

బ్ర॥ శ్రీ॥ వావిలికొలను సుబ్బరావుగారు.







VOL. I.

**Containing**
**Bala**
**Ayodhya**
**Aranya &**
**Kiskindhakandam**

Price Rs. [illegible]











**SREE MATH**

# ANDHRA VALMIKI RAMAYANAMU

**A LITERAL METRICAL TRANSLATION OF VALMIKI'S SANSKRIT RAMAYANAM**

BY

VAVILIKOLANU SUBBA ROW,

**Telugu Pandit, Presidency College, Madras,** (Now retired)
**and the author of**
**Sree Kumarabhyudayamu, Sree Kausalyaparinayamu**
**Bhagavad Gita (Dwipada), Sree Krishna Lilamritam**
**Krishnavatara Thathwamu, Subhadra Vijaya Natakamu,**
**&c , &c , &c**

THIRD EDITION

**Madras:**
**TITLE PAGE PRINTED AT**
**P. SHUNMUGAM & CO., MOUNT ROAD.**
1922





శ్రీః.

శ్రీ సీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణే నమః.

శ్రీశారదామ్బాయై నమః.

శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీమదాంధ్రవాల్మీకి రామాయణము.

శ్రీకుమారాభ్యుదయము, శ్రీకౌసల్యాపరిణయము, భగవద్గీత (ద్విపద),
శ్రీసుభద్రావిజయనాటకము, శ్రీకృష్ణలీలామృతము, కృష్ణావతారతత్త్వము లోనగు
గ్రంథములు రచియించి
చెన్నపురి రాజకీయసర్వకళాశాలయం దాంధ్రపండితులుగనుండి
ప్రకృత మునివృత్తి నొందియుండు

వావిలికొలను సుబ్బారావుచే

విరచితము.

బాలకాండము, అయోధ్యాకాండము,
అరణ్యకాండము, కిష్కింధాకాండము గల
ప్రథమ సంపుటము.

మూడవ కూర్పు.

చెన్నపురి.
బ్రిటిష్ మాడెల్ ముద్రాక్షరశాలయందు ముద్రితము.

శాలి - ౧౮౪౪. సం॥

౧౯౨౨.

శ్రీ



కం. మంతనములు సద్గతులకుఁ
బొంతనములు ఘనము లైన • పుణ్యముల కిదా
నీంతనపూర్వమహౌఘని
కృంతనములు రామనామ • కృతిచింతనముల్.

భాగవతము.

శ్రీరామ

దపనలు చదివినాఁడను. అదిమొదలు రామాయణకథయందు నా కభిరుచి మెండు. ఇటులుండ క్రీ. శ. 1885-వ సంవత్సరంబున నాపినతండ్రిగారగు లక్ష్మణరావుగారు కమలాపురమునందు డిప్యూటితహశీల్‌దార్‌గానున్న సమయంబున వారు నిరంతర రామాయణపారాయణ పరాయణు లగుటచేతనో, నాపుణ్యపరిపాకవశంబున వారికి జనించినకరుణచేతనో నన్నును శ్రీరామాయణము పారాయణ మొనర్ప నియమించి తద్విధానం బుపదేశించిరి. అటులు నే నొనర్చుచుండ నాకొక్కమాఱు గ్రంథము సాంతముగఁ బఠించుకోలేదు దానియందు భక్తిశ్రద్ధలు నా కెక్కుడగుచు వచ్చెను. ఈచొప్పునఁ బెక్కేండ్లు జరగెను. తరువాత నేను వ్యాధిచే బాధితుఁడనై రాజకీయోద్యోగముఁ జాలించికొని యుపవేతనమున జీవించుచు నెల్లూరినుండు సమయంబున నున్నట్టుండి యొక్కనాఁడు "చెనకి చెఱచినాఁడు భాస్కరుఁడు గాకుండిన రామాయణము బండ్ల కెక్కింపనా" యను బమ్మెరపోతనామాత్యుని వాక్యము మనస్సునఁ దోఁచుటయుఁ బ్రతిదిన మెంతయో కాలము వ్యర్థగాథలఁ గడుపఁబడుచుండుట యోజించి మాబమ్మెరపోతనసంకల్పము నే నేల నెఱవేర్పరాదని యూహించి నామిత్రులు బ్ర. శ్రీ. లంకలపల్లె-వేంకటసుబ్బార్యులుగారితో నాలోచింప వారు నట్టులే యొనర్పుమనియుఁ, గంబరామాయణాద్యన్యభాషారామాయణగ్రంథములఁ గల యుత్తమపద్యముల యభిప్రాయంబుల నెల్ల మిత్రసాహాయ్యంబున నందుఁ జేర్పుమనియు బోధించిరి. ఇట్లు ప్రోత్సాహింపఁబడినవాఁడనై మూలంబునఁగల ౨౪,౦౦౦ శ్లోకంబులకు నాంధ్రంబున ౨౪,౦౦౦ పద్యంబులొనర్పఁగాక యనియెంచి 'శ్రేయాంసి బహువిఘ్నాని' యనుట నాలోచించి యే నెక్కడ? నా యారోగ్య మెక్కడ? రామాయణరచన యెక్కడ? నని యతిమూఢమనంబున శ్రీరామచంద్రుఁడే శరణంబని నిశ్చయించికొని యాంజనేయవాక్యం బనుసరించి వర్తింపఁగలవాఁడనై యొకనాఁడు పారాయణాంతంబున భగవత్సన్నిధానంబున శ్రీమద్రామాయణంబునఁ బ్రశ్న వేయ

శ్లో. "ఉత్తిష్ఠ హరిశార్దూల, లంఘయస్వ మహార్ణవమ్

కం. లెమ్మా హరిశార్దూలా, యిమ్మహితార్ణవము దాఁటుమీ"

యనిప్రత్యుత్తరము రాఁగా భగవత్కటాక్షమునకుఁ బాత్రుఁడ నైతినిగదా యని యానాఁడే గ్రంథము వ్రాసినంత సంతోషంబు వహించి నామిత్రుల కెఱిఁగించి యాశార్వరి (క్రీ. శ. ౧౯౦౧) సంవత్సరము నాశ్వయుజశుద్ధదశమినాఁడు గ్రంథారంభ మొనర్చితి. భద్రాద్రిరామభద్రున కంకితమిచ్చిన శ్రీకౌసల్యాపరిణయమును నేఁటికిని నాయన కర్పింపవలనుపడమియు, నొంటిమిట్టమజ్జ స్థమం పెలంబున నుండుటయుకాక శ్రీమదాంధ్రభాగవతమునకు బద్ధులగుటయుఁ, బోతనామాత్యుఁడే రామాయణమును వ్రాసియుండిన నారామభద్రునకే యంకిత మిచ్చియుండుననియు, నాయనసంకల్పము నెఱ

వేర్పుఁ బూనిన నాకును నాయనయుద్దేశము సంభావనీయమనియు నెంచి యిలుముంగటి పారిజాతమగు నొంటిమిట్ట కోదండరామునకే యీకృతి నంకితంబొసంగితి. పదపడి క్రమముగ నాఁడునాఁటికిఁ గొంచెము కొంచెము వ్రాయుచు నాయూర (20-12-1900 వఱకు) ౨౯ సర్గములు తెలిఁగించితి. ఇందు మూలమునఁ గలదంతయు నుండఁగాని వర్ణనాదుల మూలాతిక్రమణ మొనర్చి వందలకొలంది పద్యంబు లెక్కు_నగ రచియించితి. క్రీ. శ. ౧౯౦౧-వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో నీచెన్నపురికి వచ్చుటయాదిగా 11-10-03 వఱకు మరల నీగ్రంథము నాయనారోగ్యహీనతచే విరచింప వలనుపడదయ్యె. తేఱిన పిమ్మట మరల గ్రంథరచనకుఁ దొడంగుచుండ నిక్కడి నామిత్రులు బ్ర. శ్రీ. క్రొత్తపల్లె పద్మనాభశాస్త్రులవారు యథామూలముగా నుండు గ్రంథ మిదివఱకు లేదనియు, మూలమునే యనుసరించి యాగ్రంథ ముండిన నెక్కు_నగఁ బూజితం బగుననియు, సాధ్యమైనంతవఱకు మూలగ్రంథము నతిక్రమింపక విషయములోపింపక రచియింపు మనియు, సంస్కృతంబున వాల్మీకిరామాయణము వట్టిన యాంధ్రంబున నిది యని తోఁప నాంధ్రవాల్మీకిరామాయణమని పేరిడుమనియు బోధింప వెనుకటి విఘ్నములను నా దేహస్థితియు బ్ర. శ్రీ వేంకటసుబ్బార్యుసాహాయ్యంబు దుర్లభం బగుటయు యోజించి సల్లేయని యంగీకరించి వందలకొలందినున్న యెక్కు_వ పద్యంబులఁ దొలఁగించి యతిగణప్రాసాదిభాషానియమంబులు నాకు స్వాతంత్ర్యము కలిగించినట్లు నాశక్తికొలఁది మూలంబుచొప్పున మూలచ్ఛేద మొనర్చు ప్రక్షిప్తంబులఁ దొఱఁగి రచియించుచుంటిని. ఈ రచనాకాలమధ్యమున రమారమి 3, 4 సంవత్సరముల కాలము వ్యాధిబాధచేతను, ననివార్యములైన కారణాంతరములచేతను వ్యర్థపుచ్చఁబడెను. దీర్ఘవిఘ్నములకు భయపడి నిరుత్సాహి నయినప్పుడును, హేత్వంతరముల విసుఁగు చెందినప్పుడును శ్రీరామచంద్రుఁడే నాకుత్సాహముఁ గలిగింప నాయనసూక్తియే యూఁతగ ధైర్యంబవలంబించి కృతిసాగించుచుండ శాలివాహనశకవర్షంబు ౧౮౩౧-కి సరియగు నీకీలక వత్సరమున శ్రావణపూర్ణిమనాఁడు భగవదనుగ్రహంబున నీకావ్యంబు పరిపూర్ణమయ్యె. నన్నీరామాయణార్ణవమును దరింపఁజేసి శ్రీరామచంద్రుఁడే తన సత్యసంధత్వమును జగములకు వెల్లడిపఱిచెను.

భాషాంతరీకరణమందు మూలముననున్న ప్రత్యక్షరమునకు మాఱక్షరము వేయవలయునని నే నుద్దేశింపలేదు. అట్లు వ్రాయఁబడిన గ్రంథ మాంధ్రంబయ్యు వక్తకు శ్రోతకు సుఖావహంబుగ నుండదు. మూలమునువిడిచి శాఖాచంక్రమణమును జేసినవాఁడను గాను. పరికరపరికరాంకురాద్యలంకారంబుల నాచేతైనవఱకుఁ బోషించినాఁడను. మతిహీనతచేత సారస్యము నెఱుంగఁజాలకున్న నట్టిపదములు లోపించియుండును. శ్లోకభావము మించి పద్యము మిగిలియున్నప్పుడు పాదపూర్తి కెందేని

కొన్నిపదముల నెక్కువగా వ్రాసియు నుందును. శ్లేషాలంకారముగల శ్లోకములఁ దెనిఁగించుచో వానికిఁగల యర్థములన్నియు నొకపద్యముననే వచ్చునటుల నాచేనైన వఱకు సమర్థించుకొనియున్నాను. 'తేననేన వనం గత్వా' ఇత్యాదులయందు శ్లేషము పోషించుట దుర్ఘట మని తోఁచి యాప్రయత్నము మానితి. ఒక్కశ్లోకమున కొక్క పద్యమేగాక రెండుమూఁడు శ్లోకంబులభావ మొక్కపద్యంబున నిముడ్పఁబడియు నుండును. ఇంతయేల? అప్పటిచిత్తవృత్తి యెట్లెట్లుండెనో యట్లెల్లవ్రాసితి. ఎక్కువగ వ్రాయఁబడిన కొన్ని పద్యముల సూచింప *గుర్తిడితి. వ్రాయునది లోకోపకారకమగు గ్రంథమనియు, సర్వజనీనంబుగ నుండవలయుననియు నాముఖ్యాభిప్రాయంబు. ఈ కారణముచేతనే మూలము గూఢముగనున్నచో దానియర్థము చక్కఁగఁ దెలియు నట్లు పెంచివ్రాసితి. ఏకారణముచే వాల్మీకిమహర్షి తనకావ్యము నిర్వచనముఁ జేసెనో యాకారణంబున నేనును దీని నిర్వచనంబొనర్చితి. నేను సర్వజ్ఞుఁడనుగామియు సర్వజ్ఞుఁ డను శక్తిహీనుఁడను నగుటయు మీరు యోజించి నాసాహసంబునకు క్షమించి మీ మీ బాలుర పల్కులవలె దీని గ్రహింతురుగాక. నన్ను ధన్యుఁ జేయుదురుగాక.

శ్లో. "మిత్రభావేన సంప్రాప్తం, నత్యజేయం కథంచన
దోషో యద్యపి తస్యస్యా, త్సతా మేత దగర్హితమ్"

తే. మైత్రిభావించి తాన సంప్రాప్తుఁడైన, వాని నెటులైనఁ జేవిడఁ వాఁడఁగాను
వానియెడనుండెనేని నేఁ దేనిదోష, మట్టి గర్హ్యంబుగాదు సందాళులకును.

అనువాక్యమును స్మరింతురుగాక. నాదోషంబుల సైరింతురుగాక

గ్రంథప్రకటన విధానము:—

నామిత్రులు కొందఱెట్లీగొప్పగ్రంథము ముద్రితమగునని యోజింప నావార్త విని యొకస్వదేశీయప్రభువుగారు తామాభారమునంతయుఁ బ్రతిఫలాపేక్షారహితం బుగ వహించెదమని వాక్రుచ్చి వేలకొలఁది వెచ్చించి ముద్రింపించి కృతికిని గృతికర్త కును జిరాయువొసంగిరి. ఏప్రభువైనను నేధనికుఁడైనను బ్రతిఫలాపేక్షలేక యింత ధనము వెచ్చించి దూరదేశవాసియై తమ సంస్థానమున నుండక, తమ పోష్యులలోఁ జేరకయుండు నాయట్టి యనామకునికృతిఁ బ్రకటించుట లోకము వినియుండదు ప్రభువులే ప్రతిఫలముఁ గాంక్షింతురందు రేమో,

"తుష్టో విప్రశ్శ్లోక మేకం దదాతి, తుష్టో రాజా గ్రామ మేకం దదాతి" యను యుంట ప్రసిద్ధమేకదా? ఆత్మతుష్టికై తమ్ముఁ బొగడించుకొనక యొకవరాటకమేని యిచ్చినప్రభువులు వీరును వీరిమాతులులునుగాక మఱెవ్వరు? కావున నిట్టిప్రభువులు నాకు లభించుటయు శ్రీరాముని యనుగ్రహమే యని నానమ్మకము. ఇట్టివిషయంబునఁ

దన నిర్వ్యాజకరుణకుఁ బాత్రులైన యాసత్ప్రభువుగారికి శ్రీరాముఁడే సర్వశ్రేయోదాయి యగుఁగాక. సాత్త్వికదానేచ్ఛులగు నాప్రభువుగారు తమపేరు నిందుఁ బ్రకటింప నాజ్ఞనీయమిఁ దన్నామము లోకంబునకుఁ దెలుపఁజాలమికి విచారపడుచున్నవాఁడ.

గ్రంథసమర్పణ ప్రకారము:—

గ్రంథరచన సాంతముకాఁగా మిత్రత్రయ మొక్కనాఁడు దీనిని గృతిపతియగు నొంటిమిట్ట శ్రీకోదండరాములకు నివేదించి పదపడి లోకంబున వెలయింప యోజించుచుండఁ గారాణాంతరమున నీచెన్నపురికివచ్చియుండు నస్మత్పురాతనమిత్రులును గడపమండలమునఁ బ్రొద్దుటూరియందు న్యాయవాదులునగు బ్ర శ్రీ. రా. శ్రీ. వి. వసంతరావుగారు, బి.ఏ., యీవార్త యెఱింగి యీకార్యంబు చక్కఁగ నెఱవేర్పఁ బ్రోత్సహించి తారును సహాయులై నిలిచిరి. వారు నిలుచుటేకాక కడపమండలమందు స్వీయమిత్రులును, భాషాభిమానులును, దైవభక్తియుక్తులునగు బ్ర. శ్రీ. మ-రా-శ్రీ, నెమలి పట్టాభిరామరావుగారు, బి. ఏ, (కొచ్చిన్ సంస్థానమున దివానుగా నుండినవారు) ఏ. పరశురామరావుగారు, వావిలికొలను - రామానుజరావుగారు, బి. ఏ, సి. సంజుండప్పగారు, బి. ఏ, బి. యల్., కే. గుండురావుగారు, బి. ఏ., బి. యల్., కామసముద్రము నరసింహాచార్యులవారు, బి. ఏ, బి. యల్., యన్. నరసింగరావుగారు, బి. ఏ., సత్యధీరగురురాజప్రియ కొకూరు రామచంద్రరావుగారు, బి. ఏ, బి. యల్., యన్ననూరు నాగయ్యగారు, ఆర్. గిరిరావుగారు, బి. ఏ., మ-రా-శ్రీ, కొణదల రామచంద్రారెడ్డిగారు, వినా యాగంటిసెట్టిగారు, వీరెల్లరుఁ దోడ్పడ నాహ్వానసభ యొకటి యేర్పఱిచిరి. దీనికి ననుమోదకులై శ్రీమదాయుర్వేద మార్తండ భిషజ్మణి పండిత డి. గోపాలాచార్యులవారును, మ-రా-శ్రీ, పానుగంటి రామారాయనింగారు, ఎం. ఏ., బ్ర. శ్రీ. రా. శ్రీ. గుమ్మడూరు వేంకటరంగరావుగారు, ఎం. ఏ., ఆర్. వీ. వేంకటసుబ్బయ్యగారు, ఎం. ఏ., ఏ. జయరామరావుగారు, బి. ఏ., యల్. టి., క్రొత్తపల్లి వేంకటపద్మనాభశాస్త్రిగారును, భాసిల్లిరి.

ఇట్టిమహనీయు లలంకరించినసభ యెట్టికార్యమైన నెట్టెట్లు చేయఁజాలదు! పదపడి యీసభవారిప్రార్థన నంగీకరించి గ్రంథసమర్పణకాలమున సభాపతిత్వంబు వహింపఁ జిత్రనళీయాద్యనేకరూపక గ్రంథకర్తలును, బళ్లారిపురంబున న్యాయవాదులును, శతావధానులు, నుభయవేదాంత ప్రవర్తకులు నగు మ-రా-రా-శ్రీ, శ్రీమద్ధర్మవరము రామకృష్ణమాచార్యులవారియకొనిరి. ఆహ్వాన సభాసభ్యులు క్రీ. శ. 1908 అక్టోబరునెల 9, 10, 11 తేదులకు సరియైన కీలకసంవత్సరాశ్వయుజ శు. ౧౫, బ. ౧, ౨ తిథులయందుఁ గావ్యసమర్పణంబు జరుగునని ప్రకటనపత్రికలమూలమున

నాంధ్రలోకంబున వెల్లడించి హితకవిపండితులకెల్లఁ బ్రత్యేకముగ విజ్ఞాపనపత్రికల నంపి వారి నాహ్వానించిరి. నాపూర్వమిత్రు లొంటిమిట్టయందు దేవాలయ ధర్మకర్త లగునట్టియు మ-రా-శ్రీ, తిప్పన సుబ్బారెడ్డిగారును, గ్రామమేజస్ట్రీటుగా నుండిన మ-రా-శ్రీ ఆకేపాటి సుబ్బారెడ్డిగారును నాగ్రామంబున వలయునన్ని విడుదులేర్పఱిచి దేవాలయము నలంకరించి సిద్ధపఱిచి యుంచిరి. నియమితదినముల కొకనాఁడు ముందుగనె యీవార్త వినినలోకు లాగ్రామంబున మూఁగఁజొచ్చిరి. మహాత్ముఁడగు బమ్మెర పోతనామాత్యు నామ మిప్పటికి నామండలంబున భక్తితో సంస్మరింపఁబడుచుం డుటఁ జేసి యాకవిపట్టభద్రుఁడు భాగవత మర్పించినట్టు లెవరో శ్రీకోదండరామస్వా ములవారికి శ్రీరామాయణము సమర్పింప వచ్చుచున్నారని భక్త్యావేశంబున బాలో న్మత్త పిశాచగ్రస్తులవలె రామరామయని సర్వవర్ణములవారు చుట్టు పదియోజనముల నుండి వచ్చిరి. ఇట్లు చేరిన జనులసంఖ్య యధమపక్షము ౫,౦౦౦ లకు మించియుం డునని యంద ఱనుకొనుచుండిరి.

ఆహ్వానసభాసభ్యుల యాహ్వానమును గౌరవించి నానాదేశంబులనుండి గొప్ప కవులు, విద్వాంసులు, సభకారులు, పీఠవారసనేల పూజ్యు లెందఱో వచ్చియుండిరి. రాఁజాలనివారు పత్రికలమూలమునను వాచారూపముగను వారియనుమోదముఁ దెలి పిరి. ఇట్లు తెలిపినవారిలోఁ గొందఱు రా-శ్రీ, రాయబహదర్ పి. అనంతాచార్యుల వారు, విద్యావినోద, విశారద, సి. ఐ. ఇ., మహామహోపాధ్యాయబిరుదాంకితులు బ్ర. శ్రీ. కొక్కొండ వేంకటరత్నముపంతులుగారు, ఎం-రా-శ్రీ, జయంతి రామయ్యపంతులు గారు, బి. ఏ., బి. యల్., (డిప్టికలెక్టర్, రస్సల్‌కొండ), వావిలాల శివావధానులుగారు, బి. ఏ., బి. యల్., (గుంటూరు జిల్లాకోర్టు మునసఫు), కూచి నరసింహముపంతులు గారు, బి. ఏ., (పిఠాపురమునఁ బ్రధానోపాధ్యాయులు), బి. యోజులుగారు, బి. ఏ., (వకీలు విశాఖపట్టనము), బ్ర. శ్రీ. సిద్ధాంతి శివశంకరశాస్త్రులవారు (రాజకీయ సర్వ కళాపారశాలయందలి కర్ణాటకపండితులు). చెన్నపురి రాజకీయ సర్వకళాపారశాల యందలి యాంధ్రభాషాభివర్ధనీసమాజసభ్యులు తత్సభాధ్యక్షులే గ్రంధకర్తలని భక్తి గౌరవ కారణవశంబున వచ్చియుండిరి. చెన్నపురియందలి తక్కిగసర్వకళాపారశాల యందలి విద్యార్థులును గొందఱువచ్చి వారి స్వభాషాభిమానమును దైవభక్తియు వెల్లడించిరి. పూర్వాచార పరాయణులును, బ్రసిద్ధపురాతన సంస్థానంబగు, పుంగ నూరు సంస్థానమునకుఁ బ్రభువులునగు మహారాజరాజశ్రీ రాజా వీరబసవచిక్కరా యలు యశోవంత బహదర్‌గారు, తమసంస్థానము దివానులును, పండితులు నగు బ్ర. శ్రీ. శేషప్పశాస్త్రులవారిని, మదనపల్లెనుండి విద్వాంసులగు బ్ర. శ్రీ. వేంకటరామ శాస్త్రులు గారిని బంపిరి. మఱియుఁ జెన్నపురినుండి శ్రీశైలాద్దంకి సమయోద్దండ కోలా

హాల లక్ష్మీనృసింహ కుమారేత్యాద్యభిజనవ్యపదేశ భానురులును, నఖిలహరిదంతర విస్తృతవరకవితాపరిమళమహాకవితోచిత సహృదయ సముదయసాదర సమర్పిత కవి భూషణ బిరుదభూషణులును నగు శ్రీమత్కుమార తాతాచార్యులవారును, శ్రీకాళ హస్తినుండి యాంధ్రీకృత మహాభారతులును, నుభయభాషాకవిత్వతత్త్వజ్ఞులును నగు బ్ర. శ్రీ. శతఘంటము వేంకటరంగశాస్త్రులవారును, వేంకటగిరినుండి కపిలాచిత్రకా యోపాఖ్యానాది గ్రంధకర్తలు శ్రీమదుభయవేదాంతప్రవర్తకులును నగు శ్రీమత్కొ మూండూరు శ్రీనివాసాచార్యులవారును, దిరుపతినుండి చుళికీకృతసమస్తాంధ్రగ్రం థులును నుభయకవివయస్యులును నగు బ్ర. శ్రీ. నాగపూడి కుప్పుసామయ్యగారు, బి.ఏ., కే. చెంగయ్యగారు, బి ఏ , లును, గడపపురిమునుండి శ్రీమదుభయవేదాంత ప్రవర్తకులు పండితవర్యులు నగు శ్రీమత్కమలాపురము రాఘవాచార్యులుగారును, గోపాలాచార్యులవారును, బ్రొద్దుటూరునుండి తర్కవ్యాకరణపారంగతులగు బ్ర. శ్రీ. సీతారామశాస్త్రులుగారును, బళ్లారినుండి శ్రీమదుభయవేదాంతప్రవర్తకులును నుభయ భాషాకోవిదులునగు శ్రీమదష్టావధానము నరసింహాచార్యులవారును, నెల్లూరినుండి సత్యవిజయాది గ్రంథకర్తలు మ-రా-శ్రీ, ఐ. పార్థసారథిసెట్టిగారును, దంబళ్లపల్లెనుండి మ-రా-శ్రీ, కోటిరెడ్డిగారును, లోనగు కవులు విద్వాంసులనేకులు విచ్చేసియుండిరి. ఇంతయేల? అచ్చటి సభాస్తారులలో విద్యావంతులు గానివారు లేరు. అందుఁ బెక్కురు శ్రద్ధాభక్తులచే ననాహూతులయ్యు వచ్చుటచేతను వారు దూరదేశస్థులగు టచే నపరిచితులగుటను వారిపేరులైన వ్రాసికొన విరామము లేనందునను వారి యభిధానంబుల నిం దుదాహరింపక మానవలసి వచ్చినందునకుఁ బరితాప మగు చున్నది. వారెల్లరు నాదోషమును సహింతురుగాకయని ప్రార్థింపుచుఁ బ్రార్థించెద.

దినత్రయమునందు నుభయకాలము శ్రీసీతారామచంద్రులకు సహస్రనామా ర్చనాదికము యథావిధి జరుపఁబడెను. సభ్యుల యాజ్ఞచొప్పునఁ బ్రథమదినము నుద యంబున సంస్కృతవాల్మీకిరామాయణముతోడ నాంధ్రవాల్మీకిరామాయణమును శ్రీస్వాములవారి పల్లకియందుంచి దానిని హొసపేటయందు నెన్నికఁగన్న రాయ బహద్దర్ బ్ర. శ్రీ. హనుమంతగౌడుగారు, నెమలి సుబ్బరావుగారు, మల్లవరపు వెంచ లార్యకవిగారు, కాకినాడలోని సరస్వతీపత్రికాధిపతులగు బ్ర. శ్రీ. క్రొత్తపల్లిసూర్యా రావుగారు నీలోనగుప్రముఖులు భుజములవహించి బ్ర. శ్రీ. క్రొత్తపల్లి పద్మనాభ శాస్త్రులవారును, బ్ర. శ్రీ., రా. శ్రీ., కూనపరాజు శేషాద్రిరావుగారు (పెన్షను పుచ్చు కొన్న డిప్టికలెక్టరు, నెల్లూరు) ఛత్రమును జామరమునుబట్టి తోడరా మంగళవాద్య ములతో దేవాలయ గ్రామప్రదక్షిణంబుగ నూరేగించిరి. పదపడి గ్రంథపూజానం తరము స్వాములవారియెదుట నాంధ్రవాల్మీకిరామాయణము సాంతంబుగఁ బారా

యణ మొనర్ప సంకల్పించి కవి గ్రంథాదిఁ గొంత చదివెను. మూఁడుదినంబుల గ్రంధము సంపూర్ణముగఁ జదువుట దుర్ఘటమని బ్ర. శ్రీ. చిలుకూరు కృష్ణమూర్తిగారు, ఆర్. వి. వేంకటసుబ్బయ్యగారు, ప్రొ. పద్మనాభశాస్త్రిగారు, కొమాండూరు శ్రీనివాసాచార్యులుగారు, ప్రొత్తిపల్లి సూర్యారావుగారు, కూనపరాజు శేషాద్రిరావుగారు, కాళహస్తి శర్మగారు తోడ్పడి యాకార్యంబు సాంతంబుగావించిరి. ప్రథమదినమున మధ్యాహ్నమువిూఁద దేవాలయముఖమంటపమున సభచేర, నందు బ్ర. శ్రీ. సీతారామశాస్త్రులవారును, అష్టావధానము నరసింహాచార్యులవారును, ఆర్కాట్ హనుమంతాచార్యులుగారును, కవిభూషణ శ్రీమదద్దంకి తాతాచార్యులవారును, వాధూల శ్రీవేంకటప్రసన్నయోగీంద్రస్వాములవారు (ధర్మకర్త)ను, శ్రీరామాయణ మాహాత్మ్యాదులగుఱించి నిజవచోవిజృంభణము వెలయ మరందతుందిలసూక్తుల నుపన్యసించిరి. సిద్ధవటమునందలి యుపకరగ్రాహి (డిప్టికలెక్టరు) బ్ర. శ్రీ., టి. వి. గోపాల సామయ్యర్, బి. ఏ., గారు ద్రావిడులై యాంధ్రభాషాపరిచయము విశేషము లేనివారయ్యుఁ దమ శ్రద్ధాభక్తులను, గార్యమునందలి యనురక్తిని వెలిగొలుప యుక్తి యుక్తంబుగ నుపన్యసించి తమ బహుగ్రంథశోధనశక్తిని వెల్లడించిరి.

రెండవదినము మధ్యాహ్నాపరము మరల సభగూడెను. బ్ర. శ్రీ, రా. శ్రీ., వి. వసంతరావు, బి. ఏ., గా రుదారధ్వనిచేఁ దమవాగ్మిత్వమును బ్రకటించుచు సభోద్దేశమును, నొంటిమిట్ట గ్రామప్రసిద్ధియు నిట్టికార్యముల యపూర్వత్వములోనగు విషయంబుల నుపన్యసించి సభ్యులకెల్ల స్వాగతము నిట్లు వచించిరి:—

స్వాగతపంచరత్నములు.

సీ. అసమానదాక్షిణ్య♦లసమానగుణులార! కరుణాత్ములార! స్వా♦గతము మీకు
నాంధ్రకలాపోష♦ణాధికలాలస,హితచిత్తులార! స్వా♦గతము మీకు
నిశ్శేషశాస్త్రము♦నీషావిశేషాగ్ర,గణనీయులార! స్వా♦గతము మీకు
సముదారగుణహార♦సముదయాశయులార! నుతశీలురార! స్వా♦గతము మీకుఁ
తే. గలితసత్కీర్తులార!స్వా♦గతము మీకు, నుతచరిత్రకులార!స్వా♦గతము మీకు
మతకళాశ్రద్ధలార!స్వా♦గతముమీకుఁ,దతమహామతులార!స్వా♦గతముమీకు. ౧
సీ. నిస్తులైకాంతిక♦నిష్ఠ శ్రీభగవంతుఁ, బ్రత్యక్షముగఁ జూచు♦భక్తులార!
పలికినపలుకులు ♦ పటుకవిత్వంబుగ, భాసిల్లుప్రథితవి♦ద్వాంసులార!
ఔచితిఁ బాండితి ♦ నసమానశేముషి, వాసికి నెక్కినప్రాజ్ఞులార!
ధనపతిత్వంబున ♦ దానకలావిధి, ధనదునిఁబోలుప♦దాన్యులార!
తే. సరళమతులార! నిర్వక్ర♦సరణులార! మాన్యులార! ప్రశస్తసౌ♦జన్యులార!
యాహ్యులార!సుసాధిత♦కార్యులార!స్వాగతము మీకు మీకుసు♦స్వాగతంబు. ౨

సీ. దేశమా శ్రీవేంక ♦ టేశ వేశముఖాగ్ర, మండిత దేహళీ ♦ మండలంబు
క్షేత్రమా విధిముఖ ♦ స్తోత్రైకపాత్ర స్వ, ర్ధ్వీను తేశాంఘ్రిప ♦ విత్రితంబు
గ్రామమా సత్కవి ♦ గ్రామశిరోమణి, పోతనాదికజన్మ ♦ భూతలంబు
యత్నమా రఘుపతి ♦ కాంధ్ర వాల్మీకిరా, మాయణ కావ్యస ♦ మర్పణంబు
తే. సభ్యులా కకుబంతవి ♦ శ్రాంతకీర్తి, పూతవిద్యాధనాధికుల్ ♦ పూజ్యతములు
అన్ని యిచ్చోట నిప్పాట ♦ నావటిల్లె, నౌర మాపూర్వసుకృత మే ♦ మనఁగవచ్చు. 3

ఉ. ఎవ్వఁడో యేమొ వ్రాసెనఁట ♦ యెవ్వనికో కృతి నిచ్చెనంట తా
రెవ్వరో పిల్చువార లఁట ♦ యెక్కడకో యని లక్ష్యమేది పె
ద్దవ్వు వృథాశ్రమం బనక ♦ ధన్యులుగా నలరింప మమ్ము మీ
రివ్విధి నేగుదెంచితి ర ♦ రే! కన నెంతటిసాధువృత్తులో. ౪

కవిరాజవిరాజితము.

తలఁచినమాత్రనె సత్కృతు లొక్కశ ♦ తంబు రచింప సమర్థకులై
పిలిచినమాత్రన మాయెడఁ బ్రీతిని ♦ స్వీయమహాకృతికింబలె మీ
రల ఘుసుతిం జను దెంచి మహాశయు ♦ లార! భవద్గుణపుష్పపరీ
మళపరిపూర్ణముఁ జేసితి రీక్షితి ♦ మాన్యులుగా నొనరించి మమున్. ౫

ఇట్లు
విన్నవించు తమవిధేయులు,
ఆహ్వాన సభాసభ్యులు, ఒంటిమిట్ట.

పిమ్మట నాహ్వానసభాస్తారాగ్రణులగు బ్ర. శ్రీ., రా. శ్రీ., నెమలి పట్టాభిరామ రావు బి. ఏ, గారు శ్రీమద్దర్పరము కృష్ణమాచార్యులవారిని సభాధ్యక్షులుగా నుండఁ గోరిరి. సభవా రామోదించిరి. శ్రీకృష్ణమాచార్యులవారు నంగీకరించి సభాధ్యక్షత వహించి చిరాభ్యస్తవాచోయుక్తిపటుత్వంబు సార్థకంబుగ నాంధ్రభాషా విషయాదులగుఱించి యుపన్యసించి సభకు రాఁజాలక యుత్తరములు వ్రాసిన పండితుల లేఖలఁ బఠించి గ్రంథోత్పత్తినిగుఱించి తెలుపఁ గవిని గోరిరి. కవియును భక్తియే యీగ్రంథరచనకుఁ గారణమని చెప్పి యీవిషయంబున శ్రీరామచంద్రుఁడొసర్చిన సాహాయ్యములనెల్ల సొరిది విన్నవించెను. తరువాత సభాధ్యక్షులు పండితులఁ గనుఁగొని యిష్టముగలవార లాంధ్రవాల్మీకిరామాయణమును బరీక్షింపవచ్చునని సెలవిచ్చిరి. ఆచొప్పున నందుండిన పండితులు రెండుమూఁడర్థములు గల శ్లోకములనేమి, యర్థభావ గాంభీర్యములుగల శ్లోకములనేమి వచించి యవి యెట్లు భాషాంతరీకరింపఁ బడెనో తెలియఁ గోరిరి. ఆశ్లోకముల కన్నిటికిఁ దగిన పద్యముల బ్ర. శ్రీ., ఆర్. వీ

వేంకటసుబ్బయ్యగారు చదివి వినిపించిరి. పెక్కురు పండితులులోనగువారు సభానంతరము వారివారి విడుదులకు గ్రంథములఁ గొనిపోయి శోధించిరి.

రెండవనాఁటిరాత్రి బళ్లారిపురమందలి సరసవినోదినీసభవారు శ్రీమద్ధర్మవరము కృష్ణమాచార్యులవారి పాదుకాపట్టాభిషేకనాటకము నపూర్వలాభకరం బగునట్లు ప్రదర్శించిరి. ఇట్లు గడించిన సహస్రాధికరూప్యంబుల ౫౦-౦-౦ రూప్యంబులు దేవాలయంబునకై వారొసఁగిరి.

ఆరాత్రి శ్రీరామచంద్రునిదర్శింపఁ బూర్ణచంద్రుఁడు మింటఁ బిండియారఁబోసినట్లు పండువెన్నెలలఁగాయుచునరుదెంచి దూరముననుండి దర్శించుటతోఁ దనివినొందక బహురూపియై సేవింప ధరణికిదిగియెనో యనునట్లు కనులపండువుగ వెలుంగు ధూమదీపంబుల నట్టె నాలోకించుచు విపులదేవాలయసోపానాదుల వేడుకగ నాసీనులయిన ప్రజలకెల్ల సంతుష్టిగ మ-రా-శ్రీ, నంజుండప్ప, బి ఏ., బి యల్., గారును, శ్రీమత్కమలాపురము రాఘవాచార్యులవారును, మ-రా-శ్రీ, నెమలి సుబ్బరావుగారును సీతాకల్యాణముగురించి హరికథాకాలక్షేపముగ బోధించుటయేకాక, భక్తి, పాతివ్రత్యము లోనగువిషయంబులగురించియు నుపన్యసించిరి.

మూఁడవదిన ముదయంబున శ్రీరాముల దేవాలయ ముఖమండపముస్నాతలై, పరిపూతలైన విదుషులచేతను జ్ఞానవయోభక్తివృద్ధులచేతను నిండియుండ వారికెల్ల దివ్యజ్ఞానసమాజసభ్యులలోఁ బ్రముఖులును లోకోపకారకబుద్ధియును గల మ-రా-రా-శ్రీ, రామయ్యగారు, బి. ఏ, (కడప పాఠశాలయందుఁ బ్రధానోపాధ్యాయులు), సి. నంజుండప్పగారు, బి ఏ, బి యల్., లోనగు పెద్దమనుష్యులు హిందూమతోత్కృష్ట్యమునుగురించి మతవిషయకోపన్యాసములు గావించిరి.

మూఁడవదినము మధ్యాహ్నముమీఁద గ్రంథపరీక్షానంతరంబునఁ బండితులందఱు వారివారి సంతుష్టిని గొందఱు పద్యరూపములుగను, గొందఱు ఉపన్యాసరూపముగను వెల్లడించి కృతిని బ్రశంసించి కవినాశీర్వదించిరి. పట్టాభిషేకభాగ పఠనముతోడను, సభాధ్యక్షుల యంత్యోపన్యాసముతోడను సభ ముగిసెను. ఆరాత్రి శ్రీసీతారామచంద్రులకు మహోత్సవము జరుపఁబడెను. ఈవిధముగ మున్నెన్నఁడిట్టిది కనివిని యెఱుఁగమని లోకులు కొనియాడుచుండ శ్రీసుదాంధ్రవాల్మీకిరామాయణము తత్కృతి భర్తలగు నొంటిమిట్ట శ్రీకోదండరామస్వాములవారికి సమర్పింపఁబడెను.

దినత్రయంబున నన్నదానంబు జరిగెను. సరాసరి పూఁటకు వేవురకెక్కువగ భోజనముచేసిరి. ఇది వింతకాదుగాని యీ యన్నప్రదానమందుఁ బెద్దలుఁ, బిన్నలు, నధికారులు, ధనికులు లోనగువారందఱు వారివారి యైశ్వర్యమును బదవిని మఱచి కేవల పారమార్థికబుద్ధితోఁ దమకుఁదామ స్వకార్యములకుఁబోలె సేవకులవలెఁ జరించి

కార్యము నిర్విఘ్నంబుగ నిరుపద్రవంబుగ సర్వజన సంతుష్టిగ నెఱవేర్చినదే యాశ్చర్యకరము. స్వామికార్యమున సజ్జను లభేదబుద్ధులుగదా. బ్ర. శ్రీ. అక్కరాజు సుబ్బయ్యగారు (రివిన్యూ ఇన్స్పెక్టర్, ఒంటిమిట్ట), కొమ్మరాజు. రామరావుగారు, వావిలికొలను నరసింగరావుగారు, ఏ. పరశురామరావుగారు, కే. గుండురావుగారు, విహారి పిచ్చయ్యగారు, నెమలి పట్టాభిరామరావుగారు, ఆర్. శేషగిరిరావుగారు, కంచనపల్లె ఆత్మారామయ్యపంతులుగారు, బళ్లారి భుజంగరావుగారు (వాయిల్ పాడ్), నెమలి సుబ్బరావుగారు, మల్లవరపు పెంచలయ్యగారు, కొత్తపల్లి సూర్యారావుగారు, కూనపరాజు శేషాద్రిరావుగారు, వి. వసంతరావుగారు, యం. కే. వేంకటరావుగారు బి. ఏ., (అసిస్టాంటు మైకాలజిస్టు, బెంగుళూరు) లోనగు పెద్దలు హేమాహేమీలు నడుములు బిగించి వడ్డన లోనగు కార్యములను నెఱవేర్చిరనఁ దక్కిన దేమి వ్రాయవలయును. వీరలొనర్చిన సాహాయ్యమునకేమి ప్రతికృతి సేయఁగలవాఁడ? నాప్రతికృతి కోరియా వీరు పాటుపడిరి? కావునఁ గృతఘ్నతాదోషంబు నాకొదవకుండ వీరి కందఱకు సాష్టాంగ నమస్కృతు లాచరించెద. ఆ కాలమున వీరిమదుల నావేశించిన శ్రీరామమూర్తియే వీరికి నిరంతరశ్రేయోదాత యగుఁగాకయని ప్రార్థించెద. గొప్పగొప్పవారు పైచొప్పున వర్తించినదియు వింతగాదు. ఇంకొక దైవచిత్రము. కడప మండలంబున నిరతాన్నదానంబున నసమాన యశస్సు గడించిన వైశ్యకులోద్భవురాలగు యాదాళ్ల నాగమాంబగా రయాచితల యయ్యు నిమ్మహోత్సవమునకుఁ గుమారుండగు శ్రీ వేంకటసుబ్బయ్యగారితోడనరుదెంచి మిక్కిలి వెచ్చించి యన్నదాన కార్యమున విశేషము సాహ్యపడిరి. శ్రీయాదాళ్ల పాపయ్యసెట్టిగారును దగుసాయ మొనరించి స్తుతిపాత్రులైరి. శ్రీరాముఁడిట్లు తనకృపకుఁ బాత్రులుగఁజేసిన యీ పుణ్యాత్ములకు శాశ్వతసౌఖ్య భాగ్యదాత యగుఁగాత.

---

శ్రీమన్మహామహోపాధ్యాయ బిరుదాంకితులును, బిల్వేశ్వరీయాద్యనేకగ్రంథ కర్తలునగు బ్ర. శ్రీ. కొక్కొండ వేంకటరత్నముపంతులవారు పనిచిన పద్యములు.

శ్రీరామాయనమః.

శ్రీమదాంధ్రవాల్మీకి రామాయణ కృతి ప్రశంస.

రత్నావళి పద్యపంచక బహూకృతి.

౧. మునుపు తెనుఁగు భాగవతము బమ్మెర-పోతరాజు దన కిడె నిపు డిం
పెనయ న్వావిలికొలనిసుబ్బరా-విడియె నాంధ్రరామాయణముఁ.
గన నాదివర్ణాభేద మగుటఁ-గవు లిరువు రొకరె యని తెల్పం
గనె యొంటిమిట్టఁ గలశ్రీరాముఁడు-కరుణ నేలు వా సు రాయనిఁ.

౨ ఆ వాల్మీకిసుకవి రామాయణ-మాంధ్రీకరించి సుముఖుఁడై కాన్
శ్రీవావిలి కొలని సుబ్బరావన-క్షితిసురుఁడై కృతకృత్యుండై
తా వెలయు నాంధ్రవాల్మీకి యనం-దగు నని వార్థవిశేషము వా
గ్దేవి వాణియే తెలిపెడు నోరులకుఁ-దెలియఁదరమె వా సు రాయనిన్.

3. అరయఁగ రామాయణకృతికర్త మ-హర్షి యాయె రామప్రియుఁడే
వర భాగవతము చేతఁ బోతన త-నరామకృష్ణప్రియుఁడవు జి
త్వరుఁ డీవావిలికొలని సుబ్బరావ్-తత్కావియుగధర్మముఁ గనుటన్
సరసుఁడు ధ రామకృష్ణమాచార్య-సత్పదుఁడె సభాపతిగఁ దగున్.

౪. తెలిఁగించుట సప్తకాండములను సు-ధీనుతముగ రామాయణమున్
బొలు పలరఁగ శ్రీరాముని కంకిత-ముగ నొనరించుట సద్భక్తిన్
బొలుచుట వావిలికొలని సుబ్బరా-వునకు నాంధ్రవాల్మీకి యటం
చిల మహామహోపాధ్యాయుఁడు బిరు-దిడియెఁ గొ వేంకటరత్న మిటన్.

౫. రత్నభూషణములం బ్రభువు ల్గవి-రత్నములకు నిచ్చుట వారల్
నూత్నముగఁ బ్రభురత్నము లనఁగన్-స్తుత్యులగుదు రీయమిఁ బ్రభులే
రత్నము కవి ప్రభువు లెనయమి నది-రత్న మె కవి కవిరత్నంబే
రత్నకవి యొసఁగు వా సు రాయనికి-రత్నావళి పంచక మెంచన్.

రాజమహేంద్రవరము,
కీలకనామ సం॥
ఆశ్వయుజ శు. ౧౪, గురువారము.

కొక్కొండ - వేంకటరత్నశర్మ.

---

LAKESIDE,
*Madras, 8th October 1908.*

DEAR SIR.

But for my ill-health, I should be gladly present at the function you are worthily presiding over at Onti Mitta. Mr. Vavilikolanu Subba Row is one of the few scholars of whom I am proud and in whose widening reputation I rejoice. The monumental work, which he is placing at the feet of Kodanda Ramaswami there, is enhanced in value by the fact that it is his heart's tribute to the God of his fervent love and not merely an outcome of literary ambition. That he has found a liberal patron to give his manuscript a printed and permanent shape is a matter for congratulation. I wish I were at liberty to proclaim that bounteous patron. That Mr. Subba Row will write more and more and that he and his kind will find his present patron excelling himself as years roll on is the pious and earnest wish of

To
D. Krishnama Chariar

Yours sincerely,
P. ANANDA CHARLU.

---

RUSSELLKONDA,
*29th September 1908.*

MY DEAR SIR,

The cordial invitation and your more cordial letter are welcome. I can quite understand how glad you will be if I can attend but you cannot be more so than I should myself be to be present on such an auspicious occasion. Both the occasion and the place of meeting are such as to inspire enthusiasm and reverence in all lovers of Telugu Literature. I shall, moreover, have the pleasure of meeting some of my old friends. More than this, I shall have the satisfaction of testifying, with my presence, to the regard and admiration which I entertain for a man who has done so much to enrich the Telugu literature of which I am a devoted student and lover. But alas! this cannot be. The fact is that I have exhausted all my casual leave except two days and had to take privilege leave in June last on account of urgent private business. So there is no leave due to me now.

Though I cannot, therefore, be with you in body when you formally dedicate your *Magnum Opus* to the patron God and inspirer of the immortal translator of the Bhagavatam. I am sure to be there in spirit and I know I shall be present in your mind.

The great work which you have completed is one of which any poet may feel proud ancient or modern. The authors of Bhaskara-Ramayanam no doubt laid the Telugu world under deep obligations but their translation was after all an abridgement. Ranganadha's translation was not a literal translation either. They have both survived the period when they were considered adequate. Gopinadha Ramayanam is a bolder attempt to adequately interpret "the first poem" to the Telugu people and I am told that a similar attempt was made by a former Zamindar of Sathenepalli—very likely the author of the nice little poem కీర్తికాంతాస్వయంవరము but this book has not been published. But Ramayana is a many faced gem of beauty and is to be viewed and admired from different standpoints. To understand it fully variety of interpretation is necessary for, each interpretation is sure to allow some new meaning in the old words, through the individuality of the interpreter. I welcome, therefore your translation of the great poem and venture to predict great popularity for it and same for its author. I trust you will be able to publish it before long.

I should be very glad to hear from you that the event is fittingly celebrated. May I ask you, in conclusion, to remember me to all my old friends that will attend on the occasion—the President and others.

To
V. Subba Row.

Yours sincerely,
J. RAMAYYA.

---

## సభాస్తారుల యభిప్రాయములు.

### గజమాల.

౧. కలయే త్కల్యాణ న్నః కాఙ్క్షితసకలార్థదానదీక్ష స్సః
ఏకశిలానగర సదా న్దశరథతనయ స్సదాతన శ్శేషీ. (నిరోష్ఠ్యమ్)

౨. ఎక్కసిలా ణఅర హ్మి వసఇ ఛలణజుఅంకఇగ ఆణఆణాలం జం
కీరఇ ఎణ్హిం ఇమిణా, పసంసణిజ్జా ఖుణనరతం సే మహిమా.

౩. కలికల్మష మపహన్తుం కవిలోకస్యాపి మోద మాధాతుమ్
దశరథతనయోదన్తం కవి రయ మాన్ధ్రీచకార బహువేదీ.

౪. వల్మీకోద్భవసంయమీన్ద్ర కుతుకప్రోద్గీర్ణ వర్ణావళీ
సారస్య ప్రథమాన తాన కలనా సంవాద వాన్వావదాః
లఙ్కాపఙ్కనిదానశఙ్కరధను ర్భఙ్గప్రసఙ్గోల్లస
ద్వైదేహీ కిలికిఞ్చితాఞ్చితరుచే రేతా యశస్స్ఫూర్తయః.

౫. పృథక్ప్రాకారై ర్బహుభి రపి యేయే నిగదితాః
కవే శ్చాతుర్యేణ స్ఫుట మిహ సమేతాహి విషయాః
న కశ్చి త్తత్రాంశోస్మి న్ననుభవతి భాషాన్తరకృత
స్తతో మన్యే కావ్యం బత భగవతా తేన రచితమ్.

౬. అబ్బురపాటుచెంద రస ♦ మంతయు నెల్లెడ నిండి యుంట నీ
సుబ్బయ రాయ కబ్బమున ♦ సుశ్రుత శాస్త్రత దోఁచుచుండెడిన్
ఉబ్బున నాడుడెందము స ♦ నూనకుతూహల మూనె నిచ్చలున్
గబ్బితనంబుఁ జూపు విధి ♦ కాంతయె చేసెడి సాధువాదముల్.

౭. పదన్యాసై ర్లీలారణిత మణిమఞ్జీరమధురై
రుదారై ర్వ్యాహారై స్సహృదయ మనోరఞ్జన చణైః
అలఙ్కారై ర్భావై రపి గుణగణై రస్యకవితా
విధత్తే సమ్మోదం యువతి రివ శయ్యా ముపగతా.

౮. ఆన్ధ్రవాల్మీకి బిరుదం సుబ్బరాయాయ దిత్సితమ్
అభినన్దతి సమ్మోదా దయం వః కవిభూషణః.

ఒంమిటిట్ట,
11–10–08.

అద్దంకి - కుమార తాతార్యః,
కవిభూషణః.

---

బ్ర. శ్రీ. నాగపూఁడి కుప్పుసామయ్యగారు భాషాంతరీకరణమునఁగల కష్టములు నుపన్యసించి యీగ్రంథ మనన్యానాతిరిక్తముగ నున్నదని యభిప్రాయ మిచ్చి యీపద్యములఁ బఠించిరి.

ఆశువు.

కం. శ్రీవరకరుణాపాత్రా, వావిలికొలనుప్రశస్త • వంశాంబుధిచం
ద్రా వర్ణనీయకవితా, ప్రావీణ్యవిలాస సుబ్బ • రాయకవీంద్రా!

ఉ. ఆయతరామభక్తి దన • రారఁగ నాకుభవుండు తొల్లి రా
మాయణకావ్యముం జగతి • నందఱు మేలన సంస్కృతంబునన్
జేయఁగ నాంధ్రభాషను ర • చించితి వీవు తెలుంగువారి కిం
పై యెసలారు పల్కులను • హారియశోలతకాలవాలమై.

కం. కడుగొప్పది గ్రంథము చొ, ప్పడునే యన్యులకు దాని • భాషాంతరమ
న్కడలిని దాఁటఁగ రాముని, యడుగులబత్తి యను తేప • యలవడకున్నన్.

కం. రామునిచరితం బగుటను, రామపదాంబుజయుగమె శి • రంబుగ మదిలో
నేమమునఁ గొల్చుచుంటను, రామునకె యొసంగితీవు • గ్రంథము దీనిన్.

ఒంటిమిట్ట,
11–10–1908 } నాగపూఁడి - కుప్పుసామయ్య.

ఆశువు.

కం. శ్రీవైదేహీరామకృ, పావిభవోజ్జ్వలకవిత్వ • భాసురబుధసం
భావితసుగుణాలంకా, రా వావిలికొలను సుబ్బ • రాయ కవీంద్రా.

మ. అలవాల్మీకి మహర్షి సంస్కృతమునం • దాదిన్ జగచ్ఛ్రేయ ము
ర్రిలిఁ దాఁ గోరుచు నారదోక్తి మెయి నా • శ్రీరాము చారిత్రముల్
వెలయంజేసె మృదూక్తు లొప్పెసఁగ ను • ర్విం దన్మహాకావ్యముల్
లలితోక్తిం దెనిఁగించినాఁడవు బుధుల్ • వర్ణించి మే లౌననన్.

చం. అదియును రామచంద్రునకె • యర్పిత మైనఁ బ్రశస్తిఁ గాంచు నా
మదిఁ దలపోసి భక్తి మహి • మం బెసలారఁగ నొంటిమిట్టఁ బే
రొదవిన రామభద్రునకు • నుత్సుకతన్ బుధవర్ణనీయ సం
పద మెయి నంకితంబుగ స • మర్పణఁ జేసి కృతార్థుఁ డైతి వో.

ఒంటిమిట్ట,
11–10–08. } శ. వేంకటరంగశాస్త్రి.

## ఉత్పలమాలిక.

సమ్మన మొప్పఁగా సుకవి♦చంద్రుఁడితం డని భక్తి వేఁడుచున్
రమ్మని కమ్మలం బనుప♦రాజుల విన్నము లొల్ల కెంతియున్
సమ్మతితోడ సత్కృతులు ♦ శౌరికి నర్పణ చేసినట్టి యా
బమ్మెర పోతరాజు తన♦భాగవతమ్మును నిర్వహింప భా
రమ్మిల నొంటిమిట్ట రఘు♦రాముని దంచని ధన్యుఁడౌచు మో
క్షమ్మును జెందె, నానుడిని♦గైకొని నమ్ముచు భక్తి రక్తి ధై
ర్యమ్ము లభంగభంగి హృద♦యమ్మున నాటఁగ వాసు రాయఁ డం
దమ్ముగ వ్రాసి సత్కృతు లు♦దారమనీషను బూర్వ మాదికా
వ్యమ్మున దేవభాష రస♦బంధురత న్గస వామలూరుజుం
డిమ్ముగ వ్రాసినట్టి భవ♦మృత్యుహరం బగు రామగాథ న
ట్లిమ్ముగ నాంధ్రదేశజన♦భాషములన్ ముని పల్కినట్టు లే
నెమ్మిగ నిప్పుఁ జేయుతమి ♦ నీరజనేత్రుని నాశ్రయింప, లే
లెమ్ము తరింపు మబ్ధి నవ♦లీలగ నంచును బాస యిచ్చి, స్వీ
యమ్మగు వాక్కు పొల్లువడ ♦ నాఁడిడి నొందెద, గ్రంథసత్ప్రమా
ణమ్ముల సమ్మతిస్వ, రిఁక ♦ నాగతి యేమగునో యటంచుఁ జి
త్తమ్మున నెంచి, యాశ్రితహి♦తప్రదుఁ డీరఘురామమూర్తి కా
వ్యమ్మును దీర్చెఁ, గానియెడ ♦ నాపదలెన్నియొ రాఁగ హానిఁ బోఁ
జిమ్ముఁగ నెవ్వఁడోపు? నహ♦జీవము నిల్వ దటంచు మిత్రు లొ
క్కుమ్మడి వీడఁగా బ్రతికి ♦ యొప్పను దక్కులు వ్రాయనేల? భా
షమ్మున భక్తి యెట్టిదొ స♦హమ్మగు కావ్యముఁ బల్కి దాని వే
గమ్ముగ నచ్చుఁగూర్ప నెటు ♦ కాఁగలదంచును రామచంద్ర ధ్యా
న మ్మొనరించుచుండఁగఁ ద♦నంతన యాంధ్రకళా విశారదుం
డిమ్ముల భూమితేఁడు కరు♦ణాధృతచిత్తుఁ డొకండు తాన వి
త్తమ్మును వేలువేలొసఁగి ♦ ధారణిపైఁ బ్రకటించె నౌర! సీ
[illegible] స్వాశ్రితజ♦నావనదక్షుఁ డటంట కొక్క సా
క్ష్యమ్ము ద్వితీయ మీయదిక♦దా? యెటువంటిదొ పల్లె గంటి రే
యిమ్మహిఁ జేరఁ జెచ్చె సుక♦వీంద్రుల విజ్ఞు లెల్ల దూరదే
శమ్ములనుండి యుత్తమవ♦శన్ రహిమీఱెడి ప్రాడ్వివాకవా
రమ్ముల విత్తనాయకుల ♦ గ్రామనివాసుల నెల్లనాల్గువ
ర్ణమ్ములవారి వేల్కొలఁది ♦ రాముఁడె స్వీయకృతిం గ్రహింపఁ బూ

ర్ణమ్మగు మానసమ్మునను ♦ రాజు గదా తనకీవి కర్ణ మా
ర్గమ్మునఁ గాక వేఱొక ప్ర♦కారమునం గ్రహియించునెట్లు? పూ
ర్వమ్మునఁ జెల్లెనొక్కొ యిటు♦వంటి మహాద్భుత కార్యమెందు? సీ
తమ్ము మగండు స్వాశ్రితజ♦నావన దక్షుఁ డటంచు లోక సా
క్ష్యమ్ము తృతీయ మీయదిగ♦దా? మిముబోఁటి మహాత్ము లాగ్ర కా
ర్యమ్ముగ దీని నెంచి యను♦పారుమతిం బనివాంఛఁబోలె నీ
మమ్మున నిర్వహించుటకు ♦ మానుగఁ బూనితి రేమిహేతువో
నెమ్మదులందుఁ జూడుఁడు వి♦నిర్మల భావమునన్ రఘూద్వహుం
డిమ్మెయి నిల్చి చేసెడిఁ జుఁ♦డీ పరికింపఁగ దత్త్వమెల్ల, సీ
తమ్మ మగండు స్వాశ్రిత జ♦నావన దక్షుఁ డటంచు కీర్తి సా
క్ష్యమ్ము చతుర్థ మయ్యెడిఁ గ♦దా? హయమేధము వేళ రాముఁడే
యమ్ముని కావ్యముం గొనిప♦యుక్తిలు యజ్ఞసమాన సత్క్రియన్
బమ్మిన కీర్తి బ్రహ్మఋషి♦వర్యసమానుల రీతి సభ్యులై
సమ్మతిఁ జెప్ప వాసు కవి♦సత్తముచే గ్రహియించె నిష్ఠ భ
వ్యమ్ముగ నాంధ్రరామకృతి; ♦ భాస్కరుఁ డాదిగఁ దొల్లివార లాం
ధ్రమ్మున దీనిఁ బల్కి ప్రథ♦రాజిలి రైనను మానికాస్యత
త్త్వమ్ము గాండసప్తకము ♦ వాసు కవింబలె నిర్వహింపలే
మిమ్మన మెల్ల నీసుజన♦మిత్రునిఁ జెల్లదె యాంధ్రవాల్మికా
ఖ్యమ్మునవారఁ బిల్వఁ? గవి♦కంజజు లింతలు నిష్ఠ శేకవా
క్యమ్ముగ తెల్పెదరు మని ♦ యాంశిషి రీకృతి, దీనఁ ద్వాత్మసరీ
ల మ్మనసూయతోఁ జనము♦లన్ వెలసెన్, మన సుబ్బరాయుచం
దమ్ము భావిపన్కవు లుదారమతిన్ ఘనకీర్తికాంక్ష భే
దమ్ములు లేకయుండుత, స♦తంబు సభాపతి కీర్తికాముఁ డీ
యొమ్మె నహించుఁగాత, ధర♦ణీశులు ధార్మికులౌత, భూమి స
స్యమ్ముల లబ్ధసస్యయగు♦గాక నుభయంబులు దీఱుఁగాత, లో
కమ్ము నవాక రాము నెడ♦గాటపుభక్తి వహింత్రు గాక, క్షే
మమ్ము ను గాంత్రు గాక, యను♦మల్లవరాన్వయ పెంచలార్య వా
క్యమ్ముల నాదరించు రఘు♦కాంతుఁడు ప్రోవుత మిమ్ము నెల్లరన్.

ఒంటిమిట్ట,
11–10–08.

మల్లవరపు - పెంచలార్యకవి.

శ్రీమత్కోమాండూరు శ్రీనివాసాచార్యులవారు గ్రంధము మిక్కిలి రసవంతముగ నున్నదని యుపన్యసించి యీపద్యంబులఁ బఠించిరి.

పంచరత్నములు.

కం. శ్రీమీఱ నాంధ్రభాషను, రామాయణకావ్యమును స♦రసమృదువచన
స్తోమముల రచించితి వభి,రామతరముగాఁగ సుబ్బ♦రాయకవీంద్రా.

ఉ. ఉత్తమకావ్యలక్షణము ♦ లొప్పఁగ సత్కవిపండితాళికిం
జిత్తము లుల్లసిల్లఁగను ♦ జేసితి నిర్వచనంబుగాఁగ స
ద్వృత్తపరంపరం గధస♦భేదము లేక సుసాధువాక్తతిం
సోత్తరకాండమై పరఁగ ♦ నున్నతరామచరిత్ర మిమ్ములన్.

కం. ఎనిమిదియేఁడులలోపల, ఘనమగురామాయణాంధ్ర♦కావ్యమును రచిం
చినమేటివి నీ వొక్కఁడ, వనఘా నిన్నెనయుసుకవు ♦ లవనిం గలరే.

ఉ. చెప్పఁగవచ్చుఁ గబ్బములు ♦ సేయఁగవచ్చు ననేకగ్రన్థముల్
చెప్పఁగవచ్చు నెల్లచల♦చిత్తముతో రఘురామసత్కథం
దప్పక యొంటిమిట్టఁగల♦దాశరథిప్రతిపాదకంబుగా
మెప్పుగఁ బండితుల్ కవులు ♦ మేలని సంతసమందునట్లుగన్

కం. అగణితవాక్ప్రాభవమున, సుగుణంబున రామభక్తి♦సోత్కర్షముగం
జగతీస్థలమున శాశ్వత,సుగుకీర్తి గడించినాఁడ ♦ వార్యచరిత్రా

కోమాండూరు శ్రీనివాసాచార్యుఁడు.

సీ. ఈతఁడే బమ్మెర♦పోతనాఖ్యుం డన, భాగవతముఁ దెనుఁ ♦ గ్రతి యొనంగ
నాంధ్రవాల్మీకిగా♦రామాయణకావ్యంబు, రామాంకితంబుగ ♦ వ్రాసె నిపుడు
వాల్మీకి మాఱట♦వారిజజుఁడు మున్న, సంస్కృతభాషను ♦ జలుపఁగృతిని
సరసాంధ్రకవితావి♦శారదుండగు సుబ్బ,రావు తెనింగించెఁ ♦ బావనముగ
బ్రహ్మకులమ్మునఁ ♦ బ్రభవించి సుమతియై, జన్మంబు సఫలంబు ♦ సలుపుకొంటె
నీమహాకావ్యంబు ♦ నీగతి రచియించి, రామచంద్రునకె య♦ర్పణమొనర్చెఁ
తే. పూర్వకవులకుసాటినాఁ ♦ బోలుపుమీఱు, నిట్టిమహనీయమూర్తిని♦నెన్నఁదరమె
నిన్నునమ్మినఁగొదవయు♦నున్నెజగతి, రమ్యగుణసాంద్ర శ్రీరఘు♦రామచంద్ర.

సీ. ఏకశిలాపుర♦మే యొంటిమిట్టని, భాగవతమ్మునఁ ♦ బ్రథితమయ్యె
సందేహముల నెల్ల♦ద్రుంచఁగఁ జేయఁగ, నాచంద్రతారార్క ♦ మనని వెలయ

గ్రంథప్రసిద్ధి యక్షయ్యపుణ్యంబగు, క్షేత్ర ముద్ధారంబుఁ జేయుకొఱకు
ముదముతో నీపుణ్యమూర్తికి మదిలోన, రామచంద్రుఁడె నిల్చి రాగమునను
బలియునాలుగువేలపద్యరత్నములచే, వ్రాయించె నిశ్విధి రామచరిత
మిదియెశ్రీరామువాక్కితరమేదియుఁగాదు, దృఢముగా నెల్లరుఁ దెలియవలయు
తే. నిట్టిశ్రీరామచంద్రుల నెవఁడుపొగడఁ, జాలువాఁడొకొ శేషుఁడేఁ జాల్డుఁడెకద
దైవమహిమంబుఁగనుఁడుప్రత్యక్షముగను, నింతకార్యంబు సాధ్యమే యేరికైన.
సీ. రామాంకితంబుగా వ్రాసిన యీగ్రంథ, మాసూర్యచంద్ర తారాబ్ధిమహులు
శాశ్వత మగునట్ల నశ్వర మగుచును, భక్తివైరాగ్యముల్ ప్రజల కొసఁగి
యిహపరసౌఖ్యంబు లెలమి ఘటించును, నిచ్చు నీ కావ్య మభీష్టములను
భక్తితో దీనిని బఠియించి పూజించి, బాలుర వృద్ధులు ప్రముదమొందుఁ
డిదియె లక్ష్యగ్రంథ మిదియెశ్రీరాముల, కిర వని మదిలోన నెంచి నమ్మి
మంగళవాక్కులె సంగిఁబూజించిన, రామమూర్తియె మోక్షరాజ్యమిడెడు
తే. మనకుబమ్మెరపోతనామాత్యుఁడితఁడె,యనుచుఁబల్కితినమ్ముఁడీయార్యులార
నాథమునిదాసమానసనళినవాసుఁ, డైనరాముఁడుమిముఁబ్రోచు ననవరతము.

ఒంటిమిట్ట, 11–10–08 } ప - నాథమునిదాసు.

మఱియుఁ బండితులు కొంద ఱుపన్యాసరూపమునఁ గృతిఁ బ్రశంసించిరి. వారి యుపన్యాస సారాంశముల నామిత్రులొకరు వ్రాసికొనియుండి యాపత్రిక నా కొసంగిరి. అందిట్లు వ్రాయఁబడియున్నది. శ్రీమదుభయవేదాంతప్రవర్తకులును, నిరంతర రామాయణ పారాయణ పరాయణులును, సంస్కృతాంధ్రపండితులు నగు సప్తావధానము నరసింహాచార్యులవారు

"ఇది వాల్మీకుండు సన్నిరామాయణమునకంటె నిది బాగున్నది."

పుంగనూరుసంస్థానము దివానులవారగు బ్ర. శ్రీ. శేషప్ప శాస్త్రులు గారు

"నేను ప్రశ్నచేసిన శ్లోకముల కభిప్రాయము తెలుఁగున బాగుగ వచ్చి యున్నది."

పుంగనూరు సంస్థానాస్థానవిద్వాంసులు బ్ర. శ్రీ. వేంకటరామ శాస్త్రులవారు

"ఈ గ్రంథ మన్నివిధములచేతను బాగున్నది - ఆంధ్రముప వాల్మీకులని యీకవిని జెప్పనగు."

కపిలాచిత్రకామోపాఖ్యానాది గ్రంథకర్తలు శ్రీమదుభయవేదాంత ప్రవర్తకులు నగు శ్రీమత్కొమాండూరు శ్రీనివాసాచార్యులవారు

"గ్రంథము మిక్కిలి రసవంతముగానున్నది."

ప్రొద్దుటూరునుండి వచ్చిన తర్క-వ్యాకరణ పండితులు బ్ర. శ్రీ. సీతారామ శాస్త్రులవారు

ఘృతము, క్షీరము, శర్కర, కల్పిత న్యాయములుండునో గ్రంథమంతయు నట్టిదిగా నున్నది ఇట్టి హృద్యమైన పాకము శయ్యాశోభి యాంధ్రగ్రంథము నే నింతవఱకుఁ జూడలేదు

ఈవిధముగనే మఱికొందఱు ఉపన్యసించిరి ఈయుత్సవము వేలకొలఁదిజనులు కనులారఁ జూచినదైనను నాకీకార్యంబున నత్యంతసాహాయ్య మొనర్చిన వారి యెడల నాకృతజ్ఞత నీవిధముగ వెల్లడింపనెంచి నాతిరిక్తంబగు భంగి వాస్తవవృత్తమును వచించితి. నిమిత్తమాత్రముగ నొక యనామకునిఁ గొని యిట్టి కార్యమిట్టివిధముగ నొనరించుకొనిన యొంటిమిట్ట శ్రీసీతారాముల కరుణయు మహిమయు లోకంబెఱింగి తత్సేవాపరాయణంబగుఁ గాక. సుఖించుఁగాక.

ఈవిషయము పురాణపత్రికలయందే కాక కాకినాడయందలి . యార్యమత బోధినియందును, బొంబాయియందలి యాంధ్రపత్రికయందును విశేషించి ప్రకటింపఁబడినది. చెన్నపురియందలి యాంధ్రప్రకాశిక 17-10-08 పత్రికయందు,

“కృతి సమర్పణము—ఒంటిమిట్ట యనునది చిన్నపల్లెటూరు. కడపకును, నందలూరుకును మధ్యనున్నది ఇచట శ్రీకోదండరామస్వామి దేవాలయము కలదు. ఏకశిలా నగరమని వాడఁబడు పవిత్రస్థాన మిదియే భగవత్కథామయంబగు భాగవతమును బోతనామాత్యుఁ డాంధ్రీకరించి, తన్మహాగ్రంథము నీ శ్రీరామచంద్రునికే యంకితముఁ జేసి కృతార్థుండయ్యెను

ఉ. “బాలరసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్
గూళల కిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైననేమి గహనాంతరసీమలఁ గందమూలకౌ
ద్దాలికులైననేమి నిజదారసుతోదరపోషణార్థమై.”

యని పోతనామాత్యుఁడు తన స్వాభినివేశమును విశదీకరించి, తన శ్రీమదాంధ్ర మహాభాగవతమును నరాంకితము సేయనొల్లక భగవదంకిత మొనర్చెను. భగవద్భక్తుఁడగు పోతనామాత్యుఁ డొనర్చిన సత్కార్యమునే యనుసరించి, బ్రహ్మశ్రీ వావిలికొలను సుబ్బారావుగారు తమ యాంధ్ర వాల్మీకిరామాయణమును గోదండ రామస్వామి కంకిత మొనర్చిరి. ఈకృతి సమర్పణ మహోత్సవము గడచిన 9, 10, 11 తేదీలలో నొంటిమిట్టయందు శ్రీరామస్వామి ప్రత్యక్షమున నిరుపమానముగ నెఱవేర్పఁబడెను. బ్రహ్మశ్రీ సుబ్బారావుగారు చెన్నపురి సర్వకళాశాలయందుఁ బ్రధానాంధ్రో

పాధ్యాయులుగ నున్నారు. శ్రీసుబ్బారావుగారు వాల్మీకిరామాయణమును యథా
విధిగా నాంధ్రీకరించి, యాంధ్రభాషాప్రపంచమునకు మహోపకారమొనర్చిరి. ఈ
మహాకృతి సమర్పణోత్సవమునకుఁ జాలమంది ప్రముఖులును, విద్యార్థులును విచ్చేసిరి.
ధర్మవరము కృష్ణమాచార్యులు మొదలగువారు సమయానుకూలముగఁ బ్రసంగించిరి.
డిప్యూటీ కలెక్టరు మె. టి. వి. గోపాలస్వామి అయ్యర్ గారు కించిత్పరిజ్ఞానము గల
తెనుఁగున నుపన్యసించిరి. బళ్ళారి సుమనోవినోదినీ సభవారు పాదుకాపట్టాభిషేక నాటక
మును జయప్రదముగఁ బ్రదర్శించిరి. ఆంధ్రవాల్మీకిరామాయణము నుండి కొన్ని
భాగములు చదువఁబడెను. ప్రతిదినమును నొకపండితుఁడు శ్రీకోదండరామస్వామి
సముఖమున నీనూతన గ్రంథమును బఠించుచుండెను. వచ్చినవారలకెల్ల సంతృప్తిగా
విందు లొసంగఁబడెను. ఇట్టి సంస్తవనీయంబగు కార్యమొనర్చిన బ్రహ్మశ్రీ ఆంధ్ర
వాల్మీకి సుబ్బారావుగారికి శ్రీరామచంద్రుం డాయురారోగ్యంబు లొసంగి మనుచుఁగాత.
ఆంధ్రభాషా ప్రపంచమందు విలసిల్లిన నీ యాంధ్రవాల్మీకిరామాయణమును గను
లారఁ జూచి, మనసారఁ బఠించి, పట్టరాని ప్రమోదంబున

ఉ. "ఇమ్మహి మానుషాధములు ♦ కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్నిపుచ్చుకొని ♦ సొక్కి శరీరముఁ బాసి కాలుచే
సమ్మెటపేటులం దినక ♦ సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నే
మమ్మున సుబ్బరాయకవి ♦ మాన్యుఁ డటంచుఁ గవీంద్రుఁ డెంచెడున్."

అని ప్రకటింపఁ బడియున్నది.

ఇట్లు విన్నవించు,
సుజనవిధేయుఁడు,
వావిలికొలను - సుబ్బారావు.

శ్రీరామాయ నమః.

# శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణ పీఠిక.

---

ఆర్యులారా!

శ్రీరామాయణభారతభాగవతంబు లపరప్రస్థానత్రయాఖ్య నైహికాముష్మిక సుఖప్రదానసమర్థంబులై యద్వితీయంబులై గీర్వాణభాషాసీమంతినీమణికి శిరోభూషాప్రాయంబులై వేదవేదాంతార్థోపబృంహితంబులై జగజ్జనగీయమానంబులై యలరారుచున్నవిగదా? ఈ త్రయియం దాద్యం బగుశ్రీరామాయణంబు కావ్యంబు. పద్యకావ్యంబులం దెల్లఁ బ్రథమంబున నుత్పన్న మగుటచే నాదికావ్యం బయ్యె. శ్రీమద్రామాయణంబుననే యుత్తరకాండంబున ౯౪-వ సర్గమునందుఁ జెప్పఁబడినట్లు

శ్లో. అథ కర్మాంతరే రాజా, సమాహూయ మహామునీ౯
పార్థివాంశ్చ నరవ్యాఘ్రః, పండితా నైగమాం స్తథా
పౌరాణికా౯ శబ్దవిదో, యేచ వృద్ధా ద్విజాతయః?
స్వరాణాం లక్షణజ్ఞాంశ్చ, ఉత్సుకా౯ ద్విజసత్తమా౯
లక్షణజ్ఞాంశ్చ గాంధర్వా, నైగమాంశ్చ విశేషతః
పాదాక్షరసమాసజ్ఞాం, శ్ఛందస్సు పరినిష్ఠితా౯
కళామాత్ర విభాగజ్ఞా౯, జ్యోతిషేచ పరంగతా౯
క్రియాకల్పవిదశ్చైవ, తథాకార్యవిశారదా౯
భాషాజ్ఞా నింగితాజ్ఞాంశ్చ, నైగమాంశ్చా ప్యశేషతః
హేతూపచారకుశలా౯, వచనేచాపి హైతుకా౯
ఛందోవిదః పురాణజ్ఞా౯, వైదికా౯ ద్విజసత్తమా౯
చిత్రజ్ఞా౯ వృత్తసూత్రజ్ఞా, న్గీతవృత్తవిశారదా౯
శాస్త్రజ్ఞా౯ నీతినిపుణా౯, వేదాంతార్థప్రబోధకా౯
ఏతా౯ సర్వా౯ సమానీయ, గాతారౌ సమవేశయత్.

సీ. కౌతూహలపరుండు ♦ కాకుత్థ్సతిలకుండు, కర్మాంతరంబున ♦ ధర్మవిదుల
ఆ. మౌనివరుల బుధుల ♦ మహీపుల నైగమ,జనములం బురాణ♦శబ్దవిదుల
స్వ రకళానిపుణులఁ ♦ బాదాక్షరసమాస,విదుల జ్యోతిషమున ♦ విజ్ఞవరుల.
కం.సాహిత్యచ్ఛంద్రికవిత్తములఁ గ,ళామాత్రావిభాగకుశలు♦ల౯ వేదజ్ఞ
స్తోమము గాయకులను బుగ,ధాముల హేతూపచార♦దక్షోత్తములన్.

తే. కార్యనిపుణుల సత్క్రియాకల్పవిదుల, వృత్తసూత్రజ్ఞులను గీతవృత్త విదుల
నీతినిపుణుల శాస్త్రజ్ఞనిచయములను, నింగితజ్ఞుల భాష సంహీనమతుల.
కం. వేదాంతార్థసుబోధక, వైదికఛందోవిదగ్రపౌరాణికులన్
వాదవచనకుశలులఁ జిత్రాదికవిత్వజ్ఞులన్ సంభావనఁ గూర్చెన్.

ఇన్నిశాస్త్రములు చక్కఁగఁ దెలిసినవారికిఁ గాక రామాయణమున లోఁతెఱుంగ నెవ్వరికి శక్యము? ఇఁక నాయట్టివాఁడు దానితత్త్వ మేమాత్ర మెఱింగియుండునో మీరే యూహించి నాసాహసమునకై క్షమింపుఁడు. ఇప్పుడు నాగరికాగ్రేసరులమని విఱ్ఱవీఁగువారు మృగప్రాయులయి జ్ఞానగంధము లేక మృగచర్మవసనులై కేవలమృగమాంసోపజీవులు నయి యున్నసమయంబున మనపూర్వులాధునికు లెఱుంగనినాగరికతల నెఱింగియుండి రని లంకణముల ననుగుడుపులంబోలెఁ దలంచుకొని గుటకలు మ్రింగుచున్నారముకదా. మనపూర్వు లేకారణంబుచే నార్యు లయిరి? వా రెట్టిగుణములుగలవా రై యెట్టిమహోన్నతస్థితియందుండిరి? వారినాగరికతవిధం బెట్టిది? వారికులాచారప్రవర్తన మే తెఱఁగు గలది? రాజులకుఁ బ్రజల కెట్టి యైకమత్యముండెను? భార్యాభర్తలు సోదరులు తల్లిదండ్రులు పుత్రులు పరస్పర మెట్లుప్రవర్తించుమండిరి! సుఖదుఃఖముల స్త్రీపురుషు లెట్టినడవడి గలవారైరి? వారికి దైవమునందుఁ బ్రామాణికబుద్ధి యెట్టిది? వా రెట్లు దైవము నారాధించుచుండిరి? ఇట్టి లౌకికవిషయంబులఁ దెలియఁగోరువారికి శ్రీరామాయణమునకన్నఁ దేటతెల్లంబుగఁ దెలుపు గ్రంథ మొండు లేదు.

జననమరణచక్రంబునం దగులుకొని పరిభ్రామ్యమాణు లయి తద్బాధఁ దొలఁగించుకొనఁ బారలౌకికచింత గలిగి నిరామయమై నిత్యమై నిర్మలమైన పరమపదంబుఁ గాంచఁగోరువారికిఁ గరతలామలకముగ సుఖమార్గము బోధించుగ్రంథము శ్రీమద్రామాయణమునకన్న నన్యంబు లేదు. ఇంత యేల? మనోహరముగఁ గాలక్షేపము చేయుటకైనను శ్రీరామాయణపఠనమునకన్న సుఖతరమార్గము లేదు. పఠనానంతరంబునఁ గాలంబు సద్వ్యయంబు చేసితి మని మనస్సున కాప్యాయనంబుఁ గలిగించునది శ్రీరామాయణమే. ధ్యానంబుఁ జేయుకొలఁది మనస్సున కమృతప్రాయమగునదియు శ్రీరామాయణమే. శ్రద్ధాభక్తులుగలవారికిఁ గల్పవృక్ష మగునదియు రామాయణమే. కావున నిహపరలోకసుఖము లభిలషించువారికి శ్రీరాషాయణపఠన మవశ్యకర్తవ్యంబు. ఇది స్మర్తవ్యంబు.

భరతఖండంబున శైవులు వైష్ణవులు శాక్తేయులు లోనగు భేదములచే నొప్పు భిన్నమతజులు గలరు. అందు శివునిపే రనిన వీనులుమూసికొను వైష్ణవులును, నారాయణశబ్దము వచించిన ముఖము ప్రక్షాళించుకొను శైవులును గలరనుటయు నిశ్చయము.

వినను శ్రీసీతారాములపేరు వినిన మనస్సులో నైనను భక్తిచే సమస్కరింపనియార్యుఁ డుండఁడు. ఇట్లు సీతారాములు సర్వజనసంపూజ్యు లగుట కేమి కారణము? హరిశ్చంద్రునివంటిసత్యాత్ములు లేరా? ధర్మరాజువంటిధర్మాత్ములు లేరా? దమయంతి, సావిత్రి లోనగుపతివ్రతలవంటిసతులు లేరా? వారియం దెంతగౌరవబుద్ధి యుండినను వారిని లోకులు పూజించుచున్నారా? లేదు గదా? ఇఁక సీతారాములయం దేమివిశేషమన వారవతారమూర్తు లగుటయే. ఎవ్వరెవ్వ రేయేపేరులఁ బిలిచినను భగవంతుఁ డొక్కఁడనియే యార్యులమతము. భిన్నభిన్నరూపంబులు భగవత్కళావిశేషద్యోతకంబులు. అట్టిభగవంతుఁడే శ్రీరాముఁడుగ లోకరక్షణార్థము జన్మించె నను నమ్మకమే లోకులందఱేకవిధముగ శ్రీసీతారాముల నర్చించుటకుఁ గారణము. ప్రత్యక్షానుభవయుక్తు లగు భక్తులే తద్యాథార్థ్యమును సంస్థాపింప శక్తులు. అట్టివాఁడగువాల్మీకిమహర్షి యాయవతారరహస్యమును శ్రీరామాయణమునఁ గంఠోక్తి ఘోషించి యున్నాఁడు.

## శ్రీరామాయణము.

శ్రీరామాయణ మనఁగా లక్ష్మీరమణుఁ డైన శ్రీమన్నారాయణుని మాయామానుషావతార మైనశ్రీరామచరిత్ర మనియు, శ్రీలక్ష్మీదేవియవతార మగుసీతాదేవి చరిత్ర మనియు నర్థము. "రాఘవత్వే భవే త్సీతా, రుక్మిణీ కృష్ణజన్మని, అన్యేషుచావతారేషు, విష్ణోరేషానపాయినీ" యనుతత్త్వమెఱింగిన మహాత్ముఁడగుటచే దంపతులవలె వారి యభిధానంబు లనపాయముగ నుండునట్లు వాల్మీకిమహర్షి తనచే రచియింపఁబడిన యాదిమకావ్యంబునకు శ్రీరామాయణ మని పేరిడియె. ఇందు సీతాదేవి మాహాత్మ్యము విశేషముగఁ జెప్పఁబడి యున్నదని వాల్మీకిమహర్షియే "సీతాయాశ్చరితంమహ" త్తని వాక్రుచ్చియున్నాఁడు. ఈచిత్రము గ్రంథనామమందేకాదు. గ్రంథమందును గానవచ్చెడి. శ్రీరామచంద్రుఁడు "ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజ" మ్మని భావించికొని మనుష్యునివలె నటింపఁగా వాల్మీకి వాస్తవార్థము శ్రీరామమూర్తియే భగవంతుఁడని శ్లో॥ "సహిదేవై రుదీర్ణస్య, రావణస్య వధార్థిభిః, అర్థితో మానుషేలోకే జజ్ఞే విష్ణుః సనాతనః." అయో-౧.ఇత్యాది వాక్యములచే వెల్లడించుచు దానినే రామవాక్యంబులవలనను, గొన్ని రామచర్యల వలనను సమర్థంబుగ సిద్ధాంతీకరించియున్నాఁడు. ఈయర్థము హారమునందలి సూత్రమువలె నేడు కాండములయందును వ్యాపించియున్నది. రామాయణపాఠకు లీయర్థంబును మనస్సున నుంచికొని ప్రతివిషయంబును, బ్రతివాక్యంబును హెచ్చరికతో శోధింతురు గాక. ప్రతివిషయంబునను నీవిధముగఁ బరీక్షించువారికే వాల్మీకిరామాయణమునకుఁ దక్క రామాయణములకు (రామాయణముల కననేల? ఏభాషయందే గ్రంథమునకైనఁ) గలతారతమ్యము వాల్మీకిరామాయణము నౌత్కృష్ట్యము తెలియఁగలదు. కవి

హృదయము దెలియక తత్కవితామార్గ మనుసరింపక పఠించువారు తమశక్తిహీనతను వాల్మీకిదోషముగ భ్రమించి సంతసింతురు.

శ్రీరామాయణము మహాకావ్యము. పుట్టువుచేతనేకాక గుణముచేతను నది మొదటిది. దానియందలి గుణములు రహస్యములు దెలియ వాల్మీకికొండె సర్వజ్ఞున కొండె శక్యము.

"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ" యని మనస్సునకు వాక్కున కందని యనంతకల్యాణగుణవిశిష్టుం డగుభగవంతుని దయావంతుఁడని సర్వజ్ఞుఁడని సర్వశక్తిమంతుఁ డని యిట్టులు కొన్నిగుణముల వర్ణించి సంతసించునట్టు రామాయణ మునఁ గొన్నిగుణంబులు వారివారి శక్తికొలఁది నెఱింగి సంతసింపవచ్చును. తొలుతనే కించిజ్జ్ఞుఁడను. అందు గ్రంథవిస్తరభీతి వచించువాఁడను నేనేమి తెలుపఁగల? అయినను నాకంటెఁ దెలియనివారికి మార్గముఁ జూపుటకై సీతారాములకును, వాల్మీకికిని,గోవింద రాజ మహేశ్వర తీర్థాది వ్యాఖ్యాతలకును, సంప్రదాయజ్ఞులగు విజ్ఞులకును భక్తుల కును నమస్కరించి వారి యనుగ్రహంబునఁ గొన్నిగుణముల సూచించెద. శ్రద్ధా భక్తులు గలవారు సంప్రదాయజ్ఞులచే విశేషంబు లెఱుంగుదురు గాక. శ్రీమద్రామా యణమున నుత్తమోత్తమమహాకావ్యలక్షణము లన్నియుఁ గలవు

కం. పురసింధునగర్తువనశశి, సరసీవనమధురతిప్రసంగ విరహముల్
పరిణయతనయోదయనయ, విరచనయాత్రాజిదౌత్యవిభువర్ణనముల్.

అనువర్ణనములన్నియుఁ గలవు.

శైలి—వైదర్భిరీతి ద్రాక్షాపాకము.

శ్లో. సంగీత మపి సాహిత్యం, సరస్వత్యా స్తనద్వయమ్
ఏక మాపాతమధురం, ద్వితీయం చింతనామృత

మన్నట్లు రామాయణము గానమునఁ బఠనమునఁగూడ మనోహరముగ నుండును. లోకంబునఁ గొన్నికృతులు గానంబున శ్రవ్యము లగునుగాని యూరక పఠించిన నీరస ములుగ నుండును. కొన్నిపఠనమునకు యోగ్యములయినను రాగతాలలయాదులకు నిలువవు. రామాయణ మట్టిదిగాదు. పాఠ్యే గేయేచ మధుర మ్మని గ్రంథమునందే చెప్పఁబడి యున్నది. అప్రకారము కుశలవులు పాడిరి.

రసములు—ఇందు శృంగారాది నవరసములు గలవు. అందు శృంగారరసము, సంభోగశృంగారము.

శ్లో. "రామస్తు సీతాయా సార్థం, విజహార బహూ నృతూన్
మనస్వీ తద్గతస్తస్యా, నిత్యం హృది సమర్పితః

ప్రియాతు సీతా రామస్య, దారాః పితృకృతా ఇతి
గుణా ద్రూపగుణా చ్చాపి, ప్రీతి ర్భూయో వ్యవర్ధత
తస్యాశ్చ భర్తా ద్విగుణం, హృదయే పరివర్తతే
అన్తర్జాత మపి వ్యక్త, మాఖ్యాతి హృదయం హృదా
తస్య భూయో విశేషేణ, మైథిలీ జనకాత్మజా
దేవతాభి స్సమా రూపే, సీతా శ్రీరివ రూపిణీ.

తయా స రాజర్షిసుతోఽభిరామయా, సమేయివా నుత్తమరాజకన్యయా
అతీవ రామ శ్శుశుభేతి కామయా, విభు శ్శ్రియా విష్ణు రి వామరేశ్వరః"

బాల. ౭౭-వ సర్గము.

ఉ. శ్రీరఘురామచంద్రుఁడును ♦ సీతనుగూడి యనేకముల్ ఋతుల్
హారివిహారలీలలఁ బ్రి♦యంబుగఁ బుచ్చెను నిచ్చలున్ మనం
బారమణీలలామపయి ♦ నాఁటినికూరిమి నిల్పి యామెయున్
గూరిమిపేరిమిం జెలఁగఁ ♦ గూర్చె మనంబు సదా హృదీశుపై. బా. ౧౩౬౪

కం. ప్రణతామరునకు యోషి,న్మణి పితృకృతదార యగుట ♦ మదిఁ బ్రియ యయ్యెన్
గుణముల ననుగుణసద్గుణ, గణముల రూపాదికములఁ ♦ గామించెఁ గడున్. ౧౩౬౫

కం. పతి సుందరియగు నాగుణ, వతిమనమున ద్విగుణముగను ♦ బరివర్తించెన్
సతి యంతర్గాతాశయ, మతిసూక్ష్మం బైనఁ బతికి ♦ వ్యక్తంబ యగున్. ౧౩౬౬

కం. అలసాధ్వీలక్ష్మిగతిం, జెలువంబున నమరియనఁగఁ జెలు వగు నామై
థిలు కన్న సీత పతికిం, గలప్రేమ నెఱుంగు భర్త ♦ కంటెను మిగులన్. ౧౩౬౭

ఉ. రాజసుతుండు రాముఁ డభి♦రామయు నుత్తమరాజకన్యయౌ
రాజముఖీమణిం గలసి ♦ రాజితకాముఁ డనంతకామతో
రాజిలుమోహబంధముల ♦ రంజిలుచుండె విభుండు విష్ణు వా
రాజసహోదరిం గలసి♦రాగమునన్ విలసించుచాడ్పునన్. ౧౩౬౮

భార్యాభర్తల పరస్పరానురాగ మింతకుమించి వర్ణింపఁదరముగాదు. పైశ్లోకములయందు భావమే కాక కొన్నిపదము లెంతయర్థగాంభీర్యముగలవై రసవంతము లైయున్నవో చూడుఁడు.

వాల్మీకి వాక్యామృతరస నిరంతరాస్వాదనతుందిలుం డగుభవభూతిమాత్రము దీనిలోని యేకదేశముంగొని

శ్లో. "లీనేవ ప్రతిబింబి తేవ లిఖితే వోత్కీర్ణరూపేవ చ
ప్రత్యుప్తేనచ వజ్రలేపఘటి తే వాంతర్నిఖాతేవ చ

సా న శ్చేతసి కీలితేవ విశిఖై శ్చేతో౽భువః పంచభి
శ్చింతాసంతతితంతుజాలనిబిడస్యూతేవ లగ్నా ప్రియా.

యని వర్ణించియున్నాఁడు.

విప్రలంభము. రావణుఁడు సీతను హరించినది మొదలందందును
హాస్యము. శూర్పణఖావృత్తాంతమున; త్రిజటుని వృత్తాంతమున
కరుణము. ఇష్టవియోగమువలన ననిష్టసంభవము. దశరథుమృతి లోనగువాని యందు
వీరము. లక్ష్మణుని వృత్తాంతమున
రౌద్రము. రావణువృత్తాంతమున
భయానకము. వికృతక్రూర దర్శనాదులవలని భయము. మారీచాది వృత్తాంతముల
బీభత్సము. కబంధ విరాధుల వర్ణనమున
అద్భుతము. రావణయుద్ధమున
శాంతము. శబరీవృత్తాంతమున వర్ణింపఁబడి యున్నవి.

అలంకారములు.

అలంకారములు శబ్దాలంకారములని, యర్థాలంకారములని రెండు విధములు. శబ్దాలంకారములు. రామాయణమున శబ్దాలంకారములు తఱచు లేవు. అంత్యానుప్రాసము కొన్ని స్థలములఁ గానవచ్చెడి.

శ్లో. వినష్టసీతాంశుతుషారపంకో, మహాగ్రహాగ్రాహ వినష్టపంకః
ప్రకాశలక్ష్మ్యాశ్రయ నిర్మలాంకో, రరాజ చంద్రో భగవాన్ శశాంకః.

వంశస్థము. వినష్టశీతోదకబిందుపంకుఁడు
ఘనగ్రహాగ్రాహ వినష్టపంకుఁడున్
వినోదలక్ష్మ్యాశ్రయనిర్మలాంకుఁడు
న్వినిద్రరుగ్యుక్తిఁ జనెన్ శశాంకుఁడున్.

శ్లో. త్రైలోక్యవసుభోక్తారం, త్రైలోక్యోద్వేగదం మహత్
జేతారం లోకపాలానాం, క్షేప్తారం శంకరస్యచ
దృప్తానాం నిగ్రహీతార, మావిష్కృతపరాక్రమమ్
లోకక్షోభయితారంచ, నాదైర్భూతవిరావిణమ్
ఓజసా దృప్తవాక్యానాం, వక్తారం రిపుసన్నిధౌ
స్వయూథభృత్యవర్గాణాం, గోప్తారం భీమకర్మణాం
హన్తారం దానవేంద్రాణాం, యక్షాణాంచ సహస్రశః

నివాతకవచానాంచ, సంగ్రహీతార మీశ్వరమ్
నైకయజ్ఞవిలోప్తారం, త్రాతారం స్వజనస్యచ యుద్ధ-౧౧౪

సీ. సకలజగజ్జాల♦సర్వార్థభోక్తను,వైరిహృత్స్ఫోటన♦పరుషవక్త
సర్వదిశాపాల♦సముదయజేతను,నఖిలజగత్సుభ♦యప్రదాత
సహరాజతాహర్య♦శంకరక్షేప్తను,లంకాపురీద్వీప♦లలితగోప్త
సమదశాత్రవలోక♦సంఘాతనిగ్రహీత, శఠనివాతకవచ♦సంగ్రహీత
ఆ. బహుళయజ్ఞలోప్త♦స్వజనయూథపగోప్త,దానవేంద్రహంత ♦ తతనియంత
లోకచయవిహర్త♦బాకారిమదహర్త, బంక్తికంఠధర్త♦బ్రాణభర్త . యు. ౨౫౫౮.

అర్థాలంకారములు.

శ్రీమద్రామాయణము స్వభావోక్త్యలంకారములకుఁ బుట్టినిల్లు. స్వభావోక్తు లయినను,

శ్లో. మాహిష్మతీపురీమధ్యే, ముహు రాఘ్రాయ మేదినీమ్
పాదమేకం సముద్ధృత్య, శ్వా మూత్రం విసృజత్యహో.

యనునట్టివి కావు. దేశకాలవస్తుస్వభావముల ననుసరించి చెప్పఁబడియుండును, వర్షమును వర్ణించుచుండిన మనయెదుట వర్షము కురియుచున్నట్టులే యుండును. హేమంతము వర్ణించిన మంచులో మనము దడియుచున్నట్లే యుండును, అడవులలో జరగునట్టియు మనకెన్నఁడు గోచరింపనట్టివియుఁగూడ మనకన్నులయెదుట జరగుచున్నట్లే యుండును. ఇంతయేల? తన వర్ణనాచమత్కారముచే వాల్మీకి పాఠకునిఁ దనచేతిలోని బొమ్మవలెఁ జేసికొని తనయిచ్ఛకొలఁది నాడించుచుండును, ఏవిషయము వర్ణించినను నది మన కనులయెదుట జరగినట్లే యుండును.

శ్లో. స్పృశంస్తు విమలం శీత, ముదకం ద్విరద స్సుఖమ్
అత్యన్తతృషితోవన్యః, ప్రతిసంహరతే కరమ్. అర. ౧౬.

తే. అడవియేనుఁగు పెనుదప్పిఁ ♦ బడియు మిగులఁ
జిల్లుమని యున్ననీటిని ♦ నల్లయదిగొ
నంటియును ద్రావకయ తొండ ♦ మల్లముడుఁచు
కొనుచునున్నది తిలకింపు ♦ కులవతంస. అర. ౨౬౪.

ఉపమాలంకారమందు వాల్మీకి కాళిదాసున కుపాధ్యాయుఁడు.

శ్లో. గుణవంతోను రూపాశ్చ, రుచ్యా ప్రోష్ఠపదోపమాః. బా. ౧౮ స.

కం. కాంతిని బ్రోష్ఠపదోపము, లెంతయు ననురూప సుగుణులు బా. ౫౦౬.

ఈయుపమాన సారస్యము నక్షత్రస్వరూపముఁ దెలిసినవారికిఁ దెలియును.

రావణవధానంతరము సీతనుజూచి రాముఁడు,

శ్లో. ప్రాప్తచారిత్రసందేహా, మమ ప్రతిముఖే స్థితా
దీపో నేత్రాతురస్యేవ, ప్రతికూలాసి మే దృఢమ్.

కం. జనశంకితచారిత్రవు, జనకసుతా! నీవు నాదుసన్నిధి నిలువన్
గనుకలక వానిముందటి, పెనుదీపమువోలె దాయ ♦ విధమైతిచుమీ. యు. ౨౭౦.౨.

ఈయుపమానముచే సీత నిర్దోషురాలనియు, శంకయను దోషముచే బాధ పడువాఁడు రాముఁడేయనియు స్పష్టము.

రావణాసురుఁడు సీతను హరించినపుడు,

శ్లో. జగ్రాహ రావణ స్సీతాం బుధః ఖే రోహిణీ మివ

కం. జనకజను బుధుఁడు రోహిణి, వినువీధిని బట్టునట్లు ♦ వెసఁ బట్టుకొనెన్.

సీత లోకమాత యగుటచే నామెను రావణుఁడు పట్టుట తల్లిని బట్టుటవంటి మహాఘోరకార్యమని భావము.

శ్లో. రాక్షసానాం సహస్రేషు, నకశ్చి త్ప్రత్యదృశ్యత
యథాస్తంగత ఆదిత్యే, నావతిష్ఠంతి రశ్మయః.

చం. జలజహితుండు గ్రుంకఁ గర ♦ సంతతి యాతని వెంటఁబోవున
చ్చెలువునఁ గూలియున్నహరి ♦ జిత్తునుగాంచి నురారికోటిలో
నిలువఁడ యొక్కఁడేని.

ఇవి యింద్రజిత్తు చావఁగానే వానిసేనలకుఁ బట్టినగతిని దెలుపును.

సదృశ్యస్ఫురణమునకు వచ్చినవానినిఁ దెలిపితి. ఇంకను యోజించిన నింతకు మేలైనవి యెన్నియో కలవు.

## ఉత్ప్రేక్ష.

లంకలో నశోకవనములో నొక వంక పాఱుచుండెను. దానితీరమునందలి చెట్లకొమ్మ లానీళ్లలో వ్రేలాడుటచే నీరు వెనుకకు మరలుచుండెను. ఈ సామాన్య విషయమును గవి యెట్లుత్ప్రేక్షించియున్నాఁడో చూడుఁడు.

శ్లో. దదర్శచ నగా త్తస్మా, న్నదీం నిపతితాం కపిః
అంకా దివ సముత్పత్య, ప్రియస్య పతితాం ప్రియామ్
జలే నిపతితాగ్రైశ్చ, పాదపై రుపశోభితామ్
వార్యమాణా మివ క్రుద్ధాం, ప్రమదాం ప్రియబంధుభిః
పునరావృత్తతోయాంచ, దదర్శ స మహాకపిః
ప్రసన్నా మివ కాంతస్య, కాంతాం పునరుపస్థితామ్.

సీ. ఆనగాగ్రమునుండి ♦ యవనికి సరుదెంచు, సెలయేటిచొప్పునఁ గాం♦చినను నచటఁ
బలిమీఁదఁ గినిసి యం♦కతలంబు డిగి యేగు, కోపనవైఖరి ♦ కొమరుమీఱె
నందుఁ బ్రేలాడు శా♦ఖాగ్రంబు లాక్రుద్ధ, వారించు చుట్టాల ♦ పగిదిఁ దోఁచె
ఝురమప్డు వెనుకకు ♦ మరలెడివహిఁ జూడఁ, గినుక చల్లారఁ గాం♦తునిఁ గనంగ
తే. మెల్లఁ గ్రమ్మఱి పోయెడి ♦ మెలఁతఁ బోలె. సుం. ౪౧౩,

ఉత్ప్రేక్షలయందును స్వభావమున దృష్టియుంచఁబడియే యుండును.

## శ్లేషాలంకారము.

శ్లో. మా నిషాద ప్రతిష్ఠాం త్వ, మగమ శ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచ మిథునా దేక, మవధీః కామమోహితమ్. బాల. ౨ స.

తే. తెలియుమా నిషాదుండ ప్ర♦తిష్ఠ నీక, ప్రాప్తమయ్యెడు శాశ్వత♦హాయనములఁ
క్రౌంచమిథునంబునందునొ♦క్కండు నీవు, కామమోహితముం జంపు ♦ కారణమున.

ఇదియే వాల్మీకి వదనకమలమునుండి వెలువడిన ప్రథమశ్లోకము. ఇదియే వేదాన్యవిషయంబునఁ గలిగిన యాదిమశ్లోకము. దీనికి నిషాదపరముగ నొక యర్థము, రామాయణకథాసంగ్రహము భగవత్పరముగ రెండవయర్థమును గలదు.

శ్లో. సమాక్షరై శ్చతుర్భిర్యః పాదై ర్గీతో మహర్షిణా.

అని చెప్పఁబడుటచే మూలశ్లోకమున ౪ పాదములు - పాదమునకు ౮ అక్షరములుగలవు. ఆంధ్రపద్యంబున ౪ పాదములు-పాదమునకు ౧౩ అక్షరములు నున్నవి. తెలియుమా - నిషాదుండ - ప్రతిష్ఠ - నీకుఁ-అప్రాప్తం బగునని యొక్కయర్థము. తెలియు - మానిషాదుండ - ప్రతిష్ఠ - నీక - ప్రాప్తంబగు. అని భగవత్పరమైన యర్థము.

ఒక బోయవాఁడు క్రౌంచమిథునంబునందు మగపక్షిని జంపుటయు, నాఁడుపక్షి మగపక్షిని జూచి దుఃఖించుటయుఁ బరమదయామయుం డగు వాల్మీకి చూచి బోయచేసిన యధర్మకార్యమునకై కినిసి యతని నీశ్లోకంబున శపించెను. ఓ బోయవాఁడా! కవగూడియుండు క్రౌంచంబులం దొక్కదానిని నీవు చంపుటచేత ననేకసంవత్సరములు నీవు భూమియందుండఁజాలవు. ఇదియే రామాయణోత్పత్తికిఁ గారణమైనశ్లోకమగుటచేత నిది నాంది శ్లోకమయ్యెను. కావున దీనికి భగవత్పరముగ నొక యర్థము గలదు.

మానిషాదుండ=శ్రీనివాసుఁడ! క్రౌంచమిథునంబునందు=మందోదరీ రావణులయందు, కామమోహితముఁ, ఒక్కండు=కామపీడితుఁ డగు రావణుని నీవు చంపిన కారణముచే, నీక=నీకే, ప్రతిష్ఠ=లోకములోఁ గీర్తి, శాశ్వతహాయనములఁ = అనేక

సంవత్సరములయందు, ప్రాప్తమయ్యెడుఁ=లభించుఁగాక. రామాయణము నేడు కాండముల కథయు నిందు సూక్ష్మముగ సమర్థింపఁబడియున్నది.

లక్ష్మణుఁడు రామునితోఁ నరణ్యమునకుఁ బోవుచుఁ దల్లికి నమస్కరింపఁగా నా మహాత్మురాలు సుమిత్రాదేవి యిట్లు కుమారునకు బోధించెను.

శ్లో. రామం దశరథం విద్ధి, మాం విద్ధి జనకాత్మజామ్
అయోధ్యా మటవీం విద్ధి, గచ్ఛ తాత యథాసుఖమ్.

తే. రాముఁడ యెఱుంగుమీ దశ•రథుఁడు నిజము
నను దలంపుమా జనకుని•తనయఁ బుత్ర
యటవియ యయోధ్య యంచు నీ • వాత్మఁ జూడు
పోయిరమ్ము యథాసుఖ•ముగను దండ్రి.

ఈశ్లోకమునకుఁ బండితు లనేకార్థములు చెప్పుదురు. అందు సర్వజనసమ్మతము లైనవి ప్రధానములైనవి మూఁడర్థములు. వానిని సంగ్రహముగ వచించెద.

(౧) రాముఁడ యెఱుంగుమీ దశరథుఁడు నిజము. ఇదివఱకు నీవు రాము నకుఁ గుడిచేయివలె వెలుపలిప్రాణమువలె నుండినవాఁడవు. ఆభక్తిచేతనే యిప్పుడు కానల కాయన వెంబడిఁ బోవుచున్నాఁడవు. ఇదివఱకు రాముఁడు మహారాజకుమా రుఁడు పట్టనమందుండి యనేక భోగము లనుభవించుచుండినవాఁడు. నీవు నట్లే సుఖ మునకు హానిలేకుండ నన్నుఁ గొలుచుచుండితివి. ఇఁకమీఁద నట్లుగాదు. చేయఁబోవు నది సకలదుఃఖనిలయ కాననవాసము. అదియు నొకనాఁడుగాదు. ౧౪ సంవత్సరములు. పరివారముతోఁ గూడఁగాదు. ఒంటరిగ. నీవే పరిచారకుఁడవు. అట్టికష్టదశయందు నీకు విసుఁగు దోఁచునేమో? జ్ఞాతి వెంట నేనేల కష్టములకుఁ బాలుపడవలయునని తలఁతువేమో? అట్లు తలఁపవలదు. అడవియందుండినను, బట్టనమందుండినను, ధని కుఁడైనను దరిద్రుఁడైనను దండ్రి యెట్లు పూజ్యుఁడో యట్లే. పితృసమో జ్యేష్ఠయను శాస్త్రోక్తి నీకురాముఁడే తండ్రియగు దశరథుఁడు. పితృదేవోభవ యను ననుశాసనము చొప్పునఁ దండ్రియం దెట్టిగౌరవము నీవుంచవలయునో యట్టిగౌరవము నీవు శ్రీరా మునం దుంచుము.

"నను దలంపుమా జనకునితనయఁ బుత్ర"

అనఁగా, జనకునితనయను నన్నుఁగాఁ దలంపుము.

మాతృదేవోభవ యనువాక్యము చొప్పున నాయందు నీకుఁగలగౌరవము సీతయందుంచుమని యర్థము.

"అడవియ యయోధ్య యంచు నీ వాత్మఁజూడు"

అడవిని దుఃఖాలయముగ భావింపకు సుఖాలయమైన యయోధ్యగాఁ దలంపు.

సుఖదుఃఖములు మనఃకల్పితములు. నీమనస్సు నీవశమందుండెనేని నీవెందున్నను నీకు సుఖదుఃఖములు సమములు గాఁగలవు. అని యొకయర్థము.

(౨) అమ్మా! పితృసమో జ్యేష్ఠ యనున్యాయము తండ్రి యనంతరముగదా? తండ్రి జీవించియుండ నాన్యాయ మెట్లన్వయించు నందువేమో.

"రాముఁడ యెఱుంగుమీ దశరథుఁడు నిజము"

దశరథుఁడు రాముఁడ = దశరథుఁడు చచ్చిన వాఁడే యని యెఱుంగుము. రామునిఁ బాసిన వెనుక నీతండ్రి జీవింపఁడు—నిజము.

నీతండ్రి యెప్పుడు మరణించునో యప్పుడు నాగతి యేమి? ఇక్కడనా కైకప్రభుత్వము. ఆమెకు నాయందు ద్వేషబుద్ధియుండుట నీకుఁ దెలిసినదే. నీతండ్రి లేక రాముఁడును లేక నీవును లేకపోయినప్పుడు నన్నుఁగైక యీయూర నుండనిచ్చునా? ఒకవేళ నుండినను నాకు సుఖము కలదా? కావున నేను బుట్టినయిల్లు చేరవలసినదాననే. అక్కడ నాప్రతిష్ఠ యేమియున్నది. దశరథునిభార్య యనుగౌరవము నశించెను. అక్కడివారు మనరాజుకూఁతురు తెంచి యిల్లు వచ్చి చేరినదని నన్ను నాతండ్రికూఁతుర నందురు గాన

"ననుఁ దలంపుమా జనకునితనయఁ బుత్ర"

అటులైనచో నయోధ్యగతి యేమందువా

"అడవియ యయోధ్య" - అయోధ్య యడవి కాఁగలదు. అని రెండవ యర్థము.

(3) కుమారా! "నేనేల జ్ఞాతియగు రాముని వెంట నడవికిఁబోయి ప్రాణాపాయములకు లోనుగావలయును? నన్నెవ్వరు పొమ్మనిరి? నేనై చెట్టుకొట్టి మీఁదఁ ద్రోసికొను టేల? నేను బోయిన రాఁగలలాభ మేమి? పోకుండిన నష్టమేమి?" యని సందేహింతువేమో. అట్టి యాలోచనలు చేయవలదు. ఏలన,

"రాముఁడ యెఱుంగుమీ దశరథుఁడు నిజముగను"

తత్త్వార్థము విచారింపఁగా మనుష్యస్వరూపమునఁ గానవచ్చునీరాముఁడే దశరథుఁడు = గరుడవాహనుఁడైన విష్ణువు.

"తలఁపు మా జనకునితనయఁ బుత్ర"

జనకునితనయన్ = సీతను; మా = లక్ష్మీదేవిగాఁ దలంపుము.

"అడవియ యయోధ్య"

లక్ష్మీనారాయణు లుండుస్థలమేదో యదే వైకుంఠము. దేవానాం పూ ర యోధ్యా, యని యుండుటచే నడవియే వైకుంఠము. అట్టి యేకాంతసేవ దొరకుట

దుర్లభము. కావున నాయనా! తదేకధ్యానంబున భగవత్సేవ నరణ్యంబునఁ జలుపఁ బొమ్మని బోధించెను.

ననుఁ దలంపుమా, యనుచో నొకయర్థమున నర్థానుస్వారము గలదు. ఒక యర్థమున నుండదు. దీనికిఁ బ్రమాణము,

శ్లేషే సఖండ నిర్ఖిందోర్వ్ శ్లేషనం కుత్రచి న్మతమ్ ఆ-కా.

మా = మాఁగ అన్నందులకు

క్రియావిధేయవిశేషణంబులమీఁది యగుధాతువునకు న్నంతమునకు లోపంబు విభాషనగు. ప్రౌ - వ్యా.

ఇట్లే నానార్థములుగల పద్యములు నన్వయించుటయం దాంధ్రవ్యాకరణ సూత్రంబులను సమయోచితంబుగ ననుసంధించుకొనునది.

## చిత్రాలంకారము.

అలంకారశాస్త్రములయం దెన్నియలంకారములు చెప్పఁబడి యున్నవో యన్నియు నిందుఁగలవు. విస్తరభీతి వానినెల్ల నుదాహరింపక కవియొక్క యసమాన కవితాచాతురిఁ దెలుపు నొక్కదాని నుదాహరించి యీవిషయము విరమించెద. రావణుఁడు సీతాదేవి నపహరించి చనినపిదప శ్రీరాముఁడు ప్రియావియోగంబునకై దుఃఖించుచు నడవి నిర్జనమగుటచేఁ గనులకు గోచరించు పక్షివృక్షమృగాదుల సంబోధించుచుఁ బోయిపోయి రావణుఁడు జటాయువుతో యుద్ధము సేసిన స్థలమునకు సమీపముననుండు ప్రస్రవణగిరిం గాంచి,

శ్లో. "కచ్చిత్ క్షితిభృతాంనాథ! దృష్టా సర్వాంగసుందరీ
రామా రమ్యవనోద్దేశే, మయా విరహితా త్వయా."

తే. అబల సర్వాంగసుందరి ♦ యవనిభృద్వ
రా! మనోహర మగువన♦రాజిఁ జూడఁ
బడియెనా సీత నీచేత ♦ విడువఁబడుట
నొంటి నాచేత నడయాడు ♦ చుండ నిచట

యనియడిగెను. అనఁగా నో పర్వతరాజా! నాచేత నొంటిగ రమ్యమగు వనదేశమందు విడువఁబడిన సర్వాంగసుందరియగు సీత నీచేతఁ జూడఁబడెనా యని ప్రశ్న.

వృక్షములు నదులులోనగు వానివలెఁగాక కొండలయందుఁ బ్రతిధ్వని యిచ్చు గుణమున్నది. ఇది కవి మనస్సున నుంచుకొని యీశ్లోకమును రచియించెను. ప్రతిధ్వనియందు మనము చెప్పినమాటలే మనకు మరలవినఁబడును. "నీవు చూచితివా" యనిన "నీవుచూచితివా?" యని ప్రతిధ్వని కలుగును. అట్లు వినఁబడినదనిన సారస్యములేదు. ప్రతిధ్వనిగా వినఁబడిన యీశ్లోకమునకు

"ఓ రాజశ్రేష్ఠుఁడా! రమ్యవనదేశమందు నీచేత నొంటిగవిడువఁబడిన సర్వాంగ సుందరి నాచేతఁ జూడఁబడియె" నను నర్థమును గలదు. ఇట్లు ప్రశ్నయునుత్తర మొక్క వాక్యముననే యుండినఁ జిత్రాలంకారమగును. ఇంతదీర్ఘముగనూహించి విన్నాణముగ వ్రాసినకవి యీసరికి వాల్మీకి యొకఁడే. అలంకారముల దాఁక నేల? సాధారణవిషయముఁ జెప్పునప్పుడు నేహో యొక చమత్కారము గనఁబఱుచుచుండును.

శ్లో. సీతాకపీంద్రక్షణదాచరాణాం, రాజీవహేమజ్వలనోపమాని
సుగ్రీవరామప్రణయప్రసంగే, వామాని నేత్రాణి సమం స్ఫురంతి. కిష్కిం. ౫.

కం. సరసిజ సువర్ణవైశ్వా, నరసమములు జానకీవ ♦ నాటేశనిశా
చరనాథుల డాకన్నులు, సరవిం జలియించెఁ దత్ప్ర ♦ సంగము జరుగన్.

వారివారి వాక్కులు వారివారి చిత్తవృత్తి గుణముఁ దెలుపునవిగాను వారివారి యప్పటిస్థితికి సర్వమైనవిగా నుండును. దశరథుని మృతినిగుఱించి కైక భరతునితో

శ్లో. యాగతిః సర్వభూతానాం, తాం గతిం తే పితా గతః

తే. ఎల్లభూతములకు ♦ నెయ్యదిగతి నీకు,
తండ్రి యట్టిగతికిఁ ♦ దనయ యరిగె అయో. ౧౭౫౮.

అనిచెప్పెను. తాను మహాకార్యమును సాధించినట్టు లుప్పొంగుచున్నదే కాక యింత చల్లగఁ దనభర్తచావుఁ దనకుమారునితోఁ జెప్పునిల్లా లెవతె? ఈసమాచారము నే భరతుఁడు శ్రీరామునితో

శ్లో. త్వామేవ శోచం స్తవ దర్శనేప్సు, స్త్వయ్యేవ సక్తా మనివర్త్య బుద్ధిమ్
త్వయా విహీన స్తవ శోకరుగ్ణ,స్త్వాం సంస్మర న్న స్తమితః పితా తే.

తరలము. నినుఁ దలంచియ యేడ్చుచున్ మఱి ♦ నీదుదర్శన కాంక్షియై
నినుఁ దలంగక యున్నబుద్ధిని ♦ నేర కేమియుఁ ద్రిప్పఁగా
ననఘ! నీవిడనాడుటన్ భవ ♦ దార్తి పీడితుఁ డౌచు నీ
జనకుఁ డక్కట యస్తమించెను ♦ దాని నిన్నె స్మరించుచున్

అని దీనోక్తి వచించెను.

వినాశకాలమునకు నోర విపరీతవాక్యములే వచ్చును. శుభవాక్యము లశుభ వాక్యములుగ నగును. మొట్టమొదట వానరులతోడి యుద్ధమునకు ధూమ్రాక్షునిఁ బోవ నాజ్ఞాపించుచో రావణుఁడు,

శ్లో. త్వం వధా యాభినిర్యాహి రామస్య సహవానరైః. యుద్ధ. ౧౫.
"చనుమీ

ఉ. నీవు వధార్థమై నుపవ ♦ నేచరయుక్తుఁడు రామునిర్ణరికిన్.

అనిచెప్పెను. రావణుఁడు భావించినది రామాదులఁ జంపుటకని యైనను నీవు చచ్చుటకుఁగాను బొమ్మనువిపరీతార్థము ఝటితి స్ఫురించుచున్నది.

శ్రీరామచంద్రుఁ డెట్లు ప్రాశస్త్యవంతుఁడో యట్లు కుంభకర్ణుఁడు వపుష్మంతుఁడు. అతనిది సహజశక్తి. వరలబ్ధము గాదు. కేవలము దేహమునందే దృష్టిగలవానియం దుండఁదగు పెద్దదేహము, బలము, త్రాగుపోతుతనము, నిద్దురపోతుతనము, తిండిపోతుతనము, లోనగు గుణములన్నియుఁ బక్వదశఁ జెంది యాతనియందు నిలిచినవి. ఇట్టివాఁడు తాను రామునిమీఁదికి యుద్ధమునకుఁ బోయెదనని చెప్పుచు రావణుతో

శ్లో. రమస్వ కామంపిబచాగ్ర్యవారుణీంకురుష్వ కృత్యాని వినీయతాం జ్వరః
మయాద్య రామే గమితే యమక్షయంచిరాయ సీతా వశగా భవిష్యతి.

తే. కోర్కులు భుజింపు మద్యంబుఁ గ్రోలు కృత్య
మఖిలమును దీర్పు మేఁబోదు హతుఁడుగాఁగ
రామవిభుఁ డక్షయంబుగ రమణ సీతఁ
బొందఁ గలుగును నీకెదఁ బొగలవలదు. యుద్ధ. ౧౮౮౫.

అని చెప్పెను. ఇందును విపరీతార్థము స్ఫురించుచున్నది.

పాత్రగుణ మాహాత్మ్యమున కసంగత మైనవాక్యము లాపాత్రమునోర వెలువడవు. ఇదివఱకే రాముఁడు భగవంతుఁడని వాల్మీకి యభిప్రాయమని చెప్పఁబడియెఁ గదా. భగవంతుఁ డైన చో నుత్తరక్షణమునఁ దనపట్టాభిషేక కార్యము విఘ్నము చెందుచుండఁగా సీతతో,

శ్లో. "ధ్రువ మద్యైవ మాం రాజా, యౌవరాజ్యేభిషేక్ష్యతి" అయో. ౧౯.

యని చెప్పనా యందురేమో. ఈశ్లోకార్థముఁ బరిశీలించుటకుముందు దీనికిఁ బూర్వమునందు నేతద్విషయకరామవాక్యంబు లెంత జాగరూకతతోఁ జెప్పఁబడినవో చూడుఁడు.

శ్లో. ఏవ ముక్తస్తు సంహృష్టో, నరసింహో మహాద్యుతిః
తత స్సమ్మానయామాస, సీతా మిద ముఖాచ హ
దేవి! దేవశ్చ దేవీచ, సమాగమ్య మదంతరే
మంత్ర యేతే ధ్రువం కించి, దభిషేచన సంహితమ్
లక్షయిత్వా హ్యభిప్రాయం, ప్రియకామా సుదక్షిణా
సంచోదయతి రాజానం, మదర్థం మదిరేక్షణే
సా ప్రహృష్టా మహారాజఀ, హితకామానువర్తినీ
జననీ చార్థకామా మే, కేకయాధిపతే స్సుతా

దిష్ట్యా ఖలు మహారాజా, మహిష్యా ప్రియయా సహ
సుమంత్రం ప్రాహిణో ద్దూత, మర్థకామకరం మమ
యాదృశీ పరిషత్తత్ర, తాదృశో దూత ఆగతః
ధ్రువ మద్యైవ మాం రాజా, యౌవరాజ్యేభి షేక్ష్యతి

ఉ. అనుడు లాలకించి వసు♦ధాధిప సూనుఁడు వాని సత్క్రియా
మానితుఁ జేసి సీతఁ గని ♦ మానిని! దేవర దేవి మత్ప్రియం
బైనప్రభుత్వదాన విష♦యంబు విచారము సేయుచున్నవా
రానుతశీల నన్గుఱిచి ♦ యాత్మధవుం గడుఁ దీవరించెడిన్. అయో. ౪౬_౭.

సీ. వెరవరి గాన దే♦వియు రాజు యోజన, యెఱిఁగి నాకు శుభంబు ♦ నెసఁగఁ జేయఁ
గోరుచుండుటఁ జేసి ♦ గొబ్బున నాయర్థ, వృద్ధికై తొందర ♦ పెట్టుఁ బతిని
వరహితకామాను♦వర్తిని గేకయ, జనపాలతనయ నా♦జనని కైక
యారయ యదృష్ట మా♦యవనీశుఁ డాప్రియు,రాలు నాయర్థకా♦మాభివృద్ధిఁ
తే. జేతమునఁ గోరెడిసుమంత్రు ♦ దూతగాఁగఁ
బంపి రిచ్చోటి కిది గదా ♦ పాడి దలఁప
నెట్టి దో సభ దూతయు ♦ నట్టివాఁడ
చెలియ యువరాజు నన్నిష్ట ♦ చేయుతేఁడు. అయో. ౪౬_౮.

ఇందు బాహ్యార్థము స్పష్టము. ఇఁక నంతరార్థంబున రాముఁడు చెప్పినది యేమి? నాపట్టాభిషేకవిషయమై తల్లియుఁ దండ్రియు నాలోచించుచున్నారని. ఇది వాస్తవమే కదా. ఏమని యాలోచించుచున్నారో. పట్టాభిషేకము చేయవలయు ననియో వలదనియో యది విశదపఱుపలేదు.

"ఆనుతశీల నన్గుఱిచి యాత్మధవుం గడుఁ దీవరించెడిన్"
ఇదియు సత్యమే కదా?
"నాయర్థవృద్ధికై తొందరపెట్టుఁ బతిని"
అర్థవృద్ధి యనఁగా లోకాభిప్రాయము చొప్పునఁ బట్టాభిషేకము-ధనవృద్ధి.
అర్థప్రకారే విషయేవ్యవహారేప్రయోజనే - నానా॥౭॥ - అని రాముని యభిప్రాయంబున నా(యవతార) ప్రయోజనముగుఱించి యనఁగా నేను రావణవధాది కార్యములు చేయు ప్రయోజనముగుఱించి యని యర్థము. ఈ యర్థము శ్రీరాముఁడే మునులతోనిట్లు తనమనస్సులో నున్నట్టు చెప్పెను.

శ్లో. నైవ మర్థ మాం వక్తు, మాజ్ఞప్తోహం తపస్వినామ్
కేవలే నాత్మకార్యేణ, ప్రవేష్టవ్యం వనం మయా

విప్రకార మపాక్రష్టుం, రాక్షసై ర్భవతా మిమమ్
పితుస్తు నిర్దేశకరః, ప్రవిష్టోహ మిదం వనమ్
భవతా మర్థ సిద్ధ్యర్థ, మాగతోహం యదృచ్ఛయా
తస్య మేయం వనే వాసో, భవిష్యతి మహాఫలః. ఆర - 2.

చం. అన రఘునాథుఁడిట్లను మహాత్ముల రీ రిటు నన్నుఁ బల్కఁగాఁ
జనునె? త్వదాజ్ఞ వర్తిలుదు ♦ సంయములార యరణ్యసీమకుఁ
జనిగొని యాత్మకార్యముగఁ ♦ బాపుల నెల్ల నడంచి మీకు శో
భన మొనగూర్ప మజ్జనకు♦వాక్యము సాకుగ నేను వచ్చితిన్.

కం. కాన మహాఫలదం బగుఁ, గాననవాసంబు నాకు........

కావున రాముని మనస్సులోనున్న యర్థము రావణవధాదికమే. రిపూణా మపి వత్సలయని పేరుపొందినరాముఁడు (సర్వసముఁడగు భగవంతుఁడు) తల్లిదండ్రుల యందు ద్వేషబుద్ధి గలవాఁ డగునా? కాఁడు. కావున వారియందలి సదభిప్రాయము తోనే సభ యెట్టిదో దూత యట్టివాఁడని చెప్పుట. ఈ యవతారప్రయోజన మెట్టులు నెఱవేఱఁగలదనఁగాఁ బట్టాభిషేకముచేసికొని రాజువలె నింటనుండిన నగునదికాదు. అరణ్యముల వెంటఁ బోవలయును. ఆకార్యమునకుఁ బట్టాభిషేక కార్యము విఘ్నకారి. కావున జరగఁబోవునది యేమన

శ్లో. న్నున మద్యైవ మాం రా జాఽయౌవరాజ్యేభిషేక్ష్యతి
తే. చెలి యయువరాజు న న్నిప్డ చేయ లేఁడు.

రా జిప్పుడు నన్ను యువరాజుఁ జేయఁడు.

రాజా-అయౌవరాజ్యేభిషేక్ష్యతి యని సంస్కృతంబున 'చెలి! యయువరాజు నన్నిప్డ♦చేయలేఁడు' అని తెలుఁగునఁ బదచ్ఛేదము. 'అత్మా తత్త్వమసి'కి మతత్రయా చార్యులొనర్చిన పదవిభాగ భేద మిట్టిదియకదా. ఈ భాగమున సీతాదేవి మన స్స్థితి యెట్లుండెనో చదువుఁడు.

కాళీకాదాసాదులును సీతాద్వితీయ శపథకాలంబున వాల్మీకి శ్రీరాముని సీతను గ్రహింపఁ బ్రార్థించెననియు శ్రీరాముఁడును శపథానంతరము గ్రహించెద నని చెప్పినట్టును వ్రాసియున్నారుగాని యవతారతత్త్వమెఱింగిన మహర్షివాల్మీకిమాత్ర మట్లు ప్రమాదము పడినవాఁడుకాఁడు. వాల్మీకి సీతను గ్రహింపుమని రామునిఁ గోరి నదిలేదు. శ్రీరాముఁడు మరల గ్రహించెదనని చెప్పినదిలేదు. ఇద్దఱు త్రికాలజ్ఞులు. ఉత్తరక్షణమున జరగు సమాచారము మనస్సునఁ దెలిసియుండియు నెట్లు చెప్పుదురు; అట్లుచెప్పుట పాత్రగుణవిరోధనుగాదా? ఉత్తరకాండమున ౧౫౦౧ మొదలు ౧౫౦౯

వఱకుఁ బద్యములఁ జూడుఁడు. ఇట్టివి పెక్కులు గలవు. వీనివలననే వాల్మీకి యనుత్తమమేధ తెలియఁగలదు.

వాల్మీకిరామాయణ కలశార్ణవమున రత్నములు వెదకువారు వాల్మీకిశైలి విధానము తొలుత నెఱుంగవలయును. అది తెలియక వెదకఁబూనువాఁడు చీఁకటింటఁ దారాడి నట్లగును. ఒక విషయమునుగుఱించి చెప్పవలసినదంతయు నొక చోటఁ జెప్పఁబడదు. కొన్ని సందర్భములయం దావిషయ మచ్చుటఁ బ్రస్తావింపఁ బడదు. అట్లుండియు నావిషయము మఱియెందేని సూచింపఁబడియైన నుండును. లేక చక్కఁగ విశదీకరింపఁబడియైన నుండును. ఇచ్చిన వర్ణనములచేఁ బ్రయోగించిన పదములచే మనమూహింపుకొనవలసియుండు. ఒక్కవిషయము రెండుమూఁడుమార్లు చెప్పినేని యొక్కొకసారి చెప్పుటయం దొక్కొకవిశేషమేదైనఁ జెప్పును. ఇట్టి చిత్రములు పెక్కులు గలవు.

సుందరకాండము చదువువారు ౩౬-వ సర్గంబున

శ్లో. కౌసల్యాయా స్తథాకచ్చి, త్సుమిత్రాయా స్తథైవచ
అభీక్ష్ణం శ్రూయతే కచ్చి, త్కుశలం భరతస్య చ
కచ్చి దక్షౌహిణీం భీమాం, భరతో భ్రాతృవత్సలః
ధ్వజినీం మంత్రిభి ర్గుప్తాం, ప్రేషయిష్యతి మత్కృతే.

సీ. కౌసల్యయు సుమిత్ర ♦ కపివరా భరతుండు, కుశలులే? యవ్వార్త ♦ విశదపడునె?
భ్రాతృ వత్సలుఁడైన ♦ భరతుండు నాకయి, యక్షౌహిణీసేన ♦ నంపునయ్య

అని సీతాదేవి హనుమంతునిఁ బ్రశ్నించినట్టు పైవాక్యములవలన నెఱుంగఁగలరు. ఎక్కడి పంప? ఎక్కడి పంచవటి? ఎక్కడి యయోధ్య? ఎక్కడి క్షేమసమాచారము? ఎక్కడిసేన వచ్చుట? యనుసందేహము పాఠకులకుఁ గలుగకపోదు. సంస్కృతమున నుత్తరరామాయణము చదువని వారెట్లు సమాధానము కుదుర్చుకొందురో తెలియదు గాని యుత్తరకాండమున సర్గములు ౩౮-౩౯ కాని యీగ్రంధమున నుత్తరకాండంబునఁ బద్యములు ౧౬౮ మొదలు ౧౭౮ వఱకుఁ గాని చదివినచో భ్రాతృవత్సలుఁడగు భరతుఁడు దూతలచే శ్రీరామాదులవార్త వారు పంచవటి విడిచిపోవువఱకుఁ దెలిసికొనుచుండె నని స్పష్టముకాఁగలదు.

సుగ్రీవుఁడు తన్ను వాలి పరాభవించినకథ దెలుపుటలోఁ గడపటిసారి తెలుపునపుడే

తే. అంతఁ గిష్కింధకును వచ్చి ♦ యన్న చచ్చెఁ
గాక యని నిశ్చయించి నా ♦ గాంపులగను

దార రుమను గ్రహించి వి♦స్తారరాజ్య
భార మేను వహించితి ♦ బంధుయుక్తి.

అని తారను దాను గ్రహించినవార్త మాటలోమాటగా జాఱవిడిచెను గాని తత్పూర్వము దెలిపినవాఁడు గాఁడు. కారణము స్పష్టము.

ధ్వని.

కం. తను వగు శబ్దార్థంబులు, ధ్వని జీవ మలంక్రియావి♦తానము సొమ్ముల్
తనరు గుణంబులు గుణములు, ఘనవృత్తులు వృత్తు లార ♦ కావ్యేందిరకున్.

అన్నట్లు కావ్యమునకు ధ్వనియే ప్రాణము. ధ్వనిలేని కావ్యము శవము. రామాయణమునందు ధ్వని విశేషముగఁ గలదు. కావ్యమున కంతయు ధ్వన్యర్థ ముండుటయే కాక విడిశ్లోకములయం దెన్నిటియందో ధ్వన్యర్థములు గలవు. ఋతు వర్ణనముల యందును ధ్వని స్ఫురించును.

శ్లో. తతో రావణ నీతాయాః సీతాయా శ్శత్రుకర్శనః
ఇయేష పద మన్వేష్టుం,చారణాచరితే పథి. సుందర. ౧ స.

కం. తరువాత రావణాసుర,వరనీత ధరాత్మజాత♦పదము న్వెదకన్
గురుచారణ మార్గంబున, నరుగఁగ నృపదూత ♦ కర్శితారి దలంచెన్. సుం. ౨.

ఈశ్లోకమునకు నాచార్యపరమైన యర్థము ధ్వని. (నృపదూతయను కర్తృపదమున నృపశబ్దమునకు భగవత్పర్యాయముగ నర్థము గ్రహించునది).

శ్లో. పక్షీచ శాఖానిలయం ప్రవిష్టః, పునః పున శ్చోత్తమసాంత్వవాదీ
సుస్వాగతాం వాచ ముదీరయానః పునః పునశ్చోదయతీవ హృష్టః.

చం. నెలకొని శాఖలందుఁ గడు ♦ నెమ్మిగ నుత్తమసాంత్వవాదియై
వెలసెడిపక్షి పల్కుచును ♦ వెండియు వెండియు స్వాగతోక్తిఁ బే
రెలమిని వెండివెండియును ♦ బ్రేరణచేసెడినట్లు గ్రాలెడున్

ఇందు గురు వెట్టివాఁడై యుండవలయునో యాలక్షణము వివరింపఁబడినది.
ఇట్టి యర్థబాహుళ్యము గలశ్లోకములు వందలకొలఁది గలవు.
శ్రీరామాయణాంతరార్థమని పెద్ద లిట్లు చెప్పుదురు.

భగవంతుఁ డొక్కఁడే పురుషుఁడు. తక్కినదంతయు స్త్రీప్రాయ మను నియమముచొప్పున సీతయే జీవుఁడు. ఆజీవుఁడు భగవంతుని నాశ్రయించి యుండువఱకెట్టియాపద నొందఁడు. కర్మవశమున దుర్బుద్ధియై మాయామయమైన ప్రకృతిపదార్థము (మాయజింక) నందు నాసక్తిగలవాఁ డయ్యెనేని మోక్షసాధనమునకు విరుద్ధమైన యట్టిబుద్ధి పుట్టఁ [illegible] భగవద్వియోగము కలు

గును. వెంటనే దేహప్రాప్తి (లంక) కలుగును. అందు రావణకుంభకర్ణు లహంకార మమకారములు. ఏకాక్షిప్రభృతు లింద్రియములు. అనుభవముచేత బుద్ధిమంతుఁడు గానలసియుండుటచే వానికిఁ జిక్కి యవస్థపడునపుడు జీవునకు వివేకముగలిగి పరితపింపఁ బ్రారంభించి నాయందు భగవంతునకు దయవచ్చునా? నన్ను మరలఁ దన యొద్దఁ జేర్చుకొనునా యని విలపించుచుండును (సీతావిలాపము). తన్నాశ్రయించి యుండిన జీవుఁ డజ్ఞానముచే నిట్టి కష్టదశకులోఁబడెఁ గదాయని యత్యంతదయాళువగు భగవంతుఁడు బిడ్డకై తండ్రి దుఃఖించునట్లు జీవునకన్న నెక్కువగఁ బరితపించుచు (రామవిలాపము) జీవునకు ధైర్యము వచ్చునటుల బోధించి భగవంతునకు నీయందనురాగము గలదని భయపడవలదని చెప్పుటకై యాచార్యుని (హనుమంతునిఁ) బంపును. అతఁ డాజీవుఁ డుండుచోటికిఁ బోయి యతని చేష్టలెల్లఁ దెలిసికొని ధైర్యముగలుగఁజెప్పి మరల భగవంతునితో నీజీవుఁ డనన్యసక్తుఁడు నీవేదిక్కని నమ్మియున్నవాఁడు (నియత - యక్షిత) కావున నీవు కాపాడవలయునని వేఁడఁగా భగవంతుఁడు ప్రతిబంధములనెల్ల నణంచి చిత్తశుద్ధిఁ బరీక్షించి (సీతాదేవి యగ్నిప్రవేశము) మరలఁ దనయొద్దఁ జేర్చుకొనును. కావున ననన్యాసక్తుండై దృఢనిశ్చయుండై జీవి భగవంతుని సేవించుచుండిన నాజీవికి శ్రేయస్కరమగునదియెల్ల భగవంతుఁడే ఘటియించును.

శ్లో. అనన్యా శ్చింతయంతో మాం, యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం, యోగక్షేమం వహా మ్యహమ్

అను భగవద్గీతావాక్య మీయర్థమునే బోధించెడిని.

సుందరకాండము చదువువాఁడు తన్ను సీతనుగాను, శ్రీరాముని భగవంతునిఁగాను భావించిన నీయర్థము స్పష్టపడును.

## పునరుక్తులు.

రామాయణమున సాధారణముగ సర్గాద్యంతములయందు ముందు చెప్పఁబడినకథయే సంగ్రహముగ మరలఁ జెప్పఁబడి యుండును. ఇదిగాక యుద్ధములు, శకునములు మొదలగువానియందు వర్ణించినవిషయమే మరల వర్ణింపవలసినచోఁ బూర్వోక్తశ్లోకములే మరలఁ జెప్పుట గలదు. ఇట్టిది తత్కవి కవితావిశేషమే కాని యితరము కాదు. ఇట్లున్నను సంభాషణాదుల వాక్యము లనువదించునపుడేని యితర స్థలములందేని సహృదయోచితముగ ననరించి యుండెడి నవసరములేదేని సవరింపక యుండెఁ బూర్వోక్తవాక్యములే చెప్పఁబడి యుండును. ఒకటిరెండు దృష్టాంతముల నిది స్పష్టపడు.

రావణుఁడు రామునిగుఱించి "విదితం మానుషం మన్యే రామం దశరథాత్మజం."
రాముఁడు తన్నుగుఱించి "ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజం."

రావణుఁడు మనుష్యునిచేఁ జచ్చునటులు విధి. కావునఁ దన విరోధియందు మనుష్యభావము లేక భగవంతుఁడను నమ్మకము పుట్టినచో నతఁడు చచ్చుట దుష్కరము.

ఇఁక సమర్థుఁడైన నర్తకుఁడు దాను వహించిన భూమిక కుచితమైన నటనమునఁ దన్నుఁ దానుమఱచునట్లు రాముఁడు మనుష్యవేషమువహించి నటించుచుండుటచేఁ గార్యమునందలి యాసక్తిఁ దన్నుఁ దాను మఱచెను.

ఉభయుల యభిప్రాయ మేకవిధమగుటచేతనే రామునిచే రావణుఁడు చచ్చెను. రాముఁడు రావణుఁ జంపఁగలిగెను.

సుగ్రీవుఁడు లక్ష్మణుతో

శ్లో. దృష్టా సీతా న సందేహో న చాన్యేన హనూమతా.

తే. చూడఁబడె సీత సత్యంబు హనుమ,చేతనే యది యితరులచేతఁ గాదు

సుగ్రీవుఁడు రామునితో

శ్లో. దృష్టా దేవీ నసందేహో న చాన్యేన హనూమతా.

తే. చూడఁబడె దేవి సత్యంబు హనుమ, చేతనే యది యితరులచేతఁ గాదు

భేదమునకుఁ గారణము స్పష్టము.

ఆరణ్యకాండంబునఁ (౬౮-వ సర్గము) గొఱయూపిరితో నుండు జటాయువును సీతవార్తను శ్రీరాముఁ డడుగు చుండఁగనే యతఁడు ప్రాణముల విడిచెను.

శ్లో. "పుత్రో విశ్రవస స్సాక్షా, ద్భ్రాతా వైశ్రవణస్యచ,
ఇత్యుక్త్వా దుర్లభా న్ప్రాణా, న్ముమోచ పతగేశ్వరః
బ్రూహి బ్రూహీతి రామస్య,బ్రువాణస్య కృతాంజలేః"

కం.ఔరసుఁడు విశ్రవునకు, స్థిరసల్లభునిమిత్త్రునకు సోదరుఁ డం
చీరీతిఁ జెప్పనాలో, నారవయూపిరియు పక్షిరా! వెడలి చనెన్. ౧౧౬౭

కం.నుడువుము నుడువు మటంచుం, బుడమివిభుఁడు కేలుముడువ....... ౧౧౬౮

ఈసందర్భమున నెట్టివానికి నయ్యో! యూరు పేరు చెప్పక చచ్చెనే బ్రదికియుండిన నేమిచెప్పియుండునో యని తోఁపకపోదు. ఇట్టికౌతుకము నివారించుటకై కిష్కింధాకాండాంతంబున సంపాతి యంగదాదులతో రావణువృత్తాంతముఁ జెప్పునప్పుడు

శ్లో. "పుత్రో విశ్రవస స్సాక్షా,ద్భ్రాతా వైశ్రవణస్యచ,
అధ్యాస్తే నగరీం లంకాం, రావణో నామ రాక్షసః" ౫౮ స.

కం. ఔరసుఁడు విశ్రవునకు, గౌరీవల్లభునిమిత్త్రు♦నకుఁ దమ్ముండున్
బేరను రావణుఁడు మదం, బారఁగ వసియించు లంక ♦ యనునగరమునన్. ౧౩౨౩

అనిప్రారంభించెను. కవి కవితౌత్కృష్ట్యమునకు వేఱుదృష్టాంతము వలయునా?

శ్రీరాముఁడు

శ్లో. "అహ మేవా హరిష్యామి, సర్వలోకా న్మహామునే
ఆవాసం త్వహ మిచ్ఛామి, ప్రదిష్ట మిహ కాననే" అర. ౫.

చం. కొనెదను నేన నీసుకృత♦కోటుల నెల్లను మేము నిల్వ నీ
వనమున వాసయోగ్య మగు♦పట్టెది చెప్పుము. అర. ౭౨.

అని శరభంగునితోను

శ్లో. "అహ మేవా హరిష్యామి, స్వయం లోకా న్మహామునే
ఆవాసం త్వహ మిచ్ఛామి,ప్రదిష్ట మిహ కాననే." అర. ౭.

చం. కొనెదను నేన నీసుకృత♦కోటి స్వయమ్ముగ మేము నిల్వ నీ
వనమున వాసయోగ్య మగు♦పట్టెది చెప్పుము. అర. ౯౮.

అని సుతీక్ష్ణునితోను జెప్పెను.

"అహ మేవా హరిష్యామి, సర్వలోకా న్మహామునే"

యని భగవంతునివలెఁ బలికి వెంటనే "ఆవాసం త్వహమిచ్ఛామి ప్రదిష్ట మిహకాననే" యని మనుష్యభావముతో మాటలాడుచమత్కార మేమో యదియును భావభేదమునకుఁ గలకారణము వివరింపవలయు ననిన గ్రంథము విరివియగును. కావున నిందలి యద్భుతవిశేషములనెల్లఁ బాఠకులే యోజింతురు గాక. కవిమార్గము ననుసరింపక స్వేచ్ఛచొప్పున రామాయణమునకు నర్థముఁ జెప్పఁబూనిన వా రిట్టిచోటుల హాస్యాస్పద మగువ్రాఁతల వ్రాసియున్నారు.

శ్రీరామాయణమందలి కవితాచమత్కృతిని విశదీకరింపవలయు ననిన నెంత చెప్పిన నింకను గొంచెము కొఱఁత యుండును. ఇంత యేల? కాళిదాసుఁడు కాళిదాసుఁ డగుటకు, భవభూతి భవభూతి యగుటకు రామాయణమే కారణము. వారు దాని నెన్నిమార్లు వల్లించిరో కాని వారికవితావల్లి వాల్మీకివాక్సుధాసేచనమున జీవించి వృద్ధియైన దనుట నిర్వివాదము. శ్రీవిశిష్టాద్వైతమతోద్ధారకు లగుశ్రీరామానుజాచార్యులవారు పదునెనిమిదిమాఱులు గురుముఖంబుగ రామాయణముఁ బఠించి వ్యాఖ్య వ్రాసిరి. ఒక్కసారియైనను గ్రంథమంతయుఁ జదువక సంస్కృతభాషయుఁ దెలియక పూర్వపక్షము వ్రాయువా రెట్టిప్రాజ్ఞులో!!!

ఒక్క యేటిని జూచిన నెంతగొప్ప దనుకొనెదము. అట్టులే కాళిదాసాదులను గొప్పకవు లందుము. అన్నియేఱులకాధారమైనసముద్రము నే మనవలయును? ఆరీతి

"పరంకవీనా మాధార" మ్మని చెప్పఁబడి కాళిదాసాదులకు జీవనదమైన రామాయణము నే మని వర్ణింపవలయును. మన మతమునందలి యేదే నొకసుగుణమును గ్రహించి దానిని విస్తరించి చెప్పుచుఁ బెఱమతములు ప్రసిద్ధికెక్కుచున్నట్టు లుపమావిషయమును గాళిదాసునివలె నితరకవు లితరగుణముల నొక్కొక్కదాని నిందుండి గ్రహించి దానిని దమ చిన్నచిన్న కావ్యంబుల విశేషంబుగఁ జొప్పించి ప్రసిద్ధులైరి.

ఆర్యమతమువలె వాల్మీకిరామాయణము గొప్పదై కేవలపామరులకు సర్వంబు గ్రహింప దుస్సాధ మగుటవలనఁ బిల్లపిల్లమతములవలె నితరగ్రంథములు ప్రసిద్ధికెక్కెను. అదియునుగాక మహర్షియు మహాయోగియు నగువాల్మీకి యెక్కడ? ఇప్పటి కవులెక్కడ?

కాళిదాసుని అస్త్యాక సాధు విచిం త్యేత్యాదిశ్లోకములలోనివిశేషములను రామాయణములోని

శ్లో. "అహం వేద్మి మహాత్మానం, రామం సత్యపరాక్రమమ్
వసిష్ఠోపి మహాతేజా, యే చేమే తపసిస్థితాః"

తే. ఏ నెఱుంగుదు రాజేంద్ర! యీమహాత్ము
రాము సత్యపరాక్రమోద్దాము మఱి ప్ర
సిద్ధ తేజోధికుండు వసిష్ఠముని యు
నీతపస్థితు లెల్లరు నెఱుఁగువారు.

శ్లో. "ఇయం సీతా మమ సుతా, సహధర్మ చరీ తవ
ప్రతీచ్ఛ చైనాం భద్రం తే, పాణిం గృహ్ణీష్వ పాణినా."

కం. ఈసీత నాదుకూఁతురు, నీసహధర్మచరి దీనినిం గైకొనుమా
గౌసల్యాసుత! నీకును, భాసురశుభ మగు గ్రహింపు పాణింబాణిన్.

ఇత్యాదిశ్లోకంబులయందలి ప్రతిపదసారస్యమును జక్కఁగఁ బరిశీలించినచోఁ గాళిదాసుఁడు వాల్మీకిశిష్యుఁడని తెలియనగుటయే కాక గురుశిష్యులకుఁగల తారతమ్యము స్పష్టమగు. దీని కింకను సాక్ష్యము వలయు నేని పైనుదాహరించిన

శ్లో. "కచ్చిత్ క్షితిభృతాంనాథ! దృష్టా సర్వాంగసుందరీ
రామా రమ్యవనోద్దేశే, మయా విరహితా త్వయా."

యనుశ్లోకమును గాళిదాసుఁడు తనవిక్రమోర్వశీయంబున ర-వయంకంబున

శ్లో. సర్వక్షితిభృతాంనాథ! దృష్టా సర్వాంగసుందరీ
రామా! రమ్యవనోద్దేశే, మయా విరహితా త్వయా."

యని యొక్కపదము మార్చి చొప్పించి యుండుటచేఁ దెలియనగును.

ఇట్లు వాల్మీకిరామాయణము నుండి కాళిదాసాదులు గ్రహించిన వెన్నియో కలవు. వేదవ్యాసునంతటివాఁడు వాల్మీకిశ్లోకముల ననువదించి యుండఁ దక్కినవారి మాట యేల?

ఎవ్వఁడైనను సత్కవి కావలయు నను కోరిక యుండినచో వాల్మీకిరామాయణముఁ బలుమాఱు మిగుల హెచ్చరికతోఁ బఠింపవలయును.

## శ్రీమద్రామాయణము ధర్మశాస్త్రము.

శ్రీమద్రామాయణము గొప్పధర్మశాస్త్రము. ఇందు సర్వవిధము లైనధర్మములు వివరింపఁబడి యున్నవి. రాజధర్మము, ప్రజాధర్మము, పతిధర్మము, సతీధర్మము, భ్రాతృధర్మము, పుత్త్రధర్మము, భృత్యధర్మము, మిత్త్రధర్మములోనగునవన్నియుఁ జక్కఁగఁ దెలుపఁబడి యున్నవి. లాభలోభపక్షపాతబుద్ధిలేక న్యాయమునందే దృష్టినిలిపి వాదించున్యాయవాదిధర్మముకూడఁ జెప్పఁబడియున్నది. ఇవి గాక కథాసందర్భముల నంతరాంతరముల నెన్నినీతులో పలుకఁబడినవి.

సత్ప్రభులక్షణము రామదశరథులరాజ్యపాలనవిధమున నెఱుఁగ నగు. ఆర్య ప్రభువు లేకార్యముఁ జేసినను బ్రజలయనుమతి లేనిది చేయువారు కారు. తాము ప్రభుత్వభారము సహించుట ప్రజల సుఖపెట్టుట కనియే వారిభావము. ప్రత్యక్షముగ నైనఁ బరోక్షముగ నైన వారికి హాని కలుగుపనిఁ జేయరు. ఈవిషయము శ్రీరాముని పట్టాభిషేకవిషయక మైనదశరథునుపన్యాసము (అయోధ్యాకాండము ౩౬-వ పద్యము మొదలు ౭౬-వ వఱకుఁగల పద్యముల) వలనఁ దెలియును. ప్రజలవలనఁ బన్నులుతీసికొని వారికష్టములు దొలఁగింపమి నరకకారణమని వారిసద్భావము. (ఆరణ్య - ౮౧-౮౩).

ప్రభువగువాఁడు ధర్మమునే యాధారముఁ జేసికొని వేగులవారిచే లోకుల కష్టసుఖములఁ దెలిసికొనుచుండవలయును. ప్రజలకు సరిపడనిగుణములు తనయందుండె నేని యెంతనష్టమైననోర్చి యాగుణములు మానుకొనవలయును. నాయంతఃకరణము నేను శుద్ధుఁడ నని చెప్పుచున్నది. ఇతరులను సంతోషపెట్టుటకై నే నేల దుఃఖపడవలె ననరాదు. దీనికి రామునినడవడియే ప్రమాణము. శ్రీరాముఁడు పట్టాభిషేకానంతర మొకనాఁడు వేగువాఁడగుభద్రు నిట్లు ప్రశ్నించెను.

తే. భద్రుఁడనువానిఁ గని రామ ♦ భద్రుఁ డనియె, వార్త లేమిర పల్లెలఁ ♦ బట్టసముల
భరతలక్ష్మణశత్రుఘ్న ♦ ధరణిసుతులఁ, గైకయిని గూర్చి యే మంద్రు ♦ లోకులెల్ల.

చ. జనులకు మేలు గూర్పఁగఁ బ్ర ♦ జాపతి సాలునె యీ యువరాజు దా
పిఁ బెగఁ దిన్నఁ గూర్చి తన ♦ పేటను రాష్ట్రమునందు లోకు లే

మనుకొనువారో సర్వవిష♦యంబుల రా జటుసేయఁ డేనియుఁగా
వనములఁ బల్లెలం బురము♦నఁగా జననిందితుఁ డౌ నిజంబుగన్. ఉత్తర. స ౩౦.ప.

ఈప్రశ్నకుఁ దన్ను లోకులు ప్రశంసించుచున్నా రని వాఁడు చెప్పఁగా సంతటితో సంతుష్టి లేక

చం.కలది కిలట్టు చెప్పుము జ♦గజ్జన మే మని మేలు పల్కెడుఁగా
బలికెడి నేమికీడులను ♦ వార్తల నన్నిటిఁ జెప్పు, మన్నియుం
దెలిసినఁ గాదె కీడులను ♦ దీర్చి శుభంబులు గూర్పవచ్చు, లోఁ
గలఁగకు పాప మేమనెడి ♦ త్కాజనము ల్విన వాంఛ చేసెదన్. ఉత్తర. స ౩౨.

అని యడుగఁగా వాఁడు లోకులపొగడ్తమాటలు ముందు చెప్పి

ఆ. ఋషితతుల నేలె ♦ రాక్షసకోటుల, కేలి కయ్యె నైన ♦ నేమి కాని
దనుజుఁ డపహరింపఁ ♦ దనభార్య నయ్యాది, మఱచినాఁడు మరల ♦ మరగినాఁడు.
మ బలవంతంబుగఁ జేర్చి స్వాంకమున దే♦వద్వేషి కొంచేగ, నా
ఖలుఁడే లంక నశోకవాటి నునిచెం ♦ గాపుంచె స్వస్త్రీల, న
చ్చెలువం గ్రమ్మఱఁ దెచ్చి యింట నునిచెఁగా ♦ సీ యాత్మ గర్హింపఁ డా
పొలఁతిం గూడి నృపుండు మోహమున సం♦భోగింప నేసౌఖ్యమో. ఉత్తర. స ౩౪.
కం.తామనుఁ డగు రాక్షసుగృహ,సీమను జిరకాల మట్లు♦చెఱఁబడినసతిఁగా
రాముఁడు రోయక కూడెడిఁ, గాముకు లగువారి కెందుఁ ♦ గన్నులు గలవే. స ౩౫.
కం.రాజానుమతము ధర్మము, రాజువిధం బనుసరింపఁ ♦ బ్రజ కర్హంబౌ
రాజువలె మనకు నాత్మస,తీజనచర్యలు సహింపఁ ♦ దీ రగు నింకన్. స ౩౬.

అని వారువారు వారికిఁ దోఁచిన ట్లనుచున్నా రనఁగా నది సత్య మని యితరులచే దృఢపఱచుకొని భరతాదులఁ బిలిపించిలక్ష్మణుతో లంకలో జరగినవృత్తాంతముఁ జెప్పి

తే. అంతె కాదయ్య నాయంత♦రాత్మకూడఁ
బూత యంచు నెఱుంగును ♦ భూమిజాత
గావుఁన గదా యయోధ్యకుఁ ♦ గ్రమ్మఱంగఁ
దోడితెచ్చితి లక్ష్మణా! ♦ తోయజాక్షి. స ౫౨.
కం.అపవాదము దుస్సహ మై, తపియింపఁగఁ జేసె నన్నుఁ ♦ దద్దయుఁ జిత్తం
బిపుడు పురంబులఁ బల్లెల, విపరీతపువార్తలెల్ల ♦ వినఁబడెడిఁ జూఁడీ.
చం.ఎవనియకీర్తి లోకమున ♦ నెందనుకఁగా వినఁ గల్గునో యథో
భువనములందు నందనుకఁ ♦ బూరుషుఁ డుండెడుఁ బాపభోజి యై
దివిజు లకీర్తినిం దెగడి ♦ తెల్పుచు నుంద్రు, సుకీర్తిఁ, గాన మా
నవుఁడు సుకీర్తిఁ గోరియె య♦నారతముం బను లొస్పఁ జేయఁగన్.

కం.విడిచెద మిమ్మెల్లర నే, విడిచెద నాప్రాణమేని ♦ విమలయశము కై
సొడమినయకీర్తి భీతిని, విడుచుట చిత్రంబె నేను ♦ బృథివీతనయన్.
అని సీతను వాల్మీకాశ్రమముపొంత కంపెను.

ఒకనియం దింతకంటె నసత్యమైనయపవాదము గలుగఁ గలదా? అట్టియపవాదమును బోఁగొట్టుకొొన నింతకంటె స్వార్థపరిత్యాగముఁ జేసినవాఁడు కలఁడా?

శ్లో. "లోకసంగ్రహ మేవాపి, సంపశ్యన్ కర్తు మర్హసి
యద్య దాచరతి శ్రేష్ఠ, స్త త్త దేవేతరోజనః
స యత్ప్రమాణం కురుతే, లోక స్తదనువర్తతే." భగవ. 3-అధ్యా.

ద్వి.కర్మంబులచేతనే కద జనకాదు,
లందిరి సంసిద్ధి నదిగాక పాండు,నందనా! నీవు జనప్రయోజనము
మది నిల్పియేని కర్మంబును జలుపు,టది నీకుఁ దగ నగు నర్జునా! శ్రేష్ఠుఁ
డెయ్యది గావించు నితరజనంబు,లయ్యది గావించు నయ్యె వాఁ డేది
సప్రమాణం బని చలుపునో మూఢుఁ,డాప్రకారమె సల్పు నమరేంద్రతనయ
పామరు లాసక్తిపరతఁ గర్మంబు,నేమాడ్కిఁ గావింతు రింద్రజ! యట్లు
జనరక్షణేచ్ఛచే జ్ఞాని యాసక్తిఁ,గనక కర్మంబులఁ గావింపవలయు.

ద్విపదభగవద్గీత.

అను భగవద్గీతావాక్యంబులు నిట ననుసంధించునది.

కావునఁ బ్రభువును జనులు తన్నుఁ జూచి యితరులుతప్పుత్రోవలఁ బ్రవర్తింపకుండునట్లు లోకోపకారకమైనమార్గమునే యనుసరింప వలయును.

సత్ప్రభువు ప్రజలసుఖదుఃఖము లనుదినము విచారించు చుండవలయును. సీతావియోగానంతరము లక్ష్మణుఁడు మరలి వచ్చినవఱకు నాలుగుదినములు కొలువు చేయుసందునకై రాముఁడు మర్మనికృంతన మైనబాధ పడుచు లక్ష్మణుతో

సీ. నామనంబున నొండు ♦ నాఁటి యున్నది చింత, చెప్పెద నీ వట్లు ♦ చేయవయ్య
నాలుగునాళ్లాయె ♦ నాయనా! పౌరుల, కార్యంబు లారసి ♦ క్రమముగాను
గావునఁ బ్రకృతులఁ ♦ గార్యార్థిజనములఁ, బురుషులస్త్రీలను ♦ సరగఁ బిలువఁ
బంపు పురోధకుఁ ♦ బంపుము వార్తను, గొలువుకూటమునందుఁ ♦ గూడుఁ డనుచు
తే. ననుదినంబును బౌరకా♦ర్యములఁ దీర్పఁ, బ్రాలుమాలెడినృపతి ని♦గ్గ్రాహ్యతనరక
మునను దుఃఖించు నిక్క,ంబు♦మున్ను నృగుని,చరిత విన లేదె నీవు స♦త్సాధుశీల!
అని చెప్పి పరితపించెను.

శ్రీరాముఁడు ప్రజానురాగమును సంపాదించుకొనినమార్గములలో నొకఁడు చూడుఁడు.

సీ. రణరంగమున నుండి ♦ క్రమ్మఱి వచ్చుచో, రథమున నేఁ గుంజ♦రమున నేని
తనయిల్లు చేరక♦మునుమున్న పౌరుల, నందఱఁ దనవారి♦యట్ల చీరి
కుశలంబు లడుగు మీ♦కొమరులు సేమమే? యిల్లాండ్రు లెస్సలే?♦యెల్లఁ గలదె?
శిష్యులు సుఖులెకా? ♦ క్షేమమే యగ్నులు?, జవదాఁటపోవుగా ♦ ఛాత్రగణము?
తే. లల్లురకు నాఁడుబిడ్డల♦కరుసమగునె?, సౌఖ్యవలులొక్కొ కోడండ్రు? ♦ సాధులార!
యనుచు జనకుండుబిడ్డన♦ట్లడుగుఁగ్రుచ్చి,క్రుచ్చి పేర్పేరసర్వంబుఁ♦గుతుకమునను.

ఇట్టివానివిషయమై ప్రజ లెట్లుండెడి రన,

ఉ. రామునిమేలుకోరి నగ♦రంబున రాష్ట్రమునందుఁ జక్కని
గ్రామములందు నిత్యముఁ ద్రి♦కాలములందును నెల్లవేల్పులన్
నేమమునన్ భజింత్రు తరు♦ణీమణులున్ ముదుసళ్లు లేఁతలున్
గ్రామజనాదినాగరులు ♦ రామునిఁ దప్ప స్మరింప రెవ్వరిన్.

అట్టి యనురాగము గల ప్రభునివిషయమై యిట్లుండుప్రజ లతనితోడ నడవికిఁ బోవుటయుఁ బ్రాణములనైనఁ గూడఁబరిత్యజించుట కంగీకరించుటయు నేమివింత!

ప్రభువు తా నెంతగొప్పవాఁ డైనను గొలఁదివారలతోఁ గలసి మెలసి యుండ వలయును. దీనినే సౌశీల్య మందురు. గుహునకు రామునిఁ జూడఁగానే తటాలునఁ గౌఁగిలించుకొనుట సంశ్లిష్టమైత్రి యుండవలయునో (అయోధ్య-౧౩౦౭).

ప్రభువు తా నెంత తెలిసినవాఁ డైనను మంత్రులయాలోచనలఁ దిరస్కరింప రాదు. వారు చెప్పునది విని వారికిఁ దాను జేయఁబోవునది సరి యని నమ్మునట్లు సమాధానముఁ జెప్పవలయును. విభీషణుఁడు శరణుఁ జొచ్చినప్పటి కొల్వువిధముఁ జదువుఁడు. (యుద్ధ. 33వ మొదలు)

ఇంతయేల? రామునిగుణములనుఁ జక్కఁగ శోధించినచో రాజునం దుండ వలసినసద్గుణములే గాక సాధారణముగాఁ బ్రతిపురుషునియం దుండఁదగు సత్యము, దయ, యింద్రియనిగ్రహము, పితృభక్తి, యేకపత్నీనియమము, సౌభ్రాత్రము, దైవభక్తి, దేవతారాధనము, నిత్యకర్మానుష్ఠానము, వీనిని గుఱించియు విపులముగఁ దెలియ నగు.

ఇట్టులే యుత్తమస్త్రీలలక్షణములన్నియు సీత - కౌసల్య - సుమిత్రగుణములవలనను నీచస్త్రీలలక్షణము కైకేయి, మంథర శూర్పణఖగుణములవలనను దెలియ నగు.

రావణాసురుఁడు చెడుటకు గారణము వాఁ డింద్రియజితుఁ డగుట, యసత్యము లాడుట, వేగులు లేకుండుట, యున్నవారికిఁ జక్కఁగ జీతము లీకుండుట, యాహేతువునఁ దనరాష్ట్రములో జరగుచున్నవృత్తాంతములు వెంటనే తెలిసికొనలేకపోవుట, యేది వినిన సరి నమ్ముట, [illegible] మంత్రుల [illegible]

జ్ఞానహీనతచేఁ జెప్పువారిని గనిపింప లేకుండుట, యెట్టివానిని నమ్మకుండుట, మూర్ఖత, ఇన్ని దుర్గుణము లుండుటచేతనే వాఁడు సమూలము నాశమయ్యెను. ఇది శూర్పణఖ, మారీచుఁడు, విభీషణుఁడు చెప్పినమాటలచేఁ దెలియనగు.

శ్లో. "అవిదూరస్థితాన్ సర్వాన్, బలాధ్యక్షాన్ హితైషిణః
అబ్రవీ త్తాంస్తదా సద్యో, రావణో రాక్షసాధిపః
శీఘ్రం భేరీనినాదేన, స్ఫుటకోణాహతేన మే
సమానయధ్వం సైన్యాని, వక్తవ్యంచ నకారణమ్." యు. ౩౧ స.

మ. అట రక్షోధిపుఁ డెల్లకార్యములఁ బర్యాలోచనం జల్పఁడు
త్కటసేనానుల నంతికస్థుల కనుం గాలార్గళస్థూలవాక్యులన్
స్ఫుటకోణాహతి భేరినాదముల రక్షోవాహినీపాళి ను
ద్భటయుద్ధోద్యమ మొప్పఁ గూర్పఁదగుఁ జెప్పం బోకుఁడీ హేతువున్. ౨౦౦ ప.

ఇట్లు యుద్ధకారణము తనభటులకే తెలియనీక వంచనచేసి వారిప్రాణంబులఁ దీసిన వాఁ డెట్టిప్రభువో!! ఇట్టి దిప్పుడు ప్రత్యక్షానుభూతమే కదా.

ఇట్టులే రామలక్ష్మణభరతశత్రుఘ్నులచర్యలవలన భ్రాతృధర్మము, సుగ్రీవుని చర్యలవలన మిత్రధర్మము, హనుమంతునిచర్యవలన భృత్యధర్మములోనగునవి తెలుపఁ బడియున్నవి. వీని నన్నిటిని జక్కఁగ విశదీకరింపవలయు నన నొకగ్రంథ మగును గాన నాయా ధర్మములగూర్చి యొకటి రెండుపద్యము లుదాహరించి యీగొప్ప విషయ మింతటితో విరమించెద.

స్త్రీధర్మము

అయోధ్యాకాండము ౩౯-వ సర్గము శ్రీరాముని తల్లితో

చం. హితమతిఁ జెప్పువారలకు నెప్పుడు మ్రొక్కక యున్నఁగాని, దే
వతల యజింప మానినను వారిజనేత్రకు భర్తృసేవ స
ద్గతి సమకూర్చుఁ దల్లి! నిరంతరవ్రతభక్తి సూపనాన యా
సతి పతి భక్తిఁ గొల్వఁదగుని సత్యముగా నిరయంబునం బడున్. ౨౦౧

చం. సుమతిని బుట్టినింటికిని నొచ్చినయింటికిఁ గీర్తి దెచ్చు నా
సుమహిత సద్గుణప్రకరశోభిత సన్నుతశీల సాధ్వి యు
త్తమయశముం బడయుంచి నిరంతరశుభంబును బొంది నాకసౌ
ఖ్యముఁ గనుఁగాన భర్తృహిత కారిణివై చరియింపు మంగనా. అయో-౨౮౯.

కం. తొలుత సుఖ మనుభవించియుఁ, గలికి! మఱి పతి కెదేని కష్ట మొదవుటన్
దొలఁగ సుఖ మతని నింద్రలు, పలుకుట పాయుటయు స్త్రీస్వభావము తల్లి!

ఉ బొంకులపుట్టినిం డ్లయి స్వపూరుషు గేలిగ వెక్కిరించుచుఁ
గొంకక దుష్టచింతనలఁ గుందు నిధు లై భృశగూఢచిత్త లై
మంకుతనంబునన్ వయసు మంపున రోయఁగఁ జేయుచుందు రే
కొంకముఖుల్ నిమేషమునఁ బ్రాణము వోలెను జూచువారినే
అనసూయ సీతకు హితోపదేశము సేయుఘట్టముఁ జూడుఁడు. ౨౫౨౮-౨౫౬౩.

పితృభక్తి.

కం. స్వాధీనదేవతల, బిం,బాధర! తనతల్లిఁ దండ్రి నాచార్యవరుఁ
దా ధిక్కరించి నరుఁ డ, స్వాధీనపుదైవ మెట్లు చనుఁ బూజింపన్.

చం. అన విని రాముఁ డి ట్లనియె నార్యజనోత్తమ! పుత్రలబ్ధికై
పనిగొని తల్లి తండ్రి పడుపాటులకుం బ్రతిసేయ నౌనె? యిం
పునఁ దలఁ జూచి నీళ్లు కడుపుం గని యన్నము పోసిపెట్టి యెం
డను జడి గాలిఁ బ్రోతురు దినంబును వారల తుల్యు లే రొరుల్. అయో-౪౮౫.

కం. తనుఁ దాను గాచుకొనఁజా,లనిదశ నేమఱక యెవుడు లాలించుచు వ
ర్ధన మొనరింతురు సత్ప్రియ,మును బల్కెడు రయ్య వారు ముచ్చట మీఱన్.

మిత్రధర్మము.

కం. తనపనుల నెల్ల నదలియుఁ, దనమిత్రునికార్యమునకుఁ దతము త్సాహం
బును గొని చరించునాతఁడు, కనఁ జెప్ప ననర్ఘకంబుఁ గపికులతిలకా!

కం. తనపనులఁ జక్కఁబఱిచిన, తనహితులను మఱచునాకృతఘ్నుఁడు చావన్
విను మాతనిపీనుంగును, గన [illegible] గనవు గృధ్రకంకశివాదుల్.

కం. భయపడను లక్ష్మణునకున్, భ[illegible] నొకయింత రామభద్రునకైనన్
బ్రియమిత్రుఁడు హేతువు లే,కయె కుపితుం డగుట కేను గళవళ పడెదన్.

కం. సులభము మిత్రులఁ జేస్కొట, కలసిన మఱి మైత్రి చెడక కాపాడుటయే
బలితపుఁగష్టము మది చం,చల మగుటను బ్రీతి చెడును స్వల్పంబునకేన్.

కం. ధరణీసురునిం జంపిన, సురఁ ద్రాగిన ముచ్చిలింప సువ్రతము చెడన్
బరఁగును బ్రాయశ్చిత్తము, ధర నిష్కృతి లేదు నూ కృతఘ్నున కెందున్.

న్యాయవాదిధర్మము. హనుమద్వాక్యము.

శ్లో. నవాదా న్నాపి సంఘర్షా, న్నాధిక్యా న్నచ కామతః
వక్ష్యామి వచనం రాజన్, యథార్థం రామగౌరవాత్. యు. ౧౮ స.

సీ. వాగ్వాదములు నేను వావదూకుఁడ నంచుఁ, దర్కనైపుణిఁ జూపఁ దలఁప లేదు
అన్యమతంబుల నణఁచి నావాదం బె, గెలిపింపవలయు న న్తలఁపు లేదు

ఎల్లవారలకన్న ♦ నేన మిన్న యటన్న, గౌరవంబును గాంచు ♦ కాంక్ష లేదు
నావచోజ్జృంభణ ♦ మావిష్కృతము సేయ, నిది సమయం బంచు ♦ నెంచలేదు
తే. దనుజునందలి పక్షపా♦తమునఁ గాదు
త్వద్గురుత్వాప్తిసభిలాష♦వలనఁ గాదు
రాజవల్లభ! దశరథ♦రాజతనయ!
కలది వచియింతు శ్రీరామ ♦ గౌరవమున. యుద్ధ. ౩౮౯ ప.

కన్యాజనకత్వము.

కం. కూఁతులఁ గనునాతఁడు కా, న్కూఁతలు విను వియ్యమాడి ♦ కొలఁదుల చేనో
లాఁతులచేనో తనతల, వ్రాఁతకొలఁది నిందఁ్రనంత♦వాఁడైయున్నన్. అ-౧౪౮౦.
కం. గౌరవముం గాంక్షించెడు, పూరుషునకుఁ గూఁతు రొకతె ♦ పుట్టినయేనిన్
గూరును దుఃఖం బెవఁ డా, ఘోరవుణికి మగఁడటంచు♦నెనఁగినచింతన్. ఉత్త-౧౮-౨.
కం. జననీవంశమువారిని, జనకకులమువారి స్వపతి ♦ సంతతివారిన్
దనయా! కన్యక సంశయ, మునఁ ద్రోయ సదా యకీర్తి♦ముంచునో యనుచున్.
ఉ. ౧౮౩.

కోపనిగ్రహము

కం. దీపించు నగ్నిజాలము, గూపు చెఱుచునట్లు పెరుఁగు ♦ కోపమును సుధీ
వ్యాపారముచే నణఁచెడు, నాపురుషుఁడె పో మహాత్ముఁ ♦ డవు ధన్యుండున్.
కం. కోపి తునుము గురువులు నేన్, గోపి కడుం గఱకులాడు ♦ గుణవంతుల నేన్
గోపి యొనర్పఁగఁజాలని, పాపం బేదైనఁ గలదె ♦ భావింపంగన్. సుం-౧-౨౪౦.
కం. ఆరయ వాచ్యావాచ్యవి, చారం బే లేదు కోపి ♦ జనులకుఁ జేయం
గారానికార్య మాడం, గారానియవాచ్య మొండుఁ ♦ గలదే చూడన్.

రామాయణమునం దన్నిధర్మములు విస్తరింపఁబడి యున్నవి. ఇందున్నవే సకల గ్రంథములయందుఁ గలవు. ఇందు లేనివి యెందును లేవు.

కం. తనపనులఁ జక్కఁబఱిచిన, తనహితులను మఱచునాకృ♦తఘ్నుఁడు చావన్
విను మాతనిమీసుంగును, గన నైనను గనవు గృధ్ర♦కంకశివాదుల్.

అని రామాయణమందు సూత్రప్రాయముగ నుండుదానికి వ్యాసమహర్షి నాళీకజంఘుని కథను లక్ష్యముగ వ్రాసెను. ఇట్లే రామాయణమున సూక్ష్మముగఁ జెప్పఁబడిన ధర్మాధర్మముల కొక్కొకకథఁ గల్పించి వ్యాసభగవాను లింతకు నాలుగంతలు గ్రంథ మొనర్చెను. తుదకు భగవద్గీతయంతయు రామాయణసారమే యని గ్రహింపుఁడు. రామాయణము లక్ష్యగ్రంథము, భగవద్గీత లక్షణగ్రంథము.

## శ్రీరామాయణము మంత్రశాస్త్రము.

శ్రీమద్వాల్మీకి రామాయణము మంత్రనిధానము. ఇం దనేకమంత్రము లుద్ధరింపఁబడి యున్నవి. కావునఁ గదా పారాయణము సేయువా రంగన్యాసకరన్యాసాదులతోడ యథావిధిఁ జేసి వారివారియిష్టార్థంబులు పడయుదురు. సద్భావముతో సుందరకాండము పారాయణముఁ జేసి కార్యసిద్ధి నొందనివాఁ డింతవఱకు లేఁడు.

"గాయత్ర్యాశ్చ స్వరూపం తద్రామాయణ మనుత్తమమ్"

అని యుత్తరరామాయణమునఁ జెప్పఁబడినట్లు రామాయణమంతయు గాయత్రీస్వరూపము. ౨౪-యక్షరములు నొక్కొకయక్షరము నొక్కగ్రంథసహస్రమునకాదియం దుంచి చెప్పఁబడినది. అట్టిగాయత్రీరామాయణము మఱియొకచో ముద్రింపఁబడి యున్నది. ఏడుకాండములందు సప్తవ్యాహృతులు విచరింపఁబడి యున్నవి. ఈగాయత్రీవిధానము నారదుఁడే వాల్మీకిమహర్షికి రామాయణముతోపాటు నుపదేశించెను.

శ్లో. "తపస్స్వాధ్యాయ నిరతం, తపస్వీ వాగ్విదాంవరమ్
నారదం పరిపప్రచ్ఛ, వాల్మీకి ర్మునిపుంగవమ్" బాల. ౧-సర్గము.

అని గాయత్ర్యాద్యక్షరముచే శ్లోకమును బ్రారంభించి

"జగ్ముశ్చ హృష్టాస్తేపి మహాత్మస్య విరాయుతాత్"

అని గాయత్రికడపటియక్షరముచే సర్గము ముగించెను.

కం. తపమున స్వాధ్యాయంబున, నిపుణుని వాగ్విద్వరేణ్యు ♦ నఖిలమునిజనా
ధిపు నారదు సంప్రశ్నము, తపస్వి వాల్మీకి యిట్లు ♦ తమిఁ గావించెన్.

అని మూలమునందున్నట్లు తెనుఁగునఁ బ్రారంభింపఁబడి,

"యథావిధి విన్నఁ బఠింప నారయన్"

అని ముగింపఁబడినది. గాయత్రీరామాయణమున యకారము గ్రహింపఁబడు చున్నది.

శ్లో. అగ్రతః ప్రయయౌ రామః, సీతా మధ్యే సుమధ్యమా
పృష్ఠతస్తు ధనుష్పాణి, ర్లక్ష్మణో ను జగామ హ.

ఇందుఁ బ్రణవము ప్రణవార్థము సముద్ధరింపఁబడి యున్నవి.

తే. అగ్రవర్తియై శ్రీరాముఁ ♦ డరుగుచుండె
(ఉ)సువిద తనుమధ్య మధ్యమం ♦ దుండె సీత
మహితకోదండదండసం♦భరణహస్తుఁ
డోలి వెన్నంటె లక్ష్మణుఁ ♦ డొప్పుప్రేమ.

ఇందు మొదటిమూఁడుపాదముల ప్రథమాక్షరములు గలపిన నాలవపాదము ప్రథమాంత్యాక్షరస్వరూపము వహించును. మంత్రార్థమంతయు మూలమునందువలె

కం. రాంకృతిబీజకమంత్రవ,రాంక! సమస్తప్రశస్త♦హారిగుణచయా
లంకార! సకలసులభా,శంకానాస్తిక్యరుద్ధ♦జనతాదూరా!

కం. రామా గుణధామా! రిపు,భీమా! సౌందర్యకామ ♦ విశ్రుతతేజ
స్సీమా! శుభనామా! రుచి,సీమా! లసదొంటిమిట్ట♦సీతారామా!

కం. మాయాతీతా! నిజగురు,మాయాకలితావతార! ♦ మాయావిమహా
మాయాఘఃకరణచణా!, మాయామయదివ్యదేహా! ♦ మాయామోహా!

కం. యతిమానసబిసజాలయ,యతమానజనార్థనిర్వ♦హణసుసమర్థా!
నతసర్వభూతచయ! యిం,గితవిజ్ఞవరర్య! విబుధ♦కీర్తితచర్యా!

కం. నయనీకృతరవిచంద్రా!, యయనీకృతనాగరేంద్ర! ♦ యవితసురేంద్రా!
శయనీకృతభుజగేంద్రా!, జయ జయ శ్రీరామ! జనక♦జాహృద్ధామా!

కం. మస్కరి రతికా జక్ష స, మస్కరణస్మరణతుష్ట♦మానసకమలా!
భాస్కరకులదీపక శ్రీ,యస్కర! వినతాఘతస్క♦రా! రఘువీరా!

ఈకాండాంతపద్యంబులయందు రామషడక్షరి చొప్పింపఁబడి యున్నది. మూలము నందుఁ గొన్ని యభేద్యములుగా నున్నవి. వానిస్వరూపములే దురూహములుగనుండ నికఁ దెలిసికొను టెట్లు?

శ్లో. "ధర్మాత్మా సత్యసంధశ్చ, రామో దాశరథి ర్యది
పౌరుషే చా ప్రతిద్వంద్వ, శ్శరైనం జహి రావణిమ్.

తే. సారధర్మాత్ముఁడును సత్య♦సంధుఁ డేని, రామచంద్రుండు దశరథ♦రాజసుతుఁడు
పౌరుషమునను నప్రతి♦ద్వంద్వుఁ డేని, శరమ! యీరావణాత్మజు ♦ సంహరింపు.

ఇది యొకమహామంత్రము. దీనికిఁ బ్రతిమంత్రము లేదు దీనిచేతనే సర్వాస్త్రవేదినైన యేయస్త్రముచేతను జావనియింద్రజిత్తును లక్ష్మణుఁడు చంపఁ గలిగెను.

ఇంత యేల? రామ యనురెండక్షరములే తారకమంత్రము గదా. దానినే కదా సర్వజ్ఞుఁడు శివుఁడు పార్వతికి నుపదేశించెను. శ్రీకౌసల్యాపరిణయంబున శ్రీరామనామమాహాత్మ్యవర్ణనమందుఁ జెప్పఁబడినదియు యోజింపుఁడు.

ఉ. 'మా' యనఁ బంచవింశతిత♦మం బది యాత్మకు సంజ్ఞ, రెండు నై
'రా' యన నిర్వదేడవది ♦ గ్రాలుఁ గదా పరమాత్మసంజ్ఞ, నా
రాయణుఁ డాతఁడే, ప్రణవ♦మందలి 'యు' త్తన నిర్వదాఱు నాఁ
గా 'య' తలంప నాఁ బురుష♦కారము సూచన సేయులక్ష్మిగన్.

మ. ధరణీనాయక! పెక్కు లేల? విను శ్ర♦ద్ధన్; గూర్పు నష్టాక్షరీ
వరమంత్రంబునఁ బంచమాక్షరము, శై♦వం బైనపంచాక్షరీ
స్ఫురితం బైనద్వితీయవర్ణమును దోఁ♦చున్ రామ సంజ్ఞం; దద
క్షరవిశ్లేషముచే నపాగ్రమము లై ♦ కన్పట్టు నామంత్రముల్.

ఆ. 'నారాయనాయ' యనుచు ♦ 'న శివాయ' యనుచు నా
మంత్రయుగము నిల్చి ♦ మానవేంద్ర!
కాదు ముక్తికొఱకుఁ ♦ గాదు శుభంబున
కని విరుద్ధమైన♦యర్థ మిచ్చు.

శా. ఆమంత్రద్వయరాజతార్ణములఁ బ♦న్యోన్యస్థలీసూచకం
బై మాన్యం బయి స్వాంకసంకలిత మా ♦ నా 'రా' 'మ'లుఁ లేమిడిం
దామా పెంపున బాసి నిష్ఫలము లౌ ♦ ధాత్రీశ! కంటే మను
గ్రామం బందును రామమంత్రమును సా♦రం బంచు నూహింపుమా.

కామ్యార్థ మైనను మోక్షార్థ మైనను పారాయణముఁ జేయువారికి వారి కోరికల నెఱవేర్చుశక్తి రామాయణమున కుండుటకు నది భగవత్కథయగుటకుఁ దోడు సర్వజ్ఞుఁ డైనవాల్మీకిమహర్షి నిల్పిన బీజాక్షరముల మాహాత్మ్యమును గారణమే. దీని కొక్కదృష్టాంతముఁ జూపెదను. సుందరకాండము నందఱుఁ బారాయణముఁ జేయుదురు గదా. దాన వారివారికోరికలు నెఱవేఱుటయుఁ బ్రసిద్ధమే కదా. ఆకాండము నందుఁ బ్రథమాక్షరము-త; కాండమునందలి కడపటియక్షరము త.

శ్లో. తతో రావణనీతాయాః, సీతాయా శ్శత్రుకర్శనః
ఇయేష పద మన్వేష్టుం, చారణా చరితే పథి.

కం. తరుహిత చారణాసుర,పరిసేవిత ధరాత్మజాత♦పదము న్వెదకన్
గురుచారణమార్గంబున, నరుగఁగ నృపదూత కర్శితారి దలంచెన్.

కడపటిశ్లోకము:—

"తతో మయా వాగ్భి రదీనభాషిణా,శివాభి రిష్టాభి రభిప్రసాదితా
జగామ శాంతిం మమ మైథిలాత్మజా,తవాపి శోకేన తథాభిపీడితా"

తే. తతభవద్దుఃఖమునకును ♦ దరణిగోత్ర,వార్ధిచంద్రను యట్లు తా ♦ బాధపడుచు
శుభము నిష్టంబు నగు నాదు♦సూక్తి ధృతినొం,దంగ శ్రీరామునహియించె♦ శాంతిసీత.

ఇదిగాక సుందరకాండమునఁ బ్రతిసర్గమున మొదటియక్షరము సకారమో తకారమో యుండును. లేదా యాశ్లోకంబున సీత యనుశబ్దము గాని తత్పర్యాయ పదము గాని యుండును. అదియుఁ దప్పిన రెండవశ్లోకము మొదటియక్షరము స-త తప్పదు. ఈ స-తలు సీత యనుదానిని సూచించుట స్పష్టమే కదా. సుందరకాండమున కధిష్ఠానదేవత సీతయే కదా. కావున నీసకార తకారముల మహిమ యేమన సీత=ఓం యని సాంఖ్యశాస్త్రముచొప్పున నగుచున్నది. అది గాక బీజాక్షరమహిమఁ జూడఁగా తకారము. "సాక్షా దుమేశబీజం తం,ఋషిదుర్వాస ఉచ్యతే
శ్రుతిమాత్రేణ యై సర్వ, శంఖపద్మనిధిం లభేత్

వామోరుస్థాన మిత్యుక్తం, బిందుస్వాంతం భువినాధనమ్
తకారం వాస్తుబీజంన్యా, చ్ఛేదితం సర్వజయం లభేత్
తకారం ధనబీజంచ, వసుబీజం సుఖం తథా
యక్షకిన్నరసిద్ధానాం, వశీకారం జగద్వశకమ్.

"సకారం సారస్వతం బీజం, ఋషి శ్శుక ఇతిస్మృతః
ఛంద శ్చాతిధృతిప్రోక్తో, జపత స్సర్వసిద్ధయః
బిందునాదసమాయుక్త, మయుతం యోజపేన్నరః
వాక్పతిత్వ మవాప్నోతి, మాసమాత్రేణ కేవలమ్
నియుతం యోజపే ద్విద్వాన్, చతుర్వేదాంశ్చ విందతి
త్రిలక్షేణా ష్టసిద్ధిశ్చ, జపస్యచ మడానన
సకారం భారతీశక్తి, జ్ఞానవాక్సిద్ధిదం భవేత్
లక్షత్రయేణ వాక్సిద్ధిం, సర్వశాస్త్రాణి విందతి.

అని గలదు. ఇందుఁ జెప్పఁబడియుండుదానికి శ్రద్ధావంతులై పారాయణముచేయు మహాత్ములే సాక్షులు. సీతాదేవి రామునిభార్యయని మాత్రము తలంచియుండిన హనుమంతుఁడు తుదకు నామెపేరు చెప్పవలసివచ్చినప్పుడంతయు నామెకు నామె యుండుదిక్కునకు నమస్కరించి మఱి ప్రస్తావించువాఁడయ్యెను.

ఎన్నిరహస్యములు రామాయణమునందుఁ గలవో యెవ్వఁడెఱుఁగును. ఒక న్యాయమున నీకాండమున ౬౭ సర్గములే యుండవలయును. ౫౮-వ సర్గము పూర్వ సర్గములోఁ జేరియుండవలయును. ఆచర్చ యిచ్చట ననావశ్యకము.

శ్రీమద్రామాయణము వేదము.

"వేదోపబృంహణార్థాయ" యనియు "వేదైశ్చసమ్మితం" మనియు వాల్మీకియే చెప్పి యున్నాఁడు. అదిగాక

శ్లో. "వేదవేద్యే పరేపుంసి, జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీ, త్సాక్షా ద్రామాయణాత్మనా"

యనియును గలదు. దీనివలన రామాయణము వేదముతో సమాన మగుటయే కాక వేదమే యయి యున్నది. వేదమే యయినది వేదముతోసమాన మనుట యెట్లనఁ గ్రింద సూచించినవిధముగ వేదములయందలి వర్ణములే యనులోమవిలోమములుగా మార్చి వేదప్రసిద్ధ మైనరామకథను జెప్పుటచే నది వేదమే యయ్యెను. వేదములయందలియర్థము గల దగుటచే వేదముతో సమానమయ్యెను. కావుననే కదా వేదపఠన మావశ్యక మగుశ్రాద్ధాదుల రామాయణపఠనము నియమిత మయ్యెను.

శ్లో. "రామాయణం వేదసమం, శ్రాద్ధేషు శ్రావయే ద్బుధః"
శ్లో. "దేవాశ్చసర్వే తుష్యంతి, శ్రవణా ద్గ్రహణా త్తథా
రామాయణస్య శ్రవణా, త్తుష్య న్తి పితరస్తథా"
అనిరామాయణమునసే చెప్పఁబడి యున్నది.

ఋగ్వేదము - నిరుక్తము.

భద్రో భద్రయా సచమాన ఆగా త్స్వసారం జారోఅభ్యేతి పశ్చాత్ సుప్రకేతై ద్యుభిరగ్ని ర్వితిష్ఠన్ రుశద్భిర్వర్ణై రభిరామమస్థాత్.

వ్యా. భద్రో- రామభద్రో, భద్రయా-మంగళరూపయాసీతయా, సచమాన-సంపద్యమాన అగమంతాదాగాత్ పితృనియోగవశా దరణ్యమగాత్, జారః-పరదారహర్తా - రావణః, స్వసారం - మాతృవత్పూజ్యాం జగన్మాతరంసీతాం, పశ్చాదభ్యేత్య అరణ్యగమనానంతరం సేతుబంధనద్వారా రావణే హతే సీతాయాం చాగ్నౌ ప్రవిష్టాయాం విశ్వాసార్థ మగ్నిః తాం గృహీత్వా రామం - రఘురామ మభ్యభిముఖే నాసాం శుద్ధేత్యభినివేదితవాన్ సకలార్తిహారిభిః కమనీయాభిః ఋషిద్భిః వర్ణైరాకార విశేషైశ్చవితిష్ఠన్ విశేషేణస్థితవాన్ తస్యైవోపాభవతి. అని ఋగ్వేదమున రామకథ చెప్పఁబడి యున్నది.

శ్లో. "చరితం రఘునాధస్య, శతకోటి ప్రవిస్తరమ్
ఏకైక మక్షరం ప్రోక్తం, మహాపాతకనాశనమ్"

శతకోటి౦౦౦౦౦ అనఁగా ౨౪ గాయత్రీబీజాక్షరములచే నుద్ధరింపఁబడిన ౨౪,౦౦౦ గ్రంథములుగలరామాయణమునఁ బ్రత్యక్షరము మహాపాతకముల నాశనముఁ జేయఁగలదియని కొందఱు చెప్పెదరు. కొందఱు శతకోటి రామాయణమును వాల్మీకి సంగ్రహించెనందురు.

శ్లో "సర్వపాపైః ప్రముచ్యేత, పాద మప్యస్య యః పఠేత్
పాపాన్యపిచ యః కుర్యా, దహ న్యహని మానవః
పఠ త్యేక మపిశ్లోకం, పాపా త్స పరిముచ్యతే"
అని యిట్టిమహిమ రామాయణమునం దుండుటకు హేతువేమో యాలోచింతము.

వాల్మీకిసూత్రమునందు

శ్లో. "ఇక్ష్వాకువంశప్రభవ, ఇత్యాదిస్వర ముద్ధృతమ్
నారదే నోపదిష్టంహి, సర్వశ్రుతిమనోహరమ్"
అని యుండుటచే రామాయణము వేదస్వరసముద్ధృతముగాను నందు సర్వశ్రుతులు లడఁగి యున్నట్లును దెలియ నయ్యెడిని

భారద్వాజసంహితయందు

శ్లో. "నథోరాథాహూప మితి, సప్తకాండపద స్థితిః
యజుర్వేదసంహితాయాం, కాండభక్తేషు తేష్వథ
తథారబ్ధం భవత్యేవ, జయత్యేవచ సర్వశః
చతుర్వింశత్సహస్రాణి, శ్లోకానా ముక్త్వా నృషిః
తేషు వేదస్థవర్ణాని, హ్యనులోమ విలోమశః
వర్ణక్రమానుసారేణ, బుద్ధిమా నుద్ధరే త్సదా.

కాదినవేత్యాది సూత్రములచొప్పున నథోరాథాహూపం = ౧౭౯౭౯౦ పదం ఇతి = అని, సప్తకాండ = ఏడుకాండములయొక్క, పదస్థితిః = పదములయొక్క స్థితి, అదేమనఁగా యజుర్వేదసంహితాయాం = యజుర్వేదసంహితయందు, తేషు = ఆ కాండములు, భక్తేషు = భాగములయందు, అనఁగా వానియందే యున్న దనియెంచవలెను, తథా = ఆలాగే, ఆరబ్ధం భవత్యేవ=ఆరంభింపఁబడినదవుచున్నది, జయత్యేవ=జయింపనేరయుండును, సర్వశః=ఋక్సామాథర్వములుగా నున్న దని చెప్పఁబడియున్నది, ఈరీతిగల వేదములను, చతుర్వింశత్సహస్రాణి = ౨౪౦౦౦, శ్లోక = శ్లోకములను, ఋషిః = వాల్మీకిమహర్షి, ఉక్త్వాన్ = చెప్పినవాఁడయ్యెను, తేషు = వానియందు, వేదస్థవర్ణాని - వేదములలోనివర్ణములను, అనులోమవిలోమశః = అనులోమవిలోమములుగా, వర్ణక్రమానుసారేణ = వేదవర్ణములయొక్క క్రమము ననుసరించి, బుద్ధిమాన్ = బుద్ధిమంతుఁడు, ముదా = ముదముచే, ఉద్ధరేత్ = ఉద్ధరింప వచ్చును.

దీనివలన వాల్మీకిరచిత ౨౪,౦౦౦ శ్లోకములయందు యజుర్వేదమందలి ౧౭౯౭౯౦ పదములే గాక ఋక్కు, సామము, అథర్వము వేదములయందలి పదములుకూడ ననులోమవిలోమములుగ నుద్ధరింపఁబడియున్నట్లు మర్మము దెలియవచ్చెను.

ఋగ్యజుస్సామాథర్వవేదము లని వేదముల వరుస యుండ ముందుయజుర్వేద ముద్ధరింపఁ బడుటకుఁగారణ మేమన —

తస్యయజురేవశిరః - ఋగ్దక్షిణః పక్షః - సామోత్తరః పక్షః, ఆదేశఆత్మా - అథర్వాంగిరసః పుచ్ఛం ప్రతిష్ఠా యనియుండుటయే కాక శ్రీమద్రామాయణసుందరకాండంబున,

శ్లో. "యజుర్వేద వినీతశ్చ, వేదవిద్భి స్సుపూజితః
ధనుర్వేదేచ వేదేచ, వేదాంగేషుచ నిష్ఠితః"

అని శ్రీరాముఁడు యజుర్వేది యనియుండుటయును గూడ యజుర్వేదప్రాముఖ్యము కారణము.

## యజుర్వేదసంహితా ప్రమాణము.

సూ. స భావః కామతో జాధి,కరానాధీరధీరయః
జాతుజాలమరాః కాండ, ప్రశ్నానుపదపదాక్షరాః

స అనఁగా ౭ కాండములు. అవి యేవన ౧ సౌమ్యము, ౨ ప్రాజాపత్యము, ౩ వైశ్వదేవము, ౪ ఆగ్నేయము, ౫ ఆగ్నేయబ్రాహ్మణము, ౬ సౌమ్యబ్రాహ్మణము, ౭ కామ్యకము.

భావః=౪౪ ప్రశ్నలు, ప్రథమకాండమున ౮, ద్వితీ ౬, తృతీ ౫, చతు ౭, పంచ ౭, షష్ఠ ౬, సప్త ౫, కలసి ౪౪ ప్రశ్నలు. కామతః=౬౫౧ అనువాకములు. జాధికరా = ౨౧౯౮ పనసలు, నాధీరధీరయః = ౧౦౯౧౯౦ పదములు, జాతుజాలమరాః = ౨౫౩౮౬౮ అక్షరములు.

ఈరీతి యజుర్వేదమునందలి కాండ, ప్రశ్నానువాక పనస పదాక్షరముల నిర్ణయము.

ఇఁక శ్రీమద్రామాయణమునందో

సూ. ససీతాధిపకథారాజలాలితనవసుగమసభాతా. ససీ=బాలకాండము౭౭- దీనితో నయోధ్యాకాండమునందలి ౧౧౯ - సర్గములు చేర తాధిప – ౧౯౬ దీనితో నారణ్యకాండమునందలి ౭౫ - సర్గములు చేర్ప కథానా - ౨౭౧, కిష్కింధాకాండములోని ౬౭ చేర జలాలి = ౩౩౮, దీనితో సుందరకాండము ౬౮ చేరి లితనవ = ౪౦౬, దీనితో యుద్ధకాండమునందలి ౧౩౧ చేర సుగమ = ౫౩౭ దీనితో నుత్తరకాండంబునందలి ౧౧౦ చేర సభాతా = ౬౪౭ సర్గములు సేముకాండంబులు నున్నవి.

ఈరీతి నుండు గ్రంథములో ౪ వేదములయాక్షరము లెట్లున్నవన:–

| | సర్గము. | శ్లో. | అక్షరములు. |
|---|---|---|---|
| బాలకాండము ప్రథమ సర్గము మొదలు ౫-వ సర్గము రెండవశ్లోకము కడవఱకు నారదుఁ డుపదేశించిన క్రమ మగుట ననంతరము బ్రహ్మ ప్రత్యక్ష మైనది మొదలగు కథాభాగ మున్నందున .... | ౪ | ౨౧౬ | ౭౧౨౪ |
| యజుర్వేదము, బాలకాండము ౫ - సర్గము ౩ వ-శ్లోకము మొదలుకొని యయోధ్యాకాండము ౧౧౫ సర్గమువఱకు సంహితాపదముల యక్షరము లన్నియు .... | ౧౫౮ | ౬౨౧౯ | ౨౦౨౯౭౩ |
| ఋగ్వేదము, అయోధ్యాకాండము ౧౧౬ - వ సర్గము మొదలారణ్యకాండము ౭౪-వ సర్గము | | | |

| | | | |
|---|---|---|---|
| నఱకు యజుర్వేదమునవచ్చిన మంత్రములు పోఁగా .... | ౭౮ | ౨౬౦౧ | ౮౫౩౮౩ |
| సామవేదము, అరణ్యకాండము ౭౫ - మొదలు సుందరకాండము ౪౮ - సర్గమువఱకు .... | ౧౧౬. | ౪౫౭౫ | ౧౫౨౫౨౭ |
| అథర్వము, సుందరకాండము ౪౯ - మొద లుత్తర కాండము ౩౬-న సర్గమువఱకు .... | ౧౮౭ | ౮౨౬౪ | ౨౭౨౯౨౫ |
| ఉత్తరకాండము ౩౭ - మొదలు తుదవఱకు నుప నిషత్తనఁగా శాంతి | ౭౪ | ౧౭౬౦ | ౫౫౯౬౨ |
| | ౬౪౭ | ౨౩౬౩౫ | ౭౭౬౭౯౪ |

ఈప్రకారము శ్లోకవృత్తాక్షరసంఖ్యలు సరిపోవుచున్నవి. మీఁద యజుర్వేదము నందు ౧౫౩౮౬౮ యక్షరములున్నట్లుచెప్పి రామాయణమున ౨౦౯౭౩ యక్షరము లున్నట్లుచెప్పితివే ౫౦౮౯౫ యక్షరములు తక్కువపడుటకుఁ గారణ మేమన.

వేదపదమున అసి, ఇతి, ఏతి, ఉదితి, అగ్ని యనువర్ణములుపదములు విశేష ముగ నున్నవి దీనికి వేదజ్ఞులు ఆ-ప్ర-అప-ఉప-అభి-అధి-ప్రతి-పరి-వి-ని-ఇతిఉపసర్గము లనియు, అంతః-ఇతి-పరోపి ఈసూత్రముచే రేవతే-ఉభే-భాగదే-ఊర్ధ్వే-విశాభే-శృంగే ఇత్యాదిప్రగ్రహాపద మని ప్రాతిశాఖ్యవ్యాకరణప్రమాణముఁ జెప్పుదురు.

రామాయణములో ప్రు-స్థి-త్వా మొదలగునవి ౨-౩ వర్ణములు చేరి యేకా క్షరములుగ నుచ్చారణము-ఈవర్ణము పదభాగము కొన్నిచోట్ల సే-మే అను నేకాక్షరములుగ నచ్చు హల్లులు వేఱుగ విభజన మగుచున్నది. గనుక నిప్ప సరి చూచిన వేదవర్ణముల లెక్కకు రామాయణవర్ణముల లెక్క సరిపోవుచున్నది.

వేదములలోని పదస్వరోచ్చారణము రామాయణశ్లోకములలో నుద్ధృతమైన వర్ణములు చేరినపదము లేకిలి వ్యాకరణసూత్రానుసారముగ క-త-ప వర్ణములకు గ-ద-బ-వర్ణు వేదభేదముచే మాఱుచున్నది.

మాతృకానందవిరచితమాతృకాక్షరవివేకాది ప్రథమప్రకాశమునందు షణ్ముఖే శ్వరసంవాదములో,

శ్లో. "వాగ్భవాంశ్చక్రియాశక్తిః కళాషోడశసూపజా ।
అకారశ్చ-ఇకారశ్చ-ఉకారశ్చ-ఋకారకః ।
ౡకారశ్చైవ-ఏకారః తస్యవై సారపదచ ।
ఏతే సప్తస్వరాః ప్రోక్తాః, తేషాముద్భవఉచ్యతే ।
ఏకమాత్రస్వరాజీవాః ప్రకృతేర్వికృతిస్వరాః ।
అకారోద్భవ ఆకారః ఇకారేఈసముద్భవః ।

ఈప్రకారము చూడఁగా వేదమునందలి

ఇషే త్వా ఊర్జే త్వా, వాయవః స్థ ఉపాయవః స్థ
దేవః వః సవితా ప్రతి అర్పయతు శ్రేష్ఠతమాయకర్మణే.

అనుమంత్రములు రామాయణమునందు

ఇషా తే ఊజతీ వాయఃవా స్తా ఉపయవస్తే దేవ వ సవితా అపయాతుశ్రేష్ఠతమాయ కర్మాణి యని యగుచున్నవి. ప్రతి యనునది యుపసర్గముకావున గ్రహింపఁబడదయ్యె. ఇచ్చట ఇషే త్వా అనుమంత్రము ౫-వ సర్గమునందును, వాయవః అనునైదవమంత్రము ౬-వసర్గమునందుండ నేల? వెంట వెంట నేలయుండరాదు? అనుసందేహము కలుగవచ్చును. ఇషే త్వాఊర్జే త్వా మంత్రములకు వేదభాష్యము చొప్పునఁ గలయర్థము ౬-వ వర్గము 3-వ శ్లోకమువఱకు సూచింపఁబడియున్నది. అట్టులే యాయామంత్రము యొక్క యర్థము ముగియఁగానే మఱియొక మంత్రార్థము ప్రారంభింపఁబడును. ఇది కేవలవేదజ్ఞులకే సాధ్యమగుటచే నిది యింతతో విరమింపఁబడియె. గాయత్రియు నిట్లులకొంచెము మార్పఁబడియున్నది గదా. ఈప్రకారము ఋగ్యజుస్సామవేదముల నుద్ధరించి శ్రీమదాధూల మహాముని కౌత్సాకేయ ప్రవరాన్విత వాధూలగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయి శ్రీరంగం కోవిల్ కందాడై భావనాచార్య, శ్రీరంగాచార్యులవారికుమారులు రంగాచార్యులవారు కొంతగ్రంథమును విశాఖపట్టణమునందలి యార్యముద్రాక్షరశాలయందు శ్రీరామాయణవేదసమర్థన ప్రకాశిక యనుపేర ముద్రింపించియున్నారు. ధనములేమి నాగ్రంథమంతయు ముద్రింపఁబడలేదు. రామాయణము వేదముగనుకనే కొన్నిచోటుల నిరంతరాధ్యయనపరుఁ డగువాల్మీకి వేదపరిభాషాపదములను, వేదసంజ్ఞలను బ్రయోగించెను. సహస్రసంవత్సరముపాసీత యనుప్రమాణము చొప్పునఁ గొన్నియెడల దినశబ్దపర్యాయముగ సంవత్సరశబ్దమును మాసాన్సైషశా యన్నట్లు పక్షపర్యాయముగ మాసశబ్దమును బ్రయోగించియున్నాఁడు. ఇట్టిసంకేతముల నెల్లఁ నెఱఁగి యర్థగ్రహణము సేయనివారు సందేహసముద్రమున మునుఁగుటే కాక సంప్రదాయజ్ఞులపరిహాసమునకుఁ బాత్రులగుదురు.

## రామాయణము సాంఖ్యశాస్త్రము.

కాదినవాదిసూత్రముల చొప్పున నక్షరములకుఁ గలసంఖ్యలఁ ల్క్ని చూడ రామాయణమునఁ గొన్నిచిత్రములు కనఁబడుచున్నవి.

| | | | |
|---|---|---|---|
| రా + మ = ౨ + ౫ = | ౭ | రామాయణయుద్ధమున ముఖ్య | |
| అవతారసంఖ్య | ౭ | పురుషులసంఖ్య. | ౭ |
| రామాయణకాండసంఖ్య | ౭ | (రామలక్ష్మణ హనుమద్విభీషణాదు | |
| యుద్ధదినసంఖ్య | ౭ | రావణకుంభకర్ణేంద్రజిత్తులు . . ) | |

రాక్షసులలో ముఖ్యులు ముగ్గురనుటకు బాలకాండము ౪-వ సర్గమున కుంభకర్ణస్యనిధనం మేఘనాద నిబర్హణం రావణస్య వినాశంచ యని మూఁడుపేర్లే చెప్పఁబడినవి. పారాయణమునకు ముఖ్యముగ నియమితమైన సర్గములసంఖ్య ౭. వ్యాహృతులు ౭. ఈ యేడవసంఖ్య నుహిమ యద్భుతము.

ఇంతియకాక "శ్లోకశతై" యని వాల్మీకిచెప్పినట్లు బాలకాండము మొదటి సర్గము మొదటిశ్లోకమును జూడఁగా

౬ ౧ ౪ ౧ ౧ ౦ ౨ ౬ ౬ ౧ ౪ ౪ ౪ ౮ ౪ ౨
త ప స్స్వా ధ్యా య ని ర తం త ప స్వీ వా గ్వి దాం వ రం
౦ ౨ ౮ ౧ ౨ ౧ ౨ ౭ ౪ ౫ ౧ ౫ ౦ ౧ ౩ ౪=౧౦౦
నా ర దం ప రి ప ప్ర చ్ఛ వా ల్మీ కి ర్ము ని పుం గ వమ్.

ఈ ౧౦౦ సంఖ్య ప్రథమసర్గ శ్లోకసంఖ్యగా నున్నది.

కం. తపమున స్వాధ్యాయంబున, నిపుణుని వాగ్విద్వరేణ్యు ♦ నిఖిలమునిజనా
ధిపు నారదు సంప్రశ్నము, తపస్వి వాల్మీకి యిట్టు ♦ తమిఁగావించెన్.

ఈపద్యమునకు ౧౨౦ సంఖ్య వచ్చుచున్నది. ద్విత్వాక్షరము లుభయసంఖ్య గణనీయము. ఈ ౧౨౦ యనునది ప్రథమసర్గమునకు సరియగు నాంధ్రసంక్షేప రామాయణమునందలి 'వాక్య' సంఖ్యకు సరిపోవుచున్నది.

రామాయణమునందలి సప్తసంఖ్యానియమము గ్రహించి వ్యాసభగవానులు నిజరచితగ్రంథమునకు 'జయ' మ్మని పేరు పెట్టెను. జయ=౧౮. భారతమునందుఁ బర్వములు ౧౮. ౧౮ దినముల యుద్ధము. ౧౮ మంది రణశూరులు. భగవద్గీత ౧౮ అధ్యాయములు వచ్చునట్లు సమర్థించియున్నారు మహాత్ములమార్గ మొక్కటియేకదా.

సీతారాములు వియోగములేక కూడియుండుట యయోధ్యాకాండమునందు మాత్రమే చెప్పఁబడినది. తక్కిన యన్నికాండములయందుఁ గొంతకాలమైనను వియోగము చెప్పఁబడియున్నది. కాఁబట్టి యీరెండునామముల సంఖ్యలు కలుపఁగా

సీత = ౬౭
రామ = ౫౨
౧౧౯

అయోధ్య = ౧౧౯

అయోధ్యాకాండంబున సర్గములు ౧౧౯. కాండసర్గసంఖ్య యిట్లు నియమితమయ్యెను. ఇట్టిచిత్రము లెన్నెన్ని కవి గ్రంథమున నిక్షేపించి యున్నాఁడో

## గుణవర్ణనము.

ఇంతవఱకుఁ గవిమహిమ, కవిత్వమహిమ, కావ్యమహిమ కొంచెముగ నైన సూచింపఁబడెను గాని కావ్యమునందు వచ్చుపాత్రములగుణాగుణములు ఫలాఫల

ములు వివరించి వ్రాయుటకు నేమియు నైతిగామికి మిక్కిలి విచార మగుచున్నది. ఒక్కొక్కరి గుణాగుణములు వాదప్రతివాదములచేఁ జర్చించి ప్రమాణపూర్వకముగ వ్రాయవలయు ననిన నది యొకగ్రంథ మయ్యెడిని. ముఖ్యముగఁ బురుషులయందు దశరథుఁడు, శ్రీరామలక్ష్మణభరతశత్రుఘ్నులు, సుగ్రీవుఁడు, హనుమంతుఁడు, రావణ కుంభకర్ణవిభీషణులు వీరియొక్కయు, స్త్రీలయందుఁ గౌసల్య, సుమిత్ర, కైకేయి, సీతాదేవి వీరియొక్కయు గుణాగుణములు చర్చింపవలసియుండును. దశరథు గుణములు విచారించునపు డతఁడు కామియు బహుభార్యుఁడు నై యొకభార్యయందే యత్యంతానురాగము కలవాఁడై తక్కినభార్యల దుఃఖపెట్టుటయే కాక కామాంధత్వముచేతఁ గొడుకులను గోడలిని గష్టపెట్టి తనప్రాణముమీఁదికిఁ దెచ్చుకొనిన విషయమును, రామునికిఁ దండ్రి యయ్యు రామ రామ యని యఱచుచుఁ జచ్చియు స్వర్గలోకమునకంటెఁ దైలోకములకుఁ బోఁజాలమియు లోనగునవి యాలోచింపవలయును. దశరథునిగుఱించి శ్రీరాముఁడు,

శ్లో. అర్థధర్మౌ పరిత్యజ్య, యః కామ మనువర్తతే
ఏవ మాపద్యతే క్షిప్రం, రాజా దశరథో యథా.

కం. సార్థక మగుధర్మంబును, నర్థంబును విడిచి కామ మనువర్తింపన్
వ్యర్థుం డెవ్వం డాతఁడ, నర్థంబులు దశరథునివలె ననుభోగింపన్. అయో-౧౦౮

అని చెప్పిననీతి యెంతసత్యమో చూడుఁడు.

శ్రీరాముఁడు సామాన్యధర్మంబులనెల్ల నెట్లనుష్ఠించినది, కష్టకాలంబుల నెట్లు వర్తించినది, సుఖకాలంబుల నెట్లునడచుకొనినది, యెట్టెట్టివారియం దెట్టియభిప్రాయము గలవాఁడైనది, దానికిఁ గారణ [illegible] మేవిధముగ దాఁచినది, యెప్పుడెట్లుప్రకటించినది, యప్పటిసంరంభము [illegible], మాయామానుషనటన మెట్లుచేసినది యిత్యాదు లెన్నియో చర్చింపవలయును. గ్రంథము సాంతముగఁ జదువని కొందఱు కొన్నివిషయంబుల విరుద్ధాభిప్రాయము గలవా రగుచున్నారు. అది వారిలోపమే కాని రామునియందలి లోపముగాదు. రామాయణమునందలి లోపముగాదు. ఒక్క దృష్టాంతము. రాముఁ డేకదారవ్రతుఁడని రామాయణము చెప్పుచుండఁ గొందఱు బహుపత్నీకుఁ డని వాదించెదరు. వా రేకపత్నీవ్రతమన జారుఁడుకాకుండుట యని ప్రసంగించెదరు. ఇది కొందఱిపాశ్చాత్యుల బ్రహ్మచర్యమువలె నున్నది. తాను బెండ్లి చేసికొనక పరభార్యలతో సంతుష్టిపడియుండెద నని శపథముచేయుట బ్రహ్మచర్య మని వారి యభిప్రాయము.[1] అట్లయినచో

---

[1] Celibacy. "The Tin Trumpet gives the following definition —"Celibacy, a vow by which the priesthood in some countries swear to content themselves with the wives of other men.' C. P. Brown's Dic. First Edition.

శ్లో. " నాసీ త్పురేవా రాష్ట్రేవా, మృషావాదీ నరఃక్వచిత్
కశ్చి న్నదుష్ట స్తత్రాసీ, త్పరదారరతో నరః     బాల. ౭-సర్గము.
కం దుష్టులు వెలిచవిమరగిన, భ్రష్టులు లే రప్పురమున ♦ రాష్ట్రమునందున్
(వెలిచవి=జారత్వము)     బా-౭౮ 3

అని చెప్పఁబడి యుండుటచే దశరథపరిపాలితరాజ్యమునందుఁ బ్రతిమనుష్యుఁడు నేక పత్నీకుఁ డనే కదా యర్థము. అటులైన నిఁక రాముని కందేమివిశేష మని యాయన నేకపత్నీకుఁ డనిచెప్పుట?

శ్రీరాముఁడు బహుపత్నీకుఁడని చెప్ప, వా నిరూపించు వాక్యము లెవ్వి యన.

(1) "రామస్యదయితాభార్యా" బా-౧ స యని చెప్పుటచే సీతయంతటి ప్రియురాండ్రుకానిభార్యలు కొందఱున్నారని సూచింపఁబడుచున్నదని.

సమాధానము ఈవాక్యముచే నీయర్థము సాధింపఁబడఁజాలదు. ఏలన నదేశ్లోకమునందే

శ్లో. తం వ్రజంతం ప్రియోభ్రాతా, లక్ష్మణోనుజగామ హ
స్నేహాద్వినయసంపన్న, స్సుమిత్రానందవర్ధనః
భ్రాతరం దయితో భ్రాతు, స్సౌభ్రాత్ర మనుదర్శయన్.

అనికలదు. ఈవాక్యము నాధారముచేసికొని భరతశత్రుఘ్నులు రాముని కప్రియ భ్రాతలని చెప్పవలసి వచ్చును. అంతటిసాహస మెవఁడు చేయును?

(2) శ్లో. హృష్టాః ఖలు భవిష్యంతి, రామస్య పరమాస్త్రియః
అప్రహృష్టా భవిష్యంతి, స్నుషాస్తే భరతక్షయే.     అయో-౮. స.
కం.సంతసము న రామస్త్రీసంతతి దుర్భరభంగ భరతు♦క్షయమున మదిలో
సంతాపింతురు నీస్నుష, లెంతో చింతింపు దీని ♦ కె య్యది తెరువో.అయో-౮౯౯.

ఇచ్చట నీకోడండ్రనిచెప్పుటచే భరతునిభార్యలనియర్థమునియు నట్లే రామస్య పరమాస్త్రియ యనిన రామునిభార్య లని యర్థమనియుఁ జెప్పుదురు.

సమాధానము. అంతట భరతునకుఁ బెక్కుభార్యలు గలరా యని యాలో చింతము. అట్లుండిరేని యావివాహము లెప్పుడు జరిగినవి? యెక్కడ జరిగినవి? దశ రథునకు కొడుకులతోఁగూడ విభాగయుండఁగనే యుధాజిత్తు భరతునిఁ బిలుచు కొనిపోవుటకై వచ్చెను. వివాహానంతరము దశరథునితో పాటయోధ్యకు వచ్చెను. తరువాతఁ గొన్నిదినము లుండి భరతశత్రుఘ్నులను బిలుచుకొని పోయెను. ఈలోపల నెవ్వరికి నురల వివాహములు జరుగలేదు గదా.

కేకయపురియందుండఁగా భరతునికి వివాహ మైనదేమో యని చెప్పుటకు **నాధారము** లేవియు లేవు ఒకవేళ నట్లయి యుండిన దల్లిదండ్రులు గానిదే భర **తుఁడు వివాహము** చేసికొనియుండునా? జనకుఁడు సీత నీయఁబూనినప్పుడు నాతండ్రి

యాజ్ఞ లేనిదే నేను వివాహము చేసికొన నని రాముఁడు నిరాకరించినట్లు భరతుఁడు నిరాకరించి యుండఁడా.

శ్లో. తతో౽హం తత్ర రామాయ, పిత్రా సత్యాభిసంధినా
నిశ్చితా దాతు ముద్యన్యా, జలభాజన ముత్తమమ్
దీయమానాం నతు తదా, ప్రతిజగ్రాహ రాఘవః
అవిజ్ఞాయపితు శ్ఛంద, మయోధ్యాధిప తేః ప్రభోః. అయో-౧౧౮ స.

ఉ. అంతట సత్యవాది జన♦కావనినాథుఁడు నన్ను రామభూ
కాంతున కీయ సిద్ధపడఁ ♦ గైకొనఁ డయ్యెను దండ్రియిష్టమా
వంత నెఱుంగగామి........ అయో-౨౫౮౮. ప.

పెండ్లియే చేసికొనియుండినయెడలఁ బ్రథమదర్శనంబుననే భరతుఁడు కైక తోఁ బ్రస్తావించియుండఁడా? పెండ్లిచేసికొనెననియే యందము. ఎవరిపిల్లను? మేన మామయింట నుండువాఁ డాయనకూఁతునే కదా చేసికొని యుండవలయును. ప్రతి పక్షు లీకష్టము నాలోచింపక యుధాజిత్తుదుహితల శ్రీరాముఁడు పెండ్లిచేసికొనెనని యది తమవాదమునకనుకూలమని దౌర్వాసరామాయణమందలి

శ్లో. భూ నీళా విమలా ఖ్యానా, శ్చాష్టావింశాధికంశతమ్
సర్వాభరణసంపన్నా, స్సుమధ్యా రామమోహితాః
కోసలో భానుమంతశ్చ, మాగధ శ్చిత్రభూషణః
యుధాజి త్కేకయాధీశః, కాశినాథః ప్రతర్దనః
పృథక్ షోడశసంఖ్యాకా, దుహితౄః పుణ్యలక్షణాః
తాసాం సంభవవేళాయాం, రాఘవార్థే నిమంత్రితాః
రాఘవాయ దదుశ్శ్రీమ, చ్ఛుభలగ్నే గ్నిసాక్షికమ్.

యీవాక్యముల నుదాహరించుచున్నారు. ఈరాముఁ డేరాముఁడో కాని వాల్మీకి వర్ణించిన శ్రీరాముఁడు కాఁడు. వాల్మీకియొక్కఁడే యథార్థచరితము వర్ణించినవాఁడు. తక్కినవారు రామునిపరత్వమును వర్ణించినవారే. కావున భరతునకుఁ బెక్కురు భార్య లుండుట కల్ల, రామునకుండుట యంతకుమున్న దబ్బఱ. అట్లయినచోఁ బై శ్లోకమున కర్థ మే మన,

శ్లో. లక్ష్మణోహి మహేష్వాసో, రామం సర్వత్ర నాగతః
శత్రుఘ్న శ్చాపి భరతం, కాకుత్థ్సం లక్ష్మణో యథా. అయో. ౮ స.

కం. రామునిఁ ద్రికరణశుద్ధిగ, సౌమిత్రి భజించు చుండు ♦ సంతత మతివా!
రాముని లక్ష్మణుకీతిని, సామంబునఁ గొలుచు భరతు ♦ శత్రుఘ్నుండున్.

అని మంథరయే రామలక్ష్మణు లోకయుద్ది యని, భరతశత్రుఘ్ను లోకయుద్ది యని యేర్పఱిచి చెప్పుటచే సీకోడంద్రనఁగా భరతశత్రుఘ్నులభార్యలొండె వారిపరిచారిక లొండె. రామునియొక్క యుత్తమస్త్రీ లన రామలక్ష్మణులభార్యలొండె వారి పరిచారిక లొండె నని యర్థము. మంథర కైకకుఁ గలుగు హీనదశకన్నఁ దనకుఁ గలుగఁబోవు హీనదశకే యెక్కువపరితాపపడినట్లు దాని వాక్యములవలననే స్పష్ట పడుచున్నది. పరిచారికలను బరమస్త్రీ లని చెప్పవచ్చునా? యనిన

శ్లో. భుజై ః పరమనారీణా, మభిమృష్ట మనేకధా. యుద్ధ. ౧౨ స.

సీ. పరమనారీజన ॥ కరములచేఁ బెక్కు, బడులను నల్గిడఁ ॥ బడినదాని (రామునిహస్తము)

ఇక్కడ నలుగిడునట్టియు, నలంకరించునట్టియుఁ బరిచారికలను బరమనారు లని వాల్మీకియే చెప్పెను.

శ్లో. యస్సుఖే షూపధానేషు, శేతే చందనరూషితః
వీజ్యమానో మహార్హాభిః, స్త్రీభి ర్మను సుతోత్తమః
స నూనం క్వచి దేవాద్య, వృక్షమూల ముపాశ్రితః
కాష్ఠంవా యదివాఽశ్మాన, ముపధాయ శయిష్యతే. అయో. ౮౨ స.

ఉ. హాయి నలంది గంధము మ ॥ హార్హలు చేడెలు వీచు చుండ ది
వ్యాయతతల్పమందు సుఖ ॥ మై శయనించెడినాతనూభవుం
డేయెడ వృక్షమూలమున ॥ నేగతిఁ దా దెసమాలి కట్టెయో
చేయియొ ఱాయొ దిండుగను ॥ జేసి ధరం బడియుండువాఁడొకో?

ఇది దశరథు వాక్యము ఇందును వింజామరలువీచువా రుత్తమస్త్రీ లనియే చెప్పఁబడెను. రాజులకు స్త్రీలే యలంకారాదికృత్యములన్నియుఁ జేయుట యాచారము. రావణవధానంతరమున విభీషణుఁడు శ్రీరామునితో,

శ్లో. స్నానాని చాంగరాగాణి, వస్త్రా ణ్యాభరణానిచ
చందనానిచ దివ్యాని, మాల్యాని వివిధానిచ
అలంకార విద శ్చేమా, నార్యః పద్మనిభేక్షణాః
ఉపస్థితా స్త్వాం విధివ, త్స్నాపయిష్యంతి రాఘవ. యుద్ధ. ౧౨౮.

ఉ. ఘమ్మనుదివ్యతీర్థములు ॥ కమ్రతరమ్మగుమేలియంగరా
గమ్ములు స్థాసకమ్ములు ని ॥ గారపుఁగ్రొత్తపసిండిపట్టువ
స్త్రమ్ములు సొమ్ములుఁ గ మలయ ॥ జమ్ములు దైవతవృక్షపుష్పమా
ల్యమ్ములు సిద్ధమైనయవి ॥ యంబుజపత్రవిశాలలోచనా.

కం. వివిధాలంకారకళా, సువిదిత లీపద్మముఖులు ॥ సుఖముగ నీకా
ప్లవమొనరింతురు నాప్తై, దవిలినగురుకరుణ నమ్మ ॥ తముఁ జూవఁ గదే?

అని చెప్పెను. ఇచ్చటను పద్మనిభేక్షణలు స్త్రీ లని చెప్పుటచేఁ బద్మినీజాతిస్త్రీ లనియర్థము ఇట్టివి యింకను గలవు. ఈవాక్యములవలన రామునిపరిచారిక లాఁడపాప లనఁబడు కొలఁదివారు కారనియు నుత్తమకులజ లనియు రాముని పరిచారికలును సంతసంబునఁ దృష్టించుచుండ నీకోడండ్రు మూల్గుచుండెదరనియు నర్థముగ్రహింపవలయును.

(3) శ్లో. పితుర్నిదేశం నియమేన కృత్వా, వనా న్నివృత్త శ్చరిత వ్రతశ్చ
స్త్రీభిస్తు మన్యే విపులేక్షణాభి, స్త్వం రంస్యసే వీతభయఃకృతార్థః.
సుం - ౨౬ స.

చం. జనకునియాజ్ఞఁ జొప్పునఁ బ్రశస్తగతిన్ వనవాసదీక్షఁ దీ
ర్చి నగర మేగి ధాత్రి కభిషేకముఁ గైకొనుచుం గృతార్థతన్
జనవున వారిజాతదళచారువిశాలవిలోచనాళితో
నెనయిక భీతిలేక రమియించెద వంచుఁ దలంతు సువ్రతా. సుందర-230 ప.

అనుసీతావాక్యమువలన రామునకుఁ బెక్కురుభార్యలు గల రని.

సమాధానము. ఇది తనయనంతరము రాముఁడు పెక్కురను వివాహముచేసికొను ననునభిప్రాయముచేఁ జెప్పఁబడినది భవిష్యత్తును గుఱించినయీవాక్యము భూతమునం దన్వయింపదు. ఇది తనయనంతరము తనసొమ్ములెవరు పెట్టుకొందురో? తనచీరలెవరు కట్టుకొందురో? తనభర్తలతో నెవరు రమింతురో? యని దుఃఖించు స్త్రీలస్వభావమును దెలుపఁ జెప్పఁబడినది. పారిజాతాపహరణమున సత్యభామావాక్యములఁ జదువుఁడు. అయోధ్యాకాండంబున రాముఁడు చిత్రకూటంబునఁ దన్ను దర్శింప వచ్చినభరతునిఁ గుశలప్రశ్న మడుగుటయందు

శ్లో. కచ్చిత్తే సఫలా దారా

యని యడుగుటచే బహువచన ప్రయోగకారణమున భరతునకుఁ బెక్కురుభార్య లున్నట్టు లర్థముకాదా యందురేమో యట్లు కానేరదు. దారా యనునది నిత్యబహువచనాంతము. ఏకవ్యక్తివిషయమునఁ బ్రయోగించినను దారా యనిసంస్కృతమున బహువచనరూపమే ప్రయోగింపవలయును. ఈయొకశబ్దమే కాదు. ఇట్టిశబ్దమేదైన సరియె ఈప్రయోగములఁ జూడుఁడు.

i ఇమే నో గృహాః తద్యానత్ ప్రవిశామి ము. రా.
ii స్వప్రాణేశ్వరనర్మహర్మ్యకటకాతిథ్యగ్రహోత్సుకం
పాథోదం నిజకేళిసౌధశిఖరా దారుహ్య యత్కామినీ
సాకూదప్సరసో విమానకలితవ్యోమానఏవాభవ
దన్నప్రాపనిమేషమభ్రతరసాయాంతీవసాదధ్వని. నైష.

ఇంతయేల? ఈవిషయమై రామాయణమున నెక్కడ స్పష్టముగఁ జెప్పఁబడ లేదా యందురేని యీవాక్యములఁ గనుఁడు.

(1) శ్లో. మంగళై రుపసంపన్నో, వనవాసా దిహాగతః
వత్సశ్చ మమ నిత్యం త్వం, కామాన్ సంవర్ధయాహి భో. అయో-౨౫ స.

తెనుఁగున ౭౫౨-వ పద్యముఁ జూడుఁడు.

ఇందుఁ గౌసల్య తనకొక్కతెయే కోడ లని యేకవచనప్రయోగముచేఁ దెలిపెను

(2) కల్యాణై రుచితం యత్తత్, త్వరిష్వక్తం మయైవ తు
క్రవ్యాదై స్తచ్ఛరీరం తే, నూనం విపరికృష్యతే. యుద్ధ - 3౨ సర్గ.

తే. సారఘనసారసమ్మిశ్ర♦చందనముల
నవ్యభూషణముల నొప్పి ♦ నాయొకర్తె
యంకపాళి సుఖించు మే ♦ నయ్యొ కంక
గృధ్రములపాలఁబడియెనా ♦ నృపవతంస యుద్ధ-౬౮౬.

ఇందు 'మయైవతు' అని సీతాదేవి రాముని కౌఁగిలించుకొనునది తానొక్కతెయే యని చెప్పుచున్నది.

(3) శ్లో. నఖల్వద్యైవ సౌమిత్రే, జీవితం జాహ్నవీజలే
త్యజేయం రాజవంశస్తు, భర్తుర్మే పరిహాస్యతే. ఉత్తర - ౪౮ స.

రాజవంశః=రాజసంతానః - పరిహాస్యతే=విచ్ఛిద్యేత-మయిగర్భస్యవిద్యమానత్వాదితి శేష యని వ్యాఖ్యాతలు.

కం.నామగనిరాజవంశము, భూమిపయిన్ ఛిన్న మగుచుఁ ♦ బోవదయేనిన్
సౌమిత్రీ జాహ్నవిలో, నామేను త్యజింపకుందు♦నా యీత్రుటిలోన్. ఉత్త-౯౬౬.

లక్ష్మణుఁడు సీతాదేవిని గంగాతీరమున రామాజ్ఞచొప్పున విడిచినప్పు డామె చెప్పిన వాక్యము. రామునకుఁ బెక్కురుభార్య లుండినను రాముఁడు మఱియొక వివాహముచేసికొను ననిశ్చయమైన ధైర్యముండినను సీతాదేవి యిట్లు చెప్పుటకుఁ గారణము లేదు.

(4) శ్లో. కాంచనీం మమపత్నీంచ, దీక్షాయాంజ్ఞాంశ్చ కర్మణి
అగ్రతో భరతఃకృత్వా, గచ్ఛత్వగ్రేమహాయశాః. ఉత్తర-౯౧ స.

అనురాముని వాక్యమువలన బంగారుబొమ్మను భార్యాప్రతినిధిగా నుంచుకొని రాముఁ డశ్వమేధము సలిపినట్లు తెలిసెడిని. ఇతరభార్యలున్న నిటుచేయ నేల?

(5) శ్లో. న సీతాయాః పరాం భార్యాం, వవ్రే స రఘునందనః
యజ్ఞేయజ్ఞేచ పత్న్యర్థం, జానకీ కాంచనీ భవత్. ఉత్త-౯౯ స.

కం॥ జానకిని గాక వేఱొక, మానవతి నరింపఁ డయ్యె • మహితవ్రతుఁ డ
నన్యానంబుగఁ గార్తస్వర, జానకియే భార్యజన్మ•జన్మమునందుఁ॥. ఉత్త-౧౫౮౭.
అనువాల్మీకివాక్యము పూర్వపక్షవాదము నిర్మూలించు చున్నది.

(౯) ఉత్తరరామాయణంబుననే భృగుశాపమువలన విష్ణువు భార్యావియోగ మనుభవింప రాముఁడైపుట్టిన ట్లున్నది కదా. భార్యలు పెక్కురుందురేని యాశాప మెట్లు రాముఁ డనుభవించినటు లగు?

ఇట్టులే వాలివధవిషయమున రామునిగుణము దోషసహితమని కొంద అభిప్రాయపడెదరు. ఈవిషయమై నాకుఁ దోఁచిన సమాధానము వ్రాసెదను. రాముఁడు బుద్ధిమంతుఁ డగుక్షత్రియుఁడు. దీని నెవ్వరుఁ గాదన రని నమ్మెద. ఇట్టిరామునకుఁ దొలుతఁ గబంధుఁడు సుగ్రీవునితో స్నేహము చేయు మనియు, నతనికిఁ దెలియని స్థలము లోకమున లేదనియు, నతఁడు వానరులను బంపి నీభార్యయునికిఁ దెలిసికొనఁ గలుగు నని చెప్పి స్నేహము కుదురునా యనుసందేహము పోవ నతఁడు నీవలెఁ గష్ట దశయం దున్నాఁడు, సమానదశయం దుండువారికి స్నేహము కుదురును గావున నీ కతనితో స్నేహము కుదురు నని చెప్పెను (అర. ౭౨-వ సర్గము ౧౭౬-వ పద్యము మొదలు) ఆమాటయందు నమ్మిక ముంచి రామలక్ష్మణులు సుగ్రీవుతోఁ జెలిమిఁ జేయఁ బంపాతీరముఁ జేరిరి రాముఁడు లక్ష్మణుని సుగ్రీవునిమిత్తమై పొమ్మనుచుండు సమయము లోనే సుగ్రీవునిచేఁ బంపఁబడినహనుమంతుఁడు వచ్చి సుగ్రీవునివృత్తాంతముఁ దెలిపి వారిని సుగ్రీవునొద్దకు నెత్తికొని పోయెను. అచ్చట రాముఁడే సుగ్రీవుశరణుఁ జొచ్చెను. అగ్నిసాక్షిగాఁ జేతిలోఁ జేయి వైచి రామసుగ్రీవులు మిత్రులైరి. అప్పుడు రాముఁడు సుగ్రీవుతో

శ్లో. ఉపకారఫలంమిత్రం, విదితం మే మహాకపే
వాలినం తం వధిష్యామి, తవభార్యాపహారిణమ్.

అనిప్రమాణముచేసెను. దీనినే,

శ్లో. ఉపకారఫలంమిత్ర, మపకారోరిలక్షణమ్
అద్యైవ తం హనిష్యామి, తవభార్యాపహారిణమ్.

అని రెండుమూఁడు మారులు చెప్పెను. దీనివలన వాలిని గుఱించి రాముఁడు మనస్సులో ననుకొన్నవి రెండు, (1) మిత్రునకుఁదోడ్పడి వాలినిజంపుట, (2) వాలిం జంపుటకుఁ గారణము సుగ్రీవుభార్య నతఁ డపహరించుట. ఇట్లు స్నేహము కుదిరిన పిమ్మట సుగ్రీవుఁడు వాలిబలపరాక్రమములఁ దెలుపుకథలను జెప్ప నారంభించెను. అ చెప్పుటలో

శ్లో. తమేవ ముక్త్వా సంక్రుద్ధో, మాలా ముత్క్షిప్య కాంచనీమ్
పిత్రా దత్తం మహేంద్రేణ, యుద్ధాయ వ్యవతిష్ఠత. కి ౧౧

యని వాలి యింద్రునిచే దత్తమైన కాంచనమాలను ధరించి దుందుభిమీఁదికి యుద్ధమునకుఁ బోయెనని చెప్పెను. ఈ కాంచనమాలికవిషయమై యెచ్చటఁ జెప్పఁబడిన నేమిగఁ జెప్పఁబడినదో పాఠకులు హెచ్చరికతోఁ బరించి దానిమహిమ నెఱుంగవలయును. బలవంతులతో యుద్ధము కటస్థించినపుడంతయు వాలి దానినిధరించి యే పోవుచుండెను. దానిగుణ మేమన: ఎదుటివానిబలము నాకర్షించి తన్నుధరించినవాని బలమును గాపాడుశక్తి దానియం దుండె నని గుణవర్ణనమువలనను వాలి కట్టివరముగల దనుప్రతీతిచేతను దెలియ నయ్యెడి. కావుననే వాలి దానిని సుగ్రీవుని కిచ్చునపుడు,

శ్లో. ఇమాంచ మాలా మాధత్స్వ, దివ్యాం సుగ్రీవ! కాంచనీమ్
ఉదారా శ్రీస్థితా హ్యస్యాం, సంప్రజహ్యా న్మృతే మయి. ౨౩ స.

సుగ్రీవా! దేవదత్తమైన యీకాంచనమాల గ్రహింపుము. నేను మరణించినంతట నిది నిస్సారమై జయలక్ష్మినిచ్చుశక్తి పోయినదగునని చెప్పెను. ఈ మాలికవలననే వాలి రాముని బాణముచేఁ గ్రిందఁబడియుఁ జావకుండెను.

శ్లో. భూమౌ నిపతితస్యాపి, తస్య దేహం మహాత్మనః
నశ్రీ ర్జహాతి నప్రాణా, న తేజో నపరాక్రమః
శక్రదత్తా వరా మాలా, కాంచనీ వజ్రభూషితా
దధార హరిముఖ్యస్య, ప్రాణాం స్తేజశ్శ్రియంచసా
సతయామాలయా వీరో, హైమయా హరియూథపః
సంధ్యానుగతపర్యంతః, పయోధరఇవా భవత్. ౧౭ స.

అని మాలాప్రభావముచేతనే వాలికిఁ బ్రాణముగాని కాంతిగాని పోకుండె నని చెప్పఁబడి యున్నది. కాకున్న రామబాణము దగిలి ప్రాణముతో నుండినవాఁడు వాలిగాక మతెవ్వరు? లక్ష్మణుఁడు తన్నుఁ జంపునేమో యని భయపడి సుగ్రీవుఁడు దీని ధరించి లక్ష్మణు నెదుటికి వచ్చి యతఁడు శాంతుఁడైనకారణముచే యుద్ధప్రసక్తి లేమి నీమాలికను దీసివైచె నని తెలియవచ్చెడి.

శ్లో. తస్మిన్ప్రతిగృహీతేతు, వాక్యే హరిగణేశ్వరః
లక్ష్మణా త్సుమహత్త్రాసం, వస్త్రం క్లిన్న మివాత్యజత
తతః కంఠగతం మాల్యం, చిత్రం బహుగుణం మహత్
చిచ్ఛేద విమద శ్చాసీ, త్సుగ్రీవో వానరేశ్వరః. ౩౬ స.

ఇంతియ కాక యుద్ధకాండమున ౧౦౯-వ సర్గమునందు శుకుఁడు రావణునకు సుగ్రీవునిఁ జూపి

శ్లో. యస్యైషా కాంచనీమాలా, శోభతే శతపుష్కరా
కాంతా దేవమనుష్యాణాం, యస్యాం లక్ష్మీః ప్రతిష్ఠితా
ఏతాంచ మాలాం తారాంచ, కపిరాజ్యంచ శాశ్వతమ్
సుగ్రీవో వాలినం హత్వా, రామేణ ప్రతిపాదిత.

యనిచెప్పెను. ఇట్టులే యింకఁ గొని [illegible] గలవు. ఇవన్నియుఁ జక్కఁగ నాలోచించిన నిది యొక్కగొప్పప్రభావము [illegible] మాలిక యని స్పష్టపడఁ గలదు. సుగ్రీవుఁడు వాలిమాలికగుఱించి చెప్పఁగనే రాముఁడు దానిగుణము గ్రహించి దానికిఁ బ్రతివిధాన మాలోచించుకొని యుండెను. ఈప్రకారము వాలింజంపుటకుఁ గారణము, సదుపాయము నాలోచించుకొనినవాఁడై తొలిసారి యుద్ధమునకై సుగ్రీవుని తోఁగూడఁ బోయెను. కాని వాలి యప్పుడు మాలికధరించి రాలేదు. ఆకారణంబున వాలిసుగ్రీవులకు భేదమును రాముఁడు కనిపెట్టలేఁ డయ్యెను. వాలి రెండవసారి మాలధరించి వచ్చినట్లు స్పష్టముగఁ జెప్పఁబడినది.

శ్లో. సుగ్రీవోపి త ముద్దిశ్య, వాలినం హేమమాలినమ్
శ్లిష్టముష్టిం సముద్యమ్య, సంరబ్ధతరమాగతః. ౧౬ స

రామున కీమాలికనధఃకరించు శక్తి లేదాయెనా యని యిచ్చట నొకసందేహము గలుగవచ్చును. రాముఁడు కేవలమనుష్యుఁడని యుంచితిమా యింద్రప్రదత్తమై మహామహిమగలదాని నతిక్రమింప రామునకు శక్తిలేదనియే చెప్పవలెను (Mesmeric amulet ను దిరస్కరింప నెవ్వఁడు శక్తుఁడు). రాముఁడు భగవంతుఁ డని యంటిమా బ్రహ్మవాక్యమును బరిపాలింప నింద్రజిత్తుమాయకు లోఁబడవలసివచ్చినట్లును, యముఁడు రావణుపై యమదండమును బ్రయోగింపనట్లు నొకదేవత యిచ్చినవరమును మఱియొకదేవత కాపాడవలయును గనుక నింద్రుఁడిచ్చినదానిని రాముఁడు వ్యర్థపఱుపరాదు. ఈకారణములచే రాముఁడు దానియెదుటికిఁ బోఁ డయ్యెను.

వాలికిఁ దన్నేకారణముతో రాముఁడు చంప నుద్దేశించినది తెలియదు. కావుననే తారతో ధర్మాత్ముఁడగురాముఁడు నన్నేలచంపు నని చెప్పి యుద్ధమునకు వచ్చెను. ఈకారణముచేతనే రాముని నిందించెను.

ఇప్పుడు రాముఁడు వాలికిఁ జెప్పినసమాధానమును జూతము.

సీ. నీవు పాలించున ♦ నీశైలధాత్రిని, యిక్ష్వాకుల కైనమా ♦ వగును గాదె?
దుష్టశిక్షణమును ♦ శిష్టరక్షణమును, బృథివీశులకు నెందు ♦ విధియ కాదె?
యనుజానిభార్యాగ్ర ♦ హము లాడిఁ గొని వానిఁ, గట్టువస్త్రముతోడ ♦ నెట్ట లేదె?
తమ్మునిభార్యను ♦ దాలినవానికి, శిక్ష [illegible] ♦ చెప్పఁబడదె?

ఆ. యతనితోడ నేను ♦ నగ్నిసాక్షికముగ
చెలిమిఁ జేసి హితము ♦ సేయుటకును
బ్రతినసేయ లేదె? ♦ పల్కి బొంకఁగఁ జన్నె?,
యే దసత్య మిందు ♦ నెఱుఁగఁ జెపుము?
కం. సన్నుతధర్మోపేతము, లిన్నిమహాకారణముల ♦ నృపకులచంద్రా!
నిన్ను వధించుటె ధర్మం, బన్నెఱిఁ దలపోయుమా మ♦హాబలశాలీ!
అని వాలి వధ్యుఁ డనుట సిద్ధాంతీకరించెను.

ఇట్లు వాలి వధ్యుఁడే యైనచో వాలిని జంపుమార్గ మెయ్యది యని యాలోచింపవలయును. ఒకఁడు వధ్యుఁడే యైనపుడు వాని నెట్లుచంపిన నేమి? చాటుగ నుండి చంపుట రామునంతటివానికిఁ దగ దని తలంతుమా యన

(1) మాలికాప్రభావ మొకటి యాలోచింపవలయును. అది యటుండ

(2) వాలి రామలక్ష్మణులను సచివయుక్తుం డగుసుగ్రీవునిఁ జూచి భయపడి కిష్కింధలోనికిఁ బారిపోయె ననుకొందము. తరువాత జరుగవలసిన దేమి? సుగ్రీవాదులకుఁ గిష్కింధలోనికిఁ బోవ ధైర్యము చాలదు. రాముఁడో

శ్లో. చతుర్దశసమాః సౌమ్య, గ్రామం వా యదివా పురమ్
న ప్రవేక్ష్యామి హనుమన్, పితుర్నిర్దేశపాలకః. ౨౩ స.

చం. జనకునియాజ్ఞఁ జేసి చొరఁ♦జాలను బట్నము నేని పల్లె నేఁ
హనుమ! చతుర్దశాబ్దములు........ కిష్కిం. ౬౬ ప.

యని చెప్పినట్లు కిష్కింధలోనికి బోవ నొల్లకుండెను. అప్పుడు ౧౪ సంవత్సరములు దాఁటువఱకు రాముఁడు ఋశ్యమూకమునం దుండవలసినవాఁడే కదా. తరువాత మాత్రము వాలి దొరకు నని యేమి నిశ్చయము. వానివెంటఁ బరుగెత్తుటకు రామునకు సాధ్యపడునా? అట్లు కాదేని

(3) రామునిఁ జూచినంతనే వాలి యతని శరణుఁ జొచ్చె ననుము

శ్లో. మిత్రభావేన సంప్రాప్తం, న త్యజేయం కథంచన
దోషో యద్యపి తస్యస్యా, త్సతామేత దగర్హితమ్.

తే. మైత్రి భావించి తాన సం♦ప్రాప్తుఁ డైన, వాని నెట్టులేని చేపీడు♦వాఁడఁ గాను
వానియెడ నుండె నేని నే♦దేనిదోష, మద్ది గర్హ్యంబు గాదు స♦దాశయులకు.

శ్లో. సకృదేవ ప్రపన్నాయ, తవాస్మీతిచ యాచతే
అభయం సర్వభూతేభ్యో, దదా మ్యేతద్వ్రతం మమ.

కం. నీవాఁ డని యొకపరియే, నేవాఁడే శరణు వేఁడె ♦ నేని సకలభూ
తావళి నభయంబును నే, వావిరి ఘటియింతు నిదియ ♦ వ్రత మగు నాకున్. 3౮౫
అనువ్రతము గలరామునికిఁ గర్తవ్య మెద్ది?

వధ్యుని రక్షించి, మిత్రునకు ద్రోహముఁ జేసి, యసత్యవాది గావలయునా?

(4) వాలి రామునితో విరోధించి రావణుప్రక్కనఁ దనసైన్యముతోఁ బోయి చేరు ననుకొందము. రావణునకు వాలికి నగ్నిసాక్షికమైత్రి గలదు. అప్పుడు సైన్య హీనుఁడైనసుగ్రీవుఁ డేమిచేయఁగలఁడు? రామునికార్యముగతి యేమి?

వాలి క్రోఁతి. ఇది వాలి యనుశబ్దమే తెలుపుచున్నది. క్రోఁతి యనిన నిప్పుడు మనము చూచుక్రోఁతి గాదు. వాలముగల యొకజాతి మనుష్యుఁడు. ఈజాతి వా రిప్పటికిని గొందఱున్నట్లు తెలియవచ్చెడి. ౧౯౦౪-వ సంవత్సరము సెప్టంబరు 3-వ తేది హిందూపత్రికయందు,

"A German traveller claims to have discovered in the forests of Borneo a people who still wear the tail of our primitive ancestors. He does not write from hearsay; he has seen the tail. It belonged to a child about six years old, sprung form the tribe of Poenans. As no body could speak the pœnan tongue the youngster could not be questioned; but there was his tail sure enough, not very long, but flexible, hairless and about the thickness of one's little finger. The Pœnans are reported to be very simple honest folk, with a child-like system of barter. They deposit in public places the goods they wish to exchange, and a few days later they find there the equivalent they desire. No body dreams of stealing. This is almost as remarkable as the vestige of the ancestral tail."

దీనివలన వాలిలోనగువా రిట్టిజాతివారనియు, నాకారముచే వీరు మనుష్యులలోఁ జేర్పఁబడక క్రోఁతులలోఁ జేర్పఁబడి రనియుఁ దెలియునది. తోఁకలేనిక్రోఁతులను మనుష్య లని చెప్పముగదా? కావున వాలిని (వాలిచెప్పుకొన్నట్లు) రాముఁడు మృగమనుటయం దేమితప్పు? ఇంతకునావాదమును దెచ్చినవాఁడు వాలియే కాని రాముఁడు కాదు కదా. మృగమును నిష్కారణముగానే క్షత్రియుఁడు నానావిధములఁ జంపవచ్చును ఇంక వధ్యుఁడుగా నుండునపుడు మఱుఁగున నుండిచంపిన దోషమా? కావున "ఇంగితజ్ఞాశ్చకోసలాః" యనువిరుదుగల రాముఁడు ధర్మమార్గమును విడువక తనకార్యమును మిత్రకార్యమును సాధించెనని తెలియునది. "రామో విగ్రహవాన్ ధర్మః" యనఁబడినరాముఁడా యధర్మమునకుఁ బాల్పడును? అటులైనచో,

శ్లో. ధర్మాత్మా సత్యసంధశ్చ, రామో దాశరథి ర్యది
పౌరుషే చాప్రతిద్వన్ద్వ, శ్శరైనం జహి రావణిమ్

తే. సారధర్మాత్ముఁడును సత్య♦సంధుఁ డేని
రామచంద్రుండు దశరధ♦రాజసుతుఁడు
పౌరుషమునను నప్రతి♦ద్వంద్వుఁ డేని
శరమ! యీరావణాత్మజు ♦ సంహరింపు.

అనునది యెట్లుసార్థకమగును? ఇది రామాయణమునకు మూలమంత్ర మెట్లగు?

వాలితో శ్రీరాముఁడు "భరతస్తుమహీపాలో, వయం త్వాదేశ వర్తిన" కి-౧౮ స యనిచెప్పినమాట సమయోచితముగఁగల్పింపఁబడినదనియు నయోధ్యాకాండమునఁ జెప్పఁబడ లేదనియుఁ గొందఱు తలంచెదరు. అట్టివారు రామునకు మానులకు జరిగిన సంవాదభాగము (అరణ్యకాండమున) చదువుటే కాక రాముఁడు ఖరునితోఁ జెప్పిన

శ్లో. పాప మాచరతాం ఘోరం, లోక స్యా ప్రియ మిచ్ఛతామ్
అహ మాసాదితో రాజ్ఞా, ప్రాణా న్హంతుం నిశాచర. అ ౨౯.

ఆ. పాప మాచరించు♦పాపాత్ములను భువ,నాహితార్థులైన ♦ యట్టిఖలుల
సంహరించుటకును ♦ జననాథుచే నాజ్ఞఁ, బొందివచ్చినాఁడ ♦ నాలునుదింక.

యనువాక్యమును గూడ స్మరించునది.

వాలిసుగ్రీవులు వైరులై యుండ సుగ్రీవునిమాటనే నమ్మి మఱియెవ్వరిని విచారింపక ప్రతివాది నడుగక వాలిని రాముఁడు చంపుట న్యాయమా? యని కొందఱు సందేహింతురు. తనభార్యను వాలి హరించినాఁడని సుగ్రీవుఁడు చెప్పుటకు ముందే "నానృతం వక్ష్యతే వీరో, హనుమా న్మారుతాత్మజ" యుని నమ్మకము సంపాదించుకొనిన హనుమ "సహిరాజ్యాత్పరిభ్రష్టః, కృత వైరశ్చ వాలినా, హృతదారో వనే త్యక్తో భ్రాత్రా వినికృతో భృశ" మ్మనిచెప్పెను.

శ్రీరాముఁడు సంధ్యావందనము, దేవతార్చనము, విగ్రహారాధనము, వ్రతానుష్ఠానము లోనగు నిత్యనైమిత్తికకర్మములన్నియు శ్రద్ధతోఁ జేయుచుండినవాఁడు. ఉద్దేశింపఁబడినపట్టాభిషేకదినమునకు ముందటిరాత్రి వ్రత మనునెపమున నాహారము గొనఁడయ్యె. పట్టాభిషేకదినమున సాయంతనమునఁ దమసాతీరముఁ జేరి ప్రథమోపవాస మని జలపానముఁ జేసి యూరకుండె.

శ్లో. అద్భి రేవతుసౌమిత్రే, వత్స్యా మ్యస్యనిశా మినామ్
ఏతద్ధి రోచ తే మహ్యం, వన్యేపి వివిధే సతి. అ. ౪౬ స.

మూఁడవనాఁడంతయుఁ బయనించి సంధ్యాకాలమునకు గంగాతీరముఁ జేరి తీర్థోపవాస మని గంగాజలముఁ గ్రోలి పరుండెను. తాను స్వయముగఁ దనయింటి

లోని విష్ణ్వాయతనంబున లక్ష్మీనారాయణులఁ బూజించు టేకాక దైవభక్తిచేఁ బట్టనము లోని దేవాలయములు ప్రదక్షిణముగ నైనఁ బోయినవాఁడు కాఁడు.

భూమిమీఁద బుట్టినమనుజుఁడు

౧ సమస్తధర్మములు శాస్త్రానుసారముగ నాచరించుట

౨ సమస్తమునం దనురాగమునదలి కేవలభగవత్కైంకర్యమందే కాలము గడపుట

3. భగవంతునకుఁ బరతంత్రుఁడై యనఁగా దాసుఁడై వర్తించుట

౪ భాగవతసేవ సేయుట

యీనాలుగువిధములఁ జరింపవలయును

ఇందు మొదటిది రాముఁడు స్వస్థానముచే బోధించెను. రెండవది లక్ష్మణుఁడును, భగవత్పారతంత్ర్యమును భరతుఁడును, భాగవతపారతంత్ర్యమును శత్రుఘ్నుఁడును లోకమునకు నేర్పిరి.

సుగ్రీవునిచర్యయం దతఁడు తనకుఁ గలిసినరాముని గుఱించి తన కేమియుఁ దెలియ దని చెప్పుటయం దతనిమేధయు మైత్రివిధమును జక్కఁగ గమనింపవలయును. చక్కఁగ నాలోచింపనిచో సుగ్రీవుం డసత్యవాది మిత్రద్రోహివలె నగపడును.

హనుమంతునిచర్య మిక్కిలి రమ్యదీపికతోఁ జదువఁదగినది. ప్రాయికముగ నాంజనేయునిప్రతివాక్యమునందే కాక మౌనమునందును విశేష మూహింపవలసి యుండును. అందు ముఖ్యముగ సుందరకాండమునం దతనిప్రతిభ చక్కఁగ వర్ణింపఁబడి యున్నది లంకనుండి మరలివచ్చి వానరులతో "దృష్టాసీతా" యనఁబడె సీత యని చెప్పుటకును శ్రీరామునితో "నియత-యక్షత-దేవి" యని చెప్పుటకుఁ గారణము నావక్రమముల స్వారస్యము యోజించునది. రావణునిదుష్ప్రభుత్వవిషయమై యిదివఱకే కొంచెము చెప్పఁబడినది. రావణుఁ డింద్రియజితుఁడు. ఇంద్రియజితుఁ డెంతపండితుఁడైనను భగవదనుగ్రహమునకుఁ బాత్రుఁడు కాఁడని రావణుచర్య వలనఁ దెలియవగు. కుంభకర్ణుఁడు పాంచభౌతికమైనదేహమే పరమార్థమని యెంచి దానిఁ బోషించువాఁడు. దేహదేవత కుండవలసినగుణము లన్నియు వీనియందుఁ గలవు. ఇట్టిలోకాయతికుఁడు (Materialist) ను భగవదనుగ్రహమునకుఁ బాత్రుఁడు కానేరఁడు. ఇంక నెట్టివాఁడు భగవత్కృపకుఁ బాత్రుఁడౌనన జన్మముచే నెట్టివాఁడైనను దుష్టసాంగత్యము వదలి భగవంతుని శరణుఁజొచ్చి సేవించువాఁడని విభీషణువృత్తాంతమున నెఱుఁగఁదగు. ఇంద్రజిత్తు చెప్పినట్లు కొందఱు విభీషణుఁడు భ్రాతృద్రోహి యని భ్రమింతురు. తత్త్వము విచారించిన నది యసత్యమని తెలియవచ్చును. స్త్రీల

యందు ముఖ్యురాలు సీతాదేవి. ఈమె లక్ష్మీదేవి యగుటచే లోకమాతృత్వము, పాతివ్రత్యము, కరుణాస్వభావత, లోనగుగుణము లెట్లెట్లు కనఁబఱిచినదియు, "సహధర్మచరీతవ" యను జనకునివాక్య మెట్లు సత్యపఱిచినదియు, స్త్రీస్వభావమును లోకమున కెట్లు బోధించినదియు, నివియెల్ల మనస్సునకుఁ దెచ్చుకొనవలయును.

శ్లో. ప్రణిపాతప్రసన్నాహి, మైథిలీ జనకాత్మజా

కం. ప్రణతిప్రసన్న జానకి

యని రాక్షసులచేతను గౌరవింపఁబడి 'నకశ్చిన్నాపరాధ్యతి' యపరాధముఁ జేయనట్టి యతఁడుం గలఁడే యని చెప్పినమహాదేవి నిష్కారణముగ నిరపరాధిని లక్ష్మణు దూషించి తా ననేకకష్టములకుఁ బాల్పడినది స్త్రీస్వభావము సాధుదూషణఫలము లోకమున కెఱిఁగించుటకే యనియుఁ, దత్త్వార్థమున భగ్నసంకల్పము నెఱవేర్ప సాయపడుట కనియుఁ దోఁచెడిని. ఉత్తరకాండమునందలి యీమెచరిత్ర యవిశ్వసనీయము. ఈవిధముగ సముద్రమును నావగింజలో నణఁచినట్లు లిగొప్పవిషయము సంక్షేపించితి. విశేషములు నాయ [illegible].

## పూర్వనాగరికత.

నాగరికత యనునది వేషభాషలచేతనే కాక చక్కనినడవడిచేతను దెలియఁదగి యున్నది. అనార్యుఁ డనార్య, యనునవి కేవలనిందావాచకములుగ రామాయణమునఁ బ్రయోగింపఁబడి యున్నవి. జనులు శుచిసంతోషులు, సత్యవాదులు, సద్విచారులు, సదాచారసంపన్ను లని పెక్కుచోటుల వక్కాణింపఁబడి యున్నది.

అయోధ్యాకాండమున ౧౭౦౪-వ పద్యముమొదల నరాజకత్వదోషము వర్ణింపఁబడి యున్నది. అది చదివిన రాజున్నప్పటియయోధ్యాజనులస్థితియు రాజు లేనియెడలఁ గలుగునష్టము దెలియ నగు. అందుఁగల

కం.ధారిణి యరాజకముగాఁ, గూరిమిఁ గై సేత గొప్పఁ ♦ గోమిరెలు గోమవుల్
సారారామంబులను బ,చారములఁ సౌఖ్యపడరు ♦ సాయాహ్నములన్

కం.ధారిణి యరాజకముగా, స్వైరిం జనఁబోరు సతులు ♦ వల్లభయుతలై
తేరులపై వరసుమనో,వారాపచయంబుకొఱకు ♦ వనభూములకున్

అనునీపద్యములయర్థమునకు నిప్పటివారు చెన్నపురిసముద్రతీరంబున సనాదుల సాయాహ్నముల విహరించునిషమునకుఁ దారతమ్య మున్నఁ జూడుఁడు. అయోధ్యకు సమీపమున సముద్రము లేమి నుద్యానములు వర్ణింపఁబడినవి.

సుందరకాండమున సీతాదేవి విలపించుటయందు

శ్లో. నూనం మమాంగా న్యచిరా దనార్యః
శస్త్రై శ్శితై శ్ఛేత్స్యతి రాక్షసేన్ద్రః
తస్మిన్ననాగచ్ఛతి లోకనాథే
గర్భస్థజంతో రివ శల్యకృంతః. ౨౮ స.

మాలిని. దుర్భరతేజుఁడు రాముఁడు నన్నిటఁ • దూర్ణము చూడఁగ రానియెడన్
నిర్భరకోపముతో గడు వేగిన • నిష్ఠురశాతకృపాణములన్
గర్భమునన్ మరణించినజంతువు • కండల శస్త్రచికిత్సకుఁడున్
నిర్భరముగ్ ఘటియించు గతిన్ రజనీచరుఁ డొడక ద్రోయు ననున్.

దీనిచే నార్యులు శస్త్రచికిత్సయం దెంతయభివృద్ధిఁ జెందియుండిరో తెలియును.

వానరులు సేతువు కట్టునపుడు,

శ్లో. పర్వతాంశ్చ సముత్పాట్య, యంత్రైః పరివహన్తి చ
[illegible]మాత్రం రచత్రై, స్సహస్రా జలము[illegible] [illegible] యు. ౨౨.

ఈ అందుఁ గపులు గొండ • లావుమీఱఁగ
కొండసగముగాఁ బెఱికి • దండియంత్రంబులను
నునిచి తెచ్చి రప్పు • డుదధికడకు.

పంచచామరము. గుభుల్ గుభుల్ గుభుల్లనంగఁ • గొండలెల్ల వంచఁగా
నభోంతరం బదంగ నైనఁ • దల్లడిల్లి సత్త్వముల్
గిఫుల్లనంగ గుండెలల్ దిగాల్పడంగ, బిందువుల్
నభంబునం జివాలునన్ ఘనంబుగన్ నటింపఁగన్.

ఇది చదివినఁ జెన్నపురియందలి నావాశ్రయము (Harbour) కట్టుటకై గోడ బండలు తెచ్చుచుండినయంత్రములు జ్ఞప్తికి రాక తప్పవు.

శ్లో. అగాధా గ్రాహవత్యశ్చ, పరిఖా మీనసేవితాః
ద్వారేషు తాసాం చత్వారః, స్సంక్రమాః పరమాయతాః
యంత్రై రుపేతా బహుభి, ర్మహద్భి ర్గృహపంక్తిభిః
త్రాయంతే సంక్రమాస్తత్ర, పరసైన్యాగమే సతి
యంత్రై స్తై రవకీర్యన్తే, పరిఖాసు సమంతతః
ద్వా[illegible] [illegible]పులా స్సర్వా, శ్చత్వారి సుమహాంతి చ
త [illegible], [illegible]సంతి మహాంతి చ

తత్రేషూపలయంత్రాణి, బలవంతి మహాంతిచ
ఆగతం పరసైన్యంతు, తత్ర తైః ప్రతిహన్యతే
ద్వారేషు సంస్కృతా భీమాః, కాలాయసమయాః శితాః
శతశో రచితా వీరైః, శతఘ్న్యో రక్షసాంగణైః
సౌవర్ణశ్చ మహాంస్తస్యాః, ప్రాకారో దుష్ప్రధర్షణః
మణివిద్రుమవైడూర్య, ముక్తావిరచితాంతరః
సర్వతశ్చ మహాభీమాః, శీతతోయవహాః శుభాః యుద్ధ - 3 స.

సంక్రమము లనఁగా నిష్టము వచ్చినపుడు త్రాల్చుటకు లేవ నెత్తుట కను కూలముగ నుండునట్టు లగడ్తలపై నిర్మింపఁబడినదారుసేతువులు (పలకల వంతెనలు.)

ఉ. అంపలి యశ్మయంత్రముల ♦ నాగతశాత్రవసైన్య మంద వే
త్రుందు, శతఘ్నికల్ తటము ♦ రాక్షససంఘవినిర్మితంబు లై
క్రందుగ ద్వారదేశములఁ ♦ గ్రాలుచు నుండు, సువర్ణసన్మణీ
బృందవిదూరజాంతరిత♦భీమసువప్రము దుష్ప్రధర్షమూ. యు-32.

సీ. ఆపురిచుట్టు మ♦హాభీమములు గ్రాహ,వంతముల్ శీతల♦వారి మిగులఁ
గమ్రంబు లగుచు న♦గాధంబు లగుచు న,గ్ర్ఘలాప్వను మీన♦కాంచయుక్తి
ద్వారంబులందు యం♦త్రాహ్వయంబులు చాల,యిరుప్రలోవంతెనల్ ♦ వెలయు నాలు
గచ్చోటఁ గలవు మ♦హాగృహాంక్తులా,పలకలవంతెనల్ పరుల సేన

తే. వచ్చునప్పుడు రక్షించుచుఁ ♦ బ్రస్తుతంబు, వాని యంత్రాళిబలముచేఁ♦బరిఖలోన
విడుచుచుందురు; &c. &c. 3౮.

లంకయందలి దుర్గములగుఱించి హనుమంతుఁడు రామునితోఁ జెప్పినసందర్భమున నీపద్యము లున్నవి. ఇప్పటి హూణులకోటలపిధానముఁ బరికించినవారి కివి స్పష్టముగ నర్థ మగును.

స్త్రీలు విద్యావతులుగ నున్నట్లు రామాయణము సూచించు చున్నది. విద్య యనఁగ నిప్పటివారు స్వీయమతాచారవిషయముల నలవరించుకొనక గృహిణికి నలయు తెలివి నుజ్జగించి బుజ్జగించు పరకీయవిద్య గాదు. తాను దనభర్త యిహమునఁ బరమున సుఖముగ నుండుటకు సాధన మగువిద్య స్త్రీలకు ననవద్య.

సీతాదేవికి సంస్కృతము చక్కఁగ భాషింప వచ్చియుండె నని యామెహనుమంతునితో సంస్కృతమునఁ బ్రసంగించుటచేఁ దెలియ నగు. ఇంతియ కాక యామెకు నేక శాస్త్రములఁ గొంతశిక్షయుండుటయే కాక యాయుధములపట్లువిడుపులు

కూడఁ దెలిసియుండె నని తెలియవచ్చు చున్నది. వాలిభార్య తారకు నాత్వాతిక శాస్త్రము చక్కఁగఁ దెలిసి యుండెను. కైక రణమున సారథ్య మొనర్చెఁ గదా.

అంతఃపురస్త్రీలు వెలికి రాఁగూడ దని నియమ ముండినట్లు ఉత్తరరామాయణ మున (౮౧౧-ప.)

కం.అట్టిజగత్ప్రాణుఁడు నేఁ, డిట్టులు మము నంతిపురపుఁటింతులవలె ని
ట్టట్టు చరింపక యుండఁగఁ, బెట్టం బెనుశాధ లెట్లుఁ వేఁగుదు మధిపా.

అనువాక్యముచేఁ దెలియ నయ్యెడిఁ గాని యిది యుక్తకాలములం దనియే యుద్ధకాండమున (౧౧౭వ-స,) రామవాక్యముచేఁ దెలియ నగు.

శ్లో. నగృహాణి నవస్త్రాణి, నప్రాకారాస్త్రిరస్క్రియాః
నేదృశా రాజసత్కారా, వృత్త మావరణం స్త్రియాః
వ్యసనేషు నకృచ్ఛ్రేషు, నయుద్ధేషు స్వయంవరే
నక్రతౌ నవివాహేచ, దర్శనం దుష్యతి స్త్రియాః
సైషా యుద్ధగతాచైవ, కృచ్ఛ్రేచ మహతిస్థితా
దర్శనేస్యా నదోషస్స్యా, న్మత్సమీపే విశేషతః.

కం. చేలములు ప్రహరు లాలయు, జాలంబులు నిట్టిరాజసత్కృతులు తెఱల్
చాలవు చెలువలఁ గావఁగ, స్త్రీలకు సంరక్షకంబు శీలంబె చుమీ. ౨౬౪౦
కం.సమరంబుల వ్యసనములన్, సమరముల స్వయంవరంబునన్ బెండ్లియెడన్
సుమతీ, యజ్ఞములందుం, గమలాక్షులదర్శనం బకార్యం బగునే? ౨౬౪౧
కం.ఈసీత రణతలస్థిత,మాసరదుఃఖమునుఁ బొంది మిక్కిలి నందున్
నాసవిధంబున నుండఁగ, దోసం బెయ్యదియు లేదు దోఁచిన బయలన్. ౨౬౪౨
ఇవి సీతాదేవి నుద్దేశించి రాముఁడు విభీషణుతోఁ జెప్పినవాక్యములు.

ఇప్పటివా రిప్పుడు ప్రయత్నించు చుండు నాకాశయానములు పూర్వమే యున్నట్లు పుష్పకకథవలనఁ దెలియనగు. ఇట్టివిపూర్వము మనపెద్దలకునుండెనా యని బ్రాహ్మణునియింటియూపుదూపలఁబోలినవారు సందేహింతురు గాక.

రావణునియంతఃపురంబున హనుమంతుఁడు

శ్లో. నియుజ్యమానాస్తు గజా స్సుహస్తా, స్సకేసరా శ్చోత్పలపత్రహస్తాః
బభూవ దేవీచ కృతా సుహస్తా, లక్ష్మీ స్తథా పద్మినిపద్మహస్తా సుం-౯స.
కం.తనయంతిఁ గరులు నునుఁదొం,డములన్ నెఱవిరియుకలువ... గొలనిన్
రముఁ గొని యభిషేకింపఁగఁ, గమలాంచితహస్తయైన కమలా ...న్.
ఇట్టివిచిత్రములఁ గనఁగొనెను దీనివలన శిల్ప మింతశ్రేష్ఠమై యుండెనో యూహింపఁగనగు.

## ప్రక్షిప్తములు.

ఈకలివా రసికులు రామాయణమునఁ దమయిష్టానుసారము చిత్రకథలు వ్రాసి విడి విడి శ్లోకములే గాక సర్గములు సర్గములే చేర్చియున్నారు. వీ రీప్రకారము చేయుటకు రామునందలిభక్తియే కారణ మైనను కథలుమాత్రము వాల్మీకియాశయమునకు విరుద్ధము లై యున్నవి. కావున సత్యమునకును దూరము లే యనిచెప్పవలసియున్నది. ఇట్టిప్రక్షిప్తపాఠములను బ్రమాణములుగఁ గైకొని కొందఱు లేనిపోని సందేహములకుఁ బాలగుచున్నారు. అయినను వాల్మీకి ౨౪,౦౦౦ వేలుగ శ్లోకసంఖ్య నియమించి యుండుటయు వ్యాఖ్యాత లక్షరము లెంచి యా౨౪,౦౦౦ వేలను నిర్ధారించి యుండుటయు నెంతో మేలైనది. సులోచనావృత్తాంతము, కాలనేమి కథ, పాతాళహోమములోనగునవి యన్నియుఁ బ్రక్షిప్తములే ఈప్రక్షిప్తములకు ౧,౨ దృష్టాంతములు చూపెదను.

## కాలనేమికథ.

హనుమంతుఁడు లక్ష్మణునినిమిత్తమై సంజీవనిఁ దేఁ బోవునపు డీతనికథ విశేషము చెప్పఁబడి యున్నది. లక్ష్మణమూర్ఛ పగటిపూఁటచర్యగాని రాత్రిచర్యగాదు. ఏలన, మూలబలయుద్ధము సూర్యోదయకాలంబున జరగినట్లు "ససంగ్రామో మహాన్ భీమ స్సూర్యస్యోదయనం ప్రతి" యని యుద్ధకాండము ౯౪-వ సర్గమునను్నది. ఆసర్గమునందే "దివసస్యాష్టమేభాగే శరై రగ్నిశిఖోపమైః । హతా న్యేకేన రామేణ రక్షసాం కామరూపిణాం" అని దినమున నెనిమిదవభాగమున ననఁగా ౧½ గంట కాలములో (దివసస్యాష్టమేభాగే = పాదోనఘటికాచతుష్టయే, పాదఘటికోనము హూర్తద్వయే యని వ్యాఖ్యాతలు) రాముఁడొక్కఁడే మూలబలమునంతయు నాశముఁ జేసె నని చెప్పఁబడినది. కావున నెక్కువపక్షమున నుదయము ౮ గంటలప్పటికి మూలబలము హతమైనవార్తకూడ రావణునికిఁ దెలిసియుండవలయును. అంతసేన నాశనముకాఁగా రాక్షసస్త్రీలందఱు రావణుని గట్టిగఁ దిట్టి యేడుచుచుండఁగా నామాటలు విని రావణుఁడు

శ్లో. ఆర్తానాం రాక్షసీనాంతు, లంకాయాం వై కులే కులే
రావణః కరుణం శబ్దం, శుశ్రావ పరిదేవితమ్.
సతు దీర్ఘం వినిశ్వస్య, ముహూర్తం ధ్యానమాస్థితః
బభూవ పరమక్రుద్ధో, రావణో భీమదర్శనః. యుద్ధ. ౯౫ స.

స్వల్పకాలములోనే యుద్ధమునకు బయలు వెడలెను. అనఁగా యుద్ధమునకు రావణుఁడు ౯ గంటలకు బయలువెడలి యుండవలయును ... టియుద్ధము దీర్ఘ

కాలము జరుగలేదు. కావున రావణుఁడు పగటిపూఁటనే లక్ష్మణు మూర్ఛ నొందించి యుండవలెను. ఏలన మూర్ఛ తేఱినలక్ష్మణుఁడు శ్రీరామునిం జూచి

శ్లో. "అహంతు వధ మిచ్ఛామి, శీఘ్ర మస్య దురాత్మనః
యావదస్తం న యాత్యేష, కృతకర్మా దివాకరః." ౧౦౨ స.

ఈసూర్యుఁ డస్తమించులోపల రావణుఁ జంపు మని చెప్పెను. కావున లక్ష్మణ మూర్ఛ రాత్రిపూఁట ననుట యసంగతభాషణము.

ఇట్లు కథలే కాక నడుమనడుమ మూలచ్ఛేదముఁ జేయుప్రక్షిప్తశ్లోకములు గలవు. రామలక్ష్మణులు నాగపాశబద్ధులై యున్నపుడు నారదుఁడు వచ్చి శ్రీరాము నుతించి నీవే యాదివిష్ణువ వని చెప్పిన ట్లున్నది. ఇట్టులే సేతుబంధనకాలమున సముద్రుఁడు నీవే విష్ణువ వని పొగడి నట్లున్నది. ఇట్టివన్నియు ప్రక్షిప్తము లే. "ఆత్మానం మానుషంమన్యే రామందశరథాత్మజ" మ్మనువాక్యముగుఱించి యిదివఱకే కొంత సూచింపఁబడినది ఆతత్త్వార్థమును గన వెడల శోధించువారికి మాయామానుష నటనమునకు విరుద్ధముగ నీవే విష్ణుఁడ వని రావణవధమునకుఁ బూర్వము చెప్పి మనుష్యభావమునకు హాని గలిగించుట కవ్యాశయమునకు విరుద్ధ మని తోఁపక మానదు. గరుత్మంతుఁడు రామునితోఁ జెప్పినవాక్యము లెట్లున్నవో చూడుఁడు.

కం. అనవుడు నానందాశ్రులు, కనుఁగొనలఁ బొంగడింప ♦ ఖగపతి యను మీ
కనుఁగునసఖుండనుగరుడుఁడఁ, బ్రణుతియశా! నీబహిశ్చ♦రప్రాణంబన్. యు ౧౦౪౩.

ఉ. నేను సఖుండ నె ట్లయితి ♦ నీ కని చూచెద వవ్విచారముఁ
మానుము, తద్విధం బని సమస్తము నొంద నెఱుంగ వచ్చు, నా
కానతి యిచ్చెదే చనఁగ . . . . . ౧౦౪౭

రావణవధ మగునదాఁక రామునితో నెవ్వరు ప్రత్యక్షంబుగ నీవుభగవంతుఁడ వని చెప్పలేదు. కావున నట్టి వన్నియుఁ బ్రక్షిప్తములే.

ఆర్యులారా! దిక్ప్రదర్శనముగ వ్రాయఁబడిన యీపీఠిక నే నుద్దేశించినంత కన్న గొప్పదయ్యె ననేకవిషయములు చర్చింపక విడిచియు మిగులసంక్షేపముగ నుండుటచే నాకే సంతుష్టి నొసఁగ లేదన గంధమాదికృత రామాయణార్థపులగు మీ మాటఁ జెప్ప నేల? గ్రంథమా గొప్పది. కవియా బ్రహ్మర్షి. మర్మములా మెండు. భాషయా సంస్కృతము. చదువుకొలఁది విశేషములు దోఁచు చుండును. ఇఁక నేనా కించిజ్ఞుఁడను. చంచలచిత్తుఁడను. శక్తిహీనుఁడను. కావున దోషములా దండిగ నుండును. దానికి నవరణపట్టికయే సాక్ష్యము. మీరందఱు కేవలదయచే దీనిని గైకొని నన్ను ధన్యుఁ జేయ వలయును.

గుణవతీమతల్లులగు తల్లులారా! శ్రీరామాయణమును సాధుజనసముపాదేయంబగు పరమపదపాథేయంబుగ గ్రహింపుఁడు. రామాయణశ్రోత్రజ్ఞులగు సోదరులారా! దీననెందేని యేదేనిగుణంబుండిన లోకంబునకుం [illegible] భగవద్ధ్యానైకసక్తులగుభక్తులారా! మీభృత్యునిచే భగవంతుఁ [illegible] పదింపఁజేసిన ప్రసాదంబుగ నీకృతి భావింపుఁడు. సరళసరసవచోవిభవులగుకవులారా! దీని మీసొంతకావ్యంబుగ సంభావింపుఁడు. విజ్ఞానువులగు తత్త్వజిజ్ఞాసువులారా! యమందేహులరై న్యాయ్యసందేహసుందరంబున రామాయణకలశార్ణవంబు మథింపుఁడు. మీశ్రమంబు వ్యర్థంబు కానేరదు. అమృతంబు సిద్ధించు. సౌజన్యధన్యులగుకన్యలారా! గుణాలవాలురగు బాలురారా! మీరు సంసారార్ణవంబు నీమహానావసాహాయ్యంబున నిర్భయంబుగఁ దరింపుఁడు. ఆర్యులసంతతివార మనుకీర్తి లోకంబున నిలుపుఁడు. ఉభయలోకసుఖంబు లనుభవింపుఁడు. అందఱు నాదోషంబుల క్షమింపుఁడు.

మ. “హరినామస్తుతి సేయుకావ్యము సువర్ణాంభోజహంసావళీ
సురుచిభ్రాజిత మైనమానసరసస్స్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ
హరినామస్తుతి లేనికావ్యము విచిత్రార్థాన్వితం బయ్యు శ్రీ
కరమై యుండ దయోగ్యదుర్గలినవత్కాకోలగర్తాకృతిన్.

మ. అపశబ్దంబులఁ గూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వపా
పపరిత్యాగము సేయుఁ గావున హరిన్ భావించుచుం బాడుచున్
జపముల్ సేయుచు వీనులన్ వినుచు నశ్రాంతంబుఁ గీర్తించుచున్
దపసుల్ సాధులు ధన్యులౌదురు గదా తత్త్వజ్ఞ చింతింపుమా.” భాగ.

అని యుండుటఁ జేసి

కం. తప్పైనను నొప్పైనను, దెప్పుచునో మెచ్చుకొనుచొ దివిన్ శ్రద్ధన్
దప్పక సకలముఁ జదివెదు, నప్పుణ్యాత్ములకు నొనర్తు సాష్టాంగనతుల్.

ఇట్లు విన్నవించు,
సుజనవిధేయుఁడు,
వావిలికొలను సుబ్బారావు.

కీలకసంవత్సర మాఘ శు ౧౧,
తిరువళిక్కేణి.

శ్రీరామచంద్రాయ నమః

# రెండవకూర్పు పీఠిక.

—— ——

శ్రీపిఠాపుర సంస్థానాధిపతులగు మహారాజరాజశ్రీ శ్రీరాజారావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దర్ వారి యౌదార్యాతిశయమువలన నీ గ్రంథము తొలుత ముద్రితమై ౧౯౦౯-వ సంవత్సరము జూలైనెలలోఁ బ్రకటితమై లోకమున వెలువడి ౧౯౧౨-వ సంవత్సరాంతములోపల గ్రంథము లన్నియు విక్రయింపఁ బడియెను. జీవత్కవి వ్రాసిన యింతగొప్పగ్రంథ మింతయల్పకాలములో మనదేశములో నిట్లు లోకమున వ్యాపించినది మఱొండు లేదని కొందఱు పుస్తకవిక్రేతలు చెప్పియున్నారు. అంతియగాక యీ గ్రంథమును జదివినవారిలో నించుమించుగ నందఱును శ్రీపీఠికాపుర ప్రభువువారిని గ్రంథకర్తగారిని వినుతించుచు ఒంటిమెట్టలో నీగ్రంథమును శ్రీకోదండరామస్వాములవారికి సంకిత మిచ్చినకాలమునఁ బండితు లీ గ్రంథకర్తగారికిచ్చిన బిరుదము నామోదించి స్థాపించుచు వ్రాసినవారే. అట్టియుత్తరములు నూర్లకొలఁది నాయొద్దనున్నవి. పదార్థము రుచితెలిసినపిమ్మట దానిని వర్ణించుట యనావశ్యకముగనుకను బ్రభువువారును గ్రంథకర్తగారును స్తుతివిముఖులు గనుకను వానిని బ్రకటింప సాహసింపనైతిని. వీథులయం దిదివఱకు రాత్రులయందుఁ బఠింపఁబడుచున్న కొన్నిగ్రంథములకు మాఱుగ నీగ్రంథము నెందఱో వీథిపురాణముగఁ జెప్పించుచుటేకాక యనుదినము పారాయణ గ్రంథముగఁగూడ దీని నుపయోగించుచున్నారు * ఉత్తమస్త్రీలును దీనినిభక్తితోఁ బఠించి విశేషముగ నామోదించుచున్నారు. ఇట్లీగ్రంథము సర్వజన శ్లాఘ్యమగుటకు నిది సంపూర్ణమై యథార్థమైన శ్రీరామచరిత్ర యగుటయే కారణము. ఇది సర్వజనోపయోగముగ నుండవలయునని తలంచిన కవిగారి యుద్దేశము నెఱవేఱెనని నిస్సందేహముగఁ జెప్పఁగలను. కృష్ణదేవరాయ లాంధ్రకవితాపితామహులు గృతిచెప్పుమన్నప్పుడు

---

* "అయా దేశమువారికి, నాయా దేశంబు భాష నమరిన కావ్యం

బాయతి పురుషార్థంబుల్, బాయక సమకూర్చు దేవభాషయుపోలెన్."

చం. "నిరుపహతిస్థలంబు, రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె, మాత్మకింపయిన భోజన, మొయ్యెలమంచ, మొప్పు త
ప్పరయు రసజ్ఞు, లూహ తెలియంగల లేఖకపాఠకోత్తముల్,
దొరకినఁగాక యూరక కృతుల్ రచియింపు మటన్న శక్యమే"

యనిచెప్పినట్టు ప్రతీతిగలదు. అల్లసానిపెద్దన్నగారు కోరిన సౌఖ్యములలో సౌకర్యములలో నొకటియైన నీకవిగారికి లేదని సదా యాయనతోడనుండి చూచిన నాయట్టివారందఱు తెలుంగుదురు. ఈకారణముచే నిందు స్ఖాలిత్యము లెందేని గలవు. ఈ కూర్పునందు సాధ్యమైనంత జాగ్రత్తతో నట్టివానినెల్లఁ దొలఁగించి మూలమునందలి సారవంతములైన పదములు శ్లోకములు ప్రమాదమున విడిచిపోయియుండిన వానిని నిందు గ్రంథకర్తగారు చేర్చియున్నారు. ఆకారణముచే నిది మొదటి కూర్పునకంటె నెక్కువ సమాదరణీయమగు ననుటకు సందేహము లేదు. అటులని మొదటి కూర్పు నిష్ప్రయోజన మగునన్ని సవరణలను జేసియుండలేదు. అటుచేయఁ గారణమును లేదు.

ఈరామాయణము మూలమువలెనే వారివారిశక్తికిఁ దగినట్టు బోధపడుచున్నది. కాని సర్వసామాన్యముగ నందఱకు సరహస్యముగ బోధపడుటలేదు. ఇది శబ్దకాఠిన్య దూరాన్వయాదులచే నైనదికాదు. శ్రీమద్రామాయణము క్షీరరత్నాకరము. ఒడ్డునఁగూర్చుండి యాచమించువానికి నోరుతీపుకాఁగలదు. కొంచెము లోఁతు పోయి దోసిలికొలఁది త్రావువానికి దేహమునకుఁ బుష్టి యాత్మకుఁ దుష్టి కలుగఁగలదు. మునిఁగినవానికి మణియనర్ఘము పై నోకిలింతకలుగు. లోఁతు శోధించినవానికి చింతామణివంటి రత్నములు దొరకును. చక్కనిశ్రద్ధాభక్తుల మథించిన విబుధులకు సమ్మృతము లభించుట యేమివింత?

ఈ కారణముచే ననేకులు విద్వాంసులు రామాయణ మర్మజ్ఞులు శ్రీరామాయణమును తెలిఁగించుటయందు మీ రెంతయో గ్రంథశోధనము చేసియుండ వలయును గదా. మీకుఁ దెలిసినన్నివిషయములు మీయంత పాటుపడనియితరులకుఁ దెలియ సాధ్యముకాదు. పెట్టినవారికిఁ దెలియును నిక్షేప మనికలదు గదా. సంస్కృతమున వ్యాఖ్యానములుకలవుగాని కేవలాంధ్రులకుఁ బామరులకు స్త్రీలకు నవి దురవగాహములు. కావున శ్రీరామాయణమును లోకులకెల్ల సొంతసొత్తు చేసినట్లు దాని

వ్యాఖ్యానమును జేసినలోకమునకు మిక్కిలి యుపకారమొనర్చినవా రగుదురు" అని కవిగారికి వ్రాసియున్నారు. అట్లువ్రాసిన యుదారాశయులకును అట్టిభావము గల యితరులకును ఆప్రయత్నములు జరుగుచున్నవనియుఁ గిష్కింధాకాండము పూర్ణము కావచ్చినదనియు గ్రంథము పూర్తికాఁగానే ప్రకటింపఁ బ్రయత్నములు చేయఁబడు ననియు విన్నవించుకొనుచున్నాఁడను. అయినను ఇది చాలవ్యయ ప్రయాసములతోఁ జేయవలసిన కార్యమైయున్నది. భగవంతుఁడెట్లు నిర్వహించునో చూడవలసియున్నది.

"అనన్యాశ్చింతయంతో మాం, యేజనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం, యోగక్షేమం వహామ్యహమ్"

అనుభగవద్వాక్యమే శరణము.

ఈగ్రంథమును లోకమున వ్యాపింపఁజేయు నేవిధముగ నైనను దోడ్పడిన వారి కెల్లరకుఁ బౌనఃపున్యముగ నమస్కారము లర్పించుచున్నాఁడను.—పునర్ముద్రణ మొకటిన్నర సంవత్సరముక్రిందఁ బ్రారంభించియు ముద్రాక్షరశాలవారి జాడ్యమున నింతజాగు తుదకు మఱొక జ్యోతిష్మతీ ముద్రాక్షరశాలవారి తోడ్పాటుచే నిప్పటికి వెలువడినది. కావున గ్రంథములకై వ్రాసినవారందఱు ననివార్యమైన యీ యాలస్యమును క్షమింతురుగాక.

శ్రీపతిపల్లి - వేంకటపద్మనాభశాస్త్రి.

---

శ్రీః

# శ్రీ గాయత్రీ రామాయణము.

శ్లో. తపస్స్వాధ్యాయ నిరతం, తపస్వీ వాగ్విదాంవరమ్
నారదం పరిపప్రచ్ఛ, వాల్మీకి ర్మునిపుంగవమ్.

కం. తపమున స్వాధ్యాయంబున, నిపుణుని వాగ్విద్వరేణ్యు ♦ నిఖిలమునిజనా
ధిపు నారదు సంప్రశ్నము, తపస్వివాల్మీకి యిట్టు ♦ తమిఁ గావించెన్.

శ్లో. స హత్వా రాక్షసాన్ సర్వాన్, యజ్ఞఘ్నాన్ రఘునందనః
ఋషిభిః పూజితస్సమ్య, గ్యథేంద్రో విజయీ పురా.

తే. సవనమును బన్న మొనరింపఁ ♦ దవులు సర్వ
రాక్షసానీక మీఁగతి ♦ క్రుంగఁ జేసి
మున్ను కదనంబునను గెల్పు ♦ గొన్నయింద్రు
నోజ రాముఁడు ఋషులచేఁ ♦ బూజఁ గొనియె.

శ్లో. విశ్వామిత్ర స్సధర్మాత్మా, శ్రుత్వా జనకభాషితమ్
వత్స రామ ధనుః పశ్య, ఇతి రాఘవ మబ్రవీత్.

కం. విని జనకునివాక్యము లా,మునివర్యుం డతిశయించు ♦ మోదంబున రా
మునిఁ జూచి వత్స! రాఘవ!, కనుమీ కోదండ మనినఁ ♦ గాకుత్స్థుండున్.

శ్లో. తుష్టావాస్య తదావంశం, ప్రవిశ్య స విశాంపతేః
శయనీయం నరేంద్రస్య, తదాసాద్య వ్యతిష్ఠత.

కం. తుల గాననిసౌధ మన, ర్గళగతిఁ జొరఁబాఱి సొగడి ♦ రాజాస్వయముల్
లలితగతి నృపునిశయ్యా,తలముఁ గదిసి తెలి యొకండె ♦ తన కడ్డముగన్.

శ్లో. వనవాసంహి సంఖ్యాయ, వాసాం స్యాభరణానిచ
భర్తార మనుగచ్ఛంత్యై, సీతాయై శ్వశురో దదౌ.

కం. వనవాసార్థము పతితో, ననుగమనముసేయుసతికి ♦ ననసీసుతకున్
జనపతి మామ యొసంగెను, ననుపమభూషణములును మ♦హాధనచయముల్.

శ్లో. రాజా సత్యంచ ధర్మశ్చ, రాజా కులవతాం కులమ్
రాజా మాతా పితా చైవ, రాజా హితకరో నృణామ్.

కం. రాజే సత్యము ధర్మము, రాజే సత్కులజులకును ♦ బ్రథితకులంబుల్
రాజే తల్లియుఁ దండ్రియు, రాజే హితపథ్యకరుఁడు ♦ ప్రజలకు నెల్లన్.

శ్లో. నిరీక్ష్య స ముహూర్తంతు, దదర్శ భరతో గురుమ్
ఉటజే రామ మాసీనం, జటామండలధారిణమ్.

కం. నింపుతమిఁ గొంతవడి భరతుం డారఁగఁగాంచి తెలిసెఁ ♦ దోరంపుజటా
మండలితో నుటజాసీనుం డగుశ్రీరాము సన్న♦నుల్ ధీరగుణున్.

శ్లో. యది బుద్ధిఃకృతా ద్రష్టు, మగస్త్యం తం మహామునిమ్
అద్యైవ గమనే బుద్ధిం, రోచయస్వ మహాయశః.

కం. యతిహిత యగస్త్యునిం గన, మతి గల్గినయేని యిపుడ ♦ మంచిది చనఁగా
జతనం బానరింపు మనల్, క్షితిపతితనయుండు మాని♦సెలవుం గొనుచున్.

శ్లో. భరత స్యార్యపుత్రస్య, శ్వశ్రూణాం మమచ ప్రభో
మృగరూప మిదం వ్యక్తం, విస్మయం జనయిష్యతి.

కం. భ[illegible]కును మీకును నా,కరయుము నాయత్తలకును ♦ వ్యక్తంబుగ నీ
హరిణము విస్మయజనకము, పురుషోత్తమ! దీనిభంగి ♦ బుద్ధిం గనుమీ.

శ్లో. గచ్ఛ శీఘ్ర మితో రామ, సుగ్రీవం తం మహాబలమ్
వయస్యం తం కురుక్షిప్ర, మితో గత్వాద్య రాఘవ.

కం. గమనింపు మచటి కిప్పుడ, యమలమతీ! యిచటనుండి ♦ యతిజవమున స్నే
హము సుగ్రీవునితోఁ జే,యుము వాఁడు మహాబలుం డ♦నుత్తమగుణుఁడుల్.

శ్లో. దేశకాలౌ ప్రతీక్షస్వ, క్షమమాణః ప్రియాప్రియే
సుఖదుఃఖసహః కాలే, సుగ్రీవవశగో భవ.

కం. దేశకాలంబు లెఱిఁగి వ♦ర్తింపు మింక
క్షమ వహించి ప్రియాప్రియ♦సంగతులను
సౌఖ్యదుఃఖంబు లోర్చి త♦త్సమయములను
వలనుమీఱఁగ సుగ్రీవు ♦ వశుఁడ వగుము.

శ్లో. వంద్యాస్తేతు తప స్సిద్ధా, స్తపసా వీతకల్మషాః
ప్రష్టవ్యాస్తేపి సీతాయాః, ప్రవృత్తిం వినయా న్వి[illegible]ః.

తే. వం[illegible]సీయులు వా[illegible]లు ♦ [illegible]పము
[illegible] గతకల్మషా[illegible] ♦ పి[illegible] మిం[illegible]

మిగులవినయంబుతోడుత ♦ మిథిలకన్య
వార్త వారల నడుగుఁడు ♦ ప్లవగులార!

శ్లో. స నిర్జిత్య పురీంశ్రేష్ఠాం, లంకాం తాం కామరూపిణీం
విక్రమేణ మహాతేజా, హనూమాన్ మారుతాత్మజః.

తే. సత్యవిక్రముఁ డైన కే♦సరిసుతుండు
కామరూపిణి లంకను ♦ గడిమి గెలిచి
తడయ కాపట్టణంబు న♦ద్వారమునను
జొచ్చెఁ బ్రాకారమును దాఁటి ♦ శూరవరుఁడు.

శ్లో. ధన్యా దేవా స్సగంధర్వా, స్సిద్ధాశ్చ పరమర్షయః
మమ పశ్యంతి యే నాథం, రామం రాజీవలోచనమ్.

కం. ధన్యులు రఘుకులనృపమూ,ర్ధన్యుని నాహృదయనాథు ♦ రాముని నతరా
జన్యుని రాజీవాక్షుని, మాన్యునిఁ గను దేవ సిద్ధ♦మౌనిప్రవరుల్.

శ్లో. మంగళాభిముఖీ తస్య, సా తదాసీన్మహాకపేః
ఉపతస్థే విశాలాక్షీ, ప్రయతా హవ్యవాహనమ్.

తే. మంగళాత్మిక సతి యాత్మ♦సురణతుల్య
మైనవాక్కులు విని విక♦చాంబుజాక్షి
శోకసంతప్త యయి కపి♦శుభముఁ గోరి
హుతవహునిఁ గూర్చి యిట్లని ♦ నుతి యొనర్చె.

శ్లో. హితం మహార్థం మృదుహేతుసంహితం,
వ్యతీతకాలాయతిసంప్రతిక్షమమ్
నిశమ్య తద్వాక్య ముపస్థితజ్వరః,
ప్రసంగవా నుత్తర మేత దబ్రవీత్.

చం. హితము మహార్థమున్ మృదువు ♦ హేతుయుతంబు వ్యతీతకాలసం
ప్రతిశుభదంబు సౌఖ్యదము ♦ భావిని నాతనతమ్ము వాక్యమున్
శ్రుతిఁ జొర సొచ్చి రావణుఁడు ♦ క్రోధముఁ దాలిచి మిన్నకృత్యముం
పతిశయ మైనపట్టుదల ♦ నాతనితోడ వచించె నివ్విధిన్.

శ్లో. ధర్మాత్మా రక్షసాంశ్రేష్ఠః, సంప్రాప్తోయం విభీషణః
లంకైశ్వర్యం ధ్రువం శ్రీమా,నయం ప్రాప్నోత్యకంటకమ్.

తే. ధర్మచిత్తుండు రాక్షస♦తతిగరిష్ఠుఁ
డగువిభీషణుఁ డిట నన్ను ♦ నాశ్రయించె
నితఁడు శ్రీమంతుఁ డొందె లం♦కేశ్వరత్వ
మసుర! నిష్కంటకముగ ని♦త్యంబు గాఁగ.

శ్లో. యోవజ్రపాతాశనిసన్నిపాతా, న్నచక్షుభే నాపిచచాలరాజా
సరామబాణాభిహతోభృశార్త, శ్చచాలచాపంచముమోచవీరః.

తే. యోధుఁ డవ్వాఁ డశనికులి♦శోగ్రహతుల
కించుకేనియుఁ గలఁగఁడు ♦ సంచలింపఁ
డట్టివీరుఁడు రామబా♦ణార్తి మిగుల
నడలి వడఁకుచు ధనువును ♦ విడిచెఁ బుడమి.

శ్లో. యస్యవిక్రమ మాసాద్య, రాక్షసా నిధనంగతాః
తం మన్యే రాఘవం వీరం, నారాయణ మనామయమ్.

తే. యోధవరులు నిశాటు లా♦యోధనమున
నెవనిశక్తిని యమపురి ♦ కేగి రట్టి
వీర రాము ననామయు ♦ విష్ణుమూర్తి
నాదినారాయణునిఁగ నే ♦ నాత్మఁ దలఁతు.

శ్లో. స తే దదృశిరే రామం, దహంత మరివాహినీమ్
మోహితాః పరమాస్త్రేణ, గాంధర్వేణ మహాత్మనా.

మ. నరచూడామణి రామభూవిభుఁడు గాం♦ధర్వంబునన్ మాడ్చుచోఁ
బరసేనాతతి మోహితాత్మ మయి ది♦గ్భ్రాంతిం గొనెన్; వే పర
స్పరముల్ రాముఁడుగాఁ దలంచుచును ద♦ర్పాస్పృశ్యముం దోఁపఁగా
బోరి నన్యోన్యముఁ గ్రుద్ధచిత్తు లగుచుం ♦ బోకార్చి రారాక్షసుల్.

శ్లో. ప్రణమ్య దేవతాభ్యశ్చ, బ్రాహ్మణేభ్యశ్చ మైథిలీ
బద్ధాంజలిపుటా చేద, మువాచాగ్నిసమీపతః.

కం. ప్రవిమలగుణజానకి హ,వ్యవహు సమీపించి మోడ్చి ♦ హస్తములు మదిన్
గ్వాణివద్విప్రుల మ్రొక్కుచుఁ, బవనసఖుం గూర్చి యిట్లు ♦ పలికెన్ భక్తిన్.

శ్లో. చలనా త్పర్వతేంద్రస్య, గణా దేవాశ్చ కంపితాః
చచాల పార్వతీ చాపి, త దాశ్లిష్టా మహేశ్వరమ్.

కం. చోద్యంబుగ నతఁ డగ్గిరి, మాద్యద్గతి నూఁపఁ బ్రమథ ♦ మండలి వణఁకెన్
బ్రోద్యత్కంపంబున దే, వాద్యుని గిరిరాజతనయ ♦ యాశ్లేషించెన్.

శ్లో. దారాః పుత్త్రాః పురం రాష్ట్రం, భోగాచ్ఛాదనభాజనమ్
సర్వ మే వావిభక్తం నో, భవిష్యతి హరీశ్వర.

కం. దారలు పుత్త్రులు పురమును, శ్రీరాష్ట్రము భోగములును ♦ జేలలు సకలా
హారంబులు నవిభక్తము, లారఁగ మనకిపురకు వ ♦ నాటేశ యగున్.

శ్లో. యామేవరాత్రిం శత్రుఘ్నః, పర్ణశాలాం సమావిశత్
తామేవరాత్రిం సీతాపి, ప్రసూతా దారకద్వయమ్.

కం. యామవతి దేనియందా, రామానుజుఁ డుండెఁ బర్ణ ♦ రమ్యగృహమునన్
భూమీతనుజాతయు నా, యామవతీ వేళ సుతుల ♦ నమడలఁ గాంచెన్.

శ్లో. ఇదం రామాయణం కృత్స్నం, గాయత్రీబీజసంయుతమ్
త్రిసంధ్యం యః పఠే న్నిత్యం, సర్వపాపైః ప్రముచ్యతే.

కం. గాయత్రీయుత మీరా, మాయణమున్ రేపు మాపు ♦ మధ్యాహ్నమునం
దాయతశ్రద్ధఁ బఠించినఁ, బాయును పాపములు రామ ♦ భద్రునికరుణన్.

శ్రీగాయత్రీరామాయణము సంపూర్ణము.

శ్రీరామచంద్రార్పణమస్తు

———oo✻oo———

శ్రీరామాయనమః.

# శ్రీ రామస్తుతి.

—•—

## బాలకాండము.

శ్రీమద్రవికులదీపక రామ
త్రితజనకల్పక సీతారామ
రాక్షసకులబలశిక్షక రామ
భక్తావనసువిచక్షణ రామ
మాయాతీతగుణాంచిత రామ
సత్త్వైకగుణాధిష్ఠిత రామ
యక్షేశ్వరహితపూజిత రామ
కరధృతధన్వవిరాజిత రామ
నరసురవరదత్తాభయ రామ
భాషాతీతగుణోజ్జ్వల రామ
ధృతమానవరూపాంచిత రామ
నతవిధిశక్రోమాధవ రామ
కౌసల్యావరనందన రామ
దశరథతోషణకారణ రామ
ఘోరాసురమోహాంతక రామ
కౌశికలబ్ధాఖిలశర రామ
విశ్వామిత్రసవావన రామ
మారీచస్యయవారక రామ
చైతన్యదపటుపదనఖ రామ
గౌతమహృదయానందన రామ
జనకతపఃఫలరూపక రామ
ఖండితభర్గశరాసన రామ
క్షోణీతనయాసంగత రామ
నిర్జితభార్గవకులమణి రామ
సాకేతపురీభూషణ రామ
సీతాహృత్పంజరశుక రామ
రామరామశ్రీరామా రామ
రామరామజయసీతా రామ.

----

## అయోధ్యాకాండము.

కైకయతనయావంచిత రామ
పిత్రాజ్ఞాపరిపాలన రామ
సీతాలక్ష్మణసేవిత రామ
పరమసుహృద్గుహపూజిత రామ
ధృతతాపసవేషాంచిత రామ
భారద్వాజసుదావహ రామ
చిత్రకూటతటనివసన రామ
కైకేయీతనయార్థిత రామ
కృతపైతృకజయరాఘవ రామ
భూమిధవీకృతపాదుక రామ
రామరామశ్రీరామా రామ
రామరామజయసీతా రామ.

## ఆరణ్యకాండము.

భీకరకాననవిహారణ రామ
క్రూరవిరాధవిదారణ రామ
దత్తాభయమునిజనగణ రామ
తారణకారణవర్ణన రామ
దివ్యమహామునిసన్నుత రామ
కుంభజదత్తమహాయుధ రామ
పుణ్యసుతీక్ష్ణాభ్యర్చిత రామ
పరిచితగృధ్రకులాధిప రామ
పంచవటీతటవర్తన రామ
హృతశూర్పణఖానాసిక రామ
హతఖరదూషణదానవ రామ
మాయాహరిణోద్వంచిత రామ
దారితమారీచాసుర రామ
దైత్యేశ్వరహృతభూసుత రామ
దారాన్వేషణతత్పర రామ
గృధ్రాధిపసంబోధిత రామ
గంధకబంధోన్మథన రామ
శబరీదత్తఫలాశన రామ
పంపాలోకనదుఃఖిత రామ
పవనాత్మజసంపూజిత రామ
రామరామ శ్రీరామా రామ
రామరామజయసీతా రామ

## కిష్కింధాకాండము.

రవిజనివేదితనిజకథ రామ
ప్రస్తావనిజాభూషణ రామ
లీలోత్క్షిప్తాసురతను రామ
ఖండితసప్తమహీరుహ రామ
ఏకాశుగనిహతేంద్రజ రామ
అభిషిక్తార్కతనూభవ రామ
గిరిదర్యంతరనివసన రామ
వానరసేనాపరివృత రామ
సీతాలోకనతత్పర రామ
ప్రేషితవానరనాయక రామ
మారుతసుతదత్తోర్మిక రామ
గృధ్రసుబోధితవానర రామ
రామరామ శ్రీరామా రామ
రామరామజయసీతా రామ.

## సుందరకాండము.

జలనిధిలంఘనపటుభట రామ
లంకాంతకసముపాసిత రామ
సీతానందకరార్చిత రామ
విశ్రావితనిజనామక రామ
దూషితరావణవిక్రమ రామ
భస్మీకృతలంకాపుర రామ
ప్రాప్తసతీచూడామణి రామ
జలనిధివేలావాసక రామ
రామరామ శ్రీరామా రామ
రామరామజయసీతా రామ.

## యుద్ధకాండము.

శరణాక్రాంతవిభీషణ రామ
శయనీకృతదర్భోత్కర రామ
జలనిధిగర్వనివారక రామ
వారిధిబంధనకౌశల రామ
విపులసువేలాచలగత రామ
అహిపాశోత్కరపీడిత రామ
ఖండితఫణిశరబంధన రామ
ఘటకర్ణాసురవిదళన రామ
నిర్హతేంద్రజిదాహ్వయ రామ
నాశితమూలబలోత్కర రామ
రావణకంఠవిలుంఠక రామ
అభిషిక్తాహితసోదర రామ
సీతాలోకనకౌతుక రామ
శుచిపరిశోధితభూమిజ రామ
బ్రహ్మేంద్రాదిసమీడిత రామ
దశరథదర్శనమోదిత రామ
మృతవానరసంజీవన రామ
పుష్పకయానారోహణ రామ
భారద్వాజార్చితపద రామ
పూరితభరతకుతూహల రామ
జనయిత్రీహర్షప్రద రామ
నరవానరదితిజావృత రామ
అభిషేకోత్సవహర్షిత రామ
కరుణాముద్రితవీక్షణ రామ
రామరామశ్రీరామా రామ
రామరామజయసీతా రామ.

---

## ఉత్తరకాండము.

సంజీవితవిప్రార్భక రామ
స్వర్గతశోకసుతుష్టాశక రామ
అపవాదభయైకార్దిత రామ
ఆజడమోక్షప్రదపటు రామ
ఏకశిలానగరాలయ రామ
సుబ్బరాయసంపూజిత రామ
పాహిపాహిరఘునాయక రామ
భక్తత్రాణపరాయణ రామ
రామరామశ్రీరామా రామ
రామరామజయసీతా రామ.

శ్రీరామార్పణమస్తు

---

శ్రీరామాయనమః.

# ఆపదుద్ధారకస్తోత్రము.

హరిః. ఓమ్. అస్యశ్రీఆపదుద్ధారకస్తోత్రస్య వసిష్ఠోభగవాన్ ఋషిః । అనుష్టుప్ఛందః । శ్రీరామచంద్రో దేవతా । శ్రీం బీజం - రాం శక్తిః - మం కీలకం । మమ ఆపదుద్ధారక శ్రీరామచంద్రప్రసాదసిద్ధ్యర్థే జపేవినియోగః । ఆపదామపహర్తారం - అంగుష్ఠాభ్యాన్నమః, దాతారంసర్వసంపదాం - తర్జనీభ్యాన్నమః, లోకాభిరామం - మధ్యమాభ్యాన్నమః, శ్రీరామం - అనామికాభ్యాన్నమః, భూయోభూయో - కనిష్ఠికాభ్యాన్నమః, నమామ్యహం - కరతలకరపృష్ఠాభ్యాన్నమః । ఏవంహృదయాదిన్యాసః । భూర్భువస్సువరోమితి దిగ్బంధః॥ ధ్యానం॥ ఆర్తానామార్తిహంతారం, భీతానాం భయనాశనమ్ । ద్విషతాం కాలదండంచ, రామచంద్రం నమామ్యహమ్ ॥ చాపం ధునాన స్తనయిత్నుఘోషం, కర్షన్నిషంగాదిషు మార్గ్గివిష్ణున్ । ఆపత్సు భూయాదభయప్రదో మే, సాకం సుమిత్రాతనయేన రామః ॥ ఆపదా మపహర్తారం, దాతారం సర్వసంపదామ్ । లోకాభిరామం శ్రీరామం, భూయోభూయో నమామ్యహమ్ ॥

ఆపన్నజనరక్షైక, దక్షాయామితతేజసే
నమోస్తు విష్ణవే తుభ్యం, రామాయాపన్నివారిణే. ఆపదా. ౧

పదాంభోజరజస్స్పర్శ, పవిత్రమునియోషితే
నమోస్తు సీతాపతయే, రామాయాపన్నివారిణే. ఆపదా. ౨

దానవేంద్రమహామత్త, గజపంచాస్యరూపిణే
నమోస్తు రఘునాథాయ, రామాయాపన్నివారిణే. ఆపదా. ౩

మహిజాకుచసంలగ్న, కుంకుమారుణవక్షసే
నమః కల్యాణరూపాయ, రామాయాపన్నివారిణే. ఆపదా. ౪

పద్మసంభవ భూతేశ, మునిసంస్తుతకీర్తయే
నమోమార్తణ్డవంశాయ, రామాయాపన్నివారిణే. ఆపదా. ౫

హరత్యార్తించ లోకానాం, యో వా మధునిషూదనః
నమోస్తు హరయే తుభ్యం, రామాయాపన్నివారిణే. ఆపదా. ౬

తాపకారణసంసార, గజసింహస్వరూపిణే
నమో వేదాన్తవేద్యాయ, రామాయాపన్నివారిణే. ఆపదా. ౭

రంగత్తరంగజలధి, గర్వహృచ్ఛరధారిణే
నమః ప్రతాపరూపాయ, రామాయాపన్నివారిణే. ఆపదా. ౮

దారాసహితచంద్రాస్య, శంసధ్యానస్థమూర్తయే
నమ స్సత్యస్వరూపాయ, రామాయాపన్నివారిణే. ఆపదా. ౯

తారానాయకసంకాశ, వదనాయ మహౌజసే
నమోస్తు తాటకాహంత్రే, రామాయాపన్నివారిణే. ఆపదా. ౧౦

రమ్యసానులసచ్చిత్ర, కూటాశ్రమవిహారిణే
నమ స్సౌమిత్రిసేవ్యాయ, రామాయాపన్నివారిణే. ఆపదా. ౧౧

సర్వదేవాహితాసక్త, దశాననవినాశినే
నమః కలుషసంహర్త్రే, రామాయాపన్నివారిణే. ఆపదా. ౧౨

రత్నసానునివాసైక, వంద్యపాదాంబుజాయచ
నమ స్త్రైలోక్యనాథాయ, రామాయాపన్నివారిణే ఆపదా. ౧౩

సంసారబంధమోక్షైక, హేతునామప్రకాశినే
నమః కలుషసంహర్త్రే, రామాయాపన్నివారిణే. ఆపదా. ౧౪

పవనాశుగసంక్షిప్త, మారీచాదిసురారయే
నమో మఖపరిత్రాత్రే, రామాయాపన్నివారిణే. ఆపదా. ౧౫

దాంబికేతరభక్తౌఘ, మహదానందదాయినే
నమః కమలనేత్రాయ, రామాయాపన్నివారిణే. ఆపదా ౧౬

లోకత్రయోద్వేగకర, కుంభకర్ణశిరశ్ఛిదే
నమో భీషణరూపాయ, రామాయాపన్నివారిణే ఆపదా. ౧౭

కాకాసురైకనయన, హరల్లీలాస్త్రధారిణే
నమో భక్తైకసంధ్యాయ, రామాయాపన్నివారిణే ఆపదా ౧౮

భిక్షురూపసమాక్రాంత, బలిసర్వైకసంపదే
నమో వామనరూపాయ, రామాయాపన్నివారిణే. ఆపదా. ౧౯

రాజీవనేత్రసుస్పంద, రుచిరాంగసురోచిషే
నమః కైవల్యనిధయే, రామాయాపన్నివారిణే. ఆపదా. ౨౦

మందమారుతసంవీత, మందారద్రుమవాసినే
నమః పల్లవహస్తాయ, రామాయాపన్నివారిణే. ఆపదా. ౨౧

శ్రీకంఠచాపదళన, ధురీణబలబాహవే
నమ స్సీతానుషక్తాయ, రామాయాపన్నివారిణే. ఆపదా. ౨౨

రాజరాజసుహృద్యోషా,ర్చితమంగళమూర్తయే
నమ ఇక్ష్వాకువంశ్యాయ, రామాయాపన్నివారిణే. ఆపదా. ౨౩

మంజులాదర్శవిప్రేక్ష, ణోత్సుకైకవిలాసినే
నమః పోషితభక్తాయ, రామాయాపన్నివారిణే. ఆపదా. ౨౪

భూరిభూధరకోదండ, మూర్తిధ్యేయస్వరూపిణే
నమః ప్రతాపరూపాయ, రామాయాపన్నివారిణే ఆపదా. ౨౫

యోగీంద్రహృత్సరోజాత, మధుపాయ మహాత్మనే
నమో రాజాధిరాజాయ, రామాయాపన్నివారిణే ఆపదా. ౨౬

భూవరాహస్వరూపాయ, నమో భూరిప్రదాయినే
నమః కోమలదేహాయ, రామాయాపన్నివారిణే ఆపదా. ౨౭

యోషాంజలివినిర్ముక్త, లాజాంచితవపుష్మతే
నమ స్సౌందర్యనిధయే, రామాయాపన్నివారిణే. ఆపదా. ౨౮

నఖకోటివినిర్భిన్న, దైత్యాధిపతివక్షసే
నమో నృసింహరూపాయ, రామాయాపన్నివారిణే. ఆపదా. ౨౯

మాయామానుషదేహాయ, వేదోద్ధరణహేతవే
నమోస్తు మత్స్యరూపాయ, రామాయాపన్నివారిణే. ఆపదా. ౩౦

మితిశూన్యమహాదివ్య, మహిమ్నే మానితాత్మనే
నమో బ్రహ్మస్వరూపాయ, రామాయాపన్నివారిణే ఆపదా. ౩౧

అహంకారేతరజన, స్వాంతసౌధవిహారిణే
నమోస్తు చిత్స్వరూపాయ, రామాయాపన్నివారిణే ఆపదా. ౩౨

సీతాలక్ష్మణసంశోభి, పార్శ్వాయ పరమాత్మనే
నమః పట్టాభిషిక్తాయ, రామాయాపన్నివారిణే ఆపదా. ౩౩

ఇమం స్తవం భగవతః, పఠే ద్యః ప్రీతమానసః
ప్రభాతే వా ప్రదోషే వా, రామస్య పరమాత్మనః ౩౪

స తు తీర్త్వా భవాంభోధి, మాపద స్సకలా అపి
రామసాయుజ్య మాప్నోతి, దేవదేవప్రసాదతః. ౩౫

కారాగృహాదిబాధాసు, సంప్రాప్తే బహుసంకటే
ఆపన్నివారకం స్తోత్రం, పఠేద్యస్తు యథావిధి. ౩౬

సంయోజ్యానుష్టుభంమంత్ర, మనుశ్లోకం స్మరన్ విభుః
సప్తాహం సర్వబాధేభ్యో, ముచ్యతే నాత్ర సంశయః. ౩౭

ద్వాత్రింశద్వారజపతః, ప్రత్యహం సుదృఢవ్రతః
వైశాఖే భాను మాలోక్య, ప్రత్యహం శతసంఖ్యయా. ౩౮

ధనేన ధనదప్రఖ్యాం, లభతే నాత్ర సంశయః
బహునాత్ర కిముక్తేన, యం యం కామయతే నరః. ౩౯

తం తం కామ మవాప్నోతి. స్తోత్రేణానేన మానవః
యంత్రపూజావిధానేన, జపహోమాదితర్పణైః. ౪౦

యస్తు కుర్వీతసహసా,సర్వాన్ కామా నవాప్నుయాత్
ఇహలోకే సుఖీభూత్వా, పరే ముక్తో భవిష్యతి. ఉదా. ౪౧

ఇతి శ్రీ అగస్త్య సంహితాయాం ఉమామహేశ్వరసంవాదే
ఆపదుద్ధారకస్తోత్రకథనంనామ ఏకత్రింశోధ్యాయః.

ఓం తత్సత్ బ్రహ్మార్పణ మస్తు

# THE RÂMÂYANA.

"(THIS IS AN APPRECIATION OF THE GREAT POEM BY A FAMOUS WESTERN WRITER.)"

THE year 1863 will always be to me dear and blessed, for in it I was privileged to read for the first time the great sacred poem of India—the divine *Ramayana*.

"When this poem was first sung, Brahma Himself was ravished with it. Gods, geniuses, all beings from birds to serpents, men and holy anchorites exclaimed: "Oh! the sweet poem which we would always gladly hear. Oh! enrapturing song! How it imitates nature! How clearly we see this long history! It lives under our very eyes."

"Happy he who reads this book entire. Happy he who has read but the half of it. It makes the Brahmana wise, the soldier brave, the merchant rich. If, by chance, a slave (Pariah) hears it, he becomes ennobled. He who reads the *Ramayana* is absolved from all his sins."

This last expression is no delusion of the fancy. This great stream of poetry sweeps away our abiding sin, the dregs, the bitter leaven, which time brings and leaves in us, it washes away and thus makes us pure. Whoever feels his heart dry let him drink of the *Ramayana*. Whoever has lost what was dear to him and is plunged in sorrow let him draw from it the sweet comforts and sympathies of nature. Whoever has labored too much and wished too much, let him drink from this cup a deep draught of life and youth.

Man cannot always work. Every year he must rest, take breath, and renew himself at the great living springs which preserve their eternal freshness. But where are these to be found except at the cradle of our race—on the sacred summits whence descend on one side the Indus and the Ganga, and on the other the torrents of Persia, the rivers of Paradise?

Everything is narrow in the west. Greece is so small that I am stifled in it; Judea is so dry that I pant in it. Let me glance at the side of high Asia towards the deep Orient. There I have my immense poem as vast as the Indian Sea, blessed and adorned by the sun—a book of divine harmony, where nothing jars. A calm peace pervades it, and even in the midst of

battle described in it we perceive an infinite sweetness, a boundless brotherhood, which extends to every living thing; an ocean without bottom or shore, full of love, pity and clemency. I have found that for which I was looking—the Bible of goodness. Receive me then, great poem. Let me plunge in thee, O Sea of milk.

It is only quite recently that the whole of this poem has been translated. It has always been judged by an isolated part or an interpolated episode, directly contrary to its spirit. Now that it has appeared in all its truth and grandeur, it is easy to see that whoever was its last compiler, it is the outgrowth of India—the product of its ages. During perhaps two thousand years the Hindus gave utterance to the *Ramayana* in the different songs and recitals which constitute this epic; and for the last two thousand years they have enacted it in the popular dramas, which were and are still represented at the great national festivals.

It is not a mere poem. It is a kind of Bible which, with the sacred traditions, contains nature, society, the arts, the Indian scenery, vegetation, animals, and the changes of the year in the peculiar enchantments of the different seasons. We cannot judge such a book as we would the Iliad. It has never undergone those expurgations and corrections to which the Homeric poems have been subjected by the great critics of Greece, the greatest of the world. It has had no Antiarchus. It comes to us unaltered. We see this in its numerous repititions, and in some of its descriptions, which recur two or three times and even oftener. We see this also in the many additions which have been made to it at sundry times. Here we meet with facts of such antiquity as to reach back to the cradle of India, and again with things comparatively modern and of such delicate sweetness and fine melody as would seem to be Italian.

It has not been arranged with that skill which characterises the literary works of the West. No one has taken such trouble with it. Every one has relied on the unity, which such an immense diversity receives from vague harmony in which the shades, the colors and even the opposite tunes are blended. It is like the forest and the mountain which it describes. Under gigantic trees, there is a superabundant life, which springs up from smaller trees and from an infinitude of shrubs and humbler plants, which those wood-giants permit to exist under them, and over which they pour down their showers of blossoms, and these great vegetable amphitheatres are full of life. On high soar and flutter birds of a hundred kinds and colors; apes swing from the immediate branches, and now and then the mild-eyed gazelle is

seen beneath. Is this totally a chaos? By no means. The agreeing diversities deck themselves with a commingling charm. At evening, when the sun extinguishes his overwhelming light in the Ganga, when the noises of life are silent, the skirt of the forest exhibits all this animation, so diverse and yet so well blended in the peace of the sweetest twilight, in which all things love each other and sing together. A common melody emerges. This is the *Ramayana*.

JULES MICHELET,

(the French historian in his *Bible of Humanity.*)

Taken from Madame Annie Besant's "In the Defence of Hinduism."

ఆర్యసంతతిశరీరంబున జనియించిన విపరీతవిమర్శకవ్యాధుల కీఖండాంతర మతాంతరజనిత విభీషణవాక్యంబులు మహౌషధంబులయి పరిణమించునుగాక. వివేకముతోడ వాల్మీకిరామాయణమును శోధించిన యార్యవర్యులు నరవిందఘోషు ఎం. ఏ., గారివలె నిట్లు ప్రశంసింతురు.

"It has been said, truly, that the Ramayana represents an ideal society and assumed, illogicaly, that it must therefore represent an imaginary one. The argument ignores the alternative of a real society idealised. No poet could evolve out of his own imagination a picture at once so collosal, so minute and so consistent in every detail. No number of poets could do it without stumbling into fatal incompatibilities either of fact or of view, such as we find defacing the Mahabharata."

* * * * * * *

" . ... ... The Ramayan, the grandest and most paradoxical poem in the world, which becomes unmatchably sublime by disdaining all consistent pursuit of sublimity, supremely artistic by putting aside all the conventional limitations of art, magnificently dramatic by disregarding all dramatic illusion, the uniquely epic by handling the least as well as the most epic material Not all perhaps can enter at once into the spirit of this masterpiece, but those who have once done so, will never admit any poem in the world as its superior."—*Extract from Indian Review, July 1902.*

---

శ్రీరస్తు.

# శ్రీమదాంధ్రవాల్మీకిరామాయణ విషయసూచిక.



## బాలకాండము.



A*

---

## అయోధ్యాకాండము.

1*

## అరణ్యకాండము

| సర్గసంఖ్య. | | పుటసంఖ్య. |
|---|---|---|
| ౩౧ | లక్ష్మణునిఁ జూచి క్రోఁతులు భయపడి పరువెత్తుట .. .. .. | ౬౪౮ |
| ,, | సుగ్రీవునకుఁ దనయాగమనవార్తఁ దెలుపుమని లక్ష్మణుఁ డంగదుఁ బంచుట | ,, |
| ,, | సుగ్రీవునకు మంత్రులు హితము బోధించుట .. .. .. .. | ౬౪౯ |
| ౩౨ | లక్ష్మణుఁడు వచ్చినవార్త విని సుగ్రీవుఁడు భయపడుట .. .. | ,, |
| ,, | హనుమంతుఁడు సుగ్రీవునకు హిత ముపదేశించుట .. .. .. | ౬౫౦ |
| ౩౩ | లక్ష్మణుఁ డంగదునితో సుగ్రీవు నంతఃపురంబుఁ జొచ్చుట .. .. | ౬౫౧ |
| ,, | లక్ష్మణుని సమాధానపఱుప సుగ్రీవుఁడు తారను బంపుట .. .. .. | ౬౫౨ |
| ,, | తార లక్ష్మణునితో సంభాషించుట .. .. .. .. .. | ,, |
| ,, | లక్ష్మణుఁడు తారతో సుగ్రీవుఁడు సమయాతిక్రమణంబుఁ జేయుట చెప్పుట | ౬౫౩ |
| ,, | తార లక్ష్మణుని సమాధాన పఱుచుట .. .. .. .. | ,, |
| ౩౪ | లక్ష్మణుఁడు సుగ్రీవునిఁ జూచి నిష్ఠురంబు లాడుట .. .. .. | ౬౫౪ |
| ౩౫ | తార లక్ష్మణుని శాంతి పఱుచుట .. .. .. .. .. | ౬౫౬ |
| ,, | సుగ్రీవుఁడు కపిసేనల రప్పించినవార్త తార లక్ష్మణునకుఁ దెలుపుట .. .. | ౬౫౭ |
| ౩౬ | సుగ్రీవుఁడు లక్ష్మణుని సమాధాన పఱుచుట.. .. .. .. | ,, |
| ,, | లక్ష్మణుఁడు సుగ్రీవునిఁ బ్రశంసించుట.. .. .. .. .. | ౬౫౮ |
| ౩౭ | సుగ్రీవుఁడు హనుమంతునితో వానరులనిమిత్తమై మరల దూతలఁ బంపుమని చెప్పుట .. .. .. .. .. .. | ,, |
| ,, | వానరసేనలు కిష్కింధకు వచ్చుట .. .. .. .. | ౬౫౯ |
| ౩౮ | లక్ష్మణ సుగ్రీవులు సేనలతోడ రామునియొద్దకుఁ బోవుట .. .. .. | ౬౬౦ |
| ,, | రాముఁడు సుగ్రీవునకు నీతిఁ దెలుపుట .. .. .. .. | ,, |
| ,, | సుగ్రీవుఁడు రామునితోఁ దాను వానరసేనల సిద్ధపఱుచుట తెలుపుట .. | ౬౬౧ |
| ౩౯ | రాముఁడు సుగ్రీవునిఁ బ్రశంసించుట .. .. .. .. | ,, |
| ,, | వానరసేనలు రామునికడకు వచ్చుట .. .. .. . .. | ౬౬౨ |
| ౪౦ | సుగ్రీవుఁడు రామునకుఁ దనసేనల నివేదించుట .. .. .. | ౬౬౪ |
| ,, | తూర్పున సీతను వెదక సుగ్రీవుఁడు వినతునిఁ బంచుట .. .. .. | ,, |
| ౪౧ | సుగ్రీవుఁడు హనుమదాదులను దక్షిణదిక్కున రోయఁ బనుచుట .. | ౬౬౭ |
| ౪౨ | సుగ్రీవుఁడు సుషేణాదులఁ బశ్చిమదిశ రోయఁ బనుచుట .. .. .. | ౬౭౦ |
| ౪౩ | సుగ్రీవుఁడు శతవలిని నుత్తరమున రోయఁ బనుచుట .. .. .. | ౬౭౨ |
| ౪౪ | సుగ్రీవుఁడు కార్యభారము హనుమంతునిపై మోపుట .. .. .. | ౬౭౬ |
| ,, | రాముఁడు హనుమంతుచేతికిఁ దన ముద్రికనిచ్చుట .. .. .. | ,, |
| ౪౫ | వానరులు సీతను వెదకఁ బోవుట .. .. .. .. .. | ౬౭౭ |
| ౪౬ | సుగ్రీవుఁడు రామునితోఁ దాను భూమండలముఁ జూచిన విధానముఁ జెప్పుట | ౬౭౮ |
| ౪౭ | వినతాదులు సీతను గానక వచ్చుట .. .. .. .. .. | ౬౭౯ |
| ౪౮ | హనుమంతుఁ డంగదాదులతో వింధ్యంబున సీతను వెదకుట .. .. | ,, |
| ౪౯ | అంగదుఁడు కపుల నుత్సాహ పఱుచుట .. .. .. . | ౬౮౧ |




శ్రీః.

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణేనమః.

శ్రీ శారదాయైనమః.

శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీమదాంధ్రవాల్మీకి రామాయణము.

## బాలకాండము.

---

### ఇష్టదేవతాస్తుతి.



మహిజాధవుండు, జడ♦చేతనజీవవిధాత, సద్గరి
యోఽమరభూరుహంబు, సమ♦దారివిదారణశీలి, భక్తవా
రామృతదాత, సంభృతశ♦రాసకరాంబుజుఁ, డొంటిమిట్టశ్రీ
రాముఁ డమాయవర్తనుఁడు ♦ రక్తి గ్రహించుత మన్నమస్కృతుల్. ౧

చం. జగముల నాశ్రయించి, శ్రిత♦సంతతి కాశ్రయభూత యై, నతో
క్తి గరుణ విన్చు, నాథునకుఁ ♦ దెల్పుచుఁ, గృత్తసమస్తదోష యై,
యగణితశక్తియుక్తిని స♦దాశ్రయ యై, పతి భక్తిఁ గొల్చుశ్రీ
భగవతి మాత సీత నిర♦పాయసుఖాత్ములఁ జేయు భక్తులన్. ౨

కం. సత్యము వాక్యము, లోకము సత్యము, తనవ్రాయసంబు ♦ సత్యము, ప్రోయాల్
సత్య యగువాణి, యవ్విధిఁ, బ్రత్యహమును గొలుతుఁ గృతికి ♦ బ్రహ్మోయు విడన్.

ఉ. నారసనాలతాగ్రమున ♦ నవ్యగతి న్నటియించి సద్యశః
పూరము నించి తీజగతిఁ ♦ బూర్వమునంద మదంబ! వాణి! సం
సారము నుత్తరింప రఘు♦చంద్రముసత్కృతికై తొడంగితిఁ
సారసనేత్ర! యేకరణి ♦ సాందయుం గృతి నుద్ధరించెదో. ౪

కం. రామా! మారాముని వే,నామములకు నీడు రామ♦నామం బది పో
రాములకు విరామ మిడి ని,రామయసుఖ మిడెడు ననెడు♦హరుఁ డోముః గృతిన్·

ఉ. ప్రేమ సురార్థ మై విషము ♦ మ్రింగుట డాయుట స్థాణ్వపర్ణత౯
సా మతి ద్యోనదీందు లవి ♦ చక్కఁ దొలంపఁగ రామి రామనా
మామృతభుక్తి జేవఁ గొని ♦ యంది మహేశ్వరసర్వమంగళా
త్వామితభూతి, మీఱెడుశి♦వాఽసమకల్పలతల్ కృతిత్రముల్. ౬

ఉ. శ్రీరఘురామపాదసర♦సీరుహయుగ్మము నాత్మ నిల్పి, కూ
పారము దాఁటి, విఘ్నములఁ ♦ బాఱఁగఁ ద్రోలుచు, లంకఁ జొచ్చి, సీ
తారమణీమణిం గని, ము♦దంబును గూర్చి, రఘూత్తమాంఘ్రిసే
వారతి మీఱుపావని శి♦వంకరుఁ డై వెలయించు మత్కృతిన్. ౭

సంస్కృతకవీంద్రవినతి.

ఉ. శ్రీమహిళాయనంబును, బ్ర♦కృష్టసుకాండము, స్వాదుసద్రసో
ద్దామగభీరతాధ్వనివి♦ధాలసితంబు, మనోహరంబు, నౌ
రామకథాసుధాంబునిధిఁ ♦ దచ్చి, బుధుల్ విమలామృతోజ్జ్వలుల్
గా, మహిఁ జేయునాదికవి♦కంజజుఁ బ్రాంజలి నై భజించెదన్. ౮

కం. పంచజనరక్షణార్థము, పంచమవేదంబుఁ దెలియఁ ♦ బల్కినలీలా
పంచజనపంచముఖు న,భ్యంచితమతిఁ గొలుతు నార్యుఁ ♦ బారాశర్యున్. ౯

సీ. ఏసత్కవీంద్రువా♦చాసముజ్జృంభణ, వింతతాలము నేర్పు ♦ వేధసతికి
నేవాక్ప్రతిపటిష్ఠ♦వావదూకత తార్కి,కగజకోటికి సింహ♦గర్జనంబు
ఏమహామహుమతి ♦ రామానుజాచార్య,మతమహీసితపోత్రి♦మహితదంష్ట్ర
యేవైష్ణవాగ్రణి♦భావమార్గము ముక్తి, భామినీసౌధసో♦పానపంక్తి
తే. యట్టికవితార్కికోగ్రపం♦చాస్యమూర్తి, సాధునుతకీర్తి వైష్ణవ♦చక్రవర్తి
ధీపురాచార్యు వేదాంత♦దేశికార్యు, వేంకటాచార్యుఁ గొలుతు వే♦వేలగతుల.

కం. కవికేసరి యన దేశిక,కవికే సరిగాక యితర♦కవియుం గవియే?
పవిసఖనఖముఖభయదవ,పువు పులియుం బులియు నీఁగ♦పులియుం బులియే? ౧౧

తే. కాళిదాసుని రఘువంశ♦కర్తఁ దెలిచి, పూతవాగ్భూతి కాభవ♦భూతి కెరఁగి
యల్లజయదేవువినుతమ♦హానుభావు, రాజశేఖరుని మురారిఁ ♦ బ్రస్తుతింతు. ౧౨

ఆంధ్రకవీశ్వరవినుతి.

కం. అయకవితావిభవుల న,న్నయ నేతాప్రెగడ దిక్క♦నలఁ బూర్వకవి
త్రయము స్మార్తి త్రయముం, ద్రయివోలె నుతింతు నతశి♦రస్కుఁడ నగుచున్. ౧౩

సీ. ఆంధ్రీకరణశక్తి ♦ నతకరించెను జాల, సర్వజ్ఞు లనఁబడు♦సకలకవులఁ
బరమమధూక్తుల ♦ భవ్యకవితఁ గూర్చెఁ, గోద దీఱ నమృతంబుఁ ♦ గూరి కూరి

భక్తిరసైకసం♦పద గర్భితముఁ జేసె, సకలరసావళి ♦ శ్లాఘ్యరీతి
హరివర్ణనాసమ♦యమునను స్వశరీర,విస్మృతి గనఁబడ ♦ వెలసె నట్టి
తే. పోతనామాత్యు సత్కవి ♦ పూగజాత్యుఁ, దర్పితాదిత్యు రఘుపతి ♦ ధ్యాననిత్యు
సహజపాండిత్యుఁ గృతకృత్యు ♦ శస్తసత్యు,ధీసురామాత్యుఁ గొలిచెద♦వాసి చెలఁగ.
కం.తుచ్ఛుఁడు సరిగా దనినను, స్వచ్ఛపుఁబోతనకవిత్వ♦సంపద చెడునే?
స్వేచ్ఛ జలధి దూషించిన, నచ్ఛపతివ్రతను బాప♦ మంటుట గలదే? ౧౫
కం.రామాభ్యుదయకవీంద్రుని, ధీమహితులఁ దిక్కనార్యుఁ ♦ దిమ్మన మొల్లాం
బామణి భాస్కరుఁ బాపన, రామకవుల రంగనాథుఁ ♦ బ్రణుతి యొనర్తున్. ౧౬
శా.శ్రీరామాయణపూర్వభాగము రచిం♦చె న్భక్తి నాంధ్రంబుగా
ధీరుం డార్యజనస్తవార్హుఁడును, బృ♦థ్వీదేవతాశ్రేష్ఠుఁ, డు
ర్వీరామాత్మభవేశభక్తుఁ, డగుగో♦పీనాథ వెంకార్యుఁ, డా
సూరిం గూర్చి నమస్కరించెదను స♦త్సూక్తిం బ్రశంసించుచున్. ౧౭
కం.కరములు శిరమునఁ జేరిచి, వరగతి భజియింతుఁ గృతిఁ గృ♦పారతిఁ గనఁగా
వరకవితాచణులన్ హిత,కరగుణులన్ వర్తమాన♦కవ్యగ్రణులన్. ౧౮
కం.నతిఁ జేసెద నీ రాముల,కృతి సారదయార్ద్రదృష్టి ♦ క్షితి రక్షింపన్
శతగతులన్ బుధతతులన్, గతకల్మషమతుల భావి♦కవితాంచితులన్. ౧౯

మిత్రప్రశంస.

సీ. సీతాంబికాగర్భ♦సింధుసుధాంశుఁడు, వీరరాఘవవంశ ♦ వృద్ధికరుఁడు
శ్రీకుప్పమాంబికా♦హృత్కంజమిత్రుండు, షట్కళాసారవి♦శారదుండు
నిర్నిమిత్తకదయా♦నిర్నిద్రమానసుం, డంకహీనప్రతి♦భాంచితుండు
కలితవాక్యామృతా♦స్ఖలితకవిత్వుండు, కౌశికగోత్రుఁ డ♦గళితయశుఁడు
తే. ప్రథితలంకలపల్లెస♦ద్వంశజాతుఁ, డనఘ వేంకటసుబ్బార్యుఁ ♦ డార్యహితుఁడు
కృతు లొనర్పఁగఁ బేరేచి♦కీర్తిఁ దెచ్చె, నాకునీడ్యుఁడు గాఁడొకో♦నాదుహితుఁడు.
సీ. వేంకటపరసాఖ్య♦విఖ్యాతదైవజ్ఞ, సత్తమహాగ్లాబ్ధి♦చంద్రముండు
పరమానసీగర్భ♦పరిశుక్తిముక్తాఫ,లాయమానుఁడు సాధు♦గీయమానుఁ
డన్నపూర్ణానఘా♦హ్లాకాగ్నృతరోచి, హరితసగోత్రాభ్యు♦దయకరుండు
శ్రీరావుచెల్లమాం♦బారావుకరుణాక,టాక్షసంలబ్ధర♦మాధికుండు
తే రామకృష్ణాఖ్యపనుజుండు ♦ ప్రకటకీర్తి,పల్లికులఖనిసుశివయా♦పరుఁడు ఘనుఁడు
మన్వయుస్యుండు హితుఁడు స♦న్మార్గరతుఁడు, నవ్యగుణహారి శ్రీపద్మ♦నాభ శాస్త్రి.
చం.హితము సతంబుఁ గూరిచెద ♦ రెక్కటిస్రుక్కిసఁ బెక్కుచిక్కులన్
వెతఁ బడఁ జావుసెజ్జఁ జెయి♦వీడ స్వకీయులు పూర్వపోషితుల్,

మతి గొని యాదుకొం చునుఱు ♦ మందుల నిల్పిరి; పూర్వజన్మసం
చితసుకృతంబ గాక ధరఁ ♦ జిక్కుదురే యిటువంటిమిత్రులున్? ౨౨
శా. ప్రేరింతుర్ శుభకావ్యసంఘటనకై ♦ ప్రేరించి మధ్యంబునం
దేరోగంబున నైన డీలుపడ నెం♦తేఁ గూర్తు రుత్సాహముం,
బారం బందఁ బ్రశస్తి సేయుదురు, నా♦భాగ్యంబు గాదే మహో
దారుల్ ధీరులు ధీరశాంతు లిటు ల♦త్యంతాప్తులై యబ్బుటల్. ౨౩
కం. ఎక్కడి చింతలపూఁడియొ, యెక్కడి రఘునాథపురమొ ♦ యెక్కడి కడపో
చిక్కని నెయ్యము మువురకు, నెక్కరణియొ, దైవచిత్ర ♦ మే మనవచ్చున్. ౨౪
ఆ. అడవియుసిరికయును ♦ నంబుధిలవణంబుఁ, జేరి నట్టటంచుఁ ♦ జెప్పు చంద్ర
మైత్రిఁ బలుకుచోట♦మాయెడ నయ్యది, సత్య మయ్యె రామ♦చంద్రకరుణ. ౨౫
కం. ఫలకాంక్షారహితంబుగఁ, బలువిధముల నాకుఁ దోడు♦పడుమిత్రులకున్
గలిమియు సుఖముఁ జిరాయువుఁ, గులవృద్ధియుఁ గలుగఁజేయఁ♦గోరెదరామా!

## స్వవిషయము.

శా. భారద్వాజపవిత్రగోత్రజుఁడ, నాపస్తంబసత్సూత్రుఁడన్,
బారావారసుతాధినాథపదసే♦వాలోలగోల్కొండవే
పారిన్, సత్కవిమిత్రుఁడం, గనకమాం♦బారామచంద్రాహ్వయో
దారానుత్తమదంపతిప్రజల మ♦ధ్యస్థుండ, సుబ్బాఖ్యుఁడన్. ౨౭
ఉ. పూతచరిత్రులున్, విబుధ♦పూజితులున్, సుయశోమనోహర
స్ఫీతపవిత్రమూర్తులును, ♦ శ్రీరమణీయనిజాలయాంగణుల్,
శ్రీతరుణీశ పాదసర♦సీరుహసంకలితాత్మమందిరుల్,
మాతలిదండ్రులం దొరయ ♦ మాతలిదండ్రులె శక్తు లిద్ధరన్. ౨౮
కం. గురువులఁ బరమదయాళుర, ధరణిం బ్రత్యక్షదైవ♦తంబుల నస్మ
త్కరణకళేబరదాతల, నిరతము భజియింతు నఘము ♦ నిస్సాలింతున్. ౨౯
శా. బాల్యంబందున తండ్రి వాసి చన స♦ద్భావంబునన్ మమ్ము ము
న్గల్యాణాత్మకుఁడైనకృష్ణుఁడు కృపం ♦ గౌరవ్యసంజాతకౌ
టిల్యం బందక యుండఁ బెంపవుఁ బో♦టించెం గదా, యట్ల దా
కల్యంబై ననుఁ గాచుపిన్నజనకుం ♦ గాదే ప్రశంసింపఁగన్. ౩౦
కం. కఱపెను విద్యాబుద్ధులు, నెఱపెను మజ్జీవనంబు ♦ నీతియు గుణముం
గఱపెను లక్ష్మణరాయఁడు, మఱవంగా వశమె సుజన♦మాన్యుఁ బితృవ్యున్. ౩౧
కం. అన్న యగు శేషగిరి రా, వన్నువ యగురంగరాయఁ ♦ డాత్మగృహిణి యై
చెన్నలరురంగనాయకి, సన్నుత కావ్యములె నాదు♦సంతానంబుల్. ౩౨

సీ. శాంతచిత్తుల మేలి♦బంతి యెవ్వం డన, నాతఁ డం చన నర్హుఁ ♦ డైనవాఁడు
అతిసాధుతకు నుదా♦హరణ మెవ్వం డన, వాఁడెపో యని చూపఁ♦బడెడివాఁడు
సత్యనీతివ్రతా♦చరణకు గుఱి యెవ్వఁ, డనిన వాఁ డన యోగ్యుఁ ♦ డైనవాఁడు
బంధువత్సలతకుఁ ♦ బట్టుఁగొ మ్మెవఁ డన, నాయన యనఁగఁ బా♦త్రైనవాఁడు
తే. సారసౌభ్రాత్రమున రామ♦చంద్రు సాటి, యెవ్వఁ డన వీఁడనఁగఁ గీర్తి♦ నెసఁగువాఁడు
బుద్ధికాణాచి, నెయ్యంబు♦భూమి, సుప్ర,సన్నతను సిరియన్న, శే♦షన్న నిజము.
కం. తెలియనికతమున భావిక,వులు మద్విషయంబునందుఁ ♦ బొరవడకుండన్
బలికితి నాదుకుటుంబముఁ, గలరు పితృవ్యజులు తల్లి ♦ గల దిప్పటికిన్. ౩౪
కం. మావంశము తెఱఁ గంతయు, మావృత్తాంతంబుఁ దెలియ ♦ మత్పూర్వకృతం
బై వెలయురామాభ్యుదయమం, దే విస్తృత మగుట నొడువ ♦ నే నిట మరలన్. ౩౫

కవికృతపూర్వగ్రంధసంగ్రహపట్టిక.

కం. శ్రీపతి యగుసీతాభా,మాపతికృపబలిమి శ్రీకు♦మారాభ్యుదయం
బాపయి శతకము కౌస,ల్యాపరిణయకావ్య మొండు ♦ నయ్యెం బలుకన్. ౩౬
కం. కృష్ణావతారతత్త్వముఁ, గృష్ణనులీలామృతంబుఁ ♦ గీర్తించితిఁ, ద
త్కృష్ణునగీతల శ్రద్ధా,నిష్ణాతుఁడ నగుచుఁ బల్కి ♦ నెగడితి ద్విపదన్.[1] ౩౭

వితర్కాదికము.

సీ. కనులకుఁ గలఁకయు ♦ గరళంబు మదికి నై, తపియింపఁజేయ వి♦త్తమ్ము లేదు
కాళ్లబందా లురి♦త్రాళ్లు కుత్తుకకు నౌ, బిడ్డలజెంజాట ♦ మడ్డు లేదు
మంచిసెబ్బర లెద ♦ స్మరియింప నీయని, యంతటిభోగంబు ♦ లమర లేదు
ఈపూఁట హరిహరీ ♦ యేపాటఁ గడచు న, న్దారిద్ర్యభీతి యిం♦తయును లేదు
ఆ. రాముఁ దలఁపఁజేయ♦నామయం బుండఁగ, సౌఖ్య మరయుపొంకె♦జాయ యుండ
నింత వలను గలుగ ♦ నిప్పుడ శ్రీరాముఁ, దలఁప కున్న నెపుడు ♦ దలఁచువాఁడ. ౩౮
చం. ప్రబలి కఫంబు కంఠమున ♦ బాధలు పెట్టెడివేళఁ, జూపఱుల్
గబగబ బైటఁ బట్టుఁ డిఁకఁ ♦ గార్యము లే దనువేళఁ, గింకరు
ల్దబదబఁ బ్రాణవాయువులు ♦ లాగెడివేళల, నాలుఁ జుట్టముల్
లబలబ లాడువేళలఁ, ద♦లంపఁగ శక్యమె రామనామమున్. ౩౯
సీ. దంతంబు లూడు న♦న్చింతపుట్టకమున్న, కనుదోయి మసకలు ♦ గొనకమున్న
ముడుతలచే మేను ♦ మిడుకులాడకమున్న, నడఁకునఁ గాల్దడఁ♦బడకమున్న
పెండ్లము కసుఁ గడ♦గండ్లు పెట్టకమున్న, నందను ల్దనుఁ జూచి ♦ నగకమున్న
గద్దించి బుడుతలు ♦ బుద్ధి చెప్పకమున్న, చెడురోగములఁ బెల్వ ♦ చెడకమున్న

---

[1] ఇవిగాక సుభద్రావిజయాదిగ్రంథంబులు పెక్కులు గలవు.

తే. పూని వైద్యుండు చెప్పక ♦ పోకమున్న, కాలభటదర్శనంబును ♦ గాకమున్న
రామశ్రీరామశ్రీరామ ♦ రామయనుచు, ధ్యానమొనరించువాఁడెపో ♦ ధన్యతముఁడు.

కం. సంగతవాక్యంబుల హృ, త్సంగతు రఘురాము భక్తిఁ ♦ దలఁచుటకన్నన్
రంగగు మేలువిధంబు గ, నంగా రా దింక నెన్ని ♦ నయమార్గములన్. ౪౧

కం. పూర్వులు నెవ్వరుఁ బలుకరు, పూర్వోత్తరరామకథల ♦ ముని పల్కినయ
ట్లుర్విని దెలుఁగున గావున, సర్వము నెఱిఁగింతు రామ ♦ చంద్రునికరుణన్. ౪౨

చం. శితభవబంధమోచనని ♦ దాన మటంచు నెఱింగి ఘోరసం
సృతి దృఢపాశబంధనము ♦ ఛేద మొనర్పఁగ, శాశ్వతోరుసౌ
ఖ్యతతి నెసంగ, నిత్యము ని ♦ రామయమైనముకుందలోకసం
గతిఁ జెలువార, రామకథఁ ♦ గైకొనిరిన్ రచియింప నీగతిన్. ౪౩

చం. కవికిని యోగివర్యునకుఁ ♦ గానను భేద మొకింత, నెట్లు నా
నవిరళభక్తియుక్తిని మ ♦ నోంబుజవీథిని నిల్పి శ్రీహరిం
బ్రవిమలనిష్ఠఁ దన్మయత ♦ భాసిలి తద్గుణవర్ణనాస్థచే
నవిరతకాలయాపనస ♦ మంజసుఁ డౌఁగద సత్కవీంద్రుఁడున్. ౪౪

ఆ. మనసు కారణంబు ♦ మనుజునిబంధమో, క్షముల కౌట మనసు ♦ సారసాక్షు
నందు నిల్పి ముక్తి ♦ నందుట సుకరకా, ర్యంబ టంచుఁ దోఁచె ♦ నాత్మయందు. ౪౫

మ. అటు గాఁ గైహికకన్య త్రిమై, విషయతం ♦ త్రాధీనుఁ డై ధీరుఁడుం
బటువాగ్వైభవజృంభణంబు తరుణీ ♦ ప్రత్యంగదుర్వర్ణనా
ర్భటి వ్యర్థంబుగఁ జేయుఁ దత్కలితహృ ♦ ద్వ్యాపారమశ్చింతనా
స్ఫుటఘోరాఘసుదగ్ధచిత్తుఁ డగుచున్ ♦ స్రుక్కుం గదా యెంతయున్. ౪౬

ఉ. రామకథాసుధాంబుధి ని ♦ రంతరమజ్జన మాచరించెదన్
రామకథామృతంబుఁ దమిఁ ♦ ద్రావుచు దారుణతృష్ణ నార్చెదన్
రామకథానులాపమునఁ ♦ గ్రాలుచు నుందు సహర్నిశంబు, నే
రామకథౌషధంబున ని ♦ రామయశాశ్వతసౌఖ్య మందెదన్. ౪౭

తే. రామునామమాహాత్మ్యంబు ♦ రాఁ దెలుంగ, సర్వసర్వజ్ఞునకు నైన ♦ నట్టిచోట
నేను రామాయణముఁ బల్క ♦ నెట్లు పనుచుఁ, బూను టెట్టిది వేకమో ♦ బుధులు కెఱుక. ౪౮

శా. భావింబ్రహ్మనొ పార్వతీపతినొ దు ♦ ర్వాసుండనో కాక నే
భావింపన్ రఘురాముసద్గుణవు వి ♦ శ్వామిత్రసన్మౌనినో
యావిశ్వజ్ఞుఁడు నౌ వసిష్ఠుఁడనొ లీ ♦ లాంభోజసంభూతుఁ డౌ
నా వాల్మీకినొ పల్కనౌనె సకలం ♦ బా రామచారిత్రమున్? ౪౯

కం. రాముకథఁ బలుకఁ జేనియు, నేమెయి నేఁ సుకవి గాఁ డ ♦ దెట్టిబుధుండున్
ధీమహితులమత మాటిది, రామాయణమును రచింతు ♦ శ్రద్ధాయుక్తిన్. ౫౦

కం. రాముఁడు పరదైవత మా, రాముఁడె నాపాలివేల్పు ♦ రక్షింపఁగ శ్రీ
రామకృపాసంలబ్ధికి, రామాయణమును రచింతు ♦ శ్రద్ధాయుక్తిన్. ౫౧

కం. రామాయణమును బూర్వులు, దాము వచింపఁగ నె యేమి? ♦ తత మొరుసుకృతం
బోముననె యితరులఁ? గావున, రామాయణమును రచింతు ♦ శ్రద్ధాయుక్తిన్. ౫౨

కం. ఆమిక యిది గాదు సుఁడీ, రామధ్యానక్రమంబు ♦ రాగిల్లుట కై
బాములు దొలఁగుట కొఱకై, రామాయణమును రచింతు ♦ శ్రద్ధాయుక్తిన్. ౫౩

ఉ. ఆరయ మోక్షమార్గము లు♦పాయము పూరుషకార, మీాద్వయిన్
భారతమం దుపాయ మభి♦వర్ణిత మయ్యెను, రాముసత్కథన్
గౌరవ మారఁగాఁ బురుష♦కారము విస్తృత మయ్యెఁ, బేర్మి పెం
పౌరహిఁ దోఁచు భాగవత♦మందు ననుత్తమవిష్ణుతత్త్వమున్. ౫౪

కం. ముసు వాల్మీకిరితస, జ్జననుతకావ్యంబు రామ♦చంద్రునితనయుల్
వినిపించి; రిపుడు దెనుఁగున, బొనరింపఁగ రామచంద్ర♦పుత్త్రుండఁ గదా. ౫౫

కం. తనయులు ముసు దమచరితము, వినిపింపఁగ విననయట్టి♦పీనుల మరలన్
వినుఁగాత రాముఁ డిట్టి, తనయుఁడు వినిపింపఁ గోరు♦తమచరితంబున్. ౫౬

తే. రామచంద్రుండుకృతిభర్త♦రామచంద్ర, సుతుఁడు కృతివక్త విషయంబు♦శుద్ధమోక్ష
మహితలాభప్రదంబు రా♦మాయణంబు, గలుగఁగలదెన్నైలక్షణ్య♦ములనుగొఱఁత. ౫౭

ఉ. శ్రీమహితుండు వాల్మికి వ♦చించెఁ గదా యని యుత్సహించి శ్రీ
రామకథార్ణవంబును ద♦రంబె తరింపఁగ నాదుబోఁటికిన్?
భీమతరస్వి యాహనుమ ♦ వేగమ దాఁటె నటంచు నీరధిం
జీమయు దాఁటఁ బూన నిఁకఁ ♦ జెప్పెడి దేమి వివేకసంపదన్. ౫౮

కం. ఓపి యగస్త్యుఁడు నీరధి, నాపోశన మెత్తెఁ గాదె ♦ యని యితరులు దా
మాపనికై పూనినఁ దుద, యేపారు నె? లోకమెల్ల ♦ నిహిహీ యన దే? ౫౯

కం. గోవిందుఁడు ము న్నెత్తఁడె, గోవర్ధన మనుచు వెఱ్ఱి♦గొల్లం డొకఁడా
గ్రావం బెత్తఁగఁ బూనిన, నేవిధమున సఫల మగు న♦భీష్టార్థంబుల్. ౬౦

ఆ. రామకోటి నేను ♦ వ్రాయంగ మఱవనై, రాగివేషముఁలను ♦ రాత్రిఁ గలను
బోధ మొనరఁజేయు ♦ పుణ్యాత్ము లీకృతి, నిర్వహింత్రు గాక ♦ నిఖిలవిధుల. ౬౧

తే. అద్భుతంబుగ మట్టమ♦ధ్యాహ్నమునను, బుష్కరాఖ్యవిరాగిని ♦ బుణ్యరామ
భక్తి నామదిలోపలఁ ♦ బ్రజ్వలింప, నెఱపఁ బంపిన ఘనుఁ డిది ♦ నిర్వహించు.

తే. అన్న చేత నిరస్తుఁడై ♦ యార్తిఁ గూరి, శరణుచొచ్చిన రాక్షసు ♦ శత్రు ననుజు
బ్రేమఁ జేపట్టి నట్టిద♦యామయుండు, బ్రోచు న న్నప్డు నాదోష♦పుంజ మఱఁచి.

కం.మందరనగభరమునకై , బృందారకు లెల్ల మొఱలు ♦ పెట్టినఁ బత్రి
స్యందనుఁడై సాయముపడు, నిందిరపతి నాకు శరణ ♦ మీకార్యమునన్. ౬౪

చం.అమృతము లబ్ధ మౌను గల♦శాంబుధిఁ ద్రచ్చ,నటంచుఁ దన్మహో
ద్యమమున బాస లాచు,నమృ♦తం బిడి బ్రోచె నిలింపకోటి నే
విమలుఁడు, వాఁడె తోడగుత ♦ వీడక నే నమృతోపభోగినై
యమరఁగఁ జల్పు రాఘవక♦థాఽమృతసాగరమంథనంబునన్. ౬౫

ఉ. శ్రీరఘురామచంద్ర! యొన♦రించెద నే నొకమన్వి, నాదరం
బారఁగ నప్రమాదమతి ♦ వై వినుమీ కనుమీ, నచింపఁ ద్వ
ద్భూరితరప్రబంధమును ♦ బూనితి, దానిని నిర్వహింపఁగా
భారము నీభుజంబున నె ♦ వైచితి, వల్దన వీడ నమ్ముమీ. ౬౬

చం.కవి నను గాఢగర్వమునఁ ♦ గాదు, మహత్తర మైనబుద్ధివై
భవమునఁ గాదు, నిస్తులిత♦పాండితి పెంపునఁ గాదు రయ్య, యీ
ప్రవితతకావ్యసంఘటన♦భారము నే నిటు పూను టెల్ల, రా
ఘువ! భవదీయసచ్చరణ♦కంజయుగంబు స్మరింపఁగాఁ జుమీ. ౬౭

చం.చిఱునగ వొప్పె నేమిటికొ ♦ శ్రీరఘురామ! భవన్ముఖాబ్జమం
దెఱుఁగఁగఁ దెల్పవే, తెలిసె ♦ హీం యితఁ డెక్కడఁ దుచ్ఛమానవుం?
డుఱు వగుమత్కథం బలుక ♦ నూనుట యెక్కడ? నేమి సాహసం!
బుఱక పయోధి నీఁదుటకు ♦ నూనెఁ గదే యనుచున్ హసించెదే? ౬౮

చం.తెలియుము రామ! నీవ యొక♦ధీరుఁడ వంచుఁ దలంపఁ బోకుమీ,
జలనిధి నీఁదు టెంత పని? ♦ జన్మము లెన్నిటి నెత్తినాఁడనో,
యలయక ఘోరసంసృతిమ♦హాంబుధు లెన్నిటి నీఁదినాఁడనో,
యలయిక యున్నె? నైజము సు♦మా బహుళార్తులు దేహధారికిన్. ౬౯

ఉ. తావకవర్ణనాసరణిఁ ♦ దప్పులు గల్గినఁ గోపగించుచుం
ద్రోనకు నన్ను, నావలన ♦ దోసము లే దణుమాత్రమేనియున్
భూనుచంద్ర! నీవు తెలు♦పో నలు పో నిజ మే నెఱుంగ, నా
కీనఱ కెన్నఁడేఁ దెలిపి♦తే? కనిపించితె యున్న రూపమున్? ౭౦

కం.పలువురు పరిపరివిధములఁ, బలికిరి యం దెంత నిజమొ ♦ ప్రభువ! యెఱుంగన్;
బలికెద యథార్థ మిట నీ,కలరూపుం దెలిపి తేని ♦ కారుణ్యనిధీ! ౭౧

కం.మీమహిమ మీఱ లెఱుఁగరు, శ్రీమహిళానాథ! యిట్టి♦చిత్రచరిత్రో
ద్దాముల మీముఁ దెలియంగా, నేమానవుఁడోపు,నీవ ♦ యెఱిగింపు దయన్. ౭౨

తే. చక్కఁగా ని న్నుతింగిన♦సత్యవచన,వరుఁడు పలుకుట నీతనూ♦భవులె పాడ
నీవ ప్రత్యక్షముగ విని ♦ నిక్క మనుచు,మెచ్చి యుండుట నీకథ ♦ నచ్చినాఁడ. 23

సీ. ఆమ్నాయపఠనంబు ♦ లడవియేడ్పులె కదా, తావకభక్తి య♦భావ మైన
నిత్యకర్మప్రవృత్తి ♦ నిగిడి చచ్చులె కా,తావకభక్తి య♦భావ మైన
నఖిలతీర్థస్నాన ♦ మగచాట్లకే కదా, తావకభక్తి య♦భావ మైనఁ
బట్టినామంబులు ♦ భయపెట్టుటకునె కా,తావకభక్తి య♦భావ మైన

ఆ. నీదుభక్తి లేమి ♦ నిఖిలంబు వ్యర్థంబు, ప్రాణహీనమైన♦వపువుఁ బోలె
నీదుభక్తి గలుగ ♦ నిఖిలంబు వ్యర్థంబు, నదిఁ దరించుపిదప ♦ నావయట్లు. ౨౪

శా. ప్రారబ్ధంబులు పెక్కు లెప్పుడు నను ♦ న్బాధించెడిం, గాన నా
ధీరత్వం బతిచంచలత్వముఁ గనెం ♦ దెల్వేదె, విఘ్నావళుల్
చేరం జొచ్చి కలంచుచు న్మనము ని ♦ ర్జైరంగ రా నీయ, వీ
ఘోరాపజ్జలరాశిభంగముల మ♦గ్నుం డౌచు క్షీణింతునో. ౨౫

ఉ. ఎంతటిజ్ఞానహీనుఁడ, న ♦ దెంతటిమత్తుఁడ, నెంతవ్యర్థుఁడన్,
జింతిలు చున్నవాఁడ నెటు ♦ చేకుఱు నాయభికాంక్షితం బటం
చెంతయు, నీవు రాఘవ! య♦హీనకృపామతి భీతిఁ బాపుచుం
జెంతల బాస యై నిలువఁ ♦ జేడ్పడ నేల వ్యథావిలుండ నై. ౨౬

చ. మనమున నెప్పు డేని నొక♦మాటయినన్ స్థిరసత్ప్రపత్తిచే
నను శరణంబుఁ జొచ్చినజ♦నంబులకే నభయం బొసంగెదన్
విను మిది నావ్రతం బనెదు♦నీదగువిశ్రుతవాక్య మూఁతగాఁ
గొనితిని, స్థైర్యధైర్యములు ♦ గూడె, నపాస్తము లయ్యె శంకలున్. ౨౭

ఉ. ఉల్లమునందుఁ దోఁచెను మ ♦ ఱొండుభవల్లపితంబు, నెవ్వఁ డేన్
బెల్లగు సర్వధర్మముల ♦ వీడి, దృఢోద్యదనన్యభక్తి సం
ధిల్లఁగ,నన్ను నొక్కరు, హృ♦దిన్ శరణం బన,మత్పదాప్తి రా
జిల్లఁగ నీనివిఘ్నములఁ ♦ జెండెదఁ జింతిల కంచుఁ బల్కవే. ౨౮

కం. కావున నిర్భీకుఁడ నై, కావించెద నీదుచరితఁ ♦ గావ్యము గాఁగన్
నావలనఁ దప్పు గలిగిన, నీవలననె కలిగె ననుచు ♦ నే మది నెంతున్. ౨౯

సీ. భవ్య మై మానిసం♦భావ్య మై సుజనానుభావ్య మై నవరస♦భావ్య మగుచు
హృద్య మై భక్తిసం♦వేద్య మై కావ్యాళి, నాద్య మై సతతాన♦వద్య మగుచు
శుద్ధ మై పద్యని♦బద్ధ మై శాస్త్ర సం,బద్ధ మై నిగమార్థ♦సిద్ధ మగుచుఁ
బూత మై కలితసం♦గీత మై మానిరా,జ్ఞాత మై ధర్మని♦కేత మగుచు

తే. శ్రస్య మై సర్వలోకసం♦ స్తవ్య మగుచు, దివ్య మై పార్వతీశాజ♦సేవ్య మగుచు
నవ్య మై గుణమణిగణ♦దివ్యదర్థ, మయిన కావ్యంబు రచియింతు♦నాంధ్రభాష.
తే. అమరభాషను బలికె రా♦మాయణంబు,నాంధ్రభాషనువ్యాకృతి♦కాదు్యఁ డయ్యె
నట్టివాల్మీకి మనమున ♦ నలరికున్నె,యస్మదీయాంధ్రపద్యరా♦మాయణమున. ౮౧
కం. ఉండఁగ నెంకలో వేల్పులు, కొండాడద రొక్క రాముఁ ♦ గోవిదు లేలా?
పండినమామిడి దండనె, యుండఁగఁ గీరంబు లొండు ♦ నొల్లునె చేరన్? ౮౨
తే. తక్షవిక్షపంశధారిణీ♦ధవవరేణ్య, భర్గవిధిదేవతాసము♦పాస్యమాను
ధీమహితు నధియోగి యో♦క్త్రీపుమన♦ప్ర,చోదనార్థంబు యాశ్వరి♦స్తుతియొనర్తు.
ఉ. ఖండితపాతకోత్కరు, న♦ఖండయశోజయభాగ్యశాలి, మా
ర్తండకులప్రకాండు, నహీ♦తాండజపన్నగవైరి, సత్కృపా
మండనభూషితుం, గడప♦మండలవాసుని, నొంటిమిట్టకో
దండరఘూత్తము, న్నియత♦దాస్యమున న్భజియింతు భక్తిమై. ౮౪
ఉ. బమ్మెరపోతరాజు నిర♦పాయసుఖస్థితుఁ జేయుపొంకె వా
క్యమ్ముల నిల్పి భాగవత ♦ మారి సుధారసధార లొల్కఁ, బూ
ర్వమ్మును నేఁడు నింక సరి♦వారలు మిన్నలు లేక యుండ సా
రమ్ముగఁ బల్కి నట్టిరఘు♦రాముఁడు నాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్. ౮౫
ఉ. అమ్మక! కోవెలందుఁ దన♦యమ్మయు నొంటిమి వీడి పోవ, రే
పమ్మినయాఁకటన్ శిశువు ♦ పాలకు నేడ్వఁగ, నాలకించి తా
నమ్మగ స్తన్య మిచ్చినద♦యామయి!న గ్గన వమ్మ! యమ్మ! సీ
తమ్మ! భయతుభార్తిగుని ♦ నయ్యలరాజుకులోగ్రవహించబలెన్. ౮౬

ఉత్సాహకారణ భగవద్దత్తాభయ వాగ్దానము.

కం. ఎమ్మెయి నగునో ప్రారం,భ మ్మొనరింపఁగ ని దంచుఁ ♦ బ్రార్థింప నినుఁ
లెమ్మా హరిశార్దూలా! యిమ్మహితార్ణవము దాఁటు ♦ మీ వని యన వే. ౮౭
కం. కావున నీవాక్యమ్మే, కేవల మాధారముగను ♦ గీర్తించెద నీ
పావనదివ్యచరిత్రం, బావల నే మైనఁ జేయు♦మా శ్రీరామా! ౮౮

---

## గ్రంథారంభము.

---

### వాల్మీకునకు నారదుఁడు రామాయణ ముపదేశించుట.

కం. తపమున స్వాధ్యాయంబున, నిపుణుని వాగ్విదగ్రేణ్యు ♦ నిఖిలమునిజనా
ధిపు నారదు సంప్రశ్నము, తపస్వి వాల్మీకి యిట్లు ♦ తమిఁ గావించెన్. ౮౯

సీ. ఎవ్వఁ డీధారిణి ♦ నీకాలమున గుణ, వంతుండు నతివీర్య♦వంతుఁ డెవఁడు
ధర్మజ్ఞుఁ డెవఁడు కృ♦తజ్ఞుండు నెవ్వఁడు, నిజమరియును దృఢ♦నిష్ఠుఁ డెవఁడు
సంతతానుష్ఠిత♦చారిత్రుఁ డెవ్వఁడు, సర్వభూతహితాస్థ ♦ జరగు నెవ్వఁ
డెవ్వఁడు విద్వాంసుఁ ♦ డెవఁడు సమర్థుండు, తతసద్గైకప్రియ♦దర్శనుండు

ఆ. నెవ్వఁ డాత్మవంతుఁ ♦ డెవఁడు జితక్రోధుఁ, డెవఁడు కాంతియుక్తుఁ ♦ డెవఁ డసూయ
లేనివాఁడు కలన ♦ లీల నెవ్వం డూన, నాగ్రహంబు ఘనుకు ♦ సురతతియు. ౯౦

చం. పరమకుతూహలంబు విన ♦ భావమునం దుదయించె దీని, నో
పరమమహర్షివర్య! తెలు♦పం దగువాఁడవు నీవ యిట్టిస
త్పురుషు, న టన్న నబ్జజసు♦తుండు త్రిలోకవిదుండు హర్ష సం
భరితమనోంబుజుండు విను♦మా యని యి ట్లను సాదరంబుగన్. ౯౧

సీ. నీవు కీర్తించిన♦నిరుపమగుణములు, బహుళముల్ మఱి దుర్ల♦భముల యైన
మౌనీంద్ర! చక్కఁగ ♦ మనమున యోజించి, వచియింతు నే నిట్టి♦వరగుణాఢ్యు
జనియించె నయ్యా యి♦క్ష్వాకువంశంబున, రామనామంబునఁ ♦ బ్రజలు వొగడ
నియతాత్మకుఁడుమహా♦నిస్తులవీర్యుండు, ద్యుతిమంతుఁడును ధృతి♦యుతుఁడు వశియు

తే. బుద్ధిమంతుండు సకలప్ర♦సిద్ధనీతి, పరుఁడు వాగ్మియు శత్రుని♦బర్హణుండు
శ్రీయుతుండును విపులాంసుఁ♦డాయతంబు, లైనభుజములుగలఁడును♦మహాహనుండు.

కం. కంబుగ్రీవుఁడు విపులో, రంబున వెలుఁగొందువాఁడు ♦ రాజితకోదం
డంబు గలవాఁడు శత్రుక, దంబకకాలాంతకుండు ♦ దారుణుఁ డాజిన్. ౯౩

సీ. ఆజానుదీర్ఘంబు ♦ లైనబాహులవాఁడు, రమణీయ మైనశి♦రంబువాఁడు
తరము లేనట్టి సుం♦దరలలాటమువాఁడు, కమనీయ మైనవి♦క్రమమువాఁడు
అంగైన సరిసరి♦యంగముల్ గలవాఁడు, మినమిన మను మేని♦మెఱుఁగువాఁడు
దారుణ మైనప్ర♦తాపంబు గలవాఁడు, చారుపీవరసువ♦క్షంబువాఁడు

తే. గేయ మగువాలువిరివికం♦దోయివాఁడు, మెచ్చుగొలి పెడిలచ్చిచే♦హెచ్చువాఁడు
సర్వశుభలక్షణుండును ♦ భవ్యమూర్తి, రామచంద్రుండు సుగుణాభి♦రాముఁ డనఘ.

సీ. శస్త్రధర్మవిదుండు ♦ సత్యసంధుండును, సకలభూజనహిత♦సతతరతుఁడు
సద్యశఃపూర్ణుండు ♦ జ్ఞానసంపన్నుండు, నత్యంతశుచియు స♦మాధియుతుఁడు

వశ్యుండునుం బ్రజా♦పతిసన్నిభుండును, శ్రీమంతుఁడును ధాత ♦ రిపుహరుండు
జీవలోకావన♦శీలుండు ధర్మసం,రక్షుండు నిజధర్మ♦రక్షణుండు
తే. స్వీయజనగోప్తయును సాంగ♦వేదతత్త్వ, నిపుణతముఁడు ధనుర్వేద ♦ నిష్ఠితుండు
సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞ♦చతురుఁ డనఘు, స్మృతియుతుండును బ్రతిభావి♦శేషయుతుఁడు.

ఉ. సర్వజగత్ప్రియంకరుఁడు ♦ సాధు వదీనవిచక్షణుండునున్
సర్వసరిత్తులన్ జలధి♦నా సతతార్యజనాభిగమ్యుఁడున్,
సర్వసముండు, నార్యగుణ♦శాలి, సదైకమనోజ్ఞదర్శనుం,
దుర్వర సర్వపూజ్యుఁడు, గు♦ణోత్తరుఁ డన్నిట, మానిసత్తమా! ౯౬

సీ. అతఁడు కౌసల్యాత్మ♦హర్షవృద్ధికరుండు, గాంభీర్యముననుసా♦గరముఁ బోలు
ధైర్యంబునను హిమ♦ధరణీధరముసాటి, వీర్యసమున్నతి ♦ విష్ణునిభుఁడు
ద్విజరాజుగతిని స♦ప్ప్రియదర్శనుండును, బ్రళయాగ్నిసముఁడు కో♦పంబు గదుర
నోరుపుగుణమున ♦ నుర్వీసమానుండు, ధనదసంకాశుండు ♦ త్యాగమునను
తే. నపరధర్మునియట్టివాఁ ♦ డతులసత్య,పరత మునిరాజచంద్ర! యా♦పరమపురుషుఁ
డతనికిని సుద్ది గలరయ్య♦యరయ నెంత, రాజమాత్రుండె శ్రీరఘు♦రామవిభుఁడు.

కం. రాముని నేతత్సుగుణా,రాముని నిర్వక్రఘనప♦రాక్రము జ్యేష్ఠున్
సామగుణాఢ్యునిఁ బ్రియునిన్,భూమిజనహితప్రసక్తుఁ ♦ బౌరిఁ బ్రకృతులకై. ౯౮

కం. తనయుని దశరథమహిపతి, దనమతి యువరాజుఁ జేయఁ ♦ దలపోయుచుఁ జ
య్యన జేతనము గావింపఁగఁ, జేనవుమెయిం దదభిషేక♦సంభారంబుల్. ౯౯

చం. కనుఁగొని ధారిణీశుసతి ♦ కైకయి యాధరిణీశు వేఁడఁగన్
మును తన కిచ్చినట్టివర♦ముల్ నెఱవేర్పఁగ, రాముఁ గానకుం
బనుప, నిజాత్మజున్ భరతుఁ ♦ బట్టము గట్టఁగ, ధర్మపాశ బం
ధనములఁ జిక్కి సత్యవచ♦నప్రవణుం డయి కూర్మిపుత్రునిన్. ౧౦౦

కం. రామునిఁ గానకుఁ జను మని, యామహిపతి పంప వీరుఁ ♦ డయ్యం జనియెన్
నేమము నడుపఁగఁ గయికకు, నామోదము గూర్చు జనకు♦నాజ్ఞం దీర్పన్. ౧౦౧

సీ. అడవుల కారీతి ♦ నరుగు శ్రీరామునిఁ, గని తమ్ముఁ గుఱ్ఱఁడు ♦ కరముఁ బ్రియుఁడు
నయధురంధరుఁడు న♦న్నకుఁ బ్రీతిమంతుఁడు, ననఘుసుమిత్రకు ♦ నాత్మజుండు
నగులక్ష్మణుండు నె♦య్యంబు దీపింప హా! సౌభ్రాత్ర మేపారఁ ♦ జనియె వెంట
రామునిప్రియభార్య ♦ రమణీయగుణచర్య, నయశీల హితలోల ♦ నాథునకును
ఆ. సతముఁ బ్రాణతుల్య ♦ జనకావనీశ్వర,మహితకులజ దేవ♦మాయయట్లు
సంభవించి నట్టి♦జానకి సద్గుణా,న్విత వినుతచరిత♦జాతపూత. ౧౦౨

కం. సీత సకలశుభచిహ్నో,పేత వరారోహ దశర♦థేశ్వరు కోడల్
చేతోధవు శశి రోహిణి,రీతి న్వస్నంటి చనె న♦రీణ ప్రీతిన్. ౧౦౩

కం. పౌరులు దుస్సహచింతా,భారులు దూరంబు వెంటఁ♦బడి; రటు కించి
ద్దూరము తండ్రియు ; గంగా,తీరంబును డాసి ♦ ధర్మధీనిరతుండున్. ౧౦౪

తే. శృంగిబేరపురంబును ♦ జేరి యచట,నాత్మమిత్త్రుని గుహు నిషా♦దాధిపతిని
జూచి సెలవిచ్చెఁ బొమ్మని♦సూతునకును,గుహుఁడు దాఁటించె వారిము♦గ్గురను గంగ.

ఉ. రాజకుమారులు౯ జనక♦రాజకుమారియుఁ గానకానఁ బే
రోజను గాల్నడం జని, బ♦హూదకసింధులు దాఁటి, యాభర
ద్వాజునిశాసనంబున సు♦పర్వనికాశులు చిత్రకూటము౯
రాజిలు వేడ్కఁ జేరి, తమి ♦ గ్రాలఁగ నుండిరి పర్ణశాలలోన్. ౧౦౬

కం. పుత్రకులు చిత్రకూటధ,రిత్రీధరవాసు లయినఁ ♦ బ్రేమభరమునం
బుత్త్రునకై విలపించుచు, ధాత్రీపతి చనియె సమర♦ధామముఁ జేరన్. ౧౦౭

కం. జనకుం డీల్గుట రాజ్యం,బునకు వసిష్ఠాదివిప్ర♦ముఖ్యులు దన్నుం
బనిపూని వేఁడ భరతుఁడు, గొనఁ డయ్యె న్వారిమాటఁ ♦ గొనసాగింపన్. ౧౦౮

సీ. అమ్మహాబలుఁడు ని♦జాగ్రజాంఘ్రిప్రసా,దార్థి యై వనమున ♦ కరిగి రాము
ననఘు మహాత్ము య♦థార్థపరాక్రము,నార్యభావంబున ♦ నడిగికొనియె
నన్న! ధర్మజ్ఞుండ ♦ వైన నీవే రాజు,గా నుండవే యనఁ ♦ గరుణఁ జూచి
రాముండు త్యాగాభి♦రాముండు సుముఖితో,ద్దాముండు సద్యశో♦ధాముఁ డయ్యెఁ
తే. దండ్రియాదేశమును మదిఁ ♦ దలఁచి రాజ్య,పాలనం బొల్ల కతనికిఁ ♦ బావ లిచ్చి
తనకు మాఱుగఁ,బొమ్మంచుఁ♦దఱిమి చెప్పి,పంచె నతని నయోధ్యకు ♦ భరతుఁ డంత.

కం. కామము నెఱవేఱమి నే, రాముని పాదుకలఁ గొల్చి ♦ రామాగమనం
బే మది వేచుచు నంది,గ్రామంబున నిస్పృహతను ♦ రాజ్యముఁ జేసెన్. ౧౧౦

సీ. భరతుఁ డట్టులు చనఁ ♦ బౌరులు మఱిమఱి, దనుఁ జూడ వత్తు ర♦ న్తలఁపుఁ జేసి
దండక విజితేంద్రి♦యుండు సత్యాత్ముండు, సొచ్చి విరాధుని ♦ స్రుక్కఁ జేసి
శరభంగు దర్శించి ♦ చని సుతీక్ష్ణునిఁ గాంచి, కనుచు నగస్త్య న♦గస్త్యభ్రాతఁ
గను మోదమునను న♦గస్త్యమాటన యైంద్ర,ధనువు ఖడ్గముఁ దూణి♦సునిశితంబు
తే. లక్షయశరంబులం గొనె ♦ నటవిచరుల,తోడ నుండెడి రఘురాము♦తోడ మౌను
లసురరాక్షససంహార ♦ మర్థి వేఁడ, నట్ల కావింతు నని వారి ♦ కభయ మిచ్చె.

ఉ. ఆనరపాలచంద్రసుతుఁ ♦ డచ్చట నిచ్చఁ జరించుచో జన
స్థాననివాసిని౯ భయద♦దానవకామినిఁ గామరూపిణి౯

బూని విరూపఁ జేయ నది ♦ బోదనచేసిన సర్వరాక్షసుల్
తో సమునం ద్రిశీర్ష ఖర♦దూషణముఖ్యులు దన్నుఁ దాఁకినన్. ౧౧౨

ఉ. వారిని వారివారి సని♦వారణవారణవిక్రముం డనిన్
వీరుల నాలుగుంబదియు♦వేవుర రాఘవుఁ డేకతంబ దో
స్సారమున న్వధింపఁ దన♦జ్ఞాతులసంహరణంబు విన్కిఁ దు
ర్వారతాగ్రహంబుమెయి ♦ రావణుఁడుం దనకుం సహాయతన్. ౧౧౩

శా. మారీచుం దనురాక్షసాధిపుని సం♦ప్రార్థింప వాఁడెంతయే
నోఁగి రావణ! నీకుఁ గానిపని ద♦ర్పోద్రిక్తుఁడా రాముతోఁ
బోరాటన్ ఘటియింప సం చతసనికిన్ ♦ బోధింప, నద్దైత్యుఁడుం
బ్రేరింపన్ శమనుండు, నీతి రుచి గా♦మిం, బోయెఁ దద్యుక్తుఁడై. ౧౧౪

ఉ. మాయలమారి యాయసుర ♦ మానవనాథతనూజయుగ్మ మెం
తో యెసగల్గ రావసులఁ ♦ దోడ్కొని పో, రఘురాముదేవి వై
దేయకులాధినేత గొని ♦ తెప్పునఁ బోవుచు నాజటాయు ధూం
తాయువుఁ జేసి లంకను ధ♦రాత్మజ నుంచె నశంకితాత్ముఁడై. ౧౧౫

సీ. పక్షిరాణ్మరణంబు ♦ భార్యాపహరణంబుఁ, గని విని రాముండు ♦ కళవళించి
యాకులేంద్రియుఁ డయి ♦ యాగృధ్రరాజున, కగ్నిసంస్కారంబు ♦ లాచరించి
హా యని పలవించి ♦ యఖిలవనంబుల, వెదకుచో వైదేహి ♦ వికృతరూపు
ఘోరదర్శనుని ర♦క్షోనాథునిఁ గబంధుఁ, గని త్రుంచి దహియింపఁ ♦ జనియె వాఁడు

తే. నాకలోకంబునకు; నాతఁ ♦ డరుగువేళ, శబరి వరధర్మచారిణి ♦ శ్రమణి గలదు
సకలసద్ధర్మనిపుణ యా♦సతిని జూడఁ, బొమ్మటంచును బోధించి ♦ పోవుటయును.

కం. ఆపగిదిశత్రుదమనుఁడు, భూపసుతుఁడు చక్క శబరి♦పూజలఁ గొని యి
చ్ఛాపూర్తి కామె చెప్పిన,రూపునఁ బంపాసరస్సు♦రోధముఁ జేరెన్. ౧౧౭

కం. హనుమత్కపి నటఁ గని యా,తనివచనముపేర్మి సూర్య♦తనయునితోఁ బొం
దొనరించి తనదుకథయును, వినిచెన్ సర్వంబు సీత♦వృత్తాంతంబున్. ౧౧౮

కం. అంతయు విని కపి నలినీ,కాంతతనూజుండు చెల్మి ♦ గావించె ధరా
కాంతకుమారునితో నే,కాంతము హుతవహుఁడు సాక్షి♦గా నామీఁదన్.

చం. తనకును వాలికిం బగవి♦ధంబు దివాకరసూతి చెప్పినన్
విని ఘను వాలిఁ గూల్ప రఘు♦వీరుఁడు పూని ప్రతిజ్ఞచేసినన్
విను మని వాలివీర్యబల♦విక్రమము ల్వినిపించి యార్తిలో
ననకులుఁ డింద్రజున్ గెలుచు♦నే యని సంశయలోలితాత్ముఁడై. ౧౨౦

ఉ. నమ్మిక యీనుపొంటె దిన♦నాథతనూజుఁడు గానిపింప గో
త్రస్మున నుండుదుందుభిసు♦రప్రకరారికళేబరంబు హా
స మ్మిగురొత్తఁ జూచి బల♦శాలి వెసన్ దశయోజనంబులం
జిమ్మెఁ దదస్థిద్రెళ్ల రఘు♦సింహుఁడు పాదమునంగుటంబునన్. ౧-౨౧

కం.లీలగ నొక పెనుఁగోలను, సాలాగమస్తకంబు ♦ శైలవరంబున్
దూలించె రసాతలమున, ప్రీలని ప్రత్యయము గలుగ ♦ వీరుం డంతన్. ౧-౨౨

కం.బంధుర మగువిశ్వాసము, సంధించుచుఁ బ్రీతమాన♦సము పెంపునఁ గి
ష్కింధాగుహకును నలినీ,బాంధవజుం డరిగె రామ♦భద్రునితోడన్. ౧-౨౩

ఉ. కాంచనపింగళుండు ప్లవ♦గప్రభుఁ డర్కతనూజుఁ డంత గ
ర్జించినఁ దద్రవంబు విని ♦ జిష్ణుతనూజుఁడు యుద్ధకాంక్ష నే
తెంచుచు దార తారకును ♦ దెల్పి భయంపడకుండ, సూర్యజున్
నొంచిన, వానిఁ ద్రుంచెను ఘ♦నుం డొక కోలను నేలఁ గూలఁగన్. ౧-౨౪

ఆ. మిత్రపుత్రుమాట♦మేరగ వాలిని, రణమునందుఁ ద్రుంచి ♦ రాఘవుండు
వానిరాజ్యమున ది♦వాకరతనయునే, పట్టమొప్పఁ గట్టెఁ ♦ బ్రాభవముగ. ౧-౨౫

ఉ. సీతను రోయఁగాఁ బనిచెఁ ♦ జెచ్చెర వాసరనాథసూనుఁ డ
త్యాతతవిక్రమాఢ్యుల మ♦హాకపివర్యుల, వారిలోన సం
పాతివచఃప్రబోధమునఁ ♦ బావని యామడ లొక్క నూఱునై
భీతిద మామహార్ణవముఁ ♦ బెల్చనఁ దా నవలీల దాఁటుచున్. ౧-౨౬

కం.రావణపాలిత మౌలం,కావరనగరంబుఁ జొచ్చి ♦ కనియెను బహుశో
కావిల నశోకవనగత, శ్రీవాస న్నాథసక్త♦చేతన్ సీతన్. ౧-౨౭

కం.వైశ్వానరహితతనయుఁడు, విశ్వాసముపుట్టఁ జూపి ♦ విభుముద్రికఁ దా
నాశ్వాసించెను సతి; హరి,నశ్వసుతునితోడి చెలిమి ♦ యగుటయుఁ జెప్పెన్.

సీ. తోరణంబును బ్రవి♦దారణం బొనరించి, పంచసేనానులఁ ♦ ద్రుంచి వైచి
సప్తమంత్రిసుతాళి ♦ సప్తాశ్వసుతుఁ గూర్చి, శూరు నక్షుని నల్పి ♦ చూరు చేసి
బ్రహ్మాస్త్రమునఁ జిక్కి ♦ బ్రహ్మవరంబునఁ, గట్టు వాసినయట్టి♦గుట్టు దెలిసి
తను లాగుదైత్యుల ♦ మనమున మన్నించి, సీత దప్పఁగ లంక ♦ భూతిఁ జేసి
తే రయముమెయి దాశరథికిని ♦ బ్రియముఁ జెప్ప,మరలి చనుదెంచివానర♦వరుఁడుధీర
తామహోత్తరుఁ గాంచిప్ర♦దక్షిణించి, కంటి జానకిఁ దత్త్వయు♦క్తముగ ననియె.

సీ. సూర్యకులుం డంత ♦ సూర్యాత్మజునితోడఁ, జేరి మహోదధి♦తీర మచట
సూరసన్నిభశరా♦సారంబునసు వార్ధి, జాలఁగ నల్లక♦ల్లోలపఱుప

నాపగానాయకుం ♦ డోపక తనరూపు, నవు డూని బోధింప ♦ నుపమ త్వష్టృ
సూతిచేఁ గట్టించి ♦ సేతువు నాత్రోవ, లంకాపురంబు ని♦శ్శంక మరిగి
తే. రణతలంబున దైత్యు రా♦వణునదించి,క్షమసుతనుబొందిలజ్జాభ♦రమునఁ గుంది
నిందుసభనిష్ఠురములు రా♦ముందువలుక,క్ష్మాతనూజాతచితిసొచ్చె ♦ సాధ్విగాన.
కం.క్షితిసుత నిస్తులితపతి,వ్రతయని హుతవహుఁడు వలుక ♦ రామవిభుం డా
సతినిఁ మరలం గైకొని, యతిమోదం బందె వేల్పు♦లందఱుఁ బొగడన్. ౧౩౧
కం.సురతతిచేఁ బూజితుఁడై, కర మలరెఁ రాముఁ డతని♦ఘనకార్యమునఁ
సురమునిగణములు సచరా,చర మగుముల్లోకములును ♦ సంతోషించెన్. ౧౩౨
కం.శ్రీరాముండు విభీషణు, నారక్షోవిభుఁగ లంక ♦ నభిషేకమునఁ
గూరిమిఁదానొనరించియు, వీరుఁడు గృతకృత్యుఁ డగుచు ♦ విజ్వరుఁ డయ్యెన్.
సీ. స్వర్గవాసులచేత ♦ వరములఁ దా నొంది, మృతకపులకు నసు ♦ లిచ్చి మనిచి
మిత్రవృతుం డయి ♦ మిత్రకులాగ్రణి, యరి కసాధ్యము నయో♦ధ్యం గనంగఁ
బుష్పకారూఢుఁ డై ♦ పోవుచో దిగి త్రోవ, నల్ల భరద్వాజు♦నాశ్రమమున
భరతాంతికమునకుఁ ♦ బవమానసుతు నంపి, పుష్పకంబును నెక్కి♦పురమునకును
తే. బోవుచోఁ బూర్వకథను సు♦గ్రీవుతోడ, ముచ్చటించుచు నెలమి నా♦సచ్చరిత్రుఁ
డనుజుఁ డున్న నందిగ్రామ♦మందు డిగ్గి, జడల నట వీడె సోదర♦సహితుఁ డగుచు.
కం.తనతో వెలయఁగ భూమీ,తనయామణి రాజ్యరమను ♦ దాల్చెఁ మరలఁ
దినమణితేజుఁడు దశరథ,తనయుఁడు భువనంబు లతిము♦దంబున వఱలన్. ౧౩౫
కం.విష్టపచయములు మిగులఁ బ్ర,హృష్టములై యొప్పఁ బుష్క ♦ లేపార మెయిఁ
శిష్టులు సుధార్మికులుఁ గడుఁ, బుష్టిని గని రవని రామ♦భూవరుఁ డేలన్. ౧౩౬
కం.ఆధులు పొసఁగవు జనులకు, వ్యాధులు తను వంట వాస్థ ♦ కవరోధముగా
సాధుల కీతు లనంబడు, బాధలు లే వెందు రామ♦పాలనమందున్. ౧౩౭
కం.కానరు పుత్రులమరణము, మానరు సాధ్వీగుణంబు ♦ మానవతుల్ దా
మూనరు వైధవ్యము వై,శ్వానరుభయ మింతయేనిఁ ♦ బాటిల్ల దెటన్. ౧౩౮
కం.కూలవు జంతులు జలముల, ఫ్రీలదు ప్రజ వాతజాత♦భీతిం, జోరుల్
గ్రాలరు, వేఁకిని నాఁకట, వ్రాలుట లేదెందు రామ♦రాజ్యమునందున్. ౧౩౯.
కం.పురముల జనపదములఁ గాఁ,పురములు గావించుజనులు ♦ భోగాభోగ
స్ఫిరతను ధనధాన్యంబులఁ, గరము సుఖంచెదరు కృతయు♦గంబునఁ బోలెన్. ౧౪౦
ఆ. వాజపేయశతము ♦ బహుసువర్ణకములఁ, గూర్మిఁ జలిపి కోట్ల♦గోచయముల
నెన్నరానిధనము ♦ లిచ్చి బ్రాహ్మణులకు, బ్రహ్మలోక మరుగుఁ ♦ బ్రథితగుణుఁడు.

ఆ. రామచంద్రవిభుఁడు ♦ రాచవంగడముల, నిలిపి నూర్లకోలఁడి ♦ నిల్కడ నిల
నాల్గువర్ణములజ♦నంబులఁ దమతమ,ధర్మమందు నిలుపుఁ ♦ దలఁగకుండ. ౧౪౨
కం లోకంబు లేలి యబ్దము, లేకాదశదశశతంబు ♦ లేకాకృతి ధ
రైకరతుం డయి రాముఁడు, ప్రాకటగతి బ్రహ్మలోక♦పదముం జేరున్. ౧౪౩
చం.కడుఁబరిశుద్ధముఁ, సకల♦కల్మషనాశము, పుణ్య మిచ్చుటం
దడయదు, వేదసమ్మితము ♦ తారకరూపము, దీర్ఘకాలముఁ
బుడమి సుఖింపఁ జేయు గణ♦పుత్రకపౌత్రకయుక్తి, నిద్ది యే
ర్పడఁ బఠియించినం, బిదప ♦ వాఁడు సుఖించును జచ్చి స్వస్థినితిన్.[1] ౧౪౪
ఉ. వాగృషభత్వముఁ, సకల♦వార్ధిపరీతధరాపతిత్వముఁ,
బాగుగఁ బణ్యలాభము, న♦పారమహత్త్వముఁ గల్గు నీకృతిఁ
సాగఁగ విప్రభూమిధవ♦సంఘము వైశ్యులు శూద్రకోటి శ్ర
ద్ధాగరిమం బఠించిన య♦థావిధి విన్నఁ బఠింప నారయన్. ౧౪౫

సంక్షేపరామాయణము సమాప్తము.

---

## వాల్మీకిమహర్షి తమసాతీరంబున విహరించుట.

ఆ. అనుచు నారదుండు ♦ హర్షరసావిష్ట,చిత్తుఁ డగుచుఁ దెలియఁ ♦ జెప్పుటయును
వాక్యకుశలుఁ డైన♦వాల్మీకి యస్తోత్త్రరంబు నాలకించి ♦ శ్రద్ధతోడ. ౧౪౬
చం.అడిగినయర్థ మెల్లఁ బర♦మాప్తతఁ గర్ణరసాయనంబుగా
నొడువుట నోమహాశయ! య♦నూనసుధారసతుందిలోక్తి, ని
ప్పుడ కృతినైతి నం చతనిఁ ♦ బూజలఁ దన్పి సశిష్యవర్గుఁ డై
కడుఁ బరితుష్టుఁ జేసె నన♦ఘవ్రతుఁడుఁ హృదయంగమోక్తులన్! ౧౪౭
తే. అర్చనల నంది యాగతి ♦ హర్ష మొంది,నారదుఁడు దాను బోవ నా♦నతని బొంది
చనియెను యథేచ్ఛ మాకాశ♦సరణిఁబట్టి, దేవలోకంబుఁ జేరంగ ♦ దేవమౌని.
కం.నారదుఁ డరిగిన గంగా,తీరంబున కనతిదూర♦దేశంబున ని
హ్నారివరకుసుమభరవి,స్తారలతాచారుకుటిని ♦ దమసాతటినిన్. ౧౪౯
మత్తకోకిలము. రాజితద్యుతి వాల్మికర్షి యు ♦ రాఁగ వెన్కొని త స్భర
ద్వాజుఁ డన్ప్రియశిష్యవర్యుఁడు ♦ వారి నాడఁగ నేగి, పే
రోజ మై నడిపుంట రాజిల ♦ నుగ్రదీధితి, చార్వను
ద్వేజితాంబులఁ గాంచి యిట్లనుఁ ♦ బ్రీతుఁ డై నిజశిష్యుతోన్. ౧౫౦

---

[1] స్వస్థినితి = మోక్షపదవి. శ్లో. విద్వేషాదపిగోవిందం దమఘోషాత్మజస్స్మరన్ ।
శిశుపాలోగతస్స్వర్గం కింపునస్తత్పరాయణాః ॥ అత్రిస్మృతి.

కం. అంబువులఁ గంటె సుజనుమ, నంబునకుం దుల్య మగుచు ♦ నవ్యము రమణీ
యంబై నిరతంబుఁ బ్రస,న్నంబై నిష్పంక మగుచు ♦ ననువుం గూర్చెన్. ౧౪౧
కం. తెమ్మా యావల్కల మిటు, లిమ్మా కలశంబు నుంపు ♦ మిమ్మగు నెడ వే
రమ్మా వత్సా! నేస్నా,నమ్ముం గావింతుఁ బుణ్య♦నది తీర్థమునన్. ౧౪౨
కం. అని పలుకుచు వల్కలముల్, ఘనుఁడు భరద్వాజుఁ డీయఁ ♦ గైకొని యతఁడీ
ఖని యారఁ! సంచరించుచు, వనసీమల్ విపులవిటపి♦వారోద్దామన్. ౧౪౩

**బోయ క్రౌంచపక్షిని వధించుట వాల్మీకిమహర్షి చూచుట.**

కం. అంచితచారుస్వనమై, చంచచ్ఛద మగుచు సురత♦సంగతిఁ గదురా
ణించెడివిరహాసహన, క్రౌంచద్వంద్వంబు మాని ♦ కనెఁ జేయలఁతిన్. ౧౪౪
ఆ. వానియందు నొక్క♦దానిని మగపక్షిఁ, గూల్చె వైరబుద్ధిఁ ♦ గూళ యొకఁడు
పాపనిశ్చయుండు ♦ తూపునొక్కటి దొడి, తానుజూచుచున్న♦నైన నుఱక. ౧౪౫
కం. అంతటఁ గనుఁగొనె ముని భగ,వంతుఁడు బహుళాస్రపూర♦పరిమగ్నంబై
యెంతయు మెడ వ్రేలాడ, న్గెంతం బడి పొరలు చున్న♦నీడోద్భవమున్. ౧౪౬
కం. ఎత్తతి నేనిం బాయక, హత్తిన నెయ్యమున వెంట ♦ నంటెడుమగనిన్
మత్తిల్లి యున్న వానిని, నెత్తురు ముంపఁగ శిరంబు ♦ నేలం బొరలన్. ౧౪౭
కం. విలవిల మని ప్రాణానిల,ములఁ బాయుచు విస్తృతవక్త్ర♦ముసు గలకాంతుల్
జేలజేలఁ గన్నుల నీళ్లు లు,రలగం గని కూసెఁ బెంటి♦క్రౌంచము వగచేన్. ౧౪౮
ఉ. ఎంతయుఁ గీచుకీచు మని ♦ యీరెలుఁ గొప్పఁగఁ గూయుచుల్, ధవుం
బెంతను వ్రాలి చంచువునఁ ♦ జీఱుచు, బోయకు నుల్కిపాఱుచుల్,
బొంతను గొన్నవ్రాలి నిజ♦పూరుషుఁ జూచుచు, నేడ్చు కాంత నే
కాంతము చూచి నేలపయిఁ ♦ గ్రౌంచము గూలుట కాంచి యాత్మలోన్. ౧౪౯
ఆ. కంఁగి ధర్మవిదుఁడు ♦ కడువగఁ దత్కృతి, నెఱికి దూరి మగుట ♦ నిశ్చయించి
భ్రుకుటి వికటముగను♦రోషతామ్రాక్షుఁడై, కఱకుటెఱుకుఁజూచి♦కరుణమాలి.

**వాల్మీకిమహర్షి బోయను శపించుట.**

తే. తెలియు మా నిషాదుండ! ప్ర♦తిష్ఠనీక, ప్రాప్తమయ్యెడు శాశ్వత♦హాయనములఁ
గ్రౌంచమిథునంబునందు నొ♦క్కండు నీవు, కామమోహితముంజంపు♦కారణమున.
చం. అని శపియించి కోప మెడ ♦ నాఱినఁ గూరినచింత నెంతయుం
బన నెడిక్రౌంచపక్షిదుని♦వస్థకుఁ గాఁగ నిషాదుఁ గూర్చి నే
ననినది యేమి యంచును మ♦హామతి దాఁ దలపోసి యాత్మలోఁ,
గనుఁగొని శిష్యు నిట్లనియెఁ ♦ గాంచితె వింత నొకండు నేఁ డిటన్, ౧౬౨

తే. కినిసి కుమతినిషాదుని♦కీడుసేఁత, కాత్మఁ దపియింప శోకార్తి ♦ నాడినట్టి
భాషితముపద్య మగుచును ♦ బరిఢవిల్లె,నది భరద్వాజ! చిత్ర మిం♦ట్టిదియుఁ గలదె.
కం. సమపాదచతుష్కంబై, సమవర్ణాన్విత మగుచుఁ ♦ జారువిపంచీ
క్రమతాలలయాన్వితమై, కొమరారుచునున్నయదియుఁ ♦ గోవిదవర్యా! ౧౬౪
చం. అనుచును వామలూరుభవుఁ ♦ డాదటఁ బల్క గురూక్తి వించు స
ద్వినయముతోఁ దదుక్తికిని ♦ విస్మయ మందుచు వాగ్విధేయ మై
పనుగొనఁ జేయ శ్లోకమును ♦ వాల్మికుఁ డెంతయు సంతసించె శి
ష్యునిచరితంబుఁ గాంచి; కవి ♦ కూఁతుట లోకము మెచ్చులే కదా. ౧౬౫
చం. అనల యథావిధిన్ మునికు♦లాగ్రణి యేటఁ గృతావగాహుఁడై
సవిధమునందుఁ బూర్ణకల♦శంబును గొం చరుదేర ఛాత్రుఁడున్
దవులఁగఁ జింత పద్యమునఁ ♦ దత్పరుఁ డౌచు నిజాశ్రమస్థలిన్
గవితిలకంబు చేరి హిత♦గాథలఁ బ్రొద్దులు పుచ్చి వెండియున్. ౧౬౬

## బ్రహ్మ వాల్మీకిని జూడ వచ్చుట.

చం. చటులవిషాద మూనుచు ని♦షాదుని దిట్టి వచించి నట్టియా
పటుతరపద్యముం గుఱిచి ♦ పావనశీలుఁడు భావనారతిన్
దిటముగ నుండ, భూరినిజ♦తేజము దిక్కుల నిండ హస్తసం
పుటములతోడ యోగిజన♦పుంగవు లెల్లరు వెంట నంటఁగన్. ౧౬౭
కం. వచ్చెను వాల్మీకిం గన, నచ్చపుమచ్చికను దాన ♦ యబ్జజుఁడు త్రిలో
కోచ్చయకర్త మునుత్తలి, విచ్చలవిడి బలసి కొలువ ♦ వివిధస్తుతులన్. ౧౬౮
పంచచామరము. ఇటాచతుర్ముఖుండు రాఁగ ♦ నిష్టశిష్టపాళితోఁ
దటాలున న్మునిప్రభుండు ♦ తద్ద భక్తియుక్తుమై
నిటాల మందుఁ గేలుదోయి ♦ నిల్పి మ్రొక్కి నిల్చి తా
నిశేటికో ననుం గనంగ ♦ నేగుదెంచె ధాతయున్. ౧౬౯
కం. అని కడు నచ్చెరుపడి ముని, వినయంబున నర్ఘ్యపాద్య♦విధిఁ బూజనముల్
ఘనముగఁ జల్పి యథావిధి, గను సాష్టాంగముగఁ బ్రణతిఁ ♦ గావించిమఱిన్. ౧౭౦
ఆ. కుశలవార్త లడుగఁ ♦ గూర్చుండి వీక్షిస్తె, నబ్జభవుఁడు మౌని♦నాజ్ఞసేయఁ
జిఱుతయాసనమునఁ ♦ జేరికూర్చుండియు, వదలఁ డయ్యె నెఱుకు♦వానిచింత. ౧౭౧
ఆ. పాపబుద్ధి యకట ♦ పగఁబూని వగపూని, యేమికతము లేక ♦ భూమిఁ గూల్చె
నట్టిచారునినద ♦ మమరు క్రౌంచంబు నా, యెఱుకువాఁ డదెట్టి♦కఱకువాఁడొ.
ఆ. అనుచు నాఁడుపక్షి♦వ్యసనంబు మఱిమఱి, తలఁచితలఁచి వగపు ♦ దలకొసంగఁ
దా రచించి నట్టి♦తత్పద్యమును గూర్చి, మనములోనఁ జింత ♦ మునుఁగుచున్న.

### ⟵ బ్రహ్మ వాల్మీకిని రామాయణముఁ జెప్ప నియమించుట. ⟶

మ. దరహాసాంకుర మొప్పఁ బద్మభవుఁ డా♦ధన్యాత్ము వీక్షించి సా
దరుఁడై యేటికిఁ జింతసేయ మునినా♦థా! శంకఁ బోవీడు మీ
యరయన్ బద్యమె చుమ్ము యద్ది, యెటులో♦రా వచ్చె నం చెంచ, కా
వరణిం దెల్పెద, మన్నిదేశమున భా♦షాకాంత నీవాక్కునన్ ౧౭౪

చం. అమరఁగ నిల్చి పల్కెను, ఘృ♦ణాక్షరధర్మము గాదు నీవు ప
ద్యము రచియించు టెల్ల, నటు♦లౌటను రామకథాప్రపంచ మ
త్యమలినభక్తియుక్తిని మ♦హాకృతి సేయుము నారదోక్తత
త్త్వమమున; సద్గుణాంబునిధి ♦ ధర్మియు రాముఁడె చూ మునీశ్వరా! ౧౭౫

ఉ. ఆమతిమంతుసచ్చరిత♦యందు నగూఢనిగూఢవృత్తముల్
రాముని తత్సహోదరుని ♦ రాక్షసపాళుల సీతవృత్తముల్
ధీమహితా! భవన్మతికిఁ ♦ దెల్లముగాఁగను గోచరించెడిన్
నీమహనీయకావ్యమున ♦ నేరదు దబ్బ లొకండునుం జొరన్. ౧౭౬

కం. ఇంచుక యైనను గావునఁ, గొంచక శుభరామకథను ♦ గొబ్బునఁ గృతిఁ గా
వించి మనోహరసత్పదాంచితగా ధరణి వెలయు♦నటు సేయ వనా. ౧౭౭

కం. ఎందాఁకఁ గులధరావళు, లెందాఁక నదీనదంబు ♦ లిల వెలయునొ తా
నందాఁక రామకథ జగమందున్ స్థిర మగుచు నిలుచు ♦ నయ్య మునీంద్రా. ౧౭౮

కం. నీరామాయణకావ్యము, ధారుణి నెందాఁక నిలుచుఁ ♦ దత్పర్యంతం
బార యశంబును గని మని, మారమ్యజగంబుఁ బొందు♦మా యామీఁదన్. ౧౭౯

కం. అనుచు వచించి విరించియుఁ, జనుమం దత్శ్రుక్తి కలరి ♦ సారాద్భుతవా
ర్ధిని మునిఁగెను శిష్యులతో, మునివరుఁ డెవఁ దలఁచి తలఁచి ♦ మునుపటిచరితన్.

కం. పౌనఃపున్యముగాఁ దమ, మానసముల ముదము వర్ధ♦మానముగా న
మ్మానీశుశిష్యు లెల్లరు, మానుగఁ గడువింత యనుచు ♦ మఱిమఱి తమలోన్. ౧౮౧

కం. ప్రకటముగ సమవర్ణం, బై కొమరారుచును నాలు♦గం(ఘ్రు)లకలిమిన్
శోకమె శ్లోకం బగుచును, శ్రీకరమై చెలఁగె నిట్టి♦చిత్రము గలదే. ౧౮౨

కం. అని యలర భావితాత్ముఁడు, ముని రామాయణసుకావ్య♦మును రచియింతున్
బనిగొని యేతాదృశపద్యనిగూఢముగాఁగ నంచు ♦ నాత్మం దలఁచెన్. ౧౮౩

కం. సారమనోహరవాక్యోదారము సమవర్ణవృత్త♦తతగూఢార్థా
ధారము నవమలకీర్తివిహారము రామాయణంబు ♦ నఘహరణంబున్. ౧౮౪

కవిరాజ విరాజితము.

సరసనమాసవిలాసవిభాసము ♦ సాధునుతంబు సుసంధిగముఀ
వరమధురోపనతార్థసువాక్యని♦బద్ధము యోగసమంజసము
క్షరదశకంఠవధాధికృతంబు మ♦నస్సుఖదంబు మునీరితముఀ
స్ఫురదురుసద్గుణభూషణభూషిత♦ముఀ వినుఁడీ రఘురామకథన్. ౧౮౫

⟵ వాల్మీకి యోగదృష్టిచే రామచరిత మంతయుఁ గనుట. ⟶

కం. అని ధర్మాత్ముఁడు వాల్మికి,[1] ఘనధర్మయుతంబు రామ♦కథ సర్వంబుఀ
గనఁగ యథార్థము నాలో,చన సేయఁగ సాగె మిగుల ♦ శ్రద్ధాన్వితుఁ డై. ౧౮౬

కం. వారిచి కరములు మోడిచి, తూరుపుకొనదర్భలపయిఁ ♦ దోరపుయోగం
బార సుఖాసీనుం డై, సారమతిం గనఁగ రామ♦చంద్రుని చరితన్. ౧౮౭

ఉ. ఆరయ రామలక్ష్మణభ♦రాత్మజలుఀ స్వసతీసమేతుఁడా
ధారణిభర్త యుం, బ్రజలు ♦ దద్దయు నెయ్యెడ నేది సల్పిరో
వారల యాచరిత్రములు ♦ వారలనవ్వులు వారిమాటలుఀ
వారలరాకపోకలును ♦ వారలచేష్టలు నున్నరూపునన్. ౧౮౮

ఆ. స్త్రీతృతీయుఁ డైన♦శ్రీరఘురాముఁడు, సత్యసంధుఁ డగుచుఁ ♦ జలిపె నెవ్వి
కానలోన నట్టి♦కార్యంబు లన్నియుఁ, గరతలామలకము ♦ గాఁగఁ గాంచె. ౧౮౯

ఆ. మఱియుఁ గోరి యోగ♦మార్గావలంబుఁ డై, నెఱిఁ దదేకనిష్ఠుఁ ♦ గొఱలి కాంచి
యనఘరామకథ య♦థార్థంబుగా సర్వ, మొందుకృతి రచింప ♦ నూనె నపుడు.

శా. కామార్థంబులు నించుకించుకయ గ♦ల్గఀ, ధర్మమోక్షంబు లు
ద్దామస్ఫూర్తిని విస్తరిల్ల, వరర♦త్నస్ఫారవారాశియ
ట్లామానీశుఁడు సంఘటించె రఘురా♦మాధీశుకావ్యంబు ము
న్నేమాడ్కిఀ సురమౌని పల్కె నటు లెం♦తేఁ గర్ణపేయంబుగాన్. ౧౯౦

ఉ. రామునిపుట్టు, వాతనిప♦రాక్రమముఀ, సకలానుకూలతఀ
భూమిజనప్రియత్వమును, ♦ భూరితితిక్షయు, సౌమ్యసత్యసం
ధామహిమంబు, గాధిజక♦థాకథనంబు, ధనుఃప్రభంగముఀ
భూమిసుతావివాహమహ♦ముఀ, జమదగ్నిజుతో వివాదమున్. ౧౯౧

ఉ. రామగుణోత్కరంబు, యువ♦రాజుగ నౌనభిషేకయత్నముఀ,
గాముక కైక పల్కుబడి ♦ కాంక్షిత, మాయభిషేకవిఘ్నముల్,
రామవివాసనంబును, ధ♦రాపతి శోకముచేత నీల్గుటల్,
భూమిజనార్తి, తజ్జనుల ♦ భూమిసుతాపతి వీడి పోవుటన్. ౧౯౩

[1] వాల్మీకి - వాల్మికి. వాల్మీకుఁడు - వాల్మికుఁడు రూపాంతరములు.

చం. సొరిది గుహాభిభాషణము, ♦ సూతనివర్తన, మభ్రవాహినీ
తరణము, వాజధారిముని♦దర్శన, మావలఁ జిత్రకూటభూ
ధరవరదర్శనంబు, దశ♦ధామనిమిత్తము వాస్తుకర్మముల్,
భరతుసమాగమంబును, గృ♦పామతి నాతని నాదరించుటల్. ౧౯౪

చం. జనకునకున్ నివాపము లొ♦సంగుటయున్, మఱిపాదుకాభిషే
చనమును లోనుగాభరతు♦చర్యయు, రాముఁడు దండకాటవిం
జనుట, విరాధుమారణము,♦సంయములన్ శరభంగునిన్ సుతీ
క్ష్ణునిఁ గను, టంత సీత కన♦సూయ యొసంగుట యంగరాగముల్. ౧౯౫

కం. ఘటసంభవదర్శనమును, జటాయుసంభాషణంబుఁ ♦ జని పంచవటి
తటమునకున్ శూర్పణఖన్, ఘటితవికారావఘునగఁ ♦ గావించుటయున్. ౧౯౬

ఉ. ఏచి ఖరత్రిశీర్షుల జ♦యించుట,రావణనిగ్రహంబు, మా
రీచవధంబు, సీతను హ♦రించుటయున్, రఘురాముశోకమున్
నీచనురారి గృధ్రపతి ♦ నీఱుగఁ జేతఁ, గబంధదర్శనం
బాచతురాత్మ యాశ్రమణి♦యాశ్రయమున్, హనుమంతుఁ జూచుటల్. ౧౯౭

తే. ఋశ్యమూకంబునకు నేగి ♦ యినసుతునకు, నస్థికముఁజూపి నెయ్యంబు♦నెమ్మిఁ జేసి
వాలిసుగ్రీవు లని సేయ♦వాలిఁ గోలఁ, ద్రుంచి సుగ్రీవు రాజుఁ గా♦వించుటయును.

కం. తారార్తియు సమయము వ,ర్షారాత్రి నివాసనంబు ♦ రఘుపతికనలున్
వైరోచని కపిసేనా,వారముఁ జేర్పుటయు దిశలఁ ♦ బంచుట కపులన్. ౧౯౯

ఉ. భూమిని వేదనంబుక్రమ♦మున్, మణిముద్రికయీవియున్,గుహన్
ధీమహితు ల్గవీశ్వరులు ♦ దేఁకునఁ జొచ్చుట, చావఁ గోరుచున్
భూమి శయించుటల్,నికట♦భూమి జటాయుసహోదరుండు శా
ఖామృగపాళిఁ జూచుట, స♦గంబును నెక్కుట, యబ్ధి దాఁటుటన్. ౨౦౦

తే. కదలిబోధ మైనాకునిఁ ♦ వొడగనుటయు, సింహికావధ మలయంబుఁ ♦ జేరి రాత్రి
లంకఁ జొచ్చుట యేకాంత♦శంకఁ గనుట, దశముఖాసుర పుష్పక♦దర్శనంబు.

ఆ. మద్యపానగృహగ♦మన మవరోధంబుఁ,గాంచుటయు నశోక♦కాననమునఁ
బంక్తికంఠనీచ♦భాషణక్రమమును, నుంగరంబు సీత ♦ కొసఁగుటయును. ౨౦౨

కం. రజనీచరులయదల్పులు, త్రిజటాస్వప్నంబు మణి ని♦తీమణి యీవిన్
గుజభంగం బసురసతుల్, గజిబిజి నొందుటయు దైత్య♦కాండమువధయున్. ౨౦౩

తే. వాయుసూనుండుచిక్కి రా♦వణునిఁగనుట, లంకఁగాల్చుటయును వార్ధి♦లంఘనంబు
మధువనంబునఁ గ్రోఁతులు ♦ మధుఫలాళి,సాపడుటయును రాఘవా♦శ్వాసనంబు.

కం. మారుతి మణి నొసఁగుటయుఁ బ్రతారించుట జలధి నలుఁ డు♦దారకుశలతన్
వారిధి సేతువుఁ గట్టఁగ, నారాతిరి లంకఁ జొచ్చి ♦ నట్టిచరితమున్. ౨౦౫
కం. హితత విభీషణుశరణా,గతి రక్షోవధవిధంబు♦కధనం బనిలో
నతికాయుఁ గుంభకర్ణుని, నతివిక్రము నింద్రజిత్తు ♦ నడఁగించుటయున్. ౨౦౬
కం. రావణవధయును భూజా,తావాప్తియు నరిపురంబు♦నందున యభిషే
కావాప్తి విభీషణునకు, నావలఁ బుష్పకమునందు ♦ నధిరోహణమున్. ౨౦౭
కం. అంద అయోధ్యాపురమున,కుం దరలుట భరతుఁ గూడి♦కొనుటయు నతులా
నందంబుగఁ గౌసల్యా,నందనుఁ డభిషేకమహము♦న నవ్వలుటయున్. ౨౦౮
తే. సర్వసైన్యవిసర్జన♦చరిత మవని, భావిసృత్తంబు శ్రీరామ♦భద్రకృతము,
నించుకవుదాని వాల్మీకి♦ఋషివరుండు, కావ్యమునఁ బల్కెనుత్తర♦కాండమునను.

ప్రబంధవైలక్షణ్యకధనము.

సీ. భువనావనార్థంబు ♦ భూమిపై జన్మించి, ప్రాప్తరాజ్యుం డయి ♦ ప్రజల రాముఁ
డోముచు నుండ లో♦కోపకారంబుగ, భగవంతుఁ డగుఋషి ♦ వాల్మికుండు
శ్రీరాముచరితంబు ♦ చిత్రపదంబుల, వెలయ నిర్వదినాల్గు♦వేలు శ్లోక
సంఖ్యయు, వానిని ♦ సర్గముల్ గాఁగను, పూర్వరామాయణ♦మునను నూఱు
తే. లేను,కాండంబులాఱుగ♦జానుమీఱ, వెండియునుబల్కెఁ బదపడి♦కాండమొండు
పావనంబైనరఘురాము♦భావికథను, సోత్తరంబుగ నెల్ల ర♦సోత్తరముగ. ౨౧౦
కం. వ్యాపింపఁ జేయ జగమున, నోపిక వాగ్వశముగాఁగ ♦ నొనరింపఁగ మేల్
నైపుణి గలుగుసమర్థుఁడు, ప్రాపించునె దీని కనుచు ♦ భావించె మదిన్. ౨౧౧
కం. ఘనముగఁ జింతింపఁగ నిటు, మునిపుంగవుఁ డతనిపాద♦ములఁ జాఁగిలిపా
టున మునివేషులు బాలకు, లనుపమధీరతులు మొక్కి ♦ రధికవుభక్తిన్. ౨౧౨
ఉ. రాజకుమారు లాజలధి♦రాజకుమారయశోవిభాసులున్
రాజితధర్మవేత్త లప♦రాజిత తేజులు మంజులస్వర
భ్రాజితులున్ నిజాశ్రమ♦నివాసులు ప్రాజ్ఞులు సామగానవి
ద్యాజయశోభితుల్ కుశల♦వాఖ్యులు నిశ్చలవేదనిష్ఠులున్. ౨౧3
తే అన్నదమ్ములు దనకు సా♦ష్టాంగ మెరఁగఁ, దతము వేదోపబృంహణా♦ర్థంబు నైన
మామకోత్తమకావ్యంబు ♦ మహితరీతిఁ, బరన మొనరింప వీరలే ♦ ప్రభువులనుచు.
ఆ. జనకరాజసుతానుహా♦చరితమొల్లఁ[1], బల్కెరామాయణంబుఁ గా♦వ్యంబుగాఁగ
నృశగరిష్ఠుండుపౌలస్త్య♦వధముమిషను, బ్రథితభాషణముల యథా♦ర్థముగాఁగ.
సీ. చదివిసఁ బాడిన ♦ శ్రావ్యమై భవ్యమై, జనమనోహర మయి ♦ యొనరు దాని
లలి ద్రుతమధ్యవి♦లంబితధ్వనిపరి,చ్ఛేదగానంబులఁ ♦ జెలఁగుదాని

[1] ఉత్తరకాండము వాల్మీకిప్రోక్తము కాదను గుర్వాపమును నెల్లెడ్డను ఖండించుచున్నది.

సరిగమపదని యర్కస్వరముల జాతుల, బద్ధ మై శుద్ధ మై ప్రబలు దాని
రాణ విపంచికారమ్య మై సౌమ్య మై, తాలలయంబులఁ దనరుదాని
తే. నతులశృంగారకారుణ్యహాస్యవీర, రౌద్రశాంతాద్భుతాదిక రసము లలరు
దాని శృంగారరసము ప్రధానముగను,గన్న మవుదాని నేర్పె నాకవలు పాడ.
ఉ. గానకళాధురంధరులు కన్నతిరాకృతు లీడ్యమూర్ఛనా
స్థానవిశారదాగ్రణులు చారుతరస్వరు లన్నదమ్ములు
న్నానుగ మంజుభాషణులు నాటకలక్షలశాస్త్రవేదులు
మానితరామచంద్రవిభుమూఱటమూర్తులు గావ్య మంతయున్. ౨౧౭

కుశలవులు రామాయణము నయోధ్యాపురంబున గానముసేయుట.

చం. నిపుణత వాగ్విధేయముగ నేరిచి లెస్స యథాక్రమంబుగా
నపరిమితానురక్తిని మహర్షులు విప్రులు సాధు లున్నయా
విపులసభాంతరాళముల విశ్రుతవైఖరిఁ బాడఁ జొచ్చి రా
తపసికుమారులట్టిసు యథాకథితంబుగ ధర్మకావ్యమున్. ౨౧౮
చం. జెలజెల రాల బాష్పములు సర్వమునీశులు దాని నెల్ల వీ
నులకును విందుగా విని మనోగతి నచ్చెరు వంది హర్షసం
కలితమతిం గుశీలవుల గాయనవర్యుల మానివేషులన్
సలలితరూపయుక్తులఁ బ్రశంస యొనర్చిరి సాధుసూక్తులన్. ౨౧౯
ఉ. ఎంతటి పాటసొంపహహా! యెంతటి యింపగు పద్యపాళి హా!
యెంతటి శబ్దసౌష్ఠవ మ దెంతటి సన్మధురస్వరం బహా!
యెంతటి యర్థపుష్టి యిది యెంతవిచిత్ర మహో! ప్రవృత్తమై
యెంతయుఁ గాల మేగినను నిప్పుడు జర్గెడు నట్లు దోఁచెడిన్. ౨౨౦
చం. అని యనసూయులై మునికులాగ్రణు లందఱు నొక్క పెట్ట మే
లని నుతియింపసాగ మఱి యంతకునంతకు హర్షమాణమై
కని యమళంబు మిక్కిలిగ గాన మొనర్చె సరక్తితాలమూ
ర్ఛనముగ సొంపు నింపి మధురంబుగ శ్రోతలు సొక్క; వారిలోన్. ౨౨౧
సీ. ఇంపమింప మటంచు నిచ్చెజందె మొకండు, నిదొయిదొయని బ్రుసి నిచ్చె నొకఁడు
కోకొండటంచు నొక్కొరుఁడు వల్కల మిచ్చె, మంచి దంచొకరుండు మాంజినిచ్చె
బట్టుపట్టుఁ డటంచుఁ బాత్ర మొక్కరుఁ డిచ్చె, సరసత నొకఁ డక్షసరము నిచ్చెఁ
గొండుకొండనుచుఁ గమండలు వొకఁ డిచ్చె, రండురండనియిచ్చె దండ మొక్కఁ
తే. డొక్కఁడాయుష్యమిచ్చెనం దున్నమునులు, తమకుఁ గలిగినవస్తుసంతతుల నేఱి
రాణమీఱినవాని నామాణవులకుఁ, గరుణ నొసఁగిరి సంతోషగరిమ నిట్లు.

కం. మంది యొడఁగూడి యుండిన, సందుల గొందులను రచ్చ♦చావడులను సా
నందు లయి విపణిమార్గము,లందును బోడంగఁ జొచ్చి ♦ రాకొమరుల్. ౨౨౩

సీ. *కొండెగా నొదలఁ ♦ గురులను ముడి వైచి, వీఁపుపై నొకకొన్ని ♦ వ్రేల విడిచి
పున్నమజాబిల్లి ♦ బురడించు మోమున, భవ్యచందనరేఖ ♦ పదిలపఱిచి
మొనయించి డాపలి♦మూఁపుమీఁదఁ బ్రవాళ, మణికేలఁగాయల ♦ నమర నిలిపి
తరుణాంగుళంబులఁ ♦ దంత్రుల మీటుచు, మెడ నొంటిజందెంబు♦మెఱుఁగు లీనఁ
తే. గటితలంబునఁ జిన్నిస♦క్కలముఁ జుట్టి, రాగ మలరార మంజుల♦రాగ మొప్పఁ
గాలతాలలయాదుల♦క్రమ మెఱింగి, పాడి రవ్వేళనట వాడ♦వాడయందు. ౨౨౪

సీ. భావికవీశ్వరా♦వళికిఁ బట్టుంగొమ్మ, యుక్తగీతంబుల ♦ కోజబంతి
క్షమ వినువారికిఁ ♦ గర్ణరసాయనం, బాయువు పెంపఁగ ♦ నమృతధార
రమణీయసద్గుణ♦రత్నరత్నాకరం, బఖిలరసంబుల ♦ కాటపట్టు
సలలితాలంకృతి♦చయముల మణిపేటి, యాత్మపుష్టికిని ది♦వ్యౌషధంబు
తే. భవ్యకావ్యంబు నీరీతిఁ ♦ బలికెనౌర, యహహా! వాల్మీకి యెంతమ♦హామహుండో
యనియయోధ్యాపురమ్మున♦నఖిలజనులు, వాడవాడల సింత్రు కైవారములను ౨౨౫

ఉ. అందము దప్పకుండఁగ స♦యాభినయంబులతోడఁ దద్రస
స్యందిమనోజ్ఞవైఖరిని ♦ సారెఁ గుమారులు పాడుచుండ నా
నందరసాబ్ధిమగ్నులు జ♦నంబులు మైమఱ పొంది మేలటం
చందఱుఁ దత్కుశీలవుల ♦ నాదట మెచ్చిరి మేలివాక్కులన్. ౨౨౬

↞ రామాయణముగానము సేయుకుశలవుల శ్రీరాముఁడు పిలిపించుట. ↞

ఉ. రాజపథంబునందు ముని♦రాజకుమారకవేషు లానిశా
రాజముఖుల్ సుధాజలధి♦రాజకుమారికుమారుఁ బోలును
త్తేజులు పాడుచుండ రవి♦తేజుఁడు రాముఁడు పిల్వఁ బంపెఁ బే
రోజ నిజాలయంబునకు ♦ నూర్జితకీర్తులఁ బుణ్యమూర్తులన్. ౨౨౭

కం. *బాలకులను జితరోలం,బాలకులను బాలశశిని♦భాలికులను శ్రీ
పాలకులను రామత్మో,పాలుండు కృపాలుఁ డగుచుఁ ♦ బనిచెం బిలువన్. ౨౨౮

ఉ. వారలఁ బిల్వఁ బంచి చెలు♦వం బగుదివ్యసువర్ణపీఠిపైఁ
బేరిమి నుండి తమ్ములును ♦ బెక్కురు రాజు లమాత్యవర్యులున్
గూరిమిఁ గొల్వ భాసిలుచు ♦ గొబ్బున నెమ్మది గారవించి తాఁ
గోరె వినంగఁ దచ్చరితఁ ♦ గోవిదవర్యులు పాడుచుండఁగన్. ౨౨౯

కం. మారాకారుల నతిసుకు,మారుల మునివేషయుతకు♦మారులఁ దుల్యా
కారుల సమస్తవిద్యా,ధారులఁ గని నియతశాలి ♦ దమ్ముల కనియెన్. ౨౩౦

కం. అందం బై నిష్యదమ, రందం బై యమృతరసత • రంగం బై స
చ్ఛందం బై విన బ్రహ్మ, నందం బై యమరగాఁ గ • ణంగిరి పాడన్. ౨౩౧

ఉ. సోదరులార! వింటిరె ర • సోదయకారణ మై విచిత్ర శ
బ్దాదరణీయ మై విమల • మై చెలువారెడు కావ్య మిందిరా
సోదరమూర్తి లీలఁ బసి • సూనులు గాన మొనర్ప నద్దిరా
మోదిరి మీరె యంచు బహు • మానపురస్కృతవాక్యు లాడినన్. ౨౩౨

కం. ఆలాపరక్తిమధురిమ, బాలకు లట వెల్లి గాఁగఁ • బాడిన సభ్యుల్
గ్రోలిరి కుతుకబంటిగ, వ్రాలిరి తలమునుక లైనఁ • బరవశు లగుచున్. ౨౩౩

చం. అది గని రామచంద్రుఁడు ధ • రాధిపలక్షణలక్షితాంగు లై
పొదలిక మౌనివేషములఁ • బూనినవారిఁ గుశీలవాఖ్యు లై
సదమలహృద్గతప్రవు లయి • జో నగువారల నాకునుఁ శుభ
ప్రద సుమహానుభావకథఁ • బాడెడివారి వినుండు సాధువుల్! ౨౩౪

తే. అనుచు సభ్యుల బాలకు • లలరఁ బల్కి, వారు దీపుసకును దీపుఁ • గూరి పాడఁ
దిన్నతిన్నగ గద్దియ • దిగ్గి నచ్చి, సభనుగూర్చుండి వినెనహో • సక్తమతిని. ౨౩౫

కం. శ్రీరామోత్సాహవ్యా, హారములఁ మార్గవిధి మ • హానందముమై
నీరీతి వారు పాడిరి, సారం బైనట్టిరామ • చరితం బెల్లన్. ౨౩౬

## శ్రీ రామాయణకథా ప్రారంభము.

తే. పూర్వమీభూమివలయంబు • పూర్ణముగను, నన్యదుస్సాధ్యుఁ డగుచు జ • యాఖ్యు లైన
మనువు మొదలగు నేనృప • మణులచేత, నింపు దళుకొత్తఁ జక్కఁ బా • లింపఁబడియె.

కం. ఘనులగు నఱువదివేవురు, తనయులచే సాగరంబుఁ • ద్రవ్వించె నెవం
డనుగతు లందఱు నెవనికి, నసఘుం డాసగరుఁ డెందు • నధికుం డయ్యెన్. ౨౩౭

తే. అట్టియిక్ష్వాకువంశంబు • నందుఁ బుట్టి, నట్టినరపాలురం దిల • నవతరించి
నట్టిరఘురాముచరిత రా • మాయణంబు, పూజనీయంబు ప్రథితంబు • భువనములను.

సీ. వాల్మీకి యొకఋషి • పల్కినయది యిది, బ్రహ్మముఖోద్గతం • బా?[1] యటంచు
నస కనసూయులై • యాలింపవలె మీరు, లటుగామిఁ బ్రత్యవా • యంబు గలదు
బ్రహ్మ పల్కిన దిది • బహుపాపవిచ్ఛేది, శ్రీనిని బ్రవర్తింపఁ • జేయు మాత్ర
మధకాం మందిది • నార్యులారా! ధర్మ, కామార్థములఁ గూర్చుఁ • గాన దీని

తే. విస్తరింపఁగఁ జేసెను • విశదశైలి, మొదటి నుండియుఁ దుద దాఁక • మోదమునను
నన్యవిషయాళి స్పెఁ జింత • నవలఁద్రోచి, భక్తితో డుత వినుఁడు శు • భంబు లొదవు.

---

[1] బ్రహ్మముఖోద్గతంబా = వేదమా?

## ⟵ అయోధ్యాపురవర్ణనము. ⟶

కం. రాసులు ధనధాన్యంబులు, వాసిలుప్రజ లెల్ల బుష్టి♦పరులుఁ సుఖులై;
యాసల వాసి రహించుచుఁ, గోసల మొప్పారు సరయు♦కూలమునందున్. ౧౪

సీ. రాణమై సిరులకు ♦ తాణ మై సొగసుల, నాణె మై మనువిని♦ర్మాణ మగుచు
నిడివిని బదిరెండు♦వెడలుపునను మూఁడు, యోజనంబులయియ♦యోధ్యయొప్పు
నిరువంకలను మేలి♦విరులను వెదచల్లు, తరువులచే మనో♦హరము లగుచు
నంబు వైచినయట్లు ♦ డంబుమీఱిన యట్టి, యింపైనరాజమా♦ర్గంబు లమరి
తే. గాలికిని రేఁగు పెందూళి♦చేలములను, సొంపుచెడ ముంచి కనులఁ గా♦రింపకుండ
బాటసారుల కింపుగ♦బాట లెల్ల, నీట సిక్తంబు లై యుండు ♦ వాటముగను ౧౫

సీ. వాట మౌ మేటికవాటంబు లామోద, కారణంబులు నైన♦తోరణములు
నెడ నెడ విర్వియం♦గడిపీదు లొప్పును, సర్వయంత్రాయుధా♦ఖర్వమహిమ
శిల్పకోవిదవరా♦నల్పసమూహంబు, సూతమాగధవంది♦జాతి గలిగి
శ్రీమంత మతులను♦ధీమంత మగుచు ను, చ్చాట్ట కేతనముల ♦ మట్టు మీఱి
తే. సాధ్వసకరశతఘ్నికా♦సంచయంబు, లెచటఁ జూచిన నర్తకీ♦నిచయములును
దోర మౌతియ్యమామిడి♦తోఁపులమరి, శ్రీపురంబుద్దియగునయో♦ధ్యాపురంబు

సీ. పురసతీమేఖలా♦భరణ మావగణంబు, విద్వేషిముస్తాళి♦విశిఖ పరిఖ
ధారాటకరిఘటా♦వారం బపారంబు, గోమహాంగంబులు ♦ కోటికోట్లు
మంతురహించుసా♦మంతు లమంతులు, వరకరప్రదకర్గ♦పరులు పసలు
ప్రకటనానాదేశ♦వాసు లావానులు, సమధికధనులు స♦చ్చర్యు లర్యు
తే. లోజసవరత్నమయములు ♦ రాజులిండ్లు, సాటిమీఱుమనోజ్ఞంబు ♦ లాటమలలు
ఘనవిచిత్రితవలభులు ♦ దనరి సిరిని, గోపురముసాటి యగు నయో♦ధ్యాపురంబు

ఉ. మానితరత్నకీలితవి♦మానవితానము, పుత్రపౌత్రసం
తానసలసద్గృహంబు, సమ♦ధాత్రినివేశిత, ముత్తమోత్తమం
బైనసుశాలితండులచ♦యంబును, నుత్తమపంకజాతనే
త్రానికరంబు, నై పురము ♦ రాజిలు జూదపుఁబీఁటపోలికన్. ౧౮

కం. ఆవరపురమున జలములు, భావితమధురిమను జెఱకు♦పాలం బోలుఁ
బావనతను ముక్తాఫల, లావణ్యముఁ బోలు రుచిర♦లాఘున మనురిన్. ౧౯

కం. దుందుభిమృదంగవీణా, బృందంబులయులివు పణవ♦వేణుసినదముల్
సుందరుల కాలియందెల, క్రందును నొక్కటిగ [illegible]

కం. వరతపమున దివి సిద్ధులు, పరిలబ్ధం గనువిమాన♦[illegible]
[illegible]సమావృతం బై, వరవేశ్మము లాపురమున ♦ పన్నెం మీఱున్. ౨౧

ఉ. ఒంటరివాని, వంశమున ♦ కొక్కఁడ కర్తగ నుండువాని, భీ
యంటిన డాఁగువాని, లఘు♦హస్తవిశారదు లయ్యుఁ జంపఁ బో
రొంటు లభించియుం బరి న♦నుత్తమశూరులు; కాననంబులన్
గెంటుదు రొక్కన్రేటునన ♦ కేసరులం గిరిఖడ్గకోటులన్. ౨౪౯

తే. ఆహితాగ్నులు గుణులును ♦ సాంగవేద,పారగులు సత్యరతులు స♦పారదాను
లగు మహాత్ములు ఋషిమాత్రులైనమహర్షి,కల్పులగు ద్విజవర్యులు ♦ గలరు పురిని.

దశరథమహారాజుగుణవర్ణనము.

కం. ఈలీల మహారథతతి, వాలాయము గొలువ నమర♦వరుఁడు దివంబుం
బాలించెడినడువునఁ బరి,పాలించును దశరథుండు ♦ ప్రథ నాపురమున్. ౨౫౧

సీ. వేదవేదాంతార్థ♦విదుఁడు కోవిదుఁడు భూ,స్వవ్యర్థశూరాది♦సంగ్రహుండు
నతిచిరకాలభా♦వ్యర్థదర్శనశీలి, పౌరజానపదాళి♦సుసుహితుఁడు
నిక్ష్వాకువంశ్యులం ♦ దెల్లను నతిరథుం, డమితాధ్వరసమృద్ధి♦యూపరుండు
వాపికారామకూ♦పవ్యాహ్యానిర్మాత, స్వవశీకృతాఖిల♦జనచయుండు

ఆ. వరమహర్షిసముఁడు ♦ పరమరాజర్షియు, విశ్వవినుతకీర్తి ♦ వీర్యవంతుఁ
డమితబలుఁడమిత్ర♦హరుఁడు ప్రశస్తమి,త్రాన్వితుఁడు జితేంద్రి♦యాగ్రసరుఁడు.

కం. *రా జగతీతయశమున నగ,రా జతులితధృతిని భోగి♦రాజ కళల నౌ
రా జగతి దశరథునిసరి,రా జగదీశుండు గలఁడె ♦ రాజకులమునన్. ౨౫౩

చం. అమరనువర్ణరత్నమహి♦తాంబరసంచయసంగ్రహుండు నై
యమరథనైకపింగనిభుఁ ♦ డై విభుఁడై మనురీతి విక్రమ
క్రమమున లోకలోకపరి♦రక్షణదక్షుఁడు నై యథార్థవా
ది మతి త్రివర్గరక్షణవి♦ధిజ్ఞుఁడు నై పురి నేలు నిచ్చలున్. ౨౫౪

అయోధ్యాపురజనవర్ణనము.

చం. శమదమసద్గుణాన్వితులు ♦ సత్యవచస్కులు నాహితాగ్ను ల
త్యమలినధీద్విజాతులు స♦హస్రదవేదషడంగపారగో
త్తములు మహామతుల్ సుకృతి♦ధన్యులు దేవమహర్షి కల్పులున్
హిమకరమిత్ర తేజులు మ♦నీషులు గ్రాలుదు రప్పురంబునన్. ౨౫౫

ఉ. అందఱు హృష్టమానసులె ♦ యందఱియందఱు ధర్మవేదు లే
యందఱు శాస్త్రచింతనప♦రాయణు లే మతి స్వస్వతుష్టు లే
యందఱుఁ ద్యాగశీలు రట ♦ నందఱు సత్యవచోభిభాషణా
మందులు భూరిసంచయు ల♦మానగవాశ్వధనాఢ్య లందఱున్. ౨౫౬

కం. జననియుజనకుఁడుపధువులు, దనయులుఁదనయలునుగృహిణి♦దాను నతిథియుఁగ్
దనివిగ నిండక యుండెడి, మనికి యొకం డైన లేదు ♦ మందున నగనన్. ౨౫౭.

ఆ. తన్ను ధర్మవిధులఁ ♦ దనయులఁ దనయలఁ, తల్లిఁ దండ్రిఁ దనదు♦దార నన్న
దమ్ములను గదర్య♦తావశచిత్తుఁడై, యేఁచువాఁడు లేఁడ ♦ యెచట నేని. ౨౫౮

కం. పోఁడిమి గలతత్పురమున, లేఁడు ఖలుఁడు దుష్టకామి ♦ లేఁడు చదువులఁగ్
వాఁడిమి మీఱనిపురుషుఁడు,[1] లేఁ డట నాస్తికుఁడు నెందు ♦ లేఁడు వెదకినన్.

ఉ. అందఱు ధర్మశీలరతు ♦ లందఱు నిశ్చలసంయతాత్ములే
యందఱు సత్స్వభావయుతు ♦ లందఱు నిర్మలవృత్తశాలు లే
యందఱు సన్మహర్షినిభు ♦ లందఱు నిర్మలమానసాఢ్యు ల
య్యందఱు హారహారయుతు ♦ లందఱుఁ గుండలమండితశ్రవుల్. ౨౬౦

ఉ. అందఱు సుందరుల్ మకుటు ♦ లందఱుఁ జందనలిప్తదేహు లం
దందఱుఁ బూర్ణభోగయుతు ♦ లందఱు సంతతమృష్టభోక్త ల
య్యందఱు దానశీలరతు ♦ లందఱు భూషణభూషితాంగు ల
య్యందఱు నిష్కవంతు లట ♦ నందఱు నంగదదీప్తబాహువుల్. ౨౬౧

ఉ. అందఱు నిర్జితేంద్రియులు ♦ నందఱు యజ్వలు నాహితాగ్ను ల
య్యంద ఱటఁగ్ స్వకర్మరతు ♦ లందఱు నిత్యము బ్రహ్మచింతనుల్
అందఱు సంతతాధ్యయను ♦ లందఱు సంయమితుల్యు లప్పురిం
జెందినయట్టిలోకులు సు♦శీలరతుల్ కరుణాపరాయణుల్. ౨౬౨

ఆ. ఆహితాగ్ని గాని♦యాతఁ డయజ్వయు, నధమజనుఁడు దొంగ ♦ యైనవాఁడు
వృత్తసంకరుండు ♦ వెదకిన దొరకఁ డా, కాలమందు నాజ♦పాలనమున. ౨౬౩

కం. తమతమకర్మంబులనే, తమిఁ జేయుచు విప్రవరులు ♦ దానాధ్యయనో
త్తములయి జితేంద్రియులు సం, యమితాత్ములు నీవి గొనఁగ ♦ నర్హులు సుమతుల్.

కం దీనులును జంచలులు బల, హీనులు నపడంగవిదు ల♦నృతపరు లీర్ష్యా
ధీనులు నబుధులు ననయుత, దానులు వ్యధితులును లేరు ♦ తత్సమయమునన్.

కం. సాగయించుచక్కఁదనముం, జగిబిగులును లేనివారు ♦ క్షితిపతిభక్తిఁగ్
దగులనివారలు లే రట, మగలందును మగువలందు ♦ మాటకు నైనన్. ౨౬౬

తే. దేవతాతిథిపూజల ♦ దీక్షితులును, గృత మెఱింగినవారలు ♦ నీగి గలరు
శౌర్యవిక్రమవంతులు ♦ సత్యధనులు, నాల్గువర్ణంబులందలి♦నరులు పురిని. ౨౬౭

ఆ. సత్యశీలధర్మ♦సంశ్రితవ్రతు లాత్త, చిరతరాయులుగ స♦శేమజనులు
సుతులతోడఁ బౌత్ర♦తతులతో సతులతో, నొప్పు చుందు రన్ని♦యొప్పిదముల.

---

[1] దీనివలనఁ బూర్వకాలమున బ్రాహ్మణేతరులకు విద్యలేదను దుర్వాదము ఖండితము.

చం. ధరణిసురోపదిష్టవిధి♦తత్పరులై చరియింత్రు క్షత్రియుల్
ధరణిధవానుకూలత స♦తంబుఁ జరింతురు వైశ్యవర్యులున్
ధరణిసురాళి క్షత్రియవి♦తానము వర్యుల సేవఁ దన్పుచున్
బరమపవిత్రులై యవర♦వర్ణులు పొల్తురు నైజవృత్తులన్. ౧౧౯

కం. కందరముల సింహము లన, నుందురు దావాగ్నిసములు ♦ యోధు లకుటిలుల్
మందరధృతిబంధురబల,మందిరు లన వన్నెకెక్కు♦మహితౌజస్కుల్. ౧౨౦

కం. [1]కాంభోజబాహ్లికక్షితి,సంభూతవనాయుజాత♦సైంధవలతు ల
య్యంభోజబాంధవాశ్వము, జంభారిహయంబు గెలుచు ♦ జవనాధికతన్. ౧౨౧

తే. అచటఁ దనరారు దిగిభాన్వ♦యప్రధములు,మదయుతంబులు శక్తిస♦మన్వితములు
వింధ్యహిమశైలభవములు ♦ విశ్రుతములు, నైనగజములు వేనవే ♦ లసము మీఱ.

తే. భద్రమంద్రమృగంబులు ♦ భద్రములును
మంద్రములు మృగములు భద్ర♦మంద్రములును
దగఁగ మృగమంద్రములు భద్ర♦మృగము లనఁగ
నచలసన్నిభమదకరు ♦ లందుఁ గలవు. ౧౨౩

తే. ఆమడలురెండునెటుచూడ♦సార్థకాభి,ధానమయియొప్పునాయయో♦ధ్యాపురంబు
శక్రుఁడమరావతిని బోలె ♦ సారసారి,ఋషిములయట్లు శమితారి ♦ యేలుచుండె.

మంత్రిజనవర్ణనము.

ఉ. మంతులు మంతుగల్గుమతి♦మంతులు నింగితశీలసద్యశో
వంతులు ధర్మలోలగుణ♦వంతులు లోకహితానుకారిధీ
మంతులు న్యాయవంతులు స♦మంతులు మంత్రసుతంత్రసత్కళా
వంతులు శౌచవంతులు నృ♦పాలకభక్తి వలంతు లెంతయున్. ౧౨౪

తే. అర్థసాధకవిజయసి♦ద్ధార్థు లనఁగ, ధృష్టియు జయంతుఁ డనఁగను ♦ ధీరగుణులు
మంత్రపాలుఁ డశోక సు♦మంత్రు లనఁగ,మంత్రు లెనమండ్రుగ్రాలిరాత్మోద్ధవునకు.

కం. హితులై రవివంశపురో,హితులై తద్రాజవృద్ధి♦హితకర్తలునై
నుతిఁగాంచి రలవసిష్ఠుఁడు, మతిమంతుఁడు వామదేవ♦మౌనీంద్రుండున్. ౧౨౫

సీ. అన్వీక్షకీత్రయీవా♦ర్తాఖ్యాతవిద్యల నెల్లఁ, జక్కఁగా నేర్చి ప్ర♦శస్తి నొంది
చేయఁగా రానట్టి♦చేత లజ్జాళు రై, నియతేంద్రియులు శుభ♦నీతివిదులు
భాగ్యభోగాభోగ♦భాక్కులౌచుఁ గుశాగ్ర,బుద్ధులై శాస్త్రప్ర♦బుద్ధు లగుచు
నప్రతిహతవిక్ర♦మాన్వితులై కీర్తి, మంతులై రాజ్యక♦ర్తంబులందుఁ

తే. త్రికరణంబుల నొక్కలై ♦ తేజరిలుచు వఱలి సుస్మితపూర్వాభి♦భాషు లగుచు
బలిమిగలుములమిగులఁబ్రా♦భవముఁగనుచు మహిమ వెలసిరిదశరథు♦మంత్రివరులు.

---

[1] దీని కొందఱు కాంభోజి యనియు వ్రాసెదరు.

కం. కామంబున నైనను ధన, కామంబున నైనఁ గ్రోధ♦గరిమన యేనిన్
నీమంబుఁ దప్పి కల్లల, నామంత్రులు వలుక రెట్టి♦యవసరములలోన్. ౨౬౯

సీ. చారమూలంబు వి♦చారణమూలంబు,గా నాత్మపరరాష్ట్ర♦కాండజనులు
సలిపిన సలిపెడి ♦ సలుప నెంచినపనుల్, గల్గదు వా రెఱుం♦గని దొకండు
వ్యవహారకుశలులు ♦ పరమసౌహృదమున, సుపరీక్షితులు పరి♦శుద్ధమతులు
. తప్పు గల్గినఁ దమ♦తనయుల నైనను, దండింప కుండరు ♦ దండనీతి

తే. నర్థ సంగ్రహకుశలత ♦ నఖిల సైన్య,విత్తదానంబునను గాపు♦వితమునందు
నప్రమాదులు శత్రువు♦నైన నిరప,రాధు దండితుఁ జేయ రీ♦రసముఁ బూని. ౨౭౦

కం. వీరులు సతతోత్సాహులు, పారగతనృపాలశాస్త్ర♦వారులు శుచు ల
పౌరజనంబులఁ బ్రోతు రు,దారులు ధీయులు దశరథ♦ధరణిపుమంత్రుల్. ౨౭౧

ఉ. నేరము లేకయున్ననొక♦నిష్కము దండుగు దీయ రేయెడన్
నేరము గల్గినం బరిగ♦ణించి బలాబలతారతమ్యముల్
వారక విప్రరాట్కులజ♦వర్యుల యొడ్డన యేనిఁ దీసి పెం
పారఁగఁ గోశముల్ లసదు♦పాయులు నింతురు ధర్మకర్తలై. ౨౭౨

కం. సుద్దుల మఱి బుద్దుల నొక,యుద్దిగఁ బ్రెగ్గడలు గలసి ♦ యొద్దిక నుందుర్
బద్దులు పలికెడిమనుజుఁడు, పద్దునకేన్ లేఁడు పురిని ♦ బల్లెలయందున్. ౨౭౩

కం. దుష్టులు వెలిచవి మరగిన,భ్రష్టులు లేరప్పురమున♦రాష్ట్రమునందున్
శిష్టులు సువేషపటయుత, పుష్టులు నృపహితచరిష్ణు♦వులు మంత్రివరుల్. ౨౭౪

చం. గురువులయందు నున్నగుణ♦కోటులు మాత్రమ సంగ్రహించుచున్
బురుతరవిక్రమంబు మెయి ♦ భూతభవిష్యదుదంత వేదితన్
బరవిషయంబుల న్మిగులఁ ♦ బ్రస్తుతి కెక్కుచు, సంధివిగ్రహా
చరణధురీణు లై పలికి ♦ సత్ప్రియవాదులు నైరి తజ్జనుల్. ౨౭౫

ఆ. రాష్ట్రకార్యచింత ♦ ప్రకటంబు గానీక, వరకుశాగ్రబుద్ధి♦వర్తు లగుచుఁ
బలుకుప్రల్లదంబు♦పజ్జను బోవక, ప్రతిభ మింత్రు ప్రాడ్వి♦వాకవరులు. ౨౭౬

ఉ. ఇట్టియమాత్యు లెల్లఁ దను ♦ నెప్పుడు గొల్వఁగఁ జారచక్షు నై
దిట్టలు చెల్మికాం డ్రమరఁ ♦ దేజున నెక్కుడు నుద్ది నూడు పే
ర్పెట్టఁగ రాక, కప్పములఁ ♦ బెల్లుగ నీయఁగఁ గ్రిందితేండ్లు దా
నట్టె వెలింగె నాజి కిర♦ణావళి నూతనభానునట్టులై. ౨౭౭

## దశరథుఁడు దనపుత్రహీనతకు విషాదపడుట.

కం. *కల రాతనికిని మువ్వురు, జలజాక్షునిసతులఁ బోలు♦చంద్రనిభాస్యల్
లలితత్రివర్గసస్పృశలు, సలలితగుణవతులు పరమ♦సాధ్వులు భార్యల్. ౨౭౮

తే. *సతతధర్మానుకూల్య కౌ♦సల్య యనఁగఁ, బాత్రజనవసుగోత్ర సు♦మిత్ర యనఁగఁ
గాంతిహార్షదరూపైక ♦ కైక యనఁగ,నాఖ్యలు వహింతు రాతని♦యబ్జముఖులు.

కం. *వారణములు వాజు లసా,ధారణభోగంబు లెన్నొ ♦ తనరియుఁ దనయో
దారసుఖంబును గానఁడు, ధారణివల్లభుఁ డ దేమి ♦ దైవకృతం బో. ౨౯౦

ఉ. *కాంతనిశాంతకోటులును ♦ గ్రుమ్ముఘుమాయితపుష్పవాటులున్
దంతసువర్ణరత్నరచి♦తాసనశాలలు రాజ్యలీలలున్
గాంతలు సౌకుమార్యరతి♦కాంతలు విక్రమ మిన్ని యుండియున్
సంతతిలేమి సంతతవి♦షాదమునం బరితప్యమానుఁ డై. ౨౯౧

తే. *సౌఖ్యసంతానములు నాకుఁ♦జాలఁగలవు,గాని సంతానసౌఖ్యంబు♦గలుగదయ్యె
భోగసంతతి నాకు నా♦భోగముగనెఁ, గాని సంతతిభోగంబు ♦ గలుగ దయ్యె.

ఉ. చాలఁగ నిట్లు మానసము ♦ సంతతిలేమికిఁ గుందు చుండఁ బే
రోలగమందు భాసిలుచు ♦ యోజనచేసెను మంత్రియుక్తుఁ డై,
యేల తురంగమేధమును ♦ నే నొనరింప? నిఁకైనఁ జేయుదున్
జాలము లేక కల్గు సుత♦సంతతి యంచును నిశ్చితాత్ముఁ డై. ౨౯౩

కం.మంత్రినికరావతంసు సు,మంత్రుని నృపకార్యవిహిత♦మంత్రుని నరిభీ
తంత్రుని సమస్తకళల స్వ,తంత్రునిఁ జేరంగఁ బిలిచి ♦ దశరథుఁ డనియెన్. ౨౯౪

కం.గురువుల నందఱ వైళమ, పురోహితులఁగూడ నీవ ♦ పోయి యిచటికిన్
గురు వగుకార్యము గల దని, సరసతఁ దోడ్కొనుచు రమ్ము ♦ చయ్యనఁ బొమ్మా!

చం.అని పతి యానతిచ్చిన ర♦యంబున నేగి సుమంత్రుఁ డెల్లరం
బనివడి తోడితెచ్చె శ్రుతి♦పారగవర్యుల వామదేవునిన్
మునుల సుయజ్ఞ కాశ్యపుల ♦ ముఖ్యగురుం డగునవ్వసిష్ఠుఁ ద
క్కినద్విజసత్తమావళులఁ ♦ గీర్తిధనాఢ్యుల సాధుశీలురన్. ౨౯౬

### దశరథుఁ డశ్వమేధయాగముఁ జేయ యోజించుట.

ఉ. ఈగతి నేగుదెంచినము♦నీశ్వరులన్ బహుమానపూజనో
ద్యోగముచేతఁ దన్పుచు ర♦ఘూద్వహుఁ డిట్లను భక్తి నోతపో
భోగినరేణ్యులార! మిము♦బోఁటిమహాత్ములప్రాపు గల్గియున్
నాగడుసుంగ్రహంబు లవి ♦ న న్ననపత్యునిఁ జేసె నీవిధిన్. ౨౯౭

కం. *ఆలోకనయనుఁ డాదిగ, వాలినయీమహిత మైన♦వంశము నిలుపన్
ప్రోలెఁడుమొలకయు లేమికి,వాలాయముఁ జింత నొంద♦నలసెను నాకున్. ౨౯౮

కం.సంతానము ప్రాప్తింపమిఁ, జింతాంభోనిధినిమగ్న♦చిత్తుఁడ నై యే
కాంతము వనరెద నిఁక నా,సంతాపముఁ బాపరయ్య♦ సంయములారా! ౨౯౯

కం.సుతలబ్ధికి హయమేధ,క్రతువును జలుపఁగను గోర్కి♦ గలిగెను నది దా
నతులిత మగుగతి విఘ్నని,హతిఁ బొందక యుండు టెట్లొ♦యరయుఁడు మీరల్.

చం.అన విని మేలు మే లదియ♦ యానని బ్రాహ్మణు లెల్ల సమ్మతం
బునఁ బొదల న్వసిష్ఠముఖ♦ముఖ్యధరామరు లెల్ల భూపతిం
గనుఁగొని లెస్స నీతలఁపు♦ గల్గు నవశ్యము వాంఛితార్థముల్
పనికిని బూనుమీ వలయు♦వస్తువులన్ సమకూర్పుమీ వెసన్. ౩౦౧

కం విడువుము ఘోటకమును బో,విడువుము సందేహ మెదను♦ బ్రేష్యుల కెల్లన్
నుడువుము సామగ్రులకై, కొడుకులు గలిగెదరు నీకుఁ♦ గువలయనాథా. ౩౦౨

కం.తనయులఁ గానఁగవలె నను,ఘనధార్మికబుద్ధి నీకుఁ♦ గలుగుటచేఁ బూ
తనయులఁ దనయులఁ గనియెద, వనఘులసంకల్ప మేల♦ వ్యర్థ మగు ననన్. ౩౦౩

కం.అనుడుల వినుచుఁ గన్నుల,నానందాశ్రువులు రాల♦ నధిపతి హర్షా
ధీనతఁ దనయుల నప్పుడ, మానుగఁ గని నట్లు పొంగి♦ మంత్రుల కనియెన్. ౩౦౪

చం.వలసినసర్వవస్తువు ల♦వారిగఁ జేర్చి గురూక్తి గుఱ్ఱముల్
బలియు ఘనుం బురోహితునిఁ♦ బ్రాపుగఁ గూరిచి వీడి యజ్ఞశా
లల సరయూత్తరక్షితిత♦లంబునఁ[1] గట్టి యథావిధిం గ్రమం
బలవడ శాంతికార్యము స♦మాచరణం బొనరింపుఁ డెంతయున్. ౩౦౫

కం.అపరాధంబులు పొసఁగిన, విపులవ్యసనములు వచ్చు♦ వెనుకొన వేనిన్
నృపవరు లెల్లరు దీని, న్నిపుణులు వో చలుప ధార♦ణీస్థలి నెందున్. ౩౦౬

కం.నెమకుచు నుందురు యజ్ఞ,క్రమకోవిదు లైనబ్రహ్మ♦రాక్షసు లెట ఛి
ద్రము లొదవవెయని క్రతువి,ఘ్నమునం దత్కర్తయపుడ♦ కను నాశంబున్.

కం.వేలిమి యెటు విఘ్నంబుల,పాలం బడకుండు నట్టి♦భంగిని మీరల్
చాలసమర్థులు దీర్పఁగ, హాళిమెయిన్ నిర్వహింప♦ రయ్యా శ్రద్ధన్. ౩౦౮

చం.పతి యిటు లాడఁ బ్రెగ్గడలు ♦, వల్లె యటంచును మిమ్ముఁ బోల్పహో
మతు లిలఁ బూనుకర్జముల♦ మాఱొడఁగూడునె? సత్యసత్ఫలా
న్వితనుతకార్యలోలురరు ♦ విఘ్నములుం బొడచూపు టెట్లగున్?
హితగతి సప్రమాదమతి♦ నెంతయుఁ దీర్తుము సర్వకార్యముల్. ౩౦౯

కం.అని యాడుచు భూవరునిం, గొనియాడుచు నున్నవిప్ర♦కోటులు నృపుడీ
వనలం దనుపుచు ననుమతి, గొనుచుం బనివిసిరి ముదము♦ గుబ్బతిలంగన్. ౩౧౦

[1] సరయువునకు దక్షిణమున నయోధ్య. సరయువునకు నుత్తరమునఁ గోసల. కౌసల్యా వివాహానంతరము పసుపుకుఁగాన కట్నముగ నది లభించెను.

కం. కావున వారలఁ బంచుట, యేవిధమున నైన లెస్స ♦ యిది యుక్త మనన్
భూవరుఁడు సమ్మతించిన, వే వారలు పంచి రపుడు ♦ వేశ్యామణులన్. ౩౨౮

కం. ఆరామలు ముని యుండెడు, నారామమునందుఁ దిరిగి ♦ యారామరమా
కారంబుల నా మాయో, దారలు యత్నించి రతని ♦ దర్శించుమతిన్. ౩౨౯

తరలము. జనన మందిన దాదిగాఁ బురి♦సంభవంబు నదేనియున్
జనపదోద్భవమైనఁ జూచిన♦జాడ లేదు, నెలంత ల
న్వినియు నేని నెఱుంగఁ, దుగ్రసు♦నిష్ఠుఁ డౌటఁ దపంబునన్
దనదునాశ్రమభూమి వీడఁడు ♦ దండ్రిఁ దన్పు సపర్యలన్. ౩౩౦

కం. భూదేవకుమారునకుఁ ద,లోదరు లిటు వేచి యుండ ♦ నొకదివసమునన్
యాదృచ్ఛికముగ నాతం, డాదృతిఁ జనుదెంచె వారి♦యంతికమునకున్. ౩౩౧

వేశ్యలు ఋశ్యశృంగుని వంచించి తోడితెచ్చుట.

కం. వచ్చెడిఋషిపుత్త్రునిఁ గని, మెచ్చగు వేషములఁ బూని ♦ మెలుఁతుకమిన్నల్
పొచ్చెంబు లేనిమధురిమ, హెచ్చఁగ గానంబు నెఱపు ♦ చేగిరి డాయన్. ౩౩౨

కం. చని యిటు వినయంబున న,న్వనజేక్షణ లనిరి విప్ర♦వర! యొంటరి వై
మనుజులు మెట్టాడని యీ, వనముల నెవ్వఁడ వి ట్లేల ♦ నల సెం దిరుగన్? ౩౩౩

చం. పలుకు మ టంచు వేఁడఁగ వి♦భండకపుత్త్రుఁడు పూర్వ మట్టిని
స్త్రులనుమనోహరాకృతులఁ ♦ దోయరుహాక్షులఁ జూడ కుండుట
న్గలికితనంబుచేఁ గరఁగి ♦ నర్మిలిఁ బల్కు విభండకాఖ్యుఁడౌ
నలఘుతపస్వి కౌరసుఁడ ♦ నాదును పేరను ఋశ్యశృంగుఁడన్. ౩౩౪

ఉ. అల్లదె దాపునందున మ♦దాశ్రమభూమి రహించు, నయ్యెడన్
సల్లలితాంగులార! విధి♦సమ్మతిఁ గూర్చెద నాతిథేయ మం
చెల్లర వేఁడ నాశ్రమది♦దృక్ష లతాంగులు వోన వారలం
బెల్లుగ నర్ఘ్యపాద్యములఁ ♦ బ్రేముడిసత్ఫలమూలపాళులన్. ౩౩౫

ఉ. పూజలఁ దన్పు వారు ముని♦పుత్త్రకుతో భుజియింపు వేగ మో
రాజితతేజ! స్వాదుఫల♦రాజి మదీయము, దానిపేర్మి నీ
తేజు చెలంగు నంచు నని ♦ తెప్పునఁ గౌఁగిటఁ జేర్చి స్వాదుతా
యోజితమోదకావళుల ♦ నొప్పగుభక్ష్యము లెన్ని యే నిడన్. ౩౩౬

కం. వనచరుల కలభ్యములై, ఘనరుచ్యము లైనవానిఁ ♦ గైకొని తిని యా
ముని యవియును ఫలములకా, మనమునఁ దలపోసి హర్ష♦మాణుం డయ్యెన్.

కం. రాజాస్యలు గురుసంయమి, రాజునకున్ వెఱచి మాని♦ రత్నపు మాఱుం
బూజావసర మటంచును, వ్యాజం బిడి పాఱిపోయి♦ రతిదూరముగన్. 33౮.

కం. వారలుపోయినపదపడి, యాఋషిపుత్త్రుండు వారి♦యాకారంబుల్
సారెకుఁ దలపోయుచుఁ జిం, తారతి నస్వస్థమతి న♦నంబునఁ దిరిగెన్. 33౯

కం. అవనిసురసుతుఁడు తొలుతటి, దినసంబునఁ గనినవెలకుఁ[1]♦ డెప్పనఁ జని తా
సవురుగఁ గనుఁగొనియెను రో, నవలాలను మఱుసనాఁడు♦ నవలాలితలన్. 3౪౦

ఉ. పూర్వదినంబుచొప్పున న♦పూర్వవిలాసగతిం జరించు చా
పర్వసుధాకరాస్యలు ద♦పస్వివరా! యిఁకఁ బోదమయ్య? మా
యుర్వికి నీవు వచ్చెదె? సు♦భోన్నతిఁ గూర్చెద, మన్న వేఱుపా
టొర్వఁగ లేమి వెన్కొనియె♦ నుత్తల మందక తండ్రిఁ బాయుచున్. 3౪౧

ఉ. ఇట్టులు దోడుకొం చరిగి♦ యిందుముఖుల్ నగరోపసీమ నా
నెట్టకసీల[2] నిల్పి ధర♦ణీవిభునొద్దకు వార్తఁ బంప ధా
త్రీట్టసుదెంచి బ్రాహ్మణస♦మేతముగా నుతియించి కార్యముం
బట్టుగఁ దెల్పి తోడ్కొనుచు♦ వచ్చె నిజాలయసీమలోనికిన్. 3౪౨

ఉ. ఏ మనువాఁడ నో దశర♦థేశ్వర! యాతఁడు రోమపాదభూ
మీమహిళేశురాష్ట్రమున♦ మేరఁ బదం బిడినంతమాత్రనే
వ్యోమతలంబు నిండ మెఱ♦పుల్ మొగులు ల్గ్రాయంగఁ బ్రాఁకి ధా
రామహితోగ్రవృష్టి జల♦రాసులఁ జేసె నదీతటాకముల్. 3౪3

ఉ. అంతట రోమపాదుఁ డతఁ♦ డాగ్రహ మూనకయుండ నిచ్చె నా
శాంతయశోవిశోభితస♦మస్తసుశీలమణీనిశాంత మే
కాంతసురూపకాంత నిజ♦కాంతమనోజలరుణ్ణిశాంత మా
శాంతను గాంతఁగా జనులు♦ సంతస మంద వివాహసద్విధిన్. 3౪౪

తే. ఋశ్యశృంగుఁడు కాంతాస♦మేతుఁడగుచు, మామగారింటనుండెస♦మ్మానమమున
మొగిని రెండవయాశ్రమం♦బునుగ్రహించి, శిష్టసృలియ వెలయని♦శ్చింతమతిని.

మ. ధరణీనాథ! సనత్కుమారముని స్మృ♦త్యంతంబుఁ బూర్వోక్త మా
దరబుద్ధిన్ వినిపించి మానులకుఁ ద♦స్తం బల్కె జన్మించెడిన్
వరధర్మజ్ఞుఁడు సత్యసంధుఁ డిల ని♦క్ష్వాకుస్వయంశేంద్రనా
గరరాకామృతరోచియై దశరథా♦ఖ్యప్రఖ్యధరాధీశుఁడున్. 3౪౬

తే. ఆతనికి నంగరాజుతో♦ నధికమైత్రి, సంఘటిలు, నాతనికిఁ బుట్టు♦ శాంత యనఁగ
నమలగుణశీల తనుజాత♦ యంగపతికి, రోమపాదుం డనంగఁ బు♦త్త్రుండు పుట్టు.

[1] వెలస = వెలవునకు. [2] నెట్టకసీల = నిస్తాపుమునుఁడు.

కం. ప్రథితు లగుచిత్రరథవశ,రఘులకు సంహారుమైత్రి ♦ రాజల్లెడు ని
ర్మథితారి దశరథుఁడు హృ,ష్వ్యథచేఁ గన నేగి రోమ♦పాదుం బలుకున్. ౩౪౮

ఉ. సంతతి లేనివాఁడ నృప♦సత్తమ! పంపఁగదే మహాత్ము నీ
శాంతమనోవిభుం గ్రతువు ♦ సాంతముగా నెఱవేర్పఁబొంటె,[1] నా
చింతలు దీర, వంశము ప్ర♦సిద్ధిఁ బ్రతిష్ఠయు నొంద ధాత్రిపై
సంతతి పొందుపొంటె, హిత♦సత్తమ! యంచును వేఁడు చుండఁగన్. ౩౪౯

ఉ. ఆనృడు లాలకించి మహి♦తాత్ముఁడు యోజన సేసి శాంతతో
మానిని ఋశ్యశృంగుని న♦మానుష తేజునిఁ బుత్రవంతునిన్
మానుగఁ బంపఁ దోడ్కొనుచు ♦ మానవనాథుఁ డపాస్తశోకుఁడై
తా నగరంబుఁ జేరి క్రతు♦తంత్రముఁ దీర్పఁ బ్రహృష్టచిత్తుఁడై. ౩౫౦

కం. అంజిక[2]తోడుత నృపతి కృ,తాంజలి యై ఋశ్యశృంగు ♦ నార్త్విజ్యముఁ బ్రే
మం జలుపఁగఁ బ్రార్థించిన, సంజాయింపక[3] యతండు ♦ సౌనని పూనెన్. ౩౫౧

కం. ప్రసవార్థము[4] ప్రసవార్థము, పొసఁగఁగ స్వర్గంబు చలుప ♦ భూపతి యజ్ఞం
బసమానవిక్రముల వం,శసుప్రతిష్ఠాపకులను ♦ శాశ్వతయశులన్. ౩౫౨

కం. నలువురుతనయులఁ గను నని, పలువురు విన విధిసుతుండు ♦ పలికెను గథగాఁ
దొలియుగమున నటులగుటను, బలుపఁగఁ జనవలయు నతనిఁ ♦ బ్రియమున నిటకున్.

కం. ఘనవాహనబలయుతముగ, ఘనవాహన తేజ! నీవ ♦ కడుకొని చని యా
యిన తేజునిఁ గొని తెచ్చినఁ, గొనసాగును నీకు నెల్ల♦కోర్కు లటన్నన్. ౩౫౪

దశరథుఁడు ఋశ్యశృంగునిఁ దోడి తేరఁ బయనించుట.

ఉ. సూతునివాక్యవైఖరిని ♦ సూరకులాగ్రణి యవ్వసిష్ఠుతోఁ
బ్రీతిగఁ దెల్పి యాతఁ డది ♦ రీతియ యంచును సమ్మతింపఁగా
జాతకుతూహలంబునను ♦ సత్వరుఁడై తనరాణివాసముల్
ఖ్యాతసుధీనిధుల్ సచివు♦లందఱు రాఁ జెనురాజసంబునన్. ౩౫౫

ప్రహరణకలిత. వనములు నదులున్ ♦ నరుసగఁ గనుచున్
జనపతి చనెఁ ది♦వ్యనిషయనములన్
మునికులతిలకున్ ♦ మును చని కనెఁ బా
వనశుచిరుచినిన్ ♦ నరఋషితనయున్. ౩౫౬

ఉ. అవల రోమపాద వసు♦ధాధిపుఁ జూప నతండు నెయ్యమున్
భావనచేసి పూజల న♦పారముగా ఘటియించి తుష్టుఁడై

[1] పొంటెన్ = కొఱకు. [2] అంజిక = సమయము. [3] సంజాయింపక = సందేహింపక. [4] ప్రసవార్థము = బిడ్డలకొఱకు - యజ్ఞముకొఱకు.

పావనశీల! నా కితఁడు ♦ బంధువు నెయ్యుఁడు స్వాత్మజాత శాం
తావరవర్ణినీమణిని ♦ నాకుఁ గుమారితగా నొసంగుటన్. ౩౫౭

ఉ. మామ యయౌట నీ కితఁడు ♦ మాన్యచరిత్రుఁడ నేనుబోలె నం
చామహితాత్ముఁ డల్లుఁ గని ♦ యాడిన నాతఁడు గౌరవింపఁగం
దా మొగి నేడు నెన్మిది ది♦నంబులు నచ్చొట నిల్చి యాజి యా
భూమిప! పంపవే హితుని♦ప్రోలు గనుంగొనఁ గూఁతు నల్లునిన్. ౩౫౮

చం కల దొకదొడ్డకార్యమనఁ♦గా నటు లౌత మపశ్య మంపుదున్
వలవదు సందియం బనుచుఁ ♦ బల్కి మునీశ్వరుఁ జూచి కార్యమున్
గలతెఱఁ గంతయుం దెలిపి ♦ కారుణికోత్తమ! భార్యతోడఁ బో
వలె నట కీ రటం చనఁగ ♦ నల్లె యటంచును ఋశ్యశృంగుఁడున్. ౩౫౯

ఉ ఆనృపుచే ననుజ్ఞగొని ♦ యాలును దానును రాఁ గడంగినన్
మానవపాలు రిద్దఱు స♦మంజసరీతి బహూకృతుల్ నుతు
ల్వే నతులన్ ఘటించి భృశ♦లీల ముదుల్లసితాంతరంగు లై
రీనెఱి వీడుకో ల్వడసి ♦ యేగుచు నింద్రసమానుఁ డాజియున్. ౩౬౦

ఉ. దూతలఁ బంపెఁ బౌరులకుఁ ♦ దూర్ణ మలంకృతి సేయఁ బట్టనం
బాతతలీలఁ గల్పకము ♦ లంతట నెత్తఁగ నీరు చల్ల వీ
థీతతులందు ముగ్గులను ♦ దీర్చి యనంటులు నాటి మాలికా
వ్రాతముఁ దోరణంబులును ♦ వావిరి గట్టఁగ సర్వభంగులన్. ౩౬౧

⟵ దశరథుఁడు ఋశ్యశృంగుతో నయోధ్యఁ బ్రవేశించుట. ⟶

సీ. ఆవార్త లన్నియు ♦ నాలించి పురజనుల్, తేఁ డరుదెంచు చు♦న్నాఁడు నేఁడు
జామాతతో నని ♦ జాతసంహర్షులై, యానతిమేరకుఁ ♦ బూని చలుపఁ
గ్రసేఁత వితములఁ ♦ గనుఁగొంచు జనపతి, దుందుభికాహాళీ♦బృందనరము
చెలఁగిమ్రోయఁగఋశ్య♦శృంగుండుమున్నుగాఁ, బొత్తెంచెనగరంబుసొంపుగులుకఁ
తే. బౌరు లెల్లరు నాముని♦ప్రభునిఁ జూచి, యతులితానందమునఁ దేల ♦ క్షితిధవుండు
వారలను గారవించి చె♦ల్వారఁ జొచ్చె, నంతిపురమునఁ దనయెల్ల♦కాంత లలర.

ఆ. అట్లు శాస్త్రవిహిత ♦ మైనకృత్యంబులఁ, బూజ సలిపి భూమి♦బుధవరేణ్యు
నగరిలోన నిలిపి ♦ నందించె నేఁటికి, నైతి ధన్యతముఁడ ♦ ననుచుఁ దలఁచి. ౩౬౩

కం. శాంతా కాంతామణి నిజ, కాంతునితో నరుగుదేరఁ ♦ గనుఁగొని ధరణీ
శాంతగ్రపురకాంతాజన, సంతతి సంతసము నొందెఁ ♦ బతుగ్రప్రీతిన్. ౩౬౪

కం. అంతర్గృహపురకాంతలు భూ,కాంతుండును గారవింపఁ గా మిక్కిలి నా
శాంతాకాంతుం డుండె న,నంతముదముతోడ ఋష్యగన్వితుఁ డగుచున్. ౩౬౫

## దశరథుఁ డశ్వమేధయాగము సేయ యత్నించుట.

ఉ. *అంత లతాంతకాంతము వనాంతరపుష్పలతాంతవాసనా
క్రాంతదిశాంత ముత్కటని రంతరకంతుగుణారవాళ్యప
క్రాంతము పాంథనాథ్వపదు రంతము పల్లవపుష్పభాగశా
ఖాంతము వ్యాప్తభూరుహాని శాంతము దోఁచె వసంత మెంతయున్. ౩౬౬

చం. పరమమనోహరం బగుచు వాలిన యమ్మధుమాసపూర్ణిమన్
వరము పులిమ్ముచాదికవి వర్ణిత మైనదినంబునన్ ధరా
వరుఁడు దలంచి నాంగ్రహిణి వర్తిలఁ జేయఁగ ఋశ్యశృంగునిన్
సరసత వేఁడెఁ బూనఁ గుల సంతతికై నిజయాజకత్వమున్. ౩౬౭

ఉ. ఆఋషిచంద్రుఁ డవ్విధి నె యాతమటంచును బల్కి వేగ సం
భారములం గడింపు ముఖ వాజిని వీడు మటంచుఁ జెప్పినన్
స్వారసుబుంప మంత్రిని సుమంత్రునిఁ గన్గొని ఋత్విగాదులన్
ధీరుల బ్రహ్మవాదులను దేఁగఁ వేగమ పోయి రమ్మనన్. ౩౬౮

తే. వామదేవసుయజ్ఞజా బాలికాశ్య,పులఁ బురోధ వసిష్ఠునిఁ బురుడులేని
యితరభూమీసురేంద్రుల నెల్లఁదోడి, తెచ్చెనుసుమంత్రుఁడపుడుహా స్తోచ్చమునను

ఉ. ఈగతి నేగుదెంచినము నీశ్వరులన్ బహుమానపూజనో
ద్యోగముచేతఁ దన్పుచు రఘూద్వహుఁ డిట్లను భక్తి నోతపో
యోగవిశిష్టులార! భృశ యోగ్యులు మీకృప కల్గి యుండియున్
నాగడుసుగ్రహంబు లిటు న న్ననపత్యునిఁ జేసెఁ గ్రూరతన్. ౩౭౦

కం. సంతానము ప్రాప్తింపమిఁ, జింతాంభోనిధినిమగ్న చిత్తుఁడ నై యే
కాంతమువసరెవనిఁక నా, సంతాపముఁ బాపరయ్య సంయములారా! ౩౭౧

కం. సుతలబ్ధికి హయమేధ,క్రతువును జరుపఁగను గోర్కి గలిగెను నాకీ
యనులితమునిసురుమహిమను, మతిఁ గలవాంఛితము లెల్ల మానక తీరున్.

చం. అన విని మేలు మే లదియ యానని బ్రాహ్మణు లెల్ల సన్మతం
బునఁ బొగడు స్వసిష్ఠముఖ ముఖ్యులు శాంతధనుండు భూపతిన్
గనుఁగొని లెస్స తెలుపు గల్గు సుపశ్య మభీప్సి తార్థముల్
పనికిని బూనుమా పలయు వస్తువులన్ సమకూర్పుమీ వెనన్. ౩౭౩

కం.విడువుము ఘోటకమును బో,విడువుము సందేహ మెదను ♦ ప్రేష్యుల కెల్లన్
నొడువుము సామగ్రులకై,కొడుకులు కలిగెదరు నీకుఁ ♦ గువలయనాధా! ౩౨౪

కం.తనయుల నొందఁగ వలె నను, ఘనధార్మిక బుద్ధి నీకుఁ ♦ గలిగెను గానన్
దనయుల నలువురఁ గాంచెద, వనఘులసంకల్ప మేల ♦ వ్యర్థ మగు ననన్. ౩౨౫

కం.అనుడుల వినుచుఁ గన్నుల, నానందాశ్రువులు రాల ♦ నధిపతి హర్షా
ధీనతఁ దనయుల నప్పుడ, మానుగఁ గనినట్లు పొంగి ♦ మంత్రుల కనియెన్.౩౨౬

చం.వలసినసర్వవస్తువు ల♦వారిగఁ జేర్చి, గురూక్తి గ్రుచ్చియున్
బలియుర సత్పురోహితునిఁ ♦ బ్రాపుగఁ గూరిచి వీడి, యజ్ఞశా
లల సరయూత్తరక్షితిత♦లంబునఁ గట్టి, యథావిధిం గ్రమం.
బలవడ శాంతికార్యము స♦మాచరణం బొనరింపుఁ డెంతయున్. ౩౨౭

కం.అపవాదంబులు పొసఁగిన, విపులవ్యసనములు దమ్ము ♦ వెనుకొన వేనిన్
నృపవరు లెల్లరు దీని, న్నిపుణులుఁవో చలుప ధారి♦ణీస్థలి నెందున్. ౩౨౮

కం.నెమకుచు నుందురు యజ్ఞక్రమకోవిదు లైనబ్రహ్మ♦రాక్షసు లెట ఛి
ద్రము లొదవవె యని;క్రతువి,ఘ్నమునం దత్కర్త యపుడ ♦ కను నాశంబున్.

కం.వేలిమి యెటు విఘ్నంబుల,పాలం బడకుండు నట్టి♦భంగిని మీరల్
చాలసమర్థులు దీర్పఁగ, హోళిమెయి న్నిర్వహింప♦రయ్యా శ్రద్ధన్. ౩౩౦

చం.పతి యిటు లాడఁ బ్రెగ్గడలు ♦ వల్లె యటంచు భవాదృశు ల్మహో
మతు లిలఁ బూనుకార్యముల ♦ మా కొడఁగూడు నె? సత్యసత్ఫలా
న్వితనుతకార్యలోలురరు ♦ విఘ్నములుం బొడచూపు టెట్లగున్?
హితగతి నప్రమాదమతి ♦ నెంతయుఁ దీర్తుము సర్వకార్యముల్. ౩౩౧

కం.అని యాడుచు భూవరునిం, గొనియాడుచు నున్నవిప్ర♦కోటులు నృపు దీ
వనలం దనుపుచు ననుమతి,గొనుచుం బనివినిరి[1] మనము ♦ గుబ్బతిలంగన్[2].

◆➤ వసిష్ఠుఁడు యజ్ఞసంభారముల సిద్ధము చేయించుట. ➤◆

చం.సమముగ నొక్కయేఁ డరుగఁ ♦ జారువసంతము రాఁగఁ గ్రమ్మఱ
న్నమమున నశ్వమేధము నొ♦నర్ప సుతాప్తికినై ధరాధవుం
డమలు వసిష్ఠుఁ జేరి విధి ♦ నర్చన సేసి యథోక్తి నే నుప
క్రమ మొనరింతు విఘ్నహతిఁ ♦ గానక యుండఁగఁ జేయుఁ డీకృతిన్. ౩౩౩

కం.గురుఁడవు నిస్తులమైత్రీ,భరుఁడ వవిచ్ఛిన్నసఖ్య♦పరుఁడవు క్షేమం
కరుఁడవు కూరిమి మీర లె, భరియింపను వలయు యజ్ఞ♦భారం బెల్లన్. ౩౩౪

చం.అనవుడు నవ్వసిష్ఠముని ♦ యా నృపు కే సర్వము నిర్వహింతు నే
నని సవనంబుఁ దీర్పఁగ ని♦యామకు లైనద్విజాతివృద్ధులన్

---

[1] పనివినిరి = సెలవుతీసికొనిపోయిరి. [2] గుబ్బతిలంగన్ – అతిశయింపఁగా.

సనియమధర్ములన్ స్థపతి♦సంఘములన్ వరశిల్పవిజ్ఞులన్
ఖనకులఁ[1] గర్మకారులను ♦ సర్తకవర్ధక[2] చిత్రకారులన్. ౩౭౫
చం. గొనకొని వేనవేలుగను ♦ గూర్పుఁడు తెంపిట, కిప్పు డిట్టికల్
ఘనవిపులంబు లైనయుప♦కారిక లుత్తమవిప్రవాటికల్
గనఁగ సునిష్ఠితంబులు ప♦లప్రచయాదిక భక్ష్యపానభో
జననిలయంబులు న్వలయుఁ ♦ జక్కఁగ నిర్మితి సేయ నియ్యెడన్. ౩౭౬
తే. విప్రవరు లుండ యోగ్యంపు♦వీటిపట్లు, బహువిధంబులుభక్ష్యాన్న♦పానములును
గలిగిదృఢ సుయివాసయో♦గ్యంబుగాఁగ,వందలకొలందిదీర్పంగ♦వలయుమీరు.
కం. అట్టి వ పౌరులకును గడు,దిట్టము తావసతు లొగిని ♦ దీర్పఁగ వలయున్
నెట్టన యెవియెవి కోరిన, నట్టట్టివి నిండి యుండ ♦ నగు నాయిండ్లన్. ౩౭౭
కం. ఆరీతి జానపదులకుఁ, జారుతరంబుగను దీర్చి ♦ శాస్త్రోక్తవిధిన్
సారతరాన్నాదులఁ గడు,గారవమున నిడఁగవలయుఁ ♦ గా వశ్రద్ధల్. ౩౭౮
తే. అన్నిజాతులవారి యు♦ధార్థభంగి, సత్కరించుచు వారలు ♦ సంతసించు
నటులొనర్పుఁడు కినుకచే♦నైనఁ గామ,బలముచేనైన నవమాన♦పఱుపవలదు.
చం. వలయును యాగకార్యములు ♦ నన్నగ్రమానస్కులు, శిల్పకారులన్
వలసినయన్నవిత్తము లు♦వారికి నిచ్చి యథాక్రమంబుగా
వలరఁగఁ జేయు, మీవక ర♦వంతయుఁ గూర్పుఁడు సర్వమున్ మదిం
జెలిమియుఁ బ్రీతి నూని, యపుఁ ♦ జెచ్చెర వారలు దీర్చి యమ్మునిన్. ౩౮౧
కం. మీరు వచించినవిధముసఁ, గారియము లీర్చు టయ్యెఁ ♦ గడమపడక యిం
కేరీతి వచించిన నా,తీరున సర్వంబు వేగ ♦ దీర్తు మటన్నన్. ౩౮౨

→ వసిష్ఠుఁడు రాజులను బిల్వసుమంత్రుని నియమించుట. ←

చం. అతఁడు సుమంత్రుఁ జూచి విది♦తాత్మక! పెచ్చనఁ బిల్వఁ బంపుమీ
క్షితిఁ గలసర్వధార్మికుల ♦ శిష్టపరామరభూమిపార్థివా
గ్రణతుల సర్వదేశగన♦రప్రకరంబుల వేనవేలు, స
త్కృతు లొనరించి శ్రద్ధ దలఁ♦గింపక రక్తిపురస్సరంబుగన్. ౩౮౩
చం. జనకుని సత్యవిక్రముని ♦ శౌర్యధనాఢ్యుని వేదశాస్త్రుని
ష్ఠుని మఱిఁ బూర్వబాంధవుని[3] ♦ సూరిజనాగ్రణి నీవ పిల్వుమీ
యనఘు మహాత్ము సత్కృతుల ♦ నాదృతిఁ దన్పుచు; మున్నుమున్న నే
సనివిని శిష్టుఁ డిష్టుఁడును ♦ నై యతఁ డొప్పుటచే నెఱుంగుమా. ౩౮౪
కం. సతతము ప్రియవాదియు నా,హితుఁడును నగు కాశిరాజు ♦ వృద్ధుని ధర్మిన్
సుతసహితు నృపతిమామను, హితగతిఁ గేకయునిఁ బిలువు ♦ మీ వేయిటకున్.

---

[1] ఖనకులు = త్రవ్వువారు. [2] వర్ధకి = వడ్రంగి. [3] పూర్వబాంధవుని = చిరకాలస్నేహితుని.

తే. అంగవిషయాధినాథు మ♦హాయశస్వి, రోమపాదుని నృపతిశా♦స్త్రాలమిత్రుఁ
దోడితెమ్ము మహాభాగుఁ ♦ దోన నీవ, సత్కృతుల్ బొనరించుచు ♦ సాధుచరిత.
తే. భానుమంతునిఁ[1] గోసల♦పార్థివేంద్రు, సర్వశాస్త్రవిశారదు ♦ శౌర్యధనుని
మగధనాథు[2] వదాన్య సం♦ప్రాప్తివేది, సత్కృతు లొనర్చితోడితేరఁ ♦ జనుమునీవు.
కం. తూరుపుభూమీశుల సౌ,వీరపతిని సింధురాజ♦బృందారకునిన్
సౌరాష్ట్రీయుల దక్షిణ,భూరమణులఁ బిల్వఁ బంపు ♦ పొలుపుగ నిటకున్. ౩౯౮
కం. ఇంతలు నంతలు బుడుతలు, కాంతలు సహచరులు హితులు ♦ గలవారలతో
నంతలపొంతలవారిని,[3] నెంతేఁ దమిఁ బిల్వఁ బంపు♦మీ యావేళన్. ౩౯౯
కం. అనవుడు వసిష్ఠునుడుల, న్ననిపంచెను నృపుఁడు బిల్వ ♦ వేతగునారిన్
జనెఁ దాన ముని వచించిన, జనపతులం బిలువ నగ్గి♦సంభావనలన్. ౪౦౦
కం. అంతటఁ గర్మాంతికు లా,నంతయుఁ గొఱతలేక దీర్చి ♦ యన్నియుఁ దద్వృ
త్తాంతముఁ దెలిపిరి మునిజన,కాంతునకుం జక్కసయ్యెఁ ♦ గార్యము లనుచున్.
చం. కని యవి యన్నియు న్మునియు ♦ గాటపుహర్షముతోడ నెల్లరం
గనుఁగొని వారికి ట్లనియెఁ ♦ గార్యధురాళికియంబు దోఁపఁగన్
బను లొనరించువేళఁ బొర♦పాటున నేనెఁడేని నెవ్వఁ డేన్
జన దవహేల యీవి, నటు ♦ సల్పిన దాత నిజంబు నొపఁగున్. ౪౦౨

→ యజ్ఞంబుఁ జూడ నానాదేశముల రాజు లయోధ్యకు వచ్చుట. ←

కం. ఈరీతిఁ బలుక నావల, ధారిణిపైఁ గలుగునకల♦ధాత్రీనాథుల్
చేరి రయోధ్యాపురము న,పారము లగుబహువిధోప♦హారంబులతోన్. ౪౦౩
కం. రేయుం బవలును ధరణీ,నాయకు లరుదేర ముదము♦నం గొంగుచు మే
ధాయుతమైత్రావరుణియు, నాయాజిం గాంచి పల్కె ♦ నయగిరి దోఁచన్. ౪౦౪
ఉ. వచ్చిరి ధారిణీశులు భ♦వన్నహితాజ్ఞ వహించి, కానుకల్
దెచ్చిరి వేనవేలుగఁ ద్వ♦దీయసవార్థము, వారి నందఱన్
మెచ్చఁగ యుక్తరీతిని వ♦రం బగుసత్కృతి నాదరించితిన్,
మెచ్చిరి నీనియంతృత, క♦మేయగుణాకర! లెమ్ము చెచ్చెరన్. ౪౦౫
కం. జన్నము నారంభింపఁగ, జన్నపునెలవులను జూడఁ ♦ జనుదెం, న్నటఁ దా
మున్నవి సిద్ధము వస్తువు, లన్నియు మతివిరచితముల♦యట్ల నృపాలా. ౪౦౬
ఉ. చెప్పఁగ ఋశ్యశృంగుఁడు వ♦సిష్ఠుఁడు నిట్టులు, పుణ్యలగ్నమం
దప్పుడ రాజు దా వెడలి ♦ యచ్చటి కేగిన, ఋశ్యశృంగుఁ దా
రొప్పుగ మున్నుగాఁ గొని ద్వి♦జోత్తము లెల్లరు యజ్ఞకర్మముల్
దప్పక చల్పఁ బూనిరి య♦థావిధిగా సరయూత్తరాననిన్. ౪౦౭

---

[1] భానుమంతుఁడు = కౌసల్య తండ్రి. [2] మగధనాథుఁడు - సుమిత్ర తండ్రి. [3] అంతలపొంతల వారు = దూరపుబంధువులు, దగ్గఱబంధువులు.

## —— అశ్వమేధయాగప్రారంభము. ——

సీ. అశ్వంబు విడిచి వా♦యున మాటయును నది, గ్రమ్మఱఁ బిప్పల♦ప్రజమునందు
బంధించి హయమేధ♦పరత నైభాండక,పూర్వంబుగా ద్విజ♦పుంగవులును
బ్రతిపత్తు మొదలుగాఁ ♦ బ్రతిదినంబును మూఁడు,నైశ్వదేవంబులు ♦ వఱలునట్లు
సప్తవాసరములు ♦ సల్పి క్రమంబుగ, జరపి ప్రవర్గ్యోప♦సదము లాది
తే. నవలఁ బ్రాతస్సవన మాది ♦ నైంద్రమిచ్చి, సోమవల్లిని విధ్యుక్తి ♦ స్తుతి యొనర్చి
యంత మాధ్యందినముఁ దృతీ♦యంబుఁ దీర్చి,రోలి న్యూనాతిరిక్తత ♦ లొందకుండ.
చం.స్ఖలితము హోమలోప మెటఁ ♦ గానము, సర్వము మంత్రవంత మై
వెలసె నిరంతరాయముగ ♦ వేఁడక కే నట నొక్కఁ డేనియుఁ
గలుగఁడు దప్పి నాఁకటను ♦ గాఱియు నొందెడివాఁడు, విద్యలం
దెలియనివాఁడు, నూర్లకొలఁ♦దిం దగుశిష్యులు లేనివిప్రుఁడున్. ౪౦౯
ఉ. పాఱులు నాథవంతులును ♦ బాలురు వృద్ధులు వ్యాధిచేత నో
టాఱినవారలున్ శ్రమణు ♦ లంగనలు న్వివిధౌదనంబులున్
గాఱఁగఁ జేరలన్ ఘృతము ♦ కమ్మనిపప్పులు పిండివంటలున్
జాఱలుగా భుజించి రటఁ ♦ జొక్కపుముక్కువ ముక్కుబంటిగన్. ౪౧౦
ఉ. అంచితభక్ష్యభోజ్యముల♦యచ్చపుఁగమ్మనివాసనల్ ఘుమా
యించుచుఁ దీప్ప నాఁకలిని ♦ నెంతయుఁ ద్రేఁచుచుఁ బొట్ట దవ్వుచున్
మించినయాన నాపడియు ♦ మేకొనఁ జాలమిఁ దృప్తి విస్తరుల్
దించి చనంగ లేరెనరు ♦ పేర్చి రి పెట్టులో శాకపాకముల్. ౪౧౧
కం.కుడువఁగఁ జాలక విస్తరి, విడువంగా లేక మిఱుక ♦ వెక్కస మయి, వే
యిడుఁడీ యిడుఁడీ యన్నం, బడబాలల[1] టంచుఁ బలుకు ♦ నధికారితతుల్. ౪౧౨
కం.సూపంబులు వివిధంబు ల,పూపము లన్నంబు నాజ్య♦పూరము రుచ్య
ద్దీపితపాయసములును న,నూపము[2] నొనరించె ధర స♦మానముగాఁగన్. ౪౧౩
కం నానాదేశసమాగత, మానవతతపుణ్యజనము ♦ మానక యొప్పన్
గానాన్నంబులరుచులం, బూనిక కొండాడి యాడి ♦ భుజియించెఁ దమిన్. ౪౧౪
కం దిన దినము గ్రొత్తక్రొత్తగ, జనులకు విధివంతములుగ ♦ సమకూర్చినయో
దనరాసులు కొండలొ నాఁ, గన నయ్యె మహానసముల[3] ♦ గ్రతువిధివేళన్. ౪౧౫
శా. భద్రం తే నృపలోకపాలనర! తృ♦ప్తాః స్మ ప్రభో! యంచు న
న్ముద్రామోదముతోడ సద్భ్రతలమున్ ♦ సోఁకంగ భోక్తల్ద్విజుల్
మాగ్రస్తిఁ బఱఁగఁ గూయిడ స్దశరథ♦శ్లాఘాలఁ దాలించి య
చ్ఛిద్రానందము నొంది దానమును జే♦సెం జేలము ల్భూపలున్. ౪౧౬

---

[1] అడబాలలు = వడ్డించువారు. [2] అనూపము = బుడదనేల. [3] మహానసము = వంటయిల్లు.

కం. బోసేసెడివిప్రులకు, న్గసేఁతల నొప్పుశుచిజ♦నము వడ్డించెన్
వేసట లే కవ్వారికి, బాసట నైయె కుండలముల♦వారలు దిరుగన్. ౪౧౮

కం. *మా[1] పూపో మా సూపో, మా పరమాన్నం ఘృతం చ ♦ మా దధిదుగ్ధే
మా పరితుష్టాస్స యనుచుఁ, గూపెట్టినదాఁక నిడిరి ♦ కోరిన వెల్లన్. ౪౧౯

తే. కుడిచి కూర్చుండి స్వర్ణ♦కుండలాది, భూషణాలంకృతాంగులై ♦ భూమిసురులు
గెరలి తొడఁగి రన్యోన్యజి♦గీషఁ జేసి, హేతువాదంబునకు; జేన్న ♦ మిట్లు జరుగ.

కం. దినము దిన మచట సంస్తర, ముఁన నేర్పరు లైనద్విజులు ♦ మునుకొని క్రియలన్
గొనసాగింపుదు రన్నియుఁ, బనివడి విధివిహిత మైన♦పద్ధతు లమరన్. ౪౨౦

ఆ. వ్రతులు గానివారు ♦ వాదశాలీను ల, శ్రుతిషడంగవిదులు ♦ సూరిజనుల
వలన వినికి లేని♦వారు నాదశరథు, నోలగమున దొరకఁ ♦ డొక్కఁడేని. ౪౨౧

## యూపస్తంభ ప్రతిష్ఠ.

సీ. యూపప్రతిష్ఠకు ♦ నుచితంపువేళ రా, మాఁడేడుచంద్రుల ♦ మహితము లగు
యూపంబు లాఱాఱు♦నొకటి దాపుగ నాటి, నన్నియ మోదుగు ♦ లవల నిల్పి
విరిగి యూపం బొండు ♦ వేదివజ్ఞ ఘటించి, దానిప్రక్కల డేవ♦దారుయూప
యుగ్మంబుఁ బొనరించి ♦ యొయ్యి శోభాగ్యమై, శాస్త్రకోవిదులు కాం♦చనవిభూష
తే. ణంబులను వానిని సలంకృ♦తంబుఁ జేసి, యేకవింశతియూపంబు ♦ లిరువదొకటి
గలుగఁ జిటికెనవ్రేల్మూర♦కొలఁతనిలిపి, యొక్కొకటినవస్త్ర ముంచిరొ♦క్కొక్కటికిని.

కం కల్పోక్తమార్గమునను స, నాప్పము సుకృతంబు సుదృఢ ♦ సుస్నాస్రముగన్[2]
గొల్వంగ మెఱుఁగు లీన, న్నిల్పు లొనర్చుటను యూప♦నిరహము వెలిఁగెన్.

కం లిప్తవరచందనం బై, ప్రాప్తాంబరపుష్పకాంచ♦నాలంకృత మై
దీప్తిం గనె యూపవితతి, సప్తర్షులు మింట వెలుఁగు♦చందం బమరన్. ౪౨౪

సీ. శాస్త్రోక్తపరిమితి ♦ సవుసైనయిట్టికల్, గొనిశుల్బ మనుపనిఁ ♦ గుశలు లైన
బ్రాహ్మణుల్ వేదిని ♦ బాగుగఁ దీర్పఁగ, నది గరుడాకృతి ♦ హైమపక్ష
యుక్తమై త్రిగుణ మై ♦ యొప్పి యష్టాదశా, గ్నిక మయి రాజిల్లె ♦ మఱినియుక్త
పశువులఁ బాములఁ ♦ బక్షుల విధిరీతి, నయ్యయివేల్పుల ♦ నాగ్గ నిలిపి
తే. వాజి జలచరములఁ గట్టి♦నైచి రపుడు, యూపములకును నచ్చటి ♦ యూపములకుఁ
బశువులను మూఁడువన్నూర్లను♦బార్థివేంద్రు, పశ్వరత్నంబుఁగట్టిరా♦యవనిసురులు.

సీ. అంతటఁ గౌసల్య ♦ హయమును సేవించి, మొనసి కృపాణముల్ ♦ మూఁటఁ జీల్చి
యొక్కరేయెల్లను ♦ మసృణప శయనించె, నావాజమొన్న ధ♦ర్మాభిలాష

---

[1] మా = వలదు. [2] [illegible] ప్రయు [illegible] ఎనిమిది [illegible] ది.

బ్రహ్మకు హోతకుఁ ♦ బదపడి నధ్వర్యు,నకును నుద్గాతకు ♦ నరవిభుండు
మహిషి[1] వావాతను[2] ♦ మఱియుఁ బాలాకలిఁ, బరివృత్తిని[3] నొసంగె ♦ స్పర్శనముగ
ఆ. సంత వాజివపను ♦ నగ్నిలో వేల్వ సం,పన్న ఋత్విజుండు ♦ పాప మణఁగఁ
బార్థివుండు తద్వ ♦ పాధూమగంధంబు, మూరుకొనియెఁ గాల ♦ మునను సవిధి.
ఆ. హయవరంబునంగ ♦ మంగంబుఁ గైకొని, పదియు నార్గు రైన ♦ బ్రాహ్మణోత్త
ములు సమంత్రకముగఁ ♦ బూని వేల్చిరి వహ్ని,యందు శాస్త్రయుక్త ♦ మైనసరణి.
తే. అన్య మగునధ్వరంబుల ♦ హవిసుఁ బ్లక్ష,శాఖచే సంస్కరింత్రశ్వ ♦ సవమునందు
వైతసంబున నుంపఁగ ♦ వలయుఁ గాన, నట్లయొనరించె నాఋత్వి ♦ గాళియపుడు.
సీ. యజ్ఞవిధానంబు ♦ నందు బ్రాహ్మణముల, దినములు మూఁడు వా ♦ కొనఁగఁబడియె
హయమేధవిధియందు ♦ నందుఁ జతుష్టోమ, మనఁబడు దొలుతటి ♦ దినము రెండ
వదిన ముక్థ్యం బయ్యె ♦ వల నొప్ప మూఁడవ, దిన మతిరాత్రంబు ♦ ననెడి పేర
శాస్త్రదృష్టం బగు ♦ సకలేతరక్రియా,పాళిఁ దీర్చెను ఋత్వి ♦ గాళి యంత
తే. నమలరీతి జ్యోతిష్టోమ ♦ యజ్ఞ మాయు, రధ్వరంబును నతిరాత్ర ♦ యజ్ఞయుగము
నవల నభిజిత్తు విశ్వజి ♦ దధ్వరంబు, గ్రాలఁ జేసె నప్తోర్యామ ♦ క్రతువరంబు. ౪౨౯
సీ. ప్రాచి హోతకు నిచ్చి ♦ పశ్చిమం బధ్వర్యు,నకు బ్రహ్మకును దక్షి ♦ ణంపుదిశయు
నుత్తరదిశయెల్ల ♦ నుద్గాతకు నొసంగి, స్పర్శనంబుగ వంశ ♦ వర్ధనుండు
హయమేధ మంతయు ♦ సాంతంబుఁ గావించి, శాస్త్రచోదితమైన ♦ సరణి వెలయ
సర్వసర్వంసహా ♦ చక్ర మీరీతిని, ఋత్విజులకు దాన ♦ మిచ్చియున్న
తే. యనఘు నిర్మలచిత్తుని ♦ నవనినాథుఁ, గాంచి ఋత్విజు లెల్ల ని ♦ ష్కాములైన
సంయముల మేమ్ఁ బుడమిజం ♦ జాటమేడ, యోగ మేయారుభోగమే ♦ యూరుచెపుమ
ఉ. ఒల్లము ధారణీశ్వర! ప్ర ♦ యోజన మేదిన మేదినీస్థలం
బెల్లను నీవ కైకొనుచు ♦ నేలుచు నుండుము, దాని మాఱుగాఁ
బెల్లుగ గోవు లేని మణి ♦ బృందముఁ బైఁడి నొకించు కేని రం
జిల్లుదు మిమ్ము చాలుఁ; దమి ♦ సేయము ధారిణిఁ జేరఁ డంతయున్. ౪3౧
మ. అనుచున్ విప్రులు పల్క భూమిపతి య ♦ ట్లౌఁ గాక యం చీయ నా
లను వేవేల్ పదికోట్లసువర్ణములు నా ♦ ల్గంతల్గ రూప్యంబులుం
గొని యాఋత్విజు లెల్ల రెల్లధనముం ♦ గొంపోయి యర్పింపఁ జ
య్యన భాగించిరి యవ్వసిష్ఠుఁడును శాం ♦ తాత్మేశుఁడున్ భాగముల్. ౪3౨
ఆ. వారు వారివారి ♦ భాగంబు లన్నియుఁ, బాడి దప్పకుంపఁ ♦ బంచి పెట్ట
వారు గొని నృపాల ♦ వరుఁ గాంచి సంప్రీతిఁ, జెందినార మనుచుఁ ♦ జెప్పి రంత. ౪33

---

[1] మహిషి = ఉత్తమ క్షత్రియస్త్రీ. [2] వావాత = మధ్యమజాతి భార్య - వేశ్య. [3] పరివృత్తి = ఉపేక్షిత - శూద్రస్త్రీ.

ఉ. జేన్నముఁ జూడ వచ్చినప్ర♦జల్ గడుసంతస మంద జాళువా
నన్ననిచేలము ల్మణులు ♦ పాలులు స్వర్ణము లగ్గలంబుగా
నెన్నఁగ రానికోటులను ♦ నిచ్చెను, జేతికడెంబు లర్థి ని
చ్చె న్నిఖిలవేదపాఠునకుఁ ♦ జేరి తనుం గొనియాడ నాతఁడున్. ౪౩౪

ఉ. ఈవుల నెల్లవారలను ♦ నీవిధి మిక్కిలి దన్పి భక్తి సం
భావనఁ జేరి కేల్మొగిచి ♦ పజ్జన నిల్చినఁ జూచి యమ్మహా
పావను భూమిదేవత ల♦పారద యామతిఁ బెక్కురీతులన్
దీవన లిచ్చినం దరణి♦తేజుఁడు హృష్టమనోభిజాతుఁ డై. ౪౩౫

కం. అనితరధరణిపసులభం, బనుత్తమము[1] సర్వపాప♦హారమున్ స్వర్గ్యం
బును సవముఁ దీర్చి యలరుచు, నినకులుఁ డాదటను ఋశ్య♦శృంగుం బలికెన్.

కం. కులవర్ధను లగుతనయులు, గలుగఁ బ్రసాదింప నీవ ♦ కా కెవ్వరు యో
గ్యులు సన్ముధరణిధన్యుని, జలుపఁగ దే యనినఁ బ్రాజ్ఞ ♦ సత్తముఁ డనియెన్.

దశరథుఁడు పుత్రకామేష్టిఁ జేయుట.

ఉ. అట్టుల యాను గాక వసు♦ధాధిపచంద్రమ! కీర్తిపట్టు లా
పట్టులు నీకు నల్వు రొద♦వం గలవారు విషాద మేల? యం
చట్టె యొకింత ధ్యానపరుఁ ♦ డై స్మృతిఁ దోఁపఁగ నీకుఁ బుత్రకుల్
పుట్ట నథర్వమంత్రములఁ ♦ బొల్పగు నిష్టి యొనర్పఁ జేసెదన్. ౪౩౭

ఆ. ఉక్తమంత్రవిధిని ♦ హుతవహు వేల్చిన, సుతులు పుట్టఁ గలరు ♦ క్షితిప! యనిన
నామనోహరోక్తు ♦ లాలించి తుష్టుఁ డై, సవము సల్పు చున్న♦యవసరమున. ౪౩౮

తే. అటకు గంధర్వదేవసి♦ద్ధాదిసురులుఁ, బరమఋషులును దమ హవి♦ర్భాగములకు
వారిజాసనుతోఁడుత ♦ వచ్చుకతన, ధాతఁ గన్గొని దేవతా♦తతి వచించె. ౪౪౦

దేవతలు రావణుఁడు పెట్టుసంకటములు బ్రహ్మతో విన్నవించుట.

చం. స్థిరనతిమద్విధేయ! భవ♦దీయదయాపరలబ్ధి రావణా
సురుఁడు నితాంతగర్వమున ♦ సూడు దలంచి యలంచె మమ్ము నె
ల్లరును, భుజాబలంబున వ♦లంతులు గా మెదిరించి గెల్వ, నీ
వరమును గారవించి పలు♦పాటులు సైఁచెదమయ్య దీనతన్. ౪౪౧

ఉ. ఆకులతన్ జగత్త్రయము ♦ హాయన రాయిడి పెట్టె దుష్టుఁ డై,
వ్యాకులతన్ మహేంద్రునిఁ బ్ర♦వాసిగఁ జేయఁగ నిశ్చగించె, న
స్తోకవరస్థయంబున వ♦సున్రలియత్నధరామరాదులన్
గాకు పడంగఁ జేసెఁ, గొఱ♦గాముల కెయ్యది మేర చెప్పుమా. ౪౪౨

---

[1] అనుత్తమము = దేనికంటె నుత్తమమైనది లేవో యది యనుత్తమము.

చం. తపనుఁడు చంద్రుఁ డయ్యెను, సదాగతి వీవఁకు పజ్జ నిచ్చ భం
గపడుసముద్రుఁడున్ నకనకం బడి నిశ్చలుఁ డయ్యె నివ్వెఱన్,
కృప యొకయింత లేక మముఁ గీడ్పడఁ జేయుట నేమి చెప్పఁగా?
మపను యొకంచు లేదె పనుఁ డోటఱిపోవ జగంబుఁ బ్రోవఁగన్? ౪౪౩

సీ. వేలుపు లిటు వేఁడ విధి మేలు మేల్ వాఁడు, ద్రుంగు నుపాయంబు దోఁచెవినుఁడు
దేవగంధర్వదైతేయవిద్యాధర,వసుయక్షఖేచరపరుల చేత
వధ్యుండఁ గానట్టి వరము నిమ్మని కోర, నట్ల యౌఁగావుత మంటిఁ దొల్లి
మానవులను నవమానబుద్ధిని జేసి, పరిగణింపఁడు వాఁడు వరము వేళఁ
తే. గాన మనుజునిచే వాఁడు కాల మందుఁ, గాని పరులకు వధ్యుఁడు గాఁడ టన్న
నురలు మానులుఁ గెరలిరి యురుసమునను, నిట్లు వారలు రక్షకాపేక్షు లగుడు.

శ్రీవిష్ణుమూర్తి దేవతలకుఁ బ్రత్యక్ష మగుట

కం. ఈలోనన జాంబూనద,చేలుండు జగత్ప్రభుండు శ్రీకరతను గు
గ్దాలుండు శంఖచక్రగ,దా లలితుఁడు విష్ణుమూర్తి త్వర విచ్చేసెన్. ౪౪౫

కం. అరుదెంచి యావిరించను, దరిని సమాహితమనంబున న్నోలసిల్లన్
సురలున్ వినతుల నుతులన్, హరిమన మలరించి యిట్టు లాడిరి భక్తిన్. ౪౪౬

సుగంధి. నిన్ను వేఁడు వార మయ్య నీరజాక్ష! మమ్ము నా
పన్నులం బ్రపన్నులం బ్రపంచము న్దయామతిం
జెన్ను మీఱఁ గావవే; ప్రసిద్ధుఁ డిద్ధకీర్తిసం
పన్నుఁడున్ వదాన్యుఁడుం దపస్వితుల్య తేజుఁడున్. ౪౪౭

కం. కాకుత్స్థవరుఁడు దనయుల, కై కడఁగెను భక్తిఁ గ్రతువుఁ గావింప నిలే
శాకూతము నెఱవేఱఁగ, శ్రీకర సదయాంతరంగ! చింతింపఁగదే. ౪౪౮

కం. కల రీతనికిని మువ్వురు, వెలఁదులు హ్రీ శ్రీని గీర్తిఁ బెంపునఁ బోలం
గలవారలు వారలకున్, నలువిధముల సుతుఁడ వగుచు నటియింపఁగదే. ౪౪౯

ఉ. ఆవరవర్ణినీత్రికమునందు నరాకృతిఁ బూని తోఁచి, దు
ర్భావుని లోకకంటకుని బాహువరద్రవిణప్రవృద్ధునిన్
దేవసమాజదుర్జయునిఁ దీవ్రము రావణు, సిద్ధసాధ్య లే
ఖావళి మానిసంఘములు నాతఁడు కాఱియ పెట్టెడిన్ హరీ! ౪౫౦

విష్ణువుతోఁ దేవతలు తమసంకటంబుల విన్నవించుట.

సీ. మునికోటు లడవుల ముక్కుపట్టఁగ రాదు, దేవతల్ వాహ్యాళి దిరుగ రాదు
గంధర్వకోటులు గాన మొంచఁగ రాదు, యాయజూకులు[1] యాగ మసఁగరాదు

---

[1] యాయజూకులు – యజ్ఞశీలురు.

తెఱఁగంటికన్నెలు ♦ తెరువులఁ జనరాదు, నందనం బనుపే ర♦నంగరాదు
సురకోటులు హవిస్సు♦జోలి పల్కఁగరాదు, చెలువలు కైసేఁత ♦ సేయరాదు
తే. ఏమ టంచు వచింతు మో♦యిందిరేశ, మాయవస్థలు దాఁగంగ ♦ మఱువు లేదు
ఖలుని వధియించి సురపాళిఁ ♦ గావ నిన్ను, శరణుఁ జొచ్చినవార మో♦జగదధీశ.
కం. అరిమర్దన! నీవే కద, పరమగతివి మాకు నెల్ల♦వారికిఁ గానన్
సురశత్రుల దండింపఁగ, ధరణికి నీచనఁగ మదిని ♦ దలఁపుము దేవా. ౪౫౨

విష్ణుమూర్తి దేవతల కభయ మిచ్చుట.

చం. అడజడి వేల్పు లిట్లు చతు♦రాస్యుఁడు మున్నుగ విన్నవింపఁగా,
నడలకుఁడీ సురల్, వెఱవు ♦ నందకుఁడీ మునివర్యు, లింక నేఁ
బుడమిఁ జెనంటి రక్కసులఁ ♦ బొల్పుఱఁ జేయుదు, మీకు నైనయీ
గొడవ దొలంగఁ జేసెదను ♦ గూర్చెద మే, లభయం బొసంగితిన్. ౪౫౩
కం. పుత్రులతో మంత్రులతోఁ, బౌత్రులతో వాసిజ్ఞాతి♦బాంధవతతితో
మిత్రులతో శకలీకృత,గాత్రునిఁ గావింతుఁ బంక్తి♦కంధరు ననిలోన్. ౪౫౪
కం. అదయుని మునిసురభయంకరుఁ, బాపని వధించెద రణాగ్ర♦మునఁ బృథివి పయిం
బదివేలవత్సరంబులుఁ, బదినూర్లేఁడులు వసింతుఁ ♦ బాలింతు ధరన్. ౪౫౫
చం. శరణముఁ జొచ్చి నట్టివన♦జప్రభవాదుల కెల్ల నీగతిన్
వరము దొలంగఁగా నభయ♦దాన మొసంగి యొసంగురక్తి నీ
ధరపయి నేరియందు నవ♦తారము నొందఁగ మానవాకృతిం
దర మగు నంచుఁ గొంతవడి ♦ దాఁ దలపోసి యనంతరంబునన్. ౪౫౬
కం. పద్మపలాశాక్షుఁడు దురి,తాన్తగుఁ డానతజనావ♦నాసక్తుం డ
చ్ఛద్మ్ముఁడు దనకు నయోధ్యా,సద్మ్ముఁడు[1] దశరథుఁడౌ తగును ♦ జనకుఁడు గాఁగన్.
చం. అనుచుఁ జతుర్విధాకృతుల ♦ నావటఁ బూని జనింప నెంచినన్
ఘనతరహృష్ట చిత్తులయి ♦ కాలగళాదిసురుల్ మధుద్విషున్
వినుతి యొనర్చి త్రుంపఁ గద♦వే సదయాత్మక! రావణాసురున్
మునిజననిగ్రహర్తున్ సురస♦మూహవిరావణు దుర్నివారణున్. ౪౫౭
కం. బలబంధుయుక్తివానిన,[2] పొలియించి సురేంద్ర గుప్త♦మును గతదోషా
వలియుం జిరము స్వలోకము, వెలయఁగఁ జనుదెమ్ము మరల ♦ విగతజ్వరతన్. ౪౫౮

దేవతలు విష్ణువును మానవావతార మెత్తఁ బ్రార్థించుట.

ఉ. చేయఁగఁ బ్రార్థనంబు సుర♦సిద్ధముఖామరు లెల్ల రిట్లు నా
రాయణుఁ డాదరంబు మెయి ♦ నాత్మ నెఱింగియుఁ బల్కె నేమహో

[1] రామాయణకాలమున కయోధ్యకు సాకేతమనుపేరు లేదు గావున మూలమునందువలె నిందును సాకేతమనుపేరు గానరాదు. [2] వానిన = వానినే. విభీషణాదులఁ గాదనుట.

పాయసముచే సురారులను ♦ బంచతఁ గూర్చెదఁ జెప్పఁ డన్న వా
రాయమితౌజు మ్రొక్కుచు న♦రాకృతిఁ బూని వధింపు మాశరున్. ౪౬౦

ఉ. తేఁకువఁ బెక్కు లేఁడు లతి♦తీవ్రముగాఁ జతురాస్యుఁ గూర్చి పె
న్వేఁకఁ దపంబు సేయ విధి ♦ నెమ్మి దయం బొడచూప లోక మ
స్త్రాఁకలు పెట్టఁ గోరి వివి♦ధాకృతిభూతములందు దేనికిన్
లోఁకువ గామిఁ గోరె; మది♦లో గణియింపఁడు మానవాళులన్. ౪౬౧

కం. ఔ నని వర మజుఁ డిచ్చుట, దానవుఁడు మదించి లోక ♦ తరుణీతతికిన్
మానముఁ బ్రాణము దీసెను, మానవుచేఁ గాని వాఁడు ♦ మడియఁడుగలనన్. ౪౬౨

చం. అనుచు వచింప నట్ల యగు ♦ నంచుఁ దిరోహితుఁ డయ్యె వెన్నుఁడున్;
జనపతి పుత్త్రులం బడయఁ ♦ జల్పుచు నుండఁగ నిష్టి, హవ్యవా
హను నడుమంతరంబున న♦యంబున నుద్భవ మందె నిండుఁ దే
జున దిశ లెల్ల వెల్గఁగను ♦ జూపఱు నివ్వెరపాటు పొందఁగన్. ౪౬౩

దశరథునకుఁ బ్రాజాపత్యపురుషుఁడు పాయసం బిచ్చుట.

సీ. నీలరక్తం బైన♦చేలంబు నెఱ్ఱసి, మోము దుందుభిరవం♦బును రహింప
నునుపాయ కేసరి♦తనుజాతములఁ బోలు, వెంద్రుకల్ మీసలు ♦ వెలయుచుండ
శుభలక్షణంబులు ♦ శుభభూషణంబులు, శైలశృంగోన్నతి ♦ జానుమీఱు
సమదశార్దూలవి♦క్రమము సూర్యోపమా, కారంబు దీప్తాగ్ని ♦ కరణిఁ దేజు
తే. గలిగి భూరివీర్యంబును♦స్ఫుటబలంబుఁ, దొలసియద్భుతభూతంబు ♦ దోఁచియపుడు
దివ్యపాయసయుతము ప♦త్నివలెఁ బ్రియము, నైనపైఁడిపాత్రిక బాహు♦లందునమర.

శా. త్వన్నాథుం దిలకించి భూపవర! ప్ర♦జాపత్యమూర్తిం జుమీ
కాన న్వచ్చితి ని న్న టన్నఁ బ్రణతుల్ ♦ గావించి కేల్మోడ్చి దే
వా! నాకుం గరణీయ మెయ్యది యనం ♦ బల్కెన్ మహాశక్తి సం
తానం బీ వభిలాష చేసి క్రతుతం♦త్రం బిట్లు గావింపఁగన్. ౪౬౫

చం. ఎసఁగినసంతసంబున మ♦హీవర! దేవత లెల్లఁ బంపఁ బా
యస మిది దేవనిర్మితము ♦ నస్యదురాసదముం బ్రజాకరం
బసమ మనామయంబు శుభ♦మై కడుధన్యము నైనదాని నీ
కొసఁగఁగఁ దెచ్చితిం గొనుమ ♦ యూర్జితపుణ్యచరిత్ర! దీనినిన్. ౪౬౬

కం. అనురూప లైనభార్యల, కును గరుణ నొసంగు మీవు ♦ గోరినమాడ్కిన్
దనయులు జనియించెద రో, మనుజవరా! యనిన మోద♦మానుం డగుచున్. ౪౬౭

కం. సురదత్తముఁ గాంచనభా, స్వర మగు దేవాన్న పూర్ణ♦పాత్రము నృపుఁడున్
శిరమునఁ గొని భూతమునకుఁ, బరుభక్తిఁ బ్రదక్షిణించెఁ ♦ బొగడుచు మ్రొక్కెన్.

కం. నిఱుపేదకుఁ బెన్నిధి చే,కుఱినగతిఁ సంతసిల్లె ♦ గొబ్బున భూతం
బుఱవుగ సదృశ్యముగ; న,త్తఱిఁ దఱచగుకోర్కు లూర ♦ దశరథుపత్నుల్.

చం. ఎలమి వికాసభాసురము ♦ ఖేందులుగా నవరోధనంబు భా
సిలె శరదిందుమండలరు ♦ చిప్రకరస్ఫుటపుష్కరాభమై,
తలఁగక భూపచంద్రుఁడును ♦ దారలయొద్దకు నేగి సమ్ముదా
కులహృదయంబునం బలికెఁ ♦ గోసలరాజతనూజతోఁ దమిన్. ౪౭౦

దశరథుఁడు తనభార్యలకుఁ బాయసముఁ బంచి యిచ్చుట

కం. దేవీ! పుత్త్రీయం బై, పావన మౌనమ్మృతతుల్య ♦ పాయస మిది సం
భావింపుము సుతవతి వై, శ్రీ విలసిల్లెద వటంచుఁ ♦ జెలఁగి సగర్తిన్. ౪౭౧

ఉ. అంబురుహాప్తవంశ్యుఁడు న ♦ యజ్ఞుఁడు కోసలరాజపుత్త్రి క
ర్ధంబు నొసంగెఁ బాయసముఁ ♦ దక్కినయర్ధమునన్ సుమిత్త్ర క
ర్ధంబు నొసంగెఁ, గైకకును ♦ దక్కినయర్ధమునన్ సగంబు, శే
షంబు సుమిత్త్ర కిచ్చెఁ బతి ♦ స్వాంతమునం దలపోసి వెండియున్.[1] ౪౭౨

కం. సుతసంప్రాప్తికి ధరణీ,పతి యీగతిఁ బాయసంబుఁ ♦ బంచి యొసఁగినన్
క్షితిధవుపత్నులు కడుస,మ్మతిఁ గొనిరి నితాంత హృష్ట ♦ మానస లగుచున్. ౪౭౩

ఉ. వారలు పాయసంబుఁ జెలు ♦ వంబుగ నాని వహించి రంత దు
ర్వారహుతాశనాంబురుహ ♦ బాంధవతుల్యరుచిప్రదీప్తముల్,
వారక దేవతానికర ♦ భావుకకారణముల్, సురాంగనా
వారకశృంఖలాహరణ ♦ పాటవగర్భము లైనగర్భముల్. ౪౭౪

ఉ. ఆలలనాశిరోమణుల ♦ నర్థిలిఁ గాంచి సరోరుహాప్తతే
జోలలితుండు శాత్త్రవని ♦ షూదనదక్షుఁడు దీర్ఘకాలవాం
ఛాలులితుండు నిస్తులిత ♦ సమ్మదసారవికస్వరాత్ముఁ డై
చాలఁగఁ బొల్చె సిద్ధసుర ♦ సంచయపూజితజిష్ణువైఖరిన్. ౪౭౫

బ్రహ్మ దేవతలను వానరుల సృజింప నియమించుట.

ఉ. అక్కడ నిర్జరాళి హవి ♦ రంశములం గొని యేగుచోటఁ బె
న్మక్కువ మీనిమిత్త మయి ♦ మాధవుఁ డుర్విఁ జనింప నెంచె, మీ
రుక్కునఁ గామరూపుల బ ♦ లోద్ధతులన్ నఖరాయుధోగ్రు లౌ
నెక్కటివీరులన్ హరికి ♦ నెంతయు బాసటగా సృజింపుఁడీ. ౪౭౬

ఉ. సూరులు నీతిమంతు లతి ♦ శూరులు వాయుసమాన వేగదు
ర్వారులు విష్ణుసన్నిభప ♦ రాక్రము లాజి నజయ్యు లిద్ధమా

[1] కౌసల్యకు సగము. మిగిలిన సగములో సగము ($\frac{1}{4}$) సుమిత్త్రకు. మిగిలినదానిలో సగము ($\frac{1}{8}$) కైకకు. సగము ($\frac{1}{8}$) సుమిత్త్రకు.

యారతు లస్త్రశస్త్రనిపు♦ణాత్ములు ధీరులు ఋక్షవానరా
కారులు దర్పసమానబల♦గర్వితచిత్తులు నైనవారలన్. ౪౭౭

ఉ. కిన్నరకాంతలందుఁ, గపి♦కింపురుషాంగనలందు, యక్షవి
ద్యున్నిభగాత్రలందు సుర♦యోషలయం, దహిఋక్షభామలం,
దెన్నికగన్నరామలయె♦యిం గపివర్యులు పుట్టఁ జేయఁడీ
క్రన్నన వారు దైత్యవిస♦రంబులఁ ద్రుంపఁగ నేర్తు రాజిలోన్. ౪౭౮

తే. ఇంతకును మున్న నా కావ♦లింత గలిగి, నంత జనియించె నొకజాంబ♦వంతుఁ డనఁగ
నంతకోపమవీరుఁ డ♦నంతయశుఁడు, వింత బలియుఁడు భల్లూక ♦ కాంతుఁ డగుచు.

చం. అనుచు వచించి ధాత చన ♦ నౌ నని యందఱు సిద్ధసాధ్యయ
క్షనగమునీశకింపురుష♦చారణకిన్నరఖేచరావళుల్
వనచరభల్లవీరులను ♦ వావిరిగా సృజియింపఁ, గోనలన్
వనములఁ బర్వతాగ్రముల ♦ వాఁకల వారు చరించి రుగ్రులై. ౪౮౦

## వానరోత్పత్తివివరణము.

సీ. హరిహయునకు వాలి ♦ హరికి సుగ్రీవుండు, గురుమతి తారుండు ♦ గురున కపుడు
వరవాహునకును ♦ వరగంధమాదనుం, డలవిశ్వకర్మకు ♦ నలుఁడు రోహి
తాశ్వునకును నీలుఁ ♦ డాశ్వినేయులకును, మైందద్వివిదులు న♦మందబలులు
నప్పతికి సుషేణుఁ ♦ డొప్పుగాఁ బర్జన్యు, నకు శరభుఁడు వాయు♦నకును నప్ర
ఆ. మేయబలుఁడు నైన♦ తేయజవుండు వ, జ్రాయితాంగుఁ డాంజ♦నేయుఁ డనఁగ
నరగ జనన మంది ♦ నెరసిరి దశకంఠ, కంఠదళనరతు ల♦కుంఠగతులు. ౪౮౧

తే. మేరుమందరతుల్యులు ♦ వీరవరులు, కామరూపులు ప్రబలవి♦క్రాంతిరతులు
దృఢశరీరులు గోపుచ్ఛ♦ఋక్షకాన, నొకనులు పుట్టి రిటు లసం♦ఖ్యాకు లగుచు.

కం. ఏ దేవత కేరూపము, యా దేవతరూప మూని ♦ యవనీస్థలిపైఁ
బ్రాదుర్భావము నొందిరి, యాదృఢసత్త్వములతో వ♦నౌకఃప్రవరుల్. ౪౮౩

సీ. ఋక్షీతతికిఁ గిన్న♦రీచయంబులకు గో, లాంగూలసతుల క♦భంగగతుల
దేవతాస్త్రీలకు ♦ దివ్యర్షితరుణుల, కహియోషలకుఁ దార్క్ష్య♦మహిళలకును
నప్సరఃకింపురు♦షాంగనలకు నాగ, సిద్ధకాంతలకుఁ బ్ర♦సిద్ధబలుల
విద్యాధరాబలా♦వితతికి మానిన, రారోహలకు యక్ష♦నారులకును
తే. సుతులఁగలిగింప నప్డు దే♦వతలు ధరణి, వారువారును శిలలును ♦ భూరుహములు
గోళ్లుఁ గోఱలు నాయుధ♦కోటులుగను, వివిధ శస్త్రాస్త్రవిదులయి ♦ వీఁక మీఱి.

ఉ. కొండలు పిండిగొట్టి, ద్రుమ♦కోటులఁ జెండఁగ నొక్కపెట్ట, మా
ర్తండుని మ్రింగఁ, బట్టుకొని ♦ తాలము దట్ట నభోవనుల్, సము

ద్దండత నద్రిఁగల్పఁ, బద♦తాడనమాత్రన యుర్విఁ గూల్పఁ, నౌ
చండపరాక్రముల్ బలిసి ♦ క్ష్మాతల మెల్లను నిండి రయ్యెడన్. ౪౮౫
కం. పట్టుదురు మేఘముల నేఁ, గొట్టుదు రటవీప్రమత్త♦కుంజరతతులన్
దట్టుదురు నేలఁ బడ దివి, ముట్టినవిహగముల శౌర్య♦మున నాకీశుల్. ౪౮౬
ఉత్సాహము. కామరూపధారులుం బ్ర♦కాశమాన తేజులున్
ధీమతుల్ ప్రధాయుతుల్ సు♦ధీరతావిరాజితుల్
భీమవేగభూరిశౌర్య♦విక్రమేడ్యయూధపుల్
భూమిశతసహస్రశతము ♦ పుట్టి క్రాలు చుండఁగన్. ౪౮౭
మత్తకోకిలము. అట్టిమర్కటయూథపాళుల♦యందు మిక్కిలిమేటులై
దిట్టలై రవిపుత్త్రుఁ డాదిగఁ ♦ దేజరిల్లిరి యూథనా
థేట్టు లీప్లవగేంద్రులున్ జని♦యింపఁ జేసిరి ధీరతా
పట్టభద్రుల శౌర్యరుద్రుల ♦ స్వామికార్యవినిద్రులన్. ౪౮౮
కం. కొందఱు ఋషవచ్ఛైలముఁ, గొందఱు నానావిధాద్రి♦కూటచయములున్
గొందఱు కాంతారంబులు, మందిరములుగా గ్రహించి ♦ మలయుచునుండన్.
ఉ. వానరకోటి నెల్లఁ బరి♦పాలన సేయుచు గోత్రపక్షభి
త్సూనుఁడు సార్వభౌముఁ డయి, ♦ సూర్యజుఁడున్ యువరాజుగా, హనూ
మానుఁడు నీలుఁడున్ నలుఁడు ♦ మంత్రులుగా, సమదారిభీకరుం
డైనుతిఁ గాంచెఁ; గీశులు స♦యంబునఁ గొల్చిరి వారి నన్యులన్. ౪౯౦
ఆ. వైనతేయబలులు ♦ ప్రధనవిశారదుల్, వివిధదేహచిహ్న♦వేషధరులు
వ్యాఘ్రసింహభుజగ♦భయదులై నిండిరి, గానలందు విరివి ♦ కోనలందు. ౪౯౧
మనోహారిణి. జలధరబృందా♦చలకూటనిభుల్, బలమదవంతుల్ ♦ ప్లవగప్రముఖుల్
వెలసిరి సీతా♦విభుసాహ్యముకై, బలకొని చతు♦స్స్వయదాకృతులన్.

## శ్రీకౌసల్యాదేవి గర్భము ధరించుట.

చం. క్రతుపరిపూర్తి దేవతలు ♦ గైకొని పోవ హవిష్యభాగముల్
క్షితిపతి దీక్ష వీడి పురిఁ ♦ జేరి ప్రియాస్తసతీసమేతుఁడై
హితతసమాగతాఖిలన♦రేశ్వరులం బరివారయుక్తులన్
వితతదుకూలహేమమణి♦బృందములం బరితుష్టచిత్తులన్. ౪౯౩
ఆ. చలుప మానినాథు♦సెల వంది వా రెల్ల, నేగ ఋశ్యశృంగ♦ఋషివరుండు
వీడుకోలుగాంచి ♦ విచ్చేసెఁ దనదార, మామఁ దోడుకొని స♦మంజసముగ. ౪౯౪
ఉ. అంతట నిట్లు వుచ్చి హృ♦దయంబున వేడ్క దొలంక నెన్నఁ డేఁ
గందునొ కన్నులారఁ గని♦గందుల నంచును వేచి లోన మి

న్నాందినకోరికఁ మదిని ♦ నువ్విళులూరుచు నుండె భూపసం
క్రందనుఁ; డంతఁ గోసలధ♦రాపతిపుత్రికి నంతకంతకున్. ౪౯౫

కం.*వటపత్రసన్నిభం బగు,కుటిలాలకయుదరసీమ ♦ గురు వయి యపుడుఁ
వటపత్రనిభమ యయ్యెను, వటపత్రశయానుఁ డుంట ♦ వారనిప్రీతిన్. ౪౯౬

ఆ. *పాలవెల్లిలోనఁ ♦ బండి లోకంబులఁ, బాలనంబుసేయు♦బాలకునకుఁ
బాలొసంగునట్టి♦భాగ్యమబ్బెనటంచు, నోలినుబ్బె సతిప♦యోధరములు. ౪౯౭

కం.*బంధం బెక్కడ నెఱుఁగని, బంధురగుణయశుఁడు బుధుల♦బాధల మాన్పఁ
సింధురగమనోదరని,ర్బంధంబున నుండె భక్త♦బాంధవుఁ డగుటన్. ౪౯౮

## ⟶ శ్రీభగవదవతారఘట్టము. ⟵

కం.క్రతువు పరిపూర్తి యగుడుఁ, బుతుషట్కం బరుగఁ బదియు♦రెండవనెలలో
క్షితిఁ జైత్రశుద్ధనవమి న,దితితారను రవియు నడిమి♦దివిని వెలుంగన్. ౪౯౯

కం.వరకర్కటలగ్నంబున, సురగురుఁ డుదయించుచుండ ♦ సోమునితోడఁ
దరణిముఖ గ్రహపంచక, మరుదుగ స్వోచ్చస్థలంబు ♦ లందు వెలుంగన్. ౫౦౦

కం.కౌసల్య జగత్పతి శ్రీ,వాసునియర్ధాంశమూర్తి ♦ వరశుభచిహ్నుఁ
భాసురరఘుకులవర్ధను, వాసిఁ గనెఁ సర్వలోక♦వందితు రామున్. ౫౦౧

ఆ. అమితతేజుఁ డైన♦యాపుత్రకునిచేతఁ, గోసలేంద్రతనయ ♦ కొమరు,మీఱె
నమరనాథుఁడైన♦యావజ్రపాణిచే, హవణు మీఱి వెలుఁగు♦నదితి వోలె. ౫౦౨

శా.సాక్షా ద్విష్ణువు నందు నాలుగవయం♦శం బూని కైకేయికిఁ
జక్షుఃప్రీతికరుండు సర్వగుణరా♦జన్మూర్తి జన్మించె స
త్యాక్షీణాతిబలాఢ్యుఁ డౌభరతుఁ, డౌ♦య్యం విష్ణునర్ధాంశు లై
దక్షుల్ వీరులు పుట్టి రిర్వురు సుమి♦త్రాదేవిగర్భంబునన్.[1] ౫౦౩

కం.తనయు లశేషవిశేషర,సనిలయు లయి లక్ష్మణుండు ♦ శత్రుఘ్నుఁడు నాఁ
దనరినవార లకల్మష,వినయమతుల్ సుగుణరతులు ♦ విదితాస్త్రతతుల్. ౫౦౪

తే. పుష్యమున మీనరాశిని ♦ బుట్టె సుప్ర,సన్నమతి భరతుండును; ♦ సార్పభమునఁ
గర్కటకమున మధ్యాహ్న♦కాలమందుఁ, బుట్టిరి సుమిత్రతనయులు♦పుణ్యనిధులు.

కం.కాంతిని బ్రోష్ఠపదోపము, లెంతయు ననురూపసుగుణ ♦ లీఢ్యులు ధరణీ
కాంతున కిటు వే ర్వే ఱ,త్యంతమహామహులు కలిగి ♦ రాత్మజు లంతన్. ౫౦౬

కం.పాడిరి గంధర్వులు తమి, నాడిరి యచ్చరలు మింట ♦ నమరు ల్గుము లై
కూడిరి పరమోత్సవమున, వీడిరి భయ మెదల విబుధ♦వీరుల్ నారుల్. ౫౦౭

కం.కురిసెను బూవులవానలు, మొరసెను సురదుందుభులును ♦ ముస్వర మగుచుఁ
బెరసెను బురి నుత్సవములు, నెరసెను సమ్మదము ధారి♦ణీజనమందున్. ౫౦౮

---

[1] సాక్షాద్విష్ణువు = రాముఁడు. రాముఁడు సగభాగము (½). భరతుఁడు పరక. లక్ష్మణుఁడు పాతిక. శత్రుఘ్నుండు పరక. చూ. పుట ౫౨.

ఉ. ఆపురమందు నయ్యెడ మ♦హామహ మద్భుతభంగిఁ బర్వఁ ద్రో
ద్రోవులు నయ్యెఁ బట్టనము♦త్రోవల నన్నిట రాచబాటలన్
భూపతిదత్తగోనిచయ♦భూరిధనగ్రహణేచ్ఛ విప్రు లు
ద్దీపితతేజు లెల్ల జగ♦తీతల మీానినయట్లు వచ్చుటన్. ౯౯

కం. నటనర్తకసంకుల మై, పటుగాయక గానవాద♦నందిరవప్ర
స్ఫుట మై హర్షోత్కటమై, పుటభేదన మమరె హృదయ♦పుట ముల్లసిలన్. ౧౦౦

తే. పదియురెండవదినమునఁ ♦ బార్థివుండు, పురుడు పాయంగఁ దనప్రియ♦పుత్రకులకు
నామకరణమహంబు నో♦నర్చెఁ బ్రేమ, నిర్భరానందమగ్నుఁ డై ♦ నివ్వటిలుచు.

తే. అనఘు జ్యేష్ఠునిరాముఁ డ♦టంచుఁ గైక, తనయుభరతుఁడనుచుసుమి♦త్రా సుతులకు
సరవి లక్ష్మణశత్రుఘ్న♦సంజ్ఞ లమరఁ, బేరు లిడియె వసిష్ఠుండు ♦ పెం పెటింగి.

కం. భూరమణుఁడు బ్రాహ్మణులకుఁ, బౌరులకు సమస్తజాన♦పదులకు నపు డ
వ్వారిగ భోజనమిడి మణి,వారంబుల నిచ్చె విప్ర♦వర్యుల కెల్లన్. ౧౦౩

శ్రీరాముని శైశవవర్ణనము.

కం. *కావు మనిగజము మొఱ లిడఁ, గావఁగ దక్షుండు దా నో♦కం డే జగతిం
గావుటఁ బరు విడు వేలుపు, ఠ్ఠావరనుతుఁ డగుచుఁ గావు♦కా వని యేడ్చెన్. ౧౦౪

ఉ. *లాలసమానసంబులఁ గ♦లావతులున్ రమణీయడోలికా
పాలుల నుంచి యాజినర♦పాలకుమారులఁ, గంకణధ్వనుల్
దాలము గాఁగ, రాగములు ♦ తానము దప్పక పంచమధ్వనిన్
లాలి యటంచుఁ బాడిరి వి♦లాసవికాసవిభాసమాన లై. ౧౦౫

ఉ. *నాయన నిద్రపోర, రఘు♦నందన నిద్దుర పోర, యేలరా
పాయనియాటలం దవిలి ♦ బంగరుకొండ మొగుడ్పు వత్తులన్?
మాయురె యిట్టు లైనను శ్రి♦మం బగురా, యని యెన్నఁ డేఁ గనుల్
మూాయనియాదిదేవుఁ గని ♦ ముద్దులు జోలలు పాడి రయ్యెడన్. ౧౦౬

కం. *జలములు దానము గాఁగను, గలకాలము వెలయువేల్పు ♦ కంజాతాక్షుల్
జలముల బోర్కాడింపఁగ, వెలఁదులఁ గనుచుండు ముగ్ధ♦విధమున నగుచున్.

తే. *జలములం గొని తనపాణి♦జలజమునను, రక్షఁ ద్రిప్పును శ్రీరామ ♦ రక్ష యనుచు
రామునకును ద్రిలోకాభి♦రామునకును, శ్రీమతీమణి కౌసల్య ♦ ప్రేమమునను.

కం. *చెడుగులు దమప్రాణములం, బిడికిట నీరీతిఁ బట్టి ♦ మిడికెద రనఁగాఁ
బిడికిలి విడువక యుండెం, బుడుతఁడు గొన్నాళ్లు జనని♦మోహము దీర్పన్. ౧౦౯

ఆ. *చూడ వచ్చినట్టి♦చేడియల్ రాముని, బొత్తిచేలములను ♦ హత్తియెత్తి,
బొమ్ము లంట నొత్తి ♦ యెమ్మెగా నవ్వించి, తల్లిచేతి కిత్తు ♦ రుల్ల మలర. ౧౧౦

కం. *ఆటలకై జగములజేం, జాటం బిడుకొనెడి వేల్పు ♦ జలజాతుల కే
ర్పాటుగ నాటలఁ బాటలఁ, బాటవమును జూపె శత్రు♦పాటనపరుఁడై. ॥ ౨౧

శా. *దాయల్ దానును గూడి యాడునెడలన్ ♦ దన్ డాసి కౌసల్య యెం
తో యాసక్తిని రార దస్సితివిరా ♦ యో రామచంద్రా యటం
చీయోజం దనుఁ బిల్వఁ జన్గుమనఁగా ♦ నే తెంచి తాఁ ద్రావ కే
"ఊ"యన్నా యని వ్రేలఁ జూపు సనుజున్ ♦ హా యెట్టిసౌభ్రాత్రమో! ॥ ౨౨

కం. *తనయుయ్యెలప్రక్కన లక్ష్మణునుయ్యెల లేకయున్నఁ ♦ గనుమూయం డే
మిని నుల్లాసముఁ గానఁడు, జననీస్తన్యంబుఁ గ్రోలఁ ♦ జనఁ డేమైనన్. ॥ ౨౩

తే. *పాలు విడువని యాలేఁత♦ప్రాయమంద, ప్రతిదినమునొక్కపరిన్యైన♦రాఘవుండు
సవతితల్లులయింట్లకుఁ ♦ జనక విడునఁ, డెత్తికొని పోవ సైఁగల ♦ నెలమిఁ జేయు.

ఉ. *కమ్మనినైల మంటి, యొస♦కమ్మున గంధజలంబు వోసి, ధూ
పమ్మున నార్చి, వెంట్రుకలఁ, ♦ బల్చనగా జడ యల్లి, తల్లి పౌ
న్నొమ్ములు పెట్టి మోమునను ♦ జుక్కయుఁ, గన్నులఁ గాటుకుంచి మో
దమ్మున ముద్దు వెట్టి పిన♦నమ్ములతోడుతఁ బంపు నాడఁగన్. ॥ ౨౪

మ. *ఘలుఘల్లంచును మ్రోయ గజ్జియలు బం♦గారందియల్, లీల ను
య్యాల లూఁగన్ పిపులోరపం దురుమణీ♦హారావళుల్, కుండలం
బులు ధాళధ్ధళ లాడఁ, గంకణరవం♦బుల్ మీఱఁగా, గంతులన్
జెలఁగ న్నవ్వుచు నాడఁ బోవు దినముల్ ♦ శ్రీరామభద్రుం డోగిన్. ॥ ౨౫

రాజకుమారగుణవర్ణనము.

కం. ఈలీల రాచకొమరులు, వాలాయము గారవమున ♦ సర్ధిల్లుచు వి
ద్యాలంపటులై నేర్చిరి, యోలిన్ సకలంబు మేలి♦యొజ్జలతోడన్. ॥ ౨౬

కం. వారలలో జనకునకున్, శ్రీరాముఁడు ధ్వజనుకీతిఁ ♦ బ్రియుఁడయ్యెఁ గడున్
ధారణి భూతావళులకు, సారససంభవుఁడువోలె ♦ జనవినుతుండై. ॥ ౨౭

ఉ. అందఱు సర్వవేదవిదు ♦ లందఱు శూరకులాగ్రగణ్యు, ల
య్యందఱు లోకభద్రరతు, ♦ లందఱు జ్ఞానయుతుల్, దయాళు రా
యందఱు, సత్త్వసత్త్వగుణు ♦ లందఱు, సాధుమణుల్, మహాత్ము ల
య్యందఱు సుందరుల్, విబుధు ♦ లందఱు సర్వకళాప్రవీణతన్. ॥ ౨౮

ఉ. రాముఁడు, శీలసంపదభి♦రాముఁడు, బాహుపరాక్రమక్రమో
ద్దాముఁడు, నిర్వికల్పగుణ♦ధాముఁడు, భూజనతాపహృత్సుధా
ధాముఁడు, సాధుచిహ్నసుమ♦దాముఁడు, భాసిలె నీలనీరద
శ్యాముఁడు వారిలోనఁ దను♦చారిమ ధిక్కృతకామధాముఁడై. ॥ ౩౦

ఉ. ఏనుఁగుమీఁద నెక్కి, హయ♦పృష్ఠమునందు, రథోపరిస్థితిన్,
బూనిక నిల్చి, కేల విలు ♦ పూని, కృపాణముఁ దాల్చి, శస్త్ర మే
దైన ధరించి, సంగరము♦నందుఁ జరింప హరింప శత్రులన్
మానధనుండు నేర్చె; నన♦మానసపర్యలఁ దేల్చెఁ దండ్రినిన్. ౫౩౧
ఉ. చిన్నతనాననుండియును ♦ జ్యేష్ఠుఁడు శ్రేష్ఠుఁడు లోకరాముఁ డా
నన్నకు, లక్ష్మివర్ధనుఁ డ♦నంతముఁ గూరుచు స్నేహభక్తిసం
పన్నుఁడు లక్ష్మణుండు వెలి♦ప్రాణము స్వీకము నాశరీరమున్
కన్నను మిన్నయున్, సకల♦కార్యహితాచరణుం డజస్రమున్. ౫౩౨
కం. జనయిత్రియె మృష్టాన్నముఁ, గొనివచ్చి యదెంత వేఁడు♦కొన ముట్టండున్
గనుమూయఁడు పురుషోత్తముఁ, డనుఁగుం దమ్ముండు లక్ష్మణాఖ్యుఁడు లేమిన్. ౫౩౩
ఉ. రాముఁ డుదారవిక్రముఁ డ♦రణ్యముకై మృగయావినోదకే
లీమతి నశ్వ మెక్కి చన ♦ లీలమెయిం జను నీడవోలె ను
ద్దామజవాన లక్ష్మణుఁడు ♦ దారుణచాపశరాసిపాణి యై,
యేమఱ కెప్పుడుం దిరుగు ♦ నెంతయు భక్తినప్రపూర్ణుఁ డై. ౫౩౪
తే. భరతునకునట్లె లక్ష్మణా♦వరజుఁ డెపుడుఁ, బ్రాణములకంటెఁ బ్రియుఁడయి ♦ రాణఁదనరె
భరతునందును లక్ష్మణా♦వరజుఁ డెపుడుఁ, దరము లే నట్టిప్రేముడిఁ ♦ దాల్చియుండె.
కం. భ్రాతలఁ బరిచితనృపహిత, నీతుల హితకాలసముప♦నీతుల నగుణా
పేతుల సమస్తవిద్యో, పేతుల శ్రీయుతులఁ గీర్తి♦విదితుల సుతులన్. ౫౩౬
కం. శూరుల నిజతేజోజిత, సూరుల శాస్త్రాదికళల ♦ సూరుల మారా
కారులఁ బితృశుశ్రూషో, దారులఁ గని వారిఁ గలిత♦దారులఁ జేయన్. ౫౩౭
కం. గురులన్ సమస్తబాంధవ, వరులన్ హితపరుల మంత్రి♦వరులం గని భూ
వరుఁ డాలోచన దెల్పెఁడు, ధరణిం గల రెచట నెచటఁ ♦ దగురాకన్నెల్. ౫౩౮

## ⟻ విశ్వామిత్రుఁడు దశరథునిఁ జూడ వచ్చుట. ⟼

కం. అని యోజించుచు నుండఁగ, వినుతమహాతేజుఁ డైన♦విశ్వామిత్రుం
డును నృపదర్శనకాంక్షం, జనుదెంచి వచించె ద్వార♦సంరక్షకుతోన్. ౫౩౯
ఉ. చెప్పెరఁ బోయి మీపతికిఁ ♦ జెప్పుము వచ్చినవాఁడు గాధిజుం
డిచ్చటి కంచు, నన్న విని ♦ హెచ్చినభీతిని వార లెల్లరున్
గ్రచ్చుఱఁ బర్వువాఱి, క్షితి♦కాంతుగృహంబు ససంభ్రమంబుగాఁ
జొచ్చి, మునీంద్రురాక యజ♦సూనునకున్ వడి విన్నవించినన్. ౫౪౦
కం. ఆపలుకులు విని దశరథ, భూపతి సంహృష్టచిత్త♦మున సపురోధుం
డై పరమేష్ఠి నెదుర్కొను, నాపవిధరుమాడ్కి డాయ ♦ నరిగి వ్రతీంద్రున్. ౫౪౧

మ. పరితుష్టాత్మునిఁ జేసి యర్ఘ్య మిడి సం♦భావించి యత్యంత మా
దర మొప్పార భజించి మోడ్చి నిజహ♦స్తద్వంద్వము న్నిల్వ భూ
వరుసర్ఘ్యంబు గ్రహించి మౌని కుశల♦ప్రశ్నంబు గావించె నో
ధరణీశోత్తమ! నీకు సేమమ కదా ♦ దారాత్మజశ్రేణితోన్. ౫౪౨

మ. ధరణీశా! పురమందు నెల్లరకు మో♦దం బౌనె? కోశంబులున్
బరిపూర్తి న్విలసిల్లు నే? జనపదా♦వాసుల్ సుఖం బుందురే?
వరమిత్రావళికిన్ శుభం బె? యతిథి♦వ్రాతంబుఁ బూజింతు వే?
జరగుంగా సురమానుషార్చనలు? శి♦క్షాయుక్తు లే శాత్రవుల్? ౫౪౩

కం. అని ప్రశ్నించినపదపడి, యనఘాత్ము వసిష్ఠు ఋషుల ♦ సరయుఁగఁ జేరం
జని కుశలం బడుగఁగ నా,మునులు పరస్పరము కుశల♦మును భాషింపన్. ౫౪౪

కం. అంద ఱమందానందపుఁ,గందళములు దీఁగపాఱ ♦ క్ష్మావిభునిసభా
మందిరముఁ జొచ్చి యాసన,బృందంబుల నుండ మునికిఁ♦బృథ్వీశుఁ డనెన్. ౫౪౫

దశరథుఁడు విశ్వామిత్రుని రాకకుఁ గారణ మడుగుట.

చం. తనయవిహీనుఁ డాత్మసమ♦దారలయందుఁ దనూజుఁ గంటఁ, బో
యిననిధు లబ్బుటన్, బహుళ♦వృష్టుల నిర్జలసీమలన్,సుధా
శనమున, నిర్భరాభ్యుదయ♦సంగతి, నెట్టిప్రమోద మబ్బు నో
మునివర! యట్టినిండుముద♦ముం గనితిన్ భవదాగమంబునన్.। ౫౪౬

ఉ. నన్నుఁ గృతార్థుఁ జేయుతమి ♦ నాకడ కిట్టులు వచ్చు టయ్యెఁ గా
సన్నుతశీల! నాయెడఁ బ్ర♦సన్నుఁడ వై యెఱిఁగించి తేని ప్రే
మోన్నతి నీదుకామితము ♦ నొప్పగ నే సమకూర్తు నెద్ది యేన్
మన్ననఁ జేసి తెల్పు బతి♦మాలెద వ్రాలెద నీపదద్వయిన్. ౫౪౭

కం. మహిఁ దొలుత రాజఋషి వై, మహితాత్ముఁడ వైతి నిస్స♦మానగురుతపో
మహిమను బ్రహ్మర్షివి మఱి, బహుధాపూజ్యుఁడవు నీవు♦పరమమునీంద్రా. ౫౪౮

ఉ. నీవు మహాత్మ నాకడకు ♦ నేఁ డిటు వచ్చుటఁ జేసి జన్మ మే
పావన మయ్యె, నా బ్రదుకు ♦ పండెను నిప్పు డె సార్థకంబు నై,
కేవలపూనిమాత్రుఁడ నె ♦ కీర్తితశీల! మహానుభావ! నా
దైవముకీతి వచ్చితి వు♦దారమహాభ్యుదయంబు నా కగున్. ౫౪౯

ఉ. పాత్రుఁడ నీవు నాయసమ♦భాగ్యముసం జనుదెంచితయ్య వై
ధాత్రిసమాన! పావనము ♦ తద్దయు నద్భుత మయ్యె రాక, సు
క్షేత్రనివాసభాగ్య మిటు ♦ చేకుఱెఁ ద్వద్ఘనదర్శనంబునన్,
పాత్రుఁడ నేని మీవయకుఁ ♦ బల్కఁగదే భవదీప్సితార్థమున్. ౫౫౦

ఉ. చేయునొ చేయఁడో యితఁడు ♦ చెప్పుదునా వలదా యటంచు గా
ధేయ! విచారముల్ విడుము ♦ దేవుఁడ వీ విల నాదుపాలికిన్,
జేయుదు నెద్ది యేనియు న♦శేషవిశేషశుభంబుఁ గూర్ప న
త్యాయతరక్తి వచ్చితివి ♦ ధర్మ మనుత్తమభంగి వర్ధిలెన్. ౫౫౧

విశ్వామిత్రుఁడు దశరథునకుఁ దనరాకకుఁ గారణముఁ జెప్పుట

చం. అనిన వికాసభాసురము♦ఖాంబుజుఁ డై గడు రొప్ప మౌని యో
జనవర! రాఘవాన్వయము ♦ శస్తము గాదె జగంబులందుఁ దా
నొనరు బుతోక్తికిన్ వితర♦ణోన్నతికిన్; భవదీయపూర్వులన్
విను మఱపించినాఁడవు ప♦విత్రచరిత్ర దయాసమృద్ధిమై. ౫౫౨

కం. కులము పవిత్రన్వయ మఁట, కులగురుఁడు వసిష్ఠుఁ డంట ♦ గుణము లమేయం
బులు నఁట తదుచితభంగిని, బలికితి విది నీకు నుచిత♦పద్ధతి గాదే. ౫౫౩

ఉ. వేఁడిన నిత్తు నంటి పృథి♦వీవరచంద్రమ! యెద్ది యేనియున్,
వేఁడెద నామనోగతము ♦ వేగమ దానిని సంఘటించి యే
నాఁడును బొంకఁ డంచును ఘ♦నప్రథఁ గాంచుము లోకపాళులం,
బోఁడిమి నాచరిత్రమును ♦ బొల్పుగఁ దెల్పెద విన్ము సమ్మతిన్. ౫౫౪

ఉ. తీరుప జన్న మొం డిపుడు ♦ దీక్షనహించితి, సంతరాయముల్
గూరుప రాక్షసద్వయము♦నూల్కొని యుండెడుఁ దేఁడ! వార లె
వ్వార లనన్ సుబాహుఁడును ♦ వానికి నన్నయుఁ గామరూపులున్
శూరులు నస్త్రసంతులు న♦కుంఠబలుల్ గృతహస్తు లిర్వురున్. ౫౫౫

కం. నెత్తురుఁ బ్రేవులు నెఱచియు, మొత్తంబులుగాఁగఁ గురిసి ♦ మొగి వేదిపయిన్
మొత్తి సదస్యుల మునులన్, మిత్తిని గూర్చెదరు మేము ♦ మిడుకుచు నుండన్. ౫౫౬

కం. ఆయసురులు విఘ్నం బటు, చేయఁగ నుత్సాహ మెడలి ♦ చేష్టడి గాసిన్
నాయాశ్రమదేశంబును, బాయుచు నినుఁ గనఁగ నిట్లు ♦ వచ్చినవాఁడన్. ౫౫౭

కం. పాపాత్ముల దైత్యులపస, శాపంబున మాపి యమున♦సదనంబునకున్
వే పుచ్చ వారి నాకుం, గోపింపఁగరాదు దీక్షఁ ♦ గొనునసమయమునన్. ౫౫౮

విశ్వామిత్రుఁడు శ్రీరామునిఁ దనతోడఁ బంపుమని దశరథు నడుగుట.

తే. ముంగురులు వ్రేలుముద్దు నె♦మ్మొగమువానిఁ, గమ్రతర మైనపిల్లకూఁ♦కటులవాని
రాము బలధాము నీదుగా♦రామునుతుని, సత్యవిక్రము నీఁగ దే♦ఖ్యాతతేంద్ర ౫౫౯

శా. నాచే రక్షితుఁ డై భవత్సుతుఁడు వి♦న్నాణంబు మైఁ ద్రుంచు మా
రీచాద్యాశరకోటి దివ్యనిజని♦ర్నిద్రప్రతాపోన్నతిన్

నీచుల్ వారలు వారి రాముఁ డొకఁడే ♦ నేర్చుఁగా వధింపంగ, నా
లోచింపం బని లేదు రక్షకును జా♦లుం బంపుమా రామునిన్. ౫౬౦

కం.నా కీకార్యము సేయ న,నేకశుభంబులును గూర్తు ♦ నీసుతునకు న
స్తోకయశోభాసురుఁ డై, లోకంబుల నెగడు మనుజ♦లోకాధ్యక్షా. ౫౬౧

కం.బలగర్వితు లయ్యును బా,పులు గావునఁ గాలపాశ♦ములకు నవశు లై
కలన మని రాము నెదుటన్, నిలువంగా లేరు నిజము ♦ నిజము నృపాలా. ౫౬౨

కం.చాలం డని కలనికిఁ, బసిబాలుం డని, విడువు పుత్రు♦పై మోహంబున్
జాలరు బ్రతుకఁగ నీసుతు, వ్రాల సురాహితులు శపథ♦ము సేచియింతున్. ౫౬౩

తే. ఏ నెఱుంగుదు రాజేంద్ర ♦ యీమహాత్ము, రాము సత్యపరాక్రమో♦ద్దాముమఱి ప్ర
సిద్ధ తేజోధికుండు వ♦సిష్ఠమునియు, నీతపస్వినుతు లెల్లరు ♦ నెఱుఁగువార. ౫౬౪

తే. వసుధ స్థిరముగ ధర్మలా♦భంబు మఱియు, లలితకీర్తియు నొందఁగ ♦ నలతు వేని
రాముఁ బంపుము నాతోడ ♦ రాజచంద్ర, లేనిపోనికుశంకలు ♦ మానవయ్య ౫౬౫

తే. నిను వసిష్ఠుఁడు మొద లైన♦నీదుమంత్రి,వరులు సమ్మతి నీసుతుఁ ♦ బంపు మనిర
యేని పంపుము నాతోడ ♦ నిష్టముగను, రమ్యగుణభద్రు వేగమ ♦ రామభద్రు.

కం.దశరాత్రంబగు యజ్ఞము, దశరథ! రక్షింపవలయు ♦ దైత్యావళికిన్
వశపడ కుండఁగ దీక్షా,దశ నతికాలంబుగాక ♦ తనయుని నిమ్మా. ౫౬౭

కం.శామిత్రావనమిష వి,శ్వామిత్రుల దైత్యపతుల ♦ హరియింపఁగ వి
శ్వామిత్రుఁడు మిత్రాన్వయు, రాముని నిటు పంప వేఁడి ♦ రాజితఫణితిన్. ౫౬౮

ఉ. ఊరక కూరుచుండిన నృ♦పోత్తముఁ డామునినర్యుఁ డన్న వా
హారము లాలకించి హృద♦యప్రవిదారణదక్షదుర్వ్యథా
పారమహాంబుధి న్మునిఁగి ♦ వారనిశోకమునం దపించుచున్
ధారణి వ్రాలె శస్త్రనిహా♦తం బయికూలు ద్రుమంబుచాడ్పునన్. ౫౬౯

⟶ శ్రీరామునిఁ బంపఁజాలక దశరథుఁడు పరితపించుట. ⟵

కం.ఒక్కముహూర్తం బీగతిఁ, దెక్కొనుమూర్ఛకును జిక్కి ♦ ధృతిగొని సుతుపై
మక్కువచే నివ్విధమున, నక్కౌశికతనూజుతోడ ♦ నవనిపుఁ డనియెన్. ౫౭౦

కం.మారాముఁడు బాలకుఁ,డారాముం డూనషోడ♦శాబ్దుం[1] డీయం
భోరుహనేత్రుఁడు నిశిసం,చారులతో రణము సేయ ♦ శక్తుం డగునే. ౫౭౧

సీ. కలదు నా కొక్కయ♦క్షౌహిణీసేన పూ,ర్ణంబుగ దానిఁ దూ♦ర్ణంబ తోడు
కొనుచు నే వచ్చెదఁ ♦ గ్రూరశస్త్రాస్త్రకో,విదులు నాభృత్యులు ♦ వీరవరులు

[1] ఊనషోడశాబ్దుఁడు = పదునాఱు సంవత్సరములకు లోపడినవాఁడు. ౧౬ ఏండ్లకుగాని బాల్యము పోదు. యుద్ధయోగ్యదశ రాదు. ఇప్పటి రాముని వయస్సు ౧౨ ఏండ్లు.

దైత్యులతోడ యుద్ధం బొనరింపఁగ, శక్తిమంతులు నతి♦సాహసికులు
నే ధనుష్పాణి నై ♦ నిఖిలయోధులతోడఁ, గాచెద యజ్ఞంబుఁ ♦ గడిమి మెఱసి
తే. ప్రాణములు మేనిఁ బాయని♦యంతదనుక, రాక్షసులతోడఁ బోరుచుఁ♦ద్రాసమేది
సవనరక్షణమును నేను ♦ జలుపువాఁడ, నమ్ము నామాట యోముని♦నాథచంద్ర.
కం. బాలుని నవిదితవరశర, జాలు బలాబలవిమూఢు ♦ సమరము నేర్పల్
చాలని యక్షీరకపోలు న్, శీలునిఁ గొనిపోవ నీకుఁ ♦ జెల్లు నె చెపుమా. ౫౭౩
కం. క్రించులనుఁ దృఢపరిచిత, వంచనులఁ రాక్షసులను ♦ వధియింపఁగ లేఁ
జుంచుం గలబాలుఁడు వాఁ, డంచితగతి నెట్లు శక్తుఁ ♦ డగును మహాత్మా. ౫౭౪
తే. *పండుకొనలేఁడుతోడు నొ♦క్కండు లేక, చీఁకటినినొంటిననుమన్నఁ♦జికిలుఁజికిలు
నట్టినాపట్టి యడవుల ♦ గుట్టలందు, నెట్టులు చరించునాకడు ♦ పెట్టులోర్చు. ౫౭౫
తే. *పండుకొనఁ దల్లి కేలిడి ♦ దిండుగాఁగ, మీఁద నొండొక చెయివైచి ♦ మేలికతలు
చెప్పనూఁకొట్టుచును గను♦ఱెప్పమూయు, కూనముండ్లనుఱాలను♦గూర్కునెట్లు.
తే. *గిల్లినను బాలు బుగ్గలఁ ♦ జిల్లు మనును, దీర నుచ్చియు నాఱని♦లేఁగచాటు
పిందె యతఁ డేఁడ నడవులఁ ♦ గందమూల, ములను దినివారితోఁబోరు♦నలుపు సేఁడ.
కం. రాముని నెడఁబాసియు నే, నీమహి జీవింపఁగలనె ♦ తృటియొకఁ డైనన్
రామునిఁగొనిపోవకుమీ, యోమునివర! నీదుచరణ♦యుగము భజింతున్. ౫౭౭
కం. రామునిఁ దప్పక తోడ్కొని, పో మదిలోఁ దలఁతు వేని ♦ పురుతరసేనా
స్తోమముతో నాతనిబడి, నోమునివర నేను వత్తు ♦ నొసఁగుమ యాజ్ఞన్. ౫౭౮
కం. పొడమిన దాదిగ నేఁడులు, నడచెను నార్వదులవేలు ♦ నా, కతిదుఃఖం
పడి కొడుకును శ్రీరామునిఁ, బడసితి మ మ్మెడలఁబాపఁ ♦ బాడియె నీకున్. ౫౮౦
కం. నలువురు పుత్త్రులు నాకుం, గల రైనం బెద్దవాఁడు ♦ కడుధర్మపరుం
డలరామచంద్రుమీఁదనె, నిలుపుదుఁ బ్రాణంబుఁ బంప ♦ నేర్తు నె వానిన్.

{ దశరథుఁడు విశ్వామిత్త్రుని యజ్ఞవిఘ్నకరు లగు రాక్షసులవృత్తాంత మడుగుట. }

ఉ. ఎవ్వనిపుత్త్రు లాయసురు? లెవ్వనిపంపున వచ్చువారు? వా
రెవ్విధిఁ బోరువారు? బల ♦ మెంత? ప్రమాణము లెంత? వారిపే
ళ్లెవ్వియొ? నాయకుం డెవఁడొ? యేగతి మా ఱొనరింపఁగాఁ దగుఁ
జివ్వను రాముఁ డైన మఱి ♦ సేనలతోడుత నేన యేనియున్? ౫౮౨
కం. అన విని దశరథుఁ గనుఁగొని, మునివరుఁ డి ట్లనియె రాజ♦ముఖ్యా వినవే
ధనదునితమ్ముఁ బులస్త్యుని, మనుమని విశ్రవసుసుతుని ♦ మహి రావణునిన్. ౫౮౩
కం. లోకేశదత్తవరుఁ డ, స్తోకబలపరాక్రముండు ♦ దోషాచరసే
నాకాండపరివృతుం డై, లోకంబుల నెల్ల నతఁడు ♦ లొగ్గడి పెట్టున్. ౫౮౪

ఉ. ఆతఁడు దానుగా నరిగి ♦ యజ్ఞవిఘాతము సేయఁ డైన దు
ర్నీతిపరుండు గానఁ దన ♦ నెయ్యుర భృత్యులఁ బంపు దానికై
యాతనియాజ్ఞ మేరగ మ ♦ హాబలు లిద్దఱు తాటకాత్మసం
జాతులు వచ్చి యధ్వరము ♦ సాగఁగ నీ రొకయింత యేనియున్. ౫౮౫

దశరథుఁడు శ్రీరాములను బంప నిరాకరించుట.

చం. అని వచియింపఁగా విని ధ ♦ రాధిపుఁ డెంతయు భీతచిత్తుఁ డై
యనఘ! వశంబె నా కయిన ♦ నాదురితాత్ముని మ్రోల సంగరా
వని నిలువంగ, నాపయిఁ గృ ♦ పాగరిమంబును జూపవయ్య, నా
తనయుని మన్పవయ్య, మఱి ♦ దైవము నీవ కదయ్య నా కిటన్. ౫౮౬

కం. నాపాలిగురువ వంచును, నీపాలం బడినవాఁడ ♦ నిర్భాగ్యుఁడ నా
కీపుత్రభిక్ష నిమ్మా, యాపాపనిఁ బంపఁ జాల ♦ నయ్య మునీంద్రా. ౫౮౭

కం. సురకిన్నర యక్షులు కిం,పురుషులు గంధర్వులైనఁ ♦ బోరఁగ లే రే
దురమున రావణుతోడను, దర మే మనుజులకు వాని ♦ ధాటి సహింపన్. ౫౮౮

సీ. ఆతండు వీరద ♦ ర్పాపహుం డౌటను, నబలుండ సబలుండ ♦ నయ్యుఁ గాని
కొమరులతోడుతఁ ♦ గూడి యైనను గాని, యెదిరింపఁ జాల నా ♦ యింద్రవైరి
సుందోపసుందుల ♦ సుతులు సామాన్యులే, యంతకప్రతిము ల ♦ త్యంతబలులు
కలనిలో వారు ము ♦ క్కాఁకలఁ దీరిన, వారు నాకొమరుండు ♦ బాలుఁ డౌట
తే. నకృతహస్తుండు నౌట నే ♦ నంపఁ జాల, వారిలో నొక్కరునితోడఁ ♦ బౌరుషమున
సఖులతోఁ గూడి సమరంబు ♦ సలుపువాఁడఁ, గాకయనుచును స్నేహప ♦ ర్యాకులోక్తి.

విశ్వామిత్రుఁడు దశరథుపైఁ గోపించుట.

కం. జనపతి యిటు వదరిన నా, మునిపతి యాహుతుల యజ్ఞ ♦ మున వహ్ని యనన్
గనుఁగవ నిప్పుక లురలఁగ, మనమున రోషంబు గదుర ♦ మటమటలాడెన్. ౫౯౦

మ. *వికటభ్రూకుటిదుర్నిరీక్షుఁ డయి పృ ♦ థ్వీమండలం బెల్ల నే
చి కటాక్షోగ్రహుతాశనార్చులను భ ♦ స్మీభూతముం జేయుపో
లిక దీపింప యుగాంతరుష్టతర కా ♦ లీనాథుభంగిన్ సభన్
బ్రకటాటోపతఁ బూని మానివిభుఁ డు ♦ గ్రక్రోధ సంరంభియై. ౫౯౧

ఉ. *ఎండినకాష్ఠదండముల ♦ నేర్చి మహోగ్రత మండుమంటలో
దండిగ నేయి పోసినను ♦ ధగ్గని రేఁగు హుతాశునట్లు దా
మండి ప్రచండకోపమున ♦ మానవనాథునిఁ జూచి దేవతా
మండలిగుండె ఝల్లన ♦ మాతల మెల్ల వడంక నిట్లనున్. ౫౯౨

శా. *ఓరీ రాఘవసత్కులాపశద! లే♦రో పుత్రు లెవ్వారికిన్ ?
గారామారఁగ నీ వొకండవె ధరం♦ గన్గొంటివే నేఁటి? కీ
వారిం గూర్చెద నాదుకోర్కి యని ము♦న్న ట్లాడి యిష్టిట్లహం
కారం బొత్తఁగ నీను బొమ్మనెద వా♦ కానీ క్రియల్ నిల్పునే. ౫౯౩
కం. *నిను మూర్ఖు విషయలోలుని, ననృతపరున్ శపుని మూఢు♦ నవనీపతిగాఁ
గను రాముజనకుఁ జేసిన, వనజాసను వలయుఁ బట్టి♦పాలార్పంగన్. ౫౯౪
కం. *చంద్రమతీశ్వరు ఘనని, స్తంద్రఋతత్వ మ్మెఱింగి♦ తద్వంశ్యుఁడ వన్
సాంద్రాభిలాష భూవర,చంద్రా! నిను వేఁడినాఁడ ♦ క్షమియింపఁ దగున్. ౫౯౫
ఆ. పలికి బొంక నీకుఁ♦ బాడియ యగు నేని, వచ్చినట్ల పోవు♦వాఁడ రాజ!
సౌఖ్యపడఁగదయ్య♦ సకలబాంధవులతో, ననృతవాది వగుచు♦ ననుచుఁ గినుక.
తే. కటము లదరఁగఁ జూపఱు♦కంప మందఁ,గన్నుఁగవ నిప్పుకలు రాలఁ♦ గ్రాలుగాధి
సంభవునిఁ జూచి దేవతల్♦ సంభ్రమింపఁ, దత్తఱించెడిధారిణీ♦ధవునిఁ గాంచి ౫౯౬

## వసిష్ఠుఁడు దశరథునకు శ్రీరామునిఁ బంప బోధించుట.

చం. పలికె వసిష్ఠుఁ డి ట్లనుచుఁ♦ బార్థివసత్తమ! యేది కోరినన్
జలిపెద నంచుఁ బల్కితివి♦ న్యాయ్యమె యాడినమాటఁ దప్పఁగా,
నలఘుకకుత్స్థనన్వయము♦నందు జనించి వహించి సువ్రతా
కలనము ధర్మమూర్తి వనఁ♦ గ్రాలిననీవును బొంకఁ జెల్లునే. ౫౯౭
కం. మతియుతుఁడవు ధృతిరతుఁడవు, వ్రతహితుఁడవు విమలకీర్తి♦పరుఁడవు త్రిజగ
న్నుతధర్మిష్ఠుఁడ వయి యీ,గతిధర్మము దప్ప నాడఁ♦ గార్యం బగు నే. ౫౯౮
కం. జగముల నన్నిట దశరథ,జగతీపతి పరమధర్మ♦చరితుం డనుచున్
బొగడితఁ గనియు స్వధర్మముఁ, దగునే విడునంగ నీకు♦ ధర్మైకరతా. ౬౦౦
సీ. చెప్పు మెయ్యది యైనఁ♦ జేసెద నంటివి, చేయ కుండఁగ నిప్డు♦ చెల్లునయ్య?
చేసెద నని మున్ను♦ చెప్పి చేయకయున్న, వచ్చు నిష్టాపూర్త♦వధఫలంబు
గావున శ్రీరాముఁ♦ గౌశికు వెంబడిఁ, బంపుటయే నీకుఁ♦ బరమశుభము
కలితాస్త్రుఁ డైన న♦కలితాస్త్రుఁ డైనను, నగ్నిరక్షించు ది♦వ్యామృతంబు
తే. నట్లు గాధిజరక్షితుం♦ డైనరామ,భద్రుఁ జెనకంగ లే రెట్టి♦ప్రబలదైత్య
వీరు లైనను వెఱవకు♦ వేగపంపు, మౌనిమాత్రుండె కౌశిక♦మౌనివరుఁడు. ౬౦౧
ఉ. ఆకృతి గొన్నధర్మము, ప♦రాక్రమవంతులలోన మేటి, మే
ధాకలితుండు, సువ్రతని♦ధానము, లోకమునం జరాచరా
నీక మెఱుంగఁజాలని య♦నేకమహాస్త్రము లీతపస్వికిం
బ్రాకటలీల పశ్య మయి♦ రాజలు చుండు, సతుల్యుఁ డన్నిటన్. ౬౦.

కం.సురకిన్నరకింపురుషా,సురగంధర్వాహిగరుడ♦శూరుల కైనన్
బరికించి తెలియరానివి, పరమాస్త్రచయంబు లితని♦వశమునఁ గ్రాలున్. ౬౦౩

సీ.మున్ను భృశాశ్వనా♦ముఁడు ప్రజాపతి యొక్క,రుండు చెలంగుధీ♦రుండు దక్ష
సుతల జయాఖ్యను ♦ సుప్రభాఖ్యను బెండ్లి,యయ్యె నిర్వుర జయ♦యందుఁ గాంచెఁ
గామరూపులను వి♦క్రమవంతులను నేను,వదులపుత్రకుల; సు♦ప్రభ యుఁ గాంచె
నందఱసుతుల సం♦హారాభిధానుల, దుర్ధర్షబలుల ని♦స్తులితశక్తి

తే. వరుల నస్త్రంబు లైరయ్య ♦ వార లెల్ల, వాని నన్నిటి నిజతపో♦బలముకలిమిఁ
బొందె నితఁడుభృశాశ్వచేఁ♦బుడమినేలు,సమయమునయందనీకేల♦సందియంబు.

కం.అవి యేటికి నెన్నన్ని యొ, నవనవముగ సృష్టిసేయు♦నైపుణి గలఁ డీ
భువనిభుఁ డాతని వెంబడి, నవనీశ్వర! పంపవయ్య ♦ యాత్మజు రామున్. ౬౦౪

కం.తలఁపకు తనకార్యంబును, జలుపుకొనఁగ లేక రామ♦చంద్రుని వేఁడన్
దలఁకొన నని; నీసుతునకుఁ, గలిగింపఁగఁ గోరి వచ్చెఁ ♦ గల్యాణంబుల్. ౬౦౬

కం.అనుచు వసిష్ఠుఁడు పల్కిన, విని ప్రముదితచిత్తుఁ డగుచు ♦ విపులాపతియున్
ముని వెంటఁ బంపఁగా రా,ముని లక్ష్మణసహితుఁ బిలువఁ ♦ బూర్ణమనమునన్.

దశరథుఁడు రామలక్ష్మణులను విశ్వామిత్రు వెంట నంపుట.

ఉ. వారలు సమ్మదం బెదల ♦ వర్ధిల వచ్చినఁ దల్లిదండ్రు ల
వ్వారికిఁ బ్రీతి మున్నుగను ♦ స్వస్త్యయనం బొనరింప బాలుర
న్జేరి పురోహితుండు హిత♦నిష్ఠిత బుద్ధిని మంగళోక్తులన్
గారవమార మంత్రితులు♦గా నొనరించినయంతఁ దండ్రియున్. ౬౦౮

తే. చిన్నికొమరునిఁ దనపజ్జ♦చేరఁదీసి, శిరము మూర్కొని మీఁదను ♦ జేయి వైచి
యంతరాత్మమహాప్రీతి♦నలరుచుండ, నబ్జజసమానుఁడగు ముని ♦ కప్పగించె.౬౦౯

ఉ. మందము మంద మై సురభి♦మారుత మల్లన నీరజంబుగాఁ
బొందుగ వీచె స్పర్శసుఖ♦మున్ ఘటియించుచు, దేవదుందుభుల్
క్రందుగ మ్రోసె,రాలె సుమ♦రాసులవర్షము, కోసలాత్మజా
నందనుఁ డిట్టు లాకుశిక♦నందను వెంబడిఁ బోవఁ బూనినన్. ౬౧౦

కం.రయమునను శంఖదుందుభి, చయములనిస్వనము లెసఁగె ♦ సంకులముగ న
ప్డయగతి మునిపతి వెంటను, బయనం బై వేడ్క రామ♦భద్రుఁడు వోవన్. ౬౧౧

సీ. ముందు విశ్వామిత్ర♦ముని యేగఁగఁ బిఱుంద, డాకేలఁ జాపంబు ♦ డాక మెఱయ
ముద్దుజుల్పంబులు[1] ♦ మోదంబు నింపఁగ, ననుఁగుఁదమ్ముఁడు వెంట ♦ నంటి రాఁగ

[1] ఇప్పటికి రామునివయస్సు ౧౨ సంవత్సరములు.

రామభద్రుం డేగెఁ ♦ గ్రాలభూషణములు, దశదిశల్ వెలుఁగంగఁ ♦ దనదుద్యుతిని
బురమునఁ గల్గిన♦పురుషులు మగువలు, మూఁగ లై యందంఱ ♦ మూఁగి చూడఁ
తే. బూలు గొని పూవుఁబోఁడులు ♦ లీలఁ జల్ల, మంగళరవంబు దెసలను ♦ మ్రింగివైవఁ
దల్లు లందఱుఁ గిటికీలఁ ♦ దఱసి నిల్చి, చొక్క కనుమెఱదూరంబు ♦ నిక్కి చూడ.
సీ. తరకసంబులజతఁ ♦ దనరుమూఁపులవారిఁ, గెంగేల ధనువులు ♦ గెరలువారి
ముత్తలపాములముఱుపుఁ జూపెడువారి, నంగుళిత్రాణంబు ♦ లమరువారి
దశదిశల్ వెలిఁగించు♦తనురుచు ల్గలవారి, మెయినిండ సొమ్ములు ♦ మెఱయువారి
సౌందర్యమున జిత♦జలజేషు లగువారి, ఖడ్గముల్ గలనడి♦కట్టువారి
తే. విధిని వెన్నంటునశ్వుల♦విధమువారి, శివుని వెనుకొనుకొమరుల ♦ చెలువువారి
మహితగుణులనురామల♦క్ష్మణులఁదోడు, కొనుచుఁజనియెనుగౌశిక♦మునివరుండు.

విశ్వామిత్రుఁడు రామునకు బలాతిబల లనువిద్యల నిచ్చుట.

మ. అరుగంగా నిటు సార్ధయోజనము ధ్యా♦తాత్మస్వరూపాఖ్యుఁడుఁ
సరయూదక్షిణతీరధారిణిని జం♦చన్మాధుకీవాఃసఁ బ్రే
మ రఘూత్తంసుని రామచంద్ర! రఘురా♦మా! యంచు నోవత్స! నీ
కరనీరేజములన్ జలంబుఁ గొనుమా ♦ కాలిస్పు జాగేటికిన్. ౬౧౪
కం. తెప్పెద బల యతిబల యను,నొ ప్పగుమంత్రముల నీకు ♦ నుపదేశింతున్
దప్పియు నాఁకలి శ్రమమే, స్గప్పదు పఠియింపఁ బ్రోచ ♦ నడచెడివేళన్. ౬౧౫
చం. నిదురను బూని యున్నయెడ♦నేనిఁ, బ్రమాదమునందు నేని, నా
పన లోనపింప లే వసుర♦పంక్తులు నీకు, భుజాబలంబునన్
సదృశులు గల్గ రెయ్యెడల, ♦ జ్ఞానమునన్ సుభగత్వవీర్యసం
పదలను ధీరతాస్తి సమ♦మానుఁడె వచ్చెదు, కీర్తి హెచ్చెడిన్ ౬౧౬
కం. ధీమహిమ యుక్తిపటుత య,సామాన్యం బగును వీని ♦ జ్ఞానజనములన్
నీమదిఁ బఠించి తేని, పి,తామహసుత లివి యటంచుఁ ♦ దలఁపుము మదిలోన్.
ఉ. పావనధర్మనిష్ఠఁ దగు♦పాత్రము నీవ గ్రహింప సీమనుల్,
గావున నిచ్చెదం గొనుము ♦ కాలవిలంబన మేల, నీమదిన్
భావనసేయుకార్యము ల♦వశ్యము చేకుఱు, సందియంబు లే
దోవరశీల! పెక్కుగతు ♦ లుర్విఁ జెలంగుత నీకు నిచ్చుటన్. ౬౧౭
మ. అని బోధింప జలంబు వార్చి శుచి యై ♦ యారామచంద్రుండు గ్ర
కొని యామంత్రయుగంబు నొప్పె శరద♦ర్కుంబోలి తేజానఁ, జ
య్యనఁ గావించె గురుప్రయుక్త మగుకా♦ర్యం బంతయున్, రాత్రి యె
ల్లను నాముప్వురుఁ బుచ్చి రంద సుఖలీ♦లాలోలచిత్తంబులన్. ౬౧౮

[1] మనుల్ — మంత్రములు.

తే. అపుడు దశరథవసుమతీ♦శాత్మజులకు, ననుచితపుఁదృణశయనీయ♦మందుఁ గూడఁ
బందువారికిఁ గౌశిక♦వాక్యలాలి,తులకు నా రేయి[1] సౌఖ్యంబు ♦ గలుగఁ జేసె.

కం. తెలతెలవాఱఁగ మేల్కని, నలినాసనసన్నిభుండు ♦ నవతృణపర్ణా
కలితశయనంబులఁ రవి,కులజులఁ గని వారి డాసి ♦ కూర్మిం బలికెన్. ౬౨౧

కం. కౌసల్యాసుప్రజ! రా,మా! సరసిజనయన లెమ్ము ♦ మా నగుఁ బ్రాక్సం
ధ్యాసమయము నరపుంగవ, వాసిగ దైవాహ్నికంబు ♦ వలయుం జలుపన్. ౬౨౨

సీ. అని యిట్లు కౌశికుఁ ♦ డాదరంబునఁ బల్క, విని లేచి రఘుకుల♦వీరు లంత
సరయువుసం గృత♦స్నాను లై యుదకంబు, వారిచి పరమజ♦పంబు నిష్ఠ
జపియించి యర్ఘ్యాది♦సకలక్రియల్ దక్క,నాహ్నికంబులు దీర్చి ♦ యమలమతిని
వరతపోధనుని వి♦శ్వామిత్రునిఁ డాసి, యభివాదన మొనర్చి ♦ హర్షముననుఁ

తే. బయన మొనరింపనూల్కొను♦బాలురఁగని,తోడుకొంచేగుచుండనా♦త్రోవలోన
రాచకొమరులు గాంచి ర♦బ్రంబు గదుర, సరయుసంగమభూమిని ♦ జహ్నుతనయ.

ఉ. అచ్చట నుగ్రతేజులు మ♦హర్షు లనేకసహస్రవర్షముల్
పొచ్చెము లేనినిష్ఠలను ♦ బూని తపం బొనరించి రాస్థలిఁ
సచ్చరితుల్ రఘూద్వహులు ♦ సంతసమారఁగఁ గాంచి యాత్మలో
హెచ్చెడికౌతుకంబుమెయి ♦ నిట్లని రామునిసార్వభౌముతోన్. ౬౨౪

కం. ఈపుణ్యాశ్రమ మేరిది? యేపురుషుం డిట వసించు ♦ నెప్పుడుఁ? గుతుకం
బేపారె దీని వినఁగ మ,హాపురుషా! యెఱుఁగఁ జెప్పు♦నయ్యా మాకున్. ౬౨౫

⟡ విశ్వామిత్రుఁడు రామునకు నంగదేశ వృత్తాంతముఁ దెల్పుట. ⟡

చం. అన విని పిన్ననవ్వు దొలఁ♦కాడ మునీంద్రుఁడు పల్కె రామ! యీ
యనఘమహాశ్రమంబుకథ ♦ యంతయు నీకు నెఱుంగఁ జెప్పెదఁ
మునుపు మరుండు భాసిలఁగ ♦ మూర్తియుతుం డయి స్థాణుఁ డిచ్చటఁ
ఘనతప మాచరించె గిరి♦కన్య దమిం బరిచర్య సల్పఁగన్. ౬౨౬

కం. ఆతపమునకును విఘ్నము, చేతోభవుఁ డాచరింప ♦ శ్రీకంఠుఁడు ప్ర
స్ఫీతం బగుఫాలానల,జాతంబునఁ గుమతి భస్మ♦సాత్కృతుఁ జేసెన్. ౬౨౭

చం. అదినుత మేను లేమిని న♦నంగుఁ డనంగుఁ డనంగ భూమిపై
విదితసమాఖ్యుఁ డయ్యెఁ జుమి; ♦ వీడుటచే మరుఁ డంగ మిచ్చటఁ
సదమలశీల యియ్యదియు ♦ సన్నుతిఁ గాంచెను నంగదేశ మం;
చిదియ తదాశ్రమం బిట న♦హీనతపస్వులు రుద్రశిష్యులై ౬౨౮

కం. తరతరములుగా నుందురు, పొరయవు పాపములు వారిఁ ♦ బుణ్యకృతుల; నేఁ
డిరవుగ నున మిచ్చట రే,[1] జరఘుచు తేపమరతటినిఁ ♦ జనుఁ దరియింపన్. ౬౨౯

---

[1] ఇది యిల్లువిడిచినపిమ్మట మొదటిరాత్రి.

ఉ. పోవుదమయ్య యీసరయు♦పుణ్యజలంబులఁ గ్రుంకి శుద్ధులై
పావనమంత్రవారము జ♦పం బొనరించి హుతంబు వేల్చి భూ
దేవులదర్శనార్థ మని ♦ తెల్పుచు నుండఁగ నింతలోన నా
దేవఋషుల్ తపోవిభవ♦దీర్ఘసుచక్షు లెఱింగి ప్రీతులై. ౬౩౦

ఉ. వారలఁ జేరి యర్ఘ్యమును ♦ బాద్యముఁ గాకిక మాని కిచ్చి సో
దారత నాతిథేయము ధ♦రాధిపసూనుల కిచ్చిసంత స
త్కారము లంది మువ్వురుఁ గ♦థాశ్రవణంబులఁ బ్రొద్దు పుచ్చుచుం
వారిచి సంధ్య నిష్ఠను జ♦పంబులు సల్పిరి యప్పహాస్ఫతిన్. ౬౩౧

కం. కామాశ్రమమునఁ గడు సభి,రామం బగుకథలచేత ♦ రమణీయగుణా
రాముల నిద్దురవుచ్చెను,[1] రాముని లక్ష్మణుని మౌని♦రాజాగ్రణియున్. ౬౩౨

←→ విశ్వామిత్రుఁడు రామునకు సరయూవృత్తాంతముఁ దెలుపుట. ←→

సీ. వేగుఁబోకను[2] రఘు♦వీరు లాహ్నికములఁ, దీరిచి మున్ను గా♦ధేయుఁ డరుగ
నాతని వెన్నంటి ♦ యరుగుచు జాహ్నవీ,తటరమ్యదేశంబుఁ ♦ దరియ నచటి
సంయమధనులు వి♦శ్వామిత్రునిం జేరి, మహాత్మ నావ య♦మర్చినార
మీరలు భూతలా♦ధీశనందనులతోఁ, దరియింపుఁ డీపుణ్య♦తటిని నేల

తే. తడవటం చన సరి యని ♦ యుడుప మెక్కి, యానదిఁ దరించుచుండమ♦ధ్యంబునందు
భంగసంరంభ వర్ధిత♦ప్రబలరవము, నాలకించి రఘూత్తముఁ♦డనియె మునికి. ౬౩౩

కం. మునిశార్దూలమ స్రోత,స్వినిజలముల వినఁగ నయ్యె ♦ విపులవుటులి వీ
ధ్వని వీచీకర్షణసం,జనిత మొ మఱియొం డొ దీర్పు ♦ సందియ మనినన్. ౬౩౪

కం. ఆరాముని వచనంబుల, నార్థాముని విని యుదీర్ణ♦హర్షాకులుఁ డై
గారాముమన ని ట్లనియెను, సారామలమతిని దాని♦చరితం బెల్లన్. ౬౩౫

శా. కైలాసంబున ము న్విధాతృఁడు దటా♦కం బొంపు సంకల్ప కే
ళీలోలుం డయి మానసంబున నె బా♦లిం సృష్టి గావించె, నా
నాళీకాకర మొప్పు మానససరో♦నామంబునం, దత్సరః
పాళీనిర్గత మౌట నిద్ది సరయూ♦ప్రఖ్యాతిఁ గాంచెం జుమీ. ౬౩౬

సీ. అది యయోధ్యాపురి ♦ నంటుచుఁ బ్రవహించి, గంగాతరంగిణిఁ ♦ గలియు నిచట
నీనీటియొరయిక ♦ నెసఁగు శబ్దం బిది, సలుపు నమస్కృతి ♦ శ్రద్ధతోడ
ననిన నాధర్మాత్ము ♦ లభివాద మొనరించి, యద్దరికిని దాఁటి ♦ రంత మువ్వు
రావలఁ బయన మై♦ యరుగుచుఁ గనియుందుఁ, గడుభయంకర మైన♦గహన మొండు

తే. మౌనివరునిఁ గనుంగొని ♦ మానవేంద్ర,తనయు లి ట్లని రీవనాం♦తరము చూడ
విజన మై దృష్టిభయద మై ♦ వెలయుచున్న, దెవ్వరిందునసింతురో♦ యెఱుకపఱుపు.

[1] ఇది రెండవరాత్రి. [2] వేగుఁబోక = ఉపయము.

## తాటక నగస్త్యుఁడు శపించుట.

కం. బలహీనులు యక్షు లన, న్వెలయును లోకోక్తి; యెట్లు ♦ నెలఁతకుఁ గలిగెన్
దెలుపుము సహస్రవారణ,బలము తపోధన యటన్నఁ ♦ బలికె న్మునియున్. ౯౪౮
సీ. తొల్లి సుకేతుఁ డన్ ♦ దొడ్డయక్షుఁ డొకండు, సదమలాచారుండు ♦ సంతు లేక
తీవ్రతపంబున ♦ దీపింప నాతని,యం దతిప్రీతుఁ డై ♦ యబ్జభవుఁడు
తాటకావామికఁ ♦ దనుజాతఁగా నిచ్చి, పదినూర్ల గజముల ♦ బలము దాని
కొసఁగెను గాని తా ♦ నొసఁగఁడు పుత్త్రు, నా,వనితకు రూపయౌ ♦ వనము లొప్ప
తే. సుందుఁ డనియెడిఝర్ఝుని ♦ సుతునకిచ్చి, పెండ్లి గావింప నతఁ, డది ♦ ప్రియతనూజుఁ
గాంచె మారీచుఁ డనియెడి ♦ క్రౌర్యనిరతుఁ; గాలవశుఁడయ్యె సుందుఁ డ ♦ గస్త్యుచేత.
ఉ. తాటక పుత్త్రుఁగూడి యతి ♦ దారుణభంగి మునీంద్రుఁ జంప ది
క్కూటము లాడ నార్భటులఁ ♦ గ్రూరతఁ గైఁ గవియంగఁ, దా నిరా
ఘాటత శాప మిచ్చి ముని ♦ కమ్మ నిశాటుఁడ వంచుఁ బుత్త్రు; నో
బోటి సురూపము న్విడిచి ♦ పొంది వికారపుభీమరూపమున్. ౯౫౦
కం. మనుజాదిని వై వికృతా,ననమునను విరూప వగుచు ♦ నడమాడు మటం
చును శపియించినఁ గినుకన్, మునివరుఁడు చరించు దేశ ♦ ముల నీకరిణిన్. ౯౫౧
కం. క్షణదాచరి మానవభ,క్షణపర యై పాడుచేసె ♦ జనపదములు; బ్రా
హ్మణగోచయహితముగ ని, ర్ఘృణతన్ వధియించి దీనిఁ ♦ గీర్తిం గనుమా. ౯౫౨

## తాటకను జంప విశ్వామిత్త్రుఁడు రాముని బోధించుట.

కం. శాపపరీత వధింపఁగ, నేపురుషుం డైన నుత్స ♦ హింపఁగ లేఁ డో
భూపసుత నీవు దక్కఁగ, నేపాటియతండు నైన ♦ నేలోకమునన్. ౯౫౩
కం. కాంతావధపాపసమా,క్రాంతుఁడ నగుదు నొ యటంచుఁ ♦ గరుణాపరతన్
జింతింపకు నృపసూనుఁడు, సంతతముం గానవలయు ♦ జాతురు నాగ్మున్. ౯౫౪
కం. క్రూరపుఁబని యేనియు న,క్రూరపుఁబని యేని నఘముఁ ♦ గూర్చు నదే న్ జే
కూరున దే నపవాదము, ప్రజలకు సేయఁ దగుఁ బ్ర ♦ జారక్షకు నె. ౯౫౫
తే. రాజ్యభారధురీణు లౌ ♦ రాజసుతుల, కిది సనాతనధర్మ మం ♦ చెఱుఁగుమయ్య
ధర్మ మెఱుఁగదు చంపుమ ♦ దగ్గరి దీను,వినుము మా తెని యుఁకఁబురా ♦ వృత్తములను.
ఉ. క్రూరతఁ జంపఁడే మును వి ♦ రోచననందను గ్గొనుసుంధరన్
ధారిణిఁ జంపఁ బూనివదు ♦ దారుణవృత్రహాతన్ శచీశుఁడున్
వార కనింద్రలోకమును ♦ వాంఛ యొనర్చెడి కావ్యమాత మ
ఱ్ఱీరమణుంపు చక్రమునఁ ♦ జెక్కఁడొకో భృగుపత్ని రాఘవా. ౯౫౬

కం.ఇంతియగా కన్యలు భూ,కాంతు లధర్మాత్మక లగు♦కాంతల ధరణిన్
హంతవ్య లగుటఁ జంపిరి, చింతిలకు ముదాజ్ఞ నీవు ♦ చేయుము నృపతీ! ౬౪౭

→ శ్రీరాముఁడు తాటకను వధించుట. ←

చం.అనిన మహార్థబోధకము ♦ లైనమునీంద్రునిపంగతోక్తులన్
విని మునియాజ్ఞ లెల్ల నెఱ♦వేర్పు మటంచును బల్కెఁ దండ్రి నిం
డినసభలోన నాయన నుడిన్ జవదాఁటఁగ రాదు గౌరవం
బునఁ గన నాను గాన ముని♦పుంగవుచిత్తముఁ బట్టి పోయెదన్. ౬౪౮

చం.పనిచిన తండ్రిమాటఁ గొని ♦ బ్రహ్మనిభుం డగుబ్రహ్మవాదిశా
సన మొనరింతు, నేమిటికి ♦ సందియమంచు మొగిడ్చి హస్తముల్
మునివర విప్రగోవిషయ♦ముల్ సుఖమొందఁ గ్వదుక్తిఁ దాటకన్
దునిమెద నంచు దిక్తటులు ♦ తుంపెసలాడ గుణంబు మీటినన్. ౬౬౦

శా.ఆరావంబు శ్రవోవిదారణచణం ♦ బై వీచుడున్ యక్షి హుం
కారాస్ఫోటితభూదిశావరణ యై ♦ గర్జించుచున్ లేచి వే
యారావం బరుదెంచుజాడఁ గొని తీ♦వ్రాటోపపాదోద్ధతిన్
ఘోరాకారతఁ బాఱుదేరఁగ నసుం♦గుండమ్ముతో రాముఁడున్. ౬౬౧

ఉ. తమ్ముఁడ లక్ష్మణా! కనితె ♦ దారుణదేహముతో వికారవే
షమ్మున భైరవారవము ♦ సల్పెడు రాక్షసి; ధీరు లైన ను
గ్ర మ్మగుదీనిరూపుఁ గన ♦ బ్రస్తలువాఱఁగ గుండె లంత నా
శమ్మును బొందరే; యతుల♦శాంబరిస్త్రీ నజయ్య యేరికిన్. ౬౬౨

ఉ. దీని మరల్పఁ జూడు కుద♦తీహసనం బొనరింప నొల్లని
ద్దాని నిక్కృత్తనాసికఁగ ♦ దారితకర్ణఁగఁ జేసి వీరమున్
మానిచి యాన వేగమును ♦ మాయఁగఁ జేసెద నంచు నుండ న
ద్దానవి రాముపైఁ గవిసె ♦ దారుణహుంకృతిఁ జేతు లెత్తుచున్. ౬౬౩

చం.భయదతరాకృతిం గవియ ♦ బ్రహ్మఋషీంద్రుఁ డదల్చి హుంకృతిన్
జయజయ రామభద్ర యని ♦ స్వస్తి నచించెను,యక్షకాంతయున్
రయమునఁ బాంసువర్షమున ♦ రాఘవులం గడుముంప మోహాత
న్మయత ముహూర్తముం బ్రతి యొ♦సర్పఁగ యోజన సేయుచుండఁగన్. ౬౬౪

సీ. అదియు మాయాయుక్త ♦ యై రాఘవుల నొంచెఁ, జటులనిష్ఠురశిలా♦సారధార
దానిపోకలఁ జూచి ♦ దారుణక్రోధాంత,రంగుఁ డై బాణవ♦ర్షంబుచేత
రాముండు దానిక్రూ♦రత మాన్పి ఖండించెఁ, గరయుగ్మమును బృష♦త్కములచేత
నీలోన సౌమిత్రి ♦ హృతకర్ణనాసికఁ, గావించె దాని ని♦ష్కారుణుఁడగుచు

తే. నీడఁబోవక యదియును ♦ నేవుమీఱి, కామరూపంబులను దాల్చి ♦ కనఁగరాక
మాయచే మోహపఱుచుచు♦మాఱుకొనియె,నశ్మవృష్టినిగురియించు♦చధికముగను.

ఉ. దానియసహ్యవిక్రమని♦తాంతజవంబులఁ జూచి రామ నీ
వూనకుమయ్య దీనియెడ ♦ నొక్కలవంబు దయన్, వధింపుమీ
దీనిని దుష్టచారిణి స♦దీనపరాక్రమ యజ్ఞహంత్రి ని
ష్ఠైనెఱి, సంజ యైన వధి♦యింపఁగ దుష్కర మయ్య దైత్యులన్. ౭౭౭

సీ. అని మౌని బోధింప ♦ నంతలో యక్షియు, వర్షించుచును రాల♦వాన గదియు
మాయాబలంబున ♦ మహీపకుమారుఁడు, శబ్దవేధులు నైన♦సాయకములఁ
దద్వేగ మణఁగింపఁ ♦ దాటక వేగ పై,పడఁగ రా జీవ్వన ♦ బలియుఁ డుగ్ర
సాయకం బొక్కటి ♦ సంధించి యురమున, నట్టె నాటింప ని♦శాటి చచ్చి

తే. భూమి యల్లలనాడ ద♦బ్బునను బడిన, హరిహయాదినురావళి ♦ హర్ష మంది
మేలు మే లని పొగడుచు ♦ మెచ్చికొనుచుఁ, బూజగావించె నారఘు♦పుంగవునకు.

ఉ. అంత బలాంతకాదులు న♦నంతము సంతసమార నస్త్రవి
ద్యాంతునిఁ జూచి యి ట్లనిరి ♦ కౌశిక! యీమహనీయదైత్యకాం
తాంతకు స్నేహయుక్తిని భృ♦శాశ్వసుతాస్త్రనిఁ జేయవయ్య, భూ
కాంతసుతుండు చేయఁ దగు♦కార్యము లున్నవి లోకరక్షకై. ౭౭౮

ఉ. ఈతనికన్నఁ బాత్రుఁడు మ ♦ ఱేఁడును నీకు లభింపఁ డెల్లవి
ద్యాతతి నిమ్ముటంచుఁ జనఁ ♦ దాపసుఁ డారఘువీరుఁ గ్రుచ్చి సం
ప్రీతి శిరంబు మూర్కొనుచు ♦ రే యిటఁ బుత్తమటయ్య తేపు వి
ఖ్యాతచరిత్ర పోదము మ♦దాశ్రమభూమిని డాయ నం చనన్. ౭౭౯

ఉ. అట్టులగాక యం చచట ♦ నానిశ[1] యుండఁగఁ జూడ నొప్పె ను
న్నొట్టినశాప మూడుట వి♦నూతనపల్లవపుష్పరాజికిం
బ ట్టయి శ్రీదుచైత్రరథ♦మా యని సందియ మెల్లవారికిం
బుట్టఁగఁజేయ నాగహన♦భూమి నునోద్ధరమానివాసనై. ౭౮౦

సీ. ఆరీతి నచ్చోట ♦ నాత్మాత్రి వసియించి, [2]వఱువాత నాచిన్ని ♦ బాలకులను
మునిరాజు బోధించి ♦ కనుఁగొని శ్రీరాము, నంతోషమయ్యె నీ♦చరితములకుఁ
బరమముదంబున ♦ నరసురాసురయక్ష,గంధర్వకిన్నర♦గరుడసిద్ధ
సమితి నైనను నీవు ♦ సమితి జయింపఁగఁ, జాలెడిపరమాస్త్ర♦సముదయముల

తే. నిచ్చెదను నీకు గ్రహియింపు ♦ మింపుతోడ, నెట్టిశత్రుల సేనియు ♦ మట్టుపెట్టి
వశముఁ గావించుకొనఁ జాలు♦వాలుమగఁడ,వైధరాస్థలి వెలసెదు ♦ సాధువినుత.

[1] మూఁడవనాఁటి రాత్రి. [2] నాల్గవనాఁటి యుదయము.

విశ్వామిత్రుఁడు శ్రీరామునకు దివ్యాస్త్రంబు లొసంగుట.

సీసమాలిక.

దండచక్రంబును ♦ ధర్మచక్రముఁ గాల,చక్రంబు మఱి విష్ణు♦చక్ర మతుల
మైంద్రాస్త్రభయదవ♦జ్రాస్త్రముల్ పరమగు, శివశూలమును బ్రహ్మ♦శిరశ్శరము
నైషీకశరము బ్ర♦హ్మాస్త్రంబు మోదకీ, శిఖరు లన పేరైన♦శ్రేష్ఠగదలు
వరుణపాశంబును ♦ వారుణాస్త్రము ధర్మ,పాశంబు మఱి కాల♦పాశ మొండు
నార్ద్రశుష్కాఖ్య లౌ♦పశనులు రెండును, నారాయణాస్త్రమై♦నాకశరము
లాగ్నేయబాణంబు ♦ నగ్ని దయిత మైన, శిఖరాస్త్రమును వాయవ్య♦జిహ్మగంబు
హాయశిరోస్త్రంబుఁ గ్రౌం♦చాస్త్రంబు శక్తులు, దైత్యసంఘాతంబు♦దాల్చిలిరుగు
కంకాలముసలకం♦కణములుఁ గాపాల, మును నివియెల్లఁ బెం♦పుగ నొసంగు
వాఁడను మఱియును ♦ వైద్యాధరాస్త్రంబు, నందనం బనుపేర ♦ వందగించు
నసిరత్నమును మాన♦వాస్త్రంబు గాంధర్వ, శరముఁ బ్రశమనప్ర♦స్వాపనములు
భాస్కరాస్త్రంబు ద♦ర్పణశోషణంబులు, సంతాపనవిలాప♦శరయుగంబు
దర్పకాస్త్రంబుఁ గం♦దర్పకదయితంబు, పైశాచకశరంబుఁ ♦ బ్రబలమోహ
నంబును సంవర్త♦కంబును దామనం,బును సౌమనంబు న♦మోఘ మైన
మూసలసత్యముల్ ♦ మాయాధరంబు తేజ,ప్రభాస్త్రంబును ♦ సౌమ్యశరము
ద్వష్టృస్త్ర మైనను♦దామనంబు భగేషు,శీతేషుమానవ♦శితశరములు

తే. గామహాపమహా♦బలకలితము లగు,నీశరంబుల నన్నింటి ♦ నిచ్చువాఁడఁ
దూర్ణముగఁగొమ్మటంచిచ్చెఁ♦దూర్పుదిరిగి, శుచితరామునకాయస్త్ర♦నిచయములను.

ఉ. ఇన్నియు దేవతాగణము ♦ కేని యసాధ్యము సంగ్రహింపఁ, దా
నన్ని యొసంగె రామున కు♦దారతఁ గౌశికుఁ, డంత రాముఁ డ
త్యున్నతనిష్ఠమై జపము ♦ నోలి నొనర్ప మునీంద్రునాజ్ఞ దా
మన్నియు నస్త్రశస్త్రనిచ♦యంబులు రామునిఁ గొల్చె భృత్యులై. ౬౨౩

ఉ. గారవమార వానిఁ గర♦కంజములన్ స్పృశియించి యింక స్వే
చ్ఛారతి మీరు మీవలయు♦చక్కటికిం జని యెప్పుడేని నేఁ
గోరినపట్లఁ గార్యమును ♦ గొబ్బునఁ దీర్పఁగ రండు పొం డటం
చారఘువీరుఁ డాడ నవి ♦ యన్నియుఁ బోయె యథేప్సితంబుగన్. ౬౨౪

కం. ఆగతిమతి రఘువీరుఁడు, చేతము రంజిల్ల మౌని ♦ శేఖరునకు పం
ప్రీతిని మ్రొక్కి ప్రయాణం, బై తరలుచు నిట్టు లనియె ♦ హర్షము పేర్మిన్. ౬౨౫

ఉ. ఆరయ దేవతాగణము♦కైన నజయ్యము లైనయస్త్రముల్
కారుణికాగ్రణీ యొసఁగఁ ♦ గంటినిఁక మఱి వీని కిమ్ము సం

హారములఁ యథావిధిఁగ ♦ నంచు వచించిన సుత్రతాత్ముఁ డా
శ్రీరఘురామచంద్రునకుఁ ♦ జెప్పఁ దొడంగెను వాని నన్నిటిన్. ౬౨౬

విశ్వామిత్రుఁడు శ్రీరాముని కుపసంహారాస్త్రము లొసంగుట.

సీ. సత్యవంతంబును ♦ సత్యకీర్తిశరంబుఁ, బ్రతిహారతరధృష్ట♦రభసములును
మొగిఁ బరాఙ్ముఖ మవా♦ఙ్ముఖము లక్షాక్షవి,షములును మఱి దశా♦క్షంబు నుగ్ర
దృఢనాభము సునాభ ♦ మెసఁగు సుదీప్తంబు, దశశీర్షమును శతో♦దరము నిశిత
శతపత్త్రశరముఁ గృ♦శనము జ్యోతిషపద్మ,నాభమహానాభ♦నామకములు
తే. దుందునాభసునాభముల్ ♦ తోయజాక్ష,విమలనైరాశ్యశుచిబాహు♦విరుచిరుచిర
ధనమహాబాహునిష్కలి♦దైత్యశమన, కాండములునుహరిద్ర యో♦గంధరములు.
తే. మకరధాన్యములుఁ బిత్ర్యసౌ♦మనసములును, శాతకరవీరశరము వి♦ధూతశరముఁ
గామరుచి యావరణమోహ♦కామరూప,సర్వనాభజృంభకములుఁ ♦ జారుశీల.
కం. సంతాపనవరణశరము ల,సంతవిభావంతములు భృ♦శాశ్వతనూజుల్
చింతితరూపులు జాపక,చింతామణు లనుచు నిచ్చె ♦ శ్రీరామునకున్. ౬౨౭

శ్రీరాముని కుపసంహారాస్త్రదేవతలు ప్రత్యక్ష మగుట.

ఉ. కొన్ని సుమూర్తిమంతములు ♦ గొన్ని యఖర్వసుపర్వ తేజముల్
గొన్ని సుఖప్రదంబులును ♦ గొన్ని జ్వలద్దహనోపమానముల్
గొన్నియు ధూమతుల్యములు ♦ గొన్ని యహస్కరచంద్రదీప్తు లి
ట్లన్నియు రాముఁ జేరి కలి♦తాంజలు లై మధురోక్తి ని ట్లనున్. ౬౫౦
తే. కంజదళనేత్ర నీకుఁ గిం♦కరుల మేము, పని విధింపుము మా కనఁ ♦ బార్థివుండు
మదిని నేను దలంచిన♦మాత్ర వచ్చి,సాహ్య మొనరింపుఁ డిచ్చమైఁ ♦ జనుఁడటన్న.
కం. నిటలతటఘటితకరసం,పుటములతో రామచంద్ర♦భూమీశున కు
త్కటముదమున నలగొని యవి, మటుమాయం బయ్యె నంత ♦ మనుజేంద్రుండున్.
కం. ఆమునివరునాజ్ఞం గొని, సౌమిత్రికి నిచ్చె నఖిల♦సంహారాస్త్ర
స్తోమము సంతోషంబున, నీమెయి నావిద్య లెల్ల ♦ నెఱిఁగినవాఁడై. ౬౫౩

వనమయూరము. మాణవకరత్న ములు ♦ మౌనివరు వెంటన్
రాణమెయిఁ బోవు నెడ ♦ రాముఁడు మృదుశ్రీ
వాణి నిటు పల్కె ఋషి♦వర్య! గిరిచెంతన్
బోణిమి నెసంగెఁ దరు♦పుంజ మది గంటే. ౬౫౪

చం. జలదనికాశ మై సరస♦సాలరసాలతమాలమాలతీ
మలయజబీజపూరపహు♦మాఖ్యశిరీషకమాధవీలతా

వళులును జిత్రచిత్రశుక♦బర్హిణబంభరడింభఝంకృతుల్
గలయఁగఁ బర్వె లోచనవి♦కాసకరంబు మనోహరంబు నై. ౬౮౬

కం. శారీకీరీమత్తమ,యూరీనాదములు గగన ♦ మొరసెను దళమై
యేఋషి యిం దుండెడి నో, సారమతి న టంచు రామ♦చంద్రుఁడు మఱియున్.

మత్తకోకిలము. దారుణం బగుకాననంబును ♦ దాఁటినార మ టంచు నీ
హారిసౌఖ్యతరప్రదేశము ♦ నారయ న్నదిఁ దోఁచెడిన్
జారుభూరినినాదముల్ మృగ♦సంచయంబుల స్వైరసం
చారముల్ గన నయ్యెఁ బెల్లుగ ♦ సంయమీశ్వర చెప్పవే. ౬౮౭

మ. ఘనదీర్ఘాధ్వరవిఘ్నకర్త లగునా♦బ్రహ్మఘ్ను లెవ్వారు? మీ
సవనారామ మ దెద్ది? యాఖలులవా♦సస్థాన మెం దుండు? నే
సవనం బేక్రియ నెప్పు డెప్పుగిదిఁ జే♦యం గార్య మౌఁ? బల్కవే
యివి సర్వం బన నప్రమేయునకు మౌ♦నీంద్రుండు దా నిట్లనున్. ౬౮౮

శ్రీరామునకు విశ్వామిత్రుఁడు సిద్ధాశ్రమవృత్తాంతముఁ దెల్పుట.

ఉ. ఇచ్చట మున్ను రాఘవ య♦నేకయుగంబు లనేకవర్షముల్
పొచ్చెము లేనినిష్ఠఁ దప♦మ్ముం బచరించెను విష్ణుమూర్తి దా
నిచ్చఁ దపోవ్రతంబును స♦హీనపుయోగము సిద్ధిఁ బొందఁ గా
నిచ్చట వామనుండు వసి♦యించెఁ దదాశ్రమ మిద్ది, యయ్యెడన్. ౬౮౯

కం. సిద్ధించు మహాతపములు, సిద్ధము కశ్యపుఁడు యోగ♦సిద్ధిం గనెఁ దా
నిద్ధముగ నిచట దాశరథీ, సిద్ధాశ్రమ మనఁగ నిది ప్ర♦సిద్ధం బయ్యెన్. ౬౯౦

ఉ. యాచనకామరద్రుమము ♦ నై బలియుండు బలీంద్రుఁ డల్ల నై
రోచని నిర్జితాఖిలమ♦రుద్గణసిద్ధబలారి యై త్రియా
మాచరఖేచరప్రకర♦ముం దలి గొల్వ జగత్ప్రశస్తుఁ డై
ధీచతురుండు విశ్రుతగ♦తిం బరిపాలనచేసె లోకముల్. ౬౯౧

ఉ. అప్పుడు వచ్చి యిచ్చటికి ♦ నగ్నిపురోగము లైన దేవతల్
దెప్పున విష్ణుఁ గాంచి కడు♦దీనతఁ బల్కిరి సప్తతంతువుల్
గొప్పగఁ జేసెడిన్ దనుజ♦కుంజరుఁ డయ్యది తీరుమున్న మీ
రిప్పుడ యాబలిం గనఁగ ♦ నేగి స్వకార్యముఁ జక్కఁబెట్టుఁడీ. ౬౯౨

తే. యాచకు లెవ్వ రెక్కడ ♦ యందునుండి, వచ్చి యాతని యాచింప♦నిచ్చకోలఁది
నెవ్వ రేది గోరి రేనియు ♦ నిచ్చు నతఁడు, మట్టు మీఱిన మతి యది ♦ యెట్టిదైన.

ఉ. మాయ నిమాశ్రయించి ముని♦ముందలి కభ్యుదయప్రదాత వై
చేయుము వామనాకృతిని ♦ జేకొని యుత్తమ మౌశుభంబు నా

రాయణ వారిజాక్షు యని ♦ ప్రార్థన సేయుచు నుండ నట్టిచో
వాయుసఖోపముండు ముని♦వర్యుఁడు నందనలాభకాంక్షమై. ౧౯౬

ఉ. శ్రీపతిఁగూర్చి కశ్యపుఁడు ♦ చేసెఁ దపం బదితిద్వితీయుఁడై
యోపిక దివ్యవర్షము లొ♦కొండుసహస్రక మత్యుదారస
స్థాపరిణాహ మొప్ప నతి♦సాత్త్వికవృత్తి యెసంగ, దాన ల
క్ష్మీపతి తుష్టుఁడై చు దయ♦చేసిన నిట్లు నుతించె మౌనియున్. ౧౯౭

సీ. పుణ్యతపోమయు ♦ భూరితపోరాశి, వరతపోమూర్తిని ♦ భక్తవరదు
వరతపఆత్మకుఁ ♦ బరమపూరుషు నిన్నుఁ, గంటి నిప్పుడు తపో♦గరిమచేత
ననఘ నీదుశరీర♦మునయందు సకలప్ర,పంచంబుఁ గన నయ్యె ♦ భద్రమూర్తి
నీ వనాద్యుండ వ♦నిర్దేశ్యుఁడవు గాన, శరణంబు నాకు నీ♦చరణయుగ మె

తే. యనినఁ గశ్యపుఁ గనుఁగొని♦మనములోనఁ, గరుణవఖుక్తనిట్లనె♦గరుడగమనుఁ
డయ్య వరమున కర్హుండ ♦ వైతి వింక, వరము గోరుము నీ కెది ♦ వాంఛ యనుడు.

ఆ. వరము నిమ్ము దేవ ♦ వరదుండ వేనియు, నదితియందు నాకు ♦ నసురవైరి!
సుతుఁడ వగుచుఁ బుట్టి ♦ సుత్రాముభ్రాతవై, గాసి వగచు సురలఁ ♦ గావవయ్య.

కం. ఆతతముగ సిద్ధించెను, నాతప మిటఁ గాన దీని♦నామము పరఁగుం
గాతఁ సిద్ధాశ్రము మని, ఖ్యాతిఁ జనియింపవయ్య ♦ కారుణ్యనిధీ. ౧౯౮

చం. అనినఁ దథాస్తటంచుఁ జని ♦ యంబుజనాభుఁడు వామనాకృతిం
గనికర మారఁగా నదితి♦గర్భమునం దుదయించి తా విరో
చనసుతుఁ గానఁ దత్సవన♦శాలకు నేగి జగత్త్రయావనుం
డనఘు సురారినేతఁ గని ♦ హాళి నచించెను మానదుం డిటుల్. ౧౯౯

ఆ. అడుగు లొకటి రెండు ♦ యాచింతు నసురేంద్ర, యంతమాత్ర మూర్వి♦యైసఁజాలు
నని గ్రహించి భువన ♦ మంతయుఁ దా నిండి, యతనిఁ గట్టివైచె ♦ నతులశక్తి. ౨౦౦

కం. వంచితవైరోచనియుఁ బ్ర,పంచము సర్వంబు మరల ♦ బలవైరికి న
ర్పించెను మేల్ మే లని మో,దించిరి మునులెల్ల సురలు♦ తేజం బెసఁగెన్. ౨౦౧

కం. శ్రమనాశక మగు నీయా,శ్రమమున వామనుఁడు నిలిచె ♦ రామా నేనుఁ
గమలాహృదయేశ్వరపద,కమలామితభక్తికలిమిఁ ♦ గలిగితి నిలుసన్. ౨౦౨

కం. ఇచ్చటికి నేగుదెంతు ర,సచ్చరితులు దైత్యవరులు ♦ జన్నంబులకుఁ
గొచ్చు ఘటియింప నిటఁ బోరి,పుచ్చంగా వలయు వారిఁ ♦ బురుషవరేణ్యా. ౨౦౩

ఉ. నాయన రామచంద్ర యిఁక ♦ నవ్యము భవ్య మనుత్తమంబు నే
నాయనఘాశ్రమంబును గ♦నం జన నౌను; సదాశ్రమంబు నా

---

[1] వదనాళాండవ రాత్రి.

కోయకుమార! యెట్టిదియొ ♦ యొ ప్పగు నీకును నట్టి దాచు,[1] నం
చాయతి యాయతీశ్వరుఁడు ♦ తాత్ములఁ దోడ్కొని యేగి ప్రీతితోన్. ౨౦౪

కం.శ్రమ మెడలఁ జొచ్చి సిద్ధా,శ్రమమును మునివరుఁడు రామ♦సౌమిత్రులతో
హిమరహితుఁడై పునర్వసు,సమేతుఁ డయి వెలయుచున్న♦చందురుమాడ్కిన్.

సీ. అరుదెంచు నక్కౌశి♦కాత్మజుఁ బొడఁ గని, సిద్ధాశ్రమస్థు ల♦శేషమౌను
లభిముఖు లై వచ్చి ♦ యర్చించి విధియుక్తి, నట్టుల యమ్మహీ♦శాత్మజులకు
నాతిథేయం బిచ్చి ♦ యలరించి ప్రశ్నింప, నావల బడలిక ♦ యపనయింప
నొకముహూర్తంబు దా ♦ మూరక కూర్చుండి, రాఘవుల్ పలికి రా♦గాచతపసి

తే. కథ్వరిపుదీక్షఁ దాల్పుమీ♦యనఘ నేఁడ, భద్రమగుఁగాతయజ్ఞంబు♦ఫలముగాంచ
నగుత సిద్ధంబు సిద్ధాశ్ర♦మాహ్వయంబు,సత్య మగుత భవత్సూక్తి ♦ సత్యవచన.

## శ్రీరామలక్ష్మణులు విశ్వామిత్రయాగసంరక్షణం బొనర్చుట.

చం.అనఘులు రాఘవేంద్రు లిటు ♦ లాడిన నాడట నాలకించి యా
మునివృషభుండు గాధిజుఁడు ♦ మోదమున న్నియతేంద్రియుండు నై
కొనియెను దీక్ష, వేకువను[2] ♦ గోసలరాజకుమారు లత్తపో
ధనుఁ గృతసాంధ్యకార్యు లయి ♦ తత్పరు లై ప్రణమిల్లి రంతటన్. ౨౦౭

ఉ. కాలము దేశముం దెలిసి ♦ కార్యసమర్థులు వాక్చణుల్ తప
శ్శీలుని గాధినందనునిఁ ♦ జేరి మహాత్మ నిశాచరాళు లే
కాలమునందు నిచ్చటికిఁ ♦ గ్రచ్చెకు వచ్చెడుఁ జెప్పు మేము త
త్కాలము మీఱ కుండఁ గ్రతు♦తంత్రముఁ గాచుచు నుందు మం చనన్. ౨౦౮

ఉ. సంగరరంగకౌతుకుల ♦ సాహసశీలురఁ బ్రీతిఁ గాంచి తా
రంగము వొంగ మోదమున ♦ నందఱు మౌనులు మేలు మే లటం
చుం గరము న్నుతించి నృప♦సూనులు నేఁడు మొదల్ సహావనం
బుం గడఁకన్ ఘటింపుఁడు త♦పోధనుఁ డై తమి నాఱుయామినుల్. ౨౦౯

కం.దీక్ష వహించి మునిహ,ర్యక్షుఁడు మౌనంబుఁబూను ♦ నటు గావున మీ
రక్షుద్రజాగరూకత, దక్షుల రై కావుఁ డనుచుఁ ♦ దగ బోధింపన్. ౨౧౦

ఉ. వారలభాషణంబు విని ♦ వారిజలోచను లుగ్రధన్వు లై
కూరు కొకింత లేక ముని♦కుంజరు నమ్మునియాగభూమి దు
ర్వారపరాక్రమంబునను ♦ వాసరషట్క మహర్నిశంబు పెం
పారఁగఁ గాచి దాశరథి ♦ యాఱవనాఁడు సుమిత్రపుత్రుతోన్. ౨౧౧

శా.అన్నా లక్ష్మణ! యింక హెచ్చరిక సు♦మ్మా, నీవు నేనుం గడన్
సన్నాహంబునఁ గావఁగా వలయు య♦జ్ఞం బంచు సన్నద్ధుఁ డై

[1] వామనుఁడే రాముఁ డౌటచేత. [2] అయిదవనాఁటి యుషఃకాలము.

యున్న న్వేదిక ప్రజ్వలించెఁ గుసుమ♦వ్యూహంబుతో స్రుక్కుతోఁ
జె న్నొదర్భలతోడ ఋత్విజులతో ♦ శ్రీపానపాత్రంబుతోన్. ౬౧౨
చం.సవిధిగ మంత్రవంతముగ ♦ జన్నము సాగుచు నుండ నాకసం
బవియఁగ భూరిరావము భ♦యానక మై జనియించె, వెంటనే
యవిరళ మేఘసంఘము ని♦రంతర మై వెస వర్ష నభ్రముక్
వ్యవధ యొనర్చు కైవడిని ♦ వచ్చిరి శాంబరి నాశ్రయించుచున్. ౬౧౩
కం.మారీచసుబాహులు పరి,వారము గొల్వంగ రక్త♦వర్షము వేదిక్
ఘోరంబుగఁ గురియింప న,పారంబుగ నదియు వెలిఁగె ♦ బలురక్తమునన్. ౬౧౪

శ్రీరాముఁడు మారీచునిఁ బాఱఁదోలి సుబాహువును వధించుట.

సీ. రామచంద్రుం డంత ♦ సౌమిత్రిసహితుఁ డై, యా వేది వీక్షించి ♦ యాగ్రహించి
వెసవెస వచ్చి యా♦కసమునఁ బఱ తెంచు,దైత్యులఁ గనుఁగొని ♦ తమ్ముఁ జూచి
యన్న లక్ష్మణ చూడు ♦ మిన్నరాదుల దుష్ట,చరితుల మానవా♦స్త్రంబుబలిమిఁ
బెనుగాలి వీవంగ ♦ వనదముల్ సల్లడఁ, జెల్లాచెదరు లయి ♦ చీలునట్లు
తే. చెదరఁ గొట్టెద నని దానిఁ ♦ జేతఁ బూని, చూచిమారీచు ఱొమ్మున ♦ సూటి వైవ
దంషి శతయోజనంబు లు♦ద్దండ రీతి, వానిఁ గొనిపోయి పడవైచె ♦ వనధిలోన.
కం.మునుఁగుచు మూర్ఛను దెలివిం, గనక చటులమానవాస్త్ర♦కారణమునఁ దాఁ
బెనుగాలికి నొగుడా కనఁ, జనుదైత్యునిఁ జూపి రామ♦చంద్రుం డనియెన్. ౬౧౫
కం.చూచితె లక్ష్మణ నరనా,రాచము సద్ధర్మయుతము ♦ రాక్షసనరు మా
రీచునిఁ జంపక తోఁకొని, వే చనియెడి మూర్ఛముంచి ♦ వియదధ్వమునన్. ౬౧౬
కం.అర్చితమునివర్యులఁ గడు,నిర్దయులు దుష్టగుణుల ♦ నిఖిలబుధాసా
హార్దులఁ బాపాత్ముల నే, మర్దించెదఁ జూడు నిశిత♦మార్గణశక్తిన్. ౬౧౭
మ. అని యాగ్నేయశరంబుఁ గేలఁ గొని క్రో♦ధావిష్టచిత్తంబునన్
గనుచున్ వేగ సుబాహుఱొమ్ము పయి డా♦కన్ వైచినన్ దాన నా
దనుజుం డుర్విఁ బరాసు వై పడియె, సం♦తిం దక్కురక్షస్థలిన్
ఘనవాయవ్యశరంబునన్ ధరఁ దొరం♦గం జేసె దర్పోద్ధతిన్. ౬౧౮
తే. సవనమును బన్న మొనరింపఁ ♦ దవులుసర్వ,రాక్షసానీక మీగతి♦మ్రందఁ జేసి
మున్నుకదనంబునను గెల్పు♦గొన్నయింద్రునోజ రాముఁడుబుధులచేఁ♦బూజఁ గొనియె.
ఉ. భాతి దిశల్ వెలింగెఁ బరి♦పాటి సమాప్తము గాంచె నధ్వరం
బీతి దొలంగె నెల్లయెడ ♦ నింతయుఁ గన్గొని గాధిపట్టి సం
ప్రీతిని రాముఁ జూచి కృత♦కృత్యుఁడ వైతి గుణాఢ్య నీవు వి
ఖ్యాతిగఁ దీర్చి తీకతన ♦ సార్థక మయ్యె మదాశ్రమం బనన్. ౬౨౧

## విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులను మిథిలానగరమునకుఁ దోడ్కొని పోవుట.

ఆ. రాచతపసి వేల్మిఁ ♦ గాచి యాకరణిని, బ్రొద్దుకాలము రాచ♦బొట్టియలును
నిదురగొనిరి రేయి[1] ♦ నిండారు నెలమిని, వేగుఁబోక యైన ♦ వేగ లేచి. ౭౨౨

ఉ. వేకువకర్జముల్ సలిపి ♦ వీరవరుల్ కుశికాత్మజుం దప
శ్శ్రీకలితాన్యమానులను ♦ జేరి నమస్కృతు లాచరించి మా
ధ్వీకరసాభవాక్యముల ♦ వీనులవిందుగ మందలించి ర
య్యా కుశికాత్మసంభవ ద♦యామయభావన యోగపావనా. ౭౨౩

కం. వీరలు మీ కింకరులు న,పారతపోవిభవ యేమి ♦ పనిగల్గిన వే
తీరుప సమర్థు లానతి,మేరగ నెల వి మ్మ దేని ♦ మేకొన వలయున్. ౭౨౪

సీ. అని యిట్లు పలికిన♦యాకుమారకులకు, గాధిపుత్రుఁడుదొట్టి ♦ మేధ గలుగు
తపసు లి ట్లనిరి యో♦దశరథనందన, మైథిలుం డగుజన♦నాథవరుఁడు
పరమధర్మిష్ఠుఁ డై ♦ పరఁగెడి జనకాఖ్య, సవమున కాతండు ♦ దివిరెఁ గాన
నది చూడ మే మంద ♦ ఱరుగువారము నీవు, మాతోడ వచ్చెదే ♦ పూతచరిత

తే. దివ్యకోదండ మొప్పు నం♦ స్తన్యమగుచు,నద్భుతముగొల్పుదానిమ♦హాత్త్వమరయ
మున్ను దేవత లొసఁగిరి ♦ జన్నమునను, దేవరాతసమాఖ్యపృ♦థ్వీధవునకు. ౭౨౫

కం. సురగంధర్వోరగకి,న్నరరక్షోయక్షవరగ♦ణంబులు కైనం
గర మరు దది మోపెట్టఁగ, నరకోటుల నేమి చెప్ప ♦ నాళీకాక్షా. ౭౨౬

కం. అవి లెక్కిడుతమి బహు,భూవరు లరుదెంచి దానిఁ ♦ బూరింపక ల
జ్జావనతాననములతోఁ, బోవుదు రే మనఁగ నాత్మ♦పురముల త్రోవన్. ౭౨౭

కం. రాఘవ కులదీపక నీ,వాఘను సద్వరవరంబు ♦ నచ్చటిదివ్యా
మోఘధనూరత్నంబును, శ్లాఘాపాత్రముగఁ జూడఁ ♦ జనుదువు రమ్మా. ౭౨౮

చం. ప్రథితచరిత్రుఁ డొక్క క్రతు♦రాజము శస్త్రవిధిన్ ఘటించి ము
న్నిథిలవిభుండు వేల్పులకు ♦ మేకొనఁ జేసి నితాంతతృప్తి ని
గ్గథితవిరోధి తత్ఫలము♦మాఱుగఁ గోరె సునాభమున్ మనో
రథముగ దివ్యచాపము సు♦రప్రకరంబులఁ; దచ్ఛరాసమున్. ౭౨౯

ఉ. వార లొసంగి యేగి రది ♦ వర్తిలు నప్పటినుండి తన్నృపా
గారమునందుఁ; బ్రత్యహము ♦ గంధమునన్ సుమధూపదీపసం
భారములన్ శుభాక్షతల ♦ మండితమై కనుఁబూజ లొందు, నం
చాబుధివర్యు లాడఁ దన♦యుంచున రాముఁడు లక్ష్మణుండు రాన్. ౭౩౦

[1] పావనాఁటి రాత్రి.

కం. చనఁ దొడఁగి గాధితనయుఁడు, వనదేవతలార మీకు ♦ వర్తిలు శుభముల్
చనియెద మీసిద్ధాశ్రమ,మును వీడి హిమాచలంబు♦పొంతకు ననుచున్. ౨౩౧

తే. ఆశ్రమమునకు వలగొని ♦ యరుగఁ బూనె, నుత్తరపుదిక్కునకు నంత ♦ నొయ్య మౌని
వరుని వెంటను జనుముని♦వరు లనేక,శకటముల నహ్నులను గొని ♦ చనిరి వేడ్క.

కం. చనియెను ముని వెంటను ద,ద్వనమందలిమృగశకుంత♦తతులుఁ వానిన్
జనుఁడీ మీ నెలవుల కని, చనవున మరలించి కుశిక♦సంభవుఁ డరిగెన్. ౨౩౩

ఉ. దూరము పోయి పోయి యటఁ ♦ దోయజబాంధవుఁ డస్తశైలశృం
గోరుతటంబున న్నిలువ ♦ నొయ్యన మౌనులు శోణనిమ్నగా
తీరమునందు నిల్చి నద♦తీర్థములం దొగిఁ దాన మాడి పం
కేరుహబాంధవుండు సనఁ ♦ గృత్యము లన్నియుఁ దీర్చి యోలి మై[1] ౨౩౪

కం. ముందుగ నిడికొని గాధిజు, నందఱు విలసిల్ల నచట ♦ ననుజునితో నా
నందమున రామచంద్రుఁడు, వందన మొనరించి మౌని♦వరులకు భక్తిన్. ౨౩౫

ఉ. ఎవ్వనిదేశ మియ్యది స♦మృద్ధలతాతరుషండమండితం
బివ్విధ మాలకింపఁగ మ♦హిష్ఠకుతూహల మయ్యె నంచు వా
క్రువ్వఁగ రామచంద్రు రఘు♦కుంజరుఁ గాంచి తపోధనుండు దా
నివ్విధిఁ జెప్పఁగాఁ దొడఁగె ♦ నెల్లమునుల్ విన నున్నదున్నటుల్. ౨౩౬

## విశ్వామిత్రుఁడు తనవంశకథ శ్రీరామునకుఁ జెప్పుట.

కం. కుశుఁడు తపోనిష్ఠ నిరం,కుశుఁడు పితామహునిసుతుఁడు ♦ కుటిలజనాళీ
కశుఁడు హితవిదుఁడు సజ్జన,వశుఁడు మహామహుఁడు మున్ను ♦ వర్తిలె వత్సా. ౨౩౭

కం. నిర్భరసద్గుణమణి వై,దర్భి మహావంశ తనకుఁ ♦ దగు నాలుగఁ ద
ద్గర్భమున నాత్మతుల్యుల, నర్భకులం బడసె సుతుల ♦ నమలినగుణులన్. ౨౩౮

తే. నలువురఁ గుశాంబుఁ డనఁ గుశ♦నాభుఁ డనఁగఁ
బరఁగ నాధూర్తజసుఁడు ♦ వసువు నాఁగ
దీప్తిమంతులు నుత్సాహ♦ధీరతాది
సుగుణలసితులు వా రతి♦శూరు లగుడు. ౨౩౯

కం. క్షత్త్రియధర్మచికీర్షను, బుత్త్రులతో ననియెఁ గుశుఁడు ♦ పుణ్యము పెరుఁగన్
ధాత్రిని బరిపాలించిన,మాత్రన యటు సేయుఁడీ కు♦మారకులారా! ౨౪౦

ఉ. ఆకుశనందనుల్ నలువు ♦ రాఋషివల్కుల నాలకించి సు
శ్లోకులు యోగ్యదేశముల♦చొప్పులు గన్గొని యందు నిల్చి న్యా
యైకవిశుద్ధు లై జనము ♦ లాఱడి పోవక యుండ నాదట
న్వీకున నేలు చుండి రప♦నీధవు లై జనలోకపూజ్యులై. ౨౪౧

---

[1] వ.రాత్రి.

సీ. కడిమిఁ గుశాంబుండు ♦ కౌశాంబినగరంబు, నతనితమ్ముఁడు మహో ♦ దయము మఱియు
నాధూర్తరజసుండు ♦ నతులధర్మారణ్య, మనుపత్తనవరంబు ♦ ననఘవసువు
ఘనగిరివ్రజమును ♦ గావించికొని రయ్య, తమకు యోగ్యంబు లౌ ♦ స్థానములుగ
వారిలో వసుధరా ♦ వల్లభుఁ డయ్యెడఁ, బ్రజలఁ బాలించెను ♦ బ్రథితరీతి
తే. నీమహాధారిణీధ్రంబు ♦ లేను దీనిఁ, జుట్టుకొని తేజరిల్లు ని ♦ చ్చోటఁ బాఱు
మంజుతరశోణనద మది ♦ మగధఁ బుట్టి, హారరుచిఁ దాల్చు నీయహా ♦ ర్యములనడుమ.
కం. పాఱును బడమటిమొగ మీ, యే ఱీపెన్నీటఁ బండు ♦ నెపు డారబముల్[1]
కాఱుకొని కారుకారున; మీఱెను వసుకృతిని నిది స ♦ మృద్ధిని వృద్ధిన్. ౨౮౩
ఉ. రూపసి నుంచహాసశశి ♦ రోచి ఘృతాచిని బెండ్లియాడి యిం
ద్రోపమవైభవుండు నృకు ♦ లోత్తముఁ డాకుశనాభుఁ డంతట
న్రూపవిలాసధన్యలను ♦ నూర్వురఁ గన్యల లోకమాన్యల
న్దీపితకాంతియుక్తల న ♦ నిందితరక్తలఁ గాంచె వారలున్. ౨౮౪

కుశనాభుపుత్రికల వృత్తాంతము.

సీ. *పూచినతంగేడు ♦ పోలుపున మేనులు, పసిమిహారంగుల ♦ వసల నీన
విరిసినమల్లెల ♦ విధ మయి హాస మ్మనఁ, బోవుదువ్వలువల ♦ గీవి దనర
విచ్చుపశోకంబు ♦ నుచ్చున భూషల, కెంపులతళతళ ♦ లింపు గూర్ప
గాలికిఁ గంపించు ♦ కందర్పు కేతనం, బనఁగఁ బయ్యెఁట లసి ♦ యాడు చుండ
తే. నిండుఁబ్రాయంపుఁబగటున ♦ గండు మీఱి, దండు వెడలినమరు తేజి ♦ కాండమనఁగ
దండియొయ్యారములను వే ♦ తెంచ యూన, లొండు దినమున నుద్యాన ♦ మండలమున
ఉ. చేతుల వీణె లూని తమి ♦ చేఁతలఁ జేతము లుల్లసిల్ల వ
గ్లాతటిదుత్కరంబు లనఁ ♦ జారుశరీరము లొప్పఁ జూపఁ గే
ళీతదధీనచిత్తలయి ♦ లీలల బాళిని బాడుచు న్వనీ
జ్యాతిల మందు వెల్గిరి ఘ ♦ నాంతరతారలచంద మొందఁగన్. ౨౮౬
కం. అసమానరూపయౌవన, లసమానలఁ గలితమఃశిక ♦ లాపలఁ గని పె
న్విసుమానమ్ముగ మదనవి, కసమానస్వాంతుఁ డయి జ ♦ గత్ప్రాణుఁ డనున్. ౨౮౭
కం. కోరెద మి మ్మెల్లర నా, దారలుగా నట్టు లైనఁ ♦ దడయక నరతా
దూరతఁ గని దీర్ఘాయు, స్స్త్రీరహి మీఱెదరు నుందు ♦ చేడియలారా. ౨౮౮
ఉ. అంగనలార! మిమ్ముఁ గని ♦ నంతటినుండి యనంగవేదనా
భంగిము నొందఁ జొచ్చితి న ♦ భంగురమోహమున, న్భవత్పరి
ష్వంగసుఖం బొసంగరె ర ♦ పంబున, మీకు సురత్వ మబ్బు; మ,
ర్త్యాంగనలందుఁ జంచలము ♦ యౌవన మాటను మీ రెఱుంగరే. ౨౮౯

---

[1] ఆరబములు — పైరులు.

కం. అంగుగ నాసంగతిని నె,సంగ సమర్థత్వ మబ్బుఁ ♦ జయ్యన నసఁ జ
క్రాంగగమన లని రా,సా,రంగతురంగునకు సాప♦హాసవచనముల్. ౨౫౦

ఉ. రాణను భూతరక్షణప♦రాయణతన్ సడిసన్న నిన్ జగ
త్ప్రాణ! యెఱుంగ కుందుమె, చ♦రాచరకోటులయంతరాత్మ వై
పోణిమి నుందు, విట్టి నిను♦బోఁటులకుం బరిపాటి దప్పి భీ
త్రైణవిలోచనామణుల ♦ నర్హమె యి ట్లవమానపెట్టఁగన్? ౨౫౧

ఉ. ఓపవమాన! ని న్నిచట ♦ నుండఁగనీక తొలంగఁ జేయఁగా
నోపుదు, మైన ని న్గడప ♦ నొల్లము వమ్ముగ మాతపమ్ము పో
నోపము గాన, నీ వెఱుఁగ♦వో యెపు డీకుశనాభుకూఁతులం,
బాపము! నీ కెఱుంగఁ దర♦మా మరుఁ డక్షుల దుమ్ముఁ గొట్టఁగన్. ౨౫౨

ఉ. దుష్టవిచార! ని న్నిపుడ ♦ త్రుంపక యుండెడిఁగాక తండ్రి, యా
శిష్టునిఁ జుల్కఁ జూడకుము, ♦ చెప్పెద మాతఁడ తేఁడు వేల్పుఁ, దా
నిష్టము వూని యేఘనున ♦ కిచ్చునొ యాతఁడె మాకు భర్త, యీ
కష్టపువాక్యముల్ పలుకఁ♦గాఁ గన కూరక పొమ్ము మారుతా. ౨౫3

కం. కంజాయతాక్షు లీగతిఁ, గొంజక భాషింప మిగుల♦కోపంబున నా
కుంజరయానల మేనులు, భంజించెను లోనఁ జొచ్చి ♦ పవనుఁ డదయుఁడై. ౨౫౪

కం. కఱకుటొడల్ వంకనడల్, కుఱుచతొడల్ గలిగి మిగుల ♦ గోడుం గొనుచున్
మఱుగుజ్జు లగుచుఁ గడువడిఁ, బఱతెంచిరి తెఱవ లాత్మ♦భవనంబులకున్. ౨౫౫

ఉ. ఇట్టుల యింటి కేగి, మది ♦ హెచ్చినసిబ్బితి సోలి వ్రాల, లేఁ
బట్టులఁ జూచి తండ్రి మదిఁ ♦ బ్రబ్బిన నిబ్బర మేది చింత లోఁ
దొట్టఁగ సంభ్రమంబునను ♦ దోయరుహాయతనేత్రలార! యే
కట్టిఁడి మీకు నిట్టియప♦కార మొనర్చెను ధర్మదూరుఁ డై? ౨౫౬

ఉ. కన్నుల నీరుగాఱ నెస♦కంబుగ రిత్తధరిత్రిఁ బొగ్గు చా
పన్నదశావశాత్మ లయి ♦ పల్కక యుండెద రేల? యెవ్వఁ డా
పన్నవినాశుఁ డాడుఁడు వ♦శా[1]గమనామణులార! యంచుఁ ద
త్ఖిన్నతకుం గతంబు విని ♦ దివ్యమహామహిముండు వేచినన్. ౨౫౭

కం. వారెల్ల వారిపూరము, ధారాళముగాఁగఁ గన్నుఁ♦దమ్ముల రాలన్
సారసభవనిభుపదములఁ, జేరిచి మస్తకము లిట్లు ♦ చెప్పిరి వగచేన్.[2] ౨౫౮

కుశనాభునుతలు తమ్ముఁ బవమానుఁ డవమానించుట దండ్రికిఁ దెల్పుట.

శా. తండ్రీ! యే మని చెప్పువార మకటా ♦ దర్పించి మోహాంధుఁ డై
మండ్రాటం బొదవించె గా డ్పుశుభ మా♦మార్గంబునం జొచ్చి, సన్

[1]వశా = ఆఁడేనుఁగు   [2]ఈ ప్రదేశమునకే కన్యాకుబ్జమని పేరు. ఇప్పుడిది కనోజ్ అందురు.

గొంద్రా వల్లభుఁగాఁగ నంచుఁ బలుకం ♦ గోరంగదే నీవు మా
తండ్రిం; దండ్రి యొసంగ నట్లగుత స్వా♦తంత్ర్యంబు మాకున్న దే. ౭౫౯

కం.జనకుఁడు మాపరమార్థము, కనుఁగొనవా తండ్రిచాటు♦కన్నెలు గామా?
యనకు మధర్మపురుడి మముఁ, గనలింపకు నీకు శుభము ♦ గావుత మనుచున్. ౭౬౦

కం.అబ్జనిభ యిటు పల్కఁన, నబ్జాక్షుల మనక పాపి ♦ యవమానించెన్
గుబ్జలుగా నొనరిచి యను, న్యబ్జలుగా నున్నవారి ♦ నుత్తమసుతలన్. ౭౬౧

ఉ. నమితవిరోధి యైనకుశ♦నాథుఁడు గన్గొని బిడ్డలార! మీ
క్షమ స్తవనీయ మా; ఘనుల♦చందము నిట్టిద కాదె, నాదునం
శమునకు యుక్త మైనకృతి ♦ సల్పితి రిందఱు నొక్కమాటగా;
క్షమయ కదా సుభూషణము ♦ కాంతలకే న్నగవారి కేనియున్. ౭౬౨

ఉ. సైరణ వాని యం దది య♦సాధ్యపుఁగార్యము, దానిలో నభ
శ్చారుల గూపదర్పితుల ♦ సైఁచుట యంతకు నుత్తమంబు, ని
ష్కారణకారణాకరునిఁ ♦ గాచుట యం దసమానరూప మా
నోరుపు నిందఱుం గొనితి, ♦ రుత్తమ మింతకు నొండు కల్గు నే. ౭౬3

తే. క్షమయె దానంబు జన్నంబు ♦ క్షమయ చుండు
క్షమయె సత్యంబు సత్కీర్తి ♦ క్షమయ కాదె
క్షమయె సద్ధర్మ మటుగానఁ ♦ గన్యలార!
క్షమను నెలకొని యుండెడి ♦ జగము లెల్ల. ౭౬౪

సీ. అని యిట్లు తనముద్దుఁ♦దనయల నూరార్చి, కుశనాథుఁ డంతటఁ ♦ గొలువు దీరి
కాలదేశంబులఁ ♦ బోల నాలోచించి, తగు వరులకు నీయఁ ♦ దనదుసుతల
విశ్వాసపాత్రులై ♦ వెలయుమహామాత్ర,జనులతో యోజన ♦ సలుపు చుండె
నిష్పిహిఁ గుశనాభుఁ♦డిల యేల నూర్ధ్వరే, తనుఁడు చూళి యనంగఁ♦దాపసుండు

తే. తపము సేయంగనచట గం♦ధర్వతరుణి, యూర్మిళామహిళాసుత ♦ యూర్మి మీఱ
సోమద యనంగ నొక్కర్తు ♦ సుదతి యతని,యొద్ద శుశ్రూషగావించు♦చుండెభక్తి.

బ్రహ్మదత్తు చరిత్రము.

ఆ. కొన్నివత్సరములు ♦ చన్న నీరీతిగ, దానిభక్తి కిచ్చఁ ♦ దపసి మెచ్చి
సుందరాంగి! నీదు♦శుశ్రూషకును మెచ్చి,వచ్చె నేమిప్రియము ♦ వలయు ననిన.

కం.నరినన్యానియతిక[1] ముని, పరితుష్టుం డగు టెఱింగి ♦ భాగ్యం బనుచున్
బరమప్రీతిని మధురాధర మధురాలాపకుశల ♦ తపసిం బలికెన్. ౭౬౫

కం.చూళీ దివ్యతపోధన, మాళీ యసమప్రతాప♦మర్దిత హేళీ
కేళీకృతతనువిధి నా, బాళి న్నీ వడుగ నాదు♦భాగ్యమ కాదే. ౭౬౬

[1] వరివస్యానియతి = శుశ్రూష.

కం. బ్రాహ్మణపుంగవుఁడవు స, ద్బ్రహ్మజ్ఞానైకనిధివి ♦ బ్రహ్మోత్తముఁడ వో
బ్రహ్మనిభ! నాకు నిమ్మా, బ్రహ్మతపోయుక్తుఁ బుత్త్రుఁ ♦ బరమపవిత్త్రున్. ౨౧౯

కం. నా కెవ్వఁ డింటియాతఁడు, లేకుండుట నీక తెలియు ♦ లేదు వివాహం
బోకరుణాకర! యీశర, ణాకలితర్ సనుతఁ జేయ ♦ నగు నీమహిమన్. ౨౨౦

కం. అన్నులఁతుకపలుకులకుఁ బ్ర, సన్నుండై చూళి తనదు♦సంకల్పభవున్
సన్నుతశీలునిఁ బుత్త్రుఁగ, నన్నారీమణికి నిచ్చి ♦ యనిపెం బ్రీతిన్. ౨౨౧

తే. బ్రహ్మదత్తుండు సోమదా♦రమణిపుత్త్రుఁ, డతఁడు రాజయి కాంపిల్య♦యనుపురంబు
నింద్రుఁ డమరావతిని బోలె ♦ నేలుచుండె, లలితసత్కీర్తి దిక్కుల ♦ నలముచుండ.

చం. నయముగ బ్రహ్మదత్తుఁ గుశ♦నాభుఁడు వే పిలిపించి కూర్మి స్వా
శయము నెఱుంగఁ జెప్పి తను♦జాతల నూర్వురఁ బెండ్లిచేయ వి
స్మయముగ సంఘటుం గనఁగఁ ♦ జానలకే లతఁ డంటఁ దత్సతీ
చయవికృతాకృతుల్ దొలఁగి ♦ సారమనోహరకాంతిసంపదన్. ౨౨౩

చం. వెలయఁ దనూజలం గనుచు ♦ విస్మయహర్షపరీతచిత్తుఁడై
నలువుగ వారి నెల్లఁ గుశ♦నాభుఁడు నాథునితోడఁ బంచె, నా
చెలువలఁ బుత్త్రకానుగుణ♦శీలల సోమద చూచి మేనఁ గ్రొం
బులకలు మొల్క లెత్త మెయి ♦ ముట్టుచు మెచ్చెను వారిఁ దండ్రినిన్. ౨౨౪

ఉ. ఆవిధి బ్రహ్మదత్తుఁడు ని♦జాత్మభవాశతముల్ వివాహమై
పోవఁగఁ దోడుకొంచుఁ దన♦పూర్వణికిం, గుశనాభుఁ డంతటన్
దా విగతాత్మజుం డగుటఁ ♦ దత్పరుఁడై సుతలబ్ధి కిష్టినిం
బావనరీతిఁ జేయఁగను ♦ బ్రహ్మసుతుండు కుశుండు పుత్త్రునిన్. ౨౨౫

చం. కనుఁగొని పుత్త్ర! నిన్ననయుఁ♦గాఁ గలపుత్త్రుఁడు పుట్టు ధార్మికుం
డనఘుఁడు గాధి, శాశ్వతయ♦శోంచితుఁ జేయు నతండు ధాత్రి ని
న్ననుచును బ్రహ్మలోకమున ♦ కాతఁడు పోవఁగఁ గొంతకాలము
న్జన జనియించె గాధి సుజ♦నస్తవనీయుఁడు ధర్మనిష్ఠుఁడై. ౨౨౬

కం. ఆగాధియ నాజనకుం, డోగుణభూషణ కుశాన్వ♦యోద్భవుఁడను నీ
లా గగుటను గాశికుఁ డని, నే గణనీయుండ నైతి ♦ నిఖిలజగములన్. ౨౨౭

కం. నాయప్ప సత్యవతినిన్, జాయఁగను ఋచీకునకు నొ♦సంగిన సతి దా
నీయొడలితోడ దివముం, దాయం జనె నిజసుశీల♦తామహిమమునన్. ౨౨౮

ఉ. అంతియ కాక యయ్యువ మ♦హాపగ కౌశికి నాఁగ దివ్యమై
కాంతము నై చెలంగుచు జ♦గద్ధితవాంఛను సర్వదేవతా

క్రాంతము శీతశైలశిఖ♦రంబును దిగ్గ దినంబునుండి, య
త్యంతము నప్పు నెయ్యమున ♦ నచ్చట నే సుఖినై వసించెదన్. ౨౭౯

కం. ఆసత్యవతీసతియును, భాసురసత్యైకధర్మ♦పథచారిణియై
తా సత్యవతీఖ్యాతిని, భాసిలు నానదికి సాటి ♦ పలుకం గలదే. ౨౮౦

కం. రామా! యాగార్థంబై, శ్రీమంతముఁ జేరి నిలిచి ♦ సిద్ధాశ్రమస
ద్భూమిని సిద్ధుఁడనైతిని, నీమహనీయప్రసాద♦నిస్తులశక్తిన్. ౨౮౧

కం. నీ వడిగినకారణమున, నావంశముచరితరీతి ♦ నాజననవిధం
బీవిషయాఖ్యానంబును, బావనగుణశీల! యెఱుఁగఁ ♦ బలికితి నీకున్. ౨౮౨

ఉ. అర్ధను రేయి డాసెడిని ♦ సజ్జహితాన్వయ నేఁ గథావళుల్ .
పద్దుగఁ జెప్పుచుండుటను ♦ భద్రము నీ కగుఁగాక రాఘవా
నిద్దుర వొమ్ము లెస్స యిఁక ♦ నిద్దురలే కడు గెట్లు సాగెడిన్
బ్రొద్దున లేచి త్రోవ చనఁ ♦ బూనినచో వ్యథ దోఁప కుండునే. ౨౮౩

## [1]రాత్రి వర్ణనము.

శా. ఆ కల్లాడుట మాని వృక్షములయం ♦ దత్యంతనిద్రాళులై
జోకం గూర్కొనె నా మృగాండజము, ల♦స్తోకాంధకారంబు న
వ్యాకీర్ణంబయి ముంచె దిక్కులను, సం♦ధ్యం బాసె నల్లల్ల రే,
యాకాశం బుడుపంక్తితో విమలనే♦త్రాప్తిం బలెన్ భాసిలెన్. ౨౮౪

కం. చల్లనితనకిరణంబుల, బల్లిదపుంజీఁకువాలు ♦ పలుపఱియలుగా
నల్లదె యుదయించెను జా,బిల్లి జగం బెల్ల ముదము♦పెంపునఁ గ్రాలన్. ౨౮౫

కం. చీఁకటి వెలువని గూబల,మూఁకలు మొదలైన క్రూర♦ము లగుమెగంబుల్
దేఁకువ రక్షస్సంఘము, సోఁకుగమి చరించె నెల్ల♦చోటులఁ గలయన్. ౨౮౬

చం. అని ముని యూరకున్న మును ♦ ంపఱు నాతనిఁ గాంచి మేలు మే
లని వినుతించి మీ యమలి♦నాన్వయ మెంతయు సుప్రసిద్ధ మ
త్యనఘము ధర్మశీలము త్వ♦దన్వయజాతులు బ్రహ్మతుల్యులున్
మనుజవరేణ్యులున్ నిరుప♦మానులు దివ్యమహానుభావులున్. ౨౮౭

ఉ. వారలలో సుపర్వతతి ♦ వారిజగర్భుఁడ వోలె నీవు దు
ర్వారమహానుభావుఁడవు ♦ రాజితకీర్తివి గాధిపుత్ర! మీ
సారతరాన్వయంబును బ్ర♦శస్తముఁ జేసె నదీమతల్లి నీ
గారవుఁదోఁడఁబుట్టు మనుచుం ♦ గౌతుకమారఁగఁ బల్కె నంతటన్. ౨౮౮

కం. అస్తగతుం డగుసూర్యుని,సిస్తున ముని నిదుర వోవ ♦ శ్రీరాముఁడు సం
శస్తగుణున్ మునిఁ దలచి తృ,ణాస్తరమున నిదుర వోయె♦ననుజాతునితోన్. ౨౮౯

[1] ౧౧ వ రాత్రి.

ఉ. తక్కటిరేయి యంతయు య♦థానుఖవృత్తి మునీంద్రకోటితో
మక్కవ శోణకూలమున ♦ మానిమృగేంద్రుఁడు నిద్ర వోయి తె
ల్లక్కఁగఁ దూర్పు లేచి కృత♦కృత్యవిధుం డయి కౌసలేయునిన్
మిక్కిలి గారవ మారఁ గని ♦ మేల్కొలిపెన్ మృదుభవ్యసూక్తులన్. ౨౮౧

కం. తెలతెలవాఱెఁగఁ జొచ్చెను, దొలిసంజయు డాసె లెమ్ము ♦ తోయజనేత్రా
కలదుగదా పయనము మీ, కెలమిన్ శుభ మగుత మని బు♦షీశ్వరుఁడాడన్.[1]

ఉ. ఆనుడి నిద్ర మేలుకొని ♦ యంబురుహాక్షుఁడు కల్యవిధ్యను
ష్ఠానము లెల్లఁ దీర్చికొని ♦ చయ్యనఁ దాఁ బయనంబు సేయఁగాఁ
బూని మునీశ్వరుం గని త♦పోధన శోణము శుభ్రనీర మై
మానితసైకతావళుల ♦ మంజుల మై యలరారె గాధ మై. ౨౮౨

కం. ఏ రేవునఁ దరియింపం, దీ రగు నీనదిని నా ము♦నిప్రవరేణ్యల్
కోరి చనెద రే తెరువున, దారి యదియ మన కటంచుఁ ♦ దలఁతుఁ గుమారా. ౨౮౩

చం. అనిన మహర్షు లంత భృశ♦హర్షమునన్ వనజాలవీథులం
జనుచును వేక్క మీాఱెఁ దమ♦చాయలు దా రటు త్రొక్కు వేళకున్
మునిజనసేవ్యమాన మయి ♦ పుణ్యతరోదక మై మరాళకో
కనికర మైనజాహ్నవిని ♦ శ్లాఘవనందనయుక్తి డాయుచున్. ౨౮౪

కం. ఆవిబుధనిమ్నగాతీ,రావని వసియించి యుచిత ♦ మగునెలవులఁ దా
రా వెనుకఁ దర్పణాదులఁ, గావించి భుజించి యమృత♦కల్పహవిస్సున్. ౨౮౫

## ⟶ శ్రీరాములు గంగానదీవృత్తాంతము విశ్వామిత్రు నడుగుట. ⟵

చం. వరవిబుధాపగావిమల♦వారితటిన్ సికతోరువేదికో
పరి యుపవిష్టు లై నడుమ ♦ భాసిలు చామునినేత యొప్పఁగాఁ
బరమముదంబునన్ సుగుణ♦భద్రుఁడు రాముఁడు మానిఁ గాంచి ని
ర్జరనది మూఁడుత్రోవలుగ ♦ సాగరుఁ జేరుట కేమి హేతువో. ౨౮౬

ఆ. అనుచు వేఁడ గాధి♦తనయుండు దశరథు,ముద్దుఁబట్టిఁ జూచి ♦ మోదమునను
బలుకఁ దొడఁగె గంగ♦ప్రభవంబు నద్దాని,యభ్యుదయము నచటి ♦ సభ్యు లలర.

కం. కలదు గదా ప్రాలేయా,చలము వివిధరత్నకూట♦చయచుంబినభోం
చలము బహుధాతువర్గో,జ్జ్వల మతిశయశీతవాత♦చలనాతులమై. ౨౮౭

కం ఆతండును హేమాచల,జాత మనోరమను మేన ♦ జాయఁగఁ గొని వి
ఖ్యాతయశస్స్ఫీతలఁ దను,జాతల నిరువురను గాంచె♦సంపన్నుతలన్. ౨౮౮

[1] ౧౨-వ నాఁటి యునయము.

ఉ. వారలలోనఁ బెద్ద యయి ♦ వర్తిలు గంగ, ద్వితీయ యాయుమా
వారిజనేత్ర, వా రెలమి ♦ వర్ధిలు చుండఁగ దేవతార్థమై
కోరి సురావళుల్ శిశిర♦గోత్రముఁ జేరి మహాత్మ! గంగ ము
ద్దారిని బాలఁ జేయు మని ♦ తద్దయు వేఁడఁగ శైలనాథుఁడున్. ౮౦౦

చం. అడిగినవారి యాసలను ♦ నాఱడిపుచ్చఁగ రా దటన్న యూ
నుడి మది నిల్పి యగ్రసుత ♦ నూల్కొని పుణ్యఁ ద్రిలోకపావనిన్
గడిమి యథేష్టగామిని జ♦గద్ధితముం ఘటియించు పొంటె న
ప్పుడ యొసఁగెన్ గ్రహించి తమ♦భూముల కేగిరి వారు ధన్యులై. ౮౦౧

ఉ. రెండవకూఁతు రైనయుమ ♦ వ్రీలనియుగ్రతపంబు మై జగ
త్కాండము లెల్ల మ్రొక్కఁగను ♦ గ్రాలిన నప్రతిరూప శైలకో
దండున కిచ్చె భార్యగను, ♦ దాశరథీ! యిటు లోకపూజ్య లై
కొండలఱేనియయ్యనుఁగుఁ♦గూఁతులు భాసిలి రిద్ధకీర్తులై. ౮౦౨

కం. గతిమద్వర! తొలుదొల్తను, క్షితిధరవరతనయ గంగ ♦ కెరలుచును నభో
గత యైనవిధం బంతయు, నుతచరితా! నీకుఁ దెలియ ♦ నొడివితిఁ జుమ్మా ౮౦౩

కం. ఈపర్వతవిభుసుత యే, పాపాపహ యగుచు సురక♦వాహిని యై దే
వాపగ యై నాకంబును, బ్రాపించెను నాయనా! సు♦రప్రార్థిత యై. ౮౦౪

## గంగ త్రిపథగ యైనవృత్తాంతము శ్రీరామునకు విశ్వామిత్రుఁడు దెల్పుట.

చం. అన విని రామలక్ష్మణులు ♦ హర్ష సముత్సుకు లై మహాత్మ యీ
యనఘచరిత్ర దేవమను♦జాననిజాతము నెంతయు న్విసర్
గొనియెద మాన, మంచుమల♦కూఁతు రదేటికి మూఁడుత్రోవలన్
గొనె! నది యెట్లు కీర్తి గనె ♦ గొప్పగు నేఱుల మేలుబంతి యై? ౮౦౫

కం. అని రాకొమరులు వేఁడినఁ, గని వారలు మౌనిమధ్య♦గతగాధేయుం
డనియెను వినుఁడీ వినిచెద, ననఘాత్మకులార! గంగ♦యానచ్చరితన్. ౮౦౬

ఉ. పూర్వము రామచంద్ర! నెల♦పూతలదాలుపు వేల్పు పెండ్లియై
పార్వతి నిండుహర్షమున ♦ భావజకేళి కుపక్రమింప సా
సర్వశతాబ్దముల్ గడచెఁ, ♦ బట్టి యొకండును బుట్టఁ డయ్యె, లో
పర్విన భీతి గుంపు లయి ♦ బ్రహ్మయు లోనగు బాసవార్గముల్.[1] ౮౦౭

కం. వలిగుబ్బలిసుతకడుపునఁ, గలిగినచో భూత మొకఁడు ♦ గలఁడే యెవఁడేన్
బలిమిని నోర్వనటంచును, గలఁకను శితికంఠు డాసి ♦ కలితాంజలులై. ౮౦౮

తే. దేవదేవ మహాదేవ ♦ త్రిభువనైక, హితకరాత్మక దండంబు ♦ కృత్తివాస
కనికరింపుము మా మ్రొక్కు♦లను గ్రహించి, జగములోపవు నీదు తే♦జంబు మోవ.

---

[1] బాసవార్గముల్ = దేవతాసమూహములు.

ఉ. దేవియు నీవు వేదహిత♦తీవ్రతపశ్చరణైక శీలతన్
భావజవైరి క్రాలుఁడు, ప్ర♦భాభరితం బగునీదు తేజమున్
నీవ ధరింపుమీ, జగము ♦ నిశ్చలహర్షమునం జెలంగఁగాఁ
గావుము దేవ, లోకము ల♦కాండలయంబునఁ గూల్పఁబోకుమీ. ౮౧౦

చం. అని కొనియాడువేలుపుల ♦ నాదటఁ దాఁ దిలకించి శంకరుం
డనియె సుపర్వులార! యటు ♦ లౌత, ధరింతుము మేము వీర్యమున్,
జనములు నిర్జరుల్ ససుఖ♦సంపద వర్తిలు చుండ్రుగాక, యే
యనఘుఁడు మోచుఁ జెప్పుఁడు మ♦హత్తరతేజము జాఱి నంతటన్. ౮౧౧

ఉ. గారవ మార నిట్లు కలు♦కంఠుఁడు పల్కిన దేవతాళి యీ
ధారిణి నీదు తేజు చలి♦తం బయినన్ ధరియించు నా భవా
నీరమణుండు పోవిడున ♦ నిండె సకాననపర్వతంబుగా
ధారణి యీశు తేజమున ♦ దానికి బెగ్గిలి దేవసంఘముల్. ౮౧౨

చం. హుతవహుఁ జూచి యి ట్లనియె ♦ నోపుదు వీవ మహోగ్ర పూనఁగాఁ
గ్రతుహరు తేజు నెయ్యుఁ డగు♦గాడ్పును గూడి య టన్న వల్లె యం
చతఁ డది చొచ్చె దాన నది ♦ యామ సితాచలరీతి లోకస
మ్మతదిననాథపావక స♦మగ్రవిభావిభవాభిరామ మై. ౮౧౩

తే. శరవణం బయ్యె సద్దాన ♦ జనన మంది, యనలసుతుఁ డయ్యెఁ గార్తికే♦యప్రభుండు
దానిఁగని వేల్పులెల్ల ని♦తాంతముదిత,హృదయులై పూజ సలిపిరి ♦ యీశుగారి.

→ పార్వతీదేవి దేవతల శపించుట. ←

తే. పడఁకుగుబ్బలిగారాబుఁ♦బట్టి యంతఁ, గంటుగొని కింక నా తెలి♦గంటిగముల
గెంటసము లాడెనో వేల్పుఁ♦దుంటలార,యనుభవింపుఁడుమీ చేఁయు ♦నఘఫలంబు.

చం. అని కనుఁగోనలందుఁ గన ♦ లంతకు నంతకు మీఱ వారలం
గని తనదోయిటన్ జలముఁ ♦ గైకొని మత్తనయాభిలాష వి
ఘ్ననిహతి నొందఁ జేసితిరి ♦ గావున నోసురలార! మీకు మీ
వనితలు బిడ్డలం గనరు, ♦ వార లిఁకన్ మనువారు గొడ్డులై. ౮౧౬

చం. అని శపియించి భూమిఁ గని ♦ యాఁకర[1] మాఁపక యోసి పాంసులా!
మనుమ యనేకభార్య వయి ♦ మానక నైక విధస్వరూప వై
తనయుఁడు నాకుఁ గల్గుటకుఁ ♦ దాలిమి నోరువ వైతి గాన నీ
కును లభియింప కుండెడిని ♦ గూరిమి పుత్రులఁ గాంచు మోదముల్. ౮౧౭

చం. అని గిరిరాజనందన య♦హంకృతిరోషపరీత యై శపిం
చినఁ బెనుసిబ్బితిం దలలు ♦ జేజెలు వాంచిన వారిదుఃఖమున్

---

[1] ఆఁకరము = ఆగ్రహము.

గనుఁగొనలేక శంకరుఁడు ♦ గొంటిని గూడి ప్రతీచి కేగి ని
ష్ఠను దప ముండె భూరిహిమ♦శైలవరోత్తరశృంగసీమపై. ౮౧౮
కం. ఎఱిఁగించితిఁ గఱకంఠుని, తెఱనచరిత్రంబు నెల్లఁ ♦ దెలియఁగ మీకున్
దెఱఁ గొప్పఁగ గంగ తెఱం, గెఱిఁగించెద వినుఁడు తమ్ముఁ ♦ డీవును వేడ్కన్. ౮౧౯

### కుమారస్వామి జననచరిత్రము.

ఉ. తొల్లి పినాకపాణి యతి♦దుర్భరఘోరతపం బొనర్పఁగా
నెల్లఋషీశ్వరుల్ దివిజు ♦ లేగి పితామహుఁ గాంచి భారతీ
వల్లభ! మాకు నొక్కదళ♦వాయి నొసంగితి వాశివుండు దాఁ
జల్లనిగుంటిపైఁ దపముఁ ♦ జల్పఁగఁ జొచ్చె నుమాసమేతుఁడై. ౮౨౦
ఉ. ఆవల నేమి చేయఁదగు ♦ నయ్య జగంబుల మేలుకోరి వా
ణీవర! మాకు నేడుగడ ♦ నీవ కదయ్య, యథోచితంబు సం
భావన సేయవయ్య, యని ♦ ప్రార్థన చేయఁగ వారిఁ జూచి ప్రా
హ్మావిభుఁ డూఱడించుచును ♦ మేలగు తేనియ లొల్కుపల్కులన్. ౮౨౧
చం. వలిమలపట్టిశాపవిధి ♦ వాస్తవ మయ్యది తప్ప దెప్పుడున్
గలుగదు మీకు సంతు నిజ♦కాంతలయం దది యుండ నిండు, వే
ల్పులమొగ[1] మొక్కనిం దనయుఁ ♦ బుట్టఁగఁ జేయును గంగయందు, న
య్యలఘుపరాక్రముండు పృత♦నాధిపుఁడై మిముఁ గాచుచుండెడిన్. ౮౨౨
ఉ. గంగయు గారవించుఁ దన♦గాదిలిపుత్త్రుఁడు గాఁగ నాతనిన్,
రంగుగ సన్నుతించు గిరి♦రాజకుమారియు, సందియంబు నా
స్తం గన కుండుఁ డంచన వి♦ధాతను సంస్తుతిఁ దన్పి దేవతల్
చంగున వెండికొండకును ♦ జాగి కృశానునిఁ జూచి ప్రీతులై. ౮౨౩
కం. విశ్వావనలోలాత్మక, వైశ్వానర పడయఁ దివురు ♦ వరబలు సుతునిన్
విశ్వజనీనం బిది నీ, యీశ్వర తేజంబు విడువు♦మీ సురతటినిన్. ౮౨౪
మ. అని ప్రార్థించినఁ బావకుండు సితశై♦లాధ్యక్షుజన్ డాయఁగాఁ
జన నాగంగయు సమ్మతించి సతి యై ♦ సౌందర్యసంపత్తిమైఁ
జను దేరన్ సకలాంగకంబులను దే♦జగ్గపాతముం జేయ స్వ
ర్ధునిపూరంబు సమస్తముం బరఁగె నెం♦తో తేజునన్; గంగయున్. ౮౨౫
ఉ. దుస్సహ మయ్యె నోప నిఁక ♦ దుర్భర మాభవదీయ తేజమున్
ద్రెస్సెడి నంగకంబు లివె ♦ దీనతఁ, జెందితి దగ్ధ నైతి నం
చుస్సురు మంచు నున్నఁగని ♦ నొయ్యనఁ గొమ్ములవేల్పు[1] భగ్నరం
హస్సురవాహినిం గని న♦యంబునఁ బల్కెను గార్యవేది యై. ౮౨౬

---

[1] వేల్పులమొగము - కొమ్ములవేల్పు = అగ్ని.

క౦. హైమగిరిపాదతలమున, హైమవతీ! విడవు గర్భ ♦ మన నాసతియున్
బ్రేమంబున నటు చేయఁగ, హేమము రజతంబు నయ్యె ♦ నిల యచ్చోటన్ ౨౭

ఉ. తక్కటితీవ్రభాగములు ♦ తామ్రము నల్లనియిన్ము నయ్యె, మ
స్తెక్కడ సీసముం దగర ♦ మేర్పడె నక్కడ, నద్ది పాఱునా
యిక్కలఁ బెక్కుధాతువులు ♦ వృద్ధిగనెన్, మఱి గర్భ మేయెడ
న్జక్కఁగ నిల్పె నాశరవ♦ణంబు[1] సశైలము మించె హైమమై. ౨౮

తే. అచటినృక్షలతాగుల్మ♦యనసములును, హాటకం బయ్యె నదిమొద ♦ లగ్నితుల్య
కాంతిసంపద వహియించి ♦ కనక మనఘ, జాతరూపసమాఖ్యఁ బ్ర♦శస్తిఁ గాంచె.

## శ్రీకుమారస్వామిజననము.

సీ. అందు జనించిన♦నందనుఁ గనుఁగొని, బృందారకులును బృం♦దారకుండు
నందించి స్తన్య మీయ♦యుం దగఁ బిలిపించి, నంచఁ గృత్తికా♦సుందరులను
డెందంబులను బొంగి ♦ నందనుఁగా మాకు, నొందింతురే నీయ♦కొందు మనిన
సందేహమేల యీ♦కందు జగంబుల,యం దెల్లఁ గృత్తికా♦నందనుఁ డనఁ

తే. గార్తికేయుఁ డనంగను ♦ గాంచుఁ గీర్తి, ననిన వారలు హర్షించి ♦ యక్కుమారు
బోరుకాడించి[2] చన్నిచ్చి♦పాలఁతు రెల్లఁ, బుత్రుఁడంచునుభావించి♦పోలుపుగనిరి.

క౦. గర్భపరిస్రవమున బ్రా♦దుర్భావము నొందెఁ గానఁ ♦ దోరంబుగ నీ
యర్భకునకు స్కందుఁడనన్, స్వర్భూభుజనములు పేరు♦ చను నని రమరుల్. ౩౦

క౦. జాఱఁగఁ జన్నుల దుగ్ధము, లాఱుగురుం గృత్తికలును ♦ నటు గదిసినఁ దా
నాఱు మొగంబులఁ గ్రోలి, పోఁడుఁడు[3] పాల్రాచి యొక్క♦పూఁటను వెలిఁగెన్. ౩౨

చం. తనదుబలంబుకల్మి నతి♦దారుణ మౌ ప్రవిదారణంబునన్
దనుజచమూసమూహముల♦దర్ప మణంప, నిలింపు లాగ్నినా
హినిదళవాయిఁగా నతని ♦ నిచ్చగఁ దా రభిషిక్తుఁ జేసి, రో
యనఘ! సురాపగాచరిత ♦ మంతయు నంటి సవిస్తరంబుగన్. ౩౩

క౦. ఈకొమరసామిచరితం, బాకర్ణించినగుణాఢ్యుఁ ♦ డవనీశ్వరపు
త్రా! కడుధన్యుఁడు పుణ్యుం,డై కల్యాణములఁ గూడు ♦ ననవరతంబున్. ౩౪

క౦. శ్రీకార్తికేయభక్తుఁడు, కాకుత్స్థమణీ! సుఖించి ♦ తను సుతపౌత్ర
శ్రీకలితుం డయి మించిన,నాకమునం గాంచు స్కంద♦సాలోక్యంబున్. ౩౫

## సగరచక్రవర్తివృత్తాంతప్రారంభము.

చం. అని యిటు పల్కి వెండియును ♦ నాధరణీశకుమారయుగ్మముం
గని వచియింపఁగాఁ దొడఁగెఁ ♦ గౌశికుఁడన్ మును మీఁదు మోధ్యకుం

---

[1] శరవణంబు = రెల్లువనము　[2] బోరుకాడించి = స్నానము చేయించి.　[3] పోఁడుఁడు = కొమరుడు.

జనపతి సౌరవగుణ్యుఁ డతి♦సత్కృతిలోలుఁడు లోకపాలనా
వనుఁడు యశోవిభాస్వరుఁడు ♦ వర్తిలెఁ దా సగరాభిధానుఁ డై. ౮౩౬

కం. ఆతండు దనకు నొకతను,జాతుండును లేమి మిగుల ♦ సంతాపించెన్
బూతుండును సద్గుణవి,ఖ్యాతుండును నైనకొడుకు ♦ గలుగునె యనుచున్. ౮౩౭

ఉ. నిర్భరతేజుఁ డైనధర♦ణీపతికిన్ సతు లిర్వు, రందు నై
దర్భతనూజ కేశిని సు♦ధర్మవిలోలయు నిత్యసత్యసం
దర్భయు జ్యేష్ఠయయ్యెను, ని♦తాంతనురూప యరిష్ట నేమికిన్
గర్భజ యైనయానుమతి ♦ ఖ్యాతివహించెఁ గనిష్ఠ భార్యయై. ౮౩౮

ఉ. దస్రసమానమూర్తి తన♦దారలతోఁ జని భక్తిమై భృగు
ప్రస్రవణాఖ్యశైలమున ♦ వర్షశతంబు దపం బొనర్ప నా
యస్రపవైరి తేజునకు ♦ నాసటఁ దోఁచి భృగుండు నిండుమో
దాస్రులఁ జూచునాతనికి ♦ సర్దిలి నిచ్చె వరద్వయిం గృపన్. ౮౩౯

ఉ. పుత్రులు నీకుఁ బెక్కు రిలఁ ♦ బుట్టెద రయ్య, భవద్యశోలతల్
ధాత్రిని నిండు మెండుగను ♦ ధాత్రిప! వంశకరుండు నొక్కఁడే
పుత్రుఁడు పుట్టు నొక్కతెకుఁ ♦ బుత్రకషష్టిసహస్ర మంబుజ
న్నేత్ర యొకర్తె కంచను ము♦నింగని మ్రొక్కి పచించి రంగనల్. ౮౪౦

తే. సత్య మగుఁగాక నీసూక్తి ♦ సత్యవచన!
యేకపుత్రుం బు జనియించు ♦ నెవ్వతెకునొ
యెవతె కుదయింత్రు బహుసుతు ♦ లెఱుఁగఁ బలుకు
మనిన మీకోర్కి చొప్పున ♦ నగుత మనియె. ౮౪౧

ఉ. అంతట మానికాంతుఁడు త♦లంగనలం గని కాంతలార! మీ
స్వాంతము నొప్పు చెప్పుఁ డిఁక ♦ సంతతికారణ మేకపుత్రుఁడే
కాంతకు నిష్టుఁడో? బలులు ♦ గాఢయశుల్ బహుపుత్రు లెవ్య తే
కాంతకు నిష్టు లౌదు రనఁ ♦ గంజదళాక్షులు మౌనివర్యుతోన్. ౮౪౨

తే. చెప్పి రిట్లని యంశుఁ గే♦శిని పచించె,వంశకరుఁ డైనతనయుఁడు ♦ పలయు ననుచు
వలనుపర్ణపహోదరి ♦ యభిలషించె, సుతుల నఱువదివేవుర ♦ శక్తిపుత్రులు.

కం. అంతట ముని వీడ్కొని భూ,కాంతుఁడు నిజపురికి నరిగెఁ ♦ గాంతాయుతుఁ డై
కొంతపడి యిట్లు చను నా,కాంతలు గర్భములు దాల్చి ♦ క్రాలిరి వేడ్కన్. ౮౪౪

తే. తామరసనేత్ర కేశిని♦తనయుఁ గాంచె, నతఁడ యసమంజుఁ డనఁగ వి♦ఖ్యాతిఁ దనరె
గర్భగుంబంబు జనియించెఁ ♦ గలికి సుమతి, కందు నఱువదివేవుర♦కందు లొదవ.

ఉ. దాదులు నేతికుండలను ♦ దచ్ఛిశుకాండము నుంచి నేర్పుమైఁ
బ్రోది యొనర్చు చుండఁగను ♦ బోయెఁ జుమీ బహుకాల; మంత దా
యాదులు ప్రాప్తయౌవనులు ♦ హారివిహారులు నైరి; యందు వ్యా
పాదితబాలకుం డగుచు ♦ వర్తిలె నాయసమంజుఁ డుగ్రుఁడై.    ౨౪౬

కం. పౌరులబిడ్డల సరయూ,పూరంబుల వైచి వారు ♦ బుటుకున మునుఁగన్
నీరంబులపైఁ దేలఁగఁ, దీరంబుననుండి కనుచుఁ ♦ దెంపరి యగుచున్.    ౨౪౭

కం. అనుదిన మిటు పాపావహ, మనక శిశులఁ జంపు సజ్జ♦నాహితుఁ బాపున్
జనహితుఁడు పురమువలనను, దనయుఁ డనక వెడల నడిచె ♦ ధర్మిష్ఠుండై.    ౨౪౮

కం. అతనిసుతుఁ డంశుమంతుఁడు, ఋతవాదియు సర్వలోక♦హితుఁడై వెలసెన్
మతియొదవె సగరునకుఁ దాఁ, గ్రతు వొక్కటిచేయ దాని♦కై పని పూనెన్.    ౨౪౯

←→ సగరుఁ డశ్వమేధము సేయ నింద్రుఁ డు యజ్ఞాశ్వ మపహరించుట. ←→

కం. సంధ్యాతాండవునకు సాం,బంధ్యము గలధారిణీధ్ర♦పరివృఢుఁడును నా
వింధ్యావనీధరంబు న,సంధ్యానోన్యేక్షణముల ♦ నటుల సతంబున్.    ౨౫౦

కం. ఆరెంటికి నడుమను సవ,నారంభము సేయ యోగ్య ♦ మగుఁ గావున ధా
త్రీరమణుం డచ్చో సం,భారంబుల నెల్లఁ గూర్చి ♦ మఖ మొనరింపన్.    ౨౫౧

కం. అశ్వాధ్వర మొనరించుచు, నశ్వముబడి నంశుమంతు ♦ నంపిన నపు డా
విశ్వవినుతధానుష్కుఁడు, విశ్వాసము మెఱయఁ జనియె ♦ విపులబలముతోన్.

కం. పర్వదినంబున మాయ సు,పర్వప్రాగ్రసరుఁ డసుర♦వపువున యజ్ఞీ
యార్వంబు నపహరించిన, సర్వోపాధ్యాయు లనిరి ♦ సగరునితోడన్.    ౨౫౩

ఉ. కర్తను నిన్నుఁ గైకొనక ♦ కార్యము భంగము సేయఁ గోరి యే
ధూర్తొ హరించె వారువము ♦ దోసము, దీన ఘటిల్లుఁ గీడు భూ
భర్తకు నీకు మాకు, నటు ♦ ప్రాప్తిల కుండఁగ నశ్వహర్తృసం
హర్తవు నౌచు యజ్ఞమును ♦ సాంతముఁ జేయు నృపాలకాగ్రణీ!    ౨౫౪

కం. ఋత్విజు లిటు పల్కిన విని, సత్వరుఁడై సగరుఁ డాత్మ♦జాతులఁ ద్రిజగ
జ్జిత్వరులను నఱువదివేల్, సత్వాఢ్యులఁ గాంచి పలికె ♦ సంభ్రమ మమరన్.    ౨౫౫

←→ సగరకుమారు లశ్వమునిమిత్తమై భూమిని ద్రవ్వుట. ←→

సీ. సుతులార! దివ్యతే♦జులు ఋత్విజులు నన్ను, మంత్రపంతపుఁ గ్రతు♦తంత్ర మునుపఁ
జోరత రాక్షసుల్ ♦ వారువంబును గొని, యేగుటఁ గన నైతి ♦ నీర లెల్ల
జలనిధివలయితో♦ర్వసర్వంసహా,చక్రంబు వెదుకుఁడు ♦ సత్వరముగ
నొక్కొక్క యోజనం ♦ బోలిమై దొంగయు, మావుఁ జేపడుదాఁక ♦ మరలవలదు

తే. ఋత్విజులు మనుమందును ♦ నేను నిచట, నుండు వారము సైంధవ ♦ మొదవుదాఁక
నిది యనుజ్ఞఁ గొని చనుఁ ♦ డీ రటన్న, హృష్టమానసులై వార ♦ లేగి యంత.
తే. యోజనాయామవిస్తార ♦ మొక్కఁడొకఁడ, నాకపాయుధశిఖరాభ ♦ నఖరములను
నుగ్రశూలహలంబుల ♦ నుర్విఁ జీల్ప, దాన జనియించె దుస్సహం ♦ బైనరవము.
కం. నీల్గెడిచిలువలతుటుముల, నీల్గెడిపొలదిండిగముల[1] ♦ యేడుపుటులివుల్
మూల్గెడిరక్కసిమూఁకల, మూల్గులు సఙ్గోస[2]లందు ♦ ముప్పిర మయ్యెన్. ౮౫౮
కం. అటునది వేలాపుష యా, యటునది వేవురును ద్రవ్వి ♦ రాబలితలముఁ
గటుకుఁ దనంబును గొని చిం, దటవందఱ చేసి రెల్ల ♦ ధరణీతలమున్. ౮౫౯

దేవతలు బ్రహ్మతో సగరకుమారులవలనిరాయిడి విన్నవించుట.

కం. ఖంబున సధారణీధర, జంబూద్వీపంబుఁ ద్రవ్వి ♦ సగరాత్మజు ల
శ్వంబును వెదకఁగఁ జొచ్చిన, నింబటి గంధర్వనాగ ♦ బృందారకులున్. ౮౬౦
సీ. కాంచనగర్భునిఁ ♦ గానంగ నేగి సం, భ్రాంతమనస్కులై ♦ పల్లటిలుచు
నాతనిఁ గని దేవ ♦ భూతలం బెల్లను, సగరాత్మజులచేతఁ ♦ జక్కఁబడియె
గుఱ్ఱంబుకొఱకు నై ♦ కట్టులు చేకొని, మిట్టులతో నేలఁ ♦ దొట్టి వెట్టి
పెక్కురు పెద్దగుం ♦ బీరంబుఁ బెడఁబాపి, పాతాళతల మెల్లఁ ♦ బాఁతు గలఁచి
తే. రితఁడె మా మావుదొం గని ♦ యిదిగొ వీఁడె, తురగిజన్నంబుఁ జెఱిచిన ♦ దుండగీఁ డ
టంచుఁ జెలరేఁగి సర్వభూ ♦ తావళులను, బారి సమరుచు నున్నారు ♦ భారతీశ.
చం. అనుడుఁ బితామహుం డను మ ♦ హాభయకంపితనిర్జరాళులం
గని సురవర్యులార! వసు ♦ ఖండయు తానని యెల్ల వాసుదే
వుని మది, యమ్మహామహుఁడు ♦ పూనుచుఁ గాపిలరూపుఁ దాల్చి మే
దిని, నటు గాన సాగరులఁ ♦ దీర్చుఁ గ్రుధోగ్రహుతాశనార్చులన్. ౮౬౨
తే. కల్పకల్పంబునందు నీ ♦ కరణి ధాత్రి, యెల్లఁ ద్రవ్వఁగఁ బడుచుండు ♦ నేల వగవ?
నగును నాశంబు నిజము స్వ ♦ ల్పాయులైన, సగరసుతులకు నంబర ♦ చారులార.
తే. అనిన ముప్పదిమువ్వు రా ♦ యసురవరులు, వచ్చుత్రోవన పోయిరి ♦ వసుధ కట్టి
వారివారి నెలవుల క ♦ పార మైన, సంతసం బెదఁ గ్రాల నా ♦ సగరసుతులు. ౮౬౪
చం. అట మహితాశ్వటిం బుడమి ♦ నంతయుఁ ద్రవ్వి ప్రదక్షిణంబుగాఁ
జటులతఁ జుట్టి వారునము ♦ జాడఁ గనుంగొనఁ జాల కంద ఱొ
క్కటిగను జేరి తండ్రిఁ గని ♦ తాతల మంతయుఁ ద్రవ్వి విక్రమో
ద్భటసుర దైత్యకిన్నరులు ♦ భంగపడన్ వధియించి యెంతయున్. ౮౬౫
ఉ. మిట్టును బల్లమం చనక ♦ మేదిని యంతయు రోసిరోసి యా
గుఱ్ఱముపోబడిం గనక ♦ గొబ్బున నచ్చిలి మంచుఁ బెక్కఁ గ

[1] పొలదిండిగములు — మాంసముదినువాని సమూహములు. [2] సఙ్గోసలు — సందడులు.

న్నెట్టి యొనర్చి చెట్టున మ♦హీరమణీరమణుండు పల్కె నా
కుట్టలఁ ద్రవ్వఁ డింక ధర ♦ గుట్టపుదాంగను దేక వ్యగ్రులై. ౧౬౬

సీ. వత్తురే మరలుఁడీ ♦ త్రవ్వుఁడీ సర్వంబు, రాకుఁడీ కార్యంబు ♦ గాకమున్న
యని తండ్రి పల్కిన ♦ విని యెల్లరును వేగ, మేగి రసాతల ♦ మెల్లఁ ద్రవ్వి
యచ్చో విరూపాక్ష ♦ మనుదిశానాగంబు, నద్రి పెన్నగమున ♦ కుద్రి యగుచు
నుర్విని మోచుచోఁ ♦ బర్వదినంబుల, భారఖేదంబును ♦ బాపుకొనఁగ

తే. శిరము నణఁకింప దానన ♦ ధరచలించు, నట్టియేనుంగు వలగొని ♦ దిట్ట లగుచుఁ
దూర్పు భేదించి వలకడఁ ♦ దొలఁట వెట్టి, యట మహాపద్మ మను పేరి ♦ హస్తిఁ గాంచి.

ఉ. దానిని జుట్టి వచ్చి విన♦తప్రధమాంగకులై ప్రతీచినిన్
మానక త్రవ్వి యచ్చటను ♦ క్ష్మాధర మో యన నొప్పుదాని నా
శానుతనాగముం గనుచు ♦ సౌమనసాఖ్యము మ్రొక్కి దాని కీ
శానసఖాశ కేగి సిత♦సామజవర్యము, గాంచి భద్రమున్. ౧౬౮

కం. మంచును బోలుచు సితరుచి, నంచిత మగుదానిఁ గుశల ♦ మడుగుచుఁ జని యా
పంచాస్యదిశను ధర భే,దించిరి సమకట్టి రోష♦దీపితమతులై. ౧౬౯

సగరకుమారులు కపిలుకోపాగ్నిని భస్మీభూతు లగుట.

ఉ. రాకొమరుల్ మహాబలప♦రాక్రమశీలురు ద్రవ్వుచోట ను
ద్రేకిత వాసుదేవుని స♦కీర్ణతపోమయు దేవదేవుని
న్ప్రకటయోగశీలుని స♦నాతను నాతనిదాపునందు హే
షాకలితాశ్వముం గనుచు ♦ సంతస మందుచుఁ గ్రోధమూర్తులై. ౧౭౦

చం. నిలు నిలు మోరిచోర! తగు♦నే యిటు జన్నపువారువంబు మ్రు
చ్చిల? ముని మ్రుచ్చవై యిచటఁ ♦ జేసిన బూమెలు మోసపోదు మే,
తెలియవె సాగరావళులఁ ♦ దీరు నె డొంగినయంతమాత్రనే,
పలువ మదీయ ఘోటకముఁ ♦ బట్టితివీ కిఁక నేది దిక్కురా. ౧౭౧

కం. జంకక యిటు పల్కినయా, మంకులఁ గని కపిలమౌని ♦ మండుచుఁ గినుకన్
హుంకారముఁ గావించిన, బింకము చెడి వార లైరి ♦ వెలిమిడిప్రోవుల్. ౧౭౨

సీ. అక్కడ సగరుఁడు ♦ మ్రుక్కుచు నాత్మలోఁ, బెద్దకాలం బైన ♦ బిడ్డలెల్ల
రామికి వగచి గా♦రాముమ్మనిఁ జూచి, నాయనా! నీకు లేఁ♦బ్రాయ మైనఁ
గృతవిద్యుఁడవు మఱి ♦ కృతహస్తుఁడవు మహా,శూరవరుండవు ♦ ధీరతాది
సద్గుణంబులఁ బూర్వ♦జనపాలురను బోలు,వాఁడవు గుఱ్ఱంబు♦వలతి యొఱఁగి

తే. పిన్నతండ్రు లదేగతిఁ ♦ జన్నవారొ, వారిపోబడి యారసి ♦ వత్స! రమ్ము
నీకతంబున జన్నంబు ♦ నేను నిర్వ,హింపఁ గలవాఁడ వేగ నీ ♦ వేగి రమ్ము. ౧౭౩

తే. భూమిలోపలఁ గల్గిన♦ఘాతతతులు, భూరిసత్త్వవిశిష్టముల్ ♦ పురుశరీర
వంతములు గాన వానిని♦రావపణార్థ,మసియుఁగోదండముఁగొని♦యరుగవయ్య.

కం. ముక్కఁ దగువారి కెల్లను, ముక్కము విఘ్నంబు సేయు♦మొఱకుల బలిమిఁ
దక్కఁగొనుము కదనంబునఁ, జక్కఁగఁ జను దెమ్ము కార్య♦సాధకుఁ డగుచున్. ౧౭౫

## అంశుమంతుఁడు యజ్ఞాశ్వము వెదకఁ బోవుట.

చం. అన విని యంశుమంతుఁ డటు ♦ లౌ నని ఖడ్గియు ధన్వి యౌచు గ్ర
క్కనఁ జని పిన్నతండ్రు లిల ♦ ఖాతము చేసినచొప్పు వట్టి భూ
మిని వడిఁ జొచ్చి యచ్చట సు♦మేరుసమోరుదిశాగజంబుఁ గ
న్గొని వలగొంచు వేఁడెఁ దమ♦గుఱ్ఱముచొప్పుఁ బితృవ్యసంస్థితిన్. ౧౭౬

ఆ. అంశుమత్కులీను ♦ నంశుమంతునిఁ జూచి, దిగ్గజంబు పలికె ♦ దివ్యతేజ!
యుబ్బ నీకుఁ దేజి ♦ గొబ్బున నీవు కృ,తార్థుఁ డగుచుఁ బురికి ♦ నరుగఁ గలవు.

తే. అనిన నాపల్కు లాలించి ♦ యచటు విడిచి, చనుచు దిగ్గజపంక్తిని ♦ సరవిఁ గాంచి
యుపచితి నొనర్చి యర్థించె ♦ నశ్వవిధముఁ, బిన్నతండ్రులచొప్పును♦బ్రేమనవియు.

కం. మఖఘోటకముం గొనుచును, సుఖముగ మరలంగఁ గలవు ♦ సుమ్మీ నీ వీ
ముఖముగఁ జను మన నాశత,మఖవిక్రముఁ డట్ల యరిగి ♦ మార్గమునందున్. ౧౭౯

తే. పిన్నతండ్రులబూదిప్రో ♦ వున్నఁ గాంచి, సైఁపఁగారానిదుఃఖాస ♦ సంతపించి
వా విడిచి యేడ్చె వారల♦వధమునకును, జనకదుఃఖంబు సుతునకు ♦ సహ్య మెట్లు?

## పితృవ్యులకై వగచు నంశుమంతుని గరుడుం డూరార్చుట.

ఉ. కన్నుల నీరు జాలుగొన ♦ గద్గదికం గొని మేఁతమేయు చం
దున్నహయంబుఁ గాంచి తగ ♦ వూహ యొనర్చి జలక్రియాదులం
గ్రన్నన దీర్ప రోయఁ గన♦రా దొకఁడేని జలాశయంబు; త
త్ఖిన్నత నన్నిచోట్లఁ బరి♦కించుచు దూరమునందు నొక్కెడన్. ౧౮౧

చం. కనియెఁ బితృవ్యమాతులు ఖ♦గప్రకరప్రవరేణ్యుఁ బుణ్యపా
వనజనతావగీర్ణుని సు♦వర్ణసవర్ణ సుపర్ణు నంత స
న్మనతతనూభవుండు పృథి♦వీవరపుత్రుని జూచి పల్కె స
జ్జననుతధీరతా! భువన♦సన్నుత మీవధ కుందు మానుమీ. ౧౮౨

ఆ. అప్రమేయుఁ డైన♦హరి కపిలాకృతిఁ, గసి మసంగి వీరిఁ ♦ గసిమసంగి
మసిగఁ జేసెఁ జుమ్ము ♦ మహితవిక్రములకు, వగవఁ జన్న రాజ♦వర్యతనయ. ౧౮౩

ఉ. శూరుల కీధరామరని♦ఘూదిత మాన్యులకుఁ [1]నివాపముల్
వారిజమిత్రవంశ్య! తగ♦నా తగువారిని నీయ కిల్లు ని

[1] గ్రామ్య శోకమునఁ జచ్చినవారి కస్వర్గ్య గతులు చేవు.

స్సారవుసారసాకరము♦సారములం గొని యీయఁ బూన?నీ
హారధరాధరాగ్రతన♦యాంబువులం ఘటియింపు మే లగున్. ౮౮౪

## ✦ అంశుమంతుని గరుత్మంతుఁడు గంగఁ దేర బోధించుట. ✦

ఉ. పావనశీల! వీరివగు♦భస్మసమూహముమీఁద నాజగ
త్పావని పాఱ నేని పర♦భావితనారకమార్గ లౌచు సం
భావన పొంది నాకమున ♦ భావన కందనిసౌఖ్యసంతతుల్
వావిరిచేపడన్ సతము ♦ వాలఁ గలా రటు చేయు పుత్రకా! ౮౮౫

కం. చేవాటునఁ[1] జరియించెడి, యావారువముం గ్రహించి ♦ యగుగుము వత్సా
కావింపు తాతజన్నము, వేవే పారంబుముట్ట ♦ విశ్వం బెఱుఁగన్. ౮౮౬

సీ. ఆఖగేంద్రునివాక్య ♦ మాలించి యంశుమం,తుఁడు వోయి పురికిఁ♦దురికిఁగొనుచు
దీక్షితుఁ డై యున్న ♦ యాక్షితిపాలుని, వీక్షించి సర్వంబు ♦ విన్నవించె
నైన తేయునిబోధ ♦ లోనుగాఁగలవట్టు, లంతయు విని వ్యథా♦క్రాంతమతిని
సగరుండు మిక్కిలి ♦ పొగిలి జన్నముఁ దీర్చి, విహితకల్పము యనా♦విధిగ వంతఁ

తే. దనదుపురిఁ జేరి యాకాశ♦ధునిని ధరణిఁ, జేరఁ దేరంగ మార్గంబు ♦ నేర కతఁడు
చాలఁ దలపోఁత ముప్పది♦వేలయేండ్లు, ధరణిఁ బాలించి దివమున ♦ కరిగెఁ బిదప.

చం. ప్రకృతిజనంబు లెల్లరును ♦ రాజుగఁ గోరిరి యంశుమంతు ధా
త్రికవరు, నాతఁ డాత్మజు న♦మేయబలుం గనుచున్ దిలీపునిన్
సకలధరిత్రి యాతనిభు♦జంబుల నిల్పి తపంబు చేసె నై
హికగిరిరాజకూటమున ♦ కేగి భయంకరనిష్ఠ గంగకై. ౮౮౮

తే. ముప్పదియు రెండువేలేండ్లు ♦ మొనసి తపము, సలిపి గంగను దేలేక ♦ స్వర్గ మరిగె
నాపుడమిఱేఁడు పిదప ది♦లీప విభుఁడు, తాతలమృతికి దుఃఖప♦రీతమతిని. ౮౮౯

కం. నీఁగంగఁ బితలఋణముం, దేఁగం గను టెట్లొ గంగఁ ♦ దిప్పలపై నే
నీఁగంగాఁ జేయు టెటో, యీఁగం గాండములు వారి ♦ కెట్లయ్యెడినో. ౮౯౦

సీ. అనుచుఁ జింతావశుఁ ♦ డయి సల్పె సుక్రతు,ధ్వరముల నొకముప్పదు♦పదులవేలు
వర్షముల్ పాలించి ♦ వసుధను బితరుల, నుద్ధరింపఁగఁ జాలు♦నోజ లేక
శోకావిలుం డయి ♦ నాకలోకముఁ జేరె, సుతు భగీరథు భూమి♦పతిఁగఁ జేసి
యతఁడు రాజర్షి యై ♦ హితము నాలోచించి, యనపత్యుఁ డగుటచే ♦ నఖిలధరణి

తే. యాప్తసచివాగ్రణులకును ♦ నప్పగించి, గంగఁ దేరంగఁ బూని గో♦కర్ణమునకు
నరిగి పంచాగ్నిమధ్యంబు♦నందు నిలిచి, నిష్టితేంద్రియుఁ డయి కడు♦నిశ్చలముగ.

## ✦ భగీరథుఁడు గంగకై తపంబు చేయుట. ✦

ఉ. వర్షము లొక్క వేయి యని♦వారితవిక్రముఁ డూర్ధ్వబాహుఁ డై
వర్షము గాలి నాక, కొని ♦ వన్యములున్ నెల కొక్క తేప, సో

---

[1] చేవాటున = సమీపమున.

త్కృగ్రతపంబు సేయఁగను ♦ దక్షయుఁ దా నెద మెచ్చుచుం జతు
ర్శీర్షుఁడు నిర్జరశ్రీగతి ♦ చెంతలఁ గొల్వఁగ వచ్చి యిట్లనున్. ౪౯౨

శా. వత్సా! లెమ్ము భగీరథా! పరముల ♦ న్వాంఛింపుమా నీదుని
ష్కృత్యాతుల్యతపస్సమాధి కెద మె♦చ్చున్ వచ్చె నం చన్న నా
సత్యాసజన్యధనుండు లేచి విచికి♦త్సాదూరుఁడై చూచి భా
స్వత్యాస్వవర్ణశరీరు హస్తపుటముల్ ♦ సంధించి తా నాదెన్. ౪౯౩

తోటకము. జగదీశ్వర నాకుఁ బ్ర♦సన్నుఁడ వే, నొగి నాతపముల్ ఫల♦యుక్తము యేన్
సగరాత్మజు లందఱు ♦ నావలనన్, వగ దీఱఁగఁ గాంత్రు ని♦వాపములన్.

కం. హైమవతీజలములఁ బ్రపి,తామహభసితములఁ దడుపఁ ♦ దా రరుగఁగ స్వ
ర్యాధికి; వంశము నిలువం,గా మహి సుతు లొదన వరముఁ ♦ గరుణింపు మనన్.

కం. దుర్ధర్ష! యట్ల యగు నా,స్వర్ధుని దివినుండి పడఁగ ♦ ధాత్రీతలమునకున్
దుర్ధరము గాన వేఁడుము, యర్ధేందుకిరీటు; నోపఁ ♦ డన్యుఁడు పైఁపన్. ౪౯౬

కం. అని యిట్లు పల్కి యారా,జునకున్ మఱి నాకనదిని ♦ జూచి నతీ యా
యనఘునికోరిక దీర్పుమ, యని యంతర్ధాన మయ్యె ♦ నమరులతోడన్. ౪౯౭

కం. ఈవిధి విధి పల్కి తిరో,భావంబును బొందఁ దనదు♦భావమున హరున్
భావించి బొటనవ్రే ల్వసు,ధానరుఁ డిల మోపి యేఁడు ♦ తప మొనరించెన్. ౪౯౮

ఉ. బాహువులు మీఁది కెత్తుకొని ♦ పట్టాక యింతయు లేకయుం బృష
ద్వాహము భోజనంబుగను ♦ స్థాణువుపోలికి నిట్ట నిల్చి యా
యాహతలక్షణుండు మద♦నారిని గొల్వ సహస్రి శంబు గో
వాహనుఁ డేగి యాధరణి♦వల్లభునిం గని పల్కెఁ గూర్మితోన్. ౪౯౯

సీ. ప్రీతుండ నైతి నో♦నృపతికులాగ్రణి, శిరమున నహీయింతు ♦ సురసరిత్తు
నని పల్కి నంతనే ♦ యాకాశవాహిని, గర్వసముద్రేక♦గరిమఁ దలఁచె
నోపు నే నాదునా♦టోపంబు నీశుఁడు, వీనిని గొని యేగు♦దాన నిపుడ
పాతాళమున కని ♦ భయదమహాపంబున, దుస్సహవేగంబు ♦ ఘోరముగను

తే. బాఱు దెంచెడిమిన్నేటి♦పటిమఁ, జూచి, దానిగర్వం బెఱింగి భ♦వానివిభుఁడు
రోషసంరంభమూర్తి యై ♦ రూపు మాఱ, దలఁచె నంత హిమాచనీ♦ధరనిభంబు.

→ గంగ రుద్రజటాజూటంబునఁ దిరుగుచు పడుట. ←

కం. రుద్రజటాగహ్వరమును, రౌద్రంబుగఁ జొచ్చి వెలికి ♦ రాఁ జాలక య
త్యుద్రంబుగ భ్రమియించు చు,సద్రసము బొందె గంగ ♦ బహువత్సరముల్.

కం. చొచ్చుటయు కాని వెలికిని, వచ్చుట లే కున్నఁ జూచి ♦ వసుధాపతి పెం
పచ్చుపడం దప మొనరిచె, నచ్చరితా శివునిఁ గూర్చి ♦ నదములనిప్పన్. ౫౦౨

సీ. వానికి మెచ్చి భ♦వానీధవుఁడు గంగ, జడలగుంపు లోకింత ♦ సడలఁ బుచ్చి
బిందుసరోవరం♦బందుఁ దా విడునఁగ, నేడుపాయలుగాఁగ ♦ నేలు పాతె
హ్లాదిని పావని ♦ యనఁగను నళిని నాఁ, బాయలు దూర్పుగఁ ♦ 'బాఱఁ జొచ్చెఁ
బడమటిదెసగాఁగఁ ♦ బారెసుచాఁడు|సుచక్షు, వన సీతయన సింధు ♦ వనఁగ నెగడి
తే. యందు నేడవదైనది యరిగె నృపతి
నామహాతేజుఁ డొక్క దివ్యరథ మెక్కి
ముందు చన నింట గంగ యాతఁ డేగినంబు
వెనుకఁ జనె భూమి నుతియింప ♦ విబుధగణము. ౯౦౩
కం అచ్ఛద్యుతి దివివలనన్, విచ్చి త్రిని బోఁవి పొంది ♦ విశ్వేశుజటన్
గచ్ఛపజలచరయుక్తి స,విచ్ఛిన్నముగాఁగ గంగ ♦ పృథివిం బాఱెన్. ౯౦౪
ఉ. అంతట దేవమాని సుర♦ముఖ్యవరుల్ గగనంబు రంభ్రమంబునన్
దంతితురంగసంఘములఁ ♦ దారు మహానగరోపమానయా
నాంతరవీథుల న్నిలిచి ♦ యబ్బుర ముబ్బతిలంగ నంబరా
భ్యంతరసీమ గైకొని స♦యాపతనంబును గాంచి రెంతయున్. ౯౦౫
కం.క్షితికిని డిగుసురతతితో, ద్యుతి మెఱసెడి తద్విభూష♦ణోత్కరములతో
గతతోయద మగుగగనము, శతభాస్కరయుతమనంగ ♦ సంశోభించెన్. ౯౦౬
కం.చంచలశఫరీపన్నగ,సంచయగురుశింశుమార♦సంహతితో రా
జించె వియత్తల మప్పుడు, చంచలలను నిండి యున్న♦చందము దోఁపన్. ౯౦౭
కం.నదియురవడి నలుగడలం, జెదరిన వెలినురుఁగులోడఁ ♦ జెలు వలరె సిత
చ్ఛదతతితోఁ గూడినశా,రదనీరదముల నభంబు ♦ రాజించు గతిన్. ౯౦౮
ఉ. ఒక్కొకచోట తాఁగ యన ♦ నుద్దవిడిం బరువెత్తు, నొక్కచోఁ
జక్క గభీరత న్నడుచు ♦ సాధ్వియటుల్, మఱి భోగినీగతిన్
ముక్కలి వక్రమార్గ మగు, మిన్నున నర్తకియట్లు గంతులన్
ద్రొక్కటలాడు, నొక్కయెడఁ ♦ దోఁచు నితంబిని యట్లు మందతన్. ౯౦౯
కం పాతెడినీరును నెదురై, పాఱెడునీరంబుఁ దాఁకి ♦ పై కెగిరి పడున్
మీఁజెసనిరి నడుమను రా, పీఱఁడి దా మిడిసిపడకి ♦ విధ మొనఁ దోఁపన్. ౯౧౦
కం.భ్రష్టం బై హరుశిరమున,భ్రష్టం బై సురల భూమి♦ గగనమునందున్
విష్టపముల వెలసెను నది, కష్టాఘౌకసాపహారి♦కం బగుచు శ్రీన్. ౯౧౧
ఉ. దేవఋషుల్ సురల్ వసుమ♦తీతలవాసులు వార్చి రంభఃఝుం
బావన మీఁజలంబు హర♦మస్తకసంభవ మంబటంచు,నం

దావల ఘోరశాపహతు • లై దివి నుండి ధరిత్రిఁ గూలు నా
దేవతలెల్లఁ గ్రుంకు లిడి • దివ్యతఁ గాంచి రపాస్తదోషులై. ౯౧౨

చం. ధరణిజనంబు గ్రుంకి విగ•తశ్రమమై చెలువారె, నంత నా
యరుణకులావతంసముఖ•తాంగము ముందుగఁ బోవ గంగ యా
యరథము వెంట నంటె • ససురాసురకిన్నర యక్షపాళులా
సురధుని వెంబడించెఁ; జను•చో నది జహ్నునియజ్ఞవాటమున్. ౯౧౩

జహ్నుముని గంగాజలంబుల నెల్లఁ ద్రావుట.

ఉ. ముంచె నిజాంబుపూరముల • ముంచిన నాముని దానిగర్వ మూ
హించి సరోషుఁడై జలము • నెల్లను ద్రావ నిమేషమాత్రఁ, బూ
జించుచు నమ్మహామహు స•శేషమునీశను రేశులెల్ల న
భ్యంచితరీతి నీదుసుత•యట్ల ప్రథ గాంచును వీడు మం చనన్. ౯౧౪

తే. దాన సంతుష్టి చెంది య•త్తపసియపుడు, వీనులను దానిఁ బోవిడె • విస్మయముగ
దాన జహ్నునిసుత యని•తరణికులుఁడు, జాహ్నవియనంగఁబరఁగెనీ•సౌరతటిని.

ఉ. అంత మఱిన్ భగీరథర•థానుగయై మినువాఁక యాఁక లే
కెంతయు నబ్ధిఁ జొచ్చి తద•భీప్సితసిద్ధికి లేలిహానలో
కాంతముఁ దూఱి యారవికు•లాగ్రణితాతలబూదిమీఁద నే
కాంతము పాఱ వారు హత•కల్మషులై దివి కేగి రందఱున్. ౯౧౫

భగీరథునకు బ్రహ్మ ప్రత్యక్షమగుట.

ఉ. అంచితరీతి నానృపతి • యట్టులు గాంగఝరంబు వెన్కొనన్
సంచితసాధుకీర్తు లగు•సాగరు లెల్లరు భస్మసాత్కృతిన్
గాంచినచోటి కేగి గతి•గాననివారలబూదిరాసులన్
ముంచినఁ జక్క వచ్చి నృప•ముఖ్యునిఁ గాంచి విరించి యిట్లనున్. ౯౧౬

సీ. రాజేంద్ర! సగరత•నూజాతు లఱువది,వేవు రిప్పుడు దేవ•భావ మంది
త్రిదివంబు ప్రాపించి • రుదధిని నీరంబు, లెంతదాఁక రహించు • నంతదాఁక
వారును దివ్యులై • సౌరాలయంబున, నుండంగఁ గలరు; భూ•మండలమున
గంగ నీకూఁతు రై•నంగ విఖ్యాత యౌ,నీపేరఁ బరఁగును • నేఁడుమొదలు

తే. దేవతటినియు గంగ నాఁ • ద్రిపథగ యన
వెండి భాగీరథి యనంగ • వినుతిఁ గాంచి
మూఁడుపేరులఁ, బాఱుట • మూఁడుమార్గ
ములను త్రిపథగ యనుపేరు • మొనసి యుండు. ౯౧౭

ఉ. తాతల కెల్ల నీ వుదక♦దానము లిచ్చుటఁ జేసి నీప్రతి
జ్ఞాతము దీర్చు కొ,మ్మతియ♦శస్వియు నుత్తమధర్మి నీదుము
త్త్రాతయు గంగఁ దేం మును ♦ దాను సమర్థుఁడు గాఁడు గాదె నీ
తా తగునంశుమంతుఁడు వృ♦ధాశ్రము మొందెఁ బ్రతిజ్ఞ దీర్పఁగన్. ౯౧౯

సీ. భూపతీంద్రుండు 'ది♦లీపుఁడు మేటిరా,జర్షియు దేవమ♦హర్షి సముఁడు
నీతండ్రి తపమున ♦ నాతోడఁ బురిడించు, క్షత్రధర్మండు ప♦విత్రకీర్తి
యట్టివాఁడును గట్టు♦పట్టిని నేలపైఁ, బాఱింపలేక తాఁ ♦ దీఱి పోయెఁ
గొఱ లేక ప్రతిసను ♦ నెఱవేర్చి నిర్మల,కీర్తి వైతివి పుణ్య♦మూర్తి వవుర

ఆ. యనవరతము దాన ♦ మాడంగఁ దగుగంగ,నీటిలోన నాడి ♦ నీవు మిగుల
శుచివి గమ్ము పుణ్యనిచయఫలంబును, బొందవయ్య రాజ ♦ యిందు తేజ. ౯౨౦

ఉ. తాతల కెల్ల నీ వుదక♦దానము లిమ్ము, పురంబుఁ బొమ్ము, సం
ప్రీతిని నేను బోయెద న♦భీష్టగతిం ద్రిదివంబుఁ జేరఁగా
నాతతమంగళం బగుత ♦ మంచు వచించి, నిజేచ్ఛ సత్యముౕ
ధాతయుఁ బోవఁగా, నృపతి ♦ తర్పణముల్ పొసరించి గంగలోన్. ౯౨౧

కం. తనదుపురంబునకుం జని, తనరాజ్యశ్రీని బూస ♦ ధరణీజనంబుల్
వనట దొఱంగుచు ముదముం, గని యతిసంపదలఁ దేలె ♦ గతసంజ్వరతన్. ౯౨౨

ఆ. గంగచరిత మెల్లఁ ♦ గాకుత్థ్సకులచంద్ర, యానుపూర్విఁ బలుకు ♦ టయ్యె నీకు
మేలు గలుగుఁ గాక ♦ మిగిలె సంధ్యావేళ, గంగ యిలకు దిగిన♦కథను వినిన.

→ గంగామాహాత్మ్యకథనము. ←

సీ. విత్తకాములకును ♦ విత్తంబు ఘటియించుఁ, గీర్తికాములకును ♦ గీర్తి నిచ్చు
నాయువుఁ గోరి దీ♦ర్ఘాయువుఁ బొందించు, సుతులను గోరిన ♦ సుతుల నొసఁగు
స్వర్గంబుఁ గోరిన ♦ స్వర్గంబును నయించుఁ, బితరుల కెల్లఁ దాఁ ♦ బ్రీతి నిడును
దైవతకోటులు ♦ దనిసెదు నిద్దాన, బ్రాహ్మణక్షత్రియ♦వైశ్య లితర

తే. జాతులం దెవ్వ రైనను ♦ శ్రద్ధ పూని, వినెడివారును గథ విని♦పించువారు
సర్వపాపంబులను బాసి ♦ సర్వకామ,ములను నాయువుఁ గీర్తియుఁ ♦ బొందఁ గలరు.

కం. కౌశికువాక్యములను విని, దాశరథి నితాంతహర్ష♦తస్వాంతుం డై
పేశలవచనంబులఁ ద్రిది,వేశనిభా! వినిస భవదు♦దీరితకథలన్. ౯౨౪

ఉ. అచ్చెరువయ్యె మా కనుచు ♦ నానిశ యెల్లను దమ్ముతోడ నా
సచ్చరితుండు పల్కి నప్ర♦శస్తకథ న్మదిలోఁ దలంచుచు
న్మెచ్చుచుఁ బూర్వదిక్తటము ♦ నీరజమిత్రుఁ డలంకరింపఁగాఁ[1]
గొచ్చెము లేనిభక్తి నలి♦పూర్వముగాఁ గృతకర్మ నిట్లనున్. ౯౨౬

[1] ౧౩-వ నాఁటి సమాప్తము.

## శివుఁడు హాలాహలమును మ్రింగుట

తే. ఇటులు నచియించి హరియుఁ దా ♦ నేగ నంత, సు ... వెలఁపురు గనిసిరి ♦ వరునివలుకు
వినికరంబునఁ గొనియుగ్ర ♦ విషము హాల,హలముఁ ... మొనరించె ♦ హరుఁడు లీల.

మత్తకోకిలము. ఆహరించి విషంబు నీల్గు పు ♦ రారి యేగిన దేవతల్
మోహరించి మఱిక్ మథింపఁగ ♦ ముస్గఁ గొంపె పయోనిధుల్
బాహి యంచు నుతించి రంతటఁ ♦ బంకజాక్షుని నీజగ
ద్వ్యాహరక్షకు నందు మాకును ♦ బూఁట వీవ కదా హరీ. ౩౮

కం. మునిఁగినకొండను మీఁదికిఁ, గొని రమ్ము మహాత్మ నిన్నుఁ ♦ గొలిచెడివారల్
గను చుండఁ గాతియలు నీ,వును జూచుచు నుండె యనిన ♦ భువనాత్మకుఁడున్.

కం. కరమున గిరిఁగొన మోపుచుఁ, దరికొండను మోసి యుదధిఁ ♦ దనవీఁపునయిన్
సురలందుఁ దాను నొకఁడై, పురుషోత్తముఁ డమృతమథన ♦ మునుం గావించెన్.

## క్షీరసముద్రమున ధన్వంతరి లోనగువా రుదయించుట.

కం. తిరముగ నిటు వేయేఁడులు, జరగినఁ దొలుఁగొల్త నందు ♦ జనిఁ[1] గనె ధన్వం
తరి దండకమండలువులు, ధరియించి త్రిజన్ముఁ[2] డగుచు ♦ దైవతతతికిన్. ౪౦

కం. అప్పులు మథింప వానను, నుప్పొంగెన్ రసము దాన ♦ నుద్భవ మైరిం
పొప్పుమిటారులు సొగసుం,దిప్పులు నప్సరస లనఁగ ♦ దిక్కులు వెలుఁగన్. ౪౧

కం. అచ్చర లఱువదికోటులు, సచ్చరితా వారికిఁ బరి ♦ చారిక లెన్నన్
వచ్చున యెందఱో; యసుర,యచ్చరులు గ్రహింప రైరి ♦ యోయుంగవలన్.

కం. కావున నగ్గలి నాక్రొం,బూవుంబోఁడుల నెవండుఁ ♦ బూనమిఁ గొన రా
మా! వారలు సామాన్యా,[3]భావంబున వెలయు చుండ్రు ♦ పడఁపుంజెలు లై.

కం. వరుణునికూఁతురు వారుణి, సుర పేర గ్రహీత నరసి ♦ చూచుచుఁ బుట్టన్
బరికింపరైరి యసురులు, తరుణిని గైకొనిరి సురలు ♦ తాత్పర్యమునన్. ౪౪

కం. సుర నొల్లమి దితిపుత్రు ల,సుర లైరి; పరిగ్రహించి ♦ సుర సదితిసుతుల్
సుర లగుచును హృష్టాంతర,కరణంబుల నొప్పి రపుడు ♦ గగ్గురుపాటునన్. ౪౫

తే. అవల నుచ్చైశ్శ్రవం బను ♦ హయము పుట్టెఁ, గౌస్తుభం బను రత్నంబు ♦ గలిగెఁ బిదప
వెండి నుత్తమ మమృతంబు ♦ వెడలివచ్చె, జలధ నది వారివంశంబు ♦ సమయఁ జేసె.

చం. అది యెటు లన్న నాసుధకు ♦ నై యొకటై యల రాక్షసాసురుల్
త్రిదులక వేల్పులం దొడరి ♦ పెందురముల్ ఘటియింప వారిలో
గుదిగొని రెండువాఁగులను ♦ గూలిరి లెక్కకు మిక్కుటంబుగాఁ,
ద్రిదశులపక్ష మూని హరి ♦ తెప్పునఁ దా హరియించెఁ దత్సుధన్. ౪౮

---

[1] జని = పుట్టి. [2] త్రిజన్ముఁడు = వైద్యుఁడు. [3] సామాన్య = వేశ్య.

కం. మోహనమాయను నసురుల, మోహింపఁగఁ జేసి యెదురు♦మూఁకలఁ గూల్చెన్
స్నేహంబు నెఱపి విబుధవ్యూహంబున కిచ్చె నమృత♦ముల్లం బలరన్. ౯౪౮

కం. ఘోరాహవరంగంబునఁ, గ్రూరాసురకోటిఁ దునిమి ♦ రూక్షంబుగఁ బా
కారి స్వారాజ్యము నేలె స, చారణఋషిదైవతంబు ♦ సంతోషపడన్. ౯౪౯

### దితి యింద్రునిఁ జంపుకొడుకునకై వ్రత మనుష్ఠించుట.

చం. కొడుకులపాటుఁ గాంచి దితి ♦ కూరినదుఃఖముచే విషణ్ణయై
మిడుకుచు భర్త కశ్యపున♦మీపముఁ జేరి సబాష్పనేత్ర నా
కడుపున నీకుమారకులె ♦ కాల్చిరి చుమ్మిటు నాథ! యింక నే
వడువున నోర్చుదానఁ బగఁ♦బాపుసుతుండు జనింపఁ డేనియున్. ౯౫౦

కం. పాకారిఁ జంపుపుత్త్రుఁడు, నాకడుపునఁ బుట్టఁగల్గి♦నం బగదీఱున్
నా కట్టిసుతు నొసంగుము, చేకొనుమా మనవి తపము ♦ చేసెద ననుచున్. ౯౫౧

సీ. అతిదుఃఖితాత్మ యా♦దితిఁ గని యిట్లనుఁ, గశ్యపుఁ డట్లగుఁ ♦ గాక నీవు
నిండువేయేఁడు ల♦ఖండతపంబును, నాపల్కురీతి నో♦నర్చెదేని
శక్రునిఁ జంపుప♦రాక్రమవంతునిఁ, ద్రైలోక్యభర్తఁ బు♦త్త్రకునిఁ గనెద
వని యామె యుదరంబుఁ ♦ దనకేల స్పృశియించి, శుభ మగు నీకు నో♦సుందరాంగి
తే. యనుచు వచియించి యతఁ డేగ ♦ వనమునకును
దితియు ముద మంది యొనరించె ♦ దీర్ఘతపముఁ
దాఁ గుశప్లవనంబున ♦ దారుణముగ
శక్రుఁ డామెకుఁ బరిచర్య ♦ సలుప వచ్చె. ౯౫౨

ఉ. నీతి యొకింత దప్పక వి♦నీతుఁడునై గురుభక్తియుక్తిఁ ద
న్మాతకు సేవ సేయుఁ, దరు♦ణంబును దప్పఁగనీక సత్ఫల
వ్రాతము దర్భలున్ సమిధ♦వర్గము లోనుగ నెల్లవస్తువుల్
ప్రీతిగఁ దెచ్చి యిచ్చు, మఱి ♦ వీవన వీచు శ్రమంబు దీఱఁగన్. ౯౫౩

చం. బడలినవేళఁ గాల్పిసుకు, ♦ భామిని యెయ్యది చెప్ప జాగు లే
కడ వినుమాల కద్దిఘటి♦యించు, నిటుల్ పరిచర్య సేయఁ గాఁ
గడచె దశాబ్దకంబుకొఱ♦గా నొకవేసము[1], లంతఁ దృప్తయై
కొడుకును జూచి పల్కె సుమ♦కోమల ప్రీతమనోంబుజాతయై. ౯౫౪

ఉ. వేఁడఁగ నీదుతండ్రిఁ బృథి♦వీధరశాసన! యొక్కపుత్త్రు వే
యేఁడులు నిష్ఠ నీవ్రతము ♦ నే నొనరింపఁగఁ గల్గు నంచనన్,
మూఁడుజగంబుల న్నిను న♦మోఘబలంబున గెల్వ శక్త మా
జాఁడియు నాకుఁ గల్గె, ననుజుం గనుఁగొందువు నిష్ఠ నిండిపన్. ౯౫౫

[1] వేసములు = వేయిసంవత్సరములు.

చం. వెఱవకుమయ్య నీకొఱకు ♦ వేయివిధంబుల నైనఁ జెప్పి యే
కొఱఁతయు నీకు లేనిగతిఁ ♦ గూర్మిసుతుల్ సవరించుదాన, ని
ద్దఱు నొకరై జగంబులను ♦ దర్పముఁ బ్రోవుఁడు, నిన్ను భద్రము
ల్దొఱయ నటంచు నాడుచును ♦ దొయ్యలి యానడిపూఁట నెంచకున్. ౯౫౬

ఉ. ముమ్మర మైననిద్ర దను ♦ ముంచిన మైమఱ పొంది పాదదే
శమ్మున వ్రేల వెండ్రుకలు ♦ సాధ్వి శిరస్థకలితాంఘ్రిభాగ యై
యిమ్ముగ నుంటఁ గాంచి హరి♦యుంచి ముదంబున లోనఁ జొచ్చి గ
ర్భమ్మును నేడుతున్కలుగ ♦ వజ్రహతిన్ హరి ద్రుంచెఁ, ద్రుంచినన్. ౯౫౭

ఇంద్రుఁడు దితిగర్భమున నున్న పిండంబును ఖండించుట.

ఉ. మానక యేడ్వఁ బిండములు ♦ మా రుద[1] మా రుద యంచుఁ ద్రుంప నా
చానయు నిద్ర మేలుకని ♦ చంపకు చంపకు మంచుఁ బల్కినన్
మానుచు మాతృవాక్యగరి♦మంబున వజ్రముఁ గేలఁ బూని యా
మానినిపాదసీమ శత♦మన్యుఁడు వ్రాలి వచించె నీగతిన్. ౯౫౮

శా. తల్లీ! నే నపరాధ నిక్క మిది క్షం♦తవ్యుండ మన్నింపుమీ
యల్లీలన్ నిదురింప నీ వశుచి వై ♦ యంఘ్రిద్వయి స్మూర్ధజ
మ్ముల్లీల న్నటియింప నిమ్ము గని నీ ♦ పుత్రున్ బిడౌజోంతకున్
బెల్లోల్యంబున నేడుతున్కలుగ నే ♦ భేదించితిం జన్మనన్. ౯౫౯

సప్తమరుత్తులయుత్పత్తి.

తే. తనదుగర్భ మీగతి నేడు ♦ తునుక లైనఁ, జాల శోకించి మిగుల న♦జయ్యఁ డైన
బలవిరోధిని వీక్షించి ♦ పలికెదితియు, సానునయవాక్యముల నిట్టు ♦ లంబుజాక్షి.

ఉ. దోసము లేదు నీవలన ♦ దోసము నాయది యాట భూమిభృ
చ్ఛాసన సప్తధాభిదగఁ ♦ జల్పఁగఁ గల్గితి వీవు గర్భమున్
రోస మదేల నా కిఁక, మ♦రుత్తులు నేడ్వురు నేలుభూములన్
వాసిగ వీరిపాలనము ♦ వర్తిలఁ జేయుము నాకుఁ బ్రీతిగన్. ౯౬౧

కం. నాకొడు లేడ్వురును ది,వ్యాకృతు లై నీవు పిలిచి ♦ నటు మారుతు లన్
బ్రాకటనామంబున వా,తాకృతిఁ జరియించు వార ♦ లాకసమందున్. ౯౬౨

ఆ. ఒకఁడు బ్రహ్మలోక ♦ మొకఁ డింద్రలోకంబు, నొకఁడు వాయు వనఁగ♦నుడుపథంబు
నొంది మలయువార ♦ లున్ననల్వురు[2] నాల్గు,దెసల యుష్మదాజ్ఞ ♦ దిరుగువారు.

కం. కొంజక యిటు పలుపు మనం, బ్రాంజలి యై తల్లిఁ జూచి ♦ యనె నింద్రుం డో
రంజితసుజనా! సత్య మ,గుం జూవె యి దెల్ల శంక ♦ గూర్పకు మదిలోన్. ౯౬౪

---

[1] మారుద = ఏడువవలదు. [2] లున్న నల్వురు = తక్కిన నలుగురు.

కం. అని తల్లియుఁ గొడుకుఁ దపో,వనమున నీరీతి సమయ♦పడి సంతుష్టిం
జనిరి దిశంబున కని యది, వినినారము మున్ను దివ్య♦విభవా రామా! ౯౬౫

## ✦ శ్రీరాములకు విశ్వామిత్రుఁడు విశాలాదేశ వృత్తాంతంబుఁ దెలుపుట. ✦

కం. ఈ దేశము శక్రుఁడు ము,న్నాదితికిని సేవ చేసి ♦ నట్టిది వినుమా
భూదయితుం డిక్ష్వాకుం, డాదృతిని నలంబుసాఖ్య ♦ యందుం గనియెన్. ౯౬౬

సీ. పరమధార్మికకీర్తిఁ ♦ బరఁగువిశాలుని, నతఁ డిటఁ గట్టించె ♦ నయ్య దీని
వసుధ విశాల నా ♦ వఱలు నియ్యది యు వి,శాలసుతుఁడు హేమ♦చంద్రుఁ డయ్యె
నమ్మహాబలశాలి♦యాత్మజుండు సుచంద్రుఁ, డతనికిఁబుట్టె ధూ♦మాశ్వుఁ డనఁగ
నాతని తనయుఁ డై ♦ యలరె సృంజయుఁడుత, త్తనయుఁడు సహదేవ♦మనుజనాథుఁ
తే. డతని కులవర్ధనుండు కు♦శాశ్వుఁ డయ్యె, నతనిసుతుఁ డయ్యె సోమద♦త్తాఖ్యనృపతి
సోమదత్తుఁ కుదయించె ♦ శూరవరుఁడు, వినుతగుణుఁడు కకుత్స్థనృ♦ద్వివిభుండు.

కం. ఆతనిసుతుఁ డగుసుమతియె, [illegible]రణము నందు దీని ♦ నేలెడి; నిక్ష్వా
క్వాత్మతనయు నీనృపతులు, పూతమతులు ధర్మరతులుఁ ♦ బొరి దీర్ఘాయుల్. ౯౬౭

మ. మన మీరే[1] యిట నిల్చి సౌఖ్యముగ రా♦మా! ఱేపు వేవంగ[2] నే
జనకుం జూత మటంచు నుండ నెడ వి♦శ్వామిత్రముని[illegible]
కను నైశాలికుఁ డైనయాసుమతి యా♦కర్ణించి వే వచ్చి య
మ్మునివర్యుఁ విహితోపచారవిధులం ♦ బూజించి తా మ్రొక్కుచున్. ౯౬౮

కం. ధన్యుఁడ నైతిని మునిరా,జన్యా! మద్దేశ మీవు ♦ చను దేర ససా
మాన్యభవద్దర్శనమున, ధన్యులు నాకంటె లేరు ♦ తడవిన ననుచున్. ౯౭౦

## ✦ సుమతివిశ్వామిత్రుల సంభాషణము. ✦

కం. కుశికసుతుండును సుమతియుఁ, గుశలప్రశ్నంబు చేసి ♦ కొమ రగుతమి నా
దశరథసుతులను గనుచుఁ గ్రి,వశ వల్లభనిభుఁడు గాధితనయున కనియెన్. ౯౭౧

సీ. ఏవార [illegible] ♦ దేవపరాక్రముల్, వారణపంచాస్య♦పరమగతులు
వీరలు [illegible]♦వృషభసంకాశులు, జలజాతలోచనుల్ ♦ సరసమతులు
[illegible]♦[illegible]ధారులు, నాశ్వినేయసమాన♦హారితనులు
లోలకరించుచు నున్న ♦ [illegible]యము వార, లిచ్ఛమై దివినుండి♦యిలకు దిగిన
తే. యమృతభోజనులట్లుంగ ♦ [illegible]వారు, మఱియు నింగితచేష్టాప్ర♦మాణములను
నొక్కరీతిని నున్నవా ♦ [illegible], వేఁడెదను జెప్పవే వీరి♦విధము నెల్ల. ౯౭౨

ఉ. ఏటికి నీబడిఁ మనుజ ♦ [illegible] ప్రస్మరరాని యట్టిఘో
రాటవిఁ బాదచారు లయి ♦ [illegible]యుధముల్ ధరియించి యెట్టు లి

---

[1] [illegible] రాత్రి. [2] వేవంగ — తెల్లవాఱఁగా.

ప్పాట మునీంద్ర! వచ్చిరి తు♦పాకరసూర్యులు మిన్నువోలె నీ
వాటి వెలుంగఁ జేసెడ ర♦వారణవిక్రము లేరిపుత్రు లో? ౯౩

కం. అనునావాక్యములను విని, ముని సిద్ధాశ్రమనివాస♦మును రాక్షసులన్
దునుముట లోనగుచరితం,బును సర్వము వినిచె సుమతి♦భూపతి కెలమిన్. ౯౪

చం. కుశికతనూజువాక్యముల♦కుం బరమం బగుమోద మంది యా
దశరథరాజపుత్త్రుల ను♦దారబలాఢ్యుల సత్క్రియాస్థలిం
బ్రశమితవైరి యాసుమతి ♦ భాగ్య మటంచును బూజ సల్పె, దా
దశతనువంశజాతులు ము♦దంబున దాని గ్రహించి కూరిమిన్. ౯౫

ఉ. ప్రాకటలీల నాపురిని ♦ రాతిరి యొక్కటి వుచ్చి వేఁకువన్
వేకువ[1] లేచి తర్లి ముని♦బృందముతో మిథిలం గనంగ, న
స్తోకము దానిసొంపుఁ గని ♦ సాక్షి మునీశులు మేలుమే లనన్
శ్రీకరశీలి చూచి పురి♦చేరువ నాశ్రమతుల్యదేశమున్. ౯౬

→ గౌతమాశ్రమవృత్తాంతప్రారంభము. ←

ఉ. ఎవ్వరి యాశ్రమం బిది? యి♦ టేటికి నిర్జన మయ్యె రమ్య మై?
యవ్విధ మెల్లఁ జెప్పు మని ♦ యాకుశికాత్మజు వేఁడ మేలు మే
లివ్వన మిట్టు లౌటకును ♦ హేతువుఁ జెప్పెద విన్ము రాఘవా!
యవ్వనజాసనాభుఁడు మ♦హాత్ముఁడు గౌతముఁ డుండె మున్నిటన్. ౯౭

శా. రామా! యాతఁ డహల్యఁ గూడి పలువ♦ర్షంబుల్ తపం బుండ, సు
త్రాముం డొక్కెడ సందు గాంచి, సతిఁ జే♦రన్ వచ్చి యామూనియ,
ట్లామోదంబున దానిఁ గాంచి జలజా♦స్యా! మన్మథప్రేరిత
వ్యామోహాత్ములు కార లే ఋతుప్రతీ♦క్షాదక్షు; ల ట్లౌటచేన్. ౯౮

కం. అంగజుకేళిని దమి నీ,సంగతిఁ గాంక్షించినాఁడఁ ♦ జరితార్థునిఁగా
నంగన సలుపుమ యని బహు,భంగులఁ బ్రార్థింప న త్త♦పస్విని మదిలోన్. ౯౯

కం. మునివేషధరుఁడు శక్రుం, డని యెఱిఁగియు నిర్జరేంద్రుఁ ♦ డనుతలఁపున నీ
కొనియెన్ దుర్మతి యై యా,తనితోఁ గలియంగ మఱి ము♦దంబునఁ బలికెన్.

ఉ. సంతస మయ్యె, నిన్ను ననుఁ ♦ జక్కఁగఁ బ్రోవుము మానదా! శచీ
కాంతుఁడ! ధన్య నైతి, నిటఁ ♦ గా దిఁక నిల్వఁగఁ బొమ్ము వేగ యీ
ప్రాంతము వీడి, యన్న సుర♦రాజు హసించుచు మోద మయ్యె నో
యింతి! భయంబు మాను మిదె ♦ యేగెద వచ్చినత్రోవ నింతలోన్. ౯౮౧

కం. అని యాసతి సంతృప్తగ, నొనరిచి గౌతముఁడు వచ్చు♦నో యనుశంకన్
గొని బిఱబిఱ నుటజము విడి, చనుటకు వెలి వచ్చి జంభ♦శాత్రవుఁ డెదుటన్.

---

[1] ౧౪-వ నాఁటి యుదయము.

ఉ. చేతను దర్భ లూని, పెఱ♦చే సమిధల్ ధరియించి, తీర్థను
స్నాతుఁడు నౌట నార్ద్రవస♦నంబులు దాలిచి, మండువహ్నియ
ట్లాతతదేవదానవదు♦రాసదతేజుఁడు గౌతముండు రాఁ
జేతము పల్లటిల్లఁ గని ♦ చేష్టడి భీతిఁ బ్రకంపితాంగుఁడై. ౯౮౩

కం. వెలవెలఁ బాఱెడిమోమున, నిలిచినఁ దనరూపు గొనిన♦నిర్జరనాథుం
జెలిసి మహామహుఁ డిట్లని, పలికెన్ రోషంబు రూపు ♦ వడసినభంగిన్. ౯౮౪

→ గౌతముఁ డహల్యను నింద్రుని శపించుట. ←

కం. నాయట్టిరూపుఁ గైకొని, చేయంగారాని యట్టి♦చేఁతకుఁ దెగినా
వా? యజజాతీ! బీజము, వాయుంగా నీకు నేల♦పాలుగ దీనన్. ౯౮౫

కం. అని శపియించిన సంక్రం,దనున్వృషణము లూడి పడియెఁ ♦ దత్క్షణమ ధరన్,
ఘనరోషంబునఁ దనజా,యను ముని శపియించెఁ గటము ♦ లదరఁగ నిట్లుల్.

కం. పెక్కేండ్లు నీవు గాలిన్, మెక్కుచుఁ గూడేమి లేక ♦ మిడుకుము తాపం
బెక్కఁగఁ గనఁబడ కెరికి, నిక్కడఁ బెనుబూదిఁ బండి ♦ హీనచరిత్రా.[1] ౯౮౬

కం. ఏనాఁడు దశరథేశ్వరు,సూనుఁడు రాముండు దీనిఁ ♦ జొరఁ గలుగునొ నీ
వానాఁడు పూతవై దు,ర్మానిని! వాయంగఁ గలవు ♦ మహితాఘంబున్.[2] ౯౮౭

చం. అతనికి నాతిథేయ మగు♦నర్హసపర్య లొనర్చి యోసి దు
ర్మతి! గతలోభమోహ నయి ♦ మాసితమైనస్వరూప మూని యా
తతముదమార మున్నికట♦ధారిణి నిల్వఁగఁ గల్గు నంచు ను
ద్ధతి శపియించి దీని విడి ♦ తాఁ జనె శీతనగంబుపొంతకున్. ౯౮౮

సీ. ఈరీతి ముష్కవి♦హీనుఁడై శతమన్యుఁ, డగ్ని పురోధను ♦ లైనసురలఁ
గడు వెల్లఁబాటునఁ ♦ గని గౌతముఁడు ఘోర,తప మాచరింప నా♦తపముఁ జెఱిచి
యతనికిఁ గ్రోధంబు ♦ నగ్గలం బొనరించి, తపమును నే విఘా♦తంబు చేసి
దేవకార్యముఁ దీర్చి♦తిని; ముని కలుషించి, బీజహీనుఁడుగ శ♦పించె నన్ను
తే. సతి నహల్యను దిట్టె రో♦షమున విడిచె, నతఁడు మ మ్మిట్లు దిట్టుట ♦ నతనితపము
పొల్లువడె నుర్వికార్యంబు♦పొందె నిట్టు, లైతి నఫలుని జేయ రే ♦ యమరవరులు.

చం. హరిహయుఁ డిట్టు లాడ విని ♦ నాగ్ని పురోగము లెల్ల దేవతా
వరులు మరుద్గణంబు పితృ♦వర్గములం గని మేఁక నొండ మా
సురపతి యండహీనుఁ డయి ♦ స్రుక్కుట గల్గెను గాన వేగ మీ
రరసి యజాండము ల్గొని సు♦రాధిపు బీజయుతుం ఘటింపరే. ౯౯౦

ఆ. అఫల[3] మైనమేక♦యామిషంబును మీకుఁ, దనివి గూర్చఁ గాక ♦ ధరణిజనము
లట్టిదాని నొసఁగ ♦ యజ్ఞఫలమునకు, హాని రాక యుండు ♦ నని వచింప ౯౯౧

---

[1] దీనివలన నహల్య రాయి యయ్యె ననుట వాల్మీకిమతము గాదు. [2] భగవద్దర్శనంబునఁ గాని
జారిత్వదోషము పాయదు. [3] అఫలము = వృషణహీనము.

చం. దివిజుల నాలకించి పితృ♦దేవత లప్పుడు మేకబీజము
ల్దివిచి సురేంద్రునందుఁ దవి♦లించిరి;[1] నాఁటను గోలె బీజముల్
దవులని మేకమాంసమును ♦ దారు భుజించుచు యజ్ఞకర్తకున్
మివుల ఫలంబు లీయఁగను ♦ మేకొని రాపితృదేవతల్ దమిన్. ౯౯౩

ఆ. గౌతమర్షి తపము♦కలిమిబలంబున, మేషవృషణుఁ డగుచు ♦ మేఘవాహుఁ
డమరె నాఁటఁ గోలె ♦ నాశ్రమంబును జొచ్చి, సతిఁ దరింపఁ జేయ ♦ మతిఁ దలంపు.

## అహల్యాశాపమోక్షణము.

సీ. అనుచు వాక్రుచ్చిన♦మునివాక్యములు విని, సహలక్ష్మణుఁడు రామ♦చంద్రుఁ డంత
ననఘుండు కౌశికుం♦డును మున్నుగా నేగ, గౌతమాశ్రమ మేగి ♦ కాంచె నందు
వరమహాభాగను ♦ గురుతపోద్యోదిత,దుర్భర తేజను ♦ దుర్నిరీక్ష
బనిపడి నలువచే♦తను నమానుషరూప, గాఁగ మాయామయి♦కరణి సృష్ట
తే. మంచు కప్పిన, మబ్బున ♦ మాటువడిన, నిండుఁ జందురురుచివోలె ♦ నుండుదాని
నీటఁ బ్రతిబింబితం బయి ♦ నిగుడు చున్న,యెండ యనఁ దేఱిచూడ రా♦కుండుదాని.

కం. శ్రీరామచంద్రుఁ డాశ్రమ,ధారిణిఁ జేరంగ శాప♦తాపము వాయన్
నారీమణి తనపూర్వా,కారంబున భువనములకుఁ ♦ గనఁబడె మరలన్. ౯౯౬

సీ. రామలక్ష్మణు లంత ♦ నామెకు మ్రొక్కిన, మదిరాక్షి గౌతము♦మాటఁ దలఁచి
వారలు పూజ్యు లం♦చారసి పాద్యంబు, నర్ఘ్యంబు నిచ్చిన ♦ నందుకొనియెఁ
గాకుత్స్థుఁ డంతట ♦ నాకంబునందుండి, సుమవృష్టి గురిసెను ♦ సురలు దేవ
దుందుభిస్వనములు ♦ క్రందుగ మొరయంగ, మేలుమే లంచును ♦ మెచ్చి రింతి
తే. ఘోరతపమున శుద్ధ యా♦వారిజాక్షి, స్వీకరించుచు గౌతమ♦ర్షిప్రవరుఁడు
రాముఁ బూజించె నామునిరాజు చేతఁ, బూజలను బొంది రాముండు♦పోవఁ దొడఁగె.

సీ. తమ్ముఁడు దోడు రా ♦ నమ్ముని మున్నుగా, నీశాన్యదిక్కుగా ♦ నేగి జనకు
సవనవాటముఁ జొచ్చి ♦ సవురు నాలోకించి, మునివర్యుతోడ రా♦ముండు పలికె
యజ్ఞసామగ్రి య♦త్యంతము శ్లాఘ్యంబు, వివిధ దేశాగత♦విప్రవరులు
వేదాధ్యయనరతు ♦ ల్వేనవే లున్నారు, పరమఋషీశుల♦వాటములును
తే. శకటశతసంకులం బయి ♦ ప్రకట మయ్యె, నెంచ నిలువంగ మన కిటఁ♦బొందు సనిస
జలము నిండారి జనకల♦కలము లేని,తలము విధియించె నమ్ముని♦జలజభవుఁడు.

కం. మునివర్యుఁడు కౌశికుఁ డటఁ, జనుదెంచుట నాలకించి ♦ జనకుఁడు భక్తిం
దనదుపురోహితవర్యుని, ననఘు శతానందుఁ గూడి ♦ యచటికి వచ్చెన్. ౯౯౯

## శ్రీరామాదులు మిథిలకుఁ బోవుట.

చం. ఇటు లరుదెంచి యమ్మునిమ♦హేంద్రునిఁ గొల్చుచు నుండ నింతలోఁ
దటుకున ఋత్విజుల్ విధిహి♦తంబుగ నర్ఘ్యముఁ బాద్య మీయఁ బ్ర

[1] దీనివలన నెంతటి శస్త్రచికిత్స యార్యవైద్యు లెఱింగియుండిరో తెలియనగు.

స్ఫుటమతి దానిఁ గైకొనుచు ♦ భూపతిసేమము సప్తతంతుసం
ఘటనము ప్రశ్నచేసి ఋషి♦కాండములన్ మఱి గారవించుచున్. ౧౦౦౦

ఉ. ముచ్చట లాడు చుండుముని♦ముఖ్యునిఁ జూచి నరేంద్రచంద్రుఁడో
సచ్చరితా! మునీశ్వరుల♦సంఘముతోడస యాసనంబునం
దిచ్చమెయి న్వసింపు మని ♦ యెంతయు వేఁడిన నట్ల చేసి యిం
పచ్చుపడంగ నీవు భన♦దాసనముం గొను మంచుఁ బల్కినన్. ౧౦౦౧

కం. జనకమహీపతి ఋత్విగ్జనసహితుం డగుచు మంత్రి♦సంఘంబులతోఁ
దనదుపురోధులతో నా,సనముఁ గూర్చుండె గాధి♦సంభవుఁ బలికెన్. ౧౦౦౨

సీ. నేఁడుగా మునిచంద్ర ♦ నేఁ జేయునీయజ్ఞ,మునపుణ్యఫలము ను ♦ బొందఁ గంటి
నేఁడుగా దేవతా♦నికరంబు లీక్రతు,సామగ్రిఁ జేసెను ♦ సఫలముగను
నేఁడుగా మౌనీంద్ర ♦ నీ విటు వచ్చుట,కతన ధన్యుఁడ నైతి ♦ క్ష్మాతలమున
నేఁడుగా పుణ్యాత్మ ♦ నీయనుగ్రహమున, జన్మ మెత్తుట యయ్యె ♦ సార్థకంబు

తే. పదియు రెండుదినంబు లే♦ప్పడిఁ యేఁ గోఱెత, యజ్ఞపూర్తికి వెదరి ♦ యార్యవర్య
లంత భాగార్థులై వచ్చు♦నమరవితతి,ననఘ దర్శింపఁ దగు నని ♦ యడిగె మఱియు.

సీ. ఏవార లయ్య యీ♦దేవపరాక్రముల్, వారణపంచాస్య♦పరమగతులు
వీరులు శార్దూల♦వృషభసంకాశులు, జలజాతలోచనుల్ ♦సరసమతులు
కరవాలతూణీర♦శరచాపధారులు, నాశ్వినేయసమాన♦హారితనులు
తోలకరించుచునున్న ♦ మొలకప్రాయమువార, లిచ్ఛమై దివినుండి ♦ యిలకుఁ డిగిన

తే. యమృతభోజను లట్టుల ♦ యనురువారు, మఱియు నింగితచేష్టాప్ర♦మాణములను
నొక్కనూ పయి కూఁకట్లు ♦ నొప్పువారు, వేఁడెదను జెప్పవే నాకు ♦ వీరి తెఱఁగు.

చం. అని జనకుండు పల్కిన మ♦హాత్ముఁడు గాధిసుతుండు తేని కీ
యనఘపరాక్రముల్ దశర♦థావనినాథతనూజు లంచు వా
రొని నిజయజ్ఞ రక్షణముఁ ♦ గూర్చి నిశాటవధంబునున్ విశా
లను గనఁగొంట వెంచి మహి♦శామణి నైనయహల్యఁ గాంచుటల్. ౧౦౦౫

కం. గౌతమసందర్శనమును, బ్రీతిగ నచియించి వీరు ♦ శ్రీకంపునివి
ల్చేతము రంజిలఁ జూడ మ,హాతేజా కోర్కి గలిగి ♦ యరుదెంచి రనన్. ౧౦౦౬

కం. మునినుడులను విని గౌతమ,తనయాగ్రణి మేనఁ బులక♦తతు లమరఁగ రా
మునిదర్శనమున నచ్చెరు, గొనుచు శతానందుఁ డనియెఁ ♦ కుశికాత్మజుతోన్.

సీ. చూపితే మునిరాజ ♦ సుశ్లోకఁ జిరతప,స్విని నాదుజనని రా♦తనయునకును
దెలిపెనే యీసర్వ♦దేహిపూజార్హని[1], నాతల్లి రాము వ♦న్యంబు లొసఁగి

[1] దీనివలన రాముఁ డవతారమూర్తి యని శతానందుఁడు గ్రహించెనని యేర్పడుచున్నది.

చెప్పితే నాతల్లి ♦ చేటుకాలం బైనఁ, జలిపిన యాదుష్ట♦చరిత మెల్లఁ
జేరెనే నాతల్లి ♦ చెలిమి నాతండ్రిని, దశరథాత్మజుశుభ♦దర్శనమున
తే. నాదు జనకుండు పూజించె♦నా మహాత్ము, రాముఁ? బూజల నందెనా♦బ్రహ్మవిదుఁడు
స్వాశ్రమాగతుఁ డైనయా♦యనఘుచేతఁ? దండ్రి గైకొనె నయ్య నా♦తల్లి మరల?
కం. అని యిట్లు శతానందుఁడు, దను నడిగిన గాధిజుండు ♦ తరుణము చెడకుం
డను జేసితిఁ గర్తవ్యం,బును; రేణుక పతిని బోలె ♦ ముని గౌతమునిన్ ౧౧౦౯
కం. మీతల్లి చేరికొనియెం, బ్రీతి న టం చనఁగ మునము ♦ మేకొని కౌస
ల్యాతనయునిఁ గనుఁగొనుచు మ,హాతేజుఁడు గౌతమర్షి♦యాత్మజుఁ డాడున్.
తే. స్వాగతము నీకు నోరామ♦చంద్ర! మాయ,దృష్టమున నిట్లు వచ్చితి♦దేశమునకు
నరయఁగ నజయ్య తేజుఁ డై♦నట్టిగాధి, నందనుఁడు మున్ను గాఁగ నా♦నందమునను.
తే. తెలియుదే రామ! నిస్తుల ♦ తేజుఁ డైన, కౌశికుం డెన్నరా నట్టి♦కడునుఁదపము
చేత బ్రహ్మర్షితను గొన్న ♦ శిష్టవరుఁడు, నీకు శివతాతి[1] యంచును ♦ నెమ్మనమున.
కం ధన్యుఁడు గలుగఁడొ రామా, యన్యుఁడు నీకంటె భువన♦మం దెందు నసా
మాన్యతపోబలుఁ డగునీ,మాన్యుఁడు నీరక్షకుఁ డయి ♦ మహి వెలయుటచేన్.
కం. వినుమా విశ్వామిత్రుని, ఘనమాహాత్మ్యంబు నీవు ♦ కడమ వడక యె
ల్లను మానితగతి నే వా,కొనువాఁడను నతనిబలము ♦ గుణములుఁ జరితల్. ౧౧౧౪

శ్రీరాములకు శతానందుఁడు విశ్వామిత్రుపూర్వవృత్తాంతంబుఁ దెల్పుట.

సీ. ఈధర్మశీలుఁడు ♦ పృథ్వీశుఁ డై యెంత, యేనికాలము ప్రజ ♦ నేలినాఁడు
సకలవిద్యల నేర్చి ♦ జనహితరతుఁ డయి,ధర్మజ్ఞ డనుకీర్తిఁ ♦ దనరినాఁడు
అజునిపుత్త్రుఁడు కుశుం♦డాతండు కుశనాభుఁ, గనియె నాతఁడు గాధిఁ♦ గనియె నయ్య
గాధితనూజుఁ డీ♦కౌశికబ్రహ్మర్షి, పెక్కు వేలేఁడు లీ♦పృథ్వి నేలు
తే. చుండి యొకనాఁడు నిజచమూ♦వ్యూహయుక్తి, నఖిలమేదినినగరంబు♦లాశ్రమములుఁ
బట్టణంబులు నేఱులుఁ ♦ బర్వతములు, సంచరించు చొకానొక♦సమయమునను.
కం. నానావృక్షసమాకుల, మై నానామృగవిహంగ♦మాకీర్ణం బై
దానవదేవాన్విత మై, మానిత మై సాధుహరిణ♦మంజుల మగుచున్. ౧౧౧౬
ఆ. అగ్నికల్పులౌ మ♦హాత్ములచేతను, దపము సేయుధన్య♦తముల చేత
దివ్యతేజు లైన♦దేవర్షివరులచే, బ్రహ్మఋషుల చేతఁ ♦ బ్రబలుదాని. ౧౧౧౭
ఆ. వారిభక్షకులును ♦ వాయుభక్షకులును, భూజ శీర్ణ పర్ణ♦భోజనులును
ఫలము లారగించి ♦ పరివర్జితక్రోధు, లైనవారు దాంతు ♦ లైనవారు. ౧౧౧౮
కం రిసులును[2] జపపరవైఖా,నసులును మఱి వాలఖిల్య♦నానామునిరా
డ్వసరంబులు పొలుపారఁగ, నసమం బై బ్రహ్మలోక ♦ మనఁ దగు దానిన్. ౧౧౧౯

[1] శివతాతి = శుభము చేయువాఁడు. [2] రిసులు = ఋషులు; ఋషిశబ్దభవము రిసిగాని రుసిగాదు.

విశ్వామిత్రుఁడు వసిష్ఠు నాశ్రమంబునకుఁ బోవుట.

చం. ఘనుఁడు వసిష్ఠునాశ్రమముఁ ♦ గాంచి ముదంబును జెంది చొచ్చి స
ద్వినయవిధేయతాగరిమ ♦ వీరుఁడు సమ్మునిరాజుచెంతకున్
జని ప్రణతుల్ ఘటింప ముని ♦ చంద్రముఁ డానృపవర్య సేమమా
యని యుచితాసనం బిడిన ♦ నం దుపవిష్టుఁడు నయ్యె నీతఁడున్. ౧౦౨౦

కం. ఇం బమర యథాశాస్త్రీ,యంబుగ ముని తెచ్చి మధుఫ ♦ లాదుల నిడఁ జి
త్తంబునఁ బొంగుచు నానం,దంబున నీయన గ్రహించి ♦ తపసిం బలికెన్.

తే. కుశలమా మీకు నోముని ♦ కులవతంస, సేమమే యగ్నులకు నెల్ల ♦ శిష్యులకును
భద్రమా చెప్ప యానీత ♦ పంబు జపము, తరులతాదులఫలములు ♦ దనరునయ్య.

తే. అనిన రాజేంద్రునకు నిట్టు ♦ లనె వసిష్ఠ,మౌని కుశలంబ సర్వంబు ♦ మానవేంద్ర
సేమమే కద నీకు నీ ♦ సేవకులకు, నయినవారికి హితులకు ♦ సందఱకును. ౧౦౨౩

సీ. ధర్మమార్గం బింత ♦ తప్పక రాజస్య,నీతిమై జనములఁ ♦ బ్రోతువయ్య
నీభృత్యు లెల్లరు ♦ నీవశవర్తు లే, కరము ప్రీతిని వారి ♦ నరయుదయ్య
నీశత్రు లెల్లరు ♦ నిర్జితు లే కదా, బలకోశమిత్రముల్ ♦ ప్రబలునయ్య
భార్యలుఁ బుత్రులుఁ ♦ బౌత్రులుఁ గుశలు లే, జనులకు హర్షంబు ♦ దనరునయ్య

తే. యనుచు నడిగినఁ గుశల మ ♦ టంచుఁ బలికె, నిట్టు లిద్దఱు హర్షంబు ♦ మట్టు మీఱఁ
బుణ్యగాథలఁ గాలంబుఁ ♦ బుచ్చుచుండ, క్ష్మాతలేంద్రునిఁ బలుకు వి ♦ ధాతృసుతుఁడు.

వసిష్ఠుఁడు విశ్వామిత్రునకు విందు సేయుట.

కం. అతిథిశ్రేష్ఠుఁడ వీ వో, క్షితిపా! పూజ్యుఁడవు నిన్ను ♦ సేనలతోడన్
మతి గలిగ సత్కరింపఁగ, నితవుగ సంగీకరింపు ♦ మీ నీ వనినన్. ౧౦౨౫

ఉ. అందితి నాతిథేయము మ ♦ హాత్మక నీప్రియవాక్కులన్, సుధా
తుందిలకందమూలవిత ♦ తుల్ వనమందలి వారగించి నా
నందముఁ బొందినాఁడను, ఘ ♦ నం బగు తావక దర్శనంబునన్
జెందితి ధన్యతన్, సెలవె ♦ స్నేహముఁ బాయకు పోయి వచ్చెదన్. ౧౦౨౬

కం. అనుచున్ మఱిమఱి తనుఁ బ్రా,ర్థన చేసెడి మౌనివరునిఁ ♦ దా నిట్టు లనెన్
మునివర! నీ కిష్టం బెది, యొనరించెద దాని ననుచు ♦ నుర్వీధవుఁడున్. ౧౦౨౭

చం. అనఘుఁడు మౌని యంత శబ ♦ లాఖ్యను దైవతసౌరభేయినిం
గని విను రమ్ము రమ్ము క్షితి ♦ కాంతున కేఁ బెనువిందు పెట్టెదన్
జని యిదె వీరి కెల్లరకుఁ ♦ జాలఁగఁ గూర్పుము కోర్కె తీరఁ జ
య్యావ మధురాన్న పానక ర ♦ సాయన లేహ్య ఫలాదిభోజ్యముల్. ౧౦౨౮

చం. అన విని కామధేనువు య♦థార్థమ్ముగాఁ బలుపిండివంటలుఁ
ఘనముగఁ దేనె మద్యములుఁ ♦ గమ్మనికూరలుఁ బప్పు లప్పముల్
గొనికొని యెవ్వ రెవ్వ రెవి ♦ గోరుదు రట్టివి యెల్ల రాను లై
యొనరఁగఁ బాలుఁ బండ్లు రుచి♦రోష్ణతరాన్నముఁ గంచక్క్రెరల్. ౧౧౨౯

ఉ. నీటుగుతియ్యపానకపు♦నిర్మలపాత్రలు లోనుగాఁగ నే
ర్పాటుగ సృష్టిచేయ మును♦రాజు నృపాలున కెల్లవారికిఁ
హాటకపాత్రు లుంచి రుచి♦రాసనము ల్గొన వారిఁ బంచి వే
పాటిగఁ గుడ్పు వెట్టెఁ బరి♦పాటిగ వెండియునంటి యూకులన్. ౧౧౩౦

కం. అంతఃపురకాంతలతో, మంతులతో ద్విజులతోడ ♦ మఱి సైన్యముతో
నెంతయు మెక్కెను నృపుఁ డ,త్యంతము సంతుష్టి కంర♦తఘ్నముగాఁగన్. ౧౧౩౧

కం. ఈపాటను బరిపాటిగ, సాపా టొనరించి మౌని♦సత్తముతో వే
మాపోవఁ గంటి మనఘా, నీపూజల మెచ్చు వచ్చె ♦ నీశక్తులకున్. ౧౧౩౨

## విశ్వామిత్రుఁడు దనకుఁ గామధేనువు నిమ్మని వసిష్ఠు నడుగుట.

కం. మచ్చిక నొక్కటి చెప్పఁగ, సచ్చరితా కుతుకపడెద ♦ శతదశశతముల్
మెచ్చులిడు మేలికదుపుల, నిచ్చెద నా కొసఁగవే ము♦నీశ్వర! శబలన్. ౧౧౩౩

కం. ఏల యన నాలలోపల, మేలైనది శబల చూవె ♦ మిత్రను తేజా
మేలైనవస్తుతతి భూ,పాలిది[1] గద వినవె రత్న♦హారులు రాజుల్. ౧౧౩౪

చం. అనిన వసిష్ఠుఁ డి ట్లను జ♦నాధిప! యేటికి నూఱువేలు నా
కొనియెద వాల నిత్తు నని ♦ కోటిశతంబుల నాల నిచ్చినన్
గనకపురాసు లిచ్చినను ♦ గా దెడఁబాయఁగ దీని, నాత్మవం
తుని యశ మెట్టు లట్టు లిది ♦ దొ ల్గదు న న్విడి యెల్లవేళలన్. ౧౧౩౫

ఉ. హవ్యముఁ గవ్యము న్బలియు ♦ నగ్నులు హోమము దేహయాత్రయున్
భవ్యగుణాఢ్య! యీసురభి♦పాలనె సర్వముఁ దీర్చు చుండెడ
న్దివ్యము లైనవిద్దియ ల♦నేకము లున్నవి దీనియందు, నా
కవ్యయమోదహేతువు య♦థార్థము సు మ్మిది పాయ నేర్తునే. ౧౧౩౬

సీ. అంతియ కాక యు♦నంతము లున్నవి, హేతువు ల్గాన నే ♦ నీయ శబల.
నన వసిష్ఠునిఁ జూచి ♦ యనియె గాధిసుతుండు,|బంగారుసొమ్ములఁ ♦ బటిమ మీఱు
పదునాల్గువేలద్వి♦పముల నొసంగెద, నాల్గుకక్ష్యములచే ♦ నవ్యము లగు
హేమరథంబుల ♦ నిచ్చెద నీకును, నెనిమిదినూఱు ల♦హీనజవము

తే. లయినదేశభవంబుల ♦ నశ్వములను, బదియునొక్కొండు వే లిత్తు ♦ బహుళవర్ణ
యుక్తధేనువులను గోటి ♦ నొసఁగువాఁడ, నీయవే నాకు మౌనీంద్ర ♦ యీశబలను.

---

[1] భూపాలి = రాజసమూహము.

మ నగలో రత్నములో హిరణ్యములో నా♦నాదేశసామగ్రులో
తగుమాన్యంబులో భూములో మడులో కాం♦తాశ్రేణులో యెవ్వని
చ్చగ నాసించెద వన్ని నిచ్చెద మునీ♦శా! యీయవే దీని నా,
నగునే యీయఁగ నెంత యే నడుగు మీ♦య న్నేర భూపాలకా! ౧౦౩౮

చం ఇదియు ధనంబు నాకు ధర♦ణీశ్వర! యియ్యదె నాకు రత్న మి
య్యదియ మదీయసర్వధన ♦ మయ్యెడిఁ జమ్ము మదీయజీవితం
బిది యగు దర్శ యజ్ఞము ల♦హీనపుదక్షిణపూర్ణమాస, లి
య్యది చుమి మత్త్రియాతతుల ♦ కంతకు మూలము గాధినందనా. ౧౦౩౯

కం.ఏమిటికి నిన్ను వేఁడక, మామాటలు పెక్కు లాడ ♦ నన్నిటి నిడు నీ
కామగవి నొసఁగ నేను, భూమీశ్వర! విడువు ప్రొద్దు♦పోవనిమాటల్. ౧౦౪౦

విశ్వామిత్రుఁడు కామధేనువును బలాత్కరించి పట్టుకొనిపోవుట.

సుగంధి. ఇట్టు లామునీంద్రుఁ డాడి ♦ యీయ నన్న ధేనువున్
బట్టి కట్టి కొంచుఁ బోవఁ ♦ బార్థివుండు బల్మి మైఁ
దొట్టఁగన్ దురంతచింత ♦ దుఃఖితాత్మ యౌచు న
న్నిట్టు వాయఁగా మునీంద్రుఁ ♦ డేమి తప్పు చేసితిన్. ౧౦౪౧

కం.ఏడ్చుచు నుండఁగ న న్నిట్లీడ్చుకొనుచుఁ బోవఁ జాగి ♦ రీభటు లని తా
నూడ్చుకొని కట్టులను గవి, మూడ్చుచుఁ దన్భటులఁ జేరి♦మౌనినికటమున్ ౧౦౪౨

ఉ. కన్నుల నీరు గాఱ నధి♦కవ్యథ నేడ్చుచు గోలుగోలునన్
బన్నుగ దేవదుందుభిర♦వంబున ని ట్లను బ్రహ్మపుత్ర యో
పన్నజనావనా! యిటులు ♦ పాయుటకుం గత మేమి నన్ను, నీ
సన్నిధిఁ బాపికొంచు చనుగ ♦ సాగిరి యీధరణీశుకింకరుల్. ౧౦౪౩

శా.శోకంబుట్టువువోలె దుఃఖగరిమన్ ♦ దోదూయమానాత్మయై
వాకంబాతినమోముతో వగచుచుం ♦ బ్రార్థించు నగ్గోవుతో
వీడ న్నే నిను ధేనురత్నము! కడున్ ♦ వీర్యాతిగర్వంబునన్
బాడిం బాసి గ్రహించె నిన్బలిమి భూ♦పాలుండు మోహాంధుఁడై. ౧౦౪౪

కం.ఆతండు ధారిణీశుఁ డు,పేతబలుఁడు వీర్యయుతుఁ డిఁ♦కే మన నేనో
పీతబలుఁడ బాపఁడ నా,చేత మతే మగును వాని♦చేతలు మాన్పన్. ౧౦౪౫

కం.వానికిఁ గల దక్షౌహిణి,సేన శతాంగాశ్వకేతు♦సింధురయుత మై
జా నై; యే మున్నది నా, కానృపు నెదిరింప? నెఱుఁగ♦వా నాస్థితులన్.౧౦౪౬

చం.అన విని సౌరభేయియు మ♦హాత్మక! క్షత్త్రబలంబునుం బలం
బన నగు నయ్య? బ్రహ్మబల ♦ మా బల మన్నను; నప్రమేయ మా

ననుపమతేజ! నీమహిమ ♦ మాన్పఁ డెంతబలాఢ్యుఁ డయ్యు నీ
కును నధికుండు గాఁడు, వెసఁ ♦ గూల్చెద నాతనిసేన నంతయున్. ౧౦౪౭

కం. వాని దురాత్ముని దర్పవి,హీనుంగా యుష్మదీయ ♦ భృశమంత్రబలా
దీనను నేఁ గావించెద, మానీశ్వర! యాన తీయు♦మా యని తన్నున్ ౧౦౪౮

కం. వేఁడెడిశబలకు నమ్ముని,తాఁ డానతి యిచ్చె రిపులు ♦ ఱిచ్చ వడంగాఁ
బోఁడిమి సెడఁ గల్పింపుము, వాఁడిమగల ననిన శబల ♦ వందలకొలఁదిన్. ౧౦౪౯

## కామధేనుకల్పితసైన్యముచే విశ్వామిత్రుసేన నాశ మగుట.

కం. శూరుల రిపుచయభయదా,కారులఁ బహ్లవుల నంతఁ ♦ గల్పించెను హుం
భారవమున; వారు చమూ,వారంబును రూపుమాపి ♦ వఱలఁగఁ గనుచున్ ౧౦౫౦

ఉ. క్రోధకషాయితాత్ముఁ డయి ♦ ఘోరశరంబులఁ బహ్లవాళి దు
స్సాధపరాక్రముండు ధర ♦ సాల్పడి వీఁచ మడంగఁ గూల్చినన్,
గాధితనూజుపైఁ బఱపెఁ ♦ గ్రమ్మఱ ధేనువు పట్టిసావళీ
సాధనధారులన్ యవన♦సంఘములన్ శకసైన్యకోటులన్. ౧౦౫౧

ఉ. వారలు కారుచిచ్చన న♦వారణవిక్రమకేళికారతిన్
భూరమణోరుసైన్యమును ♦ బూర్ణముగా దహియించి నైచినన్
గ్రూరతరాస్త్రకోటులను ♦ గూల్చెను వారల నెల్లఁ గింకిరిన్
ధారణిఁ బీన్గుపెంటలుగఁ ♦ దద్ద పడన్ గుది గ్రుచ్చి నట్లుగన్. ౧౦౫౨

సీ. చటులవిశ్వామిత్ర♦శస్త్రాస్త్రనిర్దగ్ధ, సేనలఁ గాంచి వ♦సిష్ఠమునియు
శబల! సృజింపుము ♦ సత్వరంబుగ యోగ,బల మాశ్రయించుచు ♦ బలఁగములను
నని నిదేశించిన ♦ నదియు హుంభారవం,బున సృష్టిచేసెఁ గాం♦భోజసమితిఁ
బొదుగునఁ బహ్లవ♦పూగంబుఁ గల్పించె, యోనిని యవనాళి ♦ నొదువఁ జేసె;
తే. సృష్టి గావించె శకుల శ♦కృత్ప్రదేశ, మునను; మ్లేచ్ఛకిరాతాళి ♦ పొడమె ధేను
రోమకూపాళి; వారెల్లఁ ♦ ద్రుంచి రఱిమి, సరథగజఘోటభటముగ♦ఁ ద్వాపుసేన.

ఉ. సేనలు మూలముట్టుగ వ♦సిష్ఠునిచే హత మైన, భూమిభృ
త్సూనులు నూర్వు రుగ్రతర♦శూలపరశ్వధశస్త్రహస్తులై
మానుగ నొక్కపూఁపున స♦మన్యుమునీంద్రుని డాయ, హుంకృతి
న్మౌనివరుండు నూర్వుర నొ♦నర్చె క్షణంబున బూదిప్రోవుగన్. ౧౦౫౪

చం. కొడుకులు నూర్వురున్ ధరణిఁ ♦ గూలుటయున్ బల మెల్ల నుగ్గుగాఁ
బొడవు చెడంగ బిద్దుటయు ♦ భూపతి గన్గొని వ్రగ్గి సిగ్గుచేఁ
జెడితి మునీశ్వరు న్గెలువఁ ♦ జేకుఱు టెట్లొ యటంచు దీనుఁ డై
మిడుకుచు వెచ్చనూర్పుచును ♦ మేదిని వ్రాలి విషణ్ణచిత్తుఁ డై. ౧౦౫౫

ఉ. వేగము లేని నీరనిధి, ♦ వీడినకోఱలక్రూరసర్పముల్,
బాగుగ గ్రస్తుఁడైనఖర♦భానుఁడు, పక్షము లూడఁ బక్షి, నా
వేగముఁ బాసి కాంతి చెడి ♦ వెల్వెలఁ బోవుచు భగ్నదర్పుఁడై
యేగతినే జయింప మది ♦ నెంచి కుమారుని నిల్పి భూభృతిన్. ౧౦౫౬

కం. వీరుండు వడఁకుగుబ్బలిఁ, జేరం జని తప మొనర్చె ♦ శివుఁగూర్చి; భవా
నీరమణుఁడు దర్శన మిడి, కోరుము రాజేంద్ర కోర్కెఁ ♦ గొనసాగింతున్. ౧౦౫౭

చం. ఇటులు నిటాలనేత్రుఁడు నృ♦పేంద్రునిఁ బల్కిన మోడ్పుఁ జేతులన్
నిటలముఁ జేర్చి మ్రొక్కి ధర♦ణీవిభుఁ డోనతభక్తలోకసం
కటహరణా! యుమారమణ! ♦ కర్కశదైత్యహరా! హరా! విశం
కటదయ నన్నుఁ జూడు పుర♦ఖండన! తుష్టుఁడ వేని నాయెడన్. ౧౦౫౮

కం. సాంగోపాంగోపనిష,త్సంగతి సరహస్యముగఁ బ్ర♦సాదింపుము నా
కుం గరుణ ధనుర్వేదం, బంగజమదహరణ! సురస♦మర్చితచరణా! ౧౦౫౯

ఆ. అసురులందు మునుల♦యందును గంధర్వ, వరులయందు యక్ష♦సురులయందుఁ
గలుగునస్త్రసంతతిఁ ♦ గరుణింపవే నాకు; గారమారఁ గోర్కె ♦ దీర ననిన. ౧౦౬౦

ఉ. వల్లె యటంచు హైమవతి♦వల్లభుఁ డేగిన, నస్త్రమండలం
బెల్లను గైకొనం బగుడు, ♦ నెంతయుఁ బొంగి సమృద్ధదర్పుఁడై
పొల్లడఁగె న్మునీశ్వరుఁడు ♦ పో యని పున్నమనాఁటికంధి నాఁ
బెల్లుగ నుబ్బుచుం జనియెఁ ♦ బెన్నడ నమ్మునియాశ్రమోర్వికిన్. ౧౦౬౧

వసిష్ఠవిశ్వామిత్రులయుద్ధము.

చం. జితసకలారి భూపతి వ♦సిష్ఠుతపోవన మెల్ల భస్మసా
త్కృత మొనరించె నొక్కత్రుటిఁ ♦ గీప్పడి యచ్చటి మౌనికోటి భీ
హతమతిఁ బాఱ దిక్కులకు ♦ నన్యయదివ్యమహాస్త్రకీలలన్
ద్రుతగతిఁ బాఱెఁ బక్షితతి ♦ దూలిరి శిష్యవరుల్ భయార్తులై. ౧౦౬౨

చం. నిమిషములోపలం జవిటి♦నేలకుఁ దుల్యతనొంది తద్వనం
బమరఁగ శబ్దశూన్యమయి ♦ యప్పుడు రుష్టమనంబుతోడ సం
యమి పొరివుత్తు గాధిజు ర♦యంబున మంచును సూర్యునట్టు ల
శ్రమమునఁ బోకుపోకుఁ డని ♦ సారెకుఁ జెప్పిన నిల్వ రెవ్వరున్. ౧౦౬౩

కం. ఇటు చెప్పియు నిలకున్నను, బటుతరసంరంభరోష♦పరవశుఁ డగుచున్
గుటిలభ్రూకుటినటనము, స్ఫుటముగ నిట్లనియె మౌని ♦ భూపాలునితోన్.

ఉ. ఆఁపఁగ లేనటంచనిర ♦ యక్కట మచ్చిరసంప్రవృద్ధ మా
తోఁపును దూపులం గినిసి ♦ దోఁకిన పెట్టితి, కాల్చి దివ్వటీ

దోఁపిడి కాఁడు వోలె? నిను ♦ దోసము రోరి దురాత్మ! యింకిటఁ
సైఁపఁగ, నంచు రోషవివశ♦శప్పృహుఁ డై కడు దుర్ని రీక్షుఁ డై. ౧౦౬౫
కం. రెండవ యమదండం బయి, మండుచు నిర్ధూమకల్ప♦శిఖ యనఁ గీలల్
మండు తనబ్రహ్మదండం, బొం డాడక కేలఁ దాల్చి ♦ యున్నతి నిలిచెన్. ౧౦౬౬
శా. జృంభారంభమహోద్ధతి న్నిలువ నే♦సెన్ మౌనిపై భూమిభృ
జ్జంభారాతియు నిల్వు నిల్వు మని వా♦చాడంభ మేపార సం
రంభో త్తేజితవహ్ని బాణ; మది పై ♦ రాఁ జూచి యమ్మౌని దో
స్స్తంభాగ్రంబున బ్రహ్మదండ మిడి వి♦శ్వామిత్రుతో నిట్లనున్. ౧౦౬౭
చం. నిలిచినవాఁడ గాధిజుఁడ! ♦ నే నిదె చూపుము క్షత్రబంధు! నీ
బలముఁ జేలంబు శస్త్రముల♦పాండితిదర్పము నీఱు చేసి ని
న్నిలకును బాతు; క్షత్రబల ♦ మెక్కడ బ్రహ్మబలం బ దేవరా'[1]
పలువ! నృశంస! దివ్య మగు♦బ్రహ్మబలం బిటు చూడు చూపెదన్. ౧౦౬౮
సీ. అని బ్రహ్మదండంబు♦సను నార్చి గాధిజు, నగ్నిబాణము నీట ♦ నగ్నిఁ బోలె
ధారణీశ్వరుఁడును ♦ వారుణరౌద్రేంద్ర, పాశుపతైషీక♦బాణములును
మానవగాంధర్వ♦కోపముల్ మోహన, మానవజృంభణ♦మాదనములుఁ
సంతాపనంబు దు♦ర్దాంతవిలాపన, దారుణశోషణ♦దారణములుఁ
తే. బరమదుర్జయ మగువజ్ర♦శరము బ్రహ్మ, పాశమును గాలవారుణ♦పాశములును
దండపైశాచదయితముల్ ♦ రెండశనులుఁ, గ్రౌంచశుష్కార్ద్రపైనాక♦ఖగము లేసె.
సీ. ధర్మచక్రంబును ♦ దారుణకాలచ, క్రంబును విష్ణు♦చక్రంబు మఱియు
మథనవాయవ్యముల్ ♦ మఱి హయశిరమును, శక్తియుగ్మంబు ము♦సలము వెండిఁ
గంకాళమును ఘోర♦కాలాస్త్రమును దీవ్ర, వైద్యాధరంబు నా♦ వఱలుశరముఁ
గాపాలముఁ ద్రిశూల♦కంకణా జిహ్మగం, బులుఁ గిన్కఁ దెగ నిండఁ ♦ బూన్చి చిమ్మ
తే. బ్రహ్మదండంబునను మ్రింగె ♦ బ్రహ్మసుతుఁడు, తచ్ఛరంబుల నెల్లను ♦ దక్షిణమున
నేమి చెప్పుదు శ్రీరామ ♦ యెల్లరకును, నక్కజం బయితోఁచె మ♦హాత్మమహిమ.
శా. సర్వాస్త్రంబులు నిష్ఫలం బగుడు వి♦శ్వామిత్రుఁ డుద్యన్మహో
ఖర్వక్రోధభయానకాకృతి లస♦ద్గర్వంబునన్ రేఁగి గం
ధర్వర్షి ప్రతతుల్ సుపర్వగణముం ♦ త్రైలోక్యమున్ భీతిమై
దుర్వారంబుగ సంభ్రమింప మునిపై ♦ దోర్దర్పముం జూపుచున్. ౧౦౭౦
శా. బ్రహ్మాస్త్రం బరి వోసి యేయ నదియుం ♦ బైరా శిఖామాలిక
ల్బ్రహ్మాండంబున నిండఁ గాంచి తనకే♦లన్ బ్రహ్మదండంబునన్
బ్రహ్మాపత్యము పూని మ్రింగె విబుధు ♦ ల్భ్రాంతాత్ము లై చూడఁ; ద
ద్బ్రహ్మాస్త్రగ్రసనంబున న్మునికి రౌ♦ద్రం బయ్యె నాకారమున్. ౧౦౭౧

[1] అనాస్థివిస్మయం జంత బలిష్ఠుఁడైనను నాస్తివిద్యాపఁటుని గంధఁఁ టాంచ.

ఉ. దారుణ మైనరూపమును ♦ దాల్చినయమ్మునిరోమనిష్కూపా
ద్వారచయంబులన్ దహను♦జ్వాలలపంక్తులు వెల్వడంగ, దు
ర్వారమహాప్రభావు ముని♦రాజును గాంచి ఋషీశ్వరుల్ స్తవం
బార నొనర్చి యిట్లనిరి ♦ హర్షసముల్లసితాంతరంగు లై. ౧౦౭౩

తే. కడు నమేయంబు త్వద్బల♦గరిమ మనుచు, లోకవిఖ్యాతి మయ్యె ను♦శ్లోక జగము
లవ్యథములుగఁ దేజంబు ♦ నణఁపవయ్య, బ్రాహ్మణోత్తమ నిర్జింపఁ♦బడియె నృపతి.

విశ్వామిత్రుఁడు పరిభవ మంది తపస్సు చేయ నిశ్చయించుకొనుట.

కం. అని యిటు తనుఁ బ్రార్థింపఁగ, మునిగణములు శాంతుఁ డయ్యె ♦ మునిపతి; దానిం
గని యూర్పుచు గాధేయుఁడు, దనమనమున నిట్లు లనుచుఁ ♦ దలఁచెన్ వగచెన్.

కం. బల మనఁగ బ్రహ్మతేజో,బల మే యగు; నిస్సి క్షత్ర♦బలమున్ బల మే?
కలన మదస్త్రము లన్నిటిఁ, దలఁగక హరియించె బ్రహ్మ♦దండం బొకఁ డే. ౧౦౭౬

కం. ఏటికి నాక్షాత్త్రం బిఁక, నేటికి సస్త్రాళి శాంత♦హృదయేంద్రియతన్
సాటి గననిబ్రహ్మత్వము, పాటిలఁ దప ముందు ననుచుఁ ♦ బనిపూని మదిన్. ౧౦౭౭

కం. మైత్రావరుణునితోఁ దన, శాత్రవముకు భంగపాటు ♦ స్మరియించుచు ఖే
దత్రపలకు లోనై కుశ,పుత్రుఁడు నిట్టూర్చి యూర్చి ♦ పొగులుచు నంతన్. ౧౦౭౮

సీ. దక్షిణదిశ కేగి ♦ దారయుతంబుగ, నుగ్రతపస్థితి ♦ నుండఁ దనయు
లందుఁ గల్గిరి హవి♦ష్యందమధుష్యంద,దృఢనేత్రులు మహార♦థేద్ధయశులు
వేయివర్షము లైన ♦ విధి యట కరుదెంచి, మధురవాక్యంబుల ♦ మహిపుఁ జూచి
యనియె రాజర్షిచ♦యంబు నీచే జిత, మయ్యెను దపమున ♦ నట్లు గాన

తే. రాజఋషి వైతి వని యెంతు♦రాజ యని స్వ,లోకమున కేగనురలతో♦లోనఁ జింత
వఱల సిబ్బితిఁ దల వ్రేల ♦ వైచి దుఃఖ,మన్యుదందహ్యమానుఁ డై ♦ మదిఁ దలంచు.

కం. ఎం తెంతో తప మొనర్చితి, నంతయు భావింతు వ్యర్థ ♦ మని మునినుమన
స్సంతతి నను రాజర్షిగ, నెంతు నటం చనియె దీన ♦ నే మగు నాకున్. ౧౦౮౦

కం. అని నిశ్చయించి మనమున, ఘనతర మగుతపము సేయఁ ♦ గడఁగెను వెండిన్
విను మిత్తఁ డిటు లుండఁగ నట, నినకులజాతుఁడు త్రిశంకు♦పృథ్వీవరుఁడున్. ౧౦౮౧

త్రిశంకూపాఖ్యానము.

ఉ. ఎంచుచు మేనితోడ దివి ♦ కేఁగఁగ నధ్వర మొండు సేయఁ బి
ల్పించి వసిష్ఠు నేగతి ల♦భించును నాసమభీష్ట మన్నఁ జిం
తించి యశక్య మన్న మది ♦ దీర్పఁ, నశక్య మ టన్న మాని న
ర్జించి యమూశ నేగెను న♦సిష్ఠతనూజశతంబుఁ గానఁగన్. ౧౦౮౨

కం. ఈకరణి నేగి వినుత,శ్లోకుల నిస్తుల్యకాంతి♦శుద్ధుల సుతప
శ్శ్రీకుల గురుసుతులం గని, భూకాంతుఁడు మ్రొక్కి యానఁ♦పూర్వ్యముగాఁగన్.
చం. శరములు మోడ్చి లజ్జను ము♦ఖం బర వాలిచి వారి కిట్లనున్
గురుసుతులార! మీశరణుఁ ♦ గోరెదఁ గం డిట దిక్కు నాకు నా
దరమున; మేసితో దివికిఁ ♦ దార మనంబునఁ గోరి యొక్కయ
ధ్వర మునుపంగ మీజనకు ♦ వావిరిఁ గోరితి పైసిమాలితిన్. ౧౦౮౪
చం. శిరము భవత్పదంబులను ♦ జేరిచి వేఁడెద నన్నుఁ బ్రోవుఁడీ
పరమతపస్విలార! సుర♦పట్టనముల్ మెయితోడఁ బోవ న
ధ్వర మొనరింపఁ బంపుఁడు; భ♦వజ్జనకుండు తిరస్కరింపఁగా
గురుసుతు లీరు గాక సమ♦కూడునె వే ఱొకత్రాపు నాకిలన్. ౧౦౮౫
శా. ధిక్కారంబును బొంది వచ్చితిని, నా♦దిక్కింక మీ రయ్య, నా
కిక్కార్యంబు ఘటింపుఁడీ, గతి గదా ♦ యిక్ష్వాకువంశ్యాళికిన్
దక్కం జేయఁగ నెల్లపుణ్యముఁ బురో♦ధస్స్రష్ట, యాతండ పో
దిక్కన్న న్మతి దైవ మన్న నిల ధా♦త్రీపాలక శ్రేణికిన్. ౧౦౮౬
కం. కోపసమన్విత మయి యా,భూపాలాపముల నెల్లఁ ♦ బోరి విని యను నా
తాపసవరసుతశత మా,క్ష్మాపాలునిఁ జూచి రోష♦సంభ్రమపరతన్. ౧౦౮౭
మ. అవివేకీ! ఋతవాది యాగురుఁడు ప్ర♦త్యాఖ్యానముం జేయఁగాఁ
దవునే యన్యుని నాశ్రయింప? మరియా♦దా వానిఁ బోనాడఁగా?
రవివంశ్యావళికిం బురోహితుఁడె గో♦త్రానాథ యాచార్యుఁడౌ;
నవునే యాతనిమాట మీఱ, ముని మి♦థ్యావాది యం చెంచితే? ౧౦౮౮
కం. కాదని వసిష్ఠుఁ డాడిన, భూదయితా మాకు దానిఁ ♦ బొసఁగునె చేయన్
లేదు వివేకము నీకెదఁ, గాదన కిఁకఁ బురికిఁ జనుము ♦ కనుము వసిష్ఠున్. ౧౦౮౯
ఆ. నిన్నె కాదు జగము ♦ లన్నిటియందలి,వారి నెవరినైన ♦ సారశక్తి
నతఁడు నవన మునుపఁ ♦ జతురుఁ డాతని కవ,మాన మొదవుపనిని♦బూనఁ గలమె.
కం. పరుషంబుగ నిటు లాడిన, ధరణీశుఁడు గురువుచేతఁ ♦ దత్తనయులచేఁ
బరిభవము గల్గె వే ఱొక,శరణంబును గాంతు మీకు ♦ స్వస్త్య స్తనుచున్ ౧౦౯౧
కం. చలియెద నన నృపుఁ గనుఁగొని, మనమున రోషాగ్ని పెరుఁగ ♦ మానితనూజుల్
గనుమీ చండాలత్వం, బని శాపం బిచ్చి చొచ్చి ♦ రాశ్రమతలమున్. ౧౦౯౨
సీ. వఱువాత మేల్కని ♦ నౌఱ పైన నునుఁజేల, కాటు కద్దినగుడ్డ♦కరణి నయ్యె
బంగారుచుచిమించు ♦ సింగారపున్నెయి, కారుమేఘము రీతిఁ ♦ గాన నయ్యె

మృదువులై నిడుపులై ♦ యింపులౌ నెఱికురుల్, కఱకున రేఁగిజుం♦జురులు నయ్యె
మణిమయకనకభూ♦షణసమూహంబులు, నాయసాభరణంబు♦ లగుచు నొప్పెఁ
తే. జూడ నే మందు మెడను వ్రే♦లాడుచుండు,జన్నిదపుఁబ్రోఁగు లెల్ల నా♦త్మోపునందు
నిమపకమ్ములు నయ్యె నో♦మనుజవర్య, నైఁప రా నట్టి మునిజన♦శాపమునను.

ఉ. మానులకిన్క చేత నిటు ♦ మాలతనంబును గన్నయాధరా
జానిని గాంచి యెల్లరును ♦ సత్వరు లై యెడఁబాసి పోవ లో
నూనినధైర్య మొక్కటియ ♦ యూఁతనిబాసట గాఁగ దుస్సహసం
తానసువర్ధమానసము♦సం బతి కౌశికు డాసి నిల్చినన్. ౧౦౪

ఉ. చేరిన మాలరూపమునఁ ♦ జేష్టడి యున్నత్రిశంకుఁ గాంచి నిం
డారుదయన్ మునీంద్రుఁడు ధ♦రాధిప! శాపము పేర్మిఁ బుల్కసా
కారము నొంది యిచ్చటికిఁ ♦ గారణ మే మరుదేర? నన్న నా
భూరమణుండు మోడ్చి కర♦ముల్ వచియించెను వాక్యకోవిదున్. ౧౦౫

కం.గురుఁడును గురుపుత్రులు నొ,ప్పరికించుట కాక నన్ను ♦ వాంఛం దీర్పన్
దొరకొనక యిట్లు సేసిరి, పరిభవముం బడితి నిట్టి♦పాటును వచ్చెన్. ౧౦౬

కం.దేహంబుతోడ స్వర్గా,రోహణముం జలుపఁ గోరి ♦ యూఢిగ శతసం
ఖ్యాహవములు సలిపితినే, నూహింపఁగ ఫలము శూన్య♦మో మునివర్యా. ౧౦౭

ఉ. ఆడను గల్ల యింతనుక ♦ నాడుట లే దికమీఁద నెన్నఁడే
నోడక క్షత్త్రధర్మమున ♦ నొప్పు మెయిన్ శపథంబు సేసెదన్
గోడొడఁగూడి యుండినను ♦ గోవిదవర్య నిజం బె పల్కెదన్
వీడక ధర్మముం బ్రజల ♦ వేయివిధంబులఁ బ్రోచి జన్నముల్ ౧౦౮

తే. ఎన్నిటినొ చేసి గురుల క♦హీనచరిత,ములను సద్గుణగణముల ♦ ముదముఁ గూర్చి
వాసిఁగంటిని గాని య♦ధ్వరము సేయఁ,గడఁగునాయందు వారికిఁ ♦ గరుణ లేదు.

కం.కావున దైవ మె పర మని, భావింతు నిరర్థకంబు ♦ పౌరుష మిలపై
దైవాక్రాంతము సర్వము, దైవ మె పరగతి యటంచుఁ ♦ దలఁతు మునీంద్రా.

కం.దైవోపహతుఁడ శరణము, నీవే యొండెడకుఁ బోవ ♦ నిశ్చయ మిది నా
దైవంబు నివర్తింపుము, కావుము న న్నిపుడు పురుష♦కారముబలిమిన్. ౧౧౦౧

కం.అని దీనోక్తుల వేఁడెడి,జనపతి సాత్వోన్నిషాదు ♦ సంయమి గని యి
ట్లనియెను మధురోక్తుల నా,యన! కడు మేలగుత నీకు ♦ నంచును మఱియున్.

చం వెఱవకు మోనృపాల శుభ♦వృత్తుఁడ వంచు నెఱుంగు దేను నీ
కొఱఁతను దీర్చువాఁడ ముని♦కోటుల నెల్లను బిల్చి బంతుఁ గ్ర

చ్చట జననంబు సేయు గురు♦శాపకృతం బగు నిట్టిరూపుతో
నుతిదిదివంబుఁ జేర నిను♦ నోపకు పుచ్చెదఁ గీర్తి దెచ్చెదన్. ౧౧౦౩

కం. విస్తర మేలా నృప విను, వాస్తవము వచింతు నింక ♦ స్వర్గము నీకున్
హస్తామలకం బనుమఁ బ్రశస్తగుణా తలఁతు నన్ను ♦ శరణముఁ గనుటన్. ౧౧౦౪

చం. అని వచియించి గాధిసుతుఁ ♦ డాత్మజులం గని యజ్ఞ సస్తువు
ల్గనుఁగొనఁ జెప్పి శిష్యులబ♦లంగముఁ జూచి మదాజ్ఞ పెంపునన్
మునివరులన్ సశిష్యహిత♦ముఖ్యబహుశ్రుతఋత్విజంబుగా
ననయత నేగుదెం డనుచు ♦ సత్వరులై పిలువుండు వెండియున్. ౧౧౦౫

మ. ఎవఁ డేనాపలు కాదరింప కను నే♦మే దానిసర్వంబు మీ
రు వచింపం దగుఁ జుండు నా కనుచు, వా♦రున్ దేశ దేశంబు లు
ద్దవడిం బోయి తదాజ్ఞఁ బిల్చిరి సమ♦స్తబ్రహ్మవాదీశులన్
సవముం జూడఁగ వచ్చి రెల్లరును వి♦శ్వామిత్రునాజ్ఞప్తిచేన్. ౧౧౦౬

ఉ. ఛాత్రులు నేగుదెంచి ముని♦సత్తమ పిల్చితి మెల్లవారి, స
చ్ఛాత్రులు బ్రహ్మవాదు లిదె♦ చయ్యన వచ్చిరి వేల్మిఁ జూడఁగా,
శ్రోత్రియుఁ డామహోదయుఁడు ♦ చూడఁగా రాఁ, డది యట్టు లుండ వై
ధాత్రినుతాళి రోషవశ♦తన్ వచియించెను నిట్టు లుద్ధతిన్. ౧౧౦౭

శా. చండాలుం డఁట దీక్షితుండు, మఱి వి♦శ్వామిత్రభూపాలుఁ డా
చండాలాధ్వరయాజకుం డఁట, బలే ♦ సద్బ్రాహ్మణాగ్రేసరుల్
చండాలాన్న మ దెట్లు తిందురో? సురల్ ♦ సంప్రీతిమై వత్తురో?
చండాలుం డెటు స్వర్గ మేగెడినొ? యా♦స్వర్గం బహో యెట్టిదో? ౧౧౦౮

కం. అనుచు మహోదయుఁ డాడిగ, మునివర! వాసిష్ఠు లనిరి ♦ మునుకొని యనఁ దాఁ
గనుఁగవ నిప్పులు రాలఁగఁ, గనుఁగొని యట నున్న వారి ♦ గాధిజుఁ డనియెన్.

చం. నిరతతపస్సమాధిపరి♦నిష్ఠితు ధర్మరతున్ ననున్ మహా
దురితము లాడి తిట్టుకుమ♦తుల్ మసి గాఁగలవారు వెంటనే,
నిరయముఁ బొంది కాలభట♦నిష్ఠురపాశనశాత్ము లై ధరం
బొరయుదు రేడునూర్లభవ♦ముల్ శవభక్షకు లౌచు, నాపయిన్. ౧౧౧౦

తే. కుక్కమాంసంబుఁ దినుచును ♦ దిక్కుమాలి, నెనరు మది లేక దుర్జాతి♦నీచులగుచు
వికృతవేషంబుతోడుత ♦ వీర లెల్ల, భూమిఁ దిరుగంగఁ గలవా ర♦పూజ్యు లగుచు.

ఆ. తిట్టరానినన్నుఁ ♦ దిట్టినయామహో, దయుఁడు బోయ యగుచు ♦ ధరణిఁ దిరిగి
యాత్మహత్యబలిమి ♦ నరిగి దుర్గతి కందుఁ, గూలువాఁడు నాదు♦కోపమునను.

కం. ఈగతి శపించి మునివర,పూగంబును గాంచి గాధి♦పుత్త్రుండు మహా
భాగుఁ డితండు త్రిశంకుఁడు, త్యాగియు నిక్ష్వాకుకులుఁడు ♦ ధర్మాత్ముండున్.

ఉ. ఈమెయితోడ స్వర్గమున ♦ కేగ మదిం దలపెట్టి వచ్చి న
న్నీ మెయిఁ బ్రాపు గోరె నిఁక ♦ నెల్లర మయ్యది దేవ సాధ్య మౌ
నామహితాధ్వరంబును బ్ర♦యత్నము సేయుద మన్న నాత్మలో
నామును లెల్ల గాధిసుతుఁ ♦ డాగ్రహశీలుఁడు వహ్నికల్పుఁడున్. ౧౧౧౪

ఉ. మాఱు వచించిన న్ననల ♦ మాడ్కి శపించి యిదేటిపీడ యీ
మోఱకుఁ డిద్ది చెప్పె మన♦ముం దగ దానిన లెస్స యన్న నీ
డేఱెడిఁ గాక భూధవుని♦యిచ్ఛయు మౌనిమహానుభావతే
జాఱనినిందు హెచ్చరిక ♦ సర్వము దీర్తమ టంచు నెంచుచున్. ౧౧౧౫

ఉ. యాజకుఁ డైనకౌశికుఁడు ♦ యాగము నంతయుఁ దీర్ప, వారుఁ బే
రోజను వారివారిపను ♦ లొక్కటి దప్పక చేయ, నాత్మభూ
తేజుఁడు భాగము ల్గొనఁగ ♦ దేవతలం బిలువంగ, వారు రా
మోజపశీల! యన్న, ముని♦యుం బటురోషకషాయితాక్షుఁ డై. ౧౧౧౬

విశ్వామిత్త్రుఁడు త్రిశంకుని స్వర్గంబున కనుచుట.

చం. స్రువమును జేత నెత్తుకొని ♦ చూడు నృపా! క్రతు వట్టు లుండనీ
యవితథమత్సమార్జితత♦పోధికవీర్యము పెంపుచేత నే
దివికిని మేనుతోడ నినుఁ ♦ దెప్పునఁ బంచెద నంచుఁ బల్కి యా
యవనిపుఁ గాంచి వెండి యిటు ♦ లాడుఁ దపోవిభవాభిరాముఁ డై. ౧౧౧౭

తే. ఏ గడించుతపఃఫలం ♦ బించుకంత, నింకయును గల దటుగాన ♦ నేరికైన
మేనితోఁ బోవ రానిస్వ♦స్థానమునకుఁ, జనుము మెయితోడ నాతప♦శ్శక్తిజేఁడ.

కం. అని గాధి పుత్త్రుఁ డాడినఁ, గనుచుండఁగ నెల్లమునులు ♦ క్ష్మానాథుండున్
జవ నుద్గమించి మెయితో, వనజాక్షా విబుధనగర♦వరమును డాయన్. ౧౧౧౯

కం. సురనికురుంబయుతంబుగ, హరిహయుఁ డా నృపునిఁ గాంచి ♦ యనియె క్షితీశా
సురలోకమునం దీవిటు, లిరవు గొనం దగవు ధరణి ♦ కేగుము మరలన్. ౧౧౨౦

మ. గురుశాపోపహతాత్మ! బాలిశ! త్రిశం♦కూ! నీకున్ స్వర్గ మా?
ధరణి న్వే తలక్రిందుగాఁ బడు మనన్ ♦ ధాత్రీశుఁడుం గూలుచున్
గురుతేజా! ననుఁ గావవే యనుచు నా♦క్రోశింప, గాధేయుఁ డా
పరమార్తధ్వని నాలకించి పటుకో♦పస్ఫూర్తి భూపాలుతోన్ ౧౧౨౧

సీ. నిలునిలు మం చంచ ♦ నిలిపి యాతని సప్తఋషులను జుక్కల ♦ సృష్టి చేసి
దక్షిణదిక్కున ♦ యాతురోషంబున, నింద్రు నొక్కని నేను ♦ సృష్టి యొండె

నిలిపెదఁ గానిచోఁ ♦ గలుగ కుండెడిఁగాక, యింద్రుఁ డం చమరుల ♦ సృష్టి సేయ
గమకింప దేవసం♦ఘములు మౌనులు వచ్చి, ప్రార్థించి రిట్టు లో♦భవ్యతేజ
తే. మహిపుఁ డీతఁడు గురుశాప♦నిహతుఁ డయ్యె, సగ్గమే వీని స్వర్గంబు♦నందు నంప
మేనితోడఁ దపోధనా ♦ దీని నీవ, మదిని దలపోసి మానుము ♦ మచ్చరంబు.

సీ. అనిన వారలఁ జూచి ♦ యనియె గాధేయుఁడు, పృథివీశు నీతనిఁ ♦ద్రిదివమునను
నిలిపెద నని పల్కి ♦ నే నెట్లు దప్పుదు,? నైన నొక్కటిచేయ♦రయ్య మీర
లాజగదంతంబు ♦ తేజరిల్లెడు నాదు, తారాగణం బన ♦ దైవతాళి
యట్ల యీఁగావుత ♦ మమరునియ్యవియెల్ల, శాశ్వతం బగు మవై♦శ్వానరాధ్వ
తే. మునకు వెలిగాఁగ నోముని♦ముఖ్యనిలుచు, నాత్రిశంకుఁడు తలక్రిందు♦నగు చునతని
ననుసరించెడి నుడుతతి ♦ యమలకీర్తి,నాకమునఁబోలె సౌఖ్యంబు ♦ లందు నఁడు.

కం.అన విని వల్లే యనుచును, మునివరుఁ డనఁ జనిరి సురలు ♦ మునులును స్వేచ్ఛన్
జని రాయజ్ఞము ముగియుడు, మునివరులును దమనివాస♦ములకుం బ్రీతిన్.

ఉ. అంతఱు వోవ నావనము♦నందలిమౌనులఁ జూచి విఘ్నముల్
పొందఁగఁ గల్గె నీయెడఁ ద♦పోగరిమంబున, కింక వేఱుది
క్కుం దగఁ జేరి చల్పుద మె ♦ ఘోరతపంబు? విశాలసద్వనీ
సుందర మల్లపశ్చిమము ♦ సొంపునఁ బెం పగుఁ బుష్కరం బటన్. ౧౧-౨౫

ఉ. అచ్చటి కేగి యందఱు మ♦నంతతపం బొనరింప సిద్ధి యౌఁ
జెచ్చెర రం డటంచుఁ జని ♦ చేసె భయంకర మౌతపంబు, పెం
పెచ్చ ఫలాశనుం డయి యు♦హీనగతిన్ దృఢనిశ్చయంబునన్
సచ్చరితా! మహామహుఁ డ♦నన్యవిచింత్యమహిష్ఠనిష్ఠలన్. ౧౧-౨౬

మ. అతఁ డీరీతిఁ దపంబు సేయఁగ నయో♦ధ్యాధీశ్వరుం డార్యసం
స్తుతభాషుండు తపోవిశేషుఁడు నరో♦షుం డుత్తమన్యాయని
ర్జితదోషుండు గుణైకభూషుఁడు ధరి♦త్రీపాంబరీషుండు ప్రీ
ణితశేషుం డగునంబరీషుఁ డటఁ బూ♦నెన్ వేలిమిం జల్పఁగన్. ౧౧-౨౭

కం.ఆజన్నపుఁబశువును సుర,రా జొకరే ముచ్చిలింప ♦ రాజును విప్రుం
డోడ చెడ నీవు గాచెడి,యాజంతువు పోయె, నిట్టి♦యలసత దగు నే? ౧౧-౨౮

కం.క్రతుపశువు పోయె నేనియు, క్షితిపా! తత్పశువుఁ గావ♦సేయనిరాజున్
హతుఁ జేయును దద్దోషము, మఱి మఱి పగునయ్య యిట్టి♦మహితార్థములన్?

ఉ. నీనుఱ పింత చేసె ధర♦ణీధవ! పోయినయట్టిదానిఁ గా
నీ, మఱి యద్ది దుర్లభము ♦ యేని మఖార్థముగా మనుష్యుఁ గా

సీ. మొగిఁ దెమ్ము వేగ మన ♦ నిద్ధరతుల్యుఁడు పల్లెపల్లెయు
గ్రామముగ్రామముఁ బవన♦సంబును బట్టనపట్టనంబునున్ ౧౧౩౦

కం. రోయంగఁ దొడఁగి స్వయముగ, నేనొక నెవఁ డేని దొరకఁ♦డే తాఁ బశువై
యీ యజ్ఞముఁ దీర్పఁగ నని, రేయును బగ లనక తిరిగె ♦ నృపతిలకుండున్.

## శునశ్శేపోపాఖ్యానము.

ఉ. పాలితధర్ముఁ డైనవర♦పాలకుఁ డీగతి సంచరించుచో
నాలును బిడ్డలం గలుగు♦వాఁడు ఋచీకునిఁ గాంచి మ్రొక్కి నీ
కాలను నూఱువే లిమదు ♦ నయ్య, యొసంగుచుఁ బుత్రు జేన్నముం
బాలన సేయు, మంచు బలి♦మాలుచు వెండియుఁ బల్కె మౌనికిన్. ౧౧౩౨

కం. కా లీచపడఁగఁ దిరిగితిఁ, జాలఁగ దేశములు నెందు ♦ జన్నపుమొకమున్
జాలన కన నవపశువుగ, బాలకు నా కమ్ము మాత్మ♦భవు లం దొకనిన్. ౧౧౩౩

తే. అనిన నీ వేమియిచ్చిన ♦ నధిప యీయఁ, బ్రేమభాజన మైననా♦పెద్దకొడుకు
ననిన నృపుఁ జూచి యనియెసి ♦ ల్లానిభార్య, వినితి వే రాజ భార్గవుఁ ♦ డనినపలుకు.

కం. తనపెద్దకొడుకు నీఁ డఁట, శునకుం డన్యన్కనిష్ఠ♦సుతుఁ డాతని మే
కొనఁజాల నమ్మ నీకును, జననికిఁ గడగొట్టుకొడుకు ♦ నన్నుతుఁ డధిపా. ౧౧౩౫

తే. ప్రాయికమ్ముగ జగమున ♦ రాజవర్య, పెద్దవానిపైఁ దండ్రికిఁ ♦ బ్రేమ మెందు
పిన్నవానిపైఁ దల్లికిఁ ♦ బ్రీతి గానఁ, గుఱ్ఱవానిని రక్షించు♦కొనుడు నను.

కం. జనకునిపలుకులు నాపయి, జననీవాక్యములను విని ♦ జనపతిని గనుం
గొనుచు శునశ్శేపుం డను,తనయుఁడు మధ్యముఁడు కడు మ♦దారత ననియెన్.

తే. తండ్రి యొల్లఁడు తన జ్యేష్ఠ♦తనయు నన్నుఁ, దల్లి యొల్లదు తనపిన్న♦తనయు నమ్మ
వారియిరువురిమాటల♦వలను చూడ, మధ్యముని నన్ను నమ్ముంగ ♦ మనసుగలదు.

మ. ఇదె నే వచ్చెద మానవేంద్ర! కొనిపో♦మ్మా యిమ్ము నీనూఱువేల్
కదుపుల్ తండ్రికి నంచు నన్ను నిడి భూ♦కాంతుండు వైళంబ తా
మున మారెన్ మునిపుత్రు ధన్యరథుఁ గొం♦పోవంగ మార్గంబున
న్గదియుం బుష్కర మంచు నల్ప నడిమిం♦ట న్వేవెలుం గొప్పఁగన్. ౧౧౩౯

ఉ. ఓపక యెండవేఁడిమి నృ♦పోత్తముఁ డాయెడ నిల్వఁగా శున
శ్శేపుఁడు పాఱుడెంచి ఋషి♦శేఖరయుక్తుని మాతులుం దపో
వ్యాపృతుఁ గౌశికుం గనుచు ♦ వారనిదప్పిని గాసి దీనుఁ డై
ప్రోపతి గాఁజవాలి ముఖ♦ముఁ వడిగా నొడిలోన వ్రాలుచున్. ౧౧౪౦

## శునశ్శేపుఁడు విశ్వామిత్రుశరణుఁ జొచ్చుట.

శా. మామా! యే మని చెప్పువాఁడ నిఁక న♦న్నన్నించి కాపాడవే
భూమిం దండ్రియు లేఁడు, లేదు తల్లియుం ♦ బ్రోవంగఁ జుట్టంబు లేఁ
డో మౌనీశ్వర నాకు నిప్పు డెటు లే ♦ నూహించి భూమిన్ సుస
త్కామంబు న్నెఱవేఱ నేఁ దపసినై ♦ కానంగ స్వర్ధామమున్. ౧౧౪౧

చం. చిరమగు నాయు వొందునటు ♦ చేయుము, దిక్కొకఁ డైన లేఁడు, నా
పర మగుదిక్కు గమ్ము, తన♦పట్టిని దండ్రియుఁ బోలె నాపదం
బొరయఁగ నీక కావు, మతి♦ పుట్టిన లోకములోనియెల్లరన్
గరుణను గావవే యనినఁ గౌశికుఁ ♦ డూఱడఁ బల్కి యల్లునిన్. ౧౧౪౨

చం. తనయులఁ జూచి యి ట్లనియె ♦ ధర్మపరాయణులార! భూమిపైఁ
దనయులఁ గోరు చుంట తలి♦దండ్రులు దాము వచించువాక్యము
ల్వినియెడివారు పుట్టుటకు, ♦ విశ్రుతనాకసుఖంబుఁ గాంచఁగాఁ
గనుటకుఁ గాన వాని కిదె ♦ కాలము వచ్చెను మీరు దీర్పఁగన్. ౧౧౪౩

శా. బాలుం డీతఁడు మౌనిపుత్రకుఁడు గా♦పాడంగదే యంచు భీ
లోలుండై శరణంబు వేఁడె నను, మీ♦లో నెవ్వఁడేన్ వీనికిన్
వాలాయంబుగఁ బ్రాణదాన మిడుఁ డీ♦వాక్యంబు పాటింపుఁడీ
మేలైనట్టిప్రియంబు నా కిది సుతుల్ ♦ మీ రియ్యెడం గూర్పుఁడీ. ౧౧౪౪

ఉ. మీర లెఱుంగనట్టివియు ♦ మీరొనరింపనిధర్మజాలము
ల్ధారణి లేవు గావున ని♦లాతలనాయకుయజ్ఞవేదికన్
మీరు పశుత్వ మూనుకొన ♦ మేకొని యగ్నికిఁ దృప్తిఁ గూర్పుఁడీ,
యారయ దీనఁ గల్గెడున♦నంతఫలం బది చెప్ప శక్య మే. ౧౧౪౫

కం. కాపుగడ గనెడు నీతఁడు, భూపతిజన్నంబు చక్క ♦ బొం దగు సురలున్
ప్రాపింతురు హర్షంబును, గాపాడఁగఁబడు మదుక్తి ♦ కావింపుఁడటుల్. ౧౧౪౬

చం. అన జనకోక్తుల న్విని య♦హంకృతితోఁ బరిహాసభాసురా
ననములతోడఁ దండ్రి! నిజ♦నందనులన్ బలిపెట్టి యన్యునం
దనుఁ బరిరక్షసేఁత దగు♦నా? యిది చూడఁగ శ్వామిషంబుభో
జన మనఁ గానికార్య మని ♦ చయ్యనఁ బుత్త్రకు లంత నాడినన్ ౧౧౪౭

శా. ఏమీ! యూ నని నేను జెప్పినది యం♦త్రే కాదు కా దంచు మీ
రీమాడ్కిన్ భయ మేని ధర్మమతియే ♦ నెంచంగఁబో కాన్తలో,
నామాటల్ జనదాఁటి మీర లిఁక మం♦ద్రా! లించు వాసిష్ఠు ల
ట్లే మంద్రాత్ముఁడు జాగిలంబునెఱచిన్ ♦ హీనాత్ములై వేసమున్. ౧౧౪౮

ఉ. ఈపగిదిం దనూజుల స♦హింసరుషన్ శపియించి వాని యా
పావనిఁ గాంచి రక్ష యిడి ♦ భద్రము చేకుఱ వైష్ణవంబు నా
యూపమునందుఁ గట్టఁబడి ♦ యుండు నెడన్ దహనోన్ముఖంబుగా
వే పఠియింపు వీని నని ♦ విశ్రుతగాథల నిచ్చి రెండిటిన్.[1] ౧౧౪౯

కం. మఱియును నిట్లను వీని, న్గఱవక పఠియించి తేని ♦ మహిపతిక్రతువున్
నెఱవేఱు నీకు సిద్ధియు, వఱలు ననుచుఁ బనుప నతఁడు ♦ నడి చని నృపునిన్

చం. కని నరపాలచంద్రమ! యిఁ♦కం దడ వేటికి యజ్ఞవాటికిన్
జనుదము, సప్తతంతువును ♦ జల్పఁగ దీక్ష వహింపు వైళ, మం
చన మునిపుత్రుమాటలకు ♦ హర్షము నొంది నృపాలుఁ డధ్వరం
బునకుఁ బురోధ సమ్మతిని ♦ బూనె నతంద్రత సంత విప్రులన్ ౧౧౫౧

కం. అట్టునఁ బువ్వులఁ జుట్టియు, నెఱ్ఱనిపట్టములు గట్ట ♦ నిడి జన్నంపుం
గొట్టునఁ గట్టిన వెఱవక, శుశ్శేఁడు పఠియించి మంత్ర♦కూటము మదిలోన్ ౧౧౫౨

కం. ఇంద్రుని నింద్రానుజునా, నాంద్రముదంబునను ముంపఁ ♦ జయ్యన నామా
నీంద్రజునకు దీర్ఘాయువు, నింద్రుం డిడి సఫలుఁ జేసె ♦ బృహదీశ్వరునిన్. ౧౧౫౩

కం. వైశ్వానర తేజుం డీ, విశ్వామిత్రుండు నిండ ♦ వేయేండ్లు దనన్
విశ్వంబు పొగడఁ దపమున్, శశ్వద్గతిఁ బుష్కరమునఁ ♦ జలిపెన్ నిష్ఠన్. ౧౧౫౪

ఉ. నిండిన నేండ్లు వేయియు ము♦నిప్రవరుం గన వచ్చి దేవతా
మండలి శోభ వినిచి శుభ♦మానిత వాక్కులఁ బల్కు సత్త్రియా
కాండసమార్జితం బగున♦ఖండఫలాన ఋషిత్వ మంది తే
దండిత వైరి యుండు మని ♦ తాను దిరోహితుఁ డయ్యె సయ్యెడన్. ౧౧౫౫

ఉ. అంతటఁ దృప్తి నొందక మ♦హాత్ముఁడు గాధిజుఁ డాచరించె నే
కాంతతపంబు, నట్టియెడ ♦ నాకమలాకరవారి నాడఁగాఁ
గాంతనితాంతసుందరతఁ ♦ గంతునికుంత మనంగ నప్సరః
కాంత యొకర్తు మేనక ని♦కారవిధంబున వచ్చె, వచ్చినన్ ౧౧౫౬

### విశ్వామిత్రుఁడు మేనకను మోహించుట.

కవిరాజవిరాజితవృత్తము.

నలినవిలోచన సూనమనోహర♦నవ్యశరీరి విహారరతిన్
జలదవినీలశిరోరుహఁ గోరిక♦ వారురుచిన్ శశిరాంశుముఖి
న్జలకము లాడ ఘనాంగనఁ జందము♦నం గని మారశరాహతుఁ డై
కలఁగు మదిం దామునిపాకుజలం బడఁ ♦ గాంతను డాసి వచించె నిటుల్. ౧౧౫౭

---

[1] శునశ్శేఫుని యను మంత్రము లివియే.

ఉ. అచ్చరకన్నరో! శుభము♦లౌత, నినుం గని నంతనుండియుఁ
గ్రుచ్చెడి నన్ను మన్మథుఁడు ♦ క్రూరశరంబులఁ, దాళఁ జాల, నీ
విచ్చగ నిచ్చట న్నిలిచి ♦ హెచ్చుతమి న్నను నేలుకొమ్ము, నీ
వచ్చినబంట నౌదు నను ♦ నమ్ముము నెమ్మది నంచు వేఁడినన్ ౧౧౫౮

తే. ఆవరారోహ యాను గా ♦ కంచు నిలిచెఁ, దత్తపోధనునాశ్రమ♦స్థలిని లీల
నిట్లు పదియేఁడు లరుగ మునీంద్రచంద్రుఁ,డొక్కనాఁ డిట్లుతలపోసె♦నుల్లమునను.

ఉ. పీడక బ్రాహ్మణత్వమున ♦ వేడ్క యొనర్పువిరాగి గాధిజుం
డేడ? నిరాకులస్థితి న♦హీనతపం బొనరించు టేడ? దా
గూడి చరింపఁగాఁ బడుపుఁ♦గోమలి యేడ? నయారె విన్న చో
బాడబు లెల్ల నన్నుఁ గని ♦ పక్కున నవ్వ రె, పైసి యార్వ రే. ౧౧౬౦

కం. రేపటిమాపటివలెనే, వే పోయెం బదియునేండ్లు ♦ వెలనెలఁతుకతో
శ్రీపుత్రునిబారి కయో, లోపడితిఁ సిగ్గు చెడితి ♦ లోలాత్ముఁడ నై. ౧౧౬౧

కం. తేఁడఁట సుఖముఁ గోసిన,వాఁ డఁట బ్రాహ్మణతఁ గోరి ♦ వనముల నేఁడుల్
పూఁడులు ముని యై వెలననఁ,బోఁడికిఁ దక్కె నఁట! యిట్టి♦బూమెలు గలవే.

కం. ఘన మైనబుద్ధిమోసం,బునఁ జెడితిం జెడితి రిత్త♦బూటక మేలా
ముని యఁట వెలచెలిపొం దఁట!! వినువారలు నగ రె నట్టి♦వేసబ మనుచున్.

మ. అని లజ్జావనతాస్యుఁ డై యెటు లొకో ♦ ప్రాప్తించె జెంజాట మం
చని యోజించి సుపర్వకోటులు తపో♦హానిఁ ఘటింపంగఁ జే
సినమోసం బని యార్చి కుంది మదిరా♦క్షిఁ సాధ్వసాకంపితాం
గను వీక్షించి తపోధనుండు మృదువా♦క్యస్ఫూర్తిఁ దా నిట్లనున్. ౧౧౬౪

కం. ఏలా వెఱచెద వోసుర,బాలా! స్మరజితుఁడ నైన♦బాలిశుఁడను ద్వ
ల్లీలారతిఁ జెడితిని ని, న్నేలా యన వలయు నిఁక ♦ నేగుము తరుణీ. ౧౧౬౫

తే. అనుచుఁ దెఱగంటివాల్గంటి♦ననిపి చనియె, దాను వలిగట్టుపొంతకుఁ♦దపము సేయఁ
గామముజయింపఁగా మదిఁ ♦ గార్య మూని, కౌశికీతీరమునఁ జల్పె♦గడుసుఁదపము.

విశ్వామిత్రుఁడు మహర్షి యగుట.

ఉ. ఉత్తర పర్వతంబున మ♦హోగ్రమతత్పరుఁ డైన వేసముల్
మొత్తముగా నిలింపతతి ♦ మోదుపఁగరంబుల బ్రహ్మ డాసి యీ
సత్తముఁడుఁ మహర్షి యనఁ ♦ జాలుతపం బొసరించె, రాఁ గదే
యుత్తలపాటు చెందె భువ♦నోత్కరముల్ ముని శాంతుఁ జేయవే. ౧౧౬౭

తే. అనినఁ జను దెంచి మునిఁ గాంచి♦యాదరించి, నాయనాయైతివిమహర్షి ♦నాఁగవగపు
గొనక తన్వి వహింపక ♦ వనజభవుని,మోముఁ గని యూర పలికె నీ♦మునివరుండు.

ఉ. నీవు మహర్షి వం చనుట ♦ నే నిపు డైతి జితేంద్రియుండ నాఁ,
గావు జితేంద్రియుండ వికఁ ♦ గాధిజ! యత్నము సేయు దానికిన్,
నావుడుఁ జేతు లెత్తి యశ♦నంబుగ గాడ్పుఁ గ్రోలి ప్రాపు లే
కావలఁ గేవలం బచలుఁ♦డై చు మహాద్భుతనిష్ఠ సల్పుచున్ ౧౧౬౯

తే. మండువేసంగిఁ బంచాగ్ని♦మధ్యమందు, నారబయటను వాన ల♦వ్వారి గురియఁ
బుండుచలిలోన జడజల♦పూరమందు, నిలిచి రేయుంబవల్లను♦నిష్ఠ సలిపె. ౧౧౭౦

తే. దానఁ జేసి జగంబులు ♦ తల్లడిల్లె, వాసవుఁడు దేవతలతోడ ♦ వనట గుడిచి
తమకు హితమును ముని కహితంబు నైన, పలుకు లి ట్లని రంభతోఁ♦బలికె నపుడు.

రంభ విశ్వామిత్రునితపంబుఁ జెఱుపఁ బోవుట.

శా. రంభా! వంచితయోగిపుంగవసమా♦రంభా! భవన్నైపుణీ
జంభం బిప్పుడు చూపఁగా వలెను, వి♦శ్వామిత్రమౌనీంద్రు సం
రంభం బాఁపవె, దేవకార్య మిది వి♦స్రంభంబుగాఁ దీర్పు, నా
జంభారాతిని జూచి సిగ్గువడి వా♦చాదైన్య మేపారఁగన్ ౧౧౭౨

చం. కరములు మోడ్చి యిట్టు లనుఁ ♦ గంజదళాక్షి సురేంద్ర! కౌశికున్
సరసకుఁ బోవ నెంచినను ♦ జల్లను గుండెలు చల్లజంపు నాఁ
కరమున కాటపట్టు, వణఁ♦కం దొణఁగెం దను వెల్ల, వాని వా
దురుసు నెఱుంగ వే, కొఱవి♦తోఁ దల గోఁకికొనంగ వచ్చునే? ౧౧౭౩

ఆ. దయఁ దలంప వయ్య ♦ దంభోళిసాధన, కరుణ చూడ వయ్య ♦ సరళహృదయ
యనుచు దీనవాణిఁ ♦ బ్రార్థింప గీర్వాణి, కాంతఁ జూచి దాన♦వాంతకుండు.

చం. వెఱచెద వేల రంభ! తగ♦వే శుభ మయ్యెడుఁ గాత నీకు, నీ
యొఱపు మఱింతగా మెఱయ ♦ నుజ్జ్వలపుష్పవు సార రమ్ము నీ
కుఱఁగట నుండువాఁడ, సుమ♦కోమల! మారునితోఁ బికంబనై
బిఱుసుగఁ గూయఁగాఁ గలను, ♦ ప్రేయసి! యామని నిల్చుఁ గొమ్మలన్. ౧౧౭౫

కం. అనుచు వచించిన మేకొని, వనితయుఁ గైసేసికొని వ♦నవనంబుగఁ ద
న్మునిఁ జేరఁ బోయి చెఱువన, పొన్నపర మనోజ్ఞంపుఁ బొట♦మొక్కటిపాడెన్. ౧౧౭౬

చం. విన విన నింపు సొంపు నొద♦వించుచు మించెడి పంచమధ్వనిన్
ముని విని కన్ను విచ్చి తప♦ముంగలఁ బాడెడి దేవకామినిన్
గని మది సంశయించి శచీ♦కాంతుని తంత్ర మటం చెఱింగి లోఁ
గినుక జనింపఁ గన్నుఁగవ♦కెంపు వహింపఁగఁ బల్కె రంభతోన్. ౧౧౭౭

విశ్వామిత్రుఁడు రంభను శిలగా శపించుట.

శా. ఓసీ! కామముఁ గ్రోధముఁ గెలువఁగా ♦ నుంకించుచో నానసీ
దోసం బెంచక నాతపోగరిమముఁ ♦ దుశ్శీల! పోకార్పఁగా
వేసంబుఁ గహియించి వచ్చితివి, పృథ్విఁ రాయి వై వేలుపుం
దాసీ! పో పదివేలయేండ్లు పడియుం ♦ డఁగ మీఁద లగ్గయ్యెడిన్. ౧౧౭౮

కం. నాయిచ్చిన యీశాపము, మేయతపోబలయుతుండు ♦ మేధానిధి య
త్యాయతతేజుఁడు విప్రుఁడు, పాయంగాఁ జేసి నిన్నుఁ ♦ బరిరక్షించున్. ౧౧౭౯

కం. అని తిట్టి తాల్మి లేమికి, మనమున నుడుకొందె;[1] వేల్పు ♦ మగువయు నావెం
టనె శిల యై పడె; దానిని, గని పఱచిరి వాసవుండుఁ ♦ గందర్పుండున్. ౧౧౮౦

ఉ. అంతట మౌనినాథుఁడు ర ♦ సంతయు శాంతము లేమికిం గడు
న్జింతిలి యెంత యైన నిఁక ♦ నిశ్చయ మియ్యది కోప మూన నా
స్వాంతమునందు, నా తెఱచి ♦ పల్కను పల్కులె యుజ్జగింతు, నే
నంతకుఁ దీర కుండిన శ ♦ తాబ్దము లైనను నూర్పు మానెదన్. ౧౧౮౧

కం. చిక్కించెదఁ గాయంబును, స్రుక్కించెద నింద్రియముల ♦ శుష్కంబుగ నే
మక్కించెదఁ గామంబును, ద్రొక్కిన మ్రొక్కినను నొక్క ♦ క్రోవనయుందున్.

కం. కుడువను గుడుపును శ్వాసము, విడువను మఱి కోప మనెడి ♦ విషయంబు మదిఁ
దడవను బాలునితన ము,నడుదాఁక న టంచు నుగ్రుఁ ♦ డం బగుమతితోన్. ౧౧౮౩

విశ్వామిత్రుఁడు ఘోరతపంబు చేయుట.

కం. ధనదాశ విడిచి తూరుపు, చని పల్కుట యుడిగి వేయి ♦ సంవత్సరముల్
వినియతిఁ దప మొనరింపఁగఁ, బొనుపడి శుష్కించెఁ బూరి ♦ పుష్పకయ పోలెన్.

తే. ఎడ నెడ ఘనాంతరాయంబు ♦ లెన్ని యేని
దాపరించినఁ గోపంబుఁ ♦ దాల్పఁ డయ్యె
నిట్లు నిశ్చితమతి యయి ♦ యెనక మెసఁగ
నింపు వేయేండ్లు పెనుఁదప ♦ ముందె నితఁడు. ౧౧౮౫

ఉ. నిండిన వేయియేఁడులు ము ♦ నిప్రవరుండు భుజింపఁ బోసి శ
క్రుండు ద్విజాతిరూపమునఁ ♦ గోరెఁ దదన్నముఁ, బెట్టవే క్షుధా
ర్తుండ మునీంద్ర! యన్న, ముని ♦ తోరపుభక్తి నొసంగెఁ గాని లో
నొండు దలంపఁ డాగ్రహము ♦ నొందఁడు సర్వము నిచ్చె మౌని యె. ౧౧౮౬

తే. నిరుపాసెంబుగా నేల ♦ నిలిచి యూపు, పార్పకయ వెంచె వేయేఁడు ♦ లధికతపముఁ
జేయ జనియించె నాతని ♦ శిరమునుండి, ఘనోరధూమంబు లోకంబు ♦ గోడుగుడుప.

---

[1] కామమునకంటెఁ గ్రోధము దుర్జయము.

సీ. సురలు గంధర్వు లాసురులుఁ బన్నగులును, వ్యాకుల మందుచు ♦ నజునిఁ గాన
నరిగి యి ట్లనిరి యో ♦ సురనాథ జగముల, గాధిజువలనను ♦ గావవయ్య
యెన్నిరో యుక్తులు ♦ పన్నితిమే కాని, కామియు, గోపియుఁ ♦ గాఁడు దేవ
యాతనిహృదయ మ♦త్యంతనిర్మలదశఁ, బుటము దీరినపైఁడి ♦ పోలె నున్న
తే. ననఘు యాలంబు చేయుట ♦ చనదు వాఁడు, నిఖిలజగమును దపమున ♦ నిర్దహింప
కుంఠ మును వానియిష్టంబు ♦ నింకఁ జేయు, వయ్యలోకంబు హావళి ♦ నావురనియె.
కం దిక్కులు వ్యాకులితము లై, పొక్కెడి జలనిధులు గ్రాఁగి ♦ పొంగెడి నగముల్
స్రుక్కెడిఁ బుడమి వడంకెడి, మిక్కిలి పెనుగాలి జగము ♦ మిడికెడి దేవా. ౧౮౯
కం నాస్తికుల యట్లు జనము లు,పాస్తిని మానిరి దినేశు ♦ ప్రభ చెడె జగముల్
కస్తిం గనె గాధేయుఁడు, వ స్తుండి తపంబు సేయఁ ♦ బట్టె విధాతా. ౧౯౦
కం. కాలాగ్ని వోలె లోకము, వాలాయము గాల్పఁ గడఁగె ♦ వాసవపద మేఁ
లీలాగతి నొసఁగి జగం, బేలుము తద్వాంఛితంబు ♦ ని మ్మది యేనిన్. ౧౯౧
చం. అనినఁ బితామహుండు విబు ♦ ధావళిఁ గూడి మునీంద్రుఁ గౌశికున్
గని యిఁక లెమ్ము బ్రాహ్మణతఁ ♦ గంటివి, వెండి చిరాయు విచ్చితిన్,
ఘనతరభద్రముల్ గలుగు ♦ గాధిజ! పొమ్ము యథాసుఖంబుగా,
ననవుడు బ్రహ్మఁ జూచి యను ♦ రావళి మ్రొక్కి వచించె నీగతిన్. ౧౯౨

బ్రహ్మ విశ్వామిత్రునకు బ్రహ్మర్షిత్వ మిచ్చుట.

సీ. దేవ బ్రాహ్మణ్యంబు ♦ దీర్ఘాయువును నాకు, నమరిన నోంకార ♦ మాగమములు
మఱి వషట్కారంబు ♦ మానుగా వరియించుఁ, గాత న న్నిం కొందు ♦ గలదు దేవ
క్షత్రవేదవిదుల ♦ సద్బ్రహ్మవేదుల, మొదటివాఁడు వసిష్ఠ ♦ మునివరేణ్యుఁ
డాతండు న న్నిట్టు ♦ లంగీకరింపఁగ, వలయు నియ్యది నాదు ♦ వాంఛితంబు
తే. దీని ఘటియించి చన రయ్య ♦ దేవవరులు, నాఁగ వేల్పులు వేఁడ న ♦ నఘతపస్వి
గాధిజునితోడ నెయ్యంబు ♦ గలిగి నీవు, బ్రహ్మఋషి వైతి వనియెను ♦ రామచంద్ర.
తే నీవు బ్రహ్మర్షి వైతివి ♦ నిశ్చయముగ, బ్రాహ్మణార్హక్రియాకలా ♦ పంబు లెల్ల
నిన్నుఁ బొందెడ న టం చేగ ♦ నిర్జరాళి, స్నేహపడియె నితండు వ ♦ సిష్ఠుతోడ.
కం. ఈవిధమున బ్రాహ్మణ్యం, బీవిధితుల్యుండు పొంది ♦ యిచ్ఛాగతిమై
భూవలయంబునఁ గ్రుమ్మరు, నీవిశ్వామిత్రు నేమి ♦ యెంచితి రామా! ౧౯౫
కం. మునితల్లజుఁ డాకారం,బును బూనినతపము వీర్య ♦ మునకున్ తావున్
జనసుతధర్మాసక్తుఁడు, వినితే శ్రీరామ! మాని ♦ వృత్తాంతంబున్. ౧౯౬
సీ. అని చెప్పి గౌతము ♦ తనయుఁ డూరక యున్న, జనకుండు రాముల ♦ క్ష్మణులతోడ
నాతనివాక్యముల్ ♦ ప్రీతి నాకర్ణించి, కరములు ముకుళించి ♦ గాధితనయు

మోముఁ గనుంగొని ♦ భూమీశపుత్త్రులతో నీవు వచ్చుట ♦ దురితదూర
ధన్యుండ నైతిని ♦ మాన్యుండ నైతిని, నీదర్శనంబున ♦ నిర్మలాత్మ!
తే. పావనుఁడ నైతి నీదుత♦పోవిశేష,ములను వింటి మసంఖ్యాక♦ములు గుణంబు
లప్రమేయంబు తపమును ♦ నప్రమేయ,మైన బలమును వినవిన♦నరిది తృప్తి.
ఉ. వేఁడి వెలుంగువేలు పదె ♦ వ్రేలెడిఁ బశ్చిమశైలవాటిపై,
వేఁడెదఁ గర్మకాల మిఁక ♦ వీడ్కొనుదే దయ యుంచి, వేకువన్
బోఁడిమిఁ జూడఁగాఁ దగును, ♦ బోయెద నేఁటి కటంచుఁ బల్కి యా
తేఁడు ప్రదక్షిణించె ముని♦తేని గుణోత్తమబంధుయుక్తుఁ డై. ౧౧౯౮
కం. రాముండు లక్ష్మణుఁడును మ,హాముని చయంబుఁ గొల్వ ♦ నాగాధిజుఁడున్
సామోదుం డయి స్వాశయ,భూమిం జేరంగఁ జనియె ♦ బుధవినుతుం డై. ౧౧౯౯
ఉ. ఆమఱునాఁడు వేకువఁ[1] గృ♦తాహ్నికుఁ డై జనకావనీశుఁడున్
రామునితోడఁ గూడుకొని♦యా మునిఁ బిల్వఁగఁ బంచి వారలం
బ్రేముడి గౌరవించుచు స♦మీహిత మెయ్యది నాచరింతు నే
నో మునిచంద్రమా! యన నృ♦పోత్తముఁ జూచి వచించె మౌనియున్. ౧౨౦౦

విశ్వామిత్రుఁడు జనకునితో రామలక్ష్మణులకు
శివునివింటిం జూపు మని చెప్పుట.

కం. వీరలు దశరథనృపతికు,మారులు దినరాథవంశ♦మండనులు మహా
వీరులు జగత్ప్రసిద్ధులు, కోరెరి నీధనువుఁ జూడఁ ♦ గువలయనాథా. ౧౨౦౧
కం. ధనువును గాన్పింపుము యది, గనుఁగొని కృతకాము లగుచుఁ ♦ గాకుత్స్థమణుల్
చనువారు యథేష్టంబుగ,నన జనకుం డిట్టు లనియె ♦ నమ్మునితోడన్. ౧౨౦౨
సీ. వినవయ్య మునినాథ ♦ వినిపించెదను నీకు, నీవి ల్లిచట నుండు♦హేతువులను
దేవరాతుం డన ♦ దివ్యప్రభావుండు, నిమికి నాఱవవాఁడు ♦ నిర్మలుండు
దేవత లతనికి ♦ దీని నిల్లడ యిచ్చి, పోయిరి దివికిని ♦ బూజ్యచరిత
దక్షాధ్వరధ్వంస♦తత్పరుం డయి మున్ను, రుద్రుండు త్రిదశుల ♦ రోషమునను
తే. గాంచి భాగార్థులార భా♦గంబు నాకు, నేల కల్పింప రిప్పుడ ♦ యిదిగో నొక్క
పెట్ట మీశిరముల బలి♦పెట్టువాఁడ, నేల కీవింట నన సుర♦నికర మపుడు. ౧౨౦౩
ఉ. విన్నఁదనంబు దోఁపఁ దను ♦ వేఁడ క్షమించి ధనుస్సు నిచ్చె నా
పన్నగభూషణుండును సు♦పర్వులకున్, మఱి వారు దీనినిన్
బ్రన్నన నాకుఁ బూర్వుఁ డగు♦రాజున కిచ్చిరి, నాఁటఁ గోలెఁ దా
నున్నది మద్గృహంబున న♦గోత్తమ నిత్యసమర్చితంబు నై. ౧౨౦౪

[1] ౧౪-వ నాఁటి సూర్యోదయము.

కం. జేన్నంబు సేయుతలఁపున, దున్నింపఁగ భూమి నొందఁ ♦ దోఁకెంచెఁ జుమీ
పిన్నది యొకర్తు; నే నా,చిన్నారి నెలంత కిడితి ♦ సీతాహ్వయమున్. ౧-౨౦౫
ఉ. మాన్యచరిత్ర! పూత మగు♦మాడ్కి జనించెను గాని లోకసా
మాన్యగతిన్ జనింపద చు♦మా, యటు గావుటఁ బెంచి కూఁతుఁగాఁ
గన్యను వీర్యశుల్క యని ♦ గాధిజ! పెండిలి సేయ కున్న రా
జన్యులు వచ్చి వేఁడిరి యొ♦సంగవె మా కని, నేను వారితోన్ ౧-౨౦౬
సీ. ఈవిల్లు మోపెట్టు ♦ నెవ్వఁడు వానికి, నాకూఁతు నిచ్చెద ♦ లోక మెఱుఁగ
వీర్యశుల్క నొసంగ ♦ బెంచుమానిసి కన, విల్లుచూడఁగ వచ్చి ♦ రెల్లవారు
గొనయంబు గనయంబుఁ[1] ♦ గూర్చ లేమి యటుండ, నెత్తఁ జాలర వార♦లుత్తబిరుదు
లామూఁకమగఁటిమిఁ ♦ యుంబ్ప మా కెఱిఁగి నేఁ, గన్య నీయ నటన్న ♦ మన్యువునను
తే. జుట్టు ముట్టిరి మిథిలను ♦ బెట్టిదముగ, నట్టు చేసిన నే లక్ష్య♦పెట్ట నైతి
దిట్టతనమున వా రెల్ల ♦ రట్టు మీఱి, గట్టిముసలఁగఁ దీరిరి ♦ తుట్టతుదకు. ౧-౨౦౭
సీ. ఏఁడాది వారు న ♦ న్నేఁచిన రణమున, సర్వసాధనములు ♦ సన్నగిల్లె
నెంతయు వగచి య♦హీనతపమ్మునఁ, దృప్తి నొందించితి ♦ దేవతలను
సంతసంబున వారు ♦ చతురంగబలముల, నీయఁ జెల్లగించితి ♦ నెల్లవీర
మాని[2] శాత్రవులను ♦ మహితరణంబున, నూడఁబాడిరి[3] వార ♦ లోర్వలేక
తే. యాధనూరత్న మియ్యది ♦ యనఘశీల, కానిపించెద రామల♦క్ష్మణుల కిపుడు
విల్లు మోపెట్ట శ్రీరామ♦విభుఁ డయోని,జాత సీతను బ్రీతి నొ♦సంగువాఁడ.
కం. జనకుని వచనంబుల ముని, విని చూపుము వింటి ననిన ♦ విభుఁడు సచివులన్
గని కొని తెండీ చాపం, బనవుడు వా రెల్లఁ బురికి ♦ నరిగి ద్రుతగతిన్. ౧-౨౦౮
ఉ. ఆయతభీమదేహులు మ♦హాబలు లొక్కట నైదువేలు దా
రాయసపేటితోఁ బస మ♦హాధనువుం గొనివచ్చి నిల్చి దే
వాయితతేజుఁ డైనజన♦వర్యుని మైథిలుఁ జూచి దేవ సు
శ్రీయుత మాశరాసన♦సిద్ధముఁ దెచ్చితి మయ్య చూడుమా. ౧-౨౧౦

జనకుఁడు రామలక్ష్మణులకు శివువింటిని జూపుట.

సీ. అని మంత్రు లాడిన ♦ జనకుఁడు గని లేచి, మోడ్పుఁగేలను రాచ♦మునిని రామ
సౌమిత్రులను జూచి ♦ యోమునిచంద్రమా, యిది యయ్య జనకావ♦నీంద్రు లెల్లఁ
బూజించుచాపంబు ♦ రాజు లెంతటిమహా,బలవంతు లయ్యును ♦ భగ్నపడిరి
యెక్కు పెట్టఁగ లేక ♦ నిక్కు లెల్లను బాసి, మానవపాలుర ♦ మాట యేల
తే. సురలు నసురులు యక్షకి♦న్నరులు నైన, నెత్తఁజాలరె యెక్కిడు ♦ టేల చెప్పఁ
జూపఁగ నభీష్ట మేనియుఁ ♦ జూప నయ్య, చాపరత్నంబు రామల♦క్ష్మణుల కనిన

[1] గనయము=వింటికొప్పు. [2] వీరమాని=తిన్నఁదాను వీరుఁడనితలంచువాఁడు. [3] ఊడఁబాడిరి=పరువెత్తిరి.

కం విని జనకునివాక్యము లా,మునివర్యుం డతిశయించు♦మోదంబున రా
మునిఁ జూచి వత్స రాఘవ, కనుమీ కోదండ మనినఁ ♦ గాకుత్థ్సుండున్ ౧-౨౧౨

కం మునివాక్యచోదితుం డయి, ధను వుండెడిమందసంబు ♦ దాయం జని మూఁ
తను దెఱచి చూచి యి ట్లను, మునివర స్పృశియించి కంటి ♦ ముదలయ యేనిన్

కం త్రిక్కక వెలుపలఁ దీసెద, నెక్కిడియెద నన్న నట్టు♦లే కానిమ్మా
గ్రక్కున నని జనకుండును, మక్కువ గాధిజుఁడు పల్క ♦ మహాపసుతుండున్

◆ శ్రీరాముఁడు హరువిల్లు విఱుచుట. ◆

కం.ఉఱక యనలీలఁ జాపం, బఱచేతను దిగిచి, చూడ ♦ నవనీశులు, క్ర
చ్చఱఁ దెగ[1] నిండఁగఁ దీసిన,బిఱు సే ఘని చెప్ప విల్లు ♦ ఫెళ్లున విఱిగెన్ ౧-౨౧౫

కం నిర్ఘాతనాద మగుచు ధ,నుర్ఘటితమహాస్వనం బ♦నూనం బగుడున్
దీర్ఘముగ వణఁకె ధరణి స,నిర్ఘోషంబుగను గిరులు ♦ నెఱెపాఱుగతిన్. ౧-౨౧౬

ఉ. రాముఁడు లక్ష్మణుండు ముని♦రాజు నృపాలుఁడుఁ దక్క నెల్లరున్
భూమి విసంజ్ఞులై పడిరి ♦ బొమ్మర వోవుమనంబుతోడ, నా
భూమిధవుండు సభ్యతతి ♦ పోఁడిగఁ గ్రాలుడు లబ్ధసంజ్ఞమై
యా మునితల్లజుం గనుచు ♦ నస్తవరుం డయి కేలు మోడ్చుచున్ ౧-౨౧౭

శా.కంటిం గంటి మునీంద్ర! రాఘవునమో♦ఘుం బైనదోశ్శక్తిఁ, దా
గొంటెన్ వింటి, మహాద్భుతంబును వితే♦ర్కింపఁగ దుస్సాధ మే
వెంటం జూడ నచింత్య మియ్యది చుమీ ♦ వే యేల మాసీత చేఁ
గంటిన్ ధన్యత రామచంద్రు విభుఁగాఁ ♦ గన్గొంట వాల్గంటియున్. ౧-౨౧౮

కం.రాముని దశరథతనయుని, నాముద్దుఁగుమారి సీత ♦ నాథునిఁగ జన
స్తోమం బెఱుఁగఁగఁ బడసి త,పోమహితా! జనకవంశ♦మున కిడెఁ గీర్తిన్. ౧-౨౧౯

◆ జనకుఁడు దశరథునొద్దకు దూతలఁ బంపుట. ◆

ఉ. నాసుత వీర్యశుల్క యను♦నావచనంబు ఫలించె, నిచ్చెదన్
వాసిగ జీవితంబునకు ♦ వర్తిలి మిన్నగఁ బ్రేమపాత్ర యీ
భూసుత రామచంద్రునకు ♦ భూరిగుణాబ్ధికి; నీయనుజ్ఞమైఁ
గోసల కేగువార లిదె ♦ కోవిదవర్య! మదీయమంత్రులున్.[2] ౧-౨౨౦

ఉ. చాలఁగ మీసుతుల్ కుశిక♦సంభవరక్షితు లౌచు వచ్చి మా
ప్రోలికి రాముఁ డుగ్రధను♦వున్ సభవారలు చూడఁ ద్రుంచుట
న్లీలగ వీర్యశుల్క సుత ♦ నీసుతనూజున కిచ్చువాఁడ నై
పాలితలోక మ మ్మిటకుఁ ♦ బంచెను మైథిలుఁ డంచు వెండియున్ ౧-౨౨౧

---

[1] తెగ = అల్లెత్రాడు. [2] ఇది ౧౫-వ నాఁటి వృత్తాంతము.

కం. మీ రడుగ దేరఁగ వేఁడెద, మా రా జని యందు రనిన ♦ మాని వరియసక
ధీరుఁడు మంత్రులఁ బుచ్చె య,థారీతి వచింప దశర♦థక్ష్మాపతికిన్. ౧౨౨౨

కం. రాజప్రేషితదూతలు, వాజులు రోఁజంగఁ బసువు♦పాఱుచు రాత్రుల్
వే జరపి మూఁడు ద్రోవన, యాజపురముఁ గనుచు నాలు♦గవదివసమునన్[1]

ఉ. ద్వారముఁ గాచి యున్నభట♦పర్యులఁ గాంచి యెఱుంగఁ జెప్పుఁడీ
ధారిణినేతకున్ జనక♦ధాత్రిపుమూతల మంచు వాకొనన్
వారలు చెప్పి వచ్చి జన♦పాలుఁడు ర మ్మనినాఁడు వేగమే
రా రయ యన్న లోఁ జని భ♦రావరు వృద్ధు సురాభు నాజినిన్ ౧౨౨౪

చం. కని భయ మేది కేల్మొగిచి ♦ కన్నవ్యదూతలు రాజశేఖరా!
జనకుఁ డెఱుంగఁ గోరెడి స♦పర్వపురోహితమంత్రివహ్ని వై
తన రెడినీదు సేమమును ♦ దద్దయు నింకొక వార్త గాధినం
దనుమెయికోలు గాంచి వసు♦ధాపతి యాగతి మన్వి చేసెడిన్. ౧౨౨౫

సీ. వినవయ్య నాసుత ♦ వీర్యశుల్క యటంచుఁ, బ్రతిన చేసితి మున్ను ♦ పార్థివేంద్ర
రాజు లెందఱో వచ్చి ♦ రాజానన వరింప, బెండుమానును లయి ♦ పెంపు సెడిరి
గాదె యదృచ్ఛమై ♦ గాధేయుతో వచ్చి, నీసుతుల్ గెలిచిరి ♦ నీరజాక్షి
నినసభమునఁ గన ♦ నల్లుగు రాముండు, వింటిని రెండుగా ♦ విఱిచి వైచెఁ

తే. గాన నమ్మహాత్మునకు నా♦కన్య సీత, నొసఁగి వీర్యశుల్క యు నెడి♦యుక్తి దీర్పఁ
గోరుచున్నాఁడ నాకోర్కె ♦ దీర మీరు, సెల వొసంగవ లేయట్ల♦చేయు మనుచు

చం. కొడుకులఁ జూడవచ్చు, పృథ♦కుంజర సంతస మందవచ్చు, నా
యడిగినకోర్కె దీర్ప నను ♦ వో,నటు గానఁ బురోహితాళితో
నడి హితపాళితో సచిన♦వర్గముతోఁ గొలువంగ దేవరు
ద్దడయక యేగు డెమ్ము,సుతు♦లం గనుఁగొమ్ము ప్రియంబు మీఱఁగన్. ౧౨౨౬

తే. అనుచు వచియించి సందేశ♦హరులు రాజ,గౌరవముతోంక చే నిల్వ ♦ క్ష్మాధిపుండు
వామదేవవసిష్ఠాది♦వరసచివుల,మోముఁ గని పల్కె నిర్భరా♦మోదయుక్తి.

సీ. గాధిజగుప్తుఁడై ♦ కౌసల్యాసనయుండు, సౌమిత్రితోఁ గూడి ♦ జనకపురిని
నున్న వాఁ డఁట, రాము♦మర్త్యశక్తిని జూచి, జనకుండు సుత నీయ ♦ సమ్మతించె
నఁట, జనకునివృత్త ♦ మని మీకు మెచ్చేని, దరులుద మచటికిఁ ♦ దడ వేఁ కేల
యనుడు మంతుడు లెల్ల ♦ రగు నగు నిది యన, సంతుష్టచిత్తుఁడై ♦ జనవిభుండు

తే. చేయ నగు తేవపయనంబు[2]♦సిద్ధమనుచు,మంత్రులకుఁ జెప్పిజనకుని♦మంత్రులకును
హితము దీపింపఁగా బహు♦మతుల లోసంగ,నిశను జరపిరి వా రంద ♦ నిమ్మళముగ.

---

[1] ౧౮-వ దినము. [2] ౧౯-వ దినము.

సీ. రేపాడి[1] సభదీరి ♦ భూపతి చుట్టముల్, మానులు గొలున సు♦మంత్రుఁ జూచి
యిప్పుడ ధనములు ♦ కుప్పలుగాఁ గొని, ధనపతు ల్ముందుగాఁ ♦ దరల వలయుఁ
జతురంగబలముల ♦ ద్రుతగతి వెడలింపు, మాజ్ఞతో డను కూర్పు ♦ మందలంబు
వామదేవుండు పి♦తామహసుతుఁడును, జాబాలికాశ్యపుల్ ♦ నాధునుతచి

తే. రాయువు మృకండుసుతుఁడు కా♦త్యాయనుండు
చనఁగవలె మున్ను; నా కొక♦స్యందనంబుఁ
బన్నుమీ దూత లాత్రము♦పఱుచు చున్న
వారు కాలంబు మీఱిన ♦ వలను గాదు. ౧౨౩౦

కం. అనవుడు సుమంత్రుఁడును ద,ర్జనపతియాదేశమునను ♦ సర్వబలంబుల్
బనిచి ఋషివర్యులకు స్యం,దనములు కల్పించి తెలిపె ♦ దశరథపతికిన్. ౧౨౩౧

ఉ. రాజవరుండు మంత్రిముని♦రాజసమూహము గొల్వ వాహినీ
రాజులు వెంట నంటఁ గడు♦రాజిలువేడ్కను బంచమాహ్నమం[2]
దోజ విదేహముం గన మ♦హోత్సుకతన్ జనకుండు నచ్చి తాఁ
బూజ లొనర్చె నాముసలి♦భూపతికిన్ భృశహృష్టచిత్తుఁ డై. ౧౨౩౨

జనకుఁడు దశరథుతోఁ గుశలప్రశ్న సేయుట.

తే. స్వాగతము నీకు నోనరపాలచంద్ర, వచ్చితివి నాదుభాగ్యంబు ♦ పండుకతన
నాత్మభవశౌర్యసంజాత ♦ మైనప్రీతి, ననుభవింపుము మన సార ♦ నర్క తేజ.

సీ. నాయదృష్టంబున ♦ నరనాథచంద్రమా, నినుఁ గాంచుపుణ్యంబు ♦ నేఁడు గలిగె
నాభాగ్యమునను మ♦హాభాగ ద్విజయుక్తు,ఘను వసిష్ఠమునీంద్రుఁ ♦ గనఁగఁగలిగె
నాసుకృతంబున ♦ సలినలిగాఁ బోయెఁ, బ్రత్యూహనిచయంబు ♦ పార్థివేంద్ర
నాపుణ్యమునఁ జేసి ♦ నళినాప్తవంశము, హాత్మలతో వియ్య ♦ మందఁ గంటిఁ

తే. బరమశౌర్యాఢ్యులైనమీ♦బాంధవమున,నన్వదన్వయ మతిపూజ్య♦మయ్యె నిపుడు
నిండె నాకోర్కె లెల్లను ♦ నీదుకృపను, సరసగుణనాంద్ర దశరథ♦ స్నాత లేంద్ర.

తే. రేపు వఱువాత[3] నోధరి♦త్రీమహేంద్ర, వేల్మికడపలఁ జలుపు మీ ♦ విధిహితముగఁ
బరనుఋషిసమ్మతంబుగఁ ♦ బరిణయంబు, ననిన జనకునితో నను ♦ నాజి యెలమి.

కం. ఇచ్చెడివారలవశ మగుఁ, బుచ్చుకొనుట యనుచు వింటిఁ ♦ బూర్వము జేఁడా
యెచ్చందమున వచించిన, నచ్చందమునం జరింతు ♦ నన్యుఁడ నొక్కో. ౧౨౩౬

కం. కీర్తి ధర్మముఁ గూర్చెడి, జ్యారమ-ఖనినుడికి ♦ నాతఁ డచ్చెరువుగొనన్
జేరినమునిసంఘాతం, బొరఁగ సుఖకీతిఁ గడపె ♦ నారే ప్రీతిన్. ౧౨౩౭

కం. తనయులఁ గని రఘుభూపతి,మునుమఁడు సుఖగోష్ఠి నుండె ♦ మఱి జనకుండున్
గొన ముట్టఁ దీర్చి జన్నము, గొనబుగఁ గావించెఁ బెండ్లి♦కూఁతుల సుతలన్.

---

[1] రేపాడి = ఉదయము　[2] ౧౩-వ దినము.　[3] ౧౪-వ దినము.

సీ. వఱువాతఁ గృతకర్మ♦వర్గుఁ డై జనకుఁ డ,నఘుఁ బురోహితు శతా♦నందుఁ జూచి
నాపిన్నతమ్ముండు ♦ నయధర్మశీలుండు, ఘనపుష్పకాభసాం♦కాశ్యపురిని
నిక్షుమతీజలం ♦ బింపారఁ గ్రోలు చు,న్నాఁడు కుశధ్వజ♦నామకుండు
వానిఁ జూడఁగ నాకు♦ వాంఛ యయ్యెడునాదు, క్రతువుఁ గాచెనటంచుఁ♦గలదునాకు
తే. నాతఁ డీ వేడ్క నాతోడ♦ననుభవింప, నలయు ననియాసయయ్యెడు♦నలయుఁబనుప
వార్తికావళి నతనికి ♦ వైళము యని, పుచ్చెఁ గొందఱ జంఘాల♦పుంగవులను.
ఆ. విభునిశాసనమున ♦ వేగవంతంబు లౌ, సైంధవముల నెక్కి ♦ జాగు లేక
జిష్ణునాజ్ఞ చేత ♦ విష్ణునిఁ గొనివచ్చు,వారు వోలె నరిగి ♦ వార్తఁ దెలుప. ౧౨౪౦
తే. అన్న రమ్మన్న యామాట ♦ విన్న యంతఁ
గ్రన్న నరుదెంచి మోదంబు ♦ మిన్ను ముట్ట
నన్నకుఁ బురోధకును మ్రొక్కి ♦ చెన్నుమీఱు
చున్నయొకయాసనంబున ♦ నుండె; నిట్లు ౧౨౪౧
ఉ. భ్రాత లలంకరించి రుచి♦రం బగునాసనపాళులం గడుం
బ్రీతి సుదాము మంత్రివరుఁ ♦ బిల్చి వచించిరి మంత్రిసత్తమా!
చేతము పల్లవింపఁ జని ♦ చెచ్చెరఁ దోడ్కొని రమ్ము యాజి ధా
త్రీతలనాథు ధీసచివ♦బృందముతో నిజపుత్రపంక్తితోన్. ౧౨౪౨
కం. అనుడు సుదాముఁడు దశరథ,జనపతిశిబిరంబుఁ జొచ్చి ♦ క్ష్మాపతిఁ గని వం
దన మొనరించి శిరమ్మున, జనకుఁడు మిముఁ జూడఁ గోరె ♦ సపురోహితుఁ డై.
సీ. నావుడు దశరథ♦భూవల్లభుఁడు ఋషి,సర్గంబు నిజబంధు♦వర్గ మమరఁ
జని జనకావనీం♦ద్రునిఁ జూచి యిట్లనుఁ, దెలియుదు విక్ష్వాకు♦కులము వేల్ప
యీవసిష్ఠుం డని ♦ యీవరశీలుండె, వక్తయు సకలార్థ♦శక్తుఁ డనఘు
గాధిజుం డాదిగా ♦ మేధావులీయున్న,మును లెల్ల ననుమతిం♦చిన మదీయ
తే. వంశవిధ మీమహర్షి ని♦స్సంశయముగఁ, దెలుపఁగలవాఁ డటంచని♦పలుక కున్న
హితపురోహితమంత్రిస♦మేతు మిథిల,నాథుఁ గనుఁగొని యమ్ముని♦నాథుఁ డనియె.

వసిష్ఠుడు జనకునితో సూర్యవంశ క్రమంబుఁ దెలుపుట.

సీ. అవ్యక్తజుఁడు నిత్యుఁ ♦ డవ్యయుం డగు బ్రహ్మ, గనె మరీచి నతండు ♦ కశ్యపమునిఁ
గనియెఁ గశ్యపునకుఁ ♦ గలిగె వివస్వంతుఁ, డస నాతనికిఁ బుట్టె ♦ మనువు వాని
తనయుఁ డిక్ష్వాకుఁ డా♦తని రాజధాని య,యోధ్యాపురం బయ్యె ♦ నొప్పుమీఱ
నిక్ష్వాకుతనయుఁ డై ♦ యెసఁగెఁ గుక్షి వికుక్షి, కొడు కాతనికిని వి♦కుక్షిసుతుఁడు
తే. బాణుఁ డనరణ్యుఁ[1] డాతని♦పట్టి యయ్యె
నతనిపుత్త్రుఁడు పృథుఁడు త♦దాత్మజుండు

[1] రావణుని శపించిన రాజయోగి యితఁడే.

సుమి త్రిశంకుఁడు నాతని♦సుతుఁడు ధుంధు
మారుఁ డన నొప్పెఁ గడు ఘన♦మానబలుఁడు.　　　౧౨౭౫

సీ. యువనాశ్వుఁ డనునాము♦ మొప్పు నాతనికిఁ దత్, తనయుండుమాంధాతృ♦జనవిభుండు
మాంధాతృసుతుఁడు శ్రీ♦మంతుఁ డైనసుసంధి, యతనికి ధ్రువసంధి ♦ యనఁ బ్రసేన
జిత్తు నాఁ దనయులు ♦ చెలఁగిరి ధ్రువసంధి,తనయుండు భరతుండు ♦ ధర్మరతుఁడు
భరతునిపుత్త్రుఁ డై ♦పరఁగెను నసితాఖ్యుఁ, డతఁడు శత్రువులు హై♦హయులుఁదాల
తే. జంఘశశిబిందువులు దాఁక♦సంగరమున,నోడివనములఁబడిమంత్రి♦యుక్తుఁడగుచుఁ
బాటి వలిగట్టునను భృగు♦ప్రస్రవణము,నందు వసియించె మితబలుఁ♦డనుచువింటి.

కం. ఆపన్నసత్త్వ[1] లిరువురు, భూపాలక యతనిసతులు ♦ పొలఁతుక యొక్క
త్తేపగిదినొ సవతాలికి, నాపడ నిడె భక్ష్య మొండు ♦ సగరము[2] గాఁగన్. ౧౨౭౬

ఉ. అందుల కేగుదేరఁ జ్యవ♦నాఖ్యుఁడు భార్గవుఁ డొక్కనాఁడు కా
ళింది మునీంద్రు డాయుచు ల♦లిం బ్రణ మిల్లె సుతుండు గల్గ నా
యందు ననుగ్రహింపు మని ♦ యామెఁ దలంచుచు నామెఁ జూచి యో
సుందరి! పుత్త్రుఁ గాంచెదవు ♦ శోకము మానుము శౌరవర్యునిన్.　　　౧౨౭౭

కం. గరసహితుం డయి పుట్టుట, సరసిజముఖి వాఁడు పరఁగు ♦ సగరుం డనఁగా
వరబలుఁ డై యసఁగ ననం,తరమునఁ గాళింది గాంచెఁ ♦ దనయుఁ సగరున్.

సీ. అనఘ! యాతనిపుత్త్రుఁ♦ డసమంజుఁ డతనికి, నంశుమంతుఁడు పుట్టె♦నతనితనయుఁ
డయ్యె దిలీపుఁడు ♦ నాతనిసుతుఁడు భ,గీరథుఁ డయ్యె భ♦గీరథునకుఁ
గలిగెఁ గకుత్స్థుండు ♦ క్ష్మాపాల యతనికి, రఘువు సుతుం డయ్యె ♦ రఘువుకొడుకు
భువిఁ బ్రవృద్ధుం డయ్యెఁ ♦ బురుషాదకుం డనఁ, గల్మాషపాదాఖ్య ♦ గల దతనికి
తే. నతనిసుతుఁ డయ్యె శంఖణుం♦డతనికొడుకు, పరఁగెను సుదర్శనుండు నా♦పార్థివునకు
నగ్నివర్ణుండు గలిగె నా♦యగ్నివర్ణుసుతుఁడు శీఘ్రగుఁ డాతని♦సుతుఁడు మరువు.

సీ. అతఁడు ప్రశుశ్రుకు ♦ నతఁ డంబరీషుని, నతఁడు నహుషుఁ గనె ♦ నతనిసుతుఁడు
వఱలు యయాతి నా ♦ వసుమతీనాథుండు, నతనికి నాభాగుఁ ♦ డాత్మజుండు
నాభాగసుతుఁ డయ్యె ♦ సన్నయశోధనుం, డై నమహాత్ముఁ ♦ డజనృపాలుఁ
డజునకు జనియించె ♦ నాజిదుర్ధర్షుండు, దశరథుం డనుమహా♦ధన్యుఁ డల్ల
తే. ఘనున కుదయించి రయ్య యీ♦యనఘ తేజు, లైనశ్రీరామలక్ష్మణు♦ లార్యచరిత
యాదివంశవిశుద్ధులు ♦ ఘనమధర్మ,సుతులు వీరలు సత్యైక♦రతులు వీరు.　　　౧౨౫౧

కం. రాముపకును సౌమిత్రికి, భూమిప! నీసుతలఁ దుల్య♦పూజితగుణలన్
బ్రేమమున నీయ వేఁడెద, నామనవిని దీర్ప నయ్య ♦ నరనాథ యనన్.　　　౧౨౫౨

---

[1]ఆపన్నసత్త్వలు = గర్భిణులు.　[2]సగరము = విషముతోఁ గూడినది.

## జనకుఁడు వసిష్ఠునకు నిజవంశక్రమంబుఁ జెప్పుట.

సీ. జనకుఁ డి ట్లనియె నో♦సంయమి! మావంశ,విధ మెల్ల వినవయ్య ♦ విస్తరింతుఁ[1]
గన్నియ దానంబుఁ ♦ గావించునాతఁడు, సత్కులీనుం డయి ♦ జరగె నేని
వక్తవ్య మతనికి ♦ వంశవిధం బెల్ల, నిమి యొప్పు సద్ధర్మ♦నిరతుఁ డగుచు
నతనిపుత్త్రుఁడు మిథి ♦ యన్మహాత్మునిచేత, మిథిలాపురంబు ని♦ర్మింపఁబడియెఁ
తే. బ్రథమజనకుఁ డతఁడ యుదా♦వసువుఁ గనియెఁ
దనయుఁ డతనికి నందివ♦ర్ధనుఁడు గలిగె
నాయునకును సుకేతుఁ డా♦త్మాధిపునకు
దేవరాతుఁడు జనియించె ♦ దేవనిభుఁడు. ౧౨౫౩

సీ. ఆయనకుదయించె ♦ నయ్య బృహద్రథుం, డతఁడు మహావీరు ♦ ననఘుఁ గనియె
నామహావీరుని♦యాత్మజుండు సుధృతి, సుధృతియు నిరుపమ♦శూరుఁ డైన
ధృష్టకేతువుఁ గనె ♦ ధృష్టకేతువునకు, హర్యశ్వుఁ డుదయించె ♦ నమితబలుఁడు
హర్యశ్వునకు మరు ♦ వావిర్భవించెను, ధీరుఁడు మరువు ప్ర♦తీంధకునిని
తే. గనియెఁ గీర్తిరథాఖ్యునిఁ ♦ గాంచె నాతఁ
డతనిపుత్త్రుఁడు దేవమీ♦ఢాఖ్యుఁ డయ్యె
నతనితనయుండు విబుధాఖ్యుఁ ♦ డతనిపుత్త్రుఁ
డయ్యెను మహీధ్రకుండు నా ♦ నతనిసుతుఁడు ౧౨౫౪

సీ. కీర్తిరాతుం డయ్యెఁ ♦ గీర్తిరాతునకును, సుతుఁడు మహారోమ♦నామవర్యుఁ
డతనికి స్వర్ణరో♦మాఖ్యుఁడు వానికి, హ్రస్వరోముఁడు పుట్టె ♦ నాతనికిని
గలిగెను బుత్త్రయు♦గ్మంబు తత్సుతులందు, నగ్రజుఁడను నాదు♦ననుజుఁ డితఁడు
వనమున కేగుచో ♦ వసుధేశుఁ గాఁ జేసి, ననుఁ బెద్ద నాటను ♦ నాదుతమ్ము
ఆ. నాకు నప్పగించి ♦ నాకంబునకు నేగె, జనకుఁ డేను నీకు♦శధ్వజునిని
నెలమిఁ జూచుకొనుచు ♦ నిపు డేల సాంకాశ్య,పతి సుధన్వుఁ డనెడి♦క్షితివిభుండు

కం. దూతల నంపెను సరసీ,జాతాక్షిని సీత శివుని♦చాపము నీయ న్
భీతిప్రదఘోరాహవ, మాతనితో నయ్యె దేని ♦ నర్పింపమిచేన్. ౧౨౫౬

మ. సమరక్షోణిని వానిఁ ద్రుంచి యనుజు న్ ♦ సాంకాశ్యమం దుంచితి
న్సముకుం బట్టముఁ గట్టి, యాతఁడె చుమీ ♦ నాతమ్ముఁ డే జ్యేష్ఠుఁడ న్
విమలాత్మా! యిడె రామలక్ష్మణులకు న్ ♦ వీర్యంబె శుల్కంబు నా
రమణీరత్నము సీత నూర్మిళను గా♦రా మారఁగా నిచ్చెదన్. ౧౨౫౭

కం. ముమ్మాటికి నిచ్చెద లే, దిమ్మాటకు సందియంబు ♦ నృపవర! సుతర
త్నమ్ముల రాముని నాతని,తమ్ముని గోదానమిదియె ♦ తటి చేయింపన్. ౧౨౫౮

---

[1] శ్రీరాములది యజుర్వేదము, కాశ్యపగోత్రము. సీతాదేవిది ఆత్రేయగోత్రము.

కం. నేఁడు మఖానక్షత్రము, మూఁడవదినమున[1] వివాహ♦మును జరపవయా
ఱేఁడా! యుత్తరఫల్గుని,నాఁడు; సుఖోదర్క మీగి ♦ నందను లీయన్. ౧౨౫౯

సీ. అని జనకుం డాడ ♦ నంత గాధిసుతుండు,మైత్రావరుణిఁ గూడి ♦ మందలించె
ననఘ యచింత్యంబు ♦ లప్రమేయంబు లి,క్ష్వాకు విదేహవం♦శంబు లిలను
మీకు సమానులు ♦ మేటులుఁ గనరారు, సంబంధమును గూర్ప♦సంపదయును
రామలక్ష్మణులకు ♦ రాజన్య! భూమిసు,తోర్మిళాసతులకు ♦ నొక్కరూప;

తే. కలదు వేఱొండు మాకు వ♦క్తవ్య మధిప! నీదుతమ్ముండు సద్ధర్మ♦నిష్ఠుఁడైన
యీకుశధ్వజునకుఁ గూఁతు♦లిరువురిమ్ము,భరతశత్రుఘ్నులకువారి♦భార్యలుగను.

కం. అందంబున భుజబలముల,చందంబునఁ బరువమునను ♦ జనవర! యొకఁడే
చందం బందఱు దశరథ,నందనులు దిగీశబలులు ♦ నందితలోకుల్. ౧౨౬౧

కం. సరి సరి యని జగ మెన్నఁగ, సరి సరి యగుబాంధవంబు ♦ చను మీకు; మఱిం
బోరిఁబోరి వృద్ధిం గను మీ,యిరువురవంశములు గూడి ♦ యెసఁగిన యేనిన్.

కం. అన విని జనకుం డిట్లను, మునిసింహులు తుల్యవంశ♦మునసంబంధం
బును దామ యానతిచ్చుట, ఘనఘము ధన్యంబు నయ్యె ♦ నస్మత్కులమున్.

ఉ. విండ్రు మహాత్ములార! కడుఁ♦బ్రీతి గుశధ్వజరాజు కూఁతులన్
ఆండ్రుగఁ గైకపుత్త్రునకు ♦ నాతనితమ్మునికే నొసంగెదన్,
వీండ్రకు నొక్కనాఁడె నెఱ♦వేడుకఁ బెండిలి సేయ నొప్పు, గో
డండ్రుర నల్వురం గన నె♦సంద ముదం బగుఁగాక యోజికిన్. ౧౨౬౪

కం. ఉత్తరదివసంబున నగు, నుత్తరఫల్గునియుఁ; దాన ♦ నుద్వాహము మే
లత్తఱి భగుఁడు ప్రజాపతి, సత్తము లది యుత్తమ మని ♦ శంసింత్రు గదా. ౧౨౬౫

కం. ధాత్రుండను మీకరుణకుఁ, బాత్రుండను నాకు మీరు ♦ పరధర్మంబున్
బాత్రం బని చెప్పితి రని, ధాత్రీశుఁడు మఱియు మౌని♦ధాత్రీశులతోన్ ౧౨౬౬

ఉ. ఓఋషివర్యులార యిదె ♦ యుండుఁడు కూరిమి నాసనత్రయిన్
మీరలు; మూఁడురాజ్యములు ♦ మీయవి గా వారా, యోజి కీర్తి యె
ట్లూరయ నా కయోధ్య యటు ♦ లౌట యనార్గళన్ భరింపుఁడీ
మీరలు సంశయింప కన ♦ మెచ్చుచుఁ బంక్తిరథుండు హృష్టుఁడై ౧౨౬౭

తే. అన్నదమ్ములు మీర ల♦నంతభద్ర,గుణుల రెప్పుడుఁ గోటాన♦గోటు లైన
రాజులను మునిరాజుల ♦ రాజులఁ దమిఁ, బూజ సేసినవారలు ♦ పుణ్యధనులు.

తే. ధరణినాయక నేనింటి♦దాఁకఁ బోయి,వత్తునే? నాంది మొదలుగా♦వలయుఁగావె
జరుప నని కౌశికవసిష్ఠ♦సహితుఁ డగుచు, విడిదికిని నేగె దశరథ♦విభుఁడు వేగ.

---

[1] ౧౨-వ దినము.

చం. ఇటు తపయింటి కేగి ధర♦ణీశుఁడు నాంది యొనర్చి వేగుఁబో
కట నడి మేలుకాంచి తన♦గాదిలిపుత్రులఁ గూర్చి యిచ్చెఁ బ్ర
స్ఫుటకనకేద్ధశృంగయుత♦భూరిపయస్విను లైనయాల నొ
క్కట నలునూఱువేలు, పిదు♦కంగ నొసంగెను గంచుపాత్రముల్. ౧౨౭౦

కం. కొడుకులకొఱకై పెల్లుగ, విడిముడి బ్రాహ్మణుల కిచ్చె ♦ విధిమై సల్వ
ర్కొ్కడుకులతో దిక్పాలకు, లొడఁగూడి భజింప నీర♦జోద్భవుఁ డనఁగన్. ౧౨౭౧

→ యుధాజిత్తు దశరథుఁ జూడ వచ్చుట. ←

కం. ఏదినమున గోదానము[1], భూదయితుఁడు చేసె నల్లి♦పూఁటన మూడం
గా దశరథుఁ గేకయసుతుఁ, డాదటఁ జనుదెంచె; మేన♦యల్లుం భరతున్ ౧౨౭౨

ఉ. హత్తిన ప్రేముఁ దండ్రి దను ♦ నంపఁగఁ దోడ్కొనిపోవ నాయుధా
జిత్తరుదేరఁ గాంచి పతి ♦ సేమము నారయ సేమ మంచుఁ దాఁ
జిత్తమునందుఁ దండ్రి దమి♦సేసె సుతానులుఁ జూడ, దాన నే
నిత్తఱి వచ్చినాఁడ నృప! ♦ యేగితి ని న్గన నయ్యయోధ్యకున్. ౧౨౭౩

ఉ. అచ్చట విన్నవాఁడ నిట ♦ కందఱఁ గూడి నృపాలచంద్ర! నీ
వచ్చుట పెండ్లికై, పరుగు♦పాఱితి నల్లునిఁ జూడఁ గోరి నే
ముచ్చట మీఱ, నన్న విని ♦ మోదమునం దనబావగారిఁ దా
నచ్చుగ నాదరించె ధర♦ణీశ్వరుఁ డాజి యథార్హసత్కృతిన్. ౧౨౭౪

కం. కొడుకులతో నాఁగాత్రిరి, గడపి దశస్యందనుండు ♦ కడువేడుకలన్
బొడువుములఁ బ్రొద్దు దోఁచిన, వడి దీరిచి విఘుల యజ్ఞ♦వాటముఁ జొచ్చెన్.

కం. ఇమ్ముగ సొమ్ములు దాలిచి, తమ్ములతోఁ దాను భద్ర♦సం బగుసుముహూ
ర్తమ్మున ధృతకంకణహ, స్తమ్మున వెలుఁగుచును రామ♦చంద్రుఁడు వచ్చెన్.

ఉ. ముస్ను వసిష్ఠగాధిసుత♦ముఖ్యులు దో నడునంగ రాముఁ డా
జేన్నపువాటిఁ జొచ్చుడును ♦ జయ్యన నేగి వసిష్ఠమౌని వి
ద్వన్నుతు మైథిలుం గని య♦థావిధిమైఁ గృతకౌతుకుల్ సుతుల్
దన్ను భజంప నాజి యదె ♦ దాతనిమిత్తము వేచి యుండెడిన్. ౧౨౭౭

కం. దాతయును బ్రతిగృహీతయుఁ, జేతఃప్రీతిమెయి నొకటఁ ♦ జేరినఁ గాదే
యాతలికార్యము లగు; వి, ఖ్యాతి స్వధర్మంబు నిలుపు♦మా పెండిలిగాన్.

ఉ. ఇవ్విధి మౌని నల్క మిథి♦లేశ్వరచంద్రముఁ డామునీంద్రుతో
నెవ్వరు క్రొత్త? లిప్డు తడ ♦ వేటికిఁ జేసితి? లేది యడ్డమో?
యెవ్వరి యాజ్ఞ వేచెదరొ ♦ యిమ్మహి యెల్లను మీదె యన్న వా
క్రువ్వఁగ నేఁ నాగృహముఁ ♦ గోపిడ! జంకు గొసంగ న్యాయ్యమే? ౧౨౭౯

---

[1] గోదానము = కేశఖండనము ౧౬-వ దినము.

కం. భూషిత లై రుచిరవధూ,వేషంబుల నాదుసుతలు ♦ వేదికకడ సం
తోషమున నున్నవారు వి,శేషంబుగ వెలుఁగునగ్ని ♦ చెలువున మౌనీ. ౧౨౮౦
కం ఇదె సిద్ధ మెల్ల మీకై, యెదురు గనుచు నున్నవాఁడ ♦ నేల తడయఁగా?
ముదితల నిలిపితి వేదిని, సదయులరై పెండ్లిఁ దీర ♦ సలుపుఁడు మీరల్. ౧౨౮౧
కం జనకుఁ డిటు లాడ దశరథుఁ, డనిపెను దనతనయులను మ♦హాత్ములఁ గ్రతుశా
లను వెండి వసిష్ఠుం గని, జనకుం డి ట్లనియె నధిక♦సమ్మద మారన్. ౧౨౮౨
తే. ఋషులతోఁ గూడి యోమునిౕ♦నృపభ నీవు, రామునకునుద్రిలోకాభి♦రామునకును
నింపు దళుకొత్త వేగ చే♦యింప వయ్య, యింక వైవాహికక్రియా♦బృంద మెల్ల.
సీ. అనిన వల్లె యటంచు ♦ ననఘుఁడు గాధిపు,త్రుఁడు శతానందుండు ♦ తోడుపడఁగఁ
జెలువపందిరిలోన ♦ శాస్త్రోక్తవిధి వేదిఁ, గల్పించి పుష్పసు♦గంధతతులఁ
గైసేసి మెఱుఁగుబం♦గరుపాలికలతోడ, సాంకురంబు లయి శో♦భావహ మగు
ఛిద్రకుంభములతోఁ ♦ జిగుళ్ల నొప్పగు,మూఁకుళ్లతోడంత ♦ మోహనముగ
ఆ. ధూపయుక్తమైన♦ధూపపాత్రములతో, వఱలు చున్నస్రుక్స్రు♦వములతోడ
నర్ఘ్యలాజపూరి♦తాచ్ఛపాత్రములతో, నక్షతలను నించె ♦ నపుడు వేది. ౧౨౮౩
ఆ. మంత్రపూర్వకముగ ♦ మంచి దర్భలఁ బర్చి, విధిహితంబుగాఁగ ♦ వేదియందు
నగ్ని నుంచి వేల్చె ♦ నందు వసిష్ఠుండు, నంత జనకరాజు ♦ హర్షయుక్తి. ౧౨౮౪

## శ్రీ సీతాకల్యాణఘట్టము [1]

కం. సీతను సర్వాభరణో,పేతను దా నిలిపి యగ్ని ♦ కెదురుగఁ గౌస
ల్యాతనయున కభిముఖముగ, ఖ్యాతలనాథుండు రామ♦చంద్రున కనియెన్.
కం. ఈసీత నాదుకూఁతురు, నీసహధర్మచరి దీని♦నిం గైకొనుమా
కౌసల్యాసుత! నీకును, భాసురశుభ మగు గ్రహింపు ♦ పాణిం బాణిన్.[2] ౧౨౮౮
తే. నిన్ను నెడఁబాయ దెప్పుడు ♦ నీడనీడ,వగిది నీపతివ్రత మహా♦భాగ యనుచు
మంత్రపూతజలంబుల ♦ మైథిలుండు, ధారవోసెను రాముహ♦స్తంబునందు.
ఉ. మెచ్చిరి దేవతల్ ఋషులు ♦ మే లిది మేలు భళీ యటంచు, లో
హెచ్చిరి నిండుమోదమున ♦ నెల్లరు, వేల్పులు పుష్పవర్షముం
దెచ్చిరి, దేవదుందుభులు ♦ దీర్ఘముగా మొరయించి, రంతటం
బ్రచ్చిరి శోకదైన్యములు ♦ వాసవుఁ డాదిగ నెల్లవారలున్. ౧౨౮౯
కం. ఈరీతిని మంత్రోదక,ధారాపూర్వకముగాఁగ ♦ ధరణీతనయం
శ్రీరామున కిచ్చి మఱిఁ, గ్మారమణుం డిట్టు లనియె ♦ సంతోషమునన్. ౧౨౯౦
కం. రమ్మా లక్ష్మణ యూర్మిలఁ, గొమ్మా దానంబుగాఁగఁ ♦ గూర్మి నొసఁగెదఁ
గొమ్మా కరమ్ము పెనిమ శు,భ మ్మగుత మిఁ కేల జాగు♦పఱుపఁగుమారా. ౧౨౯౧

[1] ౬౭-వ సర్గమున సీతాకల్యాణము. [2] పాణింబాణిపట్టికొనుట యంతశాస్త్రము పాణిగ్రహణమాత్ర
ధారణము స్మార్తము.

కం. అని జనకుఁడు భరతుని దెసఁ, గనుఁగొని మాండవికరంబు ♦ గ్రహియింపు మటం
చని శత్రుఘ్నుని శ్రుతకీ, ర్తిని గైకొనుమా యటంచుఁ ♦ బ్రేమం బలికెన్. ౧౨౯౨

కం. సుందరు లగుభార్యలతో, నందఱు సౌమ్యులరు నంద ♦ ఱాచారములన్
జెందినవారల రగుఁడ య,నిందితమతులార యనుచు ♦ నిలుచున్న యెడన్ ౧౨౯౩

కం. జనకునివాక్యములను విని, కని గురు ననుమతి గ్రహించి ♦ కరములఁ దత్త
ద్వనజాతాక్షులకరములు, ఘనమతి నల్వురును వేడు ♦ కల్ గొన వారన్ ౧౨౯౪

చం. అలమినభక్తి మ్రొక్కి రట ♦ నగ్నికి వేదికి మౌనికోటికిన్
వలగొని రక్తి రాజులకు ♦ వారిజనేత్రలతోడ రాఘవుల్,
నెలసె వివాహ మంత నతి ♦ విశ్రుత మై విధిపూర్వకంబుగాఁ
జెలఁగుచుఁ బుష్పవృష్టి గురి ♦ సెన్ మొరసెన్ దివి దేవదుందుభుల్. ౧౨౯౫

కం. ఆడిరి నిర్జరకాంతలు, పాడిరి గంధర్వసతులు ♦ బహులముగ గుమిం
గూడిరి మింటను వేల్పులు, వీడుచు భయ మప్పు డిట్టి ♦ వింతలు సెలఁగెన్. ౧౨౯౬

కం. మ్రోయఁగ వాద్యధ్వని లై, వాయఁగ మోదంబు రాఘ ♦ వచతుష్కము ము
మ్మాఱగ్నికి వలగొనఁగా, జాయనికుతుకములఁ బెండ్లి ♦ నాంతముగాఁగన్ ౧౨౯౭

కం. పడఁతులతోడుత దశరథు, కొడుకులు దమవిడిదియిండ్ల ♦ కుం జనఁ దోడన్
నడచెఁ బతి మానియుతుఁడై, యొడలక చుట్టములతో ము ♦ నీశ్వరుఁ డంతన్.

ఉ. వేగిన మేలుకాంచి నృప ♦ వీరునిసమ్మతి నొంది దీవనల్
బాగుగ నిచ్చి యానృపతి ♦ బాలురకుం గుశికాత్మజుండు దా
నేగె హిమాద్రిప్రాంత కటు ♦ లేగుడు మైథిలుఁ గాంచి యాజి మే
మేగ ననుజ్ఞ యిచ్చెద రె ♦ యింక నయోధ్య కటంచుఁ బల్కినన్ ౧౨౯౯

ఉ. ప్రీతి రహింపఁగా జనక ♦ రాజశిఖామణి యిచ్చె గారవం
బూఁతుల కొక్కతొక్క తెకు ♦ గోవులలక్షయు, మేలివన్నెగై
నేఁతలకంబళంబులను, ♦ నిగ్గులచేలచయంబు, నిండుఁ గై
సేఁతలదాసులన్, రుచివి ♦ శేషశతాంగమతంగజాళులన్. ౧౩౦౦

కం. వాఁడిమి గలగుఱ్ఱంబులు, వాఁడిమగలు సైనభటుల ♦ వరమౌక్తికముల్
పైఁడిని బగడంబులఁ దన, యాఁడుంబిడ్డలకు నరణ ♦ మాజనకుండున్ ౧౩౦౧

తే. ఇచ్చి యారీతి బిడ్డలఁ ♦ బుచ్చి తాను, గొంతవ ఱేగి కౌసల్య ♦ కాంతు నవల
సాగ నంపి తదనుమతి ♦ నేగెఁ దనదు,మందిరమునకు భూపపు ♦ రందరుండు. ౧౩౦౨

కం. ఆరామచంద్రు నరసుకు,మారతయున్ సోయగంబు ♦ మహితం బగుగం
భీరత శౌర్యముఁ గని పుర,వారిజలోచనలు మెచ్చి ♦ వాకొని రిట్టుల్. ౧౩౦౩

సీ. *వీఁ డటే తాటక ♦ వీరరణంబున, గీటణఁగించిన ♦ యేటుకాఁడు
ఇతఁ డటే కౌశిక ♦ క్రతురక్షను సుబాహుఁ, బిలుకుమార్చిన యట్టి ♦ బిరుదులాఁడు
వీఁ డటే గౌతము ♦ వెలఁది శాపముఁ బాపి, యింతిగాఁ జేసిన ♦ యితవుకాఁడు
ఇతఁ డటే మనవీటి ♦ పతి దాఁచి యున్న యా, యుగ్రువిల్విఱిచిన ♦ హరాంతకాఁడు
తే. ఈతఁడా నిన్న మనసీత ♦ నెలమిఁ బెండ్లి, యాడి కులుకుచు నున్నట్టి ♦ యందకాఁడు
ఔర యెంతటిపుణ్యాత్ముఁ ♦ డమ్మ జనకుఁ, డితఁడు తన పెండ్లికొడుకుగ[1] ♦ నెసఁగినాఁడు.
సీ. *ఏమి నోచెనొ కదే ♦ యీతని సుతుఁగాఁగఁ, గౌసల్య కడుపారఁ ♦ గాంచుటకును
నేనిష్ఠ సలిపెనో ♦ మానినీ మనసీత, పతిగాఁగ నీతనిఁ ♦ బడయుటకును
నేమి జపించెనో ♦ యీమనజనకుండు, వీఁ డల్లువాఁ డయి ♦ వెలయుటకును
నేతపం బుండెనో ♦ యీతఁ డేలిక యయి, యోమఁగాఁ దమ్ము న ♦ యోధ్యజనులు
తే. ఏమినియమంబు జరపెనో ♦ యింతులార, ప్రత్యహంబును శ్రీరామ ♦ భద్రుఁ గనుల
కఱవు దీఱంగ వీక్షింపఁ ♦ గా నయోధ్య, జనము సత్క్షేత్రతీర్థవా ♦ సంబు పొదలి.
సీ. *చూడఁగాఁ గలమె యీ ♦ సుందరాకారుని, నిం కొక్కమాఱైన ♦ నింతులార
కానఁగాఁ గలమె యీ ♦ కమలాయతాక్షుని, మఱి యొక్కమాఱైన ♦ మగువలార
వీక్షింపఁ గలమె యీ ♦ యిందీవరశ్యాము, వే ఱొక్కపరి యైన ♦ వెలఁదులార
లక్షింపఁ గలమె యీ ♦ లలనామనోహరు, నొం డొక్కతఱి నైన ♦ నువిదలార
ఆ. యేమిబాములందు ♦ నేమిపుణ్యంబులఁ, జేసినార మొక్కొ ♦ చెలువలార
నేఁడు చూడఁ గల్గె ♦ నిండారుఁగన్నుల, పండువుగను రామ ♦ భద్రు నిచట. ౧౩౦౬

దశరథునకు మార్గమున నవశకునంబు లగుట.

కం. అంతటఁ దమిని నయోధ్యా, కాంతుఁడు దనుఁ గూడి రాఁగ ♦ గాదిలితనయుల్
చెంతల మునివర్గము రాఁ, గొంతవడికిఁ జనఁగ నెదుట ♦ ఘోరత దోఁపన్. ౧౩౦౭
కం. పక్షులు గూసెను క్రూరత, నక్షత్రపథంబునం గ ♦ నన్ మృగసంఘం
బాక్షణమ పాఱఁ దొడఁగెఁ బ్ర, దక్షిణముగ దానిఁ జూచి ♦ దశరథుఁ డార్తిన్.
చం. అడిగె వసిష్ఠు నేమి యది ♦ యంచు మునీంద్రుఁడు పక్షికూఁతలన్
బెడిదపుఁగీడు దోఁచినను ♦ బెగ్గలపోకు ప్రదక్షిణించె నీ
యడవిమృగంబు లట్లగుట ♦ నాపద లే దనుచుండ నంతలో
నుడినుడి గొట్టె వాయువులు ♦ చూపఱుగుండెలు ఝల్లుఝల్లనన్. ౧౩౦౯
చం. వడఁకె వసుంధరాతలము, ♦ వ్రాలె ద్రుమంబులు, దండిచీఁకటుల్
నుడిసెను భాస్కరున్, దెసల ♦ చొప్పు దొలంగె నెఱుంగరాక, పెం
బుడమిదుమార మేచి యల ♦ భూపతిసేనలఁ గప్పఁ దెల్వియుం
జెడి నిలపాటు చెందె వెఱఁ ♦ జేయఁగ నేమియుఁ దోఁప కంతటన్. ౧౩౧౦

[1] పెండ్లికొడుకు = అల్లుఁడు.

కం.అక్కట యే మన సత్తఱి, సక్కడ దశరథనృపాలుఁ ♦ డాత్మజులు ఋషుల్
దక్కఁగ నొక్కం డేనియుఁ, జిక్కఁడు వెఱఁ దెలివి దొఱఁగి ♦ చేష్టడ కుండన్.

→ పరశురాముఁడు శ్రీరాములఁ జూడ వచ్చుట ←

శా.ఆపెంజీఁకటి భీమసంహననుఁ డ♦త్యాభీల తేజస్వి గో
త్రాపాలాంతకమూర్తి భార్గవుఁడు దు♦ర్ధర్షుండు కైలాసాద్రి నాఁ
గోపోద్రేకితఁ గల్పవహ్ని జనచ♦క్షుర్దుర్నిరీక్షుండు నా
టోపస్ఫూర్తి శరాసహస్తుఁ డురుజూ♦టుం డాపు రాఘ్నా భుఁడన్ ౧౩౧౨
కం.స్కంధవిలసితపరశ్వధ, మంధీభూతులను జేయ ♦ సందఱ మదయు
క్సింధురగమనంబున నిల, ధంధ మ్మన వచ్చె జామ♦దగ్న్యుండు వడిన్. ౧౩౧౩
ఉ. వచ్చిన సప్తసిద్ధముఖ♦వర్యులు నొండొరులతోడ నాడఁగాఁ
జొచ్చిరి గుంపు గూడి మది ♦ జొబ్బిలఁ దండ్రిసధంబుకోప మీ
సచ్చరితుండు భూమిధన♦సంతతులన్ వధియించి మానెఁగా,
వచ్చి వధించునే మరల ♦ రాజుల, లేవుగ యట్టికోరికల్. ౧౩౧౪
కం.అని మునివర్గం బర్ఘ్యం,బును రామా! యనుచు మధుర♦ముగఁ బలుకుచు ని
చ్చినఁ గైకొని దశరథరా,మునితో జమదగ్నిసుతుఁడు ♦ మునుకొని పల్కెన్.
కం రామా! దశరథరామా! నీమహితాద్భుతబలంబు ♦ నెఱి వింటిని, నీ
భీమధనుర్భంజనమును, భూమిని నెల్లెడలఁ జెప్పఁ ♦ బొలుపుగ వింటిన్. ౧౩౧౬
కం.త్రినయనువిలు నీవిఱుచుట, యన నత్యద్భుత మచింత్య ♦ మది విని నేనున్
గొని వచ్చినవాఁడ మహా,ధనువును వే ఱొండు నీదు♦దర్పముఁ జూడన్. ౧౩౧౭
కం.ఇదె జామదగ్న్యచాపం, బదరుం గుండియలు చూచి♦నంతన దీనిం
బదిలముగ శరము నెక్కిడి, బెదరక నా కిపుడు చూపు ♦ బీరము లావున్.౧౩౧౮
కం.ఈవింటిని మోపెట్టిన, నీవిక్రమ మేను జూచి ♦ నీతోఁ బినపం
గావింతు ద్వంద్వయుద్ధం, బోవీరవతంస యన స♦యోధ్యాపతియున్ ౧౩౧౯

→ దశరథుఁడు పరశురాముని శమింపఁ బ్రార్థించుట. ←

చం.వెలవెలఁబాఱి మోము కసు♦విన్నఁబడం, బదముల్ వణంకఁగాఁ,
బలుకులఁ దొట్రుపాటొదవఁ, ♦ బల్కెను భార్గవు నోమహాశకా!
కులమున బ్రాహ్మణుండ, వటు ♦ గూరితి శాంతత రాచజాతిపై,
బలరిపుతోడ శస్త్రమును ♦ బట్ట నటంచుఁ బ్రతిజ్ఞ సేసితే. ౧౩౨౦
కం.బాలురు కొమరులు క్రీడా,లోలురు[1] కరుణింప నయ్య ♦ లోఁ గొని తపశ్
శీలులు స్వాధ్యాయవ్రత,శాలులు భార్గవులు నీకుఁ ♦ జన్నె యలుగఁగన్. ౧౩౨౧

[1] క్రీడామునిపాఠము [illegible]

కం. ఇల నెల్లఁ గాశ్యపునకుఁ, సలలితగతి ధార వోసి ♦ సద్ధర్మరతిఁ
నిలిచితి మహేంద్రపర్వత, మీలు గాఁగను; జన్నె మఱియు ♦ నిటు లలుగంగన్.

కం. ఓహూనివర్య! వచ్చితె, నామహితార్థంబు లెల్ల ♦ నాశము సేయన్
రాముని నొక్కని జంపితి,వా మేము వానితోడి ♦ వారము గామె. ౧౩౨౩

కం. అని దశరథుఁ డాడినఁ దా, విన కవి పెడచెవులఁ బెట్టి ♦ వీరుఁడు భృగుసం
జనితుఁడు రామునితో నను, వినుమా వివరింతు వింశ ♦ వృత్తాంతంబున్. ౧౩౨౪

## శైవవైష్ణవధనుస్సులవృత్తాంతము.

సీ. ఈ రెండువిండులు ♦ భూరిసత్త్వంబులు, దివ్యముల్ శ్రేష్ఠముల్ ♦ దృఢతరములు
విశ్వకర్ముఁడు వీని ♦ విపులప్రయత్నుఁడై, కావింపఁ ద్రిపురముల్ ♦ గాసి చేయ
నం దొండు శివునకు ♦ నమరు లిచ్చిరి నీవు, విఱిచిన దదియ చూ ♦ విష్ణువునకు
నీ రెండవధనుస్సు ♦ నిచ్చిరి దేవత, లిది వైష్ణవము రామ ♦ యిద్ధ బలము

తే. శైవచాపంబుఁ బురిడించు ♦ సత్త్వగరిమ, సరుగ నటుకొంత కాల మ ♦ నంతరమున
నలువకడ కేగి నిర్జర ♦ నాథు లడిగి, రెవఁడు బలియుండు విష్ణుమ ♦ హేశులందు.

ఉ. అంత విధాత వారితలఁ ♦ పంత నెఱింగి విరోధముఁ రమా
కాంతునకుఁ గిరీంద్రసుత ♦ కాంతునకుఁ జనియింపఁ జేయు న
త్యంతభయానకం బగుచు ♦ నాహవ మాహరికిం బినాకికిఁ
వింతగ సంఘటిల్లె రఘు ♦ వీర! పరస్పరముఁ జయేచ్ఛమై. ౧౩౨౬

కం. పంకజలోచనుభీకర, హుంకారముబలిమిఁ బెటిలె ♦ నుగ్రునిధనువుఁ
బింకమఱి మహాదేవుఁడు, శంకరుఁడు త్రిలోచనుండు ♦ స్తబ్ధుం డయ్యెన్. ౧౩౨౭

కం. నాకౌకోమునిచారణ, లోకం బదిగాంచి యాత్రి ♦ లోచను హరి న
స్తోకంబుగఁ బ్రార్థించిన, మైకొని రాస్కందనంబు[1] ♦ మానక వారల్. ౧౩౨౮

కం. గుడుసుంగైదువు వేలుపు[2], వడికిని శివుధనువు పెడిలి ♦ పడుటయు వేల్పుం
దుడుములు మునులును విష్ణువె, కడు నధికుం డనుచు నపుడ ♦ గ్రహియించి రెదన్.

సీ. క్రుద్ధుఁడై రుద్రుండు ♦ కోదండ మిచ్చె నా, రాచంబుతో దేవ ♦ రాతునకును
నిగి వైష్ణవం బయి ♦ యొపఁగుశరాసనం, బిచ్చె బుచీకుఁ డేఁ ♦ భృగుభవునకు
విష్ణుండు సతేఁడిచ్చె ♦ విశ్వనిగుం పగు, తనసుతునకు జమ ♦ దగ్ని కతఁడె
నాతండ్రి యాతండు ♦ న్యస్తశస్త్రుండయి, తప మాచరింప మ ♦ నంబుపేర్చి

తే. నర్జునుఁడు నీచమతి యయి ♦ హతునిఁ జేయ, దారుణం బైనజనకవ ♦ ధంబు వినిఁ
క్రోధ మెదఁబుట్టఁబుట్టంగఁ ♦ గ్రూరగతిని, బెక్కుమాఱులురాజులఁ ♦ బిలుకుమార్చి

సీ. ధారణి సకలంబు ♦ దక్షిణగా నిచ్చి, క్రతుపరిపూర్తిని ♦ గశ్యపునకు
నేను మహేంద్రంబు ♦ నిలయంబుగాఁగొని, యున్నాఁడ సుఖవృత్తి ♦ నుగ్రతపము

[1] ఆస్కందనము – యుద్ధము. [2] గుడుసుంగైదువువేలుపు = విష్ణువు.

పలుపుచు సురసంఘ♦సంసేవితుండ వై, యిప్పు డ నీవు న♦శ్శ్రేష్టబలము
చూపి ద్రుంచితి హర♦చాపంబు నావిని, పరువున వచ్చితిఁ ♦ బార్థివుండ

తే. రామ! యా వైష్ణవం బయి ♦ క్రాలుచాప, మిదియె నీతండ్రి తాతల యేపుమీఱు
క్షత్రధర్మంబుఁదలఁచి యీ♦చాప మెక్కు, పూన్పుమా చూచెద నునీదు♦భుజబలంబు.

కం. ఎక్కిడి శరముం గూర్చిన, నుక్కున నీతోడ ద్వంద్వ♦యుద్ధమునకు నే
నెక్కటి[1] దొడఁగెదఁ గానీ, గ్రక్కునఁ గాని మ్మటన్నఁ ♦ గలుషితమతి యై ౧౩౩౨

శ్రీరాముఁడు పరశురాముని ధిక్కరించి నిస్తేజుఁ జేయుట.

కం. ఆరాముని మాటలు విని రా, రాముఁడు చెంతఁ దండ్రి ♦ రాజిలు కతనన్
గౌరవమున సౌమ్యస్వర, మారఁగ నిటు పలుకు భార్గ♦వా! యే మంటే. ౧౩౩౩

కం. వింటిని నీకథ; సరి యని, యంటిని జనకునిఋణంబు ♦ నటు దీర్చుట; న
న్నంటివిగా దుర్బలుఁ డని? యంటివిగా క్షత్రధర్మ♦ హీనుం డనదవలెన్! ౧౩౩౪

తే. తెలియఁగా లేవుగా నాదు♦తేజమీవు? కాంచుమా చూపువాఁడ నా♦కడిమి పెంప
టంచు భార్గవుకరమున♦యందు నున్న, యుగ్రధనువును బాణంబు ♦ నొడిసి తిగిచి[2]

కం. ఎక్కిడి కోదండముఁ జే, యుక్కున నారాచ మందు ♦ నూనిచి బలుకెం
పెక్కఁగఁ గంటను గోపం, బక్కజముగఁ గదుర సిట్టు ♦ లను భార్గవునిన్. ౧౩౩౬

కం. గాధకుమారునిచుట్టమ, వై ధాత్రీనిర్జరుండ ♦ వగుటను నీపైఁ
గ్రోధము గొని నినుఁ జంపెడి, సాధన మిది యైన మనసు ♦ చాలదు నాకున్. ౧౩౩౭

కం. నీ యాపదగతిఁ గానీ, నీయార్జితపుణ్యలోక♦నిచయముఁ గానీ
నీయిష్టము చొప్పున నే, నీయెడ ఖండింతు నిక్క ♦ మీ బాణమునన్. ౧౩౩౮

కం. అర్థింపుము పరనగరా, నర్థకరము వైష్ణవంబు ♦ నగు శర మిది దా
వ్యర్థంబుగఁ బోనేరదు, సార్థక మయి లక్ష్యభేద♦నాప్తిం దక్కన్. ౧౩౩౯

కం. అని పరశురాము దశరథ, తనయుఁడు భర్జించుచో ని♦తాంతాద్భుతమం
చును గుమిగొని బృందారక, మునిచయములు మేఘమార్గ♦మునసుండి కనెన్.

కం. వీగని రాముని భయదా, కారునిఁ బటుచాపబాణ♦కరునిం జూడం
జారణకిన్నరరక్షో, వారయుతుం డగుచు బ్రహ్మ ♦ వచ్చె నచటికిన్. ౧౩౪౧

కం. బెడిదపుఁజాపముఁ బూనిన, నడిఁ గని జగ మెల్ల మ్రాను♦పడె భార్గవుఁడున్
జడుఁడై నిర్వీర్యుం డై, చెడి రామునిఁ గనుచు నుండెఁ ♦ జిత్తరువువలెన్. ౧౩౪౨

తే. రామ తేజోభిహతపరా♦క్రముఁడు నగుచు
జాముదగ్న్యుండు బల మేది ♦ జడతఁ గాంచి
రామచంద్రునిఁ గమలాభి♦రామనయనుఁ
గాంచి యిట్లను మెల్ల స♦గౌరవముగ. ౧౩౪౩

---

[1] ఎక్కటి = అసహాయుఁడు. [2] వింటితోఁ దేజస్సును హరించెను. పరశురామావతార మావేశావతారము - శ్రీరామావతారము పూర్ణావతారము. అవతారతత్త్వమును శ్రీకృష్ణావతారతత్త్వమునఁ జూడుఁడు.

పరశురాముఁడు తనపుణ్యలోకంబులపై నస్త్ర మేయ శ్రీరాముఁ బ్రార్థించుట.

కం.ఇల నొసఁగితిఁ గాశ్యపునకు, నెలవుకొనకు మనియెఁ దనదు♦నేల పయిన్ రా
త్రులయందుఁ గాన నిలువను, జలజాక్షా! గురువరేణ్యు♦శాసనగరిమన్. ౧౩౪౪

చం.నఱకకుమీ మహాత్మ! గమ♦నంబు, మహేంద్రనగంబుఁ జేరఁగాఁ
బఱతు మనోజవంబునఁ, ద♦పస్స్ఫురణన్ గడియించులోకముల్
బిఱబిఱ నీదుబాణమున ♦ భిన్నము చేయుము, తప్పు చేసితిన్
మఱకువ, నీవునున్ నృపతి♦మాత్రుఁడవే తెలుపోయ రాఘవా. ౧౩౪౫

చం.ఎఱిఁగితి నాశరాసనము ♦ నీగతి నీక్షి శరంబుఁ బూన్పఁగా
నెఱవడి యక్షయుండ వని ♦ నీవు మధుప్రతిపక్షుఁ డంచు, నే
మఱపునఁ దప్పు చేసితిని ♦ మన్నన సేయుము, నీకు భద్రముల్
వఱలెడుఁ గాక, యీయమరు♦వర్గము చూచె భవత్ప్రతాపమున్. ౧౩౪౬

కం.ఉల్లమున లజ్జ చోఁపదు, ముల్లోకము లేలు దేవ♦ముఖ్యునిచే నే
నిల్లిల భంగపడ ను,ద్యల్లలితకృపాభిరామ ♦ దశరథరామా. ౧౩౪౭

కం.అసమామోఘశరంబును, వసుధాతనయాహృదీశ ♦ వడి విడువుము నా
యస మఱగతులు చెడం గని, వెసఁ జనుదు మహేంద్రనగము ♦ వేళకుఁ జేరన్.

కం.అనవుడు శరమున్ విడిచినఁ, దనస్వార్జితపుణ్యగతులు ♦ దగ్ధము లగుటన్
గని రాము మెచ్చి వలగొని, చనియె మహేంద్రంబుఁ జేర ♦ జమదగ్నిజుఁడున్.

కం.విచ్చెను దిమిరము దెసలన్, మెచ్చిరి నిర్జరులు మును ల♦మేయబలాఢ్యున్
హెచ్చినముదమున రామున్, వచ్చెను స్మరణంబు నెల్ల♦వారికి సేనన్. ౧౩౫౦

పరశురాముఁడు పోయినవార్తఁ దెలిపి శ్రీరాముఁడు దండ్రిని ప్రయాణము సేయఁ గోరుట.

తే. జామదగ్న్యుండు చనిన దా♦శరథి ధనువు, నిషువు వరుణునిచేతికి ♦ నిచ్చి మరలి
మ్రొక్కి మైత్రావరుణ్యాది♦మునుల కెల్ల, విహ్వలుం డైనతండ్రిని ♦ వేగ డాసి

ఉ. పోయెను జామదగ్న్యుఁ డిఁకఁ ♦ బోసఁగ వచ్చు నయోధ్య కెల్లరున్
హాయిగ నాయనా! బలఁగ ♦ మంతయు నీదు ననుజ్ఞ గోరి యి
ట్లీయెడ వేచు టయ్యె స్తన♦యిత్ను[1]జలార్థము చాతకోత్కరం
బో యన నాజ్ఞ యిమ్ము చన ♦ నొయ్యన నిమ్మగు నేని యం చనన్. ౧౩౫౨

ఉ. పోయెను రాముఁ డంట విని ♦ పొంగి ముదంబున నాత్మజుండుఁ దా
నీయిలఁ గ్రమ్మఱన్ జనన ♦ మెత్తుటగాఁ దలపోసి రామునిన్

---

[1] స్తనయిత్నువు = మేఘము.

బాలమణీలలామపయి ♦ నాటినకూరిమి నిల్పి, యామెయున్
గూరిమి పేరిమిం జెలఁగఁ ♦ గూర్చు మనంబు సదా హృతస్థమై ౧౩౬౪

కం. ప్రణతామయునకు యోషి, న్మణి పితృకృతదార యగుట ♦ నుతిఁ బ్రియ యయ్యెన్
గుణములు ననుగుణసద్గుణ,గణములు రూపాదికములుఁ ♦ గామించెఁ గడున్ ౧౩౬౫

కం. పతి సుందరి యగు నాగుణ,నతిమనమున ద్విగుణముగను ♦ బరిగ్రహించెన్
సతియంతర్జాతాశయ, మతి సూక్ష్మం బైనఁ బతికి ♦ వ్యక్తంబ యగున్. ౧౩౬౬

కం. అలసాక్షి స్వగతం, జెలువంబున నమరి యనఁగఁ ♦ జెలువగు నామ్మై
థిలుకన్య సీత పతికిం, గలప్రేమ నెఱుంగు భర్త ♦ కంటెను మిగులన్. ౧౩౬౭

ఉ. రాజసుతుండు రాముఁ డభి♦రామయు నుత్తమరాజకన్య యా
రాజముఖీమణిం గలసి ♦ రాజితకాముఁ డనంతకాముఁడై
రాజిలు మోహబంధముల ♦ రంజిలుచుండె విభుండు నిత్య వా
రాజసహోదరిం గలసి ♦ రాగమునన్ విలసించుచావనిన్ ౧౩౬౮

బాలకాండాంతపద్యములు.

కం. ఓంకారార్థక రామా! శంకరగిరిజావిరించి♦జపితసునామా!
సంకటనిచయవిరామా! పంకజమిత్రాన్వవాయ♦వారధిసోమా! ౧౩౬౯

కం. సర్వాధిక సర్వాత్మక! సర్వజగత్కారణా ప్ర♦శస్తగుణాఢ్యా!
సర్వాదిమకారణ హరి! సర్వశరణ్య మహాత్మ ♦ సర్వస్తుత్యా! ౧౩౭౦

తరళము. జలజనేత్రసుహృత్ప్రభాగ్ని ర♦సాంకపద్యనిరూపితా
కలితబాల్యవినోదఖేలన ♦ తోయజాక్ష! రమాధవా!
కలశవారిధితుల్యసజ్జన♦కాంక్షితనివాసకా!
కలుషసంహర! యొంటిపుట్టని♦కాయ! జానకివల్లభా! ౧౩౭౧

— గద్యము. —

ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందమిళిం
దాయమాన మానసత్వ మహోన్నతభవ వాపిలి
కొలను రామచంద్రరాయతనూభవ సుజనవిధేయ సుబ్బారాయ
నామధేయప్రణీతం బైన శ్రీమదాంధ్రవాల్మీకిరామా
యణ మనునిర్వచన మహాకావ్యమునందు

బాలకాండము.

శ్రీ రామార్పణమస్తు.

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్లో. నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ, నమోఽస్తు దేవ్యై జనకాత్మజాయై
నమోఽస్తు వాగాత్మభువే పరాయ, నమోఽస్తు వల్మీకభవాయ తస్మై.




శ్రీః.

శ్రీసీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణేనమః.

శ్రీ శారదాయైనమః.

శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీమదాంధ్రవాల్మీకి రామాయణము.

## అయోధ్యాకాండము.

---



మత్సుగుణాభరణా!
ధీమత్పరణప్రసూన◆దీపితచరణా!
స్వామీ చిదచిద్ద్రవిణా!
శ్రీమహితా యొంటిమిట్ట◆సీతారమణా! ౧

### భరతుఁడు శత్రుఘ్నునితోఁడఁ దన మేనమామయింటికిఁ బోవుట.

కం. అనురక్తు ననఘు శత్రుఘ్ను నిత్యశత్రుఘ్నుఁ[1] డైక◆కొమరుం డనుజున్
దన వెంటఁ దీసికొనుచుం, జనియెను దన మేనమామ◆సదనంబునకున్. ౨

కం. తనకన్నతనయుపోలిక, ఘనతరసత్కారములను◆గావించుచు లా
లన మొనరింపఁగ మాతులుఁ, డనయముఁ దమిఁ దమ్ముతోడ◆నతఁ డట నుండెన్.

కం. అచ్చట నుండియు నిచ్చకు, నెచ్చినసుఖసంతతులను◆నెలమిం గనుచున్
నిచ్చలు స్మరించు చుండిరి, సచ్చరితులు దశరథేశు◆జనకున్ వృద్ధున్. ౪

కం. కోసలధరణీశుఁడును బ్ర,వాసుల నిజసుతుల శక్ర◆వరుణోపములన్
భాసురతేజుఁడు కైకే,యీసుతశత్రుఘ్నుల నెద◆నెప్పుడుఁ దలఁచున్. ౫

కం. తనయొడలన జనియించిన,ఘనబాహుచతుష్క మనఁగ◆క్ష్మానాథునకున్
దనయులు పురుషర్షభు లెద, ననుపుచ నిష్టతము లైరి◆నల్వురు మిగులన్. ౬

---

[1] భరతుఁడు భగవత్పరతంత్రుఁడు, శత్రుఘ్నుఁడు భాగవతపరతంత్రుఁడు.

## ⟵ శ్రీరామచంద్రకళ్యాణగుణవర్ణనము. ⟶

ఉ. అంతటిలోన రాముఁడు మ♦హాత్ముఁ డనుత్తమ తేజుఁ డెంతయున్
దంతడి ప్రీతిఁ గూర్చుఁ దన♦తండ్రికి భూతములన్ విధాతృస
చ్ఛందమునన్ గుణాఢ్యుఁ డయి; ♦ స్వయము రావణుఁ జంప దేవతా
బృందమునిలన్ సనాతనుఁడు ♦ విష్ణువు పుట్టె ధరన్ నరాకృతిన్. ౭

ఆ. అమిత తేజుఁ డైన♦ యాపుత్త్రకునిచేతఁ, గోసలేంద్రతనయ ♦ కొమరు మీఱె
నమరనాథుఁ డైన♦యలవజ్రపాణిచే, నలరు మీఱి వెలుఁగు♦నదితివోలె. ౮

కం. అందమునన్ భుజవీర్యము, చందమున నసూయలేమి ♦ జగతీస్థలి పై
నెందును బురికింపఁగ రఘు,నందనుని మనోజవుం[1] గ♦నంబడఁ డొకఁడున్. ౯

కం. ఎవ్వర యేనియుఁ దన్నుఁ, నొవ్వఁగఁ బలికినను దాను ♦ నొడువఁడు కటుకుల్
నవ్వుచు మృదుపూర్వంబుగఁ, దవ్వఁగఁ బ్రతివచన మిచ్చుఁ ♦ దిర మగు శాంతిన్.

కం. ఉపకార మేమిపనికే, నెపుడే నించుక యొనర్ప ♦ నెలమిఁ గను సదా;
యపకారశతము సల్పిన, విపరీతము నెంచఁ డాత్మ♦విజ్ఞుం డగుటన్. ౧౧.

తే. అతఁడు విలువిద్యఁ గఱచెడు♦నప్పు డైన, జ్ఞానవృద్ధవయోవృద్ధ♦సజ్జనులును
శీలవృద్ధులు నయినవి♦శిష్టజనులుఁ, గూడి సత్సంప్రదాయంబు♦గోష్ఠి జరుపు, ౧౨

కం. తియ్యనిపలుకులు ప్రియముగ, నెయ్యెడఁ దా మున్న పలుకు; ♦ నెసఁగినబలిమిన్
గ్రయ్యించుఁ బరుల; ధీయుతుఁ, డయ్యుత్తమశక్తి కెదన♦హంకృతిఁ గొనఁడున్.

కం. సబ్బలి లాడఁడు; గొలుచు, న్నిబ్బరమునఁ బండితులను ♦ నెఱముదుసళ్లన్;
బ్రబ్బనతిమి జనులకు మున, ముబ్బించుఁ; బ్రజానురాగ♦యుక్తుఁడు బహుఁడున్.

చం. కరుణ గలండు, లోఁబఱుపఁ ♦ గల్గను గ్రోధము, బ్రహ్మవిన్మహా
సుగతతిఁ బూజలం దనుపు, ♦ సుస్థిరనవారికిఁ బొక్కుఁ గ్రోచు, ధ
ర్గరతుఁడు, పాయఁ డెందు నియ♦మంబుల, సదా శుచి, వంశవృత్త మా
దరమునఁ జల్పు నెప్పుడు, స్వ♦ధర్మము క్షాత్త్రము గౌరవించెడిన్. ౧౪

ఉ. దాన లభించునవ్యశము ♦ తప్పక స్వర్గఫలప్రదాయిగాఁ
దా నవ నెంచు, భద్రరహి♦తంబగు కార్యముపొంతఁ బోఁడు, వి
ద్యానిధి, ప్రొద్దువోకకయి ♦ ధర్మవిరుద్ధకథాభిలాషి గాఁ,
డూనిక నుత్తరోత్తరసు♦యుక్తుల గీష్పతివోలె వక్త యౌ. ౧౬

ఉ. రోగము లంట వెన్నఁడు, ని♦రూఢబలాఢ్యుఁడు, దేశకాలముల్
బాగుగఁ దా నెఱుంగు, నడి♦ప్రాయమువాఁడు, ప్రశస్తభాషుఁడున్,
జేగ గ్రహించుఁ బూరుషులఁ ♦ జెచ్చెరఁ జూచినయంతమాత్రలోఁ,
జాగియు,[2] సద్వ్రతియుఁ డని, ♦ సాధుగుణంబున నిచ్చెతుండునున్. ౧౭

తే. ఇట్టి మేలిగుణంబుల♦ కెల్ల నావు, రామచంద్రుఁడు జనమనో♦రాముఁ డగుచుఁ
బ్రజల కెల్లను వెలుపలి♦ప్రాణ మయ్యె, రాము రామాయటం చ్రనా♦రతము వారు.

---

[1] మనోజవుఁడు = తండ్రిని బోలినవాఁడు. [2] చాగి = దాత.

కం. వ్రతముల విద్దియలను సవ,సిత మొనరిచి స్నాతుఁ డగుచుఁ ♦ జెలఁగెం, జదివెఁ
శ్రుతులను సాంగములుగ; రఘుపతి శస్త్రాస్త్రముల జనకు ♦ పైచే యయ్యెన్. ౧౯

సీ. వినుతసత్ప్రథముగ ♦ వెలయించె ధరణి మించ, జనకవంశంబును ♦ జననికులము,
సాధు వాదియుండు ♦ సత్యోక్తి ఋజువర్తి, ధర్మార్థవిద్వాంస ♦ తత్పరులగు
ద్విజులచే శిష్టులౌ ♦ వృద్ధులచే శిక్షితుండు త్రివర్గవి ♦ దుండు ప్రతిభ
నమయు లౌకికసమ ♦ యాచారకృతకల్పుఁ, డును వర్తనసమర్థుఁ ♦ డును నిభృతుఁడు

తే. సంవృతాకృతిగలఁడు బా ♦ సటయు; గుప్త,మంత్రుఁడు నమోఘు మైనయ ♦ మర్షహర్ష
ములను గలఁ డార్జనవ్యయ ♦ ములకుఁ దగిన,కాలములఁ జక్కఁ దెలిసిన ♦ ఘనమనీషి.

సీ. దృఢభక్తియుక్తుఁడు ♦ స్థిరబుద్ధిగలవాఁడు, దుర్జనుమాటలు నాల్క ♦ తుదకుఁ దేఁడు
చెనఁటియర్థమునకుఁ ♦ జెడుజనంబులకును, మమత సేయఁడు లేశ ♦ మాత్ర మైన
మందుఁడు గాఁడు ప్ర ♦ మత్తుండునుం గాఁడు, తనతప్పు నొరుతప్పుఁ ♦ దగ నెఱుంగు
శాస్త్రంబులును జక్కఁ ♦ జదువరి మే లెంచు, గుణి పురుషాంతర ♦ కోవిదుండు

తే. ప్రగ్రహానుగ్రహాదిస ♦ త్పథస్థలులను, జరుపు న్యాయంబు కొలఁది; వి ♦ చక్షణుండు
మంచివారలఁ జేర్చుట ♦ మనుచుటందు, శత్రునిగ్రహమునయందు ♦ స్థానవిదుఁడు.

సీ. ఆర్జనమందు ను ♦ పాయంబు గలవాఁడు, వెచ్చ మొనర్చును ♦ విధహితముగ
వ్యామిశ్రకములౌ శా ♦ స్త్రావళిట్టులఁ, గడుమేటి ధర్మార్థ ♦ కలన సాక్షియు
నలసుఁడు గాఁడు వై ♦ హారికంబులు శిల్ప, మను లెఱుంగును సంవి ♦ భాగవిదుఁడు
ఏనుఁగు గుఱ్ఱంబు ♦ నెక్కంగ నేర్చును, శిక్షింప నేర్చును ♦ జెనఁటివాని

తే. విల్లుపట్టెడివారిలో ♦ నెల్ల శ్రేష్ఠుఁ డతిరథుల కెల్ల నిగ్ర్యాస ♦ ఖ్యాతుఁడు ఘనుఁడు
తాన యభిముఖుఁడై చను శా ♦ త్రవుల నణంచు,దండు నడిపింపఁ జతురుఁడు ♦ దండ గలిని.

కం. వీకునఁ బెనుఁగోపంబున, నాకౌకోసురగణంబు ♦ లైనను దాఁకన్
జీకాకుపఱచి తోలును, భీకరరణమున నజయ్య ♦ విక్రముఁ డగుటన్. ౨౩

ఉ. కుందఁ డసూయచేత, జిత ♦ కోపుఁడు, గర్వ మెఱుంగ నెట్టిదో
డెందమునం దెఱుంగఁడు, క ♦ డిందిబలాఢ్యుఁడు నయ్యుఁ గసి నే
నిం దెగి హీనభావముం గోరఁడు, ♦ సత్పురుషుల్ గొనియాడ శోభిల్లుం
జెందఁడు, మత్సరంబు మదిఁ ♦ జేర్పఁడు, పొంగఁడు సంపదృద్ధులన్. ౨౪

కం. గీష్పతి బుద్ధిబలంబున, స్వఃపతి వీర్యమున జిష్ణుఁ డను ♦ రుచి నినుఁ డని సం
తర్పిత భువనత్రయుఁడు నహర్పతివంశ్యుండు పూర్ణుఁ ♦ డెన్ను జగములన్. ౨౫

కం. శాంతము లై కరము ప్రజా,కాంతము లై జనకహర్ష ♦ కరములు నగుచున్
దాంతము లౌ గుణములఁ దివ్య,కాంతుఁడు కాంతులను బోలెఁ ♦ గడు నొప్పెన్. ౨౬

తే. అనఘు నిట్టి ప్రతాపాఢ్యుని ♦ నప్రధృష్య,విక్రముని రాము గుణధాము ♦ విశ్రుతధాము
లోకపాలోపముని గోరెఁ ♦ బ్రాకటముగ,వసుమతీకాంత దనపెనిమిటిగ ♦ నెల్లఘనుఁడుగ.

## దశరథుఁడు రామచంద్రు యువరాజుఁ జేయ యోజించుట.

చం. అతులిత తాదృశామలగు♦ణాఢ్యుని బుత్త్రునిఁ గాంచి యెట్టు లే
బ్రతికియు యుండఁగా ధరణి♦పట్టముఁ గట్టఁ గలాఁడ వీనికిన్?
ముసలిఁడ నైతి, వీనియెడ ♦ మోహము తద్దయుఁ బెద్ద నాకు, నే
గతి నభిషిక్తు రామువిభుఁ ♦ గాంతునొ యంచు విచారయుక్తుఁడై. ౨౮
ఉ. ఈతని రాజుఁ జేయుటయ ♦ యెంతయు నిష్టతమంబు, లోకసం
ఘాతమువృద్ధిఁ గోరు, జన♦కాండముపై ననుకంప మెండు, వి
ఖ్యాతిగ వృష్టిమంతుఁడగు♦నంబుదవాహుఁడు వోలె లోకులం
బ్రీతులఁ జేయు చుండుఁ, గడు♦మెచ్చెడు నాయెడకంటె వారికిన్. ౨౯
కం శమనబలదమనులకుఁ[1] దా, సముఁడు పరాక్రమమునందు; ♦ సరి గురు పునకున్
సుమతి; ధృతి మేరుశైలో,పముఁ డగు; నాకంటె సుగుణ♦వంతుఁడు దలఁపన్. ౩౦
కం సన్నుతచరితుఁడు పుత్త్రుం, డిన్నేలను నేలు చుండ ♦ నీవయసున నేఁ
గన్నారఁ గని యథాగతిఁ, బన్నుగ స్వర్గమున కరుగు♦భాగ్యము గలదే. ౩౧
తే. అనుచు లోకోత్తరంబును ♦ నప్రమేయ, మన్యరాజన్యదుర్లభ ♦ మైనసద్గు
ణాళిగలరాము యౌవరా♦జ్యంబునందు, నిలుపఁ దలఁచెను సచివోక్తి♦నిశ్చయించి.
కం. దివి భువిఁ బొడముచు నుండెడు, నశకునోత్పాతములను ♦ నాస్తికనుపున్
నవిలినముదిమిభరంబును, నవనివిభుఁడు ప్రాజ్ఞుఁ డగుట ♦ నాలోచించెన్. ౩౩
కం. రామునకును ముఖనిర్జిత,సోమునకును స్వాత్మకలిత♦శోకాపనయో
ద్దామునకును సద్గుణని,స్సీమున కగుప్రజలరక్తి ♦ చింతించి మదిన్ ౩౪
కం తనకును బ్రజకును శ్రేయము, ననుపుచు గూర్పంగ నవని♦నాథుఁడు కాలం
బును జనుదెంచుట గని ప్రే,మను దీవరపడఁగ సాగె ♦ మదిఁ దత్కృతికై. ౩౫

## దశరథుఁడు రాముని యువరాజుఁ జేయఁ బౌరులతో నాలోచించుట.

కం మంత్రమునకై పతి సా,మంతుల నానావిదేశ♦మహీజనముల భూ
కాంతుల ముఖ్యుల నంపఁ, సంతసమునఁ బిల్వఁ బనిచె ♦ జానపదాళిన్. ౩౬
కం. చెవులకుఁ బండువుగా వా, రనఁ నిపం గలుగుఁగాక ♦ యని దూరపుభూ
ధవులగు కేకయజనకుల, నవనీపతి పిలువ నంపఁ ♦ డయ్యెం ద్వరచేన్. ౩౭
కం. వచ్చినతక్కటివారికి, విచ్చలవిడి నుచితరీతి ♦ విడుదలు సొమ్ముల్
పెచ్చుగ నిడి ప్రజకు న్విధి, యిచ్చెడిగతి దర్శనంబు ♦ నిచ్చెం బిదపన్. ౩౮
చం. అరిబలహంత యానశర♦ఘాననినాథుఁడు కొల్వు దీరఁగా
వరుసగ నున్నభూమిధవ♦వర్యులు వచ్చి నృపాలనత్త మా

---

[1] బలదమనుఁడు – ఇంద్రుఁడు, శమనుఁడు = యముఁడు.

సురుచిరపీఠవర్గముల ♦ సొంపుగ సమ్ముఖు లై రహింపఁగా
నరత, మహీశుఁ డొప్పె విబు♦ధౌఘసమాస్పతశక్రుకైవడిన్. ౩౯

## దశరథు నుపన్యాసము.

చం.కలయఁగఁ జూచి యాయవని♦కాంతుఁడు నిండుసభన్ వచించె ని
స్తులహితహర్షహేతు వయి ♦ తోరపుఁగీర్తి ఘటింప నైనమే
ల్పలుకులు దుందుభిస్వని♦భంబు గభీరము రాజయోగ్యము
న్లలితము మాధురీధురము ♦ నవ్యము నొగతి మేఘఘోషుఁ డై. ౪౦
కం.కడుపునఁ బుట్టినబిడ్డల,వడువున నాపూర్వు లెల్ల ♦ వసుధాప్రజలన్
దడవుగ రక్షించిరి కడు,విడి నిది మీ కెల్లరకును ♦ విదితంబె కదా? ౪౧
తే. అట్టియిక్ష్వాకుకులమునఁ ♦ బుట్టి నట్టి,యేను బూర్వులు పాలింప ♦ నెసఁగి సౌఖ్య
మునకు స్థానంబునౌజగం♦బునకుమిగుల,శ్రేయమునుగూర్ప యోజన♦సేయువాఁడ.
కం.పెద్దలు నడచినత్రోవన, తద్దయు హెచ్చరికతోడ య♦థాశక్తిగ నేఁ
బద్దుగ రక్షించితిఁ బ్రజ, నిద్దియు మీమానసముల ♦ కెఱుకయ కాదే. ౪౩
కం.భూతలహితముం జల్పఁగ, నేతరుణమునందుఁ గోరు♦నీమే నిట్టుల్
శ్వేతచ్ఛత్రమునీడను, ఖ్యాతిగ దుర్భరజరైక♦కలితం బయ్యెన్. ౪౪
కం.అఱువదివే లేఁడులు నా, కఱగొఱ లేకుండఁ గడచె ♦ నంగంబును నో
టఱియెను, దెఱపును మఱపును,నఱలకమును హోయి నుండ ♦ వాంఛ జనించెన్.
ఉ. ఎంతయు ధైర్యశౌర్యములు ♦ నేపుఁ గలాఁడు, జితేంద్రియుండు, దు
ర్దాంతవసుంధరాభరణ♦దార్ఢ్యయుతుండును, ధర్మశీలుఁ, డే
కాంతము దాల్పఁగాఁ దగిన♦గాఢభరంబును మోచి మోచి వి
శ్రాంతికి నాస చేసితిఁ, జి♦రంబుగ నాకు ననుజ్ఞ నీయరే. ౪౬
ఉ. ఇచ్చటఁ జేరి యుండెడిద్వి♦జేంద్రుల కందఱ కిష్ట మేని, మీ
రిచ్చగ నొనటం చనెద ♦ రేని, మదాదిమపుత్రు రామునిన్
బ్రచ్చఱ భూతశాత్రవుఁ, బు♦రందరసన్నిభు, ధార్మికాగ్రణిన్,
సచ్చరితున్, మహామహుని, ♦ సర్వగుణంబుల మత్సమానునిన్. ౪౭
తే. పుష్యమునుగూడియున్నట్టి♦పూర్ణచంద్రు, చందముననేనుయౌవరా♦జ్యంబురాము
ధర్మభృద్వరు నరసింహు ♦ శర్మ యుక్తిఁ, బూన్పఁదలఁచితి మీచిత్త♦ముల నెఱింగి.
తే. నాథుఁ డగువేనిచేతను ♦ నాథవత్త్వరం బగుచు ముజ్జగంబు లేన్ ♦ రమణమీఱు
నట్టిశ్రీమంతుఁ పౌలస్త్య♦నాగ్రజుండు, జగతి కనురూపవిభుఁ డౌట ♦ దగున కాదె?
కం.ఇప్పుడ యీభూభారము, నెప్పరమున రామునందు ♦ నిలిపి ధరణి కీ
గొప్పగుశ్రేయముఁ గూరిచి, తప్పుట భారంబు నేను ♦ దప్ప సుఖింతున్. ౫౦

కం. అని నగు ప్రయోజనం బిది, యొనరించన యేని, మంచి♦యోజన యిది యే
ల్గొనసాగించుట యెట్టులో, యనుమతిని నొసంగుఁడీ మ♦హాజనులారా![1] ౫౧

కం. ఇంతకు లెస్సయుఁ గలిగినఁ, జింతింపుఁడ; యంటిఁ బ్రేమ♦చేత; స్వజనతా
చింతకుఁ గడుమే లగు నడు,మంతరపున్వారు హితము♦ నాలోచింపన్. ౫౨

చం. అని జనపాలుఁ డాడిన మ♦హాముద మంది నృపాళి వర్షముల్
గనుచు ఘనంబుఁ గాంచి భువి♦ నిండఁగఁ గేకలు నైచు నెమ్మిపిం
ఛెనయఁగ మేలుమే లనుచు♦ నెంతయు మెచ్చురవంబు పేర్మిఁ గం
పనమును గాంచెఁ దత్సభయు♦ బాఢముగాఁ బ్రతిశబ్ద మిచ్చుచున్. ౫౩

పౌరులు శ్రీరాముఁడు యువరాజగుటకు సమ్మతించుట.

తే. అంత ధర్మార్థవిదుఁ డైన♦యవనినాథు,వాక్యముల విని బ్రాహ్మణ♦వరులు పౌర
జానపదులనుగూడి యో♦జన యొనర్చి,యిట్టులని యేకమతు లయి♦ వృద్ధనృపతి.

కం. ఏఁడులు పూఁడు లనెన్నియొ, తేఁడా! వేవేలు చనె మ♦హీశ! వృద్ధుఁడవుగ
వేఁడెదము రామచంద్రునిఁ, బోఁడిమి యువరాజుఁ జేయ♦ భూతలమునకున్. ౫౫

కం. కోరుదుము మహాబాహుని, శ్రీరఘువరు భీమబలుని♦ శ్రీరాముఁ గనన్
వారణయూథాధిపయా,నారోహణు ఛత్రసంవృ♦తాననకములున్. ౫౬

కం. అని వారెల్లరుఁ బలికిన, విని వారిమనఃప్రియంబు♦విధ మెఱుఁగఁగ నే
మిని చెలియుని వానివలెన్,జనపాలకుఁ డనియె నెల్ల♦జనములఁ గనుచున్. ౫౭

కం. జనపతులారా! నానుడి, వినివినకయమున్న రాము♦విభుఁ గోరితి రే
మన మీతనికముఁ జూడఁగ, ననుమానం బయ్యె నిశ్చ♦యం బాడదయా. ౫౮

కం. లేనో? ధర్మాత్ముఁడ నేఁ, గానో? ప్రజ కెల్ల సుఖముఁ♦ గల్పింపనో? నేఁ
బోనో మీమతి? మీ రేల్లా నానుతు రాజుఁ జేయ♦ లాలసపడఁగన్? ౫౯

పౌరులు శ్రీరామునిగుణములు వర్ణించుట.

సీ. అనుచు మహాత్ముఁ డా♦డిన విని వారెల్ల, నొక్కమాటగ నిట్టు♦లూఁది యనిరి
భూపాల! దేవని♦ఘుండు రామునియందుఁ, గల్యాణగుణములు♦ గలవు పెక్కు
లానందకరము ల♦య్యవి ముచ్చటింతుము, వినవయ్య వీనుల♦విందు గాఁగ
సత్యశౌర్యుఁడు రామ♦చంద్రుండు దివ్యగు,ణంబులఁ బురుష న♦ర్నాయకునకు
తే. మేటియిక్ష్వాకులం దెల్ల♦ మేలుబంతి, రాముఁ డాప్తినధర్మ♦పరాయణుండు
లోకముల సర్వవినుతను♦ల్లోకుఁ డతఁడె, రామువలనజనించె ధ♦ర్మంబు సిరియు.

సీ. చంద్రునికీర్తి ప్ర♦జారంజనంబున, క్ష్మాసాటి విమలక్ష♦మాగుణమున
ననుపమబుద్ధి బృ♦హస్పతితుల్యుండు, విబుధేంద్రునకు జోడు♦ వీర్యమునను

---

[1] ఏకార్యమైనను బూర్వరాజులు ప్రజానుసమ్మతిని జేయుచురుగాని తమ యిష్టప్రకారము స్వతంత్రించి చేసినవారు కారు.

సకలధర్మజ్ఞుండు ♦ సత్యసంధుండును, శీలవంతుఁ డసూయుఁ ♦ జేర నీఁడు
అపరాధులకు నైన ♦ నాదరంబున చూపు, దుఃఖుల కూఱట ♦ దోఁపఁ బలుకుఁ
తే. కృతము మఱనండు నిర్జించె ♦ నింద్రియముల, మనసు మెత్తన స్థిరమతి ♦ మధురవాది
నిజమరియు[1] నాలకించెను ♦ నిఖిల మార్య,వృద్ధసద్విప్రులను గొల్చి ♦ విహితరీతి.
కం.వీరుఁడు రణవితరణముల, ధీరుఁడు సురమర్త్యపూర్వ♦దేవావిదితం
బైరాజులునస్త్రాళి వి,శారదుఁడును సాంగవేద♦చతురతరుండన్. ౬౨
కం.వ్రతవిద్యల స్నాతుం డ,ద్భుతముగ గాంధర్వ[2] మెఱుఁగు ♦ బుధనుతుఁడు మహా
మతి కళ్యాణాభిజనుం, డతులితసద్గుణగరిష్ఠుఁ ♦ డమలుఁడు సతేమున్. ౬౩
కం.దురమునకై లక్ష్మణుతోఁ, బురమును జల్లెలను గావఁ ♦ బోయి యరుల సం
గరమున నిర్జింపక తా, మరలఁడు సుమి; శరణ మన్న ♦ మన్నించుఁ గృపన్. ౬౪
సీ. రణరంగమునుండి ♦ క్రన్నుఱి వచ్చుచో, రథమున నేఁ గుంజ♦రమున నేని
తనయిల్లుచేరక ♦ మునుమున్న పౌరుల, నందఱఁ దనవారి♦యట్ల చీరి
కుశలంబు లడుగు మీ♦కొడుకుల కరుస మే, యిల్లాండ్రు లెస్సలే ♦ భృత్యజనులు
శిష్యులు సుఖులె కా ♦ క్షేమ మే యగ్నులు, జనదాఁటి పోవుగా ♦ ఛాత్రగణము
తే. లల్లురును నాఁడుబిడ్డలు ♦ నలరువారె?
సౌఖ్యవతు లొక్కొ కోడండ్రు ♦ సాధులార!
యనుచు జనకుండు బిడ్డన ♦ ట్లడుగుఁ గ్రుచ్చి
క్రుచ్చి పేర్పేర నందఱఁ ♦ గుతుకమునను. ౬౫
కం.వ్యసనంబులు జనములకును, బొసఁగినఁ దా నధిక దుఃఖ♦మును బొందును; సం
తసమును గన జనములు సం,తసమును దా నొందుచుండుఁ ♦ దండ్రివిధమునన్.
సీ. బహుళసంకటములు ♦ ప్రాప్తించె నేనియు, సత్యంబు దప్పని♦వదురుకాఁడు
ఎగచుచో శత్రుల ♦ నింద్రచాపముఁ బోలు, పెనువిల్లు ధరియించు♦బిరుదుకాఁడు
రోషంబ యేని సం♦తోషంబ యేనియుఁ, బొల్లు వోవఁగ నీని♦పోటుకాఁడు
ప్రత్యక్షమైననా♦రాయణునట్టుల, నెఱి మించు తే జొప్పు♦నీటుకాఁడు
తే. సూటి తప్పనిబాణంబు ♦ నేటుకాఁడు, మంచియుక్తుల గురుఁబోలు ♦ మాటకాఁడు
పాటి దొఱఁగనికథలందు ♦ నేటుకాఁడు, దేవపతి యైన నీతని♦దీటు కాఁడు. ౬౭
కం.ఇమ్మున విందుల నగుకను,బొమ్మలు గలవాఁడు విషయ♦ములకై చపల
త్వమ్మును బొరయనివాఁడు న,హమ్మతి లే కుండువాఁడు ♦ నతిమహిముండున్.౬౮
కం.ఈలోక మేల యొక్కఁడె, త్రైలోక్యం బైన నేలఁ ♦ దగు; వధ్యులనే
పాలార్చెడిని; నవధ్యుల,జోలికిఁ బోవండు సత్య♦శూరుం డగుటన్. ౬౯

---

[1] నిజమరి = సత్యవాది. [2] గాంధర్వము = సంగీతము.

కం. సంతస మిడుపురుషున కే, కాంతము ఘటియించుఁ గామి♦తార్థములన్; భా
స్వంతుఁడు కరములఁ బోలెన్, శాంతప్రజాకాంతగుణగ♦ణంబుల వెలుఁగున్. ౨౦

తే. అట్టిరాముని సత్యశౌ♦ర్యాదిధాము, నఖిలసజ్జననుతసద్గు♦ణాభిరాము
లోకపాలోపమునిఁ గోరె♦ బ్రాకటముగ, వసుమతీకాంతదనకూర్పు♦వల్లభుఁడుగ.

కం. ఈరీతిని ద్వత్సుకృతా, ధారుని శ్రీరాముఁ గంటి♦ తనయునిఁగా నీ
వో రాజ! యేమిపుణ్యా మొ, మారీచుఁడు కశ్యపర్షి♦మాడ్కిం జూడన్. ౨౧

కం. రాముఁడు సుఖి యగుఁ గావుత, రాముఁడు చిరజీవి యగుచు♦ రంజిలుఁ గాతన్
రాముఁడు నిరామయుం డగు, రామునకున్ దేహబలము♦ గ్రాలెడి నెపుడున్.

కం. అని వేల్పులు గంధర్వులు, జనములుఁ బన్నగులు రాష్ట్ర♦జనపదములఁ బ
ట్టనములఁ బరదేశంబుల, మనసీమను గోరుచుంద్రు♦ మహిపా! సతమున్. ౨౪

ఉ. రాముని మేలు కోరి నగ♦రంబున రాష్ట్రమునందుఁ బక్కణ
గ్రామములందు నిత్యముఁ ద్రి♦కాలములందును నెల్ల వేల్పులన్
నేమమునన్ భజింత్రు తరు♦ణీమణులున్ ముదుసళ్లు స్త్రీలునున్
గ్రామజనాదినాగరులు♦ రామునిఁ దప్ప స్మరింప రెవ్వనిన్. ౨౫

సీ. ఇందీవరశ్యాము♦ సౌందర్యజితకాముఁ, గమనీయగుణపాత్రుఁ♦ గంజనేత్రు
శాత్రవమదనాశు♦ జనరసనావాసుఁ, గరుణాలవాలు సుం♦దరకపోలు
నవయౌవనోద్దీప్తు♦ నవ్యయశఃపూర్ణు, జలనిధిగంభీరు♦ శైలధీరు
సజ్జనతాసక్తు♦ సత్యధర్మనుయుక్తు, మంజులమృదుభాషు♦ మథితదోషు

తే. యౌవరాజ్యపదంబున♦ నలరుచుండఁ
జూడఁ గాంక్షించెదము మేము♦ శుద్ధమతిని
మాహితముఁ గోరి యామత్స♦మీహితంబు
వే సమాహితమును జేయు♦వే యటంచు. ౨౬

పట్టాభిషేకసంభారంబులు గూర్ప దశరథుఁ డాజ్ఞాపించుట.

కం. పుంజికొనుసంతసంబున, నంజలి ముకుళించి యెల్ల♦ రాడిన విని లో
రంజిలి వారికి రఘుకుల, కుంజరుఁ డత్యంతముదము♦ గులుకఁగఁ బలికెన్. ౨౭

ఆ. ఏమి నాయకృష్ట♦ మెంతయుఁ బ్రీతుండ, నైతి నార్యులార♦ యైకకంఠ్య
ముగను నాతనూజుఁ♦ బూన్పంగ యౌవరా, జ్యంబు నీర లెల్ల♦ సమ్మతింప. ౨౮

తే. అనుచు వారల నెల్ల మ♦న్ననలఁ దనిపి, వామదేవవసిష్ఠుల♦వంకఁ జూచి
వలయుసంభారములఁ గూర్పు♦వలయు మీరు, శ్రీరఘూత్తముపట్టాభి♦షేకమునకు.

కం. చైత్రము సర్వసుఖశ్రీ, పాత్రము ఫలపుష్పనికర♦భరితోరువనీ
గోత్రము పుణ్యం బిది నా, పుత్రుని యువరాజుఁ జేయఁ♦ బోలును నిపుడే. ౩౦

కం.అని జనపాలుఁడు విరమిం,చిన మేల్ మే లనుచు జనము ♦ చెచ్చెర ఘోషిం
చిననినద మణఁగ మెల్లన, మునివరుని వసిష్ఠు రాజ♦ముఖ్యుఁడు పలికెన్. ౧౧
కం.రామాభిషేకమున కిపు, డే మీ రుపకరణములను ♦ నేర్పుఱుపుఁ డనం
గా మౌని యరత వఱలెడి, ధీసహితుల మంత్రివరుల ♦ దిక్కుం గనుచున్. ౧౨

వసిష్ఠుఁడు మంత్రులతో వలసినసంభారములఁ జెప్పుట.

సీ. బంగారు రత్నముల్ ♦ బలులు నోషధులును, లాజలు శుక్లమా♦ల్యములుఁ దేనె
గమ్మనినేయియుఁ ♦ గారికపుట్టంబు, లరదంబు ధ్వజము స♦ర్వాయుధములుఁ
జతురంగబలము సు♦స్తంబేరమము వెలి,చామరంబులు వెల్ల♦ఛత్ర మొండుఁ
బైఁడికుండలు నూఱుఁ ♦ బైఁడికొమ్ములయెద్దు, సంపూర్ణమౌవ్యాఘ్ర♦చర్మమొకటి
తే. చందనము లోనుగాఁగ నే♦ష్టవ్యములును
వేగుఁబోకకు ముంద పృ♦థ్వీతలేంద్రు
నగ్నిగృహమునఁ జేర్పుఁడీ ♦ యనఘులార
యనుచును వసిష్ఠ మౌనీంద్రుఁ ♦ డనియె మఱియు. ౧౩
కం.హారంబులఁ జందనమున, ద్వారంబుల నంతిపురిని ♦ బట్టనముఁ శృం
గారింపుఁడు చల్లుఁడు ప,న్నీరంబుల ధూప మిడుఁడు ♦ నెఱబుగులుకొనన్. ౧౪
కం.పాలుపెరుఁగుతో నొకనూ,ర్వే లగుద్విజులకును లెస్స ♦ రేపకడఁ మీ
రాలస్యము లే కన్నము, చాలఁగ నిడ వలయు భక్తి ♦ శ్రద్ధయుఁ దోఁపన్. ౧౫
కం.రేపటియుదయంబున మీ, రోపిక దక్షిణలతోడ ♦ నుర్వీసురులఁ
వే పిలిపించి యొసంగుం,డీ పేలలు నేయి పెరుఁగు ♦ నెయ్యము మీఱన్. ౧౬.
కం.ఇనుఁ డుదయించినయా వెం,టనె యగుఁ జుఁడి స్వస్తివాచ♦నము; దానికి నై
ఘను లగువిప్రులఁ గూర్పుం, డనఘాత్మకులార! పీఁట ♦ లమరింప రయా. ౧౭
కం.కట్టింపుఁడు కల్వడములఁ, గొట్టింపుఁడు సున్న మన్ని ♦ కూటములందుఁ
దట్టముగ నీరు చల్లఁగ, దిట్టము గావించి ముగ్గు ♦ దీర్పింప రయా. ౧౮
కం.తాళంబులతో నర్తక, జాలంబులతోడ వార♦సతులుఁ సొగసుల్
మేలిమిగఁ జేసికొని భూ,పాలయము ద్వితీయకక్ష్య♦యం దుండఁ దగున్. ౧౯
కం.దేవాయతనంబుల[1] భూ,దేవులు పూజింప వలయుఁ ♦ దెగ కన్నాదుల్
వావిరి మాల్యాదులుఁ జై, త్యావళులం దిడఁగ వలయు ♦ నర్హక్రియలన్. ౨౦
కం.రామాభ్యుదయోత్సవమున, భామానితమండలాగ్ర♦భాసితయోధుల్
దా మూని మంచిచేలలు, భూమీశాంగణముఁ జొరఁగఁ ♦ బోలుఁ శీవిన్. ౨౧
కం.అని కార్యంబుల నెల్లను, గొనకొని వచియించి, నృపతి♦కుంజరునకుఁ దాఁ
బొనరింపవలయు పనులఁ, వినిచి యచట నుండి తీర్చె ♦ వివిధంపుఁబనుల్. ౨౨

[1] త్రేతాయుగమందును దేవాలయములు నర్చాపూజలు గలవు. ఇక్ష్వాకుల యిలువేల్పు శ్రీరంగనాయకుఁడు.

తే. అన్ని కార్యంబు లీరీతి ♦ ననువుపఱిచి, వామదేవవసిష్ఠులు ♦ భూమినాథుఁ
గాంచి కావించితిమి యెల్ల ♦ కార్యముల న,టంచు వచియింపనాతండు ♦ మించె నెలమి.

దశరథుఁడు శ్రీరాములను సభకుఁ బిలిపించుట.

ఉ. అంత సుమంత్రు తేఁడు సుకృ ♦ తాత్మకు నిష్పప రామచంద్రు నా
పొంతకుఁ దోడి తెమ్మనుచుఁ ♦ బోయె నతండును దోడి తేర; భూ
కాంతుఁడు నాల్గుదిక్కులను ♦ గల్గునృపాళులు మ్లేచ్ఛవర్యశై
లాంతవనాంతవాసులు స ♦ మంబున సూరెలఁ గొల్వఁ గొల్వనన్. ౯౮

కం. అమృతాంధసులు[1] భజింపఁగ, నమరేశ్వరుఁ డనఁగఁ బొల్చి ♦ యతులప్రాసా
దమున నట నుండి యుజ్జ్వల,విమలశతాంగంబునందు[2] ♦ వెలిఁగెడి వానిన్. ౯౯

సీ. కనియెను శ్రీరాముఁ ♦ గమనీయగుణధాము, సారంగగమనుఁ గం ♦ జాతనయను
నాజానుబాహు నీ ♦ లాంబుదసమదేహు, మిహికాంశువదను గాం ♦ భీర్యసదను
గంధర్వపతితుల్యుఁ ♦ గరుణారసాతుల్యు, సమ్మతతత్త్వుఁ బ్ర ♦ శస్తసత్త్వు
నౌదార్యగుణసాంద్రు ♦ నఖిలావనాతంద్రు, నగధీరు లోకతా ♦ పాపహారు

తే. భయదఘర్మాభితప్తభూ ♦ ప్రజల కెల్ల, హర్షదుం డగుపర్జన్యు ♦ నట్టివాని
మహితరూపగుణౌదార్య ♦ మహిమకలిమిఁ, బురుషుమన మోహించు ♦ ఱేఁడు వచ్చువాని.

కం చూచియుఁ జూచియు నంతేఁ, జూచియు సంతృప్తిలేక ♦ సొక్కుచు నుండన్
వే చనుదెంచె రథం బా, రాచనగరిద్వారసీమ ♦ రహిఁ డాయంగన్. ౯౭

తే. అంతటసుమంత్రుఁ డనవిజా ♦ కాంతునకును, దానుగ్రిందండదియెసఁగి ర ♦ థంబునుండి
దించి తండ్రిని గనఁ బోవు ♦ దేవనిభుని, వెనుకఁ బ్రాంజలి యగుచును ♦ జనుచునుండె.

కం. జనకునిఁ గనుఁగొనుకతన, జనవర్యుం డుండురాజ ♦ సదనాగ్రంబున్
జనకసుతాపతి యెక్కెను, వినయంబున మోడ్పుఁగేలు ♦ వెలయం దఱి సెన్. ౯౯

ఉ. పంబినభక్తి రాముఁడను ♦ నచ్చితి సంచును దండవత్ప్రణా
మం బొనరించి నిల్వ సుతు ♦ మానవపాలుఁడు చూచి హర్షవే
గంబునఁ గౌఁగిలించుకొని ♦ కాంచనరత్నమయాసనంబునం
దింబుగ నుండఁగా రఘుకు ♦ లేశ్వరు రాముని బంచె నర్మిలిన్. ౧౦౦

కం. దిననాథుఁ డుదయసమయం,బున మేరువుఁ గాంతియుక్త ♦ముగఁ జేసెడిమా
డ్కిని రాముఁడు తత్పరమా,సనమును రహి మీఱఁ జేసె ♦ స్వప్రభమహిమన్.

కం. కౌసల్యాసుతసహితం,బై సభ రాజిల్లె నెక్కు ♦ లగుచుక్కలచే
భాసుర మగుశరదభ్రము, వాసి సుధాకరునిచేత ♦ భాసిలుభంగిన్. ౧౦౨

కం. అద్దంబునఁ గన నగుతన, నిద్దపురూపంబు వోలె ♦ నృపతియుఁ దనయ
ట్లద్దిర వెలుంగురాముని, ముద్దులసుతుఁ గాంచి మిగుల ♦ మురియుచుఁ దనలోన్.

---

[1] అమృతాంధసులు = దేవతలు. [2] శతాంగము = తేరు.

కం. చిన్ని[1] చిఱునవ్వు మోమున, వన్నియ చిలుకంగ హాయల ♦ నఱలెడివానిన్
జన్నారిసుతునిఁ గనుచుం, గన్నారంగ ననియె హరికి ♦ కశ్యపుకీర్తిన్. ౧౦౪

దశరథుఁడు శ్రీరామునకుఁ దనయభిప్రాయంబుఁ దెలుపుట.

ఉ. నాయన రామచంద్ర! నిను ♦ నాయనుహూపగుణాఢ్య పట్టపుం
దోయజనేత్రయందు సుత ♦ నూజునిఁ గంటిని, నీవుజుఁ మహో
మెయగుణాళి లోకులకు ♦ మెచ్చొనరించితి, పుష్యయోగమం
దే యువరాజుఁ జేయ మని ♦ నెంచితి నిన్నుఁ గుమారకాగ్రణీ! ౧౦౫

కం. నీవు స్వభావము చేతనె, వావిరి వినయంబు సుజన ♦ వర్ణితగుణసం
భావనయుం బొందితి; నీ, కేవిధమున నీడు లేమి ♦ యెఱుఁగుదు నరుఅన్. ౧౦౬

మత్తకోకిలము. నీ వెఱుంగని యట్టినీత్యవి ♦ నీతు లున్నవె యెందునే?
నేవి క్రొత్తగ నీకు నేర్పఁగ ♦ నేను నేస్తుఁ గుమారకా!
భావితావృతిఁ జేసి పుత్రక ♦ వత్సలత్వము పేర్మి నే
నేవియో యొకకొన్నిటిన్ వచి ♦ యించెద న్వినుము నందనా! ౧౦౭

సీ. వినయవంతుండ వై ♦ విజితేంద్రియుండ వై, నిశ్యసుశీలి వై ♦ నెగడవయ్య
కామంబు క్రోధంబు ♦ గలిగించు నట్టివ్యసనంబులను బ్రీతి ♦ పడకుమయ్య[2]
తక్షకాదిఁ బరోక్ష ♦ వశఁ దన్పుచును మంత్రి, తతుల సమ్ముఖమునఁ ♦ దనుపవయ్య
ధనధాన్యములకొట్లు ♦ తతశస్త్రశాలలు, వలిమి వోకుండఁ జూ ♦ పిట్టవయ్య
తే. యిట్లు ధర యేలుచున్నన ♦ రేంద్రుఁ గాంచి, ప్రకృతిజనులెల్ల సంతోష ♦ భరితులగుదు
రతనిహితవర్యులెల్లరు ♦ నమృత మొంది, సంతసిలు వేల్పులట్టుల ♦ సంతసింత్రు.

కం. అని బోధించుచు నుండఁగ, విని రామునిమిత్రనరులు ♦ వేగ పరువునన్
జని చెప్పిరి కౌసల్యకు, జనపాలునివచనసరణి ♦ సంతస మారన్. ౧౦౮

కం. ఆరామామణి యొసఁగెను, శ్రీరామునివార్త యనుసు ♦ హృద్వర్యులకున్
మేరలు మీఱ ధనంబులు, హారంబులు వివిధమణిమ ♦ యాకల్పంబుల్.[3] ౧౦౯

చం. జనకుని సన్నతిం దనిపి ♦ స్యందన మెక్కి రఘూత్తముండు దాఁ
జనియె నిజాలయంబునకుఁ ♦ జయ్యనఁ బౌరు లనుజ్ఞఁ గాంచుచున్
జని తమకోర్కి పండుటకు ♦ సమ్మతి మీఱఁగ నిల్లువేల్పులన్
దనిపి రభీష్టపూజనవి ♦ ధానములం గడుసంప్రహృష్టులై. ౧౧౦

ఉ. పౌరులు వీడుకోల్వడసి ♦ పాయఁగ నానల నిశ్చయజ్ఞుఁ డా
ధారిణినేత మంత్రిసహి ♦ తంబుగ నెల్లియ పుష్యయోగ మై
శ్రీ రహి మీఱుఁ గాన రఘు ♦ శేఖరునిన్ యువరాజుఁ జేయఁ బెం
పారు నటంచు నిశ్చయము ♦ నాడి సభం, జనె నింటిలోనికిన్. ౧౧౨

[1] చిన్ని = మనోజ్ఞమైన. [2] కావున నేఁ డిదాకైకయంగుఁ గోపము గాని రాజ్యకాంక్ష గాని లేక తండ్రియిష్టముదీర్ప నడవికిఁ బోవుట. [3] ఆకల్పంబుల్ = అభరణములు.

### దశరథుఁడు శ్రీరామునిఁ దననగరునకుఁ బిల్పించుట.

కం. ఈరీతి నృపతి యంతర,గారంబును జేరి సూతుఁ ♦ గని వేగమునన్
శ్రీరఘురాముని నింకొక,వారము తోడితె మ్మటంచు ♦ వాక్రుచ్చుటయున్. ౧౧౩

ఉ. చయ్యన నేగి, రాము మొగ♦సాలను నిల్చి, యుదంత[1] మంపఁగా,
నయ్యనఘుండు శంక గొని ♦ యాతనిఁ బిల్వఁగఁ బంచి, రాజుగా
రియ్యెడ నన్నుఁ బిల్చు పని ♦ యెయ్యది నా, మిముఁ దోడితేరఁ గా
నయ్యె వచించెఁ, బోకయుఁ ద♦నన్యము సేఁతయు మీయధీనముల్. ౧౧౪

చం. అనవుడు వేగ తండ్రిఁ గన ♦ నారఘురాముఁడు పోయి, దూరమం
దున కని, దండనత్ప్రణతిఁ ♦ దూర్ణముగా ఘటియింపఁ, బ్రేమమైఁ
దనయుని లేవ నెత్తి, వసు♦ధాపతి కౌఁగిటఁ జేర్చి, యోగ్యపీ
ఠిని గనిపించి, కైకొనఁ గ♦డిందిప్రియంబునఁ బల్కె రాముతోన్. ౧౧౫

### దశరథుఁడు శ్రీరాముని యువరాజుఁ జేయుటకుఁ గారణము లతనితోఁ జెప్పుట.

శా. రామా! వృద్ధుఁడఁ బెక్కు లేండ్లు మనితిన్, ♦ రాజ్యంబు ప్రాజ్యంబుగాఁ
గామంబుల్ మన సారఁ బొందితిని, నేఁ ♦ గావించితిన్ సత్క్రతు
స్తోమంబుల్ సరసాన్నదక్షిణలతోఁ ♦ దోరంబుగా దాన ము
ష్టామశ్రీ విలసిల్లఁ జేసితి యథా♦తాత్పర్యశాస్త్రంబుగన్. ౧౧౬

చం. సలిపితి సర్వదానములు, ♦ శాస్త్రము లన్నిటి నభ్యసించితిన్,
దలఁగితి నాత్మదేవవసు♦ధావిబుధర్షిపితౄణబంధముల్,
కలిమిని సర్వభోగములు ♦ కామితము ల్దని వార నొందితి,
న్బలియు నతుల్య నిష్ఠు నిను ♦ నందనుఁ గాంచితిఁ బూరుషోత్తమా! ౧౧౭

కం. రాజితగుణి వగునిను యువ,రాజుంగాఁ జేసి మిగుల♦రాగంబున భూ
మీజన మలరంగను బే,రోజను గను టొకటె కొఱఁత ♦ యుత్తమచరితా! ౧౧౮

ఉ. కావున నావచించునది ♦ కావన కీ వొనరింపఁగాఁ దగున్,
బావనశీల! నీవు నర♦పాలుఁడుగా జను లెల్లఁ గోరి రి
చ్ఛావిధి, నట్లుగాన నినుఁ ♦ జయ్యన నే యువరాజుఁ జేసెదన్,
నీవు భరింపఁ బూను మవ♦నిం, గత మే మిటుచేఁత కంటివేన్. ౧౧౯

ఉ. భీతిదదుర్నిమిత్తములు ♦ పెక్కులు గాంచెద స్వప్నమందు, ని
ర్ఘాతము లుల్కలుం బడఁగఁ ♦ గంటి మహారవసంయుతంబుగా,
జ్యోతిషికాళి రాహుకుజ♦సప్తతురంగులు[2] జన్మతారకన్
వే తవులంగఁ జొచ్చి రన ♦ వింటి, నిఁ కేమి వచింతుఁ బుత్రకా! ౧౨౦

---

[1] ఉదంతము = వార్త. [2] సప్తతురంగుఁడు = సూర్యుఁడు.

తే. ఇట్టిశకునంబులఫలంబు ♦ నెంచి చూడ, నవనిపతి మరణించు; లే♦దా మహాప
దాళి ఘటిల్లుఁగాన రా♦జ్యంబుఁగొనుము, ప్రాణవంతుండనైయుండు♦నపుడవత్స!

తే. మత్సనోవృత్తి యిప్పుడీ♦మాడ్కి నున్న, దింక నెపు డెట్టు లుండునో♦యెఱుఁగరాదు
కాన నిప్పుడ యభిషేక♦గరిమఁ గనుము, కలదె ప్రాణికి మనసుని♦ల్కడ తనూజ!

తే. కర్తిలెడి రాఘవా! పున♦ర్వసువు నేఁడు
పుష్యయోగంబు రే పౌట ♦ బుధులు నీవు
యావరాజ్యంబుఁ గొనఁగ యో♦గ్యం బటంచుఁ
దెల్పి రటు సేయు, నను మది ♦ తీవరించె. ౧౨౩

ఉ. సీతయు నీవు రే యుపవ♦సింపుఁడు, దర్భల పైఁ బరుండుఁడీ,
ప్రీతి వచింపుమీ హితులు ♦ రే నిను జక్కఁగఁ గావ, విఘ్న సం
ఘాతము లెన్నియే నగలుగుఁ ♦ గావున నిట్టిక్రియాకలాప మిం
దాతతజాగరూకత న♦యంబు వహింపఁగ నెట్టివానికిన్. ౧౨౪

కం. అది గాక యొండునుర్ నా,మది నున్నది భరతుఁ డిటకు ♦ మరలకమున్నే
యెదిలీలన నభిషేకము, తుద నాగించుటయె మేలు ♦ తోఁచెం జూపన్.[1] ౧౨౫

ఉ. నే నిటు లంటి నా పలదు ♦ నీయనుజుండు జితేంద్రియుండును
న్మానుగ ధర్మవర్తి కరు♦ణాపరుఁ డగ్రజభక్తుఁ డైనను
మానవమానసంబు లతి♦మాత్రచలంబులు, ధర్మనిత్యులం
దేనియు సజ్జనావళుల ♦ నేని నవే కృతశోభు[2] లయ్యెడిన్. ౧౨౬

తే. చెల్లు నెల్లియ పట్టాభి♦షేకమహము, పోయిరానాయనా! యని ♦ భూమిధవుఁడు
పలుక సాష్టాంగ మెఱఁగి స్వ♦భవనమునకు, నరిగె వెంటనె చనెఁ దల్లి♦యంతిపురికి.

సీ. అరిగి రాముఁడు దేవ♦తాయతనంబున, నెలిపట్టుఁబుట్టంబు ♦ వెలయుదానిఁ
దలఁగనిభక్తిని ♦ దనయుని శ్రీయుక్కు, నొనరింపు మని మ్రొక్కు ♦ చున్నదాని
నిలువేల్పు పైఁ దన♦హృదయంబుఁ గీలించి, ధ్యానైకరతి మౌన ♦ మూనుదాని
నతులితగతిని బ్రా♦ణాయామమునఁ బరా,త్పరుని జనార్దనుఁ ♦ దలఁచుదానిఁ

తే. దనప్రవృత్తిని విని సుమి♦త్రయును లక్ష్మ,ణుండు మునువచ్చి జనకత♦నూజ నటకుఁ
దోడితెప్పింప మువ్వురఁ ♦ గూడియుండు,దాని సాధ్వీమతల్లిని ♦ దల్లిఁ గనియె.

కం. కాంచి నమస్కారముఁ గా,వించి రఘూత్తంస మంత ♦ వీనులవిం దౌ
సంచితవాక్యంబుల వి,న్నించెర్ హర్షమున మేను ♦ నెఱి గగుర్పొడవన్. ౧౨౯

శా. తల్లీ! నాయన యానతిచ్చె నను గో♦త్రాపాలనప్రక్రియా
సల్లీలం జరియింప, దేవ యువరా♦జ్యశ్రీ గొనన్, రేయి నే

---

[1] కైకను బెండ్లిచేసికొనుసమయంబున దశరథుఁడు దనరాజ్య ముంకువగానిచ్చెను. ఆమెకొడుకు గోరినరాజ్య మిచ్చునట్లు మాట. ఈభయముచేతనే ఒనవాసనను నేకయురాజునకును వార్త పంపలేదు.
[2] కృతశోభి = యయినదేమో యయినపని యూరకుండుట.

నిల్లాలుం దగు నిట్లు పూన నట, నా ♦ కీరీతి మాతండ్రి దా
సల్లాపించెఁ బురోహితాన్వితుఁడు నై ♦ సంతోష మేపారఁగన్. ౧౩౦

కం. వీడ కిపుడ చేయుము నీ,కోడలికిని నాకు రేపు ♦ కోమరుగ శుభముం
గూడఁగఁ జేసెడిక్రియలను, బాడిమెయిన్ మాకు శుభము ♦ పరివర్ధిల్లన్. ౧౩౧

## కౌసల్య శ్రీరాముని దీవించుట.

సీ. అన నిట్లు దీర్ఘకా♦లాభికాంక్షితవాక్య,మును విని కౌసల్య ♦ మోదబాష్ప
కలవాక్యమునఁ బల్కెఁ ♦ గన్నతండ్రీ! రామ! చిరజీవి వగుచును ♦ బరఁగవయ్య
శ్రీసమేతుండ వై ♦ చెలఁగి నాదుసుమిత్ర,బాంధవులను బ్రీతి♦పఱుపవయ్య
జనకుని సంతుష్టుఁ ♦ జలుపుటచే బలే, కళ్యాణతార ని ♦ న్గంటి నయ్య
తే. రామ! నీ విప్పు డిక్ష్వాకు♦రాజ్యరమకుఁ
బతివి గావుట నేఁ జేయు♦పద్మలోచ
నార్చనము నేఁడు ఫలయుత ♦ మయ్యె నయ్య
మొనసి శత్రులు చెడిరయ్య ♦ ముద్దులయ్య! ౧౩౨

చం. అని జనయిత్రి పల్క దర♦హాసవికాసవిలాసభాసురా
ననమున లక్ష్మణుం గని ఘ♦నం బగునీవసుధాతలంబు నె
ల్లను దమి నాకుఁ దోడయి చె♦లంగుచు నేలుము నీవు, లక్ష్మి ని
న్ననువుగ నాద్వితీయ మగు♦నాత్మవు గావుటఁ బొందె లక్ష్మణా. ౧౩౩

కం. భోగంబులు రాజ్యఫలా,భోగంబులు నిచ్చకోలఁది ♦ భోగింపు మిఁకన్
రాగమున నీకు నై కా,దే గొప్పగఁ జూతు రాజ్య♦మేన్ బ్రాణములేన్. ౧౩౪

కం. అనుఁగుందమ్ముని కిట్లని, జననుల కభివాదనంబు ♦ సలుపుచు భక్తిన్
జనకజ కనుజ్ఞఁగొని తాఁ, జనియెన్ రాముండు తనని♦శాంతంబునకున్. ౧౩౫

## దశరథుపంపున వసిష్ఠుఁడు శ్రీసీతారాముల నుపవాస ముంచుట.

కం. క్షితిపతి వసిష్ఠసంయమి, పతినిం గని రామచంద్రుఁ ♦ బత్ని యశశ్శ్రీ
క్షితిలబ్ధికి నుపవాస,వ్రతముం జరపింప మీరు ♦ వలయును బోవన్. ౧౩౬

చం. అని యిటు ఱేఁడు వల్కిన మ♦హామతి యమ్మునినాథుఁ డట్టులే
చనె నొకవిప్రయోగ్య మగు♦స్యందన మెక్కి రఘూద్వహాలయం
బున కటు మూని కక్ష్యలను ♦ మూఁటిని దాఁటి చనంగ రాముఁడున్
విని యెదు రేగి డింపఁ గడుఁ ♦ బ్రీతిఁ బ్రియంబుగఁ బల్కె మౌనియున్. ౧౩౭

కం. అన్నా! నీజనకుండు ప్ర,సన్నత యువరాజుఁ జేయు ♦ సంప్రీతిని ని
న్నన్నహుషుండు యయాతిబ,లె న్నేఁ డుపవాసవిధి వ♦లెన్ జరుపంగన్ ౧౩౮

ఉ. సీతయు నీవు; తేప యభి♦షేకము సేయు విభుండు నీకు, నం
చాతరణీడ్యవంశజా ధ♦రాత్మభన న్విధిచోదితంబు నా

రీతి సమంత్రకంబుగ వసిష్ఠతపస్వి యతోపవాసను
స్నీతులఁ జేసి యర్చనల ♦ శ్రీరఘురాముఁ డొనర్ప నందుచున్ ౧౩౯

కం. వెనువెంట వచ్చు రఘురా, ముని ముని నిలు నిలు మటంచు ♦ ముదమొనర్చఁగ తాఁ
జనియెను రాముని వేశన, మును వీడి రథస్థుఁ డగుచుఁ ♦ బురమార్గమునన్. ౧౪౦

→ శ్రీరామపట్టాభిషేకమునకై జనులు గుంపులు గూడుట. ←

చం. మునికులసార్వభౌముఁ డిటు ♦ మోదముతో నగుగం బ్రియంవద స్తనహితు లెల్లరుం గొలువఁ ♦ దాఁ జని యాత్మగృహంబులోనికిన్
జనకసుతామనోహరుఁడు ♦ సాంత్వపువాక్కులఁ వారిఁ బ్రీతులం
బొనరఁగఁ జేసి వెండి రఘు♦ముఖ్యుఁ డనుజ్ఞ యొసంగె వారికిన్. ౧౪౧

కం. విచ్చినకమలంబులు మడ, మెచ్చి శకునములు నై[1]ర♦హించుకొలను నా
నచ్చుజిగిఁబురుమ యువతిన, ముచ్చయములతోడ రాము♦మోసల వెలసెన్. ౧౪౨

సీ. ఇసు[2] మెత్తి చల్లిన ♦ నిలను రాలకయుండ, మూఁగినమూఁక చే ♦ మొనయువాని
నెప్పు డెప్పు డటంచు ♦ నెదురు చూచుకుతూహ, లప్రజ చేతఁ జె♦లంగువాని
జనతాతరంగహ♦ర్షస్వనోద్గాఢ మై, యంబురాశికి నుద్ది ♦ యైనవాని
నంబువుల్ చల్లి వృ♦క్షంబులు గట్టి మేల్, రంగవల్లులను బ♦రంగువాని

తే. నెప్పు డెప్పుడు భాస్కరుఁ ♦ డేగుదెంచు, ననుచు నక్షత్రతతిఁ దారుపుఁ ♦ గనుచు నున్న
బాలబాలావధూవృష్ట♦పటలిచేత, మించి యిఱు కైన తెరువులఁ ♦ గాంచె మౌని.

కం. మిద్దెల మేడల ధ్వజతతు, లద్దిర యెగురంగ సాగె ♦ హర్షముతో నీ
సుద్దిని మింటను వేలుపు, ముద్దియలకుఁ జెప్ప చున్న♦ముచ్చట దోఁపన్. ౧౪౪

కం. జనతాలంకృతిభూతము, జనతానిస్తులితమోద♦జనకం బగుప
త్తనమున నుత్సుకజనములఁ, గనుచుం బ్రజ బంతి దీర్చు♦గతి మెల్ల చనెన్. ౧౪౫

చం. అరుసముతోడ మౌని యవి ♦ యన్నియుఁ గాంచుచు నేగియేగి డాల్
పరఁగ సితాంబుదాంచలని♦భం బయి క్రాలునృపాలచంద్రుమం
దిరమును జేర నేగ, గురు ♦ దేవవిభుం డన నాన్నృపాలుఁడున్
దొరతొర లేచి త న్నట నె♦దుర్కొని కార్యము ప్రశ్న సేయుడున్. ౧౪౬

కం. జరపితి సకలం బనియెను, ధరణిపుతోడన సభాస♦దప్రజ మెల్లన్
గురుమతి లేచి వసిష్ఠునిఁ, గరముం బూజింప నవని♦కాంతుఁడు పిదపన్. ౧౪౭

కం. జరగినవృత్తాంతము విని, గురువర్యుననుజ్ఞ గాంచి ♦ కూడినమనుజో
త్కరమునకున్ సెల విచ్చెను, బరమముదంబునను దగిన♦భంగిని నిట్టుల్. ౧౪౮

మానిని. వారల నెల్లరఁ బోవఁగఁ బంచి నృ♦పాలుఁడు సింహము శైలగుహన్
జేరెడిరీతి సమగ్ర్యను వేషవి♦శేషవధూజనతాకులజం

---

[1] శకునములు నై = పక్షులఁగలిగి. [2] ఇసుము = ఇసుక.

భాతిని శాంతమనోహరరాజగృ♦హంబును జొచ్చి సబుధగణో
దారసభంబును జెందురునట్టులు ♦ దా వెలిఁగించె స్వదీధితులన్. ౧౪౯

## శ్రీరాముఁడు నారాయణార్చనము సేయుట.

కం. చనుదుఁ బురోధయుఁ దా మ,జ్జన మొనరిచి నియతమతి వి♦శాలాక్షిని బ
త్నిని గూడి రామభద్రుం, డనఘుఁడు నారాయణుని[1] స♦మర్చన సలిపెన్. ౧౫౦

చం. తలను హవిస్సుపాత్రము య♦థావిధిఁ దాల్చి, జ్వలించు నగ్నిలో
పల విధిపూత మాజ్యహుతు♦ల్ భక్తిమెయిం బరదైవతంబునుం
దలఁచుచు వేల్చి, శేషమును ♦ స్వర్ద్ధయుఁ బ్రీతి భుజించి శ్రీపతిన్
నిలిపి మెడంతఁ దర్భశయ♦నీయమునన్ హరిమందిరంబునన్. ౧౫౧

కం. వినియతవాగ్మానసుఁడై, జనకసుతాసహితుఁ డగుచు ♦ శయనించెనా, మే
ల్కొని వేగ జాము గల దనఁ, దనగృహ మఖిలం బలంకృ♦తము సేయించెన్.

కం. సూతజనవందిమాగధ, చేతోహరవాక్యములను ♦ జెవిపండువుగా
సీతాపతి విని నిశ్చల, చేతంబున సంధ్య వార్చి ♦ శ్రీమధువైరిన్. ౧౫౩

చం. శిరమును వ్రాల్చి మ్రొక్కి, సిత♦చేలముఁ దాలిచి, స్వస్తివాచనా
చరణము దీర్పఁ బంప ద్విజ♦సత్తమముఖ్యులఁ, దద్గభీరహృ
ద్యరవము నిండెఁ బట్టనము♦నం దొగిఁ దూర్యరవానుసారియై;
వరనియతవ్రతంబు నుప♦వాసముఁ దీర్చె సతీద్వితీయుఁడై ౧౫౪

కం. కౌసల్యతనయుఁ డని సం,తోసంబున నాలకించి ♦ తూర్ణ మయోధ్యా
వాసులు దొరఁకొనిరి పురిం, గైసేయఁగ వేగుఁబోకఁ ♦ గమనీయముగన్. ౧౫౫

## శ్రీరామపట్టాభిషేకమునకై యయోధ్య యలంకరింపఁబడుట.

సీ. వెలిమబ్బులను బోలి ♦ వెలయు దేవళములఁ, గలితచైత్యముల శృం♦గాటకముల
నట్టాలకంబుల ♦ నఖిలపణ్యసమృద్ధ, మైన బేహారుల♦యంగడులను
రమణఁ గుటుంబిపూ♦ర్ణంబు లౌ సంపన్న,మృష్టమందిరముల ♦ నెల్లసభల
నాలక్షితోర్వీరు♦హంబుల సన్నిట, ధ్వజములఁ జిత్రప♦తాకములను
తే. నెత్తిరప్పుడు; నటనర్త♦కోత్తములయు, గాయకులయును గానంబు ♦ కర్ణపర్వ
ముగను వ్యాపించెఁ జగంబు ♦ సొగయుచుండ, నీడ నా డన కాపురి ♦ నెల్లయెడల.

ఉ. శ్రీరఘురామచంద్రునభి ♦ షేకముఁ జూడఁగఁ జత్వరంబులం
భూరిగృహాంగణంబులను ♦ మూఁగిన నారులుఁ బూరుషావళు
ల్గోరపు వేడ్క మీఱఁ దమ♦లోనఁ బరస్పరముం గుతూహల
శ్రీరతి రామచంద్రునభి♦షేకముఁ గూరిచి సెక్కరీతులన్ ౧౫౬

---

[1] నారాయణుని = ఇంటిలోని శ్రీరంగనాథమూర్తిని పురాణగాథ.

కం. ముచ్చటలాడఁగ; బాలురు, ముచ్చట నాడుచును వారి♦ముంగిళ్ల ముదం
బెచ్చఁగ జిలిబిలిపలుకుల, నచ్చరితమె చెప్పుకొందు ♦ రనయముఁ దమలోన్.
సీ. పుష్పోపహారముల్ ♦ పుష్కలంబుగ నిచ్చి, ధూపంబు లిడి గంధ♦ధూళి చల్లి
ఘంటాపథంబులు ♦ కడురమ్యములఁ జేసి, యేగు పెండ్లిని[1] రేయి ♦ యేగు దెంచు
నో యనుశంకచే ♦ నున్నతదీపవృ,క్షంబుల నిరువంక ♦ సర్వమార్గ
ముల నిల్పి కలయంగ ♦ ముదితచేతస్కులై, గుమిగూడి చత్వర♦కూటములను
తే. రాముపట్టాభిషేకంబు ♦ రమణఁ గనుదు,మెప్పు డెప్పు డటంచును ♦ నెదురుచూడ
రాముగుణములుగొండాడి♦రాజవర్యు, మెచ్చుకొనుచును జను లెల్ల♦నిచ్చ మెఱయ

పట్టాభిషేకవిషయకజనసంభాషణము.

సీ. అహహ యెంతమహాత్ముఁ ♦ డౌర రాజన్యుండు, తన కేండ్లు చెల్లుట ♦ తలఁచి తనయు
రామచంద్రుని యువ♦రాజు సేయఁగ నెంచి, పట్టాభిషేకంబు ♦ పరఁగఁ జేయు;
రామచంద్రుఁడు మన♦రాజు గావుటఁ జేసి, ధన్యుల మైతి మం♦దఱము మనము;
దృష్టలోకపరావ♦రేశుఁ డనుష్ఠిత,చిత్తుండు ధర్మాత్మ♦శేఖరుండు
ఆ. భ్రాతృవత్సలుండు ♦ భ్రాతలఁ దా నెట్టి,కరుణఁ జూచు నట్టి♦కరుణ మనలఁ
గాచు నాతఁ డింత♦కాలంబునకు జన,రక్షకత్వమూనె ♦ రాజుకరుణ. ౧౬౦
కం. ఎవనిప్రసాదంబున మన,యవనికి శ్రీరామచంద్రుఁ ♦ డగు రాజుగ నా
యవనీపాలుఁడు దశరథుఁ, డవనిన్ సుఖియించుఁ గాత ♦ మాయుర్వృద్ధిన్. ౧౬౧
మ. అని పౌరుల్ దమలోన నాడుకొన న♦త్యంతప్రమోదంబునన్
వినుటన్ జానపదాళి ముద్దినము త♦ద్వృత్తాంతము, న్గుంపులై
చనుదేర న్నలుప్రక్క నుండి జనిత♦స్వానంబు రోదోంతరం
బున నిండం బురి పర్వకాలజలధం ♦ బొలెన్ రవోద్దీప్త మై. ౧౬౨
చం. అమరపురీనిభం బయిన♦యప్పుర మప్పుడు వేడ్కఁ జూచు పెం
దమకము మీఱ మూఁక లయి ♦ తద్దయుఁ జేరుమనుష్యకోటిరా
వము గలయంగఁ బర్వడు న♦వారణవారిచరావళీపరి
భ్రమణమహోర్మ్యటీరటద♦పాంపతిచందముగాఁగ భాసిలెన్. ౧౬౩

మంథర యయోధ్యాలంకారముఁ జూచుట.

ఉ. ఏకడఁ బుట్టెనో, పితరు♦ లెవ్వరొ, యేరు నెఱుంగనట్టిదై[2]
కైకకు బంధుదాసి యయి ♦ కర్జము దీర్చుచుఁ బొట్టకూటికై
కైకను బాయ కుండెడు నొ♦కానొక మంథర దాఁ దటాలునన్
బ్రాకటశీతదీధితిని♦భం బగుహర్మ్యము నెక్కి వేడుకన్ ౧౬౪

[1] ఏగుపెండ్లి = ఊరేగింపు. [2] అభిషేకవిఘ్నమునకై యొకదేవతాస్త్రీ దేవతలచేఁ బంపఁబడెనని గాథ.

చం.జిమజిమ లాడువీథులును, ♦ జిత్రముగా వెసచల్లఁబడ్డపు
ష్పములుఁ, దలంటుకొన్నజన♦సంఘముఁ, గల్వడముల్, ధ్వజాళి, హ
స్తములను మాల్యమోదకవి♦తానముఁ దాల్చి చరించులోకపూ
గములును, శుభ్ర దేవగృహ♦కాంచములున్, హితవాద్య ఘోషముల్ ౧౬౫

చం.కెరలఁ బ్రహృష్టసర్వజన♦కీర్ణము, బ్రహ్మరవాభినాదితం,
బురుతరహృష్టహస్తితుర♦గోత్కర, ముఘనినాదపూర్ణమై,
కరము పరిష్కృతం బగుచుఁ ♦ గ్రాలునయోధ్యను గాంచి లోన న
బ్బురపడి క్షౌమవాసినిఁ బ్ర♦ఫుల్లవిలోచన దాది నొక్కతన్ ౧౬౬

ఉ. చేరువఁ గాంచి యి ట్లనియెఁ ♦ జెప్పుమ యర్థపరార్థ యయ్యుఁ జెం
పారుముదంబునన్ జనుల♦కర్థము లిచ్చెడు రామమాత యే
లా? రమణీ! పురంబు బహు♦శ ప్రముదాకులలోక మయ్యె, భూ
మీరమణుం డొనర్చెడినొ ♦ మేలిశుభం బెదియేని ధాత్రికా? ౧౬౭

తే. పొంగిపొరలుముదాన సు♦ప్పొంగుమేన, ధాత్రి యి ట్లనెఁ గుబ్జకు ♦ ధరణినాథుఁ
డెల్లి పుష్యమునందు జి♦తేంద్రియాఢ్యుఁ, డైనరాముని యువరాజుఁ♦గా నొనర్చు.

కం.ఆపల్కులు చెవిఁ బడఁ గడుఁ, గోపంబున మండిపడుచుఁ ♦ గుబ్జయుఁ గైలా
సోపమసౌధము డిగి చని, పాపుమతి ననియె హోయి ♦ పండినకైకన్. ౧౬౮

మంధర కైకేయికి శ్రీరామపట్టాభిషేకవార్తఁ దెలిపి దుఃఖించుట.

సీ. లేలెమ్ము మూఢాత్మ♦రాల! కొంప మునింగెఁ, దెలియవు విపదబ్ధిఁ ♦ దీర మునిఁగి
భర్తయొల్లనిదాన! ♦ పరమదుర్భగ! వృథా, సౌభాగ్యవతి నని ♦ చాటుకొనెదు
మండువేసవి నేట ♦ నుండుజలం బన, నీదుసౌభాగ్యంబు ♦ నేలఁ గలయు
యష్మాకాంతుఁ డెప్పుడు ♦ నాకుఁ గైవస మని, విఱ్ఱవీఁగెద విసీ ♦ వెఱ్ఱి వగుచు

తే. ననుచుఁ దనుఁ గోపపరుషోక్తు ♦ లాడుపాప,దర్శినినిగాంచి కడువిషా♦దమునఁ గుంది
కైక యి ట్లను నేడ్చెదు♦కరణి దీన,వదన వై తేల సేమంబు ♦ వఱలు గాదె? ౧౭౦

చం.అని మధురోక్తిఁ గైక యన ♦ నానుడికారపుఁ[1] బ్రోఢ రక్తలో
చన యయి కేకయాత్మజకు ♦ శర్మము రాఘవు వేఱుపాటునుం
దనమదిఁ గోరి యశ్రువులఁ ♦ దద్దయుఁ గార్చుచు నామె కిట్లనున్
వనిత! భవద్వినాశమిదె ♦ వర్తిలు చున్నది తప్ప దేమిటన్. ౧౭౧

ఉ. రాముని నీమగండె యువ♦రాజు నొనర్చెడి నంట యెల్లి, యో
చామరొ! దీని వింట భృశ♦సాధ్వసశోకపరీతచిత్త నై
హో మెయి నిప్పులం బొరలి♦న ట్లయినన్ సయిరింప లేక నీ
సేమము గోరుదాన నయి ♦ చెచ్చెర వచ్చితి నీకుఁ దెల్పఁగన్. ౧౭౨

[1] నుడికారము = చమత్కారపుమాట.

ఆ. నీకు దుఃఖ మొదవ ♦ నా కతిదుఃఖ మా, నీకు వృద్ధి గలుగ ♦ నాకు వృద్ధి
సందియంబు లేద ♦ యిందీవరాక్షిరో, యీయెడాటమందు[1] ♦ నెఱుఁగ వినుము.

ఉ. పుట్టితి వీవు పేరుగల♦భూపతివంశమునందు, దేనికిం
బట్టపుదేవి వైతి విట ♦ భామిని! నీ విటు లయ్యు నిస్సిఁగా
మట్టు నెఱుంగ లేవ, యిఁక ♦ మాటల నే మగు? రాజధర్మమున్
గుట్టున దెంతక్రూర మెదఁ ♦ గోమలిరో! తలపోయ లేవుగా. ౧౭౪

చం.పలుకులు ధర్మయుక్తములె, ♦ భావము నా నతిదారుణంబ, యు
గ్మలి! పువుఁ దేనెలం జిలుకు♦మాటలు కంఠముమీఁదనుండియే,
తెలియక మోసపోయితివి ♦ దేవి! విభుం బుజుమార్గవర్తిఁగాఁ
దలఁచి; తదీయదుష్ఫలము ♦ తార్కొనె నిన్నిపు డింతఘోర మై. ౧౭౫

కం.అచ్చికబుచ్చికగా నీ,మెచ్చులకై నగలుఁపడుచు ♦ మేదకు నటులై
యిచ్చుట, ననర్థకంబుగ, నచ్చుటఁ గౌసల్య కిడెడి ♦ నైశ్వర్యంబుల్. ౧౭౬

కం.చుట్టంబులఁ జూడఁగ నను, సొ ట్టొక్కటి పెట్టి నీదు♦సుతు దూరముగా
నెట్టి తనపెద్దపెండ్లము,పట్టిని నృపుఁ జేయు దేవ ♦ పతి దుష్టమతిన్. ౧౭౭

కం.పతి యనునెపమున నరి యని, మతి నెఱుఁగక మూఢురాల ♦ మాతవలె సదా
హితవగుచు మరగి తహి స,న్మతిఁ దొడ లాలించుకుమతి♦మాడ్కి మహీశున్.

కం ఆలంబు సేయ శత్రు,వ్యాలంబుల వెట్లు సేయు ♦ నప్పరుసున నో
బేలా! దశరథుఁ డిప్పుడు, వాలాయము నిన్ను సాత్మ♦భవ నటు సేసెన్. ౧౭౮

కం.బాలా! పరిచితచిరసుఖ,జాలా! పాపియును నసృత♦సాంత్వం డగుభూ
పాలుఁడు రాముని రాజుగ, నేలకుఁ జేయంగఁ జెడ రె ♦ నీవును జుట్టల్. ౧౮౦

చం.చతురవు విన్ము విస్మయవి♦శాలవిలోచన! నాదుపల్కు నీ
సుతు నిను నన్నుఁ గావ నొక♦చొప్పు తలంపుము, నీకు మే లెదో
హితగతి దానిఁ జేయఁగ ని♦దే సమయంబు సుమా, ప్రమాదపు
న్మతిఁ జెడి పోకు పోకు మని ♦ మంథర యీగతిఁ దీవరింపఁగన్ ౧౮౧

పట్టాభిషేకవార్తఁ జెప్పినమంథరకుఁ గైక పారితోషిక[2] మిచ్చుట.

కం.ఆలలితవచన మంథర,యాలాపము లాలకించి ♦ యతిహర్షమునన్
వే లేచెను శారదనిశ, లీలం బొడతెంచుచంద్ర♦లేఖయ పోలెన్. ౧౮౨

శా.ఆనందంబున మేను పొంగఁ బరమం ♦ బౌవిస్మయం బారఁగా
మేనం దాల్చిన మేలిభూషణముఁ గొ♦మ్మీ యంచు నొం డిచ్చి యే
ణీనేత్రామణి కుబ్జ కిట్టు లనియెన్ ♦ నిన్మెచ్చితిన్ మంథరా!
దీనిన్ నాపరమప్రియంబుఁ దొలుతం ♦ దెల్పంగ నీ వూనుటన్. ౧౮౩

---

[1] ఎడాటము = వియ్యము. [2] పారితోషికము = కానుక.

క౦.ఇంతటికడుప్రియ మగువృత్తాంతము, నెఱిఁగించునీకుఁ ♦ దగురీతిగ నే
నింతకు నేమి యొనర్తునొ, చింతన మొనరించి నాకుఁ ♦ జెప్పుము కుబ్జా- ౧౮౪
క౦.రామునకును భరతునకును, నేమాత్రము భేద మెఱుఁగ ♦ నే నటుగానన్
భూమీశుఁడు పట్టంబును, రామునకుం గట్ట మనను ♦ రంజిల కున్నే. ౧౮౫
క౦.తరమా నీ కిఁక నింతకుఁ, బరమాహ్లాదం బొసంగు♦పలుకుం బలుకన్?
బర మయి దీనిని మించిన, వర మెయ్యది గోరుకొనెదు ♦ వచియింపు మనన్

మంధర కైకను దూషించుట.

క౦.కోపము దుఃఖము మదికిని, దాపం బిడ నీసుకలిమిఁ ♦ దటుకున సౌమ్మ్యన్
వే పాఱనైచి మంథర, భూపాలకసతిని జూచి ♦ పొక్కుచుఁ బలికెన్. ౧౮౭
ఉ. బాలిశురాల సంతసము♦పాటున కా యిది వేళ? శోకకీ[1]
లాలధిమధ్యసీమను మె♦లంగుచు నీ వెఱియంగ లేవ, యా
భీలమహావిపత్తు కడు♦బెట్టిదమై యిటు దాపరించిన
న్నేలని సంతసించు నిను ♦ నే నెటు నవ్వక తాళఁ జాలెదన్? ౧౮౮
ఉ. నీ తెలి వింత లేమికిని ♦ నే వగతున్, సహజారి రూపస
త్నీతనుజాతువృద్ధి పయిఁ ♦ ద్రెక్కొను మృత్యువుమాడ్కి నిట్లు సం
జాతముదంబునం గెరలఁ ♦ జాలునె ప్రాజ్ఞయు? దీని నేమిగాఁ
జేతమునం దలంచితివి ♦ చెప్పుమ నీకు వివేక ముండినన్? ౧౮౯
తే. రాజ్య ముస్కడిసా ప్ర్కాట♦రామునకును,బ్రాణభయసంశయం బుండు♦భరతువలన
భయముపడువానివలన నె♦భయము గలుగు,నింత దలపోసినవిషాద♦హృదయనైతి
క౦.రామునిఁ ద్రికరణశుద్ధిగ, సౌమిత్రి భజించు చుండు ♦ సంతత మతివా!
రాముని లక్ష్మణుకీతిని, సామంబునఁ గొలుచు భరతు ♦ శత్రుఘ్నుండున్. ౧౯౧
క౦.జనశక్రమమాలోచిం,చిన భరతుఁడ దాఫువాఁడు ♦ చెలి! సౌమిత్రుల్
వెనుకటివా రగుదురు గా,వున రాజ్యక్రమము వారు ♦ పొందెద రవలన్. ౧౯౨
చ౦.కరము వివేకశాలియును, ♦ శాస్త్రకళాకుశలుండు, నిండునే
ర్పరి,సమయోచితార్థముల ♦ బాగుగఁ దీర్చెడితీప్రకారియున్,
ఘనశీసుతానుపోహుఁడు ♦ కా,నటుగావున నీదుపుత్రకు
న్భరతుఁ దలంచినం గుఱు వ♦ణంకెడి మే నిదె చూడు మానినీ! ౧౯౩
ఆ. ఎంతపుణ్యవతియొ ♦ యింతిరో కౌసల్య, తేపు పుష్యమందు ♦ తేఁడు తనదు
పుత్రు యౌవరాజ్య♦మున కభిషిక్తుఁ జే,యింప ద్విజులచేత ♦ నెలమిఁ గనెడి.
చ౦.సిరియును బ్రీతి కీర్తియును ♦ జెన్నలరన్ సపత్నాంద్రు గుందఁగాఁ
గెరలెడికోసలాత్మజకుఁ ♦ గ్రిం దయి చేతులు మోడ్చి దీన నై

[1] కీలాలధి = సముద్రము.

నేవిధిఁ జూడలేమి నిను ♦ నిట్టులు తొందర పెట్టెదర్; సప
త్నీవిభవాభివృద్ధికయి ♦ నీ విసి కానుక నా కొసంగె దే? ౨౦౭

చం.కల తెఱఁగు వచింతెద, న♦కంటక రాజ్యము రాముఁ డొంది యా
వల భవదీయపుత్త్రు, వన♦వాసిగనో పరలోకవాసినో
చలుపఁ గలండు నమ్ము మిది; ♦ జాల్మతఁ బంపితి బాలుఁ బుత్త్రకుర్
వలనటి మాతులుం గను నె♦వంబున, నింతకు మోస ముండునే? ౨౦౮

చం.చెలఁగును స్థావరంబులను ♦ స్నేహము దావున నున్న మాత్ర నే,
చెలువరో! రాజవర్యునకుఁ ♦ జెప్పెడి దే మిఁకఁ బుత్త్రులందు, నీ
వలనన పోయె నద్దియును; ♦ వారక నీనుతుఁ గూర్చుతమ్ముఁడేర్
మెలఁగిన నిందు నొక్కగతి ♦ మే లగు, నయ్యది యైన లేదుగా. ౨౦౯

కం.వినమా కాననసీమల, వనజీవులచేత నఱికి ♦ వైవంబడఁ జా
లినతరువులు ములుపొదరులు, పెనఁగొని నికటమున నుంట ♦ వెఱగొన కుంటల్.

శా.రాముర్ లక్ష్మణుఁ డెప్పు డేమఱఁడు, శ్రీ♦రాముండు సౌమిత్రి గా
రా మారర్ దయఁ బ్రోచు, నశ్వియుగ సౌ♦భ్రాత్రంబు న ట్లెంతయుర్
శ్యామా! వారల భ్రాతృవత్సలత వి♦ఖ్యాతంబు, సౌమిత్రికి
న్రాముం డెప్పుడుఁ గీడు సేయఁ, డది మా♦నం బోదు నీపట్టికిన్. ౨౧౧

ఉ. కావున నీదుపుత్త్రునకుఁ ♦ గార్యము మాతులునింటనుండి యే
తా వనసీము కేగుటయు; ♦ తద్దయు నీ కిది మేలు; రాజుగా
నీవిభుఁడే భవత్సుతుని ♦ నెమ్మి నొనర్చిన ధర్మరీతి చే
లా! విను నీదుచుట్టలు చె♦లం గెడివారు ప్రహృష్టచిత్తులై. ౨౧౨

కం.బాలుఁడు నిత్యసుఖోచిత,శీలుఁడు సహజాహితుండు ♦ సీతేశున కే
లీల న్విభవచ్యుతుఁ డౌ, బాలా! రామునకు లొంగి ♦ భరతుఁడు బ్రదుకున్. ౨౧౩

కం.అడవిని సింహము బొరిం, బడినగజమునట్లు రాము♦బారిం బడు నీ
కొడుకు న్మనుమున్న వెసం, గడుకొని కావంగ సర్వ♦కార్యము నీకున్. ౨౧౪

తే. నీవు సౌభాగ్యగరిమను ♦ నిక్కపడుచు, గర్వమున ధిక్కరింపవే ♦ పూర్వమందు
సవతి రామునితల్లి; నా♦జాణ యేల, యక్క సెల్లను నీపయిఁ ♦ గ్రక్కకుండు. ౨౧౫

ఉ. అర్ణవమేఖలావలయ ♦ మంతయు సాచలపత్తనంబుగాఁ
దూర్ణము కైవసం బగుడుఁ ♦ దోయజలోచన! నీకుఁ బట్టికిర్
దుర్ణయవృత్తి రాఘవుఁడు ♦ ఘోరవుఁగీడు ఘటించు నమ్ముమీ;
నిర్ణయమిద్ది, దైన్యమును ♦ నీకుఁ బరాభవ మేల తప్పెడిన్? ౨౧౬

కం. నీసవతికొడుకు రాజ్యశ్రీసహితుం డైన భరతు చేటు నిజం బా;
నీసుతుఁడు రాజ్య మేలఁ బ్రవాసిగ రాముండుగా నుపాయముఁ గనుమీ. ౨౧౭

కైక మంధరను శ్రీరామపట్టాభిషేకము విఘ్నము సేయ నుపాయ మడుగుట.

చం. అనవుడుఁ గోపరక్తనయనాంబుజ యై, నిడువేఁడియూరుపుల్
గొన లిడఁ, గేకయాత్మభవ కుబ్జఁ గనుంగొని పల్కె, నిప్పుడే
వనములపాలు సేసి రఘువర్యుని రాముని, యౌవరాజ్యమున్
దనువుగ నిల్పఁ జేసెదను దొయ్యలి చెప్పర నాతనూభవున్. ౨౧౮

ఉ. ఏవిధి నైన రాజ్యపదహీనునిఁ జేయఁగ రామచంద్రు, గో
త్రావిభుతాతిరేకమున రాజిలఁ జేయఁగ నాతనూజు, నా
కేవెర వొప్పఁ జెప్పఁ గదవే సదుపాయ మొకండు మంధరా!
నావుడుఁ బాపకార్యరచనాచణ మంధర కైక కిట్లనన్. ౨౧౯

చం. బళిర బళీరె యొండుసదుపాయము నీసుతుఁ డొందు రాజ్యముం
దెలియఁగ లేవుగా, యిదియుఁ దెల్పెద విన్ము, భవద్ధితార్థముం
దెలిసియు విస్మృతిం గనితొ? తెల్పక దాఁచెదొ నీ వెఱింగియుం?
జెలువరొ నీవె పూర్వమునఁ జెప్ప వొకో పలుమాఱు నర్థిలిన్. ౨౨౦

కం. నామాట వినఁగ నభిరుచి, భామిని! నీ కున్న దేని పలికెద నుపమం[1]
ధీమతి వై విను సర్వం, బామీఁద విమర్శ సేయుమా యొక ననుచున్ ౨౨౧

చం. పలికెడికుబ్జఁ గాంచి తనపానుపునుండి యొకింత లేచి తొ
య్యలిమిహి దాని కిట్టులను హర్షవికాసముఖారవింద యై
పలుకవె మంధరా! యొకయుపాయము నాసుతుఁ డే ప్రభుత్వ మీ
యిలకు వహింపఁగా జనకజేశుఁడు కూడనె కూడ దెట్టులున్. ౨౨౨

కం. అనఁ గైక పాపదర్శిని, విని మంధర రామచంద్రువిభవాతిశయం
బును జెఱుపఁ గోరి యిటు లను, దన దేవికి హర్ష మగ్నఁ దళు కొత్తంగన్. ౨౨౩

మంధర కైకకు రామపట్టాభిషేకము విఘ్నము సేయ నుపాయంబుఁ జెప్పుట.

ఉ. రాజును నీవు పోరె సురరాజు సహాయతఁ గోర, దేవతా
రాజియు రాక్షసాళి సమరం బొనరింపఁగ శక్రు శంబరుం
డాజి జయింపనుండ శమనాశను దండకఁ బట్టిశాత్రవో
ద్వేజకవృత్తి డాయఁ బరవీరపురంబగు వైజయంతమున్. ✓ ౨౨౪

[1]ఉపమ = ఉపాయము.

కం. దేవాసురరణమున ధాత్రీవల్లభుఁ డొసంగినట్టి ♦ రెండువరంబుల్
నీ వతనిం దలఁపించిన, నీవలచిన కార్య మెల్ల ♦ నెఱవేఱుఁ జుమీ. ౨౩౩

ఉ. లాలన చేసి నిన్ను సువి♦లాసిని తీర్చెదఁ గోర్కు లన్న భూ
పాలుని సత్యపాశచయ♦బద్ధునిఁ దొల్త యొనర్చి వేఁడుమీ
లీల నరేంద్ర! రాముఁ దర♦లింపుము వే పదునాలుగేం డ్లర
ణ్యాళిఁ జరింపఁగా, భరతు ♦ నావటఁ బట్టము గట్టు ధాత్రికిన్. ౨౩౪

ఉ. రాము నరణ్యవాసమున ♦ రాజముఖీ! చలపట్టి కోరుమీ,
రాముఁడు కాన కేగ సుక♦రం బగు సర్వము, నీతనూజుఁ ద
న్వీ! మఱి గొల్చు మూలబల ♦ మెల్ల ప్రసన్నం బగుభక్తిభీతులన్,
రాముఁడు కానలోనన వి♦రామతి[1] నొందు నిజంబు చూడుమీ. ౨౩౫

శా. కాదే రాముఁడు వచ్చెఁబో మరలఁ గై♦కా! యింతలో లోకులన్
మోదస్ఫీతులఁ జేయు నీసుతుఁడు, సం♦పూజించుఁ బూజ్యాళి, సం
పాదించున్ నవమిత్రకోటి, దృఢ మై ♦ పాఁతొందు రాజ్యంబు, దే
వీ! దూరంబుగ భీతి నెట్టి వరము♦ల్వేఁడంగఁ గాలం బిదే. ౨౩౬

కం. కావున రాముని రాజుఁగఁ, గావింపఁగ నీకు మున్నఁ ♦ గైకేయి భృశహ
ర్షావిష్టచిత్త యగుచుం, దా విష మగునగ్గ మెంచెఁ ♦ దనహిత మనుచున్. ౨౩౭

కం. కాకాని తెరువుగాం జనఁ, గోరిన గోడిగవిధానఁ ♦ గొని విస్మయమున్
జాఱువిలోచన తమి పెం,పారఁగ ని ట్లనియెఁ గుబ్జ ♦ కలమోదమునన్. ౨౩౮

కైక మంథరను మెచ్చుకొనుట.

ఉ. కుబ్జ! యెఱుంగ నింతవఱ♦కున్ నిను నింతటిప్రోడ వంచు నేఁ,
గుబ్జలు లేరె ధారిణి? నొ♦కొక్కక యోనియు నీకు సాటియే?
యబ్జహితాన్వవాయపరు♦నాశయ మింతె కెఱుంగి నన్, న
న్యబ్జమదీయశోభనము ♦ నొక్కతె పి వెస నిల్పినావుగా. ౨౩౯

ఉ. వంకరటింక లైనయవి♦వల్ పలుగుజ్జులు లేర, యిస్సి యిం
వంకఁ గనుంగొనంగ మది ♦ నచ్చునె, ఘోరవికారదేహలన్,
గొంకిరిబింకిరి న్నయిని ♦ గూడి కుము గాలికి వంగి యున్నమే
ల్పంకజమున్ హసించెడు వి♦లాసమునం ప్రముకర్ణనాల్చినన్. ౨౪౦

కం. యావత్స్కంధసమున్నత,మై వఱలు నురంబుఁ గాంచి ♦ యఱుఁగువ బహుళ
జ్ఞావిష్కృతినొ సునాభం, బై వెలసెడియుదరమూది ♦ యాలు సన్నగిలెన్. ౨౪౧

చం. నలువుగఁ బూర్ణ మైనజఘ♦నంబును నుబ్బిగిబ్బిగుబ్బలు
న్వలపునమూనవిగ్గ[illegible]♦నీలసరోజహిత[illegible]ముల్

[1] [illegible]

గలరశనాగుణాకలిత♦శ్రోణినితంబము, స్నిగ్ధజంఘలుం,
బలుచనిదీర్ఘపాదములు, ♦ మంథర! యెంతటి యందగత్తెవే! ౨౪౨
ఉ. తెల్లనిచీర గట్టి, కడు♦దీర్ఘము లైనతొడల్ వెలుంగఁగ,
ద్రెళ్ళగ నాదుముందటను ♦ నీవు చనఁ, బ్రవరాజహంసినాఁ
జెల్లుదు; శంబరుండు ♦ చేసె! సహస్రము నేర్చె మాయలన్,
గొల్లలు వేనవేలు గదె ♦ కోమలి నీయెడఁ దక్కుమాయముల్. ౨౪౩
కం. గురురథఘోణాయత మై, పరఁగెడి నీదీర్ఘ మైన♦వక్షముపందున్
ధరణిపనీతులుఁ గుట్రలుఁ, దిరముగ నెలకొనుట నేఁడ ♦ తెలిసితిఁ గుబ్జా! ౨౪౪
చం. భరతుఁడు యౌవరాజ్యపద♦పట్టముఁ గట్టుకొనంగ, రాముఁడున్
సరగున కానకేగినను, ♦ జాన! భవద్ఘనకుబ్జమున్ జుట్టెదన్
వరమణి దామపంక్తి, నద♦నంబున దిద్దెదఁ జిత్రకంబు, నా
భరణము లెంతొ మేన, శుభ♦వస్త్రము లిచ్చెద నీకుఁ గట్టఁగన్. ౨౪౫
తే. అబ్జబింబంబు నెకసక్కె♦మాడు చున్న, నిస్తులాసన మునుగంగ ♦ నిర్జరసతిఁ
బోలి కానిజనంబులఁ ♦ బోలఁ జూచి, గర్వమున ధిక్కరింపఁగఁ ♦ గలవు నీవు.
కం. ఏవేళ నన్నుఁ గొలిచెడి, యావడువునఁ గుబ్జ లెల్ల ♦ ననవరతంబున్
నీచరణద్వితయ లై నీ, సేవం జేయంగ మిగులఁ ♦ జెలఁగెదు కుబ్జా. ౨౪౬
ఆ. వేది జాతవేదు[1]♦విధమునఁ దెల్లని, తలిమ మందుఁ బండి ♦ తన్నుఁ బొగడు
కైకఁ జూచి కుబ్జ ♦ గతజలసేతుబంధమ్ము గాదె మిగులఁ ♦ దడవు సేయ. ౨౪౭

కైక కోపగృహముఁ జొచ్చుట.

కం. లే లెమ్ము నృపతివచ్చెడి, వేళకు సరి యెదురు చూడు ♦ విధుముఖి యన నా
లోలాక్షి లేచి మంథర, తో లీలం గోపగృహము ♦ దురుసుగఁ జొచ్చెన్. ౨౪౮
ఉ. కామిని స్వాభిరూప్య[2]భవ♦గర్వవికారవిలోలితాత్మ యై
భూమిపుఁ డింత చేయఁ బని♦పూనెఁ గదా యని క్రుద్ధచిత్త యై
భామహితంబు లైనమణి♦భర్మవిభూషణపల్లవంతికా
స్తోమము తారహారములు ♦ త్రోపుడు వెట్టి పచించెఁ గుబ్జకున్. ౨౫౦
ఉ. మన్నియనుంబు కుబ్జ! విను♦మా, రఘురాముఁ డరణ్యసీమకున్
జన్న మహీయపుత్త్రుఁడు వె♦సన్ ధరణీశ్వరుఁ డైనఁ గానలేన్,
వన్ను నుపేక్ష సేయుజన♦నాథునకున్ మది సంతసిల్లఁగ
న్నెన్నన నాదుచావు నయి♦నం బలుక న్వలె నీవు మంథరా! ౨౫౧
కం. రామునకే యభిషేకము, భూమీశుఁడు చేసె నేని ♦ భువి సంతయ చు
మ్మీ మజ్జీవిత; మేటికి, నీ మణులును భూషణములుఁ ♦ జేలలుఁ జైఁకుల్. ౨౫౨

[1] జాతవేదుఁడు — అగ్ని. [2] అభిరూప్యము = సౌందర్యము.

చం. అనవుడుఁ గ్రూరవాక్యనిపు♦ణాత్మిక యానృపుదేవిఁ గాంచి యి
ట్లను రఘురామచంద్రునకు ♦ నత్యహితంబుగఁ గుబ్జ భామినీ!
వినుము ధరాత్మజాధవుఁడె ♦ విశ్వవిభుం డయినన్ స్వతంబుగాఁ
గనదరు నీవు నీసుతుఁడు ♦ కష్టములన్, మఱసంగిఁ బోకుమీ. ౨౫౩

ఉ. కావున నీసుతుం డరుణ♦కంజముఖీ! విభుతం దలిర్పఁగా
భావన సేయు మంచు బహు♦భంగుల బోదన సేయ వాక్యబా
ణావళితాడితాత్మ యయి ♦ హస్తములన్ హృదిఁ జేర్చి, కోపవే
గావిలచిత్త యై, విభుఁడు ♦ హా యిటు సేయునె యంచు నెంచుచున్ ౨౫౪

కం పొగడును మంథర మఱిమఱి, తెగడును నిజభర్త నవుర ♦ తెగ నెంత కయో
మగఁ డని ప్రియుఁ డని నమ్మిన, నగ పిడియె నె యనుచుఁ గుబ్జ♦వంకం గనుచున్

ఉ. ఇక్కడనుండి కుబ్జ! విను ♦ మేగెద సంయమనీపురంబునుం
ద్రొక్కఁగ నొండె, నొండె భర♦తుండు ధరాతలరాజ్యసంపదన్
నెక్కొన, రామచంద్రుఁడు వ♦నీస్థలిఁ గ్రుమ్మర దీర్ఘకాలమున్
గ్రక్కున నాకనుల్ చలుప♦గా నరుగం గనుఁగొందు మంథరా! ౨౫౫

శా. నేనా పండను బాన్పునందుఁ జెలియా, ♦ నే మాల్యముల్ దాల్పనే,
నానేత్రంబుల దిద్దఁ గాటుకను, బా♦నం బేని నన్నంబు నేన్
జే నంటన్, మఱి చందనంబు నలఁదన్ ♦ జీవింతు నం చెంతు వా?
నే నారాముఁడు కాననాళిఁ దిరుగ ♦ న్రే పే ప్రయాణింపఁ జేన్. ౨౫౬

చం. అని బెడిదంబులం బలుకు ♦ చాయలివేణి నిరస్తభూష యై,
జనితరుపాతిరేకఘన♦సంతమసావృత వక్త్ర యై, గృహా
వని నునుసెజ్జ[1] లేక మెయి ♦ వ్రాల్చి ధరం బడి కిన్నరిం బలెన్
దనరెను దారికల్ మలుగ ♦ దట్టపుఁజీఁకటి పర్వ మిన్నునన్. ౨౫౭

శా. ప్రేరింపం దనుఁ బాప మంథర ధరి♦త్రిన్ దిగ్ధబాణావళీ
ధారావిద్ధమనోజ్ఞ కిన్నరివలెం ♦ దాఁ ద్రెళ్లి కార్యంబు తీ
రాన్ నెమ్మది నిశ్చయించుకొని కు♦బ్జాస్యంబుఁ గన్గొంచు మేల్
గూరం జేసితి లెస్స చేసి తనుచుం ♦ గొండాడి[2], హర్షంబునన్ ౨౫౮

ఆ. పాఁపపాప[3] వోలెఁ ♦ బుసఁలి నిట్టూర్పులు
సెగలువాఱఁ దనదు♦చింతితంబు
సాంత మగునొ కాదొ ♦ యని సందియము గొని
యాత్మహితముఁ దలఁపు♦నందుఁ జేర్చె ౨౬౦

---

[1] సెజ్జ — పానుపు. [2] కొండాడి = పొగడి. [3] పాఁపపాప = ఆఁడుపాము.

ఆ అర్థకామ కుబ్జ యూహించినట్లు నిశ్చయించి యంత నగుచు తనకుఁ గార్య
సిద్ధి యైనయట్లు ♦ చెలఁగుచు నెమ్మది, నధికహర్ష పులకితాంగి యయ్యె. ౨౬౧
ఆ. కలికి నిశ్చయించి ♦ కార్యసిద్ధిం జెల్లు, మహితక్రోధ ఘూర్ణ ♦ మాన యగుచు
బొమలు ముడివడంగ ♦ భూమిపైఁ బ్రస్థించు, నుస్సురనుచు లోన ♦ నుదిలకొనుచు
కం. ఎగఁజల్లె నెల్లయెడ నానగుగుల మహాభరణములను ♦ మాల్యచయంబుల్
దిగువఁబడ నవియు ధాత్రి, జిగి మీఱె సతారనభము ♦ చెన్ను రహింపన్. ౨౬౩
కం ఒకటిగఁ బెనసినజడతో, వికట భ్రూవల్లితోడ ♦ విస్మృతాకృతితో
వికలాలంకృతితోఁ గాముక మాసినచీరతోడఁ ♦ బుడమిం బండెన్. ౨౬౪

దశరథుఁడు పట్టాభిషేకవార్తఁ దెలుపఁ గైకగృహంబునకుఁ బోవుట.

తే. అంత దశరథవసుమతీ ♦ కాంతుఁ డపుడు, రామపట్టాభిషేచన ♦ క్రమము దీర్ప
నాజ్ఞ గావించి గురువుల ♦ యాజ్ఞ పొంది, శయనవేశనమును జొచ్చె ♦ మనము పొంగ.
కం. రామాభిషేకవార్తయు, భూమి నిపుడ ప్రకట మయ్యెఁ ♦ బో, కైకేయీ
కామినికిఁ జెప్పవలదే, యే మున్నగఁ బోయి యనుచు ♦ నెంచుచు నృపుఁడున్
చం. ప్రియముఁ బ్రియార్హకుం దెలుపఁ ♦ బ్రేముడి జొచ్చె సితాభ్రభాసిరా
హుయుతనభంబుఁ జొచ్చు నల ♦ యుష్ణమయూఖభంగిఁ గీరికా
చయకలకంఠ కేకిరవ ♦ సాంద్రము వాసనికాయులంబు న
వ్యయసుమభారశోభితల ♦ తాంచితమున్ గనుమందిరంబు నై ౨౬౫
కం. రాజితదాంతకనకవేదీజుష్టము నిత్యపుష్ప ♦ దీపిత ఘన
దూర్వాజాన్వితము సుమనోహరలతాజాలసుశోభితంబు ♦ త్రిదివనిభంబున్ ౨౬౬
ఉ. క్రౌంచనినాదసంయుతము ♦ రాజితదాంతసువర్ణపీఠికా
సంచయరాజితంబు నవ ♦ చంపకశోభితచిత్రవల్లికా
భ్యంచిత మన్నపానశుభ ♦ భక్ష్యసముల్లసితంబు ప్రోదిరా
యంచల నాదు పెంపున ద ♦ తాదికవాద్యనినాదహృద్యమున్ ౨౬౭
కం. అగునంతఃపురవర మా, నగధిపుఁడు చొచ్చి కాము ♦ నారాచములన్
బెగ డొందితి శయనతలమున, మృగలోచన నెమకి కాన ♦ కెంతయుఁ జింతన్
కం. సతి యెన్నండాపనుయము, సతిసన్నిహించుటయు లేమి ♦ క్ష్మాధిపుఁ డపుడా
గతి శూన్యగృహముఁ జొచ్చిన, పతిసుంతికు మున్న లేమి ♦ వికలాత్ముం డై. ౨౭౧
సీ. ఎన్నఁడే నీవేళ ♦ నెక్కడికేగదు, పూర్వ నిరాచిగురాకుఁ ♦ బోణి నేఁడ
యెచ్చటి కేగెనో ♦ యెక్కటి యని స్వార్థపరయు మూఢయు నయి ♦ వనరు చుంట
యెఱుఁగ కానంతయుఁ ♦ బృన్నమనుమును ప్రతీహారిని గైక యెం ♦ దరిగె ననిన
నదియు భయంబున ♦ నా సుమ్ము [illegible] నిల్వె, వినవమ్ము బోయె బల్కు ♦ విసవిసగను

వారక కాశిఁ గోసలను ♦ వంగముఁ నందు జనించు నెవ్వియేఁ
గోరుము నీ కొసంగెదను ♦ గోమలి నాసుకృతంబు సాక్షిగన్. ౨౮౧

కం. లేలె మ్మాయాసం బిది, యేలా యోభీరు! పల్కు ♦ మేగతి భీతిన్
వ్యాలోలత్వము గలిగెను, బ్రాలేయముఁ దరణిపోలె ♦ భంజింతు వెఱన్.

కం. అని యూఱడఁ బల్కినఁ దన, మనమునఁ గలవాంఛితంబు ♦ మనుజేంద్రునకున్
వినిపింపక మును నాతని, వనటన్ మఱి మఱియుఁ ద్రోయ ♦ భామిని దలఁచెన్.

## కైకకోర్కె నెఱవేర్చెద నని దశరథుఁడు ప్రమాణము సేయుట.

కం. అలరులవిల్తుని సెలక,ట్టెల పోటుల కోప కిటు క ♦ డింగి నెతఁ నా
కులపతివల్లభుఁ గని యా,చెలున కుటిలవచనసరణిఁ ♦ జెప్పెం గఱకుల్. ౨౮౪

ఆ. తెగులుగొంటి గాను ♦ దేవ! నా కవమతి, సేయ రెవరు; నీవ ♦ చేయు వలయు
సఫల మొందుకోర్కె ♦ సలుప నిష్టము యేని, బాస చేసి తేని ♦ పలుకుదాన.

చం. అనఁ జెఱునవ్వు నవ్వి మద ♦ నానలవర్ధమనస్కుఁ డైన యా
జనపతి తత్సతీశిరముఁ ♦ జెయ్యున నంకముఁ జేర్చి వేసలిన్
దనకరపల్లవంబున ము ♦ దంబున నంటుచుఁ బల్కెఁ గామినీ!
కనుఁగొన లేవుగా నిజము ♦ గర్వితురాల! మదీయచిత్తమున్. ౨౮౬

కం. వనితా! జగముల నీకం,టెను బ్రియతమ యొండు గలదె ♦ నెమకిన[1] యేనిన్
మనుజతతిఁ బురుషసింహుని, మనరామునికంటెఁ బ్రియుఁడు ♦ మఱి నాకున్నే.

కం. అపరాజితుఁడును ముఖ్యుఁడ,కృపణుండును జీవనాథ్యుఁ ♦ డింతీ! రఘువం
శపతి యగురాముమీఁదను, శపథము చేసెదను జెప్పుమ ♦ సలుపుదుఁ గోర్కెన్.

కం. తపియించి యొవని మూర్తము, చపలాక్షీ! కనక యున్న ♦ సత్యము బ్రతుకన్
విపులను,[2] నారామునిపై, శపథము చేసెద నొనర్తు ♦ సతి! నీపలుకున్. ౨౮౯

కం. వపువు[3] దొఱంగెద విడిచెదఁ, గృపలే కన్యాత్మజులను ♦ శ్రీరామునికై
నృపవరుఁ డగురామునిపై, శపథము చేసెద నొనర్తు ♦ సతి! నీపలుకున్. ౨౯౦

చం. సరసిజనేత్ర! నామనము ♦ చంచలము నింత యెఱింగి బాగుగా
నరసి మదీయవాఙ్మనస ♦ మైక్యము నొందుట నీదుకోరికల్
సరగునఁ జెప్పుమీ, బ్రదుకఁ ♦ జాలఁ జుమీ, నను నుద్ధరింపుమీ,
పొరిగ నెఱింగి యాత్మబల ♦ ముం దగునే యిటు సంశయింపఁగన్? ౨౯౧

కం. నాసుకృతము సాక్షిగ నే, బాస యొనర్చెదను నీదు ♦ వాంఛిత మొనరన్
జేసెద ననఁ గైక సము,ల్లాసభరవికాసమాన ♦ లపనాంబుజ యై. ౨౯౨

తే. ఆత్మసంకల్ప మనుకూల ♦ మయిన యట్లు, రాజుభావం బెఱింగి యా ♦ రమణి మధ్య
వర్తి యెవ్వరు లేమి న ♦ భ్యాగతాంత,కోపమోహస్థుఁ నా క్రూర ♦ యువతి పలికె, ౨౯౩

---

1 నెమకిన — వెదకిన. 2 విపులను — భూమిని. 3 వపువు — దేహము.

చం. జనవర! బాస మున్నుగ నొ◆సంగెద నంటివి కోర్కి, నీనుడుల్
వినియెడువారు గాక పృథి◆వీరవిచంద్రనభస్తమస్వినీ
దినశుచిపూర్వకాదితిస◆తీసుతభూతదిశాభవన్నికే
తనవరదేవతల్ మఱియుఁ ◆ దక్కటిపుణ్యములుం నిశాటముల్. ౨౯౪

కం. పనయుఁడు ధర్మజ్ఞుఁడు సత్యనిరతుఁడుఁ స్వస్థచిత్తుఁ ◆ డగునాథుఁ డొసం
గెను వరములు దయతోడ, న్వినుఁడీ దేవతలు! ధారి◆ణీవరుపలుకుల్. ౨౯౫

కైక తనపూర్వవరములవృత్తాంతము దశరథునకుఁ జెప్పుట.

చం. అని సతి బిగ్గఁ జెప్పి వసు◆ధాధిపుఁ గామవిమూఢు సత్యపా
శనికరబద్ధుఁ జేసి యను ◆ స్వాధవ! సంస్మృతి కింత తెచ్చె దే,
మును సమరామరాసురస◆మూహము పోరెడివేళ వైరిబా
ణనిహతి నీవు సోలఁ గద◆నంబునఁ గావనె యప్రమత్తతన్? ౨౯౬

కం. నీవే వరముల రెంటిని, నీవే యానాఁడు; వాని ◆ నిపు డిమ్మా, ధా
త్రీవర! సరసత నీయక, యీ వవమతి సేయఁ జత్తు ◆ నిప్పుడ వింటే. ౨౯౭

కం. వరయుగ మనునిక్షేపము, ధరణీశ్వర! నీదుకడన ◆ దాఁచితి, దానిం
మరలం గైకొనఁ గోరుచు, వరసెన నీయం దొసంగు◆మా నా కనుచున్ ౨౯౮

కం. పలికినమాత్రంబున నే, వలలోనికి నుఱుకు లేడి◆వడువున నవలా
వలలం బడి సతి కనియెం, దలఁచితి నిచ్చితిని మరలఁ ◆ దరుణీ! యనుడున్. ౨౯౯

కం. నీ వానాఁట నొసంగిన, యావరముల రెంటి నిప్పు ◆ డడిగెద తేఁడా
నే వివరించెద వానిని, నీ వాలింపుము ఋతంబు ◆ నిలుపుము బుద్ధిన్. 300

కైక భరతుపట్టాభిషేకము రామప్రవాసము వరంబులుగఁ గోరుట.

కం. శ్రీరామునియభిషేకస,మారంభము నాఁపి తత్సు◆దార్థంబులతో
నారఁగ నాసుతుసభిషే,కారంభము జరగవలయు ◆ నది యొండు సుమ్మీ. ౩౦౧

కం. సింహమతి దైన్యనిర్గత,చండ్రాహాసమందు నీ వొ◆సంగినవరమా
రెండవది కోర నిపు డో,చండాంశుకులావతంస ◆ సమయము వచ్చెన్. ౩౦౨

ఉ. నారలు గట్టి, జింక యజి◆నంబు ధరించి, జడల్ వహించి, సీ
తారమణుండు దండకను ◆ దాపసుఁడై పదునాలు గేండ్లు సం
చారము సేయఁగా వలయు; ◆ క్ష్మాప! యకంటకయౌవరాజ్యముం
గూరెడుఁ గాక నాసుతుని◆కుం; బరమార్థము లివ్వి నామదిన్. 303

కం. మున్నొసఁగినయవి యే, నిన్నిప్పుడు గోరు టయ్యె ◆ నేటి శ్రీరాముం
బన్నుగ నిప్పుడ నే నీ,కన్నులఁ జూడంగ వలయుఁ ◆ గానకుఁ బోవన్. ౩౦౪

ఛం. ధరణిని రాజరాజన బ్రతధారసితుండవు, గాన సత్యసం
గరుఁడవు గమ్ము, నీకుల మహత్త్వసుశీలము నీసుజన్మముల్
నరముశీఁ గాచుకొమ్ము, వినవా యిహమందు బరమ్ము ననుచింపఁగా
నరులకు సత్య మే శరణంబగు మునివర్యులు సత్యభాషలా! ౩౦౬

→ కైక గోరినవరంబుల విని దశరథుండు పరితపించుట. ←

తే. అన మహారాజు కైకేయి యధికదారుణోక్తు లాలించి తహతహ నొంది మిగులఁ
జింతచేఁ గుంది మూర్ఛంబు సేపు తేసకుఁ, దాన యి ట్లనుకొనుఁ గడుఁ బశ్చాత్తపమున.

ఉ. హా యిది యేమి నాకుఁ గలయా? మతిమోహమొ? పూర్వజన్మమం
దే యనుభూత మైనకృతి యీగతిఁ దోఁచెడినా? మనోరుజా
వ్యాయతియా? యటంచు వసుధాధిపచంద్రుఁడు లోఁ దలంచు చ
త్యాయతచింతఁ గుంది యతిదారుణదుఃఖము దన్నుఁ బ్రక్కఁగన్ ౩౦౭

ఉ. దేవిపల్కుముల్కులహతిం బడి సోలియు లబ్ధసంజ్ఞుఁడై
యావిభుఁ డెట్టకేని నొకయించుపులిం గనుఁగొన్న లేడి యు
ట్లై వికలుండు దుఃఖితుఁడు నై చు ససంభృతధాత్రినుండె మం
త్రావళియంత్రరుద్ధభుజగాకృతి దీర్ఘపుటూర్పు లూర్చుచున్ ౩౦౮

కం. కోపంబున హా ఛీ యని, భూపాలుం డాడి శోకమున మూర్ఛితుఁడై
ప్రాపించి తెల్విఁ గనుకం, జూపుల జూడి విభాన సుందరి కసిగొనుచ్. ౩౦౯

→ దశరథుఁడు కైకను దూషించుట. ←

ఉ. ఓసి దురాత్మురాల! యయయో యదియెంతటిగట్టివాయి[1]వే,
యీకుజనస్తుతాన్వయము నింకఁగఁ జేయఁగ రాతగుండెదా
వా! నను దెంచితే యిటకు నాయుతే నేనియు రామునందు నే
వీసముఁ బాప మున్న ననవే కత మే మిటు ద్రోహ మెంచఁగన్. ౩౧౦

ఉ. తల్లినిభోలెఁ జూచును గదా నిను రాఘవుఁ డెల్ల వేళలం,
దుల్లములోన నీచెనఁటి యుద్యమ మేటి కొనర్పఁ బూనితే?
పెల్లువిషంబుఁ బాము నిటు పీఁకిఁడి నై నృపకన్య యు బ్రమం
బొల్లునడంగ నాదుగృహమును జొర నిచ్చితిఁ జేటు దెచ్చితిన్ ౩౧౧

కం. ఎల్లపుడు జీవలోకము, సల్లలితగుణాఢ్యు రామచంద్రునిఁ బొగడన్
చెల్లుగ; నేమి నెపం బిడి, కల్లని త్రిగు రనురాజుఁ గానకుఁ బనుతున్? ౩౧౨

కం. విడిచెదఁ గౌసల్యను సిరి, విడిచెదను సుమిత్ర విడుతు విడిచెద నను తేఁ
విడుపను బితృవత్సలు నో, పడఁతీ! మరి నమ్ము రామభద్రు సుశీలున్. ౩౧౩

---

[1] గట్టివాయి = గయ్యాళి.

కం. శ్రీరాముఁ జ్యేష్ఠపుత్త్రుఁ గ,న్నారం గనఁ గనఁగఁ బ్రీతి ♦ యూఁగుబ్బతిలుఁ[1]
నా రాముఁ బిడిచి బ్రతుక, న్నేరుతు నే చెనఁటి! యొక్క ♦ నిమిషం బైనన్? ౩౧౪
కం. సూరుండు[2] లేక లోకము, నీరమ్ములు లేక పైరు ♦ నిలుచు క్షణంబేఁ;
నా రాముఁ బాయ జీవం, బేరీతిని నిలువ నేర్చు ♦ నే నాయుపలన్. ౩౧౫
తే. ఏటికే యింతఘోర మై ♦ గాట మైన, పాపకార్యంబుపందు నర్ ♦ బట్టుపఱుప?
మానవే దీని నోసి దు♦ర్మార్గురాల! కాళ్ల నైనను బడియెదఁ ♦ గావు నన్ను. ౩౧౬
సీ. పడఁతిరో భరతుని ♦ పై నాకు నెయ్యంబు, గలదో లేదో యని ♦ కనుఁగొనంగ
దలఁచి కోరితి గాక ♦ భరతాభిషేకంబు, పేర్మి రాముండు నా ♦ పెద్దకొడుకు
శ్రీమంతుఁడును మఱి ♦ జ్యేష్ఠుండు ధర్మంబు, సం దనియిచ్చునా ♦ లాఁడి తీవు
మున్న ది యుపచార ♦ ముసకటు గాకున్న, శ్రీరాముఁ డొనరించు ♦ సేవకోటికో
తే. యతనిపట్టాభిషేకస్పృ ♦ హాంత మిప్పు, డాలకించి వ్యధాభరి ♦ తాత్మ నగుచుఁ
గరము నను గోడుగుడిపెదు ♦ కరినురాల! పరుషమాటలు వినిచొచ్చి ♦ పాడుగృహము.
తే. నీతిమతి నగునీకు దు♦ర్నీతితోడ, మతివికారము గలిగిన ♦ కతనఁ జేసి
వనిత! యిక్ష్వాకుసన్నుత ♦ వంశమునకుఁ, జేటుఁగాలంబు వచ్చెను ♦ జెడియె నీతి.
తే. ఇంతకును బూర్వ మెన్నఁడే ♦ నింతయైన, నప్రియం బైన ననుచిత ♦ మైనఁ బలుక
విప్పు డీ విటు సేయుదే ♦ యేటిమాట, నేను నమ్మంగఁ జాలనే ♦ నీరజాక్షి! ౩౧౯
తే. భరతునట్టేడ శ్రీరామ ♦ భద్రుఁ డనుచు, నెన్నిమాఱులో నాతోడ ♦ నీవ యనవె?
యట్టిధర్మాత్ముఁ డేగతి ♦ నడవులందు, నవయఁగా నేర్చునే పదు ♦ నాలుగేండ్లు? ౩౨౦

⟶ దశరథుఁడు శ్రీరామునిగుణముల వర్ణించుట. ⟵

కం. రాముఁడు సుకుమారుఁడు సదయ, ధాముఁడు జనహితరతుండు ♦ ధర్మాత్ముం డో
భామ! భవదీయశుశ్రూ, షామహనహితుం డడవుల ♦ చనఁ గానలకున్? ౩౨౧
చం. భరతునికంటె రాముఁడు భ♦వత్పరిచర్యల మేలుచేయు, నే
సరసియుఁ గాన నీ వయిన ♦ నాఁడును విందును రామకంటె నీ
భరతునియందు నిగ్గొలుచు ♦ సద్విశేషము లేమి కంటివో,
పరమతి రాముఁడుండ విపిన ♦ వాటి విషం బగిసట్టిపుత్త్రుఁ డే? ౩౨౨
కం. సారమతిఁ బూజసేత స, పారగురుశుశ్రూషప్రమాణ ♦ వచనక్రియలన్
శ్రీరామునికంటెను ని, న్నే రే భజియించువారు ♦ హెచ్చుగఁ దరుణీ? ౩౨౩
ఉ. వేలకొలందు లైనయతి ♦ వేఁడులు నేఁ బనికత్తెలందు నేఁ
బ్రేలు మడంచి చెప్పఁ గల ♦ వే యొకచేడియ యైన నెన్నఁడేఁ

[1] ఆగుబ్బతిలుఁ = అతిశయించును. [2] సూరుఁడు = సూర్యుఁడు.

వాలుగకంటి! యొండుపదివావముసే నపవాద మేనియు
స్త్రీలకునైన రాముపయి ♦ నీకు వచించియ యున్నె గామినీ? 3౨౪

కం. అకలుషమతిచే రాముఁడు, సకలంబగుభూతతతికి ♦ సాంత్వోక్తులచేఁ
బ్రకటాభీష్టుఁడై త్యాగకలన లోకులను జేయుఁ ♦ గైవసపఱఁగన్. 3౨౫

కం. నరసత్యంబున లోకోత్కరము, దరిద్రులను నీవిఁ ♦ ధగుశుశ్రూషన్
గురుజనముల, సంగరమునఁ బరులం దనవింట, రామ♦భద్రుఁడు గెలుచున్. 3౨౬

కం. నరసత్యము దానంబును, గురుతపమున్ శుచిత మైత్రి♦గుణ మార్దవమున్
గురుసేవ విద్య త్యాగము, స్థిరముగ నారామునందె ♦ చెలఁగుచు నుండున్.

కం. ఆర్జవసంపన్నుండును, నిర్జరతుల్యుఁడు మహర్షి♦నిభ తేజుం డ
త్యూర్జితయశుఁ డగురాముఁడు, వర్జింపఁగఁ దగినయట్టి♦వాఁడే దేవీ? 3౨౭

కం. అప్రియవాక్యంబును జగ,తీప్రియుఁ డగురామునకై మ♦నింప దలఁపఁగ లే,
నాప్రియపుత్రు న దెట్టులు, నిప్ప్రేరణ నప్రియంబు ♦ నే వచియింతున్? 3౨౮

దశరథుఁడు కైకను వేఁడుకొనుట.

తే. క్షమయు దమమును త్యాగంబు ♦ సత్యరతియు
ధర్మముఁ గృతజ్ఞతయును భూ♦తంబులందు
నెల్ల దయయును గలుగుసీ♦తేశుఁ బాపి
లేని యయ్యయొ నాగతి ♦ యేమి చెపుమ? 330

కం. హామ్మనియెడి వీ డిటు రా,రమ్మనియెడిఁ గాదు నన్ను ♦ రమణీ! ముదుకన్
జమ్మి తపస్విని దీనుం,డ మ్మతిమతి వేఁడువాఁడ ♦ ననుఁ గావఁగదే. 33౧

కం. జలనిధిపర్యంతము గల, యిల లభ్యం బయిన గన్ ♦ యేనియుఁ గొన కేఁ
గలధన మంతయు నిచ్చెద, నలుగకుమీ తరుణి! నను ద♦యామతిఁ గనుమీ.

ఉ. అంజలి చేసి మ్రొక్కెదను, ♦ సంస్తుల నైన స్పృశింతు, రామునిం
దం జేలపట్టఁబోకు ముది♦తా! శరణం బవు గమ్ము వానికిన్,
నంజలి మాన్పు, మి ట్లయిన ♦ నేర దధర్మము నన్ను సోఁక నం
చుం బపచర్యఁ దత్యధిక♦శోకరసాంబుధిమగ్నచిత్తుఁడై 333

కం. సోలున్ ధరపయి మూర్ఛల, వ్రాలున్ మఱి లేచు శోక♦వారిధికూలం
బేలాగు నైనఁ జేర్పవె, బాలా! యను నిట్లు వగచు♦పార్థివుఁ గనుచున్ 33౪

కైక దశరథుని దూషించుట.

ఉ. చేసితి రోషభీషణవి♦శేషభయప్రదవాక్యయుక్తయై
యాడెఁ, నొసంగువాఁడ నని ♦ యాసి వరంబులు నేను గోర ని

ళ్లెడుచు చున్నవాఁడ నగు♦నే? యిఁక మీఁదట నీకు నెట్లు నో
రాడును ధార్మికుండ వని ♦ యందఱిలోఁ దగవు ల్వచింపఁగన్? ౩౩౫

ఉ. ఏయెడనేని ధాత్రిఁ గల ♦ యెల్ల నృపర్షులు నీవుఁ గూడుచో
నీ భువనీశచంద్రుఁడు మ♦హిష్ఠసుధర్మరతుం డటన్న నే
చాయ వచింతొ? యేసతిప్ర♦సాదమున న్ననినాఁడ నట్టి కై
కేయి యెడాటమందు నుడి ♦ గీప్పడె నందువె ధార్మికోత్తమా? ౩౩౬

ఉ. ఎల్లనృపాలచంద్రులకు ♦ నేర్పడ దోషము నీకిదంతయున్
జెల్లునె? యిప్పు డాడినద ♦ చేయఁగ నొల్లక నీదువాక్యమే
పొల్లవడంగఁ జూచెదవు[1] ♦ పూర్వము శైబ్యుఁడు పావురంబునున్
మల్లడి పెట్టు డేగకు స్వ♦మాంసముఁ గోసి యొసంగఁ డే నృపా. ౩౩౭

కం. లోచనములు నీ విప్రుని, యాచించినఁ దన్ను నొక్క♦యనసినిజంధుం
డాచరితతదీయేష్టుం, డై చనఁడె యలర్కనృపతి ♦ యతులితగతికిన్. ౩౩౮

తే. కడలి యేటికిఁ జెలియలి♦కట్ట దాఁటి, రాదు సమయంబు చేతన♦కాచె; వీనిఁ
జక్క యోజించినీవా క్క♦సత్యదూషి,తంబు గానీక నిలుపు య♦శంబు జగతి.

ఉ. ధర్మము రోసి సత్యము నె♦దం దలపోయక రామచంద్రునిన్
గూర్గిని రాజుఁ జేసి యల♦కోసలకన్యకతో రమించె దే?
ధర్మము లే కధర్మమె బు♦తంబొ యసత్యమె యౌను గాక, యో
దుర్మతి! యేం నేను విడు♦తున్ భవదాశ్రుత[2] మీఁక తక్కినన్? ౩౪౦

కం. రాముని రాజుగఁ జేసెద,వా మహితవిషంబుఁ గ్రోలి ♦ వసుధేశ! యిదే
నీముందట నీవు గనన్, నే మరణము నొందుదాన ♦ నిక్కము సుమ్మీ. ౩౪౧

కం. కరములు మోడిచి యంతటు, నురువుగఁ గౌసల్య కెరఁగ ♦ నొకదినమేనిన్
ధర బ్రదికి చూచుకంటెను, మరణంబే నాకు మేలు ♦ మనుజవరేణ్యా. ౩౪౨

## కైకనిష్ఠురోక్తులకు దశరథుఁడు విహ్వలుఁ డగుట.

కం. నృప! నాపై భరతుని పై, శపథం బొనరించుదానఁ ♦ జక్కఁగ వినుమీ
కృప లేక రాము నడవుల, కిపు డనుపుట తక్క నొంట ♦ నేఁ దృప్తి పడన్. ౩౪౩

చం. మెలఁత వచించి యిట్లు విర♦మించి కడు న్వగఁ గందుఁజేనిలోఁ
బలుకక యుండె, నాతఁడును ♦ భామిని కోరినచెడ్డకోరికల్
తలఁచి మనంబు విహ్వలతఁ ♦ దత్తఱ మంద ముహూర్తమాత్ర దా
నలుకను బల్క మాని సతి ♦ నట్టె కనుంగొని దుఃఖతప్తుఁ డై ౩౪౪

చం. పిడుగులువోలెఁ దాఁకుచుఁ ద♦పింపఁగఁ జేయుమనోఽప్రియోక్తులన్
దొడిఁబడు స్రుక్కు, నాయువిద♦దుర్వ్యవసాయము నెంచి యెంతకుం

[1] వివాహమునాఁటిమాటనుబట్టి యడిగిన భరతుఁడు లేఁడనుననియో, 'వారిజాతులందు వైవాహి కములం దు బొంకవచ్చు'నని చెప్పి తప్పించుకొనునో యనికైక యిట్లు పలుకఁ బోయెను. [2] అశ్రుతము=ప్రమాణము.

కం. అడవులకుఁ బనుపఁ దనసుతు, నడుగునా యేనునుచుఁ గోస♦లాత్మజ నను, నా
కొడు కేఁడీ యన నే మని, నొడువుదు నే విప్రియంబు♦నుం జేసి యిటుల్. ౩౫౫

సీ. సమయోచితంబుగ ♦ సఖివలె దాసి నా, భార్యయట్టుల సొంత♦భగినిరీతిఁ
దల్లిమాడ్కిఁ జరించుఁ♦దగ సుప్రియంవద, ప్రియకామ ప్రియపుత్ర ♦ ప్రేమ కెంతొ
యస్తా లయ్యును ♦ నకట యాకౌసల్య, నీకగౌరవమునఁ జేసి ♦ నేను గౌర
వింప నైతిని నవి♦వేకి నై నాపన్న,పాలు రెంచినఁ గన్ను ♦ భగ్న మనియె

తే. నేను నీకయి చేసిన ♦ దెల్లఁ గాంచ, వ్యాధపీడితుఁ డగునాతఁ ♦ డరయ లేక
చలువ నట్టి కుపథ్యభో♦జనముభంగి, ననటఁ బెనుపంగ సాగెనే ♦ నగలమారి.

కం. రామునియెడ నట్టిపి కొఱ,గాములు గావించి పనుపఁ ♦ గానకుఁ గని స
న్నేమాడ్కి నమ్మఁజాలునొ,కో మహిరాజపతి సుమిత్ర ♦ కూరిమిభీతిన్. ౩౫౬

కం. పంచత నేఁ గనుటయు వన,సంచారము సేయ విభుఁడు ♦ చను టేరెం డా
లించి యెటు సైచు నయో్య, పంచాననమధ్య సీత ♦ పటుదుఃఖంబున్. ౩౫౭

కం. కట్టా తనపతి నడవికి, నెట్టినదుఃఖమున సీత ♦ నెఱి చెడి మంచుం
గుట్టకడఁ గిన్నరునిఁ బోఁ,గొట్టుకొనినకిన్నరివలెఁ ♦ గూలుం గాదే. ౩౫౮

కం. అడవికిఁ జనుసుతుఁ గంటికిఁ, గడ వెడుగా నేమ్చుజనక♦కన్యం గనుచున్
గడుదుఃఖపడుచు నే నో,పడఁతి! జీవింపఁ గలనె ♦ బహుకాల మిలన్. ౩౫౯

కం. సీతాకాంతునిఁ బాసిన, నాతరమా వెంచె బ్రదుక ♦ నామ్నాయిఁ గని నే
యాతల విధవారాజ్యము, నీతఁ నే కట్టుకొమ్ము ♦ నీపుత్రునితోన్. ౩౬౦

కం. తళతళ మనుదుర్విషస,మ్మిళితమదిరఁ గ్రోలి వెంచి ♦ మిడుకునరుపలెన్
దెలియక సతి నని యసతి! తలపై నెక్కించుకొంటిఁ ♦ దాపముఁ గంటిన్. ౩౬౧

తే. ఇచ్ఛకపుఁగల్ల లాడి నీ♦యిచ్చకొలఁదిఁ, జేపడిననన్నుఁ జంప నే♦ర్చితి వె చెనఁటి
కాన మృగయుఁడు శ్రవ్య మా♦గానరసము, నెఱపి జింకను వధియింప ♦ నేర్చినట్లు?

కం. సతితోడిసుఖముఁ గొనఁగా, సుతు నమ్మెడినన్నుఁ జూచి ♦ సూరులు వీధీ
తతులందుఁ గల్లు ద్రావిన,క్షితిసురు నిందించునట్లు ♦ చెపనాడ రొకో. ౩౬౨

సీ. నీమాట వినియును ♦ నిను సైఁచు చున్నాఁడ, నెంతకష్టం బయ్యె ♦ యెంతదుఃఖ!
మిది తొలిబామున ♦ నే నొనరించిన,దోషంబు గుడునక ♦ తొలఁగు నెట్లు?
చిరకాలముగఁ బా♦పిని నిన్ను రక్షించి,తిని గదా యుగ్రాటి♦ తెరువు దోఁపఁ
జఱుతవాఁ డొంటిమైఁ ♦ జెనుపాము నంటిన,రీతి నిన్ గొంటి ♦ మృత్యుభంగి

ఆ. నెంతబాలిశుం డ♦నెంతటికాముకుం, డెంతదుష్టబుద్ధి ♦ నగుచు విభుండు
ముద్దుఁబట్టి రాము ♦ ముదితకై యడవికిఁ, బనుమ వాఁ డి టెంచి♦పాప మొక్కొ.

కం. అని నిఖిలజీవలోకం, బనయము నను దూఱకుండు♦నా? వ్రతములచే
తను బ్రహ్మచర్యమునఁ దా, వనరియు సుఖవేళ సుతుఁడు ♦ వనములఁ బడెసెన్. ౩౬౬

కం. ఆమహనీయుఁడు దురితపు, భూమి యయిననాకు| నేల ♦ పుట్టెనొ కట్టా
రాముఁ డయో నాకతమున, వామాక్షీ! తండ్రి లేని♦ వాఁ డయ్యెఁ గదే. ౩౬౭

కం. వనముల కనుగు మ తనయా! యన రెండవమాట చెప్పఁ ♦ డటులే యను; వాఁ
డనిన్ఁ బ్రతికూలవచనం, బనయుత నా కెంతో మేల♦యనఁ డటు లయ్యో. ౩౬౮

ఆ. నిష్కళంకుఁ డగుట♦ నెఱిరామచంద్రుండు, తెలియఁ డకటనాదు♦ తెఱఁగుమఱియు;
వనికి నరుగు మన్న ♦ వల్లె యనుం గాని, యడుగఁ బోఁ డదేల ♦ యనుచు నైన.

తే. రాము వనిచినయంత న♦రణ్యమునకు, సర్వజనముల ధిక్కృతి ♦ సైఁప లేని
యసమపాతకిఁ దక్షణ♦మంద మృత్యు, వెట్టులుకొ యమగృహమున♦కీడ్చు నన్ను.

కం. వైవస్వతపురి కేను న్, హావనులకు రామచంద్రుఁ ♦ డరిగినపిదపన్
నావారల నెల్లర నీ, వేవిధమునఁ బఱతొ యంచు ♦ హృదయము గలఁగెన్. ౩౭౧

సీ. రాముండు వని కేగ ♦ నామృతి సత్యంబు, మాయెంటఁ గౌసల్య ♦ మరణ మొందు
సర్వకాలముల ల♦క్ష్మణుఁడు పాయఁడు రాము, నన్నతోఁ జనియెడు ♦ నడవులకును
శత్రుఘ్నుఁడును మున్నె ♦ చనె భరతుని వెంటఁ, బతియును బుత్రులుఁ♦ బాసిచనిన
సకట సుమిత్ర దుః♦ఖార్ణవమగ్న యై, చనుదెంచు నా వెంట ♦ శమనపురికి

తే. నన్నుఁ గౌసల్యను సుమిత్ర ♦ నయగుణు లగు
ముగురుకొడుకులఁ గడుదుఃఖ♦మునను ద్రోచి
యీవ సర్వసుఖంబుల ♦ నెసఁగు చుండు
చెనఁటి! ని న్నెల్లవారు ఛీ♦ఛీ యనంగ. ౩౭౨

ఉ. రాముఁడు నేను లేమిని ది♦రంబును సత్కృతమై గుణోత్కరో
ద్దామము శాంతి స్థానరఘు♦ధాత్రిపువంశము పాడుగాఁగ నీ
వీమహి నేలు; నీసుతున ♦ కిష్టము యేని రఘురాము వీడుటల్
నామృతి వెన్క నీసుతుఁ డొ♦నర్పఁడుగాక మదుత్తరక్రియల్. ౩౭౩

ఆ. ఓసి దుష్టురాల ♦ యోసి నాపగదాన, యేను నీల్గ రాముఁ ♦ డేగ వనికి
విధవ వగుచు నేల♦వే సర్వరాజ్యంబు, నీవు సుతునితోడ ♦ నిచ్చకోలఁది. ౩౭౪

ఆ. ఘోర మగునకీర్తి ♦ గ్రుచ్చపరిభవమును, బ్రజలచే నవజ్ఞ ♦ పాపశీల
నీదురూపుఁ గాంచి ♦ నిలిచెనే నాయింట, నతులపాపియింటి♦యందుఁ బోలె. ౩౭౫

ఉ. అంగద! వాజివారణర♦థాంగము లెక్కి చరించు నెప్పుడు
న్రంగుగ నట్టినాకొడు కి♦నాగ్రజరేఖ నయిదోడు లేక యె

శాంగిగఁ గంటకోత్కరశి♦లావృత మార్గగహనంబునందు సే
భంగిఁ జరింపఁగాఁ గలఁడు ♦ పాపము! బొబ్బలు వోవఁ బాదముల్? ౩౨౬

ఉ. పొంకము మీఱ నాసుతుఁడు ♦ భోజనవేళలయందుఁ గుండలా
లంకృతు లైనపాచకులు ♦ లాలసమానసవృత్తి నేన ము
న్నిం కిటు నేన మున్ననుచు ♦ నెంతయు వంతులు పల్కికొంచు ని
శ్శంకము శస్తపానమును ♦ జారుతరాన్నము పెట్టఁ గైకొనున్. ౩౨౭

ఉ. అట్టిఁడు నాడువట్టి గహ♦నాంతరమందలిచెట్టు చెట్టు పె
న్పట్టయు గుట్టయుం దిరిగి♦కొంచును గారముఁ జేఁదునుం వగ
ర్పుట్టెడి పచ్చికాయలను ♦ భూమిని త్రవ్విపకందమూలముల్
తెట్టువఁ బొట్టపోసికొని ♦ దేవెవలెన్ నడయాడు బెట్టొకో. ౩౨౮

కం. ఎంతయు నెలగలచేలలు, స్వాంతము రంజిల ధరించి ♦ యతిసుఖపరుఁ డే
కాంతుండు కావిగుడ్డల,బొంతలు ధరియించి యెట్లు ♦ భూమి వసించున్. ౩౨౯

కం. ఇవ్వసుధ భరతుఁ డేలఁగ, నవ్విపినమ్ములకు రాముఁ ♦ డరుగఁగ నయ్యో
యెవ్వఁడు చెప్పెనె కుమతీ, యివ్విధము నచింతితంబు ♦ భృశదారుణమున్. ౩౩౧

ఉ. నారులు క్రూరమానస ♦లనారత మాత్మహితార్థసిద్ధియే
యేరహిఁ గోరి గూఢముగ ♦ నెంతయుఁ గీడొనరింతు రిస్సిసీ
నేరముఁ బల్కఁబోన నవ♦నిం గల యెల్లపొలంతులందు, నో
మారి! తగుం జుమీ భరతు♦మాతకు మాత్రము యట్టినిందయున్. ౩౩౨

చం. కసరున నన్ను వేఁచుటకుఁ♦గా మతిపట్టితె క్రూరచిత్త! యో
చెనఁటి! యనర్థకార్యపర! ♦ స్వీయహితాచరణైకశీల! యే
యనయము నెప్పుడేఁ గనితె ♦ యక్కట నాయెడ నేని నవ్వలో
కనిచయమంగళాచరణ♦కారణుఁ డా రఘురామునందు నేన్? ౩౩౩

ఉ. నీ పితు నన్ను నేఁచుటయు ♦ నేనును రామునిఁ బాయఁ ద్రోచుటల్
వావిరి చూచి నిక్కముగ ♦ భర్తలఁ దా రనురక్త లయ్యెనే
బోవిడువారు కామినులు, ♦ పోకడ పెట్టెడివారు తంత్రము లా
హా విరళానుకంపఁ గడు♦పారఁగఁ గాంచినయట్టిపుత్రులన్. ౩౩౪

కం. వ్యసనాంభోధినిమగ్నుని, వసుధాతలయామ్యదబ్జ♦భాస్కరుఁ గనుమే
వెస సకలజగములును ని, న్గసరునఁ గనకుండునా ని♦కారచరిత్రా. ౩౩౫

ఉ. దేవకుమారరూపు, వర♦దివ్యదలంకరణాభిరాము, సీ
తావిభు, నాడునందనుని, ♦ దాయఁగ వచ్చెదువానిఁ జూచి లో

నంజలి పెట్టి నీచెంటి ♦ నిర్దయ కైక మొగంబు చూచు చై
నం జనుఁ గాన వేగ మయి♦నం దెంవాలుము లేచి పోయెదన్. ౪౦౨
కం. అని పలికి యుఁ గైకయిమోముమును బోడఁగని హస్తయుగము ♦ మోడిచి వనజా
క్షిని సుప్రసన్నఁ జేయఁగ, వినమ్రమోక్తుల నిల్లు వేఁడు ♦ విపులాధవుఁడున్. ౪౦౩

దశరథుఁడు కైకను బ్రార్థించుట.

ఉ. ధీరుఁడ, మంచివాఁడఁ, ద్రవ ♦ నీయుఁడఁ, జావఁగ నున్నవాఁడ, నో
మానిని! నీకు భర్తను, ధ ♦ రాపతినిం గద, యొగ్గ దోసిలిం
మానము వీడి వేఁడెదను ♦ మన్నన సేయుము, యొంటి గాదు నేఁ
డానిఖిలావనీజనస ♦ మూహమునం గద బాస చేసితిన్. ౪౦౪
కం. ఏగి యు దానిఁ గ్రోధము, బాలా! కరుణాత్మురాల ♦ వరమనుశీలా!
యాలింపుము నామాట నిఁక, జాలిం బెట్టకు నయం బ్ర ♦ సాదింపు సతీ! ౪౦౫
సీ. నీయిచ్చు రాజ్యంబె ♦ నిత్య మోఁ గాఫుత్ర, శమియింపు నారాము♦చంద్రు దేవి!
పరమంపత్ప్రీతియుఁ ♦ బ్రాపించు నీకిల, నిది రామునకు నాకు ♦ నెల్లజనుల
కును భరతునకును ♦ గురువృల కెల్లను, సమ్మతం బిది యని ♦ జాలి పుట్ట
నడలు రక్తాక్షు శుద్ధాత్ముని నశ్రుపూర్ణాక్షుని బతిని మే ♦ లాడ కున్నఁ
ఆ. ప్రియ నదుష్టభావఁ ♦ బెంకెను బ్రతికూలవచనఁ జూచి సుతుని ♦ వనవివాస
మందు బుద్ధి నిలిపి ♦ యన నేర కేమియు, శోకమునను బడియె ♦ శోషమొంది.
కం. ఏడ్చెడివంత నలంగుచు, నూర్పుచుఁ బడియుండె నృపతి ♦ యుదయము కాఁగఁ
జెప్ప ప్రతిబోధకాళి యొ, నర్చెడిగీతంబు లాఁపి ♦ నలగుడునడఁగన్ ౪౦౭

దశరథునకు సత్యంబు కైక బోధించుట.

సీ. పుత్రశోకంబున ♦ భూశాయంబునఁ దైళ్లి, పడి యూర్పుల నలంగు♦పతిని జూచి
పాపాత్మురా లిల్లు ♦ పలుకు నో పృథివీశ! బాస చేసియును నిం♦పాపుట దానిఁ
జలుపక పాపినై ♦ చనఁ జూచెద వె యిట్లు, ధరణిఁ గాగ్లుదు? నేల ♦ తప్పవిడుతు
దిటముగా లేలెమ్ము ♦ తీర్పుము వరములు, తలఁపుమీ నీవింత ♦ ధర్మనిధము
తే. ధార్మికులు సత్యమే పర♦ధర్మ మనరె, నీవు ధర్మంబ చలుపఁగ ♦ నేను సత్య
మూఁతగాఁ బట్టుపటీచెద ♦ నూరకేల, సత్య మెడపఁగ నలవని♦ జాలి పడెదు.
కం. తనమాటఁ బట్టి కాదే, మును శైబ్యుఁడు తనదు దేహ♦మును డేగకుఁగాఁ
గోను మని యిడె వెసఁ జూడుం, గోనె నుత్తము మైనగతిని ♦ గువలయనాథా. ౪౦౯
కం. అందునకై కాదే తన, కుం దానముఁ గనులు వేఁడె ♦ కొనువిప్రునకుం
గుందక యిచ్చె నలర్కుఁడు, నందికదివిజుండు తనదు ♦ నయనయుగంబున్. ౪౧౦

సీ. బంగారుతలుగులు బఱమూఁపురంబును, గలతెల్లయాఁబోతుఁ గోరొచనయు
నాలుగుకోఱల నలువారుకేసరి, సత్త్వవంతము హయరత్నము మఱె
సింహాసనం బదె చెలఁగెడిఁ బులితోలు, నదె ప్రజ్వరిల్లుచుహుతాశనుండు
వాదిత్రసంఘంబు వఱలెడి నదిగొ స,మాలంకృతంబు వేశ్యాజనంబు
తే. బ్రాహ్మణులు వారె, యాచార్యరాజ యదిగొ,
నావు లవె, పుణ్యమృగపక్షు లవిగొఁ, బౌర
జానపదులు నైశ్యాళులు క్షత్రియులును
వారె కొలు వెల్ల నిండినవారు కంటె. ౪౨౯

తే. రామచంద్రుండు పుణ్యతారకను రాజ్య, మందుఁ గావుత, నీవేగి యవనిపాలుఁ
దీనరింపుము, రవియుఁ దోతెంచె ననిన, సత్వరంబుగ నతఁ డేగె తత్పురోటకు.
ఆ. మఱుక రాజవర్యుమతికి నెక్కనవాని, నంతిపురికి నైన నడ్డులేక
విడువఁ దగు నటంచుఁ బుడమిఱేఁ డానతి, నిడుట మున్నె పోవ విడిచిరెల్ల.

## సుమంత్రుఁడు దశరథుని నిద్ర మేలుకొలుపుట.

చం. వసుమతినాథుఁ డున్నదరహస్యయెఱుంగనివాఁడు గావున
న్వెసఁ జని యాసుమంత్రుఁ డవనీపతి డాసి, ఘటించి యంజలిన్,
బన గలసూక్తులం బలికెఁ బార్థివవర్యునిఁ గూర్చి తాఁ బ్రభా
తసమయయోగ్యపద్ధతిని దద్దయు భక్తిపురస్సరంబుగన్. ౪౩౨

సీ. అవధారు దేవ! తమోరిరాకను వార్ధి, పొంగెడిరీతి నుప్పొంగు వెలమి
నసురారి యైనబలారి మాతలి మేలు,కొలుపుభంగిని మేలుకొలుపువాఁడ
సాంగవిద్యామ్నాయ మబ్జసంభవుని బో,ధించుచందాన బోధించువాఁడ
నవనీతలంబు సూర్యాచంద్రములయట్లు, బోధించువాఁడ నిన్ భూపవర్య
తే. వేగ లెమ్ము మహారాజ వివిధరుచిర,మంగళాలంకృతుండవై మహితభంగి
స్వర్ణగిరి వీడి వచ్చుభాస్కరునిపగిది, రమ్ము రాజేంద్ర లోకంబు రంజిలంగ.
కం. సోముఁడు సూర్యుండును సుత్రాముఁడును మహేశ్వరుండు ధననాయకుఁడున్
భూమిప వరుణుం డగ్నియు, నోముదురు జయంబు నీకు నొప్పుగ నిడుచున్.
చం. భగవతి రాత్రి దీఱెను, బ్రభాతము మీఱె, నితఃపరోచితం
బగుక్రియలన్ ఘటింప సమయం బగుపించెను, లెమ్ము నీ విఁకం
దగుగతిఁ బౌరజానపదనైగమసంవృతుఁ డై వసిష్ఠుఁ డొ
ప్పుగ నట యున్నవాఁ, డిడుము పుత్త్రునిఁ బట్టము గట్ట నానతిన్. ౪౩౫
కం. కాపరి లేనిపశుల్ ధ్వజి,నీపాలుఁడు లేనిసేన నెల లేనినిశల్
గోపతి యెడసినకదుపులు, భూపాలక! రాజు లేనిపురరాష్ట్రంబుల్. ౪౩౬

ఆ. అనిన సర్వవంత ♦ మైనయాసామోక్తి,విని విషాదగరిమ ♦ విభుఁడు. శోక
శోణలోచనముల ♦ సునిశితమర్గవి,భేదనోక్తిఁ గష్ట♦పెట్టె దేల. ౪౩౭
కం.అన నృపుసకరుణవాక్యము,లను విని కని యతనివిహ్వ♦లత్వంబును గే
లిని మోడ్చి జరగెఁ గొంచెము, వెనుకకు సూతుండు మదిని ♦ వెఱ నివ్వటిలన్.

→ కైక సుమంత్రునితో శ్రీరామునిఁ దోడితెమ్మని చెప్పుట. ←

ఉ. తా నయి చెప్పలేక పతి ♦ దైన్యమునం బడియుంటఁ జూచి యా
పానిధి కైక పల్కె సచి♦వాగ్రణితోఁ బతి రామహర్షసం
దానితమానసుం డగుచుఁ ♦ దద్దయు నిద్దుర లేమి శ్రాంతుఁ డై
తా నిటు లిప్డు కన్గునిక ♦ దానఁ జుమీ వచియింపఁ డేమియున్. ౪౩౯
కం.సూతా! వేగమ చని యా,సీతాపతిఁ దోడితెమ్ము ♦ చెచ్చెర నిటకుర్
గాత శుభము నీ విది యే,మో తలఁపకు మనిన నతఁడు ♦ ముద మెద మెదలన్.
కం.రామాభిషేకమునకే, యీమానిని తఱిమి చెప్పె ♦ నీగతి నిజ మీ
భూమీశుండు తదర్థమె, యీమెయి నాయాసపడెను ♦ హితధర్మమతిన్. ౪౪౦
ఉ. నిక్కము రామచంద్రునకు ♦ నేఁ డభిషేక మటంచుఁ బొంగి తా
గ్రక్కునఁ గోపలేయుఁ గను♦కాంక్షను నంతిపురంబు వీడుచున్
ద్రిక్కటిమూఁకలం గడచి ♦ కేలి మహాధనముల్ వహించి లో
నెక్కునమక్కువం జెలఁగు♦హృష్టులఁ బౌరుల రాజులం గనెన్. ౪౪౧
సీ. పేగుఁబోకను లేచి ♦ వేదపారగు లైన,బ్రాహ్మణుల్ సభ దీరి ♦ బాహిరముగఁ
బట్టసస్థులు దళ♦వాయులు మంత్రులు, నితరముఖ్యులు నొక్క♦యెడను జేరి
ప్రాగ్గదో యువయించె ♦ బుష్యంబు ప్రాప్తించె, లక్ష్మరాగ్రజుజన్మ♦లగ్నమిదియ
యభిషేకమునకయి ♦ యమరించి సట్టియా,వస్తువు లన్నియు ♦ వఱలె నవిగొ
తే. భద్రజలకుంభములుఁ జాఱు♦భద్రపీఠి, సమ్యగాస్తీర్ణశార్దూల♦చర్మలసిత
రథము సింధుజలంబున♦భ్రనదియమున,కలయుతీలమునఁ గలయుద♦కంబుమఱియు.
సీ. ప్రాగ్వాహములయుఁ ద♦క్షిణ గ్వాహములయును
నూర్ధ్వవాహములయు♦నుదకములును
బహోన్నలసమేత♦వాఃపూర్ణసహాలాజ
పల్లవచ్ఛన్నసు♦వర్ణఘటలు
సచ్ఛుభాచారలు ♦ సద్భూషణభూషి
తాంగలు నైనవా♦రాంగనలును
జలజారికరవిక♦చప్రఖ్యకాంచన
మణిశోభిదండ చా♦మరము ఘ్రాలు

తే. చంద్రమండలసంకాశ♦చారుధవళ, మాతపత్త్రంబు పాండురం♦బైనవృషము
తెల్లగుఱ్ఱంబు లెస్స మ♦త్తిల్లి యున్న,పట్టపుంగోరు దర్భలు ♦ పాలు వెలసె.

కం. మంగళవాద్యోత్కరములు, మాంగళ్యాఖిలసువర్ణ♦మణిమయభూషా
లింగితకన్యాష్టకము హ,హ్యాంగుగ వందులును ఘృతము ♦ రాజించె నటన్ ౪౪౫

కం. స్త్రీ కాంతు లెల్ల సభ్య డి,క్ష్వాకులయభిషేకవేళ ♦ సముచిత మగుమే
లౌకానిక లాదిగ నీ,తా కాంతునికొఱకుఁ దెచ్చి ♦ తమలో సభలోన్ ౪౪౬

కం. పుట్టెను సూర్యుఁడు పతి గ,న్పట్టఁడు రాజున కెవండు ♦ నయముగ దీనికి
నెట్టన చెప్పఁడు దశరథు,పట్టికి నై యెల్ల సిద్ధ♦పడె జాగేలా. ౪౪౭

సుమంత్రుఁడు సామంతరాజులతో సంభాషించుట.

చం. అని తలపోయు చుండఁగ ధ♦రాధిపులం గనుచున్ సుమంత్రుఁ డి
ట్లనుఁ బతి రాముఁ బిల్వ మన ♦ నచ్చటి కేగెద, భూమిభర్తృకున్
ఘనులరు మీరు, పూజ్యులరు ♦ క్ష్మాతనయాపతి కంతకంటెఁ, గా
వున సయిరింపుఁ డేను నిదె ♦ పోయి నృపుం గని యుష్మదుక్తిగన్ ౪౪౮

కం. సేమ మడిగి మేల్కనియున్, రామికి నెలి కేమికత మొ ♦ ప్రశ్నింతు నటం
చామహిపతి డాయం జనె, సామంతమతానుసరణ♦చరితజ్ఞుండన్ ౪౪౯

కం. తుల గాననిసౌధ మన,గ్గళగతిఁ జొరఁబాఱి పొగడి ♦ రాజాన్వయమున్
లలితగతి నృపునిశయ్యా,తలముఁ గదిసి తెరఁ దొలఁగించె ♦ తనకడ్డముగాన్ ౪౫౦

చం. అనఘము నీదువంశము మ♦హాత్మ! రవీంద్రశశీశవహ్నులున్
ధనదుఁడు పాశియున్ జయము♦నంబులు గూర్తురు గాక నీకు, రే
చనియెను మేలుకొమ్ము నృప♦చంద్రను! కాఁగలయట్టికార్యముల్
పెనుపుగఁ దీర్పుమా, సభను ♦ వేచిరి విప్రనృపార్యసత్తముల్. ౪౫౧

దశరథుఁడు సుమంత్రునితో శ్రీరాముని బిలుచుకొని రమ్మని చెప్పుట.

మ. అని కొండాడుసుమంత్రుగాం దెలిసి కో♦సాధీశుఁ డే నిద్దురం
గనఁ జూ, రాముని దోడితెమ్మనినవా♦క్యం బేలపాటింపవే యిం
కనయేనిం జని లోడితె మ్మిటను వే♦గం, బన్న నావాక్యముల్
విని మే లంచును నిర్గమించి నగరికి ♦ వీక్షించె మార్గంబులన్. ౪౫౨

కం ప్రేమంబున గుంపులు గొని, రామకథాలాపబహుళ♦రాగము వెలయన్
భూమీజను లుండఁగఁ గను, చామాటలు వినుచు గాథ♦హస్తాక్షులుఁ డై ౪౫౩

చం. చని రజతాద్రిపేటునకు ♦ సాటి, సురేంద్రునివీటిపాటి, యా
ధనదునిమేడకున్ జత, బు♦ధప్రకరాలయశృంగతుల్య మై,

గోన బగుతెల్పులును ముసము ♦ గూర్చునరుంగులుఁ జైఁడిబొమ్మలును
ఘనమణితోరణంబులును ♦ గల్గి శరజ్జలదోపమాన మై ౨౫౪

సీ. మణివరమాళ్యాళి ♦ మండితం బగుచును, మలయజాగరుధూప ♦ లలిత మగుచు
నాకీర్ణవిమలము ♦ క్తావళీరత్న మై, దార్దురం బన సుగం ♦ ధయుత మగుచు
సారసమాయూర ♦ చారుస్వనంబు నై, సుకృతస్ఫుకావళీ ♦ సుందర మయి
మేలికాంతులచేత ♦ మిఱుమిట్లు గొలుపుచుఁ, దోయజరిపుసూర్య ♦ తుల్యమగుచుఁ

తే. బలు తెఱంగుల రంగుల ♦ పత్తు లమర, మేరుగుహ వోలి యంజలి ♦ కారు లొప్పఁ
గానుకలసార లందంద ♦ కాచి నిలువఁ, బల్లెటూరులవారలు ♦ బాగ్లు కట్ట ౨౫౫

చం. వెలసి మహాభ్రతుల్య మయి ♦ వేడుక మీఱి యలంకృతంబు నై
కలయఁ గిరాతకుబ్జజన ♦ కాండసమావృత మైనరామచం
ద్రులభవనంబుఁ జూచి యటుఁ ♦ దొప్పలుదోరలు మూఁగి యున్నలో
కులఁ గని హర్షభాసురము ♦ ఖుం డయి, యింద్రుగృహంబుఁ బోలుచున్ ౨౫౬

ఉ. జానగుమేడఁ జూచి, రఘు ♦ సత్తముమెచ్చులవారు సత్ప్రియుల్
మానుగఁ నుంట గాంచుచు సు ♦ మంత్రుఁడు సంతిపురంబు దాసి యం
దానరపాలసూనుభవి ♦ కార్థదిదృక్షుశుభప్రసంగము
ల్వీనుల కింపుగా విని స ♦ లీల శకుంతనినాదజుష్ట మై ౨౫౭

ఉ. అంజలికారులును బసదు ♦ పాయనకోటిపరార్థ్యలోకు లా
యంజనశైలసన్నిభ మ ♦ దాందదుదగ్రశరీరభద్రశ
త్రుంజయనామకేభ మది ♦ తోత్రి మసహ్యపరాక్రమంబు రా
ట్కుంజర మాపవాహ్యమును ♦ గుంజరవాజరథస్థమంత్రులున్ ౨౫౮

కం. ద్వారమునందు న్నిలుపఁగ, వారల వీక్షించి చని య ♦ వారితగతి వి
స్తారమణీగణరాజిత, నారిధి మకరంబు వొచ్చు ♦ పడువునఁ జొచ్చెన్. ౨౫౯

తే. సతిమినయమునవారని ♦ సన్యకుంచ, లోజ్జ్వలుల నప్రమాదుల ♦ నస్త్రమాను
రక్షులను బ్రాసకార్ముక ♦ శక్తిధరుల, వెండి కనుఁగొనె వృద్ధుల ♦ వేత్రధరుల. ౨౬౦

తే. పూసి తొడి కట్టి పెట్టి స ♦ భూతరీతిఁ, గావిచేలలు ధరియించి ♦ కాచి యుండ
నింపు హెచ్చరికను సుమం ♦ త్రుండు పూర్వ, నృత్తవేది సమీపింప ♦ నెల్లవారు

తే. సంభ్రమంబున నిగుడు నా ♦ సనము లోలి, వారి నాదృతి నిట్లను ♦ వరసమర్థఁ
దెలుఁగఁ జెప్పుఁడు వేగ సీ ♦ తేశునకును, వాకిటసుమంత్రుఁ డిదెయున్న ♦ వాఁడటంచు.

కం. అన వార లెఱుఁగఁ జెప్పిరి, జనకసుతాసహితరామ ♦ చంద్రున కతఁడున్
జనకాంతరంగు సూతుని, దినవును రప్పింపఁ దనదు ♦ చెక్కటి కతఁడన్. ౨౬౩

సుమంత్రుఁడు రామునితో దశరథువాక్యంబుఁ జెప్పుట.

సీ. రమణీయకనక ప♦ర్యంకభాగంబున, సవు ర్ణైనముక్తాల♦సరులవాని
ఘుమఘుమంఘుమితసూ♦కరరక్తనిభశుచి,గంధలిప్తుఁడునయి ♦ క్రాలువానిఁ
గంకణఝణఝణ♦త్కారంబు దోఁపఁ జామరవీచుజానకి ♦ మరిగువానిఁ
దనపార్శ్వమున నిల్వ ♦ ధరణిజ చిత్రాస, మీతు మృగాంకుని ♦ మించువాని
తే. భాసురంబైన నైజప్ర♦భావిశేష,స్ఫూరితమున సర్వసాక్షిని ♦ బోలువాని
సకలసౌభాగ్యములనుసై ♦ శ్రీకరుని రామ,భద్రుఁగనుఁగొనెఁగూర్చున్నవానినియతి.

చం. వరదుని రాము నంది గని ♦ వందనముల్ ఘటియించి సద్గుణ౯
త్కరములు సన్నుతించి నయ♦తత్పరుఁడై కరముల్ మొగిడ్చి మీ
కనుసమె కా విహారశయ♦నాసనలీలల నెల్ల సంచుఁ దా
నరసి సుఖంబు నొండి వసు♦ధాత్మభవాపతితోడ నిట్లనున్. ౪౬౫

కం. కౌసల్యాతనయా! రామా! సరగున మిమ్ముఁ గనఁగ ♦ మహీపతి కోర్కిం
జేసెను గైకేయీదేవీసహితుం డగుచు నటకు ♦ విచ్చేయుఁ డనన్. ౪౬౬

శ్రీరాముఁడు సీతాదేవికి రాజాజ్ఞ నెఱింగించుట.

ఉ. ఆనుడు లాలకించి, వసు♦ధాధిపసూనుఁడు వాని సత్క్రియా
మానితుఁ జేసి, సీతఁ గని ♦ మానిని! దేవర దేవి మత్ప్రియం
బైనప్రభుత్వదానవిష♦యంబు విచారము సేయు చున్నవా,
రానతిశీల నన్నరిచి ♦ యర్థిపుం గడుఁ దీనరించెడిన్. ౪౬౭

సీ. వెరవరి గాన దే♦వియు రాజయోజన, యెఱిఁగి నాకు శుభంబు ♦ నొసఁగఁ జేయఁ
గోరు చుండుటఁ జేసి ♦ గొబ్బున నాయర్థ,వృద్ధికై తొందర♦పెట్టుఁ బతిని
వరహితకామాను♦వర్తిని కేకయ,జనపాలతనయ నా♦జనని కైక
యారయ యనృష్ట మా♦యవనీశుఁ డా ప్రియు,రాలు నాయర్థికా♦మాభివృద్ధిఁ
తే. జేసెముగఁ గోరెడి సుమంత్రు ♦ దూతగాఁగఁ, బంపె దివ్వోటికిదిగదా ♦ పాడి నాఁడు
నెట్టివో సభ దూతయు ♦ పట్టివాఁడ, చెలియ యువరాజు ♦ నన్నిష్ట ♦ చేయు నేఁడు.

కం. ఇట పోయి రాజుఁ గనుఁగొని, సుదతీ! చనుదెంచువాఁడ ♦ సుఖముగ నీవుర్
ముదితలతో నందుమునను, మదిరేక్షణ! వేడ్క నుండుమా యని యనుడున్

సీ. ప్రాణేశసన్మాని♦తా పితేషణ సీత, వాకిటివఱకును ♦ వచ్చి హృదయ
కాంతుని దివ్యమం♦గళవిగ్రహునిఁ జూచి, యాశాసనముల[1] ని ♦ ట్లనియె నిన్ను
బ్రాహ్మణ జుష్టంబు ♦ రాజ్యంబు రాజసూ,యాభిషేచనమున ♦ నవనివిభుఁడు
బ్రహ్మ పులోమజా♦పలికిఁ జేయువిధాన, నభిషిక్తుఁ జేయుత ♦ హర్షమునను

[1] ఆశాసనము = ఆశీర్వాదము.

తే. దీక్షితుని వ్రతసంపన్ను ♦ దివ్యతేజు, నజినధరు శుచి నిన్ను నే ♦ హరిణశృంగ-
హస్తుఁ గని నిన్ను భజియింప ♦ నాశ్రయింతు, సర్వశుభములు నీకు నే♦సంగుఁగాత
కం. కులిశాయుధుండు తూర్పున, నళినాప్తసుతుండు దక్షి♦ణమునఁ బడమటన్
జలనిధిపతి యుత్తరమునఁ, గలకాలం గాలిబిలుఁడు ♦ కావుత నిన్నున్. ౮౭౧
కం. అంగన నిటు కృతకౌతుక, మంగళుఁ డగు నృపసుతుండు ♦ మరలఁగ నాజ్ఞా
సంగత నొనర్చి మాతుని, సంగతి నిలు వెడలె రామ♦చంద్రుం డెలమిన్. ౮౭౨

→ శ్రీరాముఁడు దశరథగృహంబునకుఁ బోవుట. ←

సీ. కంచనాంశుసనా♦గ్రసింహమో యన, నిజమందిరము వీడి ♦ నీటు మెఱయఁ
బ్రథమకక్ష్యాంతర♦ద్వారభాగంబునఁ, బ్రహ్వాంజలి సుమిత్రు♦పట్టిఁ గూడి
మధ్యమకక్ష్య స♦మ్ముఖిఁ జేరి యచట మి,త్రాప్తుల నంచెఱ ♦ నాదరించి
చని యటఁ బావక♦సంకాశ మై వ్యాఘ్ర, చర్మాంచితంబు నై ♦ జలదరవము
ఆ. నుగ్రభానుకాంతి ♦ యుచితమై శాల్యంబు, కలభకల్పజవన♦గణము లమర
ధవళతాంగజవము ♦ నవు తేరు శ్రీరామ,చంద్రుఁ డెక్కెఁ దూర్పుఁ ♦ జంద్రు నట్లు.
సీ. ఛత్త్రచామరములు ♦ జా నొప్పఁ గేల్గోయి, మెఱయ వెన్వెక్క సౌ♦మిత్రి గావ
పౌరమార్గమునఁ బ♦ర్జన్యుని విధమున, నరశతాంగము కదు♦మొరయుచుండ
నుదయాద్రి వెలువడు♦నుత్పలాప్తునిఁ బోలి, తననికేతము వీడి ♦ తరలుచుండఁ
గనుఁగొనుజనముల♦కలకలనాదంబు, తుములమై సర్వంగఁ ♦ దోరముగను
తే. జందనాగరుధూపిత♦జనము చాప,ఖడ్గధరకోటు లెలమి ముం♦గలను నడువ
వెనుక నూర్లకొలందులు ♦ వేనవేలు, హయవరంబులు నేనుఁగు ♦ లంటి రాఁగ
ఉ. మంగళవాద్యఘోషము ల♦మందసునందిజయారవంబు సా
రంగతురంగ రావములు ♦ ప్రస్ఫుటశోగిమహానినాదముల్
రంగుగ నెల్లచోట్లఁ దన♦రంగ గవాక్షగభూమితాంగ తా
నంగన లెల్లఁ జల్లిరి క♦రాంజలులం గొని పూలు రాముపై ౮౭౫
కం. నేలను సౌధంబులఁ గిటికీలను గనుచుం పుసతులు ♦ కీర్తించిరి నీ
తాలనాహ్వయమున ను,న్మాలసుశావనారు నశేచు ♦ హర్షము నొందన్. ౮౭౬
సీ. కౌసల్యనందనా! ♦ కరి మలగాను నీక, సఫల మాత్రుఁ బడస్థు ♦ జనని చూచి
సీతామనోహరా! ♦ సీమంతినీవర, ము న్నెట్టితపముల ♦ మొనసె నొక్కొ
యాహోహిణీ శశాంకు♦నట్టులు నినుఁ గూడి, నీప్రియురాలయి ♦ నెగడసీత
రామచంద్రా నిను ♦ రాజుఁగాఁ గన నేమి, సలిపినారమొ వ్రత♦స్తవ్రతంబు
తే. రామభద్రుండు దశరథ♦రాజుకరుణ, మనకు నేలిక యయ్యెడు ♦ మనము పూర్వ
కాము లౌదుము మఱికము ♦ కష్ట మనఁగ, నెట్టిదో యింక నీతని♦యేలుబడిని.

చం.అని యిటు కాంతలెల్లఁ దను ♦ నాడుకొనన్ విని హృష్టచిత్తుఁడై
చని హయవారణంబులయు ♦ స్వస్తికమాగధవందిసూతపూ
ర్వనులయుఁ బుణ్యవాటులయు ♦ సంఘము లుల్లసిలంగ రాముఁడున్
జననిబిరీసపౌధగృహ♦చత్వరరాజపథంబుఁ గన్గొనెన్. ౪౭౯
సీ. కమనీయ మగుపతా♦కాధ్వజతతులతోఁ, బరిమళదగురుధూ♦పములతోడ
వెలిమబ్బులను బోలి ♦ వెలయుగృహాళితో, నగరుచందనసంచ♦యములతోడ
వలిపంపుఁబట్టుదు♦వ్వలువలరాశితో, స్ఫటికముక్తాఫల♦పటలితోడ
నుచ్చావచంబు లై ♦ యొప్పుభక్ష్యములతో, వల నొప్పు సంగళ్ల♦వరుసతోడ
తే. రాజితం బయి యలయంబ♦రంబునందు,-దేవపథమున కుద్ది యై ♦ తేజరిల్లు
రాజమార్గంబునందు శ్రీ♦రామవిభుఁడు, సంతసం బారఁ దా నటు ♦ చనుచు నుండ
కం.హవి దధ్యక్షతలాజలు, ప్రవిమలరాజార్హదివ్య♦భద్రశ్రీధూ
పవితతుల మాల్యముల న,ర్ఘ్యవిధిం బూజితము లైన♦యజిరములఁ గనెన్. ౪౮౦
## ప్రజలు శ్రీరాముని దీవించుట.
కం.అందుల వారలు దన కా,నందంబున నీయ దీవ♦నలు వారల నె
ల్లం దగురీతిగ మర్యా,దం జేకొంచుఁ జనఁగ నారు ♦ తాత్పర్యమునన్ ౪౮౧
కం తాతలు ముత్తాతలు నే,రీతిం బాలించి రట్టిరీతిని నీవుం
బ్రాతలనాగఁడ వై మముఁ, బ్రీతిం బాలింప వయ్య ♦ శ్రీరఘురామా! ౪౮౨
సీ. పౌరిఁ దండ్రిదాతల♦ప్రోపుకన్నసుఖాన, రాముంరాజ్యంబున ♦ బ్రదుకఁ గలము
అన్న మేటికిఁ బర♦మార్థంబు లేటికి, రాముఁడు రా జయి ♦ రాకమున్న
శ్రీరామపట్టాభి♦షేకంబుకంటెను, గడుశుభం బెద్ది రాఁ ♦ గలదు మనకు
రాముమహోత్సవం ♦ బీమెయి వర్తిల్ల, నన్యంబులకుఁ బ్రీతి ♦ యెసఁగు నెట్లు
ఆ. లేమి పుణ్యఫలమొ ♦ యింతకుఁ బూర్వంబు, మనుక సేరికిని లభింప నట్టి
రామచంద్రయూవ♦రాజ్యాభిషేకద,ర్శనము గలిగె జన్మ♦సార్థకముగ. ౪౮౩
ము అని శ్రీరామునిమీఁద నుంచినిజా♦పాంగంబులుం జిత్తముల్
ఘనుఁ డాతండు సుదూర మేగినను లో♦కవ్రాత మొక్కింత యై
సను ద్రిప్పంగ వలంతి గాదు, బయల ♦ స్సంకల్పవాక్యంబునన్
గను చుండుర్ రఘురామునాకృతిని ను♦త్కంఠాతిరేకంబునన్. ౪౮౪
కం రామునిఁ గనుఁగొనఁ డెవ్వఁడు, రాముఁడు గనఁ డెవని వాని♦బ్రతుకది యేలా
భూమిని నిందయ్యం డై మను,నాతనుబాధముని వాని♦యాత్మయు రోయున్. ౪౮౫
తే నాల్గుజాతులవారిని ♦ నయము మీఱ, నన్నివయసులవారల ♦ నాదరించు
నటులు గాపుర జను లెల్ల ♦ ననవరతము, ననఘుఁ డగ్గాను శ్రీరాము ♦ ననుసరింత్రు.

కం. చమురకములకుఁ జైత్యములకు, గొదకొనునాయతనములకుఁ ♦ గోవెలలకు స
ముదమున సీతాకాంతుఁడు, ప్రదక్షిణముగఁ జనె రాజ♦భవనంబునకున్. ౮౯-౭

కం. అంబుదసంఘనిభం బయి, యింబగు ప్రాసాదముల రహించుచు వెంటి రా
ష్ట్రం బగు శిఖరికి జోడై, యంబరమును ముద్దుగొనుచు ♦ సముగం బగుచున్

తే. రత్నజాలపరిష్కృత♦రమ్యరథ్య,మానగృహముల మెఱయుచు ♦ మఱి మహేంద్ర,
సదనమో యనఁ దుబలేని ♦ సవురు పొసఁగి,దివ్య మగుపితృతండ్రిసుం దిరముఁ జొచ్చి

తే. విల్లుకాఱును సుభటులు ♦ విడుచ కెపుడు, కాపుసేసెడిమూఁడుక♦క్ష్యలను రథము
తోడ మిత్రులతో దాఁటి ♦ తోయజాక్షుఁ, డవలిరెండును గాల్నడ ♦ నధిగమించి

ఉ. అచ్చటఁ దోడవచ్చినసహా♦తాళుల నెల్లను నిల్పి తండ్రి పే
రిచ్చఁ జరించునంతిపురి ♦ కేగ రఘూద్వహుఁ డంత లోకులుల్
గ్రచ్చఱ రాముఁరాకకయి ♦ కాచి వసించిరి ద్వారసీముఁ జం
పెచ్చ మహార్ణవంబు కున♦లేశునిరాకకు వేచునట్లు గై. ౮౯-౧

శ్రీరాముఁడు దశరథునిస్థితికి వగచుట

చం. చని యట రామచంద్రుఁడు వి♦శాలశుభాసనమందుఁ గైకతోఁ
బెనువనటల్ నిజాననము ♦ విహ్వలపాటున వాడువాఱఁగా,
గనుఁగవ నశ్రుధార లొలుక♦ం బెడమోము మయియున్నతండ్రిఁ దాఁ
గని యభివాదనం బొనరఁ♦గాఁ బచరించి వినీతిమంతుఁ డై ౮౯-౨

కం. పిమ్మటఁ గైకేయీపాదమ్ముల న్సెన్నాలి నిలువ ♦ దశరథుఁ డతిదో
కమ్మున రామా యని వాక్యమ్మును నొం డనఁడు చూడఁ ♦ గాఁడు సుతునిన్.

కం. మున్నెన్నఁ డెఱుంగనియా,పన్నదశం గుందు నృపతి♦భయదాకృతిఁ దాఁ
గన్నులఁ గని రాముండును, బన్నగము త్రొక్కువాని♦పగిది న్వెఱచెన్. ౮౯-౪

చం. అనుపమశోకకర్శితుని, ♦ హర్షవిహీనుని, నష్టచేతనున్
ఘనతరదుఃఖనిశ్వసనుఁ ♦ గష్టదశావశు, రాహుపీడితా
ర్కునిగతి, క్షోభితాంబునిధి♦కోపున, ఉబ్బుఱ లాడినట్టిస
న్మునిసలె, నున్నవానిఁ గని ♦ తొట్రిలుపాటునఁ దాను నట్టు లై ౮౯-౫

కం. జలనిధి పరువంబునవలెఁ, గలఁతంబడి కలుగరాని♦గతి భూపతికిన్
గలిగె నెటో యని తనలో,పల నిటు చింతించె రామ♦భద్రుఁడు భీతిన్. ౮౯-౬

ఉ. అక్కట నన్నుఁ జూచి ముఖ♦మందు దపు డేల వికాస మూనఁడో?
యొక్కెడ దేనికేని గినుక ♦ నూనియు మున్ననుఁ జూచినంతనే
మక్కువ గారవించు, నల♦మార్గము నప్పినజాడ దోఁచె, నా
దిక్కును జూచి యిప్పు డతి♦దీనతఁ గుందెడి, నేమి హేతువో? ౮౯-౭

కం.అని మది నాలోచించుచుఁ, బెను పగుశోకమున మిగుల ♦ విహ్వలుఁ డగుచున్
దనమోము వెల్లఁబాఱఁగ, ననఘుఁడు భీత్యార్తియుక్తి ♦ బ్రాంజలి యగుచున్.

శ్రీరాముఁడు కైకను దశరథుదుఃఖపాటునకుఁ గారణ మడుగుట.

ఉ. ఉల్లము దల్లడిల్ల వ్యస♦నోద్గతిఁ గైకయివంకఁ జూచి యో
తల్లి! ప్రమాదపాటునను ♦ ద ప్పొకఁ డే నొనరింపఁ దండ్రి, కి
ట్లొల్లఁడు నన్నుఁ జూడ, మొగ♦మోడెడుఁ బల్కఁగ నప్రసన్నుఁడై,
చెల్లఁ దదీయకారణముఁ ♦ జెప్పవె, తేర్పవె నీవ యేనియున్. ౪౯౯

ఉ. నాపయి నెంతయో నెనరు♦నం జరియించెడు నప్డు దండ్రి, దా
నోపఁడు మాటలాడ నిపు ♦ డోజననీ! యిది యేమి దేహసం
తాపమొ? చిత్తవేదన యొ? ♦ ధారిణిఁ బుట్టినజీవి రోగసం
తాపముఁ గాంచ కుండునె, స♦దా సుఖ మబ్బునె దేహధారికిన్? ౫౦౦

కం.వినఁడు గదా భరతుని కడ,తనయుని విషయంబునందుఁ ♦ దా నశుభంబుల్
కనఁడు గదా కీడును నా,జననులపట్లను వీత♦సమ్మదుఁ డగుచున్. ౫౦౧

కం.ఏవిషయ మైనఁ జెప్పినఁ, గాఢింపక తండ్రి నొవ్వఁ♦గా మూర్తం బేఁ
జీవింప నొల్ల ధర నే, నేవిధి జీవింతుఁ గుపితుఁ ♦ డేనియుఁ దల్లీ. ౫౦౨

కం.సత్యముగఁ దనకుఁ దరణో,చిత్యము గల దేహ మిచ్చి ♦ క్షితిఁ బ్రోచినయా
ప్రత్యక్షదైవమున క,ప్రత్యయమునఁ దండ్రి కెనఁడు ♦ ప్రతిభాషించున్. ౫౦౩

కం.ఈవిధి జనకుఁడు నగవఁగ, నీ నభిమానంబుబలిమి ♦ నెగ్గించుచుఁ గో
పావేశంబున నోతల్లీ! నఱుగొడ్డంబు లాడ♦లేదుగ చెపుమా. ౫౦౪

కం.నిక్కము వచింపు నృపతికి, నెక్కరణిని వచ్చెఁ బూర్వ ♦ మెఱుఁగనివ్యథ దా
నుక్కడి నేటికి నీగతి, నక్కట యింతకును మూల ♦ మాడుము దేవీ. ౫౦౫

కం.అనురామచంద్రుమాటలు, విని లజ్జ దొఱంగి మదిని ♦ వికలత లేకి
ట్లనుఁ గైక యతనిఁ గనుచును, దనహిత మేమదిఁ దలంచి♦తగ వెంచకవన్. ౫౦౬

ఉ. కోపము లేదు రాజునకుఁ ♦ గోసలరాజతనూజ! మేనికిం
దాపము లేదు, మానసము♦నం గలకోర్కి వచింప నీ కెదఁ
గోపము వచ్చునో యనుచుఁ ♦ గొంకెడి, నే వచియింతునా? మన
స్తాపము దీఱు రాజునకుఁ ♦ దప్పక నీ వది చేసి తేనియున్. ౫౦౭

కం.ప్రియుఁ డగునీతో నె ట్ల,ప్రియమును వచియింతు ననుచు ♦ భీతిల్లుట నా
ల్కయు రా దితనికి నీతో, నయముగ మాట్లాడ; నందు♦నా యది తనయా? ౫౦౮

ఉ. మున్న యొసంగి నాకు వర♦ముల్ బహుమానపురస్సరంబుగాఁ
బన్నుగ నిప్డు కోరినను ♦ బ్రాకృతునట్టులఁ గుందుచున్న వాఁ

దన్న! ప్రతిజ్ఞ చేసియు గ♦తాంబుల సేతువుఁ గట్టఁ జూచెడి,
నృశ్నమ కాక న్యాయ మగు♦నా తనమాటయె తాను దప్పఁగన్? ౫౦౯

ఉ. నాయన! ప్రాజ్ఞు లెల్ల భువ♦నంబులమూలము ధర్మ మండ్రు, మీ
నాయన నీవయి న్ననరు♦నం, గడు నాపయిఁ గిన్కఁ జేసి, తా
నీయెడఁ దప్ప కుండుగతి ♦ నీ వయినన్ గురుబుద్ధి మేలు గా
నీ యది కీడు గాని సుత ♦ నెమ్మి నొనర్చెద వేని చెప్పెదన్. ౫౧౦

కం.భూపతితలంపుఁ జెప్పెద, నాపలుకులు వ్యర్థముగ నో♦నర్పవ యేనిన్
నీవయి మోమోటను దా,నై పలుకఁడు నీకు నప్రి♦యుంబో యనుచున్. ౫౧౧

కం.ఈకరణిని వచియించిన, కైకం గని కుతిలపడుచుఁ ♦ గడు రాముఁడు భూ
మీకాంతుసమక్షంబునఁ, బ్రాకటగతిఁ బల్కెఁ దనదు♦భావము దెలియన్. ౫౧౨

శా.ఇస్సీ తల్లి! యి దేటిమాట, తగవే ♦ యి ట్లాడ నన్ రామునిన్?
లె స్సాయెన్ నృపునాజ్ఞఁ జేసి విను వ♦హ్నిజ్వాలకున్ దేహమున్
భిక్షామాత్రముఁ జేసెదన్,విషము లే ♦ న్నే త్రావుదుం,గంధి రం
హస్సంరంభము మీఱఁ జొచ్చెదను, శం♦కాతంక మిం కేటికిన్. ౫౧౩

కం.భూమిపతి గురువు తండ్రియు, నామే లెదఁ గోరు నెపు డొ♦నర్తు నభీష్టం
బోమాత! బాసచేసెన, రాముం డిరుమాట లాడ ♦ రాఁ డెఱుఁగు మనన్. ౫౧౪

శ్రీరామునితోఁ గైక తన వరములవృత్తాంతముఁ దెల్పుట.

కం.చక్కనినడవడి గలయూ,చక్కనిసుతు సత్యవాది ♦ జనవినుతుని నా
టక్కరి జాణెత యిట్లను, నక్కను గరఁగించి చెవుల ♦ నుంచినమాడ్కిన్ ౫౧౫

ఉ. పూర్వము నిర్జరాసురుల♦పోరున నీజనకున్ సశల్యునిన్
గర్వితశత్రుదైత్యకోటికిని ♦ గైవసముం పడకుండ నేను యు
ద్ధోర్విని గాచితిం గొడుక! ♦ యొప్పుగ నిచ్చె వరద్వయంబు నీ
యుర్విధవుండు తత్ప్రతిగ ♦ నుత్తమశీల! కృతజ్ఞుఁ డౌటచేన్. ౫౧౬

కం.ఆ రెండువరంబులచేఁ, గోరితి నీతమ్ము భరతుఁ ♦ గువలయపతిఁగాఁ
గూరిమి నొనర్ప దండకఁ, జేరఁగ ని విపుడ చనఁగ ♦ శ్రీరఘురామా. ౫౧౭

కం నీతండ్రికి నీకును వి,ఖ్యాతిగ బొం కొదవకుండఁ ♦ గాచుకొనెద వేన్
సీతానాయక!విను సం,ప్రీతిన్ నాపలుకు దీర ♦ నృపతి కుమారా! ౫౧౮

సీ. అన్న! నాయాడిన ♦ పన్ని వింటివి గదా, జనకువాక్యము దప్పఁ ♦ జనకు మయ్య
పదునాల్గువర్షముల్ ♦ బహుళాటవులయందు, సంచరింపఁగ నిష్ట ♦ చనఁగదయ్య
నీయభిషేకంబు ♦ నెఱవేర్పఁ గూర్చిన, వస్తువుల్ భరతుకై ♦ వలయు నయ్య
పట్టాభిషేకసం♦భ్రమ మంతయును వీడి, జడలుఁ జర్మముఁ దాల్చి ♦ నడువ వయ్య

తే. వివిధ రత్న సమాకీర్ణ♦విపులవిభవ
యుక్తరథగజవాజిసం♦సక్తమైన
కోసలపురంబునందు నా♦కొడుకు భరతుఁ
డొప్పుగ నృపాలుఁ డయి యేలు♦చుండుఁ గాక. ౫౧౯

చం. అతులదయాళుఁ డైన వసు♦ధాధిపుఁ డీవరయుగ్మ మిచ్చియు
న్నతి చెడినట్టు లార్తి వద♦నం బిటు వెల్వెలఁ బోవుచుండ నీ
గతి నినుఁ జూడ నోడె నస♦ఘువ్రత! యీతని మాటఁ జల్పి యీ
క్షితిపతి సత్యవాది యను♦కీర్తిని నిల్పి తరింపఁ జేయుమీ. ౫౨౦

ఉ. ఈవిధ మైననిష్ఠురము ♦ లెన్నియొ పల్కిన ధీరబుద్ధి శో
కావిలతం గనండు మది♦యందున యే నసుమంత యేని, భూ
మీవిభుఁ డంతయు న్విని స♦మిద్ధవియోగమహాగ్నిఁ గ్రాఁగుచున్
వావిరి తాపవేగమునఁ ♦ బల్లటిలెన్ సుతశోకతప్తుఁ డై. ౫౨౧

## అరణ్యమునకుఁ బోవ శ్రీరాముఁ డంగీకరించుట.

చం. మరణసమానముల్ సవతి♦మాతనుడుల్ గడునప్రియంబు లా
పరబలమర్దనుండు విని ♦ భావమునం దొకఁ యింతయున్ వ్యథా
భరమున స్రుక్క కిట్లనియె ♦ భామిని కైకకు, నింతమాత్రకా
నరపతి దుఃఖ మందెడిని ♦ న న్ననిపల్కఁగ నొల్ల కక్కటా? ౫౨౨

కం. జెడలను దాలిచి నారల, నెడపక ధరియించి తల్లి! ♦ యిప్పుడె చనుదున్
బెడిదపుటడవులకును నృపు, నుడువుల సార్థకముఁ జేయ ♦ నూఱొక్కనాఁడున్.

ఉ. నా కిది చెప్పనన్న జన♦నాయకుఁ డేటికి మున్ను వోలె నా
రాకకు నన్నుఁ జూచియును ♦ రంజిల నోపఁడు, నీసమక్షమం
దే కలభంగిఁ జెప్పెద, ని♦దే వనిఁ జీరజటాధరుండ నై
నీ కెదఁ బ్రీతిగాఁ జనెద ♦ నెమ్మది నూఱడు, మల్క మానుమీ. ౫౨౪

కం. హితుఁడఁట మఱి జనకుండఁట, కృతజ్ఞుఁ డఁట గురువును నఁట ♦ నృపతియు నఁట! స
మ్మతి నమ్మి చేయు మన్నను, క్షితి బ్రదికియు నేల ప్రియముఁ ♦ జేయక యుందున్.

ఉ. ఒక్కటికిం దపింతు, నది ♦ యుల్లముఁ గ్రాఁగెడిఁ జూడఁ జూడఁగా,
నక్కట తానుగా నృపతి ♦ యాదట నన్బిలిపించి నాయనా!
మక్కువ చేసెదన్ భరతు ♦ పట్టాభిషిక్తుఁ జేయఁగ నంచుఁ గూర్మి పెం
పెక్కఁగ నొక్క మాట యనఁ ♦ డేయపరాధ మొనర్చినాఁడనో.

చం. భరతున కిమ్మ టన్న బహు♦భాష ల వేటికి మున్నె[1] జానకిన్
ధరణిని బ్రాణముల్ ధనవి♦తానము నీయఁగ లేనె నేనుగా?

---

[1] మున్నె = వినాహామునకుఁ బూర్వ మే.

ధరణిపుఁ డంతె కాక మఱి ♦ తండ్రియుఁ దానుగఁ గోర, నీకు ము
త్కరముగఁ జేయ కుండుదునె ♦ త న్నిల సత్యధురంధరప్రథున్? ౨౭

చం. ధరణిపుఁ దేర్ప వమ్మ, వసు♦ధాగతలోచనుఁ డౌచు బాష్పముల్
గురియఁగ నేల దుర్లభపడ, ♦ గొబ్బున మాతులునింటికిన్ సుతున్
భరతునిఁ దేర దూతలను ♦ బంపుము రాజు ననుజ్ఞఁ; గాన కే
సరిగెదఁ, దండ్రి చెప్పఁ డను♦నంకిలి పెట్టను, నొప్పు ద ప్పనన్. ౨౮

చం. అనురఘురాముని వాక్యముల ♦ కాత్మ నితాంతము సంతసించి యా
వనితయు నట్ల చేసెదను ♦ బంపెద దూతలఁ దోడితేర నా
తనయునిఁ, గాలయాపనముఁ ♦ దాళను, నానుతువార్త లేటికిన్?
వనముల కీవు తర్లు మెడ♦పల్కక, సంతసకట్టు పోకకున్. ౨౯

ఉ. సిగ్గున నీదుతండ్రి తమి ♦ సేయఁడు చూ పలు కాడ, దానఁ దా
సగ్గిసముగ్గిసల్ గొనెడిఁ ♦ జాలఁగ దైన్యము పేర్మి, దాని నీ
వెగ్గుగఁ జూడఁ బోకు, వని ♦ కీ వటు పోయెడిదాఁక త్రేఁడు దా
నిగ్గతిఁ గూడు నీళ్లు గొన♦కేని యిలం బడియుండు నం చనన్ ౩౦

చం. చెలి నుడు లాలకించి, పతి ♦ ఛీ యిది యెంతటికష్ట మంచు లోఁ
గలఁక వహించి, శోకమునఁ ♦ గ్రాఁగి, శయంబున సొమ్మసిల్లుడున్,
బలియుఁడు లేవ నెత్తి, సతి ♦ పల్కెడుమాటల కష్ట యోజనన్
జలిపె వనాళికిం జనఁ గ♦శాభృశతాడితఘోటకం బనన్. ౩౧

కం. ఆచెడుగు దన్నుఁ బలికిన,వాచానారాచములకు ♦ నగఁ జెందక సీ
తాచపలాక్షీపతి యా,పాపపుసతి కనియెఁ దనదు♦భావము దెలియన్. ౩౨

చం. అతివ! ధనార్జనంబ పర♦మార్థముగాఁగఁ దలంపఁ బోను, నీ
క్షితి నిలువంగ నైనఁ దమి♦సేయఁ జుమీ, నిజ మీ వెఱుంగుమీ,
యతులితసత్యధర్మనియ♦మైకరతిం జరియించుసంయమి
ప్రతతులతోడ సాటి నని ♦ బాగుగ నిల్పుము దేవి! నీమదిన్. ౩౩

చం. ఇది యన నెంత? దేవి! విను♦మీ ప్రియ మెయ్యె దొకంపు తండ్రికిన్
మదిగొని చేయఁ గల్గినను ♦ మానక ప్రాణము లిచ్చి యైన నే
నది యొనరించినాఁడ నెటు♦లైనను; దండ్రిసపర్యకంటెఁ ద
ద్గదితము దీర్చుకంటె ధరఁ ♦ గల్గునె మే లగుధర్మ మేదియున్? ౩౪

కం. జనకుఁడు పొ మ్మన కున్నను, జననీ! నీమాటఁబట్టి ♦ చనియెద నిపుడే
వనములఁ బలునాళ్లేఁడులు, గొనకొని వసియింప నీదు♦కోరికఁ దీర్పన్. ౩౫

కం.బలవంతపెట్టి భూపతి, నలయించితి వొక్కమాట ♦ నన వైతివి నా
కెలమిగ నియంత్రి వయ్యును, దెలియఁగ లేవైతి నాదు♦ధీగతి గుణమున్. ౫౩౬
కం.తల్లియనుజ్ఞం గొని నా,వల్లభ నూరార్చి వచ్చు♦వఱకు విళంబం
బుల్లమున సైఁపు మిదె నీ, కుల్లాసముగాఁగ నడవి ♦ నుండఁగఁబోదున్. ౫౩౭
కం.భరతుఁడు రాజై తండ్రికి,గురుమతి శుశ్రూష సేయ ♦ గఁఱుకొను నట్టుల్
వరమతిఁ జెప్పుము తల్లీ, ధరఁణి నిది సనాతనంపు♦ధర్మము కైకా. ౫౩౮
కం.అనురామునివచనంబులు, విని దుస్సహాశోకభార♦వేగంబునఁ ద
జ్జనకుఁడు వావిడిచి మహా,స్వనమున నా వఱచినట్లు ♦ ఫలవింపంగన్. ౫౩౯

### ⊷ శ్రీరాముఁడు కౌసల్యాగృహమునకుఁ బోవుట. ⊶

చం.తలగొని మ్రొక్కి తండ్రికిని ♦ వందన మాజగజంత కైకకుఁ
సలిపి సురోచి యంతిపురి ♦ చయ్యన వెల్వడి యశ్రుపూర్ణదృ
క్కులు ననుజుండు వెన్కొనఁగఁ ♦ గ్రోధసముజ్జ్వలితాంతరంగుఁ డై
వలనుగ నాభిషేచనిక♦భాండములఁ వలగొంచు రాముఁడున్ ౫౪౦
చం.ఇవి భరతాభిషేకమున ♦ కేర్పడుఁ గాక య టంచు వేఁడుచుఁ
దవులఁగ నీక వానిపయిఁ ♦ దద్దయు దృష్టియు రక్తి; ఛత్రముఁ
సవు రగుచామరంబులును ♦ స్యందనముఁ స్వజనంబు వీడి తా
నవికలితేంద్రియుం డయి జ♦నావళిదుఃఖముకై నగర్చుచున్. ౫౪౧
చం.చనియెను దల్లిపీటికయి ♦ సర్వసుఖంబులు రాజ్యభోగముల్
పొనుపడినఁ ముఖంబునను ♦ బొల్పు దొఱంగదు యోగి కట్లు రా
మునకు, తుపాగమంబు జన♦మోహనమూర్తికి శీతరశ్మికిఁ
గనఁగ మలీమసత్వ మొసఁ♦గంగ సమర్థమె యెన్నఁడేనియున్. ౫౪౨
ఉ. ఏతదనిష్టవార్త వచి♦యింపఁగ నేగెడురామచంద్రుప్ర
స్ఫీతముఖాంబుజంబున వి♦శేషముగానరు చూప ప్రౌఢ్వేఁ
ధీతతయుక్తిమై శరదు♦దీర్ణకరుండు మృగాంకునట్లు తే
జోతిశయంబు మానఁడు, ప్ర♦హర్షము వీడఁడు కొంచె మేనియున్. ౫౪౩
చం.కదుకొనుదుఃఖముఁ హృదయ♦కంజమునంద యణంచి లక్ష్మణుం
డుదితపరాక్రముండు దన♦యొప్పునఁ దోఁ జనుదేర లోకులఁ
ముదమున మంచిమాటలను ♦ మోదిలఁ జేయుచుఁ జొచ్చె మాతృస
త్సదనముఁ జెప్ప క్కాత్మలయ♦శంక నిజార్థవిపత్తి నేరికిన్. ౫౪౪
ఉ. అంతిపురంబు వీడి చని ♦ నంతన రాముఁడు ఘూర్ణిల్లటంచు శు
ద్ధాంతనితంబినీజనుల♦యార్తనినాదము మిన్ను ముట్టె నే

కాంతము, రామచంద్రుఁడు వ♦నాంతరవాసముఁ జేయు నంట, హా
యెంతలు పుట్టె నేమిగతి ♦ యేగతిఁ దాళఁగ? నేమిచేయఁగన్? ౫౪౫
చం.జనకుఁడు చెప్ప కుండినను ♦ సర్వము నంతిపురంబుకృత్యముల్
చనవునఁ దీర్చి యందఱకు ♦ సమ్మతి యై శరణంబు దిక్కు నై
జననిని గొల్చురీతిఁ దన♦జన్మముఁ దొట్టి నితాంతభక్తి మై
మనలను గొల్చుశశ్వద్గుణ♦మాన్యుఁడు రాముఁడు కాన కేగెడిన్. ౫౪౬
చం.తనయెడ నెవ్వరైన నొక♦త ప్పొనరించినఁ బ్రల్లదంబు లా
డిన విని కోపగింపఁడు, వ♦డిన్ విడనాడును క్రోధనీయము,
ల్గినిసినవారియందుఁ గృప ♦ లేశము మానఁడు. కోసలాత్మజా
తనయుఁడు రామచంద్రుఁడు సు♦ధన్యుఁడు కానల కేగు నయ్యయో. ౫౪౭
కం.గతి యెవ్వఁ డఖిలభూత,ప్రతతికి నటువంటిపుణ్యు ♦ రాముని వనికిన్
మతి దప్పి పనుచు భూపతి, కుతలముఁ దనవాత వేసి♦కొన కెటు లుండున్. ౫౪౮
కం.అని దేవెరు లందఱు భీ,జనకంబుగఁ దన్నుఁ దెగడి ♦ సరవమ్ముగ గో
లున నేడ్వ దశరథుం డది, విని తల్పమునందు క్రుంగె ♦ విన్నఁదనమునన్. ౫౪౯
సీ. సౌమిత్రిసహితుఁ డై ♦ రాముఁడు దద్ధ్వని, విని దుఃఖము నణంచి ♦ మనమునందు
నెఱిఁ గుంజరం బన ♦ నిట్టూర్పు విడుచుచుఁ, దల్లియంతిపురంబుఁ ♦ దఱిసి యందు
ద్వారపాలకు వృద్ధుఁ♦బరమపూజితు మఱి, యందు మూఁగిన యట్టి♦యఖిలజనులఁ
జూచి వారలు దన్నుఁ ♦ జూచి జయారవ,పూర్వకంబుగ లేవఁ ♦ బోవు చనల
తే. నాది కక్ష్యను దాఁటి రెం♦డవది సొచ్చి,యందు నృపమాన్యులై వృద్ధు♦లైనయట్టి
వేదసంపన్ను లగుపూజ్య♦విప్రవరులఁ, జూచి వారికి రాముండు ♦ సారెది మ్రొక్కి
ఉ. ఆవలి కక్ష్యద్వార మన♦యంబును గాచుమునల్ల బాలకుల్
వావిరి చేరఁబోవుటయు ♦ వారలు దీవన లిచ్చి యేగి సీ
తావిభురాక చెప్పనెడఁ ♦ దానును రేయి వ్రతంబుఁ బూనుచున్
వేవిన విష్ణుపాదపద♦వీపరిణద్ధమనోంబుజాతయై ౫౫౦

శ్రీరాముఁడు కౌసల్యను జూచుట.

సీ. సుతహితార్థంబుగ ♦ నతిభక్తి శ్రీవిష్ణు,పూజ గావించెడి♦పుణ్యశీల
వెలివలిపము గట్టి ♦ నెలమి విధ్యుక్తంబు, వ్రతపరాయణ యైన♦పరమసాధ్వి
మంత్రపూతంబుగ ♦ మంగళాకలిత యై, యగ్ని వేల్చుచు నున్న♦యమలచరిత
నిష్ఠలఁ గృశియించి ♦ నిజదైవతము నీటఁ, దనుపుచు నున్న కాం♦తామతల్లిఁ
తే. వల్లిఁ గని దేవ పూజ కౌ♦దధిఘృతంబు
హవియు లాజలు మాల్యపా♦యసము లార

నిండుఁగడవలు సమిధలు ♦ నిగ్గించుఁ
గృసరమును గాంచి యాఁకొను ♦ నెఱఁగె భక్తి. ౫౫౨

కం. వచ్చినసుతుఁ గని యచ్చపు,ముచ్చట గోడిగ కిశోర♦మునుబోలె నెదు
ర్వచ్చి తమి హెచ్చఁ గౌఁగిటఁ,గ్రుచ్చి శిరము మూరుకొంచు ♦ గురువత్సలతన్

కం. కౌసల్యాసతి యన్యదు,రాసద తేజుని రఘూద్వ♦హాగ్రణి నిజహ
స్తాసమకలశోదధిరా,కాసితకరుఁ బ్రియహితంబు♦గా దీవించెన్. ౫౫౪

కం. స్థవిరుల మహాత్ముల ధ,ర్మవిదుల రాజర్షి వరుల♦ప్రథ యాయువు నె
రవణిల్లు నీకు; ధర్మము,సవు రొప్పెఁ గులాన రామ♦చంద్రకుమారా. ౫౫౫

కం. చనుమీ యిప్పుడ తండ్రిని, గనుమీ సత్యప్రతిజ్ఞ ♦ గలఁ డతఁ డీయన్
గొనుమీ యువరాజత్వము,మనుమీ చిరజీవి వయి కు♦మారా యనుచున్ ౫౫౬

కం. అనుకంప భోజనార్థం, బునిచినయాపీఁట నంటి ♦ యొయ్యనఁ గేల్గా
జననికిఁ గించిద్వ్రీడా,ననుఁ డై కేల్మోడ్చి యి ట్లు♦నంగఁ దొడంగెన్. ౫౫౭

కం. అతిమాత్రవినయగుణ మా,క్షితిజాపతికిన్ స్వభావ♦సిద్ధం బందున్
నుతగుణ జననియెడం గల,యతిభక్తిని వినతుఁ డగుచు ♦ ననుఁ దనపోకన్. ౫౫౮

శ్రీరాముఁడు తల్లితోఁ దా నరణ్యమునకుఁ బోవువార్తఁ జెప్పుట.

కం. తల్లీ! తెలియవుగా యిపు, డుల్లం బగలించుదుఃఖ ♦ ముగ్రత నీకున్
సల్లలితగుణకు సీతకుఁ, జెల్లంబో లక్ష్మణునకు ♦ సిద్ధించుటయున్. ౫౫౯

ఉ. ఏటికి నీసుఖాసన? మి♦దే చనువాఁడను దండకాటవీ
వాటికి,విష్టరాసనము♦పై వసియింపఁగ వేళ నాకుఁ దాఁ
బాటిలె,మౌనిరీతి మధు♦పక్వఫలంబుల మెక్కి మాంస మ
న్నాట దలంప కుందుఁ బదు♦నాలుగువర్షము లేఁ దపస్వి నై. ౫౬౦

కం ధరణిపతి యౌవరాజ్యము, భరతునకు నొసంగు నన్నుఁ ♦ బదునాల్గేఁడుల్
చరియింపఁ బంపె దండక, ధరియించి మునీంద్రు లాపుఁ ♦ దల్లీ యిపుడే. ౫౬౧

చం. వనముల నాలు నెన్నిదియు ♦ వత్సరముల్ విజనస్థలంబులన్
గొనకొని సంచరించుచును ♦ గూరలు గాయలు వేరువెల్లఁకుల్
దిని,ముని రీతి మాంసము మ♦దిం దలపెట్టక, ప్రొద్దుపుచ్చుచుం
డుదు నన గొడ్డటన్ నఱుక ♦ దొల్లెడుకాననసాలమో యనన్ ౫౬౨

చం. దివి విడి నేలపైఁ దొరలు♦దేవతనాఁ బడె, ని ట్లరంటి నా
భువిఁ బడియున్నతల్లి సుఖ♦పూజ్యను మూర్ఛితఁ జూచి వేగ రా
ఘవుఁడును లేవ నెత్తి కడు♦గాటపుప్రేఁకను ద్రెళ్లినట్టిగో
డివవలె ధూళి బ్రుంగుడుఁ గ♦డిందిగఁ గేలను మెల్లఁ బాపుచున్ ౫౬౩

కం. చెంగటఁ గూర్చుండినసుతు,నిం గని సౌఖ్యార్హ పలుకు ♦ నెఱశోకమునన్
ముంగలఁ గలసౌమిత్రి వి,నం గన్నులయందు జలక♦ణంబులు గురియన్ ౫౬౪

శ్రీరాముఁ డరణ్యమునకుఁ బోవుట విని కౌసల్య దుఃఖించుట.

ఉ. నాయన! నీవు నాకడుపు♦నన్ జనియింపక యుండి తేని య
ద్యాయతదుఃఖ మీపగిది ♦ నందక యుండుదుఁ గాదె? మేలు గా
దే యిటువంటిదుఃఖములఁ ♦ దీఱుటకంటెను గొడ్డురాల నై
యే యెటులో ధరన్ దినము ♦ లేగఁగఁ ద్రోచుచు నుంట పుత్త్రకా? ౫౬౫
కం. బిడ్డలు లే రని యొక్కటె, గొడ్డుంబోతులకుఁ జింత ♦ కొడుకులు పుట్టన్
దొడ్డగ బ్రదికిన మేలగు, బిడ్డా! యిటులైన నేమి♦ప్రియ మగుఁ జెపుమా. ౫౬౬
ఉ. అక్కట! పెద్దపెండ్ల మని ♦ యైన విభుండొకనాఁట నైన న
న్నక్కునఁ జేరఁదీసి బహు♦మానపురస్సరవాక్కు లాడి యిం
పెక్కఁగ సౌఖ్యమో శుభమొ ♦ యేమియుఁ గూర్ప నెఱుంగఁ, బిడ్డఁడే
నొక్కఁడు పుట్ట నట్టయిన ♦ నొందుదుఁగా సుఖ మంచు నుండుదున్. ౫౬౭
చం. చనినది పోవని మ్మిఁక న♦సహ్యము లై వినరానిమాటలన్
మన మవియంగ నాడ నధ♦మల్ సవతుల్ వరకాంత నెట్టులే
వినఁ గలదానరా, సతికి ♦ వెండియుఁ గష్ట మొకండు గల్గునా?
చనినను నీవునున్ వనికి ♦ శక్యమె సైఁప ననంతదుఃఖమున్? ౫౬౮
కం. పలువతనంబున సవతులు, పలుకఁగ దుర్భాషణములు ♦ వరవర్ణిని నై
కలనా వినుచుండఁగ? హా, తెలియును గద నాదుదుఃఖ♦దీనతలతుదిన్. ౫౬౯
కం. నీ వుండఁగనే నాకడ, నీవిధి సంప్రాప్త మయ్యె ♦ నిక్క; ట్లింకన్
నీవును నడవుల కేగినఁ, జా వొక్కటిదక్క నేది ♦ శరణము తనయా! ౫౭౦
చం. మగనికిఁ బ్రేమ లేమి కను♦మానము లే, దిఁకమీఁదఁ బుత్త్రకా
వగ చెడఁ గైకతొత్తులకు ♦ వత్తును పాటిగఁ; గాదు కాద; యె
ట్లగు నది? వారికంటె నధ♦మాధమ నయ్యెద రామచంద్ర! యే
మిగ మెయిఁ దాల్చు దాన? నెది ♦ మేర వచింపుము దుఃఖవార్ధికిన్? ౫౭౧
ఉ. హాయనినోటిమంచి నెడ♦పా దడపా ననుఁ గొల్చు వారలే
నేయెడ నైన నొక్కపరి♦యేనియు నే మని పల్కరించు వా
రో యనఁ బోరు నేఁ బిలువ, ♦ నొల్లరు మోమును జూప, నింకఁ గై
కేయితనూజుఁ జూచి వెఱఁ ♦ గీడ్పడుచున్ సుత! దేని కేడ్చెదన్. ౫౭౨
కం. మటమట లాడెడిమోమును, జిటచిట యని కసరికొట్టు♦చీఁదఱపలుకుల్
కుటిలగుణంబును గల యా,పటుమాయల కైకమోముఁ ♦ బరికించు టెటో. ౫౭౩

మ. పదునేడేఁడులనుండి[1] యెప్పుడొకొ నా♦భంగంబు దుఃఖంబులున్
దుదిగాంచున్ సుఖ మబ్బు నంచు మది నెం♦తో వేచి మోదింపఁగాఁ
దుద కిట్లయ్యెనుగా! సపత్నులదురు♦క్తుల్ వించు నెన్నాళ్లయో
మది క్షీణించుచు నుండ నేర్తుఁ దనయా ♦ మానంబుఁ బోకార్చుచున్. ౫౭౪
కం. ఎప్పటికి నాకు దుఃఖము, దప్పు నటం చోర్తు సవతి♦ధౌర్త్యం; బది నే
నెప్పగిదినొ యోర్చినను, ముప్పునఁ దద్విప్రకార♦ముల నెటు సైఁతున్. ౫౭౫
చం. పొలుపున నిండుఁజందురునిఁ ♦ బోలిననీదుముఖారవిందమున్
సలలితరీతి నొక్కనిమి♦షంబును జూడక యుండ నేర; నే
తలఁపున జీవము న్నిలుపఁ ♦ దాళుదురా పదునాల్గువర్షముల్
చెలువతి నిన్నుఁ జూడకయె ♦ చిన్నికుమారక! దీనురాల నై? ౫౭౬
కం. వ్రతములు తప ముపవాసము, వెత లెన్నియొ పడుచు దుఃఖ♦వృద్ధికిఁ గాఁగన్
సుతరత్నమ! నిను సాఁకితి, నతులితనిర్భాగ్యురాల ♦ నగు నే నకటా. ౫౭౭
ఉ. ఎక్కటి నీవు కానలకు ♦ నేగెద నన్నను నాదుగుండియల్
వ్రక్కలు గామిచే నినుమొ ♦ రాయియొ యూ నిది నిశ్చయంబ, యొం
డొక్కొకటి యైన వానల మ♦హోద్ధతిఁ బాటెడి క్రొత్త వెల్లికిన్
జిక్కినయొడ్డు నా సనుసి ♦ చేష్పడ కుండునె యింత కయ్యయో. ౫౭౮
చం. సుగుణము లేదు నాకు, యము♦సుందిరమందుఁ దలంబు నేనియున్
దొరకదు నిక్క, మేల యనె♦దో విను నీదుప్రవాసవార్తకున్
భరపడి యేచ్చు నన్ను మృగిఁ ♦ బట్టి బలాత్కృతిఁ గొంచుపోవు కే
సరికరశేన్ యముం డిపుడ ♦ సత్వరుఁడై కొనిపోవ కుండుటన్. ౫౭౯
చం. అనఘ! సహింపరానివిపు♦లార్తికిఁ జిత్తము తుక్కుతుక్కలై
చన, దిది యుక్కుతుంట యగు ♦ సందియ మింతయు లే; దకాలమం
దొవరదు దేహికి న్మరణ; ముగ్రపునోములు దానముల్ తపం
బును వెతఁ గూర్చె, ము న్నెపుడు ♦ పొందఁగ లే దిటువంటిదుఃఖమున్. ౫౮౦
కం. కొడుకులు కొడుకు లటంచును, గొడుకా! సలిపితిని నేను ♦ ఘోరతపంబున్
గడకు నది చవిటినేలను, నిడువిత్తన మయ్యె నేమి♦యేడ్తును జెపుమా. ౫౮౧
కం. గురుతరదుఃఖహతాత్ములు, మరణింపఁగ శక్యమేని ♦ మత్సుత! నీవీ
సరణిఁ జన లేఁగఁ బాసిన,సురభి యనం బోనె యమునిఁ ♦ జూడఁగ నిపుడే.
చం. బ్రదికియు నేమిసార్థకము♦రా సుత! నే నిఁక నిన్నుఁ బాసి యీ
సదనమునందు; దూడబడిఁ ♦ జక్కఁగ నేగెడిబక్కగో వనం

[1] ఇప్పుడు శ్రీరాముల కిరువైయయిదు సంవత్సరములు. ఉపనయనము మొదలు ౧౭ ఏండ్లు. అప్పటి నుండియేకదా ద్విజత్వప్రాప్తి. అప్పటినుండియే యెప్పుడు బిడ్డలు పెద్దవారై తమ్ముద్ధరింతురో యను నాశ కలుగును.

బద చనుదెంతు నీబడిని ♦ మానను న న్గానిషా మ్మటంచు నా
నుదతి దురంతశోకమున ♦ స్రుక్కెను గిన్నరి నా సుతార్థమై. ౫౮౩

→ లక్ష్మణుఁడు కౌసల్యతో రాముఁ డరణ్యమునకుఁ బోరా దని చెప్పుట. ←

కం. ఈసరణిని విలపించెడి, కౌసల్యం జూచి దైన్య♦కలితాననుఁ డై
యాసౌమిత్రియుఁ దద్వే, ళాసదృశము[1] లైనవాక్కు♦ల నవ్చియించెన్. ౫౮౪

ఉ. ఆఁడుది యాడినట్టిపలు♦కం దొకయాదరబుద్ధి నిల్పి యే
పోఁడిమి లేక రాజ్యమును ♦ భోగము లన్నియు మాని కానకు
న్వాఁడిమిఁ బాసి పోవు టన ♦ నామదికిన్ రుచియింప దయ్యెడున్;
తేఁ డన వృద్ధు వెక్కలి మ♦తిన్ మరుత్రిప్పులఁ జిక్కి యాడెడిన్. ౫౮౫

కం. మతి చెడి విషయసుఖైకని, రతుఁ డై విపరీతబుద్ధి ♦ రా జంగజచో
దితుఁ డై యేపలు కాడఁడు? సతివలలం జిక్కువాఁడు ♦ జడుఁ డగు టరుదే?

ఉ. తప్పదియేమొ నే నెఱుఁగఁ ♦ దథ్యము రామునియందు తేఁడు దా
నిప్పగిది న్వనావళికి ♦ నేగు మ టంటకు, నింతపాపమా?
యొప్పనివాఁడె యైన, నొక♦యొప్పమి దండితుఁ డైన, దూఱఁ గా
నెప్పు డెఱుంగ నే నెదుర ♦ నేనియుఁ జాటుగ నేని రామునిన్. ౫౮౭

మత్తకోకిలము. దేవకల్పు బుజున్ సుదాంతుని ♦ దేవి! శత్రుల కైన స
ద్భావుఁ డై ముద మిచ్చు వాని ని♦తాంతపుణ్యునిఁ బూజ్యునిన్
భూవరుం డొకతప్పు లేక యుఁ ♦ బుత్రు నెట్టిస్వధర్మసం
భావనం బురిఁ బాసి పొ మ్మనెఁ? బ్రాజ్ఞు లియ్యది మెత్తు రే? ౫౮౮

ఉ. పిల్లతనంబునన్ నృపుఁడు ♦ ప్రేలినచో నిటు ధర్మదూరతన్
జెల్లఁగ నిచ్చునే నృపతి♦నీతి నెఱింగినరాచబిడ్డఁ డో
తల్లి! యెవండు నైన సని ♦ తాలిమి పట్టఁగ లేక వెండి తా
నల్లన లక్ష్మణుండు జన♦కాత్మభవాపతితోడ ని ట్లనున్. ౫౮౯

→ లక్ష్మణుఁడు శ్రీరామునితో నరణ్యమునకుఁ బోవల దని చెప్పుట. ←

చం. ఇరుచెవి సోఁక కుండుమును♦పే విషయంబు ధరాతలంబు నీ
గురుతరశాసనంబునకుఁ ♦ గోల్కొనునట్లుగ నేను దోడుగాఁ
ద్వరపడి చేయుమీ, మఱి కృ♦తాంతసమున్ నినుఁ జాపధారి నై
దురమున నేను గాచి నిలు♦తున్ మఱి నీ కొకయడ్డ మున్నదే? ౫౯౦

ఉ. భాసురతేజ! తీవ్రశర♦వారపరంపర నిర్మనుష్యమున్
జేసెద, నింతలోనఁ బురిఁ ♦ జేప్పడ నాభరతాప్తు లెవ్వరేన్

---

[1] వేళాసదృశములు = సమయోచితములు. కావున లక్ష్మణుఁడు చెప్పినది పరమార్థము కాదనియు నన్నగుఃఖము తొలఁగింపఁగోరి చెప్పినదని గు నెఱుంగివలయు.

డాసినఁ జించి చెండెదను ♦ డాకను, మెత్తఁదనంబు చేత నే
వాసియుఁ గల్గఁబోదు, పరి♦భావితుఁ డౌఁ బరిపంథికోటిచేన్. ౫౯౧

కం.తనయాలికి లోఁబడి మన,జనకుఁడు పగతుండువోలెఁ ♦ జరియించినయేఁ
గనికరము లేక నలయుం, దునుమంగా నొండెఁ; జెఱను ♦ ద్రోయఁగ నొండెన్.

తే. కార్య మియ్యది యిదియు న♦కార్య మనుచుఁ, దెలియకైనను గర్వంబు♦బలిమినైనఁ
గాని తెరువునఁ జనియెడి♦వాని గురుని, నైన దండింపవలయు ధ♦ర్మైకనిరత. ౫౯౩

ఉ. ఏమిబలంబు నచ్చి ధర♦ణీశ్వరుఁ డేమినెపంబు పెట్టి నీ
భూమిభరంబు నీవలనఁ ♦ బూన్పక కైక కొసంగ నెంచెడిఁ?
శ్రీమహితా! నృపాలకుఁడు ♦ నీయెడ నాయెడ వైర మూని తా
నేమిగతిఁ ఘటించు నవ♦నీశ్వరుఁగా నలకైకపుత్రునిన్? ౫౯౪

మ. వినుమీ నామదిభంగి నోజనని దే♦వీ! భ్రాతృభావంబు మై
ననురక్తుండ భవత్తనూజునకు, స♦త్యాభీష్టదానాశుగా
సనరాజంబుల మీఁదఁ జేసెదను బా♦సఁ, సంజ్వలద్వహ్ని నేఁ
వని నేఁ రాముఁడు చొచ్చుచోఁ దలఁపుమా ♦ ప్రాగ్వర్తిగా నన్నదన్. ౫౯౫

కం సూర్యుఁడు చీఁకటివలెనే, వీర్యంబున నీదుమనము♦వేఁకి వెలార్తుఁ
గార్యం బిది చూడుఁడు నా,శౌర్యం బోజనని! రామ♦చంద్రుఁడు నీవున్. ౫౯౬

ఉ. అన్నను భ్రాతృభక్తి నతఁ ♦ డాడినయానుడు లాలకించి యా
పన్నదశాప్తి కేష్చుచును ♦ బంకజలోచన పుత్రుఁ జూచి యో
యన్న! భవత్సహోదరుఁడె ♦ యాడినపల్కుల నాలకించి తే
పన్నగ నీకుఁ జిత్త మెటు♦వచ్చు నటుల్ ఘటియింపు పుత్రకా! ౫౯౭

కవిరాజవిరాజితము.

మనమున నానవతాలు వచించిన♦మాటను బట్టి గృహంబున న
న్ననయము దుఃఖములందు మునుంగు మ ♦ టంటయు నీకును ధర్మమొకో?
ఘనమతి ధర్మము సల్పఁగ నీయెడఁ ♦ గల్గినచోఁ బరిచర్యల నఁ
దనుపఁగ రాదొకో, తల్లిసి గొల్చుట♦ ధర్మము గాదె తనూజులకున్? ౫౯౮

మత్తకోకిలము. నిండుభక్తి భజించి తల్లిని ♦ నిల్చి యింటనె మున్ను వి
ప్రుండు కాశ్యపుఁ డన్మునీశుఁడు ♦ పొందఁడే సురలోకముఁ;
దండిగౌరవమందు తేనికిఁ ♦ దక్కు వౌనొకొ తల్లి? నీ
వుండు మిందుఁ, బ్రవాసి వౌటకు ♦ నొల్ల నాజ్ఞ నొసంగఁగన్. ౫౯౯

మత్తకోకిలము. నిన్నుఁ బాసి వసింపఁ గల్గిన ♦ నిశ్చయం బిది పుత్రకా!
యన్న మేటికి నీర మేటికిఁ ♦ ప్రాణ మేటికి సౌఖ్య మం

చెన్న నేటికి? నీవు గల్గిన ♦ నిన్ని యున్నటు దోఁచుఁగా,
తిన్నచో నునుఁబచ్చికైన మ♦దిం బ్రియం బొనరించు రా! ౬౦౦

కం. నే నింట నేడ్చు చుండఁగఁ, గానలకున్ నీవు పోవఁ ♦ గాంక్షించెదవే
నే నొల్లను జీవింపఁగఁ, బూనుదుఁ బ్రాయోపవేశ♦మున్ నాతనయా. ౬౦౧

కం. నను వీడనాడి కొడుకా! వనములకుం జనెద వేని ♦ వచ్చును జుమ్మీ
ఘననిరయ మధ్యంబున, వననిధికిన్ బ్రహ్మహత్య ♦ వచ్చినకరణిన్. ౬౦౨

కం. ఇటు విలపించుచు నిజకట,తటముల బాష్పంబు లురలఁ ♦ దగ్ధయు దుఃఖ
త్రుటితహృదయ యగుతల్లికిఁ, బటుగతి రాముండు ధర్మ♦పద్ధతిఁ బలికెన్. ౬౦౩

## శ్రీరాముఁడు కౌసల్యాలక్ష్మణుల నూరార్చుట.

కం. తల్లీ! జనకునివాక్యము, నుల్లంఘింపఁగను శక్తి ♦ యున్నదె, నీవే
యుల్లమునఁ దలఁపు, మేగెదఁ, జల్లనిచూపులను జూడు ♦ సాఁగిలిపడెదన్. ౬౦౪

కం. జనకునివాక్యముఁ బాటిగఁ, గొని వ్రతి యగుకండుమౌని ♦ గూల్చెఁడె గోవున్
జననీ! ధర్మముసూక్ష్మతఁ, గని కాదె యొనర్చె? దానఁ ♦ గలిగెనె యఘముల్?

చం. ఇతరుల మాట లేల జన♦నీ! విను మాకులమందు మున్ సరి
త్పతి ఖననంబుఁ జేసినసృ♦పాలుకు సాగరు లుర్విఁ ద్రవ్వఁ జో
మతిఁ దమతండ్రిమాట గొని ♦ మానవనిష్ఠూరత భూతకోటులన్
హత మొనరింప రొక్కతమ ♦ ప్రాణవినాశము నోర్చి యేసియున్. ౬౦౬

కం. తండ్రి వచించె నటంచును, దీండ్రించుకుఠారధారఁ ♦ దెగ వ్రేయఁ డొకో
. . గంద్రలుగఁ గన్న తల్లిని, వేండ్రంబుగ భార్గవుండు ♦ వినమా దీనిన్. ౬,౦౭

కం. ఎందఱో మహానుభావులు, బృందారకసము లొనర్చి ♦ పితృవాక్యంబున్
జెందిరి యశంబు; నే నే, చందంబునఁ జేయ కుందు ♦ జననీ! చెపుమా. ౬౦౮

సీ. ఏ నొకండనె కాను ♦ హితగతిఁ బితృవాక్య,పాలకుల్ పెక్కండ్రు ♦ వసుధఁగలరు
నే నపూర్వపుధర్మ ♦ మూని నీ కిటు వ్రతి,కూలుండ నై పోవు♦కోర్కి లేదు
పూర్వులు పెంపుమైఁ ♦ బోయినత్రోవన, యరిగెదఁ గాని య♦న్యంబు గాదు
కావున జనకోక్తి ♦ కార్యంబు; జనకుని, వాక్యంబు విన కున్నఁ ♦ బాప మొదవు

తే. నిశ్చయంబుగఁ జనుదు వ♦నీనివాస,మునకుఁ జింతింప వలవ దో♦పుణ్యచరిత
నన్నుఁ గరుణారసేక్షణ♦స్నాతుఁ జేసి, కాన కంపుము దయచేసి ♦ కనరువాసి.

కం. నిర్మలమతిఁ దల్లికి నిటు, శర్మంబుగఁ బలికి రామ♦చంద్రుఁడు శశ్వ
ద్ధర్మ విదగ్రేసరుఁడును, ధర్మభృదగ్రేసరుంపు ♦ దమ్మున కనియెన్. ౬౧౦

ఉ. తమ్ముఁడ లక్ష్మణా విను స♦తంబుగ నాపయి నీకు స్నేహమున్
ముమ్మర మాటయున్ భవద♦మోఘపరాక్రమసత్త్వ శౌర్య తే

జన్ములు, నేరమిఁక జనని ♦ చాలఁ దపించు కోఱుంగనోటు; స
త్యమ్ము శమమ్మునుం దెలియు♦ధన్యుఁడ వీవును నిట్లు పల్కఁదే?　　౬౧౧

కం.నీ విటుపలికిన జననికి, భావంబున మిాఱు దుఃఖ♦పా, టటుగానఁ
గావింపకు మయ్యా నీ, వీవిధసంభాషణములు ♦ హితమతి నగుచున్.　　౬౧౨

కం.ధర్మమె పర మీజగతిని, ధర్మమె సత్యంబునకు ని♦ధానం బగుటన్
ధర్మైక జనకవాక్యము, ధర్మంబా తప్పఁ ద్రోయఁ ♦ దత్త్వజ్ఞులకున్?　　౬౧౩

కం.జనకునివాక్యం బైనను, జననీవాక్యంబు నైన ♦ త్సాంబుధుఁడై యౌ
నను జలిపెద నని మఱి వృథ, చనఁ జేయఁగఁ దగదు ధర్మ♦శాలుల కెందున్.

చం.పితృవచనానుసారముగఁ ♦ బిన్నవిత్రియు నాన తిచ్చె, నేఁ
బ్రతిన యొనర్చినాఁడ నలు♦పం దదభీష్ట, మ దేల తప్పుదున్;
మతిని ననార్య మానదయ♦మార్గము క్షత్త్రియధర్మ మద్ది స
మ్మతిఁ గనఁ బోకు, క్రౌర్యమును ♦ మానుము, మన్మతి మూనియుండుమిా.　　౬౧౪

కం.కనికరమున నిటు తమ్ముని, గని తల్లిం జూచి యామె♦యంఘ్రిద్వయి పై
వినయనమితోత్తమాంగం,బును రాముఁడు నిల్పి పల్కఁ ♦ బుమ్ముఁలభక్తిన్.　　౬౧౬

శా.తల్లీ! నాకు ననుజ్ఞ నిమ్మిపుడు కాం♦తారప్రవాసార్థమై,
పెల్లాడం గన కన్ను, యెట్టిడఁదు చే♦వి నాదుప్రాణంబు పైఁ,
దెల్లం బైనకృపాకటాక్షమున నన్ ♦ దీవించి స్వస్త్యాదికం
బుల్లం బార ఘటింపుమిా, చెలఁగుమిా ♦ సోత్సాహచిత్తంబునన్.　　౬౧౭

కం జననీ! ప్రతిజ్ఞ దీరిచి, చనుదెంతు వనంబునుండి ♦ చయ్యనఁ బురికిన్
మును పు యయాతియు స్వర్గం,బును విడి ధరనుండి మరలి ♦ పోయిన మాడ్కిన్.

చం.వగపును లో నణంపు, పితృ♦వాక్యము దీరిచి వేగ వచ్చెదన్
మగుడఁగఁ, గన్నతండ్రి యగు♦మానవపాలునిమాటఁ బట్టఁ బొం
దగుఁ గద నేను నీవు వసు♦ధాత్మజ లక్ష్మణుఁడున్ సుమిత్రయుం
దగుగతిఁ, దల్లిరో! ఘనస♦నాతనధర్మవిధం బిదే కదా?　　౬౧౯

కం.మానిచి సంభారంబుల, నూనత నొందించి దుఃఖ ♦ ముల్లంబున నా
కాననవాసంబునకున్, మానుగ సెల విమ్ము ధర్మ♦మార్గముఁ గనుమా.　　౬౨౦

తే. వినుతధర్మ మన్యగ్రం బ♦విఘ్నబంబు, నైనతనయునిమాటల ♦ నాలకించి
తల్లి ధర సోలి తెలి వొంది ♦ తనయుఁ జూచి, దైన్యపాటున ని ట్లనుఁ♦దలఁకుమదిని.

కం కనుమా ధర్మముచేతను, దనయా! స్నేహంబుచేత ♦ దండ్రికి సరి యా
జనని గద; నేను వందురఁ, జనియెదె ననుఁ బాసి వనికి ♦ సమ్మతి నీయన్.　　౬౨౨

శా. అన్నా! నీ వెడఁ బాయ నేమిటికిరా ♦ ప్రాణంబు లీబొంది? సం
పన్నం బౌపరలోక మేల? స్వధయే ♦ ప్రాప్తించెఁబో యేల? యా
సన్నం బైనను నేటికిఁక సుధ? నిమే ♦ షం బైన నాయొద్ద నీ
వున్నన్ శ్రేయము జీవసంచయము లె ♦ న్నో యుంట కం చేస్తివన్ ౬౨౩

కం. నరు లుల్కాహతులం గాని, యరికట్టిన యేని యిచ్చ ♦ నరిగెడికరి నాఁ
గరుణోక్తులకుఁ రాముఁడు, పర మగుతనమతము విడఁడు ♦ పటుధైర్యమునన్.

చం. తను వవశత్వ మొంద వసు ♦ ధాస్థలి వ్రాలినదీనఁ దల్లి, హా
రన్ని తనకంటకిం గడవెఁ ♦ దశ్రులు గూర్చెడి పిన్నతమ్మునిన్
గనియును రాముఁ డొక్కరుఁడె ♦ కా కిటు దుస్తరధర్మసంకటం
బున నెవఁ డోపు ధర్మమున ♦ పొంతను బోవ నితాంతధీరతన్. ౬౨౫

రాముఁడు లక్ష్మణునకు ధర్మోపదేశంబుఁ జేయుట.

ఉ. తమ్మునిఁ జూచి యిట్టులనుఁ ♦ దమ్ముడ! వింతలె నాకు నీదు నె
య్యమ్ముఁ బరాక్రమమ్ముఁ, దగు ♦ నా యిటు లేడ్చుచుఁ దల్లితోడ నా
కుమ్మలికంబుఁ గూర్చెద, వ ♦ యో మదిఁ గానవు కంటె నాదుచి
త్తమ్ము తెఱంగు; ధర్మపుఁబ ♦ థం బెడఁబాయఁగ నొల్ల నేమియున్. ౬౨౬

ఉ. ధర్మపథం బొకండె తనుఁ ♦ దప్పక కొల్చెడివాని కెప్పుడున్
ధర్మము నర్థకామములఁ ♦ దప్పక కూర్చు నిజం, బదెట్లనన్
ధర్మిణి యైనభార్య గడు ♦ ధర్మముఁ గూరుచుఁ, బ్రేమఁ గామపూ
ర్తిర్మముఁ గూర్చు, నర్థమును ♦ సత్సుతుమూలముగాఁగఁ గూర్చెడున్. ౬౨౭

చం. కలుగవొ ధర్మ మర్థమును ♦ గామము దేనను దాని నెవ్వఁడేఁ
జలుపఁగఁ బూన రా, దెటఁ బ్ర ♦ శస్తపుధర్మము గల్గు దానినే
చలుపఁగ నౌ, ననేకులకు ♦ శాత్రవుఁ డౌను ధనైకకామి, కే
వలమును గామసక్తుఁడు గ్ర ♦ వంబుగ నింద్యుఁడు సుమ్ము తమ్ముఁడా. ౬౨౮

చం. గురుఁడును రాజు దండ్రి ముదిఁ ♦ గూరినవాఁ డొకవేళఁ గింక నే
నరుసము పేర్మినే నతుల ♦ మాభృశకామముచేత నైన నె
వ్వరునున నైనఁ జేయు మని ♦ పంచినదానిని జేయకుండు నా
నరుఁడు నృశంసుఁ డుర్ఖలుఁడు ♦ నష్టయశుం డగుఁ గాదె లక్ష్మణా. ౬౨౯

చం. ధరణితలేశ్వరుం డిటు య ♦ థామతిఁ బంచిన దెల్లఁ జేయ కే
కరణి సహించువాఁడ, విను ♦ తన్నాథవుఁ డేగతి నయ్యె నాకునున్
భరతునకుం బ్రశాస్త, మది ♦ భావన సేయుము తల్లి కట్లు యౌ,
వరయఁగ భర్తగాదె పర ♦ మార్థము ధర్మము దిక్కు భార్యకున్. ౬౩౦

ఉ. భూమిధవుండు పుణ్యపథ♦భూషణుఁ డూపిరితోడ నుండఁగా
 నే మని వచ్చు నాబడిని ♦ నీసతి భర్తృవిహీన యట్లుగా?
 భామిని కెయ్యెడం దగవె ♦ ప్రాణధవుం బెడఁబాసి యుండఁగా?
 భూమిఁ దనూజుకంటెఁ బతి ♦ పూజ్యుఁడు సాధ్వికిఁ జుమ్ము లక్ష్మణా. ౬౩౧
చం.వనముల కేగుదుర్ జనని ♦ స్వస్త్యయనంబు నొనర్పు నాకు, న
 న్గనుఁగొనుమీ ప్రసాదసుము♦ఖం బగుదృష్టిని,బూర్ణమైనచో
 జనకునియాజ్ఞ, గ్రమ్మఱెద ♦ సత్యము; పేర్మిని మున్ యయాతి వ
 చ్చినగతి వచ్చు వాఁడ, దయ♦సేయుము చేయుము తీర్ణసత్యునిన్. ౬౩౨
ఉ. పోకడపెట్టి ధర్మమును ♦ భోగములం దడియాసఁ జేసి య
 స్తోకపుసద్యశంబుఁ గడు♦దూరము నెట్టఁగఁ జాలఁ దల్లిరో!
 ప్రాకటభంగిఁ జూడఁ ద్రుటి♦భంగుర మాయువు గాన,ధర్మముం
 జేకొన కెట్లు హీన మగు♦శ్రీలకు నై తమి సేయఁ జాలుదున్. ౬౩౩
చం.అని యిటు కన్నతల్లిఁ బ్రియ♦మారఁగ నూఱడఁ బల్కి యాదటన్
 దనహితధర్మపద్ధతులు ♦ దమ్ముని కెన్నియొ తెల్పి దండకా
 వని కరుగంగఁ గోరి నర♦వల్లభుఁ డంతట భక్తియుక్తుఁ డై
 జననికి వే ప్రదక్షిణము ♦ చేయఁ దలంచి మనంబులోపలన్ ౬౩౪
చం.కుమిలెడిశోకవహ్నిఁ గడుఁ ♦ గూరినదైన్యము పేర్మిఁ గింక దే
 హాము నుడికింప రేఁగి ముఖ ♦ మంతయుఁ గన్నులుగాఁగఁ గ్రుద్ధస
 ర్పమువలె రోఁజుచున్ వెఱగు♦పాటున నిల్చినకూర్మితమ్మునిన్
 సుమతిని లక్ష్మణుం గదిసి ♦ నూల్కొను ధైర్యము పేర్మి నిట్లనున్. ౬౩౫
ఉ. మానుము రోషమున్, వగపు ♦ మానుము, పూనుము నిండుధైర్యమున్
 మానము దూలె నచ్చె నవ♦మాన మటం చెద నెంచఁబోకుమా
 మానితసమ్మదంబుఁ గను♦మా, యభిషేకసమస్తవస్తువుల్
 మానుము, పూనుమీ వనస♦మర్హము లైనపదార్థముల్ వెసన్, ౬౩౬
కం.అభిషేకముకొఱకై యే,విభవంబునఁ గూర్పఁ బడియె ♦ విశ్వంబును నా
 కభిషేకనివృత్తికి నా,విభవంబున మార్ప వయ్య ♦ వివిధార్థంబుల్. ౬౩౭
మ. చనునో రాముఁడు కానకుం జనఁ డొకో ♦ సౌమిత్రి ప్రేరించినన్
 జన నేనంచు సచించునో యనుచుఁ దా ♦ సందేహాలోలాత్మ యై
 యనఘా! తత్తఱలాడు కైక మది శం♦కాతంకనిర్ముక్తముం
 జను నీ కియ్యెడఁ జేయు,సైఁప విచికి♦త్సం[1] గుంద నాయంబయున్. ౬౩౮

---

[1] విచికిత్స = సందేహము.

కం. వినుమా యెప్పు డేనియు నే, మన సెఱిఁగియొ యెఱుఁగకైన ♦ మాతల కేనిన్
జనకున కేనియు విప్రియ,మును నించుకయైనఁ జేఁత ♦ మొనయదు జ్ఞప్తిన్. ౬౩౯
కం. సత్యపరాక్రమవర్యుఁడు, సత్యవచస్కుండు సత్య♦సంధుఁడు జనకుం
డత్యంతము పరలోకా,ప్రత్యయభీతుండు దిగులు ♦ పాయుత మింకన్. ౬౪౦
ఉ. ఈయభిషేకసంభ్రమము ♦ లిప్పుడు మానక యుంటినేని పా
ల్గాయె మదీయసత్య మని ♦ యారట మొందు నృపాలుఁ డెంతయున్;
బాయనిచింతఁ దండ్రి వగ♦పాటునఁ గుందఁగ నాదుచిత్త మే
చాయఁ దపింప కుండెడిని ♦ సంతతమున్ వచియింపు లక్ష్మణా! ౬౪౧
కం. కాన నభిషేకయత్నము, మానించి యిదే యరణ్య♦మార్గముఁ బట్టం
గా నేను, గైక రాజ్య,శ్రీ నిలుపుత భరతునందుఁ ♦ జిత్తం బలరన్. ౬౪౨
కం. చీరాజినధారి జటా,భారాన్వితు న న్నరణ్య♦పథసంగతుఁ గ
న్నారఁ గని కైక యొమ్మనఁ, జేరిచి హస్తంబు నిదుర ♦ చెందెడుఁ గాతన్. ౬౪౩
ఆ. ఎవరిబుద్ధికిక ♦ నియ్యది ఘటియిల్లు, నిశ్చయింపఁబడియె ♦ నెఱిగ మదిని
నట్టిమదికి నొవ్వు ♦ పుట్టింప నేఁ జాల; నిపుడ ననిఁకఁ బోదు ♦ నింత నిజము. ౬౪౪

## శ్రీరాముఁడు లక్ష్మణునితో మేలుగీళ్లకు దైవము కారణ మనిచెప్పుట.

కం. వంచన కైక ఘటించె న,టంచును గినియకుము, రాజ్య ♦ మందుటయు నివ
ర్తించుట నావనగమనము, నెంచఁగ దైవైకకృత, మిఁక ♦ కేలా వగవన్? ౬౪౫
కం. దైవప్రేరిత మగు నీ,భావన గాకున్న శక్య♦పడ నేర్చు నె యా
దేవికిఁ గైకకు నన్నుం, గానలె నని యిట్లు మిగులఁ ♦ గాఱియపఱుపన్. ౬౪౬
ఉ. అంతర మే నెఱుంగ హృద♦యాంతరసీమను సౌమ్యశీల! యా
వంతయుఁ దల్లు లాముగుర♦యం, దల కైకకు నాత్మపుత్త్రుఁ డం
చెంతయుఁ బ్రేమ, నాపలన ♦ నెంతయు నొల్లమి లేదు పూర్వ, మి
ట్లింతయు నేఁడ పుట్టుటకు ♦ హేతు విఁ కెయ్యది తెల్పు తమ్ముఁడా? ౬౪౭
కం. అంతటివత్సల నను నే,కాంతము ప్రల్లదము లాడి ♦ కాన కనుచుటల్
చింతింప వలఁతి యగుబల,వంతపువిధిచేష్ట గాక ♦ పరులకు వశమే? ౬౪౮
ఉ. పుట్టువుతోడఁ బుట్టి గుణ♦పూజ్యత, మంచికులంబునందుఁ దాఁ
బుట్టెను రాచకూఁతు రయి ♦ పుష్కలదానదయానిధాన మై
పట్టుగఁ గీర్తిఁ గాంచె, నటు♦వంటిది కైకయి, భర్తృసన్నిధిన్
గట్టిఁడి రీతి దిట్ట యయి ♦ కాఱులు నన్నటు లోపెఁ బ్రేలఁగన్? ౬౪౯
కం. కావున నచింత్యమహిమము, దైవం బప్రతిహతంబు ♦ ధర నెవ్వరికేఁ;
నావనితయందు నాయెడ, దైవం బె విపర్యయంబుఁ ♦ దమ్ముఁడ! కూర్చెన్. ౬౫౦

తే. కార్యభూతఫలంబుల♦కంటె వేఱు,చోట నించుక యైనను ♦ జూడరాని
దుర్జయంబైనదైవంబు♦తోడఁ దొడరి,యెవఁడు పోరంగఁ దానుత్స♦హించుఁజెపుమ.

ఉ. జానగుసౌఖ్యము న్వగపు ♦ శాంతియుఁ గ్రోధము లాభనష్టముల్
మాననిపుట్టుగిట్టుటలు ♦ మానవకోటు లకారణంబుగా
వేనిఁ దలంచు నవ్వియును ♦ విశ్రుత మింతకు దైవ మొక్కఁడే
తా నగు మూలకారణము ♦ దప్ప దదెంతయు నమ్ము తమ్ముఁడా. ౬౫౨

కం.కామక్రోధంబులచే, నేమంబుల వఱదఁ గలిపి ♦ నెఱిచెడి భ్రష్టుల్
గా మునులు తపసు లయ్యును, సౌమిత్రీ! చెడుట దైవ♦చర్యన కాదే. ౬౫౩

కం.ఎన్నం డెంచని దెటులో, యున్నట్టుగ నుండి యగుట ♦ యూనినపని వి
చ్ఛిన్నం బగుటయు నట్టులె, యన్నా! యివి దైవకృతము ♦ లగు సత్యముగన్.

కం.ఈనిశ్చితమతిచే నా,లో నేనే కాలగతి వి♦లోకించినచో
మానసమున నభిషేకవి,ధానము దప్పుటకు వగవు ♦ దగులదు నాకున్. ౬౫౫

కం.కావున నీవును వగవక, నావిధమును ననుసరించి ♦ నలు వగునభిషే
కావశ్యక కార్యంబులఁ, బోవిడువుము; చింత యేమిఁ ♦ బూనకు మన్నా. ౬౫౬

కం.మా నగునభిషేకార్థన,మానీతఘటోదకంబు ♦ లగుఁ దాపసయో
గ్యానూనవ్రతమజ్జన, మూనిక నొనరింప నెంచి ♦ యుండెడినాకున్. ౬౫౭

కం.ఈరాజద్రవ్యం బగు,వారియు నా కేల? కైక ♦ ననరదె శంకన్
ధారిణికై తోఁగెద నని; వారక నా తెచ్చునీరె ♦ వ్రతమున కగుతన్. ౬౫౮

చం.వగవకు మన్నలక్ష్మణ! వి♦పర్యయ మందెను లక్ష్మి యంచు; నీ
యగణితరాజ్యభోగము మ♦హావిపినాలయవాస మొక్కరూ
పుగ మదిఁ దోఁచె, నారసిన ♦ భూరివనాంతరవాసమే సుఖం
బగు, నటుగాన నేటికి వ్య♦థావిలమానసవృత్తి దూపిలన్? ౬౫౯

మత్తకోకిలము. అన్న లక్ష్మణ! ప్రాప్తలక్ష్మికి ♦ నంతరాయముఁ గూర్చె నా
పిన్నతల్లి యటంచుఁ గుందకు ♦ ప్రీతి దప్పకు, దైవమే
యన్నిలంతుక నట్లనిష్టము ♦ లాడఁ జేసె ముఖస్థమై;
సన్నుతాత్మక! దైవ మంతకుఁ ♦ జాలు నంచు నెఱుంగవే? ౬౬౦

లక్ష్మణుఁడు రామునితో దైవముకంటెఁ బౌరుషమే శ్రేష్ఠ మని చెప్పుట.

కం.అనురామునివచనంబుల, వినమితమూర్ధుండు నగుచు ♦ విని విని మదిలోఁ
బెనఁగొనువిషాదముదముల,కును మధ్యస్థువలె నుండి ♦ కొండొకసేపున్. ౬౬౧

సీ. సౌమిత్రి దీర్ఘరో♦షంబున నిష్కుహా,స్థాశీవిషముభంగి ♦ నట్టి రోఁజి
కుటిలమై భ్రూకుటి♦చటులనిటాలత,టంబున నటియింప ♦ డంబు మెఱసి

క్రుద్ధసింహాస్యంబు♦కోపున నెమ్మోము, దుర్నిరీక్షంబయి ♦ దోరగిల్ల
హస్తిహస్తమునట్లు ♦ హస్తాగ్రమునుదా వి,ధూననంబొనరించి ♦ తొరగఁబఱపి
తే. దృష్టినేలను నిరువంకఁ ♦ ద్రిప్పి మెడను, వడ్డచూపులకొనలు ని♦జాగ్రజాతు
నాస్యమునయందుఁ బ్రసరింప♦నధర మదరఁ,గావిపాఱఁగఁ గన్నులు♦కనలి పలుకు.

చం.జనకునిమాట దాఁటఁ గలు♦షం బగు నంచును, రామచంద్రుఁడే
వినఁ డఁట తండ్రిమాట యని ♦ వీటిఁడిమూఁకలు ధర్మసేతువుఁ
గొనకొని ద్రెంపఁ జూచెదు నొ♦కో యనుశంక, నరణ్యభూమికిఁ
గనుకనిఁ బోవఁ జూచెదవు ♦ కాలము గా దిది తత్ప్రసక్తికిన్. ౬౬౩

ఉ. ఎంతకుఁ జాల వీవు? తగు♦నే యసమర్థుఁడైన మిట్లు నీ
వెంతయుఁ బెద్దఁ జేయఁగ? ని♦జేప్సితసిద్ధికి నడ్డు వేఁడు, నా
క్కింతయు మున్న దా నిలిచి ♦ యేమియుఁ జేయదు, దాని నీ వసం
భ్రాంతుఁడ వయ్యుఁ బ్రాకృతుని♦భంగి నిటుల్ గొనియాడ నర్హమే? ౬౬౪

ఉ. పాపము పాప మంచనెదు ♦ పాపము గల్గునె పాపులైనజా
యాపతు లాడుమాటల న♦నాదృతి చేసిన? శాత్యరీతి ల
క్ష్మీపదముం దొలంచి రని ♦ చిత్తమునందు నెఱుంగ వయ్యె, ధ
ర్మోపధధర్మకంచుకులు ♦ నుర్విని గల్గరె ధర్మతత్పరా? ౬౬౫

సీ. మచ్చిక బలిమిని ♦ నిచ్చకంబులఁ దన,కొడుకునకును గైక ♦ పుడమిఁ గోర
జేతనంబు శ్రీరామ♦చంద్రున కొనరింతు, వరములు గోరు మో♦తరుణి! యనుచు
యుక్తియొక్కటి చెప్పి ♦ రక్త నట్లిచ్చుట, నాడంబర మొనర్చి ♦ యటకుఁ బోయి
మోసంబు చేసె నా♦ముదుకండు; గాదేని, యేల గోరదు కైక ♦ యిన్ని నాళ్లు
తే. వరములను? భూమిపతి యేల♦పరిహరింపఁ,డయ్యెఁ? దక్కిది, నిజమైన ♦నఖిలజనులు
విననయది మున్నగా నెఱ♦వేర్ప వలదె? యామెకోర్కుల కిదియొకో ♦ యర్హవేళ?

కం.లోకంబులు ద్వేషింపఁగ, నీకుట్రల నిన్నుఁ గాక ♦ యితరులరాజ్య
శ్రీకలితులఁ జేయఁగ నే, మేకొనఁగా నేర్తునే? క్షమింపుము నన్నున్. ౬౬౬

కం.వినతసుధీసత్తమ! నె,మ్మనమున నేధర్మచింత ♦ మలయుట ద్వైధం
బును బొందె బుద్ధి మోహం,బున నాధర్మమున నేవ ♦ పుట్టెను నాకున్. ౬౬౭

కం.ప్రకృతికి నైన వలఁతివి, కైకేయీవశతఁ దండ్రి ♦ గర్హ్యాత్మ మధర్మ్యం
బౌ కాఱులు ప్రేలినచోఁ, జేకొనుదే మోహమునను ♦ జేడ్పడ కున్నన్? ౬౬౮

ఉ. మోసపుబుద్ధిచేత వర♦ముల్ పరికల్పిత మైనఁ, బెద్దగాఁ
జేసెదు గాని వాని నిర♦సింపవు సాధుతపేర్మి, దానికై
గాసిలి దుఃఖ మందెదను ♦ గాని యిఁ కేమియు లేద; యిట్టిచో
వాసిఁ దొలంచు ధర్మపథ♦వర్తన గర్హ్యము గాదె యేరికిన్? ౬౭౦

ఆ. తల్లి తండ్రి యనఁగఁ ♦ దగనిపేరులు దాల్చి, కామవృత్తులైన ♦ కానివారు
పలుకువానినెల్లఁ ♦ బాటింప వచ్చునే, యన్న! మననునందు ♦ నైన నీవు? ౬౨౧
కం.వారలదుర్మంత్రము నీ,వారఁగ దైవిక మటంచు ♦ నాత్మఁ దలఁచినన్
దీ రగు నీకుం దదుపే,క్షారంభము; నాకు నరుచి ♦ యయ్యెన్ దానన్. ౬౨౨
కం.బలహీను లల్ప తేజులు, బలవంతము దైవ మనుచుఁ ♦ బలికెద రన్నా
బలయుతులు కీర్తికాములు, కలనైనం దలఁపఁ బోరు♦గా దైవంబున్. ౬౨౩
కం.పౌరుషబలమున దైవము, దూరంబుగ నెట్టుఘనుఁడు ♦ తుద దైవముచేఁ
గారింపఁబడక నిజకా,ర్యారంభముఁ దీర్చికొను స♦మర్థుం డగుటన్. ౬౨౪
కం.దైవబలంబే యెక్కుడొ, వావిరిపురుషునిబలంబె ♦ వరమో, లోకుల్
దైవపురుషబలభేదం, బోవీరవతంస! చూతు ♦ రొప్పుగ నిపుడే. ౬౨౫
ఉ. దైవముచేతఁ గీడ్వడిన♦తావక పట్టమహోత్సవంబు నా
దావరపౌరుషంబున ర♦యంబునఁ దీర్పఁగ, ధారిణీజను
లైవము పౌరుషోద్ధతిని ♦ లావఱి కూలినఁ జూచి, యాత్మలో
దైవముకంటెఁ బౌరుషమె ♦ తద్దయు మేలని యెంచఁ జేసెదన్. ౬౨౬
ఉ. భూరిమదోత్కటంబు సృణి♦పోటులఁ జిక్కక ఛిన్నశృంఖలం
బై రయమారఁ శైనుఱుక ♦ నట్టి మరల్చెడిరీతి దైవమున్
సారతరోగ్రపౌరుషమె ♦ సాయముగాఁగ మరల్తుఁ జూడుమీ
యోరిమి, నామతంబునకు ♦ నూఁకొనుమీ, కనుమీ యథాస్థితిన్. ౬౨౭
శా.అన్నా! నీయభిషేకముం జెడఁగఁజే♦యన్ లోకపాలాళి యా
పన్నంబై యెదిరించి నిల్చిన జగ♦త్సంఘాతముల్ పూని డీ
కొన్నన్ నేరదు; తండ్రిఁ జెప్పవలెనా ♦ ఘోరాటవి న్నిన్ను నా
పన్నుం జేయఁగఁ గోరువారి ననుతుం ♦ బద్నాలుగేం డ్లుండఁగన్. ౬౨౮
కం.నీ కభిషేకము సేయక, యాకొడుకున కవనిఁ గూర్చు♦నాజనకున కా
కైకేయి కాశఁ గోయుచుఁ, బ్రాకటముగ వారి నెట్లు♦పఱతునొ కనుమీ. ౬౨౯
కం.పరిపంథులకును నాభీ,కరపౌరుష మెట్లు దుఃఖ♦కారణ మగు నా
కరణిని దైవము వారికిఁ, బరఁగింపఁగ లేదు సుఖము ♦ పద్మదళాక్షా. ౬౩౦
చం.భరతున కెట్లు వచ్చు మహీ? ♦ పాలన సేయుచు వేలయేండ్లు నీ
వరిగినఁ గాన కంత భవ♦దాత్మజు లుర్వి వహించువారుగా,
కరయఁ బురానృపాచరిత ♦ మట్టిద కాదె? జనంబులన్ సుతో
త్కరములఁ నేలఁ జెప్పి మఱి ♦ కానల కేగరె తొల్లి భూపతుల్? ౬౩౧

ఉ. చంచలచిత్తుఁ డానృపతి ♦ శాత్రవ మూనిన రాజ్య మెట్లు ని
శ్చంచలవృత్తిఁ గ్రాలు నని ♦ సందియపాటునఁ బూన వేని, నీ
యంచితరాజ్య మంతయు మ♦హాంబుధి నాఁగెడివేలభంగి ర
క్షించెద, బ్రాన చేసెద, న♦శించుతఁ దప్పిన వీరలోకముల్. ౬౮-౨

కం. అభిషేకమునకు నియ్యెడ, శుభవిధిగా నియ్యకొనుము ♦ చోర నిమ్ము మదీ
ప్రభువుల నెల్లను నాబల,విభవంబునఁ నే నొకండ ♦ విదళింతుఁ జుమీ. ౬౮-౩

శా. అన్నా! మద్భుజదండయుగ్మమిది శో♦భార్థంబు గాదన్న, వి
ల్లునన్ నా కది భూష గాద, యసినా ♦ నాబంధనార్థంబు గా
దెన్నన్ బాణము తూణి మోఁత కయి కా ♦ దీనాల్గు ద్విట్చక్రముల్
ఛిన్నాంగంబుగఁ జేసి కండలను బ్ర♦చ్ఛేదింపఁగాఁ జుమ్మనిన్. ౬౮-౪

కం. ఏవాఁడు నాదుపగతుం, డైవర్తిలు వానియునికి♦నైన సయిఁప నే
నావజ్రి నైనఁ ద్రుంచెద, శ్రీవిద్యుచ్చలితకాంతి♦శితఖడ్గమునన్. ౬౮-౫

తే. ఖడ్గనిష్పేషనిష్పిష్ట♦గజనరాశ్వ,హస్తమూర్ధోరుసంచయ♦వ్యాప్తధరణి
దుశ్చరంబయిగహనమై♦తోఁపఁజిత్ర,గతులమెఱయుచుఁబగతురఁ♦గుతిలపఱుతు.

తే. మామకీననిశాతో గ్ర♦మండలాగ్ర,చటులధారావిదారిత♦శాత్రవేభ
మండలంబులు శంపాస♦మగ్రవారి,ధరములట్టుల వ్రాలును ♦ ధరముపట్ల. ౬౮-౭

తే. బద్ధగోధాంగుళీత్రాణ♦పరిగృహీత,భూరిచాపుఁడ నై రణ♦భూమి నిల్వ
నెవఁడు శూరుండ ననివచ్చి♦యెదుటనిలుచు,గుండెగలవాఁడుధారిణీ♦మండలమున?

కం. ఒక్కనిఁ బెక్కుశరంబులఁ, బెక్కుర నొక్కంటఁ గ్రుచ్చి ♦ పీనుఁగు పెంటల్
గ్రక్కునఁ జేయనె పగఱం? జెక్కాడనె వారివాజి♦సింధురరథముల్? ౬౮-౯

కం. ఇప్పుడ నృపునేలుబడిం, దప్పించి ప్రభుత్వమెల్లఁ ♦ దటుకున నీకే
యప్పించెదఁ గనుఁగొనుమీ, మెప్పైన మదస్త్రలసద♦మేయబలంబున్. ౬౯-౦

ఉ. చందనసుందరంబులు, ప్ర♦శస్తతరాంగదరంగభూము, ల
స్పంద వసుప్రదానవిభ♦వంబులు, మిత్రజనావనక్రియా
నందనముల్, సుయోగ్యములు ♦ నాభుజదండము లిప్డు సల్పెడిన్
జిందఱవందఱల్ త్వదభి♦షేకనివారణకర్మశీలురన్. ౬౯-౧

కం. పేశలగుండ, ధారణి నీ కెట్లు లభించుదాని♦నిం దెలుపుమ, యి
ష్టా కానివాని నిలఁ బ్రాణాకలితుఁడు గాక యుండ ♦ నలఁచెద నధిపా. ౬౯-౨

కం. అని వచియించుతమ్మునయ♦నాంత వినిర్గతబాష్పవారి నొ
య్యనఁ దనకేలఁ బోఁ దుడిచి ♦ సాదరభావలఁ దేర్చి నాయనా!

జనకునిమాట పట్టుటయె ♦ సత్పథ మద్ది దొలంగనేర నే
సనయత దానిఁ దీర్చుటయె ♦ సమ్మత మంచు నెఱుంగు మం చనన్. ౧౯౩

→ కౌసల్య రామునిశ్చయ మెఱింగి పరితపించుట. ←

చం. జనకనియోగపాలనమె ♦ చల్వఁగ నిశ్చితచిత్తుఁ డైన పు
త్రునిఁ గని కోసలాత్మభవ ♦ తోయజనేత్ర సుశీల బాష్పవా
రినిచయరుద్ధలోచన య♦రీణసధర్మపథావలంబి రా
మునిముఖపంకజంబు సుత♦మోహమునం దిలకించి యి ట్లనున్. ౧౯౪

ఉ. ఎన్నఁడు దుఃఖమం చనఁగ ♦ నెట్టి దొకో యెఱుఁగండు, ధర్మసం
పన్నుఁడు, సర్వభూతహిత♦మార్గణుఁ డెప్పుడు, నాకు నాజి కు
త్పన్నుఁడు, విక్రమాఢ్యుఁడు, ప్ర♦ధావిభవుం, డెటులొక్కొ కాసలో
నెన్నుల నొక్కటొక్కటిగ ♦ నేఱి భుజించు, భజించుఁ గష్టముల్. ౧౯౫

కం. ఎవ్వనిభృత్యులు దాసులు, మవ్వముగ భుజింప నిష్ట ♦ మంజులభోజ్యం
బవ్విభుఁడు మూలఫలముల, నెవ్విధి నమలుచును గడుపు♦నెరగలి నార్చున్.

కం. కరుణాపాత్రుని సుగుణా, భరణుని శ్రీరాము నడవి♦పా ల్సేసినయా
ధరణిపుచరితము విన్నను, నరుఁ డెవ్వఁడు నమ్ము వెఱపు♦నం బడకుండున్. ౧౯౬

కం. లోకాభిరామ! రామా! యీకరణిని నిన్ను నడవి ♦ కేగించుటచే
లోకమున దైవ మొక్కం, డే కడుఁ బ్రబలంబు దేని♦నేని ఘటింపన్. ౧౯౭

సీ. నాయనా! శోకాగ్ని ♦ నాయుదరంబున, జనియించి భవదద♦ర్శనసమీర
మున రేఁగి దుఃఖేధ్మ♦ములచేత వర్ధిల్లి, న స్రుహుతాహుతి ♦ వ్యాప్తమగుచుఁ
జంతోష్మధూమసం♦చిత మయి నిశ్వాస, నాయాసనంకలి♦తాభ్యుదయత
నీవు లేకుండుట ♦ నెఱిహిమాత్యయమున, నెండుపొదరుగుమి ♦ నేర్చు కారు

తే. చిచ్చునా నన్ను నీఱుగాఁ ♦ జేయ కున్నె, య ట్లగుట లేఁగ వెనుకొను♦నావునట్లు
వత్తు ననుఁ దోడికొనిపొమ్ము♦వత్స! యనుచు, శోకహతయైనతల్లికి♦సుతుఁడు పలుకు.

→ భార్యలు భర్తలవిడిచి పోఁగూడ దని రాముఁడు కౌసల్యతోఁ జెప్పుట. ←

అ. కైక మోసగించెఁ ♦ గాకుత్స్థతిలకుని; నరుగుచున్న వాఁడ ♦ నడవి కేను;
నమ్మ! నీవొకర్తు♦వైన నొద్దను నిల్వ, కున్నఁ దండ్రి యెట్లు ♦ లుండు బ్రదికి? ౨౦౧

కం. పతిని విడనాడుచెలువలు, పతితలె గద యగుదు; రిట్టి♦వర్తనమును నీ
మతినైనఁ దలఁపవచ్చునె? సతి వగు నీకిదియుఁ దగునె ♦ జననీ! చెపుమా? ౨౦౧

కం. ఎందాఁక బ్రదుకు జనకుం, డందాఁకను నీవు నతని ♦ నర్హపర్యా
స్పందగతిఁ గొలువుమీ యా, నందమున సనాతనంపు♦న్యాయం బిది యా. ౨౦౨

కం. ఆపుణ్యశీల శుభచర్యాపరుఁ డౌనిజతనూజుఁ ♦ డాడెడిధర్మా
లాపమ్ముల విని ప్రీతిని, నాపట్టిని జూచి యట్ల ♦ యాఁ గాక సుతా. ౭౦౩

కం. అని మఱి వగకూరెడినిజ,జననిం గని దుఃఖశాంతి ♦ సంపాదింపన్
జనకసుతావిభుఁ డిట్లను, వినయంబు నయంబు దోఁప ♦ విశదోక్తులతోన్. ౭౦౪

చం. గురుఁడును, భర్త, రాజు, జన♦కోటుల కెల్ల నధీశుఁ, డౌఁ గదా
యరయఁగఁ దండ్రి? యట్టిప్రభు ♦ నాజ్ఞఁ జరింపఁగ నాకు నీకునన్
దరమగుఁ గాదె? నే నిదిగొ ♦ దండకలోఁ బదునాల్గువర్షముల్
పరువడిఁ దీర్చి వచ్చి పిద♦పన్ భవదాజ్ఞ మెలంగుచుండెదన్. ౭౦౫

కం. అనిన విని యశ్రుపూర్ణా,నన యయి కౌసల్య ముద్దు♦నందను మోహా
మ్మున నవియె శోక గద్గది,కను బలుకులు తడఁబడంగఁ ♦ గడుదైన్యమునన్. ౭౦౬

చం. జనకునిమాటఁ బట్టి వన♦చారివిగా మది నీయకొంటివే
నిని సవతాండ్రమధ్యమున ♦ నే నిలువం గల నెట్లు పుత్రకా!
వనముల నాఁడుజింక యన ♦ వర్తిలు చుండెద సంతసంబునన్
జనసుతశీల! నీ బడిని ♦ జయ్యనఁ దోడ్కొని పొమ్ము నన్ దయన్. ౭౦౭

తే. తల్లి వగలను బొగులువి♦ధంబుఁ గాంచి, యుల్ల మెరియంగ నశ్రువు ♦లొలుక నిట్లు
సానునయముగ నను రామ♦చంద్రుఁ డపుడు, కన్నతల్లికి ధర్మంబు ♦ కడమ వడక. ౭౦౮

ఉ. జీవము గల్గునంతకును ♦ జేడెలకుం బతియే ప్రభుండునున్
దైవము, గాన శాసకుఁడు ♦ ధారుణినాథుఁడె చుమ్ము నీకు నా
కోవరశీల! నీకు నతఁ ♦ డుండ ననాథత యెట్లు గల్గెడిన్?
గావునఁ జిత్తశాంతిఁ గను ♦ కాతరభావముఁ బొంద నేటికిన్? ౭౦౯

కం. భరతుండును ధర్మాత్ముఁడు, కరుణామతి కీడు పలుకఁ ♦ గానం డెవరిన్
గురుభక్తిని భవదుక్తిను,సరణము మానండు వలదు ♦ సందియపడఁగన్. ౭౧౦

చం. అడవికి నేను బోఁ గడపు♦నారటపాటున జేఁడు వృద్ధుఁడున్
బడుగును గాన దుఃఖపడి ♦ ప్రాణముఁ గోల్పడు నొక్కొ యంచు నే
జడిసెదఁ, దండ్రికి న్నదికి ♦ సంకటపాటొదవంగనీక యె
వ్వడువున నప్రమత్త వయి ♦ వర్ణితశీల! భజింపు ప్రేముడిన్. ౭౧౧

చం. హితమతిఁ బెద్దవారలకు ♦ నెప్పుడు మ్రొక్కక యున్నఁగాని, దే
వతల యజింప మానినను ♦ వారిజనేత్రకు భర్తృసేవ స
ద్గతి సమకూర్చుఁ దల్లి! నిర♦తవ్రత యై సతతోపవాస యై
సతి పతి భక్తిఁ గొల్వకుని ♦ సత్యముగా నిరయంబునం బడున్. ౭౧౨

కం. శ్రుతులందును స్మృతులందును, హితగతి శ్రుతిఁ బూర్వసృష్ట♦దృష్టాంతములన్
సతి పతిహితరత యయి సమ్మతి సేవించుటయె ధర్మ♦మార్గము దల్లీ. ౨౦౩

కం. కావింపుము హోమములన్, భావింపుము దేవతలను ♦ బ్రాహ్మణపూజల్
వావిరి నాకొఱకై యో, దేవీ! గావింప వమ్మ ♦ తెరలనిభక్తిన్. ౨౦౪

ఉ. ఇక్కరణిన్ మదాగమన ♦ మెంతయు వేచి చరింప వమ్మ, పే
రక్కఱ నీమముల్ జరుప ♦ వమ్మ, భుజింపుము నీత మాగతిన్,
మక్కువఁ బ్రాణనాథు బహు♦మానయుతం బగుసేవఁ దన్పుమీ,
తక్కుమి చింత సాధుచరి♦తా! హృదయంబున నామెడాట మై. ౨౦౫

కం. వనవాసం బే నొనరిచి, చనుదెంచెడియంతదాఁక ♦ జనకుఁడు సుఖియై
మనునేనియు నీమదికిన్, ఘనతరసంతోష మొదవఁ ♦ గల్గును దల్లీ. ౨౦౬

—— రామునివనవాసంబునకుఁ గౌసల్య యొయ్యకొనుట. ——

కం. ఈలీలఁ బలుకుతనయుని, నాలోకించుచును గో♦సలాత్మజ యను నేఁ
జాలను నీమదిఁ ద్రిప్పఁగఁ, గాలంబు నతిక్రమింపఁ♦గా మనవశమే? ౨౦౭

కం. చని ర మ్మేకాగ్రత నీ, కనయము శుభ మగుతఁ దండ్రి ♦ యన్నిదశల; నీ
పునరాగమనంబును గని, వనటల నేఁ బాయుదాన ♦ వారిజనయనా. ౨౦౮

ఆ. జనకుబుణముఁ దీర్చి ♦ సలిపి నీవ్రతముఁ గృ, తార్థుఁడ వయి మరలి ♦ యరుగుదేర
నోమహానుభావ ♦ యొందెద సుఖ మంత,దాఁక నుగ్గఁబట్టు♦దాన నుసుఱు. ౨౦౯

కం. నామాటలు పెడచెవి నిడ, నీమాడ్కి నీమనంబు ♦ గృథపటిచెఁ గదే
యీమాయదైన మకటా, యేమనుజుఁడు దైవచిత్ర ♦ మెఱుఁగఁగ నేర్చున్. ౨౧౦

కం. పొమ్మీ తనయా! యిప్పుడ, రమ్మీ సౌఖ్యముగ మరల ♦ రాజితశుభవా
క్యమ్ములఁ దియ్యఁదనమునన్, సమ్మతి ననుఁ దేర్ప వన్న ♦ నారామనన్నా. ౨౧౧

కం. జటలం దాలిచి నారలు, కటితలమునఁ గట్టి నీవు ♦ క్రమ్మఱఁగ వనీ
తటినుండి వేళ యిదె యై, ఘటియిల్లునె? యంతశుభము♦గలదే యనుచున్. ౨౧౨

కం. అడవుల కరుగఁగ నెంచిన,కొడుకునునిశ్చిత మెఱింగి ♦ కోసలసుత దాఁ
గడునాదరమున ని ట్లని, తడయక దీవింప నెంచి ♦ తద్దయుఁ గరుణన్. ౨౧౩

—— కౌసల్య శ్రీరాము నాశీర్వదించుట. ——

ఉ. గాసి తొలంచి మంచియుద♦కంబుల వారిచి సాధ్వి మంగళా
శాసనముల్ వచించు, నిను ♦ సాధ్యముగా దిఁక నాఁగ నాయనా!
వాసిగఁ బోయి రమ్ము రఘు♦వంశమణీ! యిపు డీవు వైళ మా
యాసము లేక క్రమ్మఱుము ♦ హాళిఁ జరింపుము సత్పథంబునన్. ౨౧౪

కం. ఏధర్మము నీచేత మ,హాధైర్యస్థైర్యనియతి ♦ నవితం బయ్యెన్
సాధితశాత్రవజన! ని,న్నాధర్మమె కాచుఁగాక ♦ యనవరతంబున్. ౨౨౫

మత్తకోకిలము. దేవతాయతనంబులన్ రుచి♦దేఱుచైత్యములందు నీ
చే వరం బగుమ్రొక్కు లందుచుఁ ♦ జెన్నుమీఱినయామహా
దేవతల్ ఋషియుక్తులై వనిఁ ♦ ద్రిమ్మరం జనుచుండు ని
న్నేవిధంబులఁ గాచుచుందురు ♦ నిర్మలం బగుసత్కృపన్. ౨౨౬

కం. ప్రీతుండై గాధితనూ,జాతుఁడు నీకొసఁగి నట్టి♦శస్త్రాస్త్రంబుల్
నీతంబుగ నిను సద్గుణ,పూతుని రక్షించుఁ గాక ♦ పుణ్యచరిత్రా! ౨౨౭

కం. జనకునిఁ గొలిచిన ఫలమును, జననీశుశ్రూష ఫలము ♦ సత్యఫలంబున్
వనవాసాయాసము నీ, కొనరక యుండంగఁ బ్రోచు♦చుండుఁ గుమారా! ౨౨౮

చం. సమిధలు, దర్భలున్, జెగతి♦చాలును, నాయతనాళి, వింతలై
కొమరగుస్థండిలంబులును ♦ గొండలుఁ, జెట్టులు, గుజ్జుచెట్లు, సిం
హములుఁ, బతంగకోటి, పన♦నాశనమండలముల్, మడుంగులున్,
విమలదయన్ నినున్ సకల♦వేళలఁ బ్రోచుచునుండు నాత్మజా! ౨౨౯

ఉ. స్వస్తి ఘటింత్రు నీకు ఋషి ♦ సాధ్యమరుత్తులు, విశ్వు, లాస్థమై,
స్వస్తి విధాతృధాతలును ♦ స్వస్తి ఘటింత్రు భగార్యమార్కులున్
స్వస్తి దిశాధినాయకులు ♦ శక్రముఖుల్ ఋతుపక్షమాసముల్
స్వస్తి క్షపాబ్దఘస్రములు ♦ స్వస్తి ఘటించుత సన్ముహూర్తముల్. 230

కం. స్మృతియును ధృతియునుధర్మము, సుతరత్నమ! నిన్నుఁ బ్రోచు♦సుఖదము లగుచున్
సితకరగురుగుహకమలజ,సుతసప్తర్షులు సతంబు ♦ సుఖముల నిడుతన్. 231

కం. దిక్కులు దిక్పతులును నా,మ్రొక్కుల నంగీకరించి ♦ మునుకొని యెపుడున్
దిక్కగుత నీకుఁ దండ్రీ, దిక్కటి వనవీథులందుఁ ♦ ద్రిమ్మఱు వేళన్. 23౨

కం. గిరిసింధువరుణగగనాం,తరిక్షవసుధానదులును ♦ దారాగ్రహాళి
ర్వరులు దినంబులు సంధ్యలు, గురురక్ష యొనర్చు నడవిఁ ♦ గ్రుమ్మరు నీకున్.

కం ఋతుషట్కము మాససముల్, హితగతిఁ గాష్ఠలును గలలు ♦ బృందారకులున్
దితిసుతులుఁ బ్రోవుతన్ సుత, ధృతముని వేషమునఁ గానఁ ♦ దిరిగెడినిన్నున్. 23౪

ఆ. క్రూరకర్మనిరత♦ఘోరపిశాచాది, రాక్షసాళివలన ♦ రూక్షవన్య
మృగచయంబువలన♦నేభయంబును నీకుఁ, గలుగకుండుఁ గాతఁ ♦ గాననముల.

ఆ. వానరంబు తేలు ♦ వనమక్షికంబును, నీఁగ పాము పురుగు ♦ నెవ్వ డైన
సోఁకకుండుఁ గాక ♦ మందరాకార! నీ, వడవులందుఁ దిరుగు ♦ నపుడు పుత్ర.

కం. సింగంబులు నెలుఁగులు నేఁ, నుంగులుఁ గోఱమృగములు ని♦ను నవ్వనవీథిన్
శృంగులుఁ జెనకవు; మఱి నీ, చెంగటఁ జేరంగ లేవు ♦ చెన్నఁటిమృగముల్.

కం. నరమాంసభోజనంబు లొ, నరిచెడిమృగసంఘములు న♦నారతమును నా
పరమప్రార్థనచే నీ, దరిఁ జేరఁగ నైన రావు ♦ తనయా! యడవిన్. ౨౩౮

తే. అడవిత్రోవల నీ విట్టు ♦ లరుగుచోట, బహుళసౌఖ్యప్రదంబు లౌ ♦ బాట లెల్ల;
రహిని ఫలియించు నీదుప♦రాక్రమంబు, నాయనా రామ శుభ మగుఁ ♦ బోయిరమ్ము.

ఉ. మాటికి మాటికిన్ శుభము ♦ మానక కూర్చుత మిన్న, దేవతా
కోటులు, నీదుశాత్రవులు ♦ కూరిమి సోమగురుల్, కుబేరుఁడున్,
బాటిగ సూర్యుఁ; డగ్ని యును ♦ వాయువు ధూమము మంత్రపాళి ఘో
రాటవులందు నీరముల ♦ నాడఁగ నీకు శుభం బొసంగుతన్. ౨౪౦

తే. సర్వలోకవిభుండును ♦ సర్వసాక్షి, బ్రహ్మభూతైకభర్తయు ♦ బ్రహ్మఋషులుఁ
దక్క దేవతలును వనీ♦తలమునందుఁ, దిరుగునినుఁ బ్రోచుచుందురు ♦ దివ్యతేజ.

తరువోజ.

అనుచు వేల్పుల నెల్ల ♦ నాపుణ్యసాధ్వి ♦ యమలమాల్యంబుల ♦ నతులగంధముల
ననురూపవినతుల ♦ నర్చించి మఱియు ♦ ననఘవిప్రునిచేత ♦ నగ్నుల వేల్చి
తనయునకును శుభ♦దం బగురీతి ♦ ధవళమాల్యముల ఘృ♦తంబుల సమిధ
లను దెల్లయావల ♦ లలనలమిన్న ♦ లలితంబుగాఁగఁ జ♦ల్పఁగ ఘటియించె. ౨౪౧

తే. ఒజ్జలు నిరామయముగ శా♦స్త్రోక్తసరణి; శాంతికై వేల్చి వెలుపలి♦స్థానములను
బలిని గల్పింప మధుదధి♦పటలి నేత, నక్షతల స్వస్తివాచంబు ♦ లనిరి బుధులు.

తే. ఆద్విజేంద్రుల కెల్లర ♦ కర్హరీతిఁ, దృప్తి వెలయంగ దానంబు ♦ లిచ్చి రాము
మాతసత్కీర్తిపూతప్రే♦మమున రాము, చంద్రుఁ గనుఁగొని దీవించు♦సారమతిని.

♦ కౌసల్య శ్రీరామునకు మంగళాశాసన మొనర్చి రక్ష గట్టుట. ♦

కం. ఏమంగళ మొదవెనొ నా, నామరపూజ్యునకు దశశ♦తాక్షునకును సం
గ్రామమున వృత్రుఁ జంపఁగ, నామంగళ మొనరుఁగాక ♦ యన్నా! నీకున్.

కం. ఏమంగళము సుపర్ణున, కామాత ఘటించె వినత ♦ యమృతముఁ దేరం
బో మదిఁ బూనినవేళను, నామంగళ మొనరుఁగాక ♦ యన్నా! నీకున్. ౨౪౬

కం. ఏమంగళ మదితియు సు, త్రామునకు ఘటించె మును సు♦ధాలబ్ధి నరి
స్తోమము నిర్మూలింపఁగ, నామంగళ మమరుఁగాక ♦ యన్నా! నీకున్. ౨౪౭

కం. వామనుఁడై మూఁడడుగుల, చే మహిఁ గొలువంగ వృద్ధిఁ ♦ జెందెడువేళన్
శ్రీమధుహరి కేమంగళ, మామంగళ మమరుఁగాక ♦ యన్నా! నీకున్. ౨౪౮

కం.ఋతుజలధిద్వీపంబులు, శ్రుతులును లోకములు దిశలు ♦ శుభమంగళముల్
సతతము నిను సన్మంగళ,యుతుఁగాఁ గావించుఁగాత ♦ మొప్పుగఁ బుత్రా. ౭౪౯
సీ. అని తనూజునకు శే♦షాక్షతల్ శిరమునఁ, గదియించి మిగిలిన♦గంధ మలఁది
దృష్టఫలంబు లై ♦ యెసఁగుమూలికల వి,శల్యకరణిని ర♦క్షగను గట్టి
జపియించి మంత్రముల్ ♦ సాధ్వి దుఃఖిత యయ్యుఁ, బరితుష్టవోలె వె♦ల్పలికిఁదోఁప
శిరము మూర్కొని ప్రేమ♦పరతఁ గౌఁగిటఁ గ్రుచ్చి,గద్గదవాణి వా♦క్సూత్రఁ బలుకుఁ
తే. బోయిరా పుత్ర! సిద్ధార్థ ♦ పూతుఁ డవుగ
సౌఖ్యముగ నీవు కార్యముల్ ♦ చక్కఁ జేసి
మరలి యాయయోధ్యను రాజ♦మార్గవర్తి
వైననినుఁ గాంతుఁ గాక నా♦యనుఁగుఁగుఱ్ఱ. ౭౫౦
కం.నష్టంబులుగా దుఃఖము, లిష్టాప్తికి నలర మో మ♦హీనముగ వనీ
కష్ట మఱి వచ్చునిన్ను, న్నిష్టసుతా! యుదయదిందు♦నింబలెఁ గాంతున్. ౭౫౧
మ. వనవాసంబుఁ దరించి, యాయవనిప♦వ్యాహారముం దీర్చి, వ
చ్చి సమద్ధ్వేమణ! భద్రపీఠమున నా♦సీనుండ వై యుండ నిన్
గనుదుం గాత; వధూయుతుండవయి నా♦కాంక్షించునర్థంబులున్
ఘనసంవర్ధిత మాచరింపు చిరముం ♦ గల్యాణయుక్తుండ వై. ౭౫౨
కం.నాయర్చించెడిసురమును, లాయీశుఁడు భూతములు మ♦హాసురఫణులున్
నీయేగెడువనముల న,త్యాయతకృపఁ బ్రోచుచుండు ♦ రన్నా నిన్నున్. ౭౫౩
మ. అని యశ్రుప్రతిపూర్ణనేత్ర యయి తా ♦ నాశాసనంబుల్ సమా
పనముం జేసి యథావిధిన్ సుతునిసౌ♦భాగ్యార్థ మై ప్రేమముం
దనరన్ మంత్రితరక్షఁ గట్టి తనయుం ♦ దద్దన్ సమాశ్లేషణం
బున సాధ్వీమణి దేల్పఁ బ్రీతుఁ డయి రా♦ముం దుత్తమశ్రద్ధ మై ౭౫౪
కం.జననికి వలగొని పదముల, వినయంబున వ్రాలి వెండి ♦ వెండియు సీతా
వనజాక్షీనిలయమునకుఁ, జన నెంచె మహాయశుండు ♦ స్వశ్రీ వెలుఁగన్. ౭౫౫

శ్రీరాముఁడు సీతను జూడఁ బోవుట.

తే. తల్లి దీవింప వలగొని ♦ తరలి యచటఁ, దనదుకల్యాణగుణముల♦పెనుపుఁ జేసి
భృశసమాకృష్టచిత్తులై ♦ యెల్లజనులు, దన్ను వీక్షింపఁజనియె సీ♦తను గనంగ.
ఉ. అక్కడ భూమిపుత్రి యొకఁ ♦ డైన నెఱుంగమి నీయుదంతమున్,
గ్రొక్కుచు యౌవరాజ్యపద♦మున్ వహియించుత భర్త యంచుఁ, బె
న్మక్కువ దైవపూజల స♦మంజసరీతిని దాన తీర్చి, బో
కెక్కి కృతజ్ఞ గంధతతు ♦ లెల్లను గూరిచి భర్తృపూజ కై ౭౫౬

కం. నృపనీతివిదుషి యగునా, విపులాయతచారునేత్ర ♦ శ్వేతచ్ఛత్రా
దిపరివృతుం డగునాథుం, డెపు డెప్పుడు వచ్చు ననుచు ♦ నెదురుం జూడన్. ౨౫౮
ఉ. చారువిభూషితంబు ఘన♦సమ్మదహృష్టజనాకులంబు స్వా
గారముఁ జొచ్చి సిగ్గుపడి ♦ క్రన్న నవాఙ్ముఖుఁ డైననాథునా
కారముఁ జూచి మేను వణఁ♦కన్ సతి దిగ్గన లేవ, శోకదు
ర్వారత సైఁపలేక రఘు♦వర్యుఁడు దూపిలె బాహిరంబుగన్. ౨౫౯
చం. వెలవెలఁబాఱు నెమ్మొగము ♦ స్వేదజలార్ద్రిత మైన దేహమున్
బలితపుదుఃఖభారమును ♦ పద్మవిలోచన గాంచి శోకవి
హ్వల యయి ప్రాణనాథ! చెపు♦మా యిటు లీసమయంబునందు నీ
వెలమిఁ దొఱంగి యుండుటకు ♦ హేతు వ దెయ్యది కల్గె వల్లభా? ౨౬౦
చం. అలగురుదేవతాకము శు♦భాకరపుష్యము నేఁడ యంచు వి
ప్రులు వచియించి, రేమిటికిఁ ♦ బొల్పఱి నీగతి దుర్మనుండ వై?
లలితవిశాలమున్ శతశ♦లాకము పుష్కరఫేనతుల్య మా
వెలినునుగొడ్గునీడఁ బృథి♦వీవర! యేటికి రావు చెప్పుమా? ౨౬౧
సీ. చంద్రహంసప్రకా♦శంబు లౌచామరల్, విసర రేల ముఖార♦విందమునను?
వాగ్మిలు వందులు ♦ పరమసన్మదమునఁ, బొగడ నేటికి రారు ♦ పుణ్యశీల?
సూతమాగధు లేల ♦ శుభమంగళంబుల, నీవెంట రా రైరి ♦ నీరజాక్ష?
వేదపారగు లైన♦విప్రులు నభిషిక్త, శిరమున నుంచరే ♦ పెరుఁగుఁ 'దేనె?
తే. మంత్రు లేటికి నీతోడ ♦ మలయ? రేల, పౌరజానపదుల్ వెంట ♦ రా? రదేల
స్వర్ణభూషితనిస్తుల♦జవనహయచ, తుష్కయుతపుష్యరథము ముం♦దుగను బోదు?
చం. అరుగ దదేల కృష్ణజల♦దాద్రినిభంబు సులక్షణంబు నె౦
కరిపతి నీదుముంగలను? గాంచనచిత్రము భద్రపీఠ మో
సురుచిరరూప! మున్నుచనఁ ♦ జొప్ప డదేల? యపూర్వవర్ణ మై
యరుసముఁ బాసె మోము చెపు♦మా యభిషేకమువేళ డాసియున్? ౨౬౩

శ్రీరాముఁడు సీతతోఁ దా నరణ్యమునకుఁ బోవువార్తఁ దెలుపుట.

కం. అని కరుణంబుగ విలపిం, చినసతిఁ గని రాముఁ డనియె ♦ సీతా! నన్నున్
వనములకుఁ బొ మ్మటంచును, బనిచిరి చుమి తండ్రిగారు ♦ పద్మదళాక్షీ. ౨౬౪
కం. గొప్పకులంబునఁ బుట్టితి, వొప్పుగ ధర్మముల నేర్చి ♦ తోసతి! ధర్మం
బెప్పుడుఁ దప్పవు జానకి! చెప్పెద విను నిబ్బరముగఁ ♦ జెల్లినతెఱఁగుల్. ౨౬౫
చం. జనకుఁడు సత్యవాదియును ♦ క్ష్మాతలనాథుఁడు నైనయాజి నా
జననికిఁ గైకకున్ మునుపు ♦ సన్మతి రెండువరంబు లిచ్చె; నా

వనితయు వాని నాత్మ నిడి ♦ వర్తిల నేఁ డభిషేకయత్నముల్
గని, యవి ధర్మమార్గమున ♦ క్ష్మావిభుఁ దీర్పఁగఁ గోరె జానకీ. ౭౬౬
శా.ఈ రే డేఁడులు దండకాటవులలో ♦ నేఁ గృచ్ఛ్రరం బోవ, భూ
భారం బెల్ల వహింపఁగా భరతుఁ, డీ♦భంగి న్వరంబుల్ గొనెన్;
సారారణ్యవిహారకేళిఁ జలుపం ♦ జంద్రాస్య! నేఁ బోవుచున్
జేరన్ వచ్చితి నిన్నుఁ జూచుటకు నై ♦ సీతా! సతీరత్నమా! ౭౬౭

శ్రీరాముఁడు సీతకు నీతులు చెప్పుట.

చం.భరతుని ముంగల న న్బొగడి ♦ పల్కకు మెన్నఁడు, వృద్ధియుక్తు లౌ
పురుషులు సైఁతురే యితర♦పూరుషసంస్తవ, మట్లుగావునన్
భరతుఁడు నీకు మ్రొక్క నిట ♦ వచ్చినవేళల వానితోడ నో
తరుణి! ప్రశంస సేయుమి హి♦తం బగు మద్గుణజాతవర్ణనల్. ౭౬౮
ఉ. లోకము పాడి నీవు పది♦లోఁ బదునొక్కటిగాఁగ నుండు, మ
స్తోకతరానుకూలతన ♦ త్రోయుట మే లగు నీకుఁ గాలమున్;
కైకతనూజు నింక మన ♦ క్ష్మాపతి పూన్చుట యౌవరాజ్యమున్
నీకుఁ బ్రసాద్యుఁ డాతఁ డవ♦నీపతియే కద చక్కఁ జూడుమా. ౭౬౯
కం.జనకుని ప్రతిజ్ఞ దీర్పఁగఁ, జనియెదఁ గానలకు నిపుడ ♦ స్థైర్యముఁ గొనుమీ;
వనముల నే నుండఁగ నిటఁ, జను నీకు వ్రతోపవాస♦సంగతి యనఘా. ౭౭౦
ఉ. ప్రొద్దున లేచి వేల్పులకు ♦ మ్రొక్కి, యథావిధిఁ బూజఁ దీర్చి, యో
ముద్దియ! నాదుతండ్రికిని ♦ మ్రొక్కుము, ధర్మ మొకండ యూఁతగాఁ
దద్దయు వృద్ధదుఃఖభర♦తప్తయు నైనమదీయమాత నీ
వొద్దిక భక్తిమైఁ గొలుచు♦చుండుము, పూజలఁ దన్పుచుండుమీ. ౭౭౧
ఉ. ఖ్యాతచరిత్ర! తక్కుగల♦యంబలు నీకును వంద్య లెప్పుడున్
మాతలు నాకు నందఱు సమానలు ప్రీతిని సౌహృదంబునన్
భ్రాతలరీతిఁ బుత్రకుల♦భంగిని మిక్కిలి చూడు కైకయీ
జాతుని లక్ష్మణానుజుని ♦ సమ్మతి వారలు నాదుప్రాణముల్. ౭౭౨
కం.కులమునకు దేశమునకున్, వల నొప్పఁగ రాజు ప్రభువు ♦ భరతుఁడు కానన్
జలజాక్షి! యెప్పు డేనియు, వల దప్రియముల్ ఘటింప ♦ వానికిఁ గినుకన్. ౭౭౩
కం.భూపతు లారాధితు లై, భూపుత్రీ! శీలయత్న♦ముల లోకులచేఁ
బ్రాపింతురు సమ్మదముం, గోపింతురు తద్విరుద్ధ♦గుణములఁ గనినన్. ౭౭౪
కం.కడుపునఁ బుట్టినబిడ్డలు, దుడుకున నహితంబు సేయఁ ♦ దొడఁగిర యేనిన్
విడుతురు భూపతు; లన్యుల, గడియింతురు కార్యసాధ♦కతఁ గ్రాలినచోన్. ౭౭౫

ఉ. కావున నింక యుండుము సుఖంబుగ, రాజనుతానుకూలస
ద్భావమునన్ స్వధర్మచరితంబును సత్యపరాయణత్వముఙ్
బ్రోవను, నొవ్వఁ జేయకుము తొయ్యలి! యెవ్వరిచిత్తమైన, సం
భావన సేయు నాపలుకుఁ బావని! నేఁ జనువాఁడఁ గానకున్. ౨౨౬

→ సీత శ్రీరామునితో నరణ్యమునకుఁ దాను వచ్చెద నని చెప్పుట. ←

కం. అణుమధ్య ప్రియార్హయు సద్గుణవతి ప్రియవాదిని సతి గురువిప్రియభా
షణములు దనుఁ బతి పలికినఁ, బ్రణయామర్షమున సీత పలికెఙ్ విభునిన్. ౨౨౭

కం. ఏ మిది యిటు పల్కెద వో, రామా! యీ పేదపలుకు రాజకుమారా!
నీమాటలు విని నంతన, నామాత్రకు నాఁపరానినవ్వ దయించెన్. ౨౨౮

చం. తన తన పుణ్యపాపములు తాను భుజించుచు నాత్మభాగ్య మా
పనులు ఘటించు చుండెడిని భ్రాతయుఁ దల్లియుఁ దండ్రి కొడలుఙ్
దనయుఁడు; భర్తృభాగ్యమును దప్పక భార్య యొకర్తె పొందుఁ; గా
వున నినుఁ గాన కేగు మనఁ బొమ్మనినట్టులె నన్ను వెంబడిన్. ౨౨౯

కం. జనకుండు కాఁడు, కానిని జనని, యాత్మ సుతుఁడు కాఁడు సకియలు గా రిం
దును నందు నెల్లకాలము, ఘనవేణికి భర్త యొకఁడె గతి ప్రాణేశా. ౨౩౦

ఉ. కానల కేగె దేనియును గాంతుఁడ! నీకును మున్నువోవు చేఁ
గానసమార్గసీమఁ గుశకంటకముల్ దొలఁగించి మార్గనం
బూనఁగఁ జేయు చుండెదను, నొష్టులు ద్రావఁగఁ దక్కనీరముఙ్
మానినరీతి నాపయిని మానుము రోసము నీవుఁ బ్రీతి మై ౨౩౧

ఉ. మానవధినాథ్య! వీరవర! మానుము బాలిక నొంటిదాని నేఁ
గానకుఁ దోడుకొం చరుగఁగా నెటు లొ ననుసందియంబు, న
న్నానక తోడుకొం చరుగుమా, నినుఁ బాసియు జీవయుక్త నై
యే నిట నుండునంతయఘు మేము యొనర్పను గాదె వల్లభా. ౨౩౨

చం. అతులితసౌధవీథులను హాయిగఁ గ్రుమ్మరుకంటె, దేవతా
తతులవిమానసీమల సదా విహరించుటకంటె, వన్యమున
ద్ధతులఁ జరించుకంటెను, వెతల్ పడు చున్నను నేయవస్థలఙ్
సలికిని భర్తృపాదపరిచర్యయె యుత్తమ మార్యసత్తమా. ౨౩౩

ఉ. అంబయుఁ దండ్రిమున్న వివిధాశ్రయముల్ పలెఁ గొల్చుభంగి స
ర్వంబును నేర్పి, రియ్యెడ నవంబుగ నేర్చెడునద్ది లేదు, నే
నింబుగ వచ్చెదాన, హృదయేశ్వర! మానవవర్జితంబు దు
ర్గంబు వృదాకుభల్లుకతరక్షువికీర్ణము నైనకానకున్. ౨౩౪

కం. పుట్టినయింటనుబలె నే, నట్టడవుల హాయి నుందు ♦ నాథా; చింతిల్
దొట్టవు మది ముల్లోకము, లెట్టైనఁ; బతివ్రతంబ ♦ యెంచుచు నుందున్. ౭౮౫

ఉ. ఘమ్మనిపువ్వుఁ దేనియల♦కమ్మనితావులు గ్రమ్ము నాయర
ణ్యమ్ముల దీమ మొప్ప నన♦యమ్మును దాలిచి బ్రహ్మచర్యము
నృమ్మతి నీపదాబ్జభజ♦న మ్మొనరించుచు నిన్నుఁ గూడి నే
నమ్మదకేళిఁ దేలెదను ♦ శౌర్యధనా! యిది సమ్మతింపవే. ౭౮౬

కం. ఏమనుజుల నైన వనీ,భూముల రక్షింపఁ గలవు ♦ పౌరవడ కింకన్
నామాటఁ జెప్ప నేటికి, నోమానద! పూర్ణకరుణ ♦ యుంపుము నాపై. ౭౮౭

ఉ. సందియ మింత లేదు, నృప♦చంద్రమ! వచ్చెద నీదు వెంట, నా
డెందమునిశ్చయం, బిది క♦డింది సుమీ మరలింప నీకు, నీ
కెందును గష్ట మీయను, బ♦లీ! ఫలమూలము లారగించి లోఁ
గుందక నిన్నుఁ గూడి మదిఁ ♦ గూర్చెద మోదము, నన్ను నమ్ముమీ. ౭౮౮

ఉ. కోరెదఁ బ్రాణనాథ! నినుఁ ♦ గూడి చరింప వనీధునీఝరీ
తీరగుహాకుటీరముల ♦ ధీరజనాగ్రణి! జల్లు లాడఁగాఁ
గోరెద హంససారసని♦కూజిత రాజిత పద్మినీధ్రకా
సారములన్ మనోజ్ఞరుచి♦సారములన్ మనసార నేఁటులన్. ౭౮౯

చం. అలరుచు నీదుసంగతి శ♦తాయుతవర్షము లైనఁ గానలో
నలజడి లేక యుండెదను ♦ నాకమ యైనను నాకు మోదమున్
గొలుపదు నిశ్చయంబు నినుఁ ♦ గూడఁగఁ గల్గక యున్నఁ, గావునన్
బలిముఖసింహవారణవి♦భాసము కానకు వెంట వచ్చెదన్. ౭౯౦

చం. జనకగృహంబుచందమున ♦ సౌఖ్యముగా నివసింతు, నీకు నా
య్యనఁ బరిచర్య సేయుదు, న♦నన్యమనస్క, దృఢానురక్తచి
త్తను, నను వీడితేని మెయి ♦ దాల్ప నిజంబుగఁ, దోడుకొంచుఁ బో
మ్మనఘ! ఘటింపు కోర్కి నిను♦నంతటివానికి నిద్దిభారమే? ౭౯౧

శ్రీరాముఁడు సీత కరణ్యమందలి కష్టంబులఁ జెప్పుట.

కం. అనుచు వచించినసీతను, గని ధర్మరతుండు మదిని ♦ గైకొనఁ డయ్యెన్
వనితను గొనిచన; మఱియును, వనజాక్షికి నిట్టు లనియె ♦ వనదుఃఖములన్. ౭౯౨

కం. వనవాసక్లేశంబుల, ఘనుఁ డాలోచించి బాష్ప♦కలితేక్షణఁ దాఁ
జనవున నాశ్వాసించుచు, వనవాసోద్యమము మాన ♦ వనితకు ననియెన్. ౭౯౩

ఉ. పుట్టితి గొప్పవంశమునఁ ♦ బూని చరించెదు ధర్మనిష్ఠ, లోఁ
దట్టిన దెల్లఁ బ్రోవగ యు♦ధాసుఖవృత్తిఁ జరింపఁబోకుమీ,

పట్టుగ నింద యుండును; శుభం బగు ధర్మము నాచరింపు, మే
నెట్టు వచింతు నప్పగిది ♦ నీ వొనరించుట కార్య మౌఁ జుమీ. ౭౯౪

కం.అడవులకుఁ జనఁగఁ గోరికి, విడువుము; బహుదుఃఖకరము ♦ విపినం; బే నీ
యెడఁ బ్రేమకలిమిఁ జెప్పెదఁ, బడఁతీ! సుఖ మన నెఱుంగ ♦ వనవాసమునన్.

కం.విను మబలా! కాంతారము, ఘనతరదుఃఖముల కునికి ♦ గావునఁ జుమ్మీ
వన మని చెప్పం బడియెడి, వనమున సౌఖ్యంబు గలదె ♦ వనరుహనయనా! ౭౯౬

కం.మానితచరిత్ర! శైలగుహానివసద్భూరిశరభ♦హరిరవము ఝరీ
ధ్వానము కర్ణకఠోరము, కాన నరణ్యంబు దుఃఖ♦కరము లతాంగీ! ౭౯౭

కం.మానవవర్జితతలకే,ళీనిశ్చలనిరతమదమ♦లీమసమృగసం
తానము పయిఁ బఱతెంచును, గాన నరణ్యంబు దుఃఖకరము లతాంగీ! ౭౯౮

కం.మానిని! పంక యుతంబు మ,హానక్రవిభీషణము మ♦దానేకపసం
స్థానము సరిద్వితానము, కాన నరణ్యంబు దుఃఖకరము లతాంగీ! ౭౯౯

కం.ఒనవలా! కంటకశా,ఖానిచితము తామ్రచూడ♦ఖరరణితము ని
ష్పానీయము దుర్గము వని, కాన నరణ్యంబు దుఃఖ♦కరము లతాంగీ! ౮౦౦

కం.తానుగఁ బడునాకులగుమి,పైనగచాల్లె న్నా పగలు ♦ పడి నరుఁడు నిశన్
మేను పడవైవ వలయును, గాన నరణ్యంబు దుఃఖ♦కరము లతాంగీ! ౮౦౧

కం.తానుగ రాలినఫలసం,తానమ్మును రాత్రులన్ ది♦నమ్ముల నియతిన్
దాను దిని ముదముఁ గొనఁ దగుఁ, గాన నరణ్యంబు దుఃఖ♦కరము లతాంగీ!

చం.జడలు ధరింపఁగావలయు ♦ జానకి! నారలచీర లెప్పుడున్
విడువక కట్టఁగా వలయు ♦ వెండియు నోపినయంత పస్తులం
దడఁజడి పొందఁగా వలయు ♦ నాగత మానతిథివ్రజంబు నె
ప్పుడుఁ బరిచర్యఁ దన్పు, విధి♦పూర్వకదైవతపూజ, లొ ప్పగున్. ౮౦౩

కం.మానవతి! మూఁడుప్రొద్దుల, దైనందినమును మునుంగఁ ♦ దగు; నేమములన్
బూనఁగ వలయును గావునఁ, గాననవాసంబు దుఃఖ♦కరము లతాంగీ! ౮౦౪

కం.మానితవిధియుక్తంబుగఁ, దానుగఁ బూవుల గడించి ♦ తగ వేదిని శ్ర
ద్ధానతి బలి కిడ వలయుం, గాన నరణ్యంబు దుఃఖ♦కరము లతాంగీ! ౮౦౫

కం.ఏనాఁటికి నేమాత్రం, బోనలినాక్షీ! లభించు ♦ నుదరము నింపన్
దా నంత తృప్తి గొనఁ దగుఁ, గాన నరణ్యంబు దుఃఖ♦కరము లతాంగీ! ౮౦౬

కం.మాననియాఁకలి హోరని,మాననిగాలియును నిరులు ♦ మా వెఱపు సదా
మానక యుండెడిఁ గానలఁ, గాన నరణ్యంబు దుఃఖ♦కరము లతాంగీ! ౮౦౭

కం. నానారూపంబులు గల, నానాగిరిఫణులు ఘూని♦నాదముల నర
ణ్యానుల నిచ్చగఁ దిరుగును, గాన నరణ్యంబు దుః ఖ♦కరము లతాంగీ! ౮౦౮

కం. చాన! నదీవక్రంబు ల, హీనఘనీనిలయ ఫణులు ♦ నెపు డడ్డం బై
కానఁబడు మార్గములలోఁ, గాన నరణ్యంబు దుః ఖ♦కరము లతాంగీ! ౮౦౯

కం. జానకి! యీఁగలు దోమలు, గానఁగ భయ మిచ్చు వృశ్చి♦కంబులు పురువుల్
మే నెల్ల ముసిరి కఱచును, గాన నరణ్యంబు దుః ఖ♦కరము లతాంగీ! ౮౧౦

కం. ఓ నెలఁత! ముండ్లచెట్టు ల, నూనం బగు దర్భ తెల్లు ♦ నొగి వ్రేలెడి శా
ఖానికరము కొస లాడెడిఁ, గాన నరణ్యంబు దుః ఖ♦కరము లతాంగీ! ౮౧౧

కం. కాననవాసుల కెండును, నానాతను కష్టములు న♦నంతవ్యధలుఁ
మానసభీతియుఁ బాయవు, గాన నరణ్యంబు దుః ఖ♦కరము లతాంగీ! ౮౧౨

కం. మానసము క్రోధలోభ, స్థానముఁ జలుపంగ రాదు ♦ తప మురు వగు, నె
ద్దానికి భయపడఁ జెల్లదు; కాన నరణ్యంబు దుః ఖ♦కరము లతాంగీ! ౮౧౩

ఆ. వలన దుడుగు మబలా ♦ వనవాసగమనంబు, వడఁగఁ జాల వచటి♦యిడుమ లెల్ల;
నింతవట్టు చూడ ♦ నెన్ని యోదోషముల్, గాన వచ్చెఁ గాదె ♦ కాన ననిన.

సీత రామునితోఁ దా నడవికి వచ్చుటకుఁ గారణములు చెప్పుట.

ఉ. రాముఁడు దన్నుఁ దోడ్కొని య♦రణ్యతలంబున కేగ నిష్టముఁ
లేమి నెఱింగి శోకమున ♦ లేను ప్రసక్తతతాశ్రుధార గ్రొ
యోమహనీయ తేజ! భవ♦దుక్తవనాంతరవాసదుఃఖము
ల్నామదిఁ దోఁచె నమ్ముము గు♦ణమ్ములె నీ దగు ప్రీతి పెంపునన్. ౮౧౪

కం. మృగశరభసింహవారణ, ఖగసృమరము లెవ్వ డేని ♦ కాననిసూపుఁ
దగ నినుఁ గని మార్గగ మై, బెగడునఁ బరువెత్తు; వెఱప♦వే భయ మైనన్.

కం. గురుజనులయాజ్ఞ చొప్పునఁ, గరుణాత్మక! వచ్చు టొండెఁ ♦ గానకు నీతోఁ
బొరి నెడఁబాసిన నిప్పుడె, మరణించుట యొండె నొండు♦మార్గము గలదే. ౮౧౬

కం. నీకడ నే నుండఁగ ను, శ్లోకా! కన్నెత్తి తేఱి♦చూడం గలఁ డా
నాకేశుఁడైన నాదెస? నాకింతయుఁ దెలియదా యొ♦నా జితవైరీ! ౮౧౮

కం. పతియెడఁ బాసిననాధ్వియు, క్షితి బ్రదుకం జాల దనుచుఁ ♦ జెప్పరె మీరే
మతి నాకుఁ బూర్వ? మిపుడా, హితగతికిని నన్యథాత్వ ♦ మేగతిఁ గలిగెన్? ౮౧౯

ఉ. ఇంతియ కాక నే జనకు♦నింట వసించినయప్డు ప్రాజ్ఞ సి
ద్ధాంతులు చెప్ప వింటి, గహ ♦ నాంతరవాసము గల్గు నా కటం
చంతటిలక్షణజ్ఞులును ♦ నాడిరి మున్న భవిష్యదర్థ, మ
ట్లింతయుఁ దప్పు నేట్లు? వృష♦లా మహనీయులయూఁడువాక్యముల్? ౮౨౧

కం.సాముద్రికశాస్త్రజ్ఞులు, రామా! నే వనులఁ గ్రుమ్మరం జనుదు ననం
గా మది నువ్విళులూరుదు, నామెయి నే నెన్నఁడొక్కొ యరుగుదు ననుచున్.
శా.వారల్ చెప్పినయట్లు కల్గె గహనావాసంబు, నే బ్రాహ్మణా
జ్ఞారీతిం జరియించు టర్హమె కదా సత్యంబుగా వారివ్యా
హారం బూనియు వెంట వచ్చెదను, లే దన్యంబు, కాలం బిదే;
ధీరా! యూదురు గాక విప్రులు యథార్థీభూతసద్భావముల్. ౨౨
కం.అకృతాత్ములైనవారికి, వికటంబులు గాక బహుళవిపినశ్రమముల్
వికటంబులె మనబోంట్లకు, సుకరంబులు గాక నిజము చూడుము వీరా! ౨౩
ఉ. చిన్నటనాఁట నే జననివీట వసింపఁగఁ గన్య నొచు ముఁ
సన్నుతశీల యైనయొకసంయమినీమణి భావిఁ[1] బల్కె నీ
చిన్నది భర్తతోడఁ దమిసేయు నరణ్యనివాసలీలకుఁ
బన్నుగఁ దోడికొం చరుగు భర్తయు నం చని యోహృదీశ్వరా! ౨౪
కం.ఇచ్చట నే యుత్సుక నై, సచ్చరితా! నిన్ను నెన్ని సారులొ యెట్లె
ట్లిచ్చమెయి వేఁడ లేదే, మచ్చిక నీతోడ వనుల మలయఁగ నాథా! ౨౫
కం.ఓడక యడవులకును నీ,తోడన చను దెంచి శౌర్యధుర్యా! నీకుఁ
వీడక సేవలు సేయఁగ, వేడుక పడియెడి మనంబు వినవే మనవిన్. ౨౬
కం.శుద్ధచరిత్రా! కరుణా,బద్ధుని నిను భర్తఁ గొలిచి పావని నగుదుఁ
సిద్ధము వేయేటికి నా,బుద్ధిని దైవంబు నాదుపురుషుఁడ చుమ్మీ. ౨౭
కం.ఈలోకము మా కేటికి, నాలోకమునందు నైన ననఘాత్మక! నీ
తో లీలాగతి నుండుట,యే లాభము నెల్లశుభ మిఁ కేలా మాటల్. ౨౮
కం.సతి జనకునిచే ధారా,యుతముగ నెవ్వనికి దత్త యోగ్యచరిత యా
సతి కాపతి పరమున నగు; శ్రుతు లిట్లని మొఱలు వెట్టు సుమతీ వినవే. ౨౯
శా.ఈలా గుండఁ బ్రమాణపద్ధతులు నీయిల్లాలి, సద్వృత్త, స
చ్ఛీలాత్మం, బతిదేవతఁ, వినయసుశ్రీయుక్త, నీభక్తఁ, జిం
తాలోలఁ, వరసౌఖ్యదుఃఖములఁ దుల్యఁ, నాదుప్రాణేశ! నీ
వేలా తోడ్కొనిపోవ నొల్లవు? హితంబే యిద్ది నీకోఁటికిన్? ౩౦
తే. రామ! నన్నిందు దుఃఖవారాశిఁ ద్రోచి, కానలకు నీవ పోవంగఁ గడఁగె దేని
యగ్నిచేనైన విషముల నైన నీళ్ల,నైన మేను త్యజింతు సత్యంబు సుమ్ము. ౩౧
కం.ఇంతయుఁ దాఁ జెప్పినఁ దన, కొంతారనివాస మతఁడు కాదన సీతా
కాంత కనునీటఁ దోఁగిన, సంతాపముఁ బాపె రామచంద్రుఁడు కూర్మిన్. ౩౨

---

[1] భావి = జరుగఁబోవునది.

### సీత శ్రీరాము నిష్ఠురంబు లాడుట.

ఉ. ఊఱడఁ దన్నుఁ బల్కుపురుషోత్తముఁ గన్గొని వెండి సీత దాఁ
గాఱడవిం జరించుమతి గల్గుట యిట్లను నిందు నెయ్యపుం
గోఱడముల్ మనంబు వెఱఁ గొట్టుకొనం బరికంపమాన యై
మీఱినకింక చేఁ బతి నమేయపరాక్రము నట్టె చూచుచున్. ౮౩౩

తే. నాదుజనకుండు మిథిలాధినాథుఁ డిప్పు
డిది వినంగ వైదేహుఁ డేమెంచు నిన్ను
రామ! జామాత పురుషవిగ్రహముఁ గొన్న
స్త్రీ యటంచును దలఁపఁడే చిత్తమునను. ౮౩౪

తే. అధిప! ఖరకరుఁ డగునర్కునందుఁబోలెఁ, బరమ తేజంబు శ్రీరామభద్రునందు
లేద యని పల్కు జ్ఞానంబు లేని లోక, మన్మత మది యెట్లు సైరింతు నక్కటకట.

ఉ. ఏమిటికై విషాదము సహించితి వీగతి? భీతికారణం
బేమి ఘటిల్లె నీకు? నను నేఁటి కనన్యపరాయణన్ సతిన్
బ్రేమ దొలంగి పాయ మదిఁ బెట్టితి? వొక్కని నిన్నుఁ దక్క నే
నామనమందు నేనియుఁ గనం గులపాంసనివోలె నన్యునిన్. ౮౩౬

కం. నీవశవర్తిని యగున, న్నోవరనుతశీల! మది సమూహింపుము మున్
సావిత్రి సత్యవంతున, కేవిధ మావిధ మటంచుఁ బృథ్వీశసుతా! ౮౩౭

కం. నీయిల్లాలను గొమరుం, బ్రాయపుసుందరిని సతిని మతి నధ్యుషితన్
జాయం జీవునిపోలికి, మాయురె యన్యులకొసంగ మదిఁ దలఁచెదవే? ౮౩౮

కం. ఏరికి హితముం జలుపఁగ, వారించెదు నన్ను నట్టివారికి నీవే
కూరిమి వశ్యుఁడ వగుదువు, ధరిత్రీ! చరియింపుమీ విధేయుఁడ వగుచున్. ౮౩౯

మ. నను వెంటం గొనిపోక పోఁ దగదు కాంతారాళికిన్ నీవు, కా
ననమైనం, దపమైన, స్వర్గమయినన్ నా కిప్డు నీతోడిదే
యనఘా! లోకము, బాట నేఁ గలయఁ జూపన్నా, నిన్ను వెన్నంటి వ
త్తును, నుద్యానవిహారమందునబలెఁ గూర్మిం బ్రీతి నత్యంతమున్. ౮౪౦

కం. నీ వెంట నేను జనుచోఁ, బావిరి కుశకాశములును బల్లేరుగాయల్
భావింతు జింకచర్మము, లైవడిఁ దూలికలపోల్కి నిష్టం బేడీ? ౮౪౧

కం. క్రందుగఁ గాంతారంబుల, యందలి సుడిగాలి ధూళి యలమిన యేనిన్
డెందంబున వల్లభ! నను, గంధంపుంబొళ్లభంగి గ్రహియింతుఁ జుమీ. ౮౪౨

కం. లేఁబచ్చికపట్టుల నీ, తోఁ బవళింపంగ సుఖము ♦ దొరకొన నేలా
లోఁబుట్టుఁ గంబళంబుల, పైఁ బండఁగ నాకు? మెక్కు♦వలె తత్సుఖముల్? ౧౪౩

కం. ఆకులో యలములో పండులో, నాకుం గొంచెంబు గొప్ప♦నయముగ నీవే
చేకూర్చి చేతులారఁగఁ, బ్రాకటముగ నిడిన నమృత♦పానము సమమూ. ౧౪౪

చం. తలఁపను దల్లినిం, దలఁపఁ ♦ దండ్రి, స్మరింపను దోడఁబుట్టులన్,
దలఁపను నిల్లు వాకిలి, యు♦గ్రామతి నే వయి నాదు చేతిలో
పలఁ దమి నుంచు కాయలనొ ♦ పండ్లనొ మెక్కెద, నొక్క కష్టమేన్
గలుగఁగ నీను నీకు, నొక♦కాఁతియ గల్గదు నన్ను రాఘవా. ౧౪౫

కం. నీతోడ నున్న స్వర్గము, నీతోడు రహింప కున్న ♦ నిరయం బదియే;
నాతలఁ పిది మది నెఱుఁగుమ, యే తెంచెద మాన్పకుండు♦మీ ప్రాణేశా! ౧౪౬

కం. తగు నని తోడ్కొని పోవక, వగఁ గుందఁగ నన్ను నిచటఁ ♦ బాసెద వేనిన్
దెగి విషముఁ గ్రోలుదానను, బగతురచేఁ జిక్కి కష్ట♦పడ నోపుదునే? ౧౪౭

ఉ. ఒంటిమి నన్ను వీడి చన ♦ నోర్చెద వేని వియోగబాధ నీ
వెంటనె వచ్చుఁ బ్రాణములు ♦ విన్ము పరోక్షపుఁజావుకంటె నీ
కంటికిముందు నీచరణ♦కంజములం బడి చచ్చు టుత్తమం
బొంటరమింటరంబు లను♦నోర్వనివారిఁ గొల్చు చుందునే? ౧౪౮

చం. పదియును మూఁడు నొంటఁ జనఁట ♦ నన్నుఁ జొక్కుట దుఃఖవార్ధిలో
గొదకొని యుండ నేర్తునె? యు♦సుంతతిరీతిని నొక్క సూర్తిమేన్
మది ధృతి నిల్పఁ జాలఁ గను♦మాటయిదే విను నాథ! నీ వటం
చదవద రాముఁ గట్టుకొని ♦ హా యనుచుం బలవించె నార్తగాన్. ౧౪౯

తే. అరణియదరులు విడుచు న ♦ గ్నిలాగునాజ్జి, కార్చె దీర నిరుద్ధాశ్రు♦కణము లప్పుడు
విసపుఁగోలలు నాటిన ♦ విహ్వలించు, కరిణివోలికఁ బలవపో♦ఘాతములను. ౧౫౦

కం. తమ్ములనీరమువలెఁ గం, దమ్ములలో నుండి జాఱెఁ ♦ దద్దయుఁ గన్నీ
రమ్ముద్దియకును సంతా, పమ్ముభరమ్మునను గాంచి ♦ స్ఫటికాభం బై. ౧౫౧

తే. అమ్మహాభాగపూర్ణ చం♦ద్రాభ మైన, వదననీరజ మెంతేయు ♦ వాడు వాఱె
విడువక స్రవించుకన్నీటి♦ వేఁడుములకు, నీటఁ బావిన నెత్తమ్మి♦సాటి యగుచు.

శ్రీరాముఁడు సీత వనంబునకు వచ్చుట కంగీకరించుట.

చం. పరవశ యైనయట్లు వెత♦పాటున నేడ్చుచు నున్న జానకిన్
గర మనురక్తిఁ గ్రుచ్చి తన♦కౌఁగిట నూఱడఁ బల్కి, నమ్మికల్
పరఁగఁగఁ జెప్పి, యిట్టు లను ♦ భామిని నీకు వ్యథాకరంబు నై
జరగెడిస్వర్గ మైన నది ♦ సమ్మత మెట్లగు నాకు నిల్వఁగన్? ౧౫౩

ఉ. ఇంచుకయైన నాకు భయ ♦ మెందును లేదు స్వయంభునట్టు, లో
చంచలనేత్ర! నీమఘను♦చంద మెఱుంగమిఁ జేసి, కావఁగా
నంచితశక్తి గల్గియు వ♦నాంతరవీధుల నిన్ను, నేను దో
డ్కొంచుఁ జనంగ నడ్డములు ♦ కొన్ని వచించితి నైఁపు మాత్మలోన్. ౧౫౪

కం. నాతో నరణ్యవాసముఁ, బ్రీతిం జేయుటకె నిన్ను ♦ విధి సృష్టించెన్
బాతునా[1] నిను నాత్మజ్ఞుఁడు, ఖ్యాతివ లెన్ నీకు నేల ♦ కళవళపడఁగన్. ౧౫౫

మ. కరినాసోరు! మహాత్ము లీకరణి ము ♦ న్గావించి యున్నారు, దాఁ
దరుణిం దోడ్కొని కాన కేగుటయు స♦ద్ధర్మంబు, తద్ధర్మ మా
చరణి న్నేను జరించువాఁడ, జలజా♦స్యా! రమ్ము నా వెంట భా
స్కరుని న్వెన్కొనునానువర్చలగతిన్ ♦ సంతోష మేపారఁగన్. ౧౫౬

శ్రీరాముఁడు సీతతో నరునకుఁ బితృపూజ యవశ్యకర్తవ్య మని చెప్పుట.

ఉ. పో నన రాదు నాకుఁ బువుఁ♦బోణి వనాంతరసీమ, కిప్పు డా
మానిని కార్యచేసినప్ర♦మాణము లీడ్చుడి నన్నుఁ గానకున్
జానకి! తల్లిదండ్రులవ♦చ స్థితి నిల్చి చరించు టెంతయున్
మానఁగ రానిధర్మ, మది ♦ మాని మనంగ సహింతు నేగతిన్. ౧౫౭

కం. స్వాధీనదేవతల బిం,బాధర! తనతల్లిఁ దండ్రి ♦ నాచార్యవరున్
దా ధిక్కరించి నరుఁ డ,స్వాధీనపుదైవ మెట్లుఁ♦చనుఁ బూజింపన్? ౧౫౮

కం. అముష్మీరఁ గొలిచిన నరుఁ, డామూఁడుజగంబు లైన ♦ నగు సాధింపన్
వామాక్షి! తత్సమానం, బౌమహితపవిత్ర మొండు ♦ నలవడ దననిన్. ౧౫౯

కం. దానము మానము సత్య మ,నూనసుదక్షిణము జేన్న ♦ మోజానకి! యే
మానవున కైనఁ బితృసే,వానియతిఫలం బొసంగ ♦ వశమె పరమునన్? ౧౬౦

కం. సురలోకము ధాన్యము ని,శ్వరసుఖమో ధనము సుతులొ ♦ భాగ్యము చదువో
గురుశుశ్రూషాబలమునఁ, దరుణీ! దుస్సాధ మగుప♦దార్థము గలదే. ౧౬౧

కం. మాతాపితృ సుపరాయణు, లై తనరుమహానుభావు ♦ లత్రనుమున గో
పైతామహసురగంధ,ర్వాశితలోకములు గన స♦మర్థులు చెలియా! ౧౬౨

కం. నాతండ్రి సత్యధర్మో,పేతమనస్కుండు చెప్పె ♦ నెది యని సలుపన్
జేతమునఁ దలఁచినాఁడ; స,నాతనధర్మైక పథము ♦ నవలా! యిది యే. ౧౬౩

కం. నీమత మెఱుంగఁ జాలమి, నామియి నల దంటి; నిశ్చ♦యంబుగను వనీ
భూమి కరుదెంతు గంటివి, శ్యామా! ని న్నెట్లు విడిచి ♦ చన శక్తుండన్. ౧౬౪

---

[1] పాతునె = పాపమునె.

కం. అనవద్యగాత్ర! నిన్నుం, గానవాసము చేయుకొఱకె ♦ బ్రహ్మ సృజించెం
వనజాక్షీ! దీనికిన్నె, వనరెన వేమిటికి రమ్ము ♦ పయనింపు మింకన్. ౨౬౫

ఉ. లెమ్ము మనంబునందుఁ బని ♦ లే దిఁక సందియ మూన నీకు లే
శమ్మరు దెమ్ము ధర్మసహ♦చారిణి వై వెనువెంట, నీదువం
శమ్మునకుం మదన్వయయ♦శంబునకుం గడుయోగ్య మైనశీ
లమ్మును నిశ్చయించితివి ♦ శ్లాఘ్యము కా కిది యేమి దోసమే? ౨౬౬

## శ్రీరాముఁడు సీతను దానము సేయ నియోగించుట.

శా. ఆరంభింపు మరణ్యయాత్రకును యో♦గ్యంబైన కార్యంబులం,
దూరీభూతపరస్పరంబు నమృతాం♦ధోలోకముం సే మదిం
గోరం, విప్రులకుం ధనంబు లిడు, భి♦క్షువ్రాతము న్నిస్తులా
హారప్రీతముఁ జేయు, సిద్ధపడు జా♦యా! యింక జాగేటికిన్. ౨౬౭

తే. బ్రాహ్మణానంతరమున వ♦స్త్రములు నగలుఁ
బాన్పులును వాహనంబులుఁ ♦ బైఁడిబొమలు[1]
వేడ్కవస్తువు లన్నియు ♦ వెలఁది నావి
పరమమతి నిమ్ము యనుజీవి♦వర్గములకు. ౨౬౮

కం. అని ప్రీతచిత్తమునఁ ద, న్ననుమతి సేయుటయుఁ బొంగి ♦ యవనీసుత రా
మునిపనిచినయట్టుల నిజ, ధనవర్గము దాన మీయఁ ♦ దటుకునఁ బూనెన్. ౨౬౯

## లక్ష్మణుఁడు తాను వనమునకు వచ్చెద నని రాముం బ్రార్థించుట.

ఉ. ఇంతయు నాలకించి యను♦పే రఘురామునితోడ వచ్చి త
త్ప్రాంతమునందు నున్నపిన♦తెన్కుఁడు లక్ష్మణుఁ డెయ్యె సీత కే
యింతటికష్టసాధ్య మఁట ♦ యేగతి నన్ను ననుగ్రహింపు మ
న్వంత సహింపలేక భృశ♦బాష్పసమాకులితాస్యబింబుఁ డై. ౨౭౦

ఉ. అన్నపదంబులం బడి మ♦హాపులి గట్టిగఁ బట్టుకొంచు, నా
యన్నలమిన్న సీతఁ గని ♦ యామెను బ్రార్థనచేసి మున్నుగా,
నన్నకు సన్మహావ్రతున ♦ కార్తిపనుం వనసీమ కేగ చే
ని న్నినుఁ గొల్చి వత్తుఁ గరు♦ణింపుము నాపయి దీనవత్సలా! ౨౭౧

ఉ. కేలను విల్లు పూని మృగ♦కీర్ణమహావనిఁ ద్రోవ దీయు చే
లీలగ మున్నువోవ నవ♦లీలఁ జరింపఁగ వచ్చు మీకు, స
త్త్వాళిమృగోత్క రాన్వితమ♦హావనసీమల నెన్న యేని య
న్నా! లలి మీరు గ్రుమ్మరఁగ ♦ నెఁ జుమి నే వెనువెంట వచ్చెనన్. ౨౭౨

---

1 [illegible]

తే. దేవలోకాక్రమణ మైన ♦ దేవ యల్ల,నిర్జరత్వంబ యైనను ♦ నిఖిలలోక
ములయు నైశ్వర్యమైనను ♦ వలచునాఁడఁ,గాను నీ లేని చోట మ♦హానుభావ. ౨౩

కం.సౌమిత్రి యిట్లు పలికిన, రాముఁడు వచియించి పెక్కు♦ప్రత్యూహోక్తుల్
సాముంబున నూరార్చినఁ, దా మరల సుమిత్రపట్టి ♦ దగ నిట్లనియెన్. ౨౪

కం.అంగీకరించి[1] మున్నీ,భంగిని వారించె దిపుడు ♦ ప్రతిషేధము సే
యం గత మేది చెప్పుము? నా,సంగతి పీడెదవు దీన ♦ సందియ మయ్యెన్. ౨౫

శ్రీరాముఁడు లక్ష్మణుని నయోధ్యయం దుండు మని చెప్పుట.

ఉ. చేతులు మోడ్చి మున్నచన ♦ సిద్ధుఁడునై తను వేఁడుచున్న వి
ఖ్యాతచరిత్రు లక్ష్మణునిఁ ♦ గాంచి వచించును రామచంద్రుఁడుఁ
భ్రాతవు, ప్రాణతుల్యుఁడవు ♦ వశ్యుఁడవుఁ, వరధర్మశాలివిఁ,
బూతగుణుండవుఁ, సఖుఁడ♦వుఁ, బలశాలివి, నీవు నెయ్యుఁడున్. ౨౬

చం.వనులకు నీవు నాబడిని ♦ వచ్చెద వేనియు నెవ్వ రయ్య నా
జననిని నీదుతల్లి నిటఁ ♦ జక్క భరించెడివారు? భూమికిఁ
ఘనతర వృష్టియట్టులు సు♦ఖం బొడఁగూర్చెడియట్టినాథుఁ డా
జనకుఁడు కామపాశచయ♦వంపరిబద్ధుఁడు నీ వెఱుంగవే. ౨౭

ఉ. మే లొనరింపఁబోవదు సు♦మీ సపత్నులకు దుస్సహావ్యథా
లోలల కామె కైక యిల ♦ లోఁగొనుటఁ, భరతుండు తల్లి పె
న్లాలనఁ జేసి వారల మ♦నంబున నైన స్మరింపఁబోఁడు, తం
డ్రీ! అలి నీవన్మైన నిట ♦ నిల్వుము వారలకుందు మాన్పఁగన్. ౨౮

కం.సౌమిత్రీ! స్వయముగనో, భూమిధవానుగ్రహంబు♦పోఁడిమినో యిటఁ
నామాతను భరియింపుము, నామాటనుబట్టి నిలుము ♦ సయమతి వగుచున్. ౨౯

ఉ. నాదువియోగపాటున వ♦నారిలుతల్లికి నీవు నిల్చిన
న్మోదము గల్గు, నాయెడ స♦ముత్తమ మాభనదీయభక్తి నిం
పాదిగఁ దోఁచెడిఁ, గురుల ♦ భక్తిభజించిన ధర్మ మూర్జితం
బౌ దురితంబు వాయు, నన♦ఘా! యటు సేయుము సన్నుతిం బగున్. ౩౦

కం.నామాట వినఁగదయ్యా, సౌమిత్రీ! రఘుకులాబ్ధి♦చంద్రమ నాకై;
యేమాడ్కి సుఖింతురు చెపు,మా మనమిరువురును లేమి ♦ మనతల్లు లిటన్? ౩౧

చం.అని రఘురాముఁ డిట్లు సన♦యంబుగఁ జెప్పినతీవ్రవాక్యముల్
విని విని లక్ష్మణుం డను వి♦వేకధనా! భరతుండు నీదుత
ల్లిని మఱి మత్సవిత్రి నమ♦లీమసచిత్తమున స్మరించు, నీ
యనుపమ తేజముం దెలియఁ♦డా? యటు లేటికిఁ జేయు నెన్నఁడేన్. ౩౨

[1] ౬౫౬-వ పద్యముఁ జూడుఁడు.

మ. ననుబోంట్లా భరియించువారు జనని ♦ న్గౌసల్య నార్యామణిన్?
ననుబోంట్లన్ భరియించు వేల్పొకలఁది నా ♦ నాదానపూజాదులన్
దనసేవం జరియించువారి కతులౌ ♦ దార్యంబునం గూర్చి ని
చ్చెను గ్రామంబులు వేయి; యేమిపని వ ♦ చ్చెన్ వారితో వీరితోన్. ౧౮౩

తే. తనను గౌసల్య భరియించు ♦ కొనెడిరీతి
ననఘ! నాతల్లియు భరించు ♦ కొనఁగఁ గలదు
గ్రామములు పెక్కు లున్నవి ♦ బ్రదుకు కొఱకుఁ
గాన ననుబోంట్లు రక్షింపఁ ♦ గలఁడు దేవ. ౧౮౪

కం. అనుచరునిఁగాఁగ నన్నేల్కొనుమీ వైయగ్ర్య మిందుఁ ♦ గొఱలదు నేనున్
మనఁ గలుగుఁ గృతార్థుఁడనై, విను నీకుఁ బ్రయోజనంబు ♦ వెలసెడి దీనన్. ౧౮౫

ఆ. గంపగడ్డపాఱ ♦ గైకొని యొక కేల, విల్లు బాణములును ♦ వెలయ నొకట
నీకు ముందు పోయి ♦ నెఱిగాఁగ మార్గంబుఁ, జూపువాఁడ శ్రమముఁ ♦ బాపువాఁడ.

ఉ. పండులు గడ్డలున్ వనని ♦ వాసులు గ్రాసముగాఁగ మెక్కువే
ఱొండు నెదైనఁ దెచ్చెదను ♦ నుర్విజ నీవును గూడియాడు మన్
గొండలపేటుల న్నిదురఁ ♦ గూర్చియ యున్నను మేలుకొన్నఁ గో
దండధరుండనై మెలపుఁ ♦ దాలిచి సర్వము దీర్చు చుండెదన్. ౧౮౭

లక్ష్మణుఁ డరణ్యమునకు వచ్చుటకు రాముఁడు సమ్మతించుట.

చం. అన విని ప్రీతచిత్తుఁ డయి ♦ యన్న వచించెను లక్ష్మణా! వెసన్
జని భవదీయమిత్రులకు ♦ సర్వముఁ దెల్పుము, మామ యజ్ఞమున్
జెలిపెడుచోఁ బ్రచేతసుఁ డొ ♦ సంగ స్వయంబుగ భీమదర్శనం
బులుఁ బెనువిండ్లు రెంటి, రవిఁ ♦ బోలుచు హేమపరిష్కృతంబులై ౧౮౮

కం. వెలిఁగెడి రెండుకటారులు ములుకులు నెపుడేని వెలితి ♦ పోవనిపొదులన్
జెలు వగున భేద్యకవచంబులు దోయిని వాని దినముఁ ♦ బూజింపంగన్. ౧౮౯

కం. మనగురువులసదనంబున, నునిచితి నవి యెల్ల మనకు ♦ నుపయోగపడున్
వనసీమలఁ గావునఁ జని, కొనిరమ్మా యిటకు నీవు ♦ గొబ్బున ననుజున్. ౧౯౦

ఉ. అర్యమతేజుఁడుం జని హి ♦ తాళిల కెల్ల నెఱుంగఁ జెప్పి యా
చార్యునివీటి కేగి యల ♦ సాధనరాజములన్ గ్రహించి వే
యార్యవిభుండు రామునకు ♦ నన్నియుఁ జూపిన సంతసించుచున్
గార్యమతీ రెఱింగి యిటు ♦ గ్రక్కన వచ్చితి వెంచినంతలోన్. ౧౯౧

## శ్రీరాముఁడు తనపదార్థముల దానము చేయుట.

మ. అనుచుఁ బ్రేమలు వచించి నాకుఁ గలయ♦గ్గార్హిస్త్రీనుం గూడి చ
యన బ్రాహ్మణ్యతపస్విసోఘములను గు♦ర్వాగారకార్త్యోపచి
వినిశాయంబులను న్విశేషముగ నీ♦కిం బ్రపష్టుం జేయుదుఁ
జని వాసిష్ఠు సుయజ్ఞుఁ దక్కఁగల శీ♦ఘ్ర ప్రాతిముం బిల్వుమీ. ౮౯–౨

సీ. అని పల్కఁ శుభము ప్రి♦యం బగుసుడిని సు,యజ్ఞునింటికి నేగి ♦ యగ్నిగృహము
నందు నాతనిఁ గాంచి ♦ వందనంబు లొనర్చి, కడిఁది కార్యము సల్పఁ♦గడఁగియున్న
రామునియింటికి ♦ రారమ్ము మిత్రమా, యన సంధ్య వార్చి యా♦యనఘుతోడ
శ్రీరమ్యసుందర♦శ్రీరామసుందిరం,బును జొచ్చె వచ్చెడి♦పుణ్యమూర్తి

తే. వేదవిదునకు రాముండు వేదిజాత,తోడ నగ్నికిఁబోలె నె♦దురుగఁ బోయి [పడఁగ.
యంజలి ఘటించి మ్రొక్కి యా♦యనఘమతికి, నిచ్చెఁ దనవస్తువులను బెం♦పచ్చు

ఉ. బంగరుటంగదంబులును ♦ భ్రాజతకుండల హేమసూత్రముల్
రంగగు చేకశెంబులును ♦ రత్నకిరీటములుఁ విభూషలుఁ
బంగరుటుంగరంబులును ♦ బంధురరత్నచయంబు లెల్ల ని
చ్చెం గమలాక్షిప్రేరణము♦చే, నిటు వెండియుఁ బల్కె నాతనిన్. ౮౯–౪

కం. హారము సారసనసరి,ప్కారంబును హేమసూత్ర♦సత్తమమును గే
యూరంబుల నంగదముల, దారార్థము నీకొసంగు ♦ ధరణిజ గొనుమీ. ౮౯–౫

కం. తల్పంబులు మణిరచితా,కల్పంబు లొసంగు జనక♦కన్యక గొను నీ
తల్పముకై[1] వనగమనా,నల్పవినిశ్చయముఁ జేసి♦నారెము విబుధా! ౮౯–౬

తే. మేనమామ యొసంగిన♦మేటిగజముఁ, గొనుము శత్రుంజయాఖ్యంబుఁ♦గూడనిడుదు
వేయిగజము లటంచు వే♦ర్వేఱ నీయ, నన్నిగైకొని రామవా♦క్యంబుఁ బట్టి. ౮౯–౮

సీ. ప్రీతి సుయజ్ఞుండు ♦ విఘ్యక్తకీర్తిని, రామలక్ష్మణుల ధ♦రాతనూజ
దీవించి యయగ ని♦జానరజుం గని, యాయగస్త్యజుని గా♦ధేయసుతుని
నర్చించి పైరున ♦ కంబువుల్ గూర్చిన,గతి నిమ్ము వారికి ♦ గవులు వేలు
వెండియుఁ బైడియు ♦ వివిధరత్నమ్ములుఁ, గౌసల్యభక్తిమైఁ ♦ గాంతుతోడ

తే. నాశ్రయించిన తైత్తిరీ♦యగురువునకుఁ, దన్విగొనుదాఁక యానముల్ ♦ దాసిపిందు
పట్టుఁబుట్టంబుల నొసంగు;♦పశుకములను, నాల వేయింటి రత్నధ♦నాంబరముల

తే. పెద్దకాలంబుగాఁగ నా♦వీట నున్న, సూతునకుఁ జిత్రరగునకుఁ బ్రీతి ♦ నిమ్ము
ధనములును వస్త్రతతులు ర♦త్నములఁ జాలుఁ,జాలునని యెడునందాఁక ♦ సంతసింప

తే. వటుకతులు మఱి కాలాప♦వర్గములును, నధ్యయనశీలు రగుట ని♦రంతరంబు
నన్య మేదియుఁ జేయక♦యులను లగుచు, వాచవిగఁ దినఁ గోరెడు♦వారు మఱియు

[1] తల్పము – భార్య.

తే. గొప్పవారలమెప్పులఁ గూర్చినార
లగుట నెనుబదిలొట్టెల నవ్వి మోయు
రత్నములతోడ నిమ్ము కొంబు పెరుఁగు
ఘృతము లభియింప వేయాల నిమ్ము మఱియు. ౯౦౧

కం. ఇమ్ము కృషికర్త మగునృప, భమ్ముల నిరునూఱు మఱియు నశ్లోకవెయిగో
త్రమ్ములవి మోయునెద్దులఁ, దమ్ముఁడ వేవేగ యిచ్చి తరలింప వయా. ౯౦౨

తే. వటులసంఘంబు కౌసల్యభవనము పను, గలుగు నం దొక్కరొకరికిఁ గాంక్ష దీర
వేయి వెయి యూల నీవయ్య వేఱు వేఱఁ, దల్లి మెచ్చంగవలయు నాదానవిధిని.

తే. తక్కిసద్ద్విజాతులకు నెల్లఁ దగినరీతి, మక్కువ నొసంగుమీ నీవు తక్కుధన మ
టన్న సౌమిత్రి రామునియాజ్ఞ రీతి, ధనదునట్టులు సర్వంబు దాన మిచ్చె. ౯౦౪

ఉ. కన్నుల నీరు జాలుకొనఁ గాఱెడుపాలున నిల్చియున్న యా
సన్ననిజానుజీవులకుఁ జాలధనంబులు వేఱు వేఱ తా
మున్నన మున్నుగా నొసఁగి మానుక గేహముఁ దమ్మునిల్లు ము
న్నున్నవిధంబుగా సరయుచుండుఁడు మాయిటవచ్చునంతకున్. ౯౦౫

చం. అనుచును వారితో ననిధనాధిపతిం గని పెత్త మెల్ల వే
కొని యిటు రమ్ము టన్నఁ జని కొబ్బును వాఁడగు దేర నిచ్చె ని
ర్ధను లగుబాలవృద్ధులకుఁ గ్రచ్చఱ సద్విజవర్యకోటికిన్
జననుతకీర్తిశాలి రఘుచంద్రుఁడు లక్ష్మణసంయుతంబుగన్. ౯౦౬

త్రిజటుఁ డను బ్రాహ్మణుని వృత్తాంతము.

ఉ. నాఁగటికఱ్ఱు గుద్దలియు నాఁగలియుం గొని యుంఛవృత్తికిన్
లోఁగి దినంబునున్ వనములోనఁ జరించుచు లేనడిం గడున్
డోఁగి జరాభరంబునను దూలుచు డేవ్వసు నాలి బిడ్డలన్
బ్రేఁగునఁ బ్రోపు సేయు నొకపింగళవర్ణుఁడు గార్గ్యుఁ డుత్తముఁ ౯౦౭

ఉ. దైవవశంబునం బురిని దాఁగఁగ గల్గుట భర్తఁ జూచి యా
పావని పాఱ నుద్దెలిను బోఁటిగ నైపుము రామచంద్రుఁడిన్
నావచనంబు చేకొని కనం జనుమీ యనుముఁ డెల్ప ధ
ద్భావనుఁ డించు కేనియుఁ గృపన్ దయచేయఁడె యూల మేటికిన్. ౯౦౮

కం. అని బోధించినఁ ద్రిజటుఁడు, తనపుట్టముచింపులెల్ల దశరథసుతుఁడున్
గనకుండ దాఁపఁ జుట్టుచు, ననువుపడక చనియె రాముఁ నాలయమునకున్. ౯౦౯

కం. కొంచ కెద నంగిరో భృగ్వంచితతేజఁ డగుత్రిజటుఁ డరుగఁగ నతనిన్
బంచమకక్ష్యవఱకు వారించినవారు లేరుడు లేరు శ్రీరామాజ్ఞన్. ౯౧౦

కం.జనపతిసుతు డాయఁగఁ జని, యనియెం ద్రిజటుండు రాఘ♦వా! నిఖపేదల్
గనికరముం జూపుము నే, నని బ్రదికెద నుంఛవృత్తి ♦ బహుపుత్రకుఁడన్. ౯౧౧
చం.అన దరహాసభాసురము♦ఖాంబుజుఁ డై రఘురాముఁ డాడు నో
యనఘచరిత్ర! నాకొదవు♦లం దొకవేయియుమాత్ర చిక్కె, నీ
వును నొకదండమున్ విసరి ♦ పో విడుమీ, యది యెంతమేర లోఁ
గొను నది యంత నీకిడుదుఁ ♦ గొల్వుము నీ భుజశక్తి నావుడున్ ౯౧౨
ఉ. దోవతి యెత్తి చెక్కి, పయి♦దుప్పటి చక్కబిగించి చుట్టి, యా
పై వల కేల దండమును ♦ బట్టి, పదంబులు ముందువెన్కగాఁ,
జేవను నీలకర్చికొని ♦ చెచ్చెరఁ ద్రాణము లెల్లఁ, బొఱుఁడున్
దా విస రొప్ప వీచి స్రమ♦దంబున గోవులలోన నైచినన్ ౯౧3
కం.సరయూతీరమునందుం, బరఁగెడివేవేలయాల ♦ బసవసలకడన్
ధరణీసురకరముక్తము, గురుదండము పడఁగఁ జూచి ♦ గొఱలినప్రేమన్ ౯౧౪
ఉ. కౌఁగిటఁ జేర్చి యావిబుధ♦కాంతుని నాసరియూతిటంబు నై
మ్రేఁగినయాల నెల్లఁ గొని ♦ ప్రేఁడులు! మానివరాశ్రమంబునన్
వీఁగక తోలుఁ డించుఁ బృథి♦వీతినయారముఁబుంపు పల్కె ని
న్నేఁ గనలేక కోఱకము ♦ లేమొ పచించితి నన్ను నైఁపవే. ౯౧౫
చం.అలుగకుమీ మహాత్మక! దు♦రత్యయ మాభపదీయ తేజముం
దెలియఁగఁ గోరి వేడుకకు ♦ నే నటు పల్కితి, నింకఁ గొంతయే
కలదు ధనంబు, గోరు మది ♦ కాంక్షిత మేని యొసంగువాఁడ, నా
పలుకు నిజంబు సాధనము ♦ బ్రాహ్మణకోటినిమిత్త మే సుమీ. ౯౧౬
కం.నినుబోఁటి మహాత్ములకున్, ఘన మెల్లను నీయఁగా ని♦తాంతయశంబున్
ఘనసంప్రీతియుఁ గలిగెడు, నన నాతఁడు తుష్టుఁ డగుచు ♦ నావాక్యములన్.
తే.యశము బలమును ప్రీతియు ♦ నతులసుఖము, వృద్ధి యగు నంచు దీవించి♦విప్రవర్యుఁ
డాలితోడను జేకొన్న♦యాలతోడ, నాశ్రమానకిని నేగె ♦ నంత విభుఁడు.
చం.అనుపమసత్యవిక్రముఁగు♦ణార్జితవిత్తము లాప్తకోటికిన్
ఘనుఁ డతిగౌరవంబు మును♦గా మనసార నొసంగె, విప్రమి
త్రనిచయభృత్యపాళికి వ♦దాన్యవరుండు దరిద్రభైక్ష్యజీ
వనపరసంచయంబుల క♦వారిగ నిచ్చె యథార్హపూజలన్. ౯౧౯

సీతారామలక్ష్మణులు తండ్రియొద్దకుఁ బోవఁజూచి ప్రజలు దుఃఖించుట.

ఉ. ఈవుల నెల్లవారలను ♦ దృప్తులఁజేసి రఘూద్వహుల్ ధరి
త్రీవరకన్యతో నరుగు♦దేరఁగఁ దండ్రిని చూడఁ గోరి శో

భాండవిరళంబులుఁ మలయజార్చితముల్ వరసాధనంబులుఁ
గ్రేవల వ్రేలఁ బోవఁగఁ బురిజనముల్ గని దుఃఖతప్తులై ౯—౨౦

సీ. మిద్దెల నెత్తగు మేడలఁ బ్రాసాద,శిఖరంబు లెక్కి వీక్షించువారు
నెఱసినమూఁకల యిఱకటంబునఁ జూడఁ, గానమి నగ రెక్కి కాంచువారు
పట్టంగ గొడుగును బంటొక్కఁడును లేక,నడుచురామునిఁ గని యడలువారు
కటకటా యెంతటికష్టంబు వచ్చెరా, రామున కని వెతఁ గ్రాఁగువారు
తే. భవ్యచతురంగబలములు పటిమ మెఱయు, వెంబడినిరాఁగ వేంచేయువిభుఁడు నేఁడు
కాలినడకను దమ్ముండు నాలుఁ దోఁడు, రాఁగఁ జనియెడిఁగా యని వేఁగువారు.

కం. శ్రీరుచి మరగియుఁ గోర్కులు, కోరెడువారలకు ముదముఁ గూర్చెడువాఁడై
నేరంబు ధర్మగౌరవ,కారణమునఁ దండ్రిమాటఁ గాకుం జేయన్. ౯—౨౨

కం. ఆకాశచరులకే నా,లోకింపఁగ రాదు మున్ను లోలాంబక నీ
రాకన్నె సీత నిపు డ,స్తోకం బగు తెరువుమూఁక చూడం గలిగెన్. ౯—౨౩

కం. హరిచందనసేవిని యగు,పరమోజ్జ్వలితాంగరాగపాత్రను గనుచుఁ
బురజనములు కనునీటం, బొరిఁబొరిఁ దొరఁగించి రుష్ణముగ శీతముగన్. ౯—౨౪

పౌరులు కైకేయీదశరథుల నిందించుట.

కం. దయ్యంబు సోఁకి దశరథు, నియ్యనువునఁ బలుకు నిప్పు డిది నిక్కం బౌ
నెయ్యడనైనం బతి తన, నెయ్యపుసుతు నడవి కనుచునే దుర్నీతిన్. ౯—౨౫

కం. కొడుకు గుణహీనుఁ డైనను, వెడలఁగ నడువంగఁ దగునె? విశ్వములను మే
ల్నడవడి గెల్చినఘనుఁ డగు,బుడుతని నీగు పాయునట్టి పురుషుఁడు గలఁడే ౯—౨౬

చం. ఒగులకు నొప్పి నీయమి, యమస్థితము వరాదమును,శాస్త్రచింతనా
పరతయు, సత్స్వభావమును, బాయనియింద్రియనిగ్రహంబు, ని
ర్భరతరచిత్తశాంతి, రఘురాముని పెట్టనిసొమ్ము లౌఱు, నీ
పురుషవరోత్తముఁ సుగుణభూషణుఁ గోల్పడువారు నుందు రే. ౯—౨౭

కం. నీరమున బ్రదుకుజీవులు, నీరింకిన గ్రీష్మమునను నెఱిచెడుమాడ్కిన్
శ్రీరాముఁ డిట్టిధన్యుఁడు, దూరంబుగఁ జనఁగఁ బూన దూపిలె జనముల్.

కం. జగదీశ్వరుఁ డగు రాముఁడు, వగ పొందిన జగము లెల్ల వగ చెందుఁ గదా
తగ వేరు పోఁకఁ జెందిన, నగములఁ బూవులును బండ్లు నాశము గావే. ౯—౨౯

కం. వరధర్మసారుఁ డతిదు,ర్భరతేజుఁడు వేరితండు ప్రజలకు; నితరుల్
సరు లాకులు పుష్పంబులు, గురుశాఖలు పండ్లు గారె గుఱుతుగఁ జూడన్. ౯—30

ఉ. ఇటుఁగ వచ్చునే రఘుకులాగ్రణి రాముని బాసి, యేల యీ
తోఁటలు గేహముల్ మనులు దొడ్లును లక్ష్మణురీతి వీడి యే

పూఁటకు రాముఁ డెందు నిలఁ ♦ బూను సుఖార్థుల సేకమై యటన్
మాఁటుగలట్టిచుట్టముల ♦ మానినులం గొని యేగి యుండమా. 31

సీ. నిక్షేపముల నెల్ల ♦ నెఱపెల్లగించియు, భవనాంతరము లెల్లఁ ♦ బాడువెట్టి
ధనధాన్యముల నెల్ల ♦ మన వెంటఁ గొని చనఁ, గుల దేవతలు వీనిఁ ♦ దొలఁగి చనఁగఁ
జిమ్మువారలు లేక ♦ దుమ్ములు రేఁగుచుఁ, బాదట్టు తీఁగెలు ♦ పాఱుచుండఁ
గొక్కుబొక్కల మట్టి ♦ కుప్పలు నిండఁగ, నెలుక లిచ్చగఁ బర్వ ♦ లెత్తుచుండ
తే. మంత్రహోమజపములను ♦ మాట లేక, బోఁకిపెంకులు నిండఁగఁ ♦ బొలుపు వాసి
మనము విడిచినగృహముల ♦ మనసు దీరఁ, గైకతఁ గొట్టుకొనియెడిఁ ♦ గాక యింక.
కం. రాముం డుండెడివనమే, శ్రీమానిత మైనపురము ♦ సీతేశుండున్
లేమిని మనమును విడుచుట, చే మహితారణ్య మిదియ ♦ సిద్ధం బగుతన్. 33

ఉ. నెట్టన యింద తేగిన వ ♦ నీగుహాలందలిసింహముల్ కరుల్
పుట్టల నున్నపాములును ♦ భూధరసానుగతో గ్రపక్షులున్
దొట్టినభీతిచేఁ బఱచి ♦ దూరము పాఱటి యున్నయట్టి యీ
పట్టనమందిరాళి నిర ♦ పాయముగా సుఖయించుఁ గావుతన్. 34

ఉ. రామునితోడ నెల్లర ము ♦ రణ్యముఁ బట్టినయంత మీఁద గా
రామునుతుండు చుట్టలు ని ♦ రంతరమున్ భజియింప నుండనీ
బూమెలకైకో మాంసమును ♦ బూరియుఁ గాయలు మెక్కు నానిపై
దీమన పోరఁగాఁ గఱవు ♦ దీఱఁ బ్రభుత్వపటుత్వసంపదన్. 35

ఉ. శోకముపేర్మి ని ట్లనెడి ♦ చూపఱవాక్యము లాలకించుచున్
స్తోకవికారమే నగనక ♦ దూరమునన్ మడికాసు[1] కొండతో
జోక రహించి మించు పితృ ♦ సుందరమందిరవాటిఁ జూచి సీ
తాకమనుండు డాయఁ జని ♦ తత్స్థితవీరజనాళిఁ జూచుచున్. 36

కం. వారలయార్తికి మది నవి, కారుం డై మంవహో ♦ కలితానను డై
భూరితరదైన్యయుతు నవి, దూరస్థు సుమంత్రుఁ జేరి ♦ తోరపుఁదక్షిన్ 37

శ్రీరాముఁడు దమరాకను దండ్రికిఁ జెప్పి పుచ్చుట.

చం. జనకునిఁ గాంచి యాజ్ఞ గొని ♦ నాగెకువాఁ డయి యిట్లు పల్కెనో
యనఘ! మదాగమంబు మను ♦ జాగ్రణికిం దెలుపంగ దే యట
న్నను నతఁ డార్తి నీరు నయ ♦ నంబులఁ గాఱఁగ లోని కేగి యా
మనుజవరేణ్యు దుఃఖభర ♦ మగ్నుని గ్రస్తదివాకరుం డనన్ 38

ఉ. నీ అలమంగ ని ప్పునఁగ ♦ నిర్జల మైనతటాకమో యన
న్నీఱినదుఃఖభారమున ♦ నివ్వెఱమై సుతు రామచంద్రుఁ బ

[1] మడికాసు = పిండి.

ల్లాఱును సంస్మరించుచు విలాపము సేయునృపాలుఁ గాంచి తాఁ
దాఱనిభక్తి మ్రొక్కి మును ♦ దద్దజనోక్తుల సన్నుతించుచున్ ౩౯

సీ. ఏ మని చెప్పుదు ♦ నీవార్త యనువేళ, నేడ్చున గుదివడ్డ♦యీరెలుంగు
గ్రాల మెల్ల నచించు ♦ రామచంద్రుం డిదె, ద్వారంబునం దున్న♦వాఁడు దేవ!
ద్విజులకు నుపజీవి♦విసరంబులకు నెల్ల,విత్తంబు లొసఁగి సు♦హృత్తములకు
నెల్లరకును జెప్పి ♦ పృథ్వీశ మీయాజ్ఞఁ, గొని కానసములకుఁ ♦ జనఁగఁగోరి
ఆ. వచ్చియున్నవాఁడు ♦ మచ్చికమిముఁ జూడ, నడవి కరుగు నింకఁ ♦ గొడుకుఁ జూడ
వయ్య రశ్మిపాళి ♦ నర్కుని పోలిక, రాజగుణము లొప్పి ♦ తేజరిల్ల. ౪౦

కం. అన వననిధిగంభీరుఁడు, జననుతధర్మైకరతుఁడు ♦ జలధరమార్గం
బన విమలుఁడు సత్యాత్ముఁడు, జననాథుం డిట్టు లనియె ♦ సచివాగ్రణితోన్.

శా. నాయిల్లాండ్రను నెల్లఁ దోడ్కొని సుమం♦త్రా! యిందు రమ్మేను భా
ర్యాయుక్తంబుగఁ జూడఁ గోరెదను ధ♦ర్మిష్ఠేయు శ్రీరాము నా
నాయాజ్ఞం జని రాణివాసముల కా♦ర్యల్! రండు భూనాథుఁడు
న్వే యందుం జనుదెం డటంచుఁ బలికె ♦ న్మిమ్మెల్ల నా నాసతుల్ ౪౧

తే. మూఁడువందలయేఁబది ♦ ముద్దరాండ్రు
కెంపువాతెఱకన్నులుఁ ♦ గీడుపడుచు
నరగఁ జనుదెంచి రటకుఁ గౌ♦సల్య బొసి
యంతట సుమంత్రు సుతుఁ బిల్వ ♦ ననియె నృపతి. ౪౩

కం. ఆమాట యెఱుఁగఁ జెప్పిన, రాముఁడు లక్ష్మణుఁడు సీత ♦ రాఁ దనవెంటన్
భూమీశు డాయఁ జనియెం, జేమోడ్చిన నట్లు వచ్చు♦సీతాకాంతున్ ౪౪

దశరథుఁడు సీతారామలక్ష్మణులఁ జూచుట.

కం. అంతంతం గని ధరణీ,కాంతుం డాసనముమండి ♦ కదునడి దుఃఖా
క్రాంతమనస్కుం డయి త,త్కాంతలతో లేచె రాము ♦ డాయం జనఁగన్. ౪౫

కం. రాముని కెదురుగఁ బరు విడి, భూమీశుఁడు సోనలేక ♦ పుడమిం బడియెన్
సాము[1] తెరువునన్ దుఃఖభ,రాకులితసతి తాగ్గమునుల♦నాఖుం డగుచున్. ౪౬

శా. ఆరంగూరిసయాగ్నిమై నిపతితుం ♦ బ్రస్పష్టభూకాంతునిం
జేరం బోవుచు రామలక్ష్మణులు చే♦సే నెత్త హా రామ రా
మా రామా యనుకామినీజనుల హా♦హాకారముల్ భూషణో
దారారావము మిశ్రమై బలిసె నా♦ధాత్రీశుగేహంబునన్. ౪౭

కం. రాముండును సౌమిత్రియు, భూమీశ్వరుఁ దమకరములఁ ♦ బొదవుచు సీతా
వామాక్షితోడ నేడ్చుచు, నామంచముమీద నుంచి ♦ రాసీనుఁడుగన్. ౪౮

[1] సాము = సగము.

ఉ. మూరుత మూర కుంకి నృప♦ముఖ్యుఁడు మూర్ఛను దేఱి నంజలిం
జేరిచి తండ్రిఁ జూచి యను ♦ శ్రీరఘురాముఁడు మాకు నెల్లఁ
గేరమఁ గుండ వీవు దగు♦నే ధృతి దప్పఁగ దండకాటవిం
జేరఁగఁ బోదు నాజ్ఞ దయ♦సేయుము చూడుము చల్లఁజూపులన్. ౪౯

రాముఁడు సీతాలక్ష్మణులతో వనమునకుఁ బోవ ననుజ్ఞ వేఁడుట.

కం. సీతయును లక్ష్మణుండును, నాతోడ న్వచ్చువారు ♦ నయగతి నెం తెం
తో తథ్య హేతువుల నా,చేత నయినయంతివట్టు ♦ చెప్పితి నిలువన్. ౫౦

కం. నే నెంతయు వారించిన, మానక నాతోడ రాఁగ ♦ మతిగొని నిలుచం
గా నొల్ల రెరి యిచటం,గానన్ మైకొంటి వారు ♦ కానకు రాఁగన్. ౫౧

కం. మానుము దుఃఖము నాకుం, జానకికిని లక్ష్మణునకు ♦ సరగున సెల వి
మ్మా నాయన! ప్రజ కజువలె, నా నవనీవిభుఁడు పల్కు ♦ నందనుతోడన్. ౫౨

చం. తలఁపఁగ లేక మున్ను వ♦రదానవిమోహితబుద్ధిఁ గైకమా
యలవలలందుఁ జిక్కుకొని ♦ యూరట మందుచు నుంటఁబట్టి యిం
తలు జనియించె, న న్నిపుడె ♦ తండ్రి! నిరాకరణం బొనర్చి భూ
తలము సమస్తముం గొనుము ♦ తథ్యము నాపలు కాదరింపుమీ. ౫౩

చం. అనిన నృపాలుఁ జూచి జన♦కాత్మభవాహృదయేశుఁ డాడు నీ
వనఘ! సహస్రవర్షములు ♦ హాయిగ నేలుము దేశ మింక, నీ
వనృతము పల్కనేల సుకృ♦తాత్మక! నాదునిమిత్త మక్కటా
చనియెద దండకాటవికి ♦ సౌఖ్యము మీఱఁగ నంచ యుండెదన్. ౫౪

కం. తొమ్మిదియు నైదు నేండ్లు వ,నమ్ములఁ గ్రుమ్మరుచు నుండి ♦ నాబాసయుఁ దీ
ర మ్మరలఁ దండ్రి నీపా,దమ్ముల దర్శించువాఁడఁ ♦ దథ్యం బనినన్. ౫౫

ఆ. సత్యవాక్యపాశ♦సంయుతుం డయి రహ,స్యము బల్కి చేతఁ ♦ జెప్పఁబడుట
నార్తి గూరుచును ని♦జాత్మజు శ్రీరామ,చంద్రుఁ గాంచి పలుకు ♦ జనవిభుండు.

శ్రీరాముఁ డరణ్యమునకుఁ బోవ దశరథుఁడు సమ్మతించుట.

కం. ఇహమునఁ బెంపును బరమున, మహితాభ్యుదయంబుగాఁ గు♦మారా! యిఁక భీ
రహితాధ్వమునను జరశుభ,సహితంబుగఁ బోయి మరలి ♦ చయ్యన రమ్మా.

ఉ. ప్రాకటధర్మశీలుఁడవు ♦ బంధురసత్యరతుండ వట్టిని
న్నా కగునే మరల్ప రఘు♦నందన శక్యము, కోర్కి నొక్కటిం
జేకొని తీర్పు, మీనిశ వ♦సింపుము నాకడఁ గాన కిప్పుడే
పోకుము, రొుండువూఁ టయినఁ ♦ బుచ్చెద హాయిగ నీదుకూటమిన్. ౫౬

ఉ. తల్లిని జూడ వన్న! వను ♦ దండ్రిని జూడుము పుత్ర! మాకుఁగా
నుల్లము రంజిల న్నిలుమ ♦ యొక్కదినం బిట నాశ దీరఁగా
నెల్ల నొసంగి నీకుఁ గని ♦ తృప్తివహింతుము, నీప్రతిజ్ఞ యుం
జెల్లఁగ వేగుఁబోకటను ♦ జేయ వయా పయనంబు నిచ్చమై. ౯౫౯

కం. ఎంతయుఁ బ్రియములఁ బాయుచుఁ, గాంతారముఁ బోవ నీవు ♦ గడఁగితి సీతా
కాంతా! నాప్రియమునకై, యెంతటి దుష్కరము సేయ ♦ నెంచితి పుత్రా. ౯౬౦

ఉ. పాప యొనర్తు సత్యమునఁ ♦ బాప మొకండును నే నెఱుంగ, న
న్నోసము చేసి యీకుటిల ♦ మోహమునన్ మసికప్పవహ్ని యీ
దోసమురాశి వంశగుణ♦దూషక యింతలు చేసె, నీవు న
య్యో సతివాక్యమే నిలుప ♦ యోజన చేసితి వేమి చేయుదున్. ౯౬౧

కం. ఇది యేమి వింతకార్యము, పెదకొడుకై నీవు గలుగఁ ♦ బేరిమి నాకున్
మదిఁ దలఁతె యనృతదోషముఁ, బొదవింపఁగ నెంత లైన ♦ బుధనుత యనినన్.

శ్రీరాముఁడు తనమనోనిశ్చయముఁ దండ్రికిఁ జెప్పుట.

కం. జనకునియార్తాలాపము, విని రాముం డనుజుఁగూడి ♦ వినవినవోవన్
దను విట్టు లనియెఁ దండ్రికిఁ, జను నే నీబోఁటి కిట్లు ♦ సంతాపింపన్. ౯౬౩

కం. భూపాల! నీ వొసంగెడు, నాపరమపదార్థసమితి ♦ నందినవాఁడన్
తే పెక్క రిత్తు రయ్యా, యీపాటికిఁ గాన వాని ♦ నిచ్ఛింపఁ జుమీ. ౯౬౪

కం. అర్థిమెయి నీ వొసంగుప, దార్థములకు మాఱు నేను ♦ దగ నీబానన్
వ్యర్థంబుచేయ కెటులేన్, సార్థకముగఁ జేయ నిన్ను ♦ యరిగెద వనికిన్. ౯౬౫

మ. వనవాసంబున కీయకొంటి నిఁకఁ ద♦ప్పం బోదు నానిశ్చయం
బనఘా! సత్క్షితిలోకపూగధనధా♦న్యం బైనయైశ్వర్యమున్
మును నీకైకకుఁ జెప్పినట్లు భరతుం ♦ బూన్పం గదే, నేను నీ
పనుపారం బదునాలుగేఁడులు వసి♦వాసంబుఁ గావించెదన్. ౯౬౬

కం. అవనీశ సౌఖ్యమునకై, యవనివిభుత్వంబునకుఁ బ్రి♦యంపడ నీవే
తివు నటు సేయు మన న్నే, నవు నని యీకొంటి నీదు♦నాజ్ఞం దీర్పన్. ౯౬౭

ఉ. మాను విచారమున్, ధరణి♦మండల మెల్లను గైక పట్టినిం
బూనుపు, మెల్ల రాజ్యమును ♦ భోగము లొల్లఁ, బ్రియంబు లొల్ల, నీ
యానతిఁ దీర్చువాఁడ, హృద♦యంబున మానుము దుఃఖ, మశ్రులన్
బూనకు, మాపగాధవుఁడు ♦ పొందున క్షోభము నెన్నఁ డేనియున్? ౯౬౮

ఉ. ఒట్టిడుకొందు సత్యమున ♦ నొప్పుగ నీదుసమక్షమందు నీ
పెట్టును సత్యవాది వగు♦టే మదిఁ గోరెద, నొల్ల రాజ్యమున్

దొట్టిసుఖంబు, లొల్లఁ బ్రియుఁ ♦ దోయజనేత్రను సీత, నొల్ల నె
ట్టిట్టివి కోర్కు, లొల్ల దివి♦జేంద్రునిపట్టన, మొల్లఁ బ్రాణముల్. ౧౯

శా. తండ్రీ! నేను నిమేషమైన నిచటం ♦ బోరంగ రా దింక, నీ
కంద్రావిం గని దుఃఖ మొందకుము నీ♦క్కుం జింత నాపాలఁ బే
ఱొం డ్రాఁ బోవదు కోరెఁ గైకెయియు న♦న్నుర్వ్యాటవిం బోవఁగాఁ
బం డ్రెండు న్నతఁ డెండువత్సరము ల♦వ్వాక్యంబు నే నొప్పితిన. ౨౦

కం. అసత్యముఁ బాలించిన, వాసిగ నానావిహంగ♦వన్యమృగపాళీ
వాసిత మరణ్యదేశము, వాసముఁ గావింతు మేల ♦ వగచెదు జనకా. ౨౧

కం. దేవతల కైనఁ దండ్రీ! దైవము జనకుండ యనుచుఁ ♦ దగ విని యుంటన్
దైవంబ వనుచు నీనుడిఁ, గావించెడివాఁడ నేల ♦ కాఱియపడెదగన్? ౨౨

కం. కడచనఁ బదునా ల్గబ్దము, లడవులలోఁ బిదపఁ జూచి ♦ తగు నీవు ననున్
గడతేఱఁ గృతార్థుఁడ వై, విడువుము శోకంబు నన్ను ♦ విడు మిప్పటికిన్. ౨౩

ఉ. నీవగపాటుఁ గాంచి జన♦నీముఖసర్వజనంబు బాష్పధా
రావికటీకృతాక్ష మయి ♦ రావిడి చెందెను, వారిఁ దేర్పఁగా
నీవ కదయ్య యింక, నిటు ♦ నీవ వగంబడఁ దేర్చువార లే
రీ, వసుధాస్థలిం భరతుఁ ♦ బ్రీతిని గూర్పుము పోయివచ్చెదన్. ౨౪

ఉ. ఏఁ జనినంతటన్ భరతుఁ ♦ డీమహిఁ సాద్రిసకాననంబుగాఁ
బాఁజులు దీఱి మంది తను♦భక్తి భజింపఁగ నేలుఁగాక యే
గోఁజును లేక, నీనుడిని ♦ గొల్చి దీర్చెద, నానిమిత్త మై
రోఁజెద వేల యిట్టు లతి♦రూక్షముగాఁ, బయనింప నిమ్మికన్. ౨౫

ఇంద్రవంశము. ధీమజ్జనుల్ మెచ్చెడి♦దేవరానతిన్
నేమంబుమైఁ దీర్పఁగ ♦ నేను గోరిన
ట్లీమేలిభోగంబుల ♦ నిచ్చగింపఁ జూ
భూమీశ నాకై యిటు ♦ పొక్క నేటికిన్. ౨౬

తే. కల్ల లాడించి నిను నేను ♦ గాంచ సేయు,వాఁడనే రాజ్యకామజీ♦వనముల నకట?
సీతయైనను నా కేల ♦ చెప్పెద విను, నీదుసత్యవ్రతం బెందు ♦ నెగడుఁ గాక. ౨౭

శా. వ్యాఖ్యానం బిఁక నేల తండ్రి ఫలమూ♦లాలీనళవ్యూహమే
ముఖ్యాహారముగా మలల్ నదులసొం♦పుల్ చూచుచున్ దండకా
ప్రఖ్యాతాటవిఁ జొచ్చి కల్పలతికా♦ప్రఖ్యద్రుమచ్ఛాయల౯
సౌఖ్యం బారఁగ నుందు నీకు నిట సం♦తోసౌఖ్యంబు సంధిల్లు నాన్. ౨౮

ఉ. సిగ్గు దొలంగి క్రౌర్య మెదఁ • జేర్చి వచించెడికైకఁ జూచి యో
యొగ్గులమారి! నెత్తిపయి • నెత్తియు నెత్తఁగరానిమోపు నీ
విగ్గతి వెండి యేఁచెద వ•టే, చెనఁటీ! మును వేఁడినా వటే?
యగ్గలికంపుటీసుమెయి • నాడెదవా చలపట్టి యీయెడన్? ౧౦౦౮

చం. అని కసరారఁ బల్కు మను•జాగ్రణి గుబ్బెత యిబ్బడించుకిం
కను భవదన్వయంబునన•కా సగరుండు నిజాగ్రపుత్రకుం
బనిచి సుకీర్తిఁ గాంచె నస•మంజుని నాగతి రామచంద్రుఁడుఁ
జనుటయె రిత్తచేతులను • సన్నుత మంచన భూమిపాలుఁడున్ ౧౦౦౯

కం. ఛీ యనుటను వినువారలు, మాయురె యని లజ్జఁ దలలు • నుఱఁచుటయేఁ గై
కేయి గణింపద; యీయెడఁ, జేతులఁతిని వృద్ధమంత్రి • సిద్ధార్థుండున్ ౧౦౧౦

→ సిద్ధార్థుఁడు కైకకు బుద్ధి చెప్పుట. ←

తే. భూపుమన్నన గలవాఁడు • పుణ్యశీలుఁ, డనియెఁ గైకేయి! తెలిసిన•యట్లు లేని
మాటలాడెద వాయస•మంజుఁ డేల, వెడలఁగొట్టంగఁబడియె నా•విధము వినుము.

ఉ. ఆయసమంజుఁ డీనగరి•యర్భకు లెల్లరు నాట లాడుచో
డాయఁగ బోయి వారిని గ•డంకను దా సరయూజలంబులన్
గూయిడుచుండ వైచి పసి•కూనలు మున్గుచుఁ దేలి కొట్టుకొం
గోయని యూర్చి వేడుకలు • గూర్చును బుగ్గలు లేవ దుష్టుఁడై. ౧౦౧౧

ఉ. అతనిఁ జూచి నాగరజ•నావళి యుల్లను గోపగించి త
ద్భూతలనాథు నిట్లనియె • భూమిజనంబుల నొంచె నీతనుం
జాతుని నొంచెఁ గోరికొని • నాగఁగఁ బంపుము తక్కువారి నా
ర్తాతలభర్త యిట్లనియెఁ • గారణ మే మిటు పల్కఁ జెప్పుఁడీ ౧౦౧౩

చం. ప్రకృతిజనంబులార! యనఁ • బార్థివసత్తము యేమి చెప్పఁగ
న్వికటవిరుద్ధవర్తనుఁడు • నీసుతుఁ డాడెడియారిబిడ్డలన్
దికమికలాడఁ గొంచుఁ జని • తెప్పునఁ దా సరయూజలంబులన్
వికలుఁడు గాక ముంచుచును • వేడుకఁ జూచెడిఁ జచ్చు చుండఁగన్. ౧౦౧౪

చం. అని జనముల్ వచింప మను•జాగ్రణి వారలతుష్టిపొందెఁ బు
త్త్రుని సహభార్యుఁ గాసలను • ద్రోయఁగఁ జచ్చెడుదాఁక వాఁడునున్
గొని యొకకిళ్ళు గంపయును • గ్రూరమహాటవులందు దిక్కుది
క్కునఁ జరించెఁ గందములు • గూడుగ నాకులు వేళ్లు మెక్కుచున్. ౧౦౧౫

ఆ. పాపి యైనసుతుని • బాసె ధర్మాత్ముండు, సగరచక్రవర్తి • చాన! చెపుమ
పాప మేమి రామ•భద్రునియెడఁ గంటి, విట్టు లతని కరుగ • నెట్టుటకును. ౧౦౧౬.

ఉ. మే మొకదోషమేని నిర◆మిత్రుఁడు రామునియందుఁ గాన మో
భామిని! సోఁక నేర్చునొకో ◆ కళంకము చందురునందుఁ, బల్కు నీ
వేమియుఁ గాంచి యున్నయెడ ◆ నిష్ఫల రామునిఁ ద్రోచి పుచ్చు నా
భీమమహాటవీస్థలికిఁ ◆ బెంకితనం బిది యేల చిత్తమున్. ౧౦౧౭

ఆ. సాధు వైనవాని ◆ సత్పథనిరతునిఁ, దేర నాపదలను ◆ గూరఁజేయ
ధర్మహాని యగుటఁ ◆ దప్పక తెగఁగాల్చు, శక్రు తేజ మైన ◆ వక్రగమన. ౧౦౧౮

ఉ. కావున రాజ్యలక్ష్మిని వి◆ఘాతము సేయకు రాముఁ డొందఁగా
దేవిరో! యీసు మాను మికఁ ◆ దేరకుఁ దెచ్చెద వేల పాపపుం
రావడిపోవనీకు మది ◆ రాజసతీ! యుపనిందఁ బాపుకో
నా విని కైకఁ గాంచి నర◆నాథుఁడు పల్కు భృశార్తియుక్తుఁడై. ౧౦౧౯

ఉ. ఈవచనంబు లెల్ల రుచి◆యింపవు గావలె నీకుఁ బాపినీ!
భావన సేయ లేవు హిత◆పద్ధతి నాకును నీకు; దుష్ట మా
త్రోవల లోభివృత్తిఁ గొని ◆ త్రొక్కెదు, నీచపుఁజేఁత మాన వీ
కావల మేల కట్టుకొని ◆ కాఱియ పెట్టగ వెళ్లవాగలన్. ౧౦౨౦

ఉ. నీవును నీసుతుండు నిఁక ◆ నెమ్మినిఁ గొట్టుకొనుండు శాశ్వతం
బౌవసుధాధిపత్యము దు◆రాత్మకురాలా! సుఖంబు నొందుమీ
భూవిభుతా దిగ నవ్విడి ◆ పోయెద రాముని వెంటఁ గానకున్
నీవికటాధిపత్యమును ◆ నేస్తు నటే గన నొక్కపూటయేన్. ౧౦౨౧

కం. సచివుఁడు జనకుఁడు పలికిన, వచనంబుల నాలకించి ◆ పరమవినీతుం
డచలధృతి రామభద్రుఁడు, సచియుంచెం దండ్రిఁజూచి ◆ సలలితభక్తిన్. ౧౦౨౨

కైక సీతారాములకు నారచీరలిచ్చుట.

ఉ. ఏటికి మీర లెల్ల నట ◆ కెల్లసుఖంబులు వీడి దండకా
వాటిని సర్వసంగములఁ ◆ బాసి చరించుచు వేరు వెళ్లఁగన్
గాటముగాఁగ మెక్కుచును ◆ గాలము ద్రోయఁగ నున్ననాకు; నీ
కేటికి భ్రాంతి, యగ్గ మొకొ ◆ యేనుఁగు నిచ్చియుఁ ద్రాడు కోరఁగన్. ౧౦౨౩

ఉ. వంపఁగ నేల నాబడిని ◆ వాహినికోట్లను, వానిఁ గోరఁగా
దల్పఁగ నేన యాభరతుఁ ◆ జేర్చిన, నా కవి గోలు నమ్మ! తె
ప్పింపుము నారచీరలను ◆ వేగమ గింపయు నెక్కపాలు, నే
నింపుగ నుండువాడఁ బది◆యేఁడులు కాలుగుఁ గాననంబులన్. ౧౦౨౪

తే. రాముఁ డిటుపల్కు విని ప్రహాస్యమున నొంగి, లోన నారలఁ గొనివచ్చి◆రాఘవుధికిఁ
గట్టుకో వీని నని యిచ్చెఁ◆గైక జనుల, మధ్యమున సిగ్గు బిడియంబు◆మదిని గొనక.

ఉ. ఇవ్విధిఁ గైక హస్తమున ♦ నీయఁగఁ గైకొని నారచీరలన్
దువ్వలువల్ దొలంగ నిడి ♦ తుష్టి మెయిన్ ధరియింప రాఘవుం
డవ్వల లక్ష్మణుండు మను♦జాగ్రణి తండ్రి గనుంగొనంగఁ దాఁ
జివ్వనఁ దాల్చె నారలను ♦ జిత్తమునందుఁ గలంక దీఱఁగన్. ౧౦౨౬

శా. పట్టుంబుట్టము గట్టి యున్న జనకా♦పత్యంబు కైకేయి యీ
పుట్టంబుల్ ధరియింపు మంచొసఁగినం ♦ బూఁబోఁడి సిగ్గున్ వ్యథం
దొట్టన్ భీతిలె నాఁడుజింక వలఁ గ♦న్గొన్నట్లు లై వానిఁ దా
నట్టే చూచుచు, వెండి చేతఁగొని ధ♦ర్మాభిజ్ఞ చింతారతిన్ . ౧౦౨౭

కం. ఏమియుఁ జేయఁగఁ దెలియక, తా మఱి దూపిల్లి ధర్మ♦దర్శిని బాష్ప
స్తోమపరిపూర్ణలోచన, యై మఱి గంధర్వనిభుని♦భర్తృహృదీశున్. ౧౦౨౮

కం. ఎట్టు లొకో మౌనిజనుల్, కట్టక రీవల్కలములఁ ♦ గానల నని తా
ని ట్టట్టు త్రిప్పి వానిని, నెట్టును నేరకయ భ్రాంతి ♦ నెసఁగుచు మఱియున్.

ఉ. కైకొని యొక్కచీరఁ దన♦కంఠమునం దపిలించి యొండు దాఁ
జేకొని కేల నేమియును ♦ జేయఁగ నేరక నిల్వ సిగ్గున
న్వే కని రామభద్రుఁడును ♦ నీరజలోచన పట్టుఁజీరపైఁ
బ్రాకటరీతిఁ దాన కొని ♦ వల్కలముల్ ధరియింపఁ జేసెనన్. ౧౦౩౦

↔ సీతను దోషము లేని పోవు దని రాజకాంతలు రామునిఁ బ్రార్థించుట. ↔

కం. రాముఁడు తానై తనప్రియ,భామకుఁ జీరలను గట్టఁ ♦ బరికించి యొటన్
రామలు తమతమలోచన,సీమల నశ్రువుల నించి ♦ చిడిముడిపడుచున్ ౧౦౩౧

కం. రామా! యెవ్వరు సీతా,భామను నిటుగాన కరుగఁ ♦ బలికిరి? యేలా
నీమాటిని గొనిపోయెదు? మామాటలు వినఁగదయ్య ♦ మానఁగదయ్యా. ౧౦౩౨

కం. జనకునినిర్బంధముచే, వనములకు న్నీవు పోవ ♦ వత్సా! నీమా
ననయంబు నీమె నైనను, గనుఁగొని మే మూఱడిల్లఁ♦గాఁ జేయఁ గదే. ౧౦౩౩

కం. తమ్ముఁడు నీవును గాంతా,రమ్మునకుం బోవరయ్య ♦ రామారత్నం
బిమ్ముగ మృదులగాత్రి, పుణ్యమ్ముల మునిభంగి నెట్లు ♦ సవసెడిఁ బుత్రా. ౧౦౩౪

చం. వినఁగదవయ్య మాపలుకు ♦ వీడుము జానకిఁ దండ్రి! మానుడిన్
గొనవుగదయ్య నీవు నిటుఁ ♦ గూరిమి నిల్వఁగ ధర్మబుద్ధి నం
చును నట నున్న భామ లను♦సూక్తుల వించును నాదరింప కా
ఘనమతి నారచీరలను ♦ గట్టెను సీతకుఁ దుర్యశీలకున్. ౧౦౩౫

సీత నారచీరలు గట్టఁగూడ దని వసిష్ఠుఁడు నిషేధించుట.

ఉ. చీరలు చక్కఁ గట్టుకొను♦సీతను నాఁగి వసిష్ఠమౌని యా
క్రూరచరిత్రఁ గైకఁ గని ♦ రోషముమైఁ గను వంకఁ పాంసనీ!
ఘోరకుశీల! యేమి చెనఁటి ♦ కూళవిధంబున మోసగించియుక్
ఘోరమఁటుం బ్రమాణ ఖ♦సంస్థితి నోల్ల నవేల దుర్మతీ? ౧౦౩౬

ఉ. పోవఁగ రాదు రాముఁడుఁ♦బోవె మహీశ్వరు వెంటఁ, బట్టపుం
దేవెరి యై నిజేశ్వరుస♦దివ్యమహాసన మెక్కు, టేక్; గృహ
స్థావితధార్త్రమస్థలకు ♦ సద్గలిభార్యయ యాత్మయౌఁ గదా
కావున రాము మాఱు సతి ♦ క్ష్మాతల మెల్లను నేలు చుండెడిన్. ౧౦౩౭

కం. అట్టిది కా దని జానకి, పట్టుగఁ బతివెంటఁ జనఁగఁ ♦ బనిపూనిన మే
మెట్టును దోఁ జనువారము, పట్టనమే పోవు రాము♦భద్రుని వెంటన్. ౧౦౩౮

ఉ. జాయయుఁ దాను రాఘవుఁడు ♦ సాగెడిచోటికి నంతపాలకుల్
వ్యాయతవిత్తదాసశక♦టాదిగఁ బోయెడివారు; పూర్వజుం
డేయెడ నుండు నవ్వనికి ♦ నేగు భరతుండయుండు సానుజుం
డై యజినంబు వల్కల ము ♦ లొంటఁ దాలిచి మౌనివేషియై. ౧౦౩౯

కం. అంతటఁ బాడఱు రాజ్యము, సంతసము జనవిహీనమౌ♦యాస్థిక! కొని య
త్యంతాధకారమును నివ్వింతంబుగఁ జూపు చెట్టు♦నేమల విరాఁదన్. ౧౦౪౦

కం రాముండు లేనియట్టి మహా రాష్ట్రం బట్టుఁ ♦ గానేదు; శ్రీ
రాముఁడు నిలచినదనమె, శ్రీనూనిత రాష్ట్ర మగును ♦ సిద్ధము సుమ్మీ. ౧౦౪౧

చం. తనకును శ్రీనపూర్వముగఁ ♦ దండ్రి యొసంగనిరాజ్య మేల నే
యనువున నొల్లఁడా భరతుఁ ♦ డాపలు కట్టుల యుండె నిమ్ము, నీ
తనయుఁడె యీమహీపతికిఁ ♦ దా నుదయించుట కల్లె నేని ని
న్నును దనతల్లిగాఁ దలఁప ♦ నూల్కొను నే కనుఁగొమ్ము నానుడిన్. ౧౦౪౨

తే. నేలనుండియు నే వెంత ♦ నింగి కెగురు, మిడిసిపడినను భరతుండు ♦ మిటుకులాఁడి
పితృకులాచార ధర్మసం♦వేది యేల, చప్పు నడమను స్వర్గంబు ♦ ముష్టి గదుర. ౧౦౪౩

కం. కొడుకు నెడఁ బ్రేమకతమున, నిడుములు తెచ్చితివి వాని ♦ కిది యెఱుఁగ వొకో
పుడమిని రాము భజింపని,జడమతి యొకఁడేని లేఁడు ♦ సత్యము కైకా. ౧౦౪౪

చం. కనియెదు గాక నీ విపుడ ♦ కైక! వసుంధరఁ గల్గుగొడ్డులుక్
జనములుఁ బాములుక్ శకున♦సంతతులుక్ రఘురాము వెంబడిక్
జనఁ బురి బాసి చెట్టులును ♦ సత్ఫలపల్లవపుష్పకోటితో
నెనయిక లేక రామవిభుఁ ♦ డేగడిత్రోవకు నున్ముఖంబు లౌ. ౧౦౪౫

కం. ఇమ్మిగ్గా భూషణములు గ్రై, కొమ్మిగ్గా నారలను పరలఁ ♦ గోడలిచే వం
చమ్మునిల్లుజుఁ డావస, నమ్ముల గట్టంగ సీక ♦ నావెత ననియెన్. ౧౦౪౬

ఉ. రాముని నొక్కనిం గద య♦రణ్యనివాసముఁ జేయఁ గోరి, శ్రీ
భామినితోడ నేమి పని ♦ పాపశీల? నిజాధినాథుతో
సీమహాళిసతింపవును ♦ నేప్పటయట్లుల తా పలంక్రియం
శ్రీమహాసీయ యై చను తఁ ♦ జె ల్పెపబాయక సప్వ మిక్క యై. ౧౦౪౭

కం. మాసంబులు పసిదిరచఁ, బానంబులు భూషణములు ♦ దాసీజనసం
తానంబులు పసిడి తప్పుటిప్పానంబులు గూడి సీత ♦ ధవువెంటఁ జనున్. ౧౦౪౮

కం. ఎందాన కాలమున నీ, పరపత్ని సీత దాల్ప ♦ వల్కలముల నో
తరుణీ! యమగుట లేపగ, బోరతోర నారల నిలేల ♦ బోయ్యలి కీయన్.

కం. అని గురుఁడు విప్రముఖ్యుం, డనుమాటల నాస్థ నిపక ♦ యలిప ధరించెఁ
దనపతి చనినయడి తెపువున, జనఁ గోరుట నారచీర ♦ సంతస మారన్. ౧౦౫౦

→ సీతకు నారచీర లిచ్చుటకు దశరథుఁడు కైకను నిందించుట. ←

కం. ఆచీర లట్లు సీత స, మీరాధీసమున ధరింప ♦ మిక్కిలి జనముల్
వాచాపాపమ్యంబునఁ, జీ చీ యని దశరథు న్వ♦దించుచు నేష్పన ౧౦౫౧

శా. ఆనాసం బతిదుస్సహం బగుచుఁ దా ♦ నాలించి భూపాలుఁడున్
మానక్ దేహమునై యశింబుపయి ధ♦ గ్గంబంటస గోర్షం, గడుం
బూనక్ దుఃఖము సంతోఁ గ్గొఁ గని యాగ్యప్రాఁబోఁటి యానారల
స్నేహం దాలిచి పోవరాదు ననికేఁ ♦ సిక్కంబు ను మ్మింతెయున్. ౧౦౫౨

కం. పాప నెలవూపనయునుని, పాపము! సుకుమారి సీత ♦ వని కపుగంగా
నోవ దని కూడ వని కడుఁ, బొంలం బని నిజము గురుఁడు ♦ పలికం గ్రైగా. ౧౦౫౩

మత్తకోకిలము. భూపచంద్రముపుత్రి యై ఘన ♦ బుట్ట సాధువరిత్ర యై
పాప మెట్టి యునిలంగ నట్టిది ♦ బాల శ్రీమతి యేరి కే
పాపముం బచరించనే యిటు ♦ వల్కలంబులతోఁ జతేఁ
దాపసిం బల న్మాయం గనఁ ♦ దా సభాస్థలి నిలకఁగన్? ౧౦౫౪

మత్తకోకిలము. చేసినాఁ డన నీకు బాసను ♦ సీత నారలతో వని
వాసముం బచరింప, సిగలు ♦ బంటిపట్టప[1] వేటి కే?
తా సుఖంబుగ సర్వవస్తుని♦ చానసంయుత యై చనున్,
గాసి యేటికి నొంప? నారలు ♦ గట్ట కుండెడుఁ గావుతిన్. ౧౦౫౫

ఉ. కాటికిఁ బోవ నా కిపుడు ♦ కాలము దాపుగ రాఁగఁ గూళ నై
పాటి దొలఁగంగ ఘోర ముగు♦బాస యొనర్చితి నీచబుద్ధి, నా

---

[1] బంటిపట్టు = నిర్బంధపఱుచు.

మాటయె నన్నుఁ గాల్చెడిని ♦ మానక వేణువు దానిపు ష్పనర్;
బాటిల కున్న దుఃఖములు ♦ పాపపు జెంతలమాటఁ బట్టినన్? ౧౦౫౬

క్మం. అల్లీల బాసలం గొని, యిల్లీలను బేరుఁ బెంపు ♦ నిందును నందుర్
బొల్లవడఁ జేయువరములఁ, బిల్లతనము చేత వలచి ♦ స్త్రీలెదు కంటే. ౧౦౫౭

ఉ. మాటకు నైనఁ జూత మొక ♦ మాటు రఘూత్తమునందుఁ బాపముం
బాటిలె నందువేఁ దెలుపు ♦ మా కనుఁగొందము, పల్కు వింత మీ
పాటలగంధియందుఁ గల ♦ పాప మొకం డయినన్, దురాత్మురా
లా! టకటాంకు మాన విది ♦ గుణమే సుగనాల[1] నైనచోన్. ౧౦౫౮

తే. హితచరిత్రక హరిణాక్షి ♦ మృదులశీల, బాల సాధుతపస్విని ♦ పార్థివేంద్ర
కన్య భూసుత మిక్కిలి ♦ కరుణ గలదు, పాప మెయ్యది గంటివే ♦ పగుపతకును?

శా. ఓసీ రామవివాసనాకలితపా ♦ పౌఘంబె యత్యాంతముల్
గాసిం బెట్టఁగఁ జాలి నారకమునం ♦ గ్రుంచున్ నినుర్, వెండియున్
శ్రీసీతాపతి లోభబుద్ధి నిటుక ♦ స్సెం జెప్పఁగాఁ గల్గునీ
దోసంబుల్ నిను నేమి చేయఁ గలుగుర్ ♦ దుర్గాంత మై యెంతయున్. ౧౦౬౦

కం. రాముఁ డభిషేకము లక్కై, యీమేడకు నచ్చియున్న ♦ నెుడ నాతనితో
రామా! వనికిం బొమ్మ్మని, నామాటయె వింటి నన్య ♦ మాటవు కాదే. ౧౦౬౧

మ. వినవే రామవినాసనం బొకఁడ న ♦ న్వేఁడంగ నీకొంటి, నీ
వనఘుర్ సీతను వేఁడ, వేఁ బ్రతివ సే ♦ యుర్; దాఁటి యామేర యీ
వనజాక్షీమణి నారచీరలను ని ♦ ల్వెం జూఁడగాఁ గోరుటర్
జనఁగాఁ జూచెదు దుర్గతిం బడఁగ, నిర్ ♦ సైరించునే కాలుఁడున్. ౧౦౬౨

కం అని విలపించుచు గుహూలో, గ్గిని గుందుచు దశరథుం డ ♦ తివ్యథ నిల ద్రా
లినఁ గని జనకునితో నిట్టు, లనియుర్ శ్రీరామచంద్రుఁ ♦ డతివినయమునన్.

రాముఁడు తనతల్లిని గాపాడు మని తండ్రిని వేఁడుకొనుట.

సీ. నాతల్లి కౌసల్య ♦ నన్యగుణాకల్ప[2], సాధుతపస్విని ♦ సత్యశీల
యిదివఱ కెన్నండు ♦ నది దుఃఖ మెఱుఁగదు, నే నెడఁబాయుట ♦ నేఁడు మొదలు
పుత్త్రశోకంబునఁ ♦ బొగులుచు నుండును, నేఁడు చెప్పినయది ♦ యెట్టు లైన
నాదుఃఖమున మర ♦ ణంబు నందక యుండ, నేమెను బాలింపు ♦ మీ మహాత్మ

తే. నిన్ను మది నైన నెపుడు నిం ♦ దింపఁ బోదు, నన్నుఁ దలఁచు చుఁ దలఁచుచు ♦ నన్నగిల్లి
కాలుపురి కేగ కుండఁగఁ ♦ గావ నయ్య, నాదు ప్రార్థన నోనర ♦ నాథచంద్ర.

కం. అడవులలోఁ దిరుగుచు నే, నిడుమలఁ బడు చుండు ననుచు ♦ నెంతో వసటర్
బడుచుఁ గృశించుచు ననుఁ గనఁ, గడుఁ దమిగొను నాదుతల్లిఁ ♦ గావవె దేవా.

---

[1] మగనాలు = పతివ్రత. [2] గుణాకల్ప = గుణములే యాభరణములుగాఁ గలది.

**మునివేషధరుం డైనరామునిఁ జూచి దశరథుఁడు దుఃఖించుట.**

కం. అనురామునివచనము విని, మునివేషముఁ గొనినయతని ♦ మోముం గన లే
కను[1] బల్కనేరకయు నాం,ద్రును దానుం ద్రెళ్లి ధరణి ♦ సూక్షుపుమూర్ఛన్.

ఉ. ఇంచుక తేఱి భూమితన ♦ యేశునిఁ గూర్చి మహీశుఁడుం బ్రలా
పించు నయో పురాకృతము ♦ ప్రేఁపక పోవునె నన్ను, లేఁగలన్
గ్రించుతనాన నెన్నిటికిఁ ♦ గీడుగఁ బాపితి నొక్కొ గోవులన్,
గొంచక యెన్ని ప్రాణులకుఁ ♦ గూర్చితినో దురితంపుహింసలన్. ౧౦౬౭

ఉ. వెల్గెడివాఁడు తేజమున ♦ వీతవహ్నిం డన నాదుపుత్త్రుఁ, డీ
నల్గురుఁ జూడ నాయెదుట ♦ నారలు గట్టుకొనంగ సైఁచెదన్,
నీల్గను గైకబారిఁ బడి ♦ నిర్భరదుఃఖ మిఁ కొందు గల్గునే?
కల్గ దనాగతం బయిన ♦ కాలమునన్ మరణంబు దేహికిన్. ౧౦౬౮

కం. వంచించి నన్ను స్వార్థం, బెంచి కటా కైక యొకతె ♦ యీయున్నప్రజా
సంచయముం గారించెడి, నంచును రామా యటంచు ♦ నశ్రులు నించెన్. ౧౦౬౯

కం. రామా యని యొకపరి పై, నేమాటయుఁ బలుకలేక ♦ యేడ్చి సుమంత్రున్
భూమీశుఁ డనియెఁ దెమ్మా, రామున కుపవహనయోగ్య ♦ రథ మొం డిటకున్.

కం. కొని చని మహానుభావుని, జనపదముల నెల్లఁ గడచి ♦ చని యట విడుమీ
యనవుడు నాతఁడు తేరిం, గొని తేరఁగఁ జనిన ననియెఁ ♦ గువలయపతియున్.

ఆ. నోరులేనివాని ♦ వీరుని నడవులఁ, దల్లిదండ్రు లిట్లు ♦ దలఁగఁ ద్రోయ
నరసి సాధుగుణుల ♦ యమలగుణంబుల, ఫలము నిట్టి దనుచుఁ ♦ దలఁచువాఁడ.

కం. త్వర త్వర కార్యముఁ జేయఁగ, వెరవరి యగుసారథియును ♦ వేవే తేరిన్
దురగములఁ బూన్చి ధరణీ, శ్వరచంద్రముఁ డుండునింటి ♦ వాకిట నిలిపెన్. ౧౦౭౩

కం. కనకాలంకృతిభూషిత, మును బరమజవాశ్వయుక్త ♦ మును నరదంబున్
గొని వచ్చితి రామునికై, యని యాతఁడు విన్నవింప ♦ నాత్మాధవుఁడున్ ౧౦౭౪

సీ. విత్తకోశాధ్యక్షు ♦ సత్తము దేశకా, లజ్ఞు నిశ్చితుఁ బిల్చి ♦ ప్రాజ్ఞవర్య
వెల గలనగలు దు ♦ వ్వలువలుఁ బదునాలుఁ, గేఁడులకగుపట్టు ♦ లిలతాంగి
కీయఁగఁ గొని తెమ్ము ♦ యీ వన నతఁ డేగి, యన్నియుఁ గొని వచ్చి ♦ యప్పగింపఁ
గోడలి కన్ని యా ♦ కువలయపతి యిచ్చె, నిచ్చిన వానిని ♦ బుచ్చుకొనుచు

తే. మేలిభూషణములఁ గొన్ని ♦ మేనఁ దాల్చి
మెఱుపునకు మెఱుఁ గిచ్చిన ♦ మేల్మి దనర
వెలిఁగెఁ దత్కాంతి గృహ మెల్ల ♦ వేగుఁబోక
బాలసూర్యునిచే మిన్ను ♦ వఱలునట్లు. ౧౦౭౫

---

[1] లేకను = లేకయును. ను సముచ్చయము.

## కౌసల్య సీతకు ధర్మోపదేశముఁ జేయుట.

కం. డెందమునఁ జింత యేమియుఁ, జెందక నిలుచున్న స్నుషను ♦ సీతను దనుఁ జేఁ
రం దిగిచి కోసలాత్మజ, పొందుగఁ గౌఁగిటను గ్రుచ్చి ♦ పొలఁతుక కనియెన్.

కం. కలిమియు సౌఖ్యము సతతము, వలువుగఁగూర్చఁగను బ్రాణ♦నాథుఁడు శీవిక్
గులుకుచు, సిరులు దొలంగినఁ, గులటలుగద పతిని దూఱు♦గుణహీనసతుల్.

కం. తొలుత సుఖ మనుభవించియుఁ, గలికీ! మఱిపతి కిడేని♦కష్ట మొదవుటన్
దొలఁగ సుఖ మతని నిందలు, పలుకుట పాయుటయు స్త్రీస్వ♦భావము తల్లీ.

ఉ. బొంకులపుట్టినిం డ్లయి స్వ♦పూరుషు గేలిగ వెక్కిరించుచున్
గొంకక దుష్టచింతనల♦కున్ నిధు లై భృశగూఢచిత్త లై
మంకుతసంబునన్ వయసు♦మంపున రోయఁగఁ జేయుచుందు రే
ణాంకముఖుల్ నిమేషమునఁ ♦ బ్రాణమువోలెను జూచుభర్తనేన్. ౧౦౭౯

చం. కులముమహాత్త్వముం గన, ర♦కుంఠితరక్తి విభుండు సేయుచె
య్యుల మదిఁ జేర్ప, రాత్మవిభు♦నుజ్జ్వలపాండితి మెచ్చ రెంతయున్
వలఁపరు పాణిసంగ్రహము ♦ దత్తధనాదుల నెంచ రాత్మలన్
జలజదళాక్షి! తాఁగ లగు♦చంచలచిత్తలు మత్తకాశినుల్. ౧౦౮౦

కం. పతిహిత యయి శీలంబును, శ్రుతమును సత్యంబు శమము ♦ సొబగును గలయా
పతివత్నీరత్నమునకుఁ, బతి యొక్కఁడె పరమగతియుఁ ♦ బావనగతియున్.

కం. అక్కట నాదుతనూజుఁడు, దిక్కఱి వనవాసియగుట ♦ దెప్పకు మమ్మా
రొక్కము గలిగిన లేవడిఁ, జిక్కిన దైవత మతండె ♦ చెలువా! నీకున్. ౧౦౮౨

కం. అత్త వచించినమాటలు, చిత్తంబున నిలిపి సీత ♦ చేమోడ్పునఁ దా
హత్తించి దనదుచూపా,మత్తచకోరాక్షియందు ♦ మానుగఁ బలికెన్. ౧౦౮౩

ఉ. అత్తరొ! మున్ను వింటి జన♦కావసథంబున నుండి భక్తిసం
పత్తిని వల్లభుం గొలుచు♦పద్ధతు లన్నియు, మీరు చెప్పి న
ట్లత్తినరక్తిఁ గొల్చెద న♦నార్యులతోఁ సరి చేయఁ బోకుఁడీ;
పుత్తునె ధర్మముం, దొలఁగఁ ♦ బోవునె వెన్నెల చంద్రుఁ బాయుచున్? ౧౦౮౪

తే. తంత్రి లేకున్న వీణనా♦దంబు లేదు, చక్ర మెడసిన శకటంబుఁ ♦ సాగఁబోదు
కువలయాక్షికినూర్గురు♦కొడుకులున్నఁ, బ్రాణపతి లేమి సౌఖ్యంబుఁ♦బడయరాదు.

కం. మితముగ నిచ్చును జనకుఁడు, మితముగఁ దల్లియును సుతుఁడు ♦ మితముగ నిచ్చున్
మితి లేనిసుఖము నిచ్చెడు,పతినిన్ భజియింప దేవతె ♦ పరమపవిత్రా. ౧౦౮౬

కం. వింటిని బెద్దలవలనను, మంటిని సద్ధర్మగతిని ♦ మఱి విభు నేలా
గెంటనము లాడుదును; వాఁ,గ్లంటికి దైవత మనంగఁ ♦ గాంతుండ కదా. ౧౦౮౭

కం. అన విని వనటయు నెంమియుఁ, బెనఁగొనఁ గౌసల్య బాష్ప♦వితతులు రాల్పన్
గని సవతులలో నుండెడి,జననికి వలగొనుచు రామ♦చంద్రుం డనియెన్. ౧౦౮౮

### శ్రీరాముఁడు కౌసల్యాదిమాతలయొద్ద సెలవు తీసికొనుట.

చ.అడలకు మమ్మ! నాజనకు ♦ నాదర మొప్పఁగఁ జూడవమ్మ, నా
కడవుల నాలుగుం బదియు ♦ నబ్దము లేగెడి నీదునిద్రలో,
వడిఁ జనుదెంచి మిత్రహిత♦వర్గముతో వెలయంగఁ గాంతు వం
చడ లుడుగంగఁ బల్కి తన♦యంబవిధంబున నేడ్చువారికిన్ ౧౦౮౯
కం.మున్నూ ఱేఁబదితల్లుల, కు న్నతుఁడై మోడ్చి కేలు ♦ కొమరుఁ ధృతిసం
పన్నుఁడు ధర్మయుతం బగు,నన్నెఱి వచియించె వారి ♦ నందఱఁ గనుచున్.
కం.జ్ఞానము లేమినో, చనవుననో, నీతి దొఱంగి పలికి ♦ యుండిన మిమ్ముల్
నానేరము క్షమియించుచు, నానతి నా కిడుఁడు తల్లు♦లారా! కరుణన్. ౧౦౯౧
మ. అనినన్ రాముని మాటలన్ విని సరో♦జాక్షుల్ భృశార్తిన్ మహా
నినదం బారఁగఁ గొంచ లట్లుఱవ ము♦న్నిస్తుల్యవాద్యధ్వనిన్
గొన బౌభూమిధవేంద్రహర్మ్యము మహా♦కోలాహలోపేత మై
వనజాతాయతలోచనానికరరా♦వస్ఫూర్తి సొంపాఱుడున్. ౧౦౯౨

### సుమిత్ర లక్ష్మణునకు రాముని వెంటఁ బోవ ననుజ్ఞ యిచ్చుట.

కం.రాముఁడు సీత కృతాంజలి, సౌమిత్రియు దైన్య దుఃఖ♦సంతాపములన్
భూమీశ్వరు వలగొని శ్ర,ద్ధామతిఁ జరణముల వ్రాలి ♦ తగుగతిఁ బిదపన్.
కం.జనకతనూజను దమ్ముని, వనపల్లికి వెళ్ళఁ గనుచి ♦ దైన్యవశుం డై
వన చేతనుండు తానును, వినయంబున సమస్కరించె ♦ వెంటఁ దనకమిన్నన్.
కం.అనుపదమున లక్ష్మణుఁ డట, ఘనధీరతని జాఁగి మ్రొక్కి ♦ కౌసల్యకు, వెం
డివి దనజనని సుమిత్రకు, వినయంబున మ్రొక్కె భక్తి♦వివశుం డగుచున్. ౧౦౯౫
ఆ. వందమానుఁ డైన♦సందనుఁ జేరంగఁ, దిగిచి యగ్ర కురుల ♦ నగివ్రతోడ
శిరము మూరుకొనుచుఁ ♦ దమదేమితల్లి సు,మిత్ర హితముఁ గోరి ♦ పుత్రు ననియె.
సీ. నిఖిలసుహృత్త్రతి ♦ నియతానురక్తుఁడ, రామునితో సంద♦సైన్యములకుఁ
బోవ జన్మించితి[1] ♦ పొమ్మాన తెచ్చెద, నేను లెఱవు సుమీ ♦ యుక్తమైన
వీమసంబున నేని ♦ రాముఁ డేఁగి సనాళి, వ్యసనస్థుఁడైన సమృద్ధి ♦ నెసఁగు చున్న
నీతండె గతి నీకు ♦ నెల్లెడ ధర్మంబు, జ్యేష్ఠానువర్తిత్వము ♦ చెలఁగు చుంట
తే. పుత్రక! సనాతనం బైన♦పుణ్యవృత్త
మీకులంబున నివియ సు♦మ్మీ తలంప
దానమును యజ్ఞదీక్ష యు♦ద్ధమున మృతి యు
టంచు బోధించి పో పొ మ్మ ♦ టంచు మఱియు ౧౦౯౭

[1]అవతారరహస్యము చూడు బా. ప. ౫౦౩.

తే. రాముఁడ యెఱుంగుమీ దశ♦రథుఁడు నిజము
వను దలంపు మా జనకుని♦తనయఁ బుత్త్ర!
యటవియు యయోధ్య యంచు నీ♦ వాత్మఁ జూడు
పోయి రమ్ము యథాసుఖ♦ముగను దండ్రి.[1] ౧౦౯౮

చం. అని సుతుచిత్తదార్ఢ్యమున♦కై యిటు బోధము చేయ నంత నా
మనుజవరేణ్యు రాముని సు♦మంత్త్రుఁడు మాతలి యింద్రునట్లు స
ద్వినయమున న్వచించె నదె♦ తేరు రెడెం డెట కేగ నాజ్ఞ చే
సిన నట కేన తోలెదను ♦ జేయుఁడు తొందర యాల మేటికిన్. ౧౦౯౯

సీతారామలక్ష్మణులు తేరెక్కి వనములకై పోవుట.

చం. వనముల నాలుగుం బదియు♦వర్షము లుండఁగ మీర లిప్పుడే
చనుఁ డని చెప్పఁ గైక, యది♦ సాగుత నేడు మొదల్గ రాఘవా,
య్యన నినసన్నిభం బయి య♦నంతమణీమయ మౌళితాంగముల్
జనకతనూజ యెక్కె నరు♦సంబున భూషణభూషితాంగి యై. ౧౧౦౦

కం. అనలోపమాన మగుచుం, గనకమయం బైనరథముఁ ♦ గౌసల్యానం
దనుఁడును సుమిత్త్రపట్టియు, ననుమానము లేక యెక్కి ♦ రత్యుత్సుకతన్. ౧౧౦౧

కం. వనవాసార్థము పతితో, ననుగమనము సేయుసతికి ♦ నవనీసుతకున్
జనపతి మామ యొసంగిన, యనుపమభూషణములును మ♦హాధనచయముల్

కం. ఆయిరువురకవచంబులు, నాయుధములుఁ జర్మయుక్త ♦ మగుగుద్దలియున్
వే యుంచి రథమున నా, చాయం గని తేరు దోలె ♦ సారథి వడిగన్. ౧౧౦౩

చం. అనిలజవంబునం బఱచు♦నట్లు సుమంత్త్రుఁడు దోల నయ్యయో
యని బలితంపుమూర్ఛఁ గొని ♦ రంధఱు పౌరులు వేడ్కఁ జూడవ
చ్చినజనముల్ బలంబులు వి♦శేషవుఁగాలము, క్రుద్ధమత్తదం
తినిచయవాజిశింజితము ♦ నెక్కొనె సంకుల మైనయాపురిన్. ౧౧౦౪

రామునిపోకకుఁ బ్రజలు దుఃఖించుట.

ఉ. రాముని వెంట నెండలను ♦ గ్రాఁగినవారలు నీటికిన్వలెన్
వే ముదుసళ్లు బాలురును ♦ వీడక పాఱిరి, యశ్రుపూర్ణ మా
మోముల నార్తనాదముల ♦ మోరల నెత్తి రథంబుచాయకున్
రాముని తేరు పట్టుకొని ♦ ప్రక్కల వెన్కల వ్రేలి కొందఱున్ ౧౧౦౫

కం. పోవుచు నీగతిభృశదుః, ఖావేశవినష్టసత్త్వు ♦ లై సూతునితో
నీవిధమున వాకొందురు, పోవయ్య సుమంత్ర మెల్లఁ ♦ బుణ్యం బగుతన్. ౧౧౦౬

---

[1] ఈపద్యమునకుఁగల యర్థములు సంగ్రహముగఁ టీకయందుఁ దెలుపఁబడెను.

ఉ. ఎన్నఁడు చూడఁగాఁ గలమొ ♦ యీరఘురాముని మోముఁ గ్రమ్మఱన్
దిన్నగఁ దోల వన్న! యిటు ♦ తీవర మేటికి రన్న! పగ్గముల్
మన్ననఁ బట్ట వన్న! యొక ♦ మాటయినం గనుఁగొందు మిప్పుడే
సన్నుతశీలుఁ డైనరఘు ♦ చంద్రముచారుముఖారవిందమున్. ౧౧౦౮

సీ. రామునితల్లికి ♦ రాయియో యిను మొండెఁ, గాఁబోలు గుండియ ♦ గాక యున్న
దేవగర్భోపముఁ ♦ డీ వనజాతుండు, వనికి నేగఁగఁ బెట్టి ♦ పడక యున్నె
కాంచననగము న ♦ ర్కప్రభ పాయని,చంద మై తననాథుఁ ♦ జాయవోలెఁ
గొనకొని వెన్కొని ♦ చనియెడి యీమె పో, ధన్యాత్మురాలన ♦ ధరణియందు
తే. నౌర లక్ష్మణ నీవె కృ ♦ తార్థుఁడ విల, ననయమును బ్రియవాదిని ♦ ననుఁగుభ్రాత
దేవసంకాశు నిర్మల ♦ భావమునను, బరిచరింపఁగఁ జనెదు నీ ♦ భాగ్య మహహా!

కం. రామునితో నీపోవుట, యే మానుగఁ బరమసిద్ధి ♦ హేతువు కల్యా
ణామల బీజం బిదియే, పో మానక నాకమార్గ ♦ మును నని వనటన్ ౧౧౦౯

కం. ఉడుగక కనులను బొడబొడ, జడిగొని వర్షించుబాష్ప ♦ జలములు పోవం
దుడువఁగఁ జాలక రాముని,బడి నేగిరి పౌరు లెల్లఁ ♦ బటుదుఃఖమునన్. ౧౧౧౦

దశరథుఁడు శ్రీరామునిఁ జూడ వచ్చుట.

ఉ. రామునిపోకఁ గందు నని ♦ రామలతో నిలు వీడి వచ్చి సు
త్రామసమానుఁ డాజి తన ♦ దాపున బద్ధమతంగజార్థ మా
భీమకరేణుకారవము ♦ పెల్చన సారసపత్త్రలోచనో
ద్దామనినాదముల్ చెలఁగఁ ♦ దద్దయు గ్రస్తమృగాంకు నట్టు లై ౧౧౧౧

కం. అరుదెంచుతండ్రిఁ గనుఁగొని, స్థిరమతి రాముండు సూతుఁ ♦ దీవరపఱచెన్
దురగంబులఁ బోనిమ్మా, పరగున నీ వంచు నట్లు ♦ నలిపె నతండున్. ౧౧౧౨

కం. తోలుము తోలు మటంచును, వాలాయింపఁగను రామ ♦ భద్రుఁడు జనముల్
కాళుము కాళు మటం చన, నేలీలం జనక సూతుఁ ♦ డిటికె న్నడుమన్. ౧౧౧౩

కం. హరిఖురఘట్టన జనముల,చరణహతిన్ రేఁగుదుమ్ము ♦ జనసంచయని
ర్భరశోకజాతఘనరస,సరిదాళి నడంగెఁ బుడమి ♦ జంబాలముగన్. ౧౧౧౪

శా. హాహా నిస్వనపూరితం బగున యో ♦ ధ్యాపట్టణంబందు సీ
తాహృన్నాథప్రయాణవేళను నితాం ♦ తద్యూన మయ్యెం బ్రజా
వ్యూహం బెల్ల, విసార[1]సంక్షుభిత మం ♦ భోజాళి నా నావరా
రోహాళుల్ గన్నీరు గార్చెను మహా ♦ క్రూరంపుశోకవ్యథన్. ౧౧౧౫

ఉ. ఏకమతంబుతోడిజన ♦ బృందము నెల్లను గాంచి తేఁడు శో
కాకులచిత్తుఁ డౌచు మొద ♦ లంటఁగఁ గొట్టినవృక్షముంబలెన్

---

[1] విసారము = చేప.

జోక దాఱంగి వ్రాలుదును ♦ జూవఱు హాయని యేడ్వ సాగి ర
స్తోకముగాఁగ తేఁడు భృశ♦దుఃఖితుఁ డై ధర సోలి యుంటకున్. ౧౧౧౬

కం. ఆయెడఁ గొందఱు కౌస,ల్యా యనుచున్ రామ రామ ♦ యని కొందఱు దుః
ఖాయితమతులై యేడ్చిరి,హాయని యంతఃపురంబు♦నువిదలు కలఁకన్. ౧౧౧౭

ఉ. భ్రాంతమనస్కుఁ డై వెనుక ♦ వచ్చునృపాలునిఁ దల్లి జానకీ
కాంతుఁడు పాశబద్ధ మగు♦కర్కశఘోరము దల్లిఁ జూచున
శ్రాంతయు ధర్మరజ్జుల న♦హీనముగాఁ బరిబద్ధుఁ డౌట నే
ర్భ్రాంతిములం గనిం గనఁడ ♦ యంతగఁ గానఁగ నొల్ల కుండుటన్. ౧౧౧౮

తే. యానముల వచ్చుటకుయోగ్య ♦ లయ్యు రిత్త,గాళ్ల వచ్చెడివారి సు♦ఖంబు గలిగి
శోకభరితుల రాముండు ♦ చూచి సూత,తోలు తోలు మటంచును♦దొందరించె.

తే. కోలపోటును సైఁపని♦కుంజరంబు,పగిది జనకుండు జననియుఁ ♦ బడెడిదుఃఖ
ములను జూడంగ నోపండ ♦ జలజలోచ,నుండు రాముండు కరుణాత్మ♦కుండు గాన.

ఉ. కట్టఁగఁబడ్డ లేఁగకయి ♦ కాంక్షను బారెడిగోవువోలె నా
పట్టపుదేవి తేరుబడి ♦ పర్విడుచుం దనయా! రఘూత్తమా!
పట్టి! కుమార! లక్ష్మణ! కృ♦పాపర! యయ్యయొ తల్లి జానకీ!
యెట్టు సహింతురా యనుచు ♦ నేడువ రాముఁడు చూచెఁ బల్మఱున్. ౧౧౨౧

తే. నిలు నిలు మటంచు నఱవంగ ♦ నృపతి పిఱుఁదఁ
బద పద మటంచు రాముండు ♦ పలుకు చుండ
బండికలుదోయిఁ జిక్కిన♦వానిభంగి
మిడికెను సుమంత్రుమన మంత ♦ నుడుకు గదుర. ౧౧౨౨

ఉ. క్రమ్మఱి నీవు పోవఁగ ధ♦రాపతి నిన్గని యేల యాళతాం
గమ్మును నిల్పవైతి నుడి ♦ గైకొన వేటి కటన్నఁ జెప్పనా
నెమ్మది నీదువాక్యముల ♦ నే వినఁగాన నటంచు, నేల నా
నిమ్మహితార్తి దీర్ఘ మగు♦నేనియు దుస్సహ మాను తేనికిన్.[1] ౧౧౨౩

చం. అని రఘురాముఁ డాడఁగ శ♦తాంగము వెంబడి వచ్చు నెల్లరన్
ననయత నిల్వఁ జెప్పి రథ♦సంబుగ బోవుగుఱాల సూతుఁడున్
ఘనరయ మూరఁ దోలుటయు ♦ త్మాధవుకాంతలు నార్తి రామచం
ద్రుని వలగొంచు నిల్చిరి మ♦నోజలజంబులు కందు చుండఁగన్. ౧౧౨౪

కం. అతివేగంబునఁ జనియెడి,క్షితిపతిసుతురథముతోడఁ ♦ గ్రేవల నశ్రూ
ద్ధతి నంధు లగుచుఁ బఱచుచు, మతిఁ దలఁపరు పౌరు లెవరు ♦ మరలెడిమాటన్.

---

[1] దురుద్దేశముగాని స్వలాభాపేక్షగాని లేక సద్భావముతో సాధుభావముతో భూతహితంబుగాఁ బలుకు బొంకును సత్యఫలంబు నిచ్చునని శాస్త్రోక్తి. తేరు నిలుపుటవలనఁ గార్యహాని. దశరథునకు దీర్ఘశోకాభివృద్ధివలనఁ బ్రాణహాని.

ఉ. దూరము పోవ రాదు సుమి ♦ తూర్ణము క్రమ్మఱఁ గోరు వారితో
భూరమణా! యనన్ సచివ♦పూగము, సర్వగుణోపపన్ను లౌ
వారలమాటఁ బట్టి సహ♦భార్యుఁడు నై ప్రవిషణ్ణరూపుఁ డై
వారి స్రవింప మేన నిలు♦వంబడె నచ్చట రాముఁ జూచుచున్. ౧౧౨౬

## ⟶ శ్రీరామునకై యంతఃపురస్త్రీలు దుఃఖించుట. ⟵

కం. మ్రొక్కుచుఁ దల్లికిఁ దండ్రికి, నక్కరణిని రామచంద్రుఁ ♦ డరిగిన నాత్తై
నొక్కమొగి నంతిపురమున, మిక్కుటమై యార్తరవము ♦ మింటికి నెగసెన్.

కం. గతి యెవ్వఁ డనాథులకున్, గతి యెవ్వఁడు దుర్బలులకుఁ ♦ గడుఁదపసులకున్
గతి యెవఁడు శరణ మెవఁ డా,పతి గతిచెడి యెచటి కేగు♦వాఁడో యకటా.

సీ. తనమీఁద నెవ్వరైనఁ ♦ దంట లాడిన నైనఁ, గోపంబు చెందఁడే ♦ కొమ్మలార!
యేమి చేసిన నది ♦ యెవరి నొప్పించునో, యని జంకు చుండునే ♦ యమ్మలార!
యెవ్వరేనియుఁ గింక♦నొ వ్వొంద వారల, నూఱట లాడునే ♦ యుపిదలార!
పరసుఖదుఃఖముల్ ♦ స్వసుఖదుఃఖము లట్లు, పరికించు చుండునే ♦ తరుణులార!
తే. కన్నతల్లిని గౌసల్యఁ ♦ గన్నవగిది
మనల నందఱఁ జూచునే ♦ మగువలార!
యట్టిపుణ్యాత్ముఁ డటువంటి♦యనఘచరితుఁ
డెచట నున్నాఁడొ కటకటా ♦ యెందుఁ జనునొ. ౧౧౨౯

కం. నచ్చి తను డాయఁ గైకయు, మచ్చరి యై యేఁప విభుఁడు ♦ మతిచెడి విడిచెన్
సచ్చరితు లోకరక్షకు, నెచ్చటఁ జను చున్నవాఁడొ ♦ యెయ్యది గతియో.

ఉ. ఎంతటిబుద్ధిహీనుఁడో క♦దే ధరణీశుఁడు జాలి మాలి యే
కాంతము సత్యశీలుని జ♦గజ్జనతాప్రియు ధర్మమూర్తి దు
ర్దాంతపరాక్రమాఢ్యుని న♦రణ్యములం బడఁ బంచె నంచు శు
ద్ధాంతనితంబినీజనము ♦ హా యని యేడ్చెను దుస్సహవ్యథన్. ౧౧౩౧

కం. లేఁగలఁ బాసినయావులు, నాఁ గమలేక్షణలు బిగ్గ♦నాదున నార్తిన్
గ్రాఁగఁగఁ మ్రోఁగుడు విని ధర, మ్రాఁగెన్ మ్రాఁగన్నుతోడ♦మనుజవిభుండున్.

సీ. వండరు గృహమేధు ♦ లిండులలోపల, వేల్వ రగ్నులలోన ♦ విబుధు లెవరు
మనుజుఁ డొక్కండైనఁ ♦ బనికిఁబోనొల్లఁడు, మార్తాండబింబంబు♦మఱుఁగుపడియెఁ
గరులు దిండి తొఱంగి ♦ కన్నీరు గార్చెను, నాలు లేఁగలఁ జన్ను♦లంట నీవు
తొలిచూలు మగబిడ్డ ♦ గలిగియు జనయిత్రి, యానంద మంద దా♦వంత యైన
తే. దారుణంబుగ గురుబుధాం♦గారకులుఁ ద్రి,శంకువును నాక్రమించి రే♦ణాంకు; వీత
కాంతిఁ జుక్కలు గ్రహములు♦గ్రాల ధూమ, యుక్తమయ్యె విశాఖయు♦వ్యోమవీథి.

తే. కాళికానిలరయమునఁ ♦ గడలి కళవళించుచునుండఁ బుర మెల్ల ♦ సంచలించె
నిసుఁలు గప్పెను దిక్కుల ♦ నెల్లఁ జుక్క,లైన గ్రహ మైన వెల్గద ♦ యంబరమున.

కం. దారుణదైన్యము పేర్చి వి,హారాహారములయందు ♦ నానగరమునన్
బూరుషులు సతులు నొకరేన్, గూరుపరు మనంబునందుఁ ♦ గోరిక లైనన్.

తే. వేఁడినిట్టూర్పు లూర్చుచుఁ ♦ జోఁడిబిచెడి, వ్యసనసంతప్తమై యయో♦ధ్యాజనంబు
కాటు వేసిన నెత్తురన్ ♦ మాట లేని,వదనములఁ బల్లటిల్లెను ♦ ముదముఁ బాసి.

కం. వీవఁడు వాయువు చల్లగఁ, బావకుఁడుం జల్లపడియె ♦ భానుఁడు తాపా
భావత నొప్పెను శశియు, న్నావిరి నిజసౌమ్యదర్శ♦నత్వము మానెన్. ౧౧౩౭

ఉ. పాలకు నేడ్వఁ జేడ్వఁడును ♦ బాలుఁడు తల్లిని జూచి, తల్లులున్
బాలురుఁ దమ్ము లన్నలును ♦ భార్యలు భర్తలుఁ జుట్టపక్కముల్
చాలఁగ రామునంద తమ♦స్వాంతము నిల్పి యొకళ్లొకళ్లలన్
దూలుచుఁ బాసి పోయి రెటొ ♦ దుస్సహశోకభరంబువ్రేఁకనన్. ౧౧౩౮

ఉ. రామునిమిత్రు లందఱు భ♦రం బగుశోకము పేర్చి దిగ్భ్రమన్
ధామమునంద ఱోలుచును ♦ దద్దయు మానరు సెజ్జ[1] లప్డు, సు
త్రామునకు స్వర్ణాంకుసధరాధర♦ధారిణినా నయోధ్య శ్రీ
రాముఁడు లేమిచే వణఁకె ♦ న్రాలినభీతియు నార్తి ముంపఁగన్. ౧౧౩౯

### దశరథుఁడు మరలి తనగృహమునకుఁ బోవుట.

ఉ. రామరథోత్థితం బగుప♦రాగము దోఁచెడునంతదాఁక నా
భూమివిభుండు పుత్రకుని♦పోయినపంకను తెప్ప వ్రాల్పఁ, డా
భూమిపరాగమున్ సుతుని♦పోవుట భూపతి చూచునంతకున్
స్తోమముగాఁగ రేఁగెఁ బతి ♦ స్రుక్కక యుండెడిఁ గాక యంచునో. ౧౧౪౦

ఉ. ధూళియు మాయ మైన ధృతి ♦ దూలి ధరం బడి యున్న యల్లభూ
పాలకు రాముతల్లి కుడి♦ప్రక్కను గైకయి వామభాగమం
దోలిన పట్టి యెత్తుటయు ♦ నొయ్యనఁ దెప్పిఱి లేచి భూధవుం
డాలరికైకఁ గాంచి యిటు ♦ లాడె మనం బెరియన్ వ్యధాగ్నులన్. ౧౧౪౧

ఉ. అంటకు మింక నన్ను దురి♦తాత్మిక! పో మ్మటు, నీదు మోమునున్
గంట కసహ్య మయ్యెడిని ♦ గా విఁక బాంధవి, భార్య గావు, నీ
యుంట సహింప నోప, విను ♦ మురివిని నీయును ఉండుదాఁక ని
న్నంటినవారు నాకహితు ♦ లట్టులె నేనును వారి కిం కిటన్. ౧౧౪౨

ఆ. కేవలార్థపరవు ♦ క్లిష్టధర్మవు నీవు, గాన నగ్నిసాక్షి♦కముగఁ గొనిన
తావకీనకరముఁ ♦ దద్దయు విడిచితి, నిందు నూర్ధ్వలోక♦మందుఁ గూడ. ౧౧౪౩

1 సెజ్జ – శయ్య.

కం.భరతుం డీరాజ్యముఁ గొని, మురియుట కలిగినను వాఁడు ♦ మొగిని నివాపా
చరణం బొనరుపఁ దండ్రికిఁ, బరగతి నవి నాకుఁ గాక ♦ పరఁగుత మనుచున్
ఉ. ధూళిని బ్రుంగియున్నపతిఁ ♦ దోయజలోచన రామమాత దాఁ
గాలువ గట్టునశ్రువులఁ ♦ గన్నులు మూఁత వడంగఁ బాచుకొం
చోలిని దోడుకొం చరిగె ♦ నుర్వరభర్త సుతుం దలంచి తాఁ
గేలను నిప్పు నంటినటు ♦ కీర్తితు బ్రాహ్మణుఁ జంపినట్టులై ౧౧౪౫
ఆ. సొక్కి మరలి మరలి ♦ చూచుఁ దే రరిగిన,జాడ గ్రస్తుఁ డైన♦సవితృనట్లు
మాఱుపడఁగ రూపు ♦ మఱి మఱి పలవించుఁ, బుత్రుగవనుదాఁటి♦పోక యెఱిఁగి.
కం.కొడుకును గొని పఱచెడిత, త్తడి[1]మిన్నలయడుగు లివిగొ ♦ ధరఁ గనఁబడెడిన్
కొడు కే కనరాఁడే యెటు, మిడుకుదునో సుకృతిఁ బాసి ♦ మేదినిమీఁదన్.
ఉ. హాయి నలంది గంధము మ♦హార్హల్లు చేడెలు వీచు చుండ భ
వ్యాయతతల్పమందు సుఖ♦మై నిదురించెడి నాతనూభవుం
డేయెడ వృక్షమూలమున ♦ నేగతిఁ దా దెసమాలి కట్టెయో
చేయియొ తాయొ దిండుగను ♦ జేసి ధరం బడి యుండు వాఁ డొకో. ౧౧౪౭
తే. వందిమాగధనుతులను ♦ వాద్యములను
మేలుకొనువాఁడు కృపణుఁ డై♦ధూళి దులుపు
కొనుచుఁ బ్రస్రవణాంతిక♦కూటములను
లేచును వశాళి యూథపు♦లీల సుతుఁడు. ౧౧౪౮
ఆ. త్రిజగములకు విభుఁడు♦ దీర్ఘబాహుఁడు పట్టి, దిక్కు లేనివాని♦ తెరువు దోఁప
నడవిఁ బడుచుఁ బోవ♦ నటవీచరుల్ జనుల్, గన్నులారఁ గాంచ ♦ నున్నవారు.
చం.వల దన మాన దయ్యె జన♦వందిత యోజనకేంద్రకూఁతు, రా
కలికి సదా సుఖోచిత స♦కంటకభూములఁ బోవు చుండు, న
చ్చెలువ యరణ్య మే మెఱుఁగుఁ ♦ జేప్పడి భీతిని శ్వాపదాళికూఁ
తలకుఁ దలంకుఁ బెన్గలఁకఁ ♦ దత్తఱ మందు గభీరహుంకృతిన్. ౧౧౫౧
కం.ఓవిధవా! రాజ్యంబును, నీవే తలఁ గొట్టుకొమ్ము ♦ నీయిష్టము మై
నావనజనేత్రుఁ బాయుట, జీవింపఁగ నొల్ల గడియ♦ సేపును గైకా. ౧౧౫౨
కం.అని పలవించుచు జనపతి, జనసంఘము వెంట రాఁగఁ ♦ జనియె నరిష్టం
బు నగుపురంబునకును దా, వనట మృతస్నాతుఁబోలి ♦ వస మఱి మఱియున్.
చం.జనములు లేనిగేహములు ♦ చావడులున్ బలహీనలోకరో
దనములు మూఁతలుం బడిన♦దైవతకూటము లాపణంబులున్

---

[1] తత్తడిమిన్నలు = ఉత్తమములైన గుఱ్ఱములు.

గనుఁగొన నెందునే నొకఁడు ♦ గాఁగ మహాపథమంద తోఁపఁగా
మనుజవరుండు చూచుచు స్వ♦మందిరముం జొరఁ బొఱ నేడ్చుచున్. ౧౧౫౪
తే. గరుడహృతపన్నగం బయి ♦ క్రాలునట్లు,భీతమగుప్రాదంబుచొచ్చినగతిని,సవిత
మబ్బుమాటున కరిగిన♦మాడ్కి సుతులు, సీతయును లేనియింటిని ♦ జేరి యచట
తే. గద్గదస్వరయుక్తుఁ డై ♦ క్షోణివరుండు, మృదులమందార్థవాక్యుల ♦ నీ రెలుంగు
తోడ ని ట్లనుఁ గనుఁగొని ♦ తోడివారి, నాకు నిచ్చట నిలువ మ♦నంబు లేదు.

దశరథుఁడు కౌసల్యాగృహమునకుఁ బోవుట.

కం. తీసికొని పొండు స న్నిఁకఁ, గౌసల్యాగేహమునకుఁ ♦ గలుగదు హృదయా
శ్వాసం బొండెడఁ గడువి,శ్వాసంబునఁ జూచు రాము♦జననియ నన్నున్. ౧౧౫౬
కం. అన మార్గదర్శకులు స,ద్వినయంబున రాముజనని♦వీటికిఁ గొనిపో
యిన నచటఁ బడియుఁ దల్పం,బున లుళితమనస్కుఁ డగుచుఁ ♦ బొక్కుచు తేఁడున్
కం. కొడుకులు నిద్దఱుకొడుకులు, వీడినయవ్వీడు విగత♦విధు వగునభముల్
జూడఁ గని బావు వెత్తుచు, వీడితెరామా! యటంచు ♦ బిగ్గర నేడ్చెన్. ౧౧౫౮
కం. సేమమున మరలి వచ్చిన,రామునిఁ గని కౌఁగిలించి ♦ రమణిఁ జెలఁగఁగా
నీమహి నంతకు బ్రదికెడి,యామహితాత్మకులె ధన్యు ♦ లవురా యనుచున్ ౧౧౬౦
ఆ. పొరలి పొరలి మిగులఁ ♦ బొక్కు చుండఁగ నిట్లు,రాజుపాలి కాళ♦రాత్రి నాఁగ
రాత్రి వచ్చె; నర్ధ♦రాత్రంబువేళను, నాతఁ డనియెఁ గోస♦లాత్మజకును. ౧౧౬౧
చం. వినఁ గదె రామచంద్రు వెను♦వెంటను బోయిననాదుచూపు లా
ఘును విడనాడి యిప్పటికిఁ ♦ గ్రమ్మఱి రా, నటుగాన నిన్ను నేఁ
గనుఁగొన నేర నగ్యోదను ♦ గాంతరో! దాపునఁ జేరి నీకరం
బున నను నంటు లెస్స యనఁ ♦ బొక్కుచు నుగ్గలి చేరి నాథునిన్ ౧౧౬౨

కౌసల్య రాముని దలచి దశరథుతోఁ జెప్పుకొని యేడ్చుట.

తే. కడుపుదుఃఖంబునను దన♦కాంతుఁజూచి, పలుకుఁ గౌసల్య:శ్రీరామ♦భద్రుమీఁదఁ
గ్రక్కి కౌటిల్యవిష మెల్ల ♦ కైక కుబుస, మొడలఁ బన్నగసతి యన ♦ నెలమిఁగనియె.
కం. రాము నిలువెడల నడుచుటఁ, గామిని కైకేయి లబ్ధ♦కామయి నగుటఁ
ధామమునందలి నాగుం,బొ మన వెఱ పెట్టనను నృ♦పాలక మిగులన్. ౧౧౬౪
ఉ. అక్కట బిచ్చ మెత్తి తిని ♦ యాసనతాలికి దానుఁ డైసుతుం
డొక్కట నింటిలోనఁ బడి ♦ యుండఁగ నిచ్చిన లెస్స గాదె, నీ
వక్కలకంఠి కట్టివర ♦ మాదట నీయఁగరాదె, రాజ్యముల్
దక్కకయున్న మానె గుణ♦ధన్యుఁడు కానల కేల పోవఁగన్?, ౧౧౬౫

ఉ. అకట! యాహితాగ్ని యగు♦నాతఁడు దర్శలఁ బూర్ణమాసలన్
బ్రాకట మైననిర్జరుల♦పాలిహవిస్సును రాక్షసావళుల్
గైకొన నిచ్చిన ట్లిపుడు ♦ కైక కొసంగి యథేచ్ఛ మీవు సు
శ్రీకము రాజ్యముల్ సుతుని ♦ జ్యేష్ఠు గుణిన్ వెడలంగఁ గొట్టితే. ౧౧౧౬

కం. కేల శరాసముఁ దాలిచి, యాలును దమ్ముండుఁ దోడ ♦ నరుదేర వనీ
పాళిని గజపతిగతి నీ, కాలలనాథుఁడు చొచ్చుఁ ♦ దా నింతటికిన్. ౧౧౧౭

కం. వనవాసదుఃఖ మిట్టిది, యని యెఱుఁగనివారిఁ గైక♦యనుమతి నీ వా
యనఘులఁ గానల నెట్టితి, కన నయ్యెడ వార లేమి♦గతి పట్టెదరో. ౧౧౧౮

కం. ఎలప్రాయపువారల సుఖ,ఫలకాలమునందు నెడలఁ ♦ బాపితి నయ్యో
ఫలమూలాశనులై యే,చెలువున జీవించువారు ♦ చెపుమ యనద్లై. ౧౧౧౯

కం. రారాదా రాముఁడు సహ,దారుం డై యనుజుతోడఁ ♦ దటుకున నిపుడే
కారాదా నాదుఃఖం, బారఁగ నశియింపఁ జేయ ♦ నద నిది శుభ మా. ౧౧౨౦

సీ. ఎప్పుడు వత్తురో ♦ తెప్పున మేల్కాన్న,రమణ నయోధ్యాపు♦రంబునకును
నెప్పు డెత్తుదు రొకో ♦ యెల్లెడ హృష్టులై, తోరణధ్వజము లీ♦యూరిజనులు
ఎప్పుడు పొంగునో ♦ యిప్పుర మెల్లను, బున్నమనాఁటియం♦భోధిపగిది
నెప్పుడు తే రెక్కి♦యే తెంచు సీతతో, నావు వెన్కానుకోడె♦యనఁగ సుతుఁడు

తే. ఎప్పుడో కో రాచబాటల ♦ నీపురంబుఁ, జొచ్చి వచ్చెడు నాముద్దు♦సుతులమీఁద
జనసహస్రంబు లాజలఁ ♦ జల్లఁ గనులు, చల్లగాఁ గందు నాకుందు♦సమయుచుండ. ౧౧౨౧

కం. సురుచిరకుండలయుతు లై, దరకరనిస్త్రింశచాప♦ధరులై శిఖర
స్ఫురదవనీధరము లనం, బురిఁ జొచ్చెడిసుతులఁ జూచు♦పుణ్యం బెపుడో. ౧౧౨౨

చం. కనుఁగొను టెన్నఁడొక్కొ ద్విజ♦కన్యలు పుష్పఫలాళిఁ జేతులం
గొని ముద మారఁగాఁ బురికిఁ ♦ గోర్కి చెలంగఁ బ్రదక్షిణించుటల్;
ఘనపరిపక్వబుద్ధి, శుచి♦కాంతుఁడు ప్రాయమునందు, నోరు మె
త్తనిముగుదుండు, వానిముఖ♦తామరసం బెటు గాంచు టబ్బునో. ౧౧౨౩

కం. మూఁడేండ్లముద్దుబాలుని, పోఁడిమి నాస్రొ్మాల సుతుఁడు ♦ పొడకట్టఁగ నే
నాఁడు కనులారఁ గందునొ, యేఁడీ రాముండు తనయుఁ ♦ డేఁడీ నాకున్. ౧౧౨౪

ఉ. సందియ మింత లేదు తొలి♦జన్మమువేళను నేను దల్లు లా
నందముతోడఁ బ స్తుడుప ♦ నందనులం గడునీచురాల నై
కందులనోటిచన్నులను ♦ గండలక్రొవ్వునఁ బాయఁ జేసితిన్
దంపడియాయఘం బిటులు ♦ దారుణభంగిని నన్ను బ్రింగెడిన్. ౧౧౨౫

సీ. సింహంబుచేత హింసితవత్సగోవు వి,వత్స యైనట్టులు ♦ వత్సల యగు
నేను గైకేయిచే ♦ నీగతి సుతహీన, నైతి నింకే మని ♦ యనుకొనంగ
సద్గుణజుష్టు ♦ సఖిలశాస్త్రాభిజ్ఞు, విడి యేకపుత్త్రుని ♦ మిడుకు లెట్టు
లే మని బ్రదుకుదు ♦ నేగతి బ్రదుకుదు, నానెఱసరి నిష్టు ♦ గాన కున్న
తే. మందు పేసంగి నెట్లు మా♦న్తాండు డెల్ల, యుర్విరను గరవాడిసు♦యూఖములను
బ్రేచు నాగతి నాదుళ♦రీర మెరియఁ, జేయు చున్నది సుతశోక♦జాయతాగ్ని.

→ సుమిత్ర కౌసల్యకు శోకోపశమనంబు సేయుట. ←

కం అని వగచెడికౌసల్యా,వనితామణిఁ గాంచి ధర్మ♦పథవర్తిని యి
ట్లనియె సుమిత్ర సధ్వము, సనయంబుగ నీకు నేల ♦ సంతాపింపన్. ౧౧౭౭
చం.అనుపమసద్గుణుండు నవ♦రాజితుఁడుం బురుషోత్తముండు నీ
తనయుఁడు, వానికా కృపణ♦తన్ విలపించెద వార్య యిట్లు? దా
వనములకేగు టెల్ల జన♦కస్యుని దం,త్రిని సత్యవాదిఁ జే
యన కదె? దానికై వగన ♦ న్యాయమె చెప్పుమ ధర్మమానసా? ౧౧౭౮
కం.పెద్దలు మోక్షముకొఱకై , తద్ద నడచు చుండు నట్టి♦ధర్మపథమునన్
ముద్దులసుతుఁడును నడచెను, నద్దీ దోసంబు దీన ♦ నేటికి వగవన్? ౧౧౭౯
ఆ. అప్రమాదుఁ డగ్రి ♦ యఖిలభూతములజా, లములఁ గరుణ గలఁడు ♦ లక్ష్మణుండు
నుత్తముండు న ♦ నున్నవాఁ డన్నహా,త్మునకు నదియె లాభ♦మును ఘటించు.
కం.వనవాసంబున నెఱిఁగెడు, జనకజ సుఖశీల యెఱుఁగఁ♦ జాలకయూ తాఁ
జనియో? నను సెంచకు మీ,తనయుని ధర్మాత్ముఁ గొలుచు♦తమిఁ దోన చనెన్.
కం కీర్తిధ్వజ మెల్లెడలఁ బ్రసరింపఁగఁ జేయు జగతిఁ ♦ బ్రభుఁ డగువిలస
న్మూర్తి వ్రతసత్యధర్మ,సూర్యుఁ డీనుం డతని కేల ♦ పౌనరుం గొదవల్. ౧౧౮౨
సీ. ఆరాముశుచితాను♦భావంబు లెంతయు, నెఱ్ఱంగంబు లగుటను ♦ వనజహితుఁడు
దనకిరణంబులఁ ♦ దాపంబుఁ గూర్పఁడు, వానికిఁ గానన♦వాటులందు
యుక్తశీతోష్ణమై ♦ యొప్పగఁ గస్పని,మందవాయువు సుఖ ♦ మంద వీచు
శయనించునప్పుడు ♦ జనకునొప్పుడు మిహి,కాంశుఁడు కరముల ♦ నంటి మిగుల
తే. హర్ష మొనఁగూర్చు, నాశం♦రామరారి
తనయు నధియింప మెచ్చి వి♦ధాత యొసని
కిచ్చె దివ్యాస్త్రములు నాయు♦హీనసమ్మ్వఁ
డుండు నట లెస్స యింటిలసుం ♦ దున్నయట్లు. ౧౧౮౩
తే. పనిశరములమార్గంబు♦లోన గోచ,రించుమార్గురు ముట్ట న♦శించునార
లట్టివిక్రమశాలి సీ♦మట్టి; వాని,యాజ్ఞ నర్తింప కెటు లుండు ♦ నఖిలధరణి సౌర

తే. బలము శౌర్యంబు కాంతిసం♦పదయు నెపుడు
వెలుఁగు నెవ్వానియందు నా♦వీరవరుఁడు
కాననావాసముననుండి ♦ క్రమ్మఱంగ
వచ్చి తూర్ణంబ పాలించు ♦ వసుధ యెల్ల. ౧౧౮౫

ఉ. భానునకుం బ్రభాకరుఁడు ♦ పావకపావకుఁ, డెల్ల శ్రీలకుం
దా నగు శ్రీ, ప్రభుండు ప్రభు♦నాయకకోటికిఁ, గీర్తి కీర్తికిన్
మానుగ వేల్పువేలుపు, క్ష♦మాక్షమ, భూతతతిం బ్రభూత మా,
వానికి లోవ ముండు నొకొ ♦ పట్టనమందున యేని కాననేన్? ౧౧౮౬

ఉ. శీలవతీమణీ! సుతుఁడు ♦ చెచ్చెరవచ్చి ధరాధరానుతా
శ్రీలను గూడి వేడ్క నభి♦షేకము ముఖ్యరితోడఁ గైకొనన్
జాలుగబాష్పపూరములు ♦ జాఱ నవారిగ లోచనంబులన్
హాళిని లోకులెల్లరుఁ గ♦నంగలవార లపాస్తశోకులై. ౧౧౮౭

కం. భామహితుని నపరాజితు, స్వామిని గుశచీరధరుని ♦ బద్మాలయ నా
భూమిసుత యనుగమించెను, రామునకును దుర్లభంబు♦గ్రాలునె యెందున్.

కం. భీమధనుర్ధరసత్తముఁ, డో మహిళా! ఖడ్గమార్గ♦ణోగ్రుఁడు నడువన్
దా మున్నుగ లక్ష్మణుఁ డా,రామునకును దుర్లభంబు ♦ గ్రాలునె యెందున్.

కం. ఒట్టగు శపథం బగు నీ,పట్టి యరణ్యంబునుండి ♦ వచ్చిన మరలన్
దొట్టినముదమునఁ జూచెదు, కట్టా శోకంబు మోహా♦కరిమయు విడుమీ. ౧౧౯౦

కం. ఘనునీపదములఁ బడి యో, మానిని! నీతనయుఁడే న♦మస్కృతిఁ జేయన్
జానుగ నుదితాబ్దునివలెఁ, గానం గల వేల నీకుఁ ♦ గాఁతియపడఁగన్. ౧౧౯౧

కం. క్రమ్మఱి పురికి న్వచ్చి ను,ఖమ్ముగ నభిషిక్తుఁ డైన♦గాదిలిపుత్రున్
నెమ్మది నానందాస్రులు, గ్రమ్మఁగఁ గనులారఁ జూడఁ ♦ గలవు సుశీలా. ౧౧౯౨

కం. శోకింపకు మమ్మా దుః,ఖాకుల విటు గాకు పుత్రు ♦ నందవు కీడుల్
వే కాంచెదు సహలక్ష్మణు, శ్లోకన్యాసహితు రామ♦చంద్రుని నిచటన్. ౧౧౯౩

కం. ఇందఱ నూరార్పఁగ నీ,కుం దగ వగుఁ గాక నీవ ♦ కోమలి వగపుం
జెందఁగ నిన్నూరార్పఁగ, నిం దెవ్వరు గల రిదేమి ♦ యేడ్చెద విట్టుల్. ౧౧౯౪

కం. రాము జనయిత్రి వై గుణ,ధామా! దుఃఖింప నీకుఁ ♦ దగునే చెపుమా
రామునికంటెను వే ఱొకఁ, డీమహి సన్మార్గవర్తి ♦ యేఁడీ లేఁడే. ౧౧౯౫

ఆ. వందమానుఁ డైన♦నందను సహమిత్రుఁ, గాంచి కూర్మిపుత్రుఁ ♦ గన్నులారఁ
గారు[1] నందు నీరు ♦ గార్చు మబ్బన హర్ష,జలకణాళి విడువఁ ♦ గలవు నీవు. ౧౧౯౬

---

[1] కారు = వానకాలము.

ఉ. వైళమ వచ్చి త్వచ్చరణ♦వారిజముల్ దనమెత్తచేతులన్
వాళిని బట్ట సీతనయుఁ ♦ డాతనిశీర్షముమీఁద నశ్రువుల్
శైలముమీఁదఁ గార్త్రొయిలు♦లాగునఁ జాలుకొనంగఁ జేయఁగాఁ
జాలెద వీవ, యిప్పగిది ♦ జాలిఁబడం బని యేమి చెప్పుమా. ౧౧౯౮

కం.ఈసరణినుడులచే నా,శ్వాసింప సుమిత్ర పెక్కు♦చందంబుల నా
కౌసల్య శోక మంతం, బాసెను శరదల్పవారి ♦ వారిద మనఁగన్. ౧౧౯౯

## ⟡ శ్రీరాముఁడు పౌరులను మరలి పోవఁ బ్రార్థించుట. ⟡

సీ. అక్కడ శ్రీరాముఁ ♦ డడవిమార్గముఁ బట్టి, చనుచుండ ననురక్తి ♦ జనము లెల్ల
రథము వెంబడిఁ బోవ ♦ రాజును సచివులు, వల దని వారింప ♦ వారు వినక
పోవుచు నుండిరి ♦ పురమునవారికి, నతులయశస్వి రా♦కాబ్జునట్టి
వాఁడు పౌరులుదన్ను♦'వలదయ్యవలదయ్య, మరలుమంచును వేఁడ♦మరలఁడయ్యెఁ
తే. దనదుజనకుని సత్యవా♦దిని నొనర్ప, నిట్లు పోవుచుఁ దనవెంట ♦ నేగుదెంచు
ప్రజల నెల్లరఁ దనకన్న♦ప్రజలయట్లు,స్నేహమునఁ జూచి యను రఘు♦శేఖరుండు.

కం.నాయందలిమీప్రీతియు, నాయందలిగౌరనంబు ♦ నయగుణులారా
చేయుఁడు భరతునియెడ మీ, రాయదియే నాకుఁ గడుఁబ్రి♦యం బగుఁ జుండి.

తే. అతఁడు కైకసుతుండు క♦ల్యాణచరితుఁ
డారఁ బ్రియము హితం బగు♦నవియ యెల్ల
మీకు ఘటియించు నెద మెర♦మెర విడుండు
ఏదఁడు మీమీగృహములకుఁ ♦ బౌరులార. ౧౨౦౧

కం.వినుఁడు వయస్సున బాలుం,డును జ్ఞానమునందు వృద్ధుఁ♦డును మృదుగుణుఁడున్
ఘనవీర్యవంతుఁ డాతం, డనురూపపుభర్త మీకు ♦ నగు భయ మేలా. ౧౨౦౨

కం.రాజగుణలక్షితుఁడు యువ,రాజుగ నియమింపఁబడె భ♦రతు డటుగానన్
రాజాజ్ఞ కార్య మగుఁగా, యోజింపుఁడు నాకు మీకు ♦ నున్నజనులకున్.[1] ౧౨౦౩

ఉ. నాకుఁ బ్రియంబు సేతయు మ♦నంబున మీకు రుచించు నేని యో
లోకులు! నే నరణ్యముల♦లోఁ జరియించెడివేళఁ దండ్రికిన్
శోకముఁ గుందు లేనిగతిఁ ♦ జూచికొనుం డని చెప్పఁ జెప్ప ధ
ర్మైకరతాత్మ భూపతిగ ♦ నందఱుఁ గోరిరి రాము నయ్యెడన్. ౧౨౦౪

కం.ఎంతెంత జనకతనయా, కాంతుఁడు ధర్మంబునుండి ♦ కదలఁడో లిరుఁడై
యంతంత పౌరులును భూ,కాంతునిఁగా రామవిభునిఁ ♦ గాంక్షించి రెదన్.

కం.కన్నుల బాష్పము లురల, న్విన్ననిమోమునను వచ్చు♦నిఖిలజనములన్
బ్రన్ననితనగుణముల నా,యన్న సలక్ష్మణుఁడు గట్టి ♦ యాకర్షించెన్. ౧౨౦౬

---

[1] ఉన్నజనులు = ఇతరజనులు.

కం. జ్ఞానవయస్తేజముల న,నూనంబుగ వృద్ధులైన♦యుర్వీజనముల్
మానక తల వడఁకెడివా, రీనెఱి వెను చిక్కి యనిరి♦ యిలుఁ గ్రొత్తి వ్యథన్.

ఉ. ఓరఘురామ మోసికొని♦యుద్గతిఁ బోయెడిజాతివాజులా
రా! రమణుల్ వివాసిగ న♦రణ్యముకై కొనిపోదు రే యిటు
ల్క్రూరజవంబుమాని మర♦లుం డిఁకఁ బోకుఁడు, దాఁటఁ జెప్పనీ
తారమణుండు పృష్ఠలపి♦తంబులు[1] మీ రిటు మీఱఁ జెల్లునే. ౧-౨౦౯

తే. కర్ణవంతము లయినమృ♦గంబులందు, గుఱ్ఱములె శ్రేష్ఠములు గదా ♦ కోర్కి గలిగి
యెన్నఁ డెవరిని వేఁడమ ♦ యిట్టిమేము, మిమ్ముఁ బ్రార్థించెదము వేగ♦క్రమ్మఱుండు.

కం. వీరుఁడు ధర్మైకసదా,చారుఁడు పూతుండు రామ♦చంద్రుం డతనిన్
మీరలు పురకిని గొనిరా, కారణ్యతలాళి విడువ ♦ నరిగెద రేలా? ౧-౨౧౦

పౌరవృద్ధులు శ్రీరామునిఁ బురికి రాఁ బ్రార్థించుట.

చం. అని ప్రలపించుసద్ద్విజుల♦యార్తనినాదము లాలకించి గ్ర
క్కున తనభార్య దమ్ముఁడు ది♦గం దనతోడ రథంబుఁ గాల్నడన్
జనియెను సన్నికృష్టపద♦చారములం దన వెన్క నున్నయా
జను లెయిదన్, రథస్థుఁ డయి ♦ సాధ్యము గామి మరల్ప వారలన్. ౧-౨౧౧

కం. తేరిన్ డిగ్గియుఁ గాల్నడ, చారిత్రనువత్సలుండు ♦ చనఁగఁ గృపాఢ్యున్
జేరి యిటు లనిరి ద్విజు లో,శ్రీరామా యిట్లు సేయఁ ♦ జెల్లునె నీకున్. ౧-౨౧౨

సీ. బ్రహ్మణ్యుఁ డగునిన్ను ♦ బ్రాహ్మణ్య మిది యెల్ల, వెనుకొని వచ్చెడిఁ ♦ గనఁగ నయ్య
యరణులయందు స♦మారోపితంబులై, యగ్నులు వచ్చె ద్వి♦జాంసములను
వాజపేయాధ్వర♦ప్రాప్తాతపత్రముల్, శరదభ్ర గతి వచ్చు♦జాడఁ గనుము
ఛత్రహీనత నీవు ♦ సంతాప మిటు లేల, పొంద నెండకు దివ్య♦సుందరాంగ

తే. యస్మదీయంబు వాజపే♦యార్జితంబు, లయినగొడుగులు పట్టెద ♦ మయ్య వాని
చాయలను రమ్ము వేదాను♦సారిణి మతి, వనుల నీతోడఁ దిరుగంగ ♦ వాంఛపడియె.

కం. పాతివ్రత్యసురక్షిత, లౌతరుణులు నిలుచువార ♦ లాలయములలోఁ
బూతాస్మత్పరమార్థము,లై తగు వేదములు నిల్చు ♦ నాత్మల మాకున్. ౧-౨౧౪

ఉ. మానఁగదయ్య నీహృదయ♦మార్గము, మామతినిశ్చయంబు ని
ట్లౌను గదయ్య, మామనవి ♦ యారయ కీవ యుపేక్ష సేయుచున్
దీనికి మేలిధర్మమును ♦ దేని నొనర్పఁగఁ జూచె? దీవ యి
ట్లైనను విప్రవాక్యమును ♦ నారయువా రెవ రింక ధారుణిన్? ౧-౨౧౫

[1] లపితంబులు = మాటలు.

కం. తల వణఁకాడఁగ వెలిగు, వ్వలఁబోలిన నరల[1] నొప్పు♦వారము నిఁక జాఁ
గిలిపడి యీదుమ్మున ని, శ్చలశీలా! వేఁడెదము మ♦రల్పుము తేరిన్. ౧౨౧౬

కం. ఇం దరుదెంచినసద్ద్విజు, లెందఱొ యజ్ఞముల కూని♦రెల్లను సిద్ధం
బందునకు నవి సమాప్తిం, బొందించుట నీవశంబ♦పుణ్యచరిత్రా. ౧౨౧౭

తే. జంగమాజంగమంబు లౌ♦సకలభూత
తతులు నీయందు భక్తిమం♦తములు నూవె
వేఁడుకొను చున్నభక్తుల♦విషయమునను
గరుణ చూపుము మదిఁ దేఱి♦ ఖలవిదారి. ౧౨౧౮

ఉ. వేరులు నేలఁ బాఁతికొన♦ వెల్వడి నీబడి రా సమర్థతా
దూరము లై కుజంబు లవె♦తోయజలోచన! నిన్నుఁ జూచుచుం
బోరులఁబోలె మమ్ము నెడఁ♦బాసెదవే రఘురామ యంచుఁ దా
మూరక గాలివేగమున♦ హా! రని యేడ్చుచు నున్న వక్కటా. ౧౨౧౯

తే. సర్వభూతానుకంపి వై♦ జరగునిన్నుఁ, గదలమెదలక యాహార♦కలన లేక
చెట్లకొమ్మలయంద ని♦శ్చేష్టితాండ, జాళి యాచించుచున్నవ♦ల్లదిగోఁ గంటె.

→ శ్రీరాముఁడు తమసానదీతీరముఁ జేరుట. ←

తే. అనుచు రాము మరల్ప నా♦యఖిలజనము, యాచన యొనర్ప శ్రీరాము♦నడ్డగింప
వచ్చెనో యనఁ దమస య♦న్వాహిని యట, నడ్డముగ వచ్చెవారల♦యరుగుత్రోవ.

ఉ. అంత సుమంత్రుఁ డచ్చట హ♦యంబులఁ దేరిని బాపి మార్గవి
శ్రాంతి దొలంగ నీరములఁ♦ ద్రాపియు మేపు నొసంగి మేని నా
ద్యంతముఁ దోమి కొంతవడి♦ య ట్టిటు త్రిప్పుచు నుండ జానకీ
కాంతుఁడు సీతఁ జూచుచును♦ గాదిలితమ్మునితోడ ని ట్లనున్. ౧౨౨౨

కం. మన కాననయాత్రావ్రత, దినములలో నిదియ మొదటి♦దిన మరిగెడి నో
యనఘా చేరితి మడవియు, వనవాసం బెట్లొ యనుచు♦ వగవకు మన్నా. ౧౨౨౩

కం. మన్యువున నెలవులకుఁ జను, వన్యమృగవిహంగమాది♦వర్గంబులచే
శూన్యాటవు లేడ్చెడి క్రియ, మాన్యగుణా! తోఁచు చున్న♦మార్గము కంటే.

ఉ. అక్కట మామకీనజన♦కానుపమోజ్జ్వలరాజధానిలో
మక్కువ నెంచుచుం మనల♦ మానవతీపురుషాళి మిక్కిలిం
బొక్కుచు నుండుఁగా! సతత♦ముం భరతుం బినతమ్ము నిన్ను న
న్నక్కటికంబుతోడ వసు♦ధాధిపునిం బ్రజ ప్రేముడించెడిన్. ౧౨౨౫

చం. జనకుఁ దలంప దుఃఖ మగు♦సాధ్వి యశస్విని వృద్ధ యైననా
జననిఁ దలంప గుండియలు♦ఝల్లు మనుం జుమి యంతకంతకుం

[1] నరలం — నరసిన వెండ్రుకలచేత.

గొనకొని యేడ్చి యేడ్చి కడు♦ఘోరముగాఁ గనుదోయి వాఁచఁగా
జనకులు చీఁకు లాదు రొకో ♦ సందియ మయ్యెఁ గదయ్య లక్ష్మణా. ౧౨౨౬

చం. కలఁడు గదా సుధీరతుఁడు ♦ కైకతనూజుఁడు తల్లిఁ దండ్రిఁ దా
నలమట పొందకుండ నట ♦ నాదర మారఁగ నూఱడింపఁగాఁ
దలఁచి మఱిఁ మఱిఁ భరతు♦ధర్మరతత్వదయార్ద్ర బుద్ధులన్
దలర నొకింతయేని తలి♦దండ్రులపట్ల నెడంద లక్ష్మణా. ౧౨౨౭

ఉ. మే లొనరించి తీవు నిటు ♦ మేకొని నాబడి వచ్చి యీయర
ణ్యాళిని సీతఁ గావఁగ స♦హాయుఁడ వౌటను, నేఁటిరేయి యిం
దే లలి వన్యమూలము ల♦నేకము లుండియు నీరుమాత్రమున్
గ్రోలి యుపాస ముండెదను ♦ గోరిక యయ్యెడు నట్లు సేయఁగన్. ౧౨౨౮

కం. అనుచు సుమంత్రుం గనుఁగొని, యనఘా గుఱ్ఱములఁ జూడు ♦ మవధానిత నాఁ
జని ప్రొద్దు గ్రుంక వాజుల,కును నీరును మేపు వెట్టి ♦ కొద లే కుండన్ ౧౨౨౯

ఉ. ఆరసి మ్రొక్కి సంధ్యకును ♦ నాతఁడు లక్ష్మణుతోడ నానదీ
తీరమునందు నాకులను ♦ దీర్పఁగ శయ్యను బ్రీతియుక్తుఁడై
చేరె రఘూద్వహుం డచటఁ ♦ జేడియతోఁ బినతమ్ముతోడుతన్
గూరిమి; నన్నయున్ పదినె ♦ కూరుకు చెందిన యంత వారలన్ ౧౨౩౦

ఉ. చూచి సుమంత్రుతో ననియె ♦ సూరకులాగ్రణి లక్ష్మణుండు కం
టే పడి యున్నవారు నవ♦నీరజనేత్రులు సౌఖ్యపాత్రు లం
చీపగిదిన్ రఘూత్తము న♦హీనగుణంబులు సెప్ప మూయ కె
న్నోపలుకాడు చుండఁగనె ♦ యుగ్రకరుం డుదయింప నున్నడన్. ౧౨౩౧

తే. గోకులాకులతీర మై ♦ కొమరుమీఱు, నల్లతమసానదీతీర♦మందుఁ బౌర
జనులతోడుత నారాత్రి ♦ సంవసించె, నాలుఁ దమ్ముండుఁ గొలువ గుణాకరుండు.

## శ్రీరాముఁడు పౌరుల మోసగించి పోవుట.

ఉ. అంతట మేలుకాంచి యట ♦ నంతట సంతట నిద్దురం బడి
శ్రాంతిని గూరి యున్నజన♦సంఘములం గని కంటె లక్ష్మణా
యెంతలు పుట్టె నాస విడి ♦ యిండ్లపయిన్ మనమీఁది ప్రేమ నీ
గుంతల మిట్టలం బడియుఁ ♦ గూర్కెరి చెట్లమొదళ్ల నీజనుల్. ౧౨౩౩

చం. వలవదు పూర్వస్థ్యీ, మేఁ బురికి ♦ వచ్చెదువాఁడను గాను, బొం డనం
దొలఁగరు వెంబడిం బడిరి ♦ నొక్కివచించితి నేని ప్రాణము
ల్వోలఁ గెడివారు నిక్క మిది ♦ లోకులు నిద్దుర గూరి యుండఁగా
మెలసి రథంబు నెక్కి వన♦మేదిని నిర్భయ మార్గసీమలన్ ౧౨౩౪

తే. పోదమా వీరలెల్లరు♦నాదమఱచి, నిద్రఁగూరిరియిఁక నిట్లు♦నిద్రఁగొనరు [గొనఁగ
ప్రజల స్వకృతంపు దుఃఖంబుఁ♦బాపవలయు, నృపుఁడు; నాకయి వీరేల♦నెగులు
ఉ. మేలు త్వరం జనంగ నన♦మేకొన నావచనంబుఁ దమ్ముఁ డా
వేళ సుమంత్రుఁ జూచి పృథి♦వీతనయాపతి పల్కెఁ దేరి ఘ
ట్టాలను బూన్పు మేలుకొని♦ఱం పౌనరింపకమున్న యీ ప్రజల్
లీలగ దాఁటి పోవుదము♦లె మ్మన నాతఁడు నట్లు చేయుచున్ ౧౨౩౬
ఉ. ఆయిత మయ్యెఁ దేరు మహి♦తాత్మక నీవు సలక్ష్మణుండ వై
జాయను గూడి యెక్కు మనఁ♦జయ్యన నాతఁ డొనర్ప నట్ల య
త్యాయతవేగ మైనతమ♦సాపగ దాఁటఁగఁ దోలె సాది యం
దాయనఘుండు కాల్నడ మ♦హాపథముం గని చొచ్చి యయ్యెడన్ ౧౨౩౭
ఉ. పౌరుల మోసగింప నిటు♦పల్కె సుమంత్రునిఁ జూచి నీవొకం
డే రథ మెక్కి తూర్ణముగ♦నేగుమ యుత్తరదిక్కుగాఁ, గడున్
దూరమునందునుండి పెఱ♦త్రోవను గ్రమ్మఱు మెట్టు లైన నీ
పౌరులు మమ్ముఁ గన్గొనని♦భంగి నొనర్పు సుమంత్ర! నావుడున్ ౧౨౩౮
చం. పనివిని యట్ల చేసి రఘు♦వల్లభు నాతఁడు డాయ వారుఁ జ
య్యన రథ మెక్కి సారథి ప్ర♦యాణశుభైకనిమిత్త దర్శనం
బునకయి యుత్తరంబుగను♦ముందుగఁ దేరిని ద్రిప్పి పిమ్మటన్
వనులకు నేగుమార్గమున♦వాజులఁ దోలె జనంబు మీఱఁగన్. ౧౨౩౯

↞ పౌరులు రాముని గానక దుఃఖించుట. ↠

ఉ. ఆవలఁ బ్రాత లేచి జను♦లందఱు రాముని గాన కార్తిచే
దేవుసు నొంది మూర్ఛలను♦ద్రెళ్లుచుఁ గన్నుల నీరు గాఱఁగా
నీవల నావలన్ వెదకి♦యెందును వారలజాడ లేమి దుః
ఖావిలచిత్తు లై రఘువ♦రా! యని యార్చుచు వెచ్చ నూర్పుచున్ ౧౨౪౦
ఉ. నిద్దుర పాడుగాను, దల♦నెక్కొని యిట్టులు చేసె నయ్యయో,
బుద్ధి పరాకు చెందె, నెటు♦పోదుము, గాఁసగ రాఁ డెటన్, మహా
పద్దశ సంభవించె, నిజ♦భక్తుల నెల్లర వీడి కానకున్
బద్ధుగ నేగె నొంటి నిఁకఁ♦బ్రాపెవరో మన కెల్ల నియ్యెడన్. ౧౨౪౧
కం. ఎట్టులు చూడఁగఁ గల్గునొ, యట్టి పృథూరస్కునిన్ మ♦హాభుజు రామున్
నెట్టుకొని యెట్టిపనియొన్, బట్టుగ నెఱవేర్చునట్టి♦పార్థివుపట్టిన్. ౧౨౪౨
కం. తనకన్నబిడ్డలను దయ, జనకుఁడు రక్షించురీతి♦సంరక్షించున్
మనల సదా యిపు డేటికిఁ, జనియెనొ యిందఱను వీడి♦సాహసమతి యై.
ఉ. రాముఁడు లేకయున్న మన♦ప్రాణము లుండిన నేమి పోయెఁ బో
నే మటు గానఁ బ్రాణముల♦నియ్యెడఁ బాచుకొనంగ మేలు కా

దే మన కెల్ల, నొండె నిఁక ♦ మృత్యుముఖాభిముఖంబుగా నుద
న్వీమన పోవు టొప్పు, నది ♦ చేయుట యుత్తమభంగి చెప్పఁడా. ౧౨౪౪
కం. ఇండిగ నున్న విటం గడు, నెండినకట్టియలు వీని ♦ నెల్లను జితగా
మండించి దానిలోఁ బడి, దండధరుం జూడఁ జనఁగఁ ♦ దగుఁ దగు మనకున్.
కం. అనయ్యం బాతియ్యం, బానీతియు నీను లేమి ♦ యామృదువాక్యం
బానిస్తులగుణసంపద, యేసరులం గందు మింక ♦ నే మనుకొనఁగన్. ౧౨౪౬
ఉ. ఊరికిఁ బోవ వృద్ధులును ♦ నోపనివారును స్త్రీలు బాలు ర
య్యారె రఘూద్వహుం డెచట? ♦ నాదటఁ గ్రమ్మఱి వచ్చెనే? యనర
వారల కెల్ల రాము వన♦వాటికి సాగఁగ నంపి వచ్చు చు
న్నార మటంచుఁ జెప్ప నగు♦నా? మఱి యే మని చెప్పశక్య మా. ౧౨౪౭
కం. రామునితోడుత వచ్చియు, రామునిఁ దోడ్కొనక చనిన♦ప్రజఁ గని వృద్ధ
స్త్రీమాణవకోపేతం, బౌ మననగరంబు మిగుల ♦ నడలదె యార్తిన్. ౧౨౪౮
కం. రామునితోడుత వచ్చియుఁ, బ్రేమంబున నింతవట్టు ♦ వెండియు నగరం
బీమాయి నే మోములతో, నే మని చొర మనసు లోర్చు ♦ నె ట్లని చింతన్.
కం. క్రీవులఁ బాసినగోవుల, నూపునఁ దనుబాహు లెత్తి ♦ రోదనసహితా
లాపములఁ బెక్కు తెఱఁగుల, వాపోయిరి యెల్ల జనులు ♦ వల నెఱుఁగమిచేన్.
కం. తేరి తెరువునను గొండొక, దూరము చని దానిజాడ ♦ తోఁపమి ననలర
బౌరులు నిర్భాగ్యుల మం, చూరక తముఁ దిట్టుకొనుచు ♦ నుత్తలపడుచున్. ౧౨౫౧
కం. ఏమి యిది యేమి గతి యిం, కేమి యొనర్పంగ వచ్చు ♦ నిందఱ దైవం
బే మోసము చేసెఁ గదే, యీమాడ్కి నటంచు నేడ్చు ♦ చేగిరి పురికిన్. ౧౨౫౨

## పౌరు లయోధ్య మరలఁ జేరుట.

ఉ. పాడఱినట్లు దోఁపఁ దమ♦పట్టన మంతయు రాముఁ డున్న యీ
వీ డతుభాస్వరం బగుచు ♦ వీక్షవడెఁ గంటిరె, పక్షిరాజు నెం
టాడి ఫణీశ వెలార్పఁగ జ♦లాశయమో శశిలేనిమిన్నొ నీ
రూడినకంధియో యనఁగ ♦ నొప్పు దొఱంగె నటంచుఁ జింతచేన్ ౧౨౫౩
తే. కనులు కాఁచఁగ నేడ్చుచుఁ ♦ గదిసి తమ్ముఁ, దమజనంబులుఁ బెఱవారుఁ ♦ దగ్గఁగనఁగ
వారి గుర్తింప లేరైరి ♦ వనటకలిమి, బాష్పవిప్లుతనేత్రులై ♦ వ్రాలి పడుచు.
ఉ. రాముని వెంట నంటి యిటు ♦ గ్రమ్మఱి వారలు పీనులట్టులై
ధామములందుఁ జొచ్చి నిజ♦దారసుతావృతు లౌచు దీనతర
మోములఁ జేతు లూనుచు ము♦మూర్ఛను హా యని బిగ్గ యేడ్చి రిం
కేమి తెఱంగొ యేమిగతి♦ యెక్కడ కేగుద మంచు నంతటన్ ౧౨౫౫

ఉ. శ్రోత్రగ మిత్రు లబ్బుటకు ♦ గూర్పరు మోదముఁ, జ్రోత్రపస్తువుల్
హత్తియు హర్ష మూన రట ♦ నంగడు లుంపరు వైశ్యు లెవ్వరున్
గ్రొత్తగ నత్త లిండులకుఁ ♦ గోడలు రా మురిపెంబు గాన రెం
దత్తఁ బ్రొయ్యి రాఁజ నిడ ♦ రార్తిఁ బురిన్ గృహమేధు లెవ్వరున్. ౧౨౫౬

కం. పలుధనములు లభియించియు, నలరరు చిరనష్టవిత్త ♦ మంది మురియరున్
దొలిచూలుఁ గొడుకుఁ గాంచియుఁ, దలఁపున నేమ్మదముగనదు ♦ తల్లియుఁ బురిలోన్.

→ పౌరు లయోధ్యకుఁ బోవ స్త్రీలు వారిని నిందించుట. ←

కం. ఇంటింట నేడ్పువాలుం, గంటులు తమపతులు రాఁగఁ ♦ గని యిండులకున్
గెంటసము లాడి ర్తార్తిని, గంటులు వడ నంకుశమునఁ ♦ గరి నడుచ క్రియన్.

ఉ. రామునితోడఁ బోయియును ♦ రాజశిఖామణిఁ దోడి తేక యి
ట్లే మని వచ్చినార లొకొ ♦ యిండ్లకుఁ గ్రమ్మఱి, యిండు లేటికో
యేమిటి కాలుబిడ్డలు సు♦హీనసుఖంబులు విత్త మేటికిన్
రామునిఁ గన్నులారఁగఁ గ♦నన్ సుకృతాత్ములు గానివారికిన్. ౧౨౫౯

ఉ. ఒక్కఁడ లక్ష్మణుండు సుజ♦నోత్తముఁ డీజగమందు భక్తి మై
మక్కువ రామచంద్రుని ను♦మాతనయాన్వితుఁ గొల్వఁ గానకై
చెక్కఁగ నేగె, నాయడవిఁ ♦ జారుధునీసరసీవరంబులం
దక్కమలాత్ముఁ డాడ నహ♦హా యవి యేసుకృతంబుఁ జేసెనో. ౧౨౬౦

కం. కాంతారకసంతానము, కాంతానూపములు నదులుఁ ♦ గటకప్రస్థా
క్రాంతధరాధరములు న,త్యంతము శోభిల్లఁ జేయు ♦ నా శ్రీరామున్. ౧౨౬౧

కం. కాననములేని శైలము, లేనిఁ బ్రియాతిథినిబోలి ♦ యేతెంచినసీ
తానాథుని నర్చింపక, మానఁగ నెటు లోపు నవి స♦మర్చావిధులన్. ౧౨౬౨

కం. నెరయంగ మొకరితేఁటులు, వరకుసుమాపీడము లయి ♦ పలుమంజరులన్
సరసం బయి వనవిటపులు, దరిసింపఁగఁ గలవు రాము ♦ ధన్యము లగుచున్.

కం. కాలంబు గాక యుండియు, బాళిని బూవులును బండ్లుఁ ♦ బరమాదృతిమై
శైలంబు లొసఁగు సీతా,బాలాహృదయేశ్వరుండు ♦ వజ్జల డాయన్. ౧౨౬౪

కం. సెలయేఱుల నిర్మలతర,జలపూరము చిత్రముగను ♦ జాలు గొన మహా
చలములు సలుపును దమతమ,పొలిమేరలు చేరఁ బురుష♦పుంగవుఁ డాస్థన్.

కం. ఎండకు సాటసాట లాడుచు, దండను దమకాలినొవ్వుఁ ♦ దలఁగింపఁగ వా
రుండఁగఁ గొమ్మల వీచుచు, దండిగ రమియింపఁ జేయు ♦ ధరణీరుహముల్.

## ←→ పురస్త్రీలు శ్రీరాముఁ దలంచి దుఃఖించుట. ←→

ఉ. ఎచ్చట రామచంద్రుఁడు మ♦హిష్ఠగుణోత్కరసాంద్రుఁ డుండునో
యచ్చట భీతి లేదు చుఁడి ♦ యచ్చట లేదు పరాభవంబు నా
సచ్చరితుండు దూరముగ ♦ సత్వరుఁ డై చనకుండ మున్న పెం
పచ్చుపడంగ లెండు పదఁ♦డా చని యుండ వసింత మర్తిలిన్. ౧౨౬౭
ఉ. ఆతఁడ జీవకోటికిఁ బ♦రాయణ మాతఁడ ప్రాప్య మాటచేఁ
బ్రీతిని నమ్మహాత్ము సద♦రీణగతిం బద సేవఁ గొల్వఁగాఁ
జేతము లుల్లసిల్లెడిని ♦ సీతను భక్తిని గొల్తు మేము, మీ
రాతపుణార్క తేజుఁ బ్రియ ♦ మార భజింపుఁడు లెండు పోవఁగన్. ౧౨౬౮
కం. మీయోగక్షేమంబుల, నాయనఘుం డరయుచుండ ♦ నవనిజ యరయుః
మాయోగక్షేమంబుల; నేయడలును లేదు వారి♦నే కొలువంగన్. ౧౨౬౯
సీ. అప్రశస్తంబు నై ♦ యమనోహరంబు నై, యవలక్షణంబు నై ♦ యాత్మనాశ
కం బయి మిగుల ను♦త్కంఠఁ గల్గించు నీ,కొంపపై నెవ్వఁడు ♦ కూర్మిసేయుఁ
గైకేయి రాజ్యంబు ♦ గావింప ధర్మహీ,న్యము దిక్కు లేని దా ♦ నగర మింక
నెక్కడి బ్రతుకుపా ♦ టెక్కడిబిడ్డలు, నెక్కడిధనము ల ♦ దేటిమాట
తే. భాగ్య సంప్రాప్తి కై తన♦పట్టి విడిచె, మగని నెడఁబాసె నట్టిదు♦ర్మార్గురాలు
వంశపాంసని యింక నె♦వ్వాని నేమి,చేయ కుండెడి మన మేమి ♦ చేయఁగలము.
కం. కైకేయి బ్రతికి యుండఁగ, నాకెకడం గూలివాండ్ర ♦ మగుచును బ్రదుకః
మా కోర్వదు మది నిక్కం, బీకొడుకులమీఁద శపథ ♦ మిడితిమి చుండీ. ౧౨౭౧
ఉ. రాజకుమారునిం గనిక♦రం బనుమాట యొకింత లేక దు
ర్వ్యాజనఁ జేసి కాఱడవిఁ ♦ ద్రోసినదుర్మతి దుష్టశీల న
య్యోజ జెగజేంతఁ గొల్చి యెవఁ♦డో సుఖ మందెడివాఁ, డనాయకం
బై జనహీన మై నగర ♦ మంతయుఁ బా డయిపోవు నీపయిన్. ౧౨౭౨
ఉ. రాముఁడు గాసకుం జనుట ♦ రా జిఁకఁ జచ్చును, మీఁద నేడ్పు యీ
భూమిని; క్షీణపుణ్య! లిది ♦ బుద్ధిఁ దలంచి విషంబుఁ గ్రోలుటో
రామునివెన్నడిం జనుటో ♦ క్రచ్చఱ నీనగరంబువార్త పే
రేమి వినంగ రాని మహి ♦ కేనియుఁ బోవుటో నిశ్చయింపుఁడీ. ౧౨౭౩
చం. అలుకక మోసమై దశర♦థావనినాథుఁడు రాముఁ దమ్ముతో
జలజదళాక్షితో వనికి ♦ సాగఁగ నంపి దయావిహీనుఁ డై
మలఁగక మిమ్ము నమ్ము దెస♦మాలినవారిని బోయవానిముం
గలఁ బశుజాల ముంచుగతిఁ ♦ గైకయిపట్టికి నప్పగించెడిన్. ౧౨౭౪

సీ. నిండుఁజందురుఁబోలు ♦ నెమ్మోముగలవాఁడు, నహితపాళికిఁ గాలుఁ ♦ డైనవాఁడు
గూఢజత్రులకల్మి ♦ యూఢి కెక్కినవాఁడు, నుత్తమాజానుబా♦హువులవాఁడు
కమలంబులనుబోలు♦కందోయి గలవాఁడు, తాన మున్నుగఁ బల్కు♦నూనువాఁడు
కమ్మనిపల్కులు ♦ నెమ్మి నాడెడివాఁడు, మాఱు లేనిపరాక్ర♦మంబువాఁడు
తే. సౌమ్యుఁ డగువాఁడు, మఱి జగ♦జ్జాలమునకు
నమృతకరునట్లు చూడఁ బ్రి♦యంబు నైన
వాఁడు, పురుషోత్తముఁడు ఘోర♦వనచయంబు
శోభితముఁ జేయ కుండునే ♦ సుకృతరతుఁడు ౧౨౭౬

కం. రాముండు సత్యభాషా,ధాముఁడు దానాభి రామ♦తద్విపగమనుం
డామహనీయుఁడు నిజతను,ధామంబున వెలుఁగఁ జేయుఁ ♦ దద్వన మెల్లన్.

కం. ఈకరణిఁ బురమునం గల,యాకరిణీయాన లెల్ల ♦ నలమటపడ న
స్తోకంబుగ మృత్యుభయ,వ్యాకులల ట్లంతఁ బంక♦జాప్తుఁడు గ్రుంకెన్. ౧౨౭౭

ఉ. వేలుప రగ్నిహోత్రముల ♦ విప్రులు, వేదపురాణసత్కథల్
బాళిఁ బఠింప రెవ్వరును ♦ బాధితమంబు పురంబు ముంపఁగా
జాలి మునింగి దిక్కు చెడి ♦ సంతస మింతయు లేక శూన్యప
ణ్యాళియు నై గ్రహోడుంహి♦తాభ్రముభంగి నయోధ్య చెన్నఱెన్. ౧౨౭౮

చం. తమతమముద్దుబిడ్డలను ♦ దమ్ముల నన్నలఁ బాసినట్లుగాఁ
గమలదళాక్షు లాపురిని ♦ గాదిలిరాముని కంగలార్పఁగా
శమకరగీతనృత్యములు ♦ చారుతరోత్సవముల్ దొలంగి సం
శమితజలార్ణవంబుగతి ♦ జానకి పట్టన మొప్పె నయ్యెడన్. ౧౨౭౯

శ్రీరాముఁడు కోసలదేశంబు దాఁటి పోవుట.

సీ. అక్కడ శ్రీరాముఁ ♦ డాకొఱ రేయిని, గడుదవ్వు చని రేప♦కడను వార్చి
యావిషయం బెల్ల ♦ నతితరించుచు దూర,మందలియూరులు ♦ సుందరంపుఁ
దోఁటలు, విత్తెడు♦దుక్కిమళ్లను జూచు,చును సత్వరంబుగఁ ♦ జనుచు నుండి
యును మెల్లగాఁ జను♦నొప్పు దోఁపఁగ నట, వఱలెడిగ్రామసం♦వాసజనులు
తే. తత్కుమారులఁ గనుఁగొని ♦ దశరథుండు, ఛీఛీఛీ యాఁడుదానికిఁ ♦ జెవ్వి నిచ్చిఁ
గామవశుఁడయి యయ్యయో ♦ కైక యెంత,పాప పాపానుబంధిని ♦ భ్రష్టురాలు.

ఉ. ఎంతటిమానహీన, యది ♦ యెంతటికూళ, య దెట్టిపాపదు
శ్చింతకురాలొ, యీాయనఘుఁ ♦ జిన్నినుతుం గరుణాలవాలు స
చ్ఛాంతు జితేంద్రియుం గనికి ♦ సాగఁగ నంపె, మహానుభావ యీ
కాంత విదేహపుత్రి యకటా ♦ కాఱడవిం బడు నట్టి దుఃఖముల్. ౧౨౮౧

కం. అయోధ్య దశరథుఁ డెంతటి, నెయ్యంబును లేనివాఁడొ • నిజపుత్రకుపై
నియ్యనఘు లోకహితునిన్, దయ్యన్ ఘోరాటవులఁ బ•డం ద్యజియించెన్.
కం. ఈరీతి నాడ నయ్యా, యూరులవా రాలకించు • చోయ్యనఁ గడచెన్
వీరుఁడు కోసల| దేశం, బారఘుకులుఁ డంతఁ జేరి • యాపగ నొందున్ ౧౨౮౩
కం. వేదశ్రుతి యనుదానిని, మోదంబున దక్షిణాభి•ముఖుఁ డై చనుచున్
భూదయితుసుతుఁడు గోమతి, సాదరమతిఁ గాంచి దానిఁ • జయ్యన దాఁటెన్.
కం. శారీకీరీమత్తమ, యూరీకలహంసకలక•లోద్భటరుచిరో
దార యగుస్యందికానది, తీరంబును దాఁటి విభుఁడు • దేవికి ననియెన్. ౧౨౮౫
తే. కమలలోచన! యీనది • గరసు[1] గాఁగ, మను వొసంగెను నిక్ష్వాకు•మనుజపతికిఁ
దక్కినది యెల్లఁ గరదు లై • ధరణినాథ, లేలుచుందురు సంప్రీతి • యెనక మెనఁగ.
చం. అని తనసూతుఁ జూచి యను • హంసకలస్వరలక్ష్మితోడ నో
యనఘ సుమంత్ర! యెన్నఁటికి • నబ్బునొ నే సరయూతటంబునన్
గొనబగుతోఁటలందు జన•కుండును దల్లియుఁ దోడ రా ముదం
బున మృగయావిహారరతిఁ • బోఁడిమిగాఁ జరియించుపుణ్యముల్. ౧౨౮౭
తే. భువనములయందు రాజర్షి•పుంగవులును వేడుకకు నయి, పితృకార్య•వేళలందు
సజ్జనులు, విలుకాఁడు ల•క్ష్యంబుపొంటె, వేఁట చనుదురు నాకంత•వేడ్క లేదు.
తే. కోసలేంద్రుఁడు రాజుల•గుణములిట్లు, మనసునకుఁ దెచ్చికొనుచు సు•మంత్రుఁ జూచి
హర్ష మొప్పార ముచ్చట • లాడుకొనుచు, నేగెఁ గోసలదేశంబు•నెల్ల దాఁటి.
కం. మును పురజనసమ్మర్దము, నను గ్రొక్కఁగ వలను పడమి • నవసారసలో
చనుఁడు పురిదిక్కు మొగ మై, వినయోక్తుల మ్రొక్కి యిట్లు • వేఁడె నయోధ్యన్
ఉ. ఓరఘువంశపాలితపు•రోత్తమమా! నిను గ్రామదేవతా
వారము నీమొదన్ వెలసి • వర్తిలు వేల్పుల నెల్లఁ గ్రమ్మఱం
దీరిచి తండ్రియప్పను వ•నీస్థలిఁ గ్రుమ్మరి తల్లిదండ్రులం
గూరిమిఁ గూడి వెండిఁ గనుఁ•గొందును నన్ను ననుగ్రహింపుమా. ౧౨౯౧
కం. అని యిట్లు పలికి జేగుఱుఁ, గనుఁగవలన్ బొప్పవారి • కాఱఁగఁ గుడిచే
తిని నెత్తి యచట మూఁగిన, జనపదజనములను జూచి • సమ్మతిఁ బలికెన్. ౧౨౯౨
సీ. అనఘాత్ములార! మీ • రనుకంపయును నను, క్రోశంబుఁ దగురీతిఁ • గూర్చుకతన
నాపయి, మీ కిట్లు • పాపీయ మాచిర, దుఃఖంబు ఘటియిల్లె • ద్రోవ వసమె
పొందు మీమీకార్య•ముల నవరింపఁగ, స్వార్థసిద్ధికి నేను • నరుగువాఁడ
నని పల్క, వారు మ•హాత్ముని రాముని, వలగొని యేడ్చు చా • వలను గనుచు

[1] గరసు = ఎల్ల.

ఆ. నిలిచి యచట నచట ♦ జలజాక్షుఁ జూచుచుఁ, బోవు చుండఁ దృప్తి ♦ పొంద కెదల
వారి కెల్ల మఱుఁగు♦పడి చను చుండె ని,శాముఖంబునందు ♦ సవితవోలె. ౧౨౪

సీ. చనుచు నీరీతిఁ గో♦సల్యాతనూజుండు, పురుభూతధనధాన్య♦పుంజిత మయి
దానశీలప్రజా♦మానిత మగుచును, లలితసౌభాగ్యసం♦కలిత మగుచు
నకుతోభయంబు నై ♦ యధికరమ్యంబు నై, చైత్యయూపోత్కర♦సాంద్ర మగుచు
గున్న మామిడితోఁట♦చెన్నుల మీఱుచు, సంపన్నవరజలా♦శయము నగుచుఁ

తే. బుష్టతుష్టజనాకీర్ణ♦పురము లగుచు, నాలమందలవందలు ♦ లీల నెగడ
బ్రహ్మఘోషంబు లొప్పరఁ ♦ బార్థివేంద్ర,లక్షణీయంబు నగుకోస♦లంబు శుభము

కం. కనుచును నడుమను నడుమను, గన నగునుద్యానవాటిఁ ♦ గడచుచు భూభృ
జ్జనభోజ్యము రాజ్యము విడి, చనియెను ధీరోత్తముండు ♦ చని యచ్చోటన్ ౧౨౫

## ⟻ శ్రీరాముఁడు గంగానదిఁ గాంచుట. ⟼

లయగ్రాహి. అంగుగ దినేశకుల♦పుంగవుఁడు మోద మొ
రంగను గనుంగొనె న♦భంగతరభంగో
త్సంగను శివాంబుచయ♦రంగను మహాఋషిని
షంగను శుభాశ్రమచ♦యాంగను సురీవ్యా
సంగనుతసుందరవి♦హంగకులరాజితత
రంగకజలాశయవి♦భంగను నరౌఘో
త్తుంగభవభీహనన♦చంగను నభంగురశు
భాంగను దరంగముఖ♦రంగ నలగంగన్ ౧౨౬

కం. ఖేలాలోలామరవర,బాలాతతికేళిశైల♦పాళీశతముఁ
లీలావనమాలాచయ, హేలాభర మొప్ప నయన♦హిత మగుదానిన్ ౧౨౭

సీ. అంబుచయాఘాత♦కాట్టహాసోగ్రయై, భాసురఫేనసు♦హాసిని యయి
యొక్కచో వాఁకయై ♦ యొకచోట సుడి గల్గి, పెరచోట స్తిమితగం♦భీర యగుచు
నొండుచో వడిగ ను♦ద్దండతఁ బాఱు చో,నొక్కొ_టను గంభీరని♦ర్ఘోష యగుచు
నొక్కొక్కచో భైర♦వోగ్రనిస్వన యయి, దేవసంఘాప్లుత♦దీర్ఘ యగుచు

ఆ. నమరకమల యగుచు ♦ విమలకువల యయి, పఱపుటిసుకతిప్ప ♦ లొఱపు చూపఁ
దెల్లయినుము గల్గి ♦ దివ్యసారసహంస, చక్రవాకనాద♦సంకుల యయి ౧౨౮

సీ. ఒకచోటఁ దీరజా♦తోర్వీజపంక్తులు, లలిత మాహారవ♦ల్లరులు గాఁగ
నొక్కచో నవవిక♦చోత్పలచ్ఛన్నయై, యొక్కచోఁ గుముదషం♦డోజ్జ్వల యయి
యొక్కచో వివిధపు♦ష్పౌఘరజోధ్వస్త, యై సమదాకృతి ♦ యమరు చుండ
నొకచో మయిల లేని♦యొఱపుటద్దముభాతి, నిగనిగ లాడుచు ♦ నిర్మల యయి

తే. దిగ్గజంబులు వసకరుల్ ♦ దేవతోప, వాహ్యములు రోద సేసెడి ♦ వనులు వెలయ
భూషణోత్తమసద్రత్న ♦ భూషిత యగు, ప్రమదయాటు లొప్పి కన్నుల ♦ పండువుగను
సీ. లసమానఫలపుష్ప ♦ కిసలయాన్విత సుయి, పోలంబత్తుల నొప్పు ♦ పొదలదాని
శింశుమారభుజంగ ♦ సేవిత యవుదాని, హరిపాదసంభూత ♦ యైనదానిఁ
బాపహీనాత్మను ♦ బాపవినాశిని, భవజటాజూటవి ♦ భ్రష్ట యగుచు
నంభోధిఁ గలయుచు ♦ గంభీర యవుదాని, నఖిలపట్టపు దేవి ♦ యయినదాని
తే. సారసక్రౌంచకారండ ♦ వారభటులఁ, జాను వగుదాని గంగను ♦ జక్కులారఁ
జేరి కనుఁగొని యట శృంగి ♦ బేరపురముఁ, జేరఁ జనె రామచంద్రుఁడు ♦ శీఘ్రగతిని.

### శ్రీరాముఁడు గంగాతీరంబుఁ జేరుట.

కం. రంగత్తరంగమాలా, సంగతి రంగారె గంగ ♦ సరసత సూతా!
రంగగు మన కిప్పుడు నిల్వంగను నిట నిలుపు రథము ♦ వల నగుచోటన్. ౧౩౦౧
కం. అల్లదిగో దాపువనె యొక, ఫుల్లకుసుమవిపులవిటప ♦ పూగంబులచే
మొల్ల మగుగారచెట్టిఁక, మెల్లగఁ గొనిపొమ్ము తేరు ♦ మెలఁగుదమచటన్.
ఉ. అచ్చట గంగ లెస్స గన ♦ నౌ సురదానవమానవాళిచే
మచ్చిక సంచరించు మృగ ♦ కుంజరపక్షులచే రహింపఁగా
మెచ్చుగ నన్న లక్ష్మణుడు ♦ మేకొన సూతుఁడు దోలె వాజులన్
జెచ్చెర నింగుదీతరువుఁ ♦ జేరఁగ ముచ్చట దిగ్గ రచ్చటన్. ౧౩౦౩
కం. ఆవల సుమంత్రుఁడును డిగి, గావళిఁ బో విడిచి మేపు ♦ నమరచి యుర్వీ
జావిభుకుచ్ఛాయాత్రితుఁ, డావిభుకడ కరగఁ దాఁగ ♦ కృతాంజలి యగుచున్. ౧౩౦౪
ఉ. అప్పుడు రామచంద్రసఖుఁ ♦ డగ్రజదోగ్రసిద్ధి సమానుఁడు
గొప్పబలంగ మొప్పెడియు ♦ కుంటితపీగ్యుఁడు బోయనాయకుం
డిప్పగిదిన్ రఘూత్తమహుఁడు ♦ వృక్షమునీడను నుంట నింటఁ దాఁ
జెప్పున వచ్చె వృద్ధహిత ♦ ధీసచివాదికబంధుయుక్తుఁ డై. ౧౩౦౫

### గుహుఁడు శ్రీరాము దర్శించుట.

కం. చనుదెంచుగుహుని దవ్వునఁ, గని సహలక్ష్మణుఁడు సీత ♦ కాంతుఁడు హర్షం
బునఁ బొంగి యతనిఁ గలియఁగఁ, గని రాముని వేష మతఁడు ♦ కడుదుఃఖితుఁ డై
ఉ. క్రుచ్చి కవుంగిటం బలుకుఁ ♦ గూరిమితోడ నయోధ్య యోట్రులో
నిచ్చఁ దలంపు మియ్యదియు ♦ నీ కటు లంచును దేనిఁ జేయుదున్
సచ్చరితా! వచింపుము, సశింబె లభింపఁగ నిట్టిసత్ప్రియుం
డిచ్చకు వచ్చునయ్యతిథి ♦ యేసుకృతంబు లొనర్చినాఁడనో. ౧౩౦౬

కం. ధీమంతుండు యశస్వి ద,యామండనుఁడుక్ మహాత్ముఁ ♦ డవిదితకష్టుం
డామహిపసుతుఁడు సుఖ యా,భూమిం బన్నుండె రేయి ♦ పోయెక్ మెల్లన్.

ఉ. అన్ననిమిత్తమై వగ య♦థార్థపుభక్తియుఁ గల్గులక్ష్మణుల్
సన్నుతశీలుఁ గన్గొని భృ♦శం బగుశోకముతో గుహుండు నో
యన్న! త్వదర్థమై యదె శ♦యం బుపకల్పిత మయ్యె, దాన సౌ
ఖ్యోన్నతి నిద్రపొమ్ము శ్రమ ♦ మూడఁగ, నీ విటు లుండ నేటికిన్. ౧౩౨౦

ఉ. మానితరాజపుత్ర! సుకు♦మారుఁడ వీ విట నున్నవారలో
కానలయందు త్రిమ్మరెడి♦కర్కశదేహులు గాన జానకీ
జానిని గాఁగనూకత ని♦శాసమయంబున నప్రమత్తులై
పూనికఁ గాచు చుండుదుము ♦ పొమ్ము శయింపు యథాసుఖంబుగన్. ౧౩౨౧

ఉ. ఏమన రాము కంటెఁ బ్రియుఁ ♦ డెవ్వఁడు నెందును లేఁడు నాకు నీ
భూమిని సత్య మిద్ది యన♦పోహము సత్యము పైఁ బ్రమాణ మా
నీమహితాత్మునత్కృపఁగ♦దే మహనీయయశంబు స్వర్గముక్
శ్రీమహితార్థముం బడయు♦శ్రేయముఁ గందు సుమిత్రనందనా? ౧౩౨౨

ఉ. జ్ఞాతులు నేను నగ్గహ♦ సజ్యశరాసనముల్ ధరించి సం
ప్రీతిగఁ గూర్కుమామకసు♦హృత్ప్రభునిక్ సహోదరు నప్రమా
దాతతరీతిఁ గాతుఁ జను♦రంగబలంబు లెగర్చె నేనియుఁ
ఖ్యాలిగ నాయుఅుంగని దొ♦కండును లేడు సనాతనంబునన్ ౧౩౨౩

ఉ. జంకకు మన్న లక్ష్మణుఁడు ♦ పల్కి ననుక్ గుహ లేదు భీతియేక్
శంకయు నేని ధర్మమతి ♦ సర్వవిధంబుల నీవు గావఁగాఁ
బంకజనేత్రుఁ డైనరఘు♦వర్యుఁడు సీతయు నేలనేలపైఁ
గొంకక పవ్వళింపఁగను ♦ గూర్కఁగ నాకది యెట్లు సాధ్యమౌ? ౧౩౨౪

{ శ్రీరామవనవాసనిమిత్తక మైనదుఃఖమును లక్ష్మణుఁడు గుహునితోఁ జెప్పుట. }

ఉ. కంటికి నిద్రవచ్చునె, సు♦ఖం బగునే బ్రదుకైన, మానసం
బంటునె భోగముల్, ప్రియహి♦తా! దితిజాసురకోటి నేనియుక్
గెంటఁగఁ జాలు గంటుకొన ♦ నేలిగ నట్టిమహాత్ముఁ డిందు వా
ల్గంటియుఁ దాను జీర్ణతృణ♦కల్పితశయ్యఁ బరుండి యుండఁగన్. ౧౩౨౫

చం. తపమునఁ గ్లేశపాటున వె♦తం గని యొక్కని నాత్మతుల్యు నా
యపరిమితప్రతాపుని వ♦నాంతరవీథులఁ ద్రోచి యాజి దాఁ

గృపణతఁ బెద్దకాలము మ♦హిం మని యుండుట గల్ల మిత్రమా!
విపుల యనాథ యై చెడెడు ♦ వేగమ సత్యము చూచు చుండుమీ. ౧౩౨౬
కం. ఏడిచి యేడిచి హా యని, చేడెలు గాసిల్లి సొమ్ము♦సిలిపడ ధరపై
నేడుపురొద లే కానృపు,వీ డెల్లను నుండఁ గాదె ♦ విగతధ్వని యై. ౧౩౨౭
కం. వనితామణి కౌసల్యయు, జననాథాగ్రణియు నాదు♦జననియు నీరే
యిని నైన నెల్ల వారును, మని యుండుదురా య టంచు ♦ మది శంకింతున్.
కం. మనిన మనవచ్చుఁ జుమి నా,జనయిత్రి మనంబు నిల్పి ♦ శత్రుఘ్నునిపై
మన నేర దనుచు వగచెద, జననుత వీఁ సున్న రాము♦జనని క్షణంబున్. ౧౩౨౯
కం. అనురక్తజనాకీర్ణయు, ననఘజనసుఖావలోక♦నాహ్లాదద యా
ఘననగరి రాజుఁ గూర్చి వ్య,సనసంకులయగుచుఁ జెడును ♦ సత్యము హితుఁడా.
ఆ. తనదుపెద్దకొడుకు ♦ జననుతచారిత్రుఁ, బ్రియు మహానుభావు ♦ నయగుణాఢ్యు
రాము సౌకుమార్య♦ధాముఁ జూడక రాజు, మేనితోడ నెల్లు ♦ మెలఁగువాఁడు.
కం. పతి నృపతి గతించుట గని, సతి యగుకౌసల్య బిడ్డు ♦ సత్వరముగ, నా
పతిగతిఁ గని నాజననియుఁ, బతితోడిది లోక మనుచుఁ ♦ బ్రాణము విడుచున్.
శా. మించెన్ మించె గతించె సత్వమును భూ♦మీనాథుఁ డీరాముఁ డా
నెంచెన్ రాజుగఁ జేయఁ, జేయుకయ ము♦న్నే యాగ్రహు, సత్వరఁ దా
మంచుం జేరి భజించి యానృపతిని♦న్యాణంబునం గానృకో
దంచత్కార్యము లెల్లఁ దీర్చెదరు సి♦ద్ధార్థుల్ తనూసంభవుల్. ౧౩౩౩
సీ. అక్కటా తండ్రికి ♦ నైహిస్వదేహికముల, భరతశత్రుఘ్నులు ♦ పరఁగఁ దీర్చి
రమ్యచత్వరముల ♦ రమణీయపథములఁ, బ్రాసాదహర్మ్యాది♦భవనములను
వారముఖ్యల రథ♦వారణవాజుల, నత్యగౌర్యత్రిక♦నాదములను
హృష్టపుష్టప్రజా♦బృందంబులను సర్వ,కళ్యాణసంపూర్ణ♦కలనములను
తే. నిష్కుటారామచయముల ♦ నిత్యనరస,మాజసుమాయము నొప్పువే♦రోజ నాదు
తండ్రి యేలెడియారాజ♦ధానియందు, సంచరింతురు వారలు ♦ సమ్మదమున.
ఉ. అంతకు జీవయుక్తుఁ డయి ♦ యూరక మెలంగుచు నుండ మేము ని
శ్చింత మరణ్యవాసమును ♦ జేసి ప్రతిజ్ఞను దీర్చి యాపయిఁ
గాంతుమొకో యయోధ్య, మఱి ♦ గాదిలితండ్రిపదాబ్జ మొయ్య ద
ర్శింతుమె మిత్రమా! యనుచుఁ ♦ జెప్పుచు నుండ గతించె రేయియున్. ౧౩౩౫
కం. గురుసౌహార్దమున లక్ష్మణుఁ, డురుశోకమునం దపించు ♦ చుండఁగ గుహుఁడున్
బరమార్తిఁ గార్చె నశ్రులు, జ్వరపీడిత మగుమతంగ♦జంబును బోలెన్. ౧౩౩౬

### శ్రీరాముఁడు గంగను దాఁటఁ బ్రయత్నించుట.

ఉ. లాలితమూర్తి లేచి శుభ♦లక్షణు లక్ష్మణుఁ జూచి తమ్ముఁడా
మౌళి గతించె రేయి యరు♦ణోదయవేళయు డాసె వింటె వే
మేలికలస్వనంబులను ♦ మేల్కొలిపెం బికకేకిలోక ప
క్ష్యాళి, దరింపఁగాఁ జనుద♦మా వడిఁ బాఱెడిజాహ్నవీనదిన్. ౧౩౩౭

చం. అనుడు సుమంత్రునిన్ గుహుని ♦ నాతఁడు మీరలు వింటిరే కదా
యనఘునిదేశమంచుఁ దన ♦ యన్నకడన్ నిలువన్, గుహుండు చ
య్యనఁ దనమంత్రులం బిలిచి ♦ యంచ అరిత్రచయాదియుక్తనా
వను సమకట్టెఁ డీదృఢము ♦ వర్ణ్యము నావికవంతమున్ వెసన్. ౧౩౩౮

చం. అనవుడు వారు గూర్చి తెలి♦యంబఱుపం దము నేలువానికిన్
వినయముతోడ మ్రొక్కి రఘు♦వీరునకున్ గుహుఁ డాడు దేవ! నా
వను సమకట్టు టయ్యెఁ బిక♦వం బని యొయ్యది? గంగ దాఁటఁగాఁ
జను నిఁక దీన పన్న రఘు♦సత్తముఁ డెంతయు సంతసిల్లుచున్ ౧౩౩౯

కం. కృతకాముఁడ నైతిని నా,హితుఁడా! యీవస్తుతతుల ♦ నెక్కింపుము నా
వతఁ డట్లు చేయ వీరులు, ధృతఖడ్గకలాపచాప♦దీపితతను లై ౧౩౪౦

కం. రాముఁడును లక్ష్మణుఁడు సీ,తాసహితాయుక్తి గంగ ♦ దాయఁగఁ గని నా
కేమి సెలవింకఁ జెపుమా, ప్రేమం బుప ననుసుమంత్రుఁ ♦ బ్రియమునఁ గనుచున్

చం. పవకుశికేశ నాతని య♦థామతి నంటి సుమంత్ర! యింక వే
చనుము నృపాలుపాలికిని ♦ జాగరితృత్వముఁ బాయఁ బోకుమీ
చనుడుము కార్న్యసిక్ సరికి ♦ స్యందనమున్ విడి, మద్వివాసనా
ర్తిని గన్నప్రుక్కుశంబ్రిని స♦గ్స్ఫిరిభక్తిని గాచి యుండుమీ ౧౩౪౨

కం. ఇందాఁక మమ్ముఁ గూర్చితి, స్యందనమునఁ దెచ్చి మేలు ♦ సలిపితి కదు నా
నందించితి నిఁకఁ బురికిం, బొందుగఁ జనుమా శతాంగ♦ముం గొని సరగన్ ౧౩౪౩

### సుమంత్రుఁడు తన్నరణ్యమునకుఁ దోడ్కొని పోవ శ్రీరాము వేఁడుకొనుట.

చం. అన విని నాతఁ డిట్టులను ♦ నక్కట లోకములోన నొక్కఁడేన్
దనమది సన్నుతింపఁడు గ♦దా భవదీయవనీనివాసమున్
మనమున బ్రహ్మచర్యమును ♦ మార్గన మార్దవవేదపారముల్
గనుఁగొనువాఁడ నిష్ఫలము♦కా నిఁక నీ వరుగంగఁ గానకున్. ౧౩౪౪

కం. ప్రాకృతులు పౌరులు ననముప, నీకరుఁడున్ నీవు తమ్ముఁ ♦ డిల్లాలును దుః
ఖాకులు రగుటను భువి న,వ్యాకులుఁ డై కడచి బ్రదుకు♦వాఁ డెవ్వఁ డొకో. ౧౩౪౫

ఉ. తమ్ముఁడు భార్యయుం గొలువ ♦ దండక నీవు వసించి మూఁడులో
కమ్ములు గెల్చినంతప్రభఁ ♦ గాంతు మహాత్మక! నీవు మమ్ము ధ
ర్మమ్మున నిల్పు గూల్చితి గ♦దా! యెటు లేగి దురాత్మురాలు పా
పమ్ముల కిక్క కైకవశ♦పాటున నుండుము దుఃఖ మందుచున్. ౧౩౪౬

చం. అని తనప్రాణతుల్యుఁ డగు♦నామహనీయునిఁ గూర్చి బిగ్గ రో
దన మొనరించి హా యనుచు ♦ ధారగ నశ్రులు గాఱఁ గొంతకుం
బనిమొయి నిబ్బరించుకొని ♦ మార్జనముం బొనరింప నీట న
య్యనఘునిఁ గాంచి రామవిభుఁ ♦ డాదట నెయ్యము మీఱ నిట్లనున్. ౧౩౪౭

⟶ శ్రీరాముఁడు సుమంత్రుని సమాధాన పఱుచుట. ⟵

కం. అయ్యా నినుఁ బోలినకడు, నెయ్యుఁడు రఘువులకు నెందు♦నేఁ గలఁడే, మా
యయ్య యెటు గుంద కుండును, యయ్యనువు ఘటింప నీక ♦ యగును హితాత్మా.

ఉ. ఇంతగఁ జెప్పఁగా వలసె ♦ వృద్ధు మదీయవియోగదుఃఖిలే
న్వాంతుఁడు కామభారచలి♦తాత్ముఁడు గావుటఁ జేసి, యాధరా
కాంతుఁడు కైక ప్రీతి కయి ♦ కార్యము నెయ్యది చెప్ప దాని నా
వంతఁ దిరస్కరింప వల ♦ దయ్య ఘటింతువు గాక ప్రీతితోన్. ౧౩౪౯

తే. ఏతదర్థంబు గా దొకొ ♦ నృపతివనులు, రాజ్యపరిపాలనము నేఁత ♦ రాగగరిమ
నెట్టిపనియుండు నేఁ దమ♦పట్టిపట్టినట్టు సాధింపఁ జూచెద ♦ రెట్టు లైన. ౧౩౫౦

ఆ. ఎట్టు లైన నతని ♦ కేయప్రియంబును, నుదిలిపాటు లేక ♦ యుండునట్టు
లప్రమాదవృత్తి ♦ నరయుచు నుండుమా, యదియ నాదుకోర్కి ♦ యనఘశీల.

కం. అద్ధరణీశుఁడు మిక్కిలి, వృద్ధుండును నార్యశీలుఁ ♦ డెఱుఁగఁడు దుఃఖం
బిద్ధజితేంద్రియుఁ డతనికి, శ్రీఘ్రగ నామాటలు సలిపి ♦ సాష్టాంగనతుల్ ౧౩౫౨

మ. అనుమీ నావచనంబుగాఁ బతి కయో♦ధ్యం బాయఁగా నొయ్యఁగా
వనవాసం బొనరింపఁగా వలసెఁగా ♦ బాధల్ పడ న్వచ్చెఁగా
యని నేఁ జింతిల, లక్ష్మణుండు మదిలో ♦ నార్తిం గొనం, దుర్వగా
తనయారత్నము దుఃఖముం గొనదు, త♦థ్యం బింత భూమీశ్వరా. ౧౩౫౩

కం. ఈ రే డబ్దంబులు సం, చారముఁ గావించి వనులఁ ♦ జయ్యన రా, నక్
ధారణికన్యను లక్ష్మణు, గారామునఁ జూడఁ గలవు ♦ గ్రమ్మఱఁ దండ్రీ. ౧౩౫౪

కం. అని చెప్పుము జనకునకున్, జననికిఁ గైకకును దక్క♦జనయిత్రులకున్
గొనకొని మఱి మఱి చెప్పుము, యనఘు కుశల మడిగినాఁడ ♦ నందఱ ననుచున్.

ఆ. అవల నేను సీత ♦ యార్యుండు లక్ష్మణుం, డమలసూక్తులన్ ము♦దంబుఁ గుశల
మడిగినార మనుచు ♦ సంప్రీతులపై ప్రాలి, మ్రొక్కినార మనుచు♦నొక్కి యనుము.

తల్లిరో యందునా ♦ తగ వెతింగియు నెట్టు, లన్నృతంబు రోయక ♦ యాడువాఁడ
నన్నృత మాడఁగ నేల ♦ యనెదవా నే నెట్లు, పాపపునత్యంబుఁ ♦ బలుకువాఁడ
తే. నిన్ను నీదేవి లక్ష్మణు ♦ నీరజాక్షు
నెమ్మి వహియించుహయములు ♦ నేఁ డ వెట్లు
మన్ని యోగంబునను దాము ♦ మరల నేర్చు?
రమ్యగుణసాంద్ర దయఁ జూడు ♦ రామచంద్ర. ౧౩౬౫

కం సాధ్యంబు గాదు మరలి య,యోధ్యకుఁ బోవంగ నాకు ♦ నూరక, నా కా
రాఘ్యుఁడవు పరపి కరుణా,నిధ్యాన మనుజ్ఞ నిమ్ము ♦ నీతో వత్తున్. ౧౩౬౬

ఆ. కాదు కూఁడ దనుచుఁ ♦ గరుణమాలుచు నాదు,ప్రార్థనంబు వ్యర్థ♦పతిచె దేని
రథముతోడ నేను ♦ బ్రజ్వలదగ్నికి, మే నొసంగువాఁడఁ ♦ జూ నిజంబు. ౧౩౬౭

కం పసముల నీదుతపంబున,కును విఘ్నముఁ గూర్పఁ గలవు ♦ క్రూరపుజంతుల్
గొనకొని వానిని రథమున, వినిహాతములు చేయువాఁడ ♦ విపరింపు మెదన్.

కం. నీరథముఁ గడపుసౌఖ్యముఁ, గూరెడిభాగ్యంబు లేదు ♦ కోమలగాత్రా
ఘోరారణ్యములఁ నీ,తో రా సుఖ సౌదు నన్నుఁ ♦ ద్రోచకు తండ్రీ. ౧౩౬౯

కం సన్మతి నీభయదార,ణ్యమ్ముల నీ పజ్జ నుండ ♦ నాశ గొలిపెడిఁ
జుమ్మీ యట్లే కానీ, ర మ్మని యొకమాట యనవె ♦ రాజీవాక్షా. ౧౩౭౦

కం. మిట్టలఁ బల్లంబుల నీ,గుట్టంబులు నిను సహించి ♦ కొని పోయి శ్రమం
బిట్టింక నీకుఁ గొలుచుచు, నిట్టియులం బరమగలికి ♦ నేగెదు రామా. ౧౩౭౧

కం తలఁగక నీశుశ్రూషను, నలతోఁ జేయుచు వసింతు ♦ దండక నీతో
మలయుచు నయోధ్య యేటికి, నిలింపతల మైన నేల ♦ నినుఁ గొలువంగన్.

కం దురితాత్ములు సురనగరముఁ, జొరఁజాలనియట్లు లెల్లు ♦ చొరఁగా నేర్తుఁ
ధరణీశసుత యయోధ్యా,పుర మే నొంటిగను గోలు ♦ పోయియు నిన్నున్. ౧౩౭౩

ఉ. ఉట్టట లూఁగెడిఁ హృదయ ♦ మొండుతలంపున నాసఁ జేసి, యీ
గుఱ్ఱములఁ శతాంగమునఁ ♦ గూరిచి నే రథచోదకుండ నై
చిట్టనచీఁద కీవు గడ ♦ చేయఁగఁ గానఁ జతుర్దశాబ్దముల్
పట్టెలు వాఱ భూమి యద్రు ♦ పఁ మిముఁ దోడ్కొనిపోవ నూరికిన్. ౧౩౭౪

కం. నీసంగాతంబున నన,వాసంబున నేండ్లు నాల్గు ♦ పది యొకత్రుటి యా .
నీసంగతిఁ బాసిన త్రుటి, గాసిం బడఁ జేయు నొక్క ♦ కల్పము వోలెన్. ౧౩౭౫

కం. భక్తుఁడ భృత్యుఁడ నీ కను,రక్తుఁడ మత్స్వామిసుతచ ♦ రణయుగ సేవా
సక్తుఁడ దృఢశక్తుఁడ నో,భక్తావనశీల యన్నుఁ ♦ బాయఁగఁ దగవే. ౧౩౭౬

కం. పౌనఃపున్యంబుగ నిటు, దీనాలాపములఁ దన్ను ♦ ధృతి చెడి వేఁడం
గా నిజసారథి కనియెన్, మానుగ భృత్యానుకంపి ♦ మహిజావిభుఁడున్. ౧౩౭౭
సీ. పరమభక్తుఁడ వీవు ♦ భర్తృవత్సల! నేను, నిజ మింత యెఱుఁగని♦నిష్ఠురుఁడనె?
యేనిమిత్తము పురి ♦ కేగు మంటిని నిన్ను, వివరింతు నయ్యది ♦ వినఁగదయ్య
నీయరుగుట చూచి ♦ పోయెఁ బో రాముఁ డం,చును నమ్మునాపిన్న♦జనని కైక
నావనిపోక కా♦నందించి ధర్మజ్ఞుఁ, దండ్రిఁ గల్లరి యని ♦ తలఁప కుండు
తే. భరతుఁ డేలెడిరాజ్యంబుఁ♦బడయనలయుఁ,గైక యనినాదుముఖ్యసం♦కల్పమయ్య
రాజునకు నాకుఁ బ్రియముగ♦రథముతోడ, నగరికిని జని చెప్పుమా♦నాదునుడులు.

రామలక్ష్మణులు జడలు ధరించుట.

సీ. అని యూఱడించి యి♦ట్లను గుహుఁ గనుఁగొని, జనయుతం బిచ్చోటఁ♦జనదునిలువ
నాశ్రమవాసి నై ♦ యర్హవిధంబుగ, మునిజనభూషణం ♦ బనఁగఁ దగిన
నరనియమంబున ♦ వర్తిలి తండ్రికిఁ, గరము హితంబుగ ♦ ధరణిసుతకు
సౌమిత్రికిని హిత♦కాముఁడ నై జడల్, దాల్చెద మఱ్ఱిపాల్ ♦ త్వరగఁ దెమ్ము
తే. నాఁగ నతఁ డట్లుసేయ సౌం♦దర్యధాముఁ, డైనరాముండు తనకును ♦ ననుజునకును
జడలు గావించె నిబ్బంగి ♦ జటిలుఁ డయ్యె, దీర్ఘబాహుండు గుణనిధి ♦ దేవనిభుఁడు.
కం. నారలవసనంబులు నిల, జీరాడెడునిండుజడలు ♦ చెలు వొసఁగంగా
శ్రీరామలక్ష్మణులు చె,న్నారిరి సాక్షాన్మునీంద్రు♦లట్టుల యంతన్. ౧౩౮౦
కం. వసిగొని యావల వైఖా,నసమార్గస్థుండు నగుచు ♦ నళినాక్షుఁడు దా
వెనసహలక్ష్మణుఁ డై గుహుఁ, గనుఁ గని యిట్లనియెఁ బ్రీతి ♦ చెప్పలు చేలన్.
కం. జలకోశదుర్గజనపద,ములప్రమాద♦మున రక్షింపుమా
చెలి! యేమఱకుము తనవా,రలను దురాపతిమము♦రాజ్యం బనియున్. ౧౩౮౨
సీ. అని యాన తిచ్చి స♦రాగ్రణి నడిఁ జని, జానకీ సౌమిత్రి♦సహితుఁ డగుచు
గంగాతటంబునఁ ♦ గన్గొని నావను, నది వేగ తరియింప ♦ మదిని గోరి
యన్న లక్ష్మణ నీవు ♦ మున్ను నావికెఁ బట్టి, కదలకుండఁగ దానిఁ ♦ బడిలపఱిచి
యీమనస్విని మెల్ల ♦ నెక్కించి యనుపదం,బున నీవు నెక్కుమీ ♦ పొ మ్మటన్న
తే. నాత్మవంతుండులక్ష్మణుం ♦ డట్ల సీత,మున్న యెక్కించి తా నెక్కి♦యున్నఁ జూచి
సరసిజాక్షుండు నెక్కె ని♦షాదనేత, జ్ఞాతులనుజూచి నడపుఁడీ ♦ నావ యనుడు.
ఆ. రామచంద్రుఁ డంత ♦ బ్రాహ్మణక్షత్రయో,గ్యంబు మంత్రవరము ♦ నాత్మహితము
పొంటె జపముఁ జేసి ♦ భూమిజాలక్ష్మణ,యుక్తి నాచమించి ♦ యుల్లసించి ౧౩౮౪
చం. సబలు నిషాదనాథు గుహు ♦ సారథిసత్తము నాసుమంత్రునిన్
నిబిడదయాతిరేకమున ♦ నిల్వఁ డటంచు ననుజ్ఞ యిచ్చి నా

శబరులఁ దీవరింప దృఢ♦స్వారసమాహితకర్ణధార మై
సొబగుగ నేగె నోడ యియు♦సుందరి మై స్వర్గహతాంబుపూర మై. ౧౩౮౫

## సీతాదేవి గంగను బ్రార్థించుట.

తే. ఏటినడుమంతరంబున ♦ కేగియుచటఁ, దోయజాతాక్షి తన కేలు ♦ దోయిలించి
మ్రొక్కి భాగీరథీదేవి♦దిక్కుఁ జూచి, భక్తిపూర్వకముగఁ జల్పెఁ ♦ బ్రార్థనంబు.

కం. అమ్మా భాగీరథి! నె,య్యమ్మున నీదాశరథి వ♦నాంతరవాసం
బిమ్ముగఁ దీసుచు సట్టుగ, సమ్మతి రక్షింప వమ్మ ♦ సాగరుకొమ్మా! ౧౩౮౭

కం. ఈరే డబ్దంబులు వనిఁ, దీరిచి తాఁ దమ్ముతోడ ♦ దేవి నాతో
వారక నిను మఱి గానఁగఁ, జేరఁగఁ గనవమ్మ చంద్ర♦శేఖరుకొమ్మా! ౧౩౮౮

కం. క్షేమముగ మరలి వచ్చును, నేమంబుగ సర్వకామ♦నిచయము చేరన్
వ్యోమధుని! నిను బూజా,స్తోమంబుల ముదితఁ జేయు♦దుం గడుభక్తిన్. ౧౩౮౯

సీ. దేవి! నీ వసఁగను ♦ గేవలసదివాఖ్యని, త్రిపథగా ఖ్యాతిని ♦ దేజరిల్లి
బ్రహ్మలోకంబునఁ ♦ బరఁగుచు నీలోక,మందుఁ గంధీశుని♦ల్లాల వగుచు
తెూళితకల్మష♦స్నాతకపుంజ వై, యలరుని న్నెట్లుకొం♦డాడ నేర్తుఁ
గరములు మోడ్చెదఁ ♦ గాకుత్స్థతిలకుండు, గ్రమ్మఱి యే తెంచి ♦ ప్రాప్తరాజ్యుఁ

తే. డగుడు నీప్రీతిగాఁగ బ్రా♦హ్మణుల కిచ్చు,దాన మూర్వేలు గోవులు ♦ మానితాన్న
వస్త్రములు నీకు వేసురా♦భాండములును,గరుణఁ జూడుము పూని గం♦గాభవాని.

కం. నీతీరంబుల నుండెడి,పూతక్షేత్రములఁ దీర్థ♦ముల దేవతలన్
నీతముగాఁ బూజించెదఁ, బ్రీతిం గను గంగ కలుష♦విసరవిభంగా. ౧౩౯౧

కం. తనతమ్మునితో నాతో, సనఘుఁడు శ్రీరామచంద్రుఁ ♦ డామోదమునన్
వనవాసముఁ దీరిచి మఱి, చను దేరఁగఁ గుశలిగాఁ బ్ర♦సాదింపు దయన్. ౧౩౯౨

కం. అని వేఁడుచు నుండఁగ భూ,తనయ వడిన్ నావ గంగ♦దక్షిణతటమున్
జనుడు నట డిగ్గి రంపణుఁ, దనతమ్మునిఁ బల్కు దశర♦థప్రభవుండున్. ౧౩౯౩

శా. సౌమిత్రీ! యిఁక నేమఱం దగదు ర♦క్షాప్రక్రియన్, నిర్జనం
బె మానుష్యసమేత మేనియును నే♦ర్పెన్ మున్నుగా నీవు పో
మ్మా మార్గమ్మును జూచికొంచు, బిఱి సీ♦త్మాపుత్రి యే తెంచు, నే
నో మీాయిద్దఱఁ గాచుచున్ వెనుక నై ♦ యుర్వీజకున్ వచ్చెదన్. ౧౩౯౪

కం. కానవివిర్మానుష్యపుఁ,గానన మివి కాన మనము ♦ కడు హెచ్చరికన్
బూని పరస్పరరక్షను, మానక కావించుటయె స♦మంజసవిధ మా. ౧౩౯౫

కం. కడచినకార్యము చక్కం,బడుట యరిది కాన గడవఁ♦బడుటకు మున్నే
కడుకొని యవధానుల మై, జడ నేమియు లేక రక్ష♦సలుపఁగ వలయున్. ౧౩౯౬

మ. జనసమ్మర్ద మొకింత గానక మనో♦జ్ఞంబుల్ మహారామము
ల్గాన బొక్షేత్రము లేమి లేకయును గం♦ర్లుగ్ గుండ్లు ముం ట్లొప్పి భీ
జనకం బైనయరణ్యదేశ మిదె కం♦జాతాక్షి వైదేహియు
స్వనవాసశ్రమ మింకిటం దెలిసెడిన్ ♦ నా లక్ష్మణుం డాచటన్ ౧౩౯౮
కం.మున్నుగఁ జనుడును నాతని, వెన్నంటె క్షమాతనూజ ♦ వెలఁదికిఁ బిఱుఁదన్
సన్నుతవీర్యుఁడు రాముఁడు, క్రన్నన చను చుండె వారిఁ ♦ గాచుచుఁ గడఁకన్.
కం.గంగాపరపారము నరు,గంగాఁగని తెప్ప వ్రాల్ప♦కయ కడుద వ్వే
గంగా వారు సుమంత్రుఁ డ,భంగవ్యథఁ జెందె గళిత♦బాష్పుం డగుచున్.౧౩౯౯
కం.ఆలోకపాలనిభులు స,మాలోకితచారుసస్య♦మహితాననుల్లై
యాలోకబాంధవుఁడు మం,దాలోకుం డగుడు నిలిచి ♦ యవ్వేస్సమునన్.౧౪౦౦
చం.నళినదళాక్షు లొండొకవ♦నస్థలినీడను జేరి యిర్వురున్
దొలుత వరాహఋశ్యములఁ ♦ దొడ్డరురుం బృషతంబు నా మృగం
బుల వధియించి నాల్గిటి, బు♦భుక్షితు లౌట భుజించి రంద, ఆ
య్యలఘుపరాక్రముల్ తరణి ♦ యస్తమితుండుఁగ వార్చి రమ్యెడన్. ౧౪౦౧

శ్రీరాముఁడు తల్లిసంస్మృతిఁ దలంచి దుఃఖించుట.

సీ. జానకీనాథుండు ♦ సౌమిత్రిఁ గనుఁగొని, పల్లెల దాఁటివె♦ల్పలిపొలంబు
నందు వసించుట ♦ యీసుమంత్రుండును, నెడఁబాయఁ దొలిరేయి♦యిదియ కాదె
కావునఁ గడిచిన♦కాల్యంబు దలపోసి,కొనుచు విచారంబు ♦ గొనకు మయ్య
నిద్దురఁ జాలించి ♦ నెఱజాగరూకత, నీరేయి మొనలుగ ♦ నిద్దఱమును
తే. సీత రక్షింపవలయును ♦ రాతురుఁనను,లఁసక్షేమంబు మనయంద ♦ నిలిచెఁ గాదె
మనము తెచ్చినయాకుల♦మహిని బఱచి,పండుకొనఁదగుశిలయొండు♦దిండుగాఁగ.
కం.అని సుఖశయ్యాయోగ్యం, బనఘుఁడు కూర్చుండి నేల ♦ నవరజునకుఁ దా
విన నిం పగుశుభకథలం, జనవున వినిపించుచోఁ బ్ర♦సంగవశమునన్. ౧౪౦౩
సీ. అన్న లక్ష్మణ! ధ్రువం ♦ బమ్మహారాజేంద్రుఁ, డడలుచు నాసుతుం ♦ డడవి కేగెఁ
గా యని పడియుండుఁ ♦ గైకయుఁ దనకోర్కి, తుద దాఁకెఁ గాయని♦తుష్టి నొందుఁ
గాదె యామెయుఁ దన♦గాదిలిపుత్రుండు, క్రమ్మఱుదును రాజ్య♦కారణమున
నమ్మహారాజు ప్రా♦ణమ్ముఁ దీయదు గదా, యేమి సేయఁగలాఁడు ♦ వృద్ధు డైక
తే. నలువలత్రాళ్లఁ జిక్కిన♦వాఁడు దిక్కు,మాలినాఁ డేను దూర మీ♦లీల వచ్చు
కతనఁ బెరువేమి తెలియకే♦వెతలఁబడునొ,యేమి సేయుదుఁదమ్ముఁడా♦యిప్పుడేను.
కం.స్త్రీ చెడ నాకు వ్యసనా,శర్మము మతివిభ్రమంబు ♦ జనపతి కగుటన్
ధర్మార్థంబులకంటెను, ధర్మజ్ఞా కామ మెంచె♦నన్ బలితముగన్. ౧౪౦౪

ఉ. కావనె దేని లక్ష్మణ ని♦కారము మై నెటువంటిమూఢుఁడేఁ
గాదిలిపుత్రుని న్మనసుఁ ♦ గన్గొని సగ్గిలువానిఁ బ్రాణవుం
బైదలిమాటఁబట్టి యిటు ♦ పాయునొకో నను దండ్రి పాసి న;
ట్టేది గనంగఁ జాలుఁ గుసు♦మేషుశరాహతచిత్తుఁ డేమెనన్. ౧౪౦౬

కం. జాయాయుక్తుం డాకై, కేయీసుతుఁ డొకఁడె సుఖితుఁ ♦ గెరలెడి సారా
మాయురె కోసలు లేలెడు, నాయతధరణీస్థలమున ♦ కధ్యక్షుం డై. ౧౪౦౭

ఆ. తండ్రి ముసలివాఁడు ♦ దారుణాటవులందు, నే వసించి మిడుకు ♦ చిట్టు లుంట
నేకముఖముగాఁగ ♦ నేలఁడే రాజ్యంబు, నెల్లఁ గైకతనయుఁ ♦ డేమి చెప్ప. ౧౪౦౮

కం. సార్థక మగుధర్మంబును, నర్థంబును విడిచి కామ ♦ మనువర్తించుఁ
వ్యర్థుం డెవ్వం డాతఁ డ, నర్థంబులు దశరథువలె ♦ ననుభోగించున్. ౧౪౦౯

కం. తననాథుని వధియింపఁగ, ననునీగతిఁ గాననముల ♦ నవయం జేయఁ
ఘనరాజ్యమెల్లఁ గూర్పఁగఁ, దనసుతునకుఁ గైక మనకు ♦ దాపుర మయ్యెన్.

తే. అతులసౌభాగ్యమదమోహి♦తాత్మయగుచు, నాపయినికోపమునఁ జేసి♦పాపబుద్ధి
యెంత బాధించునో కదే ♦ శాంత లైన, నాదుతల్లిని నీతల్లి♦నయము విడిచి. ౧౪౧౧

కం. నాకయి జనని సుమిత్రయుఁ, జీకాకుపడంగ నేల ♦ చెపుమా వేగఁ
వే కానఁగఁ జను మాయమ, నీకడ నుండియ యయోధ్య ♦ కీవు కుమారా!

కం. దిక్కేదిన కౌసల్యకు, దిక్కగుమీ నీవు దండ్రి ♦ ధృతిఁ గానల కే
నొక్కండఁ జనుదుఁ దోడ్కొని, యిక్కమలేక్షణను దడ విఁ ♦ కేలా యనుజా!

కం. పుత్రక్రియాచరణరత, పాత్రగతిం గైక పగఁ బ♦రాభవమును సో
పత్రపగతిఁ గావించును, భర్త్రము నాతల్లి యనుచు ♦ భరతున కనుమా ౧౪౧౪

కం. నాతల్లియుఁ దొలిబాముస, నేతల్లినిఁ బుత్రకునిని ♦ నెడఁబాపెనొ యా
హేతువునఁ జూవె యిటులా, పూతచరిత్రకును దుఃఖ♦ములు ప్రాప్తించెన్. ౧౪౧౫

కం. కని పెంచి పెద్దఁ జేసెను, మనిచెను బహుకష్టములను ♦ మలయుచు నన్నా
జనని యిటు ఫలము వేళకు, గొనకొని విడిచితిని నేటి♦కొడుకను ఛీఛీ. ౧౪౧౬

తే. కన్నతల్లికి దరిలేని♦గడుసుదుఃఖ, మిడితిఁ గంటివె నే నెట్టి♦కొడుక నయ్యొ
పుడమిలోపల నాయట్టి♦పుత్రకునిని, గనక యుండెడిఁ గాక యే♦జనని యేని.

చం. అటమట మయ్యె నాజనన ♦ మంతయు లక్ష్మణ! యేమి చెప్ప, స
చ్చటఁ దలికిఁ ముపం బిడును ♦ శారిక కీరముఁ గాంచి యల్ల దే
కుటిలవిరోధిపాదమున ♦ గొబ్బునఁ గాటిడు పంచుఁ బల్కుఁ యేఁ;
గటగట యంతమాత్రమును ♦ గానయితిం గద మానవుండ నై. ౧౪౧౮

చ. ఎలమి మనంబ యేమి సుఖ ♦ యించె నను న్గని పుత్త్ర, సౌఖ్యముల్
కలుగక యున్న మాడెని ♦ గాక యహో యెటువంటిదుఃఖముల్
గలిగెను నానిమిత్తముగఁ ♦ గల్గియు నేమిఫలంబు చెప్పుమీ
యిలపయి నిట్టిపుత్త్రకుఁ, డ ♦ నృష్టవిహీన మనంబ చూడఁగన్. ౧౪౯

ఆ. అడలు చుండుదాని ♦ కల్పభాగ్యకు గొడ్డు,రాలిఁబోలి యున్న ♦ యమలమతికిఁ
గొడుకుగాఁగఁ బుట్టి ♦ కూర్చిన మే లేది, పలుకవయ్య నీవ ♦ లలితచరిత.౧౫౦

కం.నిర్భాగ్యురాలు గద నను, గర్భంబునఁ దాల్చి కనిన♦కౌసల్య మహా
దుర్భరతరశోకప్రా,ప్తుర్భావంబున నలంగి ♦ దూపిలు చుండున్. ౧౫౧

ఉ. ఏనొకరుండనే పుడమి ♦ నేల్ల నయోధ్యను శాతబాణసం
తానవిదారితంబుగ నొ♦నర్పఁగఁ జాలనె? కారణంబు లే
కేను బరాక్రమింపఁ దగు♦నే? పరలోకభయంబు ధర్మధీ
జ్ఞానము మాన్చి నన్ను నఁ♦సాధ్యమె పట్టము కట్టుకొంటయున్. ౧౫౨

తోటకము. అని పెక్కు తెఱంగుల ♦ సత్త్రయుతా
ననుఁ డై విజనంపువ♦నంబున నా
యనఘాత్మకుఁ డేడిచి ♦ యానిశ యం
దొనరన్ మునిపోలికి ♦ నున్న యెడన్. ౧౫౩

తోదకము. అలలు చలింపని♦యంబుధినా మం,టలు పెను పాఱ ధ♦వంజయునట్టుల్
నిలిపి విలాపము ♦ నివ్వెఱ నుండన్,లలివచనంబుల ♦ లక్ష్మణుఁ డాడెన్.

లక్ష్మణుఁడు శ్రీరాము నూరార్చుట.

ఉత్సాహము. నిక్క మింత రామచంద్ర ♦ నీవు వీడి వచ్చుటన్
దిక్కుమాలి యాయయోధ్య ♦ తేజు మాసి యుండెడిన్
జుక్క లేఁడు లేని రేయి♦ పోల్పునన్ ; వ్యథామతిన్
స్రుక్కఁ దగునె నేను సీత ♦ స్రుక్కమే నినుం గనన్. ౧౫౪

మత్తకోకిలము. నిన్నుఁ బాసి ధరాతనూజయు ♦ నేను నొక్కముహూర్తమే
ని న్నిలం గలవారమే తమ♦నీటిఁ బాసినచేఁపల
ట్లన్న! యాజనకాఖ్యుఁ జేటికి ♦ నంబ యేటికిఁ దమ్ముఁడేన్
నిన్నుఁ బాసిన స్వర్గ మేటికి ♦ నిక్క మియ్యది రాఘవా. ౧౫౫

కం.అనుచు మును పున్నవృక్షం,బునక్రిందను పెజ్జఁ గూర్పఁ ♦ బొరి సుఖముగ నా
సనములు గొని రంపఁటుఁ ద,మ్మునిమాటల రామవిభుఁడు ♦ మోదంబు గనెన్.

కం.గిరిసానుగోచరము కే,సరియుగ్మము మాడ్కి రామ♦సౌమిత్త్రులు లో
వరసంభ్రమములు పాయుచు, గురుశౌర్యులు నిర్జనవనిఁ ♦ గొఱలిరి రేయిన్.

## శ్రీరాముఁడు భరద్వాజాశ్రమంబునకుఁ బోవుట.

కం. అంతట నిర్మలనళినీ,కాంతునిబింబంబు దోఁప ♦ గంగాయమునో
పాంతపు దేశము భీకర,కాంతార మదృష్టపూర్వ♦కస్తువిషయముల్ ౧౪౨౯

కం. కనుఁగొనుచు యథాక్షేమము,గను వివిధధరారుహాళిఁ ♦ గాంచుచు దివసం
బున నర్ధమండలసముయ,మున లక్ష్మణుఁ జూచి పురుష♦ముఖ్యుఁడు పలుకున్.

కం అల్లదె ప్రయాగచుట్టును, బెల్లుగ దహనధ్వజంబు♦విధమున ధూమం
బుల్లాసంబుగఁ గదురా,జిల్లెడి ముని యచట నెలవు ♦ చేకొనెఁ బోలున్. ౧౪౩౧

కం. గంగాయమునాతటినీ,సంగమమునఁ జేరితిమి ని♦జం బదె వింటే
భంగాన్యోన్యవిఘట్టనఁ, బొంగారు రవంబు వినఁగఁ ♦ బోలెడి నిటకున్. ౧౪౩౨

కం. రాజితవన్యపదార్థము,చే జీవిక సడపువారు ♦ చీల్చినకట్టెల్
భూజవిశేషములు భర,ద్వాజాశ్రమమందుఁ గంటె ♦ తమ్ముఁడ యనుచున్. ౧౪౩౩

ఆ. అంత నపరకుభృదు♦పాంత దేశంబున, లంబమాన రక్త♦బింబుఁ డగుచు
నరుణకిరణుఁ డమర ♦ నాధన్వ లరిగిరి, యమున గంగఁ గలియు♦నట్టిచోట ౧౪౩౪

కం. వెలయుభరద్వాజాశ్రమ,తలముం జేరంగ బెదరఁ ♦ దన్మృగపక్షుల్
బలియురు ముహూర్తమాత్రం, బెలమిం జని చొచ్చి రాత్రి♦మేలగు మొల్లన్.

సీ. ఆయాశ్రమస్థలి ♦ వటు చేరి జానకీ,సహితులై తపసిద♦ర్శనము సేయఁ
గోరి యనను వేచి ♦ దూరంబునందున, నిలిచి తచ్ఛాత్త్రుల♦వలన వార్తఁ
బుచ్చి లోఁజొచ్చి స♦మ్పూతశిష్యాగ్రుగు, సంశ్రితవ్రతునిఁ బ్ర♦శస్తచరితు
నేకాగ్రచిత్తు స♦న్స్తుతపోలబ్ధ,చక్షు మహాత్ముని ♦ సన్నిధిఁ గని

తే యగ్నిహోత్రవిధానంబు ♦ నాంత మగుడు, నొయ్య లక్ష్మణజానకీ♦యుక్తుఁ డగుచు
నళినలోచనుఁ డభివాద♦నం బొనర్చి, పేరుకొనుచును దనపేరు ♦ వెండి పలుకు.

సీ. దశరథ సుతులము ♦ శశిచంద్ర! శ్రీరాము,లక్ష్మణులము నాదు ♦ లలన జనక
నందన కల్యాణి ♦ నావెంటఁ జనుదెంచె, నిర్మలవ్రత యయి ♦ నిశ్చలుండు
నాచిన్నతమ్ముఁడు ♦ సన్నుగమనించెఁ, దండ్రి కాననులకు న ♦ న్నరుగు మనినఁ
దండ్రియాదేశంబుఁ ♦ దలఁ దాల్చి వనభూమి, కేతెంచితిమి ముని♦వృత్తి నుండఁ

తే. గాయలును గూర లశనంబు♦గాఁగ ధర్మ,గలిని జరియించువారము ♦ హితమనీష
యనుడు గోవును నర్ఘ్యంబు♦నంబువులను, నన్నరసముల ఫలముల♦హాలి నొసఁగె.

కం. మునిమృగపక్షిసమేతుం, డనఘుని శ్రీరామచంద్రు ♦ నర్చించి మతిక
ఘనుఁడు భరద్వాజుఁడు రా,ముని కుశలప్రశ్న మడుగ ♦ ముదితుం డగుచున్

కం వా రిచ్చినయర్ఘ్యల రఘు,వీరుఁడు గైకొని సుఖోప♦విష్టుం డయినక
గూరిమిని భరద్వాజుం, డారాముని కనియె ధర్మ్య ♦ మగువాక్యములన్. ౧౪౩౯

ఉ. ఎన్నిదినాల కేను నిను ♦ నిచ్చటఁ గంటిని రామ, నీకు నీ
బన్నముఁ, దండ్రి తేర కిటు ♦ పంపుటయుఁన్, ననిఁ జేసు టేకథల్
మున్నుగ వింటిఁ, బుణ్యతల♦ముఁన్ విజనంబు మహాపగోరుసం
పన్నము కన్య మియ్యది, ని♦వాసముఁ గైకొను మిందు నెమ్మదిన్. ౧౪౪౦

సీ. అనుచు భరద్వాజుఁ ♦ డాడ నాతనిఁ గని, యనియె శ్రీరాముఁడు ♦ మునివరేణ్య
కడుసుదర్శుండ సంమఁ ♦ గనుఁగొన వత్తు రా,సన్నపౌరులు మఱి ♦ జానపదులు
మాజానకిని నన్ను ♦ మఱి మఱి గావున, నిచ్చట నిల్వంగ ♦ నిచ్చగింప
సుకుమారి జానకి ♦ సుఖముగావర్తింప, నేకాంతతల మొండు ♦ నెఱుఁగఁ జెపుమ
తే. యుచటికిని బోవువార మం ♦ చనిన లోక,పీరు నిటకు దశక్రోశ♦దూరమునను
గంధమాదననిభ ఋక్షు♦కపిసమేత,వాటి సుఖవాసము చిత్ర♦కూట మమరు.

తే. రామ తచ్చిత్రకూటప♦ర్వతముశిఖర,వితతు లెందాఁకఁ గనఁబడుఁ ♦ పృథివి నంత
దాఁకఁ గలప్రాణకోటులు♦తలఁపులందుఁ,గలుషముండదు పుణ్యంబు♦సలుపఁబడును.

తే. అందు నూఱులకొలఁదు లేం ♦ డ్లుపఘశీలు, రైనఋషితల్లజులు పెక్కు ♦ రాచరించి
ఘోరతపమును దినముసు ♦ గూడఁ జనిరి, సహకపాలశిరస్సులై ♦ జగము లెన్న.

కం. అని విజన సుగుటచే బిగా, కొదవింపు ముదం బటంచు ♦ సూహించెద; నీ
వెనువెంట నుండ నిట, సదయుత నాతోడ నేని ♦ చను నింటసంగన్. ౧౪౪౪

కం. అనుచు భరద్వాజుం డా,యనఘాతిథి నద్వితీయు ♦ నానుజు నుపచా
రనియతి సంతుష్టుంగఁ జే,సెను మఱి రాముండు కథలు ♦ చెప్పుచు నుండెన్

తే. సంజకెంజాయ లపరది♦శాతలంబు, నావరించెను బదపడి ♦ యనుజుతోడ
సీతతోఁ దదాశ్రమ♦సీమ విభుఁడు, సన్మతి వసించి వ్యథ పాయ ♦ సౌఖ్యముగను

కం. వేవిన మేల్కని పగానిఁ డ,పోవిభవుం డాకసీన♦పుణ్యతలమునన్
రేవుచ్చితి హాయిగ నిఁకఁ, బోవఁగ సెలవిచ్చెదరె ప్ర♦భూతపుఁగరుణన్. ౧౪౪౭

సీ. అనుడు భరద్వాజుఁ ♦ డాదిఘ్యూహముతోడ, ననుఁ బోయి రమ్ము పు♦ణ్యప్రభావ
చిత్రకూటంబు ప♦విత్రముధురమూల,ఫలసుధుయుత మగు♦స్థలము వెండి
నానాసగోపేత♦మానితకిన్నరో,రగసేవితము మయూ♦రసదకలిత
మిథరాజసేవిత ♦ మెంతయుఁ బుణ్యంబు, రమణీయ సుగుఁ గాన ♦ రామ పొమ్ము

ఆ. సీతుఁ దగిన నెలవు ♦ నిక్కంబ యచ్చటఁ, గనుఁగొనంగఁ గలవు ♦ కరిఘటలును
మృగసమూహములును ♦ క్రీడావిలోలంబు, లగుచుఁ దిరుగుచుండ ♦ నంబుజాక్ష.

కం. ఘుమఘుమలుం జమలుం దిరిగెడు,కగులున్ నిర్ఝరచయంబుఁ ♦ గందరతతులున్
దరులున్ శుకపికనాదిత,తరులున్ నీసరికి హర్ష♦దములగు ననుచున్. ౧౪౪౯

ఉ. బల్లునఁ దెల్లవాఱుటయుఁ ♦ బార్థివపుత్రులు నిండుఁ బ్రీతి సం
ధిల్లఁగ మ్రొక్కి మౌని కప♦నీధ్రముచాయను బోవఁ బూనఁగా
నల్లలితోక్తి వారలకు ♦ స్వస్త్యయనంబు ఘటించి సత్యవా
గ్వల్లభుఁ డేగె వెంట సుత♦వర్గముతోఁ జనుతండ్రిపోలికన్. ౧౪౫౦

భరద్వాజముని రామునకుఁ జిత్రకూటమార్గముఁ దెలుపుట.

సీ. రామునిఁ గని ముని♦రాజేంద్రుఁ డిట్లను, జాహ్నవీసూర్యజా♦సంగమంబుఁ
జేరి యామీఁదఁ బ♦శ్చిమముఖమై పాఱు, యమునతటంబు బట♦ననుసరించి
చని చని యానది ♦ సత్వరంబుగఁ బాఱు, కడ రాకపోకలఁ ♦ గరము వాడఁ
బడుట క్షుణ్ణంబైన♦బాటను గని యందుఁ, దెప్పఁ గట్టికొని మీ♦రొప్పమీఱ
తే. యమున నట దాఁటి యచ్చోట ♦ శ్యామ మనెడి
పెద్దమఱ్ఱిచెట్టు బహుతరు♦వృక్ష మగుచు
సిద్ధసేవిత మగుదానిఁ ♦ జేరి మెలి
దీనస లొసంగ మ్రొక్కింపు ♦ తీసఁ బోనె. ౧౪౫౧

చం. నిలిచిన నిల్వఁ డందుఁ, దమి ♦ నెక్కొనె నేనియుఁ బోవ నేగుఁ డా
వల, నట కొక్కక్రోశమున ♦ వర్తిలు నీలవనంబు వెండి శేఁ
గులు వెదురుల్ మనోజ్ఞము ల♦గుర్, బహు వారము లేగినాఁడ, నీ
చెలువపుఁ ద్రోవ మార్దవము ♦ చిచ్చుభయంబును లేదు రమ్యమా. ౧౪౫౨

చం. అని ముని జాడఁ జెప్పి యన♦ఘాత్మక! నిల్తునె యన్న రాముఁడున్
వినయము మీఱ లెస్స యన ♦ నిర్గలవేలుఁడు పోవ లక్ష్మణుం
గనుఁగొని మౌనినాసనను♦కంపకుఁ బాత్రుల మౌటఁ దమ్ముఁడా!
మనము సుపుణ్యు లంచు నర♦మండనుఁ డాడుచుఁ బోయి యావలన్. ౧౪౫౩

కం. సీతాసతి ముద్దుగ యము,నాతటముం బట్టి పోయి ♦ నది నడఁ జనుచో
టాతరణికులులు గని చిం, తాతత్పరు లైరి యెట్లు ♦ దాఁటుద మనుచున్. ౧౪౫౪

ఉ. కట్టెలఁ బ్రోవుఁ దెచ్చి, యెన♦కంబుగఁ దెప్ప బిగించి రావయిన్
గట్టిని యొంపుబొంగులును ♦ గట్టి, యుశీరము నైచి, మీఁదటన్
నెట్టన ప్రబ్బలీవెలను ♦ నేరెడుకొమ్మలఁ గూర్చి, సీతకున్
దిట్టము సత్సుఖాసనముఁ ♦ గూర్చె సుమిత్రతనూజుఁ డంతటన్. ౧౪౫౫

కం. ఇందిరమాడ్కి సచింత్యను, సుందరి దరలజ్జమాన♦సుదతిని సీతన్
ముందుగ రాముం డుడుపము, నం దెక్కఁగఁ జేసి పిదప ♦ నవనిజ ప్రక్కన్ ౧౪౫౬

కం. ఆమెపరిష్కారంబులు, నామెవసనములును నాయు♦ధావళి మఱియున్
రాముండు కరినకాజము, లామహితప్లవమునందు ♦ నారోపించెన్. ౧౪౫౭

సీ. కదలక యుండఁగఁ ♦ గాకుత్థ్సులాతెప్పఁ, బదిలంబుగాఁ జక్కఁ ♦ బట్టుకొనుచు
సీత నెక్కించి ని♦ర్భీతిఁ దరించుచోఁ, గాళింది మధ్యభా♦గంబుఁ జేరఁ
గరములు ముకుళించి ♦ ధరణీతనూభవ, యోవాఁక హేవాక ♦ వనియె నిట్లు
నిన్నుఁ దరించుచు ♦ నున్నవారము దేవి, నాపతివ్రతము సాం♦తంబుఁ జేసి
ఆ. సౌఖ్యముగను వెండి ♦ చనుదేర దయఁ గన, నమ్మ మరలి పురికి ♦ నరిగినపుడు
గవులు వేయుఁ గల్లు♦ఘటములు వందయు, నిచ్చుదాన నీకు ♦ మెచ్చు గదుర.
కం. అని మ్రొక్కు చుండఁ దెప్పయుఁ, జనె దక్షిణతటమునకును ♦ సరసకుజానం
దనమునకు నంత వారలు, జనకజ నట డించి వదలి ♦ చయ్యనఁ దెప్పన్. ౧౮౫

## సీతారామలక్ష్మణులు శ్యామవటంబుఁ జేరుట.

కం. యమునాతీరవనంబులఁ, గ్రమముగఁ గనుఁగొనుచు నరిగి ♦ కమ్రహరితప
త్రముల బహుశీతలం బగు, విమల శ్యామాఖ్యవటము ♦ వీరులు డాయన్. ౧౮౬
కం. న్యగ్రోధముఁ గని జానకి, వ్యగ్రత నిట్లనియె భూజ♦వంశోత్తమ! న
మ్యగ్రతి నాపతి నియమస, మగ్రతఁ గనఁ జేయుమా న♦మస్కృతిఁ గొనుమా.
కం. నాయత్తలఁ గౌసల్య న, మేయచరిత వినుతగుణ సు♦మిత్రను మరలన్
వ్యాయతముదమునఁ గనఁ గుజ, నాయక దయఁ జూడు నన్ను ♦ నానతిఁ గొనుచున్.
సీ. అని వలగొన్నధ♦రాత్మజఁ గనుఁగొని, సౌమిత్రితో రామ♦చంద్రుఁ డనియె
నీవు మున్నుగ సీత ♦ నెమ్మిఁ దోడ్కొని భర, తాగ్రజా! చనుము నే ♦ సాయుధుండ
నగుచు వెంబడి వత్తు ♦ నరుగుత్రోవను సీత, లలితపుష్పం బైన ♦ ఫలముఁ నైనఁ
గోరె నేనియు నీవు ♦ గొనివచ్చి యిమ్ము నా, నట్ల కాకని యతఁ ♦ డరుగు చుండ
తే. మత్తమాతంగయుగళంబు♦మధ్యముననను, జను కరేణుకభంగిని ♦ జనకతనయ
వార లిరువురనడుమను ♦ వఱలు ప్రీతిఁ, జనుచు నుండెను వింతలఁ ♦ గనుచు నచట.
ఉ. ఎన్నఁడు మున్ను చూడనిమ♦హిష్ఠవినోదకరంబు వృక్షమేన్
గ్రొన్నన యేనియుం గుసుమ♦కుంజమ యేనియుఁ గానరాఁగ నా
చిన్నది దానిపేరు రఘు♦శేఖర యెయ్యది? రామచంద్ర! యీ
క్రొన్నన నేమి యందు? రని ♦ కూరిమిఁ బ్రశ్న మొనర్చు వల్లభున్. ౧౮౮
ఉ. నల్లవొ! యెంతవింత ఛద♦నం బది, యీకుసుమంబు సొం పహో,
పల్లవ ముల్లముం గరఁచె ♦ బాపురె యీనను మోకరీవి నా
నల్లలనామనంబుఁ గని ♦ యంతన యంతన తత్పదార్థముల్
పెల్లుగఁ దెచ్చి యిచ్చు నవ♦లీల సుమిత్రసుతుండు భక్తిమై. ౧౮౯
తే. వింత యినుమయి జలము ల♦త్యంతహృద్య
హంససారసరవము లై ♦ యమలమైన

యమునఁ గ్రోశంబు చని కని ♦ యచట హరిణ
మాంసమునఁ బూటఁ గడపి రా♦మహీపసుతులు. ౧౪౬౬

తే. కేకికేకలుఁ గ్రోఁతుల♦కిచకిచలును, హస్తిఘీంకారములుఁ బర్వ ♦ యామునోప
వనమునందు ధరాత్మజ ♦ వలచుచోట, నేటియొద్దున నిలిచి ర♦హీనబలులు.

↞ శ్రీరాముఁడు సీతకుఁ జిత్రకూటంబునందలి చిత్రములం జూపుట. ↠

సీ. ఆరేయి యంతయు ♦ నచ్చోఁట గడపి వే,విన రాముఁ డవసుప్త ♦ ననుజు[1] మెల్ల
మేల్కొల్పి యనియె సౌ♦మిత్రి! వింటే వన్య,శుకపికశారికా♦సుందరస్వ
నము లింకఁ బయనింప ♦ సమయంబు నా నిద్ర, మత్తును గాసియు ♦ నొత్తి నైచి
లేచె నందఱు నిట్లు ♦ లేచి యాయేటినీ,రముల స్నానాదికా♦ర్యములఁ దీర్చి

తే. చిత్రకూటంబునకు ముని♦సింహదిష్ట
మార్గమునఁ బోవు చుండఁగ ♦ మానవేంద్రుఁ
డాసరోజాక్షిఁ గనుఁగొని ♦ యచటి చిత్ర
ములను నెల్లను దెలుపుచుఁ ♦ బోవు చుండె. ౧౪౬౭

ఉ. అల్లదె కంటె జానకి! ప♦లాశ మహీరుహకాననంబు లు
త్ఫుల్లసుమాంచితంబు లయి ♦ పోణిమి దీప్తము లైనయట్లు రా
జిల్లుచు నున్న వెల్లయెడ♦స్వీయమనోహరసూనపంక్తులన్
బెల్లుగ మాలికావితతి ♦ వేడ్క ధరించినభంగి నామనిన్. ౧౪౬౯

కం. కనుమీ పూచినజీడులు, జనములఁ జేరంగనీక ♦ సరసన్ ఫలప
త్రనిచయభరమున వంగెను, మనుగడ నేఁ గంటి నిట్టి♦ మ్రాఁకులు గలుగన్.

తే. తేనెటీఁగలు గూర్చిన♦ తేనెపెరలు, రెండుతూముల తేనెతో ♦ నిండి వ్రేలి
యాడుచున్నవియ వెఘూరు♦హాగ్రములను, గొండ కొండను ననుజ! క♦న్గొమ్మువాని.

కం. అల్లవిగో! నత్యూహము, లుల్లసితమనోజ్ఞకాన♦నోద్దేశములన్
బల్లవసుమతల్పంబులఁ, గొల్లగఁ గూయంగ మాఱు ♦ కూసెన్ నెమిళుల్. ౧౪౭౨

ఉ. వారణయూధరాజితము ♦ వల్గుశకుంతనితాంతకూజితో
దారము చిత్రకూట మదె ♦ తమ్ముఁడ కంటివె తన్నగంబునన్
జారుసమప్రదేశమున ♦ సారధరారుహవారమండితం
బై రహిఁ మీఱు పుణ్యతల♦మందు వసింపుద మన్న లక్ష్మణా. ౧౪౭౩

సీ. అని పల్కి శ్రీరాముఁ ♦ డనుజుండు సీతయుఁ, దనతోడ రాఁ జని ♦ ఘనముదమున
నానావిహంగమ♦నాదసంకులమును, బహుఫలమూలసం♦పన్నమగుచు
సరసోదకంబును ♦ జారుతరంబును, మంజులతాద్రుమ♦మండితంబు
వరతపోధనగణ♦వాసస్థలంబు నౌ,చిత్రకూటనగంబుఁ ♦ జేరి యిచట

---

[1] దీనివలన లక్ష్మణుఁడు ౧౪ సంవత్సరములు నిద్రలేకుండినవాఁడు కాఁడని యేర్పడుచున్నది.

తే. మనకు సుఖజీవనం బగు ♦ మంజులంబు, బహుళఫలమూలయుక్తంబు♦ప్రముదకరము
వివిధపుష్పితవల్లికా♦విటపియుతము, నగుచు నున్నది లక్ష్మణా ♦ నగతలంబు.

కం. పరమతపోవిభవులు ముని,వరు లీశైలంబునందు ♦ వాసము గొని నా
రిరవుగ మనమును నీక్షితి,ధర మంద వసింప వచ్చుఁ ♦ దలఁగని ప్రీతిన్. ౧౮౮౫

→ శ్రీరాముఁడు వాల్మీకిమహర్షిని సందర్శించుట. ←

కం. అని రాముఁడు లక్ష్మణుతోఁ, జనకతనూజాతతోడ ♦ సద్భక్తి వెసం
జనియె మహాత్ముని వాల్మీకిఁ, గన ముని కభివాదనంబుఁ ♦ గావించె నొగిన్. ౧౮౮౬

ఉ. ఆయనఘుండు వారలకు ♦ హార్షమునం దగుపూజ సల్పి వి
చ్చేయుఁ డటంచు స్వాగతము ♦ సేమము ప్రశ్న యొనర్చ రాముఁడుర్
న్యాయముఁ దప్పకుండఁ దమ♦నామములుం దమరాక హేతు న
త్యాయతభక్తిఁ దెల్పి ముని♦యాజ్ఞను గాంచి వచించెఁ దమ్మితోన్. ౧౮౮౭

కం. గట్టివి వరదారువులం, గట్టుము యొకయాకుటిల్లు ♦ కడురమ్యముగా
దిట్టమ్ముగ నన నాతఁడు, కట్టెఁ గుటీరం బొకండు ♦ క్ష్మారుహతతులన్. ౧౮౮౮

→ రామలక్ష్మణులు చిత్రకూటంబునం బర్ణశాల నిర్మించుట. ←

సీ. గాలికి వానకుఁ ♦ గంప మొందనిదాని, బాహ్యావరణముల ♦ బద్ధ మగుచు
భద్ర మై యొప్పెడు♦పర్ణశాలను గాంచి, శుశ్రూషమాఁఖఁ దైత ♦చూచు చున్న
యేకాగ్రు లక్ష్మణు ♦ నెలమిఁ గాంచి వచించె, శ్రీరామచంద్రుఁ డా♦ర్జింప వయ్య
ఱంకహూంసంబును ♦ జేయంగఁ దగుఁ బూజ, శాలకు ధరవాస్తు♦శమన విధియుఁ
తే. బెక్కునాళ్లు బ్రతుక న♦భీష్ట మైన,వారలకుఁ గరణీయ మా♦వశ్యకముగఁ
గాన హరిణంబు నొక్కటిఁ ♦ గానఁ జంపి, తెమ్ము స్మరియించుకొమ్ము వి♦ధిప్రవృత్తి.

చం. అనవుడు నాతఁ డట్టులె ర♦యంబునఁ జప్పఁగ వెండి పల్కుఁ బ్ర
న్నన హరిణామిషంబుఁ బచ♦నం బొనరింపు ధ్రువంబు మూర్తముర్
దినము నటన్న లక్ష్మణుఁడు ♦ తెప్పునఁ గృష్ణమృగంబుమాంస ము
గ్నిని బచనంబు సేసి కల♦నెత్తురు పోయెడిదాఁక, ని ట్లనున్. ౧౮౯౦

కం. పరిపూర్ణాంగంబులతోఁ, బరిపక్వం బగుట రామ♦భద్రా! కంటే
హరిణము తొల్లిటిభంగిన, కర మొప్పెను దీర్పు దేవ♦కార్యముఁ గుశలా. ౧౮౯౧

సీ. అనవుడు శ్రీరాముఁ ♦ డంబువులను దోఁగి, నియతి జపించి యా♦నిఖలవిధులఁ
దీర్చి దేవగణాళిఁ ♦ దృప్తిగాఁ బూజింప, నందఱు నిలు సొచ్చి ♦ రంత ముదితుఁ
డయి వైశ్వదేవబ♦లియు రౌద్రవైష్ణవం,బులు వాస్తుదోషముల్ ♦ పోవఁ ద్రోయు
పుణ్యాహవాచనం♦బును శాంతిజపము లో,నగుమంగళక్రియ ♦ లాచరించి

తే. యాపగాజలంబుల స్నాన ♦ మాడి పిదపఁ, గ్రూరభూతప్రశాంతి పొ♦ల్పార బలుల
నిచ్చె శ్రీరామచంద్రుండు ♦ హితము చెలఁగ, శాస్త్రనిగదితరీతిఁ బ్ర♦శస్తగతిని.

తే. ఆశ్రమంబున కనుహూవ ♦ మైన వేది, చైత్యములు నాయతనములుఁ ♦ జక్కఁ దీర్చి
వన్యమాల్యఫలాదులఁ ♦ బక్వమాంస,ములను దీర్ఘంబులను వేద♦కలితములను

తే. జపములను దర్భవితతుల ♦ సమిధలను య,థావిధిగ జానకీయుక్తిఁ ♦ బావనం బొ
నర్చి శాలాప్రవేశంబు ♦ నడపి దేవ,సభను బోలె శ్రీరామ♦చంద్రుఁ డొప్పె.

శా. నానాపక్షిమృగాకులంబు సుమనో♦వన్యద్రుమభ్రాజితం
బై నాగేంద్రమృగానునాదితము నై ♦ హారిప్రతీరాఢ్య మౌ
కానన్ మాల్యవతీతటంబునను జో♦కన్ జానకీ రాఘవుల్
సానందంబుగఁ గ్రీడ సల్పిరి ప్రవా♦సాయాససంవిస్మృతిన్. ౧౪౮౫

↔ సుమంత్రుఁడు మరల నయోధ్యకుఁ బోవుట. ↔

సీ. దుఃఖార్తుఁడై సుమం♦త్రుండు గుహుఁడు రాముఁ, గనుచూపుమేరదాఁ♦కను దదీయ
కథ ముచ్చటించుచుఁ♦గనుఁగొనుచుండి యా,నల నింటి కేగి రా♦యలఘుమతులు
చని ప్రయాగమునందు♦మునిభరద్వాజుని,తో డ నుండుటయు సం♦తోస మార
నాగిరిగమనంబు ♦ నానిషాదాధిపు, చారులవలనను ♦ జక్క నెఱిఁగి

ఆ. గుహునిచే ననుజ్ఞఁ ♦ గొని సుమంత్రుం డయో,ధ్యాపురంబునకు ర♦థంబుఁ దోలు
కొనుచు నరిగె వనటఁ ♦ గోమలగంధన,నాపగానగరము ♦ లరసి కొనుచు. ౧౪౮౬

మ. చనుచున్ మూఁడవజాము వేళ గతహా♦ర్దం బౌట నిశ్శబ్ద మై
కన శూన్యంబుగఁ దోఁచు చున్నపురముం ♦ గన్నీటితోఁ జొచ్చి దు
ర్గమనుఁ డై వాజులు వారణంబులు ప్రజల్ ♦ రాజుల్ గనన్ లోక భూ
తనయావల్లభశోకహవ్యవహద♦గ్ధం బైనచందంబునన్. ౧౪౮౭

ఉ. తోఁచుచు నున్నదంచుఁ బురి♦దోరముఁ జేరుచు లోనఁ జొచ్చి లోఁ
గ్రాఁచుచు నున్నదుఃఖమునఁ ♦ గ్రన్నన పోవ సుమంత్రుఁ డార్తినొఁ
బూఁచి పురీజనంబు రఘు♦పుంగవుఁ డేఁడి య టంచు నాతనిన్
వాఁచినయట్లు దుఃఖమున ♦ వాఁచినమోముల నడ్డగించినన్ ౧౪౮౮

కం. గంగాతీరమునన్ రఘు,పుంగవుచే నాజ్ఞఁ గొంటిఁ ♦ బోయిరి వారల్
గంగాతరణ మొనర్చి య,నంగా హా రామ యని జ♦నంబులు వనటన్ ౧౪౮౯

↔ సుమంత్రునిరథముం జూచి పౌరులు దుఃఖించుట. ↔

ఉ. హా యనువారు భూపతన♦యా యనువార లిఁ కేటిజీవ మి
స్సీ యనువారు గుంపు లయి ♦ చేసెడి దే మిఁక వచ్చినారమే
హా యనువారు దానసవ♦పుణ్యసమాజవివాహవేళలం
దాయనఘాత్ము నింకఁ గన ♦ నౌ నెటు లం చనువారు నై రటన్. ౧౪౯౦

సీ. ఆరామచంద్రుఁ డెపో ♦ మాదటఁ గన కున్న,మన కేది సుఖకర ♦ మనఘులార
యాలోకహితు డామహా♦నాలోకనము లేక,యగుస్త్రియం బేక నెద్ది♦యార్యులార
యానళినాక్షు డా♦యంగ లేకయ యున్నఁ, బొరి సుఖావహ మెద్ది ♦ పుణ్యులార
మన తండ్రివలెఁ బ్రో చు♦ననఘుఁడు పెడఁబాయ, ది క్కేది మన కింక ♦ దీనులార

తే. యెంత నిర్భాగ్యులము కదా♦చింత సేయ, నట్టిధర్మాత్ముఁ డటువంటి♦యనఘమూర్తి
యట్టి హృదయాళుఁడట్టిద♦యాపరుండు, విడిచిపోయిన మని యిట్లు♦మిడుకుచుండ

కం. ఏది సుఖంబు నొసంగునొ, యేది యెుకో ప్రియము జనుల ♦ కెల్లను క్షేమం
బేదియొ కూర్చెడు నని సీ,తాదయితుఁడు మనలఁ బ్రోచెఁ ♦ దండ్రియపోలెన్.

కం. వాతాయనగతసరసీ,జాతాయతలోచనలు స♦సహ్యాం బగుదుః
ఖాతురతం బలవించిరి, సీతానాయకునిఁ గూర్చి ♦ చిత్తం బగలన్. ౧౪౩

కం. సారథి విహితాస్యం డై, తేరిం దోలుకొని చనియెఁ ♦ దెప్పున భూపా
గారమునకు సట డిగ్గి మ,హారయమున సర్వజనస♦మాకుల మగుచున్ ౧౪౪

సీ. దిట్టంబు లగునేడు♦తోట్టికట్టులు దాఁటి, యరుగ సౌధవిమాన♦హర్మ్యరాజ
మందిరాగ్రంబుల ♦ మందయానలు నిల్చి, రామశూన్యం బైన♦రథముఁ జూచి
విపులహాహాకార♦వికృతస్వరంబుల, నొండొరుఁ గనుఁగొని ♦ యుల్ల మెరియ
నాయతవిమలనే♦త్రాంతంబు లం దుండి, కాల్వలు వాఱంగఁ ♦ గంటినీరు

తే. పొక్కుచును నేడ్వఁ బ్రాసాద♦ములను నంత, టంతటను నిల్చి దశరథు♦నింతు లెల్ల
మహిపసాన్నిధ్యమునఁ జేసి ♦ మందమంద,ముగను నీరీతి నేడ్చిరి ♦ మొగములుబ్బ.

ఉ. రామునితోడ నేగి యిటు ♦ రామునిఁ గానలపాలు సేసి తా
నే మని కోసలాత్మజకు ♦ నీతఁడు చెప్పెడి వాఁడొ, యెట్టు లిం
కేము మనంగ సాధ్య మెుకొ ♦ యీగతి నామెయు రాముఁ బాసి మే
నో మెడి నట్టి దుష్కర మ♦హో యెటు లోర్చు దురంతతాపమున్. ౧౪౬

సుమంత్రుఁడు దశరథుఁ జూచుట.

సీ. అనుచు రాచపడంతు ♦ లాడు చుండఁగ విను, చమితశోకహుతాశ♦నార్చిఁ గ్రాఁగు
చున్నదో యన నొప్పు ♦ మన్న రాజగృహంబు,నం దెనిమిదవక♦క్ష్యను సదీన
మానను నాతురు ♦ మహితపుత్రవ్యథా,మ్లానుఁ బాండరగృహ♦మధ్యమునను
గాంచి నమస్కృతిఁ ♦ గావించి శ్రీరాము, వాక్యంబు లెల్లను ♦ వరుసఁ జెప్ప

తే. హాని యై విని విభ్రాంత♦మానసమున, నేలపైఁ బడి మూర్ఛిల్ల ♦ నేలతేఁడు
బాహువుల నెత్తి హా యని ♦ భామ లెల్ల, రోదనము సేయ సాగిరి ♦ క్రూరగతిని.

సీ. కౌసల్యయు సుమిత్ర ♦ బొసటగా నాథు, సెత్తి యి ట్లనియె భూ♦మీశ! యీతఁ
డఘటనఘటనాస♦మర్థునిదూత కా, యడవులయందుండి ♦ యురుగు దెంచె
నింత యన్యాయంబు ♦ నేఁ జేసితిని గదా, యని యేల లజ్జించె ♦ దధిప యిపుడు
లే లెమ్ము పుణ్యంబు ♦ చాల నీకు లభించు, నేడ్చిన ఫలమింక ♦ నేమి గలుగు
తే. నెవ్వతెకు నీవు జడిసి నీ♦ తేఁకువార్త, యైన నడుగవో యట్టినీ♦ప్రాణదయిత
నైక యిట లేదు సత్యంబు ♦ గాన దిటను, దెచ్చుకొని మాట లాడంగ♦వచ్చు నీకు.
మ. అని కౌసల్య సతాంతదుఃఖమున మూ♦ర్ఛాక్రాంత యై నేల వ్రా
లిన శుద్ధాంతసరోజపత్త్రనయన ♦ ల్వీక్షించి హాహారవం
బున న్వేడం గని చుట్టుప్రక్కఁ గలపూ♦వుంబోండ్లు వృద్ధాళి యా
వనవంతుల్ విలపించి రంతిపురి మ్రో♦వన్ హాల్లకల్లోల మై. ౧౪౯౯

దశరథుఁడు సుమంత్రుని రామలక్ష్మణుల వృత్తాంత మడుగుట.

ఉ. అంతట మూర్ఛఁ దేఱి మను♦జాగ్రణి యాత్మసుతాగ్రగణ్యవృ
త్తాంత మెఱుంగఁ గోరుమతిఁ ♦ దాల్చిన సూతుఁడు కేలు మోడ్చి య
త్యంతవిషాదచిత్తుఁ బరి♦తప్తు నవగ్రహ మైనరోగ మా
దంతిని బోలువాని వసు♦ధాపతి డాసిన నంత నాజియున్ ౧౫౦౦
కం. ధూళిని బ్రుంగినమేనును, గాలువ లై పాఱుబాష్ప♦కణములు మున్నే
వ్రాలినతలయును నార్తిం, దూలినమో మైన సూతు♦తోడం బలికెన్. ౧౫౦౧
సీ. అత్యంతసుఖి యయి ♦ యలరు ధర్మాత్ముఁ డే, చెట్టుమొదల్ల వ♦సించె నయ్య
రాచబిడ్డఁడు శయ్య♦నోచితుం డతికోమ, లుండు నేనేలపైఁ ♦ బండె నయ్య
యెవ్వనిబడి నేగు ♦ నిభరథభటతతి, వాఁ డేవనంబున ♦ వనరె నయ్య
లేలిహానమృగావ♦లీనిషేవితకాన, నమునఁ గొండిక లెట్లు ♦ నవసి రయ్య
ఆ. బాల ముద్దరాలు ♦ పరమపతివ్రత, యన్నెపున్నె మెఱుఁగ♦నట్టిసీత
వెంట నంటఁ బుత్త్రు ♦ లొంటి మై కాల్నడ, నరదము డిగియెట్లు ♦ లరిగి రయ్య.
కం. కన్నారఁ గాంచినాఁడవు, మన్నందనయుగ్మ మడవి ♦ మందర మఖ్యుల్
పన్నుగఁ జొచ్చినగతిఁ జొరఁ, గ న్నీవే ధన్యతముఁడు ♦ కావె సుమంత్రా ౧౫౦౩
ఉ. ఏ మనె రామచంద్రుఁడు మ ♦ తే మనె నయ్య సుమిత్రపట్టియుఁ
భూమితనూజ యే మనియెఁ ♦ బో మ్మను వేళను నిన్నుఁ జెప్పుమా
యామహనీయుఁ డుండుతల ♦ మాతఁడు దేని భుజించె నెట్టు? లే
నీమెయిఁ దాల్చువాఁడ విని ♦ యేనియు సాధులలో యయాతినాన్. ౧౫౦౪
కం. అని తన్ను నృపతి యడిగిన, విని కంఠగతోరుబాష్ప♦వికలరవుం డై
వనరుచుఁ బలుకులు దడఁబడ, ననియె సుమంత్రుండు రఘుకు♦లాగ్రణితోడన్.

⟻ సుమంత్రుఁడు దశరథునకు రామవాక్యంబులఁ దెల్పుట. ⟼

సీ. నామాట విదితాత్మ♦ నాతండ్రి మ్రొక్కుమీ, పదములఁ బడి మొట్ట♦ మొదట నంత
వారికి వారికి ♦ వల సగురీతిగా, నాకుఁగా నభివాద♦నములు సేసి
శుద్ధాంతకాంతల ♦ సుఖమె కా మీ కెల్ల, ననుచు నామాటగా ♦ నడుగ వయ్య
మాతల్లిఁ గౌసల్య ♦ మఱిగాంచి కుశలాభి, వాదనంబులు సల్పి ♦ పలుకు మిట్టు
ఆ. లెల్లకార్యములను ♦ నేమఱ కోయమ్మ! ధర్మనిత్య వగుమ ♦ తగినవేళ
నగ్న్యగారపరత ♦ నలయకు; పతిపాద, ములను గొలుము దేవుఁ ♦ గొలుచునట్లు.
ఉ. మానము పొంతఁ బోక, యభి♦మానము దూరముఁ జేసి త్రేనిక
న్మ్యానకుఁ గైకకుఁ మనసు ♦ నొవ్వక యుండెడుమైఁ జరింపు, త
త్సూనుఁడు నేలతేఁ డనుచుఁ ♦ జూడుము; రాజులు విత్తవృద్ధు లౌ
నానుడి నీ వెఱుంగవె? మ♦నంబున నిల్పుము రాజధర్మముల్. ౧౫౦౭
చం. భరతుఁడు వచ్చినం గుశల♦వార్తలు మద్వచనంబుగాఁగ నీ
వరయుము; యెల్లతల్లు లెడ ♦ న్యాయపువృత్తిన సంచరింపుమీ
ధరణిపతిత్వ మూని ముది♦తండ్రిని జిక్కులఁ ద్రోయఁ బోకుమీ
వరనృపభూరిభోగముల ♦ వ్రాలుము తండ్రి వచించుపద్ధతిన్. ౧౫౦౮
చం. అని వచియింపు మంచు నయ♦నాంబులు రాలఁగ వెండిఁ బల్కు నీ
జననిగఁ జూడ నయ్య యను♦జా! సుతగర్ధిని నాదుతల్లి, నం
చును గనునీరు నించెఁ గడు♦శోకమునన్ ధరణీశ! ఫుల్లకో
కనదదళాక్షుఁ డామహిజ♦కాంతుఁడు రాముఁడు మోము వ్రాల్చుచున్. ౧౫౦౯

⟻ సుమంత్రుఁడు దశరథునకు లక్ష్మణువాక్యంబులఁ దెలుపుట. ⟼

సీ. సౌమిత్రియో రోష♦సంభ్రమంబున రోఁజు, చును నిట్టు లనియెను ♦ వినుము దేవ
యేయపరాధంబుఁ ♦ జేయఁ గాసలఁ ద్రోచెఁ, రాజపుత్రాగ్రణి ♦ రామచంద్రు
మీరాజు చెప్పుమా ♦ తేరకు మా కిట్లు, వ్యసనంబు గలుగంగ ♦ వలచుకైక
తుచ్ఛ శాసనమును ♦ ద్రోష్ఠగాఁ దలఁ దాల్చి, చేయఁగారానట్టి♦చెనఁటిసేఁతఁ
ఆ. జేసెఁ గార్యబుద్ధి ♦ వాసిగ వరదాన, లాభముననొ రాజ్య♦లోభముననొ
యేమి హేతు వైన ♦ రామునిఁ బాయుట, నిష్కృతియును లేని♦దుష్కృతంబ.
కం. దైవప్రేరణమున నిటు, గావించె నటంచు ననెదె ♦ కలుగఁగ వలదా
దైవమునకుఁ గారణ మొకఁ, డావిధ మేదైన నున్న ♦ నాడుము వినెదన్? ౧౫౧౧
కం. ఆలోచింపక మతి లే, కీలోకవిరుద్ధకార్య ♦ మిటు చేసెను భూ
పాలుం డనియెదె దానికె, జాలిం గొనియెదము దాన ♦ జనపతి యేడ్చున్.

కం. రాముఁడె భ్రాతయు భర్తయు, రాముఁడె ప్రియబంధువరుఁడు ♦ రాముఁడె చుమ్మీ
రాముఁడె నాజనకుం డును, భూమిపునెడ లేదు జనక♦బుద్ధి సుమంత్రా. ౧౫౧౩
ఆ. సర్వలోకహితుని ♦ సర్వలోకప్రియు, ననఘు ధర్మరతు జ♦నాభిరాము
రాము విడిచి యెట్లు ♦ రంజింపఁ జేసెదు, ధరణి నెల్ల ననుము ♦ దశరథునకు.
కం. ఇంతటిలోకవిరుద్ధపు,వింతలఁ బచరించు నీవు ♦ విశ్వంభరకుఁ
గాంతుఁడ వెట్లగు దనుచు సు,మంతా నామాటగాఁగ ♦ మహిపున కనుమా.
తే. అనియె; జానకియో యూర్పు♦లొనర పోఁకు, పోఁకినట్టులు దిగ్భ్రమఁ♦జూచుచుండెఁ
గాని దుఃఖం బెఱుఁగని♦కమలనయన, యేడ్చు చుండె మహారాజ ♦ యేమి యనక.
కం. కనునీరు దొరఁగుచుండెడు, పెనిమిటిముఖపంకజంబు ♦ వీక్షించుచు వా
డినమోముఁదమ్మితో ననుఁ, గనుచు మహిజ బాష్పవారిఁ ♦ గార్చుచు నుండెన్.
కం. సౌమిత్రి బాహుపాలితుఁ, డై మో మశ్రులను దడియ ♦ నంజలితోడన్
రాముండు నిలిచి యుండెను, భూమిజ నను రథముఁ గనుచుఁ ♦ బొక్కుచు నిలిచెన్.
చం. అనుడు నృపేంద్రుఁ డి ట్లనియె ♦ నావలిశేషకథాంశ మింక వా
కొనుము సుమంత్ర! యన్న రఘు♦కుంజరు లంత జడల్ ధరించి గ్ర
క్కునఁ గుశచీరధారు లయి ♦ గంగను దాఁటి ప్రయాగవంకగాఁ
జనిరి, సుమిత్రపట్టి రఘు♦చంద్రముఁ గాచుచు మున్నుగాఁ జనెన్. ౧౫౧౯
కం. ఆతని వెంబడిఁ జనె భూ,జాతయుఁ దన వెన్క రామ♦చంద్రుఁడు రాఁగన్
ఖ్యాతలధన! యింతయుఁ గని, చేశము దుఃఖార్ణవమునఁ ♦ జిడిముడివడఁగన్
కం. మాపుల మరలింపఁగ సీ,తావిభు వేర్పాటు చూచి ♦ తత ముష్ణాశ్రుల్
లావుగఁ గాఱఁగ మరలవ, భూవల్లభ! యవియు శోక♦పూర్ణము లగుచున్.
తే. ఇరువురకు రాజపుత్రుల ♦ కేను మ్రొక్కి
వగపు సహియించి గుహునితో ♦ వచ్చి యుంటిఁ
బెక్కుదినములు నే నంద ♦ పిలువ నంపఁ
డా రఘూద్వహుఁ డనియెడి♦యాశఁ జేసి. ౧౫౨౨

సుమంత్రుఁడు తాను వచ్చుమార్గమునఁ జూచినవిశేషంబులఁ జెప్పుట.

చం. మలమల మాఁడి యుండె సుమ♦మంజులకుట్మలకోరకావళుల్
సలసలఁ గ్రాఁగు చుండెను గొ♦లంకులు నేఱులుఁ బల్వలంబులున్,
గలగల లాడు చుండెను న♦గంబుల నాకులు నెండి వర్ణలై,
విలవిల పోవు చుండెఁ బృథి♦వీధవ! చిత్తము ద్రోవ వచ్చుచోన్. ౧౫౨౩
కం. మెదలవు కాకోదరములు, కదలవు వన్యేభములును ♦ ఘాతుకమృగముల్
రొద యైన వినఁగ రా దట, సదమలగుణశీల! రామ♦చంద్రభృశార్తిన్. ౧౫౨౪

సీ. లీనపుష్కరపత్ర♦లీనమీనవిహంగ,తప్తపద్మమృణాళ♦తతులఁ గంటిఁ
బూర్వంబునట్టులు ♦ పారి జలజప్రసూ,నములేని స్థలజసు♦మములు గాని
కమ్మవాసన లించు♦కయు నీవు తోఁటలు, శూన్యంబు లైనవి ♦ మాన్యచరిత
యెక్కడివిహగంబు ♦ లక్కడనే సోలి,పడి యుంట నవియును ♦ బాడు దోఁచె
ఆ. నేమి చెప్పువాఁడ ♦ నీయూర నొకనికేఁ, దేటమొగము లేదు ♦ మాటిమాటి
కూర్పు పుచ్చువార ♦ లుర్వీజధవులేమి, నిలువుగుండెతోడ ♦ నిలిచి చూచి.

సుమంత్రుఁడు పౌరులదుఃఖమును దశరథునకుఁ జెప్పుట.

ఉ. రాముఁడు లేనిస్యందనము ♦ రాఁ గని పౌరులు దుస్సహవ్యథో
ద్దామత రాజమార్గమునఁ ♦ దల్లడ మందిరి, కాంత లన్ననో
భూమిప! సౌధవీథులను ♦ బొక్కుచు హా యని యేడ్చి, రింక నే
నేమి వచించువాఁడ ధర♦ణీశ్వర! దుస్సహాలోకశోకమున్. ౧౫౨౬
కం.విమలాయతనేత్రంబులఁ, బ్రమదలు కన్నీటితోఁ బ♦రస్పరవీక్షా
క్రమ మేది యేడ్చు చుండిరి, శమియింప వశంబు గాని♦సంతాపమునన్. ౧౫౨౭
కం.వీరలు నీపగవారలు, వీర లుదాసీనజనులు ♦ వీరలు హితు లం
చోరాజ! తెలుఁగ నైతిని, వారక జను లెల్లవారు ♦ వనరుచు నుంటన్. ౧౫౨౮
కం.సంతోషరహితలోకయు, సంతప్తహయద్విపార్త♦శబ్దార్దితయుఁ
జింతానిశ్వాసయు భూ,కాంతా! కౌసల్య యనఁగఁ ♦ గ్రాలెం బురియున్. ౧౫౨౯
కం.ఈరీతి సూతుఁ డాడిన, ఘోరమణుం డాలకించి ♦ గాఢవ్యసనో
దారత దారితమతి యై, కూరినగద్గదిక మంత్రి♦కుంజరు ననియెన్. ౧౫౩౦

సుమంత్రునితో దశరథుఁడు తన్ను రాముఁ డుండుచోటికిఁ దీసికొని పొమ్మని చెప్పుట.

సీ. పాపాభిజనభావ ♦ బాలిశ కైకేయి,వినియుక్తమై నవి♦వేకి నగుచు
మంత్రకుశలు లైన♦మంత్రులు వృద్ధులు, హితులు ధీయుతపౌరు♦ లింప తోంద
మసల నొక్కరితోడ ♦ మంతనంబుండక, స్త్రీ మోహమునఁ జేసి ♦ చేసినాఁడ
నేమిరో మునిఁగి పో♦యినయట్లు నాహసం, బిది భవితవ్య మై ♦ యేటుపడియెఁ
ఆ. గులవినాశమునకుఁ ♦ గూడె యదృచ్ఛమై, యిట్టిఘోరదుఃఖ; ♦ మేను నీకుఁ
గొంచెమేని మేలు♦గూర్చియయుండినఁ, బొమ్ము తోడుకొంచుఁ ♦ బుత్రుకడకు.
కం.ఇప్పటికిని నాయానలి, తప్పక చెల్లెడినయేని ♦ తనయునిఁ దె మ్మీ
తెప్పున రాముఁడు లేమిని, ముప్పొదవెడి బ్రతుక లేను ♦ ముహూర్తం బేనిన్. ౧౫౩౨
ఉ. దూరము పోవు నేమొ యల♦తోయజమిత్రకులోద్వహుండు నా
తేకిని బన్ని న న్నటకుఁ ♦ దెప్పునఁ దోడ్కొని పొమ్ము సారథీ!

యారమణీయమూర్తి విమ♦లాయతకీర్తి జగజ్జనాళిహృ
ద్వారిజవర్తిఁ గాంచఁగల♦వాఁడ ధరన్ మని యుండఁగల్గినన్. ౧౫౩౩

ఉ. ఆనగుముద్దునెమ్మొగము ♦ నామణికుండలమండితంబు లా
వీనులు నాప్రఫుల్లదర♦విందవిశాలవిలోచనంబు లా
జానుసుదీర్ఘబాహువులుఁ ♦ జారుతరం బగుపఙ్క్తదంతముల్
గానకయున్న సంయమనిఁ ♦గానఁగఁ బోక ధ్రువంబు సారథీ. ౧౫౩౪

తే. ఇంతకంటెను దుఃఖ మిం ♦ కేది గలుగు, నిట్టిదురవస్థలో నున్న♦యట్టినేను
గన్నులారఁగ రఘురాముఁ ♦ గానలేతి, నేనియు సుమంత్ర! ది క్కేది ♦ యింకనాకు.

కం. హారామా రామానుజ, హారమణీమణి ధరాత్మ♦జా దుస్సహదు
ష్ప్రారవ్యథ ది క్కఱిన, ట్లీరీతిని జచ్చునన్ను ♦ నెఱుఁగర మీరల్. ౧౫౩౬

సీ. అని తేఁడు మున్గి దుః♦ఖాంబుధిఁ గౌసల్య,దిక్కు మొగం బయి ♦ దేవి రామ
శోకమహాభోగ ♦ మై కంజనేత్రవ,ధూరత్నవిశ్లేష♦పారగంబు
నై శ్వసితోర్మిమ♦హావర్త మై బాష్ప, ఫేనజలావిలా♦భీల మగుచు
హస్తవిక్షేపమీ♦నౌఘ మై క్రందితో,దీర్ణరవంబు ప్ర♦కీర్ణ కేశ

తే. శైవలంబును గేకయ♦క్ష్మాతలేంద్ర,పుత్రి కాబడబాముఖ♦మును నుదగ్ర
వేగజము మంథరావాక్య♦వికటనక్ర,భీకరము పాపినీవర♦వేల మగుచు. ౧౫౩౭

కం. రామప్రవ్రజ్యాయుత, మౌమహితార్ణవమునందు ♦ నబలా యిపు డా
రాముఁడు దోడ్పడ కుండిన, నే మునుఁగుదు; దాఁట లేన ♦ యీదుఃఖాబ్ధిన్.

చం. అనుజసమేతురాముఁ గన ♦ నాశ జనించియుఁ గానలేన యో
వనితరో యింతకంటెఁ బెనుఁ♦బాపము గల్గునె యంచు మూర్ఛిలం
దనయునిమిత్త మై హృదయ♦నాథునిఁ గూర్చియు నిబ్బడింపఁగా
మనమున దుఃఖ మామహిళ ♦ మానవిభీతి వణంకి వెండియున్. ౧౫౩౯

ఉ. భూతము సోఁకిన ట్లునుఱు ♦ పోయినయ ట్లయి రాముమాత యా
సూతునిఁ జూచి యి ట్లనియె ♦ సూతకులాగ్రణి! నన్ను రాముఁడున్
సీతయు లక్ష్మణుం డెచటఁ ♦ జేరిరొ యచ్చట వీడు పుణ్య మౌ;
ఖ్యాతచరిత్రుల న్విడిచి ♦ కాయము నిల్వదు పో నిమేషమున్. ౧౫౪౦

చం. మరలుపవయ్య తేరు గుణ♦సుందను లుండెడిదండకాటవిన్
సరగున నన్ను వీడు మిఁక ♦ నాసుతులం గదియంగ లేనిచో
నరుగుట నిశ్చయంబు యము♦నాలయసీమకు నంచు నేడ్చినన్
గరుణము దోఁప నారమణిఁ ♦ గాంచి సుమంత్రుఁడు పల్కు మ్రొక్కుచున్.

## సుమంత్రుఁడు కౌసల్య నూరార్చుట.

కం. విడువుము శోకము మోహము, విడువుము దుఃఖభ్రమంబు ♦ విడి పరితాపం
బడవులలో దేవీ! నీ,కొడుకు చరించెడిని నీదు♦కోడలితోడన్. ౧౫౪౨
కం. సౌమిత్రియు ధర్మరతిన్, భామారత్నంబ! రాము♦పదపంకజముల్
నేమములను విజితేంద్రియుఁ, డై మహితపరంబు నొంద ♦ సర్చన సేయున్. ౧౫౪౩
ఉ. రామునిమీఁద మానసము ♦ రాజముఖీమణి సీత నిల్పి తా
ధామమునందుఁబోలె జన♦తారహితాటవి నైజభంగియు
ద్దామిత నొంది భీతియు ర♦వంతయుఁ గానక ధీరయట్టు లెం
తో ముద మారఁగాఁ దిరుగు ♦ చున్నది కాన దొకింతదైన్యమున్. ౧౫౪౪
కం. ప్రమదావనాంతరములం, బ్రమదామణి మున్నుతిరుగు♦భాతిని జనశూ
న్యము లగు నడవులయందును, రమియించుచు నున్న దమ్మ ♦ రాగము మీఱన్.
కం. బాలికవలె బాలేందుక,ళాలాలితనిటల యాని♦లానుత నిజహృ
త్పాలాధీనాత్మక జన,జాలచ్యుత వనులలోను♦సతి రమియించెన్. ౧౫౪౬
కం. తదధీనం బయి ప్రాణము, మది తద్గత మగుచు నుంట ♦ మహిజ కయోధ్యా
పద మడవి రాము లేమి, న్మదిరాక్షికి వన మయోధ్య ♦ నాథుం డుంటన్. ౧౫౪౭
ఉ. రాముని లక్ష్మణున్ జనక♦రాజతనూభవ త్రోవ నున్నయా
గ్రామములం బురంబులఁ ద♦రంగిణులన్ ద్రుమపాళిఁ గాంచి వే
రేమియొ వీని? కెందుఁ జను ♦ నియ్యవి? యే మది? యంచుఁ బ్రశ్నలన్
గోమలి సేయుచుం జనియెఁ ♦ గూర దొకింతయు శోక మాత్మలోన్. ౧౫౪౮
తే. మనపురంబున కొకక్రోశ♦మాత్ర మున్న,యూటతోఁటను గ్రీడించు♦సరసమునను
నడవిఁ దిరుగుచు నున్న దా♦యమలచిత్త, యామె కై నీవె దుఃఖంప ♦ నగునటమ్మ.
సీ. ఇప్పుడు జ్ఞప్తి నా ♦ కింతియ కైకేయిఁ,గూర్చి తటాలునఁ ♦ గోమలాంగి
యేమేమొ పల్కె న ♦ వ్వెల్ల దోఁపవ యిప్పు, డని ప్రమాదంబున ♦ జనకతనయ
పలికినపలుకులు ♦ పలుకఁ బూనియును ద,త్ప్రస్తావమును ద్రిప్పి ♦ ప్రసుదకరము
లైనవాక్యంబుల ♦ ననియె మధురముగ, దారి గాసిని గాని ♦ ఘోరవాత
తే. వేగమునఁ గాని యెండల♦వేఁడి నేని, సంభ్రమున నేనిఁ జంద్రాంశు♦సదృశకాంతి
వికృతినొందద యింతేని ♦ విడువు చింత, తల్లి నీపాదమాన త♦థ్యంబు సుమ్ము.
కం. అంభోజపత్రనిభము సు,ధాంభోనిధితనయతుల్య ♦ మయి రాజిలునా
కుంభినిసుతముఖముకురము,జృంభము రవ యేని వికృతిఁ ♦ జెందదు తల్లీ. ౧౫౫౧
కం. లాక్షారసనిభపదములు, లాక్షారసహీనము లయి ♦ లలితనుకాంతిన్
సాక్షాత్కమలముకుళములె, లక్షింపఁగ నిప్పుడును ని♦లాసంభవకున్. ౧౫౫౨

ఉ. సొమ్ములమీఁదిప్రేమమున ♦ సుందరి జానకి నూపురమ్ములన్
సమ్మతిఁ దాల్చి యే హృదయ♦నాథునితో సరిగాఁగ నేగు వే
గమ్మునఁ బోవఁ బాదములు ♦ ఘల్ఘలు ఘల్లన హంసవోలె మో
దమ్మున నేగఁ గంటిఁ జుమి ♦ తల్లి యిఁక నేటికి నీకుఁ జింతిలన్. ౧౫౩

కం. శ్రీరాముబాహుదుర్గం, బారఁగఁ దా నాశ్రయించి ♦ యడవిని బులులన్
గారుల సింగంబులఁ గన్నారఁగఁ గాంచియును భీతి ♦ నందదు సుమ్మా. ౧౫౪

కం. వారికిఁగా మన కేనియు, భూరమణుంగూర్చియైనఁ ♦ బొగలకు మమ్మా
వీరిచరిత్రము స్థిర మై, ధారిణి సత్కీర్తితోడఁ ♦ దరలక నిలుచున్. ౧౫౫

చం. జనకుని యాజ్ఞఁ బూని తన♦సత్యము లోకములో రహింపఁగా
మునిజను లేగుమార్గమున ♦ మోదముతో ఫలపత్రభోజి యై
యనఘుఁడు నిత్యకీర్తిఁ గను ♦ న్నార్తిని గూరకు మన్న నామెయుం
దనయుఁ దలంచి యేడ్చెను సు♦తా సుకుమార కుమార రాఘవా. ౧౫౬

→ కౌసల్య దశరథునితో నతనిదుశ్చేష్టగుఱించి చెప్పుకొని యేడ్చుట. ←

చం. అని విలపించుచున్ సుదతి ♦ యాత్మవిభుం గని పల్కు భూమిపా!
తన రెడిఁ గాక నీ కిల వదాన్యుఁడు కారుణికుండు సత్యవా
గ్ధనుఁడు ప్రియైకవాది యని ♦ గాథయశంబు; సుఖప్రవృద్ధు లౌ
వనమునఁ బుత్రకుల్ నృపతి♦వర్యతనూజయుఁ గుందు రెట్లొకో. ౧౫౭

కం. చలికిన్ వేఁడికి గాలికి, వలిగొనక తపింప కెట్లు ♦ నడిఁ బడక వనీ
స్థలిఁ దరుణి శ్యామ సుఖయుత, మలయున్ సుకుమారి సుఖిత ♦ మైథిలి చెపుమా.

ఉ. పప్పును నూరుగాయలును ♦ బచ్చడులుం దననోటి కింపుగా
నొప్పుగ నంజుకొంచు మృదు ♦ వోగిరమున్ భుజియించుసీత హా
యుప్పును లేక చప్పిడివి ♦ యుర్విని రాలినగడ్డిగింజ లే
చొప్పునఁ దా మెసంగెడినొ ♦ చూడుము దేవ! భవత్కృతంబులన్. ౧౫౯

కం. గీతంబుల మంగళరవ,జాతంబుల వీను లలర ♦ సతతము విను నా
సీత యెటు వ్యాఘ్రహర్య,క్షౌతతభీకరరవంబు ♦ నాలించెడినో. ౧౬౦

ఉ. ఎక్కడఁ బవ్వళించెనొ సు♦రేశ్వరకేతనసన్నిభుండు దా
నక్కట నాసుతుండు పరి♦ఘాభమహాభుజ మొప్ప దిండుగా
దిక్కుల లేనివానిపగి♦దిన్ నునుఁబచ్చిక మెత్తపాన్పుగా,
దిక్కవఁ డుండు తండ్రియు మ♦దిం గలుషించి వ్యథాబ్ధిఁ ద్రోయఁగన్? ౧౬౧

ఉ. ఎన్నఁడు చూడఁ గల్గునొ క♦దే వికచాంబుజపత్రవర్ణమున్
సన్నవపద్మసౌరభల♦సచ్ఛ్వసనంబును బద్మనేత్రమున్

బ్రన్ననిప్రేలుముంగురుల♦రమ్యమునై దరహాసభాసమా
పున్నమచందురుం దెగడు♦పుత్త్రునిముద్దుమొగంబు నే నిఁకన్. ౧౫౬౨

తే. ఇంత లయ్యును నాగుండె♦యింత లింత,లగుచుఁ బెటలక యుండుట♦యరసిచూడ
వజ్రసారమయంబు గా♦వచ్చు నిక్క, మట్లు గాకున్న వే తున్క♦లగుచుఁ బోదె.

కం. నాకొడుకును నాకోడలి, నాకుం గావలయువారి♦ నట్టడవుల న
స్తోకసుఖార్హులఁ ద్రోచితి, వేకాలమునందు భర్త♦ యిట్టిఁడుఁ గలఁడే? ౧౫౬౪

సీ. పదునేనవేఁట నా♦పట్టి కానలనుండి, వచ్చెనేని భరతుండు♦ వసుధ నేలు
చుంట రాజ్యమునకు♦ నుల్లసింపఁడుగాన, భరతుఁ డిచ్చిన నొడఁ♦బాటుగొనఁడు
శ్రాద్ధంబునకు యోగ్య♦బ్రాహ్మణుఁ బిలువక, ధనలోభమునఁ జేసి♦ ధరణిసురులు
తమవారలకు భోజ♦నము పెట్టి యోగ్యుల, మీఱిష్టపంక్తి కే♦తేరుఁ డనిన

ఆ. నట్టివారియింట♦ నమృతమేనియు వెండి, సుగుణవంతుఁ డైన♦సూరి యమర
సన్నిభుండు ద్విజుఁడు♦ సమ్మతింపఁడు గ్రోల, నాఁగ వినమె మనము♦ నాథ జగతి.

కం. మును ము న్గుడిచినవారలు, జనవర! బ్రాహ్మణులె యైన♦ సమ్మతిఁ గుడువన్
గొనరు తిరస్కృతవిప్రులు, విను శృంగచ్ఛేద మైన♦వృషభములట్టుల్. ౧౫౬౬

కం. మును తమ్ముఁ డనుభవించిన, ధనమును రాజ్యంబుఁ బిదపఁ♦ దా నెటులు గొనున్
ఘనమతి వరిష్ఠుఁ డగునా,తనయుఁడు జ్యేష్ఠుండు నగుట♦ ధరణిప! చెపుమా.

కం. పరజంతుభుక్తశేషము,గురుబల మగువ్యాఘ్ర మెందుఁ♦ గోరదు తినఁగాఁ
బురుషవ్యాఘ్రుం డేటికిఁ,బరభుక్తముఁ గోరు నేవ♦పడక మహీశా. ౧౫౬౮

తే. యాతయామంబు లైనట్టి♦యాజ్యకుశవా,విస్సులును బురోడాశంబు♦వెండి యూప
ఖాదిరంబుల నెవఁడైనఁ♦ గ్రమ్మఱంగ, వాడుకొనునొక్కొ వెనుక స♦వంబులందు.

కం. హృతసార మైనసురవలెఁ, జ్యుతసోమముసవమురీతి♦ నుర్వీధవ! నా
సుతుఁ డేల యన్యభుక్తము, క్షితినిం గాంక్షించు; నంత♦ చెడి బ్రతికె నొకో?

కం. ఇంతటియవమతి సీతా,కాంతుఁడు సహియించు నెట్లు♦ కలదే నిజవా
లాంతముఁ ద్రొక్కిన వ్యాఘ్రము, శాంతతమై నోర్చియుంట♦ జగతిం జెపుమా.

చం. భువనము లెల్ల నొక్కటయి♦ పూనినయేనియు నాతనూభవున్,
లవమును భీతి గొల్పఁగ వ♦లంతులు గావు మహారణంబునన్,
భువిని నధర్మవర్తులను♦ బూన్పఁగ ధర్మపథంబుఁ దద్విధిన్
దవిలినమానసంబునను♦ దా నిటు సైఁచెడిఁ గాక దుఃఖముల్. ౧౫౭౨

చం. కలితసువర్ణపుంఖశిత♦ కాండములన్ దహియింపఁ జాలెడిన్
జలనిధి నేని భూతముల♦సంఘము నేని యుగాంతకాలున

ట్టుల యటువంటిసింహబలుఁ♦డుఁగ వృషభాక్షుఁడు గండుమీనుచేఁ
బొలిసెడిచేఁపపిల్ల యనఁ ♦ బోయె హతుం డయి తండ్రిచేతనే. ౧౫౨౩

ఉ. ఈవును ధర్మవేదివి న♦రేశ్వర! చెప్పుమ కన్నపుత్త్రునిం
నీ విటు గానలం నవయ ♦ నెట్టితిగా, యిది రాచవారు భూ
మీవిబుధార్యవర్యులును ♦ మెచ్చు సనాతనధర్మశాస్త్ర మెం
దే విధియించెనో విహిత♦కృత్యముగాఁ దెక తేర కక్కటా? ౧౫౨౪

కం.పతి మొదటిదిక్కు సతికిం, సుతుఁడు ద్వితీయుండు, ననుఁగుఁ♦జుట్టం బాపై
గతి యయ్యెడుఁ బరికింపఁగ, గతి యన్యము లేదు సుమ్ము ♦ కాంతకు నధిపా! ౧౫౨౫

చం.సవతికి నీవు దక్కి ననుఁ ♦ జాఁగఁబడఁ బొట్టుట నీవు గల్గియుం
ధవుఁడవు లేనివాఁడ, వికఁ ♦ నాసుతునిం వనిఁ ద్రోచి తీవ,నా
కెవరును లేరు చుట్టములు ♦ నేఁగెదఁ గానల కన్నచో మగం
డవు మని యుంటఁబోల, దిటు ♦ నాశము చేసితి నన్ను నన్నిటన్. ౧౫౨౬

చం. హత మయి పోయె నీవలన ♦ జ్యాతల,మీవును మంత్రు లెల్లరుం
హతు లిఁక, నేను నాసుతుఁడు ♦ నాశన మైతిమి, పౌరు లందఱుం
హతుల, నితాంతసమ్మదము♦నం ధర నీప్రియురాలు నీసుతుం
డతులితభోగయుక్తు లయి ♦ హాయిగ నేలుచు నుందు రిం కిటన్. ౧౫౨౭

చం.అనుచుఁ గఠోరభంగిఁ దను ♦ నాడిన భూపతి వించు శోకవే
దనను సహింపలేక పడి ♦ తాలిమి దూలి ధరాతలంబునం
వనిత నిజంబ పల్కెడి, న♦నన్యకృతంబు మహాఘు మేమి నే
నొనరిచినాఁడనో యనుచు ♦ నుల్లమునం దలపోఁతె మున్గుచున్ ౧౫౨౮

దశరథుఁడు కౌసల్యను క్షమింప వేఁడుట.

కం.సోలుచు మూర్ఛను ధరపై, వ్రాలుచుఁ గౌసల్య మోముఁ ♦ బరికించుచుఁ జిం
తాలులితమానసంబున, నాలోచన సేయఁ బ్రాక్కృ♦తాఘము దోఁచెన్. ౧౫౨౯

చం. తెలియమి శబ్దవేధు లగు♦తీవ్రశరంబులఁ జేసినట్టియా
కలుషము బుద్ధిఁ దోఁచినను ♦ గాతరుఁ డై ద్విగుణంబుగా మునిం
బొలియఁగఁ జేతయం దనదు♦పుత్త్రునిశోకకు నుమ్మలించు చం
జలి ఘటియించుచుం సతిప్ర♦సాదముకై, తల వాంచి యిట్లనున్. ౧౫౩౦

చం.కరుణ దొఱంగ వెన్నఁడును ♦ గానిజనంబుల మీఁద నేని, నం
గరుణ క్షమింపు దేవి! కమ♦గానక చేసితిఁ దప్పు నీయెడం,
గరములు మోడ్తు ధర్మరత ♦ కాంతలకుం బతి నిర్గుణుండయేం
గరము లసద్గుణుం డయినఁ ♦ గాని సమక్షపుదైవతం బగున్. ౧౫౩౧

చం నిరుపమధర్మతత్పరవు ♦ నిత్యము లోకులు సేయు మంచిసె
బ్బరల నెఱుంగు దీవు, గుణ♦భాగ్యవు, వుంటిని నుప్పుఁ బెట్టదే
పరితపియించు న న్నిటులు ♦ పల్కి? సుదుఃఖిత వయ్యు శాంతమున్
గరుణఁ దలంప రాదె? ననుఁ ♦ గర్కశవాక్యము లాడఁ బాడియే? ౧౫౮౨

తే అనుచు దీనోక్తిఁ బ్రార్థించు♦నధిపుఁ జూచి
భయము సంభ్రము మొనవంగఁ ♦ బ్రాణనాథు
నంజలిని బద్ధ మన శిర♦మందుఁ దాల్చి
నారి కన్నీరు గార్చి ప్ర♦ణాళిఁ బోలి ౧౫౮౩

చం. పలికె హృదీశుఁ బ్రాణధవ ♦ పాదములం బడి వేఁడుదాన నన్
జెలువను వేఁడికోలు దగు♦నే? ననుఁ జంపఁగ నీకు న్యాయమే?
యలుకక తన్ను వేఁడుకొను♦నట్లు నిజేశ్వరు బాధపెట్టు నా
కలికి యిహంబునుం బరము ♦ గానదు, దుర్గతి నొందఁ గల్గెడున్. ౧౫౮౪

చం. తెలియనిదానఁగాను జగ♦తీవర! సత్యరతుండ వంచు ని
శ్చలపరధర్మమూర్తి వని ♦ సత్యముఁ జెప్పెద విన్ము, నానుతున్
దలఁచుకొలంది యే మన ని♦తాంతము భగ్గనిమండుఁ గడుపులో
బలితపుఁబుత్రశోకమునఁ ♦ బల్కితి, నన్ను శమింపఁగాఁ దగున్. ౧౫౮౫

కం శోకంబున ధైర్యము చెడు, శోకంబున నాశ మొందు ♦ శ్రుత మఖిలంబున్
శోకంబున సర్వము చెడు, శోకము సరిపోలు వైరి ♦ చొప్పడఁ డెందున్. ౧౫౮౬

ఆ. పగఱు చేతితోడ ♦ బాఁదినదెబ్బలు, సైఁప వచ్చుఁగాని ♦ సైఁపరాదు
స్వల్పమైనఁ గాని ♦ యాకస్మికంబుగ, దాపరించు శోక♦తాపవహ్ని. ౧౫౮౭

కం. ఏచునిశ లేగె రాముఁడు, కాననవాసంబుచేయ ♦ గడఁగినది మొదల్
మానవవర! శోకంబున, నేనేఁడులు గడచినట్టు ♦ లేర్పడె నాకున్. ౧౫౮౮

కం. చింతింపకొలఁది శోకం, బంతంతకుఁ బెరుఁగ సాగు ♦ నభివృద్ధి నదీ
కాంతుఁడు తటినీవేగా,క్రాంతుం డయి కాంచురీతి ♦ గతి యేమి యొకో.

తే అనుచుఁ గౌసల్య యూరార్చ ♦ నస్తమించె, దివసనాథుఁడు రేగ్రమ్మె ♦ నవనివిభుఁడు
సతిహితోక్తుల వినియును ♦ శాంతి లేక, కన్ను గూర్కొనువగపునఁ ♦ గలఁకపడుచు

ఉ. మూఁపతమాత్ర, మంత నృప♦ముఖ్యుఁడు మేల్కని యాత్మదోషమున్
గూరిచి చింత వేఁడివెలుఁ♦గున్ గ్రసియించెడిరాహుపోలికన్
ఘోరముగాఁగఁ బైకొనుడుఁ ♦ గోడలినిం గొడుకుం దలంచి యా
త్మారమణేంద్రుఁ డాఱవని♦శన్ నడురే ధవళాక్షి కిట్లనున్. ౧౫౯౧

దశరథుఁడు తాను జంపిన మునిబాలకువృత్తాంతముఁ గౌసల్యకుఁ జెప్పుట

కం. మేలైననను గీడైనను, శీలవతీ! మనుజుఁ డెద్ది ♦ సేయుఁ బరులకున్
వాలాయంబుగ నది ఫల,కాలంబునఁ గుడుచు వేఱు ♦ గలుగదు చెలువా!
కం. వ్యాపారారంభమునం, బ్రాపించునొ దాన శుభము ♦ పాపఫలంబే
ప్రాపించునొ యని చూడని,యాపురుషుఁడు బాలిశుండ ♦ యగును గుణాఢ్యా.
చం. ఫలములు పూలకొల్దు లని ♦ బాలిశుఁ డొక్కఁడు మావితోఁటలన్
దళన మొనర్చి, యచ్చొటను ♦ నాటుచు మోదుగుచెట్లు, వానినిన్
జలములు పోసి యక్కఱగ ♦ సాఁకి, ఫలాగమవేళఁ జింతచేఁ
దలరు; విచారశూన్యులకృ♦తంబులఁ గల్గుఫలంబు లిట్టి వౌ. ౧౫౯౪
కం ఈదృగ్విధకర్మములకు, నీదృగ్విధ ఫలము లనుచు ♦ నెఱుఁగక యొకఁడే
నాదటఁ బను లొనరించిన, మోదుగుపెంపరినిబోలి ♦ ముచ్చిరుఁ జుమ్మీ.
కం. అట్టుల యామ్రవణంబును, గొట్టి పలాశముల నాటి ♦ కొనను ఫలంబుల్
పుట్టఁగ రామునిఁ బాసెదు, నట్టుగ మతి లేని యేను ♦ నడలెదఁ గంటే. ౧౫౯౬
కం. పిన్నటనాఁటను జాపము, విన్ననువునఁ దాల్చి శబ్ద♦వేధిఖ్యాతిన్
జెన్నలరుచుఁ గావించితి, మున్నొకపాపంబు నేను ♦ మూఢుఁడ నగుచున్.
కం. బాలుఁడు విషమున్ మ్రింగిన,పోలిక మోహమునఁ బాప♦మును జేయారన్
లోలాక్షీ! కావించితి, వాలాయము దాని ఫలము ♦ వలసెం గుడువన్. ౧౫౯౮
ఉ. పామరుఁ డొక్కరుండు సుమ♦భాస్వరతం గని కింశుకంబులన్
గోమునఁ బెంచినట్లు సుమ♦కోమల! నేనును భావ్యనర్థమున్
నామదిఁ గానలేక యిటు ♦ నాశన మాటకు శబ్దవేధ్యజం
బౌమహితాఘముం జలుపు ♦ టయ్యెను, దత్కథ విన్ము చెప్పెదన్. ౧౫౯౯
చం. అకృతవివాహ వప్పటికి ♦ నబ్జముఖీ! యువరాజ నేనునున్,
ప్రకటితరీతి నయ్యెడను ♦ వానలకాలము దాపరించె ద
ర్పకమద కామసంభ్రమవి♦వర్ధన మై, మహిసారమున్ సహ
స్రకరుఁడు పీల్చి ప్రేల్చుచు ర♦సాస్థలి దక్షిణదిక్కుఁ జేరినన్. ౧౬౦౦
ఆ. వేఁడి మాయ మయ్యె ♦ వెలసెనుమేఘముల్, స్నిగ్ధకాంతితోడ ♦ నీట బలిసి
కప్పకూఁత లెగసె ♦ నొప్పుగ సారంగ, బర్హినివహ చయము ♦ పర్వెమింట. ౧౬౦౧
తే. జడికి ఱెక్కలపైవైపు ♦ తడియు చుండ, స్నాన మొనరించి నట్టు లై ♦ శకునవితతి
గాలివానకు నూఁగున♦గ్రములు గలుగు, చెట్లకొమ్మల నెట్టెట్లొ ♦ చేరె నపుడు.
కం బోరున కురుసిన కురిసెడి, ధారలచేఁ దొప్పదోఁగి ♦ దంతులచే వాః
పూరంబుల గిరి నిశ్చలం, వారిధివలెఁ దోఁచెనపుడు ♦ వారిజనయనా. ౧౬౦౩

కం. గైరికధాతుమిళితగా, రారుణవర్ణముల శుద్ధ ♦ మౌ సెలయేళుల్
వారక ప్రవహించెను గాం, తారానలభస్మయుతప్ర ♦ దాకులభంగిన్. ౧౬౦౪

తే. వానకాలంబునందు నో ♦ వనజనేత్ర, యాకులారుణతోయంబు ♦ లగుచు నేఱు
లొడ్డులను బొర్లి పాఱుచు ♦ నుండె; నేను, గమ్రతర మైనయాసుఖ ♦ కాలమునను

సీ. బాణినై కోదండ ♦ పాణినై తేరెక్కి, వేఁటపైఁ దగిలిన ♦ వేడ్కకతన
సరయూతటంబున ♦ సారంగమహిషాది, ఘాతుకమృగములఁ ♦ గడకఁ జంప
రేవుమాటున నొక్క ♦ రేప్రొద్దు నొంటిగ, నుండితి విస్తృతచా ♦ పుండ నగుచు
నప్పు డాలించితిఁ ♦ జప్పు డేనుఁగుజల, మానురవంబును ♦ బోనిదానిఁ

తే. గటికచీఁకటికతమునఁ ♦ గనుల కెద్ది, చూడరాకున్న శబ్దంబు ♦ జాడపట్టి
గజముకా నెంచి యేసితిఁ ♦ గాండ మొండు, సర్పసన్నిభ మాధ్వని ♦ చక్కటికిని.

కం. ఘనశరము పడినచోటన, విన వచ్చెఁ హాయ టంచు ♦ విశదం బగుచున్
మనుజస్వర మచ్చట నొక, ముని నాశితబాణపాత ♦ మున నేలఁ బడెన్. ౧౬౦౭

సీ. పడి యిటు లనియెఁ ద ♦ పస్వి నౌనాయట్టి, వానిపై బాణంబు ♦ పడుట యెట్లు
నరులు మిట్టాడని ♦ నడురేయి నీటికై, వచ్చితి నేటి కె ♦ వ్వం డొ నన్ను
వధియించెఁగా యిట్లు ♦ వానికి నే నేమి, యెగ్గు చేసితి నొక్కొ ♦ యెన్నఁ డైనఁ
బరహింసనము మాని ♦ పరఁగుచు ఋషి నయి, యాకులు నలము లా ♦ హారముగను

ఆ. బొట్టపోసికొనుచుఁ ♦ బూని జటాభార, ములను నారచీర ♦ ములను గట్టి
యడవిలోన నుండు ♦ నట్టినే నేడ నీ, క్రూరబాణమునను ♦ గూలు టేఁ. ౧౬౦౮

ఉ. ఎవ్వఁడు నన్నుఁ జంపి యిటు ♦ లేపరమార్థముఁ బొందఁ బోవునో.
యెవ్వని కేమి యెగ్గు ఘటి ♦ యించితినో, గురుతల్పగుండు లెక్క
బ్రువ్వఁగఁ దిట్ట కుండుదురె ♦ భూజను లాతని నిష్ఫలంబు గా
కెవ్వఁడిఁకేమి వాఱుకొను ♦ నిట్టియనర్థపుఁ జేఁత దైవమా. ౧౬౦౯

సీ. అక్కటా! నామృతి ♦ కడలను గాని నేఁ, జిరకాలముగఁ బ్రోది ♦ సేయు చున్న
వృద్ధదంపతులఁ దం ♦ డ్రినిఁ దల్లిఁ దలఁచిన, గుండెలు ఝల్లనుఁ; ♦ గూలువారు
నాచావు విని నంత ♦ నాగురుల్ దిక్కేది, యింక నేగతిఁ జరి ♦ యింపఁ గలరు
అవివేకి బాలిశుం ♦ డైనయెవ్వఁడొ యొక్క, శరమున ముప్పుర ♦ సంహరించె

తే. ననుచుఁ గరుణోక్తు లాడిన ♦ నాలకించి, నంత విరవిర పోయె నా ♦ యవయవములు
పరమదుఃఖితుఁడైన నేఁ ♦ బట్టియున్న, ధనువు బాణంబుఁ దమయంత ♦ ధరణిఁ బడియె.

ఉ. ఉల్లము ఝల్లనంగ సర ♦ యూతటసీమకుఁ బోయి కంటి నేఁ
బెల్లుగ నెత్తుటం దడిసి ♦ విద్ధఘటోదకుఁ డై ధరిత్రి మే
నెల్లను ధూళి బ్రుంగి సుమ ♦ తీ! యవకీర్ణజటాభరంబుతో
మల్లడిగొంచుఁ బొర్లుచును ♦ మార్గణవేదనఁ గుందు తాపసున్. ౧౬౧౧

కం. కంటిని గనినంతన నెఱి,మంటలు గన్నులను గ్రమ్మ ♦ మాణవకుఁడు న
గెంటసము లాడె వాలుం,గంటీ యిట్లనుచు నేమి♦గా వచియింతున్. ౧౬౧౨

సీ. అడవులఁ బడియుండు♦నట్టినే నీ కేమి,యపకృతిఁ జేసితి ♦ నయ్య రాజ
గురువులు నను డప్పి ♦ గొని నీరు దెమ్మన్న, వచ్చి నీచేతను ♦ జచ్చినాఁడ
నను నొక్క బాణంబు♦నను గొట్టి దానన, యంధులు వృద్ధులు ♦ నైననాదు
జననిని జనకుని ♦ సంహరించితి వీవు, దప్పిచేఁ బెదవులు ♦ దడిపికొనుచు

తే. నెపుడు వచ్చునో కొడు కంచు ♦ నెదురు చూచు
చున్న వారలు సహియింప ♦ నోర్తు రెట్లు?
బిలను బడియుండు న న్నెట్లు ♦ లెఱుఁగుఁ దండ్రి?
శ్రుతము నాతపమును ఫల♦శూన్య మయ్యె. ౧౬౧౩

ఉ. కన్నులు లేవు రోయఁ, గొడు♦కా యని యేడ్చుచు నుందు రింట నా
యున్నవిధం బెఱుంగ, రెవ♦రో నచియించెడివారు వారి, కా
పన్నులెఱింగి రేని నడు♦వంగను నేరనివారు వార లే
తెన్నున నన్ను రోసెదరు ♦ ద్రిమ్మరి త్రిమ్మరి గుట్టగుట్టయున్. ౧౬౧౪

ఆ. నడువలేనివాఁడు ♦ నాగతి యెఱిఁగియు, నేమి సేయఁ గలఁడు ♦ వృద్ధుఁ డకట
గాలిఁ గూలుచెట్టుఁ ♦ జాలునే కావంగ, నుర్విఁ గూలుచున్న♦యొండుమ్రాని.

చం. అరుగుము నీవ రాఘవ! ర♦యంబునఁ దండ్రి వసించుచోటి కీ
వరుగకయున్న శాప మిడు ♦ నాగ్రహ మెత్తి దవంబు కాన నాఁ
బరువత నిన్ను నీక్షణము ♦ భస్మము సేయుఁ, దదాశ్రమంబుఁ బోఁ
దెరు విటు కాలిత్రోవ యదె♦ తెప్పున శాంతుని జేయు తండ్రిసిన్. ౧౬౧౬

కం. నీ వతని వేఁడుకొన్నను, నీవలనం గినుక గొనఁడు ♦ నీశర మింక
భూవర దీయుము యునుఱు న,దీవేగం బినుకతిన్నె ♦ తీరునఁ గోసెన్. ౧౬౧౭

కం. అనవుడు బాణముఁ దీయమిఁ, దను వేదన దుస్సహంబు ♦ దానిం దీయ
దనువు దొఱంగు న టంచును, వనటం బడుసన్ను దీను♦బాలుం డనియెన్.

చం. అడలకు మయ్య తీయ భవ♦దాశుగ మిప్పుడు బ్రహ్మహత్య వ
చ్చెడు నని, తన్భయంబు మదిఁ ♦ జేర్పకు, నేను ద్విజుండఁగాను జూ;
పొడమితి శూద్రకాంతకును ♦ భూమిప వైశ్యున; కంచు వేదన
బుడమిని బొర్లి సొమ్మసిలెఁ ♦ బోఱఁడు[1] పల్కఁగ లేక బోలునున్. ౧౬౧౯

ఆ. నెఱఁకు నాటి యున్న♦కఱకుబాణమువానిఁ, బలుక లేనివాని ♦ వణఁకువానిఁ
బొరలువానిఁ జేష్ట ♦ పొలిసినవాని మేన్, ముడుఁచువానిఁ గాంచి♦ములికిఁ బెఱికి

కం. ఆతండు నన్నుఁ గనుచున్, భీతుండై ప్రాణములను ♦ విడిచెన్ నే నా
పూతచరిత్రకునిన్ సర,యూతీరశయాను గాసి ♦ నూర్చెడివానిన్ ౧౬౨౧

[1] పోఱఁడు = బాలుఁడు.

కం.జలములఁ దడిసిన మేనిం, గలవానిని జూచి చూచి ♦ కళవళపడుచున్
విలపించితి విలపించితిఁ, జెలియా! నా కిట్టియఘము ♦ చేపడె ననుచున్..౧౬-౨౨

కం.అని చెప్పి మునికుమారుని, మనమునఁ దలపోసి యేడ్చి ♦ మానిని కనియెన్
జనపతి మునిపతిఁ గానఁగఁ, జనుటయె సేమంబొ కాక ♦ చనమియ మేలో ౧౬-౨౩

కం.పొరపాటున నాకెంతటి,దురితము ప్రాపించె ననుచు ♦ దురపిల్లుచు నేఁ
బరమోదక మాఘటిఁ గొని, యరిగితి వినియున్నత్రోవ ♦ నాశ్రమమునకున్.

చం.నడువఁగలేనివారి, నయ♦నంబులు గాననివారి, వృద్ధులై
వడఁకెడిమేనివారి, హత♦పక్షగంబులఁ బోలువారలన్,
బడుగుల, నింత నే పయిన ♦ బాలుఁడు రాఁడు జలంబుఁ గొంచు నం
చడలెడివారి, మత్కృతని♦రాశులఁ, గంటిని యత్నహీనులన్. ౧౬-౨౫

కం.మునిపుత్రునిఁ జంపిన పె,న్వనటన్ వ్యాకులత నొంద ♦ స్వాంతము వెఱచే
తను గుండె లదుర నాశ్రమ,మును డాసెడికొలఁది వగవు ♦ ముమ్మర మయ్యెన్.

తే. కాలిచప్పుడు వా రింత ♦ యాలకించి, యెంతసే పాయెరా తండ్రి ♦ యిదిగొ నున్న
యేటిసీటికి నీ వేగి ♦ యింతతడవు, తడయఁగాఁ జెల్లునా నీకుఁ ♦ గొడుకుఁగుఱ్ఱ.

ఉ. నాలుక లెండ మాకు నిట ♦ నాయన! నీటికిఁ బోయి యాటలన్
గాలముఁ బుచ్చుచుంటి గద ♦ కాలవిళంబన మైన రాఁపుగా
బాలుఁ డటంచుఁ బెన్వగవు♦పాటునఁ దూలెడి నీదుతల్లియున్
నీళులు దెమ్ము, యెన్నఁడిది ♦ నేరవు, నేఁడ యి దే౹ పుత్రకా! ౧౬-౨౮

ఉ. తప్పుగ నెంచఁ బోకుము సు♦తా! నిను నేనొ త్వదీయమాతయేన్
దప్పులు పట్టి యుండినను ♦ ధన్యుఁడ వీవు తపోధనుండ! మా
తెప్పయు నీవ మాగతియు ♦ దృష్టియు నీవ యటంచుఁ బ్రాణ మే
మెప్పుడు నీపయి న్నిలుప ♦ నేటికిఁ బల్కవయో కుమారకా! ౧౬-౨౯

ఆ. కనులు లేనిమాకుఁ ♦ గనులు నీ వనుచును, దిక్కు లేనిమాకు ♦ దిక్కు నీవ
యనుచు నమ్మి యుండ ♦ నగుపయ్య నీ కిట్లు, మ మ్ముపేక్ష సేయ ♦ మహితచరిత.

ఆ. అనుచు నీరెలుంగు♦నను దొట్రుపాటునఁ, బలుకు చున్నయట్టి♦పరమమునిని
జేరఁ బోయి చెనఁటి♦నేత భీతిల్లుచు, నల్లనల్ల నిట్టు ♦ లంటి నేను. ౧౬-౩౦

ఉ. పుత్రుఁడఁగాను మీకు, ముని♦పుంగవ! పంక్తిరథుండఁ బేరునన్,
క్షత్రియుఁడన్, మహాఘమును ♦ సజ్జనగర్హితమైననీచచా
రిత్రము సల్పి పొందితిని ♦ రే సరయూతటభూమి వేఁటకై
గాత్రము డాఁచి హస్తమునఁ ♦ గార్ముకముం గొని వేచి యుండఁగన్ ౧౬-౩౧

చం. బుడబుడ మన్న నాదము త♦పోధన! నీళుల వింటి, నాడున
న్వడి నది కుండ ముంచెడిర♦వం బని యెంచక దంతి నీళ్లు ద్రా
వెడినులి వన్నభ్రాంతి వెస ♦ వ్రేసి శరంబున డాసి యీమ్మునన్
బెడిదపుటమ్ము నాట ధర ♦ వ్రీలినవాని నొకండుఁ జూచితిన్. ౧౬౩౩

కం. అనఘాత్ములార! వనగజ,మును జంపఁగ నీట బాణ♦మును విడిచిన నీ
తనయుని నది వధియించెను, వినిపించె నతండు తనదు♦వృత్తాంతంబున్. ౧౬౩౪

ఉ. ఆతనిమాటచొప్పునన ♦ యాశుగముం బెఱుకంగ నాతఁడున్
హా తలిదండ్రులార! ముది♦యంధకులార! యటంచుఁ గూలె నే
నాతనిబోధపద్ధతి మ♦హాత్మకులార! కనంగ నచ్చితిన్
బాతకి వీని మీమనసు♦వచ్చినరీతి నొనర్పుఁ డింకిటన్. ౧౬౩౫

కం. మీసుతు నజ్ఞానంబున, నే సంపితి నిమిషమునను ♦ నిజ మిది నేనో
దోసిని ననుఁ గరుణింతురొ, శాసింతురొ యిచ్చకొలఁది ♦ పలుపుఁ డటన్నన్.

ఉ. పాపభయంబుచే వగపు♦పాటున నా యనినట్టి కర్కశా
లాపము వీనులం బడఁ బ్ర♦లాపము సేయుచు నుష్ణబాష్పధా
రాపరిగాహ మారఁగ భ♦రంపడి యూర్చుచుఁ బల్లటిల్లుచున్
దాపున నున్న నన్ను ముని♦తల్లజుఁ డిట్లని పల్కె నార్తుఁడై. ౧౬౩౭

శా. వానప్రస్థునిఁ జంపి క్షత్రియుఁడె ని♦ర్వాంజాలు? నా నత్రియేన్
స్థానభ్రష్టత మిక్కిలిం గనఁడె వ్ర♦జ్ఞాపూర్వమ్ముం జేసినన్
క్ష్మానాథా! బ్రదుకంగఁ గంటి విటు ప♦శ్చాత్తాప మూరంగ నె
వే నీపాపముఁ జెప్పుటన్; శిరము కా♦దేన్ బోదె వ్రేవ్రక్కలై. ౧౬౩౮

చం. ఎఱిఁగి యెఱింగియున్ ముని మ♦హాతపోధను బ్రహ్మవాదినిన్
గఱకుశరంబునం దునుమఁ♦గాఁ దల గూడెడి నేడువ్రక్కలై
మఱకునఁ జేయుటం గలిగె ♦ మస్తప నొంచ, నెఱింగి చేసినన్
నెఱ రఘువంశమే చెడదె ♦ నీ వన నెంతటివాఁడ వో నృపా. ౧౬౩౯

ఉ. ఎచ్చట మాసుతుండు పడి♦యెన్ నృప! తోడ్కొని పొమ్ము మమ్ము నీ
నచ్చటికిం, దనూజు రుధి♦రార్ద్రశరీరుఁ బ్రకీర్ణజూటుఁ డై
చచ్చి ధరాస్థలిన్ యమప♦శంగతుఁ డై పడియున్న పుత్త్రు లో
నిచ్చ జనించెఁ జూడ నన ♦ నేఁ గొనిపోయితి వారి నిద్దఱన్. ౧౬౪౦

ఋషి తనపుత్త్రునకై విలపించుట.

ఆ. కాలధర్మ మొంది ♦ కూలిననిజపుత్త్రుఁ, దడవి తడవి చూచి ♦ తండ్రి యనియె
నేల పుత్త్ర! తండ్రి ♦ యే లెంచియుండెన, గండ మిడవు నీకుఁ ♦ దగునె యిట్లు.

ఉ. అయ్యరొయొ వాతసూజ! పలుకాడ వి దేమిర, కోప మేలరా,
యియ్యెడ నేలపైఁ బడిన దేటికిరా, యొకమాట చెప్పరా,
నెయ్యము నాపయిం గలుగనేరద యేనియుఁ దల్లిఁ జూడరా,
తియ్యనిపల్కు పల్కర, మదిఁ దనగ పాయఁగఁ గౌఁగిలింపరా. ౧౬౪౨

కం. క్రమమారఁగఁ గడుహృదయంగమముగ శాస్త్రాది సకలకళల నపరరా
త్రములందు నెనఁడు చదువఁగ, నమలమతీ యింక వీనులారఁగ విందున్. ౧౬౪౩

కం. ఎవఁ డింక స్నాన మొనరిచి, సవరగ సంధ్యాగ్నిహోత్రసముపాసనముల్
సువిహితముగ నొనరుచు నన్, బ్రవిమలమతి భీతుఁ గొల్చుఁ బట్టీ! చెపుమా.

చం. తిరుగఁగ లేనివారి, నొకదిక్కు నెఱుంగనివారి, నిత్యక
ర్తరతికి శక్తి లేని మము రాగమునం బలుకందమూలముల్
వరమతి సత్ప్రియాతిథికిభాతిని మా కిడి నిండుఁబ్రీతితో
నరసెడువార లెవ్వరిఁక హా తనయా! చన నీకు న్యాయమా. ౧౬౪౪

తే. కడుపుదుఃఖంబునను గడుఁ గ్రాఁగుచున్న, నీదుతల్లిని గృపణను నిండుమునలిఁ
గనులు గాననిదాని నేకరణిఁ జెపుమ, నాయనా! యింక భరియింప నాకువశము?

ఉ. పోకుము కాలువీటికిని బుత్ర! యిదే భవదీయమాతతో
వేకువ యైన వచ్చెదను వెంబడి, నిల్వుము నేను జెప్పెదన్
మా కపరాధ సహింపుము యమా! గురులన్ మముఁ దోడి తేరఁగా
జేకుతెఁ గాలయూపనము శిశుకుఁ బాత్రుఁడు గాఁ డటంచునున్. ౧౬౪౭

చ. నిలువఁగ నెట్టు లోఁ దనయ ని న్నెడఁబాసి వ్యధాభరంబునన్
నలఁగుచు దిక్కు లేకిటు నవనంబుల గ్రుగ్గఁగ, నాదుమన్నవ్వలన్
గలితసుహోతుశుంను గతకల్మషుఁ డాశమునుందు జాలి ని
న్నలుగఁడు కూర్కిఁ గ్రూరి యభయం బొసఁగున్ మముఁ జూచి సంతతన్. ౧౬౪౮

సీ. అఘము నీచేసినయది లేదు పాపి యైనా, క్ష్మానాయకుఁడు నిన్నుఁ జంపెఁ బుత్ర!
దాన నాసత్యసత్తపముల బలమున, శస్త్రయోధులగతిఁ జనుము కలన
వెనుకంజ పెట్టక మునుపోవునను గూలు, శూరులలోకంబుఁ జేర వయ్య
సగరదిలీపులు శైబ్యనహుషధుంధు,మారులు జనమేజయారి జేత

ఆ. యరిగినట్టిగతికి నరుగుము పుత్రక! యేది గతియొ మునుల కెల్ల సాధు
వులకు భూమిదులకుఁ గలుగు నేగతి యట్టి,గతికి నీవు చనుము హితచరిత్ర!

తే. ఏకపత్నీవ్రతస్థు లనేకగోస,హస్రదాతలు గుర్వర్చనాభిరతులు
యోగసంపరిత్యక్తదేహులును జనెడి,యట్టివరలోకములకు నీ వరుగు వత్స!

ఆ. ఊర్ధ్వలోకలాభ ♦ ముల్లంబునను నిల్పి, గంగ సూర్యతనయ ♦ గలియుచోట
నగ్నియందొ నీళ్ల♦యందునొ తమమేని, విడుచువారిగతికిఁ ♦ గొడుక! పొమ్ము.
కం మావంశసంభవులకున్, లేవు సుమీ యధమగతులు ♦ నీ కెట్టు లగున్
నీవధకుఁ గారణం బగు,నావానికిఁ గలుగుఁ గాక ♦ యవి నాపుత్రా! ౧౬౫౨
కం.అని పనవి పనవి యేడ్చుచు, మునివరుఁ డుదకంబు లిచ్చె ♦ మొగిఁ బుత్రునకున్
మునిసుతుఁడు దివ్యరూపం,బున శక్రునితోడ నిల్చి ♦ పుష్కరవీథిన్ ౧౬౫౩
కం.గురులకు ని ట్లనియెను మీ,పరిచారము సేఁత నాకుఁ ♦ బరలోకసుఖో
త్కరములు ఘటిల్లెఁ గావునఁ, బరితపియింపకుఁడు మీరు ♦ బ్రహ్మవిధిజ్ఞుల్.
తే. వచ్చెదరు మీరు నచ్చేర♦భవ్యులార, సత్వరంబుగ నంచు భా♦స్వరవిమాన
మునను దివ్యశరీరంబు♦నను దివంబుఁ, జేరఁ బోయె మునీంద్రకు♦మారకుండు.
తే. తనయుఁ డీభంగి దివ మేగఁ♦ దాపసుండు, నెలఁతతోఁగూడి యతనికి ♦ నీళ్లు విడిచి
కరములు మొగిడ్చితనయంతి♦కమునను న్న,నన్నువచియించెదుఃఖసం♦తప్తుఁడగుచు

⟵ ఋషి దశరథు శపించుట. ⟶

ఉ. భూమిప! యేకపుత్రకు న♦పుత్రకుఁ జేసితి గాదె నన్ను, నిం
కేమిభయంబు చా వనఁగ ♦ మృత్యువుఁ గూర్పుము నన్ను నిప్పుడే
ధీమహితున్ శుచిన్ సుతునిఁ ♦ దేరకుఁ జంపితి జ్ఞానహీనతన్
హోమిక దీక్ష ని న్నిదె భ♦యంకరదుఃఖము గల్గఁ దిట్టెదన్. ౧౬౫౭
కం.నాకిప్పు డిట్టిపుత్రక,శోకంబును గూర్చినట్లె ♦ సుతశోకమునన్
భూకాంతుఁడ! నీవిటులే, యేకాంతము వనరి వనరి ♦ యీల్గెదు వింటే. ౧౬౫౮
కం. తెలియక చేసినకతమునఁ, గలుగదు సుమి బ్రహ్మహత్య ♦ క్షత్రియ! నీకున్
గలిగెడు దాతకు దక్షిణ,ఫల మన శీఘ్రంబ యిట్టి♦భంగియు నీకున్. ౧౬౫౯
ఆ. ఇట్లు నాకు శాప♦ మిచ్చి పట్టెడుఁగుల, నగచి పుత్రకునకు ♦ వార లిరువు
రంతఁ జితను బేర్చ ♦ నగ్నిఁ జొచ్చి దివంబుఁ, జేరఁ జనిరి యేమి ♦ చెప్ప నింక.
తే. శబ్దవేధిశరంబున ♦ సంయమీంద్రు,బిడ్డ నేయుట బాణంబుఁ ♦ బెఱుకుటయును
బాల్యమునఁ జేసినట్టియా♦పాప మిపుడు, స్మృతికి వచ్చెను దేవిరో!♦ చింత కతన.
కం.ఆకలుషముఫల మీవిధిఁ, జేకూరె నపథ్యభుక్తి ♦ చేసినయేనిన్
బైకొన కున్నె రోగము, హాకౌసల్యా! యిఁ కేమి ♦ యనఁ గలవాఁడన్. ౧౬౬౨
తే. ఆయుదారులవాక్యంబు ♦ లంబుజాక్షి
యిపుడు సరిదాఁకెఁ బుత్రశో♦కేధితార్తిఁ
బ్రాణములు నేను విడుచుట ♦ ప్రాప్తమయ్యె
నరులు మరులును మిక్కుట ♦ మయ్యెఁ దన్వి. ౧౬౬౩

కం. కన్నులు గవ రాకున్నవి, నిన్నుం గనలేను మాని♦నీమణి నన్నున్
దిన్నగ స్పృశియింపు మటం, చన్నరపతి యేడ్చు చిట్టు♦లని వెలి నతికిన్.

ఉ. రాముని కేను జేసినది ♦ రాజముఖీ! విను నాకుఁ జెల్లు, నా
రాముఁడు నాకుఁ జేసినది ♦ రామున కే సరి, యెట్టు లంటివా
భూమిని నట్టిదుశ్చరితుఁ ♦ బుత్త్రునిఁ బాయుమి వేకి యుండునే?
యీమెయిఁ బొమ్ము టన్న సుతుఁ ♦ డెవ్వఁడు దండ్రిని నైఁపఁ జాలెడిన్? ౧౬౬౫

కం. యమపురి కేగినవారలు, తమవారిని జూడ వశమె ♦ తన్వీ కానన్
క్షమ జీవించియు యుండఁగఁ, గమలాక్షుని రామచంద్రుఁ ♦ గనఁ గాంక్షింతున్.

ఉ. రాముకరంబు సోఁకినను ♦ రాముముఖాబ్జముఁ జూడఁ గల్గినన్
భామరో యంతకాలయము♦వజ్జకుఁ బోవక దక్కవచ్చుఁ జు
మ్మా మది సంభ్రమించె, స్మృతి ♦ మాఱుపడెన్ నిరుఁ గాన నేరనే,
సేమ మిఁ కెల్లు గల్గుఁ, దవ్వు ♦ నేనెన రిద్దిగొఁ గాలకింకరుల్. ౧౬౬౭

కం. ఎన్నఁగ నింతకు దుఃఖం, బున్నే నా కెందు మఱి ♦ మొండెడి వేళన్
గన్నారఁ గాన నైతిని, సన్నుతమతి రామచంద్రు ♦ సద్గుణసాంద్రున్. ౧౬౬౮

ఉ. ఆతనిఁ జూడకుండెడు మ♦హాత్వధఁ బ్రాణము శోషగిల్లెఁ దీ
వ్రాతపతాపవృద్ధికిని ♦ నల్పజలాంబులయట్లు, లెవ్వరా
పూతచరిత్రుచారుముఖ♦మ్ముం బదునేననయేఁటఁ గ్రమ్మఱన్
జూతురొ వారు నిర్జరులు♦మా సుదతీమణీ! కారు మానవుల్. ౧౬౬౯

ఉ. ఆనళినాయతేక్షణము ♦ లాలిమణీయుతకోన్నసంబు నా
జానగుకన్నుబొమ్మలు ల♦సత్స్ఫటిక భాతి యొసంగుచెక్కులున్
శ్రీనుతశారదేందురుచి ♦ చిందెడి రాముముఖారవిందమున్
మానిని ధన్యులౌజనులు ♦ మానుగఁ గాంతురు వెండి వచ్చినన్. ౧౬౭౦

కం. వనవాసము నెఱవేఱిచి, చనుదెంచినపు డ్య రాము♦చంద్రుని బుజుమా
ర్గపయుక్ పుత్రునిఁ గనుగిఁ, గనుఁగొందురు పుణ్యతములు ♦ కౌతుక మమరన్.

ఆ. కానరావు కనులు ♦ వీనులు వినరావు, చిత్తమోహమునను ♦ జెలియ యెడఁద
టుముకమైనయట్లు ♦ తోఁచుచు నున్నది, యింద్రియములు లేవొ ♦ యేము యెఱుఁగ

ఆ. చమురు లేనిదివ్వె♦చవులచందంబునఁ, జిత్తనాశమునను ♦ జిగురుఁబోని
యింద్రియంబు లెల్ల ♦ నిట్టట్టు వికలంబు, లయ్యె నేమి చెప్ప ♦ నగును యింక.

తే. ఏటి వేగంబు కూలంబు ♦ నెల్ల నురలఁ
ద్రోయు చందంబునను నిష్ఠు ♦ తోయజాక్షి

తనయశోకంబువేగంబు ♦ నను ననాథు
వనటఁ గూల్చుచు నున్నది ♦ యనుచు మఱియు. ౧౬౭౪

ఉ. హాయను, నాదుముద్దుఁదన ♦ యా యను, నెక్కడ కేగి తీవు రా
రా యను, నీవ దిక్కు గద ♦ రా యను, నన్ను భృశార్తి ముంపఁ జ
న్నే యను, నొంటి వీడఁ దగు ♦ నే యను, మద్దశఁ జూచియైనఁ బో
రా యను, నిట్లు నీకుఁ దగు ♦ రా యను నయ్యయొ పుత్రకా! యనున్. ౧౬౭౫

కం. హా రామ! మహాబాహూ! హా రాకాచంద్రవదన ♦ హా ప్రియపుత్రా!
హా రక్షక! యెట కేగితి, రారా యాయాస మణఁప ♦ రా పుణ్య మగున్. ౧౬౭౬

-- దశరథుఁడు మృతుఁ డగుట. --

శా. కౌసల్యా! నినుఁ గూడ నేఁ జెఱిచితిం ♦ గాంతా సుమిత్రా! నినుం
గాసిం బెట్టితి, నాదుదాయ వగుకై ♦ కా! మత్కులోన్మూలినీ!
యీసంతాపము నీవ పెట్టితివి చం ♦ డీ! యంచు హాహాపుచుం
జేసెం గాలము మధ్యరాత్రమునఁ దా ♦ సీతేశుఁ జింతించుచున్. ౧౬౭౭

సీ. వేగుఁబోకట వంది ♦ విశ్రుతగాయకుల్, సూతులు వే ర్వేఱ ♦ చొచ్చి నగరు
మంగళాశీర్వచో ♦ మానితస్తవములు, ప్రాసాద మం దెల్లఁ ♦ బరఁగఁ జేయఁ
బాణివాదకు లంతఁ ♦ బఱతెంచి తమనేర్పు, మెయిఁ గరతాళముల్ ♦ మిగులఁగొలుప
నారనంబున నృపా ♦ లాలయగతపంజ, రస్థశాఖాస్థప ♦ త్రరథచయము
తే. మేలుగొని కలకల మని ♦ లీలఁ గూయు, వ్యాహృతంబులు పుణ్యశ ♦ బ్దంబు లొలయ
వేణువీణారవంబులు ♦ విస్తరిల్ల, నిలయ మెల్లను రవమున ♦ నిండి యుండె. ౧౬౭౮

సీ. అవలఁ గల్యసే ♦ వావిచక్షణకాము, నీవర్షధరపాళి ♦ నిర్మలహరి
చందనసంపృక్త ♦ సలిలముల్ కాంచన, ఘటముల మజ్జన ♦ కార్యములకు
నిలిచి మంజుప్రాశ ♦ నీయాను లేపన, దర్పణాభరణవ ♦ స్త్రనుమములను
గన్యకల్ సిద్ధంబు ♦ గావించికొని సర్వ, లక్షణసంపన్న ♦ లలితవిధుల
తే. నుండ నుదయంబునకు మున్న ♦ యుచితరీతి; వేవినను రాక యున్నఁ బృ ♦ థ్వీవరుండు
కారణం బేమి యనుచు శం ♦ కావిలోల, మతుల నుండఁగఁ జెంగట ♦ మలయుసతులు

ఉ. మెల్లగఁ జేరి యానృపతి ♦ మేల్కొలుపం బయిఁ జేయి నైచి య
ల్లల్ల నయంబు దోఁపఁ దను ♦ నంటియు నిద్రురలక్షణంబు భూ
వల్లభునందుఁ గాన కెటు ♦ వైచిన కాలును గేలు నట్టులే
చల్లగ నుంట, వ్రేలిడిన ♦ శ్వాసము నాసికయందు లేమిచేన్ ౧౬౮౦

కం. గుండియ లదరమిఁ గని యా, యండజనయనాళి కంప ♦ మందుచు నృనా
థుండు మనుట సందియపడి, యుండెను బ్రత్యాపగాత్ర ♦ నోత్కర మనఁగన్..

కం. వడఁకుచుఁ బార్థివుఁ గనుచుం, దడఁబడఁ బాదములఁ జేక్క దర్శించి మదిం
డొదరినశంకయె నిజ మని, మిడుకుచుఁ గోసలసుతాసమీపం బరుగన్ ౧౬౭౨

→ దశరథుమృతికై యంతఃపుర స్త్రీ లేడ్చుట. ←

సీ. పుత్రశోకంబునఁ బొగలుచుఁ గౌసల్య,యును సుమిత్రయు జేనియొద్దఁ జచ్చి
నట్టులు వెల్లనియాస్యంబుతోఁ దిమి,రావృతతారకలట్లు తేజ
మాసి బొంది నునుఋమాత్రతోఁ బడి నిద్రఁ, జెందియుండఁగ వారిస్థితిని నృపతి
మృతిని గనుంగొని మెలఁతలు గొల్లున, హతయూథపతివశాతతులభంగి
తే. నొక్కపెట్ట యాక్రోశింప నుల్ల మదర, లేచి కౌసల్యయు సుమిత్ర చూచి విభుని
దాఁకి గతజీవుఁడగుట సత్యం బెఱింగి, ధరణిఁ ద్రెళ్లిరి ప్రాణనాథా! యటంచు.
ఉ. నేలను ధూళి సోలిపడి నింగినినుండి ధరాతలంబునన్
రాలినచుక్కయట్లు రుచి వాశిలి కోసలకన్య యుండినన్
జాలఁగఁ దక్కుచేడియలు సంభ్రమపాటున రోదనధ్వనుల్
గోలున నింపఁగైకయును లోనగుకాంతలు పల్లటిల్లఁగన్. ౧౬౭౪
కం. చుట్టంబు లెల్లవారును, జుట్టుకొని ధరాతలేంద్రసుదతుల్ చేతుల్
పట్టుకొని పెక్కువిధముల, బిట్టుగను బ్రలాపములను బెరసిరి యంతన్. ౧౬౭౫
ఉ. శాంతదవానలం బనఁగ శంబరహీనమహార్ణవం బనన్
గాంతవిహీనభాస్కరునికైవడి నున్నమృతుం బతిన్ వ్యధా
క్రాంత మనంబునం గనులఁ గాల్వలు కట్టఁగ బావ్పవారి భూ
కాంతుశిరంబు స్వాంకమునఁ గ్రాలఁగ రామునితల్లి కైకతోన్. ౧౬౭౬
ఉ. ఓసి దురాత్మురాల! యిఁక నుల్లము చల్లనగా నకంటకం
బాసిరి యెల్లరాజ్యమును హాయిగఁ గైవసపెట్టుకొమ్ము, నీ
గాసి సహింపఁ జాల కిటు కాంతుఁడు స్వర్గముఁ జేరె రాముఁ డా
యాసము నొందెడిన్ వనుల హా నెఱవేఱెఁగ నీదుకోరికల్. ౧౬౭౭
కం. చోరభయసహిత మైనమ,హారణ్యమునందు నొంటి యరిగెడిసతినా
నేరీతి నుండఁగల నీ,యూరం బతిసుతుల విడిచి యాపిరితోడన్? ౧౬౭౮
కం. తనపాలిదైవతం బగు,తనమగని న్విడిచి బ్రతుకఁ దమకము సేయున్
వనజాక్షి యెవతె ధర్మం,బును విడిచిన కైక దక్క భూవలయమునన్. ౧౬౭౯
కం. పిసినారి దోష మెఱుఁగునె, పిసఁ గింపాకంబుఁ దినెడిపిఱిఁడిరీతిన్
బస గలరఘువంశంబును, మసిఁ గలిపె గయాళి కైక మంథరకొఱకై. ౧౬౮౦
కం. చెవఁటినుడి నాలు చెప్పిన, జనపతి విని రామచంద్రు సతితో వనికిన్
బనిచె నటంచును వినినన్, జనకుఁడు నాయట్టు లెంతసంకటపడునో. ౧౬౮౧

కం ఇక్కడ జనపతి యీల్గుట, దిక్కఱి వైధవ్యమునను ♦ దీనత్వమునన్
స్రుక్కుచు నేనుండుట తా, నక్కడ నాతనయుఁ డెఱుఁగఁ ♦ డకటా వనిలోన్.

ఉ. ఏ మనుకొందు నట్టడవి ♦ నెన్నఁడు దుఃఖ మెఱుంగనట్టి యా
కోమలి మైథిలాత్మభవ ♦ క్రూరమృగేంద్రతరక్షుబుక్కశా
ఖామృగసూకరాహిపృథు♦గండకభీషణరావభీత యై
రాముని నాశ్రయించుచు భ♦రం బగుకష్టము లెల్ల నోర్చెడిన్.　　౧౬౯౩

చం. కనుఁగొన నల్పపుత్త్రకుఁడు ♦ కానఁడు పెక్కురనైన, వృద్ధుఁడున్
జనకుఁడు దుస్సహార్తిఁ బడి ♦ సంపరితప్తుఁడు నై నశించు, నే
నును సతి నౌట సువ్రతము ♦ నూల్కొని యీవిభుతోడ నిప్పుడే
చనియెదఁ గాలుప్రోలికిఁ గృ♦శానుశిఖాపరిదగ్ధగాత్ర నై.　　౧౬౯౪

చం. అని పలవించు చుండ న్యవ♦హారవిదుల్ చనుదెంచి తత్సతిన్
సనయత నూఱడించి యిల♦నాథపతిగాత్రము నూనెకాఁగులో
నునిచి యనంతరక్రియల ♦ నొప్పుగఁ దీర్చిరి రాజకార్యముల్;
తనయుఁ డొకండు లేమి నట ♦ ధర్మవిదుల్ నృపుఁ గావఁ బంచుచున్.　　౧౬౯౫

శా. తైలద్రోణిని నుంప భూరమణు శు♦ద్ధాంతాంగనల్ చూచి భూ
పాలా! పోయితె యంచు నార్తరవలై ♦ బాహుద్వయం బెత్తుచున్
వాలాయంబుగ నెత్తి మోఁదికొనుచున్ ♦ బాష్పాంబులీనాస్య లై
వ్రాలం జొచ్చిరి హా పతీ చనితివే ♦ ప్రాణేశ యం చుర్విపై.　　౧౬౯౬

సీ. సత్యసంధుఁడు రామ♦చంద్రుఁడు ప్రియవాది, వాసె నీవును మమ్ముఁ ♦ బాయఁదగు నె?
చెనఁటికైకయి వేఱ ♦ చేసెను శ్రీరాముఁ, బతిహంత్రి కడ నెట్లు ♦ వచ్చు నిలువ
విధవల మగుదును ♦ విభుఁ డగు నీకు మా, కెల్ల ది క్కన్న నీ♦ తేఁకుఁ డొకఁడె
యట్టిధన్యుండు రా♦జ్యశ్రీలఁ బెడఁబాసెఁ, జనితివి నీవును ♦ స్వర్గపురికి

ఆ. మగని నిన్నుఁ జంపె ♦ సుగుణి రామునిఁ బాపె, వీరు లక్ష్మణునిని ♦ విడిచి పెట్టె
ముద్దుఁగోడ లైన♦ముగ్ధ సీతఁదొలంచెఁ, ద్రుంప దింక నెవరి ♦ దుష్టకైక?　　౧౬౯౭

కం. కైక యనుమాటలం బడి, యేకరణిని నిలువఁ గలమొ ♦ యిచ్చట నని దుః
ఖాకులచిత్తంబుల నస్తోకంబుగఁ బొరలి పొరలి ♦ దూపిల్లంగన్.　　౧౬౯౮

కం పతి లేనిసతిని దారా, పతి లేనిత్రియామఁ బోలి ♦ పట్టనము ధరా
పతిలేమిని దేజోవర్జితమై శోభిల్ల కుండెఁ ♦ జింతాయుత మై.　　౧౬౯౯

మాలిని. కలయఁగ జను లెందుం ♦ గార్పఁగన్ బాష్పవారిన్
గులతరుణులు హాహా♦ఘోషముల్ నించు చుండన్

లలి నలుకులు ముగ్గు ♦ ల్గానరా కెట్టియింటన్
బొలుపు దొఱఁగి యుండెం ♦ బ్రోలు గుర్తింపకుండన్ ౧౨౦౦

కలితాంతము. భూమీశ్వరుఁ డేఁచ్చుచు ♦ బొంది విడన్, భామాజన మార్తిని ♦ వ్రాలనిలన్
శ్రీమద్రవి యస్తముఁ ♦ జేరఁ జనెన్, భూమిం బెనుఁజీఁకటి ♦ పొల్పెసఁగెన్.

కం. సుహృదాప్తులు చేరియు న,న్మహిపతినుతు లేమిఁ జూచి ♦ మానిరి తనువున్
దహనము సేయక యాతని, గృహమందున యుంచి రతనిఁ ♦ గృతమతు లగుచున్.

మానిని. తామరసాప్తుఁడు లేనినభం బనఁ ♦ దారలు లేనిత్రియామ యనం
గా మహితాత్ముఁడు భూపతి లేమిని ♦ గద్గదకంఠరసమాకులితా
యామమహాపథచత్వరసంఘము ♦ నై పురి యొప్ప నరుల్ సతులున్
స్తోమము లై చెడఁదిట్టుచు నుండిరి ♦ ద్రోహ మొనర్చినకైకేయినిన్. ౧౨౦౩

సీ. తరువాత నటువాతఁ ♦ దరణి దూర్పునఁ దోఁప, రాజకర్తలు ద్విజ ♦ రాజవరులు
గౌతమమార్కండేయ ♦ కాత్యాయనులును మా,ర్కండేయజాబాలి ♦ కాశ్యపులును
వామదేవుండును ♦ వల నొప్ప సభ దీరి, మంత్రియుక్తంబుగ ♦ మానవేంద్రు
వరపురోధ వసిష్ఠు ♦ వంకఁ గనుంగొని, క్ష్మాపతి స్వర్గంబుఁ ♦ జనుట కతన

తే. రేయినూఱేండ్లవిధముగఁ ♦ బోయె నని కు,రాజుపరలోకగతుఁ డయ్యె ♦ రాముఁ డనుజు
తోడఁగాననకుఁ జనియె ♦ శత్రుఘ్ను యుక్తి, రాజగృహమునఁ భరతుండు ♦ గ్రాలువాఁడు

కం ఘను లగురాసుతులం దొ,క్కని నైనను రాజుఁ జేయ ♦ వలయుం బురి కో
యనఘ! యరాజక మొనవిన, జనములు రాష్ట్రములు మిగుల ♦ సంకటపడవే.

⟶ అరాజకత్వదోషవర్ణనము. ⟵

కం ధారిణి యరాజకము గా, వారిధనిచయంబు దిక్కు ♦ వార్ధారాప్తిన్
వారక చపలాగర్జో,దారంబుగ వృష్టి నిడదు ♦ తగుసమయమునన్ ౧౨౦౬

కం. ధారిణి యరాజకము గాఁ, గారున బీజములు నాటి ♦ కాఁపుజనంబుల్
పైకు లొనర్పరు ఫలసం,వారగ్రహణంబు నష్ట ♦ వలు నెది లేమిన్. ౧౨౦౭

కం. ధారిణి యరాజకముగాఁ, బూరుషునకవస్తు లగుచుఁ ♦ గొడుకులు పుత్రుల్
దార; లరాజకమున లే, వారలు నిశ్శబ్దులు లేర ♦ యొండ్రు మగలకున్ ౧౨౦౮

కం. అత్యాహిత మిటు గూడిన, సత్యం బెట నుండు నెందు ♦ శౌచం బుండున్
క్షిత్యధిపతి యొకఁ డుండుట, యత్యావశ్యకముగా మ ♦ హర్షి ప్రసరా. ౧౨౦౯

కం ధారిణి యరాజకముగాఁ, జాగుతరోద్యానములు ప్ర ♦ శస్తపుఁబుణ్యా
గారంబులు గలుగవు సభ, చేసిగు మానవులు మహిని ♦ స్తిమితత లేమిన్ ౧౨౧౦

కం. ధారిణి యరాజకముగా, ధారిణీసురు లధ్వరములఁ ♦ దలఁపరు నలుపన్
గూరినవిఘ్నభయమున నుఁ,దారులు ధను లయ్యు నిడరు ♦ దక్షిణ లెందున్.

కం.ధారిణి యరాజకముగా, రారాజన్న ర్తకనట ♦ రాష్ట్రసమృద్ధి
స్ఫారోత్సవయాత్రాసం,చారంబులు గనఁగ రావు ♦ సమ్మద మారన్. ౧౭౧౨
కం.ధారిణి యరాజకముగా, బేరులు లాభంబు గనరు ♦ బేహారములం
దీరుపఁ దగవులు తగునధి,కారులు లేకుంటఁ గొనుటఁ ♦ గడు లంచములన్.
కం.ధారిణి యరాజకముగాఁ, బౌరులు స్వేచ్ఛానువృత్తి ♦ బహురమ్యకథా
ధోరణి వెలయరు పలుసిం,గారంబులు చేసికొనరు ♦ కంజాతాక్షుల్. ౧౭౧౪
కం ధారిణి యరాజకముగాఁ, గూరిమిఁ గై సేఁత లొప్పఁ ♦ గొమిరెలుఁ గొమరుల్
సారారామంబులను బ,చారిముల౯ సౌఖ్యపడరు ♦ సాయాహ్నములన్.[1] ౧౭౧౫
కం.ధారిణి యరాజకము గా, స్వైరిం జనఁ బోరు సతులు ♦ వల్లభయుత లై
తేసలపై వరసుమనో, వారానచయంబుఁగొలుకు ♦ వనభూములకున్.[2] ౧౭౧౬
కం ధారిణి యరాజకముగా, భూరిధనుల్ గోపజనులు ♦ ప్రొద్దు మఱిఁగిన౯
ద్వారములు తెఱచి నిద్రం, గూరరు చోరులభయాన ♦ గుండియ లద్రువన్.[3]
కం.ధారిణి యరాజకము గా, వారణరత్నములు షష్టి ♦ వర్షాంచితముల్
తీరుగ ఘంటానాదము, లారఁగ ఘంటాపథముల ♦ సలవడదు చనన్. ౧౭౧౮
కం.ధారిణి యరాజకముగా, నారాచాభ్యాసముస వి♦సంబడు పటుమౌ
ర్వీరావము విన రా దెట, వీరులకుం జ్యా మొక్క ♦విధమున లేమిన్. ౧౭౧౯
కం ధారిణి యరాజకముగా, దూరవిషయగాము లగుచుఁ ♦ దోరపునస్తుల్
బేరంబునఁ గొని యరిగెడు, నూరుభవుల్ సుఖితేఁ జేర ♦ గొల్లను బల్లెల్.
కం.ధారిణి యరాజకముగా, ధీరత యతి యొంటిగాఁగఁ ♦ దిరుగఁడు పంచ౯
దారి రవి గ్రుంకుచోటన, కోరం డట వన్న దాత ♦ గొఱలమి నొకఁడున్.
కం.ధారిణి యరాజకము గా, మూరదు యోగంబు క్షేమ♦మును; సైన్యంబుల్
ఘోరారాతుల చేతను, ధీరుఁడు పతి లేమి మొనలఁ ♦ బెగటాఱి చనున్. ౧౭౨౨
కం.ధారిణి యరాజకము గా, సారతరానందమునను ♦ జనములు పురిలో
వారణ ఘోటకరథయా,నారూఢులు నగుచు నిచ్చ ♦ వరుగరు పూనీ? ౧౭౨౩
కం.ధారిణి యరాజకము గాఁ, బోరంగత మగుచు శాస్త్ర ♦ పటలి౯ జన మి
చ్ఛారతి వనముల నుపవన,తీరంబుల వాదములను ♦ దేఱదు మహిమన్. ౧౭౨౪
కం.ధారిణి యరాజకము గా, నారయఁగా దేవతార్చ♦నార్థము సుమనో
హారోపహారములఁ దమిఁ, బౌరులును సదక్షిణముగఁ ♦ బరఁగింప రెటన్.
కం ధారిణి యరాజకము గా, సారాగరుచందనాది♦చర్చలను వసం
తారంభవృక్షములవలె, భూరమణకుమారు లెందుఁ ♦ బొలయరు సుఖులై.

---

1. 2 స్త్రీపురుష సుఖసంచారము లిప్పటికిన్ని మిన్నగాఁ బూర్వ ముండెనని యెఱ్ఱుడుచున్నది.
3 పూర్వమున జనులు చోరభయములేక తలుపులు తెఱచియుంచి నిద్రించుచుండిరి. చోరులవలనఁ గలుగు నష్టి గ్రామాధికారులు కట్టుకొల్లు రాజ్యాన. ఇప్పుడు రక్షకభటులే . . . . .

కం. నీళ్లులు లేని స్రవంతులు, సల్లలితతృణాళి లేని ♦ సారవనంబుల్
వల్లవులు లేనిమూఁకలు, వల్లభుపాలనము లేని ♦ వసుధయు సమముల్. ౧౭౨౭

కం. కనఁ దేరికిఁ గేతనమును, ననలునకుం బొగయుఁ జిహ్న ♦ మగు నారీతిన్
మనకును ధ్వజ మగుభూపతి, మనలోకము విడిచి చనె న♦మర్త్యులపురికిన్.

కం. ధారిణి యరాజకము గా, నేరికి నెది సొంత మనుచు ♦ నెన్నఁగ రా దెం
తూరక జనులొక రొకరిన్, వారక మ్రింగుదురు మత్స్య♦వర్గముభంగిన్.

తే. ఛిన్నమర్యాదు లగుచు నా♦స్తిక్య మూని, నృపతిచే మున్ను శిక్షితుల్ ♦నీచజనులు
రాజు లేమిని జంకక ♦ తేజ మెసఁగి, స్వప్రభావంబు వాఁగెదు♦వారు గారె. ౧౭౩౦

కం. పన్నుగ నిత్యము మేనికిఁ, గన్నులవలెఁ జూచి రాజు ♦ క్ష్మాజనములకున్
సన్నుతధర్మము సత్యము,ల న్నిలుపుం జెడక బలక♦లాయుతుఁ డగుచున్.

కం. రాజే సత్యము ధర్మము, రాజే సత్కులజులకును ♦ బ్రథితకులంబున్
రాజే తల్లియుఁ దండ్రియు, రాజే హితపథ్యకరుఁడు ♦ ప్రజలకు నెల్లన్. ౧౭౩౨

కం. దండధరవిత్తనాథా,ఖండలవరుణులను మీఱుఁ ♦ గడిమిని భూపా
ఖండలుఁడు మహితవృత్తి సు,సుండితుఁడయి జగము లెల్ల ♦ మన్నింపంగన్.

కం. సాధువుల నసాధువులన్, క్ష్మాధవుఁ డిల విభజనంబు ♦ సలుపనిచో న
య్యా! ధారిణివలయమ్ము స,మేధితతమమున మునింగి ♦ మిడుకదె చెపుమా.

కం. జీవితుఁ డై యుండఁగనే, భూవిభుఁడు త్వదీయవాక్య♦మును మీఱమి పా
రావారము వేలనువలె, నీవేలను జెప్ప నేల ♦ హితసంకల్పా. ౧౭౩౫

కం. నృపతి యొకఁ డుండఁ జేనియు, విపినమగున్ రాష్ట్ర మిదియు ♦ విదితము నీకున్
నృపుఁగా దశరథునుతు నీ, విపు డొనరించుటయె తగు ము♦నీంద్రప్రవరా! ౧౭౩౬

మంత్రిపురోహితులు భరతునకు దూతల సంపుట.

చం. అనుడు వసిష్ఠుఁ డా యనఘు ♦ లాడినవాక్యము లెల్ల నాదటన్
విని భరతుండుఁ దమ్ముఁడును ♦ నెమ్మిని రాజగృహంబునందు సౌ
ఖ్యనితతి నున్నవారు జవ♦నాశ్వములం గొని దూత లిప్పుడే
చని వడిఁ దోడి తేవలయు ♦ సాగెడు నెయ్యది వారులేనిచోన్. ౧౭౩౭

సీ. అగు నగు నన్న సి♦ద్ధార్థ విజయు జయం,తాశోకనందనా♦ఖ్యాతదూత
లను గాంచి ముని పల్కె ♦ వినుఁడు కర్తవ్యంబు, జవనాశ్వముల నెక్కి ♦చనుఁడు వేగ
రాజగృహాఖ్యపు♦రంబును జేరంగ, నందుఁ గించిచ్ఛోక ♦ మొందక కీరు
భరతునిఁ గనుఁగొని ♦ గరిమ నాయాజ్ఞగాఁ, బలుకుఁడీ శోకంబు ♦ నళుకు లేక

తే. క్షేమ మడిగిరి మంత్రివ♦సిష్ఠు లేవొ, ముఖ్య మైనట్టిపని యుంట♦మూర్తమైనఁ
దడవు సేయక రమ్మని♦నుడివినా ర,టంచుఁ జెప్పుఁడు మఱి యేమి♦యనఁగ నలదు.

ఉ. చెప్పకుఁ డీర లాతనికి ♦ సీతవిభుండు ప్రవాసి యౌట, మీ
యప్ప దివంబుఁ జేరె నని ♦ యైనను, తేనికిఁ గైకపట్టి కిం
పౌ ప్పగువస్త్రభూషణము ♦ లుత్తమ మైనవి కొంచు నేగుఁడీ
తెప్పున, నన్న వారికి వి♦ధించి యొసంగినదారిబత్తెముల్ ౧౭౩౯
సీ. కైకొని వారు స్వా♦గారంబులకు నేగి, సమ్మతాశ్వములను ♦ సరగ నెక్కి
పయన మై వలసిన♦వస్తువు ల్గొని వసి,ష్ఠున కెఱింగించి చ♦య్యనను జనుచుఁ
నపరతాలాఖ్య మా♦నద్రికిఁ బడమర,యును బ్రలంబాద్రికి ♦ నుత్తరంబు
నగుచు నీ రెంటిమ♦ధ్యమునఁ బాఱెడిమాలి,నీనదిబడి నేగి ♦ నెఱిగ హస్తి
తే. నాపురముపొంత జాహ్నవీ♦నదిని దాఁటి
యవలఁ బశ్చిమముఖముగ ♦ నరిగి జాంగ
లంబుత్రోవను బాంచాల♦కంబుఁ జొచ్చి
కొలఁకులను నదులను గనుం♦గొనుచు వారు ౧౭౪౦
సీ. చని చని కార్యవ♦శంబున ద్రుతగతిఁ, దతజనాకుల శర♦దండ యనెడి
తటినిఁ దరించుచుఁ ♦ దత్పశ్చిమతటస్థ,సత్యోపయాచన♦త్యాజ మెఱఁగి
చని కుళింగపురంబుఁ ♦ గని యభికాళ మన్,గ్రామంబు దాఁటి త♦త్ప్రాంతలసిత
బోధిభవన మను♦భూధరంబును జేరి, యాజిపూర్వమహీధ♦వానుభూతి
తే. మిక్షుమతిఁ గాంచి యందు దో♦సెఁడుజలంబుఁ
గ్రోలి తప మున్నపుణ్యవి♦ప్రాళిఁ గాంచి
యంత బాహ్లికదేశమ♦ధ్యంబుఁదాఁటి
పోయి యవల సుదామాఖ్య♦భూమిధరము ౧౭౪౨
సీ. విష్ణుపదంబును ♦ వీక్షించుచు విపాశ, శాల్మలీతరువును ♦ జారువాపి
కానదీపల్వల♦కస్రుతటాకాళిఁ, దిలకించుచును మృగ♦ద్విపమృగేంద్ర
శార్దూలభీకర♦సత్త్వాళి దృష్టించి, చని చని యావల ♦ శ్రాంతతురగు
లైనదూతలు దూర♦యానంబు నడచి శీ,ఘ్రంబునఁ గని గిరి♦వ్రజపురంబు
తే. భర్తకును బ్రియ మొదవింప ♦ భర్తృవంశ,సుప్రతిష్ఠకుఁ గుల మోము ♦ సుమతు లైన
దూత లల్లంత రేయి సం♦ప్రీతిఁబురిని, జొచ్చి నిశ యెల్ల నొకచోటఁ ♦ బుచ్చిరంద.

◆— భరతుఁడు దుస్స్వప్నముఁ గని పరితపించుట. —◆

కం. ఏరాత్రియందు దూతలు, చేరిరి తత్పురము నాని♦శీథినియందే
క్రూరస్వప్నము కైకకు,మారుండును గాంచి మిగుల ♦ మల్లడిగొనియెన్. ౧౭౪౩
కం. వేకువన లేచి తత్స్మృతి, వ్యాకులుఁ డైయున్న నిష్ట♦వాదులు మిత్రుల్
శోక మణంపఁగ సభలోఁ, బోకల నెన్నేని యుబుసు♦పోకకుఁ బోవన్ ౧౭౪౪

కం. కొందఱు కథలు వచించుచుఁ, గొందఱు హాస్యంబు లాడి ♦ కొందఱు నాట్యా
దిం దిలకింపఁగఁ జేసియుఁ, గొందఱు వాద్యముల నెఱపి ♦ కొలఁ గా కున్నన్

చం. ప్రియసఖుఁ డొద్దకుం జని సు♦హృజ్జను లందఱుఁ జుట్టి కొల్వ నే
ల యెద ముదంబుఁ గాన? వని ♦ లాలన వేఁడిన నాతఁ డి ట్లనున్
నయమున మిత్రుఁడా! వినుము ♦ నాయతిదీనతకారణంబు ని
శ్చయ మిది భీషణంపుఁగల ♦ సంకటపెట్టెడి నేమి సేయుదున్. ౧౭౪౬

సీ. కలలోన మాతండ్రి ♦ మలినుఁ డై ముక్తకే,శుం డయి శైలమ్ము♦నుండి పేఁడ
మడువులోఁ గూలిన♦మాడ్కి నే దా నందుఁ, గప్పగంతులతోడఁ ♦ గడఁగి నవ్వ
కొనుచు దోసిటిలోనఁ ♦ గొని తైల మానిన, కరణిఁ దిలోదన♦గ్రాసయుక్తిఁ
దలక్రిందుగా నుండి♦తైలంబు మెయి నింపఁ, బూసితా నా తైల♦మునను మునుఁగఁ

తే. గంటి శుష్కించి పోయె సా♦గరము లెల్లఁ
గుపలయాప్తుండు ధరణిపైఁ ♦ గూలఁబడియెఁ
జిమ్మచీఁకటి ముంచె జ♦గమ్ము నెల్లఁ
బట్టపేనుఁగుదంతంబు ♦ భగ్నపడియె. ౧౭౪౭

ఆ. అగ్నిచల్లపడియె ♦ నవని బ్రద్దలు వాఱె, నెండిపోయెఁ జెట్టు ♦ లెల్లయెడలఁ
బొగయు చుండె శైల♦ములు; నల్లయినుపపీ,ఠంబుమీఁద నల్ల♦డంబు గలుగు

తే. అంబరముఁ దాల్చి కూర్చుచు♦యాజి దన్నుఁ, గృష్ణపింగళ లంగనల్ ♦ గేలి నవ్వ
చుంప నెఱ్ఱనిపూవుల♦దండ లమర, ఖరరథమున దక్షిణా♦శకును జనియె. ౧౭౪౮

తే. రక్తవాసిని యొక్క గ♦ రాజుఁ జూచి, నవ్వుచుండెను; వికృతాన♦నంబు గలుగు
రాక్షసియొకర్తు నాతండ్రిఁ♦బ్రసభమునను, లాగుచుండఁగఁ గంటి నీ♦లాగు కలను

కం. ఈరాత్రి యిట్టిభయదా, కారపుఁగలఁ గంటి దీనఁ ♦ గాకుత్స్థునకో
శ్రీరామునకో నాకో, యారయ లక్ష్మణునకో ల♦యంబు ఘటిల్లున్. ౧౭౫౧

కం ఖరయుక్తవాహనంబుల, నరుఁ డెవ్వం డేగుఁ గలను ♦ నాతిచిరముగాఁ
బరఁగును నాతని చితిపై, నురు వగుధూమములు దీన ♦ నుల్లం బగలెన్. ౧౭౫౨

చం. తడఁబడె మాట, కుత్తుకయుఁ ♦ దద్దయు నెండెఁ, జిత్త మన్ననో
నుడివడఁ జొచ్చె, నెట్టిగడు♦సుందనపున్నడి వింట గల్గునో,
యుడుకుట మానసంబు మొగ ♦ మొప్పదు మీయెడఁ బ్రీతిఁ బల్క, నీ
యెడ భయకారణం బెఱుఁగ ♦ నె త్తినభీతిని దల్లడిల్లెదన్. ౧౭౫౩

కం. ఏలొకొ నాస్వరయోగము, దూలె న్నాకాంతి మాసె ♦ దూపిలె నెదయున్
వాలాయము కారణ మే,మో లవమును దోఁప దయ్యె ♦ నుల్లంబునకున్. ౧౭౫౪

కం. మును పెన్నఁ డెఱుంగనియీ, పెనుఁజెడుకల వివిధగతులఁ • బీడించుటచేఁ
నను(గుంజెలికాఁడా! నా, జనకున క్షేమో యటంచు • సంతాపింతున్. ౧౭౭
కం. అని తనస్వప్న చరిత్రము, వినిపించుచు మిత్రులకును • వేఁదుఱు గొనుచున్
జనకునిఁ దలఁచుచుఁ జింతా, వననిధి మునుఁగుచు నతండు • వర్తిలు చుండన్.

రాజదూతలు భరతునితో సంభాషించుట.

సీ. తత్సమయమున దూ•తలు వచ్చి నృపుచేత, నృపపుత్రుచేత న•ర్చితులు నగుచు
క్షితిపతిపాదముల్ • చే నంటి భరతునిఁ, గని యిట్టు లనిరి యో•త్కృష్టకళత్ర
మీ సేమ మడిగిరి • మీపురోహితమంత్రు, లెల్లరుఁ బయనింపు • మింక వేగ
యాత్యయికంబు కా•ర్యంబు నీయొనరింపఁ, దగిన దున్నది యట • నగలు వస్త్ర
తే. ముల నొసంగిరి నీకయి • తొలుత నిమ్ము, వీన వింశతికోటులు • పృథ్వీపతికి
మేనమామకుఁ బదికోట్లు • నా నతండు, వానిఁ గైకొని యిట్లని • వారి నడిగె.
సీ. మాతండ్రి దశరథ•మహిపతి కుశలియే, సౌఖ్యమా శ్రీరామ•చంద్రునకును
నారోగ్యవంతుఁ డే • యనఘుఁడు సౌమిత్రి, సేమమే మానిన•సిత్తునకును
భద్రమే శ్రీరామ•భద్రునిమాతకు, నార్య ధర్మజ్ఞధ•ర్మైకనిరత
కామోదమే కదా • యతి ధర్మ మతియైన, లక్ష్మణుజననికి • లలితశీల
తే. కాంత్కకాను సదాచండి • యతులకోప, శీలయును బ్రాజ్ఞమానిని • చెనఁటి నాదు
తల్లి యారోగ్య యుక్త క•దా మ త్రేమి, పలికె మీతోడ మీరిట•నచ్చునపుడు.
చం. అనుడును దూత లెంతొ విన•యంబున నాడిరి మీర లిష్ట కో
రినమునవారికిన్ సుఖమె • శ్రీసతి పద్మ వరించుఁ గాత ని
న్ననఘు గుణాఢ్య! యేల యిఁక • నాలము, వే పయనింపు మన్న నే
జనపలికిన్ వచించి యిదె • చయ్యన నచ్చెన నంచుఁ బల్కుచున్ ౧౭౯
చం. భరతుఁడు తాతఁ గన్గొని నృ•పా! జనకుం గనఁ బోయి వచ్చెదన్
దొరపడు చున్నవార లిదె • దూతలు మీ రెవు డిచ్ఛయించినన్
సరగున నష్ట నత్తు నన • నస్మితిఁ జెంది యతండు నాయనా!
గురులఁ బురోధ మంత్రులను • గూరిమి సేమపుమాట లాడుమీ. ౧౮౦
కం. రామునకును లక్ష్మణునకు, ధీమహితద్విజుల కెల్లఁ • దెలుపుము కుశలం
బీమహితకంబళాది, స్తోమము వారలకు నెల్ల • సొంపుగ నిమ్మా. ౧౮౧
తే. అనుచుఁ గాంచననిష్క స•హస్రయుగముఁ, బదియునాల్గ్వార్ల వాజుల•భరతునకును
గంబళాజనవిత్తంబు • లింబు మీఱ, నొసఁగె సత్కృతి మున్నుగ • నుల్ల మలర.
ఉ. బాసటగాఁగ నశ్వపతి • పంపె నమాత్యుల సద్గుణాఢ్యవి
శ్వాసులఁ ద్రోవఁ దోడుగ వె•సం దనయల్లునకున్ యుధాజితుం

డాన నిరావదుద్భవము ♦ లైంద్రశిరంబుల దంతులన్ జవో
ద్భాసిఖరంబులన్ భయద♦దంష్ట్రము లౌపెనుఁబ్రోదికుక్కలన్. ౧౭౬౩

↞ భరతుఁ డయోధ్యకుఁ బ్రయాణం బగుట. ↠

ఉ. ఇచ్చినవానిఁ గైకొనియు ♦ నేమిముదం బెద లేక స్వప్నయా
వచ్చరితంబు దూత లిడు♦వాఁవిరితీవరపాటు నెంతయే
నిచ్చ మెలంగఁగా భరతుఁ ♦ డేగఁ గడంగినయంతఁ దాతయున్
సచ్చరితుండు మామయును ♦ సమ్మతి వీడ్కొలుపన్, రథంబులన్ ౧౭౬౪

ఉ. తమ్ముఁడుఁ దాను నెక్కి సుర♦ధామము వెల్వడుసిద్ధుపోల్కి వే
గమ్మున నూరు వీడి బల♦కాంతము గొల్వఁగ మండలోరుచ
క్రమ్ముల నొప్పు తేర్లు తుర♦గమ్ములు గోవులు నుష్ట్రసంఘముల్
సమ్మతిఁ గొంచు భృత్యజన♦సంతతి వెంబడి రా మహోత్వరన్. ౧౭౬౫

సీ. రాజగృహమునుండి ♦ ప్రాఙ్ముఖుం డై కొంత, చని సుదామాఖ్యంబు♦ధునిని దఱిసి
యతివిశాలం బగు♦హ్లాదిని దరియించి, పశ్చిమముఖ మయి ♦ పాఱునవి శ
తద్రు వేలాధాన♦తటమున లంఘించి, యపరపర్వటముల ♦ నాశ్రయించి
ఘనశిలావహానది ♦ ననఘుఁడు దాఁటుచు, నాగ్నేయమున హ్రాద♦యానురంజ

తే. కంబు నగుపురమును శల్య♦కర్తనంబుఁ
జూచి చైత్రరథంబున♦సొంపు మెచ్చి
గంగయు సరస్వతియునాఁగ ♦ రంగుమీఱు
జోడునదులను గాంచి యా♦సూర్యకులుఁడు ౧౭౬౬

సీ. వీరమత్స్యోత్తర♦భారుండవనిఁ జొచ్చి, కొండలనడుమను♦గోమరు మీఱు
నలకుళింగంబు నా♦వల యమునాతీర,మున బలంబులుఁ దాను ♦ ముదము మీఱ
విడిసి సేదలు దీర్చి ♦ కడిగి గుఱ్ఱంబులఁ, దాము మజ్జన మాడి ♦ దప్పి తీఱ
జలములు గ్రోలి యా♦వల నీరములు లేమి, జలము లానదియంద♦ సంగ్రహించి

తే. ఘోరవనములలోఁ జొచ్చి ♦ కుంజరంబు,మీఁద రాకొమరుండు దా♦మింటఁ జనెడి
గాలిపోలిక వానిని ♦ లీల దాఁటి, చేరె భాగీరథీనదీ♦తీరభూమి. ౧౭౬౭

తే. అంశుధానాఖ్యదేశంబు♦నందుఁ బ్రాగ్వ,టాఖ్యపురిని భాగీరథి ♦ నధిగమించి
యవలఁ గుటికోష్టికానది ♦ యవల ధర్మ, వర్ధనాఖ్యపురంబును ♦ వరుసఁ గాంచి.

సీ. తోరణదక్షిణ♦ధారిణి నుండి జం,బూప్రస్థనామక♦పురముఁ జేరి
రమ్యవరూథ మన్♦గ్రామంబు దరి వనీ,స్థలి నిల్చి తూర్పుగఁ ♦ జనుచు నుజ్జి
హానంబునం బ్రియ♦కారామమును డాసి, యచ్చట జవనంబు ♦ లశ్వములను
రథమునకును గట్టి ♦ రాజకుమారుండు, వానిని మెల్ల రాఁ ♦ బలికి తూర్ణ

ఆ. ముగను ద్రోవ నడచి ♦ మొగి సర్వతీర్థంబు,నందు నొక్క రేయి ♦ యనఘుఁ డుండి
యొప్పుగాఁ గఁగదలి ♦ యుత్తానికాదివా,హినులఁ గుటికహస్తి♦పృష్ఠకమున ౧౨౬౯

సీ. దాఁటి లౌహిత్యప♦ త్తనసమీపమునఁ గ,పీవతిఁ దరియించి ♦ వీరవర్యుఁ
డేకసాలంబున ♦ నెసఁగు స్థాణుమతిని, వినతంబునను గోమ♦తిని గమించి
యధ్వపరిశ్రాంతి ♦ యణఁగఁ గళింగపు,రంబున సాలవ♦నంబునందు
నొక్కింత నిలిచి రే ♦ తక్కక యది దాఁటి, యరుణోదయంబున ♦ భరతుఁ డాత్మ
తే. పురము మనునిర్మితం బయి ♦ సిరుఁ మీఱు,నయ్యయోధ్యను గనుఁగొనె♦నవనినాథ
తనయుఁ డిట్టులుసప్తరా♦త్రములు నడచి,తనదుపురమును జూచి సూ♦తునకుననియె.

భరతుఁ డయోధ్యాదుస్థితికి వగచుట.

ఉ. సారథి! కంటివే నృపతి♦సత్తమపాలిత మౌచు యజ్వసం
వారములన్ శమాదిగుణ♦భాసురవాళుల వేదపారగో
దారచయంబులన్ వెలసి ♦ తద్దయుఁ దెల్లనిసుద్దఁ బోలుచున్
దూరపుదృష్టి కీపురము ♦ దోఁచి ముదంబు ఘటింప దేలొకో. ౧౨౭౧

కం. మున్నెప్పుడుఁ గలకల మని, యన్నులపురుషులరవంబు ♦ లతిదూరమునన్
జెన్నుగ వినఁబడు నిపు డా,సన్నంబున కరిగి వినము ♦ సారథి యేలా? ౧౨౭౨

కం. కేళీలీలాలోలజ,నాళులు సాయంతనముల ♦ నారామములన్
హాళిమెయి నుండి వేకువ, నేలా చన రింప్లకడకు ♦ నియ్యెడ సూతా ౧౨౭౩

శా. నాకుం జూడఁగ సారథీ! పుర మర♦ణ్యప్రాయ మై తోఁచెడిన్,
శాకల్ పోకలు సేయ రెవ్వరుఁ బురిన్ ♦ యానంబులం దేని, నా
నాకుంభీంద్రతురంగమంబులపయి ♦ న్హార్షంబున న్లోకు ల
స్తోకక్రీడలు సల్ప రెవ్వ, రిదయున్ ♦ దోలాయితం బయ్యెడిన్. ౧౨౭౪

ఉ. మత్తశుకీపికంబులను ♦ మంజులరంజకకందళంబులన్
హత్తినకేళికారతి స♦మాగతసుందరబృందసంగతిన్
జిత్త మిగుర్పఁ జేయుసర♦సీనుమమందిరకందరంబులన్
సత్త నెసంగుతోఁట లివి ♦ సారథి! యేగతి పట్టెఁ జూచితే. ౧౨౭౫

కం. రాలెడునాకులతోడను, ప్రీలెడుశాఖాచయముల ♦ వృక్షంబు లయో
గోలున నేడ్చెడి రీతిని, లీలాచ్యుతిఁ దోఁచె సూత ♦ లీలావనులన్. ౧౨౭౬

కం. కనరా రొక్కరుఁ దోఁపుల, వినరాదు విహంగరుతము ♦ వీనుల కింపై
చనుదేర దగురుచందన,ఘనధూపమిళత్సమీరు♦కమ్మనితావుల్. ౧౨౭౭

కం. భేరీమృదంగవీణా,చాగునినాదములు తొల్లి♦చందంబున నే
లా రావు వినఁగ శకునము, లారయ మేల్గావు హృదయ ♦ మాకులతఁ గనెన్.

చం. ధ్రువ మిది యెట్టులుఁ శుభము ♦ దుర్లభ మౌను మదీయబంధులం
దవశతఁ జెందెడిఁ హృదయ ♦ మారటపాటున నంచుఁ దత్పురిఁ
జవమున వైజయంత మను♦సత్పథఁ గాంచినద్వారసీమఁ జొ
చ్చి విజయ మద్గుదర్శకులు ♦ చెచ్చెర రా వెనువెంట నేగుచున్ ౧౭౯

చం. పరిపరిరీతులఁ మనము ♦ బ్రద్దలు వాఱఁగ సూతుతో నను
గురుఁడు వసిష్ఠుఁ డేమిటి కొ♦కో పిలిపించె నకారణంబుగ
దారతోర రమ్మటంచు ననుఁ ♦ దోఁచె నదో యశుభంబు గల్గెనొ
విరవిర వోయె మేను గడు♦విహ్వలభావము గాంచెఁ జిత్తమున్. ౧౮౦

చం. నృపతివినాశకాలమున ♦ నేవి ఘటిల్లు నటంచు వింటినో
యవి యెల్లఁ దోఁచెడిని ♦ నిచ్చట సారథి! వెంట లూడ్చుటో,
విపులసుధూపధూమములు ♦ వెల్వడుటో, పచనంబు సేయుటో,
సపరికరంబుగా బలులు ♦ సల్పుటయో, కన మీగృహంబులన్. ౧౮౧

కం. గేస్తులభవనము లెల్ల న,ప్రాస్తశ్రీకంబు లయ్యెఁ ♦ బ్రభ చెడిరి జనుల్
సిస్తుగఁ బూలవిపణులను, రస్తులు గన రా వోకండుఁ♦ గ్రయ్యం బగుచున్. ౧౮౨

చం. అలుకవు, రంగవల్లుల జ♦నావళి లుంపవు, దేవతాగృహం
బుల రమణీయ మాల్యములుఁ ♦ బూస్పవు, మానిసి మోముఁ జూడఁగా
నలవడ దందుఁ బాడిడిన♦యట్టులు దోఁచెను, గుళ్లు దొల్లి యు
ట్టుల లసియింప వేలొకొ క♦డుం బరితాపము పుట్టె సారథీ. ౧౮౩

కం. కొన రస్థుసు వైశ్యులు చిం,తను మునిఁగినవార లయి య♦థాపూర్వముగ
గన రారు వాడుమోములఁ, బని చెడి యున్నారు లేమి ♦ భంగియొ సూతా.

ఉ. కోవెలలందుఁ జైత్యముల ♦ గూరిన పెంపుడుపుల్గులుఁ స్వగ్రా
భావములఁ శిరంబు లర ♦ వ్రాల్చి తొరంగెనిబొప్పవారితో
వావిరిపల్లటిల్లెడిని ♦ వారిజనేత్రలు పూరుషుల్ దురం
తావిలవృత్తినార్తిపడ ♦ నయ్యొ కశం బది యేమొ దైనమా, ౧౮౫

ఉ. మాటికి సూతుతో నిటులు ♦ మాటలు చెప్పుచుఁ బోయి శూన్యశృం
గాటకవేశ్మరథ్యముల ♦ గాఢరజోరుణయంత్రదేహళీ
వాటకవాటఘాటసుల ♦ నర్థిలుప్పన్గిని కాశ మైనయ
వ్వీటిని జూచి దుఃఖమున ♦ విహ్వలుఁ డై తల వాంచి వేగ న్మై. ౧౮౬

భరతుఁడు కైకేయియింటికిఁ బోవుట,

కం. జనకునిమేడకుఁ జని యట, జనకుఁడు గనరామి నతఁడు ♦ చయ్యనఁ జనుదుర్
జననీగృహంబులోనికిఁ, దనప్రోసితసుతునిఁ జూచి ♦ తతమోదమునన్. ౧౮౭

కం.కనకాసనంబుఁ దటుకున, జనయిత్రియు డిగినఁ జూచి ♦ చరణంబులకున్
వినతుం డయినన్ భరతుం, దనయంకముఁ జేర్చి శిరముఁ ♦ దా మూర్కొనుచున్.
శా.ఎన్నాళ్లాయెనొ యూరు వీడి తనయా ♦ యెంతేఁ బథశ్రాంతిచే
నున్నావో కద? మేనమామ సుఖియై ♦ యున్నాఁడుగా? యందు నీ
విన్నాళ్లెట్టులు ద్రోచి? తక్కడ ముదం ♦ బేపారెనా నీకు? నా
యన్నా కన్నులఁ గట్టుచుండితివిగా ♦ యత్యంతమున్ నా కిటన్. ౧౭౯
కం.అని యడిగిన నిజజననికి, ననియెన్ భరతుండు నేఁటి ♦ కాఱునొకండున్
జనె నమ్మ రేలు మామన,దనమును నే విడిచి లెస్స ♦ తాతయు మామన్.౧౮౦
కం.వా రిడిరి ధనము లెల్ల న,వారిగ నవియెల్ల మెల్ల♦వచ్చుచు నుండన్
దారిన్ ము న్నే వచ్చితిఁ, దీరక సందేశహరులు ♦ తీవర పెట్టన్. ౧౮౧
చం.అడిగినవాని నీవు చెపు♦మా జననీ! కనకాంచితంబు నీ
పడుకొనుపాన్పు శూన్య మయి ♦ భాసిల కున్నది, రాచవారలున్
మిడికెద రేల దీనత? న♦నింద్యచరిత్రుఁడు తండ్రి యుండ యె
ప్పుడు భవదీయగేహమునఁ ♦ బొల్చును నేఁ డిట లేఁ డ దేమొకో? ౧౮౨
కైకేయి భరతునకు దశరథుఁడు మరణించుట దెలుపుట
చం.జనకునిఁ జూడఁ గోరి యిటు ♦ చయ్యన వచ్చితి నిందు మ్రొక్కఁగా,
వినయము మీఱ నాయనకు ♦ వే నచియింపుము, పెద్దభార్యయిం
టను గలఁడే? యటం చడుగ ♦ నందనుతో నచియించె ఘోరవా
ర్తను బ్రియబుద్ధిఁ గైక నిజ♦రాజ్యమహాశను మోహితాత్మయై. ౧౮౩
ఆ. యజ్ఞశీలుఁ డనఘుఁ ♦ డవనీధవుండు మ,హాత్ముఁ డధిక తేజుఁ ♦ డార్యనుగతి
యెల్లభూతములకు ♦ నెయ్యది గతి నీదు,తండ్రి యట్టిగతికిఁ ♦ దనయ యరిగె.
చం.అని వచియింపఁగా భరతుఁ ♦ డార్తిని హా యని నేలఁ ద్రెళ్లి చ
చ్చినగతి నుండి లేచి తన♦చేతుల నెత్తి విలాపయుక్తుఁ డై
వనరుచు దిగ్భ్రమం గొనుచు ♦ వ్రాలుచుఁ జూడుము నన్ను నాయనా!
యను నెట కేగితో యను ద♦యామతి న గ్గనరాదొకో యనున్. ౧౮౪
ఉ. శారదరాత్రి యందు సము♦నారసశాత్రవుచే నభంబున
ట్లీరమణీయశయ్య మును♦ పెంతయుఁ గాంతి వహించు, నేఁడయో
యారమణుండు లేమి జల♦జారివిహీననభంబుపోలికన్
నీరము లెండి నట్టిపెను♦నీరధిచందముగాఁగఁ దోఁచెడున్. ౧౮౬
కం.అనుచును వదనముఁ జేలం,బునఁ గప్పి కురారకృత్తి♦భూజం బన భూ
మిని వ్రాలి యేడ్వఁ గరి నా, నినుఁ డన నెల యనఁగ నొప్పు♦నింద్రసమానున్.

కం.తనయునిఁ దనకరముల మెల్లన లేవఁగఁ బట్టి యెత్తి ♦ లాలించి జేడిం
గొని కాఱునీరు దుడుచుచుఁ, జనవు మెఱయఁ గైక యనియె ♦ శాంతమనమునన్.
కం.లే లెమ్ము రాజ! యేలా, యీలీలన్ వగచె దిట్టు ♦ లిల వ్రాలి నినున్
బోలినసుమతులు వగతురె, కాలంబును మీఱి బ్రతుకఁ♦గా నరువశమే. ౧౭౯౯
చం.చదివితి వెల్లవేదములు ♦ సభ్యసుసమ్మతవర్తనంబులన్
బొదలితి, దానయజ్ఞవిధిఁ ♦ బొల్చు నజస్రము మందరంబునన్
మెదలురవిప్రభంబలెను ♦ నీమతి, యేప్పుట లాభ మేమొ నీ
మదిఁ బరికింపుమా యనుడు ♦ త్తాఁ బడి పొర్లుచు నెట్టకే ననున్. ౧౮౦౦
ఉ. రాముని యావరాజ్యమున ♦ రాజిలఁ జేయునొ, కాక యజ్ఞమే
శ్రీమహితుండు తండ్రి యొన♦రించునొ, యంచును నాశ వచ్చితిన్
భూమిధవుం గనుంగొనెడి♦పుణ్యము లేమిని గోర్కు లెల్లఁ గ
ట్టా మొదలాఱిపోయెను, నె♦డందయు వ్రీలెడిఁ దున్క తున్కలై. ౧౮౦౧
ఉ. ఏ మయి యుండెఁ దండ్రి కిట ♦ నే నరుదేరకమున్నె బిడ్డఁగా?
నామయ మెద్ది? ధన్యులు గ♦దా పితృకార్యము లెల్లఁ దీర్చి రా
రాముఁడు లక్ష్మణుండును, ధ♦రాపతి నేఁ జనుదేర మూర్ధముం
బ్రేమను మూర్కొనండె తన♦మేన నొకింతయుఁ బ్రాణ ముండినన్. ౧౮౦౨
కం.ధూళిని బ్రుంగిననామెయిఁ, జాలఁగ ననురక్తిఁ దుడిచి ♦ స్వకరంబుల నన్
లాలించు నాతఁ డెవఁ డిఁక, నాలీలాస్పర్శ మిడెడి♦హస్తం బేదీ. ౧౮౦౩
ఉ. ఎవ్వఁడు నాకు భ్రాత, పిత ♦ యెవ్వఁడు, చుట్టము నెవ్వఁ, డెప్డు నే
నెవ్వనికింకరుండనొ య♦హీనగుణాకరుఁ డైనరాముకై
చివ్వున వార్తఁ బంపు మిఁక ♦ జ్యేష్ఠుఁడె తండ్రి వివేకశాలి, కే
నవ్విభుఁడే మదీయగతి ♦ యాటను వ్రాలెదఁ దత్పదద్వయిన్. ౧౮౦౪
కం.ప్రకటధర్మజ్ఞుఁడు సత్యైకరతుం డమలచరితుఁ ♦ డౌ జనకుఁడు తా
నాకంబున కేగెడిచో, నా కేమని చెప్పు మనెనొ ♦ న్యాయ్యహితోక్తుల్. ౧౮౦౫
కం జనకుఁడు కడపట న్నాకై,యని నట్టిహితంబు వినఁగ ♦ నాశపడెద నం
చును భరతుఁడు పలికిన నా,తనికి యథాతత్త్వముగను ♦ దరుణి వచించెన్ ౧౮౦౬.
కం.రామా యని సీతా యని, సౌమిత్రీ యనుచు మిగుల ♦ సంతాపముతో
భూమీశుఁ డేడ్పు చేష్పుచుఁ, దా మేనిం బాసి విబుధ♦ధామముఁ జేరెన్ ౧౮౦౭
చం.అవిరళపాశపీడితమ♦హాకరి నాఁగఁ దపించి చచ్చుచో
భువిజను లెవ్వ రాభువన♦పూజ్యుని రాము ససీతు లక్ష్మణున్

సవురుగ వెండి రాఁ గనఁగఁ ♦ జాలుదు రట్టిర ధన్యు లంచుఁ దా
నివి కడమాట లాడె ,మఱి ♦ యింతకు నాడఁ డొకం డటం చనన్. ౧౮౦౮

కం.విని రెండవయప్రియముం, దనజనని వచింప మిగులఁ ♦ దహతహపడుచున్
మనమున విషణ్ణవదనం,బున భరతుం డనియె జనని♦మోముం గనుచున్. ౧౮౦౯

కం.అమ్మా రఘురాముఁడు దా, నమ్మహిళారత్న మైన♦యవనీసుతతోఁ
దమ్మునితో నెట కేగెనొ, యమ్మెయిఁ జన హేతు వేమొ ♦ యాడుము తెలియన్.

కం.అని యడిగినఁ గైకేయియు, విన నప్రియ మైనవార్తఁ ♦ బ్రియ మనుబుద్ధిన్
దనయునకుఁ జెప్పఁ దొడఁగెను, దనచేసినయట్టిపని య♦ధాత్త్వముగన్. ౧౮౧౧

కైకేయి భరతునకు శ్రీరాముఁ డరణ్యమునకుఁ బోవుటఁ దెలుపుట.

ఉ. నారలు గట్టి దండకవ♦నంబున కేగెను బుత్ర! రాముఁ డా
ధారిణికన్యతోడఁ బిన♦తమ్ముఁడు గొల్వ న టంచుఁ బల్కినన్
దారుణవార్తకున్ భయవి♦దారితమానసుఁడై స్వవంశశీ
లోరుమహత్త్వ మెంచుచును ♦ సోదరసద్గుణశంక నిట్లనున్. ౧౮౧౨

ఉ. కోరఁడుగా ధరామరుని♦కూర్చినవిత్తము లెవ్వి యేనియున్?
క్రూరత దోషహీను ధని♦కున్ నిజు పేదను నొంపలేదుగా?
కోరఁడుగా పరాంగనల♦కూటమి? శ్రీరఘురామచంద్రునిన్
గారణ మేమి భ్రూణహుని♦కైవడిఁ ద్రోయఁగ దండకాటవిన్? ౧౮౧౩

కం.అనవుడుఁ బండితమానిని,యును జపలయు నైన కైక ♦ యున్నది యున్న
ట్టనుఁ గామినీస్వభావం,బునఁ దనచేఁతకును దాన ♦ పొంగుచు మదిలోన్. ౧౮౧౪

ఉ. రాముఁడు గొంచెమేన్ గొనఁడు ♦ బ్రాహ్మణవిత్త మొకప్పు డేనియున్
గాముకుఁడై పరాంగనలఁ ♦ గన్నులనైనఁ గనండు, పేదనేన్
శ్రీమహితాఢ్యు నేనియు వి♦శిష్టుని నొంపఁడు; నీదుతండ్రినిన్
రాముని గాన కంప నిను♦రా జొనరింపఁగ నేన కోరితిన్. ౧౮౧౫

కం.తనమాటను నిల్పియె నీ,జనకుఁడు వని కనిచె రాము ♦ సహజన్మునితో
జనకజతోఁ బిమ్మటఁ బ్రియ,తనయుం గనలేమి వనటఁ ♦ దా మరణించెన్. ౧౮౧౬

ఉ. నీకొఱ కింతకార్యమును ♦ నే ఘటియించితిఁ బుత్ర! మానుమీ
శోకము నీకుఁ గా నెదురు♦చూచెద రెల్లపురోహితాదు ల
స్తోకధరావిభూతి వర♦శూరకులాగ్రణి నిన్నుఁ బూన్పఁగాఁ
జేకొన వయ్య ధైర్యమును ♦ సిద్ధము గ మ్మభిషేక మందఁగన్. ౧౮౧౭

కం.ఈనగరం బీరాజ్యం, బీనానాకోశచయము ♦ లెల్లను నీ వౌ
భూనాథునిసంస్కారము,గా నీయభిషేకవిధియుఁ ♦ గావింత్రు ద్విజుల్. ౧౮౧౮

## భరతుఁడు కైకేయిని దూషించుట.

చం. అనవుడుఁ దండ్రిచావుఁ దన♦యన్నయుఁ దమ్ముఁడు గాన కేఁగుటల్
విని భరతుండు శోకమున ♦ వేఁగుచు నిట్లనుఁ దల్లితోడ నా
జనకునిఁ దండ్రివంటిరఘు♦చంద్రముఁ రామునిఁ బాసి యేడ్చు నీ
యసదకు హీనభాగ్యనకు ♦ హా సిరి యేటికి రాజ్య మేటికిన్. ౧౮౧౯

ఉ. చండి! ధరాపతి న్గడపి ♦ సద్గుణసాంద్రుని రామచంద్రునిన్
దండక మానిఁ జేసి భృశ♦దారుణదుఃఖముమీఁద దుఃఖమున్
బుండున నుప్పు నిడ్డగతిఁ ♦ బూని ఘటించితి నాకు; నానృపా
ఖండలుఁ డయ్యొ చచ్చు నొడిఁ♦గట్టఁ గదే నినుఁ బొంది మూఢుఁడై. ౧౮౨౦

ఉ. ఎక్కడ దాపరం బయితి♦వే చెనఁటీ! యిటు కొంపఁ గూల్పఁగా?
సక్కట కాళరాత్రిగతి ♦ నాధరణీశుని నీవ చంపితే?
మ్రుక్కడి! యీకులంబునను ♦ మోహమునన్ సుఖ మెల్లఁ గూల్చితే?
దిక్కఁటి చచ్చెఁ దండ్రి కడు♦దీనత నిన్ను వివాహ మాడుటన్. ౧౮౨౧

మ. అనఘున్ సత్యరతాత్ము నాజనకు నే♦లా చంప? నాయన్న స
జ్జనసమ్మాన్యు నరణ్యభూములకుఁ బు♦చ్చం గారణం బేమొ? యిం
కను గౌసల్య సుమిత్రయుం గడుపుదుః♦ఖం బెట్టు సైరింతురే?
మనుటే దుష్కర మింక వార లిట న♦స్సన్మాత వౌనీదరిన్. ౧౮౨౨

మ. తతధర్మాత్ముఁ డనుత్తమవ్రతుఁడు శ్ర♦ద్ధాభక్తియుక్తంబుగా
సతమున్ రాముఁడు గన్నతల్లిగతి నిన్ ♦ సంభావనం దన్పఁడే?
నతసల్లోకయు దీర్ఘదర్శినియు నౌ ♦ నా తల్లి కౌసల్య స
మ్మతిఁ దోఁబుట్టినదానిరీతి నిను స♦మ్మానింపదే ప్రేముడిన్? ౧౮౨౩

ఉ. ఆమహనీయపుత్రకుఁ గృ♦తాత్మకు నారలు గట్టఁ జేయుచున్
భీమమహాటవీస్థలుల ♦ నెట్టియు దుర్భగురాల! కొంచెమేన్
నీమదిఁ గుందఁ జాలవ య♦నింద్యచరిత్రుని శూరు సత్ప్రథున్
రాముఁ బ్రవాసిఁ జేసియు దు♦రాత్మిక యేమిఫలంబుఁ గాంచెదే. ౧౮౨౪

కం. రామునియెడ నే నెట్టెడ, నై మెలఁగుట నీ వెఱుంగ♦వైతివి లుబ్ధా!
యీమహితానర్థము ధర, కేమాడ్కిం దెచ్చి పెట్టి ♦ తీవు కులఘ్నీ. ౧౮౨౫

ఉ. శూరకులాగ్రగణ్యులును ♦ శుద్ధమనస్కులు రామలక్ష్మణుల్
దూరగు లైన నేబలము♦తో ధర నేలఁ గలాఁడ నింక? న
మ్మేరునగంబుపొంతఁ గల♦మేరువనం బన వారిప్రాపుచే
ధారుణి నేలు చుండె వసు♦ధాపతి యాజి యనన్యభేద్యుఁడై. ౧౮౨౬

తే. భూరివిక్రమశాలు లౌ♦వారిచేతఁ, దాల్పఁబడ యోగ్య మైనయీ♦ధరణిభరము
నన్నుబోఁటికి శక్యమే ♦ యెన్నిచూడ, నెద్దుబరువును లేఁగ దా ♦ నెట్లు మోయు.

ఉ. ఓపుమఁ గాక బుద్ధిబల♦యోగబలంబులచేత ధారణిం
బ్రోఁ పోషరింప, న ట్లయినఁ ♦ బుత్రకగర్ధిని వైనసీదుబల్
పాపుఁగోర్కిఁ దీర్పఁగను ♦ బొల్పడ నోపుదునే? దురంతహృ
త్తాపముచేత మాఁడు మిఁకఁ ♦ దథ్యము నీ కిది శిక్ష రాక్షసీ. ౧౮౨౮

ఉ. రాముఁడు నిన్నుఁ దల్లివలెఁ ♦ బ్రత్యయబుద్ధిని జూచుచుంటచే
నేమియుఁ జేయ నిన్ను మది ♦ నీయకొనం జుమి, గాకయున్న నీ
బూమెలమారి! దూరముగఁ ♦ బుచ్చి నుఱంపనె, యిట్టిబుద్ధి నీ
కే మని పుట్టెనే, చెనఁటి ♦ హేయచరిత్ర నువంశపాంసనీ. ౧౮౨౯

ఉ. మాకులమందు జ్యేష్ఠుఁడ క్ష♦మాభర మెల్ల భరింప సోదరుల్
ప్రాకటభక్తిచే జనకు♦భంగిని నాతనిఁ గొల్చి టొప్పు, న
స్తోకపుధర్మ మీ తెఱఁగు ♦ దోఁపదొ నీ, కిది యెల్లరాజులుఁ
జేకొనుచుంద్రు, మా యెడ వి♦శేషముగాఁ గొనియాడఁగాఁబడున్. ౧౮౩౦

తే. అట్టి ధర్మైకరతులు ♦ యనఘవంశ,సాధుచారిత్రశోభుల ♦ శస్తచరిత
యుతుల మనియెడిపొగ రిప్డు ♦ మర్వఁ గలసె,నీదుసంబంధమునఁ జేసి ♦ నీచురాల.

కం. నీపుట్టినయింటను గో,త్రాపాలురలోన జ్యేష్ఠు ♦ ధరణీపతిఁగాఁ
జేపట్టరె? నీతల నే,లా పుట్టెనె యిట్టిచెనఁటి♦యాశయ మసతీ? ౧౮౩౧

కం. ననుఁ జంపఁ జాలునంతటి,ఘనతరదుఃఖంబు నీవు ♦ గలిగించితి గా
వున నీయిష్టముఁ దీర్పఁడి,పనికిఁ నేఁ బూనఁ జాలఁ ♦ బాపచరిత్రా. ౧౮౩౩

కం ఇష్టముఁ దీర్పమి గాక య,నిష్టంబును గూర్తు నిట్టి♦నీ కిప్పుడె యా
శిష్టుని స్వజనప్రియు నో,దుష్టాత్మిక మరలఁ జేయుఁదుం బురమునకున్. ౧౮౩౪

కం.కొనివచ్చెద కా దిట కా,యనలప్రభు నేను మస్థి♦రాంతఃకరణం
బున దాసుఁడ నై కొలిచెద, జనపతిఁగాఁ జేసి యతని ♦ సమ్మద మారన్. ౧౮౩౫

కం ఇటు భరతుఁడు కటకటఁ బడి, కుటిలాత్మికఁ గైకఁ దిట్టి ♦ కుతిలపడంగాఁ
బటుతరదుఃఖంబున నా,ర్భటు లొనరిచెఁ గందరస్థ♦పారీంద్ర మనన్. ౧౮౩౬

కం.అని పరుసము లాడియు నె,మ్మనమున సంతంత రేఁగు♦మన్యూద్ధతి ని
ట్లనియెను భరతుఁడు గైకం, గనుఁగొని రోషమున మేనఁ ♦ గంపం బెత్తన్. ౧౮౩౭

కం.ఛీ పో యీరాజ్యము విడి, పాపచరిత్రా నృశంస ♦ బాలిశ యిటు ధ
ర్మాపాయము ఘటియించితి, వాపోవుము నేను దెగిన♦వాఁడ న టంచున్.౧౮౩౮

కం.భూరమణుఁడౌ పుణ్యుఁడు నీ, తారమణుఁడౌ తిట్టి రేమి ♦ తత్పూర్వము నీ
కారణమున సురపురికి మ,హారణ్యానులకు వార ♦ లరుగఁగ నోకటన్. ౧౮౩౯

కం.కైకేయీ కూల్చుటచే, నీకులమును భ్రూణహత్య ♦ యేఁప నిను నధో
లోకమున కరుగు నీకుం, జేకుఱదు సలోకసుఖము ♦ సిద్ధము పతితోన్. ౧౮౪౦

మ. తిర మాక్రూరపుఁజెత్తికోలు గలయీ ♦ దృగ్ఘోరపాపక్రియా
చరణాసక్తను నిన్నుఁ గాంచినజగ ♦ జ్జాతప్రియుం డైనశ్రీ
ధరణీజాపతి చింత లేమి భయ ము ♦ త్పాదిల్లెఁగా కక్కటా
ధరణీరాజ్యము నాకుఁ గల్గుటలు మి ♦ థ్యల్ దుష్టకష్టాత్మికా. ౧౮౪౧

కం.మన్నిగొని నాదుజనకుని, నన్నుం గానలకు నెట్టి ♦ యపయశముఁ నా
కు న్నేఁడే దలఁగట్టితివే, యెన్నయమున జగతి శిరము ♦ నెత్తి చరింతున్. ౧౮౪౨

ఉ. తల్లివి గావు నీవు, చెడు ♦ దాయవు నాకు, నృశంస కాముకా
చెల్లదు పల్క, నీమొగముఁ ♦ జెల్లదు చూడఁగ భర్తృఘాతినీ!
చెల్లరె రాముమాతయు సు ♦ శీల సుమిత్రయు లోనుగాఁగ నా
తల్లులు దుఃఖముం గనిరి ♦ తథ్యము నీ విటు దాపరించుటన్. ౧౮౪౩

చం.అతులితధర్మశీలుఁ డగు ♦ నశ్వపతిప్రభుపుత్త్రి వీవు గా
వతనికులంబుఁ గూల్ప నుద ♦ యంబయినట్టిపిశాచి వేలనో
సతతసుధర్మనిష్ఠుఁ డగు ♦ సత్యపరాక్రము రాముఁ గానఁ ద్రో
చితివి దివంబుఁ జేర్చితివి ♦ శీఘ్రము తద్వ్యథ నాదుతండ్రినిన్. ౧౮౪౪

కం.లోకాప్రియ! నీకృతి నే, లోకములకుఁ జెడినవాఁడ ♦ లుబ్ధా! భవద
స్తోకాఘము న న్నంటుట, రాకాసీ! తల్లి ననిన ♦ రావె కలుషముల్. ౧౮౪౫

తే. సన్నుతాచార యైనకౌ ♦ సల్య నకట, సుతవియుక్తను జేసి యే ♦ గతిని బడయ
నీవు గోరితివే సిరి ♦ యెట్టిఘోర,నరకమునఁ బడుదానవో ♦ దురితశీల. ౧౮౪౬

ఆ. బంధుసంశ్రయుండు ♦ పరమ ధర్మిష్ఠుండు, పెద్దవాఁడు తండ్రి ♦ యుద్దివాఁడు
కోసలాత్మజాత ♦ కొమరుఁ డన్నియుతుని, నెఱుఁగ వటవె క్రూర ♦ హేయచరిత.

కం.కన నంగప్రత్యంగజుఁ,డును హృదయాబ్జాతజాతుఁ ♦ డును నగుపుత్త్రుం
డనసిన ప్రేమను దల్లికి, ఘనతరుఁ డగు వానిసాటి ♦ గా రేబంధుల్. ౧౮౪౮

సీ. ము న్నొక్కనాఁ డిల ♦ దున్నుచుఁ దనసుతుల్, నాఁగటిమ్రాఁకుల ♦ వ్రేఁగు కతన
మొసలు వ్రేలఁగ వైచి ♦ పుడమిఁ గూలినమ ట్ట,మధ్యాహ్నమునను ధ ♦ ర్మజ్ఞసురభి
పుత్త్రశోకంబున ♦ బోరన యేడ్చిన, నశ్రువుల్ క్రిందుగ ♦ నరుగు చున్న
పురుహూతుపైఁ బడఁ ♦ బుణ్యగంధము లైన,కన్నీళ్లు సురభివి ♦ గాఁ దలంచి

ఆ. శిరము మీఁది కెత్తి ♦ పరికించి సభమున, నిలిచి యేడ్చు చున్న ♦ నిర్జరగవి
యొద్ద కేగి మిగుల ♦ నుద్విగ్నఁ డగుచును, మోడ్పుఁగేలఁ బలికె ♦ మొదవుతోడ.
కం.మాలో మొదలుచు జగముల, మేలుం దలపోయునీకు ♦ మిడుకఁగ భయ మే
లీల ఘటిల్లె మాచేఁ, గ్రాలదుగా నెందుభయవి♦కారము గోవా! ౧౮౫౦
చం.సురపతి యిట్లు పల్కినను ♦ జూచి సుపర్వులధేను విట్లనున్
హరి హరి మీనిమిత్తమున ♦ నాపద లే దెపు డేని, దుస్థితిన్
వరలెడిపుత్త్రులం గన న♦వారితశోకము వచ్చెఁ, గంటివే
ఖరకరతప్తదీనతను♦కార్శ్యయుతంబుల నాదుబిడ్డలన్. ౧౮౫౧
కం బడుగు లయి యీడిగిలఁబడఁ, గడు ముక్కులు మూసి మేను♦గాల్చుచుఁ గోలన్
బొడుచుచుఁ దోఁకలు విఱుచుచు, బడియుల మోఁదు చును గాసి♦పఱిచిరి కాఁపుల్.
కం.పొడుముట నాకడుపున నీ,యిడుమలఁ బడు చుంటఁ జూచి ♦ యేమియుఁ జేయన్
వడి చాలమి నిటు వగచెదఁ, గొడుకుంబలె నిష్టతముఁడు ♦ కోమలి కున్నె.
కం.వేలకొలందులు బిడ్డలు, భూలోకమునందు నుండిఁ ♦ బొగలెడిసురభిన్
బాలోమీపతి గని వని,తాళికి సుతచయమె పరమ ♦ మంచుఁ దలంచెన్. ౧౮౫౪
చం.అసమశుభప్రవృత్తము స♦మస్తజగంబులఁ బ్రోచుకోర్కియున్
లసితసమృద్ధియున్ నిరత♦లాలితసద్గుణ చక్రవాళ మీ
ద్యసహజశీలముం గలస♦హస్రసుతాఢ్యము కామధేను వే
వ్యసనము నొంద రాము నెడఁ♦బాసినకోసలకన్య నే మనన్. ౧౮౫౫
తే. ఏకసుత సాధ్వి కౌసల్య ♦ హీనబుద్ధి, నైననీచే వివత్స యై ♦ యడల కున్న
యట్టిపాపంబుచేత నో♦గట్టివాయి, యుభయలోకంబులను దుఃఖ ♦ మొందె దీవు
మ. చని మాయన్న ను దోడితెచ్చి, ధరణీ♦సామ్రాజ్యధౌరేయుఁగా
వినయం బారఁగఁ జేసి, తత్పదములం ♦ బెంపార సేవించి, యీ
జనకానంతరకార్యముల్ సలిపి, నే ♦ సత్కీర్తియుం బుణ్యవ
ర్ధనముం గూర్చెదఁ జూచు చుండు జలధా♦రాపూర్ణనేత్రాంత వై. ౧౮౫౭
కం.పిలుచుకొని వచ్చి రాముని, నిలుపుదు రాజ్యంబునందు ♦ నిజముగ మఱి నేఁ
దలఁగక చొచ్చెద మునిజన,నిలయం బగుకాననంబు ♦ నీవు కనంగన్. ౧౮౫౮
కం.కన్నులకొలుకుల వెదలెడి,కన్నీళ్లులతోడఁ బురిన్ స♦కలజనులు భృశా
పన్నులు కన నీచేసిన,యన్నీ చపుఁ జేత శక్య ♦ మానే సైఁపన్. ౧౮౫౯
కం.ఈయెడ నిప్పుల దూఁకుము, హా యని దండకను జొరుము ♦ యురిపోఁతను వే
పాయుము ప్రాణము వే ఱొక,ప్రాయశ్చిత్తంబు లేదు ♦ పాపిని నీకున్. ౧౮౬౦

చం. అడవుల కంచినట్టియతు♦లాఘము వాయఁగ రామచంద్రునిన్
గడువడిఁ ద్రోడి తెచ్చి జన♦కాండము లెంతయు సంతసింపఁగాఁ
బుడమికి రాజుఁ జేసి కడుఁ♦బుణ్యుఁడ నయ్యెద, నంచు నేలపైఁ
బడి సృణిచోది తేభ మనఁ♦బా మన రోఁజుచు నుండెఁ గ్రుద్ధుఁడై. ౧౮౬౧

చం. భరతుఁడు రక్తనేత్రుఁ డయి♦పాఱఁగ వైచి విభూషణంబులన్
బరిశిథిలాంబరుం డగుచు♦వ్రాలె మహాక్షయమందు వ్రాలు నా
సురపతికేతువో యనఁగఁ♦జొక్కి యటుండియు వెండి లేచి ని
ష్ఠుర గతి దీన మాతదెసఁ♦జూచి యమాత్యులతోడ నిట్లనున్. ౧౮౬౨

ఉ. కోరినవాఁడఁ గాను సిరిఁ♦గుత్సితయోజన సేయఁ దల్లినిం
బ్రేరణ సేయ, భూమిపస♦మీక్షిత మానభిషేకవార్తనన్
జేరదు దూరదేశమునఁ♦జిన్నసహోదరుతోడ నుండుటన్
ధారిణికన్య రాఘవులు♦దండక కేగు టెఱుంగ నేమియున్. ౧౮౬౩

కం. అని పెద్దయెలుంగున రోదన మొనరించుటయును విని♦ధ్వనిపడి గొని యి
ట్లనియె సుమిత్రకుఁ గోసలతనయామణి వింటె కైక♦ధామమునందున్ ౧౮౬౪

భరతుఁడు కౌసల్యఁ జూడఁ బోవుట.

ఉ. వచ్చినవాఁడు చూడ ఖల♦వర్తన కైకసుతుండు దీర్ఘగృ
ధ్నచ్చరితుండు వానిఁ గనఁ♦గా మదిగోల్వెదు నంచు దీన సై
వచ్చుట కుద్యమించెను వి♦వర్ణిత గార్శ్యము దోఁపఁ బ్రాణముల్
వచ్చునో పోవునో యనన♦వస్థను దత్సుతుఁ డున్న చోటికిన్. ౧౮౬౫

తే. భరతశత్రుఘ్ను లంత నా♦పరమసాధ్వి, యున్న యింటికిఁ బోయి తా♦రుల్లమగల
శోకవేగంబునను ధర♦సోలి యున్న, యంబ నాలింగనము చేసి♦యడల సతియు

చం. భరతునిఁ జూచి యిట్టు లనుఁ♦బ్రాజ్య మకంటకరాజ్య మెల్ల నో
భరతుఁడ! నీకు నీవలచు♦భంగి లభించెఁగదా క్షణంబులో
ఖరతరకార్యశీల యగు♦కైకకతంబున; నింక నమ్మపైఁ
గర మిడి నిద్రపొందు కృత♦కార్యధురీణులు రీవు తల్లియున్. ౧౮౬౭

ఉ. కట్టఁగఁ బంచి నాసుతునిఁ♦గర్కశచీరములన్ వనంబులన్
నెట్టఁగ నేమి వారుకొనె♦నీజనయిత్రి నృశంసతామతిన్,
గట్టిఁడి పంపకున్నె ననుఁ♦గాఱడవిం బడ, నట్టులైన నా
పట్టి హిరణ్యనాభు నెడఁ♦బాయక కూడి సుఖించి యుందుదున్. ౧౮౬౮

ఉ. అంపుము పోవుదాన వసు♦ధాధవునగ్ను లతో సుమిత్రతో
నింపుగ రాముఁడున్న యెడ♦కేర్పడ నాతఁడ సంస్కరించుఁ బా

లింపుము నీవ మాతృకమ♦లీమసతార్జితధాన్యవిత్తగో
సంపదిభాశ్వపూర్ణము ర♦సాస్థలి నీసరి లేనిరాజ వై. ౧౮౬౯

→ భరతుఁడు కౌసల్యతో శపథంబులు సేయుట. ←

కం అని పరుసంబులు పలికిన, విని పుండున నూది గ్రుచ్చు♦విధమైనను దుః
ఖనిహతిని ద్రెళ్లి భరతుఁడు, వనితామణిపాదములను ♦ వాలినమూర్ఛన్. ౧౮౭౦

శా. ఒల్లంబోయి యొకింత తేఱి వినయం ♦ బొప్పారఁ జేమోడ్పుతోఁ
దల్లీ! యేటికి నింద లాడెదవు? క్రొ♦త్తా నీకు శ్రీరాముపైఁ
బెల్లౌనాస్థిరభక్తి? నే నెఱుఁగ నే♦వృత్తాంత మేపాపముల్
గల్లల్ గావిని, యంత ద్రోహినొకొ యం♦న్నం గాసలం ద్రోయఁగన్. ౧౮౭౧

ఉ. రామునిపోక కొప్పినదు♦రాత్ముఁడు శాస్త్రసులబ్ధమైన ప్ర
జ్ఞామహిమంబుఁ బాయుత, నృ♦శంసజనంబులఁ గొల్చుఁ గాత, దు
శ్శ్రేముపి మేహసర్జన మ♦శీతకరాభిముఖంబు సేయునా
పామరుఁ డేగుదుర్గతుల♦పా లయి పోవుత ధర్మతత్పరా. ౧౮౭౨

ఉ. హోమిక సుప్తధేనువు ని♦జాంఘ్రితలంబులఁ దన్ను వానికిన్
బ్రేమ యొసంగి నట్ల ఘన♦కృత్యములెల్లను జేయఁ బంచి తా
నేమియు నీయ కూరకయ ♦ భృత్యునిఁ బంచెడివాని కేగతుల్
రామునిపోక కొప్పినదు♦రాత్మున కాగతు లబ్బుఁ దల్లిరో. ౧౮౭౩

ఉ. ప్రేమను భూతజాలముల ♦ బిడ్డలఁబోలెను సాఁకు సట్టియా
భూమిపుపట్ల ద్రోహమతిఁ ♦ బూనెడివానికి, షష్ఠభాగముల్
నేమపుఁబన్ను లాగి యవ♦నిం దయఁ బ్రోవనితేని, కేగతుల్
రామునిపోక కొప్పినదు♦రాత్మున కాగతు లబ్బుఁ దల్లిరో. ౧౮౭౪

ఉ. సామముతోడ మున్న తన♦సత్త్రమునం దొగి సర్వసత్త్వకున్
గామము దీర నింత యొసఁ♦గం గలవాఁడ నటంచుఁ బల్కి తా
నామఖమైన వంచనము ♦ లాడెడియాతఁడు పోవుదుర్గతిన్
రామునిపోక కొప్పినదు♦రాత్ముఁడు పోవుట గల్గుఁ దల్లిరో. ౧౮౭౫

ఉ. సామజఘోటకప్రకర♦సంకులశస్త్రసమాకులోగ్రసం
గ్రామమునందుఁ బాఱెడిధ♦రాపతికిన్, గురుదిష్టతత్త్వమున్
బామరి వై మది న్మఱచు♦శుంఠున కేగతి గల్గు నందునో
రామునిపోక కొప్పినదు♦రాత్మున కాగతి గల్గుఁ దల్లిరో. ౧౮౭౬

ఉ. సోమరవిప్రభావిభవు ♦ సుందరవిగ్రహు సింహశౌర్యు నా
స్వామిని సింహసంహనను ♦ సామజవిక్రము వ్యూఢబాహువున్

రాము వృథాంసు రా జగుచ♦రాజిలు చుండఁగ భద్రపీఠిపై
రామునిపోక కొప్పినదు♦రాత్ముఁడు చూడమి కల్గుఁగావుతన్. ౧౭౭

కం. దూరీకృతకరుణుండై, వార కజతిలోదనములఁ ♦ బరమాన్నముఁ దా
నూరక తినుఖలుగతి యా, శ్రీరామునిపోక కొప్పు ♦ చెనఁటికిఁ గలుగన్. ౧౭౮

ఉ. తాఁ ముసవృత్తిఁ బెద్దలను ♦ ధార్ష్ట్యమునం గనువాని, కావు ను
ద్దామపుఁగ్రొవ్వునం దనప♦దంబునఁ దాఁకెడివాని, కొజ్జపై
నాముగ నిందఁ జెప్పుకుటి♦లాత్మునకుం గతి యెద్ది గల్గునో
రామునిపోక కొప్పినదు♦రాత్మున కాగతి గల్గుఁ దల్లిరో. ౧౭౯

ఉ. తా మది విశ్వసించినహి♦తప్రవరుం జెలుపంగఁ బూను నా
పామరుఁ డాత్మనమ్మకము♦బల్మి రహస్యముఁ జెప్ప దానినిం
భూమిజనాళికిం దెలుపు♦పూరుషుఁ డేగతిఁ బోవు నందురో
రామునిపోక కొప్పినదు♦రాత్మకుఁ డాగతిఁ బోవుఁ దల్లిరో. ౧౮౦

సీ. మేలునకును మఱు ♦ మేలు సేయనివాఁడు, మేలు మఱచిన యట్టి♦బాలిశుండు
సజ్జనావళిచేత ♦ సంపరిత్యక్తుండు, సిగ్గు దలంపని ♦ చెన్నఁటీఁడు
లోకమునకుఁ బగ♦యై కలంగనివాఁడు, పెండ్లము బిడ్డలు ♦ భృత్యజనులుఁ
దనరియు గృహమునఁ♦దానొక్కఁడే మంచి, యన్నంబుఁ దినియెడి♦యఘురతుండు

ఆ. తనసమానురాలి ♦ దారను గైకోక, సంతు లేక చచ్చు♦జనుఁడు ధర్మ్య
మైనక్రియలు లేని♦యతఁ డేగుగతు లగు, రాముపోక కొప్పు♦రాక్షసునకు. ౧౮౧

సీ. రామచంద్రుని బాయ♦రణ్యవాసము సమ్మతించిన యట్టియ♦కించనుండు
తనయాలికడుపునఁ ♦ దనయాలిఁ గానక, యలమటించుచును న♦ర్థాయువగుచుఁ
బరలోక మేగెడు♦వాఁ డగుఁ గావుత, వృద్ధుల బాలుర ♦ నృపతి సతుల
వధియింపఁ గలిగెడి♦పాపంబు భృత్యుల, విడిచినపాపంబుఁ ♦ గుడువఁ గలఁడు

ఆ. కల్లు లక్క యుప్పు ♦ గరళంబు లోహంబు, పలల మమ్మి పోష్య♦వర్గములను
బ్రోచువానిగతికిఁ♦బోవును శ్రీరాము, కాన కరుగు పెఱుఁగు♦కలుషబుద్ధి. ౧౮౨

కం. ఘోరాజి డాయఁ బాఱెడి, భీరువు చేపడినఁ జంపు♦విధమునఁ దల్లీ
మారణ మొనరింపఁగ నగు, శ్రీరామునిపోక కొప్పు♦చెనఁటిని నిపుడే. ౧౮౩

సీ. కేలఁ గపాలంబు ♦ గ్రాలఁ జింపులు గట్టి, వేఁదుఱుపోలిక ♦ బిచ్చ మెత్తి
తిరుగుచు ధరణిని ♦ ద్రిమ్మటకాఁ డగు; నక్షపానంబుల ♦ నతివలందుఁ
దగు లగు మతి పత♦తంబుఁ గామక్రోధ, వశుఁ డగు రాముని♦పట్ల వంచ
కుండు ధర్మపుబుద్ధి ♦ కూలుఁ గావుత వాని, కెప్డధర్మపుబుద్ధి ♦ యొసఁగుఁ గాత

ఆ. వాఁడపాత్రములను ♦ వర్షించు ధన మెల్ల, వానిసంచితంబు ♦ లైనధనము
లన్ని దొంగపాల♦యగుత శ్రీరాముల,పట్ల ద్రోహ మెంచు♦పాపమతికి. ౧౮౮౪

కం. రవి యుదయించెడివేళల, రవి గ్రుంకెడివేళ నిద్ర♦రం గొనుజడుఁ డే
యవిధింబడు జనకసుతా,ధవుద్రోహియు నట్టియవిధిఁ ♦ దప్పకపడెడున్. ౧౮౮౫

ఉ. పాప మదెద్ది గల్గు గురు♦భార్యను బట్టిననీచబుద్ధి, కే
పాపము గల్గు నింద్లకును ♦ వహ్నిఁ దగిల్చినయట్టికూళ, కే
పాపము మిత్రవంచనను ♦ బాటిలు, నాఘనపాప మొందు సీ
తాపతిఁ గైశవంబున వ్య♦థంబడఁ జేసినయట్టిద్రోహికిన్. ౧౮౮౬

కం. దేవతలయుఁ బితరులయుం, బావనమతి జనకులయును ♦ బరిచర్యకుఁ గాఁ
డే వాఁ డాపాపము సీ,తావిభునెడ ద్రోహమెంచు♦తన్న రున కగున్. ౧౮౮౭

తే. పెక్కుబిడ్డలవాఁడును ♦ బేదవాఁడు, జ్వరముచే బాధపడువాఁడు ♦ సంతతంబు
బహుళకష్టంబులకుఁ జిక్కి♦వగచువాఁడు,నగును రాముని వనవాస♦మనుమతింప.

ఆ. చేతు లొగ్గినుతులు ♦ సేయుచు నాశను, గనులు మీఁది కెత్తి ♦ కనుచు దీనుఁ
డగుచు వేఁడువాని♦యాసను వృథ సేయు,నమ్మ రాముపోక ♦ ననుమతించి. ౧౮౮౯

చం. అనుపమసత్యధర్మరతు ♦ లైనమహాత్ము లొడి చెల్మి స
జ్జనసుతకీర్తియుఁ సుజన♦సత్ప్రియ లీక్షణమంద పాయుతన్
జననికి శ్రద్ధమీఱఁ బరి♦చర్య లొనర్ప కనర్థగాముఁ డౌ
జననిరో రాముఁ గానలకు ♦ సాగఁగఁ జేసినపాపజాతియున్. ౧౮౯౦

ఉ. మాయలమారియున్ గడుసు♦మాటలమారియు దోషకారియున్
న్యాయముఁ దప్పి తేనికి వ♦ణంకెడివాఁడును లోభి యయ్యెడున్
జాయను ముట్టునీళ్లదివ♦సంబున నొద్దన యుండి క్రీడలన్
డాయనిదుష్టుఁ డౌత రఘు♦నందనుపోకకు నొప్పునాతఁడున్. ౧౮౯౧

కం. ధరధర్మదారఁ గూడక, పరదారలఁ గూడుత్యక్త♦వరధర్మరతి
స్థిరుఁ డౌత రాము నడవుల, కరుగన్ ఘటియించినట్టి ♦ యాబాలిశుఁడున్. ౧౮౯౨

ఉ. కూడును నీళ్లు నీక తన♦కుం గలబిడ్డలఁ జంపువిప్రుఁడున్,
డోడనె చచ్చుబిడ్డలను ♦ దోరముగాఁ గనుబ్రాహ్మణుండు, లే
దూడలయాలపాల్పిదుకు♦దుష్టుఁడు, బ్రాహ్మణదత్తహర్తయున్,
గోడును రామచంద్రునకుఁ ♦ గూర్చినవాఁ డగుఁ జుమ్మి తల్లిరో. ౧౮౯౩

కం. జలదూషకవిషదాయక, కలుషంబులు రెండు గలుగుఁ ♦ గావుత జననీ
పలుగాకి యెవఁడు రాముని, బలుగాసిం బెట్టవిపిన♦వాసముకతనన్. ౧౮౯౪

ఉ. నీరముఁ గోర దప్పి జన♦నీ! గృహమందున కల్గి మంచినీ
రార నొసంగ కేవియొ యు♦పాయములం జను మన్న వంచకుం
డారసి యుప్పునీరముల ♦ నాతని కిచ్చునతండు వోవుత
న్నారక మేగు నీమప్రియా♦నందనుపోకడ కొప్పు నాతఁడున్. ౯౫

తే. తగవులను దాను మధ్యస్థుఁ ♦ డగుచుఁ జెలిమి
నందు నొకనికి జయ మొందు♦నట్లు తెలుపు
వానిగతి యగు జానకీ♦జానియెడల
నఘము నెంచినవారల♦యరుగుగతియు. ౯౬

→ కౌసల్య భరతు నూరార్చుట. ←

చం. ఇటు పతిహీనయౌచు సుతవి♦హీనయు నై దురపిల్లుతల్లిని
బటుశపథాళి నూఱడఁగఁ ♦ బల్కియు దుర్గతిము పేర్మి నేల పైఁ
దటుకున వ్రాల నాయమయుఁ ♦ దత్సుతుఁ గాంచి వచించెఁ దండ్రి! యెం
తటిశపథంబు లాడితివి ♦ దారుణతాపముగల్గె నిన్గనన్. ౯౭

కం. నాదుతనూజవియోగము, చేతను దపియించునాదు♦చిత్తము నీవా
గ్జాతంబులఁ బీడించియు, నాతనయా యునుబు నిలిపి♦నాఁడవు నాకున్. ౯౮

ఉ. తమ్ముఁడు లక్ష్మణుండు బలెఁ ♦ దద్ద యదృష్టము నీవునౌ సుధ
ర్మమ్మును బాయ వన్నయెక ♦ రాజిలు పుత్త్రక! సత్యసంధతౌ
నెమ్మది సజ్జనుల్ చనెడి♦నిర్మలలోకముఁ బొందు, మంచు నం
కమ్మున నిల్పి కట్టుకొని ♦ కాఁతియు హా యని యేడ్చె దీన యై. ౯౯

కం. ఇమ్మెయిని శోక మోహాభ, రమ్మున మూర్ఛలను నేల ♦ వ్రాలుచుఁ గడుదీ
ర్ఘమ్ముష్ణమ్ముగ రోఁజుచు, నున్మలినము నొంద రేయి♦యుం గడఁ గాంచెన్.

→ భరతుఁడు దండ్రిశవంబును జూచి యేడ్చుట. ←

కం. వేకువ యగుడు వసిష్ఠుఁడు, కైకేయిసుతుఁ గాంచి పల్కు ♦ గాఢప్రేమన్
శోకింపకు మన్నా నీ, వీకరణిఁ ఫలము గలదె ♦ యేడ్చుచు నుండన్. ౧౦౧

మ. అవనీనాథతనూజ! నీజనకునం♦త్యానక్రియల్ దీర్పఁగాఁ
దవు నాకార్యము నిర్వహింపు మన నా♦తండుఁ ధృతిం బూని శా
స్త్రవిధిఁ దండ్రికి నొర్ధ్వదైహికములం ♦ జల్పంగఁ దా నెంచి భూ
ధవనిద్రాగతతుల్యకాయము సుపీ♦తత్వట్బయోదాత్తమున్. ౧౦౨

కం. నానారత్నపరిష్కృత, మానుజ్జ్వలహేమశయన♦మం దిడి కైకే
యీనందనుఁ డతిదుఃఖతుఁ, డై నానాగతుల నేడ్చె ♦ నారటపడుచున్. ౧౦౩

శా. రాజేంద్రా! యటు విప్రవాసి నగునే ♦ రాకుండు మున్ ధర్మని
ష్ఠాజుష్టాత్ముఁడు రామచంద్రుఁడు మహా♦శౌర్యుండు సౌమిత్రియున్
వ్యాజం బేమియు లేక కానలకు నీ ♦ వాదిత్యలోకంబుఁ బో
నోజన్ బాపురె యెంతసేసి తిట న♦యోధ్యాతంత్రి యెట్లోర్చెదన్. ౧౦౪

కం. నిరుపమనిర్మలచరితుఁడు, ధరణీతనయావిభుండు ♦ తలఁగి చనుటకున్
బరిపరివిధముల నేడ్వఁగఁ, బరికింపవు నన్ను నిచటి♦వారి మహీశా. ౧౦౫

కం. రాముఁడు వనులకుఁ జన వ్వ,గ్రామమునకు నీవు పోవఁ ♦ దగుగతి యోగ
క్షేమంబుల నిఁక నెవ్వరు, భూమీశ్వర కూర్చువారు ♦ భూజనములకున్. ౧౦౬

కం. రాజ వగునీవు లేమిని, రాజిల్ల దనాథ మగుచు ♦ రాష్ట్రంబు నిశా
రాజు రహింపని రాతిరి, యోజను రాణింప దీయ♦యోధ్య మహాత్మా. ౧౦౭

భరతుఁడు దశరథున కుత్తరక్రియలు సలుపుట.

సీ. అని పలవింపఁగాఁ ♦ గని భరతునితోడఁ, బలుకు వసిష్ఠుఁ డో♦భవ్యచరిత
ప్రేతకార్యములు తం♦డ్రికిఁ జల్పు వనిఁబూను, మీవిచారము మాను♦మీ వటన్న
నగుఁగాక యని యాతఁ ♦ డాచార్యఋత్విక్పు,రోహితాదుల వేగ ♦ రూఢి వెలయ
నముకట్టుఁ దనబహి♦స్థలి నున్ననృపునగ్ను,లను యథావిధిఁ దెచ్చి ♦ రనఘు లైన
తే. యాజకులు ఋత్విజులు నంత♦నవనిపాలు,శవము శిబికను నిల్పి బా♦ష్పంబు లురల
మోయఁ బరిచారకులు చల్ల ♦ మున్ను వెండి, పైఁడి; చేలలు పఱచుచు♦బాటలందు

సీ. జనములు కొందఱు ♦ చన మఱికొందఱు, చందనాగరువులు ♦ సరళపద్మ
కము గుగ్గిలంబు ధూ♦పము వేయుచును బోవ, గంధాది బహువిధ♦కాష్ఠములను
బేర్చినచితమీఁదఁ ♦ జేర్చి భూమీశుని, ఋత్విజుల్ మంత్రస♦మేతముగను
భరతునిచే నగ్నిఁ ♦ బ్రజ్వలింపఁగఁ జేసి, సామమంత్రంబులు ♦ చదువు చుండ
తే. నృపతికాంతలు పల్లకీ ♦ లెక్కి వృద్ధ,యుక్తముగఁ బురి వెడలి వా ♦ రున్నచోటి
కరిగి సవ్యాపసవ్యంబు♦గాఁగఁ జుట్టి, రధిపుఁ గౌసల్య లోనగు♦నబ్జముఖులు ౧౦౮

కం. మించినవగ వారలు దుః,ఖించిరఁ దద్రనము మూఁడఁ ♦ గీ డొక్కటిగాఁ
గ్రౌంచీసహస్ర మాక్రో,శించినగతి నెగసెఁ గరుణ♦చేష్టాయుక్తిన్. ౧౦౯

ఉ. వారక యేడ్చుచున్ సతులు ♦ పల్లకులన్ సరయూతటంబునన్
జేరి పురోధలున్ సచివ♦శేఖరులున్ మఱి తారుఁ బుత్రుతో
నీరము పీడి యశ్రుయుత♦నేత్రములం బురిఁ జేరి పండుచున్
ధారిణి ఘుస్రముల్ పది యథా♦విధిఁ బుచ్చిరి సూతకంబుతోన్. ౧౧౦

సీ. పదునొకొండవనాఁడ ♦ భరతుఁ డాశౌచంబు, దీర్చి పండ్రెండవ♦దినమునందు
శ్రాద్ధకర్మము లెల్ల ♦ జరపి బ్రాహ్మణులకు, సమితధనాన్నర♦త్నములు మేలి

చేలలు నిర్భర♦శ్వేతబాస్తికములు, గోవులు నూఱులు♦కొలఁది గాఁగ
దాసదాసీయాన♦ధామవితతు లెల్ల, దానంబు లిచ్చెను ♦ దండ్రిగుఱిచి
తే. మఱి త్రయోదశదినమున ♦ మహిపతనయుఁ, డస్థిసంచయనార్థమై♦యరుగుదెంచి
రోదనధ్వను లెసఁగని♦రుద్ధబాష్ప,కంఠుఁడై చితిమూలంబుఁ ♦ గదిసి యేడ్చె.
కం.నన్ను ప్పగించితివి మా,యన్న యయినరామచంద్రు♦హస్తమునకు నా
సన్నుతుఁడు కాన కరుగుట, నన్ను నిరాశ్రయుఁడుగా నొ♦నర్చితె తండ్రీ. ౧౯౧౩
కం.కొడుకొక్కఁడ వానిని గా,ఱడవులఁ ద్రోయుటను ననద♦యై యేడ్చెడునీ.
పడఁతిని గౌసల్యను నిటు, విడి యెచటికి నేగి తయ్య ♦ ప్రియహితచరితా. ౧౯౧౪
కం.అని కాలుట నెఱ్ఱన యై, పెనుబూదిని నిండి యున్న♦పిత్రస్థితలం
బును గని జనకునిఁ దలఁచుచుఁ, బనవి పనవి యేడ్చె నేలఁ ♦ బడియెఁ మూర్ఛన్.
ఆ. ప్రక్కనున్నవారు ♦ పట్టి యెత్తియుఁ గట్టు, సడలు వజ్రిధ్వజము ♦ సరణిఁబడియె
నాకపతితుఁ డగుయ♦యాతిని డాసెడి, ఋషులభంగిసచివు♦లెల్లఁగదియ. ౧౯౧౬
సీ. భరతుండు నేలపైఁ ♦ బడిన శత్రుఘ్నుండు, జనకుగుణాంగంబు♦లను స్మరించి
సంతాపభరమున ♦ సంజ్ఞావిహీనుఁడై, యుస్మత్తుపోలికి ♦ నుండి వెండి
తలపోసి తలపోసి ♦ తండ్రిగుణంబుల, నిట్లని విలపించె ♦ నెద గలంగ
మంథరాప్రభవ మ♦మంధరకైకయీ,గ్రాహసంకులము వ♦రప్రదాన
తే. మయగురుశోభమైనసాగ♦మహితశోక,సాగరంబున మముముంచి♦చనితెతండ్రి!
బాలు సుకుమారు సంతత♦లాలితాత్ము, భరతు విడనాడ నీ కెట్లు ♦ వచ్చె మనసు.
సీ. ఎవ్వారో మ మ్మింక ♦ నేవి కోరిన నిచ్చి, బుజ్జగించెడివారు ♦ పుణ్యశీల
మాకోరుభోజ్యముల్ ♦ మాకోరుపానంబు, లింకఁ గొమ్మని యెవ్వఁ ♦ డిచ్చుఁ దండ్రి
మంచిచేలంబులు ♦ మంచిభూషణములు, పిలిచి మా కీయంగఁ ♦ దలఁచు నెవఁడు
తగినబుద్ధులు సెప్పి ♦ తగవులు బోధించి, మమ్ము నెవ్వఁడు దిద్దు ♦ మహితచరిత
ఆ తొడను జేర్చి మమ్ముఁ♦బుడికి ముద్దాడుచు, గారవించు నింకఁ ♦ గరుణ నెవఁడు
నిన్ను విడిచి చెడక ♦ నిలిచిన ధారిణి, ప్రళయవేళ నైన ♦ భంగపడదు. ౧౯౧౭
కం.ఇది కావలయునె పుత్రక, యిది కావలయునె యటంచు ♦ నీరీతి మముఁ
ముదమున బలవంతంబుగ, నెది గోరిన నిచ్చువార ♦ లెవ్వరొ యింకన్. ౧౯౧౯
చం.జనకుఁడు స్వర్గ మేగెనఁట ♦ సత్యచరిత్రుఁడు రామచంద్రుఁడుఁ
వనములదారిఁ బట్టె నఁట ♦ వచ్చునె నిల్వఁగ మేనఁ బ్రాణముల్
వనముల నైనఁ జొచ్చెదను ♦ వహ్నుల నైనఁ జొరంగఁబాతెదఁ
గని కని యీయయోధ్యఁ జొరఁ♦గా మది గొల్పదు వారు లేమినిన్. ౧౯౨౦

సీ. అనుచు సోదరు లిటు ♦ లడలుచు ధరణిపైఁ, గొమ్ములు విఱిగిన♦కోడె లనఁగఁ
బడినఁ దోవచ్చిన♦వారును విలపింపఁ, జేరి వేదాంతి వ♦సిష్ఠమౌని
భరతునిఁ గనుఁగొని ♦ జరిగెడిఁ బదియుమూఁ,డవనాఁడు పృథ కాల♦యాపనంబు
చనునె శేషాస్థిసం♦చయనంబు సాంతంబు, గావలదే యది ♦ గాక మఱియు
తే. నాఁకలియు దప్పి శోకమో♦హములు జరయు
మరణ మనియెడి నిరుమూఁటి ♦ మర్త్యుఁ డెవఁడు
పరిహరింపఁగ శక్తుఁడు? ♦ భరత! తగునె
యపరిహార్యంబునకు శోక? ♦ మనుచు నుండ. ౧౯-౨౧
కం అంత సుమంత్రుఁడు తదనుజు, చెంతకుఁ జని లేవ నెత్తి ♦ చెప్పె నతనికిన్
జింతాహరమగుభూతభ,వాంతయథార్థ వృత్తమెల్ల ♦ నంతటఁ గొమరుల్ ౧౯-౨౨
ఉ. వానకు నెండకున్ సుడిసి♦వాసవుకెక్కుము లట్టు లొప్పుచున్
మానక కాఱుబాష్పముల ♦ మార్జితులైనను వారి మంత్రులన్
దీనతఁ దక్కుకర్జములఁ ♦ దీర్పుఁ డటంచును వేగిరించి య
న్యూనముగా సమస్తము క్రి♦యోత్కరమున్ ముగియింప నందఱున్ ౧౯-౨౩

శత్రుఘ్నుఁడు భరతు నూరార్చి మంథరను దన్నుట.

కం ఇందులకుఁ బోవ శత్రు,ఘ్నుం డట రఘురాముఁ జూచు♦కోరిక నపుడే
దండకకుఁ బోవుతలఁ పెద,నిండినభరతునకు ననియె ♦ నిర్వేదమునన్. ౧౯-౨౪
కం.గతిచెడి వగచెడి భూత,ప్రతతుల కన్నింటి కెపుడు ♦ ప్రభు వెవ్వఁ డగున్
గతి యాతండే మనకును, గతి యంచును జెప్ప వలెనె ♦ కలుషవిహీనా. ౧౯-౨౫
సీ. మన కన నేల స♦మస్తభూతాళికిఁ, బట్టుఁగొమ్మగు రాము♦భద్రుఁ డధిక
సత్త్వవంతుం డయ్యుఁ ♦ జాలనిపోలికి, నాఁడుది పొమ్మని♦నంత వనికిఁ
బోయె నౌరౌర ప్ర♦భూతపరాక్రమ,వంతుఁ డాలక్ష్మణు♦నంతవాఁడు
జనకు నటుండు మం ♦ చనక రాముఁడు నని, కరుగఁ దా నెట్లొకో ♦ యనుమతించె
తే.నాఁడు దాడించు నట్లైన ♦ నాడి తప్పు,త్రోవలను బోవువానిని ♦ దొలుతఁ దాన
నీత్యనీతుల నారసి ♦ నిగ్రహింపఁ, దగదె? జనకుం డటంచును ♦ దలఁపఁ దగునె?
మ. అని శత్రుఘ్నుఁడు పల్కఁ దూర్పునఁ బ్రతీ♦హారంబునన్ మేనఁ జం
దనముం బూసి సుమాళిఁ దాల్చి నృపవ♦స్త్రంబుల్ మణీహేమమం
డనముల్ మేఖల మధ్యమం దమరఁ ద్రా♦టం గట్టఁబడ్డట్టి క్రోఁ
తినిబోలెం జనుదేర మంథరయు న♦ర్థిన్ దానిఁ దద్ద్వార్థినుల్. ౧౯-౨౭
ఉ. పట్టి దయావిహీనఁ గడ♦పార్థివనందనుమ్రోల నిల్పి యీ
కట్టిఁడిచేతఁ బుట్టెఁ జుమి ♦ కష్టము లిన్ని యరణ్యదేశమున్

మెట్టుట రామచంద్రుఁ, డన♦నీపతి స్వర్గముఁ బోక, యిచ్చ నీ
కెట్టులొ యట్లు సేయు మన ♦ నెంతయు మండి సుమిత్రపట్టియున్. ౧౯-౨౮

ఉ. అంతకు మూల మాచెడుగ ♦ యన్నుడి వీనుల సోఁకినంత నే
కాంతము సంతపించి యటఁ ♦ గల్గినవారల నెల్లఁ గాంచి భూ
కాంతుని మత్సహోదరులఁ ♦ గాఱియ పెట్టినయానృశంస దు
శ్చింతన నిప్డె కుడువఁ ♦ జేసెదఁ జూడుఁడు తత్ఫలం బనన్. ౧౯-౨౯

కం. వారు సఖీజనవృత యగు, క్రూరచరిత్రకను నల్ల ♦ కుబ్జ నొగి బలా
త్కారమునఁ బట్ట నది తద,గారము మార్మ్రోయ నేడ్వఁ ♦ గని నృపసుతుఁడున్.

చం. కినుకను బట్టి నేలఁ బడి ♦ కీడ్చనఁ దాఁచిన నద్దురాత్మ హో
యనుచును నేడ్చుచుండ సర♦యంబుగ నీడ్చను నేల దానిఁ గ
గని యట నున్న దాసులును ♦ గాఢతరాగ్రహయుక్తుఁ డైనయా
తనిఁ గని మూల కొక్కటెగ ♦ దాఁగఁగఁ బోవుచుఁ గంపితాంగు లై ౧౯-౩౧

ఉ. ఒండొరుఁ జూచి యండఱు స♦ముగ్రత నీతనిబాట చూడఁగాఁ
జెండెడి మూలముట్టుగను ♦ జెచ్చెర నిండఱిఁ, గోసలాత్మజన్
నిందుమతిన్ దయారతను ♦ నిర్మలధర్మచరిత్రుఁ గావు మీ
గండ మటంచు వేఁడఁ దగుఁ♦గా యని పాఱిరి యామెయొద్దకున్. ౧౯-౩౨

చం. మనుజవరేణ్యనందనుఁడు ♦ మంధర మొత్తొ యనంగ భూమిమీఁ
దను బడఁ దాఁచి యీడ్చుడును ♦ దానిధరించినసొమ్ములున్ సవే
శనముచు శారదాంబరము♦చా డ్పొనరించెను, గూర్మిదాసికిన్
గనుకనిఁ గైక యడ్డ మరు♦గన్ వెస నాపెను దిట్టెఁ గ్రుద్ధు డై. ౧౯-౩౩

ఉ. తిట్టియు దారుణోక్తులను ♦ దిమ్ముచెడన్ నడిఁ దన్నఁబోయినన్
దొట్టినభీతిఁ గైకయు సు♦తున్ శరణంబుఁ జొరంగ నాతఁడుం
బిట్టలుక న్సహించినసు♦మిత్రసుతుం గని సైఁప వయ్య యీ
కట్టిఁడి; నెల్లప్రాణులను ♦ గాంత లవధ్యలు గారె తమ్ముఁడా. ౧౯-౩౪

చం. అనఘుఁడు మాతృఘాతకుఁడ ♦ నంచును రాముఁడు నామొగంబునుం
గనుఁగొనఁ డన్న భీతి యెనఁ ♦ గల్గ యేనియు నీదురాత్మఁ గై
కను బలి పెట్టనే యిలకుఁ ♦ గాతరఁ గుబ్జను జంప నక్కట యె
త్తున నతఁ డేల పల్కు మన♦తో మొగమిచ్చి ధ్రువంబు చూడుమా. ౧౯-౩౫

తే. అనుచు భరతునిమాటల ♦ నాలకించి, తోన కుబ్జను విడిచె శ♦త్రుఘ్నుఁ డదియుఁ
గాళ్లపైఁ బడియేడ్వంగఁ ♦ గైక దేర్చె, నురులఁ జిక్కినక్రౌంచినా ♦ నొరలుదాని.

→ రాజకర్తలు భరతునిఁ బట్టాభిషేకము చేసికొనఁ బ్రార్థించుట. ←

సీ. పదియునాలవనాఁటి♦యుదయంబునను రాజ,కర్తలు భరతునిఁ ♦ గాంచి యనిరి
పరమగురెం డైన♦నరపతి తనజ్యేష్ఠ,తనయు రాముని లక్ష్మ♦ణుని వివాసి
తులఁ జేసి స్వర్గంబుఁ ♦ దోడన తానేగె, రాజవు మాకీవు♦రాజతనయ
క మ్మిప్పుడైవయో♦గమ్మున నీయరా, జకరాజ్య మిందాఁక ♦ వికలపడదు
తే. వలయునభిషేకసద్వస్తు♦వులను గూర్చి, పౌరులును మంత్రులును వేచి♦నారు వీర
పితృపితామహపాలితం♦బతుల రాజ్య,మెల్ల వహియించి మ మ్మెల్ల ♦ నేలు మనిన.
కం. అర్థిని నభిషేకపునుప,దార్థములఁ బ్రదక్షిణించి ♦ తతభక్తిని ద
న్నర్థించు నెల్ల వారికిఁ, బార్థివసుతుఁ డిట్లు పలికెఁ ♦ బరమప్రీతిన్. ౧౯౩౯
సీ. లోకులారా వినుఁడు ♦ మాకులమునయందు, జ్యేష్ఠుఁ డర్హుండు రా♦జ్యేందిరకును
న న్నిట్లు పల్కఁగ ♦ న్యాయమా మీకెల్ల, మాయన్న రాముని ♦ మహిపుఁ జేసి
నేన వసించెదఁ ♦ గాననంబులలోన, నీరేడువర్షంబు ♦ లిది నిజంబు
మాయన్న శ్రీరాము ♦ మరలించి తెచ్చెద, సంతనకట్టుఁడు ♦ సకల సైన్య
తే. ములను గూర్పుఁడు కొంపోదు ♦ మున్నుగాఁగ, నెల్లయభిషేకవస్తువు♦లెల్లవారు
రండు పట్టాభిషేక మ♦రణ్యమునన, రామునకుఁ జేయువాఁడను ♦ రాగ మెసఁగ.
కం. సవనాగ్నిరీతిఁ దెచ్చెద, నవనీపతిఁగాఁగఁ జేసి ♦ యభిషేకమహో
త్సవమున క్ష్మాతనయాధవు, నవనీజనులార! నిశ్చ♦యం బిది నుండీ. ౧౯౪౦
ఉ. పేరునమాత్రఁ దల్లి యగు♦వేటిఁడి కైక సకామఁ జేయఁగాఁ
గోరఁ జుఁడీ, ధరాభరముఁ ♦ గూర్చి మదగ్రజునిందు నేన కాం
తారని వాసి నయ్యెదఁ,బ♦ధంబులఁ దీర్పఁగ మిట్టపల్లముల్
భూరికశిల్పివర్గములఁ ♦ బుచ్చుఁడు పంపుఁడు దుర్గవేత్తలన్. ౧౯౪౧
చం. అన విని వార లెల్లఁ బ్రమ♦దాశ్రుతరంగితలోచనంబులన్
మనుజవరేణ్యపుత్త్రుఁ గని ♦ మానితవాక్కులఁ బల్కి, రన్నకున్
గొనకొని రాజ్య మీయ మదిఁ ♦ గూర్చితలం పది లెస్స,దాన నీ
కనయముఁ గూర్చుఁగాక నిర♦పాయినియై సిరి సంప్రమోదముల్. ౧౯౪౨
కం. నరవర! నీయాజ్ఞప్తిని, వరశిల్పుల మార్గవిదులఁ ♦ బంచితి మిపుడే
గురుభక్తుల ననుచును ని,ర్భరముదమున వారు చనిరి ♦ పనులం దీర్పన్. ౧౯౪౩

→ పౌరులు వనమార్గంబును జక్కఁబఱుచుట. ←

సీ. అంత స్థలజ్ఞులు ♦ యంత్రకుల్ ఖనకులు, సూత్రకర్మ చణులు ♦ శూరవరులుఁ
గమ్మరి వడ్రంగి ♦ గమ్మటీండ్రును గూలి,వాండ్రును మేదర♦వాండ్రు బావి.

త్రవ్వువారును బేలు♦దార్లును మార్గద,ర్శకులును లోనుగాఁ ♦ జతురు లైన
పనివాండ్రు మున్నుగాఁ ♦ జనిరి సముద్రంబు, పున్నమ రే పొంగి ♦ పొరలురీతి
తే. గాసిఁ బడుదు మొయనక ప్ర♦యాసమనక, రామచంద్రునిఁ జూచెడి♦ప్రమదమునను
దమకుఁ దామబయల్ దేఱి♦తరలిచనిరి, మూఁగియెల్లరుఁ దమకొల♦ముట్లుగొనుచు.
ఉ. ముండ్లను రాలుఁ జెట్లు మును♦ముట్టుగ నూడ్చుచుఁ,ద్రోవ కడ్డ మౌ
గండ్లను బూడ్చి లేనియెడ ♦ క్ష్మాజసమూహము నాటి,గండ్రగొ
డ్డండ్లను గత్తులం బొదల ♦ డాకమొయిక్ విదళించి చక్కఁగా
బండ్లను బోవున ట్లడవి♦బాటలు తీర్చుచుఁ బోవఁ గొందఱున్. ౧౯౮౫
సీ. కొందఱు చొరరాని♦కుటిలకాననములఁ, దగులంగఁ జెట్టిరి ♦ ధగధగ మనఁ
గొందఱు మట్టంబు ♦ నొందించి రున్నత,స్థలులఁ బల్లంబుల ♦ సత్వరముగఁ
గొందఱు పెద పెద్ద♦గుంటలు పూడ్చిరి, వంతెనల్ గట్టిరి ♦ వలయుచోట
రాగొట్టునేలల ♦ బాగుగఁ జదిపిరి, చెఱువుకట్టలఁ గొన్ని ♦ నఱికి రందుఁ
తే. గొంద ఱరిగట్టివాఁగులు ♦ కొండవంక, లచిరముగఁ జేసి రంబుధి ♦ ననుక రించు
పెనుజలాశయముల నీరు ♦ గననిచోట, మడుఁగులను ద్రవ్వి రెల్లరు ♦ గడియలోన.
సీ. గారపూఁతలతో ని♦గారపుఁగుట్టిమ,తలములు పొసఁగించి ♦ కొలఁకులందుఁ
బూలచెట్లను మఱి ♦ మేలిస్వనంబుల,పక్షుల ధ్వజములఁ ♦ బరఁగఁ జేసి
విమదలపట్టుల ♦ వివిధసుమంబులఁ, గ్రాసేసి చందన♦గంధవారిఁ
జల్లఁగనాసేన ♦ చనుత్రోవ సురపథ,మోయన శోభిల్లె ♦ నొప్పుమెఱసి
తే. యాజ్ఞ మేరకు నధికారు♦లచటనచట, రుచిరతలముల భరతున ♦ కుచిత మైన
సన్నివేశాళిఁ గూర్చిప్ర♦శస్తతార, సొగసు చేసిరి మఱి పెక్కు♦ తెగల వాని.
సీ. ము న్నిసుమును దుమ్ము ♦ మొనసినత్రోవలే, యెసఁగెను బరిఖల♦నింద్రకీల
భాసురవీథులఁ ♦ బ్రాసాదపంక్తులఁ, గన్రుసౌధములఁ బ్రా♦కారములను
ధ్వజముల నంబర♦తలముల నొరసెడి,వరవిమానకపోత♦పాలికలను
నవ్యమైసురరాజ♦నగరంబు దొరయుచు, నాజాహ్నవీతీర ♦ మమరెఁ ద్రోవ
తే. చంద్రతారాసముత్కర♦సహిత మైన, తారకాపథనిభ మయి♦తనరె నపుడు
శిల్పవరనిర్మితం బయి♦చెలువు మీఱి,యంతనాందీముఖము రేయి♦యందు నెలమి.
సీ. సూతులు మాగధుల్ ♦ స్తోత్రపారంబుల, శ్వశ్శ్రేయసోక్తులఁ ♦ జదువు చుండ
యామదుందుభులు కో♦ణాభిహతంబులై, మొరయ శంఖంబుల♦మ్రోఁతలెసఁగ
భరతుండు మేల్కని ♦ పరమదుఃఖితుఁ డయి, నరపతి నేఁ గాను ♦ నా కివేల
చాలింపుఁ డని చెప్పి ♦ శత్రుఘ్నుఁ గనుఁగొని, కంటివే తమ్ముఁడా ♦ కైక యెంత
తే. జగములకు నెల్ల నపకృతి ♦ సలిపె నన్నుఁ, బ్రబలదుఃఖంబులకు నెల్లఁ♦బాత్రుఁ జేసి.
దశరథుం డేగ నదిఁ గర్ణ♦ధారహీన,తరి యనక్ రాజ్యలక్ష్మియుఁ ♦ దల్లడిల్లె.

కం. మన కెల్లరకును దిక్కగు, ననఘుని శ్రీరాము వనికి ♦ న్యాయేతర మై
పనిచెను నాతల్లియ యే, మని యేడ్చెద నయ్య యిట్టి ♦ యాగడమునకున్. ౧౯౦
సీ. అని యేడ్వ శుద్ధాంత♦జనములు పలవించు, చుండ వసిష్ఠుఁ డ♦త్యుత్తమార్హ
రత్నమయం బయి ♦ రాజిల్లుకొల్వుకూ, టంబును శిష్యగ♦ణంబు గొల్వఁ
జొచ్చి కాంచనమయ♦సుఖదపీఠంబున, నాసీనుఁడై సేవ♦కాళిఁ జూచి
ద్విజుల నమాత్యులఁ♦బెద్దలఁ బిలుఁ డాత్మ, యుక మొండు గలదు భూ♦మీశసుతుల
తే. భరతశత్రుఘ్నులను హిత♦వరుల విజయు, నలసుమంత్రునితోడుత ♦ ననఁగ వారు
పిలువ హలహలశబ్దంబు ♦ బలియు వచ్చి, రంద అశ్వరథాదివా♦హనము లెక్కి.
కం. వచ్చెడిభరతునిఁ గనుచు వి, యచ్చరవిభు నాకవాసు ♦ లట్టుల ముదు రై
వచ్చి దశస్యందను మును, పచ్చపుమతిఁ గొలుచునట్టు ♦ లంతటఁ గొలువన్.
కం. తిమినాగసంవృతం బగు, స్తిమితోదకరత్నశంఖ♦సిక తాహ్రద మ
ట్లమరె సభ భరతుచేఁ బూ, ర్వము దశరథుఁచేతఁ బోలె ♦ రాణ దలిర్పన్. ౧౯౩

→ వసిష్ఠుఁడు భరతునిఁ బట్టాభిషేకము చేసికొమ్మని చెప్పుట. ←

సీ. ఆర్యజనాకీర్ణ ♦ మైనయాసభలోన, నర్హాసనంబుల ♦ నందఱకును
నియమించి కూర్చుండ ♦ నయమున వచియించి, భరతుఁ డున్నంత స♦భాస్థలంబు
వస్త్రాంగరాగప్ర♦భావిభాసిత మయి, శారదసంపూర్ణ♦చంద్రకలిత
యామినియును బోల ♦ నలరి వసిష్ఠుండు, లేచి యెల్లరఁ బాఱఁ♦జూచి కైక
తే. తనయుతో నిట్లు వచియించె ♦ ధర్మవిదుఁడు, మృదువుగా వచ్చనీతండ్రి♦పృథివి యేలి
ధర్మపద్ధతి బహుధన♦ధాన్యవతిని, ధరణి నెల్లను నీకిచ్చి ♦ యరిగె దివికి. ౧౯౪
తే. సత్యధృతిరామచంద్రుండు ♦ సత్పురుషుల, ధర్మపద్ధతిఁ దలపోసి ♦ తండ్రియాజ్ఞ
నడుప నడవికిఁ జనియెను ♦ నళినవైరి, వెన్నెలను బాయ లేనట్టి♦విధము దోఁప.
చం. జనకసహోదరప్రదము ♦ త్వాతల మెల్ల నకంటకంబుగాఁ
గొనుము నిజాభిషేకమును ♦ గొబ్బునఁ గైకొను మంత్రులెల్లరున్
ఘనముదితాత్ములిధరణి ♦ నాల్గుదెఱంగుల నున్న చేండ్లు నీ
కొనరిన రక్తిఁ గూర్తురు స♦ముత్సుకు లై బహుళంపుఁగానికల్. ౧౯౬
చం. అన విని భూరిశోకమున ♦ నాత్మ నిజాన్వయధర్మ మెంచుచున్
ఘను రఘురామునిం దలఁచి ♦ గద్గదపాటున నక్కుమారుఁ డి
ట్లని కలహంసనాదమున ♦ నాగురువర్యుని గర్హలాడె ఛీ
యని గురు వంచు నింపుసభ ♦ యంచును గొంకక యారటంబునన్. ౧౯౭
చం. గురుకులవాసి యై శ్రుతు ల♦కుంఠితరీతిని నభ్యసించి యె
ల్లరు మతి మంతుఁ డంచనఁ♦ జెలంగెడి ధర్మరతాత్మురాజ్యమే

పురుషుఁడు నావలెం గొనఁగఁ ♦ బూనును? బంక్తిరథేంద్రుపట్టి నై
గురుఁ డగురామచంద్రుసిరిఁ ♦ గోరఁగ నంతటిపాపజాతినే? ౧౫౮

కం. పుట్టియు దశరథుకడుపున, నెట్టులు నే నపహరింతు ♦ నీరాజ్యము, నా
యట్టులె రాజ్యము రామున, దిట్టగుటను మీర చెప్పఁ♦డీ ధర్మగతిన్. ౧౫౯

ఉ. ఓజమునన్ దిలీపనహు♦షోపముఁ డైనరఘూత్తముండు దా
నాజివిధాన రాజ్యరమ ♦ నందఁగ నర్హుఁడు పెద్ద యాట చే
భూజనశస్త్రధర్మగుణ♦పూతుఁడు గావుట శ్రేష్ఠుఁ డౌట నే
యోజనచేత నన్ను ధర ♦ నూను మ టంటివి చెప్పుమా మునీ? ౧౬౦

కం. జ్యేష్ఠుఁడు ప్రాయంబునఁ గడు, శ్రేష్ఠుఁడు గుణములను నట్టి♦సీతేశురమన్
నిష్ఠురతం గాంక్షింపఁ గ, నిష్ఠుఁడ నై యంత నేను ♦ నీచాత్ముఁడ నే? ౧౬౧

కం. కలుషాత్మకసేవిత మై, తలఁగక నిరయము ఘటించు ♦ దారుణపాపం
బిల నేను జలిపి యిక్ష్వా,కులవంశమ్మున కకీర్తిఁ ♦ గూర్తున కాదే. ౧౬౨

ఉ. కన్నది చేసినట్టియన♦కార్యము నాకు రుచింప దేమి, మా
యన్న వనాంతరస్థునకు ♦ నంజలి చేసెద నింద యుండి, వి
ద్వన్నుత! యాతఁ డేలఁగల♦వాఁడు సుమీ భువనత్రయంబు, నేఁ
గ్రన్నన రాముత్రోవఁ జనఁ♦గా మదిఁ బూనితి మాట లేటికిన్. ౧౬౩

కం. అన విని యెల్లసదస్యులుఁ, గనులను బ్రమదాశ్రు లురల ♦ ఖ్యాతనయానా
ఘునిపై నిలిపిరి చిత్తం, బనంతర మిటు ననఁ దొడఁగె ♦ నానృపసుతుఁడున్. ౧౬౪

మ. వినుఁడీ సభ్యులు! రామచంద్రుఁ బురికిన్ ♦ విచ్చేయఁగా వేఁడువాఁ
డను నే నేగతి నైన, నాతఁడును రాఁ♦డా నేను సౌమిత్రిమా
డ్కిని ఘోరాటవిలో వసించెదను జుం♦డీ, రండు నాతోడ మీ
రును, నెట్లైన రఘూత్తముండు చనుదే♦రుం జేయుదుం దద్విధిన్. ౧౬౫

ఉ. పంచితి మున్నె యెల్లపని♦ఖాండ్రను త్రోవలు చక్కఁజేయఁగా,
నెంచితిఁ బోవఁ దూర్ణముగ ♦ నే నని చెంత సుమంత్రుఁ జూచి నీ
వంచితరీతిమై మనబ♦లావళి సిద్ధపడంగ మాత్ర నా
యంచినయట్లు చేయు మన ♦ నాతఁడు నర్థిలి నట్ల సేయఁగన్. ౧౬౬

శా. సేనానాయకులుం బురీజనములున్ ♦ శ్రీరాముఁ దోడ్తేర భూ
మీనాథాత్మభవుండు దాను జనఁగా ♦ మేకొంట విన్నంతలో
నానందంబున నింట నింటఁ దమి యో♦ధాజ్ఞాతులున్ భర్తలన్
వే నిండారుప్రయత్నముల్ సలుపఁగాఁ ♦ బ్రేరించి రాయాత్రకున్. ౧౬౭

ఉ. కొందఱు ఘోటకంబులను ♦ గొందఱు కోడెలబండ్ల వెంచియుం
గొందఱు స్యందనంబులను ♦ గొబ్బున సిద్ధపడంగఁ గైకయీ
నందనుఁడున్ సుమంత్రుఁ గని ♦ నాయరదంబును సజ్జితంబుగాఁ
బొందుగఁ జేయు మన్న విని ♦ పొంగుచు నాతఁ డొనర్చె నాగతిన్. ౧౧౭

మ. భరతుం డంత సుమంత్రుఁ జూచి ధ్వజినీ♦వారంబుతో సాగుమీ
త్వరతో రాముని దోడితేర మిగులన్ ♦ వాంఛింతు నా నాతఁడున్
దరుసం దెల్పె బలప్రధానసగరీ♦వాస్తవ్యమిత్రాళికిన్
ఖరవిప్రాదికజాతు లుష్ట్రఖరస♦ద్వాహాదులం బోవఁగన్. ౧౧౮

భరతుండు శ్రీరాముఁ దోడి తేరఁ బ్రయాణ మగుట.

సీ. అఖిల వేవినఁ గైక♦యాత్మభవుం డుత్త, మస్యందనము నెక్కి ♦ మంత్రిగురులు
ముందుగాఁ జనఁగ న♦త్యున్నతనాగముల్, నడుచు వెన్నంటుచు♦ననసహస్ర
మాయుధీయులు నొక్క♦యఱువదివేవురు, నూఱువేల్ గుఱ్ఱపుల్ ♦ మీఱి రాఁగఁ
గైక సుమిత్రయుఁ ♦ గౌసల్యతోడరా, యానంబులను హస్తి ♦ మానవ జనియు
తే. జానకీనాథు లక్ష్మణ♦సహితుఁ గనఁగ
నుత్సుకత వారికథ లెల్ల ♦ నుల్లసిల్లఁ
గొందఱులు చెప్పికొనియె జ♦నోత్కరంబు
లెచట నున్నాఁడొ శ్రీరాముఁ ♦ డేమొ యనుచు. ౧౧౯

సీ. ఎన్నఁడొకో యంబు♦భృన్నీలు స్థిరసత్త్వ, నాజానుబాహు మ♦హోన్నతిస్థు
లోకసంఘాతైక♦శోకనాశనదక్షుఁ, గాంచుట యాతనిఁ ♦ గనుటమాత్ర
చాలుఁ గా మన మన♦స్తాపంబు లెల్లను, విరియింపఁ జీఁకటిఁ ♦ దరణియట్ల
యంచు నీరీతి భా♦షించుచుఁ బౌరులు, సీతేశుకథ లెల్లఁ ♦ జెప్పికొనుచుఁ
తే. గోమటులు రత్నకారులుఁ ♦ గుమ్మరులును, గమ్మరులు గమసాలులుఁ♦గంబళకులు
గంధవాసివారు జేల్లాగ్ర♦గములు నెమిలి,పినసకత్తులవాండ్రును ♦ బెజ్జగాండ్రు.
తే. సాలెలును ఱంపగాండ్రును♦జాలరులుఁ దల,యంటువాండ్రు నొడల్ పట్టు♦నట్టివారుఁ
సూత్రపుంబనివారును ♦ గొల్లవారు, వెజ్జు లీడిగవాండ్రును ♦ బెస్తవాండ్రు. ౧౨౦

కం. కేడెలతో సట్టువులును, కొడబులును వారివారి♦వాహనములపై
వేడుక శుద్ధాంబరములతోడ విశేషసము లాది♦తోఁ జని రంతన్. ౧౨౧

చం. చని చని కొంతదూరగ మిటు ♦ నాశ్వసనాగసయానపాళులై
జనములు రామమిత్రగుహ♦సంపరిపాలితశృంగిబేరముం
గనుఁగొనె జాహ్నవీతటిని ♦ గౌతుక మారఁగ రమ్యదేశమం
దున విడిసెం జమూతతియుఁ ♦ దూర్గమ యచ్చట నిల్వఁ బ్రీతమై ౧౨౨

మ. భరతుం డంతట వారిఁ గాంచి తరియిం♦పన్ వచ్చు రే పిన్నదిన్
వరగంగోదకపాళిఁ దండ్రికి నివా♦పం బే నిటం గూర్చెదన్
సరగన్ మీరలు స్వోచితస్థలములన్ ♦ సంప్రీతి నిల్వుండు నా
నరుసం బారఁగ వారు నిల్చిరి యథా♦ర్హస్థానసంస్థాయులై. ౧౯౭౫

గుహుఁడు భరతురాకఁ గని సందేహించుట.

ఉ. అంత నిషాదనేత గుహుఁ ♦ డాధ్వజినీచయ మెల్లఁ గాంచి యే
కాంతరయంబునం దనహి♦తాళుల నెల్లరఁ జూచి కంటిరే
యంతము గానరాదు మఱి ♦ నైన గణింపఁగ నట్టిసేన యీ
పొంతలఁ జేరె సాగరము♦పోలికఁ జూడ్కికి వ్రేఁగు గొల్పెడిన్. ౧౯౭౬
తే. ఖలుఁడు దుర్బుద్ధి భరతుండు♦బలము లెల్లఁ, గొలువ వచ్చె నిజం బదె♦ కోవిదార
కేతనమ్ము రథమ్మున ♦ రీతి మెఱసె, వీనిబాటలు చూడంగ ♦ వేఱు దోఁచె. ౧౯౭౭
ఉ. కట్టునొ చంపునో మనలఁ ♦ గైకతనూజుఁడు తండ్రిచేత దా
నట్టఁగఁ జేసి రామవిభు ♦ నిర్జనభూమిఁ దదీయసంపదన్
నట్టన క్రూరుఁడై కొనియు ♦ నేఁ డిదె కంటిరె సేనతోడ లోఁ
బుట్టినకింక రాముఁ బొరి♦పుచ్చఁగఁ బోయెడు నొండెఁ జూడఁగన్. ౧౯౭౮
ఉ. రాముఁడు నాదుభర్త రఘు♦రాముఁడు నాచెలి గాన నెట్టులే
నోమెద రామచంద్రుని, ర♦యోద్ధతి మీరలు గాంగతీరమున్
దీమస మారఁ గావుఁడు వి♦నిద్రత సేనలతోడ నావలం
దామిషమూలపక్వసుఫ♦లాదుల నింపుఁడు పెంపు మీఱఁగన్. ౧౯౭౯
కం. నావల నేమాటిని గొని, నావకు నావకును నూ ఱ♦నంతబలాఢ్యుల్
కైవర్తకు లుండుఁడు నది, రేవుల నన్నిటను మీ గ♦రీణశ్రద్ధన్. ౧౯౮౦
కం. రాము నెషఁ బ్రీతుఁ డేనియు, సేమంబున దాఁటుఁ గాక ♦ చిటుమట పడినన్
భూమీశనందనుఁడు దా,నేమాడ్కిం జనునొ చూప♦నే యొకచేయిన్. ౧౯౮౧

గుహుఁడు భరతునిఁ జూడ వచ్చుట.

చం. అని మధుమాంసభక్ష్యము లు♦పాయనముం గొని వేగ వచ్చువీ
రుని గుహుఁగాంచి సూతుఁడు ని♦రూఢజవంబున నేగి కైకయీ
తనయునిఁ గాంచి రాఘవహి♦తప్రవరుండు గుహుండు వచ్చె నీ
యనకు సువేద్యముల్ సకల ♦ మైనపథంబులు దండకాటవిన్. ౧౯౮౨
చం. దరిసెన మి ష్షవశ్యముగ ♦ దాశరథీ మన రామలక్ష్మణుల్
ధగణిజయుం జరించెడిత♦లంబు నెఱుంగు నిజంబు నాఁగ నా

భరతుఁడు తోడి తెమ్మనుడు ♦ బంధుజనాన్వితు బోయనాయకుల్
బరువడిఁ దోడితేర నృప♦వర్యుఁడు సత్కృతిఁ దన్పె నాతఁడున్. ౧౯౮౩

మ. రమణీయం బగుదేశ మియ్యది వరా♦రామంబునా నొప్పెడిన్
సుముదం బారఁగ నిందు నిల్వఁ దగదే ♦ చూడంగ మీయిల్లె కా
కమలాక్షా! మము మానగింపఁ దగునా ♦ కారా దొకో యుష్మదా
గమవార్తల్ మునుమున్న పంప, నిట వే♦డ్కల్ నిల్వఁ బ్రార్థించెదన్. ౧౯౮౪

కం. కలవు ఫలమూలములు కొల్లలుగా వివిధంబు లగుప♦లములు నిషాదుల్
వలనుగ శుష్కార్ద్రంబులు, వలసినయంతయును దేర ♦ వలఁతు లధీశా. ౧౯౮౫

కం. కావున నీసేనలతో, నీవును నేఁ డింద యుండి ♦ నిశ గడపి యిటుల్
వేవినఁ జనంగ నగు ధాత్రీవర నాప్రార్థనంబు ♦ దీర్పు మటన్నన్. ౧౯౮౬

సీ. భరతుండు సంప్రీతిఁ ♦ బల్కు మద్గురుసఖా! యింతసేన నొకండ ♦ వెలమి గార
వింప నెంచితివి నీ♦వివిధకామంబులు, నిత్య మభ్యుదయ మై ♦ నెగడుఁ గాక
యన్నరసము కంటె ♦ నాదరణరసంబు, మేలు నీపల్కుల ♦ మెచ్చు వచ్చె
గంగ దాఁటఁగరాదు ♦ గహన మీదేశంబు, మాకు భరద్వాజ♦మౌనియాత్ర

ఆ. మంబు దెరువు దెల్పు♦మా యన గుహుఁ డనుఁ, బ్రకట శౌర్యుఁ డైన♦రామభద్రు
నందు దుష్టబుద్ధిఁ ♦ జెంద వేనియు దాశ,వీరవరులఁ బుత్తు ♦ వెంట వత్తు. ౧౯౮౭

గుహుఁడు భరతునుద్దేశంబు సందేహించి యడుగుట.

ఉ. కారణ మేమి యిట్టు బలఁ♦గంబులతోఁ జన రాముమీఁదికిన్?
దోరపుసందియంబు మదిఁ ♦ దోఁచె,ననన్ మినువోలె నిర్మలం
బౌరమణుండు పల్కె నక♦టా నను నీవు నచించినట్టియా
క్రూరపుఁగాల మెన్నఁటికిఁ ♦ గూడకయుండెడుఁ గాక మిత్రమా. ౧౯౮౮

మ. అనుమానింపకు మయ్య నాయెడల మా♦యన్నల్ రఘూత్తంసునిన్
జనకాభున్ రఘురాముఁ దోడుకొని రా ♦ సన్నాహినై పోయెదన్
జనునే నీమది వేఱుగాఁ దలఁప? నే ♦ సత్యంబ యంటిం జుమీ,
యనుడున్ నిర్భరసంప్రమోదభరితుం ♦ డై బోయతేఁ డిట్లనున్. ౧౯౮౯

ఉ. ధన్యుఁడ వీవ యోభరత ♦ ధారిణిలోఁ గన రాదు నిన్నుఁ బోల్
మాన్యు లయత్న లబ్ధ మగు♦క్ష్మాతల మొల్లఁ బరిత్యజింప సౌ
జన్యము పెంపుఁ జూచెదు య♦శంబు ధ్రువంబు జగంబునందుఁ బ
ర్జన్యనిభున్ రఘూత్తమునిఁ ♦ గ్రమ్మఱుపం దమి గొంటి గావునన్. ౧౯౯౦

మ. అని సల్లాపము లాడుచుండ రవి డా♦యం బోయె నస్తాద్రి యా
మినియున్ వర్ధిలె సేన దీర్పు గుహుఁడున్ ♦ మిత్రాన్వయుం డర్థిఁ ద

పంకజనేత్రుఁ డైనరఘు♦వర్యుఁడు సీతయు గడ్డునేలపైఁ
కొంకక పవ్వళింపఁ గను♦కూర్కుట నేఁ? నది యెట్లు సాధ్య మౌ? ౨౦౦౦

ఉ. కంటికి నిద్ర వచ్చునె? సు♦ఖం బగునే బ్రదుకైన? మానసం
బంటునె భోగముల్? ప్రియహి♦తా! దితిజామరకోటి నేనియుఁ
గెంటఁగఁ జాలుఁ గంటుగొనఁ ♦ గేలిగ నట్టిమహాత్ముఁ డిందు వా
ల్గంటియుఁ దాను జీర్ణతృణ♦కల్పితశయ్యఁ బరుండి యుండఁగన్. ౨౦౦౧

చం. తపమునఁ గ్లేశపాటున వె♦తం గని యొక్కని న్నాత్మతుల్యు నా
యపరిమితప్రతాపుని వ♦నాంతరవీథులఁ ద్రోచి యాజి దాఁ
గృపణతఁ బెద్దకాలము మ♦హిన్ మని యుండుట కల్ల; మిత్రమా!
విపుల యనాథయై చెడెడు ♦ వేగమ సత్యము చూచు చుండుమీ. ౨౦౦౨

కం. ఏడిచి యేడిచి హాయని, చేడెలు గాసిల్లి సొమ్మ♦సిలి పడ ధరపై
నేడుపురొద లే కాన్పృపు,పీ డెల్లను నుండుఁ గాదె ♦ విగతధ్వని యై. ౨౦౦౩

కం. నవితామణి కౌసల్యయు, జననాథాగ్రణియు నాదు♦జననియు నీరే
ఝుని నైన నెల్లవారును, మని యుండుదురా యటంచు ♦ మది శంకింతున్. ౨౦౦౪

కం. మానిన మనవచ్చుఁ జుమి నా,జనయిత్రి మనంబు నిల్పి ♦ శత్రుఘ్నునిపై
మన నేర్చదు దుఃఖంబున, జననుత వీరసువు రాము♦జనని క్షణంబున్. ౨౦౦౫

శా. మించెన్ మించె గతించె సర్వమును భూ♦మీనాథుఁ డీరామునిన్
క్రించుం డై ధరణీశుఁ జేయకయె తాఁ ♦ గీడొందు నిక్కంబు, దా
మించుం జేరి భజించి యానృపతి ని♦ర్యాణంబునం జైత్రకో
దండచాతుర్యము లెల్లఁ దీర్చెగరు సి♦ద్ధార్థుల్ దదాత్మోద్భవుల్. ౨౦౦౬

సీ. అక్కటా తండ్రికి ♦ నౌర్ధ్వదైహికములు, భరతశత్రుఘ్నులు ♦ పరఁగఁ దీర్చి
రమ్యచత్వరముల ♦ రమణీయపథములఁ, బ్రాసాదహర్మ్యాది♦భవనములను
వారముఖ్యలచేత ♦ వారణవాజుల, నవ్యతౌర్యత్రిక♦నాదములను
హృష్టపుష్టప్రజా♦బృందంబులను సర్వ,కల్యాణసంపూర్ణ♦కలనములను
తే. నిష్కుటారామచయముల ♦ నిత్యనరస,మాజసమాజముల నొప్పి పే♦రోజ నాదు
తండ్రి యేలెడియారాజ♦ధానియందు, సంచరింతురు వారలు♦సమ్మదమున. ౨౦౦౭

కం. తనప్రతినఁ దీర్చి క్షేమం,బున వర్తిలురాముతోడఁ ♦ బురికిన్ మరలన్
జనఁ గలమే మేముసు నా,యనుఁగుఁజెలీ యంతపుణ్య♦మౌ మాకు నిఁకన్. ౨౦౦౮

కం. అని యీరీతి సుమిత్రా,తనయుండు మహాత్ముఁ డార్తిఁ ♦ దరలుచుఁ బరిదే
వన మొనరించుచు నుండఁగఁ, జనియెన్ రే యెల్ల ♦ నేమి సంభాషింతున్. ౨౦౦౯

కం.ఖరకరుఁడు దోఁప జడలన్, ధరియింపఁగఁ జేసి యన్న ♦ దమ్ముల నేనే
 తరియింపఁ జేసితిని నీ,సురతటినిన్ సీతతోడ ♦ సుఖ మేపారన్. ౨౦౧౦
కం.కుంజరయూథపతుల్యులు, కొంజక జడలను ధరించి ♦ కొని వల్కలముల్
 రంజిలుచుఁ గట్టి భూసుత,యుం జను దేరంగఁ జనిరి ♦ యుగ్రాయుధులై. ౨౦౧౧

గుహునిపల్కులు విని భరతుండు దుఃఖించుట.

సీ. అనవుడుఁ గైకేయీ ♦ తనయుఁ డాయప్రియ,ముల విని యాధ్యాన ♦ మున మునింగి
 సింహసంహననుఁ డ ♦ క్షీణబలాఢ్యుండు, సుకుమారమూర్తి యు ♦ స్సురు మటంచుఁ
 బోక్కి మూర్ఛిల వ్రాలెఁ ♦ బోడువఁ దోత్త్రంబునఁ, బడియెడి యేనుఁగు ♦ పగిది నంత
 సరసన యుండెడి ♦ శత్రుఘ్నుఁ డాతనిఁ, గౌఁగిటఁ బట్టి దుః ♦ ఖమునఁ బొగిలె
తే. భర్తృశోకార్దితలు నుప ♦ వాసకృశలు
 భరతుతల్లులు నందఱు ♦ సరగ వచ్చి
 పుడమిఁ బడియున్నసద్గుణిఁ ♦ గొడుకుఁ జూచి
 యేడ్వఁగాఁ, గ్రుచ్చి కౌసల్య ♦ హితము దోఁప ౨౦౧౨
కం.కడుపారఁ గన్నబిడ్డను, గడుఁ బ్రేమ గలట్టితల్లి ♦ కౌఁగిటఁ గొనున
 ట్లుడికెడిభరతుఁ దపోవతి, యడలుచు నిట్లనియె శోక ♦ మారట పెట్టన్. ౨౦౧౩
చం.తనువున వ్యాధి లేదు గద ♦ తండ్రి! నచింపు, భవద్వశంబ యీ
 యనఘకులంబు జీవితము ♦ ప్రాణము లన్నను నీవ మాకు, నీ
 జనకుఁడు స్వర్గ మేగ రఘు ♦ చంద్రుఁడు కానకుఁ బోవ దీననై
 నినుఁ గని కాదె ప్రాణములు ♦ నిల్పినదానను మేనఁ బుత్త్రకా. ౨౦౧౪
ఉ. అక్కట యేకపుత్త్ర నయి ♦ యూరట మొందెడినాదుపుత్త్రకుం
 డొక్కట నాలితోడ విపి ♦ నోర్వికి నేగెడిచోట వింటి వే
 మొక్కి సుమిత్రపట్టియెడ ♦ నొండుప్రియేతరవార్తఁ దండ్రి! నీ
 విక్కరణిం దపింప నిను ♦ నెవ్వరు దేర్చెడివారు నాయనా! ౨౦౧౫
కం.అని యేడ్వనొక్కమూర్తం,బునకుం దెలి వొంది మిగులఁ ♦ బొగులుచుఁ గౌస
 ల్యను నూరార్చుచు గుహునిం, గని భరతుం డిట్టు లనియెఁ ♦ గళవళపడుచున్.

భరతుఁడు గుహుని సీతారాముల నిద్రాహారవిషయంబు లడుగుట.

సీ. మాయన్న యానాఁటి ♦ రేయి దా నెక్కడ, నవనిపైఁ బవళించె ♦ నయ్య చెపుమ
 వరసుకుమారి మా ♦ వదినె యెచ్చటఁ బండె, నుండె నెచ్చట లక్ష్మ ♦ ణుండు సఖుఁడ
 యేని భుజించిరి ♦ యేనిపై శయనించి, రంతయుఁ జెప్పుమా ♦ యనిన గుహుఁడు
 రామునిచరిత స ♦ ర్వంబును జెప్పంగఁ, గఁడగెను బహువిధ ♦ కష్టఫలము

ఆ. లతులభక్ష్యములను ♦ నన్న పానాదులఁ, గొనుచు నేను బోవఁ ♦ గూర్మి మీఱ
నాదరించెఁగాని ♦ యంటఁ డొక్కటియును, క్షత్రధర్మ మాత్మ ♦ సంస్మరించి. ౨౦౧౭

కం. ఇచ్చుట యుచితము మాకుం, బుచ్చుకొనుట తగ దటంచుఁ ♦ బుణ్యాత్ముఁడు దా
మచ్చిక వచించి మరలం, బుచ్చెను నాయిడినవస్తు ♦ వుల నెల్ల నృపా. ౨౦౧౮

ఉ. ఆవల లక్ష్మణుండు విమ ♦ లాంబువులం గొని తేర సీతతోఁ
ద్రావి యుపాస ముండె మఱి ♦ దక్కిననీరము నీయఁ దమ్ముఁడుఁ
ద్రావెను మువ్వు రంతట య ♦ థావిధి మానముతోడ సాంధ్యపూ
జావిధిఁ దీర్చ లక్ష్మణుఁడు ♦ చయ్యన దర్భలశయ్యఁ గూర్చినన్. ౨౦౧౯

కం. ఆపడకయందు రాముఁడు, క్ష్మాపుత్రీయుక్తి నుండ ♦ సౌమిత్రియుఁ ద
చ్ఛ్రీపాదంబులఁ గడగియు, దాపున నిలఁబడక కొంత ♦ దవ్వుగఁ జనియెన్.

శ్రీరాముఁడు పరుండినస్థలమును గుహుఁడు భరతునకుఁ జూపుట.

కం. ఆరేయి రాముఁడును సీ,తారమణియుఁ బండినట్టి ♦ దర్భ లివే యా
గారతరువుమూలం బిదె, కూరిమిఁ గను మిందు నిద్రఁ ♦ గూరిరి వారల్. ౨౦౨౧

ఉ. సారతలాంగుళిత్రముల ♦ శాతకలంబకదంబపూర్ణతూ
ణీరములన్ మహాధనువు ♦ నిర్భరవృత్తి ధరించి చుట్టు సం
చారము జేసి కాచె రఘు ♦ సత్తము లక్ష్మణుఁ డెల్లరేయి య
వ్వీరుని వెంట నంటితిని ♦ విల్లును బాణము లూని నేనునున్. ౨౦౨౨

కం. కునుకక తెప్పన్ వ్రాల్పక, వెనుకొని యాత్మీయు లెల్ల ♦ భృతకార్ముకులై
చనుదెంచిరి నా వెంటన, యనఘా కాచితిమి యిట్లు ♦ లాహరినిభునిన్. ౨౦౨౩

కం. అని గుహుఁడు పల్క సర్వం,బును విని భరతుండు మంత్రి ♦ ముఖ్యులతోడన్
జని యింగుదిమూలము రా,మునిశయ్యను జూచి యనియె ♦ మునుఁగుచుఁ జింతన్.

రాముఁడు పరుండినస్థలముం జూచి భరతుఁడు పరితపించుట.

ఉ. కంటిరె తల్లులార! రఘు ♦ కాంతుఁడు నాఁటిరేయాము నిందు నీ
కంటకదర్భశయ్యపయిఁ ♦ గన్ను మొగిడ్చి శయించె, నల్ల దే
కంటిరె నల్గి యున్న యది ♦ కాయమురాపిడిగుర్తు లల్ల వే
యంటినఁ గందుమే నఁట కు ♦ శాస్తరణం బఁట! యేమి చెప్పుదున్. ౨౦౨౫

చం. అతులయశస్వి యై దశర ♦ థావనినాథతనూజుఁ డై జగ
త్ప్రుతమతి యై కులీనుఁ డయి ♦ దుర్భరవిక్రమశాలి యై జగ
త్పతి యగురాముఁ డాయజిన ♦ తల్పవరంబులఁ బండు నాథుఁ డీ
క్షితిఁ గుశతల్పసీమ నెటు ♦ చేర్చెనొ మే నెటు నిద్రఁ గూరెనో. ౨౦౨౬

సీ. ప్రాసాదతతుల ను♦ప్పరిగల విహరించు,నట్టితఁ డుండెనే ♦ చెట్టునీడ
హైమతలాళి ను♦ద్యానంబులం దుండు,ఘనుఁడు చరించెనే ♦ కటికినేల
మలయానిలము వీవఁ ♦ దలిరుఁబాన్పులఁ బండు,ధన్యుఁడు కూర్కెనే ♦ దర్భశయ్య
మంగళధ్వనులు చె♦లంగ మేల్కనునృప,వరుఁడు మేల్కొనియెనే ♦ వాశితములఁ
తే. బ్రోదిచిలుకలపలుకుల ♦ మోదమునను,వినెడుపతి యెట్లు వినియెనో♦వికటసత్త్వ
పరుషరవముల వేనవేల్ ♦ ప్రజలు గొల్వ,నుండునతఁ డెట్టు లుండెనో♦యొంటినిచట.
సీ. మొరసురానేలయే ♦ వరహైమరాజత,ప్రాసాద మాయెనా ♦ రామ నీకుఁ
గఱకుదర్భలప్రోవు ♦ నెఱిమించుమెత్తని,పానుపు లాయెనా ♦ భ్రాత నీకు
గారవృక్షముకొమ్మ♦లా రాణఁ బట్టున,నల్లినచేందువా ♦ యన్న నీకు
హోంనుగాలియే ♦ యువిదలు వీచెడి,వింజామరలగాలి ♦ విభుఁడ నీకు
తే. వందిమాగధనుతిగీత♦వాద్యరవము, పరుషకాకనిదానమే ♦ పరమపురుష
కనకభూషణరాజిని♦స్వనము లకట, ఝిల్లికాగణరావమా ♦ శ్రీయుతాంగ.
కం. మతి మోస మయ్యెఁ గా కీ,క్షితి నిట్టిది సత్యమొందు ♦ చెలఁగునె, కలవే
నతిమోహపడితి నారఘు,పతి యేడఁ గటికి నేలఁ ♦ బండుట యేడన్? ౨౦౨౯
కం. తలఁపఁగఁ గాలముకంటెను,బలితము దైవంబు గాదు ♦ పరికింపఁగ నీ
యిల దాశరథిని రాముని, ఖలునట్టులు నిద్దురింపఁ♦గాఁ జేసెఁ గదా. ౨౦౩౦
కం. జనకునినుత యఁట దశరథ,జనపతికోడ లఁట రాము♦సతి యఁట ప్రియద
ర్శన యఁట యాసీతయు, వని నేలను బండె నింత♦పాపము గలదే. ౨౦౩౧
కం. ఇది మాయన్న పరుండిన,యది శయనము కఠినధరణి ♦ నటు నిటు పొర్లన్
చెదరి నలంగెను బూరియు, మృదుతనునకు దర్భశయ్య ♦ యే మనవచ్చున్. ౨౦౩౨
ఉ. జానకియుత్తమం బయిన♦శయ్య యిదే,యిట నామె సొమ్ములన్
మేన ధరించియే బడలి ♦ నిద్దుర పొందె నటంచుఁ దోఁచెడిన్
మానుగ నిందు నందు నవె ♦ మంజులకాంచనసూక్ష్మరేణువుల్
కానఁగ నయ్యెడిన్, విధిని♦కారము నే మనవచ్చు దైవమా. ౨౦౩౩
ఉ. భామినియుత్తరీయ మిటఁ ♦ బట్టుకొనెం గనుఁగొంటిరే కుశ
స్తోమమునన్ దుకూలమున♦సూక్ష్మపుఁదంతువు లిందు రాజిలెన్,
నామదినాథ్వ యానతికి ♦ నాథునిశయ్యయె సౌఖ్యదాయి యౌ
నేమొయి నున్న నద్ది వగ ♦ పేది శయించుట సీత యియ్యెడన్. ౨౦౩౪
చం. కటకట యెంతపాపుఁడను ♦ గష్టపుజీవిని నానిమిత్తమై
కుటిలత రాఘవుండు దన♦కోమలితో నిటువంటిశయ్యపైఁ

గటికిధరిత్రి దర్భలను ♦ గన్ను మొగుడ్చుట గల్గె దిక్కు లే
నటు వెత యింతకన్నఁ గల ♦ దా తలపోయఁగఁ గడ్పు భగ్గనెన్. ౨౦౩౬

ఉ. పుట్టను సార్వభౌమకుల ♦ ము న్వెలిఁగించుచు, లోకసమ్మతిం
బట్టుగ సర్వలోకహిత ♦ భావమునం జరియించె నీతికిఁ
బట్టయి, యట్టిసుందరుఁడు ♦ పద్మదళాక్షుఁడు రక్తలోచనుం
డిట్టికఠోరతల్పముప ♦ యిం బవళింపఁగఁ గల్గె నే మనన్. ౨౦౩౭

కం. ధన్యుఁడు మహానుభావుఁడు, మాన్యుఁడు సౌమిత్రియే సు ♦ మా కష్టదశన్
వన్యస్థలి నన్నను సౌ, జన్యమునన్ వెంట నంటె ♦ సమయజ్ఞుం డై. ౨౦౩౮

ఆ. ధన్యురాలు సీత ♦ ధవపతితోడుత, వనికి నేగెఁ గుతుక ♦ మునను నరగ
మనకుఁ జేష్టఁదలఁప ♦ మనల రాముండు ప్రసాదదృష్టిఁ గనుట ♦ సంశయంబ.

ఆ. దశరథుండు విబుధ ♦ ధామంబుఁ జేరుట, రామవిభుఁడు గహన ♦ రాజిఁ బడుట
నారకాటి లేమి ♦ నల్లాడునావిక, పోలె ధరణితలము ♦ జాలిఁ బడియె. ౨౦౩౯

సీ. వనవాసి యైనను ♦ వనజాతనేత్రుని, బాహురక్షిత మాటఁ ♦ బత్తనంబుఁ
గానఁ గోరఁ డెవ్వఁడుఁ ♦ గోరఁ జాలు న దెట్లు, ప్రాకారములు గాచు ♦ వారు లేక.
యేనుఁగుల్ గుఱ్ఱంబు ♦ లేర్పాటు లేకయుఁ, దెఱచినగవఁకులు ♦ దెఱచి యుండ
దిక్కు లే కదలను ♦ దక్కు మోదంబులు, ప్రజ లున్న యాపాడు ♦ పట్టనంబుఁ

ఆ. బగతుఁ డెవ్వఁ డైన ♦ భక్ష్యంబు విషమిశ్రితంబుఁ దినెడిజడుఁడు ♦ ధరణిఁ గలఁడె
మన్నిమిత్త మకట ♦ యిన్ని త్రిప్పులు వచ్చెఁ, బాచితంబుఁ జెప్ప ♦ వాఁడ వినుఁడు.

ఉ. పండెడ నింతనుండి తృణ ♦ పర్ణచయంబున నొండె భూమిపై
నొండె, ధరించెదన్ జడల ♦ నూనెద నారల నెల్ల వేళలన్,
బండుతఁ గందమూలములఁ ♦ బ్రాణము నిల్పెదఁ, దక్కు కాలమే
నుండెద హాయిగా వనిని ♦ నోరిమి నన్నప్రతిజ్ఞఁ దీర్చెదన్. ౨౦౪౧

ఉ. ఏలెడుఁ గాక రామవిభుఁ ♦ డీయిల లక్ష్మణుతోడ, నన్నకై
వాలినభక్తిఁ గాననని ♦ వాసముఁ జేయుచు నాకుఁ దో డగున్
బాళిని బిన్న తమ్ముఁ, డట ♦ బ్రాహ్మణముఖ్యు లయోధ్యలోన సీ
తాలలనేశుఁ బట్టము య ♦ థావిధిఁ గట్టి సుఖింత్రుగా కెదన్. ౨౦౪౨

ఉ. దేవతలార! మ్రొక్కెదను ♦ దీర్పుఁడు నాయభికాంక్షితంబు నే
నావిభు రామచంద్రుచర ♦ ణంబుల వ్రాలి యనేకరీతులన్
వావిరి వేఁడుకొందు, రఘు ♦ వర్యుఁడు నామతిఁ బోవఁ డేని నే
నే వని నుందు నందు, నతఁ ♦ డేటికి నన్ను నుపేక్ష సేసెడున్ ! ౨౦౪౩

మ. అనుచున్ వేఁగుచు నుండ వేగుటయు నా♦హ్లాదీశసూనుండు త
మ్ముని శత్రుఘ్నునిఁ జీరి రేయి గనులన్ ♦ మోడ్వంగనన్ రామచిం
తనచే; నాగుహుఁ దోడితెమ్ము తటినిన్ ♦ దాఁటించుఁ గా కెల్లవా
రిని నా జాగరణంబ నా కనుచు నీ♦రీతిం బ్రసంగింపుచోన్. ౨౧౪౪

ఉ. వచ్చి గుహుండు గేల్మోగిచి ♦ స్వస్థత రేయి నదీతటంబునం
బుచ్చితివే సుఖంబొకొ చ♦మూతతి కంచును స్నేహయుక్తి వా
క్రుచ్చిన సేమ మెల్లరకుఁ ♦ గూరిము నీదుసపర్య లెల్ల మా
యిచ్చకు నెక్కె, గంగఁ దరి♦యింపఁగఁ జేయుము మమ్ము నెల్లరన్. ౨౦౪౫

కం. అని తీవరించి పలికిన, విని గుహుఁడున్ నగరి కేగి ♦ వేవేగమ త
జ్జనములఁ గని లేలెం డిఁకఁ, బనిగొని నావలను బూన్పఁ ♦ బదఁడీ మీరల్. ౨౦౪౬

భరతుండు గంగానది దాఁటుట.

తే. సేన దాఁటింప వలయును ♦ శీఘ్రమనఁగ, వారు రాజాజ్ఞఁ దలఁదాల్చి♦పంచశతము
నావలను దీర్చి పెద్దఘం♦టలు గవాక్ష, ములు పతాకలు కంబళ♦ములును గలిగి

తే. స్వస్తికం బను పేరఁ బ్ర♦శస్తిఁ గాంచు, గొప్పనావల నిల్పిన ♦ గురులు విప్ర
జనులు మున్నుగఁ దల్లులు♦సకలసతులు, నెక్కి రందఱుఁ గుతుకంబు♦ లెదకు నెక్క

తే. అన్ని నావలలోస మే ♦ లగుచుఁ బొండు, కంబళంబులు పఱచిన♦క్రమ్రఘంటి
కానినాదంబు చెన్నగు♦దాని గుహుఁడు, తేరఁ రాజకుమారులు♦దీవరముగ

సీ. ఆరోహణ మొనర్పఁ ♦ నావల శకటముల్, వస్తువు లన్ని యుఁ ♦ బడవలందు
నెక్కింప నవ్వేళ ♦ నే మున్న నే మున్న, యని యోట దిగియెడి♦ చుట్టివారి
తమనివాసంబుల ♦ దహియించుసవ్వారి, నాపాత్ర యిది యిద్ది ♦ నాది యనెడి
వారి పెన్నులివు ద్యో♦పథ మంటె బెస్తలు, గాలిచాఁపల నెత్తఁ ♦ గదలి చనియె

ఆ. సతులతోడఁ గొన్ని ♦ శకటాళితోఁ గొన్ని, హరులతోడఁ గొన్ని ♦ యానయుగ్య
తతులతోడఁ గొన్ని ♦ తను లేగి వింతగ, దించె గంగయవలి♦తీరమునను. ౨౦౫౦

కం. జంగమధరణీధరము ల, నంగఁ బతాకములతోడ ♦ నాగము లరిగెన్
రంగుగ బరికాంద్రురతో, గంగానది నీఁదికొనుచుఁ ♦ గమనీయగతిన్. ౨౦౫౧

ఉ. కొందఱు దాఁటి రీఁదుచును ♦ గొందఱు తెప్పలమీఁదఁ బోవుచుం
గొందఱు మ్రాఁకు లండఁగొని ♦ కొందఱు కుండలపైఁ బరుండియున్
గొందఱు యానపాత్రములఁ ♦ గొందఱు కోలములం దరించి రా
యందఱు వారి వారి కను♦వైన తెఱంగులఁ బెక్కు రేవులన్. ౨౦౫౨

భరతుఁడు భరద్వాజమహర్షిని సందర్శింపఁ బోవుట.

ఉ. అ మ్మెయి నేగి యందఱు ప్ర♦యాగ వనమ్మును మైత్రమైనమూ
ర్తమ్మునఁ జేరి రంత నుచి♦తస్థలమం దొాగి నెల్లవారి సా

ఖ్యమ్ముగ నుండఁ బంచి మను♦జాధిపుఁ డాప్తపురోహితాళితో
సమ్మతిఁ బాదచారి యయి ♦ చయ్యనఁ బోయె ఋషిప్రకాండమున్. ౨౦౫౩
తే. జ్ఞానవృద్ధుఁ దపోవృద్ధు ♦ జంభదమన,వరపురోధ భరద్వాజుఁ ♦ బ్రవయుఁ జూడఁ
బోవుచో మానివర్యప్ర♦భూతరమ్య,నగవిరాజిత మైనవ♦నమ్ముఁ గనియె. ౨౦౫౪
చం. కని యొకకోసునందు జన♦కాండము నిల్వఁగఁ బంచి, శస్త్రముల్
ధనువును వీడి, మేనఁ బరి♦ధానము మీఁదికి నుత్తరీయముం
బూనరఁ, బురోహితాగ్రుఁ డయి ♦ పోవ వసిష్ఠునిఁ జూచినంత నా
సనముననుండి డిగ్గి తన♦ఛాత్రుల నర్ఘ్య మొసంగఁ బంచుచున్. ౨౦౫౫
సీ. మునిభరద్వాజుండు ♦ ఘను వసిష్ఠునిఁ జేరి, యాతనిపిఱుఁదన ♦ యరుగుదెంచి
తన కభివాదనం♦బును ఘటించినవాని, దశరథసుతుఁ డని ♦ తలఁచి మదిని
నానుపూర్వ్యంబుగ ♦ నర్ఘ్యపాద్యంబుల, ఫలముల నొసఁగి నీ♦బలములకును
గోశమిత్రాళికిఁ, ♦ గుశలమకా యని, ప్రశ్నించి దశరథు♦పా టెఱింగి
తే. యుండుటను దాని నడుగక ♦ యుండె నంత
భరతుఁడు వసిష్ఠుఁడును మునిఁ ♦ బక్షిహారిణ
వృక్షదేహాగ్నులకు నెల్ల ♦ వేఱువేఱఁ
గుశల మడిగిన నాయన ♦ కుశల మనుచు. ౨౦౫౬

## ⟵ భరద్వాజుఁడు భరతునిరాకకుఁ గారణ మడుగుట. ⟶

చం. భరతునిఁ జూచి రాఘవుని♦పైఁ గలరక్తిని బల్కు, నేలుచున్
ధరణిని నీవు వచ్చినని♦దానముఁ జెప్పుము, నీదుచర్యలఁ
దురితము దోఁచె, రామవిభుఁ ♦ దొయ్యలితో ననుజాతుతోడుతన్
జిరవనవాసిఁ జేసెఁ గద ♦ స్త్రీవశుఁ డై నినుఁ గన్నయాతఁడున్. ౨౦౫౭
ఉ. పొమ్మనినంత మా ఱనక ♦ పోయెఁ గదా పదునాలుగేండ్లు దా
సమ్మతిఁ గాన నుండఁగఁ బ్ర♦శస్తచరిత్రుఁ డపాపశీలికిన్
దమ్మున కెగ్గుగూర్చి వసు♦ధాతల మెల్ల నకంటకంబుగా
నెమ్మది నేల నెంచితివె ♦ నిర్దయవృత్తిని గైకనందనా! ౨౦౫౮
కం. పాపార్జితంబు నింతటి,తీపా నీ? కనిన నతఁడు ♦ దీనుం డై బా
ష్పాపూర్ణనేత్రుఁ డై య,త్తాపసుఁ గని యిట్టు లనియెఁ ♦ దడఁబడఁ బల్కుల్.
చం. అకట మహానుభావ! నిను♦నంతటివాఁడును నిట్టు లెంచ నీ
తకలుషు వ్యర్థజీవిని గ♦దా? యొకపాపము లేదు నాయెడన్;
వికటకఠోరవాక్కులను ♦ వీనులఁ గ్రుచ్చుట మే లెః కైకపు
త్రకుఁ డనునింద దప్ప నొక♦తప్పును గల్గదు సుమ్ము నాయెడన్. ౨౦౬౦

ఆ. నేను లేనివేళ నిష్ఠుర మైన నాదు,జనని సల్పినట్టి♦చెనఁటిచేఁత
నామతంబు గాదు ♦ నాయిష్టమును గాదు, దాన సంతసంబుఁ ♦ బూన నేదను.

ఉ. పోవుచు నున్నవాఁడ రఘు♦పుంగవుఁ దోడ్కొనిరా నయోధ్యకుం
బావనశీల! యాయనఘు♦పాదయుగంబులమీఁద వ్రాలి స
ద్భావమునం క్షమింపు మని ♦ ప్రార్థన సేయఁగఁ బూనినాఁడ; నీ
తావిభుఁ డిప్పు డిచ్చట య♦థానువృత్తిఁ జరించుఁ జెప్పమా ౨౦౬౨

చం.స్థిరకృప నన్న నంతట వ♦సిష్ఠుఁడు లోనగువారు వేఁడినం
భరతునిఁ జూచి మౌని యిటు ♦ పల్కెను రాఘవవంశ్య! నీకు నీ
గురుహితవృత్తియుం దమముఁ ♦ గోవిదసాధ్వనుయాయితల్ దగుం
బరఁగుము నిత్యకీర్తివై ♦ భాసురతేజ జగత్త్రయంబునన్. ౨౦౬౩

చం.ఎఱుఁగనివాఁడఁ గాను ధర♦ణీశ్వరనందన! నీమనంబు, నే
నెఱిఁగియు నీకుఁ గీర్తి ఘటి♦యింపఁగ బుద్ధి దృఢీకరింపఁగా
బిఱుసన నాడినాఁడఁ; బృథి♦వీజయుఁ దమ్ముఁడుఁ గొల్వ రాముఁడుం
వఱలెడిఁ జిత్రకూటగిరి♦వర్యమునం, నిజ మే నెఱుంగుదున్. ౨౦౬౪

కం.ఈపూఁట నిందు నిల్వుము, నీపరిజనమంత్రిజనులు ♦ నీవుఁ బ్రియమునం
రేపాడి పోవఁ జను నీ,తాపతిఁ గనఁ గామితార్థ♦దానప్రవణా. ౨౦౬౫

కం.అనవుడు నట్లులకా యని, జనపాలతనూజుఁ డాని♦శం నిలిచె నటం
ముని యాతిథ్యార్థము ప్రార్థన మొనరుప నాతఁ డాభ♦రద్వాజు ననున్. ౨౦౬౬

కం.ఇచ్చితిరి పాద్య మర్ఘ్యం, బిచ్చితి రాతిథ్య మడవి ♦ నెసఁగెడిదానం
సచ్చరితా! తుష్టుఁడ నన, మచ్చిక నగ వంకురింప ♦ మౌని వచించెన్. ౨౦౬౭

ఉ. ఏమిరెయొ కొంచె మిచ్చుటనె ♦ తృప్తి వహించితి, వే నెఱుంగుదుం;
భూమిప! నీకు సేనకును ♦ భోజన మీఁయఁగ వేడ్క యయ్యెడుం
నామతి నీవు పోవుట ఘ♦నంబు ముదం బిడు నాకు, వాహినీ
స్తోమము దూరమం దిడితి ♦ తోడ్కొని రా వది యేల నావుడున్. ౨౦౬౮

చం.మునివర! మీభయంబునఁ జ♦మూనివహంబులఁ దేను, రాజు లేం
జనపతిపుత్రులేని జేత♦నంబునఁ ద్యాజ్యము చేత మే లగుం
మునివిషయంబు,లశ్వకరి♦ముఖ్యబలాంగము లాశ్రమోటజా
వనిరుహపాళిఁ దీర్చు నని ♦ వచ్చితి నొంటరిగాఁగ, నం చనన్. ౨౦౬౯

కం.వలదు తడ వింక సేనలఁ, బిలిపింపు మటంచు మౌని ♦ ప్రియమునఁ బలుకం
బలఁగం బంతయు రా రఘు,కులముఖ్యుఁడు పనిచె నంతఁ ♦ గుతుకము మీఱన్

## భరద్వాజుండు భరతునకు విందుపెట్టుట.

సీ. ఋషివరేణ్యుండగ్నిగృహమునఁ జొచ్చిము, ష్ఠాఱువార్చియు ముఖమార్జనంబు
నిరుమాఱు సల్పి భూవరున కాతిథ్యార్థ, మయి విశ్వకర్మ నాహ్వాన మొనరఁ
జేసి యాతిథ్యంబుఁ జేసెద సేనకు,విశ్వకర్మయుఁ ద్వష్ట వేగ వచ్చి
గృహసంవిధానంబు నిష్పన్న సేయుఁడు, శక్రాదిదిక్పతుల్ సకలవస్తు
తే. తతుల నరయుఁడు ప్రాక్ప్రత్యక్కులందు, మింట నేలను గలిగిన మేటినదులం
దొన్ని యిక్షుజలంబులఁ గొన్నిసురను, గొన్నిమైరేయముల నిటఁ గూర్చ్చఁగాక.
సీ. దేవగంధర్వవిశ్వావసుహూహూవుఁడు, హాహాయుండు నుభయవిధాప్సరసలు
విశ్వాచియు ఘృతాచి వినుత యలంబుస, నాగదంతియు హేమనగనివాస
హేమయు మిశ్రకేశీద్యనామ్నియు మొదల్,బ్రహ్మేంద్రులనుగొల్చు పద్మముఖులు
తుంబురుఁ డావిగాఁ దో డొప్ప మేళంబు, తో రండు ధనదుని తోషణదము
తే. వస్త్రభూషణసత్పత్రవంత మంగ
నాఫలము నైన చైత్రవనంబ రమ్ము
చంద్రుఁ డొసఁగుత భక్ష్యభోజ్యములు లేహ్య
చోష్యములు వివిధాన్నముల్ చొప్పు చెడక. ౨౦౭౨.
కం.పలుతెగ లగుపూవులచేఁ, జెలు వగుమాల్యములు సురయు సిద్ధరసముతోఁ
దులితము లగుపేయంబులుఁ, గలిగింపఁగ నలయు శశి సకలమాంసంబుల్.
చం.అనుచు సమాధియుక్తుఁ డయి యమ్ముని శిక్ష స్వరంబు తప్ప కా
స్థను గరముల్ మొగిడ్చి జపతత్పరుఁ డౌచును ప్రాఙ్ముఖుండునై
వినుతి యొనర్ప దేవతల వేఱుగ వేఱుగఁ బేరువాడి చ
య్యన మలయాద్రిదర్దురసుఖానిల మయ్యెడ వీచె హాయిగన్. ౨౦౭౪
కం.కురిసెను బువ్వులవానలు, మొరసెను దుందుభులు దిశలముఖముల నెందుణ్
బెరసెను దివ్యామోదము, నెరసెను నచ్చరలపిండునృత్యము లంతన్. ౨౦౭౫
ఉ. అచ్చరమచ్చకంటుల లయాన్వితహారిసుఖావహంబు నౌ
నచ్చపువీణనాదములయం గెఱఁగించెను వారిరాకలణ్
మెచ్చులు గొల్పునారవము నిల్చినయంతన సేన లెల్ల నిం
పెచ్చఁగఁ గాంచి రచ్చటను హృద్యము నౌగృహసంవిధానమున్. ౨౦౭౬
తే. ఉర్వి సమతను గనె నైదుయోజనములు, నీలవైడూర్యసన్నిభస్నిగ్ధశాద్వ
లంబులొప్పారె నందు బిల్వంబు వెలగ,మాదిఫలములు పనసలు మామిడులును.
కం.వెలసెను నట నుసిరికలును, ఫలయుక్తినిజైత్రవనము పఱతెంచె నదుల్
విలసితతటగతతరుసం,కలితంబులు నగుచు నటకుఁ గ్రన్ననవచ్చెన్. ౨౦౭౭

సీ. చదరపుటిండ్లఁ గుం♦జరవాజిశాలలఁ దోరణంబులు, హర్మ్య♦వారములును
సితమేఘనిభములు ♦ భృతతోరణంబులు, శుక్లమాల్యాకృతుల్ ♦ సురనువాస
నాన్వితంబులు చతు♦రస్రములై విశా,లంబులు శయనాస♦నంబులు మఱి
యానముల్ దివ్యర♦సాంచితాన్నంబులు, వస్త్రముల్ నిర్మల♦భాజనములు

తే. నైనరాజగృహంబులు ♦ నమరి యుండె
స్నానభోజనవసతులు ♦ శయనగృహము
లొప్పె భరతుండు తద్భవ♦నోత్తమంబుఁ
జొచ్చె మునియాజ్ఞ మునిశక్తి ♦ మెచ్చుకొనుచు. ౨౦౭౯

చం. అనుచరమంత్రియుక్తిని నృ♦పాసనముం వ్యజనంబు ఛత్రముం
గని యటఁ గైకయీసుతుఁడు ♦ గాఢతరం బగుభక్తి వానికిం
జనుచుఁ బ్రదక్షిణంబు రఘు♦చంద్రుఁ దలంచుచుఁ జామరంబుఁ గై
కొని సచివాసనంబునను ♦ గూరిమి మీఱఁగఁ గూరుచుండినన్. ౨౦౮౦

తే. మంత్రులుఁ బురోహితులును గ్ర♦మంబుగాఁగఁ
గూరుచుండఁగ నారాచ♦కోమరువెనుక
సైన్యపతియుఁ బ్రశాస్తయు ♦ సరస నుండి
రంత దివ్యప్రభావమ♦హర్షి మహిమ. ౨౦౮౧

ఆ. ఆముహూర్త మంద ♦ యచ్చటఁ బాయస,కర్దమితము లేర్లు ♦ కైకతనయు
దాపునందుఁ బాఱె ♦ నాపగాతటములఁ, బాండుమృద్విలిప్త♦వసతు లమరె.

కం. సురకంజాతులు దివ్యా,భరణవిభూషితలు బ్రహ్మ♦పనుపున నపుడే
యిరువదివేవురు వచ్చిరి, యరు దందుచు నుండఁ జూచు♦నట్టిజనంబుల్. ౨౦౮౩

కం. పవడంబులచే నవర,త్నవితానముచేతఁ గాంచ♦నంబున సొబ గా
వివిధాలంకృతు లొప్పఁగ, నవలా లేతెంచి రర్థ♦నాథునియాజ్ఞన్. ౨౦౮౪

తే. మనుజు నెవ్వరు సోఁకిన♦మాత్రలోన, వెఱ్ఱి పట్టినయటుః లగు ♦ వికలమతిని
నట్టియచ్చర లరుదెంచి ♦ రమరవనము,నుండి యిరువదివేవు ర♦త్యుత్సవమున.

కం. తుంబురునారదగోపులు, డంబున నీరేజహితు వి♦డంబించెడివా
రింబుగఁ బాడిరి మునియా,జ్ఞం బృథివీనాథతనయు♦సన్నిధియందున్. ౨౦౮౬

తే. మిశ్రకేశి యలంబుసా♦మీనవనేత్ర, పుండరీకయు వామన ♦ పోఁడిమిగను
భరతుముంగల నాడిరి ♦ పలుతెగ లగు,చైత్రరథవనసుమము ల♦చ్చటికి వచ్చె.

కం. మారేడులు మార్దంగికు, లై రావులు నర్తకులుగ ♦ నై తాండ్రలు నిం
పారంగఁ దాళధరులై, యారేయిముదంబుఁ గూర్చె ♦ నమ్మునిముదలన్. ౨౦౮౭

తే. తాలతిలకంబులును నక్త♦మాలకములు, సరళములుఁ గుబ్జ లగుచును ♦ సంచరింప
స్త్రీలరూపంబులం గొని ♦ శింశుపలును, నుసిరికలును జంబూద్రుమ♦విసరములును

తే. మాలతీమల్లికాజాతి♦మంజులతలు, నమ్మహామునివర్యుని♦యాశ్రమమున
శ్రవ్యతర మైనసూక్తుల ♦ శ్రవణపర్వ,ముగనుభాషించి సుందర♦మూర్తులొప్ప

మ. మదిరాపాయులు! రండు త్రాగుఁ డిదిగో ♦ మద్యంబు, నాఁకొన్నవా
రిదిగోఁ బాయస మారఁ గ్రోలుఁ, డివె ♦ స్వేచ్ఛన్ మాంసముల్ మెక్కుఁడీ,
పడఁడీ యంచును నొక్కనొక్కనికి శం♦పాదేహ లెన్మండ్రు స
మ్మద మారం దలయంటి న ల్గిడుచు నం♦భఃపూరముల్ పోయుచున్ ౨౦౯౧

చం. జిలుఁగుమడుంగు లిచ్చుచును ♦ సీవిరులం గొని ప్రక్క నిల్చుచున్
గలికి సురన్ సుపాత్రములఁ ♦ గమ్మగఁ గ్రోలఁగ నిచ్చి యిచ్చి యి
చ్చెలువున సంచరింప ముని♦శిక్షితవాహనపుల్ గజాశ్వజా
ళులకును మేపు వెట్టిరి య♦లోభగతిన్ ఖరభద్రజాతికిన్. ౨౦౯౨

కం. పేలలతో సారాయము, వాలాయము గలిపి చెఱకు♦పా లిడిరి మహీ
పాలకసేనావాహన,జాలంబుల కెల్ల వెక్క♦సం బగుదాఁకన్. ౨౦౯౩

ఉ. కట్టరు రాతు లశ్వములఁ ♦ గట్టరు మావిటివాండ్రు దంతులన్
బొట్టలు నిండ మెక్కి పడి ♦ పొర్లుచు గుస్తు లెఱుంగఁ జాలమిన్
దొట్టినసర్వకామములఁ ♦ దోరముగాఁ దని వొంది నెండి కే
ల్పట్టి వియచ్చరాంగనలు ♦ బల్విడి వెంబడి రాఁగ సైనికుల్. ౨౦౯౪

ఉ. పోమిఁక దండకాటవికిఁ ♦ బోమ యయోధ్యకు నుందు మియ్యెడన్
సేమము గల్గుఁ గాత నృప♦శేఖరుఁ డారఘురామమూర్తికిన్
క్షేమము గల్గుఁ గాక యల♦కేకయరాజతనూజపట్టికిన్
బోమిఁక వార లెట్లయినఁ ♦ బోదుము గా కని కూఁతపెట్టఁగన్. ౨౦౯౫

సీ. ఆడెడివారును ♦ బాడెడివారును, గూడెడివారును ♦ వీడువారు
నవ్వువారును మదిఁ ♦ గ్రొవ్వువారును బరు,వెత్తువారును బూవు ♦ లెత్తువారు
నయి యెల్లసైనికుల్ ♦ నాక మియ్యది పో మ్మటంచుగర్జింపఁ బ్ర♦హర్షితమతిఁ
దిని యుండియును నన్న♦మును మఱి తినఁగోరి,యును గడుపు లేమికి ♦ నుమ్మలింత్రు

తే. చేటులును బరిచారికల్ ♦ చేడియలును
నూతనాంబరములఁ దాల్చి ♦ రాతతముగ
మునికృతాన్నంబు దక్క న♦వ్వనములోన
రాఁజవేయరు ప్రొయ్యి లా♦రాజభటులు. ౨౦౯౬

కం. మావులు ఖరములు లొట్టెలు, గోవులు మృగసంతతులును ♦ గుంజరములు నా
నావికిరంబులు నాపో, కావటిలన్ ముదముఁగాంచె ♦ నాసమయమునన్. ౨౦౯౭

కం. తల మాసిన మెయి మాసిన, వలువలుమాసిననరుండు ♦ పరికింపఁగ న
ఖ్బలముల్ల లేఁ డొకఁడును నాఁ, కలిగొన్న యతండు లేఁడు ♦ కలికంబునకున్.
కం. పలుదెగ లగుపలనిచయముఁ, బలు తెగ లగుఫలచయములు ♦ బహుకుసుమగణో
త్కలితధ్వజములు బంగరు, తెలె లొప్పెను వేనవేలు ♦ దివ్యము లగుచున్.
సీ. వనపార్శ్వములఁ బాలు ♦ పరిరుచిమంతంబు, లమలధేనువులు చ ♦ న్నవియఁబిదికె
మైరేయపాయస ♦ మాంసకూపంబులు, పెక్కులైయొప్పె న ♦ ల్దిక్కులందుఁ
కుక్కుటంబులయుఁ గే ♦ కులయు జింకలయును, వండినమాంసముల్ ♦ నిండియున్న
బంగారుపాత్రముల్ ♦ రంగారుచెఱకుపాల్, బావులు స్నానసం ♦ భావ్యము లగు
ఆ. సురభికల్కములును ♦ చున్నిపిండులు నుష్ణ, జలము లమరె మేలి ♦ కొలఁకులందు
దంతధావనార్హ ♦ కాంతకూర్చాకృతు, లైనపుడక లెసఁగె ♦ నన్నికడల. ౨౧౦౦
కం. ఆవులమావులమొత్తలు, రేవులు కమలోత్పలసుమ ♦ బృందంబులు నై
పావనజలములు గిలసెఁ, బావులు మడుఁగులును శస్త్ర ♦ వర్గము వీటల్ ౨౧౦౧
కం. మంచంబులు బంగారవుఁ, గంచములు రసాలరసము ♦ గల డిగ్గియలున్
మంచిలసంగము లేలా, సంచయములుఁ గన్పఁ బెరుఁగు ♦ జానగుకడవల్. ౨౧౦౨
కం. ముచ్చెలును బావుకోళ్లును, నచ్చపుఁగిఱుచెప్పు లొప్పె ♦ నద్దము లమరెన్
మెచ్చుపుకాటుకబరిణలు, నిచ్చకొలఁది దువ్వెనలును ♦ నెన్నియొ యుండెన్.
కం. తూర్ణంబుగ భక్షితములు, జీర్ణంబులు గావుటకును ♦ జిత్రౌషధచూ
ర్ణంబు లయినజలములఁ, బూర్ణంబులు నైపస్థలులఁ ♦ బొలుపారె నటన్. ౨౧౦౪
కం. కలఁబోలుచు సద్భోజ్యము, చెలునం బగుమానివర్ష్య ♦ చేసినవిందున్
దిలకించి యాజనంబులు, పలుకఁ దరము గానివింత ♦ పాటుం గాంచెన్. ౨౧౦౫
కం. నందనమున నస్ఫుతాంధో, బృందంబులమాఢ్కి నెలమి ♦ వెలయుచు మునిసం
క్రందనువనమునఁ దష్టను, లందఱు విహరింప రేయి ♦ యంతయుఁ బోయెన్.
కం. గంధర్వులు బృందారక, సింధురయానలును నదులఁ ♦ జిక్కసవి తపో
బంధురుఁ డగుముని యాజ్ఞ వ, సుంధర విడి దివికిఁ జనిరి ♦ సురచయములతోన్.
ఉ. త్రావినమత్తు మెక్కసుధ ♦ దార్ఢ్యము నిక్కుమెయిన్ ధరించున
వ్వావుల తావి మేనఁ గడుఁ ♦ బూసినగందమురీవి దివ్యభూ
షావిభవంబు వస్త్రముల ♦ సంచయముల్ పొలుపార సైనికుల్
రే విలసిల్లినట్టులె స ♦ లీలగ నుండిరి సర్వ మెంచుచున్. ౨౧౦౮
కం. భరతుం డీగతి రాతిరి, పరివారముతోడఁ గడపి ♦ వరువాతఁ జనెన్
వరిసింప భరద్వాజునిఁ, బరమర్షియు నతనిఁ జూచి ♦ పరమప్రీతిన్. ౨౧౦౯

చ. రాతిరి మాపవనంబునను ♦ రాజకుమారక! నీకు సౌఖ్యముం
బ్రీతియుఁ గూడెనయ్య? చెపు♦మీ భవదీయుల కాతిథేయమున్
జేతము తెప్ప రంజిలఁగఁ ♦ జేసె నొకో? యన నమ్రుఁడై మ భూ
జేత నిజాశ్రమంబు విడి ♦ నిర్గతుఁ డౌమునితోడ నిట్లనున్. ౨౧౧౦

భరతుఁడు భరద్వాజర్షిని రామాశ్రమంబునకుఁ ద్రోవ యడుగుట.

ఉ. సన్నుతశీల! రాత్రి సుఖ♦సంపదఁ దేలిరి యెల్లవారు, భో
గోన్నతి నిట్టి దట్టి దని ♦ యోపి వచింపఁగ నావశంబె, సం
పన్నము సర్వమున్, సచివ♦వర్యులకున్ జనపాలికిన్ సుశా
ల్యన్నము లాదిగా శుభప♦దార్థములం దని సయ్యె మాకునున్. ౨౧౧౧

కం. అన్నను గనుతమకంబున, నున్నాఁడను సెల వొసంగు ♦ మోమునివర్యా!
విన్నపము నాలకించి ప్రసన్నుఁడ వై మైత్రిదృష్టి ♦ సాగింపు ననున్. ౨౧౧౨

ఉ. ఎక్కడ నున్నవాఁడొకో ముఁనీశ్వర రాముఁడు, మార్గ మెద్దియో?
యిక్కడ కెంతదూరఁ? మిపు ♦ డేగఁగఁ గోరెద, వన్న మౌని యీ
ప్రక్కన యోజనద్వయము♦పై నడయోజన మేగఁ గానలోఁ
జక్కఁగ నిర్జనం బయిన♦చాయ, నటన్ నయనాభిరామ మై ౨౧౧౩

సీ. చిత్రకూటం బనఁ ♦ జెలువారు నగ మొండు, దానికి నుత్తర♦తలమునందు
సుందరతరులతా♦బృందతుందిలమని, మందాకినీనది ♦ యందగించు
నానదీనికటంబు♦నం దుండుఁ జిత్రకూటం బను శైలంబు ♦ డంబుమీఱి
యా కెంటి నడుమను ♦ నాశ్రమంబునఁ దండ్రి! నీయన్న వసియించు♦నిక్క మిదియు

ఆ. నిట్లు దక్షిణముగ ♦ నేగుము వత్స వేగ, సవ్యదక్షిణముగఁ ♦ జను నొకొండు
బాట దానియందు ♦ బోఁగంబు నడపు ము,చ్చోటఁగనెదు రాము♦సుగుణధాము.

సీ. ఇట్లు భరద్వాజుఁ ♦ డేగుమార్గంబును, దెలుపఁగ దశరథు♦దేవు లెల్లఁ
దమయానములు డిగ్గి ♦ తద్విప్రవరుఁ జుట్టి, కొలిచిరి కౌసల్య ♦ పలుకవాఱు
చిక్కినమేనితోఁ ♦ బ్రక్క సుమిత్ర రా, మునిపాదయుగళికి ♦ మ్రొక్కి నిలువ
వ్యర్థకామయు లోక♦వర్గవిగర్హిత, కైక మ్రొక్కెడి ఋషి♦లోకపతికి

ఆ. సిగ్గుచేత భరతు♦చెంగట నిలిచిన, భరతుఁ జూచి యిట్లు ♦ పలికెఁ దపసి
దివసనాథవంశ్య ♦ తెలుపవే మీతల్లు, లెవ్వ రనిన నాతఁ ♦ డిట్టు లనియె ౨౧౧౪

భరతుఁడు భరద్వాజునకుఁ దనతల్లుల నెఱిఁగించుట.

ఉ. పుట్టెఁడుశోకభారమునఁ ♦ బొక్కుచు పాసముచేఁ గృశించుచున్
బట్టుగ ధర్మదేవత య♦నం గనుపట్టుడి సాధ్వి యాజికిం

బట్టపుదేవి, యీమెయ సు♦మా పురుషోత్తము సింహవిక్రముం
బట్టిగఁ గాంచె నయ్యదితి ♦ మాధవుఁ గాంచినపోల్కి రామునిన్. ౨౧౧౬
ఉ. అల్లదె యీమె వామభుజ ♦ మల్లన నూఁది దురంతవేదనన్
మల్లడిఁగొంచు చరణ్యమున ♦ మ్లానసుమంబగు గన్నెరో యనన్
వెల్లనఁబాఱి తోఁచునది ♦ విశ్రుతశీల సుమిత్ర, తత్సుతుల్
సల్లలితప్రచారు లగు♦లక్ష్మణుఁడుం బినతమ్ముఁ డీతఁడున్. ౨౧౧౭
ఉ. ఏపె మహాపరాధము ము♦నీశ్వర! ప్రాణము మీఁదఁ దెచ్చె ని
ష్పాపుల కన్నదమ్ములకుఁ ♦ బార్థివు స్వర్గతుఁ జేసె నట్టి దా
పాపిని మూఢచిత్త ఖల ♦ భామిని నిష్ఠురశీల శార్యసం
ప్రాపితభోగ దుస్సుభగ♦మానిని కైకయి యిగ్గియే సుమీ. ౨౧౧౮
తే. ఆర్యరూపిణి యైనయ♦నార్య యదయ, పాపనిశ్చయ నాదుసం♦తాపమునకు
మూలకారణ మైనట్టి♦మూర్ఖురాలు, నన్నుఁగన్నదిగా నెంచు ♦ సన్నుతాఢ్య!
కం అని బాష్పగద్గదధ్వనిఁ, దనపలుకులు తొట్రుపడఁగ ♦ దర్వీకరరీ
తిని రోఁజుచుఁ గను లెఱ్ఱగఁ, బనవెడునాతనికి మౌని♦పతి యిట్లనియెన్. ౨౧౨౦
కం. నీతల్లి నేల దూఱెదు, ఖ్యాతయశా! రాముని విభుని♦గహననివాసం
బాతతసుఖదంబగుఁ జూ, మ్మా తపసుల కసురులకును ♦ మనుదనుజులకున్. ౨౧౨౧

భరతుఁడు చిత్రకూటంబునకుఁ బ్రయాణ మగుట.

కం. పయనింపుఁ డనిన మ్రొక్కుచు, హయగజరథవివిధవాహ♦నాదులతోడన్
రయమునఁ జనఁ బొచ్చెను యమి, నియమితమార్గమున ♦ బుణ్య♦నిష్ఠుం డంతన్.
కం. హాటకభూషావంచిత, ఘోటకములఁ గ్రంపనములు ♦ గురుజనమును నే
ర్పాటుగఁ దీరిచి జనతా, కోటులు పయనించె నెక్కి ♦ కుతుకముతోడన్. ౨౧౨౩
కం. కంజారికతూర్యారాజిత, కుంజరకన్యకలు సేమ♦గుల్ గంటలు మ్రోఁ
గం జని జడికారుస ఘుష, పుంజంబులు గిట్ట లొలయఁ ♦ బోయెడికిటిన్. ౨౧౨౪
కం. చినచిన్నవి పెదపెద్దవి, కన నివిధము లై మహోఘ♦కలితంబులు వా
హనములు పోనం దొడఁగెను, జనియె భటావళియుఁ బాద♦సంచారమునన్.
కం కను లెప్పుడొ కోసలి నా, యిన తేజుల సుతుల ననెడి♦యొలమిని దమవా
హనములఁ గౌసల్యాదులు, చనిరి మహాసమ్మదమున ♦ సత్వర లగుచున్. ౨౧౨౬
కం. భరతుఁడు తరుణార్కాన్వ్రిత, కిరణనిభం బయినపల్లకిని నెక్కి చనన్
బరివారంబులు గొలువఁగ, సరిగెను బెనుమేఘ మన మ♦హానీకినియున్. ౨౧౨౭
కం. చని చని దక్షిణపుందెస, వనచయముల దాఁటి గంగ♦పరవేలను జొ
చ్చెను దృప్తపక్షిమృగ మయి, పెను పగువన మొక్కఁ డచట ♦ వీరవరుండున్.

సీ. అపురూప మగునమ్మ♦హాసేనరాకకుఁ, గలగుండుపడుచు న♦క్కానలోని
వనగజంబులు పర్వ♦పాఱె నాత్రోక్కుల, హల్లకల్లోలంబు♦ లగుచు ఋశ్య
రురుపృషతంబులు♦ గిరినదీవనరాజి, నెక్కడఁ జూచినఁ♦ బిక్కటిల్లె
వాహినీపతిఁ బోలు♦ వాహిని వన్నాట్ల, మన భూమి నెంతయు♦ నాక్రమించెఁ
ఆ. జటులజవము లైన♦సైంధవంబులచేత, గంధసింధురముల♦గణముచేత
బంధురంబు నైన♦వాహిని నడుచుచోఁ, గానరాదు దీర్ఘ♦కాల మిలయు ౨౧౨౯
ఆ. ఇట్లు పోయి పోయి♦ యెంతయు దవ్వుగ.వాహనములు డయ్య♦ వాసవాభుఁ
డచోటు చేరి పలికె♦ నసఘు వసిష్ఠమా,నీంద్రుఁ జూచి కంటె♦యిమ్వనంబు.
కం.మనకు భరద్వాజుఁడు ప,ల్కినదేశం బిదిగఁ దోఁచె♦ గిరి యది యగుఁబో
ఘనచిత్రకూట మావా,హిని మందాకినియు కంటి♦రే దూరమునన్. ౨౧౩౧

భరతుఁడు శత్రుఘ్నునకుఁ జిత్రకూటవనంబు వర్ణించి చెప్పుట.

కం.అసితజలదాభశోభా,లసితం బగువన మటంచు♦ లక్ష్మణునను జూ
దెసఁ గన్గొని గిరిసానుల,పసఁ జెలఁగు మదద్రితుల్య♦వారణగణముల్. ౨౧౩౨
ఉ. సామజముల్ చనంగ రభ♦సంబున రా ల్పొడి యయ్యె, వృక్షముల్
కోమలసూనరాజులను♦ ఘు మ్మన రాల్చెను, నూష్మకాత్యయ
శ్యామలవారివాహములు♦ నంబువులం దొరఁగించుభంగి నై;
యామరకిన్నరోత్కరస♦మాచరితం బగు దేశ మల్లదే. ౨౧౩౩
చం.మకరనివాససాగరము♦మాడ్కి రహించె మృగాకులంబు గో
త్రకటకదేశముం గనితె♦ తమ్ముఁడ తోలఁగ సైనికుల్ భయా
ధికగతిఁ బాఱఁ జొచ్చె నలు♦దిక్కులవాతవిఘాతశారద
ప్రకటవలాహకావళి న♦భస్థలిఁ బోలె మృగోత్కరంబులున్. ౨౧౩౪
కం.నల్లనిమేఘం బన రుచి, మొల్లమి గలకురుల నెగయ♦ ముడి వైచి భటుల్
పెల్లుగఁ బూవుల ముడిచిరి, యల్లదిగో దాక్షిణాత్యు♦లనఁగాఁ గంటే. ౨౧౩౫
కం.జనవర్జిత మీశైలము, జనతాసంకీర్ణ మగుచు♦ సంశోభించెన్
మనపురి యయోధ్యరీతిని, గనులకుఁ బండువుగ నిపుడు♦ కాంచితె దీనిన్.
కం.గిట్టలతాఁకున ధూళులు, బుట్టి నభోమండలంబుఁ♦ బొదిఁగప్పినఁ దా
నెట్టన గాలియుఁ జెదరం, గొట్టెడి హర్షంబు నాకుఁ♦ గూర్చెడిభంగిన్. ౨౧౩౭
ఉ. రామునిఁ గాంచుకౌతుకభ♦రంబున నెవ్వడిఁ బోవుసైనిక
స్తోమముఁ గంటె తేరుగమి♦తోరపునాదున కుల్కి పాఱు నీ
భూమిధరంబువందలి ప్ర♦భూతమనోజ్ఞమయూరపాళు లెం
తే ముద మొప్పఁ గూర్చెఁ గని♦తే యవె సానువులందుఁ దమ్ముఁడా ౨౧౩౮

ఉ. కన్నులకింపు వయ్యెఁ గనఁగా నిది కేవలనాకతుల్య మై
యున్నది, తాపసాశ్రమము లుండెడు నిం దని తోఁచెఁ, బుష్పసం
ఛన్నము లట్లు బిందుమృగసంతతు లయ్యవె, రామునాశ్రమం
బున్నెడ నోయఁ బంప నగు నోయ్యనఁ గొంచు నాకనాథుసైన్యమున్. ౨౧౩౯

చం. అన విని కొంత తేగి వని నక్కడ నక్కడ రోసి యొక్క చోఁ
గని పొగ రేఁగు చుంటఁ జని కైకయిపట్టికిఁ జెప్పి రద్దిగోఁ
గను మదె ధూమమును, గలుగఁగా నెటు నేర్పు జనంబు లేనిచో
టను బొగ, గాన నయ్యెడ దృఢంబుగ నుందురు రామలక్ష్మణుల్. ౨౧౪౦

ఉ. వారలు గాక యున్న రఘువర్యునితో సరి యైనమానుతేర
వారక యుందు రం దనిన వారలమాటలు నాలకించి య
వ్వారలతోడ ని ట్లనియె వాహినితోడుత నింద నిల్వుఁడీ
మీరలు; నే సుమంత్రుఁడును మేటిగురుండును బోదుము వనన్. ౨౧౪౧

ఉ. వ్యగ్రత సేన లందు నిలువన్, భరతుండును దాను నున్నధూ
మాగ్రమునందు దృష్టి నిడి యాదటఁ బోవుచు రాము నంద నే
కాగ్రముఁ జేసి చిత్తమును హర్షవికస్వరుఁ డయ్యె రాఘవ
ప్రాగ్రసరున్ వెసం గనులపండువుగాఁ గనుఁగొందు నం చనన్. ౨౧౪౨

రాముఁడు సీతకుఁ జిత్రకూటంబున వినోదములఁ జూపుట.

ఉ. అక్కడ రామచంద్రుఁడు ఘనాత్మజతోఁ జిరకాల మద్రిపై
మక్కువ నుండియుం గుధరమంజులతన్ గనఁ గోరి కోర్కె లై
పెక్కువనొందుప్రీతి నిడ వేడుకఁ గాన్పు ము తెల్లఁ జిర్చి తా
నొక్కెడ సీతకుం దనకు నుల్లము హాయిగ నొంద శైలమున్ ౨౧౪౩

చం. హరిహయుఁ డాపులోమజకు నట్టుల దేవధరుం జూపుచున్
ధరణిజ కిట్లు పల్కె వనితా! కను మీగిరిసొంపుఁ జూచినన్
బర మగురాజ్యమున్ విడిచి పట్టణమున్ సుహృదాళిఁ బాయుటన్
మొరమొరఁ గూర్పఁజాలదు సుమీ యిసుమంతయుఁ బద్మపాణిరో. ౨౧౪౪

ఉ. అంబుజనేత్ర! యల్లదిగో నంబరచుంబినితంబలోలగో
లంబకదంబకీరమృదలాలితదేశము లొప్పఁ గంటివే,
యిరులగఁ గొన్ని పచ్చ నయి యింద్రమణిస్ఫటికప్రవాళపీ
తాంబరసైకద్యుతులు నై మహిఁగొన్నయి రాజిలెం జెలీ ౨౧౪౫

కం. క్రూరతఁ బాసి సింగులు, ఘోరపు దెబ్బలులు దిరుగఁ గూటములందున్
జారురవాన్వితనానా, వారివిహగతతులతోడ నది, రహించెన్. ౨౧౪౬

కం.సాలతినిశప్రియాళాం, కోలామ్రశ్రీతమాల♦కుజతిందుకనృ
తాళీయుతమై సుమఫల, జాలచ్ఛాయలనునొప్పు ♦ చందముఁ గంటే. ౨౧౪౭

ఉ. కీరమనోజవాణి! యదె ♦ కిన్నరదంపతు లేకచిత్తతన్
హారివిహారలీలల న♦గాగ్రమునన్ రమియించుచున్న వా
రారయ రోమహర్షణము ♦ నయో; నిజాంబరఖడ్గపాళులన్
భూరుహశాఖలందు నిడి ♦ యొంపిరిపోవుముదంబు పెంపునన్. ౨౧౪౮

శా. క్రీడాదేశములం జరించెదరు వా♦రే చూడు విద్యాధరుల్
వీణాలంకృతమస్తకల్? సకియ యు♦ద్భేదించి భూభాగమున్
గూడం బాఱుజలప్రపాతముఁ గ♦న్గో దేవి మత్తోత్కట
వ్యాడవ్యూహకటప్రసన్నదరఝరీ♦వ్యాపార మేపారెడిన్. ౨౧౪౯

కం.కనఁ గనఁ గనులకు విందుం, బొనరించెడి పెక్కుదెగల♦పూవులసలపుల్
గొని గుహ వెడలెడి తెమ్మెర, జనకసుతా! యెవనిమదికి ♦ సమ్మద మిడదో. ౨౧౫౦

ఉ. నీవును లక్ష్మణుండుఁ దరు♦ణీమణి! కొల్వఁగ నెన్ని యేండ్లు నే
నీవనసీమ నున్న మది ♦ కించుకయున్ వ్యథ లేదు, చారునా
నావిధపుష్పపక్వఫల♦నవ్యశుకాదిశకుంతసంఘుసం
భావితచిత్రకూటమును ♦ బాయక నేఁ జరియింతుఁ బ్రీతితోన్. ౨౧౫౧

కం జనకునిఋణంబుఁ దీర్చుట, యనుజునకుం బ్రియముఁ గూర్చు ♦ టనుఫలయుగ్మం
బొనరెను జుమ్మీ యీవన, వనవాసముచేత ఫుల్ల♦వనజదళాక్షీ! ౨౧౫.౨

తే కలికి! యీచిత్రకూటన♦గంబునందుఁ, జారుమానసవాక్కాయ♦సంయతేములు
వివిధభావంబు లెల్లను ♦ వేన్క సరిసి, కొనుచుఁ గ్రీడింతువే నన్నుఁ ♦ గూడి ప్రీతి.

కం.ఈవనవాసవ్రతమును, దేవి! మా పెద్దలెల్లఁ ♦ దెలిపిరి యపవ
ర్గానహ మని సంస్మృతిపా, శానచ్ఛేదక మటంచు ♦ నాదరయుక్తిన్. ౨౧౫౪

తే. వందలకొలంది చాఁపఱా ♦ లందు నిందు, నెందు సల్లగఁ బెల్లగ ♦ నెట్టనగను
బెక్కురంగుల నొప్పారు♦విధముఁ గంటె, నారసారససంకాశ♦చారువదన! ౨౧౫౫

తే. రేల నీరాలఁ దమడాలు ♦ లీలఁ గ్రాలు, వేలకొలఁది మహౌషధుల్ ♦ వెలయుచుండు
స్వప్రభాలక్ష్మి దెసలందు ♦ సజిలుచుండఁ, గొండ నెల్లెడ శిఖిశిఖా♦కోటు లనఁగ.

కం.కొన్నిగృహంబులడంబునఁ, గొన్నియు నెలతోఁట లల్లు ♦ కొండొకచోటన్
జెన్నారు నేకశిలలై, కన్నులపండువుగఁ జూడు ♦ క్ష్మాధరతలముల్. ౨౧౫౭

తే. భూమిఁ బెకలించుకొని వచ్చు♦పోల్కిఁ జిత్ర, కూటమొప్పారెఁ బున్నాగ♦కుష్ఠభూర్జ
పత్రములుమీఁదఁబరచుదు♦ప్పటులుగాఁగఁ, గాముకులతమ్మిపాన్పులు♦ గ్రాలెసవిగో.

తే. కాముకులమేనిరాపుఁబఁ ♦ గందిసలఁగి, యున్న తామరదంతల ♦ యొప్పుఁ గనుమి
వారు బహువిధఫలముల ♦ నారగించి, విస్తరంబుల మొల్లెల ♦ విడిచినారు ౨౧౫౯
తే. వివిధమూలఫలోదక♦విశ్రుతంబు, చిత్రకూటంబు చెలువారు ♦ చెన్ను గని తె
నళిని వస్వౌకసారయం,దమునురమణి! యుత్తరకురుహర్మ్యలను మించి♦యున్నదార.
కం.వనవాసకాల మెల్లను, వనితా! లక్ష్మణుఁడు నీవు ♦ వరమతిఁ గొలువఁగ
గొనబుగ నిచ్చటఁ బుచ్చుచుఁ, జనువాఁడను బిదప రాజ్య♦సంపదఁ బూనన్.

శ్రీరాముఁడు సీతకు మందాకినీనది వర్ణించి చెప్పుట.

కం అని గిరిని దాఁటి మందా,కినిఁ జూపి విచిత్రపులిన♦కీర్తితఁ జారు
స్వనసారసహంసాన్వి,తఁ, గనకనళినలసితనదిని ♦ గాంచితె ముదితా! ౨౧౬౧
కం.చారుతరపుష్ప ఫలసం,భారంబులచేత వెలుఁగు♦పలుతెగ లగునా
తీరభవభూజములను గు,బేరసరసియట్లు వెలసెఁ ♦ ప్రేయసి నదియున్. ౨౧౬౩
కం.జంతువులు నీరు ద్రావెను, గాంతా! యచ్చోటఁ గంటె ♦ గలుషిత మయ్యెన్
గాంతంబై జల మమరెను, వింతవెసం గగుచు మదికి ♦ వేడ్క ఘటిల్లెన్. ౨౧౬౪
ఉ. కాలము దప్పకుండ ఋషి♦కాండము లందు జటాజినంబులం
దాలిచి దోఁగుచుండెడి ♦ దారుణనిష్ఠులు కొంద ఱల్లదే
బాలిక! యూర్ధ్వబాహువులు ♦ భాస్కరుఁ గొల్చెద రందుఁ గంటె వా
తూలచలద్ద్రుమాగ్రములఁ ♦ దూల సుమాళి పటించెఁ గొండయున్ ౨౧౬౫
సీ. ఒకచోట జలవాటి ♦ యుత్తమముక్తాఫ,లాభకాంతి నెసంగె ♦ హరిగాత్రి
యొకచేర హితభావ ♦ ప్రకటమనోజ్ఞమై,సతరాజి రాజిల్లెఁ ♦ దతనితంబ
యొకవంక మఘుపాంక♦పుకరాంకకెరవార, ముద్యాల లూఁగెడి ♦ నుత్పలాక్షి
యొకప్రక్కఁ దమి నిక్క ♦ నవిక సిద్ధజనాళి, నయ్యాళి తిరిగెడి ♦ వనజపాణి
తే. గాలికిని బూలు తటములు ♦ రాలఁ గొన్ని
జలములను దేలెడిసి గొన్ని ♦ జలదవేణి!
వల్గువచనంబులను జక్ర♦వాకతతులు
పూలపానుపు లెక్కెడి ♦ లీలఁ దరణి. ౨౧౬౬
కంలలనా! యీమందాకిని, పలువారెడిచిత్రకూట♦నగముం గనిన
జెలి! నిన్నుఁ జూచుకంటెను, నలపురమును గనుటకంటె ♦ హర్షం బిడెడిన్.
తే. దమశమాన్వితు లగుచును ♦ దపముఁ జల్పు,ధూతకలుషులుసిద్ధులు ♦ దోఁగుకతన
నిర్మలం బగుమందాకి♦నీజలముల, జలకమాడుము ననుఁగూడి ♦ తలిరుఁబోఁడి.
కం.చెలితో నాడెడువడువున, జలకేళులు నన్నుఁ గూడి ♦ సలుపుము నీటన్
వెలికమ్ములఁ గెంపమ్ములఁ, గలికి! మునుఁగ నీదుసొబగుఁ ♦ గని పెనులజ్జన్. ౨౧౬౭

కం. వనమృగములె పురజనములు, ఘనపర్వత మాయయోధ్య ♦ గా నీనదినిన్
మనసరయువుగాఁ దలఁచుచు, వనజాక్షీ! సంతసమున ♦ వర్తింపు మిటన్. ౨౧౭౦
కం. నామాటను జవదాఁటని, సౌమిత్త్రి భజింప, నీవు ♦ జానకి! సతివై
నామతి ననువర్తింపఁగ, నీమహి నింతకును సౌఖ్య ♦ మితరము గలదే. ౨౧౭౧
కం. ఇమ్మందాకిని మునుఁగుచు, ముమ్మాఱును సమధుమూల ♦ ములఁ దిని నీతో
సమ్మతి నుండెద నే రా, జ్యమ్మైన నయోధ్యయైన ♦ నభిలాషపడన్. ౨౧౭౨
కం. కరటిఘటాశాలినియును, గిరికేసరికీశపీత ♦ కమలయు సుమనో
భరసృష్టయు నగునీనది, తరుణీ! యెవ్వనికి ముదము ♦ దనరింప దొకో. ౨౧౭౩
కం. అని రామామణికిని నా, యినకులుఁడు సుసంగతోక్తి ♦ నిం పెనయఁగ నా
ధునిఁ జూపుచు శుభనయనాం, జననిభ మగుచిత్త్రకూట ♦ సానువునందున్. ౨౧౭౪
కం. ఇది పూతం బిది స్వాదువు, సుదతీ! యిది తప్త మనుచు ♦ సొంపుగఁ బలమున్[1]
మదవతికిఁ జూపుతఱి మి, న్నదియఁగ నాదంబు రేణు ♦ కాండం బెగసెన్. ౨౧౭౫
శా. ఆనాదంబున గుల్కి తద్గహనస ♦ త్త్వాళుల్ శకుంతాదులున్
నానాయూథములుం గలంగి దెసల ♦ న్నగ్గోలుగాఁ బాఱినన్
త్స్థానాగుం డది గాంచి లక్ష్మణునితోఁ ♦ గంటే ధరా రేణుసం
తానంబుల్ దివిఁ దాఁకె భీషణమహా ♦ నాదంబు పెంపారెడిన్. ౨౧౭౬
కం. కదులో కాసరమో కే, సరి భీతినిమృగములో ♦ దిశాంతములకు స
త్వరముగఁ బాఱెడి వేఁటకు, నరపతి యరుదెంచెనో, క ♦ నన్ శ్వాపదమో.
చం. కనుఁగొన నొక్కపిట్టయినఁ ♦ గానఁగ రా దిట, దీనితత్త్వమున్
గనుఁగొని రమ్ము టన్నఁ జని ♦ గ్రక్కునఁ బుష్పితసాల మెక్కి తూ
ర్పును గని వెంటి యుత్తరముఁ ♦ బోలిచి చూడఁగ నందు ఘోరమై
తనరెస వచ్చుచున్న యొక ♦ దారుణసైన్యముఁ గాంచె దవ్వులన్. ౨౧౭౮
చం. ఘనరథనాగవాజిభట ♦ కాండవిరాజితభూరివాహినిన్
గని, యట నుండి రాముఁ గని ♦ గ్రక్కున నార్పుము వహ్ని, నీశరా
సనముసు నెక్కు పెట్టుము, ఇఁక ♦ జానకినిన్ గుహ నుండఁ బంపుమీ,
మునుకొని తాల్పుమీ కవచ ♦ ముం, బెను మోసము వచ్చె నన్న యా! ౨౧౭౯

లక్ష్మణుఁడు శ్రీరామునితో భరతుండు సేసతో వచ్చుట దెలుపుట.

కం. అనవుడు లక్ష్మణుతో నోయనఘా! కనుఁగొమ్ము లెస్స ♦ యావాహిని యె
వ్వనిదో నావుడు సైన్యముఁ, గనుఁగవనె దహించు నట్లు ♦ కని మండి యనెన్.
చం. ఘనతరరాజ్యసంపదలు ♦ గైకొని తా నభిషిక్తుఁడై పురిన్
మనల వధింప వచ్చెను జుమా భరతుం డలకైకపట్టి, యా

[1] పలము = మాంసము.

ఘనరథమందు నున్నతప్ర♦కాండము గ్రాలెడిఁ గోవిదారకే
తన మదె చూడవన్న! మఱిఁ♦ దక్కము సందియ మాతఁడే చుమా. ౨౧౮౧
ఉ. కౌతుకమార వటీంద్రు వెస♦రా నిటఁ జొచ్చి తాల్చి యాయుధ
వ్రాతము నశ్వనాగములఁ♦బై వడిగా, మన మిప్డు చాపముల్
శాతశరంబులం గొనుచు♦ శైలాధర మెక్కుటొ యుంద యుండుటో
నీతఁ డేది? చిక్కెడిని♦ నేఁ డనిలో భరతుండు భూపతీ. ౨౧౮౨
ఉ. నీకును నాకు సీతకును♦ నిష్ఠురకష్టముఁ గూర్చె, శాశ్వత
శ్రీకి నినుం దొలంచె, మఱిఁ♦ జేర్చె నికారవిధంబు నట్టియా
కైకకతనూజుఁ డారిపుఁడు♦ క్రమ్మఱఁ బైపడి వచ్చెఁ గంటివే
భీకరబాణపాతముల♦ బీరము నీ యొనరించి త్రుంచెదన్. ౨౧౮౩
చం. భరతునిఁ ద్రుంచుటందు నొక♦పాపము లే దని నాకుఁ దోఁచె, ధు
శ్చరితుని మున్ను కీడులను♦ జల్పినవానిఁ బరిత్యజించినం
దొరయ దధర్మ మందుకు ఘ♦నుల్, విను త్యక్తసుధర్ముఁ డీతఁ డా
సరణిఁ జరించె, నీయలుచఁ♦ జంపెద, నేలుము రాజ్య మంతయున్. ౨౧౮౪
చం. తనతనయుండు మచ్ఛరవి♦తానములన్ ధరఁ గూల నేడ్చుచున్
గనుఁగొనుఁగాక రాజ్యభర♦కాముక కైకయి మత్తహస్తిభ
గ్ననగమునట్లు, సానుచరఁ♦ గైక సబాంధవ వెంటఁ ద్రుంతు మే
దినియు నపాస్తపాప యయి♦ తేజము నొందెడుఁ గాక నిత్యమున్. ౨౧౮౫
కం. ఎండినపొదరులమీఁదఁ బ్రచండహుతాశనునియట్ల♦సత్కారభవో
ద్దండక్రోధము శాత్రవ, కాండంబులమీఁద విడుతుఁ♦ గాకుత్స్థవరా! ౨౧౮౬
తే. చించి చెండాడి శాత్రవ♦సేన లెల్ల, ఘోరసునిశితనారాచ♦కోటిఁ బరపి
చిత్రకూటంబు రక్తపి♦శితసుసిక్తముగను గావించువాఁడను♦ జగము మెచ్చ. ౨౧౮౭
తే. శరవినిర్భిన్నహృదయకుం♦జరతురంగ, మానవకళేబరముల న♦నూనమోద
మునను తినుఁగాక శ్వాపద♦ములును నిట్లు, చాపశరఋణముక్తిని♦ జలుపువాఁడ.

### భరతునిపైఁ గినిసినలక్ష్మణుని శ్రీరాముఁడు శాంతిపఱుచుట.

చం. అనుచును క్రోధమూర్ఛితుఁడు♦ నై రణయత్నము సేయు చున్నల
క్ష్మణుఁ బరిసాంత్వనోక్తులను♦ శాంతిపఱంగ నచించు రాముఁడున్
బని గలదే సుమిత్రసుత♦ బాణముచే నసిచేత వింటిచే
తను గురుచాపుఁడున్ సుమతి♦ తానుగ రా భరతుండు సోదరా! ౨౧౮౯
చం. జనకునిసత్యముం జెఱిచి♦ సమ్ముఖమం దిట నన్నుఁ జూడ వ
చ్చినభరతున్ వధించి గత♦జీవితుఁ జేసియు లోకనిందలన్

గనుమ ధరాతలంబుఁ గొనఁ • గార్యము లక్ష్మణ! యేమి చెప్పుమా?
మనమున నీకు నంతరుచి•యంతయు లే ధనముల్ మహామతీ? ౨౯౦

కం. హితబాంధవవర్గంబులు, మృతిఁ జెందిన వారిధనము • లేఁ గొన నొల్లన్;
మృతనష్టస్వము లే విష,కృతభక్ష్యములట్లు చూచు • టె వెఱుఁగ వొకో. ౨౯౧

కం. భూమియు ధర్మం బర్థముఁ, గామముఁ గాక్షింతు మీకుఁ•గా రాజ్యంబేఁ
మీమేలునకే కోరెద, సౌమిత్రీ శస్త్ర మంటి • శపథ మొనర్తున్. ౨౯౨

చం. జలధిపరీతభూవలయ•సంపద లేఁ గొన నా కసాధ్యమే?
తలఁగి సధర్మమార్గమును • దమ్ముఁడ! శక్రత నేనిఁ గోర, ని
స్తులితగుణాఢ్యుఁ డైనభర•తుండును నీవును నీదుతమ్ముఁడున్
బొలుపుగ లేనినాదుసుఖ•మున్ శిఖి నీఱుగఁ జేయుఁ గావుతన్. ౨౯౩

సీ. భ్రాతృవత్సలుఁ డైన• భరతుం డిజకులా,చారము నెంచి యయో•ధ్యకును వచ్చి
నేను నీతో సీత•తో నారణ్యము గ్రహింప నెంచి పోయి నంత • విని కిరాక
యాలకించియు నాపైఁ • బ్రాణంబుకంటెను, ప్రియతరం బౌట భా•వించి నీతి
నాకింలి తేంద్రియుం • డగుచు స్నేహాక్రాంత,హృదయంబునను జూడ•నేగుదెంచెఁ

ఆ. గాని యొండు గాదు • కైకేయిఁ గోపించి, యప్రియంబు లాడి • యనఘుజనకు
కరుణ వడసి నాకుఁ • గ్రమ్మఱ రాజ్యంబు, నీయ వచ్చె వింటె • యింత నిజము.

కం. భరతుండు మనలఁ జూడఁగ, నరుదెంచుట యోగ్యనిధమ • యగు; నతఁ డంతః
కరణంబున నేనియుఁ గీ, డరయఁడు మనయందు నీకు • నలుగం దగునే? ౨౯౪

చం. వినుతగుణాఢ్య నీకు నొక•విప్రియ మెన్నఁడు నల్పె నయ్యె యా
యనఘుఁడు? తేర తేరకు భ•యంపడ దేటికి? నిట్టిమాట లే
సనియెనె? సందియంబు దగు•నా? యిఁక నాడకు మిట్టు లాతనిన్
వినయము దప్పి పల్కినను • విన్నది న న్ననినట్లు లెంచెదన్. ౨౯౫

ఉ. ఎంత విపత్తియైనఁ గలఁ•డే తనతండ్రిని జంపుపుత్రుఁడున్
సొంతముప్రాణతుల్యుఁ డగు•సోదరుఁ జంపెడిభ్రాతయుం? గటా
యింతలు నీమనాలుకకు • నేగతి వచ్చెను? రాజ్యకాంక్ష నీ
కంతఘనంబ యేని భర•తా ధర నీవిక ని మ్మటందునా? ౨౯౬

కం. ఊరకయ మాటమాత్రము, ధారుణి లక్ష్మణున కిమ్ము • తమ్ముఁడ! యన నేఁ
గూరిమి వల్లే యనుఁ జుము, కోరిక లే ఎతని కంత • క్షోణిస్థలిపై. ౨౯౭

ఆ. అనిన ధర్మశీలుఁ • డైన రామునివాక్య,తతుల నాలకించి • తద్ధితార్థి
లక్ష్మణుండు మిగుల • లజ్జచేఁ దనలోనఁ, గ్రుంగి యిట్లు లనియెఁ • గుతిలపడుచు.

తే. మిమ్ముఁ గనుఁగొన మనతండ్రి ♦ మేదినీవి,భుండు దశరథుఁ డరుదేరఁ ♦ బోలుననిన
ప్రీతితుని లక్ష్మణునిఁ జూచి ♦ లాలితోక్తి, భావవిదుఁ డైనశ్రీరామ♦భద్రుఁ డనియె
సీ. మనలఁ జూడంగనే ♦ జనపతి వచ్చెనో, వనవాసమున మన♦పడెడిపాట్లు
మదిలోనఁ దలపోసి ♦ మనల నింటికిఁ దోడు,కొని పోవ వచ్చె నం♦చును దలంతు
మనకు నై కాకున్న ♦ మనుజేంద్రుఁ డీసుకు,మారి సుఖార్హను ♦ త్మాతనూజఁ
దలఁచి యైనను మన♦తండ్రి దశరథుఁడు, వచ్చు సత్యంబ యా♦వచ్చు చున్న
తే. పవనజవనంబులును గోత్ర♦వంతములును,జారుతరములు నైనయ♦శ్వములు రెండుఁ
దండ్రిశత్రుంజయం బను♦దంతి దండు,మున్ను నడ తెంచు చున్నవో♦యన్న!కంటె.
కం.కనఁబడ దెం దరసిన మన,జనకుని దివ్యంబు భువన♦జనపూజిత మై
తనరెడిశ్వేతచ్ఛత్రం, బనుమానం బయ్యె లక్ష్మ♦ణా! నామదికిన్. ౨౨౦౨
కం.నామాట వినుము లక్ష్మణ, భూమీజము డిగుము వేగ♦ముగ రమ్మన నా
సౌమిత్రి యట్ల యొనరిచి, రామునకుఁ బ్రయుక్త యొక్క♦ప్రక్కగ నిలిచెన్.
చం.భరతుఁడు క్రిందుసంపడిని ♦ భ్రాతలయాశ్రమ మార్తి చెందునం
చుచుతర సైన్యసంఘము న♦గోత్తమసీమను ధర్మబుద్ధి మై
నిరవుకొనంగ నిల్పె,నటు ♦ లెంతయు సైన్యము సార్ధయోజనం
బిరవుకొనెం, బదంపడి మ♦హీశసుతుండు వినీతవేషుఁ డై. ౨౨౦౪

భరతుండు పాదచారి యై రామాశ్రమంబు వెదకుట.

ఉ. అన్నను జూడఁ గోరి గురు♦నానతిఁ గైకొని పాదచారి యై
తన్ను భజించి యున్నపిన♦తమ్మునిఁ గన్గొని యెల్లవార మీ
యున్నవనంబులోపల ర♦ఘూత్తముఁ గాల్నడ నారయంగఁ బో
లు న్నిఖిలానసీజనుల ♦ లుబ్ధులఁ గొల్వఁగఁ బొమ్ము సీ నటన్. ౨౨౦౫
చం.మనలను గొల్చి వచ్చు నస♦మానబలుండు గుహుండు బంధురా
జిని వెసఁ గూడి; మంత్రిజన♦శేఖరులున్ గురుపౌరవర్గముల్
వెనుకొనువారు నన్ను నిట ♦ వేగపడున్ హృదయంబు వారలన్
గనుఁగొనుదాఁక శాంతి మదిఁ ♦ గల్గఁగ నేరదు చుమ్ము తమ్ముఁడా! ౨౨౦౬
కం.రాముని ద్యుమబలుఁ డగు,సౌమిత్రి మహానుభావ ♦ జనకాత్మజ నే
సేమముగఁ గాంచుదాఁకను, నామదికిని శాంతి లేదు ♦ నాసోదరుఁడా! ౨౨౦౭
కం.వనజదళ నేత్రుఁ డగురా,మునిపూర్ణసుధాంశుఁ డెగడు♦మోమునందమ్మిన్
మనమారఁగఁ గన్నారఁగఁ, గనుదాఁకను నాకు శాంతి ♦ గలుగు నటయ్యా.
కం.భూమిపలక్షణయుతములు, రామునిచరణాంబుజములు ♦ రాగంబున నే
నామస్తకమునఁ దాల్పక, నామదికిని శాంతి లేదు ♦ నాసోదరుఁడా! ౨౨౦౯

కం.మనతండ్రి దాత లేలిన,ఘనరాజ్యభరంబుఁ బూని ♦ క్ష్మాపతి యగుచున్
మనయగ్రజుఁ డభిషేకముఁ, గనుదాఁకను నాకు శాంతి♦గలుగదు సటయ్యా.

కం.ఎంతటిధన్యుఁడొ సీతా,కాంతసుధాంశూపమాన♦కమనీయాస్యం
బెంతయు సంప్రీతిని నే,కాంతముఁ గను లక్ష్మణుండు ♦ కాకుత్స్థమణీ. ౨౨౦౧

కం.ధన్యాత్మిక సాధ్వీమూ,ర్ధన్య మహాభాగ జనక♦రాజాత్మజ రా
జన్యవరుం దనభర్త న,నన్యమతిం గొలిచి వెంట ♦ నంటెను గంటే. ౨౨౦౨

కం.నందనవనిని గుబేరుం, డందంబున నుండునట్లు ♦ లవనీశ్వరుఁ డీ
సుందరగిరివరకూటం,బం దుండెడి దీని భాగ్య ♦ మగు నే పొగడన్ ౨౨౦౩

తే. వ్యాళపాళీనిషేవిత ♦ మైనవనము, రామచంద్రుండు భువనాభి♦రాముఁ డిందు
నధివసించుటఁ జేసి ధ♦న్యత్వ మంటె, ఘనత గన దెగ్గి రామసాం♦గత్యమునను.

చం.అని వచియించి యాభరతుఁ ♦ డవ్వనసీమను బాదచారి యై
చనుచును వాగ్మిశేఖరుఁడు ♦ చారుసుమాగ్రము లైన శైలసం
జనితనగాళిమధ్యమునఁ♦జక్కఁగఁ బోవుచు సాల మొండు డా
సిన నట గోచరించె రఘు♦శేఖరునాశ్రమసాలమూలముల్. ౧౨౦౪

కం.శ్రీరాముఁ డచట నుండు ప్ర,కారము భరతుం డెఱింగి ♦ కడలేఁడునదుం
డారఁగఁ బారముఁ గనిన ట,పారిముదమ్మును వహించె ♦ బంధుయుతుండై.

⟿ భరతుండు రామాశ్రమమును జూచుట. ⟿

చం.అనఘచరిత్రు లచ్చటిమ♦హాత్ములు రామునియాశ్రమం బదే
యనఁ దనతోడిసైన్యముల ♦ నచ్చట నిల్పి గుహుండు వెంట రాఁ
జనె గురువత్సలుండును వె♦సన్ మునుమున్న వసిష్ఠుఁ బంచెఁ జ
య్యనఁ దనయెల్లతల్లులను ♦ నచ్చటికిం దొడితేఁ, నీగతిన్ ౨౨౦౭

కం.చనునెడ సీతాధవన,గ్నకాంతును భరతునకును♦సముఁడు సుమంత్రుం
డును దావుఁ గంటి శత్రు,ఘ్నుని నెవ్వాఁగఁ ♦గొను కనుజునకున్ ౨౨౦౮

తే. తాపసాగారనిచయము♦ధ్యంబునందు
నున్నరామాశ్రమముఁ జూపు ♦ సుద్దిశి
నరుగుచును దూరమున నున్న♦ యగ్నిభర్తుని
యాకుటిల్లును నుటజంబు ♦ నాసిఁ గనిరి. ౨౨౦౯

కం.తెలుపను నుటజమునకు ముం,దలఁ బూర్వాగ్రంబు పువ్వు♦తతులం జేక
ట్లుతిమిన మంటలు వే మఁగ, విఱిచినకట్టె-ను గాంచి ♦ వీరుఁడు చనుచున్.

తే. రామలక్ష్మణులుండునా♦శ్రమము తెరన్న,గుఱుతు తెలియంగసంనంద♦గుర్తులుగను
జెట్లకొనశాఖ్మలను కుశ♦చీరములను, గట్టియుంపుట గనుఁగొనెఁ♦గైకసుతుఁడు.

కం.అడవుల మృగముల దుస్సుల,పిడకలఁ జలికాఁచుకొనఁగ ♦ విడి కుప్పలుగా
నిడినవి చూచుచు సంతస,పడుచు నమాత్యులకుఁ దనదు♦భ్రాతకు ననియెన్.

భరతుండు శ్రీరాముని దర్శించుట.

కం. నిండుతమిఁ గొంతవడి భర,తుం డారఁగఁ గాంచి తెలిసెఁ ♦ దోరంపుజటా
మండలితో నుటజాసీ,నుం డగుశ్రీరాము నన్న ♦ నుర్ ధీరగుణున్. ౨౨౩౪

సీ. కృష్ణాజినం బుత్త ♦ రీయంబు గాఁ జీర,వల్కలంబులు గట్టు ♦ వస్త్రములుగఁ
బావకనిభుఁ డయి ♦ భాసిల్లు చాసీనుఁ, డగుమహాబాహుఁ గం ♦ జాయతాక్షుఁ
జతురబ్ధివలయిత ♦ క్ష్మామండలేశు సిం,హస్కంధు ధర్మని ♦ త్యానురక్తు
జావకీలక్ష్మణ ♦ సహితుఁడై దర్భసం,స్తరణంబుమీఁదను ♦ జాను మీఱి

తే. శాశ్వతబ్రహ్మవైఖరి ♦ జాను మిగులు,రాముఁ గని పరువెత్తి చే ♦ రంగఁ బోయి
చూచివంతన యేడ్చుచు ♦ శోకబాష్ప,వారి సందిగ్ధవచనుఁడై ♦ పలికె నిట్లు.

కం. ఉన్నతసింహాసనమున, సన్నుతిఁ జేయంగ జనులు ♦ సభ నుండెడిమా
యన్నయె యిటువలె నడవుల, నున్నాఁ డారణ్యమృగఖ ♦ గోత్కరవృతుఁడై. ౨౨౩౫

సీ. వెల లేని దువ్వలు ♦ వలను దాల్చెడి మహా,నుహాఁడె యీజింకచ ♦ ర్మము ధరించెఁ
బట్టనంబున సౌఖ్య ♦ పడ యోగ్యుఁడగునుకు,మారుఁడా యడవుల ♦ మలయువాఁడు
వలపులు చల్లుపూ ♦ వులు దాల్చు సొబగుఁడా, తతజటాభారంబుఁ ♦ దాల్చినాఁడు
చందనచర్చల ♦ నందంబు మీఱునా,యంగమా యీఘూళి ♦ గ్రుంగినదియు

ఆ. మన్నిమిత్త మకట ♦ యిన్నిదుఃఖంబులు, సౌఖ్యపరుఁడు రామ ♦ చంద్రునకును
సంభవించె జగతి ♦ నడి గన్నయీక్రూరు,బ్రతుక దేల యేల ♦ ప్రాభవంబు. ౨౨౩౬

కం. సన్నుతగతి విధియుక్తిగ, జేన్నంబులు సలిపి ధర్మ ♦ సంపన్నుఁడుగా
నున్నయతండా యడవుల, నిన్నఁటి మెయిగాసి ధర్మ ♦ మెంచం గూర్పున్. ౨౨౩౭

కం. ఖిన్నుండై యిటు లేడ్చుచు, స్విన్నముఖాంభోజుఁ డగుచుఁ ♦ జేరఁగఁ జన లే
కన్నను భరతుం డిలఁ బడె, నన్నా! యని యొండుపలుకు ♦ నన లేకేమిన్.

కం. కన్నులనీళ్లులు కంఠం,బు న్నెఱి మాటంగఁ గర ♦ పుత్రుఁడు రాముఁ
గన్నెత్తి చూచి పిలిచియు, నన్నా! యని వేఱుమాట ♦ నన లేఁ డయ్యెన్.

తే. రోదనము సేయు చంత శ ♦ త్రుఘ్నుఁ డన్న,పాదములు ప్రాలెఁ బట్టుగఁ ♦ బట్టియెత్తి
నీరజాక్షుండు వారి క ♦ న్నీరు దుడిచి, కౌఁగిలించుచు వారల ♦ కలఁకఁ బాపె.

తే. ఆవలనుమంత్రగుహులు నె ♦ య్యమునడాయ,శుక్రగురుయుక్తులైనట్టి ♦ సూర్యచంద్రు
లనఁగ నొప్పిరి భ్రాతలు ♦ వననివాసి, జనములును గూడ దుఃఖించెఁ ♦ గనుచు వారి.

శ్రీరాముఁడు భరతునిఁ గుశలప్రశ్న సేయుట.

తే. జడలు ధరించి నారవ ♦ స్త్రములు గట్టి,పుడమిఁ బ్రాంజలి యగుచును ♦ బడినకల్ప
భానుపోల్చిక దుర్దర్శు ♦ దీనుఁ గృశు వి,వర్ణు నెట్టెట్లొ తా నాన ♦ వాలు పట్టి.

తే. తపదు వెయ్యంపుటనుజు హ♦స్తముల నెత్తి
రాముఁ డక్కునఁ జేర్చి శి♦రంబు మూరు
కొనుచుఁ దనతోడఁ గూర్చుండఁ♦గూర్చిఁ దిగిచి
కుశలసంభాషణముఁ జేసె♦ విశదఫణితి. ౨౨౪౫

ఉ. ఎక్కడ నున్న వాఁడొకో యి♦టి విట వచ్చుటఁ జేసి తండ్రి? నీ
విక్కడ రావుగా జనకుఁ♦డింటను జీవముతోడ నుండఁగా?
నక్కట మున్ని నాళ్లరిగె♦ నయ్య నినుం గని,గుస్తు చిక్కనై
తెక్కట దుర్గమాటవుల♦కై యిటు రాఁ బని యేమి తమ్ముఁడా? ౨౨౪౬

ఉ. నీ విటు రా నెఱింగి మన♦ నేర్చినవాఁడొకో తండ్రి, నాకముం
బోవఁగ లేదుగా? మిగులఁ♦ బూజ్యము రాజ్యము బాలకుండ వౌ
నీవు ధరింప భ్రష్టమయి♦ నెప్పుడిఁ బాయదుగా? మహాత్మునిన్
భూవిభుఁ దండ్రినిం దినముఁ♦ బూజలఁ దన్పుదు గాదె నాయనా? ౨౨౪౭

శ్రీరాముఁడు కుశలప్రశ్న వ్యాజంబున భరతునకు
ధర్మోపదేశము సేయుట.

ఆ. సత్యసంగరుండు♦ సకలధర్మవిదుండు, రాజసత్తముండు♦ రాజసూయ
సైంధవాధ్వరముల♦ సలిపినపుణ్యుండు, కుశలి యయ్యె తండ్రి♦ దశరథుండు.

కం. మనకులముగురువు విద్వ, జ్జనవర్యుఁడు బ్రాహ్మణుండు♦ సారద్యుతి యా
మునివర్యుండు వసిష్ఠుఁడు, మునుపటివలెఁ బూజితుండె♦ మొగి దాశరథీ. ౨౨౪౮

కం. ఆమాడ్కి విడిచి వచ్చిన, నామాత సుమిత్ర, సాధు♦నందన సుఖులే?
నీమాత పూజ్య కైకయి, యామోదముతోడ నున్న♦దయ్యా భరతా? ౨౨౫౦

కం. కులపుత్రుంపును వినయము, గలవాఁడు బహుశ్రుతుండు♦ కార్యజ్ఞుఁడు ని
ర్మలమతి యనసూయుం డయి, యలఘుమతీ నీపురోధ♦ యర్చితుఁ డగునే.

ఉ. ఘనమతి యగ్నిహోత్రముఁ♦ గాచఁగఁ బూనినవాఁడు, సత్క్రియా
వినియమవేది, ధీయుతుఁడు♦ వేళ్వం లోపుఁ దుల్యహావని
ష్ఠనుగలవాఁడు, హోమములు♦ సల్పఁగలట్టివి సల్పినట్టివిన్
వినిచెడివాఁడు, నై యుచిత♦వేళల నొప్పునె నీపురోధయున్? ౨౨౫౨

సీ. దేవతలను బితృ♦దేవతలను నెల్ల,జననుల గురువుల♦ జనకసముల
వృద్ధుల వైద్యుల♦ విప్రుల సత్కృతిఁ, దన్పుదే? యర్థశాస్త్రప్రవీణు
నిష్వస్త్రసంపన్ను♦ హితు సుధన్వాఖ్యు ను,పాధ్యాయుఁ బూజింతు♦వా సభక్తి?
శూరులే కులజులే♦ శ్రుతవంతులే యార్త్మ,సములె జితేంద్రియ♦శాలు లొక్క

తే. యింగితజ్ఞులె నీమంత్రు♦లెల్లఁ దండ్రి? మంత్రమే జయమూలంబు♦ మహిపులకును
శాస్త్రకోవిదు లైనట్టి♦సచివవరులు, దాని రక్షింతురా ప్రమా♦దంబు లేక?

కం.కావు గదా యెప్పుడుని,ద్రావఘుఁడవు? మేలుకొనుదె ♦ తగుకాలములన్?
నీ వాలోచింతె ధన,ప్రావీణ్యము లేచి యపర♦రాత్రములందున్? ౨౨౪

కం ఒక్కనితో నైనను మఱి,పెక్కురతో నైనఁ జేయ♦వే కద మంత్రం?
బెక్కరణి నీదుమంత్రము,గ్రక్కున వెలువడదుగాదె♦రాష్ట్రమునందున్? ౨౨౫

కం.నయత లఘుమూలము మహో,దయ మగుకార్యంబు నిశ్చి♦తం బగుడు మఱిన్
రయమునఁ జేయుదె? కార్యము, క్షయ మగుగతిఁ దడవు సేయఁ♦గాఁ దఱఁపవుగా?

కం.సామంతభూమిపాలురు, నీమంత్రితకార్యసమితి ♦ నెఱవేఱెడిమున్
దా మేమి యెఱుఁగ కుందురె? యామీఁదనె యెఱుఁగు చుందు♦రా యెల్లపుడున్?

కం.పలుయుక్తులనో తర్కము,వలననొ మఱి యెట్టు లైనఁ ♦ బరు లెవ్వరు నీ
వలననొ నీధీసచివుల,వలననొ యెఱుఁగరు గదయ్య ♦ వరమంత్రితమున్? ౨౨౮

కం.పండిత వెయిమూర్ఖులకును, బండితుఁ డొక్కండు మేలు ♦ భావింతె మదిన్?
గండంపుటర్థకష్టము, నిండినయెడ నతఁ డొసంగు ♦ నిశ్శ్రేయసమున్. ౨౨౯

ఉ. వేవు రదేల యొక్కరుది♦ వేవురు మూర్ఖులు గొల్చు చుండినన్
భూవిభు, వారిచేఁ గలుగఁ♦బోదు సహాయత, గాన నొక్కమే
ధావియు శూరుఁడుం బనుల ♦ దక్షుఁడు నీతివిదుండు మంత్రిగా
క్ష్మావిభునేని భూమివిభు♦మాత్రునినే ధనవంతుఁ జేసెడిన్. ౨౩౦

ఆ. గొప్పవారి నెల్ల ♦ గొప్పకార్యంబుల, మధ్యములను మధ్య♦ముంపుఁబనుల
నధము లైనవారి ♦ నధమకృత్యంబుల, భృత్యజనుల నును తె♦ పేర్చికొలఁది? ౨౩౧

ఉ. ప్రేముఁ గలారిఁ, బెక్కులుప♦రీక్షలఁ దేరినవారిఁ, బూర్వపున్
భూమిపు లాదిగా మనలఁ ♦ బూనికఁ గొల్చెడివారి, సత్యవా
ణీమతికర్మము ల్గలుగు♦నిర్మలులన్, సచివాగ్రగణ్యులన్
గా మదిఁ జూచి శ్రేష్ఠ మగు♦కార్యముల న్నియమింతె శ్రేష్ఠులన్. ౨౩౨

తే. ఉగ్రదండంబుచేత నీ ♦ పుర్విజనులఁ, బీడితులఁ జేసి తేని మో♦మోడి నీదు
మంత్రివర్యులు నీపోవు♦మార్గములకుఁ, దలల నూఁచుచు నుందురా♦తగవు మాలి?

చం.ధనమును దుష్టమార్గమునఁ ♦ దా నొడఁగూర్చి వనంబుఁ జల్పఁ గో
రినఖలు యాజకుల్, ప్రసభ♦రీతి గ్రహింపఁగఁ గోరుకాముకుల్
వనితలు వీడనాడుగతి ♦ నాయన! తీవ్రగతిన్ ధనంబులన్
బెను పొసరించునిన్నుఁ బ్రజ ♦ వీక్షణ సేయుదుగా యనాదృతిన్. ౨౩౪

ఉ. లేరు గదయ్య నీకడ మ♦లీమసచిత్తులు, దుష్టనీతివి
ద్యారతు, లాత్మభృత్యజన♦తాపరిదూషకులున్, నృపాలభీ

దూరు, లసూయకుల్ చెనఁటి♦త్రొక్కుడుగూర్పరు లర్థతృష్ణ శ్రీఁ
గోరెడివారు? వీరిఁ బతి ♦ గూల్పఁడ యేనియుఁ జచ్చు వారిచేన్. ౨౨౬

తే. హృష్టుఁడును శూరవరుఁడును♦ధృతియుతుండు,సత్కులుండును సుమతి ప్ర♦శస్తశుచియు
దక్షుఁడును బ్రీతి గలవాఁడు ♦ దండనాథుఁ, డగుచు వఱలు నె నీ కిష్టు♦ సుగుణలోల!

చం. బలయుతులా, పరాక్రమవి♦భాసితులా, రణకేళిదక్షులా,
తొలిఁ దమపౌరుషంబులను ♦ దోఁపఁగఁ జేసినవారె, సైన్యము
ఖ్యులు? నటువంటివారలకుఁ ♦ గూర్తె ముదంబును బారితోషికం
బుల సతులన్ సృపాత్మభవ ♦ పోణిమి నీవయిఁ గూర్చి యొక్కఁగన్? ౨౨౭

ఉ. జీతము బత్తె మిచ్చెదవె ♦ సేవకకోటికిఁ గ్రస్తకాలమం,
దాశతకాలయాపన మొ♦కప్పుడుఁ జేయవు గాదె? వేళకున్
వేతన మీయకున్నట్టిపతి♦ని గ్గినకం గినుచుండు రాభటుల్
ప్రీతి దొలంగి లిట్టుదసు ♦ పెక్కులుకీడులు పుట్టు దానిచేన్. ౨౨౮

కం కులజులు ప్రధానులును ని,శ్చలరక్తి న్నున్నఁ గంప్రె ♦ సమయం బైనన్
గలసను నీకై ప్రాణం,బుల నీయఁ గడంగుదురె ప్ర♦భూత్రప్రీతిన్? ౨౨౯

కం మనజనపదమునఁ బుట్టిన,మనుజుం బండితు యథోక్త♦మార్గస్థిరు ద
క్షిణుఁ బ్రతిభాయుతు నీమా,తనుగా నొనరింతె కార్య♦తత్పరమతివై. ౨౩౦

సీ. పరపక్షమున మంత్రి♦పరిపురోహితయువ,రాజసేనానికా♦రాగృహాధి
పతి లోనుగాఁ గల♦పదియెనిమండ్రఁ దీ,ర్థాఖ్యులఁ దనపక్ష♦మందు మొదటి
మూవుర విడి పదు♦నేవురన్నత్తంబు, లరయఁ జారులను ము♦వ్వురను బరుల
కును దమలోఁ దము♦కును నెఱుంగఁగ రాని,యట్టుల నియమింతె ♦ యమలచరిత

ఆ. పగతుఁ డగుటఁ నెఱుఁ♦బడి మున్ను గర్వంబు, చెడియు మరలనిన్నుఁ ♦ జేరె నేని
యబలుఁ డనుచు వాని ♦ నవమానదృష్టిని, జూడకుందు వయ్య ♦ సుగుణభూప.

కం.లోకాయతికుల విప్రుల, నేకాలమునందుఁ గొలువ♦వే కద? వార
స్తోకానర్థచణుల్ సుమి, ప్రాకటవిపరీతమతులుఁ ♦ బండితమానుల్. ౨౩౧

ఆ. విద్యమానముఖ్య♦వివిధధర్మాగమ,విధుల దుర్బుధులును ♦ వికటశుష్క
వాదరతులు గాన ♦ వారితో సాంగత్య, మొదలి యుంట మేలు ♦ పుడమిపతికి.

సీ. వరదృఢద్వారంబు ♦ వారణఘోటక,రథసంకులం బయి ♦ క్రాలుదాని
సంతతోత్సాహులు ♦ సంజితేంద్రియు లార్యు, లాత్మకర్మరతులు ♦ నైనవిప్ర
రాజ్ఞవైశ్యజనులచే ♦ రాజిత మవుదాని, బహువిధప్రాసాద♦పటలి గలిగి
నైన్యజనాప్తిని ♦ హృద్య మౌదానిని, నిత్యసంతుష్టిని ♦ నెగడుదాని

తే. వీరు లగుమనపూర్వులు ♦ విహితరీతిఁ, బాలనము సేసి నట్టియా ♦ పట్టణంబు
మనయయోధ్యను[1] సార్థక ♦ మహితనామ్ని,కగను బాలింతువే తండ్రి! ♦ కరముఁ బ్రీతి.

సీ. నిలుకడ నెలవుల ♦ నెలకొన్న వారిచే, శతయజ్ఞకలితసు ♦ స్థలులచేత
దేవాలయప్రపా ♦ పావనసరసుల, సంహృష్టనరపుణ్య ♦ సతులచేత
నొప్పుగా వరసమా ♦ జోత్సవంబులచేత, నాకృష్టపశుసమూ ♦ హములచేత
సంతతాహింసక ♦ జనసంఘములచేత, వాన నమ్మని శాల్య ♦ వనులచేత

తే. సత్త్వములు లేక సహ్యానయ ♦ జనులచేత, వీతభయులైనపౌరుల ♦ వేలచేతఁ
గనకమణిశాస్త్రభాసిత ♦ ఖనులచేత, నొప్పు మనసీమ సుఖముగ ♦ నున్నదయ్య?

తే. దున్నియును జీవనము చేయు ♦ చున్నవారి, పసువులను మేపుకొనుచును ♦ బ్రతుకువారి
పట్లఁ బ్రీతి వహింపుదే ♦ నగ్రకమున, బ్రదుకునీయాశ్రితులకు శు ♦ భంబు గలదె?

కం. ఇష్టంబుఁ గూర్చి వారి క,నిష్టంబును దీర్చి ప్రోతు ♦ వే? జనములు సం
తుష్టిని మన భూపతి విధి,దృష్టగతిం గాన వలయు ♦ నెవ్వరి నైనన్. ౨౨౭

కం. నీకాంతల మన్నింతువె? ప్రాకట రక్షితలె వారు ♦ వారలపలుకుల్
చేకొన కుందె? రహస్యం, బేకాంతమునందు నైన ♦ నెఱిఁగింపవుగా? ౨౨౮

కం. నాగవనము రక్షింతువె? బాగుగ ధేనుకలు[2] గలవె ♦ పట్టఁగఁ గరుల౯?
నాగాశ్వనశా[3]స్త్రనమున, నేగతి సంతుష్టి లేక ♦ యొసఁగుదువు కదా? ౨౨౯

కం. దినముదినంబును వఱువా,తను భూమీజనుల కెల్ల ♦ దర్శన మిడు దే?
యనుమానింతురు దేహం,బున కేమో నృపతి కనుచుఁ ♦ బొంచమాపనిచోన్.

కం. పనివాండ్రను విచ్చలవిడిఁ, దనుఁ జేరఁగ నీయరాదు ♦ తఱచుగ వారి౯
గనుఁగొనక యుండరా దిం,దును మధ్యమవృత్తి మేలు ♦ దొరలకుఁ బూనన్.

కం. ధనధాన్యతోయనాధన,వినిచయసంగతములే ప్ర ♦ వీరభటశరా
సనధరయుతములె శిల్పక, జనయుక్తము లౌనె దుర్గ ♦ చయములు భరతా? ౨౩౧

ఉ. ఆయము లున్నె దండిగ? వ్య ♦ యంబును స్వల్పము చేయుచుండు దే?
యేయెడ నీధనంబుఁ జన ♦ నీయవు గాదె యపాత్రులందు? నీ
వీయుదె యోధపాలిధిమ ♦ హీసురమిత్రులకు స్థనంబుల౯?
జేయుదె దేవతాపితృల ♦ చేతలకై ధనసంహపసాహ్యమున్? ౨౩౩

చం. అమలమనస్కుఁడుఁగా శుచియు ♦ నార్యుఁడు నైనొకఁడుండు చోరక
ర్మమునను దూషితుం డయినఁ ♦ బ్రాజ్ఞుల నీ విడుగంగఁ బోక లో
భమున వధింతువా? ఖలుఁడు ♦ పట్టుపడంగ సకారణంబ చౌ
ర్యమునకు వానిచే ధనము ♦ లంది వధింపక వీడవే కదా? ౨౩౪

1 ముఖ్యముగ ఉయుంప సహస్రమైనది యయోధ్య. 2 ధేనుక = ఆఁడేనుఁగు. 3 వశ = ఆఁడేనుఁగు.

కం. ధనికునకును ధనహీనున,కును వ్యవహారంబు పొసఁగఁ ♦ గుటిలత మంత్రుల్
ధనికునిరొక్కముపై నా,శను గొన కుండఁగఁ బరీక్ష♦నలుపుదె వారిన్? ౭౨౮౫
కం. దోసమును జేయ కుండియు, శాసింపఁగఁ బడినయట్టి♦జనములయశ్రుల్
వాసి చెడఁ జేయు భోగ్యై,కాసక్తు నృపాలుఁ బశుధ♦నాత్మజహీనున్. ౭౨౮౬
కం. బాలుర వృద్ధుల వైద్యుల, నోలిని వశ్యులుగఁ జేయు♦చుందువు కాదే
మేలిధనంబులఁ బ్రేమము,మై లలితోక్తులను మూఁడు♦మార్గంబులచేన్. ౭౨౮౭
కం. గురువృద్ధతాపసోర్వీ,సురచైత్యాతిథుల కెల్ల ♦ శుభసిద్ధార్థో
త్కర దేవతాళి కెల్లను, వరమతి వయి మ్రొక్కు చుందు♦వా కడుభక్తిన్? ౭౨౮౮
కం. అర్థముచే ధర్మంబును, నర్థము ధర్మంబుచేత ♦ నవి కామముచే
వ్యర్థంబులు గాకుండ న,నుష్ఠింతువె? సుఖము మరగి ♦ యవి చెఱుపవుగా?
కం. ఉదయంబున నర్థంబును, బదపడి ధర్మంబు ప్రొద్దు♦పడఁ గామం బ
య్యది యెఱిఁగి యనుష్ఠింతువె? మది చెడి కలయంగ నీకు♦మూ యొండొంటిన్.
తే. సర్వశాస్త్రార్థ నిపుణు లా♦త్మవిబుధులు, పౌరజానపదాళితోఁ ♦ బ్రత్యహంబు
నీవుధరమీఁద సుఖ వయి♦ నెగడుటకును, బ్రార్థనముఁ జేయుచున్నారె♦రాజతనయ.
సీ. అనృతంబుపలుకుట ♦ నాస్తిక బుద్ధియు, దీర్ఘసూత్రత క్రుధ ♦ ధీప్రమాద
మాలస్యమును జ్ఞాని♦పాళికి దర్శనం, బీయ కుండుట పంచ♦నృత్తితయును
గార్యంబుపట్ల నొ♦క్కండ యాలోచించు, టొట్టివానికి నెదు♦రేగు చుంట
నిశ్చితకార్యంబు ♦ నెఱవేర్పమియు సన,గ్రహాలతోడ మం♦త్రంబు సేత
తే. మంత్రమును రక్ష సేయమి ♦ మంగళంబు, లైనకార్యంబులందు న♦నాదరంబు
ననఁగఁ బరఁగెడిపదునాలు ♦ గైనరాజ,దోషములు లేక యుంటె సు♦స్పష్టచరిత.
కం. పదియును నైదును నాల్గై,న్గిది యేడును మూఁడు నైన♦నెఱిసర్గములన్
వదలక విద్యలమూఁటిని, మదిఁ దలఁతువె? యింద్రియముల ♦ మర్దించితివే?
తే. దైవమానుషవ్యసనము ♦ దలఁతు వయ్య? ప్రకృతిమండల వింశతి♦వర్గములను
మద్గుణంబుల యానంబు ♦ సంధి విగ్ర,హంబు యాత్రయు దండవి♦ధంబుఁ దలఁతె?
కం. నలువురొ మువ్వురొ మంత్రులు, కలయఁగ యోజింతె మంత్ర♦కార్యము లెల్లన్?
తెలిసికొని వారు వారలు,పలికెడివిధ మెల్ల నీవు ♦ భావింతె మదిన్? ౭౨౯౫
కం. ఫలయుతములె నీచదువులు? ఫలయుతములె నీధనములు ♦ పను లన్నియునున్?
ఫలయుతయే నీదారయు? ఫలయుతమే నీశ్రుతంబు ♦ ప్రాజ్ఞవతంసా? ౭౨౯౬
కం. ధర్మార్థకామసహితము, శర్మద మాయుష్యకరము ♦ జనవరతనయా
నిర్మలమతి నాచెప్పిన,కర్మంబుల నెల్ల జరుపఁ♦గా మదిఁ గొంటే. ౭౨౯౭

కం మనతండ్రియు మన తాతలు, మును నడచినయట్ల నడుతె ♦ మునుకొని శుభవృ
త్తిని జరియించెదు గాదే, యనఘస్థాస్తక ధర్మమార్గ ♦ మాచరితం బే? ౨౯౮

కం.విను మధురాహారంబులు, గొనవుగదా యొక్కరుఁడవె ♦ కూర్మిని నీమే
లును గోరుమిత్త్రవరులకు, ధనముల సంతుష్టి సేయు♦దా వలసినచోన్? ౨౯౯

కం.నరపాలుఁడు ధర్మంబునఁ, బరిపాలన సేసి ధరణిఁ ♦ బడపడి స్వర్గం
బరుగును గావున ధర్మము, ధరణీవరతనయ! విడువఁ ♦ దగ దే వేళన్. ౩౦౦

భరతుండు శ్రీరామునకు దశరథుండు మరణించుట దెల్పుట.

కం.ఆ వాక్యము విని భరతుం, డావాసవనిభునిఁ గాంచి ♦ యనె వినయమునన్
నావంటిధర్మహీనుఁడు, గావించునె రాజధర్మ♦కాండము లెల్లన్. ౩౦౧

చం.కలదు గదా సనాతనము♦గా మనలో నొక ధర్మ, మగ్రజుం
డిల మని యుండఁ బిన్న వహి♦యింపఁగరాదు ధరాభరంబు, స
ల్లలితసమస్తవస్తువిభ♦లాస కయోధ్యకు నాదు వెంబడిం
జెలువుగ నేగుదెంచి యభి♦షేకముఁ గైకొను ముత్సవంబుగన్. ౩౦౨

కం.జనపతి నరుఁ డనువారలె, యనుపమధర్మార్థసహిత ♦ మగునీవృత్తం
బు నమానుష మని చెప్పుట, ననఘా దేవుఁడ వటంచు ♦ నాత్మం దలఁతున్.

సీ. కేకయస్థాపతి♦గృహమున నే నుండ; జానకీలక్ష్మణ♦సహితముగను
నడవులకును నీవు ♦ నడచినయంతనే, దుఃఖాభిఘాతుఁడై ♦ దూర్ణముగను
మనతండ్రి స్వర్గంబుఁ ♦ జనె నెమ్ము తండ్రికి, నుదకంబు లిమ్ము మే ♦ ముభయులమును
గార్యంబులెల్ల ము ♦ న్నావించినారము, మీ రిరువురు సేయ ♦ మేకొనుండు
తే. ప్రియుఁడు నీళ్లను విడఁ దృప్తి ♦ ప్రేతములకు
గరముఁ బితృలోకమునను స♦తుష్టియ్య మగును
దండ్రికిని నీవు ప్రియుఁడవు ♦ తద్దగాన
నెమ్ము నీ వింకను నివాప ♦ మిమ్ము ప్రీతి. ౩౦౪

తరళము. నినుఁ దలంచియ యేప్పుచున్ మఱి ♦ నీదుదర్శనకాంక్షి యై,
నినుఁ దలంగకయున్నబుద్ధిని ♦ నేర కేమియుఁ ద్రిప్పఁగా,
ననఘ! నీవిడనాడుటన్, భవ♦దార్తిపీడితుఁ డౌచు, నీ
జనకుఁ డక్కట యస్తమించెను ♦ జాల నిన్నుస్మరించుచున్. ౩౦౫

పితృమరణంబు విని శ్రీరాముఁడు దుఃఖించుట.

చం.అని భరతుండు తండ్రి విల♦యంబును వాసవముక్తవజ్రపా
తనమునుబోనివాక్యముల ♦ దారుణరీతిని విన్పఁ గానసం
బున బలుగండ్రగొడ్డటను ♦ మూలముమట్టుగఁ ద్రుంపఁ ద్రెళ్లుపు
ష్పనిచయభూషితం బయిన♦పాదపమో యన వ్రాలె రాముఁడున్. ౩౦౬

ఉ. కూలముఁ గూలఁ ద్రోచి నెత♦గూరిన నిద్దుర పోవుదంతినా
వ్రాలినఁ జూచి తమ్ములును ♦ వారిజలోచన సీతయుం వ్యథా
జ్వాలలఁ గ్రాఁగి రామునకుఁ ♦ జల్లనినీటను దేహ మంతయుం
జాలఁగఁ దడ్పి; రంత రఘు♦చంద్రుఁడు మూర్ఛ దొలంగి దీనుఁ డై. ౨౩౦౭

ఉ. కన్నుల బాష్పపూర మెసఁ♦గం భరతుం గని యిట్లుపల్కె నే
మున్నది నా కయోధ్య నిఁక ♦ నుత్తముఁడా జనకుండు లేమి, లో
కోన్నతుఁ డేలినట్టిది య♦యోధ్య యిఁకం భరియింప నెవ్వఁ డో
యన్న సమర్థుఁ, డాదిభుజ♦గాధిపుభారము నేది మోసెడిన్? ౨౩౦౮

కం. ననుఁగూర్చి వనవి చచ్చిన,జనకుని సంస్కారవిధులు ♦ సలుపనిననుఁబోల్
తనయుఁడు దుర్జాతుం డా,ఘనమతికిం బుట్టి యేమి♦కార్యము చెపుమా. ౨౩౦౯

కం. భరతా! శత్రుఘ్నునితోఁ, బొరి జనకునిప్రేతకృత్య♦ములు దీర్చితి వీ
వరయఁగ ధన్యుఁడు నా కా,పరమం బగుపుణ్య మబ్బు ♦ భాగ్యము లేదే. ౨౩౧౦

ఆ. దిక్కు లేక జనులు ♦ దీను లై చీకాకు,పడుచు నున్న పురికి ♦ వ్రతము విడవ
నైన నందుఁ దండ్రి ♦ లేనికారణమున, మరలి వచ్చుటకును ♦ మనను రాదు ౨౩౧౧

కం. వనవాసము సంపూర్ణము,గను జలిపి యయోధ్య కేను ♦ గ్రమ్మఱ నన్నుం
గని దిద్దెడివా రెవ్వరు, జనకుఁడు లోకాంతరంబుఁ ♦ జనుటను భరతా. ౨౩౧౨

కం. మును కృతసత్కార్యుని ననుఁ, దనతోడఁ గూర్చుండఁ బెట్టి ♦ తండ్రి సుధోక్తుల్
విన నాడు శ్రవణసుఖముగ, విన నేర్తునె యింక నెన్ని♦విధముల వానిన్. ౨౩౧౩

ఉ. హా యని భార్యదిక్కు మొగ♦మై తరుణీ! యిఁక నీకు మామ లేఁ
డాయెనుగా, యిఁ కెవ్వరిని ♦ నాఁడెదు మామ యటంచు, లక్ష్మణా!
నాయన లేనివాఁడ వయి♦నాఁడెవుగా, యని యశ్రుపూరపూ
ర్ణాయతలోచనుం డగుచు ♦ నారఘువీరుఁడు పల్లటిల్లఁగన్. ౨౩౧౪

కం ధరణీతనయాదివు లతి,కరుణోక్తుల నాలకించి ♦ కాకుత్స్థులు ని
ర్భరశోకముసం గుందిరి, ధరణీశ్వరుఁ దలఁచి తలఁచి ♦ తముపుపులందున్. ౨౩౧౫

కం ఉన్మలికిం దురపిల్లు[illegible]ముఁ, దమ్ములు చెప్పి సునాంత్వ♦తరవాక్యములఁ గా
ర్యమ్మిఁక జనకునకు సనా, [illegible] నొసంగి నగరి ♦ ఫలమా యనుచున్.

ఉ. మామ [illegible]ంబుఁ జేరెనసు♦మాట చెపం బు నాకు జానకీ
భామిని యశ్రుపేరిమునఁ ♦ [illegible] గని నేరి చెప్పుచుం
రాముఁడు నామెఁ దేర్చి [illegible]సు♦సంబులు వాఁడఁగ నేడ్చుచుండఁగా
ప్రేముడిఁ బిల్చి తండ్రికిని ♦ నీళ్లు వి[illegible]ం జనువాఁడఁ దమ్ముఁడా. ౨౩౧౬

ఉ. చీరము గారపిండియును ♦ జెచ్చెరఁ జేర్పుము, పోవ నిమ్ము ముం
దీరమణీమణిం, బిదప ♦ నేగుము నీ, నటువెన్క వచ్చెదన్,
దారుణ మైనకార్యముల ♦ ధర్మపథం బిది, యంచుఁ బోవుచో
వారల నందునున్న తగు♦వారలు దేర్చిరి సాంత్వవాక్యలన్. ౨౩౧౮

కం. దాంతుండును విదితాత్ముఁడు, శాంతుండును రామభక్తి♦సంపన్నుఁడు స
త్స్వాంతుఁడు నిత్యానుగధీ,మంతుండు సుమంత్రుఁ డల్ల♦మాటలఁ దేర్చెన్.

సీ. వారు దుర్గఖంబునఁ ♦ బాదము ల్దడఁబడ, రమ్యపుష్పితవన♦రాజిరాజి
తంబు సుతీర్థ మై ♦ యిం పైనమందాకి,నీనది డాయుచు ♦ నిగ్గలంబు
శివమును నై కడు♦శీఘ్రంబునను బాఱు, చారుతీర్థమున య♦శస్వివరులు
ధరణీశు మదిలోనఁ ♦ దలఁచుచు నివె నీకు, నివె నీకు ననుచును ♦ నిడిరి జలము
ఆ. లంత రామచంద్రుఁ ♦ డంజలి నుదకంబుఁ, దీసికొనుచు యామ్య♦దిశకుఁ దిరిగి
చటులశోకభార♦సంతప్తుఁ డగుచును, జనకుఁ గూర్చి యిట్టు ♦ లనుచుఁ బలికె.

రామలక్ష్మణులు దండ్రికి నివాపంబు లిచ్చుట.

కం. నే నొసఁగెడువిమలం బగు,నీనీరమ్ము పితృలోక ♦ మేగిన నీకున్
మానుగ నక్షయసుఖసం,ధానచణం బగును గాతఁ ♦ దండ్రీ యచటన్. ౨౩౨౧

కం. అని మందాకినితీరం,బున రాముఁడు భ్రాతృయుక్త♦ముగను నివాపం
బును విడిచి యొంటుకడకుం, జని యచ్చట నొక్క దర్భ♦సంస్తరసీమన్. ౨౩౨౨

తే. గారపిండియు రేఁగును ♦ గలిపి పిండ,ములనునిల్పి నీ తేశుండు ♦ దలఁచి తండ్రిఁ
గన్నులను నీరు జడిగొని♦కాఱు చుండ, నిట్టు లనుఁ బిండములఁ జూపి♦నృథతరాష్ట

కం పురుషున కన్నం బెది యా,పురుషుని దేవతకు నదియు ♦ భుక్తి య టౌటన్
నరవర! భుజియింపుము కడుఁ, బెరిమన్ మా కిన్న మైన♦పిణ్యాకంబున్. ౨౩౨౪

సీ. అనుచుఁ గర్తవ్యక్రి♦యల నెల్లఁ దీరిచి, క్రమ్మఱి చనియెఁ బ♦ర్వతము నెక్కి
యాకుటింటిని జేరి ♦ హా యని భరతల,క్ష్మణులను గ్రుచ్చి శో♦కంబు గదుర
విలపింప వారల ♦ విపులారవంబున, ధరణీధరము ప్రతి♦ధ్వనుల నీనె
నది విని భరతు సై♦న్యంబులు భీతిల్లి, భరతుండు శ్రీరామ♦ భద్రుఁ జూచెఁ
తే. గావున నెపుట్టె నింతటి♦కలకలమ్ము, వినియెఁ గాఁబోలుఁ దమతండ్రి ♦ చనుట దివికి
ననుచు వారలు వారివా♦హనము లంద, వీడి పరు వెత్తి రాధ్వని♦జాడఁ బట్టి. ౨౩౨౫

పౌరులు శ్రీరామునిపర్ణశాలకుఁ బోవుట.

కం. కొందఱు గుఱ్ఱంబులపైఁ, గొందఱు నాగములమీఁదఁ ♦ గొందఱు తేర్లన్
గ్రందుగ సుకుమారులు చన, నందఱుఁ గాల్నడన పోయి ♦ రాస్థలమునకై.

కం. మొన్ననె విడిచినరాముని, నెన్నాళ్లో యయిన యట్టు ♦ లేఁ కారుచు వే
గోన్నతి నాశ్రమమున కా,యన్నలఁ దమ్ములను జూడ ♦ నరిగిరి లోకుల్. ౨౩౨౮
కం. భ్రాతలసమాగమంబును, జేతగ్ల ప్రీతిగను జూడఁ ♦ జెచ్చెరఁ జనఁగా
జాతిఘురనేమిరావ, వ్రాతము దలఁచించె జలధ♦రసమాగమమున్. ౨౩౨౯
కం. గడబడ దడబడ నులివ్రుఁ, దొడిఁబడి యశ్వాసలోని♦దుంతెలు దంతుల్
బెడిదపుఁబులులుం బాములు, గడగడ కొం డదురఁ బాఱె ♦ గవయన్మృకంబుల్.
కం. చక్రంబులచక్రంబులు, చక్రాంగంబులును సార♦సంబులు నత్యు
హ్యక్రోంచంబులు మింట న,నక్రగతిం గూయఁ దొడఁగె ♦ నదలనిభీతిన్. ౨౩౩౦
కం. ఖగములు తారాపథమున, మృగములు మనుజులును నేల ♦ నెల్లెడఁ గ్రమ్మన్
వగ నేలఁ గూరుచుండిన, సుగుణిమణిన్ రాము నచటఁ ♦ జూచెను జనముల్.
కం. తిట్టుచుఁ గైకను మంథరఁ, బుట్టెఁడు బొప్పములఁ గనులు ♦ పూరటిలంగా
నట్టెఁ గనుంగొని రామునిఁ, గట్టా యని యెల్లవారుఁ ♦ గాఱియపడఁగన్. ౨౩౩౨
ఉ. వారలఁ జూచి రాజజన♦వర్యుఁడు తండ్రిని దల్లినిం బలెన్
గూరిమిఁ గౌఁగిలించుకొనఁ ♦ గొందఱు రామునిఁ గూర్చఁ గౌఁగిటం
బౌరులు కొంద ఱాయపఘు ♦ మాటికి మ్రొక్కిరి, బంధులన్ సుహృ
ద్వారము నాదరించెఁ దగు♦భంగుల రాముఁడు సాదరంబుగన్. ౨౩౩౩
కం. వారల యేడుపుటులివు ల,వారితమై మిన్ను మన్ను ♦ వారక నిండన్
గౌరికగుహలు మృదంగ, స్ఫారరవములట్టు లిచ్చెఁ ♦ బ్రతినిస్వనముల్. ౨౩౩౪

కౌసల్య సుమిత్రకు రామలక్ష్మణుల యేటినీటి రేవుఁ జూపి దుఃఖించుట.

కం. అంతట దశరథధరణీ,కాంతుని కామినులు మున్న♦గా భూతనయా
కాంతునిఁ గనఁగ వసిష్ఠుం,డెంతే ముదమునను వచ్చె♦నెడ మార్గమునన్. ౨౩౩౫
సీ. దేవు లెల్లరుఁ దివ్య♦తిన్ననినడకల, మందాకినీకూల♦మందుఁ జనుచు
రామలక్ష్మణసేవి♦తామలతీర్థంబుఁ, గనుఁగొనఁ గౌసల్య ♦ కనుల వారి
ధారలు గురియంగఁ ♦ దనపజ్జ నచ్చుసు,మిత్రాదిసతులకు ♦ మెల్ల ననియెఁ
జపురాజ్యముపనుండి ♦ తఱుముఁగొట్టంబడి, నట్టి యనాథులు ♦ ననఘచరితు
ఆ. లంబువులకుఁ గాను ♦ నరుగుదెంచెడి రేవు,చూడుఁ డిదియ యసుగు ♦ జాడ లొప్పె
రాకపోకకలిమి ♦ రాపడి యున్నది, కంటివే సుమిత్ర ♦ కష్టపాటు. ౨౩౩౬
కం. నాకొడుకు నిమిత్తా బై, నీకొడుకు కిటనుండి దినము ♦ నీళ్లం బ్రీతిం
జేకొని పోవుఁ గదా య,స్తోకాత్మం బ్రతను దాన ♦ సుమహితచరితా! ౨౩౩౭
సీ. ఇది నీచకర్మంబ ♦ యీ హేతువున నీవు,పుత్త్రు గర్హింపదు ♦ భువనవిథలి
యన్నసేవయె పర♦మార్థముం చతఁ డట్లు, చేయు నానుగుణికే ♦ చెల్లు నదియు
నాతనిఋఁకష్ట ♦ మంతయుఁ దీఱదే, భరతుండు కోరిక ♦ పడసె నేని
యని యేగుచును దక్షి♦ణాగ్రదర్భలమీఁద, జనకునకై రాము♦చంద్రుఁ డిడిన

తే. యట్టియింగుదిపిణ్యాక • మతివ చూచి, తోడనుండెడి దశరథు•చేడలఁ గని
యనియెఁ గంటిరె జనకున•కై రఘూత్తముండు సవిధిగఁ బెట్టిన•పిండములను.

ఉ. దేవసమానుఁ డైనజగ•తీపతివర్యుఁడు శక్రభోగసం
భావితుఁ డార్యమూర్తి పరి•పాలితసాగరవేష్టితక్షముం
డేవిధి గారపిండి తిను • నియ్యవి రామునివంటిపుత్త్రుఁ డు
ర్వీవిభుఁ డైనతండ్రి కిడె • వే లోకదుఃఖము భూమి నున్నదే. ౨౩౯

కం. అంగద! రాముఁడు దండ్రికి, నింగుదిపిణ్యాకపిండ • మిడుటను గన్నా
రం గాంచియు నాడెంద మ,భంగురదుఃఖమున వేయి•పఱియలు గాదే. ౨౪౦

కం. అన్నం బెది పురుషున కా,యన్నమె తద్దేవతలకు • నను వేదోక్తిన్
మున్ను విని యుంటి మిప్పుడు, కన్నారఁగ సత్య మనుచుఁ • గనుఁగొను టయ్యెన్.

కౌసల్యాదులు శ్రీరాముని జూచుట.

చం. అని యిటు లార్తిఁ గూర సవ•తాండ్రను దేర్చుచుఁ బోయి యాశ్రమం
బున దివి వీడినట్టిసుర•పుంగవుఁ బోలెడిత్యక్తభోగు రా
మునిఁ గని గొల్లు మంచు వెత • మున్గి రవంబుగ నేడ్వ రాముఁడున్
జనులపాదపద్మములఁ • జయ్యన వ్రాలి నమస్కరించినన్. ౨౪౨

కం. వారు సుఖస్పర్శములగు,హారిమృదులపాణులన్ ని•జాంగుళులన్ సీ
తారమణీశు వీఁపుదు,మారముఁ బోఁదుడిచి రంత • మాతలఁ గనుచున్. ౨౪౩

సీ. సౌమిత్త్రి దుఃఖించి • సాష్టాంగ మెరఁగిన, నాతని రఘురాము • నట్లచేయ
జానకి చనుదెంచి • సంతప్తహృదయ యై, యత్తల కెల్లను • నత్తు లురల
మ్రొక్కి నిల్చుండిన • నక్కటికంబునఁ, దల్లి కూఁతునుబోలెఁ, • దద్ద గ్రుచ్చి
వనవాసకృశ దీన • వామాక్షి వీక్షించి, కౌసల్య పల్కు స•గద్గదముగఁ

ఆ. దండ్రి జనకరాజు • దశరథేశుఁడు మామ, రామచంద్రవిభుఁడు • ప్రాణధవుఁడు
నైననీవు నిట్టి•యడవులలో నెట్లు, దుఃఖపడెదవమ్మ • తోయజాక్షి! ౨౪౪

ఉ. వాడినకల్వ, యెండ ధర • వ్రాలి కృశించినతమ్మి, ధూళిచేఁ
గూడినజాతిరూపము, మొ•గుల్ గుమి మాటినచందురుండు నాఁ
జూడఁగ నీమొగంబు భృశ•శోకభరారణిజాగ్ని కాల్చెడిన్
దూడిగ నన్నుఁ గాష్ఠమును • దూకుముగా శుచి గాల్చు కైవడిన్. ౨౪౫

సీ. అనుచు నీగతిఁ దల్లి • యడలుచు నుండఁగ, జంభారి దేవతా•చార్యునకును
మ్రొక్కునరీతిని • మ్రొక్కి శ్రీరాముఁడు, శిష్టవినుతుఁడు వ•సిష్ఠునకును
నాతనితోడుత • నాసీనుఁ డైనను, భరతుండు నిజమంత్రి•పౌరయుతము
గాఁగఁ గూర్చుండెఁ దాఁ•గరములు మోడిచి,భరతుఁ డేమనిరాము•భద్రుమ్రొక్కి

ఆ. పలుకు వింద మనుచుఁ ♦ బ్రజలు వీనులు విచ్చి, వినుచు నుండ రాముఁ ♦ డనుజు లైన
భరతలక్ష్మణులును ♦ పౌరులతో సభ్య, యుక్తవచనవహ్ని ♦ లొప్పఁ గనిరి.

⟵ శ్రీరాముఁడు భరతునిరాకకుఁ గారణం బడుగుట. ⟶

కం గురువత్సలుఁ డగుతమ్ముఁడు, భరతుఁడు తనుఁ జూడవచ్చు ♦ భావము సీతా
వరుఁ డెఱిఁగి కౌఁగిలించుచు, సరసగతిని నడుగఁదొడఁగె ♦ సహలక్ష్మణుఁడై.

ఉ. ఏమిది నీవ మాకు వచి♦యింప విరాళ మన సయ్యె, నేల యీ
భూమికి నీవు వచ్చితివి ♦ పూనితి వేల జటాజినంబు? నీ
వేమియి నారచీరల వ♦హింపఁగ నేటికి? రాజ్య మిట్లు నీ
వే మని వీడి తన్నన ని♦యెఁ భరతుం డిటు కేలుమోడ్పుతోన్. ౨౩౪౮

సీ. అన్న! చేయఁగ రాని♦యట్టికార్యముఁ జేసి, మిముఁ బాసి వెనుక భూ♦మీధవుండు
పుత్రశోకంబున ♦ గాత్రంబు దొఱఁగెను, నాయంబ ప్రేరింప ♦ నారి యనక
యామాటఁ బాటించి ♦ యూర్జితశోవార, మగుమహాపాపంబు ♦ నాచరించె
రాజ్యఫలంబును ♦ బ్రాపింపమియ కాక, విధవ యై యేడ్చుచు ♦ విపులఘోర

తే. నిరయమునఁ బడు నాతల్లి ♦ నిష్ఠురాత్మ, యట్టియపవాదనిహతుండ ♦ నైనవన్ను
నీదుదాసుఁ బ్రసాదింప ♦ నీకుఁ జెల్లు, మఘువుపోలిక రాజ్యంబు ♦ మరలఁ గొనుము.

కం. కలప్రకృతిజనములును విధ, వలు నగు మనతల్లు లెల్ల ♦ వచ్చిరి వీరే
కులభూషణ! నినుఁ గన ని,ష్కలుషాత్మక! మమ్ముఁ గరుణఁ ♦ గనుఁగొనఁ గదవే.

తే. పెద్దవాఁ డుండ రా జయి ♦ పిన్నతమ్ముఁ, డలరుటలు మనవంశము♦ర్యాద యగునె?
భరణవరుఁడ వీవ యీ♦ధరణి నెల్ల, రాజ వై సల్పుమా హిత♦రంజనంబు.

కం. కైరవబాంధవుచేతను, శారదనిశవోలె నిన్ను ♦ జనపతిఁగా నీ
ధారిణి పొంది సనాథగ, సారసదళనేత్ర! వెలుఁగు ♦ జనహర్ష దయై. ౨౩౫౨

కం నీసోదరుఁడన్ శిష్యుఁడ, దాసుఁడ సచివాళితో యు♦థా యోగ్యగతిన్
నే సాష్టాంగనమస్కృతి, తో సాధువతంస! వేఁడు♦దున్ దయఁ గనుమీ. ౨౩౫౩

కం. పూజితమై శాశ్వతమై, రాజిలి పిత్ర్యంబు నైన ♦ ప్రజప్రార్థనమున్
భూజనవత్సల! మీఱన్, యోజన సేయంగ నీకు ♦ యోగ్యం బగునే. ౨౩౫౪

⟵ శ్రీరాముఁడు భరతునితో నీవు నిర్దోషి వని చెప్పుట. ⟶

చం. అని కనులందు శోకజల ♦ మల్ల దొనంకఁగఁ బాదపీఠిపైఁ
దనశిరమున్ ఘటించి పడి ♦ తద్దయు నూర్చుచు నున్నతమ్మునిన్
గనుఁగొని లేవ నెత్తి తన♦కౌఁగిటఁ గ్రుచ్చి వచించెఁ దమ్ముఁడా!
చనునె భవాదృశుం డిటులు ♦ సల్పఁగ? నే మనువారు పామరుల్? ౨౩౫౫

కం. కులజుండవు సాత్త్వికుఁడవు, నలఘువ్రతరతుఁడవును మ♦హాతేజుఁడ వీ
విల కై యింతటిపాపముఁ, దలపెట్టఁగ నైన నీకుఁ ♦ దర మెట్టులగున్? ౨౩౫౬

ఉ. కావునఁ గొంచెమైన నప♦కారము నీయెడ లే దెఱుంగుదుర్
నీవును బాల్యహేతువున ♦ నీజననిం దగ దిట్టు చిట్టు, న
న్నా! విపరీతమా సుమతు ♦ లైనను దా రెద మెచ్చ్చుదారపు
త్రాచలిపట్ల స్వేచ్ఛమెయి ♦ నాదర ముంచుట కైకనందనా? ౨౩౫౭

కం కొడుకులు భార్యలు శిష్యులుఁ, బుడమిని నేగతిఁ జరింపఁ♦బోలు నటంచున్
నొడువుదురో సాధువు లా,నడువున మనతండ్రిపట్ల ♦ వలదే మనకున్. ౨౩౫౮

కం.ధరణీభరణంబున నే,కరణిని నర్హుండొ నిలుపఁ ♦ గానల నను నా
కరణిం గృష్ణాజినములు, ధరియించి చరింపు మనఁగ ♦ దండ్రి తగండే? ౨౩౫౯

తే. ధర్మమార్గవిదుం డైన♦తండ్రియందు, మనము జను లెన్నగౌరవం ♦ బునిచినట్లు
ధర్మభృచ్ఛ్రేష్ఠ! మనకును ♦ దల్లి యందు, గౌరవం బుంప మర్యాద♦గాదె చెపుమ?

ఆ. ధర్మశీలురైన♦తల్లియుఁ దండ్రియు, రాఘ! పొమ్ము నీ వ♦రణ్యమునకు
ననుచు నాజ్ఞ సేయ ♦ నా యాజ్ఞ మీఱంగ, నాకు నర్హమగునె ♦ న్యాయ్యచరిత?

తే. నీవు రాజ్య మయోధ్యలో♦నెమ్మిఁ దాల్చి,ఘనజనసత్కృతిఁబొందుము♦పూజ్యచరిత!
దండకారణ్యవాటి నే ♦ నుండువాఁడ, వల్కలాజినములు దాల్చి ♦ యల్కలేక.

కం.లోక మెఱుంగఁగ జనకుం, డీకరణి విభాగపఱిచి ♦ యేగెన్ దివికిన్
నీ కిచ్చినభాగము నే, జేకొన ధర్మంబె నీవ ♦ చెప్పుము భరతా! ౨౩౬౩

కం.లోకగురుఁడు ధర్మాత్ముఁడు, నీకుఁ బ్రమాణంబ కాదె ♦ నియతి జనకుఁడున్?
నీ కతఁ డిచ్చినభాగము, నీ కుపభోగింప కుంట ♦ నీతియు నగునే? ౨౩౬౪

కం.జనకప్రదభాగం బీ,వనవాసము నాకు దీనిఁ ♦ బదునాల్గేఁడుల్
వనిఁ దీర్చుచు గురుహితమని, మనమునఁ దలపోయువాఁడ ♦ మానితచరితా!

కం.నరలోక సత్కృతుఁడు సుర,వరసన్నిభుఁ డైనతండ్రి ♦ పలికిన యదియే
పరమాత్మహితము లోకే,శ్వరభావం బైన నాకు ♦ సంతస మిదునే? ౨౩౬౬

భరతుండు శ్రీరాముని రాజ్యంబు గ్రహింపఁ బ్రార్థించుట.

కం.ఆనాఁటిరాత్రి యీగతి, మానవసింహులకు దుర్గఖ♦మయ మై చనియెన్
భానుం డుదయించిన నది,లో నిష్ఠను జపతపంబు♦లుం దీర్చి వెసన్. ౨౩౬౭

ఉ. రామునిఁ గొల్చి యుండిరి న♦గప్రవరుల్ హితమంత్రియుక్తి, నా
స్తోమమునందుఁ గొంతవడి ♦ మూపఱునం దొకరుండు నేని యే
దేమియుఁ బల్కకుండె,మఱి ♦ జ్యేష్ఠునిఁ గన్గొని కైకపట్టియుం
బ్రేమయు భక్తిగౌరవముఁ ♦ బెంపుఁ గనంబడఁ బల్కె నీగతిన్. ౨౩౬౮

ఉ. చెప్పితి బుద్ధిఁ దల్లికిని ♦ జెన్నఁటిరీతిని నాకు దత్త మై
వి ప్పుగుభాగ్యయుక్తపృథి♦వీస్థలి మీకు నొసంగువాఁడ నై
యిప్పునిఁ బూని వచ్చితి న♦హీనగుణాఢ్య! యకంటకంబు నో
నిప్పుడమిన్ గ్రహించి యవ♦నీశ్వర! నన్నుఁ గృతార్థుఁ జేయవే. ౨౩౬౯

ఆ. వానకాలమునఁ బ్ర♦వాహవేగంబునఁ, గట్టఁ దెంచుకొనుచు ♦ నట్టె వచ్చు
వెల్లినాఁపరాని♦విధమున నీరాజ్య, మీవు దక్క నితరుఁ ♦ డేల లేఁడు. ౨౩౭౦
కం.తురగమునడకను ఖరమును, గరుడునిగమనంబుభంగిఁ ♦ గాకము పోలన్
దర మగునే? యట్టులు నీ,వరమార్గము నెనయ నాకు ♦ వశమే దేవా? ౨౩౭౧
కం.పరతంత్రుఁ డగుచు రక్షణ,భర మెఱుఁగక యుండువాని ♦ బ్రదు కే సుఖ మౌఁ,
బరరక్షాభరమును దన,శిరమునఁ గలవాఁడు కష్ట♦జీవియ సుమ్మీ. ౨౩౭౨
చ. పురుషుఁడు విత్తి నద్ది పెను♦భూరుహమై మఱుగుజ్జువానికిన్
నరగతి నెక్కరానిగతి ♦ వర్ధిలుచు న్ననుఁబూత పూచియున్
బరమఫలాన్వితంబు నయి ♦ వాలక యుండినఁ జెట్టుఁ బెంచు న
ప్పురుషున కేమి సంతసము ♦ పుట్టఁగఁ జాలునొ యూహ సేయుమా. ౨౩౭౩
తే. రామ మాకెల్లరకు నీవ ♦ రక్షకుఁడవు, నీదుభృత్యుల మగుమమ్ము ♦ నీవ యేలఁ
బూనవేనియుఁ జైత్యర్థ♦మునకు నుపమ, యిదిమహాభుజ! తక్కిన♦దెఱుఁగుమీవ.
తే. రాజ్యసింహాసనస్థు న♦రాతిదమను, నిన్నుఁ గాంచెడివారలు ♦ నెమ్మితోడ
రాష్ట్రమునవారు సచివులు ♦ రాజవర్య, నిండు తేజున వెలుఁగుమా♦ర్తండు నట్లు.
కం.నిను ననుసరించి వచ్చుచు, మనుజర్షభ! సింధురములు ♦ మదమున గీఁకల్
నినుచును నంతఃపురగత, వనితలు మోదమునఁ బొంగి♦పడెదరు తృప్తిన్. ౨౩౭౬
కం.అనవుడు రాముని భరతుఁడు, వినయంబున వేఁడుచున్న ♦ విధముం గని మే
లని శ్లాఘించెను నాగర,జనములు తద్వచనరచన ♦ సంతసపడుచున్. ౨౩౭౭
కం.విని దీనాలాపంబులఁ, దను నార్తిని వేఁడుచున్న♦తమ్ముని గని యిం
పెసయంగ ననునయించుచు, వినియతచిత్తుండు రామ♦విభుఁ డిట్లనియెన్. ౨౩౭౮

## శ్రీరాముఁడు భరతునకు దుఃఖోపశాంతివాక్యంబులు చెప్పుట.

కం.తమ్ముఁడ! నరునకు స్వాతం,త్ర్యమ్మున్నదె యెన్నఁడైనఁ ♦ దనయిచ్చను లో
కమ్మునఁ గృతాంతుఁ డిట్టటు, దిమ్మెయి నమ్మెయిని లాగి ♦ యులయించుఁ జుమీ.
కం.ధనములు నిధనాంతంబులు, విను వృద్ధిసమస్థములును ♦ విలయాంతంబుల్
జననము మరణాంతం బగు, నొనరెడిసంయోగములు వి♦యోగాంతంబుల్.
ఆ. పక్వఫలమునకును ♦ బడిపోవుటయె తక్క, వేఱుభయము లేని♦విధముగాఁగ
ధరణిఁ బుట్టినట్టి♦నరునకుఁ జావు దక్కంగ నొండుభయము♦గాన రాదు. ౨౩౮౧
కం.బలితపుఁగంబంబులు గల,నిలయము కాలక్రమమున ♦ నెఱిచెడురీతిన్
బొలుపు చెడం బురుషుఁడు ముదు,సలితనమునఁ జావుచేత ♦ సమయుం జుమ్మీ.
కం.కడచిన రే యంతటితోఁ, గడచనియెం గాక మరలఁ ♦ గ్రమ్మఱునే యొ
క్కుడుజలములఁ గళవళపడు,కడలిఁ గలిసి నిండుయమున ♦ గ్రమ్మఱు నొక్కో.

చం. పవలును రేయి పోవుచును ♦ ప్రాణులయాయువు నాహరించెడిన్
రవియు నిదాఘవేళ స్వక♦రంబుల వేఁడిమి నంబుజాలమున్
దివియువిధాన, న ట్లగుట ♦ నీకయి యేడ్వ మి కేల యొడ్లకై
తవిలినచింత నేడ్చెదవు ♦ తమ్ముఁడ! యాయువు శాశ్వతం బొకో. ౨౩౮౪

కం పొడమిన మడియుట సిద్ధము, నడచినయే న్నిలిచియుండి♦నన్ వడి క్షీణిం
చెడి నీయాయువు; జన్మము, గడ తేఱెడిమార్గ మేదొ ♦ కనుఁగొను మనుజా. ౨౩౮౫

కం పురుషునితోఁ బుట్టును మృతి, పురుషునితోఁ గూడియుండుఁ ♦ బురుషునితోడన్
దిరుగుచు నుండును దవ్వుగఁ, బురుషునితో నేగు మరలు ♦ బుద్ధిం గనుమీ. ౨౩౮౬

కం. ముడుతలు పడ నొడ లెల్లను, దడఁబడఁ బాదములు వెండి ♦ తల తెల్లపడన్
మిడి కెడి వేళను నీ వే,నడుపున నినుఁ గాచికొనఁగ ♦ వలఁతివొ చెపుమా. ౨౩౮౭

కం ఇదె పుట్టె సూర్యుఁ డంచును, నదె సూర్యుం డస్తమించె ♦ నంచును లోకుల్
మునమునఁ జూతురు; తమతమ, బ్రదుకులు క్షీణంబు లగుట ♦ పరికింప రయో.

కం. ఋతు వొకటి పోయి క్రొత్తగ, ఋతు వరుదేరంగ హర్ష ♦ వృద్ధిం గను నీ
క్షితిజనసంఘం బది తన, బ్రతికెడికాలంబుఁ దినుట ♦ పరికింపదుగా. ౨౩౮౯

ఉ. కట్టెయుఁ గట్టె నేళ్లఁ బడి ♦ కంధిని జొచ్చి తటానఁ గూడి యు
న్నట్టుల యుండి పాయుగతి ♦ నాలును బిడ్డలు బంధు లర్థముల్
పట్టునఁ జేరియుం బిదపఁ ♦ బాయుట కాలబలంబుచేత నే
యెట్టును బాసిపోక ధ్రువ ♦ మియ్యది నమ్ముము చింతయేటికిన్. ౨౩౯౦

ఉ. ఇచ్చగ జీవయుక్తు లగు♦నిష్టజనంబులతోడ నొక్కటన్
మచ్చికఁ గూడి యుండ మన ♦ మానక శక్యము గాక యుండఁగాఁ
జచ్చెడివారి నాఁపుటకు ♦ సారవివేక! వశంబె ప్రాణి కీ
విచ్చఁ దలంపు మేటికను ♦ లేటిసహోదరు, లేటి మిట్టముల్? ౨౩౯౧

కం. త్రోవను నిలిచినయొకఁ డా,త్రోవన చనుపాంథజనము♦తోడన్ నేనున్
మీవెంట వత్తు నను వహిఁ, బోనం దగుఁ బెద్దవారు ♦ పోయినత్రోవన్. ౨౩౯౨

కం. కావున నతిక్రమింపం,గా వశపడనట్టిత్రోవ ♦ గమనించిన యా
జీవులకై శోకించిన, నేవిధమున మేలు గలదె ♦ యోజింప వయా. ౨౩౯౩

కం. వయను ప్రవాహము వంటిది, రయమునఁ జనుచుండుఁ గాని ♦ క్రమ్మఱ దెపుడున్
నియమింపవలయుఁ దనమది, నయముగ సుఖ మందఁ; బ్రజలు ♦ నవ్యసుఖాప్త్యై.

సీ. ధర్మాత్ముఁ డై యుండి ♦ తతశుభావహ మైన,జన్మంబు లన్నియు ♦ జరపినాఁడు
దక్షిణాదులచేత ♦ ధరణీసురాదిక,జనముల నెల్లను ♦ దనిపినాఁడు

తనభృత్యవర్గంబు ♦ ధరణీజనంబుల, హితదానములచేత ♦ నేలినాఁడు
చేకొలందిగ నీవి ♦ చేసి యథేష్టంపు,భోగంబు లన్నియుఁ ♦ బొందినాఁడు
తే. సాధుకర్మంబు లెన్నియో ♦ చలిపినాఁడు, పెక్కుకాలంబు ధరణి జీ♦వించినాఁడు
నాకలోకసుఖంబుల ♦ నందినాఁడు, తండ్రి కేటికి వగవ నా♦తండ్రి! చెపుమ.
తే. జీర్ణమానుష దేహంబు ♦ క్షితిని విడిచి, బ్రహ్మలోకవిహారపా♦త్రంబు నైన
దివ్య దేహంబుఁ దాలిచి ♦ తేజరిల్లు,జనకునకు నేల దుఃఖింప ♦ సాధుశీల. ౨౩౬
కం.వావిరి యీగతి నేడువ,బోవఁడు ప్రాజ్ఞుండు నిన్నుఁ ♦ బోలినశ్రుతివి
త్కోవిదుఁ డగునే మునుకొఁగ, నీవిధి శోకింపఁ గార్య ♦ మే మగుఁ దండ్రి? ౨౩౭
కం.ఎట్టిదశయందుఁగానీ, దిట్టతనముగలిగియున్న ♦ ధీమంతుఁడు లోఁ
బుట్టినశోకభరంబునఁ, బుట్టఁగనీఁ డశ్రుబిందు♦వులు నయనములన్. ౨౩౮
ఉ. కావున స్వస్థచిత్తుఁ డవు ♦ గమ్ము విషాదము మాని యూరికిం
బోవుము రాజ్యభారమును ♦ బూనుము తండ్రి వచించినట్లు నే
నీవనవాస మోర్తుఁ బది♦యేఁడులు నాలుగు, తండ్రియాజ్ఞ నే
నే విఫలంబు సేఁత దగు♦నే? యది ధర్మమె నాదుబోఁటికిన్? ౨౩౯
కం.ఆతండె మనకుఁ దండ్రియు, నాతండే మనకుఁ జుట్ట ♦ మటుగావున నీ
కాతని సమ్మానించుట, ఖ్యాతికరము నాకు నదియె ♦ యగు సమ్మతమున్. ౨౪౦
కం.పరలోక మందఁగోరెడు,నరుఁడు వయోపరుఁడు గర్మ♦నైష్ఠికుఁ డైనన్
బరిపాలితగురువాక్యుఁడు, ధరణిం గావలయుఁ జుమ్ము ♦ ధర్మార్థవిదా. ౨౪౧
కం.జనకునిసచ్ఛీలము నీ,మనమునఁ దలపోసి యతని ♦ మాటను నిలుపన్
గొనకొనుము రాజ్యభారం,బును బూను మిటేల ననట ♦ మునుఁగఁగ భరతా.

భరతుఁడు శ్రీరామునితోఁ దనదుఃఖమునకుఁ గారణముఁ జెప్పుట.

తే. అనుడు శ్రీరాముఁ గనుఁగొని♦యనియె భరతుఁ,డనఘ నీయంటినరుఁడిల♦నరిదిమాపె
చెట్ట ని న్నేమి కాచియు ♦ పెట్ట లేము, మేలు నిముఁ బొంగఁ జేయుంగ♦జాల దార.
కం.ఎటుక గల పెద్దలకు వా, రెటుఁగనియవి చెప్ప నీవె ♦ యెటుఁగనియట్టుల్
గుటుకొని సందియ మడిగెదు,కాల లీ కవ్వారి కెటుక ♦ గూర్చెడివాంఛన్.
చం.కనుఁగొనసట్టివస్తువునఁ ♦ గల్గదు కామము, తద్విహీనంబునం
గనుగొనువస్తువం దయినఁ ♦ గల్గదు కామము జ్ఞానికిన్, మృతిం
గనినమనుష్యమీఁదఁ బగ ♦ గల్గదు, తద్విధి నున్న వారిపై
జనవర! కాన నేనును వి♦షాదము గూరెను దండ్రికై మదిన్. ౨౪౫
సీ. అడలె దేటికి నాఁ బ♦రానరజ్ఞుండె ష్న, దుఃఖపాళికి నింత ♦ దూలిపోఁడు
నీవు నాకైవడి ♦ నెగడితి వమరోప,మా! సత్త్వసంపన్నుఁ ♦ డగుమహాత్మ

సత్యసంగరుఁడవు ♦ సర్వజ్ఞమూర్తివి, సర్వదర్శివి కడుఁ ♦ జతురమతివి
ధృతియుతుండవు భవ ♦ స్థితివిదుండవు నీవ, సహియింప రానట్టి ♦ సంకటముల
ఆ. ననుభవింపఁ దగునె ♦ యది దలపోసిన, మాకు సుఖము గలదె ♦ మాన్యచరిత
నిన్నుఁబోలువాఁడు ♦ నిష్ఠురారణ్యాళి, నశల నెట్లు దుఃఖ ♦ పడక యుండు ౨౮౦౬
ఉ. నే నటు లింట లేనియెడ ♦ నీచచరిత్ర మదంబ నాకు నై
తా నిటు లోకగర్హితము ♦ దారుణపాపము నాచరించె, ని
ష్ఠేనియుఁ దల్లి యం చనక ♦ యింతలు నింతలు తుండెతుండెముల్
గా నఱకంగఁ జాలుదును ♦ గాని నిబద్ధుఁడ ధర్మరజ్జులన్. ౨౮౦౭
కం. పుట్టితి శుద్ధాన్వయమునఁ, బుట్టినయూజికిని ధర్మ ♦ పుం దెరువుల నే
నెట్టిన నేర్పితిఁ గని కని, యెట్టులు గర్హ్యం బధర్మ ♦ మే నొనరింతున్. ౨౮౦౮
చం. ఘనుఁడు గురుండు వృద్ధుఁడును ♦ గార్యవిదుండును జచ్చెఁ గాన నా
జనకుఁడు నిందుగోష్ఠిఁ బరు ♦ షంబులు పల్కఁగరాదు గాక యే
మనుజుఁడు పూను నొక్క యొక ♦ మానినిప్రీతికి నర్థధర్మనా
శన మగునట్టిక్రూరకలు ♦ షం బొనరింపఁగ ధర్మవేది యై. ౨౮౦౯
ఉ. కూడు వినాశకాలమున ♦ కుఁ విపరీతపుబుద్ధి యంచు ని
ట్లాడెడు లోక మానుడి యథార్థముఁ జేసె నృపాలుఁ డిష్ట దా
నోడక క్రోధమోహముల ♦ నొప్పనికార్యముఁ జేసి, దాని కీ
వీడుగ సాధువృత్తిఁ జరి ♦ యించి మరల్పుము తత్కృతాఘమున్. ౨౮౧౦
చం. జనకుఁడు కిల్బిషం బొకఁడు ♦ సల్పిన యేనియు దానిపాపముం
జనకునిఁ బొందకుండఁ గృతి ♦ సల్పినపుత్త్రుఁడె పుత్త్రుఁడౌఁ జుమీ
జనకుఁడు పాపముం బొరయఁ ♦ జల్పినవాఁడును బుత్త్రుఁ డౌనొకో?
జనకునిఁ గావుమీ యతఁడు ♦ సల్పినదానిని విస్తరింపుమీ. ౨౮౧౧
ఉ. ఎక్కడి క్షత్త్రధర్మ మిది ♦ యెక్కడి ఘోరమహావనస్థలం
బెక్కడిరాజ్యపాలన మి ♦ దేటి జటాభరధారణంబు నీ
కక్కట! యిట్టిచేఁత దగ ♦ వా! ననుఁ గైకొను దండ్రి మిత్త్రులన్
దక్కినపౌరబంధుజన ♦ తం గృప నేలఁగదన్న మ్రొక్కెదన్. ౨౮౧౨

భరతుఁడు శ్రీరామునితో వనవాసం బతని కర్హ్యధర్మంబు గాదనుట.

ఆ. ప్రాజ్ఞలోకవర్య ♦ ప్రజలఁ బాలింపఁగ, దేన శక్య మగునో ♦ మానవేంద్ర
పటలి కట్టిరాజ్య ♦ పట్టాభిషేకంబు, ప్రథమధర్మ మనిరి ♦ ప్రాజ్ఞ జనులు. ౨౮౧౩
సీ. ప్రత్యక్ష మగుప్రజా ♦ పాలనధర్మంబుఁ, బోకార్చి మిగులశం ♦ కాకులంబు
గాలాంతరఫలంబు ♦ కలితలక్షణహీన, మవినిశ్చితం బగు ♦ నట్టిగర్హ్య -

మే క్షత్రియుఁడు పల్కు ♦ నీవు కష్టోద్భవ,ధర్మంబుఁ జలుపంగఁ ♦ దలఁచె దేని
నాలుగుజాతుల ♦ పాలనచేత క్లేశాత్మక మగుట న ♦ య్యది చరింపు
తే. మాశ్రమచతుష్టమున గృహ ♦ స్థాశ్రమంబు, శ్రేష్ఠ మగు నని కాదొకో ♦ శిష్టమతము
ధర్మతత్పర నీయట్టి ♦ ధార్మికుండు, దాని విడనాడఁ జూడంగ ♦ ధర్మమగునె? ౨౪౧౪
ఉ. పుట్టువుచేత స్థానమునఁ ♦ బోఁడిమివిద్యల నీకుఁ బిన్న నే
నెట్టులు నీవు గల్గియును ♦ నేలఁగఁ జాలుదు? ధీగుణంబుల
న్బుట్టునఁ బిన్ననాఁట నినుఁ ♦ బాసి నిలంగను నేర నన్నయా!
యెట్టులు రాజ్యభారము వ ♦ హింతునొ? పోవఁ జుమీ యయోధ్యకున్. ౨౪౧౫
సీ. పౌరపురోహిత ♦ బాంధవప్రవరులు, గల రిట నెల్లరుఁ ♦ గాన నిచటఁ
బట్టాభిషేకంబుఁ ♦ బటిమ నొనర్తుము, పదపడి ధారిణీ ♦ పాలనమున
కరుదె మ్మయోధ్యకు ♦ నరివరులను గెల్చి, వృత్రారిపోలె నీ ♦ వెల్ల రలర
మూఁడుఋణంబుల ♦ ముడుముట్టఁ దీఱిచి, మిత్రకోటులకు న ♦ మిత్రులకును
ఆ. నిష్టకష్టములను ♦ నిడుచు మ మ్మెల్లరఁ, గాన నయ్య నిన్నుఁ ♦ గాంచి హితులు
దేలఁ బ్రీతిఁ బగతు ♦ దిక్కుమొగంబుగా, రమ్యసుగుణభద్ర ♦ రామభద్ర. ౨౪౧౬
కం. నాతల్లి నిందవలనం, బూతగ నొనరించి తండ్రి ♦ పుణ్యాత్ముఁడుగాఁ
బాతకమునకుం బాపుము, భూతముల మహేశునట్లు ♦ ప్రోవుము మమ్మున్.
కం. నామాటలు పెడచెవి నిడి, యీమహితారణ్యవాస ♦ మీఁకొనె దేనిన్
రామా! మీబడిఁ గానన,సీమకు నివసింప వత్తు ♦ సిద్ధ మటన్నన్. ౨౪౧౮
ఉ. ఇంతయు నాలకించి పురి ♦ కేఁగఁగ నీకొనకున్న జానకీ
కాంతునిఁ జూచి నైగమని ♦ కాయము లశ్రుల నించి హా యటం
చెంతటి ధీరచిత్తుఁ డర ♦ రే యని హర్షము గాంచెఁ దల్లులున్
వంతను బొంది హా యనుచు ♦ వ్రాలిరి మెచ్చిరి కైకపుత్రునిన్. ౨౪౧౯

శ్రీరాముఁడు భరతునితో నతఁడు రాజగుట ధర్మమని చెప్పుట.

చం. భరతుఁడు వేఁడ నిట్లు బహు ♦ భంగుల రాముఁడు పల్కె నాజికిన్
బురుమతి కేకయాత్మజకుఁ ♦ బుట్టిన నీ కిది చెల్లుఁ, గైకయీ
పరిణయవేళఁ దాతకును ♦ బ్రాజ్యము రాజ్యము శుల్కమిచ్చె భూ
వరుఁ డగుతండ్రి యామెసుతుఁ ♦ బట్టముఁ గట్టఁగ బాస చేయుచున్. ౨౪౨౦
సీ. విబుధదానవయుద్ధ ♦ వేళ నీజనయిత్రి, పుడమిఱేనికిఁ దోడు ♦ పడినకతనఁ
బరమహర్షంబున ♦ వరములు రెం డిచ్చె, నామెయు వానిన ♦ యడిగె నిప్పు
డిదియును దోషమే ♦ యిందు నొక్కటి నీవు, రాజౌటయును నే న ♦ రణ్యములకుఁ
బోవుట మఱియొండు ♦ భూవరుం డని యిచ్చెఁ, గావునఁ దండ్రివా ♦ క్యంబుఁ బట్టి

ఆ. పదియునాలుగేండ్లు ♦ భ్రమియింప వనముల, వచ్చినాఁడఁ దోడ ♦ వసుధతనయ
లక్ష్మణుండు రాఁగ ♦ లలితపద్ధతిఁ దండ్రి, సత్యవచననిష్ఠుఁ ♦ జల్పుటకును ౨౪౨౧
కం. నీవును దండ్రిని నిజమతిఁ, గావింపఁగవలదె? యట్లు ♦ గావున రాజ్య
శ్రీవిభవముఁ గైకొనుమీ, నావచనము వినఁగదయ్య ♦ నాకొఱకైనన్. ౨౪౨౨
కం. జనకుని ఋణంబుఁ దీర్పుము, జనయిత్రియు సంతసింపఁ ♦ జరియింపు గయుం
డనునతఁడు దొల్లి గయయం, దనియె సుగీతములఁ బితరు♦లందఱు వినఁగన్.
కం. జనకుఁడు పున్నామనరక, మునఁ గూలక కాచుఁ గాన ♦ మొగి నాతనికో
ర్కిని దీర్చిసుకృతుఁ జేయును, గనుకం బుత్త్రాఖ్యఁ బరఁగుఁ♦గా సుతుఁ డెందున్.
కం. కలుగుదురు గాక తనయులు, పలువురు గుణయుతులు వేద♦పారగు లని కో
ర్కులు జనములు గోరఁగఁ దగుఁ, గలుగఁడె యొకఁడైనఁ బోవ ♦ గయ కనునాశన్.
తే. రాజఋషు లందఱును నిట్లు ♦ రాజపుత్త్ర! తలఁచుచుందురు గావునఁ ♦ దండ్రి నీవు
నరకమునుండి కావుమీ ♦ ధరణిజనుల, ననుజుతోఁగూడి పాలింపు♦ నురుగుపురికి.
ఉ. రాజవు గమ్ము నీవు జన♦రాజికి, నే మృగపాళి కయ్యెదన్
రాజను, దండకాటవికి ♦ గ్రక్కునఁ బోయెదఁ, బొమ్ము వీటికిన్,
రాజిలుఁ గాక నీకు దిన♦రాజకరాతప మాఁప ఛత్త్రమున్,
భూజవిశాలశాఖ లిటఁ ♦ బొల్పగు నాకు సుఖప్రదంబులై, ౨౪౨౭
తే. తోడుపడుచుండు నీకు శ♦త్రుఘ్నుఁ డచట
నిచట సౌమిత్రి నాకుఁ దా ♦ నెలమిఁ గూర్చు
మనము నలువురు తనయుల ♦ మనఘచరిత
తండ్రి సత్యస్థుఁ జేయఁగఁ ♦ దలఁపవయ్య. ౨౪౨౮

జాబాలి రామునితో నాస్తికవాక్యంబులు చెప్పుట.

కం. ఈలీల భరతు హితవా,గ్జాలంబులఁ దేర్చు రాముఁ ♦ గనుఁగొని యట భూ
మీలేఖోత్తముఁ డగు జా,బాలి యధర్మోక్తు లిట్లు ♦ పలికె హితేచ్ఛన్. ౨౪౨౯
చం. అరయఁగ సర్వముం దెలిసి♦నట్టిమహామతి వీవు నీకుఁ బా
మరునకు యుక్తమైనమతి♦మాంద్య మదెట్టులు కల్గె? నేల యీ
కరమునిరర్థకంపుమతి ♦ గ్రక్కున నేగు మయోధ్య కింక నీ
భరతుఁడు గోరినట్టు జన♦పాలనశీలివి గమ్ము రాఘవా! ౨౪౩౦
ఉ. ఎక్కడితండ్రి? మానవున ♦ కెక్కడిబంధువు? లేటిమాట, దా
నొక్కనిచేఁ గనం దగుప్ర♦యోజన మెయ్యది? పుట్టువేళఁ దా
నొక్కఁడ పుట్టుఁ, జచ్చునెడ ♦ నొక్కఁడ చచ్చును, వెంట వచ్చునే
యొక్కఁడునైన? నెట్లగుదు♦రో తనవారలు కన్నవారలున్? ౨౪౩౧

ఉ. ఎక్కడితల్లి తండ్రి? మతి♦హీనతతో యటు లంట, లేదు చూ
యొక్కని కొక్కఁ డెందుఁ, బెఱ♦యూరికిఁ బోవుచు బాట నిల్చి తా
నొక్కఁడ వేగినంత మఱి♦యొండు కడం జనుపాంథునట్లు దాఁ
దక్కుచుఁ దల్లితండ్రిధన♦దారలఁ బోవును జీవి రాఘవా! ౨౪౩౨

కం. ఆవాసమాత్ర మియ్యవి, కావున వీనికిని బుధుఁడు ♦ కాంక్షయుఁ గనునే?
భూవరతనయా! ని న్నేలా విపరీతంపుబుద్ధి ♦ యావేశించెన్? ౨౪౩౩

చం. జనకునిరాజ్యము న్విడిచి ♦ సంకటకారణకంటకావృతం
బును విషమంబు నైనచెడు♦పోకలఁ బోవఁగ నేల? సర్వభో
గనిచయపూర్ణ మాపురికి ♦ గ్రక్కునఁ బొ మ్మభిషేకసద్విధిన్
గొనుము, యథేచ్ఛసౌఖ్యములఁ ♦ గూడుము, వేచె నయోధ్య నీకునై. ౨౪౩౪

ఆ. తండ్రి, యనఁగ నీకుఁ ♦ దండ్రికి నీ వెవ్వఁ? డతఁడు వేఱు వేఱ ♦ యధిప! నీవు
దీని నీ వెఱింగి ♦ మానుగ మే మ్మిల్లఁ, జెప్పినట్లు చేయఁ ♦ జెల్లు నీకు. ౨౪౩౫

కం. జనకుండు బీజమాత్రను, జననీజఠరమున శుక్ల♦సంయుతరక్తం
బున నగుఁ బిండము దానన్, జనియించును బ్రాణి దీన ♦ సందియ మున్నే. ౨౪౩౬

ఉ. ఎచ్చటి కేగఁగా వలె మ♦హీశ్వరుఁ డచ్చటి కేగె, నద్దియే
నిచ్చలు మర్త్యకోటులకు ♦ నిశ్చితసృష్టము, దీనిఁ జూచి కే
పిచ్చితనంబునన్ వృథగఁ ♦ బెక్కువిధంబులఁ బల్కెదీవు, నీ
వెచ్చటఁ దండ్రి యెచ్చట? ని ♦ దేమిటి ప్రాజ్ఞులు విన్న నవ్వరే? ౨౪౩౭

కం. ధర్మార్థంబునకొఱకై, కర్మంబులఁ జేయువాని♦గాసికి వగతున్
గర్మునఁ డిందును నందును నశ్వర్థంబున వగచు; మేలు ♦ సౌఖ్యమె కోరన్. ౨౪౩౮

కం. అష్టక యని యాబ్దిక మని, కష్టము పడిచేయువారు ♦ కర్మముఁ, గంటే
కష్టార్జితాన్నసష్టము, శిష్టవినుత! యన్నమున్ భు♦జించునె మృతుఁడున్? ౨౪౩౯

ఉ. ఒక్కఁడు కూడు దిన్న మఱి♦యొక్కనిపొట్టయు నిండు నంట హా!
యెక్కడి మాట, యట్లయిన ♦ నింటను శ్రాద్ధముఁ బెట్టి రేనియున్
మక్కువబాటసారికిని ♦ మార్గమునం దుదరంబు నిండునే?
టక్కులుగాక నిక్క మను♦టల్ మతిమంతులు విశ్వసింతురే? ౨౪౪౦

ఉ. చేయుము యాగముల్, దపము ♦ సేయుము, దీక్ష వహింపు, దానముం
జేయు, మటంచు గ్రంథములఁ ♦ జెప్పిరి యన్యధనాపహారులై
ధీయుతు, లవ్వి నమ్మునె సు♦ధీమణి, కానఁ బరంబు లేమి నీ
వీయెడ లబ్ధభోగముల ♦ నేల త్యజించెదు ధీరసత్తమా. ౨౪౪౧

తే. ధరణిఁ బ్రత్యక్షమగుదానిఁ దలఁగఁద్రోసి, కొని పరోక్షంబు నమ్మునే చెనఁటి యైన?
భువనజనసమ్మతంబు నా బుద్ధి వినుము, కట్టుకొన వయ్య పట్టంబుఁ గరుణమీఱ.

## శ్రీరాముఁడు జాబాలిమతమును ఖండించుట.

మ. అని జాబాలి వచింప నావలుకు సత్యాత్ముండు సీతేశుఁడుఁ
విని నిశ్చంచలచిత్తుఁడై యనియె నో విప్రా! మదర్థంబు నీ
వనుసమ్మాటలు కార్యసన్నిభ మకార్యం బౌ, హితాకారమ
య్యు నపథ్యంబును, గాన వాని విన నొల్లో ర్మిఁ జగద్గర్హ్యమున్. ౨౪౪౩

తే. భిన్నచారిత్రదర్శనుల్ పేర్మి చెడఁగ
స్ఖలితమర్యాదులును గల్మషప్రవర్త
కులును నగుచును మానంబుఁ గోలుపోయి
సభలదూషితు లగుదురు సత్య మిదియు. ౨౪౪౪

కం. కులహీనునిఁ గులవంతునిఁ, బలువను సజ్జనుని శుచిని బాపిని శౌర్యా
గళితునిఁ బూరుషమానిం, దెలియఁగఁ దగు వానివాని నెఱినడవడిచేన్. ౨౪౪౫

సీ. నిక్క మనార్యుఁడై నెఱయార్యుపోలికి, శుచితావిహీనుఁడై శుచివిధంబు
లక్షణ్యునట్లు లక్షణ్యుఁడై దుష్టశీలుఁడయ్యును సాధుశీలుమాడ్కి
శ్రుతిహితకార్యవర్జితలోకసంకర, మగు సద్ధర్మము ధర్మ మనుచుఁ జెప్ప
నాయట్టివాఁ డది న్యాయ్యంబుచు గ్రహింపఁ, గార్యవిచక్షణుఁ డార్యుఁ డెవఁడు

తే. లోకముల దుష్టశీలుని లోకనింద్యు, నన్నుఁ జూడఁగ నేర్చు సన్మార్గదృష్టి?
నేన ప్రతినను గలిపి మున్నీట గ్రుచ్చ, మెవని కెఱిఁగింతు? నాక మే నెట్లు గాంతు?

## శ్రీరాముఁడు జాబాలికి సత్య మవశ్యానుష్ఠేయం బని బోధించుట.

కం. రాజే నాస్తికుఁడైనను, భూజనతతి యిచ్చకొలఁది పోకలఁ బోదే
రా జేపోకలఁ బోయిన, భూజనసంచయము నట్టిపోకలఁ బోవున్. ౨౪౪౭

కం. సత్యదయాంహసక మయి, నిత్యంబుగ రాజవృత్తి నెగడును గానఁ
సత్యాత్మక మీరాజ్యము, సత్యంబే కుదురు సర్వజగముల కెపుడున్. ౨౪౪౮

కం. సత్యంబె శ్రేష్ఠ మని యాదిత్యులు మునిపుంగవులును దెలుతురు హితముఁ
సత్యంబుఁ బలుకువాఁడే, సత్యంబుగఁ బరమపదముఁ జాలుం బొందన్. ౨౪౪౯

కం. పామునకు వెఱచినట్టులు, భూమిజనం బనృతవాదిఁ బొడగని వెఱచుఁ
శ్రీమద్ధర్మమె సత్యము, హో ముని! స్వర్గమును సత్యమూలము సుమ్మీ. ౨౪౫౦

కం. సత్యమున నుండు లక్ష్మియు, సత్యంబే యీశ్వరుండు జగముల కెల్లఁ
సత్యము మూలం బంతకు, సత్యంబునకంటె లేదు శాశ్వతపదమున్. ౨౪౫౧

కం. దానంబును వేదంబును, ధ్యానము హోమంబు నిష్ట ♦ తప మిష్టంబుల్
మానక సత్యాశ్రయములు, కాన నరుఁడు సత్యపరుఁడు ♦ గానలయుఁ జుమీ.
కం. ఒక్కఁడు లోకం జేలెడు, నొక్కఁడు వంశంబుఁ బ్రోచు ♦ నుండు నరకమం
దొక్కఁడు స్వర్గతుఁ డొక్కరుఁ, డిక్కరణిని భిన్నగతు ల ♦ వేలా చెపుమా?
తే. సత్యసంధుఁడ నగుచును ♦ జగతిఁ బరఁగి, బాస యొనరించి తప్పుట ♦ పాడి యగునె
కాన జనకనియోగంబుఁ ♦ గా దటంచు, నెట్టు నన నేర్చు నయ్య నా ♦ యట్టివాఁడు.
ఆ. లోభముననొ రాజ్య ♦ లాభంబుచేతనో, మోహముననొ బుద్ధి ♦ మోసముననొ
జనకు నెదుట ననిన ♦ సత్య మన్సేతువు, నఱకఁజాల దేని ♦ కొఱకు నైన. ౨౮౫౫
కం. చలచేతస్కుఁడు సత్పథ, చలితుండును గల్ల లాడు ♦ జనుఁ డిచ్చు శ్రాద్ధం
బులు యాగంబులు పితరులు, నిలింపులు గ్రహింప రన ము ♦ నీ! విన మొక్కో.
సీ. ప్రత్యగాత్మంబు ధ ♦ ర్మంబు సత్యార్థంబుఁ, బ్రత్యక్షముగఁ జూచు ♦ వాఁడ నేను
సజ్జనాచరితంబు ♦ సత్యధర్మార్థంబు, నే జటాభారంబు ♦ నెఱిధరింతు
ధర్మలేశాన్వితా ♦ ధర్మంబు లుద్ధులు, పాఁసుల్ క్రూరులు ♦ పాపరతులు
సేవింపఁ దగిన దు ♦ ర్వ్యాపారంపుక్రియ, ధర్మంబు విడిచితిఁ ♦ దాపసేంద్ర
ఆ. మనసుసంద్రు నఘము ♦ మాటి కాలోచింప, జిహ్వచేతఁ గల్లఁ ♦ జెప్ప చుండఁ
గాయమునను బాప ♦ కార్యంబుఁ గావింప, మువ్విధములఁ బాప ♦ ములు లభించు.
కం. ధర కీర్తియశోలక్ష్ములు, పురుషుల సత్యైకనిష్ఠుఁ ♦ బొందును దమిచే
సురభూమి కరుగుఁ దోడుగఁ, బురుషుఁడు సత్యంబు నెట్లు ♦ పోకార్పఁ దగున్.
సీ. ఎంత యాలోచించి ♦ యిది మే లటంచును, చక్కమాటల నీవు ♦ నొక్కి యనిన
చెనఁటిధర్మం బెట్లు ♦ చేయఁగ నోపుదుఁ? బార్థివేంద్రునిముందు ♦ బాసఁ జేసి
భరతునిమిత్తమై ♦ గురువాక్య మే నెట్లు, తుంగలలోఁ ద్రొక్కి ♦ భంగపఱుతుఁ
బతి మున్ను నాయన్న ♦ ప్రతినకై కైకేయి, హర్షించెఁ దా నేమి ♦ యాత్మ నెంచు
ఆ. నిపుడు మాటఁ దప్ప; ♦ విపినవీథులయందు, నియతభుక్తిఁ గొంచు ♦ నిష్ఠఁ బూని
పూలఁ బండ్ల మూల ♦ జాలంబులను బితృ, దేవతామునులకుఁ ♦ దృప్తి నిడుదు.

◆ జాబాలికి శ్రీరాముఁడు సత్యం బవశ్యకర్తవ్యం బని చెప్పుట. ◆

కం. సంతుష్టేంద్రియతను ధృత, చింతారహితుఁ లోకయాత్రఁ ♦ జేసెద శ్రద్ధా
వంతుఁడనై నిష్కలుష, స్వాంతంబున సాధుకార్య ♦ సంగతి దనరన్. ౨౮౬౦
ఆ. కర్మభూమి దీనిఁ ♦ గావింపవలయును, బుణ్యకర్మములను ♦ బురుషు లెపుడు
వాయు వగ్ని శశియు ♦ స్వకృతకర్మంబుల, ఫలముచేత వారి ♦ పదముఁ గనిరి. ౨౮౬౧
కం. క్రతువులనూఱిటి నొనరిచి, శతమన్యుఁడు స్వారపదము ♦ సంపాదించెన్
వితతోగ్రతపోనిష్ఠుల, నతులితదివ మందఁ జాలి ♦ రఖిలమహాసుల్. ౨౮౬౨

చం. అనుచును వెండి యాతపసి♦నాస్తికవాక్యముల్ స్మరించి ఛీ
యని మదిలో ననహ్యపడి ♦ యాగ్రహ మెత్తి వచించె సత్యముల్
ఘనతరవిక్రమంబు నను♦కంపయు ధర్మము సాధువాద మా
ర్యనిచయ దేవతాతిథిస♦మర్చ్చయుఁ ద్రోవలు నాకవాటికిన్. ౨౪౬౩

ఉ. కావున నింతయుం దెలిసి ♦ కాదె ధరామరు లైకకంఠ్యసం
భావన వారివారికుల♦పద్ధతిఁ దప్పక ధర్మకార్యముల్
వావిరి చేయువారు? నిను♦వంటియధర్మపథాత్ము నాస్తికున్
ఛీ విషమస్థబుద్ధి దరిఁ ♦ జేర్చినతండ్రిని దూఱఁగాఁ దగున్. ౨౪౬౪

ఆ. చోరునట్టివాఁడు ♦ సుమ్ము బుద్ధుఁడు నాస్తికుండునుం దథాగ♦తుండ నిజము
ప్రజకు శంక్యుఁ డైన♦వాఁడు నాస్తికుఁ డౌట, యతని కెదురు విబుధుఁ♦డరుగరాదు.

శా. నీకుం బూర్వులు నీకు మిన్నలు మహా♦నిష్ఠాత్ములై కర్మముల్
సాకల్యంబుగఁ జేయ రే? యిహపర♦స్ఫాయజ్జయశ్రీకు లై
జోకన్ శాశ్వతమూర్తులై వెలుఁగ రే ♦ శుద్ధాత్ము లట్లౌటఁ దా
రేకాలంబున మంగళాత్మకమహా♦భీష్టక్రియల్ సల్ప రే? ౨౪౬౬.

ఉ. దానగుణప్రధానులు ని♦తాంతదయామతు లార్యసర్వ సం
తానసమేతు లప్రతిహ♦తప్రభు లుత్తమధర్మమార్గగ
మ్యానులు వీతపాపు లస♦మానచరిత్రులు కర్మనిష్ఠలం
బూనెడిమానిసత్తములు♦పో మునివేషక! లోకపూజితుల్. ౨౪౬౭

చం. అనుచు సరోషభాషణము ♦ లాడుమహాత్ము నదీనసత్త్వుఁ గ
న్గొని మునివెండి యాస్తిక మ♦కుంఠితసత్యము నైనపల్కు సా
నునయముగా వచించె సుము♦నోనరసన్నుత! కాను నాస్తికుం
డను, నన నాస్తికోక్తి, మఱి ♦ నాస్తి యటన్నది నాస్తి యెంతయున్. ౨౪౬౮

⟶ జాబాలి శ్రీరామునితోఁ దన్ను క్షమింప వేఁడుట. ⟵

సీ. జానకీశ్వర! ధర్మసంకటవేళ యుత్కంఠి నగ్గం బూని ♦ కీడు దలఁగఁ
ద్రోచుట యెప్పుడి ♦ చూచి యే నిప్డు డ,రాదికం బనునుప♦ద్రవము దొడర
నాస్తికవాద మొ♦నర్చితి నంతియు, కాని నాస్తికుఁడ నేఁ ♦ గాను వింటె
యన్యుఁ డెవ్వం డేని ♦ నాస్తికవాదంబుఁ, జేయఁ దద్వాదంబుఁ ♦ జెఱుతు నేన
తే. ధర్మసంకటకాలోచి♦తంబు సుమ్ము, నాదుప్రకృతపు నాస్తిక♦వాద మిట్టి
ధర్మసంకటకాలంబు ♦ దాపగించె, నేని వెంశి నాస్తికతను ♦ బూనువాఁడ. ౨౪౬౯

ఆ. కడఁగి నిన్నుఁ బురికిఁ ♦ గ్రమ్మఱింపఁగఁగోరి, భరతుఁ డిట్లు జాలి♦పడుటకతన,
నీయనుగ్రహంబు ♦ నెఱిపొందుకొఱకునై, యిట్లు పలికినాఁడ ♦ నఘము సైఁపు.

{ వసిష్ఠుఁడు శ్రీరామునితో జ్యేష్ఠుఁడు రాజ్యార్హుఁ డని పూర్వరాజవృత్తాంతముఁ జెప్పుట. }

సీ. అనఁ గ్రుద్ధుఁ డైనరా♦మునితో వసిష్ఠుండు, పలుకు జాబాలియుఁ♦బార్థివేంద్ర!
జనులగతాగతం♦బును జక్క నెఱుఁగుని, న్నరలింపఁ గోరి య♦ట్లాడెఁ బలికె
లోకేశ! వినుము యీ♦లోకసముత్పత్తి, యఖిల మేకార్ణవ ♦ మైనయపుడు
పుడమి నిర్మింపఁగఁ♦బడెఁ బిదంబునను స్వయంభువు బ్రహ్మ దే♦వాళితోడఁ
ఆ. గలిగె నీట మునుఁగు♦ధాత్రితలంబును హరి, పోత్రి యగుచుఁ దెల్పెఁ♦బుత్రయుక్తి
నవ్యయుండు నిత్యుఁ ♦ డాకాశభవుఁ డల, బ్రహ్మ జగములెల్లఁ ♦ బరఁగఁ జేసె.

సీ. ఆయనకు మరీచి ♦ యతనికిఁ గశ్యపుఁ, డతనికి భాస్కరుఁ ♦ డాతనికిని
ఘనుఁ డుద యించెను ♦ మను వాతఁ డిక్ష్వాకుఁ, గనియె నయోధ్య నా♦తనికి నిచ్చె
మను వట్టు లగుట నా♦తని మూలపురుషుఁగా, నెంచు మీకులమున ♦ కెల్ల నధిప
కుక్షి యాతనికి వి♦కుక్షి యాతనికిని, నతనిపుత్త్రుఁడు బాణుఁ ♦ డతులబలుఁడు
తే. బాణపతి కనరణ్యుఁ డా♦క్షోణినాథు, పాలనంబునఁ దస్కర♦బాధగాని
కఱవు డామరములు గాని ♦ కలుగవయ్యె, సత్యధర్మగరిష్ఠుఁడై ♦ జరగుకతన. ౨౪౭౨

కం. ఆతనికిని బృథుభూపతి, జాతుం డై కీర్తిఁ గనెఁ ద్రి♦శంకుఁ డతనికిన్
ప్రీతికరపుత్త్రుఁడై దివి, కై తనమెయితోడఁ జనియెఁ ♦ బతిసత్యరతిన్. ౨౪౭౩

కం. కలిగెం ద్రిశంకునకు ని, ర్మలచరితుఁడు సుతుఁడు ధుంధు♦మారఖ్యాతిన్
వెలయుచు యువనాశ్వుం డన, బలియుఁడు మాంధాత యతని♦పట్టియె రామా.

కం. మాంధాతృతనయుఁ డయ్యె సు, సంధి యతనితనయులు ధ్రువ♦సంధియు దృఢవీ
ర్యాంధుఁడు ప్రసేనజితుఁ డర్క, బంధుర కీర్తి ధ్రువసంధి ♦ భరతుం గనియెన్. ౨౪౭౫

సీ. భరతుఁ డసితుఁ గాంచెఁ♦బగతురు హైహయుల్, తాలజంఘులు శూర♦తములు వాని
నాహవంబున గెంట ♦ నతఁడు ప్రవాసియై, చలిమల ముని యయి ♦ సంచరించె
నతనియిల్లాం డ్రిర్వు ♦ రటఁ జూలి ధరియింప, సవతికి విష మన్య♦సతి యొసంగె
నటఁ గర్భవతియైన ♦ యాసతి కాళింది, చ్యవనుని చెంతకుఁ ♦ జని మెఱంగి
ఆ. నంత నతఁడు సదయుఁ♦డై వరకామ కీర్తినియు నీకుఁ బుత్త్రుఁ♦ డఖిలలోక
విశ్రుతుండు వైరి♦విజయుఁడు వంశక, రుండు సాధునుతగు♦ణుండు పుట్టు. ౨౪౭౬

కం. అని దీవించిన మ్రొక్కుచుఁ, జని యింటికిఁ బద్మ నేత్ర ♦ సారసగర్భా
భుని సుతునిఁ గనె గరముతో, జనియించుటఁ జేసి యతఁడు ♦ సగరుం డయ్యెన్.

కం. ప్రవ్వించె నీరనిధి ము, న్నవ్విభుఁ డాతనితనూజుఁ ♦ డసమంజుఁడు దాఁ
గ్రొవ్వున శిశువులఁ జంపఁగ, నెవ్వగపడఁ గానలందు ♦ నెట్టింపఁబడెన్. ౨౪౭౮

సీ. ఆయసమంజున ♦ కంశుమంతుఁడు పుట్టె, నతఁడు దిలీపుఁ డ♦న్సుతునిఁ గాంచె
నతఁడు భగీరథా♦ఖ్యమహీశుఁ గాంచె,నా,యనపుత్త్రుఁడు కకుత్థ్సుఁ ♦ డార్యచరితుఁ
డతనిపేరన కాదె ♦ యన్వయజుల కెల్లఁ, గాకుత్థ్సు లనఁగఁ బ్ర♦ఖ్యాతి గలిగె
నతఁడు రఘువుఁ గాంచె ♦ నతఁడు కల్మాషపా,దుం డనఁ బురుషాద♦కుండు ననఁగ
తే. మఱియు సౌదాసుఁ డనఁగ నా♦మముల నొప్పు
నతనిఁ గాంచెను; శంఖణుఁ ♦ డతనిసుతుఁడు
దళములను గూడి జనకుని ♦ వలనఁ జచ్చె
నతనికొడుకు సుదర్శనుఁ ♦ డనెడుఱేఁడు. ౨౪౯
ఆ. ఆసుదర్శనునకు ♦ నగ్నివర్ణుఁడు తత్సుతుండు గాఁగ శీఘ్ర♦గుండు నయ్యె
వానికొడుకు మరుఁడు ♦ వాఁడు ప్రశుశ్రుకుఁ, గనియె నంబరీషుఁ ♦ గనియెనతఁడు.
కం. మహిపతి నహుషుం డతనికి, నహుషునకుం బుత్త్రుఁ డయ్యె ♦ నాభాగుం డా
మహితాత్మున కిరువురు సుతు, లజాఁడు సువ్ర♦తాఖ్యుఁడు నాఁగన్.
కం. ఆయజునకు దశరథపతి, దాయాదుం డయ్యె నతని♦తనయులలో నీ
వే యగ్రజాతుఁడవు రా,మా! యిట్లట నిలనేలు♦మా తండ్రివలెన్. ౨౫౨
కం. అనఘా! యిక్ష్వాకులలోఁ, దనయుఁడు జ్యేష్ఠుండు రాజ్య♦తంత్రముఁ దీర్పన్
జనుఁ గులధర్మము విడువక, కొనుమీ రాష్ట్రంబు నేలు♦కొనుమీ ప్రజలన్.

వసిష్ఠుఁడు శ్రీరాముని రాజ్యంబుఁ గొను మని వేఁడుట.

మ. అనుచు న్వెండి వసిష్ఠుఁ డెంతయును న్యా♦యం బార ని ట్లాడు నో
జనపాలాగ్రణి రామ! పూరుషున కా♦చార్యుండునుం దల్లియున్
జనకుండు న్గురు లైరి ముగ్గు రిల జ♦న్మం బిచ్చుటం దల్లియున్
జనకుండున్, మఱి జ్ఞానదాత యయి యా♦చార్యుండు, నవ్వారిలోన్. ౨౫౪
కం. తనువు నొసంగినజననీ,జనకులకంటెను సుబుద్ధి♦సంపదఁ గూర్పన్
గనుటను నాచార్యుఁడె గురుఁ, డనుపెనుపుం గాంచి శ్రేష్ఠుఁ ♦ డయ్యెను రామా.
కం. ధరణీతనయాధవ నీ,గురువునకున్ గురుఁడ నేను ♦ గురుఁడను నీకున్
వరమతి నానుడి వినినను, బరఁగదు సన్మార్గగతికి ♦ భంగము తండ్రీ. ౧౫౬
కం. ధరణీసురులును వీరే, పురజనులును వీరె ద్విజులు ♦ పుణ్యులు వీరే
పరిపాలింపుము వీరలఁ, బరఁగదు సన్మార్గగతికి ♦ భంగము తండ్రీ! ౨౫౭
కం. వరధర్మశీల వృద్ధయు, గురుసతి నీతల్లి యామెఁ ♦ గొలువమి తగునా?
చరియింపు మామెనుడి విని, పరఁగదు సన్మార్గగతికి ♦ భంగము తండ్రీ! ౨౫౮
తే. సత్యధర్మపరాక్రమ ♦ జానకీశ, ప్రార్థనముచేయు చున్నట్టి♦భరతుపల్కుఁ
బట్టి వర్తించు టాత్మాతి♦వర్తనంబు, గాదు నాపల్కుఁ గైకొమ్ము ♦ కరుణ మీఱ.

## శ్రీరాముఁడు వసిష్ఠునితో నాచార్యులకంటెఁ దల్లిదండ్రులు శ్రేష్ఠు లని చెప్పుట.

చం. అని విని రాముఁ డి ట్లనియె ♦ నార్యజనోత్తమ! పుత్రలబ్ధికై
పనిగొని తల్లి దండ్రి పడు ♦ పాటులకుం బ్రతి సేయ సౌనె? యిం
పునఁ దలఁ జూచి నీళ్లు,కడు ♦ పుం గని యన్నము, పోసి పెట్టి యెం
డను జలి గాలిఁ బ్రోతురు ది ♦ నంబును,వారలతుల్యులే యొరుల్? ౨౪౯౦

కం. తనుఁ దాను గాచుకొనఁ జా,లనివళ నేమఱక యెపుడు ♦ లాలించుచు న
ర్థన మొనరింతురు సత్ప్రియ,మును బల్కెదు రయ్య! వారు ♦ ముచ్చట మీఱన్.

ఉ. కావునఁ గన్న తండ్రి కొడు ♦ కా! యిటు సేయు మటంచు మున్న దా
నావిధి నాజ్ఞ సేసెఁ గద ♦ న్యాయ్యమె యాతనిపల్కు కల్ల యై
పోవఁగఁ జేయ? నాఁ గయిక ♦ పుత్త్రుఁడు సూతునిఁ జూచి సారథీ!
నీ విట నేలఁ గూర్పు కుశ ♦ నిర్మిత మాసనముల్ మదర్థమై. ౨౪౯౧

ఉ. రాముఁడు పట్టనంబునకు ♦ రా మదిఁ బూనెడిదాఁక నింద శా
లాముఖమందు నప్పిడి యి ♦ లాత్రిదశుం డధమర్ణు[1]వాకిటన్
మోమున గుడ్డ వైచుకొని ♦ ముట్టక కూడును నీళ్లు నుండు న
ట్లేమియు ముట్ట కేను వసి ♦ యించెద, నిశ్చయ మిద్ది నావుడున్. ౨౪౯౩

సీ. ఆసుమంత్రుండు రా ♦ మాస్యంబుఁ జూచుచు, వేచియుండఁగ రఘు ♦ వీరుఁ డపుడు
తాన దర్భలతోడఁ ♦ దల్పంబుఁ గల్పించి,కొనియున్ననాతని ♦ కనియె రాముఁ
డన్న! యేయపకార ♦ము నీకుఁ జేసితి, వాకిటి కడ్డంబు ♦ పండుటకును
నుత్తమర్ణుఁడు[2]విప్రుఁ ♦ డొంటిప్రక్కన పండుఁ,దనసొమ్ము మరలంగఁ ♦ గొనుటకొఱకుఁ

ఆ. దల కిరీట మూని ♦ ధరణిఁ బాలించెడి,ధరణిపతికి నిట్లు ♦ దగునటయ్య
లెమ్ము విడుము భరత ♦ యిమ్మహావ్రతమును, మరలి చనుము నాదు ♦ మాట వినుము.

కం. అన విని భరతుం డనుఁ బుర,జనులను వీక్షించి రాము ♦ చంద్రుని మీరై
నను దేర్పరె మరలింపరె, యనవుడు వా రెల్లఁ బలికి ♦ రా భరతునకున్. ౨౪౯౪

ఉ. కంటిమి రామచంద్రునిదిఁ ♦ గల్గినచందముఁ, దద్వచస్థితుల్
వింటిమి లెస్సపల్కెడి వి ♦ వేకధనుం డల తండ్రివాక్యమం
దుంటయె యిష్ట మీసుకృతి ♦ కొంచువిధంబులు ప్రీతిఁ గూర్పు,వీ
దంట మరల్ప మాతరమె ♦ దాశరథీ! యన రామచంద్రుఁడున్. ౨౪౯౬

ఉ. ఆపలు కాలకించి భర ♦ తా యిటు లౌ హితు లౌచుధర్మమే
ధాపరు లైనవారినుడి ♦ దద్దయు నీమది వీరిపల్కులున్

[1] అధమర్ణుఁడు = అప్పుపుచ్చికొనినవాఁడు. [2] ఉత్తమర్ణుఁడు = అప్పిచ్చినవాఁడు.

నాపలుకుం దలంచి మఱి ♦ న్యాయ్యపథంబునఁ బొమ్ము, తేఁకే
లా పడియుండ, నన్నును జ♦లంబుల నంటుము దోషశాంతికై. ౨౪౯౭

కం. అన లేచి భరతుఁ డటువలె, వినయంబున జలము లంటి ♦ విశ్వజనంబుల్
విన ని ట్లనియె న్విభుఁడీ, జనములు నాపల్కు సరస♦సమ్మతరీతిన్. ౨౪౯౮

ఉ. కోరినవాఁడఁగాను ధరఁ ♦ గూర్పు మటంచును దండ్రి, నెప్పుడున్
గోరినవాఁడఁగా నిటులు ♦ కుత్సితవృత్తిఁ జరింపఁ గైకయున్,
శ్రీరఘురాముఁ డీయడవిఁ ♦ జేరు టెఱుంగను, దండ్రివాక్యమే
తీరుపఁ గార్యమేని వని ♦ దేవరమాఱుగ నేన యుండెదన్. ౨౪౯౯

## శ్రీరాముఁడు వనవాసానంతరము రాజ్యంబుఁ గొన నంగీకరించుట.

కవిరాజవిరాజితము.

అనవుడుఁ దథ్యహితోక్తికి విస్మితుఁ♦డై విభుఁ డిట్లనుఁ బౌరులతో
జనకుఁడు జీవితుఁడై విధియించిన♦చందముఁ దప్పఁగ నొప్పని యీ
తనికిని నాకును గావునఁ దద్విధి ♦ దప్పఁగ నేఁడిట నొల్లఁ జుఁడీ
వని విధిఁ దీర్పఁగఁ జాలెడి నేనెటు♦భంగి భరం బిడ బాలునిపై. ౨౫౦౦

ఉ. న్యాయము పల్కఁ గైక, వసు♦ధాధిపుఁడుం జరియించె ధర్మమం
దీయనఘుండు ధీరగుణుఁ ♦ డీడ్యుఁడు శాంతుఁడు వృద్ధసేవనా
త్యాయతభక్తియుక్తుఁ డని ♦ యాత్మ నెఱుంగుదు, సత్యశీలి కై
కేయిప్రియాత్మసూతికిని ♦ క్షేమము కల్గెడు నెల్ల వేళలన్. ౨౫౦౧

చం. వనమున నాలుగుంబదియు♦వర్షము లుండి యనంతరంబు ప
ట్టనమున కేఁగుదెంచి ప్రక♦టంబుగఁ బట్టము నొంది యప్పు డీ
యనుజునితోడ నుందు నెటు ♦ లంబ వచించినపల్కుఁ దీర్తు నా
యనువునఁ బెద్దవాఁడ నని ♦ యాడినఁ దీర్పఁగ రాదె వీనికిన్. ౨౫౦౨

సీ. అనఁగ నంతరిక్షు ♦ లైనసిద్ధర్షులు, నన్నదమ్ములపల్కు ♦ లాలకించి
యద్దిరా యిట్టిమ♦హాత్ములఁ గన్నయా, దశరథుం డెంతటి♦ధన్యతముఁడొ
యని ప్రశంసించిరి ♦ యాత్మల దశకంఠువధముఁ గోరుచు నున్న♦పరమమునులు
భరతునిఁ గన్గొని ♦ పల్కిరి నీతండ్రి, తరియింపఁ గోరెడి♦తలఁపు గల్గె

ఆ. నేని గ్రాహ్య మగును ♦ జానకీధవుపల్కు, తండ్రిఋణముఁ దీర్పఁ ♦ దగు నితనికిఁ
గైకఋణము దీఱఁ ♦ గాదె నీజనకుండు, స్వర్గలోకమునకుఁ ♦ జనుట భరత.

తే. అనుచుగంధర్వసిద్ధర్షు ♦ లరిగి రిచ్చ, హృష్టవదనాబ్జుఁ డగుచు సీ♦తేశుఁ డపుడు
మునులవాక్యంబులకుఁ జాల♦మోద మంది, వారి నెల్లరఁ బూజించె ♦ గౌరవమున.

తే. అందఱకు సమ్మతం బైన♦యగ్రజాతు,వాక్యముల విని భయమున ♦ వణఁకుమేన
హస్తములు రెండు జోడించి ♦ యధికవినయ,గరిమ నిట్లను జానకీ♦కాంతుఁ గనుచు.

చం. అతులపరంపరాగతని♦జాన్వయధర్మము క్షత్త్రధర్మముల్
మతిఁ దలపోసి తీర్పఁ దగు ♦ మామకమాతృమనోరథంబు లీ
క్షితితల మే నొకండఁ దమి ♦ సేయఁ జుమీ భరియింప, భూప్రజా
వితతిమనంబు సంతసము♦పెట్టఁగ నైనను నేర నన్న యా. ౨౫౦౬

కం. మనచుట్టంబులు యోధులు, మనసుహృదులు మిత్త్రజనులు ♦ మాననిలివురుల్
నిను నెదురుచూచువారలు,జనవర! వానకును హాలిక♦జనములమాడ్కిన్. ౨౫౦౭

శా. అన్నా! రాజ్యము నొల్ల నీవ కొనవే ♦ యర్థ్యాంశ మీ వంచు నా
పన్నుండై పడి పాదపద్మయుగళిం ♦ బ్రార్థింపఁగా రాముఁ డు
త్పన్నప్రేమను లేవ నెత్తి తనయు♦త్సంగంబునం జేర్చి భా
స్వన్నీలాబ్జతనుల్ మరాళరవుఁ గం♦జాతేక్షణుం బల్కెడున్. ౨౫౦౮

శ్రీరాముఁడు భరతుని సమాధానపఱుచుట.

చం. అహితభయప్రదానచరి♦తా! వినయాన్విత మిట్టిబుద్ధియుల్
సహజముగా లభించినప్ర♦శస్తగుణుండవు నీకు లక్ష్యమే
మహిపరిపాలనంబు, మతి♦మంతులు మంత్త్రులు మిత్త్రులుల్ సదా
విహితమె పల్కుచుండుదురు ♦ వీరిమతిన్ ఘటియింపు కార్యముల్. ౨౫౦౯

ఉ. పాయును గాక లక్ష్మి హిమ♦భానుమనోహరమండలంబునన్,
బాయును గాక మంచు హిమ♦వన్నగరాజమునుండి, వేలనే
పాయును గాక సాగరము ♦ విశ్వము ముంపఁగ రామచంద్రుఁడుల్
నాయన! తండ్రిసత్యవచ♦నంబును దప్పఁడు, మాట లేటికన్. ౨౫౧౦

ఆ. కామ మైన నేమి ♦ కడులోభ మగు నేమి, నీకుఁగాను గోరె ♦ నీదుతల్లి
తల్లి తల్లిగాదె ♦ తనయుఁ డాయమపల్కు, సేయ వలదె తక్కు♦చింత విడుము.

శ్రీరాముఁడు భరతునకుఁ దనపాదుక లొసంగుట.

సీ. అనుచు వచించిన ♦ యాదిత్యసమతేజు, నన్నను గనుఁగొని ♦ యనియె భరతుఁ
డన్న నీవింతటి♦యచలప్రతిజ్ఞుండ, వైన నేనే మందు ♦ నయ్య నిన్ను
నాయభాగ్యముగాక ♦ మాయు రే యింతైన, నీమది గరఁగదు ♦ నిర్మలాత్మ
యూరక పో నొల్లఁ ♦ గూరిమి మోపుము, ధర్మభూషితరత్న♦పాదుకలను

ఆ. నీదుచరణములను ♦ నెమ్మి నాశ్రీరామ,భద్రుఁ డట్ల యిచ్చె ♦ భరతునకును
వానిఁ దా గ్రహించి ♦ వఱలినభక్తిని, హస్తయుగము మోడ్చి ♦ యన్న కనియె.

చం. విను పదునాలుగేండ్లు రఘు♦వీర! జటాజినధారి నై ధృతిన్
దినములు లెక్కవెట్టుచును ♦ దిన్చు ఫలంబుల, నూరివెల్పలన్
గొని నియమంబుఁ, బాదుకల♦కున్ వినిపించుచు రాజ్యతంత్రమున్
మనియెద; నగ్నిఁ జొచ్చెదఁ జ♦మూ మఱుతేపట నీవు రానిచోన్. ౨౫౧౩

కం. అనవుడు నట్లుల కాని,మ్మని బాస యొసఁగి కౌఁగిలించి ♦ యతనిన్ శత్రు
ఘ్నుని నూఱడఁ బల్కుచు ని, ట్లనియెన్ రాముండు కైక♦యాత్మజుతోడన్. ౨౫౧౪

కం. పోషింపుము కైకను సం,తోషంబున; నాడె దేమొ ♦ దూషణ మాపెన్
రోషమున నిన్ను సీతా,యోషయు నేనును శపింతు ♦ ముర్వీశసుతా! ౨౫౧౫

మ. అనుచుం గన్నుల నీరు గ్రమ్మఁ జని ర♦మ్మా నాయనా! యంచుఁ ద
మ్ముని వీడ్కొల్పె, నతండు పట్టకరిరా♦ణ్మూర్ధంబునం బాదుకల్
వినయం బారఁగ నిల్పి రాముడను బా♦ళిన్ మ్రొక్కి, రాముండునున్
జనవారన్ సెలవిచ్చె నైగమున ను♦న్యస్తాసుసుంత్రాన్యశీకిన్. ౨౫౧౬

కం. తను వీడ్కొనలే కేడ్చుచు,తనతల్లుల కెల్లరకును ♦ దండవదభివా
దనములు ఘటించి చొచ్చెం, దనదుకుటీరంబు రోద♦నస్వరయుతుఁడై. ౨౫౧౭

భరతుఁ డయోధ్యకుఁ బ్రయాణ మయి భరద్వాజాశ్రమంబుఁ జేరుట.

సీ. భరతుండు శ్రీరాము♦పాదుకల్ తలఁదాల్చి, తుష్టుఁడై రథము శ♦త్రుఘ్నుతోడ
నెక్కి వసిష్ఠుము♦నీశుండు జాబాలి, వామదేవుండుఁ గౌ♦స్వామిఁ జనిరి
మంత్రియుక్తంబుగ ♦ మందాకినిఁ గనుచుఁ, దూరుపుముఖముగ ♦ దూర మరిగి
చిత్రకూటము ప్రద♦క్షిణముగ నరుగుచో, గైరికధాతుని♦కాయములను

ఆ. బార్శ్వములను గనుచు ♦ భరతుండు సేనతోఁ, జిత్రకూటమునకుఁ ♦ జేయలంతి
నట్లగన్బ తేజుఁ ♦ డగు భరద్వాజుని,యాశ్రమంబుఁ గాంచె ♦ నమలమతిని. ౨౫౧౮

చం. అరదము డిగ్గి కాల్నడన ♦ యాయన డాయఁగ నేగి నమ్రుఁడై
చరణములందు వ్రాలుటయు ♦ సన్మునమార నతండు నాయనా!
ఖరకరతేజు రాముబిభుఁ ♦ గాంచితివే? పను తెల్లఁ దీరెనే?
భరత! యటన్న నాతఁ డిటు ♦ పల్కుఁ దపోధనశీతభానువున్. ౨౫౧౯

ఉ. అన్నవు నీ వటంటి, నృథ ♦ యాలసిపా లయినాఁడ నంటి, నన్
మన్నన చేయు మంటి, దయ ♦ మాలుట నీకును జన్నె యంటి, నేఁ
గన్నుల నీరు పెట్టితిని ♦ గట్టిగఁ బట్టితిఁ బాదయుగ్మ, మే
నెన్నివిధాల వేఁడ మది ♦ నించుక త్రిప్పఁడ యేమి సేయుదున్. ౨౫౨౦

తే. మాగురుండును గడుబతి♦మాలుకొనఁగ, రాముఁడనియెను మానిను♦త్రామునకును
జనకుఁ డాడినరీతిని ♦ వనములందుఁ, బదియు నాల్గేండ్లు వసియింతు ♦ బాస దీక్ష.

ఉ. ఆన్పృథచిత్తుమాట విని ♦ యాముని యిట్లను క్షేమయోగసం
పాదనచుంచువుల్ కనక♦పాదుకలిస్సు యయోధ్య నేల నా
శ్రీదయితుండు ప్రాఙ్ముఖుఁడు ♦ చెచ్చెరఁ బామక లెక్కి వీని నెం
తే దయతోడ నిచ్చెను ము♦నీశ్వర! భూపరిపాలనార్థమై. ౨౪.౨౨

ఉ. పొమ్మన నిట్లు వచ్చితిని ♦ బోదు నయోధ్యకుఁ బాదుకాద్వయిన్
సమ్మతిఁ గొంచు నన్న విని ♦ సంయమి యిట్లను సాధుశీలస
త్తమ్ముల సన్నుతుండ వఁట ♦ ధన్యచరిత్ర భవచ్చరిత్ర చి
త్రమ్మెకో? మిట్టనీళు లరు♦దా కనఁ బల్లపునేల కేగుటల్? ౨౪.౨౩

కం. నీవంటిసుతుఁడు గలుగఁగ, భూవిభుఁ డగుదశరథుండు ♦ భువి విడిచియుఁ దా
జీవించిన వాఁడే యనఁ, బావనమతి భరతుఁ డెఱఁగి ♦ వాచంయమికిన్. ౨౪.౨౪

చం. తనపరివారము గ్గొలువ ♦ దాశరథుండు పురంబుఁ బోవుచో
వినతనయం దరించి కని ♦ యింపు దొలంకఁగ జాహ్నవీస్రవం
తిని, వెస దాని దాఁటి చని ♦ తీరమునందలిశృంగిబేరప
త్తనమును జొచ్చి యన్నయును ♦ దండ్రియు లేనియయోధ్యఁ గాంచుచున్.

కం. సారథితో ననియె నిరా,కార నిరానంద దీన ♦ గళితస్వర మై
సారమటి నగరి యుండెడి,తీరును గను మనుచుఁ బురము ♦ దీనతఁ జొచ్చెన్.

నిరానంద మైనయయోధ్యాపురి వర్ణనము.

మధురగతిరగడ.

పిల్లులు గూబలు ♦ పెల్లవుదానిని, మల్లడిగొను కరి♦మనుజులదానిని
శ్రీ లఱఁ జిమ్మని♦చీఁకట్లలమఁగఁ, గాలనిశాగతిఁ ♦ గ్రాలెడిదానిని
గ్రహపీడితశశి♦కాంతారీతిని, మహామతి తేజము ♦ మలిగినదానిని
నిగిరిన క్రాఁగిన ♦ యించుకనీళ్లను, సెగలను బొగిలెడి♦చిఱువిహగములను
విలయముఁ గాంచుపి♦విధమత్స్యములను, సెలగమే అనఁగను ♦ జెలఁగెడిదానిని
సనమున బంగరు♦చాయల మించుచు, హవిసున నణఁగిన♦యగ్నిని బోలుచుఁ
జెదరినగజములుఁ ♦ జిట్లినధ్వజములుఁ, బదరినవాజులుఁ ♦ బగిలిన తేరులుఁ
గలిగి విరోధులు ♦ కలఁచిన జెగ్గిలి, కలఁగినదం డనఁ♦గాఁ దగుదానిని
ఫేనము ధ్వానము ♦ పెల్లయి పెద్దతు,పానున గాలియుఁ ♦ బరిశాంతముగా
స్తిమితతఁ గాంచిన♦సింధుతరంగము,గుమి నా మ్రోఁతలు ♦ గూడనిదానిని
యజ్ఞాంతంబున ♦ యాజకయూథము, యజ్ఞాయుధములు ♦ నన్నియుఁ బాయఁగ
వీతరవం బగు♦వేదిని బోలుచు, నాతతజనసూ♦న్యం బవుదానిని
లేఁబచ్చికఁ దల ♦ లీలన్ వ్రాల్పక, యాఁబో తెడచన ♦ నటమట గొనియెడి

గోమండల మనఁ♦గూడినదానిని, శ్రీమంతం బయి ♦ స్నిగ్ధతరం బయి
తేజోయుత మయి ♦ దివ్యతరం బయి, రాజిలునుత్తమ♦రత్నశ్రేణులు
తీరఁగ రాలినఁ ♦ దేజము దూలిన,హారం బనఁ గొమ♦రారినదానిని
జలిపినపుణ్యము ♦ క్షయ మయి పోవఁగ,నిలఁ బడుచుక్కను ♦ నెనసినదానిని
బంభరకోటులఁ ♦ బలుసూనంబుల, సంభరిత మయి వ♦సంతాంతంబునఁ
గారున నగ్గికిఁ ♦ గమరినతీఁగఁ,తీరునఁ గాంతులు ♦ దీఱినదానిని
బేరము సారము ♦ పేరును లేమిని,ద్వారము తెఱవని♦పణ్యస్థలమై
మఱుఁగఁగఁ జుక్కలు♦మబ్బున శశితో, నెఱిమాసినయా♦నిశ నగుదానిని
నుత్తకడనలును ♦ నుత్తపిడుతలును, గత్తరఁ గెడసిన♦కల్లందిర మన
దొరలెడికుండలుఁ ♦ దూలెడిగోడలు, జరగుచుఁ బాడఱు♦చలిపందిలి యన
వీరుని బెఱిదవు♦వింటను నెక్కిడ, నారాచంబున ♦ నఱకఁగ నైగులు
బిగి చెడి నేలను ♦ వ్రీలినజ్యాలత,నగ నగ చెడి జిగి♦పాసినదానిని
నాహవశూరుం ♦ డశ్వాభరణ,వ్యూహంబులచేఁ ♦ బొలుపుగఁ దీర్చియుఁ
గలనికి నుపయో♦గము గా కుండుట, తొలఁచుకిశోరము♦తోఁ బో ల్దానిని
గచ్ఛపమత్స్యని♦కాయంబులచే, నచ్ఛం బయి శుం♦పాకంబుక మగుచును
గూలము దొరలఁగఁ ♦ గువలము నెడలఁగ, వాలి చెడినకూ♦పాలిని బోలుచు
వగపునఁ జర్చా♦భరణవిహీనుని, జిగిచెడుమే ననఁ♦జెలఁగిన దానిని
జడికారున బహు♦జలధరసంతతి, విడునక క్రమ్మ ర♦విప్రభ నాఁగను
నొప్పుచు నున్నయ♦యోధ్యాపురిఁ గని, యప్పుడు భరతుం ♦ డలమటఁ జొచ్చెను.

భరతుఁడు మరల నయోధ్యఁ బ్రవేశించుట.

ఉ. స్యందనమందు యుండి తన♦సారథిఁ జూచి యయో పురంబునం
దెందును మున్నటట్లు కదు♦హృద్యము లౌశుభగీతవాద్యముల్
విందుగ వీనులం బడవు ♦ విస్రుతచందనగంధమాలికా
బృందసుగంధబంధుర వ♦రిష్ఠసమీరము వీవ దియ్యెడన్. ౨౫౭

ఉ. రాముఁడు లేమిఁ జూవె నగ♦రంబునఁ బల్లకి మోయుమొత్తఁతలుఁ
సామజబృంహితంబులును ♦ సైంధవహేషలు స్యందనారవం
బేమియుఁ దోఁప దయ్యె యొక♦రేనియుఁ జందనపుష్పమాలికా
స్తోమముఁ దాల్ప రార్తిఁ బరి♦తోషము లేమి వయోవిజృంభితుల్. ౨౫౮

కం. హాళిం బురి వెలుపల వా, హ్యాళిం జన రెవరుఁ బుష్ప♦హారవిభూషా
పాళి న్మైయిఁ దాలిచి జన,పాళి రాముండు లేమిఁ ♦ బత్తనమందున్. ౨౫౯

కం. మాయన్న రాముతోడన, యీయయూరికళావిలాస ♦ మెల్లను జనె; ధా
రామయశిన్నతసితయామిని,యో యనఁ గనబట్టె సీమ♦యోధ్యాపురియున్. ౨౬౦

కం. ఎన్నండు వచ్చునో మా, యన్న జనోత్సవముతోడ ♦ నందఱకును దా
నెన్నండు మోద మిడునో, పన్నగ వేసంగిమబ్బు ♦ భాతిని సఖుఁడా. ౨౫౩౨

చం. యువయువతీజనావళుల ♦ నొక్కరయేని మహాపథంబునన్
సవురుగఁ డాఁకుటీకుగను ♦ సంచరణం బొనరింప రంచు హె
చ్చువుచగ సింహహీనగుహ ♦ నర్కవిహీనదినంబు భూమిభృ
ద్భవనముఁ జొచ్చి సూర్యరహి ♦ తం బగు మిన్నన నున్నఁ బొక్కుచున్. ౨౫౩౩

భరతుఁడు నందిగ్రామముఁ జేరుట.

శా. అందుం దల్లుల నుండఁ బంచి గురుతో ♦ నానద్వితాస్యం డనున్
నందిగ్రామమున న్వసించిన దురం ♦ తం బైనశోకంబునన్
గ్రుందం బోవక తాళుకోఁ గలను జు ♦ మ్మా శావ్రనం బోయి నే
నందే శాఁపుర ముందు, నెల్లరును నా ♦ కాజ్ఞప్తిఁ గావింపుఁడీ. ౨౫౩౪

కం. భూమీశుఁ డరిగె దివికి, న్రాముఁడు నాగురుఁడు వనికి ♦ నపచెను నట నే
రామాగమనము వేచెద, రాముఁడె రాష్ట్రమున కెల్ల ♦ రాజు మహాత్మా. ౨౫౩౫

చం. అది విని మంత్రులు న్గురుఁడు ♦ నాశుభవాక్యము గారవించి త్వ
ద్గదితము శ్లాఘనీయము హి ♦ తంబు భవాదృశభ్రాతృవత్సలుం
డుదితయశుండు సన్నుతసు ♦ లోచ్ఛ్రవుఁడున్ నిజబంధులుబ్భుఁ డి
ట్టియ్యది ఘటియింతు నన్నఁ జరి ♦ తార్థక యెవ్వఁడు సన్నుతింపఁడో. ౨౫౩౬

చం. అని తనయిచ్చచొప్పునన ♦ యాడఁగ మంత్రులు రాజు నారథిం
గని ఘటియింపుమీ రథము ♦ గ్రక్కున నా నతఁ డట్లు సేయఁగా
జనను లెల్ల మ్రొక్కి యను ♦ జాతుఁడు దోడన రాఁగ ముందుగాఁ
జన గురుఁ డాదిగా, నరిగె ♦ శక్రదిశాభిముఖంబుగా వెసన్. ౨౫౩౭

మ. దళము ల్మంత్రులు వారె రాఁగఁ దనముం ♦ దంబందుఁ బాదూర్వయిన్
వెలయం జేసి నృపాలనందనుఁడు నం ♦ దిగ్రామముం జేరి మా
నిలలామంబును గాంచి యుల్లసిగ మా ♦ నీ! యుంచె మాయన్న య
స్ఖలితప్రేమను రాజ్య మిచ్చి క్షితియో ♦ గక్షేమముల్ పూనెడిన్. ౨౫౩౮

సీ. అని సచివాదులఁ ♦ గనుఁగొని మాయన్న, చరణంబులకు ఛత్ర ♦ చామరములు
పట్టుఁడీ యివియ మా ♦ ప్రభుత నింక నహించు, నతులితకరుణ మా ♦ యన్న వీని
నాకు నిల్లడ యిచ్చె ♦ ధర్మైకన్యకాధనుం, డరుదెంచుదాఁక న ♦ త్యంతభక్తి
రక్షింతు వీనిని ♦ రాముండు చనుదేర, నర్పించి మరల రా ♦ జ్యంబుతోడ

తే. నతని భజియించి యశకీర్తి ♦ నణఁచువాఁడ
నాయనకు రాజ్య మిచ్చుట ♦ యందఱకును

సంతసం బిను నదిను య॥శంబుఁ గూర్చు
మఱియు రాజ్యంబుకంటె న॥న్నాడుఁగు లెస్స. ౨౫౩౯

చం అని మునివేషయుక్తుఁ డగు॥నాభరతుం డలపాదుకాద్వయిన్
గనకపుసింహపీఠి నిడి॥ కౌతుక మారఁగఁ గట్టి పట్టమున్
దినముదినంబు కార్యములఁ॥ దెల్పుచు వాసికిఁ దొల్త, నన్నరా
కను మది వేచుచుం బ్రజ సు॥ఖంపఁగ రాజ్యము సేయు చుండఁగన్. ౨౫౪౦

ఋషీశ్వరులు చిత్రకూటంబు విడిచి పోవుట.

సీ. అక్కడ శ్రీరాముఁ॥ డనుజసమేతుఁ డై, చిత్రకూటమున వ॥సించు చుండి
భరతుండు పోయిన॥పదపడి యచ్చటి,సంయమీంద్రులు తన॥చాయఁ జూచి
గుసగుస లాడుచుఁ॥ గొంకుచుఁ జెప్పంగఁ,గనుబొమ్మ లార్చుచుఁ॥ గనులు గిఱపు
కొనుచును డాయుచు॥ నని బోయి యేమేమొ, క్రుంగుచు నీరీతి॥ మిణుకు చున్న

తే. వీరిచంద మిదేమియో॥ వింత దోఁచె, నంచు శంకించి యెఱిఁగెన॥ నంచు నందుఁ
గులపతిని జూచి కేల్మోడ్చి॥ జలజబాంధ,వాన్వవాయప్రదీప మి॥ ట్లనియె నపుడు.

చం. మునివర! నాదువర్తనము॥ మున్పటియట్టిది కాదొ, కాక నా
యనుజుఁడు పాడి దప్పె నొ క॥టా, పొరపాటున నేని ధారిణీ
తనయయు మత్సపర్యకయి॥ తావక సేనలపట్టులన్ సతీ
జనహితవృత్తిఁ బాసెనొకొ॥ సంభ్రమ మేటికి నొంద సంయముల్? ౨౫౪౨

వృద్ధఋషి తమకష్టంబుల శ్రీరామునితోఁ జెప్పుట.

సీ. అనుడు వయోవృద్ధుఁ॥డును దపోవృద్ధుఁడు, నైనయాముని వేష॥మానుఁ డగుచుఁ
బరమకళ్యాణస్వ॥భావజానకి యేడ, నందులోఁ దపసుల॥యందుఁ దప్పి
నడచుట యది యేడ॥ నాయనా! నిన్గొల్చి, యే నుమ్ము తాపసు॥ లిట్టు లగుట
రాక్షసతతిచేత॥ రాయిడిపడి యిట్టు, లందఱు గుసగుస॥లాడువారు

ఆ. రాక్షసేంద్రుఁ డైన॥రావణుతమ్ముఁడు, ఖరుఁడు నిర్దయుండు॥ పురుషభోజి
గర్వి పాపి సుజిత॥కాశి నీ విట వచ్చి,నదియు మొదలు మమ్ము॥ నుదిల పెట్టు.

ఉ. ఒల్లరు వారు నీయిచటి॥యున్కిని, మీ రిట వచ్చు టాదిగాఁ
బెల్లున మౌనికోటులకుఁ॥ బీడ నొనర్చుచు నున్నవారు హృ
ద్భల్లనికాశు లై బహుళ॥దారుణభీషణరూపధారు లై
యెల్లెడఁ బెల్లురేఁగి మము॥ హింస యొనర్చెద రేమి చెప్పుదున్. ౨౫౪౪

తే. అప్రశస్తంబు లైనప॥దార్థములను
మీఁద వగిరించి మునులను॥ మోఁది చనిరి

పెలుచ దుష్టులు ఋషులముం♦గలను నిలిచి
ప్రాణములు దీసి చనిరి వి♦త్రాస మొదవ. ౨౫౪౫

ఉ. డాఁగి మఱుంగుతావులఁ ద♦టాలునఁ బైపడి కొన్ని చోటులన్
జాఁగఱిగొంచు స్రుక్కులను ♦ నాశము సేయుచు హోమవహ్నులం
దోఁగఁగఁ జేయుచుం బగుల ♦ నూకుచుఁ బాత్ర లుపద్రవింపఁగా
వేఁగుచు నున్నవారము వి♦వేకనిధీ! యొకభంగి నియ్యెడన్. ౨౫౪౬

ఉ. చచ్చినవార లేమొ యిటఁ ♦ జచ్చిరి, చావక యున్నవార మే
నెచ్చటికైనఁ బోద మని ♦ యిందఱు న న్బరిగొల్ప వచ్చి నా
రిచ్చటి కెంతొ దవ్వున న♦రేశ్వర! నిర్భరపత్రపుష్పసం
పచ్చతురంబు భాసిలుఁ జు♦మా ప్రతనాశ్రమ మొండు రమ్య మై. ౨౫౪౭

ఉ. చేరెద మందు నిందఱము ♦ చేవ గలట్టిర మైన సీతతో
మీ రిట నుంట కానిపని ♦ మేకొనుదేనియు వెంట రాఁగ నే
తేరఁడు మీర లాఖరుఁడు ♦ దేఁకువఁ బైపడకుండుమున్న, యా
క్రూరునితోడిపోరితము ♦ గోడిపు దక్షున కైన రాఘవా. ౨౫౪౮

ఉ. మానివరుం డిటుల్ పలుక ♦ మానవసింహము వారికిన్ సమా
ధానము లెన్ని చెప్పిన యు♦ధామతిఁ బోయిరి వారు, రాముఁడున్
మానుల వెంటఁ గొందనుక ♦ మార్గము పోయియు సాగనంపి య
మ్మానివరేణ్యు మ్రొక్కి ముని♦మండనునానతి వచ్చె నింటికిన్. ౨౫౪౯

సీతారామలక్ష్మణు లత్రిమునియాశ్రమంబుఁ జేరుట.

చం. తపసులు చన్న వెన్క వసు♦ధాపతి యించుక చింత సేయుచున్
నెపములు పెక్కు లున్నయవి ♦ నే నిట నిల్వఁగరామి కియ్యెడన్
సపరిజనుండు మాతృజన♦సంయుతుఁ డాభరతుండు న న్గనెం
దపతెపలాడెడిన్ మనము ♦ తద్దయు నయ్యది సంస్మరించినన్. ౨౫౫౦

కం. బంధురగుణుఁ డగుభరతుని, స్కంధావారంబు విడిసె ♦ సవిధాననిఁ ద
త్సింధురవాజికరీషపు, గంధంబున నిలువ మేలు ♦ గా దిచ్చోటన్. ౨౫౫౧

ఉ. కావున దీనిఁ బాసి యెస♦గాఁ జనుటే యుచితం బటంచు నా
మూవురు బైలుదేరి ముని♦ముఖ్యుని నత్రిని జేరి మ్రొక్కినన్
భావము పొంగఁ బుత్రకుల♦భంగిని వారల నాదరించి సం
భావన నాతిథేయ మిడి ♦ భవ్యచరిత్ర పవిత్రవృద్ధయున్. ౨౫౫౨

మ. తనయిల్లా లనసూయ తాపసి మహా♦ధర్మాత్మ తన్ డాసినన్
జనకాత్మజకన్ జూపి సతి! యీ♦సాధ్వీలలామంబు భూ

తనయా! రత్నము గా గణింపు మని ప్రీ♦తస్వాంతుఁడై పల్కి యా
యనసూయామహిమంబు వాఁగొనియె రా♦మాధీశుతో నీగతిన్. ౨౫౫౩
చం. దిను కనుమాట లేక నర♦జీవచయంబు ప్రదగ్ధమైనచోఁ,
దనదుతపంబునన్ ఫలవి♦తానము మూలములున్ దశాబ్దముల్
పెనుపడఁ జేసె గంగతటిఁ ♦ బెద్దతపంబునఁ దీవ్రనిష్ఠఁ గై
కొనెఁ బదివేలయేఁడులు వి♦కుంఠితసర్వతపోంతరాయ యై. ౨౫౫౪
తే. దేవకార్యనిమిత్త మీ♦దేవి పదియు, రాతుయల నెల్ల నేకరా♦త్రంబుఁ జేసె
స్నాత యయ్యెను వ్రతములు ♦ సౌమ్యశీల, తల్లివలెఁ బూజ్య నీకు నో♦ధన్యచరిత.
తే. సర్వభూతనమస్కార్య ♦ సాధుకీర్తి
కోపసంత్యక్త నిజకర్మ♦కోటిచేతఁ
గనియె ననసూయ యనఁగఁ బ్ర♦గస్త జనక
తనయ మ్రొక్కింపు మీవు తా♦త్పర్యయుక్తి. ౨౫౫౬
కం. అనవుడును రామచంద్రుఁడు, జనకసుతం గాంచి యనియె ♦ జానకి! వింటే
మునిపల్కులు వృద్ధతపస్విని వే కాన్పించుకొనుము ♦ చేకుఱు శుభముల్. ౨౫౫౭

సీత కనసూయ హితోపదేశంబుఁ జేయుట.

సీ. పతిపలు కాలించి ♦ క్షితికన్య చని వృద్ధ, నొడలెల్ల ముడుతలు ♦ పడినదానిఁ
బండుముదిమిచేతఁ ♦ బాండురం బగుతల, వెండ్రుకల్ జడ లయి♦ వెలయుదాని
నోరుగాలిఁ జలించు ♦ చున్నయనంటి నా, మిగుల వణంకెడి♦ మేనిదాని
ధాత్రిఁ బతివ్రతా♦ధర్మంబె రూపంబుఁ, జేకొన్నవిధముగఁ ♦ జెలఁగుదానిఁ
తే. గాంచి జనకతనూభవ♦కరముభక్తిఁ, దనదుపేర్వాడి మ్రొక్కి హ♦స్తములుమోడ్చి
నిలిచి కుశలంబు లడుగ నా♦నిర్మలాత్మ, యమ్మహాభాగతోడ ని♦ట్లనియెఁ బ్రీతి.
ఉ. ఎంతటిపుణ్యశీలవొ క♦దే జనకాత్మజ! సాధ్విధర్మ మే
కాంతముఁ బూని, బంధులను ♦ గల్మిని సౌఖ్యముఁ బాసి, మాన మా
నంతయు లెక్కసేయక, వ♦నావళికిన్ వ్రత మూని వచ్చి నీ
కాంతునితోడ వచ్చితివి ♦ కామిను లిట్టిరు గల్గిరే భువిన్. ౨౫౫౯
కం. నగరస్థుఁడో విపినస్థుఁడో, యగుణియొ నిర్ధనుఁడో ఖలుఁడో ♦ యతికాముకుఁడో
మగనాలికిఁ దనపతియే, సుగతికిఁ గారణ మతండ ♦ చూ దైవంబున్. ౨౫౬౦
చం. తనయొనరించినట్టిసుకృ♦తంపుఁదపంబువిధాన జానకీ!
తను నిఖిలస్థలంబులను ♦ దద్దయుఁ బ్రోచెడిప్రాణభర్తకం
టెను మఱి మేటిచుట్టమును ♦ నే నెఱుఁగం జుమి, యాఁగ లైనయా
వనిత లెఱుంగలేరు మను♦వా! తగ వాఱిపోక పోవుచున. ౨౫౬౧

చం. తనపతి సద్ద సేయక ని♦తాంతలకాంతశరార్తి నిచ్చమైఁ
జనియెడివారు, ప్రాణవిభు ♦ శాసన పెట్టెడివారు, దుర్యశం
బున నరఘస్థసంమ్మృతిని ♦ బొల్పతి పోవుదు రమ్మ! యిందు నం
దును గుణదోషమూఢ లయి ♦ దుష్టగుణంబు సుఖంబుఁ గూర్చునే. ౨౫౬౨

కం. ఇటువడి పాటించుచు మదిఁ, దలఁచుచు మేల్గీల్లు శుభముఁ ♦ దప్పనిసాధ్వీ
తిలకము సమస్తసత్కర్మం,బులు చేసినవారిమాడ్కిఁ ♦ బొందుఁ ద్రిదివమున్. ౨౫౬౩

చం. సుమతిని బుట్టినింటికిని ♦ జొచ్చినయింటికిఁ గీర్తిఁ దెచ్చునా
సుమహితసద్గుణప్రకర♦శోభిత సన్నుతశీల సాధ్వి యు
త్తమయశముం బడంపడి ని♦తాంతశుభంబును బొంది నాకసౌ
ఖ్యముఁ గనుఁగాన భర్తృహిత♦కారిణివై చరియింపు మంగనా! ౨౫౬౪

కం. అని యనసూయయు ననసూ,యను దను వచియించినట్టి ♦ యప్పలుకులకున్
జనకతనూభవ యలరుచు, మనమున నిట్లనియె మంద♦మధురమృదూక్తిన్.

### సీత యనసూయవాక్యంబులకు మోదించుట.

కం. నీవంటితపశ్శాలిని, యీవిధముగ ననుట చిత్ర♦మే సాధ్వులకున్
సేవింపఁ బ్రాణనాథుఁడె, దైవం బనుమాట దెలియు♦దానను దల్లీ. ౨౫౬౬

ఉ. ఏపతి నృస్తహీనుఁ డగు ♦ నేనియు భర్త యభేదబుద్ధిమై
నోపిక భక్తిఁ గొల్వఁ దగి♦యుండుఁగ నేను జితేంద్రియుండు శ్లా
ఘాపరిపూతసద్గుణుఁడు ♦ కారుణికాగ్రణి ధర్మబుద్ధి మా
తాపితృవత్ప్రియుండు నగు♦ధన్యుసి రాముని గొల్చు టబ్రమే. ౨౫౬౭

ఉ. తుల్యవిలోకనుండు గుణ♦శోయధి రామవిభుండు తల్లిఁ గౌ
సల్యను బోలె నన్యనృప♦నారసనేత్రలఁ జూచి భక్తి సా
కల్యము గా నదాటునను ♦ తద్విభుచూచినకాంత దోఁప సౌ
శీల్యము పెర్గ మాతృనుతి ♦ చేయు నహంకృతిముక్తచిత్తుఁ డై. ౨౫౬౮

ఉ. హత్తినగత్తి నేను విపి♦నాపళికిం జనుదెంచువేళ మా
యత్తయు, నావివాహసమ♦యంబున నంబయుఁ, జెప్పినట్టివా
క్యోత్తమపాళి నాటినది ♦ యుల్లమునం దిపు డీవు వాసినిన్
గ్రొత్తలు చేసి; తంగనల♦కుం బతిసేవయె సత్తపం బగున్. ౨౫౬౯

కం. పతిశుశ్రూషన కాదే, సతి సావిత్రియు వెలుంగు ♦ స్వర్గమునందున్
బతిశుశ్రూషను గాదే, యతివ భవద్ధస్తకలిత ♦ మయ్యె దివంబున్. ౨౫౭౦

కం. దివి దేవత యగురోహిణి,[1] యువతిజనశ్రేష్ఠ యొకము♦హూర్తం బేనిన్
స్వవిభుం దారాపతి నె, డ్డవులక చరియింపఁ గలుగు♦నా యెన్నండున్. ౨౫౭౧

---

[1] రోహిణి - ఈరోహిణి ౨౭ నక్షత్రములలోని రోహిణి కాదు.

చం. స్థిరపతిభక్తిఁ జేసెడిప♦తివ్రత లెల్లు జగన్నుతంబుగా
ధరణిఁ జరించి యాత్మకృత♦ధర్మమునన్ దివిఁ బూజ్యమాన లై
పరఁగుదు రంచుఁ బల్కుముని♦పత్ని నితాంతముదాన జానకిన్
శిరమును మూరుకొంచుఁ దనుఁ ♦ జేరఁగఁ దీసి వచించె నీగతిన్. ౨౫౭౨

శా. అమ్మా! నీదుమనోజ్ఞవాక్కులు మహా♦హ్లాదంబు సంధిల్లెఁ, గొ
ల్కొమ్మా నీకు నభీష్ట మిద్ది సముకూ♦ర్తున్ మత్తపశ్శక్తి, నా
నమ్మాటల్ విని విస్మయంబు దరహా♦సాంకూరముల్ దోఁపఁగా
నమ్మీనాక్షి భవత్కృపం గొదవ లే ♦ దమ్మా యొదే న్నావుడున్. ౨౫౭౩

అనసూయ సీతాదేవి కంగరాగాదు లిచ్చుట.

సీ. ఆమాట లాలించి ♦ యధికతరప్రీతి, నాతపస్విని యిట్టు ♦ లనియె సతికి
నీమాల్యములు వస్త్ర ♦ మీయాభరణములు, నీయంగరాగంబు♦లీవిలేప
మెంతయు దివ్యంబు ♦ లిష్టంబు సంప్రీతిఁ, గొమ్మరో వీనిఁ గై♦కొమ్ము నీవు
వాడవు వీడవు ♦ నలఁపులు పోనవు, నీ కనురూపమ్ము ♦ నెఱిగ నుండు
తే. వీని ధరియించి తేనియు ♦ విద్రుమోష్ఠి! లసదనూనశోభాయుత♦లలితదేహ
వగుచు నలరించెదవు నీవు ♦ ప్రాణవిభుని, వెలఁది మంగళదేవత ♦ విష్ణునట్లు. ౨౫౭౪

కం. అని ప్రీతి నొసంగిన న,జ్జనకతనూజాత వాని ♦ సంతసమునఁ గై
కొని పూతభక్తితో న,మ్మునిపత్నికి మ్రొక్కి నికట♦మునఁ గూర్చుండెన్. ౨౫౭౫

కం. ఇటు లంచునఁ గూర్చుండిన,కుటిలాలకఁ గాంచి యత్రి♦కోమలి విడిము
చ్చట లాడఁ దొడఁగుచును ము,చ్చటమీఱఁగ ననియె రామ♦చంద్రునిసతికిన్.

సీత యనసూయకుఁ దనస్వయంవరమువృత్తాంతముఁ జెప్పుట.

చం. ప్రరుచిరగాత్రుఁ డైనరఘు♦రాముఁడు విక్రమమార నిన్ స్వయం
వరమునఁ బెండ్లియాడె నను♦వార్తను వింటిని, గాని నే నవి
స్తరముగ నాలకింపఁ బ్రను♦దా! మది గోల్పెడుఁ దత్కథన్ వినన్
జరగిన దంతయుం జెపుము ♦ సమ్మద మార నరాళకుంతలా. ౨౫౭౭

సీ. అనవుడు జానకి ♦ వినవమ్మ వినుతు నా,జనకుఁడు జనకుఁడు ♦ క్షత్రధర్మ
రతుఁడు విదేహాధి♦పతి యొక్కనాఁడు దాఁ, గ్రతు వొందు సేయంగఁ ♦ గడఁగి నేల
దున్నింప నాఁగటి♦తుదతాఁకునను భూమి, పెల్లగిల్లఁగ నేను ♦ వెడలి రాఁగ
భూపతి ముష్టివి♦క్షేపతత్పరుఁడు ధా,త్రీపాంసుకుంఠిత♦దేహ నన్నుఁ
తే. గాంచి యబ్బురపడి కన్న♦కన్నవోలె, స్నేహ మూరంగఁ దనయంక♦సీమఁ జేర్చి
మత్తనూభవ యిది యని ♦ మమత చేసె, గగనవాణియు నీమె నీ♦కన్య యనియె.

చం. అన మున మంది హర్షలసి♦తాననుఁడై తన జ్యేష్ఠపత్నికి
చ్చినఁ దనకూఁతువోలె నను ♦ స్నేహము పేరిమిఁ బెంచు చుండఁగాఁ

బనువడె భర్తృయోగసులభం బగుప్రాయము, దానిఁ జూచి ని
ర్ధని ధనవష్టికైవలె నితాంతము చింతఁ దపించుచు న్నదిన్. ౨౫౯

కం. కూఁతులఁ గనునాతఁడు కా,న్యాఁతలు విను వియ్య మాడి కొలఁదులచేనో
లాఁతులచేనో తనతల,వ్రాఁతకొలఁది నింద్రు నంత వాఁడై యున్నన్. ౨౬౦

తే. ఇట్టిగుణధన్య కర్హుఁడై యెసఁగునట్టి
కాంతుఁ డెవ్వఁడు సజ్జనాగ్రణి లభించు
నంచుఁ జింతార్ణవమున మగ్నాత్ముఁ డగుచు
దరిని గనఁ డయ్యెఁ బ్లవహీనుకరణిఁ దండ్రి. ౨౬౧

కం. నన్ను నయోనిజఁ గని యెందు న్నృపతిని మదనరూపుఁ దుల్యునిఁ గన కా
సన్నుతమతి దలఁచెను నా,ప్రసన్నితనయకు స్వయంవరంబు ఘటింతున్. ౨౬౨

చం. అని తనకుక్ మహాధ్వరమునందుఁ బ్రచేతసుఁ డిచ్చియున్న యా
ధనువును నక్షయాశుగవితాన మమానుషచాల్య మాటచే
జనపతు లెక్కు పెట్టఁ దమస్వప్నములందుఁ దలంపరానిదా
నిని దనపిల్వఁబంచుధరణీవిభుకోటికిఁ జూపి యిట్లనున్. ౨౬౩

కం. ఈవింటిని మోపెట్టిన,యాపీరుఁడు నాదుపుత్రి కగు నాథుఁడు నా
త్మావల్లభతతి మ్రొక్కుచు, రావడి యది యెత్తలేమి గ్రక్కునఁ జనఁగన్.

చం. అరుగఁగ దీర్ఘకాలము మహాత్ముఁడు గాధితనూభవుండు దా
శరథుల రామలక్ష్మణుల సన్నుతిమజ్జనకుండు సల్పున
ధ్వరమును జూడఁ దోడుకొని వచ్చి నచించె విదేహనాథుతో
స్మరసుకుమారు లీనృపకుమారకు లాజకుమారు లర్థిలిన్ ౨౬౪

కం. చూపుము నీదాఁచినశివు,చాపముఁ జెప్పించి రాముచంద్రున కనినక్
భూపాలుఁ డట్లు చేయఁగఁ, దాపసునుడి రామవిభుఁడు ధనువుం గదిసెన్.

కం. చాపం బవలీల సమా,రోపం బొనరించి గుణ ముదుగలిం దివియక్
జూవఱు బెగ డొందఁగ నది, కోపటి రెం డయ్యె నశనిఘోషము నిండన్.

ఉ. అంతట సత్యవాది జనకావనినాథుఁడు నన్ను రామభూ
కాంతున కీ జలంబుఁగొనఁ గైకొనఁ డయ్యెను దండ్రియిష్ట మా
వంత నెఱుంగరామి, నపు డాదట మజ్జనకుండు పంచె నా
కాంతుని మామగారి నటఁ గ్రచ్చటఁ దోడ్కొనిరాఁగ దూతలన్. ౨౬౮

తే. జనకుఁ డంతట శ్రీరామచంద్రునకును, నన్ను నొసఁగుచు నూర్మిళానామధేయ
నాదుచెల్లెలి లక్ష్మణునకు నొసంగె, నట్లు రామున కనురక్త నైతి నమ్మ. ౨౬౯

## అనసూయ సీతకు సాయంకాలము వర్ణించి చెప్పుట.

కం. అన మునిసతి శిరమున్ మూ,ర్కొని కౌఁగిటఁ గ్రుచ్చి యనియెఁ ♦ గోకిలవాణీ
వినఁ జిత్రము స్పష్టము తి,య్యన గా భాషించితివి స్వ♦యంవరచరితన్. ౨౪౯౦

ఉ. క్రుంకెను బ్రొద్దు, చీఁకటులు ♦ గూడెను, మేఁతకుఁ జన్న పుల్గులుం
దెంకులు చేరి కూసెడిని ♦ నిద్రకుఁగా, నభిషేకవారికై
పంకజనేత్ర! చన్నముని♦వర్యులదే తడినార లూని పా
త్రాంకితహస్తులై మగిడి ♦ రద్దెసఁ జూడఁగనమ్మ జానకీ. ౨౪౯౧

ఆ. వీతిహోత్రునందు ♦ విధియుక్తి ఋషులు హు
తంబు సేయ మారు♦తమున నెగరు
ధూమములను గంటె ♦ తొగ రెక్క పావురాల్
మెడలజిగిన మెఱసెఁ ♦ బుడమిపట్టి. ౨౪౯౨

కం. పలుచగ నాకులు గలకుజ,ములు సైతము దూరమంద ♦ పొలిచియుఁ జీఁక
ట్లలమఁగ నాకులు నిండిన,చెలువునఁ గన్పించె; దెసల♦చెలువు దొలంగెన్.

కం. అమ్మా! రేద్రిమ్మరి స,త్త్వమ్ములు చరలాడఁ దొడఁగెఁ ♦ దపసులమృగజా
తమ్ములు వేద్యవతరణత,లమ్ముల శయనించెఁ గంటె ♦ లలితేందుముఖీ. ౨౪౯౪

ఉ. రాతిరి చాల నేగె, నుడు♦రాజముఖీ! గగనంబు తారకా
జాతముతో వెలింగెడిని ♦ జంద్రిక మేలిముసుంగుగా నదే
శీతకరుండు దోఁచె రఘు♦శేఖరు డాయఁగఁ బోఁగదమ్మ, సం
ప్రీతి జనించె నిన్నుఁ గన ♦ వేడుక ముచ్చట లాడుచుండఁగన్. ౨౪౯౫

ఉ. వారిజనేత్ర! నాయిడిన♦వస్త్రము లాదిగ నీవు దాల్పఁ గ
న్నారఁగఁ జూడఁ గోరెద, స♦మక్షమునంద ధరింపనమ్మ, నా
ధారుణీశకన్య యన్నియును ♦ దాల్చి నమస్కృతి చేసి రాముని
జేరఁగఁ బోయెఁ దన్నుఁ గని ♦ చిత్తమునన్ ముద మందె నాతఁడున్. ౨౪౯౬

కం జరగినది చెప్పుచును నా,భరణంబులు వస్త్రమాల్య♦పటలియుఁ దనకున్
గరుణను మునిసతి యిచ్చిన,సరణిని వినిపించె రామ♦చంద్రున కెలమిన్. ౨౪౯౭

ఉ. మానవదుర్లభం బయిన♦మానితసత్కృతిఁ జూచి జానకీ
జానియు లక్ష్మణుండు నరు♦సంబునఁ బొంగి తపోధనాఢ్యస
మ్మానన మంది కూర్కి రవి♦మండల మభ్ర మలంకరింప సం
ధ్యానియమాదికల్యవిధు ♦ లన్నియుఁ దీర్చి మునీంద్రకోటులన్. ౨౪౯౮

ఉ. మార్గము వేఁడ వారలు క్ష♦మాధవనందన! యెందుఁ బోవ దు
ర్మార్గచరిష్ణువుల్ వికట♦మాంసభోజులు క్రూరసాహసం

సర్గులు రాక్షసు ల్గలరు ♦ మైలయు సోఁకఁ, బ్రమాద మూన, మా
వర్గమువారి మ్రింగుదురు ♦ వాసవసన్నిభ! దీని నాఁపవే. ౨౪౯౯

తే. అడవులకుఁ బోయి ఫలసంగ్ర♦హంబు సేయు
సంయములు పోయి వచ్చెడి♦జాడ యిదియ
యిదియ మీకును దగుత్రోవ ♦ యేగ నయ్య
యనుచుఁ బ్రాంజలు లగుచు దీ♦నసలు పలుక. ౨౬౦౦

తే. సంయమీంద్రులు మంగళా♦శాసనములు,పలికి తన్నంపఁ దమ్ముండు ♦ జలజనయన
వెంటఁ జనుదేరఁ జొచ్చెను ♦ విపినభూమి,సభ్రమండలమును జల♦జాప్తులీల.[1]

అయోధ్యాకాండాంతపద్యములు.

కం. రాంకారబీజమంత్రవ,రాంక సమస్తప్రశస్త♦హారిగుణచయాఽ
లంకార సకలసులభా, శంకానాస్తిక్యరుద్ధ♦జనతాదూరా. ౨౬౦౨

వనమంజరి. గురుజనవాక్యసమాచరణానమ ♦ కోపకామవిహీనసధీ
పరమకృపాశ్రయ నిశ్చలచిత్తక ♦ భ్రాతృవత్సల కామదా
విరహితదుఃఖసుఖాంతరచేతన ♦ విశ్వసన్నుత భూధవా
నిరుపమధర్మవిధాయి దయామయ ♦ నిత్యహర్ష గుణోజ్జ్వలా. ౨౬౦౩

కమలవిలసితము.

భువనధిఖశరజ♦ముఖనయనాంక, ప్రవిదితపురకృత♦ప్రథితచరిత్రా,
దివిజమనుజనుత ♦ స్థిరతరచిత్తా, ధనవర భవహర ♦ దశరథపుత్రా. ౨౬౦౪

— గద్యము. —

ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందమిళిం
దాయమాన మానసతత్వ మహాన్వైభవ వావిలి
కొలను రామచంద్రరాయతనూభవ సుజనవిధేయ సుబ్బరాయి
నామధేయప్రణీతం బైన శ్రీమదాంధ్ర వాల్మీకిరామా
యణ మనునిర్వచన మహాకావ్యమునం
దయోధ్యాకాండము.

—

శ్రీ రా మా ర్ప ణ మ స్తు.
శ్రీ. శ్రీ. శ్రీ.

శ్లో. నమోస్తు రామాయ సలక్ష్మణాయ, నమోస్తు దేవ్యై జనకాత్మజాయై
నమోస్తు వాతాత్మభువే వరాయ, నమోస్తు వల్మీక భవాయ తస్మై.

---

[1] ఈయుపమానము రాఁబోవు కష్టమును సూచించును. మేఘ మాచ్ఛాదించిన సూర్యునకుఁ గాంతి హీనతలేదు. చూచెడివారికి వెలుఁగు లేకపోవును. అట్టులే రాముని స్థితియు నూహించునది.



శ్రీః.

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణే నమః.

శ్రీ శారదాయై నమః.

శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీమదాంధ్రవాల్మీకి రామాయణము.

## అరణ్యకాండము.

---



నారాయణ కరుణా
ధీనా దీనార్తిహరణ ధీమజ్జనర
క్షానియమా యపవర్గవి
ధానక్షమ యొంటిమిట్ట♦దశరథరామా. ౧

### శ్రీరాముఁడు దండకారణ్యముఁ జొచ్చుట.

ఉ. ధీరుఁడు రామభూవరుఁడు ♦ తీవ్రపరాక్రమశాలి చొచ్చి దు
స్తారమహావనిన్, బహుళ♦ఘోరమృగావిలదండకాటవిన్,
హారివిహారి తాపసజ♦నాశ్రమమండల, మందుఁ గాంచె నా
నారమణీయభూమిరుహ♦సవ్యము భవ్యము భూతసేవ్యమున్. ౨

కం. చీరకుశ వ్యాప్తం బై, సారాగమకాంతిపూర♦సంపద మింటన్
భూరిద్యుతిదుర్దర్శం, బౌరవిమండలముభాతి ♦ నమరెడు దానిన్. ౩

సీ. నానామృగాకీర్ణ ♦ మై నవ్యవిష్కిర, కాంత మై యప్సరః♦కంజముఖుల
యాటలఁ బాటల ♦ నర్చావిధంబుల, హర్షదం బై విశా♦లాగ్నిశరణ
ములచేత స్రుగ్భాండ♦ములచేతఁ గృష్ణాజినములచే దర్భసం♦తతులచేత
నొప్పారి సమిధల ♦ నుదకకుంభంబుల, ఫలమూలతతుల రా♦జిల్లుచు స్వాదు

తే. ఫలసమాస్తృతవన్యసల్లలితభూరి,ధారిణీరుహావారసంభార మగుచు
హోమబలిసత్కృతం బయి యుదితవేద,నాద మయి నీరజోజ్జ్వలనళిని యగుచు.
కం. ఫలమూలాశనులును దాం,తులుఁ జీరాజినధరులును ద్యుమణికృశానూ
జ్జ్వల తేజ లగుపురాణము,నులు నిలువన్నీడ యయి మనోహర మగుచున్. ౫
కం. బ్రహ్మభవనతుల్యం బై, బ్రహ్మరవస్ఫీత మగుచు బ్రహ్మజ్ఞము లౌ
బ్రాహ్మణకదంబములచే, బ్రహ్మస్థలచేతఁ గడుశుభం బగుతలమున్. ౬
ఉ. దాపునఁ గాంచి యాదశరథప్రభవుండు తదాశ్రమంబుఁ దాఁ
జావము నెక్కుడించి చన సంయమివర్యులు దివ్యతత్త్వ మే
ధాపరిణీతు లెంతయు ముదంబున వే యెదు రేగి కాంచి రా
త్మాపకుమారు రాముని యశస్విని జానకిఁ దమ్ము లక్ష్మణున్. ౭

మునులు తమ్ము రక్షింప శ్రీరామునిఁ బ్రార్థించుట.

ఉ. భాసురసంభవత్కుముదబాంధవ తేజుని రామచంద్రునిన్
శ్రీసహితున్ సుమిత్రసుతు స్ఫీతయశస్విని జానకీసతిన్
మాసరరక్తిపూర్ణ బహుమానపురస్సరయుక్తి మంగళా
శాసనసంప్రయుక్తని ప్రశస్తమతు ల్భజియించి రాస్థమై. ౮
కం. ఆరామునిసంహననం, బాహుహపము సౌకుమార్య మా తేజంబున్
శ్రీరమణీయసువేషము, వారక కని యబ్రపడిరి వనసంవాసుల్. ౯
కం. జనకసుతాఘుణినిన్ ల,క్ష్మణునిన్ శ్రీరామచంద్రు సర్వబుషీశుల్
గనుఁగొని యచ్చెరుపాటున, ననిమేషత్వంబుఁ గనిరి యాఱనిత్యప్తిన్. ౧౦
చం అతిథిని నమ్మహాత్ముని సమస్తచరాచరభూతరక్షణో
న్నతిఁ దమపర్ణశాలలకు మానులు దోడ్కొనిపోయి యాసన
స్థితి నొనరించి యాయనల తేజుల స్వాదు ఫలప్రసూనసం
హతుల నిజాశ్రమంబుల సుపర్ణచేసి మొగిడ్చి హస్తముల్ ౧౧
ఉ. ఈమునికోటి కింతటికి నీవె శరణ్యుఁడ వీవె ధర్మర
క్షామహితుండవై నుతియశా! గురువర్యుఁడుఁ బూజనీయుఁడున్
స్వామియు మాననీయుఁడును శాసకుఁడు న్నృపుఁ డీవ సమ్ము మ
త్స్వామివి నీవ, నీవు వనధారణినుండిన నూర నుండినన్. ౧౨
కం. ఇంద్రుచతుర్భాగము ధర,ణీంద్రుఁడు గొని ప్రజలఁ బ్రోచి నృపతనయా! ని
స్తంద్రత నతలోకుం డయి, సాంద్రసుఖము లనుభవించు సంతస మారన్. ౧౩
కం. కావున మే మెల్లరమును, నీవిషయమునందు నుంట నీచే నెపుడున్
గావంబడ నర్హుల మో,భూవరతనయాగ్రణీ! ప్రభూతపుఁగరుణన్. ౧౪
ఉ. నిర్భర తేజ! దండము మునిప్రకరంబుల మైన మా కసం
దర్భపుఁ జేఁత, యాగ్రహముఁ దాల్పఁగ లేము జితేంద్రియాప్తి, నీ

గర్భముఁ బోలె నీ కెపుడుఁ ♦ గావఁగ మమ్ముఁ దగుఁ దపోధనా! ప్రా
దుర్భవదుత్కృపాపరతఁ ♦ దోయజనేత్ర! తపోధనాన్వ్యలన్. ౧౫

కం. అని యీగతి సీతాపతి, ననుజయుతుం బూజ చేసి ♦ యమ్మును లెల్లన్
వనభవసుమఫలతతులను, గొన బగుమూలములఁ దన్వఁ ♦ గూరఁగఁ బ్రీతిన్ ౧౬

తే. సిద్ధసాధననిష్ఠులు ♦ శిఖిసమాను, లన్యతాపసవర్యులు ♦ న్యాయవృత్తు
లీశ్వరుని రాము నర్చించి ♦ రెలమి మిగుల, వారువారు యథాన్యాయ♦పద్ధతులను.

సీ. అంగీకృతాతిథ్యుఁ ♦ డై రామచంద్రుండు, వేగుఁబోకటఁ గల్య♦విధులఁ దీర్చి
విశ్వమానులచేత ♦ వీడ్కోలు వడసి య,రణ్యంబునం బోయి ♦ పుణ్యమూర్తి
నానామృగాకీర్ణ♦నానాతరూద్గీర్ణ, శార్దూలసూకర♦సైరిభాచ్ఛ
భల్లసమాక్రాంత ♦ ఝిల్లీనినాదిత, నిష్కుటజలహూళికు♦నిప్రవేశ

తే. ధ్వస్తనృతులతాగుల్మ♦వార వారి, హీనసలిలాశమారణ్య♦పృథివి దాని
నడుమఁగనియెసుమిత్రాగ్ర♦నందనుఁడును, జానకియు వెన్నడింపఁగ ♦ సంతసమున,

విరాధుండు సీత నెత్తికొని పోవుట.

సీ. ఆయెడ శైలశృంగ♦గాభు మహాస్వనుఁ, బురుపాదు గంభీర♦భూరినయను
వికటమహావక్త్రు ♦ విషమోదరు సుదీర్ఘ,విషమబీభత్సైక♦వికృతరూపు
హస్తఁగఁ గ్రొవ్వు గ్రొ♦న్నెత్తురు వడిసెడి,పులితోలు గట్టి త్రి♦భువనములను
మ్రింగెడునో యను♦భంగి నాస్యము విచ్చి, యంతకురీతి భూ♦తాళిభీతి

తే. కారణుం డయి నాల్గువ్యా♦ఘ్రములు రెండు
వృకములును మూఁడుసింగముల్ ♦ వృషతదశము
హస్తిశిరమును శూలాగ్ర♦మందు గుదిగఁ
గ్రుచ్చి పెడబొబ్బ లిడుచున్న♦క్రూరుఁ గనియె. ౧౮

చం. అతఁడును రామలక్ష్మణుల ♦ నాజనకాత్మజఁ జూచి క్రుద్ధుఁడై
క్షితితల మొల్లఁ బెల్లదరఁ ♦ గేరి లయాంతకునట్లు భైరవా
తతనినదంబు నించుచు న♦దాటున మీఁదికిఁ బాఱి జానకీ
సతిఁ గొనిపోయి యంకమునఁ ♦ జయ్యనఁ జేర్చి వచించె వారితోన్. ౨౦

ఉ. ఎవ్వరు మీర లీయడవి ♦ నిట్లు జటాజినధారులై కడుం
గ్రొవ్వున ఖడ్గచాపశర♦కోటి ధరించి చరింప భార్యతో?
జవ్వని యేల మానులు? క♦సాధుచరిత్రకులార! చూడ మీ
సవ్వడి వేఱు, పాపులరు ♦ చావఁగలారు, మునీశదూషకుల్. ౨౧

చం. వినుఁడు విరాధనామకుఁడ ♦ వీరుఁడ సంభృతశస్త్రపాణినై
మునిజనమాంసఖాది నయి ♦ మోదమునం జరియింతు నీవనిన్
మును కొని పాపశీలుర మి♦ముం బొరిగొం చని నల్లఁ ద్రావి యీ
వసితను నాదు పెండ్లముగ ♦ వారక కైకొనువాఁడ నమ్ముఁడీ. ౨౨

కం. అనుచు విరాధుఁడు గావర,మునఁ బల్కినపల్కు విని ప్ర♦భూతపుభీతిన్
జనకసుత మోరుగాలికిఁ, బెనుపఱి కంపించుకదళి♦విధమున వడఁకెన్. ౨౩

కం. సీతాసతి సాధ్వసనుతి, దైతేయాధిపతియంక♦తలమున వణఁకన్
వీతసహజముఖరుచియై, సీతాపతి యనుజుతో న♦చించెను వనటన్. ౨౪

ఉ. కంటివె లక్ష్మణా జనకు♦గాదిలిపుత్త్రిక నామభార్య వా
ల్గంటి నితాంతసౌఖ్యరత♦ క్ష్మావరనందిని భవ్యశీల లో
నంటినభీతిఁ గ్రూరదను♦జాధమునంకమున న్వణంకెడిన్,
బంటువలంతిక న్న కెటు♦నంటెనుహాపద వచ్చెఁ దమ్ముఁడా. ౨౫

ఉ. ఏయది గోరి కానలకు♦ నేగు మనె న్నను మధ్యమాంబ కై
కేయి ఫలించె నిప్డ దది♦ శ్రీ ప్రగలిం దనపట్టి రాజ్యముం
జేయుటమాత్ర గోరక వి♦శిష్టజనప్రియు నన్నుఁ గానలం
ద్రోయఁగ దుష్టదర్శినిమ♦నోవిభుఁ గోరుట దీనికే కదా. ౨౬

కం. జనకునిమరణముకంటెను, గన రాజ్యశ్రీహరణము♦కంటెను సీతా
వనజాక్షి నన్యుఁ డంటుట, ఘనతర మగుదుఃఖమునకుఁ♦ గారణ మయ్యెన్. ౨౭

కం. అని శోకబాష్పయుతులో, చనుఁడై వగపడెడిరామ♦చంద్రునిమోమున్
గని క్రుద్ధుండై లక్ష్మణుఁ, డనియెన్ రోఁజుచును మారు♦తాశనలీలన్. ౨౮

శా. గీర్వాణాధిపతేజ! భూతములకుం♦ గీర్తింప నాథుండవై
గర్వంబేని యనాథునట్లు కడుదుః♦ఖం బందె దేలన్న? కిం
కుర్వాణుండను నేను లేనె? యిదె మ♦త్క్రూరాస్త్రధారాహతిన్
దుర్వారోద్యమబాహు కేళిని విరా♦ధు న్నేలపా ల్సేసెదన్. ౨౯

కం. భరతునిపైఁ బుట్టినదు,ర్భరకోపము నేఁడు వీని♦పై శైలముపై
సురపతి వజ్రము విడిచిన,కరణిని నే విడుచువాఁడఁ♦ గాకుత్స్థవరా. ౩౦

కం. విస్ఫుటమద్భుజబలవే,గస్ఫారదిశునికర మితనిఁ♦ గ్రక్కున వక్షః
ప్రస్ఫోటంబుగ నాటుచుఁ, బ్రస్ఫీతజపంబుసం బ♦రాసువుఁ జేయున్. ౩౧

కం. అని బలియుండు సుమిత్రా,తనయుఁడు రాక్షసునిఁ జూచి♦ దరహాసముతో
సన నెవ్వఁడ వోరీ యీ,వనమున నీ వేల తిరుగు♦వాఁడవు సుఖివై. ౩౨

కం. అని యడుగ నావిరాధుం, డనె వారలఁ జూచి యెవఁడ♦ వని నన్నడుగం
గను జాలెడిమీ రెవ్వరు, చనియెద రెట కనిన రామ♦చంద్రుం డనియెన్. ౩౩

కం. తెలియుమురా యిక్ష్వాకుకు,కులులము క్షత్త్రియులము వన♦గోచరులము ని
ర్మలవృత్తుల మెవఁడవు? కా,ననలోనఁ జరింపఁ గార♦ణం బేమి? యనన్. ౩౪

వసంతమంజరి. వినుము నాజనకుండు జయుఁ డను♦పేరుఁ డంబ శతహ్రదా
ఖ్య నిఖిలావనిఁ గల్గుదనుజని♦కాయ మెల్ల విరాధుఁ డం
చును వచించును నన్నుఁ దపమున ♦ సూర్యవంశ్య! వరంబు నేఁ
గొనితి శస్త్రముచేత మరణముఁ ♦ గూర కుండఁగ బ్రహ్మచేన్. 3౫

కం. ఛేదనభేదనముల వ్యా,పాదింపఁగఁ బడక యుండఁ ♦ బడసితి సరముల్
బైదలిని విడిచి పాఱుఁడు, మేదిని బ్రదుకంగ నిష్ట ♦ మేనియు మీఁకున్. 3౬

రామలక్ష్మణులు విరాధుని వధించుట.

చం. అన విని కోపరక్తనయ♦నాంబుజుఁడై రఘురాముఁ డిట్లనున్
దనుజకులాధమా! ఖలగు♦ణా! యిటు మృత్యువు రోసె దీవు, న
న్నని మొనఁ దాఁకియుం జనెద♦వా మెయితోడ, నటం చధిజ్య మౌ
ధనువున శాతమార్గణిక♦దంబముఁ గూర్చి సురారి నేయుచున్ 3౭

ఉ. వెండియు రుక్మపుంఖమయి ♦ విశ్రుతవాయుసుపర్ణవేగితో
చ్చండము నైనసప్తశిత♦సాయకపంక్తి బుధారివక్షము
ద్దండతఁ దూఱ నైన నది ♦ దారితదానవదేహ శైల మై
దండిగ రక్తదిగ్ధ మయి ♦ ధారిణిఁ జొచ్చెఁ గృశానుతుల్యమై. 3౮

చం. శరజనితోగ్రవేదనను ♦ జానకి డించియుఁ గేల శూలముల్
సరభసవృత్తిఁ గొంచు రఘు♦సత్తమయుగ్మముఁ గిట్టి యార్భటుల్
పరఁగ లయాంతకుం డనఁగ ♦ వక్త్రము విచ్చుడు నన్నదమ్ములుం
గురిసిరి నిర్జరారిపయిఁ ♦ గ్రూరకలంబకదంబవర్షమున్. 3౯

కం. ఆమార్గణసృష్టికి నగి, భీమవపుష్మంతుఁ డగుచుఁ ♦ బెంచిన మేనిన్
భూమిని రాలెను విశిఖ,స్తోమము పతి వఱపె వెండి ♦ తోరపుములుకుల్. ౪౦

ఉ. వారలు వేయుశాతశర♦వర్షముఁ గన్గొని నవ్వె రక్కసుం,
డూరక వారునుం గురిసి ♦ రుగ్రఖగంబులు, దాన నొచ్చి దే
వారి వరంబు పెంపునను ♦ బ్రాణము లెంతయుఁ జిక్కఁబట్టి యా
శూరుల వైచె వజ్రనిభ♦శూలమున న్గగనంబు వెల్గఁగన్. ౪౧

కం. మండుచు వచ్చెడిశూలము, గండున రెండంబకముల ♦ ఖండించెను గో
దండగురుఁ డశని మేరువు,గుం డన సది భూమి యద్రువఁ ♦ గూలె న్నేలన్. ౪౨

కం. శూలమును గూల్చి కృష్ణ,వ్యాలంబులఁ బోలుతమక్ష♦పాణంబుల దో
ర్లీల వెలుఁగంగ నడిచిస♦, గాలాంతకతుల్యుఁ డప్ర♦కంప్యులఁ గేలన్ ౪౩

తే. పట్టుకొని యెత్తుకొని మింటఁ ♦ బాఱ వాని
తలఁ పెఱుంగుచు రఘుపతి ♦ దమ్ము నసియ

నితనియిచ్చకొలందిని ♦ నేగ నిమ్ము
దనుజుఁ డరిగిన దే త్రోవ ♦ మనకు ననఁగ. ౪౪
ఉ. మూఁపున వారి బాలకుల ♦ ముచ్చటఁ దాల్చి వనంబుఁబట్టి పోఁ
దీఁపుర మద్ది గాంచి భయ ♦ తీవ్రత జానకి దుఃఖభారముల్
సైఁపక యేడ్చె బిగ్గఱగ ♦ సత్యరతుల్ శుచి రాముఁ దమ్ము ని
ట్లేఁపఁగఁ గొంచుఁబోయెడిఁ గ ♦ దే దనుజుండు దయావిహీనుఁడై. ౪౫
కం. నను మ్రింగు నిచట బెబ్బులు, లును దోడేళులును జిఱుత ♦ లును వీడము వా
రిని నన్నుఁ గొంచుఁ బొమ్మీ, దనుజోత్తమ నీకు మ్రొక్కె ♦ దల్ దయఁ గనవే. ౪౬
చం. ధరణిసుతార్తవాక్యముల ♦ దాశరథు ల్విని దైత్యుఁ జంపఁగాఁ
ద్వరపడి రందు లక్ష్మణుఁడు ♦ వామభుజంబును రామభద్రుఁడా
శరుకుడిచేయియు న్నఱక ♦ సాంద్రనలాహకసన్నిభుండు భీ
కరపవిధారఁ బర్వతము ♦ కైవడిఁ గూలె ధరాతలంబునన్. ౪౭
కం. ఆఁకరమున మోచేతుల, మోఁకాళులఁ బాదములను ♦ ముష్టులఁ బైపైఁ
గాఁకమెయిఁ గ్రుమ్మి గ్రుద్దుచు, వీఁకం బైకెత్తి యెత్తి ♦ విడుచుచు నేలన్ ౪౮
కం. నఱకినఁ గరవాలంబుల, గుఱుకొని శితబాణములను ♦ గ్రుచ్చిన నేలం
జఱచిన నట్టును జావని, కఱకుటసురఁ జూచి పలుకు ♦ గాదిలితమ్మున్ ౪౯
కం. భీతజనాభయదుఁడు శ్రీ, సీతాపతి పరషుఁలుపుఁ ♦ జేసి యసుర దా
శాతశరాసులఁ జావఁడు, గోతిని బాఁతంగ వృత్తిని ♦ గూరెదు ననినన్. ౫౦
తే. ఆవిరాధుఁడు రాముప ♦ ల్కాలకించి, యిట్టు లను శక్రతుల్య స ♦ మృద్ధతేజ
యేను నీచేతఁ జచ్చితి ♦ నెఱుఁగ నైతి, బూర్వ మ్మునముననిన్నుఁ ♦ బురుషసింహ.

విరాధుఁడు శ్రీరామునకుఁ దన శాపమువిధంబు నెఱింగించుట.

సీ. కౌసల్యనందనా ♦ కరుణాఢ్య శ్రీరామ, యొఱిఁగితిఁ దండ్రి మి ♦ మ్మిప్పు డేను
ఈమహాభాగ సీ ♦ తామహాదేవిని, లక్ష్మణు నీతని ♦ లలితయశుఁడ
తొలుత గంధర్వుండఁ ♦ దుంబురుఁ డనువాఁడఁ, గ్రమము దప్పిచరింప ♦ రంభఁ గూడి
శ్రీదుండు శపియించెఁ ♦ జేకొనుమీ రాక్ష, సాకృతి నని దాని ♦ వదలి నేను
తే. బలుకవే శాపమోక్షణ ♦ భంగి ననిన, దశరథసుతుండు రాముండు ♦ దర్పకలన
నెప్పుడు వధించు నిన్నని ♦ నప్పు డీవు, పొందెదవు తొంటిరూపని ♦ మందలించె.
కం. శ్రీరఘురామా నీదయ, దారుణశాపంబు దొలఁగె ♦ ధన్యుఁడ నైతిన్
గూరిమి సెలవిచ్చెదవే, చేరెద నాకంబు మీకు ♦ శ్రేయం బగుతన్. ౫౩
చం. ఇటు లోకసార్థయోజనము ♦ నేగి కనుంగొను మందు స్వప్రభా
పటలహసత్ప్రతంగు శర ♦ భంగు శుభంబగు నీకు న న్మహా

నటమున నావటించి రఘువర్య పదంపడి పొమ్ము, దీని ము
న్నటి పెదవారు ధర్మ మని పల్కిరి చచ్చినసోకుమూఁకకున్. ౫౪

కం ఏవాఁడు గుంత నిడఁబడు, నావాఁడు సనాతనంబు లగులోకములం
దే వఱలు; నైఁపలేను మహావేదనఁ బ్రాణ మెగసి యరిగెడు ననినన్. ౫౫

కం ఏనుఁగునకువలె లక్ష్మణ, దానవునకు గుంత యొకటి ద్రవ్వుమ టంచున్
దా నతనికంఠ సీమను, బూనికఁ బాదంబు నుంచె భూపవరుండున్. ౫౬

కం. సౌమిత్రి ఖనిత్రముఁ గొని, యామానవభోజిపార్శ్వమం దొకబిల ము
ద్దామస్థవఁ ద్రవ్వ బల,స్థేమంబున వారు వాని దృఢగతిఁ ద్రోయన్ ౫౭

కం భైరవరవమునఁ గూలెను; శ్రీరాఘవు లతఁడు శస్త్రబృందంబులచేఁ
గూరఁడు మృతి నని వానిఁ బ్రహారంబులఁ జంపి రాబిలాంతరసీమన్. ౫౮

ఉ. రాముఁడు లక్ష్మణుండును విరాధుని నీగిలెఁ జంపి హృష్టుల
లై మహితాశ్మసంతతులు నబ్బిల మెల్లను బూడ్చి, కాంచనో
ద్దామశరాసనంబులను దాలిచి, జానకిఁ జేరి చంద్ర భా
ధాములు మింటఁబోలె రుచిధాములు వెల్గిరి కాననంబునన్. ౫౯

సీతారామలక్ష్మణులు శరభంగాశ్రమమునకుఁ బోవుట.

సీ. జానకి నూఱార్చి సౌమిత్రిఁ గని రాముఁ, డిట్లని దుర్గమం బేగ మనకు
సాధ్యంబుగాదు కష్టము శరభంగుని, దర్శింపఁ బద మని తలఁచి వేగ
మాశ్రమోపాంతంబునందుఁ గనుంగొనె, దివ్యసూర్యానల తేజు గగన
యానరథోత్సంగు నమరచయానుగు, నుర్వి యంటక మింట నుండువాని

తే. సుప్రభాభరభూషణు శుద్ధవసను
హరిహయునిఁ దన్నుఁ దనుఁబోల్ల హాస్తవితతి
యర్థి భజియింప వెలిఁగెడుహరిని, బాండు
రాభ్రశశిబింబ సన్నిభ చ్ఛత్రవిభవు. ౬౦

తే. చారురూపవతీకర సారసధృత, భర్మదండమహాధన వ్యజనచామ
రావళీమృదులాందోళ నైకజనిత, మందమారుతచలితమిళిందడింభు. ౬౧

కం సురగంధర్వులు సిద్ధులు, పరమర్షులు గుములు గట్టి పరమస్తుతులన్
గర మభినందింపంగ, సరసన వెలుఁగొందువానిఁ జక్కఁగఁగాంచెన్. ౬౨

చం. పరమవిభాఽవిభంగశరభంగునితోడుత ముచ్చటించు నా
సురపతిఁ గాంచి తమ్ముఁ గని చూచితె లక్ష్మణ! వింత జాజ్వల
ద్వరరుచిమంతుఁ దీవ్రకరవంతునివంతున నంతరిక్షసం
చరణచణంబు నైనయొక స్యందనమందు వెలుంగునాతనిన్. ౬౩

ఉ. ఎట్టిహాయంబు లుంచు నని ♦ యింద్రునకు న్మన మెల్ల విందుమో
యట్టివ యాకుపచ్చనిహ♦యంబులు మింట రహింపఁ గంటివే
చుట్టి శతాంగముం గొలుచు♦శూరులు భూరికృపాణపాణులుం
దిట్టలు శోణవస్త్రకులు ♦ దీర్ఘభుజుల్ యువకుల్ సకుండలుల్. ౬౪

ఉ. హారవిహారహారివిపు♦లాంచితవక్షులు శౌర్యదర్పదు
ర్వారులు వ్యాఘ్రముల్పగిదిఁ ♦ బ్రాయమునం గనఁ బంచవింశతి
స్ఫారసముల్ సురావళికి ♦ సంతత మియ్యది ప్రాయ మాటచే
వీరలు దేవత, ల్విభుఁడు ♦ వీరుఁడ నీవును సీత యిచ్చటన్. ౬౫

ఉ. వానివిధంబు నే నెఱిఁగి ♦ వచ్చెద నంచు మునీశునాశ్రమం
బావృషసూతి చేరఁ జన ♦ నాతనిరాకను గాంచి శక్రుఁడ
మ్మానికి నేకతం బనియె ♦ మానవపాలుఁడు రాముఁ డిందు రాఁ
బూనినవాఁడు నన్ననఁగఁ ♦ బోలదు నా కిపు డీతనిం గనన్. ౬౬

ఉ. ఈయన చేయఁగాఁ దగిన ♦ యెంతయుదుష్కర మైనకార్యముం
జేయఁగ నిమ్ము, ధన్యుఁడును ♦ జిష్ణుఁడు నై పొగ డొందఁ బిమ్మటం
దాయుదు ముచ్చటింతు నని ♦ దానవవైరి వచించి మింటికై
పోయె శతాంగయుక్తి, నిటు ♦ పోవుడు నాపురుహూతుఁ డావలన్. ౬౭

కం. నృపకులతిలకుఁడు రాముఁడు, చపలాయతనేత్రతోడ ♦ సహజన్మునితో
నపరిచ్ఛదు సజ్వలనుం, దపసిం జేరంగఁ జనియెఁ ♦ దాత్పర్యమునన్. ౬౮

ఉ. చేరి మునీశుపాదములు ♦ శీఘ్రము సోఁక నమస్కరింప న
వ్వారల నర్హపీఠముల♦పై వసియింపఁగఁ బంచె మౌని, సీ
తారమణుండు శక్రుఁడు క♦తం బెది యిచ్చటి కేగుదేర నా
వారక సర్వముం దెలిపె ♦ వాసవురాకకుఁ గారణంబులన్. ౬౯

⟵ శరభంగుండు శ్రీరామునితో నింద్రునిరాకకుఁ గారణంబుఁ జెప్పుట. ⟶

సీ. దాశరథీ! నేను ♦ దపమున క్షుద్రదు,రాసదం బైనయా♦బ్రహ్మలోక
మును సమార్జించితి ♦ నను గొనిపోవఁగ, వాసవుం డిచటికి ♦ వచ్చినాఁడు
అధికప్రియుండ వౌ♦నతిథివి దావున, నరుదెంచి యుండుట ♦ యాత్మ నెఱిఁగి
నిన్ను దర్శింపక ♦ నే బ్రహ్మలోకంబుఁ, జనఁగ నా కేమియు ♦ మనసు రామి

ఆ. నిలిచినాఁడఁ, గలిగె ♦ నీదర్శనం బిఁక, దేవసేవితంబుఁ ♦ ద్రిదివపదము
నరుగువాఁడ మత్స♦మార్జితాక్షయశుభ,లోకచయము గలదు ♦ లోకవంద్య. ౭౦

ఆ. స్వర్గలోకభవము♦బ్రహ్మలోకభవంబు, నైనసుకృత మెల్ల ♦ మానసీయ
నీకు నొసఁగువాఁడ ♦ నెమ్మి గ్రహింపుమీ, యనిన రాముఁ డనియె ♦ ననఘమతికి.

చం.కొనెదను నేన నీసుకృత♦కోటుల నెల్లను, మేము నీవు నీ
వనమున వాసయోగ్య మగు♦ప ట్టిది చెప్పు, మ టన్నఁ బ్రాజ్ఞుఁ డి
ట్లనియె సుతీక్ష్ణనామకమ♦హాత్ముఁడు మీ కెఱింగించు నాతిసిన్
గనఁ జనుఁ డీవనంబునన ♦ కల్గు నతండు ఘటించు శ్రేయమున్. ౨౨

ఉ. ఈకడ నుండి మీర లెదు♦రేగుఁడు పాఱుచు నున్న యల్లవం
దాకిని కందునందును గ♦నం దగుఁ బూవుల తెప్ప, లద్దియే
మీ కరుగంగ మార్గము, ని♦మేమము నిల్వుము తండ్రి! దేహముం
బోకడపెట్టుదుం గుబుస♦ముల్ ఫణిరాజము వీడునట్లుగన్. 23

ఉ. దానిని నీవు చూచి మఱి ♦ తన్లు మటంచును వేఁడి మంత్రపూ
తానల మాజ్యధారల ర♦యంబునఁ బ్రజ్వలితంబుఁ జేసి య
ద్దానను మాంసరక్తసహి♦తంబుగ నస్థులతోడ భస్మమై
మానియు వహ్నిసన్నిభకు♦మారకరూపముఁ దాల్చి క్రమ్మఱన్. ౨౪

చం.అనలమునుండి వెల్వడి మ♦హర్షి సురాళిజగంబు దాఁటి చ
య్యనఁ జని బ్రహ్మలోకమున♦యందు సహానుచరుం బితామహుల్
గనియె నతండు మానికిని ♦ గారవమారఁగ స్వాగతంబుఁ బ
ల్కెను, మునిశక్తికి న్నగురుఁ ♦ గీర్తన చేసిరి విస్మయాత్ములై. ౨౫

↞ మునీంద్రులు శ్రీరామునితోఁ దమకష్టంబులు దెల్పి శరణుఁ జొచ్చుట. ↠

ఉ. మాని దివంబుఁ జేర నతి♦మానుష తేజుని రామచంద్రు వై
ఖానసవాలఖిల్యులును ♦ గాత్రశయాను, లశయ్యనీరప
త్రానిలభోజనుల్, సురప♦థాలయులుల్, మహిశయ్యు, లశ్మకు
ట్టానల తేజులుల్, ఘనర♦సాంతరమగ్నులు, యోగలగ్నులున్. ౨౬

కం.వ్రతులును సంప్రక్షాళులు, సతతార్ద్రపటుల్ మరీచి♦చయపానులు ని
ర్జితసకలేంద్రియులును స,న్మతదంతోలూఖు లైన♦మానివరేణ్యుల్ ౨౭

కం.ధర్మజ్ఞు లచలచిత్తులు, ధర్మభృదగ్రియుఁ బరమ♦ధర్మజ్ఞుని స
త్కర్మాచరణధురీణుని, నిర్మలు శ్రీరామచంద్రు♦నిల్ బలశాలిన్. ౨౮

ఉ. చేరి రఘూత్తమా మనుజ♦శేఖర వేల్పులలో బలారి నా
శ్రీరఘువంశ్యకోటులను ♦ శ్రేష్ఠుఁడ, వుర్వికి భర్త, వీవ నీ
భూరిశయంబు విక్రమము ♦ భూనుతముల్, పితృభక్తిసత్యవా
చారతి ధర్మనిష్ఠయును ♦ సంతత మొప్పును బుష్కలంబుగన్. ౨౯

కం.నిను ధర్మవత్సలు మహాత్ముని, ధర్మజ్ఞుని మఱుంగు ♦ మొగిఁ జొచ్చితి మో
జనకసుతాహృదయేశ్వర, విను మర్థించెద మొకండు♦విషయము నాథా. ౩౦

ఉ. ఏ మొకమున్వి చేయ మది ♦ నెంచితి మిందుసక్తి క్షమింపుమీ
భూమిధవుం డెవండు కర♦ముం గొని యాఱవపాలు పుత్త్రుల
ట్లామనుజాళిఁ బ్రోవఁడో మ♦హత్తరపాపము వాఁడు పొందెడిన్
రామ! య టౌట భూమిజన♦రక్షయె కార్యము నేలఁజేసికిన్. ౧౧

కం.తనప్రాణంబులుపగిదిని, జనప్రాణముకంటె నిష్ట♦తాపాత్త్రము లౌ
తనయులగతి మనుజులఁ బ్రోఁ,చినపతి చిరకీర్తి బ్రహ్మ♦చేఁ బూజఁ గనున్. ౧౨

కం.ఫలమూలంబులు మెసవుచు, నలఘుతపముఁ జేయునామ♦హాత్ములు తపమం
దలినాలవభాగముఁ బ్రజ, నెలమిని రక్షింప జేని ♦ కిడుదురు గాదే. ౧౩

శా.దీనార్త్తావనదక్ష! విన్మ గలరీ♦తిన్ బ్రహ్మభూయిష్ఠ మీ
వానప్రస్థగణంబు భూరిమహిమన్ ♦ వాసిల్లి త్వన్నాథ మే
యైనన్ మిక్కిలి బాధలం గనెడి రా♦మా దుష్టమాంసాశిసం
తానం బేపఁగ మాకు నిష్ఠభయదా♦నం బీఁగదే ప్రేముడిన్. ౧౪

కం.ర మ్మవిగో రాఘవ కనుఁ,గొమ్ము వనంబునను నసుర♦కోటులచే నా
శమ్మును గన్నమునీంద్రచ,యమ్ముల దేహమ్ములెమ్ము ♦ లంతటఁ గనవా. ౧౫

కం.పెంపఱి మందాకినితటిఁ, బంపానదిఁ జిత్రకూట♦పర్వతమున వా
సింపఁగ ఋషు లవ్వారిం, జంపెను నొంచెను సురారి♦సంఘము లీశా. ౧౬

చం.మునిజనవిప్రకారము న♦మోఘబలా! సయిరింపలేమిచే
నిను శరణంబు జొచ్చితిమి ♦ నీవ శరణ్యుఁడ వాసురాళిచేఁ
బొనుఁగుపడంగ నీకు, కృప ♦ భూమితలంబున నీవు తప్ప మా
కును గతిలేదు, మా వెతలు ♦ కూలఁగఁ జేయవె జానకీపతీ. ౧౭

## శ్రీరాముఁడు మునుల కభయం బొసంగుట.

చం.అన రఘునాథుఁ డిట్లను మ♦హాత్ముల రీ రిటు నన్నుఁ బల్కఁగాఁ
జను నె? త్వదాజ్ఞ వర్తిలుదు ♦ సంయములార! యరణ్యసీమకున్
బనిగొని యాత్మకార్యముగఁ ♦ బాపుల నెల్ల నడంచి మీకు శో
భన మొనగూర్ప మజ్జనకు♦వాక్యము సాకుగ నేను వచ్చితిన్. ౧౮

కం.కాన మహాఫలనం బగుఁ, గాననవాసంబు మాకు ♦ గం డడఁతు నరిన్
మౌనిజనశాత్త్రవుల నిఁక, సానుజమద్బాహుశక్తి♦సంపదఁ గనుఁడీ. ౧౯

తే. ఇట్టు లభయం బొసంగి ము♦నీశ్వరులకు, సత్యనిరతుండు లక్ష్మణ♦సహితుఁ డగుచుఁ
జనె సుతీక్ష్ణాశ్రమంబున♦జాడఁబట్టి, యెల్లద్విజులును దనతోడ ♦ నేగుదేర. ౨౦

ఉ. ఒయ్యన దూర మేగి విపు♦లోదకవాహిని సంతరించె, దా
నయ్యెడ నంజనోన్నతఘ♦నాభమహీధ్రముఁ గాంచి సంతతా

ఘయ్యఫలప్రతానసుమ♦సంతతి వింతలు గొల్పఁ గానలో
నయ్యమరేంద్రవంద్యుఁడు శు♦భాశ్రమముం గనెఁ జీరమాల్యమున్. ౯౧

శ్రీరాముఁడు సుతీక్ష్ణాశ్రమంబుఁ జేరుట.

కం. డాసి యటఁ దపసి ధూళీ,ధూసరితజటాకలాపు ♦ ధృతపాపుని సౌ
ఖ్యాసనయుక్తునిఁ గని యి,ట్లాసీతాహృదయనేత ♦ యాడెం బ్రీతిన్. ౯౨

ఉ. రాముఁడ నేను దాపసవ♦రా యనఘా భవదీయసద్గుణో
ద్దామము దాన వచ్చితి, య♦ధామతి నాదెసఁ దృష్టిఁ జూడవే,
నా మునితల్లజుండు రఘు♦నందనుఁ గ్రుచ్చి కవుంగిలించి సీ
తామహిళేశ! సేమము ము♦దంబు గదా యని వెండి యిట్లనున్. ౯౩

కం. నీవచ్చినకతమునఁ గడు,పావన మ్మై యగ్రనాథ♦వంతం బై భూ
మీపర యీయాశ్రమ మెం,తో వెలయుచు నున్న దిపుడు ♦ దుర్భరతేజా! ౯౪

తే. దేహమును వీడి యోవీర ♦ దేవలోక,మేగ నొల్లక నీవచ్చు ♦ టెఱిఁగి యింద
వేచి యున్నాఁడ నీకొఱ♦కై చుమయ్య,వచ్చి తీవిట మద్భాగ్య♦వశతఁ దండ్రి ౯౫

కం. వింటిని రాజ్యభ్రంశముఁ,గొంటయు మునిసహవుఁ జిత్ర♦కూటంబున వా
ల్గంటియుఁ దమ్ముండును నీ,వుంటయుఁ గాకుత్స్థవర్య♦యుగ్రసుశౌర్యా! ౯౬

ఉ. రమ్మని పిల్వవచ్చె సుర♦రాజు నను౯ సుకృతాప్తి దేవలో
కమ్ములు గెల్చినాఁడ నఁట ♦ కారుణికాగ్రణి నీవు మత్ప్రసా
దమ్మున భార్యతో ననుఁగు♦తమ్మునితో విహరింపు వాని; నా
బమ్మను గళ్యవర్ణి యనఁ ♦ బల్కె మహర్షిని రామచంద్రుఁడున్. ౯౭

చం. కొనెదను నేన నీసుకృత♦కోటి స్వయమ్ముగ, మేము నిల్వ నీ
వనమున వాసయోగ్య మగు♦పట్టది! నీహితబుద్ధిశక్తులన్
వినిచెను గౌతమాన్వయుఁడు ♦ విశ్రుతుఁ డాశరభంగుఁ, డన్న నా
ముని మధురోక్తి నిట్లనియె ♦ మోదరసాప్లుతుఁ డై రఘూత్తమున్. ౯౮

సీ. రామ యీయాశ్రమ♦భూమియే రమ్యంబు, గుణవంతమును ఋషి♦కోటు లిందుఁ
దప మాచరించు సం♦తతము ఫలాదులు, దండిగా నుండు మా♦ర్తాండ తేజ
యకుతోభయం బైన♦యాశ్రమభూమి ని,చ్ఛావిహారంబులు ♦ సలుపు మేకము
పిండు మాత్రము తపో♦విఘ్నంబుఁ గలిగించు, నది తక్క మఱి యేభ♦యంబు లేదు

ఆ. నిలు మటన్న ననియె ♦ నిర్మల తేజ యా,మృగచయంబు శాత♦ఖగకదంబ
ములను జంప నీకుఁ ♦ గలుగు మనోవ్యథ, గానఁ బెక్కునాళ్లు ♦ గాదు నిలువ. ౯౯

కం. అని యచట నిలిచి సాయం,తనసంధ్యన్ వార్చి మౌని♦దత్తాహారం
బును గొని యారే లక్ష్మణ,జనకసుతాయుక్తి రామ♦చంద్రుఁడు గడపెన్. ౧౦౦

ఉ. వేవిన లక్ష్మణుండు పృథివీజయుఁ దానును గమ్మకల్వపూఁ
దావులు గ్రాలునంబువులఁ దాన మొనర్చి హుతాశదైవపూ
జావిధిఁ దీర్చి పూర్వగిరిసానుతటంబున కేగుదెంచు ఛా
యావరుఁ గూర్చి మ్రొక్కి ముని నంజలిఁ జేర్చి వచించె నీగతిన్. ౧౧౧

మ. చెలువారన్ సుఖవృత్తి రే గడచె నీచేఁ బూజలం బొందుటన్
సెలవా మా కిఁకఁ, దీవరించిరి మునిశ్రేష్ఠుల్ స్వకీయాశ్రమం
బులకున్ రండని దండకాలయులు, నేఁ బోవం దలంతున్ ఋషీ
శులతో, మమ్ము ననుగ్రహింపుము తపశ్శుద్ధాంతరంగాంబుజా. ౧౧౨

చం. అనుచితమార్గవృత్తి నడుమంతరపున్నిరిఁ గన్నదుష్కృలుం
డన రవి చేతులం గొలవు లాని దహింపక మున్నె పోదుమే
యని చరణంబు లంటినఁ బ్రియంబునఁ గౌఁగిట నొత్తి యేగుఁడీ
జనకజ ఛాయవోలె నిను సంతతము న్భజియించి వెంట రాన్. ౧౧౩

ఉ. అచ్చపుఁబుణ్య లీబుషులు పోయిగఁ బొమ్ము యరిష్టపద్ధతిన్
విచ్చినతామరల్ మిగులవేడుకఁ గూర్చుకొలంకులున్ గిరుల్
నిచ్చలుఁ బూచువృక్షములు నెమ్ముల కేకలు నిర్ఝరాళి మీ
కిచ్చిన నిండుసమ్మదము నిచ్చును లక్ష్మణ! పోయి రావనా. ౧౧౪

చం. అనఘు మదాశ్రమంబునకు నాదట వెండియు మీరు రండటం
చును సెల వీయఁగా భువనసుందరి జానకి చాపదండముల్
సునిశితఖడ్గతూణములు శూరవరాగ్ర్యుల నన్న దమ్ములన్
గొనుఁ డని యీయ వారలును గొంచు ధరించి ససజ్యచాపులై ౧౧౫

→ సీతాదేవి శ్రీరామునకు హితోపదేశంబు సేయుట. ←

కం. అంతట చనునెడఁ దమ రఘునందనువదనంబుఁ గాంచి నవలా ప్రేమా
స్పందితహృదయంబున మృదుమందమధురవచనరచన మానుగ ననియెన్.

సీ. నీవనుష్ఠించెడి నిష్ఠాప్రకారంబు, కామజవ్యసనముల్ కడకుఁ బాయ
వదలియు నొందఁగ వచ్చును గాదొకో, సూక్ష్మమార్గంబున శూరవర్య
కామజవ్యసనముల్ గలవొక మూఁ డందుఁ, బ్రథమంబు మిథ్యాభిభాషణంబు
దానికంటెను బరదారాభిగమనంబు, పగ లేకయును హింసపఱుచుటయును

ఆ. గీడు; నీ వసత్యమాడిన యది లేద, యింక నాడఁబోవు టెపుడు లేదు;
తలఁచు టైన లేదు పలుక నేటికి నన్య,దారసంగమేచ్ఛ ధర్మనిరత. ౧౧౬

కం. లే దిప్పు డింకఁ గలుగం,బో దెప్పుడు వలపు పరులపూఁబోఁడులపై
భూదయితా! నీమది నే, న్మోదించెద వాత్మ దార మోదముఁగూర్చన్. ౧౧౭

చం. నిరతము సత్యధర్మరతి ♦ నిశ్చలబుద్ధివి లక్ష్మణాగ్రజా!
గురువచనస్థితుండవు స♦త్యుండవు సత్యము ధర్మ మెల్లనున్
స్థిరముగ నిల్చె నీయెడఁ బ♦తీ! విజితేంద్రియు లైనవారికిన్
దొరకొను నన్నియు, నే నెఱుఁగుదు♦న్భవదీయజితేంద్రియత్వమున్. ౧౦౯

సీ. పూనుకపయిని యగు ♦ మూఁడులు పగ లేక, యితరుల ప్రాణంబు ♦ హింససేయు
క్రౌర్యకర్మము రాము♦ఁ డెట్లొ నొరంగొంటి, వీ విప్ర మానుల♦ హేతువునను
దండకారణ్యవా♦సి ప్రజల నసురులఁ, జంపఁ బ్రతిజ్ఞను ♦ జలిపి తీవు
యిది నిమిత్తంబుగా ♦ నిందు వచ్చితి వీవు, తమ్ముండు బాణకో♦దండములను
తే. దాల్చి యిప్పుడు మీరంతఁ ♦ దరలు చుండఁ, దానికీను శుభంబు హి♦తంబుఁ గోరు
దాన నగుటను నామది ♦ దల్లడిల్లె, నామువిన్నప మాలింపు ♦ నాథ కరుణ. ౧౧౦

ఉ. ఈరణపోక నాకు రుచి♦యింప, దదేల యటంటి రేని నేఁ
గారణముల్ వచించెదను ♦ గాస్తుక బాణకృపాణపాణులై
వీరుల రీరు పోవు చట♦వీచరులం గని యుక్కు మీరి యే
నారసము న్విడం గలరు ♦ నాగ యదే పగ కారణం బగున్. ౧౧౧

కం. గంధగజము బొంధవుగనును, నింధనములు పోల్కి క్షత్రి♦యేశ్వరతతికిన్
బంధురశస్త్రంబులు సం,బంధము వహ్నిఁ జేయు ♦ బల తేజములన్. ౧౧౨

సీత శ్రీరామునకు శస్త్రసాంగత్యదోషమును దెలుపు నితిహాసముఁ జెప్పుట.

సీ. ప్రాణేశ ము న్నొక్క♦యడవి సత్యాత్ముండు, ధర్మరతుం డైన♦తపసి గలఁడు
కానన ఖగమృగ♦కాంతంబు లందలి, కరుణయు నమితరా♦గంబుఁ గలఁడు
అతని తపంబున ♦ కంతరాయముఁ గూర్ప, భటరూపధరుఁ డయి ♦ కుటిలమతిని
వాసవుం డొకనాఁడు ♦ భాసమానకృపాణ, మిల్లడ యుంచి తా ♦ నేగె దివికి
తే. న్యాసరక్షణతత్పరుం ♦ డైనయతఁడు, దాని ధరియించి చరియించుఁ ♦ గానలోన
ఫలములును మూలముల్ దెచ్చు♦నట్లనైన, విడిచి పోవఁడు దాని న♦వ్వాడఁ గుఁదపసి.

చం. ప్రవిదిన మిట్టు లాముని కృ♦పాణముఁ దోకొని పోవువాడు కన్
రతి జనియించె దానిపయి ♦ రౌద్రము దానస కల్గె, నైజ మౌ
మతి చెడి క్రూరకర్ముఁ డయి ♦ మత్తత ధర్మనిధుల్ దొఱంగి దు
ర్గతి కతఁ డేగ, నంతటిని♦ కారణము కంటివె శస్త్రసంగతిన్. ౧౧౪

తే. ఇదియు నొండు పురాతన♦వృత్త మధిప, శస్త్రసంయోగకారణ♦సంకలితము
ఆశ్రయాశసంయోగము♦నట్టి దండ్రు, శస్త్రసంయోగమును జూడ ♦ సారబుద్ధి.

చం. చనవున స్నేహభావమున ♦ సాదరలోచన నీవు నన్ సదా
కనుబహుమానదృష్టి నిది ♦ కానని నిం దలఁపించితిం జుమీ

మనమున నీవెఱుంగనిసుమార్గము నేర్పుట గా దదెంత చూ
చిన రుచియింప దోసుజనశేఖర నీ దగునెత్తికోలిటన్. ౧౧౬

చం. ధనువు ధరించి పోవుటయు దర్పమునం బగ యేమి లేక యా
దనుజుల దండకాశ్రితులఁ దార్కొని చంపుట కాని కార్య మే
యనువున నెంతచూచిన నిరాగసులన్ వధియింపఁ బూనుటల్
జనుతశీల! నామదికి సంతస మీయ దొకింతయేనియున్. ౧౧౭

కం. వీరులు మఱి కాననసంచారులు నగు క్షత్త్రియులకు సార్త్రివ్రజర
క్షారంభమునకుఁ గార్ముక,ధారణ మగుఁగాక రిత్తవండము తగునే. ౧౧౮

కం. ఎక్కడిశస్త్రము కానన, మెక్కడ క్షాత్త్రం బదేడ నేటితపంబో
యిక్కార్యం బన్యోన్యము, మిక్కిలి వికటంబు చూడ మీ ప్రాణేశా. ౧౧౯

కం. ఏ దేశపుధర్మంబుల, నా దేశమునందు నడప సగ్గాను కాదే
కాదే వని మునివృత్తిని, మోదించెడినీకు నడన మునిమార్గమునన్. ౧౨౦

తే. శస్త్రసంభృతి మతి కలుషత్వ మొంపఁ
గానఁ గానల శస్త్రసంగతిని విడుము;
క్షత్త్రధర్మంబు వహియింపఁ గార్య మగును
వెండియు నయోధ్యఁ జరియించువేళ నీవు. ౧౨౧

మంజుభాషిణి. సిరియున్ ధరన్ విడిచి చేరి కానలన్
జరియించునీ విపుడు సంయమింబలెన్
దిరుగం దపోనియతి దేవ మోదముం
బరఁగించు నత్తకును మామగారికిన్. ౧౨౨

కం. ధర్మంబున స్వర్గం బగు, ధర్మంబున సుఖము గలుగు ధర్మముచే స
త్కార్థంబులు ఫలియించెడి, శర్మకరా జగము ధర్మసారంబె కదా. ౧౨౩

కం. సుఖమున సుఖము లభింపదు, ప్రఖరవ్రతములకు నియమపద్ధతులకు ను
న్ముఖుఁడై యాత్మజయించిన, సఖులోత్తము మైనధర్మ మలవడు నాథా. ౧౨౪

కం. మానితసౌమ్యుఁడవున్ శుచి,ధీనియతుండవును నీకుఁ దెలియని దున్నే
ప్రాణేశ ముజ్జగంబుల, నే నెంతటిదాన నీకు నీతులు నేర్పన్. ౧౨౫

చం. విపినతలంబులం దిరుగువేళ నహింసఁ జరింపరాదె, స్త్రీ
చపలత నాకుఁ దోఁచినది సజ్జనవందిత యాడితిన్, ధరన్
నిపుణుఁ డెవండు ధర్మములు నీ కుప దేశ మొనర్పఁ, దమ్ముఁడున్
నృపవర నీవు నారసి చరింపుఁడు మీకు రుచించుచొప్పునన్. ౧౨౬

→ శ్రీరాముఁడు సీతకు నార్తరక్షణము పరమధర్మం బని చెప్పుట. ←

చం. అతులితభర్తృభక్తి సతి ♦ యాడినపల్కులు వించు ధర్మసు
స్థితమతి రాముఁ డి ట్లనియె ♦ దేవి తమిన్ భవదీయసత్కులో
చితముగ రాగతుల్యముగఁ ♦ జెప్పితి వియ్యెడ ధర్మబుద్ధి నా
మతిగతిఁ బల్కెద న్వినుము ♦ మానుగ నంతయు బోధ మయ్యెడిన్. ౧౨౭

శా. నీవే పల్కితి కాదె క్షత్రియులకు ♦ స్త్రీనార్తరక్షార్థ మై
దేవి చాపముఁ దాల్ప నర్హ మని, భీ♦తిన్ మానినాథుల్మహా
భావుల్ దండకవారు తారకదవే♦ బాధార్తి మై వచ్చి న
న్నీవే ది క్కని మర్వ చొచ్చి, రిత వొ♦నే వారిఁ బోషింప నన్. ౧౨౮

చం. అడవులఁ గాయ కూర కడు♦పార భుజించి శరీరమాత్రులన్
నడపుచు ధర్మపద్ధతి న♦నారతముల్ వ్రతులైన మానులన్
విడువనివైర మెత్తి కడు♦నిష్ఠురవృత్తి వధించుచున్న యా
చెడుగుల మానుపాదులఁను ♦ జెప్ప మధర్మమె త్రుంపఁ బూనుటల్. ౧౨౯

కం. దండక వసియించెడిముని,దండంబులు మమ్ముఁ జేరి ♦తమదుఃఖంబుల్
గొండలుగఁ జెప్పుకొని కా,వుం డనుచున్ వేఁడ నేను ♦ బూవుంబోణీ. ౧౩౦

తే. అంస్త్రిశస్త్రాపఁ దేర్చి సం♦యముల లజ్జ,మయ్యె మీరలె ననుఁజూడ♦నరుగుదేరఁ గరుణ శమియింపుఁ డెవ్వి మీ♦కాంక్షితంబు, లేమిచేయుదునోవచి♦యింపుఁడంటి.

ఉ. మానిని వార లెల్ల నొక♦మాటగ దండకలోఁ జరించునా
మానవభోజు లెల్లపుడు ♦ మార్తురరీతిని హోమవేళలన్
మానక బాధపెట్టుచును ♦ మారకులై రెగి దిక్కటంచు మే
మూనిసభీతి నుండఁగ నృ♦పోత్తము మానుకృతంబు పెంపునన్ ౧౩౨

ఉ. వచ్చితి, వీవ దిక్కు, జన♦పర్య తపంబున రాక్షసాధముల్
చచ్చి పడన్ శపింపఁ గల♦శక్తి నహించి చిరార్జితంబునై
హెచ్చినమత్తపంబులు వ్య♦యింపఁగ నొల్లక వారిచేతిలోఁ
జచ్చుచు నున్న వార మతి♦శాంతి వహించి సహించి బాధలన్. ౧౩౩

కం. సులభంబు గాదు తపమును, జలుపుట దుష్కరము విఘ్న♦సంతతు లెపుడున్
గలిగెడుఁ గావున నసురలు, పొలయక పము ద్రుంగఁ దిట్టఁ ♦ జూడము మరలన్.

కం. భావింపుము మాస్థితిఁ బ్రతి, గావింపుము మాతపంబు ♦ కడఁ గనుగలి సం
భావింపుము తమ్మునితో, నీవే మాకిచట దిక్కు ♦ నిర్గంకీర్తి. ౧౩౫

కం. అన విని సర్వముఁ దీర్పఁగ, ననఁబోణీ ప్రతిన చేసి♦నాఁడను జిహ్మా
తనువునఁ బ్రాణము లుండఁగ,నని తప్పుట లేదు సత్య ♦ మతిహిత మగుటన్ ౧౩౬

కం. నన్నాశ్రయించి కీడుం, దెన్నన నెన్నఁడును బోని ♦ దీనుల నసురుల్
వన్నఁగఁ జంపిరి నీవే, యెన్నుమ యింతకు విరోధ ♦ హేతువు సుమతీ! ౧౩౭

కం. విడిచెదఁ బ్రాణము లైన, న్విడిచెద నిన్నైనఁ దమ్ము ♦ నిన్ విడిచెద నే
విడతును బ్రతిజ్ఞ నందుం, బుడమిసురలతోడఁ బల్కి ♦ ముగ్ధా యెపు డేన్. ౧౩౮

కం. మునిజనకార్యము పరిపాలన మే నొనరింపవలయు ♦ లలనా వారల్
నను నడుగకయుండినన్ జనకసుతా ప్రతిన సల్పి ♦ చనునే విడఁగన్. ౧౩౯

కం. స్నేహంబున మోహంబున, సౌహార్దంబునను బోధ ♦ సలిపితివి పరా
రోహా మెచ్చితి బుద్ధులు, స్నేహవిహీనులకు నోరులు ♦ చెప్పుదు రట వే. ౧౪౦

చం. అనఘ భవత్కులంబునకు ♦ నంబుజపాణి భవచ్చరిత్రకున్
గన ననురూప మర్హమగు ♦ నైనడిఁ బల్కితి నాకు నెప్పుడున్
వనిత సధర్మచారిణివి ♦ ప్రాణచయంబునకంటె మిన్నగం
చును వచియించి లక్ష్మణుఁడు ♦ సుందరియుం జనుదేర ధన్వియై ౧౪౧

తే.[1] అగ్రవర్తియై శ్రీరాముఁ ♦ డరుగుచుండె, నువిద తనుమధ్య మధ్యమునం ♦ దుండె సీత
మహితకోదండదండసం ♦ భరణహస్తుఁ, డోలి వెన్నంటె లక్ష్మణుఁ ♦ డొప్పు ప్రేమ.

మానిని. నారము లౌనవసారసకైరవ ♦ సౌరభవాసితభాసితకా
సారములుం దటినీతటసైకత ♦ సంచరదంచితచక్రయుగీ
వారములున్ గిరిసుందరకందర ♦ పాతసుపూతఝరీలహరీ
పూరములున్ సుమమంజులకుంజక ♦ పుంజితగుంజదళివ్రజములన్ ౧౪౩

కం. భీకరసూకరపృథుద, ర్వీకర కాసరకరాగ్ర ♦ విస్తృతహిమవ
చ్ఛీకరకరికేసరినిక, రాకరగహ్వరవితాన ♦ మానటఁ గనుచున్ ౧౪౪

తే. అట్లు చని చని దవ్వుగ ♦ నంబరంబు
లంబమానదివాకర ♦ బింబ మగుచు
డంబుమీఱఁగ నొక యోజ ♦ నంబు చనర
మింబు గూర్చెడియొకతటా ♦ కంబు శుభము ౧౪౫

కం. అలినీమలినీకృతమున్, నలినీదళనీరజాత ♦ నవ్యము ద్విజరా
జ్ఞలనాకలనాదితమున్, బలదానవదీర్ఘవితాన ♦ బాధితతటమున్. ౧౪౬

కం. కని మనుజహీన మయ్యును, ఘనతానసంగీతజా ♦ ఘనపూరితమం
బును నందు హృదయసమ్మద, జనకంబుగ నాలకించి ♦ సౌమిత్రియుఁ దాన్. ౧౪౭

## మాండకర్ణివృత్తాంతము ధర్మభృతుఁడు శ్రీరామునకుఁ దెల్పుట.

సీ. తనుమోదఁ జనుదెంచు ♦ ధర్మభృతుం డను, మునివరుఁ గనుఁగొని ♦ యనఘశీల
యిది యేమి వింత మా ♦ కెనఁ గానుపించుచున్న, దీనిచరిత్రంబుఁ ♦ దెలియ వినఁగ

---

[1] ఇందుఁ బ్రాసము [illegible]

వక్తవ్య మేని గో♦ప్యంబును గా దేని, జెప్పవే యేమి యి♦చిత్ర మనిన
జానకీనాయకు♦సల్లాప మాలించి, సరసిస్సృత్తాంతంబు♦ సర్వమిట్లు
ఆ. తపసి చెప్పఁ దొడఁగె♦ ధర్మాత్మ విన వయ్య, మాండకర్ణి యనెడి♦ మండితపసి
గడుసుఁదపముబలిమిఁ ♦ గల్పించె దీనిని, సార్వకాలికంబు ♦ చారుతరము. ౧౪౯
కం. పంచాప్సర మనఁబడు నిది, యంచిత మగుదీని జలము♦ వం దాతఁ డహో
పంచేంద్రియ నిస్పృహుఁ డొనరించెం బది వేలయేండ్లు ♦ దృఢ మతిఁ దపమున్.
ఉ. నీరసమీరభక్షుఁ డయి ♦ నిష్ఠుర మైనతపంబు సేయునా
ధీరు సమీరమిత్రముఖ♦దేవత లెల్లరుఁ గాంచి భీతులై
తా రొకచోటఁ జేర్కొని ప♦దం బెది కోరెడినో యితం డదే
తీరున విఘ్నముం గొలుపఁ ♦ దెర్వగు నంచుఁ దలంచి వంచనన్. ౧౫౦
కం. మెఱుఁగులతులఁగలి గితికొను, తెఱగన్నులఁ దెఱవపిండుఁ ♦ దెప్పనఁ బంపన్
మిఱుమిట్లు గొలుపు తేజునఁ, బఱిగొని రాతపసిదిటముఁ ♦ బడఁతుక లేవురా. ౧౫౧
కం. సృష్టపరావరుఁ డగునా, శిష్టవరుఁడు సురలు కార్య♦సిద్ధిం గన నా
కృష్టగుణుఁ డైన మరుశర, సృష్టికి నచ్చరలసృష్టి ♦ కెంతయు వశుఁ డౌన్.౧౫౨
కం. చేరినవారల దారల, గారామునఁ జేసి లోనఁ ♦ గల్పించి గృహం
బా రామలతో నీకా, సారమున రమించు యోగి♦సారము పెంపన్. ౧౫౩
కం. పావనయౌవనమునసం, భావన దేనసవి శేష♦పరుఁ డై ముని దా
నావనజాతులతోడ మ, హావనమున నుండునాద ♦ మదియ మహాత్మా. ౧౫౪
కం. పాటలగంధులయిం పగు, నాటలరవళియును భూష♦ణాళినదముల్
పాటలనినదము లీగతి, వాటంబుగ వినఁబడుఁ గ ని♦వారిర తేజా. ౧౫౫
చం. అనవుడు నీరజేక్షణుఁడు ♦ నబ్బుర మందుచుఁ దోడఁ దమ్ముఁడుం
జనకజరాఁగఁ జీరకుశ♦సంస్తృతముఁ బహువిప్రపూర్ణముం
గనుఁగొని యాశ్రమంబు ఋషి♦కాండసమర్చితుఁ డై యటే మఱి
జనినతలంబె చొచ్చుచు ది♦నంబులు పుచ్చె శరాసపాణి యై. ౧౫౬
సీ. ఒకచోటఁ బదుమూఁడు ♦ నొక్కచోఁ బది రెండు
నొకయెడ నాలు గిం♦కొక్కకడను
నైదును నాఱును ♦ నాఱునొక్కఁడి గియుక
పాతి కెక్కువగ ము♦ప్పాతికగను
మూఁడు నెన్మిది మాస♦ములు రాముఁ డతిసుఖ
మారఁగాఁ గడపె నా♦యాయిచోట
నాప్రకారంబు ఋ♦ష్యాశ్రమంబులయందు
జరిపెను బదియేండ్లు ♦ చాపగుణుఁడు

తే. మరల నల్లసుతీక్ష్ణాశ్రమంబునకును
వచ్చి యచ్చోట నామునివరుఁడు వేఁడఁ
గొంతకాలంబు నిలిపియుంచె నంత నొక్క
నాఁడు రఘువీరుఁ డామునినాథుతోడ. ౧౫౭

→ శ్రీరాముఁ డగస్త్యాశ్రమంబునకుఁ బోవ సుతీక్ష్ణునిచే ననుజ్ఞఁ గొనుట. ←

ఉ. ఈవనమం దగస్త్యుఁడు మునీశ్వరుఁ డుండెడినంచు నిత్యముల్
నే వినుచున్న వాఁడను మునిప్రవరా స్థలమే నెఱుంగ న
ద్భావుని యమ్మునీశ్వరుపదంబులు గొల్వఁగఁ గోర్కి పుట్టె నీ
తావరజాన్వితంబుగఁ, దదాశ్రమమార్గ మెఱుంగఁ బల్కవే. ౧౫౮

కం నావుడు సుతీక్ష్ణుఁ డిట్లను, నీవిషయము నేన చెప్పనెంచెదులోనన్
నీవే ప్రస్తావించితి, భూవర! సంతోష మయ్యె బొమ్మచ్చటికిన్. ౧౫౯

చం.ఇట నొకనాల్గుయోజనము లేగితి వేనియు దక్షిణంబుగా
నట నొకరావితోఁపు గల దందు మిళిందకబృందసుందర
స్ఫుటదరవిందతుందిలవిశుద్ధజలాశయముల్ ఫలావళీ
విటపమనోహరోరుపృథివీరుహముల్ జలపక్షిసంఘముల్ ౧౬౦

చం.కల వదియే రఘూత్తమ యగస్తిసహోదరునాశ్రమం బటన్
నిలువుము రేయి, వేగినను నీ వటఁ జను దక్షిణంబుగా
నలవనపాళిపార్శ్వమున నామడ యొక్కఁడు పోవ నం దగ
స్త్యులపరమాశ్రమస్థలిని జూచెదు కన్నులపండువై తగన్. ౧౬౧

కం.బహుపాదపసంవృత మై, మహితంబై సనతలంబు మాసగుచుండున్
మహికన్యానుజలక్ష్మణ, సహితముగ రమింప నీకుఁ జను సౌఖ్యముగన్. ౧౬౨

కం.యతిహిత! నీ వతనిం గను, మతి గల్గినయేని యిపుడ మంచిది చనఁగా
జతనం బొనరింపు మనన్, క్షితిపతితనయుండు మౌనిసెలవుం గొనుచున్, ౧౬౩

తరలము.ముని వచించినత్రోవచొప్పున మువ్వురున్ పనిఁ బోవుచున్
గనిరి త్రోవలక్రేవలన్ ఘనకంధరాకృతిబంధురం
బును ధరప్రదయంబులున్ సుమపుష్పితప్రవనంబులన్
గొనబుమీఱినవంకలం గని గూర్చు మేలికొలంకులన్. ౧౬౪

చం.అవి గని రాఘవుండు హృదయంబు ముదంబునఁ బల్లవింపఁగా
నవరజుతోడ ని ట్లనియె నన్న యగస్త్యునితమ్ము నాశ్రమం
బవు నిది నిక్క మో మనకు సమ్ముని చెప్పినచిహ్నలన్నియున్
సవుసుగ నున్న వీవనిని జూడుతెరంగు ముదాకరంబు నై. ౧౬౫

సీ. ఫలపుష్పకుట్మల♦భారావనతములై, తగులు గంటివె నేలఁ ♦ దాఁకు చుంటఁ
బరిపక్వపిప్పలీ♦ఫలముల వగ నైన,గంధంబుఁ గొని వచ్చు ♦ గంధవహుఁడు
యచ్చటనచ్చట ♦ వ్రచ్చినకట్టెలు,వ్రేసులు పడియున్న ♦ పొలుపుఁ గంటె
వైడూర్యకాంతులు ♦ నజలి కోయఁగఁ బర్హి, దర్భల నదె చూడు ♦ ధరణిమీఁద
తే. నీలమేఘాగ్రనిభ మయి ♦ నెఱిఁ జెలంగు, పావకాముఖధూమాగ్ర ♦ పటలిఁ గంటె
యదె వివిక్తంపు తేవుల♦యందు ద్విజులు, స్నాతులై యమలపుష్పోప♦హార మిడిరి.
తే మనము వినిన యగస్త్యానుజ♦యనుజు నాశ్ర,మంబ యిదియౌ యోగంపు లో♦కంబుమేలు
పడఁగ నసురులనధియించి ♦ ప్రజలఁ జేర్చె, దక్షిణంబున నతనికిఁ ♦ దమ్ముఁ డితఁడు.

→ శ్రీరాముఁడు లక్ష్మణునకు వాతాపీల్వలులచరిత్రఁ జెప్పుట. ←

కం. వాతాపీల్వలు లనియెడి,భ్రాతలు బ్రహ్మఘ్ను లిచటఁ ♦ బ్రబలిరి దేవా
రాతులు ముశ్చక్రఘ్నులు, జాతిధరామరులఁహింప♦సంపద నెలయన్ ౧౮౮
ఉ. శ్రాద్ధము నేఁడు రెండు ద్విజ♦సత్తములార యటంచు నెంతయుక్
శ్రద్ధ నటించి సంస్కృతము♦నం బిలుచుక్ గృహమందు సర్వముక్
సిద్ధ మటంచు మేషముగఁ ♦ జేసి నిజానుజుఁ ద్రుంచి యిల్వలుం
డద్ధరణీసురవ్రాలకు ♦ నాపలలంబె భుజింపఁ బెట్టుచున్ ౧౮౯
తే. కుడిచి కూర్చుండి కడుపులు ♦ దడవుకొనెడి,ధరణిసురులను గాంచి వా♦తాపి'రమ్ము
టంచుఁ బిలుచును వాతాపి ♦యంతలోన, వారిపొట్టలు వ్రచ్చి తా♦వచ్చు వెలికి.
కం. ఈవిధముగఁ గ్రవ్యాదుల,చే వేలకొలంది విప్ర♦శేఖరు లెల్లక్
జావుం గూరి రగస్త్యుఁడు, దేవత లర్థింప వారిఁ ♦ దీర్చెక్ మహిమన్. ౧౭౧
మ. కలశీసూనునకుక్ నిమంత్రణము ప♦ల్కెక్ వార లస్మాని య
ట్టుల కానిం దని యేగి సర్వమును గు♦డ్డుక్ మెక్కి హస్తోదకం
బుల సంపన్న మటంచు నీయఁ గొనె నా♦మోదంబుతో నంత ని
ల్వలుఁ డోతమ్ముఁడ యన్న భ్రాతపయి నే♦లా భ్రాంతి రక్షోధమా. ౧౭౨
కం. నాకడుపునఁ బడి వెడలఁగ, మీకా సాధ్యంబు? వాఁడు ♦ మేషాకృతితో
నాకుక్షిని బడి జీర్ణం, బై కాలునిపురముఁ జేరె ♦ నది యెఱుఁగవుగా. ౧౭౩
చం. అని చిఱునవ్వునం బలుక ♦ నాతఁడు భ్రాతృవధం బెఱింగి హా
మ్మని పటురోష వేగమున ♦ నమ్మునిముఖ్యుని హింస చేయఁ బూ
నిన ననలాభదృష్టులను ♦ నీఱుగఁ జేసె ఘటోద్భవుండు చ
య్యన నలమానిసోదరుని♦యాశ్రమ మియ్యది చుమ్ము లక్ష్మణా. ౧౭౪
చం. అనునెడఁ బ్రొద్దు గ్రుంకుసమ♦యం బగుడుం గృతసాంధ్యుఁడై మునీం
ద్రునిఁ గని మ్రొక్కి యాతఁ డిడు♦తోరపుమూలములక్ ఫలంబులం

గొని యట రేయి వుచ్చి రఘు♦కులజుఁ డర్కుఁడు దోఁప మౌనితో
ననియె, మహాత్మ నీకృపను ♦ హాయిగఁ బుచ్చితి మిందు రాతిరిన్. ౧౬౫

కం మీయన్నను గనుఁగొనఁగాఁ, బోయెద మాజ్ఞప్తియే త♦పోధన యనుడున్
జేయుం డటు లని మౌని నతి, యాయనుఁగ మునియు విన్న త్రోవ ♦ నేగుచు వారల్. ౧౬౬

సీ సంజులగంజుల♦పుంజముల్ మాధవీ, కుంజముల్ బిల్వని♦కుంజములును
నాలంబులుత్తాల♦తాలంబులును మని, వారముల్ చిరిబిల్వ♦వారములును
సుందరచందన♦స్యందనముల్ కుంభముల్, మధుపాత్రసుమపుష్ప♦మధుకములును
సుమనోహరామల♦సుమనోవరాళులు, నాగమతులు పు♦న్నాగములును

తే. దిమిశపనసలు బహువిహం♦గసుసమూహ
కలకలాంచితములు నైపస్థ్యసహములు
కరికరాకృష్టములు కపి♦కంపితములు
గనులఁ గాంచువుగాఁగ గ♦న్గొనిరి వనిని. ౧౬౭

కం. తన వెనుకను గడుదాపునఁ, జను దెంచెడి లక్ష్మణునకు ♦ జనవరుఁ డనియెన్
గనితివె స్నిగ్ధదళంబుల, ఘనశాంతమృగద్విజాళిఁ ♦ గావున నిటకున్ ౧౬౮

శ్రీరాముఁ డగస్త్యాశ్రమంబుఁ జూచుట.

తే. అనతిదూరంబునందు మ♦హాత్మునాశ్రమంబు గల దందు నిజమహి♦మంబు పేర్మి
వనియందు నగస్త్యవి♦ఖ్యాతిఁ గాంచి, పట్టె మౌనీశ్వరుం డంచు♦నార్య వినుత.

తే. ప్రాజ్యఘనాచారకులవనంబు ♦ శ్రాంతలోక
సుఖదమును జీవమాలికా♦సుందరంబు
శాంతమృగయూథయుతము ని♦తాంతసమ్య
విహగనాదిత మయి యది ♦ వెలసెఁ గంటె. ౧౭౦

కం. ఈపుణ్యుం డీదిక్కును, బ్రాపించిన మొదలు శాంతి♦పరులై యసురుల్
లోపలఁ దటతట బలవ వెలి, చూపులఁ జూచెదర కాని ♦ చూపరు సూడున్. ౧౭౧

తే ఇమ్మునీశ్వరుపేరట ♦ నెసఁగుఁ గాదె, దిక్కుదక్షిణ మితనిని♦ దేశమునను
దీవ్రకరుని నిరోధింపఁ ♦ గిరివి వింధ్య శైల మిప్పటికిని నుండు♦ నేల నంటి. ౧౭౨

సీ. దీర్ఘాయు వైనదయా♦దీప్త తేజుసమూర్తి, మము విసీతజనస♦మంచితంబు
ఘజగదన్నితు ♦ నెలమి సేవించిన, మనకు శుభంబులు ♦ మొనయఁ గలవు
వనవాస శేషంబు♦గినము లితనిఁ గొల్చి, యింప యుందుము మహా♦నందముగను
నిచట గంధర్వాది♦నిచయ మీమితభోజిఁ, బర్యుపాసించును ♦ భక్తితోడ

తే. తపుఁడు కల్లరి కూళ నృ♦శంసకుండు, కామవృత్తుండు నిట బ్రదు♦కంగఁజాలఁ
డమరయక్షపతంగనా♦గాదులిచట, నలరు ధర్మైకరతి నియ♦తాశనముల. ౧౭౩

కం. ఈ యెడ సిద్ధులు తమ తను, కాయంబులు విడిచి సూర్య♦కల్పద్యుతు వై
హాయసయానములను సన, కాయంబులఁ దాల్చి దివికి ♦ గమనించిరయా. ౧౮౪
కం. ఇందలిభూతావళిచే, వందితు లయి దేవతలు స్వు♦వంబుగ నిడుదుర్
బృందారకయక్షత్వము, లందంబుగ రాజ్యభోగ ♦ మైశ్వర్యంబుల్. ౧౮౫
కం. వచ్చితి మాశ్రమమునకున్, సచ్చరితా నీవు మున్ను ♦ చని జానకి నే
వచ్చుటలు విన్నవింపుము, చెచ్చెరఁ జను మన్న నట్ల ♦ చేయుచు నతఁడున్ ౧౮౬

← శ్రీరాముఁ డగస్త్యునకుఁ దనరాకఁ దెలుప లక్ష్మణుఁ బంపుట. →

తే. ఆశ్రమపదంబునం జొచ్చి ♦ యచట నున్న, కలశసంభవు శిష్యునిఁ ♦ గాంచి పలికె
దశరథుని పెద్దకొడుకు సీ♦తాధవుండు, రామచంద్రుండు చనుదెంచె ♦ రమణితోడ
కం. మునిదర్శనార్థముగ; రా, మునితమ్ముఁడ లక్ష్మణుండ ♦ మునివర నన్నున్
వినవే హితుఁడ ఘనభక్తుఁడ, ననుకూలుఁడ నతనిఁ గొల్తు ♦ ననవరతంబున్. ౧౮౮
కం. సనయంబుగ జనకునియాజ్ఞను వనమునఁ జొచ్చితిమి ప్ర♦శస్తచరిత్రున్
మునివరుఁ గనుఁగొనఁ గోరెన, మనఘాగ్రజ విన్నవింపు♦మా మారాకల్. ౧౮౯
చం. అనవుడు వల్లె యంచు నతఁ ♦ డగ్నిగృహంబును జొచ్చి యస్తపో
ధనుఁ గని మ్రొక్కి మున్ దశర♦థప్రభుపుత్త్రులు రామలక్ష్మణుల్
వనజదళాక్షి సీతయును ♦ వచ్చినవారలు నీదుసేవకై
మనవి యొనర్పమీ యనిరి ♦ మౌనివరా! మున లేది? నావుడున్. ౧౯౦

← శ్రీసీతారామలక్ష్మణు లగస్త్యాశ్రమంబులోనికిఁ బోవుట. →

ఉ. భాగ్యము! రామచంద్రుఁ డిట ♦ వచ్చెనె యన్నిదినాలకేని, యా
యోగ్యచరిత్రురాకకయి ♦ యుల్లమునం దొగిఁ గాచి యుంటి, స
మ్యగ్గుణభక్తి వారలను ♦ నాదట సత్కృతిఁ దన్ప మున్పరిన్
భోగ్యవిధిన్ జవంబునను ♦ బొమ్మిటఁ దోడ్కొని రమ్ము శిష్యుఁడా. ౧౯౧
ఉ. వారిని లోను రం డనక ♦ వల్వనిజా గొనరించి తే లనన్
గూరినభక్తి నాతఁడును ♦ గొబ్బున మ్రొక్కి ససంభ్రమంబుగన్
జేరి సుమిత్రపట్టి! రఘు♦శేఖరుఁ డెచ్చట నున్నవాఁడొ యే
తేరఁడు మీర లన్న మహి♦దేవకుమారునితోడ నాతఁడున్ ౧౯౨
చం. వెలుపల వచ్చి యందు రఘు♦వీరుని జానకిఁ జూపెఁ జూపినన్
సలలితరీతి మౌనివచ♦నంబులు శిష్యుఁడు చెప్పి రాము న
స్ఖలితవిధిన్ బహూకృతునిఁ♦గా నొనరించిన వారు ప్రోదిజిం
కల నలువంకలం గనుచుఁ ♦ గ్రన్నన లోనికిఁ బోవ చయ్యెడన్ ౧౯౩
సీ. పరమేష్ఠిస్థానంబు ♦ పావకశ్రీవిష్ణు, శక్రదివాకర♦స్థానములును
బద్మారిస్థానంబు ♦ భగునిస్థానంబును, ధనదు ధాత విధాత♦స్థానములును

ననిలునిస్థాన మ♦నంతునిస్థానంబు, గాయత్రిస్థానంబు ♦ గడచి పోవ
వసువులస్థానంబు ♦ వరుణునిస్థానంబు, స్కందుని గార్తికే♦స్థానములును
తే. ననెడి పూజాప్రదేశముల్ ♦ గనుచుఁ బోవ, శిష్యపరివృతుండై ముని♦శేఖరుండు
దనకు నెదు రరుదెంచఁగ ♦ ననుజుఁ జూచి, కంటె నచ్చెడివాఁడె య♦గస్త్యమౌని

సీతారామలక్ష్మణు లగస్త్యు దర్శించుట.

కం కాంబోలు నతని తేజము,చేఁ గరికించితి నటంచుఁ ♦ జేరి రవికులభుఁ
డాఁ బదములఁ బ్రాలిన మతి, పూఁబోఁడి యు లక్ష్మణుండుఁ ♦ బూర్ణశ్రద్ధన్ ౧౯౫
తే. మ్రొక్కి నిలుచున్న నమ్మునిముఖ్యుఁ డెలమి
రాము నతిథిగ గ్రహియించి ♦ ప్రేమమునను
నర్ఘ్యపాద్యాదు లొసఁగుచు ♦ నర్చలిడి
నేమ మారసి కూర్చుండఁ ♦ జెప్పి పిదప ౧౯౬
తే. ప్రథితచరితుండు వైశ్వ దే♦వంబు సలిపి, యర్ఘ్యమిడి చక్కఁగావించి♦యతిథిపూజ
ధర్మవిధుఁడు వానప్రస్థ♦ధర్మసరణి, భోజనం బిడి తనరంగఁ ♦ బూర్ణతుష్టి ౧౯౭
తే తాను దొలుదొలఁ గూర్చుండి ♦ తత్త్వవేది
యంజలి ఘటించి కూర్చున్న♦యమ్ములధర్మ
కోవిదుని రాముఁ గనుఁగొని ♦ కుతుకమూని
నిట్టు లనియెను ధర్మంబు ♦ తెలుపఁ దలఁగ. ౧౯౮
కం హోమంబు సలిపి యతిథికి, శ్రీమహితా యర్ఘ్యమిచ్చి ♦ సేవింపఁగ నొ
నామెయిఁ జలుపనితపసి ని,జామిషమును గూటసాక్షి♦యటు లట మెక్కున్.
ఉ. రాజవు సర్వలోకనిక♦రంబుల కీవు మహారథుండవుఁ
భ్రాజితధర్మవర్తివి వి♦రాజితకీర్తివి మాన్యమూర్తివిఁ
బూజకుఁ బూర్ణయోగ్యుఁడవు ♦ భూవర వచ్చితి కూర్మికిం దనై
యోజ దలిర్ప మాకు సుకృ♦తోదయ మింతకు నొందు గల్గునే. ౨౦౦
కం.అని ఫలమూలసుమంబులు, తనివి దనరఁ వారి కిచ్చి ♦ తదనంతర మా
జనకసుతాధవునకు ముని, ఘనచాపాసియశరాదిఁ ♦ గనిపించి యనెన్. ౨౦౧

అగస్త్యుఁడు శ్రీరామునకు వైష్ణవాయుధంబులు సమర్పించుట.

సీ. ఈదివ్యమహనీయ ♦ హేమమణిభూషి, తాసనుమవిష్ణుశ♦రాసనంబు
నిర్మిత మౌవిశ్వ♦కర్మచే; నీశర,రాజ మమోఘంబు ♦ రవినికాశ
మబ్జజదత్త మీ♦యక్షయ్యసాయక,ములు శితబాణసం♦పూర్ణతూణు
లనఘ సువర్ణాంచి♦తాసియుఁ గోశంబుఁ, బాకారిదత్తముల్ ♦ భాను తేజ
ఆ. యీశరాసనమున ♦ నింద్రవిరోధుల, సంగరమునఁ జంపి ♦ శార్ఙ్గధన్వి
జయముఁ గొనియెఁ జుమ్ము♦శరములు నవ్వియ,యసియుఁ దరకసంబు♦లవియరామ.

ఆ. వఱల జయము నీకు ♦ వజ్రి వజ్రంబును,[1] గొనినభంగి వీనిఁ ♦ గొను మ టంచుఁ
దవ్వరాయుధములు ♦ దశరథసుతేంద్ర,మున కొసంగి యిట్లు ♦ లనియె మఱియు.

⟵ అగస్త్యుఁడు శ్రీరామునితో సల్లాపంబు లాడుట. ⟶

శా. రామా! లక్ష్మణ! ప్రీతిఁ జెందితిని మీ♦రిల్ భూమిజాయుక్తులై
ప్రేమ న్నన్నన నిందు వచ్చుటను, దా♦రిక్ గాసి పాల్గైతి, రీ
రామారత్నముఁ జూడ నధ్వక్షముగ వి♦శ్రాంతిక్ మదిం గోరెడిన్,
భూమీశాత్మజ కోమలాంగి వ్యసనం♦బుం గాన చెప్పట్టునన్. ౨౦౪

ఉ. అట్టి కుమారి కష్టనిచ♦యంబుల కెల్లను నాటపట్టులై
నట్టివనంబులన్ ధవుని♦యందవలినట్టుల మైనభక్తిచే
నిట్టులు వచ్చి దుష్కరము ♦ నీమె ఘటించెను, గాన నీమె కె
ట్టట్టు సుఖంబొ యట్లు చరి♦యింపుము సొంపుగ నిందు రాఘవా. ౨౦౫

కం. సృష్టి మొదలుగాని జగమున, స్పష్టమ్ముగ స్త్రీలు మగని ♦ సౌఖ్యదశం దా
రిష్టం బని రంజింతురు, కష్టంబులు వచ్చె నేని ♦ కడ కేగు రయా. ౨౦౬

కం. మెఱపులచాంచల్యంబును, గఱకుఁదనంబునను నాఁడి♦కత్తులవాఁడిమియున్
నెఱపడి గరుడానిలముల,పఱపును దెఱవలను నెందుఁ ♦ బ్రకృతిగుణంబుల్. ౨౦౭

కం. ఈనీయిల్లాలియెడం, గానంగా రాదు దోష♦కణ మేనియు ని
మ్మానవతి సతీజనస,న్మానితయ యరుంధతీస♦మాన తలంపన్. ౨౦౮

కం. ఈవైదేహియు లక్ష్మణుఁ, డీవును వసియింపఁ గలుగు♦నీదేశము రా
మా! వితతాలంకృతమ్మె, పావన మగు నన్న రామ♦భద్రుఁడు పలికెన్, ౨౦౯

కం. దారానుజయుక్తుఁడ నై, ఘోరాటవిఁ దిరుగునాదు♦గుణములు నీకున్
గూరిచె ముద మటు గాన ను,దారగుణా! నీకృపను ♦ ధన్యుఁడ నైతిన్. ౨౧౦

ఆ. నీటివలను గలిగి ♦ నిండార నడవులు, గలుగునాశ్రమంబుఁ ♦ గరుణ మీఱ
నానతీయ వయ్య ♦ యచ్చోటఁ గాలంబు, గడవు దీఱ దాఁకఁ ♦ గడపువాఁడ.

కం. ఇటు రాముఁ డడుగఁగా నొక,గ్గుటి యాలోచించి విగత♦దోషుఁడు పలికెన్
స్ఫుటధీరతిరోక్షులతోఁ, బటుతరగుణభద్ర రామ♦భద్రా! వినుమా. ౨౧౨

కం. బహుమూలఫలోదక మై, బహుమృగసంకీర్ణ మగుచుఁ ♦ బంచవటి యనన్
మహితమగుతలము సౌఖ్య,ద మిట కామడలు రెండు ♦ నర్తిలు దన్నై. ౨౧౩

కం. చని యట నాశ్రమసంస్థా,పన మొనరిచి యాసుమిత్ర♦పట్టియు మీరున్
జనకునివాక్యము నడపుఁడు, చని యుం డెన్నఁ డయుఁ దపసి♦సముదాయంబుల్. ౨౧౪

[1] వజ్రి...[illegible]
కాఁడు మునుఁ బలివారగు.

వింప నెనమంద్ర వారిలోఁ ♦ బెండ్లి యాడెఁ
గశ్యపుఁడు వారి పేరులు ♦ కరుణ వినుము. ౨౨౩

తే. అదితి దితియును దనువును ♦ నతులచరిత!
కాళియును క్రోధవశ యను♦కలికి తామ్ర
మనువు ననలయు నందును ♦ మానవతుల
నాంద్రఁ గనుఁగొని కశ్యపుఁ ♦ డనియె నిట్లు. ౨౨౪

కం. మీరు త్రిలోకీరక్షణ,భూరిక్షము లైనవారిఁ ♦ బుత్రులఁ గనుఁడీ
పేరిమి మత్తుల్యుల నన, నారులు తొలిసల్వ రొప్పి♦నం దక్షసుతుల్. ౨౨౫

ఆ. సన్నుతింపరైరి ♦ సరవి ముప్పది ముప్ప, దైననుతులఁ గనియె ♦ నదితి యందు
వార లైరి రుద్ర♦వసావశ్వినేయు లా,దిత్యు లనఁగఁ బరఁగు ♦ దేవవరులు. ౨౨౬

తే. దితికి దైత్యులు గలిగి రీ♦క్షితితలంబు, వారలదియ ససాగర♦వనము మున్ను
దనువునకును నశ్వగ్రీవుఁ ♦ డనఁగఁబుట్టెఁ, గాళికకు నరకుండును ♦ గాలకుండు.

సీ. కలిగిరి తామ్రకుఁ ♦ గ్రౌంచియు భాసియు, శ్యేనియు ధృతరాష్ట్రి♦చెలఁగి శుకియుఁ
గన్యక లేవురు ♦ క్రౌంచి యులూకాళి, భాసి భాసంబులఁ ♦ బ్రసన మయ్యె
శ్యేనియు గృధ్రాళి ♦ శ్యేనంబులను గనె, ధృతరాష్ట్రిహంసల ♦ నుతగుణాఢ్య
కలహంసచక్రవా♦కంబుల శుకియును, నతఁ గాంచె, నతకు వి♦నత జనించెఁ

తే. క్రోధవశకును బదుగురు♦కూఁతు లైరి
సురస మృగమంద హరి శ్వేత ♦ సురభి భద్ర
మదయు మాతంగి శార్దూలి ♦ మఱియుఁ గద్రు
కయును మృగియును; మృగికి మృ♦గంబు లొదవె. ౨౨౮

సీ. మృగమందకును గల్గె ♦ ఋక్షముల్ సృమరముల్,చమరముల్ హరికిసిం♦హములుఁ [కపులు
భద్రమదకు రామ♦భద్ర యిరావతి, దానికి నైరావ♦తంబు గజము
మాతంగికిని బుట్టె♦మాతంగములువ్యాఘ్ర,ములునుగోలాంగూల♦ములునుగలిగె
శార్దూలికిని; దిగ్గజంబులు శ్వేతకు, సురభికి రోహిణి ♦ సురుచిరాంగి

తే. మఱియు గంధర్వి, నాలు సం♦భవము లయ్యె
రోహిణికిని, గంధర్వికి ♦ వాహవితతి;
సురస బహుఫణముల నాగ♦నరులఁ గాంచెఁ
గద్రువకుఁ బన్నగంబులు ♦ గలిగె నయ్య.

సీ. మను వనుదానికి ♦ మనుజులు పుట్టిరి, బ్రాహ్మణ క్షత్రియ♦వైశ్యశూద్రు
లనువారు సర్వపు♦ణ్యఫలవృక్షంబుల, ననలాఖ్య గనియును ♦ వినతయు శు
శుకి సుతాసుతకును ♦ నుతు లరుణుండును, గరుడుండు నాఁగను ♦ గలిగి రయ్య
సురసతోఁబుట్టు వౌ♦సుదతికిఁ గద్రువ,కును ధరణీధరం♦బును సహస్రము

తే. వేయునేటికిఁ బూర్ణముగ ♦ వెలసె నందు, వరుణనుఘుండనను సంపాతి ♦ కవరజుండ
ననఘ నన్నుజటాయు వ♦టంచుఁ బల్కెని, శ్యాఘ్యపుఁడవ నిష్టమేని సా♦యం బొనర్తు.
కం. కాంతారము దుర్గము దు,ర్దాంతము రక్షోన్వితంబు ♦ రామా! మృగయా
స్వాంతము వ మీరు చన నే, కాంతంబుగ నున్న సీతఁ ♦ గడిమిం గాతున్. ౨౩౧
చం. అనుచు జటాయువాక్యముల ♦ నంతయు నాఁట నాలకించి యా
జనకహితుం గవ్వులగిటను ♦ సమ్మతిఁ గ్రుచ్చుచు మైత్రిగాథలన్
వినుచును సత్కరించి పృథి♦వీసుత నాతనికిన్ సహాయుఁడై
యవనుఁడు తోడ రాఁగఁ జని ♦ రంపటుఁ బంచవటిం గనుంగొనన్. ౨౩౨
కం. నడి గొని నుండెడిజ్వాలానుఁడు, మిడుతలు దహింయించుగతి న♦మిత్రజనములన్
బొడ యడఁగింపఁగ జొచ్చెం, దొడి తోడి రాముఁడు తమ్ము♦తోఁ బంచవటిన్. ౨౩౩
కం. నానావ్యాళమృగాయుత, మానాపంచవటిఁ గాంచి ♦ యంబుజనేత్రుం
డానందితు సౌమిత్రిని, మానితమధురోక్తి ననియె ♦ మన ముపొంగిన. ౨౩౪

## సీతారామలక్ష్మణులు పంచవటిఁ బ్రవేశించుట.

శా. అన్నా! పంచవటీప్రలీల గలం♦న్యం బైన దేశం బిదే
కన్నారం గన నో సుపుష్పితలతా♦వృక్షజాతజాతంబులో
విన్నాణీ! పరికించి చెప్పు మిఁకఁ బ్ర♦ఖ్యాతనన్యకున్ నీకు నా
కు న్నిండార ముదంబు నాశ్రమ మెటం ♦ గూర్పంగ నో లక్ష్మణా. ౨౩౫
ఉ. నీటికి దవ్వుగాక రమ♦ణీయవనీహృదయంగమస్థలీ
వాటులు గల్గి మిట్టలును ♦ బల్లము లేక సమప్రదేశ మై
గాటముగాఁగఁ బూవులును ♦ గట్టియలుం గుశలున్ సమీప మై
నే టగుసైకతం బయిన♦నిర్మలదేశముఁ జూడుమీ యనన్. ౨౩౬
ఉ. అంజలి చేసి జానకిస♦మక్షమునం దిటు విన్నవించె భూ
రంజనశీల యయ్యెడఁ జి♦రంబుగ మీరు శతాబ్దముల్ ముదా
త్మం జరియింప మీకుఁ బర♦తంత్రుఁడ నే, నటుగాన మీరె నా
కుం జేసవార నాజ్ఞయిడుఁ ♦ గోరవ మీకు రుచించుస్థానమున్. ౨౩౭
చం. అనవుడు రాఘవుండును మ♦హాత్ముని లక్ష్మణుమాట కెంతయున్
దనరి ముదానఁ బోయి యుచి♦తం బగు దేశము చూసి, తమ్ముకే
లిని వనకేలిఁ బట్టుకొని ♦ లీలమెయిన్ వచియించె నీస్థలం
బిజ! సమంబు పుష్పితన♦గాన్వితమా త్రమ మిందుఁ గూర్పుమీ. ౨౩౮
తే. అదిగో నాదిత్యసంకాశ ♦ మైనసురభి,గంధమద్గ్రాళిఁ గోమ రయి ♦ బంధురముగఁ
బద్మ సేన మైన స్ఫుటపద్మపంక్తి, దాపునం దున్నయది సుమిత్రాతనూజ. ౨౩౯

కం సురుచిరపుష్పితతరునై, వరసారసహంసచక్ర♦వాకాన్వితమై
పరువన్ని యనినగోదా,నది యిదె కనుఁగొనుము కనుచు ♦ నలరెడిఁ గంటే. ౨౪౦
ఉ సుందరకందరంబులను ♦ సొంపును నింపు రహింపఁ గేకికా
బృంద మమందనాదముల ♦ నెల్లెడ నర్తనఁ బూచి కాచి యా
నందము కందళింపఁగ ఘ♦నంబులు భూమిరుహంబు లొప్పఁగా
దంపడి పర్వతంబు లివె ♦ దవ్వును దాపును గాక యుండెడిన్. ౨౪౧
తే. పెక్కు తావులఁ బైఁడియు ♦ వెండి రాగి, ధాతువులచేత నొప్పుధా♦త్రీధరములు
వన్నెల నలంకరించిన♦వారణములు, చెన్ను వహియించు చున్నవో♦యన్న కంటె.
మత్తకోకిలము. సాలతాలతమాలతుంగర♦సాలజాలమధూకకు
ద్దాలవంజుల నక్తమాలవి♦తానసిందుక చందనో
ద్దాలచంపకపారిజాతక♦నంబనింబకపిత్థత
క్కోలకేసరజంభకింశుక(కూటపాటలకోటులన్ ౨౪౩
చం. గిరులు రహించె నీతలము ♦ కీర్తితమున్ మృగపక్షిలోకసుం
దరమును బుణ్యదంబు నిటఁ ♦ దమ్ముఁడ పక్షివిభుండు బాసటై
పరఁగ వసింత మన్న వెసఁ ♦ బర్ణకుటీరము పద్వి శాలమున్
ఖరకరవంశవర్ధనుఁడు ♦ గట్టె సుమిత్రతనూజుఁ డన్నకై. ౨౪౪

లక్ష్మణుఁడు పంచవటిఁ బర్ణశాల నిర్మించుట.

ఉ. నేలఁ బునాది త్రవ్వి కడు♦నేటుగ గోడలు పెట్టి బొంగుకం
బాలను నిల్పి వానిపయి♦ప్రక్క వెదుళ్లను బర్చి జమ్మివా
సాలు గుదిర్చి నారలను ♦ జక్కబిగించియు బోద తెల్లునన్
జాలఁగఁ గప్పి దిమ్మెపను ♦ సారెకు దంచి సపాటగా మహిన్. ౨౪౫
సీ. గోదావరికిఁ బోయి ♦ క్రుంకి సత్వరుఁ డయి,పండ్లుఁ బూవులుఁ దెచ్చి♦బలి యొనర్చి
శాంతికార్యంబుల ♦ నాంతము ల్గావించి, యన్నకుఁ గాన్పించె ♦ నాశ్రమంబు
సీతాసమేతుఁడై ♦ శ్రీరాముఁ డది చూచి, యానందరసభరి♦తాత్ముఁ డగుచుఁ
దమ్ముఁ జేరఁగఁ దీసి ♦ తనకౌఁగిటను గ్రుచ్చి, యనురాగ ముప్పొంగ ♦ ననియె నిట్లు
తే ఘనమతి! భవత్కృతమహా♦కార్యమునకు, నీడుగాఁ బారితోషకం♦బేమియీయఁ
గలను గావున నర్మిలిఁ ♦ గౌఁగలించి,నాఁడ నీశక్తి కేమను♦వాఁడఁ గుఱ్ఱ. ౨౪౬
చం. అనఘు తలం పెఱుంగుదు న♦యజ్ఞ! కృతజ్ఞుఁడ విట్టి నిన్ దనూ
జునిఁగను గన్నతండ్రి యతి♦శుద్ధుఁడు ధర్మ్ఁడు నాదుపాలికిన్
విను మనియున్నవాఁడ యని ♦ నెమ్మి వచించి సుఖంబుగా వసిం
చెను నటఁ గొంతకాలము వి♦శిష్టుఁడు వేల్పు దివంబునం బలెన్. ౨౪౭

↔ లక్ష్మణుఁడు హేమంతఋతువును వర్ణించి యన్నకుఁ జెప్పుట. ↔

కం కాంతానుజ యుతుఁడై యా, కాంతసుఖము మీఱఁ నుండఁ ♦ గా శారదవే
శాంతమున నిష్టమగు హే, మంతము వొడసూపె సురుచి ♦ మంతం బగుచున్.

ఉ. ఆవల నొక్కవేకువ మ ♦ హాత్ముఁడు రాముఁడు స్నాన మాడ గో
దావరికిం జనంగ వని ♦ తాయుతుఁడై బడిఁ బాత్రహస్తుఁడై
పోవుచు లక్ష్మణుం డనియెఁ ♦ బొల్పయి యబ్దము దేన రాజిలున్
వావిరి నీ కభీష్ట మది ♦ వచ్చెనుగా యలసీతు వియెడన్.[1] ౨౪౯

కం. బిఱుసెక్కె మేను ప్రజలకుఁ, గఱ కెక్కెను నీటి కనన ♦ గాహ్యముగ నిలన్
మెఱుఁ గెక్కెఁ బైరుపచ్చలు, నఱమఱ లే కాప్తుఁ డయ్యె ♦ హవ్యవహుండున్.

కం. పొంగళ్లను బొంగింతురు, ముంగల దేవతలకు బితృ ♦ ముఖ్యులకు బుధుల్
రంగారు క్రొత్తధాన్యము, లం గడు గతపాపు లగుచు ♦ లాలితచరితా. ౨౫౧

తే. వంశయాత్రాభిరక్తిని ♦ ధరణిపతులు
పరమగోరసనంపన్న ♦ తరులు ప్రాజ్య
కాము లయి జనపదులును ♦ గ్రాలు చంద్రు
గాదె యన్నయ్య యీమంచు ♦ కాలమునను. ౨౫౨

కం. దక్షిణదిశయందు జగ, చ్చక్షువు రాజించు చుండ ♦ శశ్వచ్ఛోభా
లక్షణతిలకచ్యుతహరి, ణాక్షి యనఁగ నుత్తరదిశ ♦ యమరెడిఁ గంటే. ౨౫౩

తే. సహజముగ మంచుగడ్డల ♦ స్థాన మైన
వాఁడు హిమవంతుఁ డీతఱి ♦ వేఁడి వెలుఁగు
మిగుల దూరగుఁ డౌటను ♦ మీఱె సార్థ
కాఖ్యుఁడై కాలనుహిమంబు ♦ నగ్గలికను. ౨౫౪

సీ. మధ్యాహ్నముల జనుల్ ♦ మలయ సుఖంబుగా, నింపైన నును వెచ్చ ♦ యెండ లొప్పె
సలలితార్కంబులై ♦ చాయల జెల్లను, జలములుగ్రాలె దు ♦ స్సహము లగుచు
మృదుమసూర్యంబు లై ♦ మిహికావృతంబు లై, వలిగాలి వీవఁగ ♦ వనము లెల్ల
మానవసంచార ♦ హీనంబులుగ ముస్ద, కట్లు కట్టిననిజాం ♦ గములు గలుగు
తే జనులతో దినసంబులు ♦ సాగు నిపుడు, కానఁగా రాని వెలిపడ ♦ కలను గలిగి
పుష్యనీతములయి మంచు ♦ బూఁజు వాఱి, యీఁదగాలిని రే లిప్డు ♦ వృద్ధిఁ జెందె.

కం. వావిరి నిజసౌభాగ్యం, బీవిధుఁ డర్కున కొసంగి ♦ హిమబిందువులన్
గావి గొని తేజ మఱె నో, టావిరిచే గ్రుడ్డి యైన ♦ యద్దము పోల్కిన్. ౨౫౬

తే. నిండుపున్నమనాఁటి వె ♦ న్నెలల రేయి, యినముచే మలినం బయి ♦ యెలమినీయ
దంపఁ గావిరివాఱిన ♦ పృథివికన్య, మాడ్కి నుండియుఁ దత్కాంతి ♦ మహిమ లేదు.

---

[1] మాసములలో మార్గశిరము నేనని భగవద్గీత.

కం. సహజంబుగ శీతలుఁడై, మిహికాయోగమున నిపుడు ♦ మిహిరకులేంద్రా
రహి ద్విగుణితశీతలుఁడై, యహస్సుఖములందుఁ బశ్చి♦మానిలుఁ డొప్పెన్. ౨౪౮
కం. యనగోధూమవిరాజిత, సవుబాష్పచ్ఛన్నవిపిన ♦ మర్కోదయమం
దవిరళక్రౌంచీసారస,రవముల శోభిల్లఁ దోఁచెగ ♦ రాఘవ కంటే. ౨౪౯
తే. కలితఖర్జూరకుసుమముల♦కాంతి గలిగి, పూర్ణతండుల మగుశిరం♦బును నొకింత
వంచి యపరంజిబంగరు♦వన్నె మెఱసి,యున్న నరిపైరుఁ గంటివే ♦ యుల్ల మలర
తే. మంచుతుంపర బెరసి వ్యా♦పించు చున్న
కిరణములతోడ సూర్యుండు ♦ కరము దవ్వు
నందు నభ్యుదితుం డయి ♦ చందమాను
పోలె నున్నాఁడు గనుఁగొమ్ము ♦ పుణ్యశీల. ౨౫౧
తే. రామ పూర్వాహ్ణమునఁ బస ♦ యేమి లేక
హాయిగా మేను సోఁకి మ♦ధ్యాహ్న వేళఁ
గించిదాపాండురంబులు ♦ నించుకంత
యెఱుపులై యున్నయవి చూపు ♦ మెండ లిపుడు. ౨౫౨
తే. ఇవముతుప్పర రాలుట ♦ నించుకంత, తడిసి యున్నట్టిపచ్చిక♦తావులందు
హాళియారెండ వ్రాలిన♦లీలఁ గంటె, మంచుబొట్టులు వజ్రాల♦మాడ్కిఁ దనరె. ౨౫౩
తే. అడవియేనుఁగు పెనుదప్పిఁ ♦ బడియు మిగులఁ
జల్లు మనియున్ననీటిని ♦ నల్ల యదిగొ
నంటియును ద్రాపకయ తొండ ♦ మల్లముడుఁచు
కొనుచు నున్నది తిలకింపు ♦ కులవతంస. ౨౫౪
తే. నీటిపక్షులు గూర్చుండి ♦ నీటి వెంట
మునుఁగఁగా జంకు చున్నవి ♦ యనఘచరిత
దురమునను గోఁచలగువారు ♦ చొరఁగలేని
తీరు దలఁపించుచును వాని♦ తెఱఁగు గంటె. ౨౫౫
కం. లో నీహారపుఁజీఁకటి, పైని యవశ్యాయతమము ♦ పటుగతిఁ గప్పం
గా నిద్రించెడివిధమునఁ, గానసము విపుష్ప మగుచుఁ ♦ గ్రాలెడి నన్నా. ౨౫౬
కం. ఆవిరిగ్రమ్మిననీటను, రావము చేఁ దెలియఁబడెడి ♦ రహి నెగ్గురులన్
దూవరమంచునఁ దడిసిన,యావాలుకపంక్తి నేఁటి ♦ లలరెడిఁ గనుమా. ౨౫౭
కం. ఇవ మదె పయిపయి రాలుట, రవికరములు మృదువు లగుట ♦ రామా కంటే
ప్రవిమల మగుశిలమీఁదం, దవిలినసలిలములు శిలవి♦ధంబుగ నయ్యెన్. ౨౫౮

కం. ప్రాలేయధ్వస్తంబును, జాల జరాజర్ఝరితము ♦ జాతెఱి కింజ
ల్కాళియు బిసశేషం బగు, నాళీకము తోడఁ గొలను ♦ నాతెముఁ బొసెన్. ౨౧౯

చం. కన నిటు పుంషువంటిచలి ♦ కాలమునన్ భరితుం డయోధ్యలో
ఘనతరదుఃఖవేదనను ♦ గ్రాఁగుచు, రాజ్యము మాని, భోగముల్
గొనక, తపస్వియై, నిదురఁ ♦ గూరుచు నేలపయిన్, మితాన్నముల్
గొనుచును, నీపయిం గలుగు ♦ కూరిమి పెంపున నున్నవాఁడుగా. ౨౨౦

కం. ఇదియే వేళ కతండును, నిదురన్ మేలుకొని యేటి ♦ నీట మునుంగన్
గదుకొని ప్రకృతులు గొలువఁగ, సదమలమతిఁ జనుచు నుండు ♦ సరయువుఁ జేరన్.

కం. గారామునఁ బెఁగినసుకు, మారుఁడు భరతుండు సుఖము ♦ మరగిన యాతం
డీరీతి నపరనిశలన్, సారసనయనుండు గ్రుంకు ♦ సరియువునందున్. ౨౨౧

సీ. మహనీయశరసుకు ♦ మారుండు ధీరుండు, సురుచిరానుచరుండు ♦ సుందరుండు
రాజితసర్వధ ♦ ర్మజ్ఞుండు, ప్రాజ్ఞుండు, సత్ప్రముదాపాది ♦ సత్యవాది
నిస్తుష్టకార్శ్యక ♦ నిరతుండు భరతుండు, మిత్త్రారిమదశోషి ♦ మధురభాషి
యాజానుదీర్ఘబా ♦ హుండు పరాగుండు, హ్రీనిషేధుండు జి ♦ తేంద్రియుండు
ఆ. భక్తిమేదురుండు ♦ భవదీయసోదరుం, డఖిలభోగరాసి ♦ యాసఁ బాసి
స్వర్గమును జయించె ♦ వననీమఁ జరియించు, నిన్నుఁ బోలి తపము ♦ నిష్ఠఁ దాలి.

చం. మనుజులలోనఁ దండ్రిని గు ♦ మారుఁడు పోలఁడు పోలుఁ దల్లినే
యనియెడి లోకవార్త పృథ ♦ గ్గయె చనెఁ గ్రైకయిపట్టియందు; నే
మన నుతిశీలి యాజి పతి ♦ గ్గయె, గుణి యాభరతుండు పుత్త్రుఁడై
చనియెడి కైక యట్టి ఖల ♦ శాతమనస్విని యాటయొ ట్లొకో. ౨౨౪

చం. అన విని కైక నేల దుర ♦ నాడఁగ? రాఘవవంశనాథుత
త్తనయుచరిత్రఁ జెప్పుము ము ♦ దం బగు, నే వనవాసనిష్ఠపై
మనము దిటంబు చేసియును ♦ మాన్యుని నబ్బరతుం దలంచినన్
వనటను మానసంబు కదు ♦ బాలిశవృత్తి భజించు లక్ష్మణా. ౨౨౫

కం. అమధురభాషణంబులు, నామహిత సుధోక్తి హృద్య ♦ మై యమృతరస
స్తోమనిభం బయి యెపుడున్, నామనమున మఱపురాదు ♦ నాయన వింటే. ౨౨౬

కం. నిను భరతుని శత్రుఘ్నుని, జనకజ నేఁ గూడియుండు ♦ సమ్మద మెన్నం
డొనరు నొకో యని వగచుచుఁ, జనియెం గౌతమికి రామ ♦ చంద్రుం డాడన్. ౨౨౭

కం. చని సీతానుజయుతుఁడై, యినముని పితృదైవతముల ♦ నెల్లఁ గొలిచి యా
యనఘుఁడు గిరిజానందులు, తనుఁ గొలువఁగ నుండు హరువి ♦ ధంబున నుండెన్.

## శూర్పణఖ శ్రీరాముని జూచుట.

ఉ. ఆహతలక్షణుండు వసు♦ధాత్మజ లక్ష్మణుఁ గూడి గౌతమీ
వాహినిఁ దాన మాడి నిజ♦పర్ణకుటీరముఁ జేరి యందు ని
ష్ఠాహితకల్యకృత్యముల ♦ నన్నిటిఁ దీరిచి శాలలో వరా
రోహయుఁ దానుఁ దమ్ముఁడు ని♦రూఢమతిం జని యిష్టగోష్ఠిఁ గై. ౨౮౯

కం. ఆసీనుం డయి లసదిలి,హాసంబులఁ జెప్పుచుండ ♦ నా సౌమ్యుఁడు సీ
తాసహితుం డయి దివిఁ జి,త్రాసంగతుఁ డైన చంద్రు♦రాణఁ దనర్చెన్. ౨౯౦

కం. కతలు చెప్పుచున్న♦కాకుత్స్థునిఁ జేర,విభు నదాటుగాఁగ ♦ నిర్జరారి
దైవపంక్తివను♦ననుజాత శూర్పణ,ఖాఖ్య నూచి చొచ్చె ♦ నాశ్రమంబు. ౨౯౧

సీ. హర్యక్షనిభవక్షు ♦ నరవిందపత్త్రాక్షు, సంతతోత్సాహు నా♦జానుబాహు
సలలితదీప్తాస్యు ♦ సజ్జనతోషాస్యు, నింద్రసమాను గ♦జేంద్రయాను
వర్ణితసుకుమారు ♦ బహుళజటాభారు, సమధిక ప్రియదర్శు ♦ శత్రుకర్శు
నిందీవరశ్యాము ♦ సౌందర్యజితకాము, భూపలక్షణయుక్తు ♦ భూరిశక్తు

తే. రాముఁ గనుఁగొని కుసుమనా,రాచశాత,బాణదారితచిత్తను ♦ పాపశీల
రాక్షసాంగన యతనిఁ జే♦రంగ వచ్చె, నృత్తమున్నస్య మాహాత్మ్య ♦ వికసితాస్య.

చం. సుముఖుని దుర్ముఖ యగుచు, వి♦శుద్ధసుశీలుని శీలహీన, యు
త్తమశుభరూపవేషుని ని♦తాంత వికారవిరూప, సుస్వరున్
సమధిక భైరవస్వర, వి♦శాలవిలోచను భీకరాక్షి, యా
భ్రమరవినీతకుంతలవి♦రాజితుఁ దామ్రశిరోజ, దక్షిణున్ ౨౯౩

తే. వామభాషిణి, తరుణుని ♦ బలితదేహ, దారుణాకార ప్రియుని ను♦ద్గాఢభయద
వేష యిట్లనుఁ బంచశ♦రేషుదగ్ధ, చిత్త యగుచును మోహంపుఁ♦దత్తరమున. ౨౯౪

## శ్రీరాముఁడు శూర్పణఖకుఁ దమవృత్తాంతముఁ జెప్పుట.

ఉ. ఎవ్వఁడ వీవు? చెప్పుము ము♦నీశ్వరవేషముఁ దాల్చి భార్యతో
నివ్వనభూమిఁ జాపశర♦తేషుధయుంబులఁ బూని రాక్షసుల్
క్రొవ్వున సంచరించు నెడఁ ♦ గ్రుమ్మర నేల? నిమిత్త మేమి మీ
రివ్విధి నిందు నుండ? నన ♦ నిట్లనియెన్ ఋజుబుద్ధి రాముఁడున్. ౨౯౫

కం. రాముని కన్నతం బొమట, యేమాత్రం [illegible] గాదు♦భీష్టం, బందు
రామానికటమునఁ దపస్విసహితావస్థ నింకఁ ♦ జెప్పెఁగ నెలం. ౨౯౬

సీ. ధరణీతలేంద్రుండు ♦ దశరథనాముండు, త్రిదశతేజుఁ డొకండు ♦ తేజరిల్లు
నా రాజుకొడుకు♦నుం బగ్రజుఁడ నేను, రాముఁ డందురు నన్ను ♦ భూమిజనులు

నాతమ్ముఁ డీతండు ♦ నా వెంటఁ జనుదెంచె, లక్ష్మణాఖ్యాతుండు ♦ లలితగుణుఁడు
ఈతన్వి నాభార్య ♦ సీత యందురు పేరఁ, దల్లిదండ్రుల యాజ్ఞఁ ♦ దప్ప నోడి
ఆ. ధర్మకాంక్షఁ జేసి ♦ ధర్మార్థమై యిట, వచ్చినార మేము ♦ వనిత వింటె
యింకఁ జెప్పు మెవతె ♦ విపు? నీపే రేది? తథ్యమాడు మెవరి♦దాన వీవు. ౨౮౭
తే. నీదునవమనోజ్ఞ వేషంబు♦ నెఱిఁ గనంగ, రక్కసివిగాఁగఁ దోఁచెదు ♦ నిక్క మనుమ
యిచ్చటికినీవు రాఁగతం♦బేమి?యనిన, సత్యము వచింతు నో రామ! చంద్రవినుము.

శూర్పణఖ శ్రీరాముని మోహించుట.

సీ. నేను శూర్పణఖ నా♦నెగడినరాక్షస,తరుణి నేకామ్యపైనఁ ♦ దాల్చి నేస్త
నీయరణ్యంబున ♦ నేకతఁ జరియింతు, సర్వభయంకర♦చరిత నగుచు
విన లేదె నీ వల♦విశ్రవసునిపుత్త్రు, రాక్షసనాయకు ♦ రావణాఖ్యు
నాతండె మాయన్న ♦ యధికనిద్రాళు వౌ,కుంభకర్ణుం డతి♦క్రూరబలుఁడు
తే. దనుజచేష్టితదూరుండు ♦ ధర్మచిత్తుఁ, డగువిభీషణుఁ డును దోడు ♦ లమరరూప!
తోడఁబుట్టువు లాఖర♦దూషణులును, నతులసంగ్రామశూరు లో♦యందగాఁడ
ఉ. వారి నతిక్రమించి మది♦వచ్చినచొప్పు చరించుచుందు, నా
కారము సందు నీసమునిఁ ♦ గానమి నెందును నిన్ను నేను గ
న్నారఁగఁ గన్న దాది హృద♦యంబున నీవ మగండు గాఁగ నేఁ
గోరితి నిన్నుఁ జేరితి న♦కుంఠితవృత్తిని బూరుషోత్తమా. ౨౮౦
ఉ. ఏ మనుకొంటివో నను మ♦హీశ! యమేయతరప్రభావల
క్ష్మీమిత స్వైరసంచరణ♦సిద్ధబలాన్విత; నామగండవై
కామిక సౌఖ్యముల్ పడయు♦మా, యిది యేమిటిసీత రోఁత, నీ
కీమదిరాక్షి యర్హ యగు♦నే వికృతాంగి విరూప యిన్నిసీ. ౨౮౧
శా. ఏనే నీ కనురూపభార్యను జుమీ ♦ యిల్లాలిఁగాఁ గొమ్ము న
న్నీనీసీతఁ గరాళ దుష్టవనితన్ ♦ హేయన్ మనుష్యాంగనన్
నే నీతమ్మునితోడ మ్రింగెద నిదే ♦ నీ వేను శైలాటవీ
నానాకందరసుందరోర్వుల మగం♦డా! వేడ్కఁ గ్రీడింతమా. ౨౮౨
కం. అనవుడుఁ జఱున వ్వాలయఁగ, దనుజాంగన కసమబాణ♦తాడితకును వా
క్యనిపుణుఁడు మృదులవాక్యం,బున విస్పష్టార్థయుక్త♦ముగ నిట్లనియెన్. ౨౮౩
ఉ. ఆడితి దీనిఁ బెండ్లి, ప్రియు♦రాలిది నా, కెటు వీడ నేరుతున్
జోడుము నిన్నువంటి పెను♦సుందరికిన్ సవతాలిపోరు నా
వీడనిదుఃఖకారణము ♦ వీనిఁ గనుంగొను శీలవంతు, నా
తోడుఁ, బ్రియానవలోకను, సు♦దుర్భరతేజుని, లక్ష్మణాఖ్యునిన్. ౨౮౪

ఉ. వీఁ డనభార్యలేఁ, డతుల♦వీరవరుండును, జాణ, ప్రాయపుం
బోఁడిమి గల్గుసుందరుఁ, డ♦పూర్వి, సతీమణిలాలసుండు, పూఁ
బోఁడి! భవత్సురూపమును ♦ బోల్పఁగ నీకపతిత్వయోగ్యుఁడౌ[1]
వాఁడె, భజింపు వీని నస♦పత్నత నొంద సుమేరురీతిగన్. ౨౯౫
కం.అను రాముని పల్కులు విని, దనుజాంగన కామమోహి♦తస్వాంతమునన్
జని కని లక్ష్మణుతో ని, ట్లనియె వృథాకాలయాప♦నాసహమతియై. ౨౯౬
కం.నీచక్కఁదనమునకు సరి,యౌచెలువను నేనె, నీకు ♦ నాలయ్యెద, న
న్నో చెలువుఁడ! కైకొమ్మా, వే చనుదమె వనుల గిరుల ♦ విహరింపంగన్. ౨౯౭
చం.అన విని లక్ష్మణుండు పరి♦హాసముగా నను నేను బానిసీ
డను, ననుఁ బెండ్లియాడి యక♦టా చెలి బానిస వీవు నౌదె నా
యనువున నబ్జవర్ణిని మ♦హాత్మున కన్నకు నేను బంట నై
మనుట యెఱుంగవో యిటులు ♦ మాటలు చెప్పెదె నీ వెఱింగినన్. ౨౯౮
తే. ఆసమృద్ధార్థునకు నసి♦ద్ధార్థురాల,ముదిత నమలవర్ణిని వీవ ♦ ముద్దు లొలుకు
భార్యవు కనిష్ఠురాల వై ♦ బ్రదుకు చుందు, వింత తలఁపన నిన్ను నే ♦ నే మటందు.
తే. ఈవిరూపఁ గరాళను ♦ నీయసతిని, నిర్ణతోదరి వృద్ధను ♦ నెట్టి నిన్ను
భార్యఁ గైకొను నిటువంటి♦పరమరూప, విడిచి మానవి నెవ్వఁడే ♦ వేడ్కసేయు.[2]
కం.అని లక్ష్మణుండు పలికిన, విని యది పరిహాస మగుట ♦ వెకలి యెఱుఁగకే
చని పర్ణకుటీరములో, జనకసుతాయుతున కనియె ♦ స్మరమరిద్ధయై. ౩౦౧
తే. ఈవిరూపను నసతిని ♦ నీకరాళ, నిర్ణతోదరిఁ జేపట్టి ♦ నీవు నన్ను
గారవింపవ మ్రింగి యీ♦గరితనిపుడు, సవతిపోరాటములు లేక ♦ సౌఖ్యపడుదు.
తరలము. అని కురంగకిశోరలోచన ♦ నాయలాతనిభాక్షి హా
మ్మనుచు రోహిణిమీఁదఁ బాఱుమ♦హోత్తరోల్క యనంగ రాఁ
గని మహాబలశాలి రాముఁడు ♦ గ్రక్కునం బిగఁబట్టి కిం
కను సుమిత్రతనూజుతో ననుఁ ♦ గంటె లక్ష్మణ రక్కసిన్. ౩౦౩
కం నీచులతో నెప్పుడుఁ బరి,యాచక మాడంగఁ గూడ ♦ దక్కట యిదె సీ
తాచపలాక్షియు స్వస్థత, నేచందంబుననొ కాంచె ♦ నెటు లోర్వ నగున్. ౩౦౪

→ లక్ష్మణుఁడు శూర్పణఖముక్కు సెవులను గోయుట. ←

తే. ఈమహోదరి నసతిని ♦ నీవిరూప
నీమదోన్మత్త రాకాసి ♦ నిపుడ పట్టి
చేయుము విరూప నన్న న♦మేయబలుఁడు
కోపమున దానిముకు సెవుల్ ♦ గోసె నసిని. ౩౦౫

---

[1] నికపతిత్వయోగ్యుఁడౌ :- (1) నీకు + అపతిత్వయోగ్యుఁడు. (2) నీక + పతిత్వయోగ్యుఁడు.
[2] ౨౯౫ - ౨౯౭ - ౨౯౮ పద్యములకు రెండర్థములు గలవు.

ఉ. ముక్కును వీను లీకరణి ♦ మొక్కలు వోయిన మొత్తుకొంచుఁ జే
రుక్కునఁ గారుమబ్బు వలె ♦ హోయని కానయు మాఱుమ్రోయ నా
రక్కసి బొబ్బ వెట్టుచును ♦ రక్తము గాఱ వికారరూప యై
యక్కను తోడ నేడ్చుచు వ♦నాంతరవీథులఁ బాఱి గ్రక్కునన్. ౩౦౬

తే. చని జనస్థానమందు రా♦క్షసపరీతుఁ, డైనసోదరు ఖరుఁ గని ♦ యార్తనాద
మెసఁగ దివినుండిపడియెడి♦పిడుగుపగిది, నేలఁ బడి పెద్ద యెలుఁగున ♦ నేడ్చుచుండె.

కం. తెడియుఁగ నెత్తుట దేహము, పుడమిం బడి వికృతరూప♦మున నేడ్చెడున
ప్పడఁతుకఁ గని యాగ్రహమున, నుడుకుచు ఖరుఁ డిట్టు లనియె ♦ నుగ్రాకృతి యై.

↞ ఖరుఁడు శూర్పణఖ వికృతవేషమును జూచి కోపించుట. ↠

ఉ. ఎవ్వఁ డనాగసాచలము♦హిమ్మనిపోజ్వల♦లకృష్ణసర్పముల్
గ్రొవ్వున వ్రేలితోఁ జెనకెఁ ♦ గ్రోలె నెవండు విషంబుఁ? గంఠమం
దెవ్వఁడు చుట్టుకొఁ గలిగె ♦ హీనమనీషను గాలపాశ? మే
నెవ్వఁడి నేగి వాని యిదె ♦ నేలను గూల్చెద, నెత్రు, వీల్చెదన్. ౩౦౯

కం. బలవిక్రమసంపన్నవు, వలచినచో వలచినట్లు ♦ వలచినవేషం
బులఁ దిరిగెద వీదుర్దశఁ, గలిగఁ యత్రాయు నెవఁడు ♦ గలిగించె నొకో. ౩౧౦

కం సురనరగంధర్వాదులఁ, బరమర్షుల నే నెవండు ♦ పరమాపకృతిన్
దురుసుగఁ జేయఁ దెగించిన,గురుసాహసుఁ డెవఁడు చెపుమ ♦ కూల్చెదవానిన్.

ఆ. సురలయందుఁ బాక♦సూదనుఁడును సహ
స్రాక్షుఁ డగుమహేంద్రుఁ ♦ డైన నాకు
నప్రియంబుఁ గూర్ప ♦ నడలెడి నా నెవ్వఁ
డొక్కొ నాకనిష్ట ♦ మొనరఁ జేయు. ౩౧౨

కం. నీరముల నున్న క్షీరము, సారస మానెడువిధానఁ ♦ జయ్యన నిదె నా
నారాచంబులనాతని, ధారణిఁ బడవైచి త్రావెద ♦ దగ్ ప్రాణంబుల్. ౩౧౩

ఉ. క్రూరరణాంగణంబునను ♦ గూలిచి వేసి సఫేన రక్తముల్
ఘోరముదాకునోత్కరము ♦ గ్రోలఁగఁ గోరమి? శాతబాణని
ర్దారితమ్మసంధుఁ డయి ♦ దారుణగృధ్రపతత్రిజాలి కా
హారముగా నెవండొ యిటు ♦ లాఁతిపెట్టె నినుఁ సహోదరీ. ౩౧౪

ఉ. కావఁగ వాని దేవతలు ♦ గారు సముర్షులు, కాదు నాకనుల్,
చావు నిజంబు వానికిని ♦ శాతశరాహతి సేన చేతి నే
వేవిధినైన వాని గుఱుఁ ♦ జెప్పవె చెప్పుము టన్న ఖ్యాతృవా
క్యావలి? నాలకించి బహు♦రాత్రులు చెల్లి గొనంగ నిట్లనున్. ౩౧౫

శూర్పణఖ ఖరునకు సీతారామలక్ష్మణులవృత్తాంతముఁ జెప్పుట.

చం. తరుణులు ప్రశస్తరూపులును ♦ దాపసవేషులు సౌకుమార్యభా
స్వరులు మహాబలుల్ విశద♦వారిజలోచనులుఁ మృగాజినాం
బరులును వన్యమూలఫల♦భక్షులు దాంతులు ధర్ములుఁ సహో
దరులును రామలక్ష్మణులు ♦ దాశరథుల్ సుమి వారు రాక్షసా. ౩౧౬

కం. భూవల్లభచిహ్నకింతు, లావరగంధర్వనాయ♦కాభులు వారల్
దేవతలో మానవులో, భావింపఁగ రాదు తేజ ♦ పరికించినచోన్. ౩౧౭

కం. వారలమధ్యంబున నొక, నారీమణిఁ గంటిఁ దరుణి ♦ నవ్యమనోజ్ఞా
కార సమస్తాభరణో,దార సుమధ్యమ సరోజ♦దళనేత్ర నటన్. ౩౧౮

కం. ఆయువతినిమిత్తంబుగ, నాయిద్దఱు నొక్కటగుచు ♦ నదలిచి నన్నీ
చాయ ననాథసతింబలె, బోయనిదురవస్థలకును ♦ బొల్పఱిచి రయా. ౩౧౯

కం. ఆకుటిలశీలరక్తము,నీకహతులవారినురువు♦నెత్తురుఁ దమిచే
నాకంఠముఁ గ్రోలఁగ నిష్మా కోరితి నిదియె మొదటి♦యభిలాష సుమీ. ౩౨౦

ఖరుండు పదునాల్వురురాక్షసుల శ్రీరామునిమీఁదికిఁ బంపుట.

చం అన విని దానిమాటలకు ♦ నాగ్రహ మెత్తి ఖరుండు క్రూరులఁ
దనుజవరేణ్యులం బదియు♦నల్వుర నంతకతుల్యతేజులఁ
గని మనదండకాటవిని ♦ గామినితో మనుజుల్ శరాసనో
ద్ధరులు మృగాజినాంబరులు ♦ దార్కొని నిల్చిరి వారి నిర్వ్వగన్. ౩౨౧

తే. మీరు చంపుఁడు మాయక్క ♦ మేలుపడియె, వారినెత్తురు ద్రావంగ ♦ శూరులార
యప్పకోరికి దీర్పంగ ♦ నరుగుఁడనిన, వీరు లరిగిరి యాసతి ♦ వెంట రాఁగ ౩౨౨

శా. వాతోత్క్షిప్తఘనోత్కరంబుపగిదిఁ ♦ వా రేగి యాభ్రాతలఁ
సీతాయుక్తుల నాశ్రమస్థలసమా♦సీనప్రభావంతులఁ
దైతేయాంగన చూపఁ జూచి రలసీ♦తానాథుఁ డారాక్షసా
న్వీతఁ శూర్పణఖం గనుంగొని యను ♦ న్దీప్తాస్యుఁ సౌలక్ష్మణున్. ౩౨౩

ఉ. ఇంచుక నిల్వు మీ విచట ♦ నీయెలనాఁగను గాచి వీరలం
ద్రుంచెద నన్న పల్లె యనఁ♦దూర్ణము సజ్యశరాసనుండు నై
కాంచనపుంఖబాణములఁ ♦ గైకొని కంజవిలోచనుండు దు
ర్వంచకరాక్షసాధముల♦వంకఁ గనుంగొని పల్కె నీగతిన్. ౩౨౪

సీ. రామలక్ష్మణు లను♦భ్రాతల మే మల,దశరథసుతులము ♦ దండకాట
విని సీతతోఁ గూడ ♦ విహరింప వచ్చిన,వారము ఫలమూల♦వారభక్ష

కులము తాపసులము ♦ లలి ధర్మరతులము, దాంతుల మే మిటు♦దండకవని
నిచ్చ వసింతు మి♦టేల మాపై మీరు, వచ్చుట మి మ్మఘు♦వర్తనులను
తే. మునులయాదేశమునఁ జేసి ♦ యనిని గిట్టి, వ్రచ్చి వధియింప వచ్చిన♦వార మేము
ధైర్యవంతుల మేనియుఁ ♦ దలఁగకుండు, బ్రతుకుపై నాశ గలిగినఁ ♦ బాఱి పొండు.
కం. అన నాపదునల్వురు కిం,కను రామున కిట్టు లనిరి ♦ కరముల వెలుఁగన్
సునిశితశూలాయుధములు, విను రామా మేము వచ్చు♦వృత్తాంతంబున్. ౩౨౬
ఉ. కోపముఁ బుట్టఁ జేసితి వ♦కుంఠపరాక్రమవంతుఁ డైనమా
భూపతికిన్ ఖరేంద్రునకుఁ ♦ బోయెద రెం దిఁకమీఁద మేనితో
నీపదునల్వురం గదిసి ♦ యెక్కటి నీవ్వఁగ నైన నేస్తువే
యేపున సంగరస్థలిని ♦ నేస్తెఱ మార్కొనుమాట! లేటికిన్. ౩౨౭

శ్రీరాముఁడు పదునల్వురు రాక్షసులఁ జంపుట.

మ. ఇవె మద్బాహువిముక్తఘోరపరిఘా♦హీనోజ్జ్వలచ్ఛూలముల్
దవులన్ వీర్యము విల్లుఁ బ్రాణములు బే♦లా వీడు దం చంద ఱొ
క్కవడిం జిమ్మిన శూలసంఘముల లో♦కస్తుత్యుఁ డాయన్నిటిన్
రవలై నేలఁ దొరంగ నేసెను సువ♦ర్ణస్ఫారబాణావలిన్. ౩౨౮
ఉ. ఏసియు నంతఁ బోక మను♦జేంద్రవరుండు శిలాశితార్కభా
భాసురరుక్మపుంఖశిత♦బాణచతుర్దశ మూని వింటఁ గ్రూ
రాసురసంహతిం గని బ♦లారి శతారముపట్లు వైవఁగా
దూసి యురంబులన్ ధరణిఁ ♦ దూఱె శరంబులు, రాక్షసాధముల్ ౩౨౯
తే. ఛిన్నమూలద్రుమంబుల♦చెలువు దోఁప, శోణితార్ద్రాంగులై గత♦ప్రాణులగుచుఁ
బడిరిపుడమిని వారల♦పాటు చూచి, భీతిగొని పాఱె నాచుప్ప♦నాతి మరలి. ౩౩౦
తే. పెద్దపెట్టున నఱచుచు ♦ భీషణముగ, నాజనస్థానమందు ఖ♦రామరారి
సన్నిధిని బడ నిర్యాస♦పల్లకియన, నాయనర్థసమాగత ♦ కనియె నతఁడు. ౩౩౧
ఉ. ఏమిటి కేడ్చెదే మరల ః నెంతయుశూరుల రాక్షసేంద్రులన్
నీమత మాచరింప నటు ♦ నీబడిఁ బంచితిఁ గాదె? వారలో
మామకభక్తులున్ హితులు ♦ మాసరు కార్యముఁ జేయకుండ ధై
ర్యామలులున్ సురక్తు లప♦రాజితు లాహవభూమి సోదరీ. ౩౩౨
కం. ఈయేడ్పునకుం గారణ, మేయది హానాథ యనుచు ♦ నిటు పొర్లెద వే
లా యాశీవిషభామిని, చాయను ధర వ్రాలి చెపుమ ♦ సందర్భంబున్. ౩౩౩
కం. దిక్కై నే నుండఁగ నిల, దిక్కెవ్వరు లేనియట్లు ♦ దీనత నేలా
వ్రుక్కెదు లే లెమ్మిఁక నా, కక్కడికథఁ దెలుపు విడువు ♦ మాత్మను భీతిన్. ౩౩౪

నవు నొకక్షీణజీవితు మ♦నంబున రాముని లెక్క గొందునే
భువిఁ దనదుష్టచేష్టలనె ♦ పోయెడిఁ గాక స్వనామశేషుఁ డై ౩౪౪
ఉ. ఏఁటివ కేల యేద్చెద వి♦దే చని రాము సహానుజుఁ జేముం
గూడఁగఁ బంపువాఁడఁ జుమి ♦ క్రూరకఠోరకుఠారధార న
క్కడరి వేఁడి నెత్తురులు ♦ కేలికొలందిని జుట్టుకొమ్ము నీ
సూదు దొలంగ నన్న విని♦ శూర్పణఖాసతి హృష్టచిత్తయై. ౩౪౫
కం. వెండియు మూర్ఖ్యంబున ఖరుఁ, గొండాడిన నతఁడు రేఁగి ♦ క్రూరంతతో ను
చ్చండుని దళవాయిని బలు,గండని దూషణునిఁ జూచి ♦ కడువడిఁ బలికెన్. ౩౪౬
సీ. పదునాల్గువేవుర ♦ బలభీమవేగుల, సమరానివర్తుల ♦ సాహసికుల
నీలజీమూతస♦న్నిభవర్ణదేహులఁ, గ్రూరుల హింసావి♦హారరతుల
సింహవిక్రముల మ♦చ్ఛిలాత్మానువర్తుల, నుద్యోగసంతుల ♦ నుగ్రబలులఁ
గూర్పుమీ వేగమ ♦ కోదండశరఖడ్గ, వివిధసాధనముల ♦ వెలయునట్టి
తే. మద్రథంబును గొనిరమ్ము ♦ మహితతేజ
చనుదు మున్నుగఁ బౌలస్త్య♦సంతతులకుఁ
జావు గూడఁగ శ్రీరామ♦చంద్రునకును
జయము వెలయఁగఁ బేర్కొందు ♦ జగములందు.[1] ౩౪౭
చం. అన విని దూషణుండు ప్రళ♦యార్కనిభంబు మహారథంబుఁ జ
య్యన శబళాశ్వయుక్తముగ ♦ నాతని మ్రోలను నిల్పెఁ దప్తకాం
చనలసితంబు హేమమయ♦చక్రము మత్స్యసుమద్రుమాద్రిప
క్షినికరచంద్రసూర్యగముఁ ♦ గేతనఖడ్గకృపాణకింకిణీ
వినిచయయుక్తముఁ రథము ♦ వే ఖరుఁ డెక్కె నమర్షచిత్తుఁడై. ౩౪౮
ఉ. అంతట దూషణుండును మ♦హాధ్వజనీయుతుఁడై ఖరేంద్రుర
థ్యాంతముఁ జేరి నిల్వ నతఁ ♦ డాజ్ఞ యొసంగెఁ జనంగ నంత దు
ర్దాంతజవంబునం గదలె ♦ రానము దిక్కులఁ బిక్కటిల్ల సం
భ్రాంతము లొంచు సత్త్వములు ♦ బమ్మెరపోవఁగ సొమ్మసిల్లఁగన్. ౩౪౯
ఉ. భాసురశూలముద్గరకృ♦పాణపరశ్వధఖడ్గవజ్రఘో
రాసిక పట్టిసాళిపరి♦ఘాటిక కార్ముకబాణహస్తులై
వేసము బీతు గొల్పఁ బృథి♦వీతల మెల్ల వణఁక రాక్షసుల్
రోసముతోడ వెల్వడిరి ♦ రూక్షమతుల్ పదునాల్గువేవురున్. ౩౫౦
కం. ఖరుచిత్త మెఱిఁగి సారథి, సరభసముగఁ దేరు దోలె ♦ సైన్యము వెంటన్
ధరణియు దిశలు విదిక్కులు, నెర వయ్యెం దద్రథాంగ♦నిబిడధ్వనిచేన్. ౩౫౧

---

[1] పౌలస్త్య సంతతులకుఁ జావుగూడఁగ, శ్రీరామచంద్రునకు జయము వెలయఁగ ననియు గ్రహింప వలయు. సరస్వతి ముందుగా వానినోర నట్లాడించుచున్నది.

చం. గురుతరకోపయుక్తుఁ డయి ♦ క్రూరచరిత్రుఁడు నిర్జరారి భీ
కరఖరకంఠరావమున ♦ గాఢమహోపవనేరితంబు ప్ర
స్తరచయసృష్టి హేతుజల♦దంబు మఱొండుఘనంబు పొల్చున
క్కరణిని సారథిం బొడిచె ♦ గ్రక్కునఁ దోలుము తోలు మం చొగిన్. ౩౫౨

◆ ఖరునకు దుశ్శకునంబు లగుట. ◆

ఉ. ఈనెఱి రాక్షసావళి స♦మీకసముత్సుకితాత్మ నా జన
స్థానము వీడ గార్దభము♦చాయను మేఘము రక్తతోయ మా
వానను బెల్లుగాఁ గురిసె ♦ వాహ్యచయంబు యదృచ్ఛఁ బుష్పసం
తానచిత ప్రదేశమున ♦ దబ్బునజాతిపడెన్ సమస్థలిన్. ౩౫౩

ఉ. శ్యామము లోహితాంత మయి ♦ యప్పుడు సూర్య సలాతచక్రమై
భీమతరంబు నై పరిధి ♦ వేగము చుట్టెను, గ్రద్ద యెక్కుపు
న్వామసమిద్ధదండమున ♦ నెమ్మది నొక్కొని యుండె, విస్వరో
ద్దామము లై చెలంగె భయ♦దంబుగ నందుఁ బలాదసత్త్వముల్. ౩౫౪

ఉ. నక్కలు గూయఁ జొచ్చె దిన♦నాథు దెసం గని, శైలపాళిపెం
ప్రక్కలఁబోలి నెత్తురుల♦వర్షపుధారలు గార్చె మబ్బుపిం,
డొక్కటఁ జిమ్మచీఁకటులు ♦ నుర్వియు దిక్కులు దోఁపకుండఁగా
రెక్కొనె, వేళగామి దన♦రెం క్షతజాగ్రపటాభసంధ్యయున్. ౩౫౫

కం. ఖరునకు నభిముఖ మగుచును, ఖరతరరవములను నినిచెఁ ♦ గంకవృకాదుల్
పరుసపుమంటలు గ్రక్కుచుఁ, బరఁగించెను నఱుడు లెల్ల ♦ భయదస్వనముల్. ౩౫౬

సీ. పర్వంబు గాకయు ♦ భాను స్వర్భానువు, పట్టె దినేశుని♦పజ్జఁ గ్రమ్మె
నొకపరిఘాకార♦వికటకబంధంబు, ఱివ్వనఁ బెనుగాలి ♦ వీసె నెదుట
దేజంబు చెడియె సం♦భోజబంధువు నిశ, గామియుఁ దారకల్ ♦ గ్రహచయంబు
ద్యోతలంబునను ఖ♦ద్యోతకాంతిని దోఁచె, సంలీనపృథురోమ♦సంఘ మగుచు

ఆ. శుష్కకంజ మగుచుఁ ♦ జొప్పడెఁ గొలఁకులు, భూజతతులు విగత♦పుష్పములును
ఫలయుతంబు లగుచుఁ ♦ బొడఱెఁ గెందూళు, లలమె గాలిలేక ♦ యభిముఖముగ.

కం. శారీతతి కూచీవీ,చీరవముల సించె నపుడు ♦ చెలఁగెను భయదా
కారములను నిర్ఘాతో,ల్కారభసజ్యోతిరనిల♦కాంపము లంతన్. ౩౫౮

చం. వడఁకె వసుంధరాస్థలి స♦పర్వతకానన మై యవార్య మై
యెడమభుజంబు బిట్టదరె ♦ నెంతయు గద్గద నింపఁ బోయిన
జడిమ గొనెం గళం బసుర♦నాథునకుం గనునీరు గాఱె నొ
వ్వడరె లలాటమందు జడుఁ ♦ డాఁగఁడు యాత్రను వీనిఁ జూచియున్. ౩౫౯

భూతభయావహం బగుచు ♦ భూతనిశాచరనాశసూచకో
త్పాతము లెల్లెడం బ్రబలెఁ ♦ దప్పదు ముప్పు ఘటిల్లుఁ జూడఁగన్. ౩౬౮

కం. చావఁగలవారి మోములు, వే విన్నఁదనంబుఁ జెందు ♦ విగ్రహమందుల్
నీవదనము సప్రభ మై, శ్రీ వెలసి ప్రసన్న మగుచుఁ ♦ జెల్వారెఁ జుమీ. ౩౬౯

సీ. గర్దభారుణములై ♦ ఖరనిస్వనంబులై, రక్తధారంబులై ♦ ప్రాలెఁగొంటు
చదల మేఘంబులు ♦ చలియించు చున్నవి, మచ్చాపములు సధూ♦మంబులగుచు
జ్వలియించె శరములు ♦ వనరాజిఁ గలవిహంగంబులు నులివుచం♦దంబుఁ జూడఁ
బ్రాణగొడ్డం బైన♦భయ ముప్పతిలు వేగ, శత్రువుల్ చత్తురు ♦ జయము మనకుఁ

తే. గల్గు గడుఘోర మైనసం♦గ్రామ మొదవు
నదరెడిని మతి మతి కుడి♦హస్త మిప్పుడు
రాక్షసాళిభయంకరా♦రావములును
భేరికాభాంకృతులు నవె ♦ వినఁగ నయ్యె. ౩౭౦

కం. ఆపద రాఁగల దని మది,లోఁ పలఁ దోఁపఁగఁ బుసీపి ♦ లోలుఁడు గాకా
యాపద దొలఁగునుపాయము, వే పూర్వము చేసికొనును ♦ విమలప్రజ్ఞన్. ౩౭౧

శ్రీరాముఁడు సీతాలక్ష్మణుల గుహ నుంచి నిలిచి
యుద్ధసన్నద్ధుఁ డగుట.

కం. కావున శరచాపంబుల, వావిరి ధరియించి నీవు ♦ వైదేహిఁ బ్రభూ
తావనిరుహానిబిడస,గ్రావాంతరదరికిఁ బొమ్ము ♦ కిసలయము లెన్నిగా. ౩౭౨

కం. బదు లాడితి వేసియు నా,పదములపై నాన సుమ్ము ♦ బలసంతోఁ డన్నుల్
గదసప్రియ! శూరుఁడ వం, చెద నెయుఁగుదుఁ గెలవు పీరి♦నెల్ల వధింపన్. ౩౭౩

కం. అం దొకయింతయు నామది, సందేహము లేదకైన ♦ స్వయముగ రక్షో
బృందంబుఁ జంపఁగోరెద, ముందుగ నీ వరుగు మన్న ♦ మునుకొని త్వరమై. ౩౭౪

కం. శరచాపంబులు దాలిచి, ధరణీసుతతో సుమిత్ర♦తనయుం డరుగన్
సరి వెళ్లిరిగా వారని, పరమముదంబునను రామ♦భద్రుఁడు గడఁకన్. ౩౭౫

చం. అనలనికాశభూరికవ♦చావృతుఁడై పెనుఁజీఁకటిం బొగిన్
గొనని కృశానునట్లు రుచిఁ ♦ గూరి యుదగ్రనిశాతబాణముల్
ధనువును గేలఁ బూని గుణ♦దారుణరావము దిగ్వితానమం
దన మొనరింప నిల్చె వసు♦ధాపపుత్రుఁ డుదీర్ణగాత్రుఁడై. ౩౭౬

సీ. అప్పుడు గంధర్వ ♦ లాదిగా దేవతల్, చారణుల్ గుంపులై ♦ సమరదర్శ
నాసక్తిఁ జనుదెంచి ♦ యంబరమ్మున నిల్చి, ఋషులొండొరులతోడ ♦ నిట్టు లనిరి

స్వస్తి గోబ్రాహ్మణేభ్యోస్తు ♦ యేత్రిభువనా,నా మభిసంగతా ♦ భీమయామి
నీచరాన్ పౌలస్త్యనిచయాన్ రణే రామ,చంద్రమహీశ్వరో ♦ జయతు జయతు

తే. చక్రపాణి ర్యథా రణే ♦ సర్వదైత్య, పుంగవా న్నంచు మఱి ధర్మ♦బుద్ధి నృపతి
వీరుఁ డొకరుఁడు పదునాల్గు♦వేలు చెనఁటి,సోఁకు లెట్లగునో యని♦చూతమనుచు

కం. కౌతూహలమున నుండిరి, జాతోగ్రరుషాపినాకి♦సమ వేషం బౌ
భూతాధికభీత్యావహ,సీతాపతిరూపుఁ గాంచి ♦ చేష్పడ జగముల్. 3౬౯

## ఖరసైన్యము రామునిం జూచుట.

సీ. అంత గంభీరని♦స్స్వానయు ఘోరవ, స్త్రాయుధధ్వజయునౌ ♦ నసురసేన
చటులహుంకారంబు ♦ చాపటంకారంబు, భేరిభాంకారంబు ♦ భీమరథిక
వరులధిక్కారంబు ♦ పదదభక్కారంబు,తోఁపఁ దో తెంచుడుఁ ♦ దుములముగను
నారవంబునకుఁ గాం♦తారమండలిజంతు,నికరంబు భీతల్లి ♦ నిఖిలదిశల

తే. బఱచి పఱచి నిశ్శబ్దంపుఁ♦బట్టుఁ జేరి, తిరిగి చూచెను రాక్షస♦వరులసేన
రామచంద్రునిఁ గదియ సం♦గ్రామకేళి,పండితుఁడు దాని నల్గడ ♦ పాఱఁ జూచి.

శా. వింటన్ బాణముఁ గూర్చి యీడ్చి పలభు♦గ్విరాసుపాళీమరు
ల్లుంటాకుండు గఁ దెచ్చికొంచుఁ గినుకన్[1] ♦ లోలాక్షుఁడై కల్పపు
న్మంటల్ గ్రక్కుకృశానుచండమగుచు ♦ న్దక్షోధ్వరాలంభు ము
క్కంటింబోలి దిదృక్షు భీకరతరా♦కారంబునం గ్రాలినన్. 3౭౦

కం. భీమఘోషం డగురఘు,భూమణివేషంబుఁ జూచి ♦ భూతములు మహా
ఘోషంబునఁ బఱచెను సం,తోషము చెడి భూరిభీతిఁ ♦ గ్రొక్కటపడుచున్.

కం. ధ్వజకోదండాభరణ,వ్రజజాజ్వలదగ్ని తుల్య♦వర్మాన్వితమై
రజనీచరసైన్యము పం,కజహితజనివేళ జలద♦గణ మన నొప్పెన్. 3౭౨

## ఖరుఁడు సేనతోడ శ్రీరాముఁ దాఁకుట.

కం. క్రుద్ధు రిపుఘాతి రణస,న్నద్ధు నవష్టబ్ధచాపు ♦ నరపతితనయున్
బద్ధాంగుళిత్రుఁ గని ఖరుఁ, డిద్ధగతిన్ సూత పఱపు♦మీ యట కనియెన్. 3౭3

ఉ. ఆతనిఁ జుట్టి రాత్రిచరు ♦ లార్భటి నించి రతండు తారకో
పేతకుజాకృతిన్ వెలిఁగి ♦ భీమశితేషుపరంపరల్ వెసన్
వ్యాతతరీతి వైచె నృపు ♦ నందఱుఁ బట్టిసశూలముద్గర
వ్రాతపరశ్వధాసు లని♦వారణ నైచిరి వారిజాక్షుపై. 3౭౪

కం. కాండములతోడ మదవే,తండంబులతోడ ఘనర♦థంబులతోడన్
మెండుగఁ బైపడి రసురులు, చండాంశుకులావతంసుఁ ♦జేక్కాడంగన్. 3౭౫

---

[1] సహజముగ శాంతుఁడు కావునఁ దూరముననున్న వస్త్రము మీఁదఁగప్పుకొన్నట్టులు కోపమును గార్యార్థమై తెచ్చుకొనెను.

కం. ధారాధరసంఘము జల,ధారాపూరములచేత ♦ ధరణీధరమున్
బోరన ముంచెడిగతి శర,వారంబులు రాముమీఁద ♦ పర్వించి రొగిన్. ౩౮౬
కం. పారావారము తటినీ,పూరము లోఁగొను నెడిరీతిఁ ♦ బురుషోత్తముఁ డా
క్రూరతరసాధనంబుల, నారాచవితానముల క్ష♦ణంబున నణఁచెన్. ౩౮౭
ఉ. ధీరత దీప్తవజ్రనిహా♦తిన్ వ్యథఁ గూరనిభూరిశైలమో
నా రఘువీరుఁ డుగ్రముగ ♦ నాటినసాధనకోటి నింతయున్
గారణఁ బొందఁ డయ్యె మెయిఁ ♦ గాఱెడిరక్తముతో దినాంతమే
ఘోరుచయాన్వితార్కుఁడన ♦ నొప్పె నవీనవిలాసభాసియై. ౩౮౮
ఉ. అక్కట రామచంద్రు సుగు♦ణాంబుధి నొక్కనిఁ జుట్టు ముట్టి యీ
మ్రుక్కడిసోఁకుమూఁక లిటు ♦ మోఁదెడినే యని దేవతల్ ఋషుల్
మిక్కిలి పొక్కి,రంత మిఱి♦మీఱినకిన్క రఘూత్తముండు దా
గ్రక్కున మండలీకృతసు♦కార్ముకుఁడై విశిఖోత్కరంబులన్. ౩౮౯

శ్రీరాముఁడు ఖరుసేనను నుఱుమాడుట.

ఉ. నూఱులు వేలు దుర్విషహ♦నూతనసూర్యజదండతుల్యముల్
తేఱి గనంగ రాక పటు♦తీవ్రత నైచిన రాక్షసాళులన్
దూఱి కృతాంతపాశగతి ♦ దోఁపఁగ వారల మేను వ్రచ్చి న[1]
ల్లేఱులఁ దోఁగి యభ్ర పద ♦ మేగె జ్వలద్దహనార్చు లోయనన్. ౩౯౦
ఉ. ఎన్నఁగరానిబాణముల ♦ నేసియుఁ గోసియు వ్రచ్చి త్రుచ్చియున్
బన్నుగ శత్రుసంఘముల♦బాహులఁ గాళ్ల నూరులం దలల్
ద్రొన్నగలన్ ధ్వజాగ్రములఁ ♦ గుప్పలు కుప్పలు వెట్టెఁ గ్రోధసం
ఛన్నహృదంతరాళుఁ డయి ♦ శత్రులు తత్తఱ మంద రాముఁడున్. ౩౯౧
సీ. కాంచనభూషణో♦దంచితహయముల, సాదులతోడుతఁ ♦ జమరి చమరి
మావటివాండ్రతో ♦ మత్తగజంబుల, నంత లంతలు దును♦మాడి యాడి
రథికసారథులతో ♦ రథనికరంబులఁ, గఱుకుటంపరలచే ♦ నఱకి నఱకి
పటుతరగర్వదు♦ర్భరభటచ్ఛటలను, గూరబ్రద్దలువోలెఁ ♦ గోసి కోసి
తే. మండలీకృతచండకో♦దండదండ,సర్వతోముఖనిర్గళ♦చ్చటులవిశిఖ
ఖరగభస్తిఖరాంశుని♦కరణి వెలుఁగ, నసురతతిభీతిఁ గూపెట్టె ♦ నంగలార్చి. ౩౯౨
కం. శుష్కం బగునని దవశో,చిష్కేశునిచేతఁ బోలెఁ ♦ జిత్రంబుగ నా
పుష్కరనేత్రునిచే నా,ముష్కరపరపాళి యూఁచ♦ముట్టుగఁ గూలన్. ౩౯౩
ఉ. వారలలోనఁ గొంద ఱని♦వారణవారణవిక్రమక్రముల్
శూరులు మండలాగ్రసృగ♦శూలపరశ్వధహస్తులై బలో

[1] నల్లేఱు = నెత్తుటిప్రవాహము.

దారుని రాము నైచిన ని♦తాంతశితాశుగసంహతిఁ వెసఁ
వారలసాధనంబులను ♦ వారిశిరంబులుఁ ద్రుంచె నొక్కటన్. ౩౯౪

కం. శరములు కరములు శిరములు, శరాసనములు గూలి యమర♦శత్రులు చావఁ
బరికించి తక్కునసురో,త్కరము వెఱచి పఱవఁదొడఁగె ♦ ఖరుమాటునకున్.

సుగంధి. మానవేంద్రముక్తశాత♦మార్గణాసహిష్ణువై
వైన తేయపక్షజాత♦వాతభూతభూజసం
తానరీతి భీతయాతు♦ధానకోటి యోటమై
దీనవృత్తిఁ బాఱఁ జొచ్చె ♦ దేవవైరి డాయఁగన్. ౩౯౬

సీ. వారల కెల్లను ♦ ధీరతఁ గల్పించి, భీమణరోషుఁడై ♦ దూషణుండు
కాకుత్స్థుపైఁ ♦ గవిసినతోడన, మునుపటివారును ♦ మూఁగి తోడరి
నాలతాలశిలాది♦సాధనంబులతోడఁ, బైపడఁ జొచ్చినఁ ♦ బార్థివుండు
ఘోరతరాకృతిఁ ♦ గురియించె శరవృష్టి, యసురలు పిఱువోవ ♦ కని యొనర్ప

తే. రోమహర్షణమయ్యె సం♦గ్రామ మప్పు, డంతఁ బోవక యసురు ల♦త్యంతరోష
మొదవ దెసలందుఁ జీఁకట్లు ♦ గదుర నొక్క, పెట్ట పైపడి రామునిఁ ♦ జుట్టు ముట్టి.

స్రగ్ధర. ఘోరప్రాసాసిఖడ్గా♦కుటిలశరతతు ♦ ల్గుప్పగా మీఁద గుప్పఁ
జ్యారావోద్భిన్నశత్రూ♦చ్ఛ్రయహృదయపుటీ♦సద్మఁడై కంఠరావో
దారుండై శత్రుఘాతా♦ర్థముగ భయదగాం♦ధర్వనారాచ మేసెఁ
నీరంధ్రంబై దిశాళుల్ ♦ నిశితఖగతతిఁ ♦ నిండ సీతేశుఁ డంతన్. ౩౯౭

శా. ఆగాంధర్వమహాస్త్రసంజనితనా♦నాకారఘోరాస్త్రసం
పూగాంధీకృత మయ్యె వ్యోమము, దివిం ♦ బూషుండు మోఘాంశుఁడై
సాగెన్, సేనయుఁ దూలి వ్రాలి పడి నా♦శం బంది తుత్తున్కలై
ప్రేగుల్ ద్రస్సిన సోలి కూలి తుముఱై ♦ బీభత్సమై పాడఱెన్. ౩౯౮

కం. శరనికరాదానంబును, శరసంధానంబు మోక్షు♦శరగమనంబుల్
పరికింప రాశరులు కర,చరణనికృంతనము దక్క ♦ స్వవ్యూహమునన్. ౪౦౦

కం. ఆలోకశౌంధవుండు గు,రాలోకుఁడుఁ గాఁగ దెసల ♦ నలమఁగ నిరులా
భీలపుగతి రఘుపతిశర,జాలమ్ములు గ్రక్కుచున్న♦చందముతోఁచెన్. ౪౦౧

కం. తగులుట నొగులుట చచ్చుట, పగతురు ప్రోవులుగ నేలఁ ♦ బడుటయుఁ జూడఁ
యుగపత్ప్రియు వెలసెను గమ్మ, నెగ డంపరి మింటఁ జూచు♦వేల్పులు మౌనుల్. ౪౦౨

సీ. ఉష్ణీషములతోడ♦యుత్తమాంగంబులు, నవనిపైఁ బడి దొర♦లాడు చుండ
నంగదకటకస♦మన్వితబాహువుల్, కట్టలు కట్టలై ♦ వ్రాలు చుండ
స్థూలమహాస్కంధాళి♦కరణిఁ గృత్తంబులై, కుఱువులు ధరనిండఁ ♦ బఱచి యుండ
వివిధవిభూషణా♦న్వితజానుసంఘముల్, ఖండఖండంబులై ♦ కదిమి యుండ

తే. చండ వేదండ రథ హయ♦చ్ఛత్ర చామ,రధ్వజవ్యజనంబులు ♦ రవరవలుగఁ
బుడమి నిండారి నిశ్శేష♦భూతజాత,భీతిజాతక మయ్యె దృ♦గ్భీమముగను. ౪౦౩

కవిరాజవిరాజితము.

విఱిగిన తేరులు గూలినతూరులు ♦ వ్రీలిన కేతువులుం గొడుగుల్
తెఱచిననోరులు పాఱెడివీరులు ♦ ద్రెళ్లినగౌరులు పొస్లుహరుల్
తఱిగినచేతులు తున్గినమూఁపులు ♦ తాఱెడిభీతులు మిక్కుటమై
తెఱఁగఱి రాక్షససైన్యము సర్వము ♦ దీఱుచు నుండఁగ దూషణుఁడున్. ౪౦౪

→ దూషణుఁడు శ్రీరామునితో యుద్ధముఁ జేసి చచ్చుట. ←

ఆ. ఐదువేల కఱకు♦టసురుల రామచ,ద్రార్త నంప వార ♦ లశనితుల్య
తూలఖడ్గబాణ♦జాలవర్షము మున్ను,గాఁగఁ గవియఁ జూచి ♦ కడిమి మెఱసి ౪౦౫

మ. శరవర్షంబున వారిసాధనములం ♦ జక్కాడి వర్షంబు పైఁ
దొరఁగం బొల్పునృషంబుభంగి రఘునా♦థుం డొప్పి సక్రోధుఁడై
శరధారాప్లుతి దూషణాన్వితముగా ♦ సైన్యంబు దైన్యంబు నొం
ద రణోర్విం జెలరేఁగి కాల్గాగిలుచం♦దం బారఁగా ముంచినన్. ౪౦౬.

కం. రోషంబున శాత్రవచయ,దూషణుఁ డగుదూషణుండు ♦ దోర్బలలీలా
భీషణుఁడై వజ్రనికా,శేషువులం బఱపుటయును ♦ నినకులుఁ డలుకన్. ౪౦౭

చం. క్షురమునఁ జాపముం దునిమి ♦ క్రూరచతుశ్శితమార్గణాహతిం
హరులను నాల్గిటిం జదిపి ♦ యానలఁ గూలఁగ నేసి సూతుకం
ధరమును నర్ధచంద్రమున ♦ ధాత్రి శరత్రిక మూని దూషణుం
బరువడి వక్షముం జొరఁగఁ ♦ బార్థివవర్యుఁడు వైవ దైత్యుఁడున్ ౪౦౮

ఉ. కాంచనపట్టవేష్టితము ♦ క్ష్మాధరశృంగనిభంబు దేవతా
సంచయమర్దనక్షమము ♦ శంకువికీర్ణము వైరిరాడ్వసా
వంచితముం మహాశనిశ♦తారసమంబు విరోధిపట్టన
ప్రాంచితగోపురోద్దళన♦బంధుర మాపరిఘంబు గ్రాలఁగన్. ౪౦౯

కం. ఉక్కుమిగిలి సంభ్రమముగ, నక్కరణిని మీఁదఁ బడఁగ ♦ నరుదేరఁగఁ దా
గ్రక్కున నిరుశరములఁ దొడి, రక్కసునిరుకేలు నఱకె ♦ రాముండు వడిన్. ౪౧౦

కం. కరయుగముతోడ నాయస,పరిఘము ధరఁ గూలె వాస♦వధ్వజ మనఁగన్
గరములు దెగ నసురుఁడు వడె, ధరణిని నిర్వారదంత♦దంతి యనంగన్. ౪౧౧

ఆ. అసురు నిహతుఁ జూచి ♦ యఖిలభూతంబులు, మేలు మే లటంచు ♦ మెచ్చె రాము
నంతలోన దూష♦ణాంతకు పై రోష,వివశు లగుచు నసుర♦వీరవరులు ౪౧౨

కం. స్థూలాక్షుఁడు పట్టిసముల్, శూలంబు మహాకపాల♦సురవైరియు నా
భీలపరశువుఁ బ్రమాథియుఁ, గేలం గ్రిస్సుచును వేగ ♦ గిట్టి కవియఁగన్. ౫౧౩

సీ. మైథిలీపతి శిత♦మార్గణపంక్తిను, హాకపాలు శిరంబు ♦ నవనిఁ గూల్చి
సహితబాణముసఁ బ్ర♦మాథిని వధియించి, స్థూలాక్షుకనుల బా♦ణాళిఁ గూరి
పంచసహస్రరా♦త్రించరవరులను, బంచసహస్రరో♦షముల నొకట
ఖండింపఁగా దూష♦ణుండు ససైన్యుఁ డై, రూపజిహోక ఖ♦రుండు చూచి

ఆ. కినుక గదుర నీచ♦మనుజునిచేఁ జచ్చె, దూషణుండు సేన♦తోడ మీరు
చని వధింపుఁ డతని♦నసుచు యోధులఁ బంపి, తాను జనియె రాముఁ♦దాఁకుమతిని.

→ కాలకార్ముకాది సేనాపతులు పన్నిద్దఱు శ్రీరామునిచేఁ జచ్చుట. ←

సీ. కాలకార్ముక మేఘ♦మాలి మహామాలి, దుర్జయ యజ్ఞశ♦త్రులు విహంగ
ముండును రుధిరాశ♦నుండు సర్పాస్యుండు, స్థిరపృథుగ్రీవుండు ♦ శ్యేనగామి
విశ్రుతబలి కర♦వీరాక్షుఁడును బరు, షుం డనువారు పం♦డ్రెండుమంది
దళవాయు లొక్కట ♦ దాశరథిని దాఁకి, విశిఖచయంబుల♦వృష్టి గురియ

ఆ. వారిబాణములను ♦ వారించి రాముండు, వజ్రతుల్యబాణ♦వర్షమునను
దరులఁబోలె నఱికి ♦ ధరణికి బలియిచ్చె, నిర్జరారివరుల ♦ నిమిషమునను. ౫౧౫

కం. కర్ణాకారేషుల నా, కర్ణాంతము లాగి నూటి ♦ ఖలశతకంబుల్
దూర్ణము వేయింటను సము, దీర్ణబలుం డగుచు నేసెఁ ♦ దెగ వేవు రనిన్. ౫౧౬

ఉ. కూలిన చాపదండములు ♦ గుప్పలు రాలిన భూషణంబులున్
వ్రాలిన టెక్కియంబులును ♦ బ్రద్దలువాఱిసస్యందనంబులున్
జాలుగఁ గాఱురక్తములు ♦ చాలిఁక నన్నవిధంబు దోఁపఁగాఁ
గాలునివంటయి ల్లనఁగఁ ♦ గ్రాలె రణావని రక్తపంక మై. ౫౧౭

ఆ. రక్తసిక్తు లగుచు ♦ ముక్తకేశంబుల, తోడ ధరణిఁ బడిన♦దుష్టదివిజ
వైరిచయము కేశ♦వర్గంబుతో నిల, కుశసమేతవేది♦కొమరు దాల్చె. ౫౧౮

కం. పదునాలుగువేవుర దు, ర్మదుల మహాక్రూరకర్మ♦రాక్షసవరులన్
బదిగుఁడు నెక్కటినరుఁ డగు, సదమలమతి రామమూర్తి♦చంపెం గడిమిన్. ౫౧౯

కం. దురమునకుం బూనినయా, యిరువాఁగున నప్పు డొప్పి ♦ రిల జీవముతో
ఖరుఁడు త్రిశిరుండు శాత్రవ, హరుఁ డగురాముండుఁ దక్కి♦నంతయుఁ దీఱెన్.

→ త్రిశిరుఁడు శ్రీరామునితోఁ బోరి చచ్చుట. ←

చం. ఖరుఁ డది చూచి రామునకుఁ ♦ గట్టెదు రై చనఁ బూన వాహినీ
వరుఁడు త్రిశీర్షుఁ డడ్డపడి ♦ వాసవమర్దన నేను గల్గఁగాఁ

బరుపయి నీవు పోవు టిది ♦ భావ్యమె? రాముని గీముఁ బట్టి మ
చ్ఛరములఁ ద్రుంచి వైతు నిముఁ♦సంబున, భాస నొనర్తు వింటిపై. ౪౨౧
చం.అతనికి నేనొ నా కతఁడొ ♦ యంతకుఁ డయ్యెడు, నిల్చి చూడు మీ
హతుఁడుగ రాముఁడుం జనుడు ♦ నంత నిజాలయముక్ మదాన, నే
మృతుఁడుగ నైన నీ వతని ♦ మేటిగణంబుఁ గిట్టి పట్టి యు
ద్ధతి నడఁగింపు, మన్న నతఁ ♦ డట్లగుఁ గావుతఁ బొమ్మటం చనన్. ౪౨౨
చం.చనియెఁ ద్రిశృంగపర్వతము♦చాడ్పున స్యందన మెక్కి రాముపై
సునిశితబాణజాలముల ♦ జోరున వర్షముఁ బోలె వైచి క్రం
దున జలసిక్తమైన పెను♦దుందుభి నాఁ ద్రిశిరుండు గర్జలన్
వినిచిన, విల్లు ద్రిప్పుచును ♦ నిష్ఠురబాణము లూని రాముఁడున్ ౪౨౩
చం.త్రిశిరుని వైచె నాతఁడును ♦ దీవ్రశరాగ్రహతుం డౌచు రేఁగినన్
దశరథు నాత్మ సూతికిని ♦ నాకివిరోధికి నద్భు తాహవం
బశముతతీవ్రతం దగె మృ♦గాధిపదంతిరణం బనంగ, నా
త్రిశిరుఁడు భల్లకత్రయ మ♦రీణగతిన్ నృపుఫాలభాగమున్ ౪౨౪
ఉ. గ్రుచ్చినఁ గోప మెత్తి రఘు♦కుంజరుఁ డిట్లను రాక్షసాధమా
మెచ్చితి నిన్ను శూరుఁడవు ♦ మెత్తనిపూవులవోలె బాణముల్
గ్రుచ్చితి నాలలాటమునఁ ♦ గొమ్మిదె మచ్ఛరపాళి యంచుఁ బెం
పచ్చుపడంగ వానియుర♦మందు శరంబులు నాలుగుం బడిన్ ౪౨౫
ఉ. నాటఁగ వైచి గుఱ్ఱముల ♦ నాల్గిట సూతుని నెన్మిదింట నొ
క్కేటునఁ డెక్కెముం దునిమి ♦ పృథ్వికి దాఁటునిశాటువక్ష మా
స్ఫోటముగాఁగఁ దీవ్రశర♦పూగము వైచిన పీతచేష్టుఁ డై
పో టటఁ చచ్చి నేలఁ బడెఁ ♦ బూర్వనికృత్తనిజోత్తమాంగుఁ డై. ౪౨౬
ఉ. ఆతనిపాటుఁ గన్గొని ఖ♦రాశ్రయసేవకరాక్షసుల్ మహా
భీతిని బాఱి రెల్లయెడ ♦ బెబ్బులిఁ జూచిన లేళ్లు వోలె నా
భీతుల నెల్లఁ ద్రిప్పికొని ♦ పేరిలుకన్ ఖరుఁ డెందు రాహుస
ట్లాతతలీల నాదశర♦థాధిపనందను మార్కొనం జనెన్. ౪౨౭

## ఖరుఁడు శ్రీరామునితో రణం బొనర్చుట.

సీ. అని దూషణత్రిశి♦రాదుల గతిఁ జూచి, గుండె ఝల్లనఁగ ఖ♦రుండు దేమి
విక్రమం బవుర దో♦ర్వి క్రమవంతుఁ, బదునాల్గువేవురఁ ♦ బ్రథితబలులఁ
ద్రిశిరుని దూషణుఁ ♦ ద్రిక్కటక ఖండించె, రాముఁ డెక్కటి నేమి♦భీమబలము!
కానిమ్ము మాచెదఁ ♦ గాక యం చింద్రుని, నముచి మార్కొనినచం♦దంబు దోఁచ -

తే. గవిసి యాశీవిషోపమ♦కాండములను, గుప్పఁగూరలుగా వైచి ♦ గుణము మీఁటు
చక్రశస్త్రకళాదిసా♦మర్థ్య మెల్లఁ, బ్రకటితంబుగఁ జలిపెను ♦ రణము ఖరుఁడు.
మ. సకలాశాపరిపూరణంబుగ మహా♦శస్త్రాస్త్రసంతానముల్
భ్రుకుటీభంగముతోడ రాముపయిఁ జొ♦ప్పం దప్ప నీ కేసినన్
వికలత్వం బొకయింత లేక నిజదో♦ర్విక్రాంతి దీపింప సా
యకముల్ దుర్విషహాస్ఫులింగచటుల♦వ్యాపారముల్ గ్రక్కునన్ ౪౨౯
శా. ఆకాశం బవకాశశూన్యముగ నే♦యన్ బాణజాలావృతం
బై కానంబడఁ డయ్యె సూర్యుఁ డటు ల♦న్యోన్యప్రఘాతార్థులై
త్యాకాంతుం డసురాధినేత పెనఁగన్ ♦ శాతాశుగాళిన్ ఖరుం
డాకౌసల్యతనూజు నొంచె సృణి మ♦త్తానేకపంబుం బలెన్. ౪౩౦
ఉ. నొంచి యుగావసానశమ♦నుం దలఁపించుచు నిల్చి ఘోరరా
త్రించరకోటిఁ గోడఁ గపుఁ♦దీవ్రత నీతఁడు పోరి పోరి తా
నించుక డయ్యఁడే యనుచు ♦ నెంచె, మృగేంద్రపరాక్రమున్ ఖరున్
గాంచె నరేంద్రుఁ డల్పమృ♦గంబును సింహము చూచుకైపడిన్. ౪౩౧
కం. క్రించుఁడు భాస్కరసన్నిభ,కాంచనరథతలముపందుఁ ♦ గాండాసనముం
జంచద్గతిఁ ద్రిప్పుచుఁ బా,శాంచితకరశమనుభంగి ♦ నవనిపుఁ గదిసెన్. ౪౩౨

ఖరుఁడు శ్రీరాముకవచంబు భేదించుట.

చం. వనదహనంబు డాయుశల♦భం బన రామునిఁ దాఁకి విల్లు చ
య్యనఁ గరలాఘవంబు మెఱ♦యన్ దృఢముష్టితలంబు న్రయ్యఁగా
సునిశితబాణముల్ వఱపి ♦ సూర్యనికాశకలంబసప్తకం
బున రఘువీరుకంకటము ♦ భూమిపయిం బడ నేసెఁ దీవ్రుఁడై. ౪౩౩
చం. కవచము నేలఁ గూల్చి లయ♦కాలభయంకరగర్జలట్టియా
రవముల నించుచున్ శితశ♦రంబు లసంఖ్యముగాఁగఁ గప్ప భూ
ధవుఁడు ఖరాసురారి శర♦తాడితుఁడై గతధూమవహ్నినా
మివుల వెలింగె భీషణస♦మీకతలంబున రోషదీప్తుఁడై. ౪౩౪
ఉ. కోపము రూపముం గొనిన♦కోపున నాతనిఁహాపు మాపఁగా
నేపున నన్యచాపము ము♦నీశ్వరదత్తము వైష్ణవంబు సీ
తాపతి పూని రోషము ♦ దారుణరీతి ఖరధ్వజంబు ధా
త్రీపతితంబుఁ జేయు సది ♦ ద్రెళ్లె సురాజ్ఞను సూర్యుఁ డోయనన్. ౪౩౫
ఉ. సంగరమర్మకోవిదుఁడు ♦ శాతశరంబుల రామచంద్రుమ
ర్మాంగము లోలి దూఁటఁ బ్రద♦రాగ్ర్యచతుష్కము వైచి రక్కసి

క్తాంగునిఁ జేయు, మూర్ధమును ♦ నాయతబాహు లురంబు నాటఁగా
ఱంగునఁ గ్రుచ్చెఁ దా నొకట ♦ రెంటను మూఁటను రాముఁ డాఖరున్. ౪౩౬

చం. ఉఱక విభుండు నెండియుఁ ద్ర♦యోదశబాణములూని వైరి పిం
పఱుఁగ నొకంటఁ గాఁడియు హ♦యంబుల నాల్గిట సూతు నొక్కటన్
బిఱుసన మూఁటిచే నొగయు ♦ వేగమ యక్షము రెంటఁ ద్రుంచి క్ర
చ్చఱ నవలీల బాణయుత♦చాపముఁ ద్రెంచెను ద్వాదశంబునన్. ౪౩౭

కం. పతి వెండియుఁ బదుమూఁటన, శితశరమున ఖరుని మేను ♦ చీల్చిన నతఁడున్
హతసారథి హతహయుఁడై, క్షితికిని లంఘించె గదను ♦ గేలం గొనుచున్. ౪౩౮

కం. అద్భుత మగుకౌసల్యా,ప్రోద్భవుచారిత్రమునకుఁ ♦ బుష్కరవీథిన్
ముద్భాసంబునఁ బొదలుచు, సద్భావముతోడఁ బూజ ♦ సలిపిరి వేల్పుల్. ౪౩౯

ఖరుని శ్రీరాముఁడు నిందించుట.

చం. గద గొని నిల్చియున్న ఖరుఁ ♦ గాంచి ధరాతనయాధవుం డనున్
మృదువుగ హృద్వ్రణంబులగు♦నిష్ఠురవాక్కుల రాక్షసాధమా!
గొదకొని తేరులున్ హయలుఁ ♦ గుంజరముల్ పొలుపార గర్వ వై
యదయత లోకదూష్య మగు♦నాఱడిచేఁతలు చేసి తిస్సిరో. ౪౪౦

కం. తాపముఁ గూర్చుచు జనులకుఁ, బాపంబులఁ జేయువాఁడు ♦ పరమేశ్వరుఁ డేన్
బ్రాపించుఁ గీడుఁ దప్పక, పాపాత్మా! నీవిధంబుఁ ♦ బలుకఁగ నేలా. ౪౪౧

చం. భువనవిరుద్ధమైనపనిఁ ♦బూని యొనర్చుచు దుష్టచిత్తుఁడై
పావరున సంచరించుఖలుఁ♦డొం గణఁగింపఁగఁ జూతు రెల్లరున్
భవనసమాగతోగ్రఫణి♦భంగిని; ధూర్త స్వలోభ కామసం
భవకలుషంబులం జెడును ♦ బ్రాహ్మాళి దా వడగండ్లచేబలెన్. ౪౪౨

ఉ. ఏమిఫలంబుఁ బొందెదవొ ♦ హీననిశాటుఁడ! దండకాటవీ
భూమిఁ జరించుసాధుముని♦పుంగవులన్ వరధర్మనిష్ఠులన్
హామికఁ జంపి చంపి; కలు♦షాత్ములసంపద శీర్ణమూలమౌ
భూమిరుహంబుభంగి నిలుఁ♦బోవదు దీర్ఘముగా దురాత్మకా. ౪౪౩

కం. ఋతువులు సమకూరినచో, క్షితిజము తగుపూలు పూచు♦చెలువున నరుఁ డు
ద్ధతిఁ జేసినయఘములఫల, మతఁడ యవశ్యంబు నొందు ♦నయ్యయివేళన్. ౪౪౪

కం. విసమును గూడినయన్నము, గ్రసియించినవానిపగిదిఁ ♦ గలుషఫలము లా
దొసఁగులు పాపాత్ముం డెటు, వెసఁగుడుచుం; బాపఫలము ♦ వృథ పో దెప్పుడున్.

ఆ. పాప మాచరించు♦పాపాత్మకుల భువ,నాహితార్థులైన♦యట్టిఖలుల
సంహరించుటకును.♦ జననాథుచే నాజ్ఞఁ, బొంది వచ్చినాఁడఁ ♦ బొలుసుదిండి. ౪౪౬

ఉ. పాములు పుట్టలోనికిని ♦ బాఱెడుభంగి మదీయమార్గణ
స్తోమము నీశరీరమునఁ ♦ దూఱెడి నిన్ సహాసైన్యమిత్రుఁగా
నీమురుదంపినట్టి వ్రతి♦నిష్ఠుల వెంబడిఁ గావు పుచ్చెగా
నీమెయి కంఠగర్వమును ♦ నేఁ డిటఁ జూపర చూతు రాక్షసా. ౪౪౭
చం. నిరయము నొంద యుద్ధధర♦ణీస్థలి మామక తీవ్రమార్గణో
త్కరములఁ గూలియున్న నిను ♦ గాఢముదాన విమానసుస్థితుల్
దుమునున నీవధించినవ్ర♦తుల్ గనుఁగొందురు, కాటిపందువ
ప్పురు భవచ్ఛిరంబుఁ బడ ♦ నైచెద నీబల మెంతో చూపుమా. ౪౪౮
చం. అని తను నాడు రామమను♦జాధిపుఁ గన్గొని కోపరక్తలో
చనుఁ డయి నవ్వి రాక్షసుఁడు ♦ చప్పడిమూఁకను జంపినంతనే
కనుఁగవ కానలేక కడు♦గర్వమునన్ నిను నీవ మెచ్చుకో
ఘనత లభించునే? పిను వి♦కత్థనముల్ బలియుండు పల్కునే? ౪౪౯
సీ. పౌరుషశాలి యౌ♦బలవంతుఁ డేయెడఁ, దాఁ జెప్పునే స్వకృ♦త్యములఁ బొగడి
నీచు లౌధాటిణీ♦నేతలు నీయట్లు, రజ్జు లాడెదరు ని♦రర్థకముగఁ
దనమహాకులప్రసూ♦తత్వంబుఁ జాటుచు, నసవసరంబుగ ♦ మనుజుఁ డెవఁడు
మృత్యుకాలంబున ♦ మేకొనుఁ బొగడుకో? దర్పాగ్రమున నున్న ♦ దహనుమాడ్కి
తే. నిట్టు నిను నీవ పొగడుకోఁ♦బట్టి తెలిసె, నీలఘుత్వంబు; గదఁగొని ♦ కేల నిలుస
ధాతుచిత మప్రకంప్యమౌ ♦ ధరణిధరము, చొప్పమైయున్న నన్నిటఁ ♦ జూడవొక్కొ.
ఆ. పాశహస్తుఁ డైన♦భాస్కరసూనుఁడు, జగము లన్ని బౌరి♦సమరుమాడ్కి
నీగదానిహతిని ♦ నిప్పుడ నినుఁ జంపఁ, జాలువాఁడఁ జూడు ♦ సత్త్వహీన. ౪౫౧
ఉ. నిన్ననఁ బూనుకొన్నది న♦నేకము లున్నవి, పల్కనొల్ల, నా
సన్నదినాంత మయ్యె, రవి ♦ జాఱెన యుద్ధవిఘాత మబ్బెడిన్
జన్నసురారిపాళులకుఁ ♦ జయ్యనఁ ద్వద్వధ నశ్రుమార్జనం
బున్నది చేయఁగాఁగలుగు♦నుత్తమకార్యము, మాట లేటికిన్? ౪౫౨

## శ్రీరాముఁడు ఖరునిగదను ఖండించుట.

చం. అని గదఁ గేలఁ ద్రిప్పి మను♦జాధిపుఁ బిడుగుబోలె వైచినన్
ఘనతరవృక్షగుల్మముల ♦ నాశ మొనర్చుచుఁ గిట్టి రాఁగ మిం
టన రఘురామచంద్రుఁడు ఘ♦నప్రదరప్రకరంబునన్ వడిన్
దునుకలుగాఁగఁ గూల్చె గ దెఁ ♦ దోరపుమంత్రబలంబునం బలెన్. ౪౫౩
ఉ. కూలిచి దిగ్భ్రమః బెగడు♦కూళను ధర్మరతాత్ముఁ డిట్లనున్
బ్రేలితి వేమియో బలము♦పెంపును జూపితి వింతమాత్రకే

బాలిశ! రజ్జు లాడితివి ♦ బాణవిదారిత మై ధరాస్థలిన్
దూలిననీగదం గనుము ♦ తూర్ణము రమ్ము వచఃప్రగల్భుఁడా. ౮౫౪

కం. కూలిన రాక్షసులకు బా,ష్పాళిని మార్జన మొనర్తు♦నని యాడినసీ
యాలాపము లనృతము లై, యిాలోనన వెలసెఁ గంటె ♦ హీనచరిత్రా. ౮౫౫

కం. గరుటామంతుం డమృతము, హరియించినరీతి నీదు ♦ ప్రాణము లివిగో
హరియింప నాశరంబులు, నురుఁగుల నెత్తుటిని గ్రోల ♦ నుసలెడు మహీయున్.

ఉ. ధూళిని బ్రుంగ మేను నిజ♦దోర్యుగ ముద్విని జాఁచి మగ్లభా
లోలవిశాలనేత్ర నవి♦లోలతఁ గాఁగిటఁ జేర్చుచాడ్పునన్
నేలను గ్రుచ్చి దీర్ఘ మగు♦నిద్దురవోయెద, నంతి తోమ్ములన్
గేలిడి నిద్రవోయెదరు ♦ కీర్తితపుణ్యులు సంయమీశ్వరుల్. ౮౫౭

సీ. రాక్షసా! మచ్ఛర♦ప్రకరంబులను జన,స్థాన మిప్పుడు హత♦స్థాన మైన
నిర్భయతను ముని♦నికురుంబములు సంచ,రించు నీవుండకఁ ♦ గొంచ కెదను
భయపెట్టురక్కసుల్ ♦ భయముపాటున సలు,దెసలఁ బాఱెదరు చూ ♦ దిక్కు లేక
కన్నీళ్లఁ దడిసిన♦విన్ననిమోములు, నీ కనుఁగూప లా♦నీదుభార్య

ఆ. లిట్టిమగని నిన్నుఁ ♦ గట్టికొంటను నిష్ఫ, తెలిసి శోకరసము♦తెఱఁగుఁ గామ
సౌఖ్యములకుఁ బాసి ♦ చని నిరర్థకజీవ, లగుదు రింక రాక్ష♦సాపశదుఁడ. ౮౫౮

ఉ. ఓరి నృశంస నీచ విను ♦ మోరిదురితాత్మక విప్రకంటకా
క్రూరమనీష మీావలనఁ ♦ గూరినభీతిని మానిపుంగవుల్
దారు హవిస్సు నగ్ని నిడు♦దాఁకను సంశయలోలచిత్తు లై
సారెకుఁ గంప మొందెదరు ♦ సాగు నొకో యిఁక నట్టిచేతలున్. ౮౫౯

కం. అన విని ఖరతరవచనం,బున ఖరుఁ డిట్లనియెఁ బ్రాణ♦ములు వోయెడివే
ళను గూడ గర్వపడియెదు, మనుజాధమ! నీ వడట్టి♦మానిసి వొక్కో. ౮౬౦

ఉ. కాలము దీఱినాతఁ డెఱుఁ♦గం గలఁడే యిది పల్కవచ్చు నీ
లీల వచింపరా దనెడి♦లీలలు, కార్య మకార్యముల్ మదిన్
జాలు నొకో తలంప మతి♦సత్త్వము వాసి మడింద్రియప్రభల్
దూలుటఁ జేసి; నీవిధము ♦ దోఁచెడి నట్టులు గాఁగ రాముఁడా. ౮౬౧

చం. అని కలయంగ నాల్గుదెస ♦ లారసి దవ్వున నున్న పెన్నగం
బును మొద లంటఁ బీఁకి కను♦బొమ్మలు నాట్యము లాడ తివ్వు తి
వ్వున వడిఁ ద్రిప్పి నత్తురులు ♦ పుట్ట రదంబుల మోవి నొత్తి యే
పున గుఱి చూచి చచ్చితివి ♦ పో మనుజాధమ యంచు నైచినన్. ౮౬౨

ఖరుఁడు శ్రీరాముచే హతుం డగుట.

ఉ. వచ్చెడు దానిఁ జూచి రఘు♦వర్యుఁడు శాతకలంబకంబులన్
బిచ్చలు పిచ్చలై పడఁగఁ ♦ వ్రేల్మిడిఁ ద్రుంచి యలంతిఁ బోఁడ యా
కుచ్చితుఁ డంచు దీవ్ర మగు♦క్రోధముఁ దాలిచి మేనఁ జెమ్మటల్
పిచ్చిల రక్తనేత్రుఁ డయి ♦ భీకరమార్గణసంచయంబులన్ ౪౬౩

ఉ. చిల్లులు వోవ మిను వెసఁ ♦ జేసిన నెత్తురు కొండవంకనాఁ
బెల్లుగఁ దొర్ల వేదనను ♦ బెల్కుటి తాళఁగలేక మత్తు సం
ధిల్లఁ గృతాస్త్రుపైఁ బడఁగఁ ♦ దేఁకువ తీవ్వన రాఁగ నెత్రు చి
ప్పిల్లెడు మేనివానిఁ గని ♦ వెన్కడు గుంచి జవైకగామి యై. ౪౬౪

ఉ. కాంతిని బ్రహ్మదండమున♦కంటె ఘనం బగు పావకాభదు
ర్దాంతశరంబు శక్రదము ♦ గ్రక్కునవైవఁగఁ బిడుగువోలె నా
శాంతము మాఱుమ్రోయఁ జని ♦ నాఖరువక్షము గాఁడఁ గూలె నా
ద్యంతము దగ్ధుఁ డౌచుఁ ద్రిపు♦రాంతక దగ్ధఖలాంధకుం డసన్. ౪౬౫

కం ఫేనమున నముచి పవిధా,రాలిహతిని వృత్రబలుల♦రమణను శ్రీసీ
తానాథునిమార్గణమున, మానవభుగ్వరుఁడు గూలె ♦ మహి భస్మితుఁడై. ౪౬౬

మహర్షులు శ్రీరామునిఁ బ్రశంసించుట.

ఉ. అంతట గుంపుగూడి ముది♦తాత్ములు రాజఋషుల్ మునుల్ ధరా
కాంతునిఁ జేరి యిట్లనిరి ♦ గౌరవ మూర మహాత్మ నిన్ను నీ
ప్రాంతముఁ జేరఁ బంప శర♦భంగునిఁ జూడఁగ వచ్చె నాఁడు పా
కాంతకుఁ డామహర్షులు ను♦పాయమునన్ నినుఁ జేర్చి రీయెడన్. ౪౬౭

శా త్రుంపింపం గలుషాత్మకంబు సనుర♦స్తోమంబు ని న్నిందు ర
ప్పింపం గల్గెను, దీరె మాపనులు, నీ♦వే రెన్నుచున్ హాయి రా
ణింపన్ మౌనులు దండకాటవిని దం♦డ్రీ! యింక ధర్మంబు దీ
పింపన్ నిచ్చలు సంచరించెదరు ని♦ర్భీతిన్ స్వధర్మంబులన్. ౪౬౮

కం.అను నీఁగోనన చారణ,జనయుతముగ దేవతలును ♦ జననాథుని పై
ఘనపుష్పవృష్టి గురిసిరి, వినువీధిని నిండె దుందు♦భిధ్వానంబుల్. ౪౬౯

శా.ఔరా యేమిపరాక్రమం, బరరె యే ♦ మాదాక్ష్యసత్త్వంబు, ల
య్యారే యాపదునాల్గువేలు మనుజా♦దానీకముల్ దాఁక నీ
శ్రీరాముండు పదాతి యై యొకఁడ త్రుం♦చెన్ వానినిన్ భీకరా
కారుం డై ఘటికాత్రయంబునను సా♦టోద్విష్ణు వోఁ జూడఁగన్. ౪౭౦

### సీతాలక్ష్మణులు శ్రీరాముఁ జేర వచ్చుట.

కం. అని కొండాడుచుఁ దను తను,మునుకులకుం జనిరి లోని♦మునికిత మాలన్
గన వచ్చినసుర; లంతం, జనుదెంచెను లక్ష్మణుండు ♦ జానకితోడన్. ౪౭౧

కం. విజయి యయి యచటిమౌని, వ్రజములు పూజింపఁ దోఁప ♦ రా లక్ష్మణుఁడున్
గజగమనంబునఁ జనియెను, నజితపరాక్రముఁడు స్వాశ్ర♦మానసిఁ జేరన్. ౪౭౨

కం. అంతట నాతని శత్రుని,హంతను బరమర్షులకు సు♦ఖావహు హర్షా
క్రాంతయయి భర్త జగతీ,కాంతుని వైదేహి గాంచి ♦ కౌఁగిటఁ గ్రుచ్చెన్. ౪౭౩

కం. ఉక్కునఁ బేరెక్కినయా,రక్కసులం ద్రుంచి మౌని♦రాజినుతుం డై
చెక్కు చెమర్పనిరాముని, నక్కువలహితాస్య మఱియు ♦ నక్కున నొత్తెన్. ౪౭౪

### అకంపనుఁడు రావణునకు ఖరాదివధవృత్తాంతముఁ జెప్పుట.

సీ. అట నకంపనుఁ డను♦నసురుండు వడి జన,స్థానంబునందుండి ♦ తెరలి పోయి
లంకాపురముఁ జొచ్చి ♦ లంకేశ్వరునిఁ గాంచి, రాజ! జనస్థాన♦రాక్షసాళి
ఖరుఁ డాదిగాఁగ సం♦గ్రామవీథిని జంపఁ,బడియె నెల్లట్లో నేఁ ♦ బ్రాణము [illegible]
దక్కించుకొని యిటు♦వంతముఁ జెప్పఁగ, వచ్చితి నన దశ♦వదనుఁ డనరె
తే. కనుల నిప్పులు రాల నా♦తనికి ననియె, నెవఁడురా యోరి మిక్కిలి♦హ్రస్వమైన
నాజనస్థానమును గూల్చి♦నాఁడు నేఁడు, డెట్టిలోకంబునందు వాఁ ♦ డింక [illegible]
ఉ. నాకపకార మేదియు నొ♦నర్చి సుఖంపడ లేరు నిక్కమా
నాకపదంబపాణులును ♦ యక్షపవిష్ణులు, దండి దండితుల్
వీకునఁ జేయుదుర్ దహను♦వేఁడిమి దగ్ధ మొనర్తు మృత్యువున్
జోక వధించెనం బవన♦సూర్యులఁ గట్టుదుఁ గాలఁ బెట్టుదన్. ౪౭౫

చం. అనిన నకంపనుండు భయ ♦ మంది విభూ! యభయం బొసంగ దే
నిని నిజమున్ వచింతు నన ♦ నీ కభయం బిడినాఁడఁ జెప్పుమీ
మనమునఁ గొంక కల్ల నన ♦ మానవభోజననాథుతో నకం
పనుఁ డనియెం గరద్వయము ♦ భక్తిభయంబుల మోడ్చి యీగతిన్. ౪౭౬

ఉ. మానితవృత్తబాహుఁ డస♦మానబలుండు నృపాంసుఁ డిందుతు
ల్యాననబింబుఁడున్ దశర♦థాత్మజుఁ డుత్తమకీర్తి బాణకీ
లానలమూర్తి రాముఁ డప♦రాజితవిక్రముఁ డాతఁడే జన
స్థానముఁ బాడు చేసెను వె♦సన్ ఖరదూషణసంయుతంబుగన్. ౪౭౭

కం. అన విని పెనుఁబాము వన న,ద్దనుజవరుఁడు రోఁజుచున్ య♦థాస్థితి చెపుమా
చనుదెంచెనో యింద్రామర,జనయుతుఁ డై యటకు రామ♦చంద్రుం డనికిన్. ౪౭౮

←→ అకంపనుఁడు రావణునకు శ్రీరాముపరాక్రమంబు వర్ణించి చెప్పుట. ←→

కం. తెలుపుమ యన రావణుతోఁ, బలికె నకంపనుఁడు రామ♦భద్రుని తేజో
బలవిక్రమవిధ మంతయుఁ, గలది గలట్టుగను వీత♦గర్వం బగుచున్. ౪౮౦

తే. విల్లు పట్టెడివారిలో ♦ నెల్ల మేటి, బహువిధదివ్యాస్త్రసుగుణసం♦పన్నవర్యుఁ
డాహవమునఁ బురందరు♦నంతవాఁడు, రామనాముఁడు దివ్యప♦రాక్రముండు.

ఉ. ఆతనిసోదరుండు తన♦యన్నకుఁ దుల్యుఁడు శక్తి, దుందుభి
స్వీతరవుండు రక్తసర♦సీరుహనేత్రుఁడు లక్ష్మణుండు కం
జాతముఖుండు, నన్నకును ♦ సంతతముం గడుఁగూర్చు నగ్నికి
న్వాతమురీతి, వారివల♦నం జెడిపోయెఁ జనపట్టు దండకన్. ౪౮౨

ఉ. రా రనిఁ దోడు దేవతలు ♦ రాఁడు బలారియు, రాముఁ డొక్కఁడే
క్రూరనిశాతబాణములఁ ♦ గూల్చెను రాక్షసకోటి నెల్ల, బం
గారపుఁబింజతూపులు తె♦గన్ విడి వెల్వడి పంచవక్త్రయు
క్పోరగపంక్తు లౌచునను♦రోత్తములన్ గబళించె నాజిలోన్. ౪౮౩

కం. ఏయే తెఱఁగుల దిగులున, నేయే తెరువులను బోవు ♦ నెల్లపగఱ క
య్యాయి తెఱంగుల మఱి నా,యాయిపథంబులను దోఁచు ♦ నని రాముండున్.

కం. ఈ నెఱిఁ బా డయ్యె జనస్థానం బన నాలకించి ♦ దశవదనుఁడు రో
షాననమున ననె నరిగెద, నే నిదె మానవులఁ బట్టి ♦ హింసింపంగన్. ౪౮౫

చం. అనిన నకంపనుం డనియె ♦ నాన్నృపువిశ్రుతవిక్రమంబులన్
విను మనుజేంద్ర! కింక గొనె♦నేని యసాధ్యుఁడు, నిండు వెల్లినేన్
ఘనతరబాణపంక్తి నరి♦కట్టు, సతారము సగ్రహంబు నా
ఘనపదమున్ శరంబులఁ బ♦గల్చుఁ జుమీ రఘురాముఁ డుద్ధతిన్. ౪౮౬

శా. శ్రీమంతుం డతఁ డుద్ధరింపఁ గలఁ డు♦ర్విన్, లీలఁ గూపారవే
లామర్యాద నడంచి యంబునిధి కీ♦లాలంబులన్ వే జగ
త్స్తోమం బెల్లను ముంపఁ జాలు గుణశ♦క్తుం, డంబురాశిస్థయం
బామూలంబు హరించు, మారుతమునే ♦ నాఁకట్టు బాణంబులన్. ౪౮౭

చం. ఘనతరవిక్రమంబునను ♦ గాఢమహాయశుఁ డాతఁ డెల్లలో
కనికరమున్ హరించియును ♦ బ్రహ్మణ సృష్టి యొనర్పఁ జాలు, నా
మనుజమృగేంద్రుఁ డీప్రజల ♦ మానుగ నట్టులె చేయు, నీకు నా
మనుజవరుం డసాధ్యుఁ డని ♦ మన్నత మియ్యది పంక్తికంధరా! ౪౮౮

ఉ. ఈ వొకఁ డంచుఁ బల్కు నది ♦ యేటికి లోకమునందుఁ గల్గుర
క్షోవరలోక మంతయును ♦ గూడియు నాతని డాయలేదు పా

పాపహాకర్తయుండు దివి♦జాలయముం జొర నేరనట్టు; లా
భూవిభుఁ జంపుయుక్తిఁ బరి♦పూర్ణమనంబున విన్ము చెప్పెదన్. ౪౮౯

అకంపనుఁడు రావణునితో సీతాపహరణము
శ్రీరామవధోపాయంబుగఁ జెప్పుట.

ఉ. ఏ మని చెప్పువాఁడ దను♦జేంద్ర! రఘూత్తముభార్య సీత నా
భామ త్రిలోకసుందరి యి♦భప్రతిమానసుయాన యౌవనో
ద్దామ నితంబినీమణి యు♦దంచితరత్నవిభూషితాంగి, యా
సామజవైరిమధ్యకును ♦ సాటి జగంబున లేదు భూమిపా. ౪౯౦
కం.సురలను గంధర్వుల న,చ్చరలను నాశరుల నైన ♦ జానకి నెనయం
దరుణీమణి లే దనఁగా, నరసతుల వచింప నేల ♦ నమదమరేంద్రా. ౪౯౧
కం.ఆమెను నీవిటఁ దెచ్చినఁ, గామి రఘూత్తముఁడు చచ్చుఁ ♦ గాంతావిరహో
ద్దామానలమునఁ బడి యన, నామాటల నాలకించి ♦ యసురేంద్రుఁ డనున్.

రావణుఁడు మారీచుం జూడఁ బోవుట.

శా.కానీ నే వఱువాత నేగి ధరణీ♦కన్యామణిం దెత్తు మో
దానన్ నీ విఁకఁ బొమ్ము టం చనిపి దై♦త్యస్వామి సూర్యాభ తే
జోనిస్తుల్యము రాసభాంచితము నై ♦ శుభ్రంబు నౌ తేరిపైఁ
దా నొక్కండుగ సూతయుక్తుఁ డయి య♦ధ్యాసీనుఁడై వెల్వడెన్. ౪౯౩
కం విసువీదిఁ జనెడు నాస్యం,దన మయ్యెడఁ దోఁచె మేఘ♦తతిమధ్యమునన్
గానబారుచంద్రుమండల, మన నటు చని తాటకేయు♦నాశ్రమమందున్ ౪౯౪
తే. అవతరించిన మారీచుఁ ♦ డరుగుదెంచి, భవ్యము లగునమానుష♦భక్ష్యభోజ్య
ములను దృప్తునిఁగాఁ జేసి ♦ పూజ సలిపి, యర్ఘ్యపాద్యాదు లర్పించి♦యనియె నిట్లు.
కం.సేమంబే యసురేశ్వర, సేమంబే రాక్షసులకుఁ ♦ జెచ్చెర నీ విం
దీమెయి నరుదెంచుటచే, నేమో కల దనుచు శంక ♦ యెద జనియించెన్. ౪౯౬
ఉ. ఆనుడు లాలకించి యసు♦రాధిపుఁ డిట్లనుఁ దండ్రి! రాముఁ డన్
మానవుఁ డొక్కరుం డుసుఱు♦మాలిచి రక్షకకోటులన్ జన
స్థానముఁ బాడు చేసె రణ♦శౌండత, నాతనిభార్యఁ దెచ్చుచో
మానుగ నాకుఁ దో డగుము ♦ మానుతు నాపగఁ దద్విధంబుగన్. ౪౯౭

మారీచుఁడు రావణునకు శ్రీరామునితోడివిరోధంబు వల దని చెప్పుట.

కం.నావుడు మారీచుం డను, నేవాఁ డొకొ నీకుఁ దెల్పె ♦ హితశత్రుం డై
యావైదేహినిగూరిచి, యేవాఁ డొకొ నీదుచేటు ♦ నెదురుం జూచున్. ౪౯౮

ఉ. నీకు హితుండు గాఁడు ధర♦ణీసుతఁ దెమ్మనినట్టివాఁడు, ము
ల్లోకము లేలువానికిని ♦ లోలత శృంగము భంగ మొందఁగాఁ
జేకొనఁ జేయ నెవ్వఁడు? ప్ర♦సిద్ధవిషోరగదంష్ట్రఁ బీకఁగా
నీ కెవఁడో వచించె? నిటు ♦ నిద్రితు నిన్ దలఁ దన్నె నెవ్వఁడో? ౪౯౯

చం. సురవరవైరి భూనుతవి♦శుద్ధకులాభిజనాగ్రహస్త మై
యురుతరశౌర్యదాన మయి ♦ యుగ్రభుజార్గళసద్విషాణ మై
పరజనభీకరం బగుచు ♦ వాలెడురాఘవగంధహస్తి నిన్
దురమునఁ దేఱిచూచుటకు ♦ నూల్కొన కిప్పుడు రాక్షసోత్తమా. ౫౦౦

మ. కలహాంతస్థితిసంధివాలమును ర♦క్షఃకాండసత్త్వాపహం
బలఘుస్ఫారికలంబసన్నఖము శా♦తాసిస్ఫురద్దంష్ట్రముల్
బలితం బైనన్నృసింహమూర్తి నిదురన్ ♦ మ్రాన్పాటు నై నుండఁగాఁ
జెలముం బూనుచు నీవు లేఁప దగునే ♦ చర్చింపు లంకేశ్వరా. ౫౦౧

కం. చాపావహారము భుజా,టోపాధికపంకమును బ♦టుశరోర్మికముల్
దీపితరణౌఘ మగుసీ,తాపతిపాతాళమందుఁ ♦ దగదు పడంగన్. ౫౦౨

కం. క్షమియింపుము లంకేశ్వర, శమమున లంకయును బొమ్ము ♦ స్వసరులతోడన్
రమియింపుము వనసీమను, రమియించుత భార్యతోడ ♦ రాముఁడు ప్రీతిన్, ౫౦౩

క. అనుచును మారీచుం డిటు, తను బోధింపఁగను విబుధ♦దమనుఁడు వల్లే
యనుచును లంకాపురికిని, జని తనమందిరముఁ జొచ్చె ♦ సంతుష్టుం డై. ౫౦౪

## ←→ శూర్పణఖ లంక కేగి రావణుఁ జూచుట. ←→

సీ. ఈరేడు వేవురు ♦ క్రూరరాక్షసవరుల్, ఖరుఁడు దూషణుఁడు త్రి♦శిరుఁడు లోను
గా నొక్కరాముచేఁ ♦ గవనతలంబునఁ, గూలుట గనుఁగొని ♦ ఘోలికొనుచు
భూరిరావమున వా♦పోవు చపస్యదు,ష్కరమైనరాముని♦క్రమముఁ గాంచి
యుద్విగ్న యగుచును ♦ నుగుఃడిఁ జనె దశ,కంఠపాలితము లం♦కాపురంబుఁ
తే. గదియ నరిగి విమానాగ్ర♦గతుని దీప్త
తేజు సురివరివృతసుర♦రాజుఁ బోలి
సచివయుతుఁ డగువాని ఘ♦నస్ఫురనిభంబు
కాంచనాసనమున యథా♦కామితముగ ౫౦౫

తే. జాతరూపవేదీస్థజా♦జ్వల్యమాన,జాతవేదునిగతి నొప్పు♦చుకల దేవ
భూతగంధర్వతాపస♦జాతిముఖ్య,జయ్యుఁ డగువాని శమునిని♦నాటివాని ౫౦౬

కం. అసురనురవిషమసంయుగ,రస నతులితనిశితకులిశ♦ప్రహారణకలితో
ల్లసితవ్రణు సురకరిసన,ఖసవంతకృతకిణకలిత♦పటువక్షతలున్ ౫౦౭

కం.ఇరువది నిడుకరములు పది,శిరములు వింజామరములు ♦ శ్వేతచ్ఛత్రం
బురువిపులోరము భూపతి, వరలక్షణములను గలుగు♦వానిని వీరుళ్ 208

తే. స్నిగ్ధవైడూర్యసంకాశు ♦ నిగనిగత్సు, వర్ణ మణికుండలుని మహా♦వదను శుక్ల
దశను విష్ణుచక్రాది[1] సా♦ధనశతాన్య, శస్త్రతాడితు నాహత♦సకలదేవు 209

కం.అక్షోభ్యార్ణవనిచయు,ప్రక్షోభణు సకలభూరి♦వసుధాధరసం
ప్రక్షేప్తను సురవరబల,విక్షేపకు రాక్షసైక♦విభు భీప్రదునిన్. 210

తే. అన్యదారాభిమర్శను ♦ నఖిలదివ్య,శస్త్రయోక్తను దాపస♦సప్తతంతు
విఘ్నకరు భోగవతి సర్ప♦విభుని వాసుకిని బరాజితుం జేసి ప్ర♦ధనమునందు 211

కం.తక్షకుని నొడిచి తద్వన,జేక్షణ హరియించి హంస♦గేంద్రమునందుళ్
యక్షపతి గెలిచి పుష్పక, మాక్షణమునం దెచ్చినట్టి♦యతిశూరవరున్. 212

కం నందనచైత్రరథంబుల, సుందరనుగునళిని గినుపు ♦ చొప్పడనాశం
బందించినబలి నుదయం, బందెడిరవిశశులం గేల ♦ నాంగెడు బలియున్. 213

సీ. హాయన లోకముల్ ♦ హాయనదశసహస్రకము తపంబును ♦ జలిపి మున్ను
పరమేష్ఠిం గూరిచి ♦ శిరములు దెగంగోసి, యర్పించి పూజించి ♦ యతనిచేత
దైతేయదేవగం♦ధర్వపిశాచప,తంగోరగములచే♦తను మనుష్య
జాతీతరములచే ♦ సంగ్రామమున మృతి, లేకుండ వరములం ♦ జేకొనుచును

ఆ. హోమములను జెఱిచి ♦ సోమంబు హరియించి, ప్రాప్తయజ్ఞములను ♦ బాడుచేయు
బ్రహ్మహంత దుష్టు ♦ బాణకర్కశు దయా, హీను నహితరతుని ♦ నింద్రవైరి.

ఉ. రావణు సర్వభూతచయ♦రావణు నిర్జరలోకలోకవి
ద్రావణు నష్టహాసకృత♦దైవతకంజముఖాళిగర్వ వి
స్రావణు భూరిదోశ్చ్రయప♦రాక్రమభంజితగాఢదంతకై
రావణు లోకపీడనప♦రాయణుం గుత్సితధీతురాయణున్. 214

కం.రాక్షసకులవర్ధనుం బ్ర,త్యక్షయమాంతకుని భూమ♦నాలంకృతునిళ్
వీక్షించి నిజభ్రాతను, రాక్షసి శూర్పణఖ భయభ♦రంబునం బలికెన్ 215

శూర్పణఖ రావణు నిందించుట.

ఉ. మంతురు లాలకింప నవ♦మానముపాటును దుఃఖపాటు మ
ర్త్యాంతకుం డట్టిచూడంగ దు♦రాగ్రహ మెట్టి ప్రమత్త! దుర్మదా!
సంతతకామభోగములం ♦ జాల్కుడ వొంచునిరంకుశుండ వై
చెంతల నిన్ను మ్రింగ వెసం ♦ జేరినమిత్తిని గాన లేవుగా. 216

చం.సతతము గ్రామ్యభోగముల ♦ సక్తుడు రక్తుడుం గామవృత్తుం డౌ
క్షితిపతినిళ్ స్మశానపుశి♦ఖింబలె లోకులు గౌరవింతురే?

---

[1] విష్ణుచక్రము = ఇది సుదర్శనము గాదు. ఈపేరిటి యాయుధము విశ్వామిత్రుడు రాముని కుపదేశించిన శస్త్రాస్త్రములలో నొకటి.

మతిచెడి రాజ్యకార్యముల ♦ మానుగఁ దాన యొనర్పనట్టిభూ
పతి సహకార్యజాలుఁ డయి ♦ పా డయి పోవు స్వరాజ్యయుక్తుఁ డై. ౫౧౮

ఉ. చారుల నేరి నుంపక వి♦చారవిదూరతఁ బౌరకోటికిన్
సారెకు దర్శనం బిడక ♦ చాటున మాటున నుండి కార్యపుం
భారములందు నెవ్వరివొ ♦ మాటల నమ్ముచు నస్వతంత్రుఁ డౌ
క్ష్మారమణేంద్రుఁ బంకమున ♦ సామజరీతి నరుల్ ద్యజింపరే. ౫౧౯

చం.తమతమపెత్తనంబు చెడఁ ♦ దారు స్వతంత్రులు గాక ధారిణీ
రమణులు వేరిచేతఁ దమ♦రాష్ట్రము నేలఁగఁ జేయఁ జాతురో
క్రమమున వారిచేత జల♦రాశి నగంబులపోల్కి మున్గి రూ
పము చెడిపోవు చుందుదురు ♦ ప్రాభవముల్ మును మున్న నాశిలన్. ౫౨౦

ఉ. నీ కపకారము న్నెఱప ♦ నిచ్చలు సందులు రోయు చుండ నా
నాకనివాసదానవగ♦ణంబులు చారవిచారదూరతన్
బ్రాకటబుద్ధిచంచలతఁ ♦ గ్రాలెదు నీ వెటు లింక రాజ వై
యాకరణిన్ మనంగఁ గల ♦ వీయిలఁ బ్రాణముతోడ నేనియున్. ౫౨౧

కం.పో దింతకుఁ బసితనమున్, రా దేమియుఁ దెలివి నీకు ♦ రాక్షస మఱియున్
లే దెఱుక వలయుపట్లన్, భూవయితుఁడ వగుచు నెట్లు ♦ పోలు పొందెద వో.

కం.వేగుల బండారంబుల, బా గగునీతులను నెవఁడు ♦ పరతంత్రుం డౌ
నాగబ్బితనపుసున్నిఁ, డా గద్దఱి ప్రకృతి జనుల ♦ కుద్దియ సున్నా. ౫౨౩

కం.దూరస్థపువిషయంబులఁ, జారులచే నెఱుఁగుఁ గాన ♦ క్ష్మారమణునకున్
దూరపుఁజూపరి యనుపే, రారయ సార్థకము; లేద ♦ యది నీయందున్. ౫౨౪

కం.ఈ నెఱిగ సచివవర్గము, మానక సేవింప సుఖము ♦ మరగుట నేచం
దాన నెఱింగెదు స్వజనవి,తానజనస్థానలయముఁ ♦ దద్దైవ్యగులచేన్. ౫౨౫

కం.పదునాలుగువేవుర రణ,పదమున ఖరదూషణాది♦బంధుయుతముగా
సదమదముచేసెఁ ద్రిజగ,ద్విదితంబుగ రాముఁ డొకఁడ ♦ వింటిబలమునన్. ౫౨౬

ఆ. నీసహోదరాళి ♦ నిర్మూల మొనరించె, ఋషుల కెల్ల నభయ ♦ మిచ్చి కాచె
నిశ్చయంబుఁ జేసె ♦ నీదండకాటవి, సాంద్రబలుఁడు రామ♦చంద్రుఁ డిపుడు.

చం.పిసినివి, వేగువారలకు ♦ వేతన మీయవు, లెస్స మత్తుచే
వసపడి కార్యతంత్రముల ♦ వారికి వీరికి మందబుద్ధి వై
యసమమతి మీఁద దెఱుంగవు, భ♦యంబు స్వదేశమునందుఁ బుట్ట నీ
విసిరో యెఱుంగ విందనుక ♦ నేమని నిన్నవచ్చు రావణా! ౫౨౮

ఉ. కొంచెపుజీత మిచ్చునృపుఁ ♦ గ్రూరుని మత్తుని గర్వితుం బుతున్
ముంచినవేళ నాపదలు ♦ మోటుకొనం డొకభృత్యుఁడేనిఁ, గో
పించు నకారణంబ యతి♦భీషత నామికఁ దన్నుఁ దాన భూ
షించు నసభ్యు భూపతిని ♦ సేవకులుం బ్రజనంబె చంపెడిన్. ౫౨౯

చం. తెలివిగఁ గార్యతంత్రములు ♦ దీర్పక యాపదలందు శంకచేఁ
జలితుఁడు గానిభూపతికి ♦ సంపద లెల్లను వేగ రూపఱం
బలుచనిగడ్డిపోఁచకు స♦మానుఁడు వాఁ డయి దుఃఖ మొందఁగాఁ
జులకనఁ జూతు రెల్లరును ♦ శోకముఁ బొందరు వానిభంగికిన్. ౫౩౦

మత్తకోకిలము. ఎందుకట్టెల మంటిపెళ్లల ♦ నేనియుం మఱి దుమ్ముచే
నొందు కార్యము కల్గుఁ గాని స♦మూహ చేయఁగ రాజుగా
నుండి భ్రష్టత నొందినట్టివ♦రోత్తముం డొకగవ్వకేఁ
ఖండితాహితసంచయా! కొఱ♦గాఁడు నిక్కము నమ్ముమీ. ౫౩౧

తే. కట్టివిడిచిన వస్త్రంబుఁ ♦ బెట్టి తీసి, నట్టిమాల్యంబుఁబోలుచు ♦ ననవిభుఁడు
రాజపదమునుండి తా ♦ భ్రష్టుఁ డైన, నాతఁ డెంతటివాఁ డేని ♦ నర్థకుండు.

ఆ. అప్రమాదబుద్ధి♦యయి యన్ని యెఱుఁగుచు, నింద్రియముల గెలిచి♦కృతము దెలిసి
ధర్మశీలుఁ డైన♦ధారిణీనాథుండు, చిరముగా సుఖించు ♦ సిరులతోడ. ౫౩౩

కం. నయనంబుల నిదురించియు, నయదృక్కుల మేలుకొని య♦నయ ముండి రుషా
దయలను వ్యక్తముఁ జేసెను, నయకార్యుని నృపతిఁ గొలుచు ♦ నఖిలజనంబుల్.

చం. వెదకిన లేదు నీయెడను ♦ వీఱిఁడి యిట్టిగుణంబు లొక్కటేన్
గదనమునందు రక్కసు ల♦కాలలయంబున దండకాటవిన్
సదమద మూట నీ నెఱుఁగఁ ♦ జాలవు చారులు లేమి, శత్రులన్
మదిని నుపేక్ష చేసెదవు ♦ మానితసౌఖ్యరసావశ్యాత్మతన్. ౫౩౫

తే. దేశకాలవిభేదంబుఁ ♦ దెలియ లేవు, గుణము దోషంబు నెఱిఁగెడి♦కొలఁది లేదు
కాన నోరక్కసులఱేఁడ♦కలిమిఁ బాసి, వ్యసనముల నొందెదవు చూడు♦వైళ మీవు.

చం. అని తనదోషజాలముల ♦ నాడిన రాక్షసలోకభర్త యా
ధనబలదర్పదర్పితుఁడు ♦ తద్ద విచారముఁ జేసి యిట్లనున్
గనుఁగవ జేవుఱింపఁగను ♦ గ్రక్కన మాడెడిచుప్పనాతితో
ననుజ! వచింపు సర్వమును ♦ నచ్చటివార్త లటంచు వెండియున్. ౫౩౭

ఉ. రాముఁ డనంగ నెవ్వఁడు ప♦రాక్రమ మెట్టిది రూప మెట్టి దా
రాముఁడు దండకాటవికి ♦ రాఁ గత మేమి ఖరాదిరాక్షస

స్తోమము నేమియాయుధము • తో వధియించెను జెప్పు మన్న నా
భామిని చెప్పఁగాఁ దొడఁగె • భానుకులేంద్రుచరిత్ర మంతయున్. ౫౩౮

→ శూర్పణఖ రావణుతో శ్రీరాముని వర్ణించి చెప్పుట. ←

సీ. నిడుదబాహులవాఁడు • వెడఁదకన్నులవాఁడు, వల్కలకృష్ణాజినాం•బరమువాఁడు
దర్పకరూపుఁడు • దశరథతనయుఁడు, రాముఁడు భయదప•రాక్రముండు
హేమపట్టావృత•భీమచాపముఁ దాల్చి, చిమ్ము బాణముల స•ర్పమ్ము లట్లు
కాండసంధానంబుఁ • గాండవికర్షంబుఁ, గాండప్రయోగంబుఁ • గాన నైతిఁ
ఆ. బండియున్న పైరు • వడగండ్లవ్రేటున, నేలఁ బడెడిరీతిఁ • గూలుచున్న
సేనమాత్రఁ గంటిఁ • జెప్పుదు నే మని, యతనిజవము బలము • నస్త్రబలము.
కం. ఖరదూషణసహితంబుగఁ, బరఁగినపదునాల్గువేలు • పటురాక్షసులన్
సరి మూఁడుగడియలను దా, శరముల నుఱుమాడె నొకఁడ • చరణస్థితుఁ డై.
ఆ. అభయ మొసఁగె దండ•కాటవిమునులకు, స్త్రీవధంబు శంక•చేసినట్టి
యమ్మహాత్ము చేత • నెమ్మెయినో విడు,వంగఁ బడుట నోర్తు • బ్రదికి యిటకు ౫౪౧
ఉ. వచ్చితి, రాముతమ్ముఁ డని•వారణతేజుఁడు లక్ష్మణుండు దా
వచ్చు ససుంబు రామునకు • వాలి మహాగుణసంపదన్ సతం
బచ్చపుభక్తిఁ గొల్చును మ•హాగ్రహశీలి యజయ్యుఁ డాజిలో
సచ్చరితుండు రాము నప•సవ్యభుజంబు బహిశ్చరానువున్. ౫౪౨

→ శూర్పణఖ రావణుతో సీతను వర్ణించి చెప్పుట. ←

సీ. రాముని ప్రియదార • రమణీయసంచార, యురుకీర్తికలిత రం•భోరులలిత
చంపకసుమనాస • చంద్రికాదరహాస, సౌందర్యసదన రా•కేందువదన
పతిహితమతిపూర్ణ • భవ్యకాంచనవర్ణ, నీలకుంతలభార • నీతిసార
హర్యక్షనిభమధ్య • యఖిలలోకారాధ్య, సీతాభిధాన సు•శ్రీనిధాన
ఆ. మపరలక్ష్మిపోలె • నావనలక్ష్మి నా, వెలుఁగుచున్నయదియు • వేల్పుఁజెలులఁ
గిన్నరాంగనలను • గీర్తితగంధర్వ,సతులఁ గంటి నిట్టి•సతిని గాన. ౫౪౩
ఉ. కంటిని యక్షకాంతలను • గంటిని గింపురుషాంబుజాక్షులన్
గంటిని దైత్యకామినులఁ • గాని రఘూద్వహుదేవివంటి దై
కంటికిఁ బండు వౌకలువ•కంటిని మూఁడుజగంబులందు నేఁ
గంటయు వింట లేదు గజ•గామినిచంద మిఁ కేమి చెప్పుదున్. ౫౪౪
కం. ఎవ్వనికి సీత భార్యయొ, యెవ్వని గవుఁగింటఁ జేర్చు • నింతి యొలమిచే
నవ్వాఁడు ముజ్జగంబుల, నవ్యాపవుకంటె నధికుఁ • డై వర్ధిల్లున్. ౫౪౫

ఉ. ఆరమణీలలామ యస♦మాంచితరూప సుశీల యావనో
దారవిహార నీకుఁ దగు♦దార సతీమణి కీవె యర్హుఁ డా
పూరుషుఁ డంచు నిద్దఱను ♦ బోలిచి చూచి ధరాత్మజాతఁ దో
తేరఁగ నందుఁ బోయితిని ♦ దేరకు ముక్కును గోలుపోయితిన్. ౫౪౬

కం. అట్టాడుచు నట నిట సతి,యట్టునకుం బోవ మోస ♦ మది గని తనక
న్నట్టిగ లక్ష్మణుఁ డదయత, మొట్టో యని యఱవఁ గోసె ♦ ముక్కుం జెవులున్.

కం. నీ వేగి కన్నులారఁగ, నావగకత్తియను బూర్ణి♦మాబ్జాస్యఁ గనఁ
బూవిలుతువేల్పుదాసరి,వై విడవే బిగువు గిగువు ♦ నాతఁణమందున్. ౫౪౭

ఉ. పమ్మిన ప్రేమ జానకిని ♦ భార్యగఁ గైకొన నిష్ట మేని లే
లె మ్మపసవ్యపాదమును ♦ లేవఁగ నెత్తు జయార్థ, మందుఁ బో
పొ మ్మిపుడే, రఘూత్తములఁ ♦ బోర వధించి యనాథ సీతఁ దే
తెమ్ము, సుఖోపభోగములఁ ♦ దేలుము తత్సతితోడ రావణా. ౫౪౯

ఉ. రాముని చేతఁ జచ్చినఖ♦రప్రముఖాసురకోటిమీఁద నీ
కేమియుఁ బ్రేమ యుండిన న♦హీనముదంబుగ వారి కెల్ల నా
రాముని దోడివారలను ♦ రాక్షసరాజ! వధించి రమ్ము, నీ
కీమెయి సమ్మతం బయిన ♦ నేగుము నేఁ డటకుం దిరుండ వై. ౫౫౦

కం. రుచియించె నేనియును నా,వచనంబులు నీకు ననుర♦వల్లభ! వేవే
విచికిత్సాహీనుఁడ వై, విచికిలగంధిన్ గ్రహింప ♦ వెడలుము మఱియున్. ౫౫౧

ఉ. నీబల మెంతమాత్రమొ ము♦నిప్రకరార్దన! మున్ను చూచి యా
పై బలవత్కృతంబుగ నృ♦పాలసుతన్ హరియింపఁ బూనుమీ
దే బెలువౌ లె దండకను ♦ దీఱినయాఖరదూషణాదిర
క్షోబలవీరులం దలఁచి ♦ చూచి ప్రతిక్రియ కై కడంగుమీ. ౫౫౨

→ రావణుండు రహస్యంబుగ మారీచాశ్రమంబునకుఁ బోవుట. ←

సీ. అన రోమహర్షణం ♦ బైనశూర్పణఖవా,క్యంబుల విని రావ♦ణాసురుండు
మంత్రులతోడుత ♦ మంతనం బుండి కా,ర్యంబుచందంబును ♦ నాత్మ నెఱిఁగి
వారికి సెలవిచ్చి ♦ పనిచి తాను బోయి, యోజించి కార్యంబు ♦ లున్న తెఱఁగు
తనతలపోఁతవి♦ధంబునఁ గలమేలు, హానియు వానిబ♦లాబలములు

తే. నట్టె యోజించి యిద మిత్థ♦మనుచు నిశ్చ,యించి స్థిరబుద్ధి వాహన♦గృహముఁ జేరి
గూఢగతి సారథిని జేరు ♦ గూర్పఁ బనుప, నతఁడు గ్రక్కున సమకట్టె♦స్యందనంబు.

సీ. కామసంచారంబుఁ ♦ గాంచనాంచితమును, ఖరపిశాచవదన♦ఖరయుతంబు
నంబుదధ్వానమూ ♦ నరద మంబుధి డాయ, ధవళాతపత్రంబు ♦ ధవళ మైన

వాలవ్యజనమును ♦ వాలఁగఁ గాంచన,కుండలంబులు తేజఁ ♦ గురియ నెక్క
స్నిగ్ధవైహూర్యస♦న్నిభుఁడును వింశతి,కరుఁడును బంక్తికం♦ధరుఁడు నగుచు
తే. దర్శనీయపరిచ్ఛద♦తతుల వెలిఁగి, భయదదశశీర్ష శైలంబు♦పగిది నొప్పి
చంచలాబలాకసహిత♦శరద మనఁగఁ, గ్రూరచరితుండు మునికంట♦కుండు చనియె.
సీ. శీతమంగళతోయ♦పూతసరిస్సుల, బహుపుష్పఫలవృక్ష♦పటలిచేత
వేదీసమావృత♦విస్ఫుటాశ్రమముల, సాలతాలతమాల♦నాళికేర
కదళికాథకిపూగ ♦ క్రముకవృక్షంబుల, నాగసుపర్ణగం♦ధర్వకిన్న
రాళులచేత న♦త్యంతమితాహార,మునులచే జితకామ♦ఘనులచేత
తే. నజుల వైఖానసులచేత ♦ ననఘమాష,వంశజులచే మరీచప♦వాలఖిల్య
గణముచేతను సిద్ధచా♦రణులచేతఁ, జెలఁగు వేలాప్రదేశంబుఁ ♦ జేరఁ జనియె. ౫౫౫
సీ. ఆటలఁ బాటలఁ ♦ బాటన వేలుపుఁ,బాటలాధర లెల్ల ♦ నీటు మెఱయ
నంచలుఁ గ్రౌంచులు ♦ నంచితంబుగ స్వర,సంచయంబులఁ జెవుల్ ♦ నించుచుండ
హారసంభారముల్ ♦ హారివిశాలముల్, నీహారతుల్యముల్ ♦ నిర్మలములు
వరమనోహరగీత♦వాదిత్రసంజుష్ట, దేవయానంబులు ♦ దేజరిల్ల
తే. నచ్చరలను గంధర్వవి♦ద్యచ్చరులను, నిజతపోబలజితలోక♦నిచయఘనుల
మఱియు నిర్యాసరసమూల♦మహితచంద, నాగరుధరారుహంబుల ♦ నంద మగుచు
తే. ఘ్రాణతృప్తికరంబులై ♦ గ్రాలువనుల, నేత్రతృప్తికరంబులై♦ నెగడుస్థలుల
శ్రవణతృప్తికరంబులై ♦ చాగుధ్వనుల, హృదయతృప్తికరంబుగఁ ♦ బొదలుదాని
కం. ముక్తాప్రవాళనీరజ,సక్తము నిర్మలతటాక♦చంచన్మహిరీ
యుక్తము మరీచగుల్మ,వ్యక్తము నై విత్తధాన్య♦వనితాయుత మై ౫౫౮
కం. కరితురగస్యందనసం,భరితం బయి హృద్య మైన♦పట్టనవితతిం
బరికించుచుఁ దక్షిణ మై, సురనగరసమాన మైన♦సుందర వేలన్. ౫౫౯
సీ. కనుఁగొని యటఁ గాంచె ♦ ఘనసన్నిభం బయి, శతయోజనాయత♦శాఖ లొప్పు
పెనుమఱ్ఱివృక్షంబు ♦ మును వైనతేయుండు, కవణంబుగా గజ♦కచ్ఛపముల
గోళ్లలో నిఱికి తా ♦ గొబ్బునఁ జని దాని,కొమ్మను వ్రాల భా♦రమ్ము చేత
బల్లున విఱిగిన ♦ వాలఖిల్యాదులు, తప మందుఁ జేయుట ♦ నయ దలంచి
తే. ముక్కునను దానిఁ గొని జవ ♦ మెక్కుడుగను
జనుచుఁ ద్రోవనయొంటికా♦లను భుజించె
నామిషము నిషాదవిషయ ♦ మంత చెఱిచి
మునుల ముక్తుల నొనరించి ♦ ముదముఁ జెంది. ౫౬౦
కం. ద్విగుణీకృతవిక్రముఁ డయి, గగనంబున కెగసి యినుప♦కమ్ములకిటికీల్
పగిలిచి డులిచి మణిమయ, మగునింద్రగృహంబు సమృత ♦ మతఁడు హరించెన్.

తే. అట్టితాపసగణజుష్ట ♦ మైనదాని, నరుణసోదరకృతచిహ్న ♦ మైనదాని
పేరున సుభద్ర మనఁగను ♦ వెలయుదాని, వటకుజంబును గని దాఁటి ♦ వనధి నసుర.

ఉ. అం దొకచోటఁ బావనవ♦నాంతరసీమ మితాశనుండు న
స్పందనిజేంద్రియుండు మృగ♦చర్మధరుండు జటాభరుండు నై
పొందుగ నార లూని తప♦ముం బచరించుచు నున్న తాటకా
నందనుఁ జేరఁ బోవఁగ ఘ♦నంబు నమానుష మైనరీతిగన్. ౫౬౩

కం పూజించి పావనోదక,భోజనములఁ దృప్తుఁ జేసి ♦ పోరి మఱి పలభు
గ్రాజుం గని సేమమె కద, రాజా యీలోన నిట్లు ♦ రాఁ గత మేమీ. ౫౬౪

రావణుఁడు మారీచుతో జనస్థానవృత్తాంతముఁ జెప్పుట.

కం. అనవుడు రావణుఁ డిట్లను, వినుతండ్రీ! నాదువాక్య♦విస్తరమును నేఁ
జనుదెంచితి నార్తుఁడ నై, కన నీయార్తునకు నీవ ♦ గతివి మహాత్మా. ౫౬౫

సీ. నీ వెఱుంగుదు రజ♦నీచరేశ్వర జన,స్థానంబునందు నా♦తమ్ముఁ డైన
ఖరుఁడు దూషణుఁడును ♦ గావిలిచెలియలు, చుప్పనాతియు నతి♦శూరుఁ డైన
త్రిశిరుండు లోనగు♦తీవ్ర తేజులు చతు,ర్దశసహస్రాసురుల్ ♦ రమణ నాదు
నాదేశమునఁ జేసి ♦ యావాస మొనరించి, బహుధర్మరతులను ♦ బఱచు చుంట

ఆ. యట్టివార లిపుడు ♦ నెట్టన క్రుద్ధు లై, వివిధసాధనము♦పేరు లగుచుఁ
గూడి యొక్క పెట్ట ♦ క్రూరత రామునిఁ, జెనయు నతఁడు కోప♦చిత్తుఁ డగుచు.

మ. పరుషం బాడక యొక్కఁడే శిని విశిఖ♦వ్యాపారకోదండుఁ డై
సరిగం గూల్చెఁ జతుర్దశాసురసహ♦స్రంబుం ద్రిశీర్షాదులన్
నరుఁడుం దాను బదాతి యై ఖరు బలిన్ ♦ శస్త్రారినిన్ దూషణున్
వరుసన్ రూపము మాపెఁ, జల్పె నభయ♦వ్యాయామమున్ దండకన్ ౫౬౭

కం జనకుఁడు వెడలం గొట్టెన, వనములఁ సతితోడఁ జిక్కి ♦ వసరెడునృపపాం
సనుఁడు కుశీలుఁడు తీక్ష్ణుం, డనయుం డజితేంద్రియుఁడు ద♦యారహితుండున్.

కం.భూతాహితలోలాత్ముఁడు, వీతసుధర్ముండు మిగుల ♦ వీఱిఁడి పగకున్
హేతువు లేకయె నాయను,జాతకు ముకుసెవులు కోసె ♦ సత్త్వమదమునన్. ౫౬౯

రావణుఁడు మారీచుని దోడుపడ వేఁడుట.

ఉ. కావున వానిభార్య సుర♦కాంతనుబోనిసురూప జానకిన్
నే వెసఁ దేరఁగాఁ జనెద ♦ నీవు సహాయుఁడు గమ్ము, తమ్ములున్
నీవును నాకు బాసటగ ♦ నిర్జరకోటుల నైన నాజిలో
భావన సేయువాఁడఁ దృణ♦భంగి నిజం బిది రాక్షసోత్తమా. ౫౭౦

ఉ. కావున నాకుఁ దోడ్పడుము ♦ కానను నీకు సముండు వీర్యసం
భావన నేని దర్పనదు♦పాయములందున నేని నాజిలో
నీ వోనరింప లేనియవి ♦ నిస్తులమాయలు లేవు లోకమం
దీవిషయం బెఱింగి కద ♦ యే నిటు వచ్చితి నిన్నుఁ జూడఁగన్. ౫౭౧

ఉ. ఏ నొనరింపఁగాఁ దగిన ♦ దెయ్యది యంటివ యేని విన్ము జాం
బూనదచిత్రబిందుమృగ♦మూర్తి ధరించి చరింప రాముఁడున్
జానకి యున్న యాశ్రమము♦చక్కటి; భ్రాతలఁ బంపుఁ బట్టఁగా
మానిని, రాహు చంద్రప్రభ ♦ మాడ్కి హరించెద నొంటి మైథిలిన్. ౫౭౨

కం. జాయావియోగకర్శితుఁ, డై యడలెడిరామచంద్రు ♦ నంత వధింతున్
హాయిగ సుఖయింతును మఱి, మాయయ్యా సలుపు మింత♦మాత్రం బనినన్.

శా. మారీచుండును రావణుం డనినరా♦మత్యాధవోదంతముం
దీర న్విన్నను గుండె ఝల్లు మనఁగా ♦ నిశ్చేష్టుఁ డై కంపి యై
నో రెండం గనుచూపు నిట్రగొన నెం♦డున్నాలె తెఱల్ నాకుచున్
ధీరత్వం బఱి ప్రేతకల్పుఁ డయి దై♦తేయాధిపుం జూచుచున్. ౫౭౪

కం. రామపరాక్రమవిజ్ఞుం, డామానవభోజి భీతి♦హతచిత్తత ను
త్రామారికిఁ దనకును గడు, సేమముగా నిట్లు పలికెఁ ♦ జేమోడుపుతోన్. ౫౭౫

మారీచుఁడు రావణునకు శ్రీరామునిబలపరాక్రమములు దెల్పుట.

కం. అనయము ప్రియవాక్యంబుల, ననియెడిజను లెందు సులభు ♦ లప్రియ మయ్యున్
గనఁ బథ్యమైనసూక్తిని, ననువాఁడును వినెడివాఁడు ♦ నరు దసురేంద్రా. ౫౭౬

ఉ. అమహనీయవిక్రము గు♦ణాధికు రాముని బాశహస్తసు
త్రామసమాను నీ వెఱుఁగ♦రాదు చలాత్ముఁడ! వేగు లేమిచే
రాముని కాగ్రహంబు మది ♦ రాఁజక యుండెడిఁగాక యీజగ
త్తోనము మరాక్షసం బగుచుఁ ♦ దూలక యుండెడిఁగాక నాయనా ౫౭౭

సీ. నీప్రాణములు నిట్టి♦నిల్వవఁ దీయఁగ, జన్మమెత్తెదు గదా ♦ జనకతనయ
ధారిణిసుతనిమి♦త్తంబుగ నాకేమి, కలుగ కుండెడుఁగాక ♦ కష్టములును
గామవృత్తుఁడ వీవు ♦ గావుట నాథుండు, గాసి గాకున్నె లం♦కాపురంబు
స్వచ్ఛందవృత్తిని ♦ జరియించు నినుఁ గూడి, పాడు గా కుందురా ♦ బంధుజనులు

ఆ. నిన్నుబోఁటికుమతి ♦ నిష్ఠురశీలుండు, పాపమంత్రితుండు ♦ ప్రభుతఁ గాంచి
తన్ను రాష్ట్రమెల్లఁ ♦ దనవారితోఁ గూడ, మూలముట్టు చెఱుచు♦మూర్ఖుఁ డగుచు.

ఉ. కాఁ డయ కాఁడు రాముఁ డిల ♦ క్షత్రియపాంసనుఁడుం గుశీలుఁడున్
గాఁ డయ లోభి ధర్మగుణ♦కాండవిహీనుఁడు గాఁడు తీక్ష్ణుఁడున్

గాఁడు సమస్తభూతహిత♦కార్యవిదూరుఁడు గాఁడు కానకున్
రాఁ డయ తండ్రి నెట్టినను ♦ రావణ! నీ కెవ రట్లు చెప్పిరో. ౫౭౯

కం. తనజనకుఁడు కైకయిచే,తను వంచితుఁ డగుట గాంచి ♦ తండ్రిని ఋజువా
దిని జేయఁ గైకప్రీతికి, జనకుని ప్రీతికిని వనికిఁ ♦ జనెఁ ద్యక్తసుఖుఁ డై. ౫౮౦

కం. విను రఘురాముఁడు కర్కశుఁ,డును గాఁడు కళావిహీనుఁ♦డునుం గాఁ డవశుం
డును గాఁడు నిక్క మింతయు, ననృతము దుశ్శ్రుతము లేల ♦ యాడెదు తండ్రీ. ౫౮౧

ఉ. రాముఁడు ధర్మమూర్తి యప♦రాజితసత్యపరాక్రముండు, సు
త్రాముఁడు దేవతాతతికి ♦ రాణ విభుండు సమస్త మాజగ
త్స్తోమముపాలికిన్, సుమతి ♦ సూర్యునికాంతి హరించునట్లు సో
ద్దామసుశీలగుప్త మగు♦ధాసుతనా హరియింపఁ జూడఁగన్? ౫౮౨

కం. శరకీలామాలికలన్, దరిఁ జేరఁగ రాని దాని ♦ ధనురింధనసం
భరితంబు సంప్రదీప్తము, వరరాఘవవహ్నిఁ బడఁగఁ ♦ బాలుఁగఁ దగునే. ౫౮౩

శా. చాపవ్యాదితదీప్తవక్త్రుని మహో♦గ్రాస్త్రజ్వాలు సామర్షునిన్
జాపోద్దీపితపాశధారిని విప♦క్షవ్రాతసంహారు సీ
తాపద్మాయతలోచనాహృదయనా♦థ శ్రాద్ధదేవున్ సుఖ
వ్యాపారానువు లెల్లవీడి చన నే♦లా తండ్రి డాయన్ వెసన్. ౫౮౪

కం. జనకాత్మజసంబంధం,బున రాముం డప్రమేయ♦పురుతేజుం డ
య్యెను నట్టిరామచాపము, తనుఁ గావఁగ నున్నసీతఁ ♦ దరమా తేరన్. ౫౮౫

కం. సింహోరస్కుం డగునర,సింహునిపద్మాక్షి సత్య♦శీలాఢ్య వ్యపే
తాంహశ్చరితను రాక్షస,సింహా! డాయంగఁ బోకు ♦ చెప్పితి హితమున్. ౫౮౬

కం. విను ప్రాణముకంటెను రా,మునకుం బ్రియహితను సీత ♦ మోహాము చేతన్
వనవహ్నిశిఖను బట్టఁగఁ, జనుపోలిక నిగ్రహింపఁ ♦ జనకుము శుభ మా. ౫౮౭

కం. కొనసాగనియీకార్యము, పనిపూని సురారి! యేమి♦ఫలము గుడిచెదో
విను మతనికంటెఁ బడితే, నని నంతటఁ దీఱు నీదు♦నాయుష్యంబున్. ౫౮౮

ఉ. రామునితో విరోధమును ♦ రాక్షసనాయక! కొంటి వేని నీ
కామితరాజ్యభోగసుఖ♦కాండముఁ బ్రాణముఁ దక్కఁ బోదు, నీ
కేమియుఁ గొంతకాల మిల ♦ నింకను సౌఖ్యపడంగ నిష్టమేన్
రాముమనంబు నొచ్చుపని ♦ రావణ చేయకు మయ్య వేఁడెదన్. ౫౮౯

చం. చనుము పురంబు, ధర్మహిత♦సత్తము లైనవిభీషణాదులం
గనుము సభన్, మదిం దలఁచు♦కార్యమునందు గుణాగుణంబులన్

వినుము, బలాబలంబులను ♦ వెంజియు స్వాన్యబలప్రమాణ మె
య్యన మది నిశ్చయింపుము, హి♦తాహిత మెంచి యొనర్పు కార్యమున్. ౫౯౦
కం. నాకుం దోఁచిన యది యిది, యాకోసలరాజపుత్రు ♦ నాహవమందున్
నీకు నెఱి గాదు డాయఁగఁ, జేకొను నాబుద్ధి నీకుఁ ♦ జెలఁగు శుభంబుల్. ౫౯౧

మారీచుఁడు రావణుతో శ్రీరాముచేఁ దాను బడినపాట్లు దెలుపుట.

సీ. వినవయ్య దశకంఠ ♦ విపులాతలం బెల్ల, వేయిగజంబుల♦విపులబలముఁ
దాలిచి పర్వతో♦త్తాలరూపంబున, నీలజీమూతస♦న్నిభశరీర
కాంతితో సంతప్త♦కాంచనకుండల,ధారి నై పరిఘాయు♦ధంబుఁ బూని
లోకంబు భీతిమై ♦ నాకులపా టొంద, దండకాటవిఁ దపో♦ధనులమాంస
తే. ములను మెక్కుచుఁ దిరుగఁగ ♦ మునివరుండు
గాధిజుఁడు భీతి దశరథుఁ ♦ గాంచి యిపుడు
భయము ఘటియిల్లె మారీచు♦వలన నాకు
రామభద్రునిఁ బనుపవే ♦ క్రతువుఁ గాన. ౫౯౨
చం. అనవుడుఁ గౌశికోక్తులకు ♦ నానరపాలకుఁ డిట్లనుం దపో
ధన పసివాఁడు రాఘవుఁడు ♦ ద్వాదశవత్సరుఁ డస్త్రకౌశలం
బును గలుగండు కావునఁ జ♦మూసహితంబుగ నేన వచ్చి యా
దనుజులఁ ద్రుంచి మీకును ని♦తాంతము సంతస మారఁ జేసెదన్. ౫౯౩
శా. ఆమాట ల్విని కౌశికుం డనియె రా♦జా! రాముఁ డొక్కండు గా
కామాంనాశనవర్యునిం దలపడం♦గాఁ జాలఁ డెవ్వండు, సద్
ధామస్తోమము నీవు గామట ప్రసి♦ద్ధంబె కదా సైన్యముల్
నేమం బొంగఁగ నుండ ని మ్మిచట నే ♦ శ్రీరాముఁ గొంపోయెదన్. ౫౯౪
కం. బాలుం డయ్యును నాతఁడు, చాలుఁ రాక్షసుల నొంప ♦ సమధిక తేజో
లాలితుఁ డగుటను నీకుం, జాలశుభంబులు ఘటిల్లు ♦ క్ష్మాధవచంద్రా. ౫౯౫
కం. అనుచున్ రామునిఁ దోడ్కొని, చని విశ్వామిత్ర మౌని ♦ సంతోషమునన్
దనయాశ్రమమున నుంచెఁ, బనిపూనెన్ సవమునకును ♦ వన దేశమునన్, ౫౯౬
ఉ. ఆయెడ రాముఁ డేకవస♦నాంచితుఁ డై, శిఖి యై, సరోజప
త్త్రాయతనేత్రుఁ డై, మెఱయు♦హాటకమాలిక లీల వ్రేలఁగా,
శ్రీయుతమూర్తి యై, ముఖము♦చెల్వముచందముఁ జాటు చుండ లేఁ
బ్రాయము, విల్లు మీటుచును ♦ స్వద్యుతిఁ గాన వెలుంగఁ జేయుచున్ ౫౯౭
కం. పొడ తెంచు బాలచంద్రుని,వడువున శోభిల్ల లబ్ధ♦వరగర్వమునన్
గడువడిఁ జను దెంచితి న,య్యెడకున్ మేఘాభ కాంతి ♦ యెసక మెసంగన్. ౫౯౮

చం.ఇటు చనుదెంచు నన్నుఁ గని ♦ యింతయు భ్రాంతుఁడు గాక చాపమున్
బటుగతి నెక్కుపెట్టఁ బసి ♦ బాలకుఁ డంచు నుపేక్షఁ జేసి యా
జటిలునివేదిచాయకు వె ♦ సం జనుడు న్ననుఁ జిమ్మె రాముఁడున్
జటులశరంబునం బడఁగ ♦ సంభ్రమునన్ శతయోజనంబులన్. ౫౯౯

కం.ఊపిరితో నను విడుచుటఁ, గూపారమునందు మూర్ఛఁ ♦ గూలియు నెంతో
సేపునకుఁ దెలివిఁ గని లం,కాపురికిం జనితి తేఁడ ♦ గర్వం బూడన్. ౬౦౦

కం.బాలుఁడు నకృతాస్త్రుం డగు,గోలయె న న్నట్లు పఱచెఁ ♦ గూలిచె సైన్యం
బాలమునకు నిపు డెత్తిన, నేలా వచియింప రాక్ష♦సేశ్వర! ఫలమున్. ౬౦౧

ఉ కావున రామునిం జెనకఁ ♦ గార్యము గా దని నీప్రయత్నమున్
రావణ! యాఁపఁగా వలసె ♦ రామునితోఁ బగ గొంటి వేనియున్
బోవదు రిత్త కయ్యెనియు ♦ భూరితరాపద రాక్షసాళికిన్
నీవ ఘటించి నట్ల యగు ♦ నిక్కము నమ్ముము పంక్తికంధరా. ౬౦౨

ఉ. క్రీడలు సొంపు పెంపుఁ దన♦రింపఁగ నిం పగునుత్సవంబులన్
గూడి చరించు నీయసుర♦కోటికిఁ దాపము కీడుఁ గూర్పఁగాఁ
జూడకు, భగ్నహర్మ్యశల♦సుందరసౌధవితాన లంకయుం
బా డయి పోఁగఁ జూచెదవు ♦ మైథిలికై విను రాక్షసోత్తమా. ౬౦౩

ఉ. పాపముఁ జేయ కెంతయును ♦ బావనరీతిఁ జరించు చుండియున్,
బాపులసంగతిం బరుల♦పాపములం జెడుఁ జుమ్ము సజ్జనుం;
డాపద నొందుఁ బన్నగజ♦లాశయమందలి చేఁపపిండు, నీ
పాపమునన్ సుఖానుభవ♦భవ్యులఁ జూచెదు నేలపాలుగాన్. ౬౦౪

కం.ఏపాప మెఱుఁగకున్నను, నీపాపముకతన దివ్య♦నిరుపమమణిభూ
షాపటలదివ్యచందన,లేపనయుతరాక్షసాళిం దెగఁ గనెదే. ౬౦౫

చం.అనిమొనఁ జావఁగా మిగిలి♦నట్టినిశాచరు లాత్మదారలం
గొనియునొ వీడియో దెసల♦కుం బరువెత్తఁగ దిక్కుమాలి లం
కను గలకొంప లెల్ల శర♦కాండహుతాశనహేతిపాళిచే
తను దెగఁగాలి నీ ఱగుట ♦ తప్పక చూచెదు నీవ రావణా. ౬౦౬

కం.పరదార వలచుకంటెం, బరికింపఁగ వేఱె భూరి♦పాపము గలదే?
సురవైరీ నీభార్యలు, తరుణులు పదివేలు లేరె ♦ తర్కింపు మదిన్. ౬౦౭

ఉ. కమ్ము స్వదారలోలుఁడవు ♦ కావుము నీదుకులంబు రాక్షసా
నెమ్మదిగా సుఖాప లగు♦నీప్రియభార్యలతోడఁ గూర్మి మి

త్రమ్ములతోడ నింకయుఁ జి♦రంబుగ సౌఖ్యము లందఁ గోరితే
నమ్మెయి రామచంద్రునకు ♦ నె గ్గొనరింపకు చాటి చెప్పితిన్. ౬౦౮

మాలిని. వలదు వలదు సీతా♦వారిజాక్షిన్ గ్రహింపన్
జెలిమికలిమి నీకుం ♦ జెప్పెదం, గా దటంచున్
బలిమిని గ్రహియింపన్ ♦ బంధుమిత్రాళితోడన్
గలవు కలనఁ గూలన్ ♦ క్ష్మాసుతానాథుచేతన్. ౬౦౯

మారీచుఁడు రావణుతోఁ దాను రామునిబారిఁ బడి
తప్పించుకొన్నవిధముఁ దెల్పుట.

శా. ఎట్టెట్టో విడిపించె న న్నపుడు ధా♦త్రీశుండు సంగ్రామమున్
దిట్టటాడక విన్ము చెప్పెదను ద♦ద్వృత్తంబు నూత్నంబు, నే
నట్టుల్ స్రుక్కియు రాముచేఁ బడి యిదే♦ యారణ్యవీథిన్ బడిన్
దిట్టల్ దైత్యులు జింకరూపముల నే♦తే నిద్ద ఱే నుద్ధతిన్ ౬౧౦

తే. దీప్తజిహ్వయుఁ బెనుమేను ♦ దీర్ఘదంష్ట్ర
లమరు ఘోరమృగం బయి ♦ యగ్నిహోత్ర
గృహములను దీర్థములఁ జైత్య♦వృక్షములను
గ్రుమ్మరితి మాంసభోజి నై ♦ క్రూరమతిని. ౬౧౧

తే. దండకారణ్యతాపస♦కాండములను
గూల నడిచియు రుధిరంబుఁ ♦ గ్రోలి వారి
మాంసములు మెక్కుచు నధర్మ♦మార్గపరత
నొడలు దెలియక మత్తెక్కి ♦ యొక్కనాఁడు. ౬౧౨

సీ. తాపసవేషంబుఁ ♦ దాల్చి మితాహార,యుక్తి భూతావనా♦సక్తిగల్గు
రామభద్రుఁడు మహా♦వ్రతధరాకన్యయు, మిత్రతేజుండు సౌ♦మిత్రి యుండు
చక్కటికిని బోయి ♦ చిక్కెరా ముని యని, పూర్వవైరంబును ♦ బుద్ధిఁ దలఁచి
వాఁడికొమ్ములు వంచి♦ వేఁడిమి దీపింప, బుద్ధిహీనుఁడ నై ♦ పొడువఁ బోవఁ
తే. జాప మెక్కిడి నాయున్న ♦ చాయఁ జూచి, గరుడమారుతనిస్వన♦కలితవజ్ర
సన్నిభాశుగములమూఁటి ♦ సరగ విడువ, నుఱికితిని వాని వేగంబు♦నెఱుఁగుకతన.

కం. కావున నే బ్రతికితి నా,తో వచ్చినవారు వాఁడి♦తూపులు దాఁకన్
బోవిడిచిరి ప్రాణంబుల, నేవానికి వశము రాము ♦ నెదిరియు బ్రదుకన్. ౬౧౪

చం. విదితబలాఢ్యుఁ డైనరఘు♦వీరుని బారికిఁ దప్పి యె ట్టెటో
బ్రదికితి నాఁటఁ గోలె నిట ♦ రాక్షసనాయక! సన్న్యసించి ని

ర్థదమున యోగయుక్తి ముని♦మాడ్కిఁ జరించుచు నున్నవాఁడ, నా
హృదయముపాటు నే మనుదు ♦ శ్రీరఘురాముని సంస్మరించినన్. ౬౧౫

కం. భూరిధనుస్సు మృగాజిన,చీరంబులు దాల్చి చెట్టు♦చెట్టున దశకం
ఠా! రాముఁడు గనఁబడెడి న,నారతముం బాశహస్తుఁ ♦ డగుయముపోల్కిన్.

ఉ. రాములు వేనవేలుగను ♦ రావణ! తోఁచెద రెల్లవేళలన్
రామమయంబుగాఁగ విపి♦నంబు సమస్తము గోచరించెడిన్
రాముఁడు లేనిపట్టులను ♦ రాముఁడ కన్పడు,స్వప్నమందునన్
రామునిఁ గాంచి బొబ్బరిలి ♦ రాత్రుల నిద్దుర లేక కుందుదున్. ౬౧౭

కం. రామునిపే రన విబుధవి,రామా! వెఱ చెప్ప నేల ♦ రత్నము రథముల్
రామ లని రాదిశబ్ద,స్తోమము చెవిఁబడిన మనము ♦ నుడివడుఁ భీతిన్. ౬౧౮

చం. వలవదు నీకు రాముసెడ ♦ వైరము, యుద్ధమునందు నమ్మహా
బలు నెనయంగ లేవు, రఘు♦వర్యుపరాక్రమ మే నెఱుంగుదుం,
బలి నముచిన్ వధింపఁగ స♦మర్థుఁడు, శక్తుఁడ వేని నీవ యు
చ్ఛలమునఁ బోరు, కానియెడ ♦ సైరణ సేయుము బంధుతామృతిన్. ౬౧౯

కం. నే వసుధఁ గొన్నిదినములు, జీవించుట యిష్టమేని ♦ చెప్పకు మయ్యా
రావణ! నాతో నాసీ,తావిభుకథఁ జాలుఁ జాలుఁ ♦ దలప్పై వచ్చున్. ౬౨౦

ఉ. పెక్కురుసాధువుల్ జగతిఁ ♦ బెద్దయు ధర్మరతాత్ము లయ్యునుం
దక్కినవారిదోషమునఁ ♦ దారు నశించెద, రట్లు నేను నీ
ముక్కడి సేఁతలం జెడుట ♦ యూఢియ, నీబడి రాను నేను, నీ
యిక్కృతి నీ కభీష్ట మగు♦నృత్తిఁ జరింపుము, నన్ను వీడుమీ. ౬౨౧

కం. రాముఁడు నిస్తులసత్త్వో,ద్దాముఁడు పటు తేజుఁ డధిక♦దర్పస్థైర్య
స్థేముఁడు రాక్షసలోకవి, రాముఁడు గా నేల నీకు ♦ రావణ చలుపన్. ౬౨౨

ఉ. హేమికతోడ నాదశర♦థాత్మజులన్ మనచుప్పనాతి దా
నే మని డాసె? నంతఁ జన ♦ కీను మెయిం బెరరేచె నాఖరున్
స్తోమముతోడ వాఁడు చని ♦ దొమ్మి యొనర్చి గతించె రాముచే,
రాముఁడు చేసినట్టియప♦రాధ మ దేదియొ పల్కు రావణా. ౬౨౩

కం. చుట్టములహితముఁ గోరుచుఁ, బట్టుగ నాయాడుమేలు♦పలుకులు చేఁదై
తట్టిన రామునిచే నని, గిట్టెదు సహబంధుమిత్ర♦కీర్తిగ ననినన్. ౬౨౪

కం. యుక్తంబు క్షమము నగుత,త్సూ క్తిని గొనఁడయ్యెఁ దనకె ♦ శుభ మని మరణా
సక్తుం డౌషధములను వి,రక్తిని గ్రహియింపనట్లు ♦ రావణుఁ డాత్మన్. ౬౨౫

రావణుఁడు మారీచునిఁ బరుషంబు లాడి బలాత్కరించి తోడుపడ నంగీకరింపఁ జేయుట.

కం. ఈ వొప్పున నయహితవా,చాచతురత బోధ సేయు♦సచివాగ్రణి మా
రీచు విధిచోదితుఁడు క్షణ,దాచరపతి పరుషఫణితిఁ ♦ దా ని ట్లనియెన్. ౬౨౬

శా. మారీచా! నిను నెవ్వఁ డీకథల సం♦భాషింపఁగాఁ గోరె? నో
రారం బ్రేలితి వేలరా చవుట బీ♦జావాప మోనాఁగ వ్యా
హారంబుల్? మనుజుండు మూర్ఖుఁడును బా♦పాత్ముండు రాముండు; నా
యారాజన్యు నెడాటవుంబనులు నీ♦వా నేస్తు భేదింపఁగన్. ౬౨౭

ఆ. ఆఁడుదానిమొఱుగు ♦ లాలించి రాజ్యంబుఁ, దల్లిఁ దండ్రి హితవి♦తానములను
విడిచి తత్క్షణంబ ♦ నడచు చరణ్యంబు,లందుఁ జొచ్చె నెంత♦మందుఁ డతఁడు.

కం. నీవ కన ఖరనిహంతకు, భూవరతనయునకుఁ బ్రాణ♦ములకుం బ్రియ యా
శ్రీవైదేహి గ్రహించెద, నీవశమా త్రిప్ప నాదు♦నిశ్చితబుద్ధిన్. ౬౨౯

ఉ. వాసవుఁ డాదిగా విబుధ♦వర్గము లైన మదుద్యమంబులన్
వీసమునంతఁ ద్రిప్ప వన ♦ నీ వటరా ననుఁ జక్కదిద్దఁగా?
వాసి గుణంబు దోషము ను♦పాయ మపాయము చెప్పు మన్నఁ గా
దే సచివుండు చెప్పఁదగుఁ ♦ దెల్విగఁ గార్యవినిశ్చయంబునన్? ౬౩౦

కం. ఇది యెట్టని ప్రభు వడిగిన, బ్రదుకం గాంక్షించుమంత్రి ♦ బద్ధాంజలి యై
మదిఁ గలరీతి నణంకువ, విదితము సేయంగఁ దగును ♦ వెర వొనరంగన్. ౬౩౧

కం. హితమును మృదుపూర్వము న,ప్రతికూలము శుభము నైన♦వాక్యము చేతన్
బతికి వివరింపఁ దగు న,మ్మత మగుగతి మంత్రి వినయ♦మండనయుక్తిన్. ౬౩౨

కం. మానార్హుఁ డైనభూపతి, మానవివర్జితము లైన♦మహితశుభోక్తుల్
వీనులఁ బెట్టఁ డదెంతటి,మానిసి వచియించె నేని ♦ మారీచుండా. ౬౩౩

ఆ. వాసవాగ్నిసోమ♦భానుజవరుణుల,విక్రమౌష్ణ్యములును ♦ విపులసౌమ్య
దండములుఁ బ్రసన్న♦తయుఁ దాల్చు భూపతి, యెల్లవేళఁ బూజ్యుఁ ♦ డింతనిజము.

ఉ. నీవును ధర్మముం దెలియ♦నేరక కేవలమోహితుండ వై
యేవియొ కాఱు లాడెదవు ♦ హీనమతీ! పనిపొంటె రాఁగ, ని
న్నీ విషయంబునం దడిగె ♦ నెవ్వఁడు కీడును మేలు? నీకృతిన్
నీ వొనరింపు సాహ్య మని ♦ నే వచియింప ని టేల ప్రేలఁగన్? ౬౩౫

సీ. వినుము నీసాయంబు♦విధము వచించెద, రజతబిందువులచే ♦ రమ్య మైన
బంగరుజింక వై ♦ రంగుగ రామాశ్ర,మముపొంత రాముని♦మహిళ యెదుటఁ

దిరుగు చుండుము నీదు♦తీరుఁ గనుంగొని, విస్మయపడుచును ♦ విభునితోడఁ
బద్ధాయతాక్షి నిన్ ♦ బట్టితెమ్మను నంత, దవ్వుగఁ గొనిపోయి ♦ దాశరథిని
తే. జానకీ లక్ష్మణా! యని ♦ చావుకూఁత
రామవాక్యానురూపంబు♦గా మహీజ
వినఁగ వేయుమ యద్దాన ♦ వికల యగుచు
మెలఁత రామునిఁ జూడ సౌ♦మిత్రిఁ బనుచు. ౬౩౬
కం. సౌమిత్రియు సౌహృదమున, రాముని నెమకంగఁ బోవు ♦ రాకొమరులు పో
రామునిరామ హరించెద, నామఘవుఁడు శచినిబోలె ♦ హాయిగ నేనున్. ౬౩౭
తే. ఇంతమాత్ర మొనర్చి నీ♦వేగవయ్య, యిచ్చు మెయి నర్ధరాజ్యంబు ♦ నిచ్చువాఁడ
ముందు నీ వేగు కార్యసం♦పూర్తిపొంటె, నిన్ను నెనుకొందు రథమున ♦ నిర్జరారి.
కం. వంచించి రాము సీత గ్ర, హించి రణముమాట లేక ♦ యేగెద సుఖ నై
యించుక సేపున లంకకుఁ, గొంచెపుఁబని దీని నీవు ♦ గూర్పక యున్నన్. ౬౩౯
ఉ. కూరుచువాఁడ మృత్యువును ♦ గొబ్బున, నీ కిది సమ్మతంబయేన్
గోరిక సంఘటింపు, మటు ♦ గూడ దటంచును బ్రేలెదే బలా
త్కారమునన్ ఘటించెదవు ♦ తప్పదు, తెల్విని దెచ్చుకో, సుఖో
దారత నుందు రే బ్రతికి ♦ ధారిణిపప్రతికూలభాషణుల్? ౬౪౦
కం. అట కేగ సందియము మృతి, యిటఁ బ్రేలుచు నున్న ధ్రువము ♦ మృత్యువు నాచే
నటు మేలో యిటు మేలో, పటుమతి యోజించి కార్య ♦ పరుఁడవు కమ్మా. ౬౪౧

మారీచుఁడు రావణు నిందించుట.

కం. అని రాజుకరణి ముద లిడ, విని మారీచుండు పరుష♦వికటోక్తుల న
ద్దనుజాధిపునకు ననియెం, గనఁగాఁ బ్రతికూల మైన♦గతి నీగతిగన్. ౬౪౨
సీ. పుత్రభృత్యామాత్య♦మిత్రాన్వితంబుగాఁ, జేటు గూర్చెడి యిట్టి♦చెనఁటిపనిని
రావణా! యేపాపి♦రా నీకు బోధించె, సుఖముగా నీ వుంట ♦ చూడలేక
యేకుచ్ఛితుఁడొ నీకు♦మృత్యువక్త్రముఁ జూపెఁ, బడుపొమ్మటంచు ను♦పాయమునను
బలహీను లగుభవ♦త్పరిపంథు లిట్లీవు, బలవద్విరోధాన ♦ భంగపడఁగ
ఆ. దలఁపుఁ గూర్చినారు ♦ తెలియంగ లే వది, హితముఁ జెప్పునట్టి♦హీనుఁ డెవఁడొ
నీదుకూళసేత ♦ నీవ నశింపఁగఁ, గోరుచున్నవాఁడు ♦ కుటిలబుద్ధి. ౬౪౩
శా. లేరా నీకు నమాత్యవర్యు? లిటు తె♦ల్విం బాసి వర్తించు నిన్
గారా దంచు వచింపరా? హితముఁ బ♦ల్కం జూడరేన్ వారలే
లా రక్షోధిప? భూమి నింకఁ గల రే ♦ ప్రాణాన? దుర్మార్గసం
చారున్ భూపతి దిద్దనట్టిసచివుల్ ♦ చాకున్నఁ గీడౌఁ దుదిన్. ౬౪

కం. జనపతి ప్రసన్నుఁ డైనను, మొనయును ధర్మార్థకామములు సచివులకున్
వినుము విపర్యయమునఁ బ్రజ, వనటం బడు మంత్రుల కవి వ్యర్థంబు లగున్.

తే. రాజమూలంబు విజయధర్మంబు లగుట, రక్షితవ్యుండు సర్వదా రాజవరుఁడు
క్రూరుఁడవినీతుఁడును బ్రతికూలుఁ డైన,నృపతియెట్టులురాజ్యంబునేలఁగలఁడు.

కం. క్రూరులు ప్రధాను లైనను, భూరమణునితోడఁ గూలిపోదురు తారున్
సారథి మందుం డైనను, వారువములు వానితోడఁ బడు గుంతలలోన్. ౬౪౭

ఉ. పెక్కురుసాధువుల్ జగతిఁ బెద్దయు ధర్మరతాత్ము లయ్యునున్
దక్కటివారిదోషమునఁ దారు నశింతురు బంధుయుక్తు లై
నిక్కన భూవిరుద్ధమతి నిష్ఠురుఁ డై పతి రాజ్య మేలినన్
నక్కలు గాచుమేఁక లన నాశముఁ బొందెదువారు లోకులున్. ౬౪౮

ఉ. నాయెడ నాకుఁ గాఁగ వ్యసనంబు జనింపదు నమ్ము కాకతా
లీయముగాఁగ వచ్చినబలిష్ఠపుఁ జేటున, కీవు మూర్ఖతన్
న్యాయముఁ దప్పి యింద్రియజయంబు గణింపక దుర్మనీష న
త్యాయతసేనతోఁ జెడెద వంచుఁ దపించెదఁ దృప్తిమిత్తమై. ౬౪౯

కం. ననుఁ జంపి రామచంద్రుఁడు, నిను వెంటనె చంపుఁ జుమ్ము నిక్కము నీశ
త్రునిచేఁ దునుమంబడి యో,దనుజకులాధీశ నేను ధన్యుఁడ నగుదున్. ౬౫౦

ఉ. ఆరఘురాముకంటఁ బడి సప్పుడె చచ్చినవాఁడ నేను, నీ
వారమునీకి మారించి హతుఁ డయ్యెదు నమ్మును బాంధవాళితో,
వారిజనేత్ర నెత్తికొని వచ్చితి వేనియు నీ వ దేడ నీ
యూ రది యేడ రాక్షసకులోత్తము లెక్కడ నే న దెక్కడన్. ౬౫౧

వసంతతిలక. నీమేలు గోరి యిటు నేను హితంబుఁ బల్కన్
నామాట నీ వెద సనాదృతిఁ జేసె దయ్యో
యే మందు రావణ సుహృజ్జనపథ్యవాక్యం
బేమాడ్కి మృత్యుపగతుఁ డేర్పడ నాలకించున్. ౬౫౨

చం. అని యసురేశ్వరుం గని భయంబునఁ బోదము లెమ్ము రావణా
ధనురసిబాణపాణి వసుధాతనయాపతి మద్వధోద్యమున్
గనుఁగొన నిట్టనిల్చిన దిగాలునఁ జావఁ గలాఁడ, రామచం
ద్రుని ననిఁ దాఁకియుం బసులతో మరలం గలవాఁడుఁ గల్గునే. ౬౫౩

తే. దండధరదండమున నిహతుండ వైన, నీకు నాకును సరిపోయె నేస్త మిచటఁ
జేటుకాలంబునకుఁ దగు చెనఁటిబుద్ధిఁ, జేసి చెడిపోవుని న్నేమి చేఁయుదమ్మ.

తే. నాయనా యిదె పోవుచు♦న్నాఁడ నీకు, స్వస్తి యగుఁగాత మనినను ♦ సంప్రహృష్ట
చిత్తుఁ డై పల్కు రాక్షస ♦ శేఖరుండు, దనదు కౌఁగిటఁ జేర్చి యా♦తనిని దమిని.
శా. సైరా యిట్టులు మాటలాడ వలదా ♦ శౌండీర్యయుక్తంబుగా
నారం జూచిన మద్వచస్సరణిగా♦హా యిప్పు డై తీవు పో
మారీచుండవు పూర్వ మెన్నఁడవొ, మా♦మారీచుఁ డట్లాడునే,
యారోహింపుము రత్నభూషితమదీ♦యస్యందనంబున్ వెసన్. ౬౫౬

↔ రావణమారీచులు పంచవటికిఁ బ్రయాణ మగుట. ↔

ఉ. వచ్చెద నేను దోస, యట ♦ వచ్చి ధరాసుత మోసగించి నీ
యిచ్చను బొమ్ము, నేనును మ♦హీసుత యొంటిగ నుండ బల్మిమైఁ
జెచ్చెర సంగ్రహించికొని ♦ చేరెద లంక, నటంచుఁ దద్రథం
బచ్చలపాది యెక్కి చనె ♦ నాశ్రమమండలి దాఁటి చయ్యనన్. ౬౫౭
చం. చని చని రాక్షసేశ్వరుఁడు ♦ శైలసరిద్వనభూరిరాష్ట్రప
త్తనగరంబులం గడచి ♦ దండకలో రఘురాము నాశ్రమం
బును గని తేరు డిగ్గి కర♦ముం దన కేలఁ గదించి మిత్రుతో
ననియె నరంటిచెట్లు గల♦యద్దియె రామునివాస మోసఖా. ౬౫౮

↔ మారీచుఁడు మాయామృగం బగుట. ↔

సీ. మనము వచ్చినయట్టి♦పనిని గావిమ్మన, ననఘమణీద్ధశృం♦గాగ్రములును
దెలుపు నల్పును గల♦లలితముఖంబును, గెందమ్మికల్వడా ♦ లంద మైన
యాస్యంబు నింద్రనీ♦లాభశ్రవణములు, కించిదభ్యున్నత♦గ్రీవ మొనరి
నీలదళాధరం ♦ బోలిఁ గుందేందువజ్రాభదంతంబు ♦ నబ్జకేస
తే. రములఁ బోలెడివీఁపు పా♦ర్శ్వము మధూక
కాంతి వైడూర్యనిభఖుర♦గణము సుతను
జంఘలును గల్గి వాసవ♦చాపతుల్య
మూర్ధ్వపుచ్ఛంబు మెఱుఁగుల♦మొప్పు గలిగి ౬౫౯
కం. నిమిషంబున మారీచుఁడు, రమణీయం బైనహరిణ♦రాజం బగుచున్
గ్రమముగఁ దిరుగుచు రామా,శ్రమమున్ వెలిఁగించె నాయ♦రణ్యమునందున్.
ఉ. జానకి బేలుపుచ్చ దను♦జప్రవరుం డట లేఁజిగుళ్లలన్
మానుగఁ ద్రుంచు, లేఁగసవు♦సం జరియించు, గ్రసించు, వెంకి రం
భానవగేహకంబుల స♦మందగతిన్ విహరించుఁ, దన్ను స
జ్జానస చూడఁగల్గుతెల♦మందు యథామతి సంచరించెడున్. ౬౬౦
కం. పఱచున్ దవ్వగఁ బచ్చికఁ, గఱచున్ మృగయూథములను ♦ గలయున్ ధ్వనికిన్
వెఱచుం జను మరలున్ వా, తెఱచుం బన్నుంచు కొన్ని♦తెరువుల యందున్.

కం. ఆశ్రమముఁ జేర వచ్చుచు, మైశ్రమము హరించునట్లు ♦ మహిఁ బచ్చికపై
విశ్రమ మొనరఁ బరుండు గ,తశ్రమ మైనట్లు లేచి ♦ తటుకునఁ బోవున్. ౧౧౩
కం. పలురంగుల మెయిబిందులు, తళుకొత్త చివాలటంచు ♦ దాఁటుచు దోఁటుచు
నిలుచుం దరలుచు మరలుం, దొలఁగుచు మలఁగుచు హారంగు ♦ దోరము గాఁగన్.
ఉ. మండలనుండి వచ్చు నవ♦మండలచిత్రగతిం జరించు నా
సుందరి చూడ నిట్టటులు ♦ చూచును నిట్లు చరింపఁ గానసం
బందలియన్యజంతుచయ ♦ మాదట డాసియు మూరుకొంచు వే
చిందఱవందరై భయము♦చేఁ బఱచుచు దశదిక్తటంబులన్. ౧౧౫
కం. మృగవధరతుఁ డయ్యును నా,మృగలోచన మోసగింప ♦ స్పృశియించును ద
న్మృగముల మఱుఁ గిడుచును నై,జగుణముఁ దత్కాలమంద ♦ జానకి నెమ్మిన్.

←→ జానకి మాయామృగంబును జూచుట. ←→

కం. కుసుమాపచయక్రీడా,లసమాన యశోకచూత♦లాలితసుమనో
విసరంబులఁ గోయుచు నా,యసమానమృగంబుఁ గాంచి ♦ యబ్బుర పోయెన్.
తే. హారిదంతోష్ఠి విస్మయ♦హాసితనేత్ర
స్నేహపూర్వంబుగాఁ జూచెఁ ♦ జిత్రమృగము
మదిరలోచన తనుఁ జూచి ♦ మునము గొనెడి
కొలఁది నదియును వింతవే♦డ్కల నొనర్చు. ౧౧౮
తే. పసిఁడి వెండిజిగుల్ మీఱు♦ప్రక్క లమరఁ, గాన వెలిఁగించుచిత్రమృ♦గంబుఁ గాంచి
రండు రం డని సతి పిల్చెఁ ♦ బ్రాణనాథు, సంభృతాయుధు లక్ష్మణు ♦ సత్వరముగ,
శా. చేర న్వచ్చి సుమిత్రపట్టి కని యా♦జింకం గడుచు శంకచే
శ్రీరాముం గని యిట్లు వాకొనియె, మా♦రీచాసురుం డేతదా
కారం బూని మునీశపాళి మృగయా♦కాంక్షాగతోర్వీశులచు
క్రూరుం డై వధియించు నీయడవిఁ గా♦కుత్స్థాన్వయగ్రామణీ. ౧౨౦
కం. మాయావి యల్లయసురుఁడె, మాయామృగరూప మెత్తి ♦ మలయును గంధ
ర్వాయతపురి యట్టిది యీ, కాయము నిక్కంబు గాదు ♦ కంజదళాక్షా. ౧౨౧

←→ సీత మాయామృగంబును బట్టి తెమ్మని కోరుట. ←→

ఉ. కంటిమె వింటిమే కనక♦కాంతిమణీమయ మామృగంబు, నా
కంటికిఁ జూడ మాయ యనఁ♦గా, శుచిహాసిని భర్తఁ జేరి వా
ల్గంటి మఱంది నాఁగి నిజ♦కాంతునితో మృగచర్మమందు వో
వంటినమక్కువం బలికెఁ ♦ బ్రాణధవా! విను మాస గొల్పెడిన్. ౧౨౨

ఉ. దాని మహాభుజా! లఘువి♦ధంబునఁ జట్టుము, కేళి కౌను, నీ
కాననమందుఁ జూడమె మృ♦గంబుల భల్లుకకిన్నరాళులన్
వానరచామరంబులను ♦ వానికి నీయశోభగల్గెనే?
కానము దీనితుల్య మగు♦కాంతమృగంబు నిజంబు వల్లభా. ౬౨౩

ఉ. జింకలు లేవె లోకమునఁ ♦ జిత్రమృగంబుల నెన్ని చూడ, మీ
పొంకపువన్నెయుం జనవు♦పోణిఁ గంటిమె దేనియందు? న
ల్వంకల మేనికాంతులు ద♦ళంబుగఁ జల్లుచుఁ గానలోన నే
ణాంకునిఁబోలి యున్నది ప్రి♦యా! దయ దానిని బట్టి తేఁగదే. ౬౨౪

తే. ఔర రూపంబు బళిబళీ ♦ యరరె లక్ష్మి, స్వరముసంపద బళిర ప్ర♦శస్త మనఘ
మద్భుతం బైనయీలేడి ♦ ప్రాణనాథ, లాగుచున్నది నామది ♦ బాగుగాను.

ఉ. జీవముతోడఁ బట్టుపడఁ ♦ జిత్రము గల్గున దీనికంటె నొం
డావలఁ, గాననస్థితి స♦మాప్తము చెందఁ బురంబుఁ జేర మో
దావహభూషణం బగును ♦ నంతిపురంబు నలంకరింపదే
భావన చేసి చూడుము నృ♦పాలశిరోమణి! మద్వచస్థితుల్. ౬౨౬

కం. భరతునకున్ మీకును నా, కరయుము మాయత్తలకును ♦ వ్యక్తంబుగ నీ
హరిణము విస్మయజనకము, పురుషోత్తమ దీనిభంగి ♦ బుద్ధిం గనుమీ. ౬౨౭

తే. ప్రాణములతోడ నియ్యది ♦ పట్టుపడక, పోయినను దీనిచర్మ మ♦మేయముదముఁ
గూర్చుఁ బచ్చికబ్బసిమీఁదఁ ♦ బఱచి దీనిఁ, గోర్కె చేసెద నీతోడఁ ♦ గూరుచుండ.

చం. అది యిది లేదు గావలయు ♦ నంచుఁ బతిన్ వ్యథపెట్టు టెంతయున్
సుదతికిఁ గ్రూరమైనపని ♦ సుమ్ము, మదాశయ మిద్ది, యైన ని
య్యది తనమేనికాంతిఁ గను♦నచ్చెరువున్ ఘటియించె నా కనన్
విదితపరాక్రముండ మృగ♦విస్మయకారణవర్ణశృంగముల్ ౬౨౯

కం. కాంచనరోమంబులు ర,త్నాంచితశృంగములు నీర♦జాప్తప్రభయున్
మించిననక్షత్రంబుల,సంచును వెర గొల్పు మిగుల ♦ సమ్మదపరుఁ డై. ౬౩౦

శ్రీరాముఁడు లక్ష్మణునకు సమాధానముఁ జెప్పుట.

కం. సీతావాక్యము విని మృగ, రీతిం గని యాసపడుచు ♦ శ్రీరఘుపతి భూ
జాతాప్రచోదితుం డై, భ్రాతం గని యిట్టు లనియెఁ ♦ బరమముదమునన్. ౬౩౧

ఉ. కంటివె లక్ష్మణా! ధరణి♦కన్యకకుం గలజింకయాశ, మ
న్గంటిమె యిట్టిరూపమును ♦ గల్గుమృగం, బిఁకఁ గల్గ నేర్చు నే,
వింటిమె నందనంబునఁ గు♦బేరవనంబున నైన నుంట, మి
న్నంటెను దేజ హాటకన♦మంచితబిందుకబృందరమ్య మై. ౬౩౨

తే. రోమములు ప్రతిలోమాను◆లోమములను
గొనబు మీఱెడి నావలిం◆చినను వెఱ్ఱి
మేఘమున నుండి వెల్వడు◆మెఱుఁగువోలె
నగ్నిశిఖవోలు నాలుక ◆ యాననమున. ౬౮౩

తే. ఇంద్రనీలసమం బయి ◆ యెసఁగు మోము, శంఖముక్తానిభం బగు ◆ జఠరసీమ
మేలిసౌందర్యములదీవి ◆ మృగముఁ దీవి, యెవ్వనిమానసమును హరి◆యింప లేదొ.

కం. నానారత్నమయము జాం,బూనదశుభవర్ణకలిత◆ముఁ గా రూపంబుం
బూనుగఁ గనఁ గరఁగదె యే,మానసమును గాల సీత◆మా కేమిటికిన్. ౬౮౫

సీ. ఆమిషార్థము విహా◆రార్థంబు మృగముల, ధానుష్కులైనట్టి◆ధరణిపతులు
మృగయాభిరతిఁ దున్ను◆పృథ్వీశలేంద్రులు, ధాతువుల్మణిహేమ◆ధననిచయము
లాఖేటమునఁ గాదె ◆ యార్జింత్రు శుక్రసం,కల్పకల్పితవస్తు◆కాండము లన
వసుధేశ్వరునకు స◆ర్వంబును వనమునఁ, గలిగిన దే కదా ◆ లలితచరిత

తే. యర్థకాముకు లెట్టిప◆దార్థమందు, నాసచేతను వనచారు ◆ లగుచు దాని
సంగ్రహించెదరో యట్టి ◆ శాస్త్రవేత్త, లైనవిబుధులు దాని నే ◆ యర్థ్యమండ్రు.

కం. ఈమృగపతి కాంచనమయ, మామహితజనమునందు . సవనీసుతయుఁ గా
దా మేలుపడి యె నాతో, సౌమిత్రీ! కూరుచుండ ◆ సమ్మదమారన్. ౬౮౭

కం. మృదులతఁ బ్రసిద్ధిగాంచిన, కదళీప్రియకప్రవేణి◆కాచర్మములుం
విదిత మగు మేషచర్మము, మదిఁ జూడుము దీనితోఁ స◆మానం బగు నే. ౬౮౮

కం. ధారిణి యీమృగరత్నము, తారాపథమందు వెలుఁగు◆దైవతహరిణం
బీరెండు నాకుఁ జూడం,గా రమణీయములు దక్కు ◆ గావు నిజముగన్. ౬౮౯

{ శ్రీరాముఁడు లక్ష్మణుతోఁ మారీచుమాయ యేని మాయామృగం బవశ్యవధ్యం బని చెప్పుట. }

ఉ. నీవు వచించినట్టు రజ◆నీచరమాయయ యేని దీని దు
ర్భావ మడంగఁ జంపుటయె ◆ భవ్యము చూ, యిటు తొట కేయుఁడే
కావలుఁ డై మునీశ్వరజ◆ఘాంసువు నై చరియించుచుం గృపా
లావళి రాఁగ వేఁటలకు ◆ నట్టె నధించును వారి వంచనన్. ౬౯౦

ఉ. ఏపున దీనిఁ జంపుటయె ◆ యెంతయుఁ గార్యము పూర్వ మిందు వా
తాపి యనంగ రక్కసుఁడు ◆ తాపసగర్భములందుఁ జొచ్చి యా
లోపలనుండి తేలువలె ◆ లూనతదీయపిచిండుఁడౌచు హీం
సాపరుఁ డై చరించు చవ◆సానమునం దొకనాఁ డగస్త్యుచేన్. ౬౯౧

కం. భక్షింపంబడి యాతఁడు, కుక్షి వెడలి ళేవ నున్నఁ ♦ గుంభభవుం డా
రాక్షసునకు ననియెన్ హ్రాద, యక్షోభముగాఁగ నగుచు ♦ నమరవిరోధీ! ౧౯౨

తే. సరకు సేయక బ్రాహ్మణ ♦ సంతతులను, నీదు తేజంబునను జంపి ♦ నిష్ఠురతను
బాపచరితుండవైతి వి ♦ ప్పాట నీవు, జీర్ణమై పొమ్ము నాగర్భ ♦ సీమ ననియె. ౧౯౩

కం. ఈతండును జూడఁగ నా, వాతాపిని బోలఁడా య ♦ వశ్యము ఘటసం
జాతునిచే నతఁ డీల్గిన, భాతిని నాచే నితండు ♦ పైపడి చచ్చున్. ౧౯౪

కం. సన్నాహంబున జానకిఁ, బన్నుగ రక్షింపు మీవు ♦ పదిలంబుగ నీ
కన్నియుఁ జెప్ప నున్నవి మన, యున్ని ప్రయత్నములు కావు ♦ మా సతి శ్రద్ధన్. ౧౯౫

కం. ఈమృగమును వధియింపఁగ,నో మెలఁపునఁ బట్టుకొనఁగ ♦ నో నేఁ బోదున్
సౌమిత్రి! కంటె జానకి, యామృగచర్మంబుఁ జూచు ♦ వ్యామోహంబున్. ౧౯౬

ఉ. కావున నొక్కశాతతర ♦ కాండమునన్ హరిణంబుఁ ద్రుంచి నే
నావరచర్మముం గొని ర ♦ యంబున వచ్చెద, నంతదాఁక నీ
తావరవర్ణినిన్ మిగులఁ ♦ దత్పరతం గడు నప్రమాద మే
ధావిభవంబు మీఱఁగ స ♦ దా పరిరక్ష యొనర్పు తమ్ముఁడా. ౧౯౭

మత్తకోకిలము. దక్షుఁడున్ దృఢసత్త్వుఁడున్ మతి ♦ ధైర్యయుక్తుఁడు లక్ష్మణా!
పక్షిరాజు జటాయు వియ్యెడ ♦ బాసటై చరియింపఁగా
రక్షణంబు ఘటింపుమీ యుడు ♦ రాజబింబసమాస్యకున్
దీక్షఁ బూని ప్రమాద మేది ప్ర ♦ తిక్షణంబును శంకివై. ౧౯౮

శ్రీరాముఁడు మాయమృగము వెంటఁ బోవుట.

కం. అని ముల్లంపుఁలవిలుఁ గొని, కనకత్సరుఖడ్గరత్నముఁ ♦ గసదొనలును న
మ్మునుకులుఁడు కట్టుకొని వెసఁ, జనె మాయామృగముఁ బట్టు, సంరంభమునన్. ౧౯౯

ఉ. వింటిని గేలఁ బూని వెను ♦ వెంటను వచ్చెడురాముఁ జూచి లోఁ
దంటమలాడ గుండెలు త ♦ టాలునఁ గన్పడ కేగి వెండియున్
గంటికిఁ దోఁప దూరముగఁ ♦ గాంచి రఘూత్తముఁ డుగ్రవేగుఁడై
వెంట నె కూడఁ బాఱ నది ♦ వృక్షచయంబుల డాఁగుఁ దోఁచెడున్. ౨౦౦

సీ. చేపడె నిదె యని ♦ వే పట్టఁ బోయినఁ, జెంగున మెలపునఁ ♦ జౌకళించు
గడుదవ్వు చనె నిది ♦ గడు నంచు నిలిచినఁ, దారసంబున నటఁ ♦ దారు చుండుఁ
బరువువాఱుచు దీనిఁ ♦ బట్టెద నని పాఱఁ, బొదలలోపలఁ దూఱి ♦ యొదిఁగియుండుఁ
జిక్కెఁ బో యిది యని ♦ చే చాఁపఁ బోవఁ జివ్వుక్కున నొక్కవైపు ♦ చిక్కకుఱుకుఁ

తే. దోఁచుఁ దోఁపకుండు ♦ దూరంబుచను డాయు, నెదురు వచ్చు మిగుల ♦ బెదరి చూచు
మాఱుమొగము పెట్టు ♦ మాటిమాటికి రాదు, లేఁతగసవు మేయు ♦ నీలఁ గెరుగు.

మాలి. కనఁగనఁ గనఁగనఁ గాంతుల్ ♦ గ్రక్కుచున్ నిల్చు ధన్విన్
గనుచుఁ గనుచుఁ బాఱు ♦ న్దవ్వుగాఁ జిక్కకుండన్
మునుఁగు వెఱను బాణం♦బుం గనున్ మింట నాడన్
వనుల దరుల డాఁగున్ ♦ వంచనన్ గాసి ప్రాఁగున్. ౨౦౨

సీ. వెఱచెఁ బో యని విల్లు♦మఱుఁ గిడి డాయంగఁ, దిన్నతిన్నగ ముసు♦మున్నుబోవుఁ
జంపెదఁ గా కంచుఁ ♦ జాపంబుఁ దీసిన, బెదరినభంగిఁ గు♦ప్పించి మొగయుఁ
దనవెంట వచ్చెడు♦జననాథుఁ జూడని,యట్టులై పచ్చిక ♦ నాడుచుండు
రద్దు సేయక పొంచు♦రాములీలాగతి, నోరచూపులఁ జూచు ♦ నొంటికంట

ఆ. మఱుఁగుఁ జేరు బయల ♦ మెఱయును మబ్బుల,నడిమిచందురుండు ♦ నాఁగ నిట్లు
కాస వచ్చి కొంత ♦ కానరాక యొకింత, నేఁగెఁ దీసికొనుచు ♦ నెం...దవ్వు ౨౦౩

సీ. ఒకమాఱు పొదలలో ♦ నొదిగి నట్టులె యుండు, నంచునఁ జేరద ♦ న్వెరిగి యుండు
నొకసారి నేలపై ♦ నొయ్యనఁ బన్నుండుఁ, జే సాఁచునంతలోఁ ♦ జిక్కకుండు
నొకతూరి నాయాస♦వికలత నిలుచుండు, బడలె నం చేఁగఁ గ♦న్పడక యుండు
నొకసారి వింతవే♦డుకల నాడుచు నుండుఁ, బట్టఁ జూచినయంతఁ ♦ బాఱుచుండు

ఆ. వికటహరిణ మిట్లు ♦ గికురించి వంచించి, యటమటించి మిగులఁ ♦ దటమటించి
మోసగించి మాయ♦ముంచి తా బేలించి, తచ్చనలను రాము ♦ దవ్వులాగె. ౨౦౪

కం. అంత రుషావివశత సం,భ్రాంతుం డయి రామవిభుఁడు ♦ బడలిక నిలిచెన్
భ్రాంతమహావృక్షచ్ఛా,యాంతరమున శాద్వలమున ♦ నంతట నదియున్ ౨౦౫

కం. జింకలమందలలోపలఁ, బొంకంబుగఁ గూడి మాడి ♦ పొదలుచుఁ దోఁచెన్
సంకటతలమున రాముఁడు, బింకంబునఁ బట్టఁ బోవఁ ♦ బెల్కుఱి యుఱికెన్.

ఉ. వెండియు వృక్షషండపద♦వీగతమై కనఁబడ్డ రామచం
ద్రుండు నితాంతరోషమునఁ ♦ ద్రుంచెద దీని నటంచుఁ బూని మా
ర్తండరుచిప్రచండభయ♦దద్రుహిణప్రవినిర్మితాస్త్రము
ద్దండత నారిఁ గూర్చి మృగ♦దానవునిన్ గుఱి చూచి వైచినన్. ౨౦౬

**శ్రీరామునిబాణముచే మారీచుఁడు హాలక్ష్మణా యని యఱచి చచ్చుట.**

శా. ఆనారాచము తాటకాతనయుమా♦యాదేహముం దూఱి వే
గానన్ వానిద యాహృదిం బగుల ఘ♦ట్కారంబుతోఁ జీల్పఁగా
నానాకీశవిరోధి తాటిపొడ వా♦యస్త్రాహతి న్నిట్టిపా
టై నేలం బడె భైరవారవముతో ♦ నల్పాయు వీరీతిగన్ ౨౦౭

చం. మరణముఁ గూరుచుం దనదు♦మాయశరీరము వీడి యెట్టు లా
ధరణితనూజ లక్ష్మణుని ♦ దవ్వుగఁ బంపును, రావణుండు నే

కరణి హరింపఁ గల్గు నల♦కంజదళాక్షి నటంచు యోజనా
పరుఁ డయి యశ్వ్మభంగి రఘు♦వర్యు నెలుంగునుబోలు నెల్గునన్. ౨౦౯

కం. హాసీత లక్ష్మణా యని, మాసరరవ మార నఱచి ♦ మనుజాదుఁడు నై
జాసురరూపముతోడ నిజాసువుఁబాఱ విడిచి యవని ♦ నాక్షణమ పడెన్. ౨౧౦

తే. హేమమాలి మహాదంష్ట్రు ♦ హేమభూషుఁ, జిత్ర కేయూరమండితు ♦ శితకలంబ
నిహతు రాక్షసరూపు ని♦ర్భిద్రభయద, వేషు రక్తాంగు క్షితితల♦నేష్టమాను ౨౧౧

మ. కని సౌమిత్రి వచించినట్టి యలవా♦క్యంబుల్ మదిం దోఁపఁగా
జనకాపత్యముపై మనం బరుగఁ గౌ♦సల్యాత్మజుం డాత్మలో
ననుజుం డియ్యది తాటకాతనయుమా♦యల్ పో యటం చెంచె మ
త్తనిశాతాస్త్రనిహన్యమానుఁ డితఁ డా♦దోషాటనాథుండె యౌ. ౨౧౨

కం. హాసీతా లక్ష్మణ యని, యాసురనాథుండు బిగ్గ ♦ నఱచుచుఁ జచ్చెన్
భూసుతయును సౌమిత్రియు, నేసందమువార లైరొ ♦ యెలుఁగుఁ విన్నటన్.

కం. అని భీతి మేనఁ బులకలు, జనియింపఁగ నొండుమృగముఁ ♦ జంపినమాంసం
బును గొని యాశ్రమభూమికిఁ, జను చుండెను రాముఁ డెంతొ ♦ సత్వరుఁ డగుచున్.

సీత లక్ష్మణుని రామునకు సహాయుండుగఁ బొమ్మనుట.

ఉ. అక్కడ భర్తృకంఠసదృ♦శార్తరవంబును నాలకించి య
మ్మక్క! యిదేమి లక్ష్మణ! ర♦యంబునఁ బర్విడు రాముఁ జూడ నా
కక్కట గుండె ఝల్లు మనెఁ ♦ బ్రాణము తత్తఱలాడఁ జొచ్చెఁ దా
నెక్కటి యెందుఁ జిక్కెనొ మ♦తేమి ఘటిల్లెనొ యేమి సేయుదున్. ౨౧౫

చం. అఱచుచు నున్నవాఁడు భవ♦దగ్రజుఁ డాతనిఁ గావఁ బోఁగదే
బిఱబిఱ, నాదుతమ్ముఁ డతి♦వీరుఁడు బాసట యౌ నటంచు నె
త్తెఱఁగున నాసలం గొనెనొ ♦ ధీరుఁడు రాక్షసకోటి ముట్టఁ బె
ల్కుఱి హరిసంచయావృతము ♦ కోడెవిధంబున నుమ్మలింపఁడే. ౨౧౬

కం. అని చెప్ప లక్ష్మణుండును, దనయగ్రజుశాసనంబుఁ ♦ దలఁచి చనక ని
ల్చినఁ గని కుపితాత్మిక యై, జనకతనూజాత యిట్లు ♦ సౌమిత్రి కనున్. ౨౧౭

సీత లక్ష్మణునిఁ గోపించి పలుకుట.

శా. సౌమిత్రీ! భవదగ్రజాతునకుఁ గ♦ష్టం బైన యీకాలమం
దేమాత్రంబును నీవు దోడ్పడఁగ నూ♦హింపంగనుఁ లేమి సౌ
రా మిత్రాకృతి సంచరించెడిమహా♦ప్రత్యర్థి వం చెంతు దు
ష్కామీ! రాముఁడు నీకు నేచెడుగులం ♦ గావించె నో సంచకా. ౨౧౮

చం. ఎటువంటి గతి లెమ్ము నీ తెఱంగు ♦ లెల్లను లక్ష్మణ! రామచంద్రుచేఁ
గలుగ యభిలాష చేసెదవు ♦ కల్మషచిత్తుఁడ! నానిమిత్త మా
మొఱ చెవులారఁగా వినియు ♦ మోహము మై నడు గత్తి పెట్టకి
ట్లుఱక తిరుండ వైతి, విటు ♦ లోర్వ్వమెయిన్ సుజనుండు నిల్చునే! ౨౧౯
ఉ. అన్నకుఁ జేటు గూరుట ప్రి♦యం బగు నీ కెవ స్నేహ మన్నపై
నున్న నిజంబు నీవు వనిఁ ♦ జొచ్చుట ముఖ్యము రాముకై కదా
యన్నిరఘూత్తముప్రాణమున ♦ కాపద వచ్చిన వేళ నేమిగా
న న్నిటఁ గాచి యుండెదు మ♦నంబున జంకవ యెంత చెప్పినన్. ౨౨౦
కం. భీతహరిణాక్షి యీగతి, భీతహరిణిచందమునను ♦ బెగ్గిలి బాష్ప
వ్రాతములు దొరఁగఁ బలికిన, క్ష్మాతనయామణిని గాంచి ♦ సౌమిత్రి యనున్.

లక్ష్మణుఁడు సీతకు సమాధానముఁ జెప్పుట.

చం. వదినె! యి కేటి కన్న భయ♦పాటునఁ గుందెదు, నీమనోహరున్
త్రిదశమనుష్యయక్షఫణి♦దేవవిరోధిపిశాచనాయకుల్
కదనమునందుఁ దాఁకియు ము♦ఖాముఖి నిల్వఁ గలారె? వారికిన్
బ్రదుకులు దీపుగావె? మఱి ♦ ప్రాణము లంతటిచేఁదె యేరికిన్? ౨౨౨
చం. ఇటు తగు నన్ను నీకు వచి♦యింపఁగ, రాముఁ డవధ్యుఁ డెందు, నె
క్కటి నిను వీడి నాకుఁ జనఁ ♦ గా లెటు లాడెడి, ముజ్జగంబు లొ
క్కటఁ బయి నెత్తెనేని సస♦గప్రతిబంధమహద్గణంబునేన్
దిటముగ రాముఁ డాశుగ త♦తిం బరిమార్చును దీర్చు నందఱన్. ౨౨౩
కం. నమ్ముము నామాటను మది, నిష్ఠురముం గనుము దేవి ♦ నీనాథుఁడు శీ
ఘ్రమ్మున మృగముం జంపి సు,ఖమ్ముగ నిట వచ్చు నేల ♦ కళవళపడఁగన్. ౨౨౪
కం. రామునిస్వరంబు గా దది, యేనూ మాయయొ రవంబు ♦ నెసఁగించెఁ జుమీ
యే మన గంధర్వనగర, మా మాయ్కిని కలుగఁ జేసె ♦ నాయసురుం డే. ౨౨౫
ఉ. ఇల్లడపెట్టి పోయె నిను ♦ నియ్యెడ రాఘవుఁ, డస్మహాత్ముప
ల్కెల్లను బొల్లు చేసి యెటు ♦ లేగుదు, వైరము పూని యున్నవా
రల్లఖరుండు చచ్చినది♦యాదిగ రాక్షసు లెల్ల, వారలే
కల్లరవంబు నించెదరు ♦ ఘాతుకులై సతి యేల చింతిలన్. ౨౨౬

సీత లక్ష్మణుని నిష్ఠురంబులు పల్కుట.

కం. అని సౌమిత్రి వచించిన, జనకతనూజాత కోప♦సంరక్తవిలో
చనయై పరుసనివాక్యంబు, లనియెన్ ఋజువాది యైన ♦ యాలక్ష్మణునిన్, ౨౨౭

ఉ. ఓరి దయావిహీన విన ♦ రోరి నృశంస యనార్య పంచకా
యోరి సువంశపాంసన గు♦ణోన్నతుఁ డౌ రఘురాముచేతు నీ
కారయ సమ్మతం బిది య♦థార్థము సు మ్మటు కానిచోటఁ గ
న్నారఁగఁ గీడు గాంచి యటు ♦ లాడెదవా చెడుగా దిటంబుగన్. ౨౨౮

కం. కా దిట్టిది చిత్రము దా,యాదులు ప్రచ్ఛన్న వేషు ♦ లై నిత్యంబుల్
లో దయ మాలుచు నీవలె, నోదుర్మతి కీడు సేయ ♦ నులుకరు వింటే. ౨౨౯

శా. నీవే వచ్చితొ కైకయీతనయుఁడే ♦ నిన్నంపెనో కాని మా
యావేషం బిటు లూని నాకొఱకె దు♦ష్టా! యొంటిమై నొంటివాఁ
డౌ వాత్సల్యపయోధి రాముబడి ఘో♦రారణ్యముల్ సొచ్చి దు
ర్భావా వచ్చితి నీవుదోడ్పడఁగ స♦ద్భావంబునన్ వచ్చితే. ౨౩౦

కం. నీకోరిక యో మఱి యా, కైకేయీతనయుతలఁపొ ♦ కడఁ గనుసటరా
యాకమలాక్షునిభార్యను, గైకొందు నె యొందువానిఁ ♦ గలలో నైనన్. ౨౩౧

కం. రాముండు లేకయుండిన, నీమేనన్ నిలుపుదాన♦నే ప్రాణంబుల్
సౌమిత్రి! నీవ చూడఁగ, నే మరణించెదను గనుము ♦ యీనిమిషమునన్. ౨౩౨

లక్ష్మణుఁడు సీతపైఁ గోపించి రామునొద్దకుఁ బోవుట.

చం. అని వినరానివాక్కు లిటు ♦ లాడిన జానకిఁ జూచి మేనియం
దొవర గగుర్పు రోఁజ కర♦యుగ్మము మోడ్చి జితేంద్రియుండు ప
ల్కెను బదులాడఁగా మనసు ♦ లే దిఁక,దైవత మీవు నాకు, ని
ట్లనుచితనిష్ఠురోక్తి జన♦కాత్మజ వింతలుగావు స్త్రీలకున్. ౨౩౩

చం. ఇది సహజంబు లోకమున ♦ నింతుల కెల్ల, విముక్తధర్మదు
ర్హృదయలు చంచలాత్మికలు ♦ నెంతయుఁ గ్రూరలు భేదకారిణుల్
ముదితలు, కొట్టు గాల్చి చెవి♦లోపలఁ గ్రుచ్చినయట్టు లయ్యెనో
మద వతి నీదుపల్కు రవ♦మాత్రమ యేని సహింప నేర్తు నే. ౨౩౪

ఆ. సాక్షిభూతు లగుచు ♦ సర్వవనేచరు, ల్వినెడివారు గాక ♦ విశదముగను
న్యాయవాది నగుచు ♦ న్యాయంబుఁ బలికిన, నన్ను నీ ♦ నిన చె♦నంటిపల్కు ౨౩౫

కం. ఛీ పో పాడుగ నీ విపు,డే పాపిష్ఠంబు స్త్రీత్వ ♦ మిల సహజముగాఁ
గోపన గురువాక్యస్థితు, నీపగిది న్నన్నుసంశ♦యించినకతనన్. ౨౩౬

కం. పోయెద రామునికడ కిపు,డే యబలా! నీకు స్వస్తి ♦ యొసఁగుత దేవీ
యీయటవిదేవతావళి, పాయక రక్షించుఁగాక ♦ పద్మాక్షి నినున్. ౨౩౭

కం. నాకు నిమిత్తము లెంతయు, భీకరమై తోఁచె రామ♦వీరునితోనే
నీకడకు వచ్చు వైదేహి! కందునొ కనఁగలేనొ ♦ యిచ్చట నిన్నున్. ౨౩౮

చం.అనుచు సుమిత్రపట్టి దను ♦ నాడిన జానకి బాష్పపూరముల్
కనుఁగవఁ గాఱ నేడ్చుచును ♦ గద్గదకఠోరముగాఁగఁ బల్కె నేఁ
డిదె విషంబు, గౌతమిని ♦ దీఱెద, నే నురిపోఁతఁ జత్తు, వ
హ్నిని బడుదానఁ, గాక పరు♦నిన్ స్పృశియింతునె కాలిప్రేలనేన్. ౨౩౯
కం.అని పల్కి బిగ్గ నేడ్చుచుఁ, దనయుదరము బాఁదుకొనుచుఁ ♦ దనహస్తములన్
జనకజ యుండిన లక్ష్మణుఁ, డనునయములు పల్కి మాట ♦ లాడదు సతియున్. ౨౪౦
కం.సౌమిత్రి యంతనించుక, కైమోడ్పున నతియొనర్చి ♦ కదలి పలుమఱున్
భూమిజఁ గనుచుం గుపితుఁడు, దా మది గొల్పకయుఁ బోయెఁ ♦ ద్వరఁ జని నట్టుల్.

→ రావణుఁడు యతివేషము ధరించుట. ←

సీ. అది సందుగాఁ గొని ♦ పదిశిరంబులపోఁకుఁ, డాసీత డాయంగ ♦ నరుగ నెంచి
సన్న్యాసివేషంబు ♦ సరగన ధరియించి,శ్లక్ష్ణకాషాయవ♦స్త్రంబుఁ గట్టి
వామభుజంబున ♦ వఱల యష్టి కమండ,లువులు ఛత్త్రముసిగ♦లును వహించి
పావలు దొడిగి య♦పద్మాక్షి సోవరు, ల్వెడిచి పోవఁగ రవి♦విధులు లేని
తే.సంధ్య నలమెడియిరు లన ♦ శశివిహీన, రోహిణిని డాయుగ్రహమనఁ ♦ గ్రూరబుద్ధిఁ
గదిసె నాతని రాకకు ♦ ద్రుమరుహములు, కదల వయ్యె సమీరంబు ♦ మెదల దయ్యె.
కం.వావిరి త్వరఁ బాఱెడిగో,దావరి మెల మెల్లనడిచెఁ ♦ దగ్గయు భీతిన్
రావణుఁ డభవ్యుఁడిటు స,ద్భావపుహూపముఁ దృణావృ♦తము కూప మనన్ ౨౪౩
ఉ. తాలిచి ప్రాణవల్లభుఁడు ♦ దవ్వగఁ బోవుటకై తపించున
బ్బాలను నూత్నచంద్రనిభ♦భాలను బాష్పశీతభాననన్
నీలసరోజలోచన వి♦నిర్మలపీతదుకూలఁ గాంచి దు
శ్శీలుఁడు కాలుసోఁవరుఁడు ♦ చిత్రను జేరెడిమాడ్కిఁ దోఁపఁగన్. ౨౪౪
ఆ. పద్మహీన యైన♦పద్మను బోలుచు మేనికాంతి దెసల ♦ మెఱుఁగువెట్ట
నాశ్రమాంతరమున ♦ నాసీన యైయున్న, యొంటిదానిఁ జంచ♦లోపమాంగి.

→ రావణుఁడు యతివేషంబున సీతయొద్దకు వచ్చుట. ←

కం.పంచశరశరావిష్టుఁడు, వంచనమెయి రావణుండు ♦ బ్రహ్మారవంబున్
నించుచుఁ జేరం జని యా,చంచలలోచనకు వినయ♦సంగతిఁ బలికెన్. ౨౪౬
కం.రమణీ పీతసువాసిని, రమణీయసువర్ణవర్ణ ♦ రాజనిభాస్య
కమలసుదామాలంకృత,...వినిపలెఁ వెలిఁగె దీవు ♦ కలికి యెవతెవే. ౨౪౭
కం.ధరణివో కీర్తివో వెన్నుని,తరుణివొ సైరంధరి పుష్ప♦ధన్వునిసతివో
హరిణీ సురవరమణివో యో,కరిణీగమనా వచింపు ♦ కలహంసంబున్. ౨౪౮

సీ. నీరదంబులు శుచి♦స్నిగ్ధముల్ సమములు, కుట్మలశిఖరులే♦ కుందరదన
నేత్రముల్ రక్తాంత♦నిర్మలదీర్ఘముల్, నీలతారములె వి♦శాలనయన
చారుపీనంబు విశా♦లంబు జఘనంబు, కరికరాకారముల్ ♦ కలికితొడలు
మిట్టలు వట్రువల్ ♦ మిగులసంహతములు, సంప్రవల్గితములే ♦ స్తనము లబల
తే. తాళఫలనిభములును గాం♦తములు పీన
రోర్ధ్వముఖములు స్నిగ్ధముల్ ♦ యువతి నీదు
విరివిచనుదోయి రత్నప్ర♦వేకభూష
ణాంచితమ్ము దివ్యతూష్యా♦ద్వంచకమ్ము. ౨౪౯

కం. చారుస్మిత చారుదతీ, చారువిలోచన విలాస♦సాగర సుకచా
హారిక రాంతమితవల,గ్నా రమణీ సంహతోరు ♦ కఠినకుచాఢ్యా. ౨౫౦

కం. వారక శైవలినీవా!,పూరము తీరంబుఁబోలెఁ ♦ బొలఁతుక నీవు
నా రెకు నామనమును సరి,సీరుహాలోచన హరించి ♦ చెలఁగెదు గదవే. ౨౫౧

ఉ. చూచితి దేవకాంతలను ♦ జూచితి యక్షసరోరుహాక్షులన్
జూచితిఁ గిన్నరీమణులఁ ♦ జూడ్కికిఁ బండువుసేయువారలన్;
జూచి యెఱుంగ నోసుదతి ♦ సుందరతావిభవంబునన్ మృగీ
లోచన నిన్నుఁబోలు నొక♦లోలవిలోచన భూతలంబునన్. ౨౫౨

కం. ఓకోమలి నీప్రాయము, నీకోమలతావిభూతి ♦ నీరూపం బా
లోకింప నిచట నడవిని, నేకాంతం బుంట వెఱ్ఱి ♦ యెత్తెడి నాకున్. ౨౫౩

ఉ. పొమ్ము లతాంగి యింటికిని ♦ భూరిభయంకరకామరూపు లై
త్రిమ్మరుయామినీచరులు ♦ దీయక యిందుఁ జరింత్రు, గాన నీ
విమ్మెయి నొంటి నుండఁ దగ♦వే తగ వే చను రమ్యహేమసౌ
ధమ్ముల నిమ్మటాళి సుది♦తం బగు నీకు నలంకరింపఁగన్. ౨౫౪

కం. వరమాల్యము వరభోజ్యము, వరవస్త్రము వరనరుండు ♦ వర మగు నీకున్
వరమేచకలోచన నా,పరమాభిప్రాయ మిదియ ♦ పంకజనేత్రా. ౨౫౫

ఉ. నిక్కపుదేవకన్య వని♦ నే మది నమ్మితి రుద్రకాంతవో
నిక్కముగా మరుత్సతివొ ♦ నెమ్మి వచింపుము దేవకిన్నరుల్
మక్కువ నిందు రా రిదియు ♦ మానవభోజులవాస మౌట, నీ
వెక్కడి దాన వెక్కటి చె♦లీ యిట నుండఁ గతంబుఁ జెప్పుమా. ౨౫౬

కం. పులులుం గ్రోఁతులు సింహం,బులుఁ జిఱుతలు నెలుఁగుబంట్లుఁ ♦ బురుకంకంబుల్
దళముగ నిందుఁ జరింపఁగఁ, గలికీ! నీ కెట్లు భయము♦గలుగదు చెపుమా. ౨౫౭

కం. మదయుతములు ఘోరంబులు, మదావళము లిందుఁ బెక్కు ♦ మలయుచు నుండన్
మదిరాక్షి మది భయమ్మును, బొదలక యెట్లున్నదాన♦వో కదె చెలువా. ౨౫౮

ఉ. ఎవ్వరిదాన వీవు మది♦రేక్షణ! యెవ్వతె వీ విచేటికే
యివ్వని జవ్వనీ! తిరిగె♦దెక్కటి రక్కసమూఁక లెప్పుడుఁ
గ్రొవ్వున సంచరించు నిటఁ♦గ్రూరతి, నావుడు విప్రవేషు నా
గ్రొవ్విరిఁబోఁడి సత్కృతుల♦గొబ్బునఁ బూజ లొనర్చి వెండియున్. ౭౫౯

→ సీత యతివేషంబున నున్నరావణు సత్కరించుట. ←

సీ. తరుణి పాత్రకుసుంభ♦ధారి యాద్విజవేష,సహితు నపాయద♦గ్ధనుని వాని
ద్వేషింప దుస్సాధు♦ విప్రనిభంగిన, పూజించి యిట్లనుఁ♦ బుష్పగంధి
యిదిగో దర్భాసనం♦బిందుఁ గూర్చుండుమీ, యిదె యర్ఘ్యమిదె పాద్య♦మిఁవిగో సిద్ధ
వనజాతఫలములు ♦ త్వన్నిమిత్తం బివి, యారగింపుము తని♦వార ననుచుఁ

ఆ. బలుకు చున్నయట్టి♦ప్రతిపూర్ణభాషిణి, నానరేంద్రపత్ని ♦ నవనితనయ
నాత్మవధముపొంటె♦నసురలోకేశ్వరుం, డపహరింప మనసు♦నందుఁ బూనె. ౭౬౦

తరలము. వనికి వేఁటకుఁ జన్నభర్తయు ♦ భ్రాతతోఁ జనుదెంచు నా
యనుచు నాలుగుదిక్కులుఁ జల♦జాయతాక్షి వనీదిశన్
గనియెఁ గాని రఘూత్తముల్ పొడ♦కట్టరైరి, యథాస్థితిన్
ననకుజంబులు దోఁచు చుండెను ♦ భామచిత్తము కందఁగన్. ౭౬౧

→ సీత మాయాయతికిఁ దనవృత్తాంతముఁ జెప్పుట. ←

ఉ. తన్ను హరించుభావమున ♦ దానవనాథుఁడు ప్రశ్న సేయఁగా
సన్నుతశీల పీఁ డతిథి ♦ త్మాసురవర్యుఁడు మద్విధంబు నే
నున్నటు చెప్పకుండిసను ♦ నుగ్రరుషన్ శపియించునో యటం
చెన్నుచు మూర్తమాత్ర మెద ♦ నిట్లని చెప్పఁదొడంగె వానికిన్. ౭౬౨

సీ. మిథిలాధినాథుఁ డై ♦ ప్రథితమహాత్ముఁ డౌ, జనకావనీశుని♦తనయ నేను
సీత యందురు నన్ను ♦ శ్రీరాముభార్యను, సర్వకామసమృద్ధ♦జనసుఖములఁ
బదియు రెండేఁడు లి♦క్ష్వాకులయింటను, గడపితి నేదియుఁ ♦ గసము లేక
యంతటఁ బదియు మూఁ♦డవవత్సరంబున, రామాభిషేకకా♦ర్యంబు పొంటె

తే. రాజు మంత్రులతోడ మం♦త్రంబు సేసి, సర్వసంభారములఁ గూర్పఁ ♦ జతుర కైక
య నెడినృపుభార్యశసహ్యద♦యాధినాథుఁ,డైనమామామ సుకృతవ♦శాత్ముఁ జేసి.

కం. నాపతి ప్రవ్రాజనమును, స్వాపత్యం బైనభరతు♦నభిషేకంబున్
భూపాలుని సత్యాత్ముని, నాపడఁతి వరద్వయంబు ♦ నాకాంక్షించెన్. ౭౬౪

కం. తిన నన్నముఁ గొన నీరముఁ, గన నిద్దుర యేమియైనఁ ♦ గానిమ్మా రా
ముని నీ వభిషేకించిన, జననాయక నాకు నుసులు ♦ సరి యింతటితోన్. ౭౬౫

కం. అని పలికెడి కైకేయికి, నసఘుఁడు మామామ సార్థ♦కార్థంబు లివే
కొను మని యెంతయు వేఁడిన, విన దాయిల్లాలు మగని♦విన్నప మేమిన్. ౭౬౬

కం. ప్రతిభటరహితుం డగునా,పతి కిరువదియేనుసమల ♦ ప్రాయం బవు డీ
క్షితిఁ బుట్టువాదిగాఁ గన, హితగుణ నా కపుడు పదియు ♦ నెనిమిది యేఁడుల్.[1]

సీ. రాముఁడనామంబునఁ ♦ బ్రధితుండు జగతిని, సత్యవంతుఁడు గుణ ♦ శాలి శుచియు
నీరజాతాయత ♦ నేత్రుండు నాజాను,బాహుండు భూతావ ♦ లీహితాత్ముఁ
డట్టినాపెనిమిటి ♦ కాలిముచ్చట దీర్చ,నభిషేక మొనరింపఁ ♦ డయ్యె దశర
థుండు కామార్తుఁడై ♦ వెండి తండ్రిని డాయ, వచ్చినరామునిఁ ♦ బలికెఁ గైక

ఆ. వినుము రామ నీదు ♦ జనకునియానతి, భరతునందు రాజ్య ♦ భార మునిచి
వని వసింపు మీవు ♦ వర్షము ల్పదునాల్గు,జనకు సత్యవాది ♦ సలుపవయ్య. ౨౧౮

కం. అని కైకేయి వచియించిన, విని యకుతోభయుఁడునాదు ♦ విభుఁ డాపలుకుం
గొని నిశ్చలవ్రతుం డయి, చనుదెంచెన్ జనకు సత్య ♦ సంధునిఁ జేయన్. ౨౧౯

తే. ఇచ్చునే కాని యొరులచేఁ ♦ బుచ్చుకొనఁడు, సత్య మాడున కాని య ♦ సత్య మాడఁ
డెట్టివేళల నివియ చూ ♦ డిట్ట మైన, రామచంద్రునివ్రతములు ♦ బ్రహ్మతేజ. ౨౨౦

సీ. రామువైమాత్రేయుఁ ♦ డైమించు లక్ష్మణ,నాముఁడు శూరతా ♦ ధాముఁ డన్న
కును సహాయుం డగు ♦ ననిలోన విజితారి, యతివృఢవ్రతుఁడు ధ ♦ ర్మాత్ముఁ డతఁడు
మా వెంటఁ జనుదెంచె ♦ సుహితధనుష్పాణి,యగుచు రాముఁడు జటి ♦ యగుచుఁ దపసి
యాకృతిఁ గైకొని ♦ యనుజుతో నాతోడ, దండకాటవిఁ జొచ్చె ♦ దండితారి

తే. కైక వలనను రాజ్యంబు ♦ గరిమఁ బాసి, మేము మువ్వుర మివ్వవీ ♦ భూమిఁ దిరుగు
చున్న వారము మూర్తి మిం ♦ దుండు వేని, వచ్చు నాభర్త వన్యాళిఁ ♦ దెచ్చు విప్ర.

కం. తావక నామము గోత్రము, భూవిబుధా! కులము సత్త్వ ♦ మును నిక్కముగా
నావిష్కృతి సేయుము మీ,లా విహరించెదవు దండ ♦ కాటవి నొంటిన్. ౨౨౨

కం. అని తన్నడిగినసీతా,వనజాక్షికి ననియె నుగ్ర ♦ పర్యనుఁ డగున
ద్దనుజేంద్రుఁడు తీవ్రంబుగ, వినవే యోసీత నాదు ♦ వృత్తాంతంబున్ ౨౨౩

రావణుఁడు సీతకుఁ దనవృత్తాంతంబుఁ జెప్పి యామెను దుష్టాలాపుట.

ఉ. ఎవ్వనిపేరు విన్న జగ ♦ మెల్ల వణంకు సదేవదైత్య మై
యెవ్వఁడు రాక్షసావళుల ♦ కెల్లను నాయకుఁ డట్టివాఁడ నో
క్రొవ్విరిఁబోణి రావణుఁడఁ ♦ గోమలి నిన్ననిసంతనుండియున్
బువ్విలుకానిలీలలకుఁ ♦ బోదు మనంబు స్వదారపాళిపై. ౨౨౪

ఉ. ఎంతటినో పరాంగనల ♦ నేపున నే హరియించి తెచ్చితిన్
సుందరి! వారి కందఱకు ♦ సొంపుగ నీవిక గమ్ము, నా నిశ
న్తందిర మామహాంబునిధి ♦ మధ్యమునన్ నగిమూర్ధ దేశమం
దుం దిర మైనలంక, యటఁ ♦ దోయజలోచన! నన్నుఁ బొందుమీ. ౨౨౫

[1] సీతాదేవిక భూమియందుఁ బుట్టినది మొదలు వివాహము. ఆమె భూమిలో ౫ సంవత్సరము లుండెను.

ఉ. అక్కడి భర్తహర్మ్యముల ♦ నక్కడి సుందరనందనంబులం
దక్కడి సౌధవీథికల ♦ నక్కడి చారువిహారభూములన్
బెక్కువమక్కువం జెలఁగి ♦ పెంపును సొంపు రహింప నుండె దే
నిక్కడి భీకరాటవు లి ♦ వేల రుచించెడి నీకు మోహినీ ౨౭౬

కం. నాభార్యవైన నిను స, ర్వాభరణోపేత లైన♦యబ్జాక్షులు శ్ర
ద్ధాభక్తుల భజియించెద, రోభామిని యేను వేవు ♦ రుత్తమకులజల్.[1] ౨౭౭

సీత రావణు నిష్ఠురంబులు పలుకుట.

కం. రావణుఁ డిటుపల్కిన సీ, తావనజాతాక్షి తీవ్ర♦తరరుష చే ర
క్షోవిభుఁ దృణీకరించుచు, నీవిధమున మాఱు పలికె ♦ దృఢమానస యై ౨౭౮

కం. భూమీధ్ర మన నకంప్యుఁడు, భూసురపతి యుదధినాఁగ ♦ నక్షోభ్యుఁడు శ్రీ
రాముఁడు నాహృదయేశుఁడు, రామానువ్రతను నేను ♦ రాక్షసరాజా. ౨౭౯

కం. శ్రీమహితలక్షణుఁడు నట, భూమిజపరిమండలుండు ♦ పురు తేజుఁడు స
త్యామితరక్తుఁడు రాముఁడు, రామానువ్రతను నేను ♦ రాక్షసరాజా. ౨౮౦

కం. రాముఁడు నరకేసరి సిం, హామితవిక్రాంతగామి ♦ హరితుల్యుఁడు దే
జోమేదురభుజవక్షుఁడు, రామానువ్రతను నేను ♦ రాక్షసరాజా. ౨౮౧

కం. భూమీశకుమారుఁడు సమ, సోమసమాననుఁడు సద్య♦శోభరితుండున్
రాముఁడు జితేంద్రియుఁడు శ్రీ, రామానువ్రతను నేను ♦ రాక్షసరాజా. ౨౮౨

ఉ. చెన్నఁటినక్క వీవు, నను ♦ సింహి సుదుర్లభఁ గోరువాఁడవా
నన్ను ఖరాంశుదీధితిని♦నా స్పృశియింపఁగ నీకు శక్య మా?
యిన్నటి రామచంద్రుహృద♦యేశ్వరిఁ గోరుట మందభాగ్యుఁడా
కన్నుల నిప్డె కాంచెదవు ♦ కాంచనవృక్షచయంబు రాక్షసా. ౨౮౩

ఉ. నిష్ఠురదుఃఖుధాకుపిత♦నిర్భరవేగమృగేంద్రగూఢపా
ద్వేష్టకఘోరదంష్ట్రలను ♦ బీఁకఁగఁ బూనుట, ధారిణీధర
శ్రేష్ఠము మందరంబు నఱ♦చే హరియింపఁగ నూనుటల్ సర
జ్యేష్ఠరఘూత్తమాత్మసతి ♦ నీ వెసఁ గోరుట యోదురాత్ముఁడా. ౨౮౪

చం. పటుతరకాలకూటవిష♦పానముఁ జేసియు సౌఖ్యరీతిఁ గో
రుట, శితసూచికాగ్రములఁ ♦ గ్రొవ్వున లోచనమార్జనంబు సే
యుట, పెనుబంప కంఠమున ♦ నుండఁగ నంబుధి దాఁట నెంచుటల్
చటులపరాక్రమప్రకట♦సత్వరఘూత్తముభార్యఁ గోరుటల్. ౨౮౫

కం. కాలాయసశూలాగ్రము, పై లాఁగులు వేయఁగనుట ♦ ప్రజ్వలితాగ్నిన్
జేలాగ్రంబున ముడుచుట, నాలుక నసి నాకు టగును ♦ నను నీకోనుటల్. ౨౮౬

---

[1] రావణువాక్యములయం దుత్తమములు గ్రహింపవలయు. కామోక్తిగ నొకటి భక్తియుక్తిగ నొకటి.

కం ఖరకర హిమకరులను నీ, కరతలములఁ బట్టుకొనుట • గాఁ దలఁపుము భీ
కరశరుఁడగు శ్రీరాముని, పరమప్రియ నన్నుఁ బట్ట • భావించుటయున్. ౭౮౭

చం హరిమృగధూర్తకంబులకు • నంబుధికుల్యలకున్ విహంగరా
డ్వరపికవర్ధనంబులకు • వారణమూషక బర్హిమద్గులన్
బరమసురాగ్ర్యకుంజలవి • భాసితచందనపంకవారులం
బరఁగెడునంతరంబె రఘు • వర్యునకున్ విను నీకు రావణా. ౭౮౮

కం.కాంచన సీసములకు రా, యంచకు గ్రద్దకును గల్గు • నంతర మే యూ
నంచితగుణి రామునకు, న్వంచకుఁ డగునీకుఁ గలదు • పరిశీలింపన్ ౭౮౯

ఉ కర్బురపుంఖసంకలిత • కాండవిభాసితచాపహస్తుఁ డై
బర్బరపాణి రాఘవుఁడు • వాసవతుల్యుఁడు నాకుఁ గల్గఁగా
దుర్బల నంచు నీవు నను • దోర్బలవృత్తి హరించి తేనియుం
గర్బురనాథ మక్షికముఁ • గల్గినయాజ్యము నొందు నీ కెటున్. ౭౯౦

కం.అని దృఢమతిఁ బరుసంబుల, ననియు వెఱన్ గాలిఁ గదలు • నలఁతియరఁటియో
యన గడగడవడఁకఁగ న, ద్దనుజుఁడు భయపెట్టఁ బలుకుఁ • దనకులబలముల్.

⟷ సీతకు రావణుఁడు తనస్వరూపముఁ జూపి భయోక్తు లాడుట. ⟷

చం.విపులలలాట దేశపరి • వేల్లితభ్రూకుటి యై సురారి దు
ష్కుపితకఠోరవాక్యములఁ • గోమలి కిట్లను నన్ను నేమిగాఁ
జపలమృగాక్షి చూచెదవు • శంకరమిత్రసహోదరుండ య
క్షపుఁడు విమాతృజుం డు దశ • కంఠుఁడ రావణనామధేయుఁడన్. ౭౯౧

సీ ఎవ్వనిఁ గని భీతి • మృత్యువుఁ గని నట్లు, పఱచు గంధర్వాహి • పతగవితతు
లెవ్వని ననిఁ దాఁకి • హేత్వంతరంబున, నరవాహనుం డోడి • పరువు వాఱె
నెవ్వనిభీతి స • మృద్ధినున్నిజపురి, వీడి శ్రీదుఁడు చేరె • వెండికొండ
నెవ్వఁ డాతనికాము • గేష్టపుష్పాఖ్యవి, మానంబు నొడిచె న్వ • యాసముగను

తే. నట్టినామోముఁ జూచిన • నడలి నడలి, నడఁకి తడఁబడి పఱతురు • వాసవాది
విబుధులెవ్వఁడు గలచోట • వెఱచి గాలి, వీవఁ డుష్ణాంశుఁ డగుఁజలి • వెలుఁగుగాఁగ.

కం.ఎట నెట నే నిలిచినఁ జన, నట నట నల్లాడ దొక్క • యాకేఁ జెట్లన్
బటురయము వదలి నదులును, గుటిలాలక పాఱ వెఱచి • గుదినడి నిలుచున్.

సీ. క్రూరులై భీకరా • కారులై వెలసిన, రాక్షసజనులచేఁ • జోకఁ గూడి
పూర్ణమై ప్రాకార • కీర్ణమై కాంచన, కక్ష్యావితతులు సం • లక్ష్యమగుచు
వారణాదులమణి • తోరణాదులఁ బొల్చి, తూర్యనినాదగాం • భీర్య మగుచు
నుద్యానచరశోభి • తోద్యానసర్వర్తు, సూనఫలావళీ • స్థాన మగుచు

తే. మత్పురము పొల్చు సాగర • మధ్యమునను, శక్రపురితుల్య మగుచు ని • ర్వక్రవిభవ
మలర లంకాఖ్యపట్టణ • మలరుఁబోఁడి, కాననుగా రమ్ము కన్నులు • కఱవు దీఱ. ౭౯౨

తే. అందు నాతోడ నీవు సా♦నంద వగుచు
మందగమనరొ క్రీడల ♦ నుందు వేని
డెందమునయందుఁ దలఁపఁగఁ ♦ గందె మనుజ
సుందరీబృందముల నోసి♦కుందరదన. ౨౯౬

కం. మానుషసురసుఖములఁ జం,ద్రానన యట మరగి యనల ♦ నాత్మఁ దలఁతువే
మానవు గతాయు వగునొక,హీనుని దుర్బలుని భాగ్య♦హీనుని రామున్. ౨౯౭

మ. తనగారాబుకుమారు రాజ్యమున సం♦స్థాపించి నీమామ జ్యే
ష్ఠునిఁ దన్నున్ నిరసింప హీనబలుఁడై ♦ చొచ్చెన్ వనాంతంబునన్
జనునే నీకటువంటిదుర్బలుని రా♦జ్యభ్రష్టు నల్పాయువున్
వనచారి న్మునివేషుఁ గట్టుకొని యే♦ష్వం గానలో సుందరీ. ౨౯౮

ఉ. నీ కిది ధర్మ మౌ నటవె ♦ నిష్ఠురశీలిని! పంచబాణబా
ణాకులితాంతరంగమున ♦ నాసమయిం దమిఁ దాన వచ్చి ని
న్నో కమలాక్షి వేఁడికొను♦చున్ననిశాచరలోకనాథునిం
బ్రాకటలీల నేల కన♦మానముగాఁగఁ దృణీకరింపఁగన్. ౨౯౯

ఉ. భీరు! నిరాకరించి ననుఁ ♦ బిమ్మట వేఁగదు మాఁగు కాఁకలన్
ధారిణి మున్ను దాఁ జరణ♦తాడితుఁ జేసి పురూరవున్ స్వర్గన్
గూరినయుర్వశీతరుణి♦కోపున, రాముఁడు యుద్ధభూమి నా
గోరికి సాటిరాఁడు, ననుఁ ♦ గూడుటకు న్మది సంశయించెదే. ౩౦౦

తే. నీయదృష్టంబు పండుట ♦ నీరజాక్షి
వచ్చినాఁడను ద్రోసంగ ♦ వలదు నన్నుఁ
బొందుమీ యనఁ గ్రుద్ధ యై ♦ భూమిజాత
పరుషవాక్కులఁ దశకంఠుఁ ♦ బలికె నొంటి. ౩౦౧

సీత రావణు నిందించుట.

ఉ. ఏమిర యక్షగుహ్యకగ♦ణేశ్వరుఁడై మఱి భూతవంద్యుఁడై
ధీమహితాత్ముఁ డౌ ధనద♦దేవుని తమ్ముఁడ వౌచు నా యఘం
బీమెయిఁ జేయఁ బూనితి వి♦సీ యజితేంద్రియు బుద్ధిహీను నిన్
భూమిపుఁ గాఁగఁ బొంది పొరి♦పోదు రవశ్యము సర్వరాక్షసుల్. ౩౦౨

కం. హరిహయుసతిఁ బౌలోమిని, హరియించియు నైన బ్రదుక ♦ నగుఁ గా కెట్లున్
వరబలుఁ డగురామునిసుం,దరి నను హరియించి బ్రతుకఁ ♦ దరమా నీకున్. ౩౦౩

మత్తకోకిలము. దుష్టచిత్తుఁడ వజ్రహస్తుని♦తో యజాక్షిఁ బులోమజన్
భ్రష్టశీలుఁడ! యాహరించి మ♦నంగవచ్చును గాక యు

త్కృష్టతేజుఁడు రామచంద్రుని♦భార్యవైరికి ననుబోఁటి నీ
కష్టవాక్యము లాడి చేరెదు ♦ కాలునికి సుధఁ ద్రావినన్. ౧౦౪

కం. అని పలుకుసీతవాక్కులు, విని దశకంఠుండు కోప♦వివశుం డగుచుం
దనకరములఁ జఱచుచు ననె, వినవే నావిక్రమము వి♦వేకవిహీనా. ౧౦౫

ఉ. ఎత్తుదునో ధరాతలము ♦ నేపునఁ జేతులఁ బట్టి మింటికిన్
మొత్తుదునో రణంబునను ♦ మొత్తులు పెట్టఁగ మృత్యుదేవతన్
రుత్తుదునో హిమాచలము ♦ నాక్షత ప్రద్దలునాఱ సూర్యునే
నొత్తుదునో శరంబుల మ♦హోదధినీరముఁ ద్రావి నైతునో. ౧౦౬

కం. వెంబరవిత్తా! కామసు,ఖంబులఁ గలిగించునన్నుఁ ♦ గామాకృతి నా
ధుం బరికింపుము యని చూ,పెం బడఁతికిఁ దనదురూపు ♦ భీతిం గొలుపన్. ౧౦౭

శా. మాయాభిక్షుకరూపము న్విడిచి దు♦ర్మార్గుండు పంక్త్యాస్య మా
న్వీయాకారము సూర్యకల్పదహనో♦ద్వేలంబు సంతప్తగాం
గేయోదంచితకుండలంబును గ్రుధా♦క్లిన్నాక్షము న్మేచక
చ్ఛాయాభ్రప్రతిమానముం శరశరా♦సస్ఫీతకాలాభమున్. ౧౦౮

కం. రక్తాంబరధరుఁ డై సం,రక్తాక్షుం డయి నిదాఘ♦రవితేజస్సం
సక్తు నిట్లనియెం గ్రూ,రోక్తుల దైత్యేశ్వరుఁడు స♦ముజ్జృంభితుఁ డై. ౧౦౯

➛ రావణుఁడు సీతను బలాత్కారముగ నెత్తికొని పోవుట. ➛

మ. వినవే సీత భవత్సమానవిభునిన్ ♦ విశ్వత్రయీఖ్యాతునిన్
గనఁగాఁ గోరెదవేని నన్గలయుమీ ♦ కల్యాణి! శ్లాఘ్యుండ నే
ననురక్తుండను నీకు నప్రియముఁ జే♦యం బోన నెన్నండు నా
మనుజు న్విడుము గూడు నన్నుదనుజున్ ♦ మాంగళ్యసంధాత్రి నై. ౧౧౦

ఉ. ఏమని మోహ ముంచితివె ♦ యేమిగుణంబులఁ జూచి మెచ్చి తే
యోమతిహీనురాల! యొక♦యుగ్గలిమాటను బట్టి రాజ్యమున్
భామ సుహృజ్జనంబులను ♦ బాయుచు వ్యాళనిషేవితాటవిన్
దీనుస మేది క్రుమ్మరెడి♦దీనునిఁ బండితమానినీమణీ.

కం. అని ప్రియవాదిని సత్ప్రియఁ, గనలున రావణుఁడు పల్కి ♦ కామా
జనకజను బుధుఁడు రోహిణి, వినువీదిని బట్టునట్లు ♦ వెస
కం. సీతాశిరోజముల డా,చేతన్ వలచేతఁ దొడలు ♦ శీఘ్ర
యాతతఖరయుత మగు తే, రాతఁ మునఁ దోఁపఁగా

కం. దారుణవిభీషికల నా,క్రూరుఁడు బెదరించి యో
జేరిచె శతాంగమునఁ గను,లారమణీరూపిణిన్

కం. మృత్యుప్రాయుని భృకుటీ, తృణాత్యంతస్ఫురితదంష్ట్రు ♦ నద్రిసమానున్
దైత్యునిఁ గని వనదేవత, లత్యగ్రభయంబునన్ వ♦నాళులఁ బొత్తెన్. ౧౧౫
కం. రావణగృహీత యార్తా, రావంబున నఱచె రామ ♦ రామా యని యా
శీవిషసతి యనఁ బొరలెడి, యావనిత నణంచి యెగసె ♦ నసురుఁడు దివికిన్. ౧౧౬
కం. ఉప్పరవీధిని నీగతిఁ, దెప్పునఁ జను తేరిమీఁద ♦ దీవ్రాతుర యై
యప్పుడతి వేఁడు ఱనఁగా, నిప్పగిదిని నేడ్చె భ్రాంతి♦హృదయయ పోలెన్. ౧౧౭

→ సీత రామలక్ష్మణులఁ బేర్కొని యేడ్చుట. ←

కం. హా లక్ష్మణ గురుపరసే, వాలోలా యీగసమునఁ ♦ బాపాత్ముం డ
యోధ్యాలావున నను ముచ్చిలి, వాలాయము చనెడి నెఱుఁగ♦వా భూరిభుజా.[1]
కం. జీవితమును సుఖ మర్థముఁ, గేవలధర్మార్థముగను ♦ గీడ్వఱచిననీ
వీవిధి నధర్మగతిఁ గొని, పోవఁగ నన్నసుర కావ♦వో రఘురామా. ౧౧౯
కం. అవినీతు లైనదుర్జన, నిసహంబుల కెప్పుడున్ వి♦నేతుఁడ వయ్యున్
బొవరునఁ బాపముఁ జేసెడి, యవినీతు దశాస్యునేల ♦ యణఁపవు రామా. ౧౨౦
కం. పాపులఁ బాపఫలంబులు, ప్రాపింపవు తోడుతోన ♦ పరిపక్వము లై
ప్రాపించుఁ గాలగతి నో, పాపీ యసురేంద్ర పండు♦పైరులమాడ్కిన్. ౧౨౧
కం. కాలోపహతమనంబున, నీలీలం బాపకృతికి ♦ నేతెంచుటచే
బాలిశ! పొందెద వాయరి, కాలునిచే జీవితాంత♦కరదుఃఖంబున్. ౧౨౨
కం. అయోధ్య యిప్పుడు కైకయి, నెయ్యురతోఁ గోర్కి దీర ♦ నెఱ సుఖియించున్
గుయ్యెడ హరియించుటచే, నియ్యధముఁడు ధర్మశీలు♦నిల్లాలి ననున్. ౧౨౩
ఉ. వేమఱు మ్రొక్కెదాన నట♦వీస్థలి నున్నఘనప్రసేనకో
ద్దామములార భూమిరుహ♦షండములార లతాళిలార యో
వ్యోమచరిష్ణులార యయ♦యో రఘురామునిఁ గాంచి చయ్యనన్
రామ! హరించె సీత నిదె ♦ రావణుఁ డంచు వచింపరే దయన్. ౧౨౪
సుందరశృంగాన్వితమా, నందన మోమాల్యవంత ♦ ప్రస్రవణగిరీ
దారకారి యిదె నీ, సుందరి హరియించె రామ ♦ చూడుము యనుమా. ౧౨౫
నీ కిదె సారస, కాండసితగరుద్విలాస♦ గౌతమి యాకో
డ నీవే, తండగమన ముచ్చిలించె ♦ దశముఖుఁ డనుమా. ౧౨౬
ధ♦వృక్షతలంబులయందు నుండునో
ట ♦ దండక వాసము చేయు చున్ననా
నాయకులార నమస్కరించెదన్
రామతి నాగతి యెల్లఁ జెప్పరే. ౧౨౭

---

దే యీరంఢునను తిలంభున నైఋటఁ బిలిచెను.

కం. రామా నీప్రాణములకుఁ, బ్రేమాస్పద మైన యట్టి ♦ ప్రియను బరవశన్
భూమిజ హరించె రావణుఁ, డోమఁగఁ జను మనుచుఁ జెప్పు ♦ రో గిరులారా. ౨౮

కం. నాపయి దయ నింతటివా, చాపుణ్యము గట్టుకొన్న ♦ సరగున రాముం
డేపున విడిపించును స్వస్థాపిత నైనను యముండు ♦ దాఁచిన యేనిన్. ౨౯

సీత జటాయువుం జూచి పలవించుట.

కం. అని విలపించుచు సతి యొక, ఘనతరువున నున్న గృధ్ర ♦ కాంతు జటాయున్
గనుఁగొని దుఃఖభయంబులఁ, బెనఁగొనుమతి తోడఁ బిల్చెఁ ♦ బెద్దయెలుఁగునన్.

ఉ. అయ్య జటాయువా! యిదె దు ♦ రాత్ముఁడు రావణుఁ డుగ్రకర్ముఁ డై
కుయ్యిడు చుండ నన్నుఁ గడుఁ ♦ గ్రూరత దిక్కొది లేనిదాని నా
నియ్యెడఁ గొంచుఁ బోయెడి న ♦ హీనబలున్ జితకాశిఁ గ్రూరు దు
ర్జయ్యు దురాత్ము నాయుధుని ♦ సాధ్యము గాదె దిరింప నీ కనిన్. ౩౧

మత్తకోకిలము. అన్న! తండ్రి! జటాయువా! దురి ♦ తాత్ముఁ డీయసురుండు న
న్నిన్నిటన్ హరియించి యేగెడి ♦ నిట్టినాదురవస్థలన్
విన్నవింపఁగదయ్య యిప్పుడ ♦ వేగ మేగి సమస్త మా
యన్నదమ్ముల కోమహాత్మక ♦ యార్త నన్ దయఁ బ్రోవుమా. ౩౨

జటాయువు రావణుని దూషించుట.

చం. కులకులకూఁగు చున్నవిహ ♦ గుండు జటాయువు సీత సేయునా
మొఱ విని లేచి రావణుని ♦ ముగ్ధ ధరాసుతఁ గాంచి రావణా
యెఱుఁగు సనాతనోల్లసద ♦ హీనసుధర్మరతుండ సత్యధీ
గొఱలెడివాఁడ గృధ్రపతిఁ ♦ గ్రూరబలుండను నే జటాయువున్. ౩౩

కం. రాముఁడు సర్వజగద్ధిత, ధీమహితుఁడు దాశరథి సు ♦ ధీమంతుఁడు సు
త్రామాప్పతితుల్యుఁడు భూ, స్తోమంబుల కెల్ల రాజు ♦ సురశాత్రవుఁడా!

సీ. ఆలోకనాథుని ♦ల్లాలి యశస్విని, సీతను హరియింపఁ ♦ జెల్లు నటర
ధర్మతత్పరుఁ డైన ♦ ధారిణీపతికిని, బరదారహరణంబు ♦ భావ్య మటర
దానిలో విను రాజ ♦ దార ముఖ్యంబుగఁ, గాపాడఁ దగు సుం... నటర
పరదారమర్శన ♦ భావంబు నీచంబు, ధీరగర్హిత మాట ♦ తెక్రూర చరిత

ఆ. నీకు బుద్ధిగాదు ♦ నీరజలోచనఁ, గొంచుఁ బోవ విడుమ చుఁ దలఁపు ♦ ప్రాజ్ఞతతికి.
యాత్మదార రక్ష్య ♦ యగురీతిఁ బరసతుల్, రక్ష్య స్త్రీ ♦ గ్గర్హితంబు ౩౪

ఆ. ధర్మనిరతు లైన ♦ ధారిణీపాలురు, కాంక్షపడరు శ్రేష్ఠపాత్ర ♦ విశదముగను.
లైనధర్మములకు ♦ నర్థకామములకు, విను

కం. ధర్మార్థకామములకు సు,కర్తపథుం డైనరాజు ♦ ఘనతరనిధి యౌ;
ధర్మము పుణ్యము పాపము, యర్మిలి విను రాజమూల ♦ మై వర్తిల్లున్. ౮౩౭

కం. పాపస్వభావ చపలా, యేపగిదిం గంటి వీ వ ♦ హీనశ్రీలన్
బాపాత్ముఁడు సురయానముఁ, బ్రాపించినరీతి సాధు ♦ బాధాచరణా. ౮౩౮

కం. పుట్టఁగ వచ్చినగుణములు, కట్టెలతోఁ గాని పోవ ♦ కలుషాత్ములకున్
గట్టిగఁ జెప్పినబుద్ధులు, పట్టునె మనమునకు నిలువఁ ♦ బడునే తిరమై. ౮౩౯

ఉ. నీనగరంబునందొ మఱి ♦ నీవిషయంబునయందొ జానకీ
జాని విరోధ మే మయినఁ ♦ జల్పెనురా? యిటు లేల రిత్తక
య్యానకుఁ గాలు ద్రవ్వి యన ♦ ఘాత్ముని రామునిపట్ల నేరముం
బూనితి చేయఁగా వినుము ♦ మోసము చేకుఱు నీకు దీనిచేన్. ౮౪౦

ఉ. దానవలోకనాథ యతి ♦ దర్పితుఁడై యతినృత్యుఁడై జన
స్థాననివాసి యాఖరుఁడు ♦ చచ్చెను శూర్పణఖానిమిత్తమై
పూని రఘుద్వహుం జెనకి ♦ పూరుషపుంగవు చేసినట్టి కా
కానిది యెద్ది తత్సలిని ♦ రావణ నీ విటు ముచ్చిలింపఁగన్. ౮౪౧

మాలిని. వలదు వలదు రక్షో ♦ వల్లభా నీవు సీతన్
బలిమిని గొనిపోవం ♦ బాప మాభూవరుండున్
దెలిసినయెడ నిన్నున్ ♦ దృష్టిచేనే దహించున్
గులిశమున వృత్రుం ♦ గూల్చు జంభారిమాడ్కిన్. ౮౪౨

కం. కొంగున నాశీవిషము భు,జంగమమున్ ముడిచి మెడకు ♦ జముపాశముఁ జ
క్కంగ బిగించికొనియు నెఱుఁ,గంగాఁ జాలవు దురాత్మ ♦ కాఁగలకీడున్. ౮౪౩

కం. మోవఁగలు యంతభారమె, మోవం దలకొనఁగవలయు ♦ మొగి రోగముఁ దేఁ
కేవస్తు వెంత యఱుఁగునొ, యావస్తువు నంతె తినుట ♦ యోగ్యము కుమతీ. ౮౪౪

కం. ఏకార్యంబునఁ జెడునో, లోకమున యశంబుకీర్తు ♦ లున్ ధర్మంబున్
జేకుఱునో దేహక్షేమం, బాకార్యము బుద్ధిమంతుఁ ♦ డగునే చేయన్. ౮౪౫

చం. అఱువది వేలయేం డ్లిపుడు ♦ ప్రాయమునన్ సురవైరి నాకు నే
యఱగొఱలేక యేలితిని ♦ హాయిగఁ బైతృక మైనరాజ్య మీ
వుఱది గట్టికొనెదవు ♦ నొప్పగువాఁడవు విల్లు తేరు మై
మఱువు శరంబులుం గలుగు ♦ మాసటి వే ముదుకండ, నైననున్. ౮౪౬

ఉ. జానకిసీఁ హరించుకొని ♦ సౌఖ్యముగాఁ జన లేవు చెప్పితిన్
నేను గనంగ నీవ యవ ♦ నీతనయన్ గ్రుడ్డిగ మార్గమున్

బూనిక న్యాయహేతువుల♦పోలికగా హరియింప నేర వో
దానవ! పౌరుషంబు గల♦దా నిలుమీ నిమిషంబు పోరఁగన్. ౮౪౭

కం.మున్ను ఖరాసురువలె నీ, విన్నేలఁ దీర్ఘనిద్ర♦యేగెదు రాముం
డెన్నియొ మాటలు దైత్యుల, మన్నిగొనినయట్లు పిలుకు♦మార్చు న్నిన్నున్:

కం.శూరులు రాజకుమారులు, దూరగతుల్ గాఁగఁ జూచి♦తొయ్యలి నబలన్
గూరినభీతిని బాతెద,వా రక్కస! యనుచు ; నేమి♦వలఁతిని జేయన్. ౮౪౯

మ.వినరా నామెయిఁ బ్రాణము ల్గలుగఁ బృ♦ధ్వీకన్యకన్ జానకిన్
వనజాతాయతపత్రనేత్రను రఘు♦స్వామిపత్నిఁ జితేశ్వరిన్
గొనిపోనీ నిదె ప్రాణగొడ్డ మయినం♦గూర్తుం బ్రియం బామహా
త్మునకున్ రాముని కాజికిన్ వెలయుదున్♦దుర్వారవిక్రాంతిచేన్. ౮౫౦

ఉ. పోకుర పోకు నిల్వు నిలు♦పోఁ గల వెం డిఁకఁ బంక్తికంఠ నిన్
దీకొని విక్రమంబుకొలఁ♦దిన్ సమకూర్తు రణాతిథేయమున్
జోక గ్రహింపుమీ కనుమి♦శూరత నిన్నె రథంబునుండి యు
ద్యోకజవంబునన్ ధరణిఁ♦ద్రోయుదు వృంతమునుండి పండనన్. ౮౫౧

↞ జటాయురావణులయుద్ధము. ↠

చం.అది విని పంక్తికంఠుఁడు దు♦రాగ్రహరోషవశాత్ముఁ డౌచు ని
ర్వదికనుల న్నిణుంగురులు♦రాల జటాయువుఁ దాఁకెఁ దాఁకినన్
జేవల మహాస్త్రవాతధుత♦సారఘనాఘనయు గ్మభంగిగన్
ఛదయుతమాల్యవంతముల♦చందమునం గనుపట్టి రిద్దఱున్. ౮౫౨

ఉ. వారికి నద్భుతాహవము♦వర్తిలు చుండఁగఁ బంక్తికంఠుఁడున్
ఘోరనిశాతబాణములు♦కుప్పనఁగూరలు గృధ్రరాజుపై
వారక వృష్టిగాఁ గురియ♦వాని జటాయువు చండతుండశా
తోరునఖాగ్రపాళులను♦నుగ్వరఁ గూలిచి పేర్చి తీవ్రతన్.

ఉ. దానవుగాత్ర మెల్ల వ్రణి♦తంబుగ గోళ్లను గాళ్ల గీఱి యెం
తే నొగు లొందఁజేయ నసు♦రేశ్వరుఁడున్ యమదండతుల్యతా
మానితఘోరశాతవిశి♦మార్గణముల్ గుఱిగా జటాయువా!
వీనను జప్పి తి ననుచు♦ పే వయిచెం దెగ నిండఁ దీయఁగ ౮౫౪

ఉ. వానికి నీడఁబోక సురి♦వైరిరథస్థ సబాష్పలోచనన్
జానకిఁ జూచి వైరిపయి♦సాహసికత్వము దోఁప ... కి ము
క్తానిచయాన్వితంబు శిత♦కాండసమన్విత మైన చాపమున్
దా నిరుతుంట్లలై పడఁ బ♦తంగకులాగ్రణి త్రుంచి వైచినన్. ౮౫౫

ఉ. వే తొలకవిల్లు వుచ్చికొని ♦ విక్రమవంతుఁడు రావణాసురుం
డాఱనికిన్క బాణనిచ♦యాధికవృష్టిని ముంప గూఁట నో
టాఱినపక్షియో యన జ♦టాయువు కొండొకసేపు చిక్కియున్
మీఱినపక్షవేగమున ♦ మీఱటి శరంబులు విల్లు ద్రుంచుచున్ ౨౫౬

సీ. సురవైరిఘనశరా♦వరము పక్షాహతిఁ, దుత్తుము రై నేలఁ ♦ దొరఁగఁ జేసి
కాంచనోరశ్ఛదో♦దంచితదివ్యపి, శాచాస్యఖరముల ♦ క్షమను గూల్చి
కామగంబు త్రివేణు♦కలితంబు పావకా,ర్చిష్క మౌరథము ధ♦రిత్రి డొల్చి
చంద్రసన్నిభసిత ♦చ్ఛత్రంబు సగ్రాహి, సవ్యజనంబుగఁ ♦ జదుగ సేసి

తే. ముక్కనను సూతుతల పట్టి♦నొక్కి త్రుంప
భగ్నచాపుండు హతయంత ♦ పాలితార్వుఁ
డగుచు ధారిణిఁ ద్రెళ్లె సు♦రారినేత
యంకమున బిగ్గ గ్రహియించి ♦ యవనిసుతను. ౨౫౭

ఆ. భగ్నచాపుఁ డగుచు ♦ భగ్నవాహనుఁ డయి, నేలఁ ద్రెళ్లినట్టి♦నిర్జరారిఁ
గాంచి భూతకోటి ♦ ఖగరాజు మెచ్చెను, మేలు మే లటంచు ♦ మేలినుతుల.

కం. ముదుకం డగుటను బడలిన, విదితబలున్ గృధ్రరాజు ♦ వీక్షించి మహా
ముదమున మింటికి నెగసెను, మదిరాయతనేత్రతోడ ♦ మనుజాశనుఁడున్. ౨౫౯

ఉ. పోవుచు నున్నయాయసుర♦పుంగవుఁ గాంచి జటాయు వంతఁ దెం
పావహిలంగ నడ్డ మయి ♦ యాతనితో నను వజ్రతుల్యబా
ణావళిదీపితుం డయిన♦యారఘునాయకుదేవి నీవు గొం
పోవుట రాక్షసాన్వయము ♦ మూలముతోఁ జెడిపోకకే చుమీ. ౨౬౦

→ రావణుని జటాయువు పరుషోక్తు లాడుట. ←

.. త్రులతో బంధులతోఁ, బుత్రులతో సచివసైన్య♦పూగంబులతోఁ
.. లతో గరళంబుఁ బవిత్రం బని త్రాగెదే వి♦వేకవిహీనా. ౨౬౧

కం. రాఁ.. ఫలముం దమమది,లోఁ గానఁగ లేక బుద్ధి♦లోపమున జడుల్
రేఁగి య.. ర్యం బొనరిచి, తోఁగుదురు విపత్తునందుఁ ♦ దుది నీకరణిన్. ౨౬౨

కం. కాలుఁడు పాశ.. నీమెడఁ, బోలం బిగియింప నెందుఁ ♦ బోయిన నీకే
లీల మృతి దప్పు .. నము, గాలం బెరతోడ మ్రింగు♦గతి నైతివిరా. ౨౬౩

చం. అలవి యెఱుంగ నేరకి ము♦హాత్ములతోఁ బగఁగొంటి, వారు నీ
కలఁతులు గారు, నీ విటు .. శ్రమవాసిని సంగ్రహించుటన్
బలిత పుఁగోప మెత్తి సహ♦బాం.. గాఁగ రణంబులో నినుం
బొలియఁగఁ జేయువారు, చెడి♦పో.. ము పోకుము దోరి రావణా. ౨౬౪

కం. భీరుత్వంబున నీకర, భీరువు హరియించి పోవ ♦ యుక్తి కెవదు విధి లో
నారయ జగంబు దిట్టెడి, చోరునికర్మంబు గాక ♦ శూరునివిధమే. ౧౬౫

కం. శూరుఁడ వేనియు నిలువుము, రా రావణ మూర్ఖ మొండు ♦ రణమున నీవుఁ
గూరెదవు పెద్దనిద్దుర, నారామునిచేత నీదు ♦ ననుజునిపోల్కిన్. ౧౬౬

కం. మరణం బాసన్నం బై, పొరసిన స్వవినాశమునకుఁ ♦ బోనరుచు నఘముం
బురుషుం డట్టియుకార్యము, దురుసున నీ విపుడు సేయఁ ♦ దొడఁగితి వసురా.

కం. పాపానుబంధకార్యం, బేపురుషుఁడు లోక మెల్ల ♦ నేలెడువాఁ డే
నాపరమేష్ఠియ యేనియుఁ, బాపాత్మా! చేయఁ బూనుఁ ♦ బ్రాభవ మఱఁగన్?

చం. అని హితనీతివాక్యముల ♦ నాడి జవంబున వ్రాలి వీఁపుపైఁ
దననఖపాళి నాతని వి♦దారితగాత్రునిఁ జేసి వేగముం
బొనుఁగువడంగఁ జేసె మద♦ముం గొని రేఁగ గజంబు మావటీఁ
డనుపమితాంకుశంబున ర♦యంబునఁ దాఁ గుదియించుకై వడిన్. ౧౬౯

కం. తనఖరనఖరంబులచేఁ, దనముఖవిశిఖమున దైత్యు ♦ తల వెండ్రుకలన్
ఘనబలుఁడు మెఱుక దైత్యుఁడు, కినుకఁ బెరవిఁ గొఱికికొనుచు ♦ గిట్టునఁ దిరిగెన్.

కం. తిరిగియు సవ్యాంకంబున, ధరణిసుతం బొదివి పాణి ♦ తలమున వ్రేసెన్
గురువేగమున జటాయుని, నరుణజుఁ డది తప్పఁగొట్టి ♦ యభిముఖుఁ డగుచున్.

కం. వామకరంబులు పదియును, భూమిపయిం దొరఁగఁ దుండ ♦ మునఁ జిదుమఁ గర
స్తోమము వెంటనె పుట్టె వి, షామితదంష్ట్రాహులు వొదవు ♦ నట్టులు పుట్టెన్. ౧౭౨

ఉ. అంతటఁ బఙ్క్తికంఠుఁడు దు♦రంతరుషానలదీప్తనేత్రుఁ డై
కాంతను వీడి ముష్టిపద♦ఘాతములం బతగాస్వయేంద్రు దు
ర్దాంతపరాక్రమం బడరఁ ♦ దాఁచిన నేచెను బోరు ఘోర మై
కొంతనడిన్ శకుంతపున♦కుం బలలాశనలోకభర్తకున్. ౧౭౩

↞ రావణుఁడు జటాయువుఱెక్కలు నఱకుట. ↠

కం. ఆయెడ శ్రీరాముసకై, వ్యాయామము సేయు చున్న ♦ పతగేంద్రునిపా
దాయతపక్షంబులు కొ, త్తేయకమున నసుర నఱకె ♦ క్షితిఁ గూలన్. ౧౭౪

కం. నఱికిన నేలన్ వ్రాలుచుఁ, గొఱ కొఱ మని కుత్తికం దుఱ ♦ గుట్టును ఉండన్
బిఱు మఱచిన జటాయువునకుఁ, దెఱవ స్వబంధునకు బోలె ♦ దీనత నేడ్చెన్. ౧౭౫

తే. కాలజీమూతనిభుఁ డయి ♦ నేలఁ బడిన, పాండురస్యూఁ గనె రావ♦ణుండు శాంత
దావదహనునిమాడ్కిని ♦ ధరణికన్య, రామనాశ్రమనికటోర్వి ♦ వ్రాలియున్న

సీత రామలక్ష్మణులఁగూర్చి యాక్రోశించుట.

ఉ. కంఠగతాయు నాశకున ♦ కాంతునిఁ గాంచిటుఁ గ్రుచ్చి యాపికీ
కంఠి భృశార్తి బాష్పములు ♦ కాల్వలు గట్టఁగ నేడ్చె నిట్లు, ని
ష్కుంఠిత సౌఖ్యదుఃఖములఁ ♦ జూపు శరీరజలక్షణంబు ల
త్యంత దొలంగఁ బింగళపతత్త్రిముఖాండజకంఠరావముల్. ౧౭౭
ఉ. ఈమృగపక్షిసంతతియు ♦ నిప్పుడు పాటెడి సిప్పుఁ గూర్చి యే
మామకదుర్దశం దెలుప ♦ మాధవ నీ విపుడే నెఱుంగ వా
రామ! భవత్సతీగతప ♦ రాభవ మింతకు నీ వెఱుంగఁగా
లేమిని నాదుదుష్కృతము ♦ లేశముగా దని నిశ్చయించితిన్. ౧౭౮
కం నన్నుం గావఁగఁ బూనుట, నిన్నీచునిచేత మడసె ♦ నీపుణ్యధనుం
డిన్నీడోద్భవుఁ డౌరా, మన్నిర్వృతి యదేల యితని ♦ మనఁగా నిచ్చున్. ౧౭౯
శా. రామా! కావఁగ రమ్ము లక్ష్మణ! వెసన్ ♦ రక్షింపుమా తంత్రి! సు
త్రామద్వేషి హరించి వే యరిగెడిన్ ♦ ధాత్రీభవన్ న న్నటం
చీమాడ్కిన్ వినువారుగాక రఘునం ♦ దనుల్ సమీపస్థితిన్
దా మంటల్ లభియించెనేనియు సుదా ♦ రధ్వాన మం చేర్వఁగన్. ౧౮౦
చం కదుకొని బాష్పవారి జడి ♦ కాఱ సమీపధరారుహంబు న
మ్మనవతి తీఁగెనాఁ బెనఁగ ♦ మాననభోజియు పీడు పీడు మం
చవలిచి బంకెన ల్వలికి ♦ యట్టె సతీమణి కేశపాశముల్
వదలక పట్టి యీడ్చె నమ ♦ వర్తి తనున్ సిగఁ బట్టి యీడ్వఁగన్. ౧౮౧
శా. రామా రామ రఘూత్తమా యని మహా ♦ రావంబు మై నేడ్వ నా
శ్యామారత్నశిరోజము ల్దిగిచె రక్షోధీశుఁ డవ్వేళ దు
ర్దైవధ్వాంతసమావృతం బయి యమ ♦ ర్యాదంబు నై యీజగ
త్తో నంబుల్ సచరాచరంబులు వగం ♦ దూలెన్ విషణ్ణంబు లై. ౧౮౨
ఉ. పీవఁడు ని కుతుం డవుడు ♦ వెల్వెలఁబాఱె దివాకరుండు రా
జీవభవుండు లో నెఱిఁగి ♦ సీతను రావణుఁ డేచు చుండుటల్
కావర మెత్తి, చక్కఁగ నిఁక ♦ గార్యము పొ స్గనె, శోకమోహముల్
దేవఋషు ల్భజించిరి ని ♦ తవ్యధ రావణు చేటు చూచుచున్. ౧౮౩

రావణుఁడు సీత నెత్తుకొని పఱు వెత్తుట.

కం. రామా రామా యనుచును, సౌమిత్రీ యనుచు నేడ్చు ♦ జనకతనూజన్
వ్యోమపథంబునఁ గొని యుద్దామజవంబునను బఱచె ♦ దశకంధరుఁడున్. ౧౮౪

ఉ. నీరదదేహుఁడైనరజ♦నీచరుచెంగట స్వర్ణవర్ణ గౌ
ర్యాకారమెలుంగునాఁ బొలిచె ♦ గాలికిఁ బై నెగయంగ సతీమణీ
భూరిమయూంశుకాంచలము ♦ పూర్వసుధాశనలోకభర్తయుం
మారుతమిత్రదీప్తగిరి♦మాడ్కి రహించెను చేటు దోఁచఁగన్. ౮౮౫

కం.తరుణీమణి ధరియించిన, పరిమళభరితములు తామ్ర♦పంకజదళముల్
సురశాత్రవనాయకుపై, మరుదాహతిఁ దొరఁగి ధరణి♦మండలి డొల్లెన్. ౮౮౬

కం.ఆకల్యాణిదుకూలం, బాకాశమునందు వెలిఁగె ♦ హాటకరుచి న
స్తోకాతపమున రవిశోణీకృతధారాధరంబు♦ నెఱిచూపట్టన్. ౮౮౭

కం.అసురనాథాంకగ యగు, నాసుందరి సునసవక్త్ర ♦ మారాముఁడు తో
వాసింపమి భాసిల్లదు, వాసి దఱుగఁ దూఁడులేని♦వనజం బనఁగన్. ౮౮౮

కం.సులలాటము కురుళాంతము, సలలిత మవ్రణము ఫుల్ల♦సారససమ మహా
జలజాక్షి మోము పొలిచెను, జలదంబును వ్రచ్చి తోఁచు♦చందురుఁ డనఁగన్.

చం.సలలితశుక్లదంతమును ♦ జంపకకుట్మలతుల్యనాసముం
విలసితహాటకాభరణ♦విభ్రమముం బతదుత్పతత్సుకుం
తలమును బక్వబింబఫల♦సన్నిభ్యోష్ఠము రావణాంకసం
కలితసతీముఖంబు దివిఁ ♦ గ్రాలె దినోదితచంద్రబింబ మై. ౮౯౦

కం.ఎంచఁగ నీలాంగాసుగు, నంచుసఁ గాంచనసువర్ణ ♦ యవనీసుత దాఁ
గాంచనకాంచిక హరినీ,లాంచిత మైన ట్లు పొలిచె ♦ సంబరవీధిన్. ౮౯౧

కం భానురత్నస్తనువర్ణో, ద్భాసితభూషామనోజ్ఞ ♦ పంకజగౌర
శ్రీసీత మొగులుచెంగట, వాసించిన మెఱుఁగు వోలె ♦ వర్తిలు చుండెన్. ౮౯౨

తే. పగడపుందీఁగెఁ బోలిన♦పడఁతి సీత, నల్ల నగు మేనివాని నా ♦ నల్లదింపఁ
బంగరువుకక్ష్యచేత ని♦బద్ధ మైన, వారణంబువిధంబున ♦ వఱలఁ జేసె. ౮౯౩

కం.చంచలనేత్రాసంభృత, కాంచనభూషావితాన♦ఘల్ ఘల్లనినదో
దంచితరాక్షసపతి రా, జించె సశింజానసీతము ♦ సీవిన పసఁగెన్. ౮౯౪

చం.జనకసుతాశిరస్స్ఖలిత♦చారుసుమంబులు నేల వ్రాలు చ
ద్దనుజుఁడు పాఱు వేగమునఁ ♦ దద్దయు సుళ్లను జుట్టి క్రొన్ని యా
తనిమెయిఁ జుట్టుచుం దిరిగెఁ ♦ దారక లోలి సుపర్వమందిరా
వనిధరనాథుఁ జుట్టి చెలు♦వంబుగఁ ద్రిమ్మరు చున్నరీతిగన్. ౮౯౫

కం.ధరణీతనయామోదంచిత, నవరత్నవిభూషితంబు ♦ పదకటకం బు
ర్వర జాతి పడియె మధుర, స్వరయుతముగ మెఱుఁగుదీగె♦చక్రము పగిదిన్.

సీ. రావణుం డారాము♦రమణి మహోల్కనాఁ, బ్రసభంబునను గొని ♦ పాఱు చుండ
నాసతియగ్ని వ♦ర్ణాభరణంబులు, దివినుండి చుక్కల ♦ ట్లవనిరాలె
స్తనతలభ్రష్టచం♦ద్రద్యుతిహారాళి, యాకాశగంగనా ♦ నమరెఁ బడుచుఁ
బడఁతిని ఖగయుక్త♦పవనకంపితతరుల్, ధూతాగ్రముల భీతిఁ ♦ దొలఁగు మనియెఁ
ఆ. ద్రస్తమీనజలచ♦రంబులతోఁ ధ్వస్తనలినతతులతోడఁ ♦ గొలఁకు లెల్ల
నూర్పు నిలచియున్న ♦ యుత్తమసఖినాఁగ, భూమిసుతకుఁగాఁగఁ ♦ బొక్కుచుండె.
కం. కలయఁగ నల్లెడ నెరయుచు, బలితపుసింగములు పులులు ♦ పక్షులు మృగముల్
తలఁగనిరోసంబున ను, గ్గలిసీడలజాడఁ బఱచె ♦ గను చుప్పరమున్. ౫౯౮
చం. ఉరలఁగ నిర్ఝరాశ్రుగణ ♦ ముచ్ఛ్రితశృంగకరంబులన్ గుహాం
తరతలనిర్గతానిలన♦దంబునెపంబున నేడ్చె సర్వభూ
ధరములు వంచనాపహృత♦ధారిణికన్యవిపద్దశాప్తికిన్,
సరసిజమిత్రమండలము ♦ సొగెను దీనత వెల్ల వెల్లనై. ౫౯౯
ఉ. ఎక్కడిధర్మ మింక నిల ♦ నెక్కడిసత్యము నార్జవం బయో
యెక్కడ నానృశంస్య మది ♦ యెక్కడ నిక్కటిలుందు జానకిన్
దిక్కఱినట్లు వంచనను ♦ నిష్ఠురతం గొనిపోవ లోకమం
దొక్కఁడు నైనఁ గా దనఁ డయో యని యేడ్చె భూతసంఘముల్. ౬౦౦
కం. ప్రేలెడుమోములతో భయ,లోలత మృగశాబకములు ♦ లురదశ్రులతో
బాలామణి చనుమార్గము, వాలాయము చూచి చూచి ♦ వనరుచు నుండెన్.
చం. కనుఁగొనుచున్ ధరాతలముఁ ♦ గన్నురవంబున రాము లక్ష్మణా
యని పలవించుచున్ దెసల ♦ నడ్డము రారె మహాత్ము లెవ్వరే
నని తిలకించుచుం జనుమృ♦గాక్షిని గాంచి వణంకుమేనులొ
ప్పున వనదేవతావితతి ♦ బోరన యేడ్చె మహాస్వనంబునన్. ౬౦౨
చం. పెరిగినతారహారములు ♦ బీఁటలు వాఱినయోష్ఠబింబమున్,
గరఁగినచిత్రకంబుఁ గను♦కాటుక, వ్యాకులకుంతలంబులున్
బరఁగుసతీమణిన్ నిజవి♦నాశముపొంతె గ్రహించి రావణుం
డరుగ వివర్ణవక్త్రయు భ♦యవ్యథితాత్మయు నొచు సీతయున్. ౬౦౩
కం. రోదనరోషములను నెఱ,జాదుకొన నేత్రయుగళి ♦ జనభీకరు వ్యా
పాదరతాత్మకు మర్దవి, భేదనముగ నిట్టు లనియె ♦ బెట్టిదపునుడుల్. ౬౦౪

సీత రావణు నిందించుట.

ఉ. ఏమిర సిగ్గు లేదటర ♦ యేకత మే నటు లుండఁ జూచి నీ
వీమెయి మ్రుచ్చిలించుకొని ♦ యెత్తినభీతిని బాఱిపోయె దే

నీమటుమాయయే కద వ♦నిన్ మృగరూపముచేత నామనో
రాముని దవ్వుగాఁ బనిచె ♦ రాక్షసవంశదవాగ్ని హోత్రుఁడా. ౯౦౫

ఆ. నాదుమామసఖుని ♦ నన్ను సంరక్షింప, మొనసి వచ్చినట్టి♦ముసలి గ్రద్దఁ
బెద్దపెనఁగి నీవు ♦ పిలుకుమార్చితి వౌర, యెంతక్రూరుఁ డవుర ♦ హీనచరిత. ౯౦౬

ఆ. పేరు చెప్పుకొనెడి♦బింక మేమియు లేక, కలనిలోన నన్ను ♦ గెలువ లేక
దుష్టరాక్షసుండ ♦ దొంగిలి పఱచెదే, యహహా యేమి నీమ♦హాబలంబు! ౯౦౭

ఉ. ఈదృశ మైనగర్హితపు♦హేయపుఁగార్యముఁ జేసి యన్య యా
పైకలి దొంగిలించికొని ♦ పాఱెదు భీతి దురాత్మ బాలిశా
లేకట రోరి సిగ్గు లవ♦లేశము-ఛీ నిను శూరమాని వ్యా
పాదరతాత్ముఁ గాంచి మగ♦వారు హసింతురు సుమ్ము నీచుఁడా, ౯౦౮

ఉ. ప్రేలితి కాఱుకూఁతలను ♦ బెద్ద బలంబును శౌర్య మంచు ఛీ
కాలుపనే దురాత్మ కల♦కాల మకీర్తియు వంశనాశమున్
బోలఁగఁ జేయుకార్యమును ♦ బూని తిసీ నిలు పోటుబంట వై
చాలు ముహూర్త మంతఁ జనఁ ♦ జాలుదె యీమెయితోడ నీగతిన్. ౯౦౯

తే. చావుపరువునఁ బరువెత్తి ♦ చనెడినిన్ను, ననవివల్లభుఁ డేమి చే♦యంగఁ గలుగు
నేది నిల్వుము క్షణమాత్ర ♦ మిందు నీదు, ఘోరకృత్యఫలంబును ♦ గుడువఁ జేయు.

కం. భూవరపుత్రులకంట, న్నీ విప్పుడు పడితి వేని ♦ నీసైన్యములున్
నీవును ముహూర్త మైనను, జీవముతో నుండఁగలవె ♦ చెనఁటిపలాశీ. ౯౧౧

ఆ. కారుచిచ్చు రేఁగఁ ♦ గాననాంతరములఁ, బులుఁగు దానిఁ జేర ♦ జలములేని
యట్లు నీవు వారి♦యంబకములఁ దేఱి, చూడనైన లేవు ♦ పోఁకుఱేఁడ. ౯౧౨

మ. వినరా నీకు హితంబుఁ జెప్పెద నరున్♦వే వీడుమీ నానుడుల్
వినవేనిన్ భృశమత్ప్రధర్షణరుషా♦వేశంబునన్ భూమిభృ
త్తనయుం డాత్మసహోదరాన్వితుఁ డనిన్ ♦ దర్పించి యర్పించు నీ
తనువుం గంకసృగాలగృధ్రతతికిం ♦ దన్వీం గొన న్విందుగన్. ౯౧౩

శా. ఏమోకోరిక నన్గ్రహించికొని నీ♦ వెంతే వడిం బాఱెదే
నామాట ల్వినుసీప్రయత్న మది యె♦న్నం డైన సాగంగఁ బో
దోమాయావి మదీయ భర్త నవిజ♦య్యుర్వి లోకనాథోపమున్
రాముం బాసి చిరంబుగా బ్రదుక నే♦రన్ శాత్రవాధీన నై. ౯౧౪

కం. కృపణుఁడు మృతికాలంబున, విపరీతమ్ముల భుజించు♦విధమున నీవున్
జపలత నీసేమం బే, వ్వపగతమతి నెఱుఁగ లేవు ♦ పాపాత్ముండా. ౯౧౫

కం. పథ్యముచేఁ దగు నరునకుఁ, దథ్యము చానున్న వేళఁ ♦ దగులదు సుమి వై
తథ్యము నా నుడికిని నా, తిథ్యమునకు నిన్ను నీడ్చె ♦ దినకరసుతుఁడున్. ౯౧౬

ఉ. ఇంతటిపాపకార్య మొకఁ ♦ డింతయుఁ గొంకును జంకు లేక ని
శ్చింతతఁ జేయఁ బూనుటను ♦ జెచ్చెరఁ గాంచెదు హేమభూమిరు
ట్సంతతి, నీఁదె దస్రచయ ♦ సన్నము వైతరణిం, గలాఁడవుఁ
స్వాంతమునందు నమ్ము మసి ♦ పత్రవనంబునఁ గ్రీడ సల్పఁగన్. ౯౧౭

కం. సంతప్తహేమపుష్పా, క్రాంతము వైడూర్యదళము ♦ శాలాయసశా
ఖాంతద్రుఘకంటకచితము, నంతకశాల్మలిని గలవ ♦ యాలోకింపన్. ౯౧౮

ఉ. అల్పచరిత్ర యంతటిమ ♦ హాత్ముని వంచన చేసి మేనిలో
నిల్పఁగ నేర్తువా యసువు ♦ నిర్ఘృణుఁడా విషపాయిభంగి నీ
కల్పము నేఁటితో ముగిసెఁ ♦ గాలభటోత్కటపాశబద్ధునిన్
వేల్పులనూడ! రాఘవుఁడు ♦ నిన్వధియించెడి నెందుఁ జొచ్చినన్. ౯౧౯

ఉ. భ్రాతయుఁ దోడు లేక ఖర ♦ రాక్షసులం బదునాల్గువేవురన్
జేతులతీట పోఁ దుమురు ♦ సేసె నిమేషములోన రాముఁ డా
ఖ్యాతమహాస్త్రవేది సుస ♦ మర్థుఁడు భార్యను ముచ్చిలించుదు
ర్జాతుని నిన్ను సైఁచునె దు ♦ రంబున వ్రక్కలు చెక్కఁ కుండునే. ౯౨౦

కరిబృంహితము. ఇట్టు పలుకుచుఁ బెక్కువిధముల ♦ నేడ్చి కరుణము దోఁపఁగాఁ
దిట్టుచును ఘనశోకభరమున ♦ దీన యయి స్మృతి దప్పుచున్
గట్టిగను విలపించి పొరలుచుఁ ♦ గంప మొనరఁ దపించుచోఁ
దిట్ట యయి యనురాధముఁడు నృపు ♦ దేవిఁ గొని చనెఁ బాపియై.

సీత తనయాభరణంబులు కపులముందట వైచుట.

చం. అతఁ డటు పోవుచుండ నొకఁ ♦ డైనను గావఁగ రామిఁ బొక్కుచున్
క్షితిసుత కాంచి భూమిధర ♦ శృంగచరత్కపిపంచకంబు నీ
క్షితిరుహచారు లేనియును ♦ జెప్పక యుందురె రాముతోడ నా
గతి యని కొంగునన్ ముడిచి ♦ కాంచనభూషలు వారి ముంగలన్. ౯౨౨

ఉ. వైచెను వైచు టాఖలుఁ డ ♦ వారణసంభ్రమసాధ్వసాత్ముఁ డై
వే చనుచుంటఁ గన్గొనఁడు ♦ నృక్షచరావళి నిర్ని మేష మా
లోచనముల్ వహించుచు వి ♦ లోలవిశాలవిలోచనామణిన్
జూచెను రామ రామ యని ♦ శోకమునం బలవించు చుండఁగన్. ౯౨౩

ఉ. అసురభర్తయుం గపుర ♦ యంబునఁ బంపను దాఁటి తీక్ష్ణనం
ప్రాసహితాహికన్యకఁ దొ ♦ డన్ ధరియించినభంగి దోఁపఁ బృ

ధ్వనుత మృత్యుదేవి నన ♦ దెంపున బల్మి గ్రహించి పర్వతా
లీసరసీనదీవనుల ♦ లీల నిరస్తశరంబుపోలికన్. గా౨౪

ఆ. నడిగ దాఁటి నక్ర♦పాఠీనతిమితిమిం,గిలచయాన్వితంబు ♦ జలధి డాసి
తీఱెఁ బో సురారి ♦ దీనితోనన సిద్ధ,వితతి;హృష్టుఁ డగుచు ♦ వేగి యగుచు గా౨౫

## రావణుఁడు సీతతో లంకఁ జొచ్చుట.

చం. తననగరంబు లంకను న♦తంద్రగతిం బొరఁబొఱి రావణుం
డనయత సీత నుంచెఁ దన♦యంతిపురంబున దైత్యశిల్పి ము
న్ననువుగ శాంబరీసుదతి♦యట్టుల, యంతఁ బిశాచకాంతలన్
గనుఁగొని మీరు హెచ్చరికఁ ♦ గావలి యుండుఁడు సీత కెప్పుడున్. గా౨౬

ఉ. కాంతలఁ గాని పూరుషులఁ ♦ గాని యిటం జొరనీయ కుండుఁ, డే
కాంతము స్వర్ణరత్నవస♦నాదుల దేనిని సీత గోర నా
వంతయు నడ్డు చెప్ప కిడుఁ ♦ డాసయుఁ గల్గినయేని మేనిపై
నింతి నెఱింగియే నెఱుఁగ♦కేఁ బరుషంబులు పల్కఁబోకుఁడీ. గా౨౭

కం. అని యిట్టు లాజ్ఞయిడి య,మ్మనుజాశనుఁ డంతిపురము ♦ మాని యిఁ కేమే
నను వగుఁ జేయఁగ నని నర,మున మోహితుఁ డగుచు నెంచి ♦ పురుబలయుతమున్

## రావణుఁడు జనస్థానమునకుఁ గాపు పంచుట.

కం. అష్టపలాశినిఁ గనుఁగొని, స్పష్టంబుగ ననియె మీరు ♦ చనుఁడీ మీమీ
యిష్టాయుధములఁ గొనుచు న,వష్టంభముతోడ వేగ ♦ వని దండకకున్. గా౨౯

సీ. అందు హతస్థాన ♦ మగుజనస్థానంబు,నందు నిల్వఁడు మీర ♦ లంద అరిగి
మున్ను ఖరాసురుం ♦ డున్నచో టది మీరు, సాధ్వసపడక రో♦షంబు చలము
పౌరుష మారంగఁ ♦ బరికించు చుండుఁడు, మున్ను నే నుంచిన♦యన్నిశాట
నాథుల ఖరదూష♦ణప్రముఖులఁ జంపె, రాముండు దాన వై♦రంబు పుట్టె

తే. వైరనిర్యాతనమునకు ♦ వలను రోయు,వాఁడ ధైర్యంబుకంటెఁ గో♦పంబు మించె
జానకీనాథు రణమునఁ ♦ జంపి కాని, యాద మఱచి నే నిద్రింప ♦ నసురులార.

ఉ. కావునఁ బేద విత్తమును ♦ గాంచినయట్లు ఖరారిఁ జంపి సౌ
ఖ్యావహవృత్తి నుందుఁ, జని ♦ యయ్యెడ కీరలు రాముపోకలన్
రేవగ లప్రమాదగతిఁ ♦ ద్రిమ్మరి కాంచుచుఁ దన్విశేషవా
ర్తావళి నాకుఁ బుచ్చుఁడు, నృ♦పాత్మజులన్ వధియింపఁ బూనుఁడీ. గా౩౧

కం. మీబలమును మీ శౌర్యం, బే బహురణములను జూచి ♦ యెఱుఁగుట మిమ్మే
యీబలితపుఁగార్యంబున, నే బారకమునకుఁ బూన్చు ♦ టయ్యె నటంచున్. గా౩౨

ఉ. ఈ నెఱి నింపు పెంప నను♦రేంద్రుఁడు పల్కిన రాక్షసాష్టకం
బానతిఁ జేసె, రావణుని♦యానతిఁ జేసి జవంబు మైజన
స్థాన మలక్ష్యదర్శనులు ♦ దారుణభంగిని జొచ్చి, రీగతిన్
జానకిఁ దెచ్చి రాముని నెడ ♦ శాత్రవ మూని విమోహి మోదిలెన్. ౯౩౩

కం. వితతబలిష్ఠాదిత్యా,హితులను నెనమండ్రఁ బనిచి ♦ యోగ్యమిం గొనుచున్
జితదిక్పాలుఁడు తనలోఁ, గృతకృత్యుఁడ ననుచు బుద్ధి♦హీనతఁ దలఁచెన్. ౯౩౪

రావణుఁడు సీతకుఁ దనసౌధంబుఁ జూపుట.

కం. వెంశియు నుమకాండాసన, చండతరాశుగనితాంత♦సంతాడితుఁ డై
దండితసురరాజుఁడు వే,తండగమనసీతఁ దలఁచి ♦ తటుకునఁ జనియెన్. ౯౩౫

చం. చని యట దైత్యనేత నిజ♦శాసితదైత్యసతీపరీత, లో
చనయుగళీగళత్సలిల♦జాత, నతాస్యవరాంబుజాత, భూ
ర్యనిలసమాహతోడుపని♦భాతిసమాకులధీసమేత, ద
ర్శనవిముఖస్ఫురాత్మముఖ♦సాగరజాతను, సీతఁ గన్గొనెన్ ౯౩౬

ఉ. తేఁచులు తన్నుఁ జుట్టుకొని ♦ తేసిన నివ్వెఱ ఱిచ్చపాటు దన్
లోఁచఁగఁ జిక్కి స్రుక్కుమృగ♦లోకవిముక్తకురంగిఁ బోలుచున్
డ్రాఁచన దీర్ఘనిశ్వసన♦రాజి నిగుడ్చుచు నున్నదానిఁ దాఁ
బూఁచి బలాత్కృతిన్ నగరు♦పోఁడిమిఁ జూపఁగఁ బట్టి లాగుచున్. ౯౩౭

కం. ముద్దియలు వేలకొలఁదులు, నిద్దపురతనములతోడ ♦ నెఱి గలమేడల్
మిద్దెలు నగళులు వన్నెల, ముద్దులు గొలిపెడితకుంతముులు గలయింటన్. ౯౩౮

కం. స్ఫాటికరాజతదాంతక,హాటకవైడూర్యవజ్ర♦హారిస్తంభో
త్కూటము కాంచనతోరణ,ఘూటము సోపాన మెక్కి ♦ సతి కసురుఁ డనున్.

సీ. ఇదె చూడవే సీత ♦ హేమదంతసమేత,పూతవాతాయన♦వ్రాతములను
నదె చూడవే భామ ♦ హృదయంగమోద్దామ,ధామనిర్జితసోమ♦ధామములను
నటు చూడవే గోల ♦ హారికేళీలోల,జాలపాదాంగనా♦జాలములను
నిటు చూడవే చాన ♦ యింపుసొంపుల సీన, మానితనవనవో♦ద్యానములను

తే. జూచి లే యల్లకొలఁకుల♦సొంపుపెంపు, కొమరుఁజిలుకలపులుఁగుల♦గుంపుఱంపు
నెల్లపుష్పితవృక్షంబు ♦ లింపు నింపు, మగువరో యింకనైన నీ♦మంపు దింపు. ౯౪౦

చం. అని యిటు లాంగ్లదివ్యభవ♦నావళిచందము మందయాన దాఁ
గనుఁగొనఁజేసి మోసపడఁ ♦ గ్రమ్మఱ నిల్లను నన్నుఁ గొల్చుచున్
గొనకొని యెప్పు డుండుదురు♦కోటులు ముప్పదిరెండు రాక్షసుల్
వనిత తలఁపు మేఁ ప్రభుత♦ వాలెద నింపఱ నేలుచున్ సతీ! ౯౪౧

కం.పరిచర్యల నొక్కొక్కపని, యరయఁగ నొక్కొక్క వేవు • రసురవరేణ్యుల్
పరిగణనము సేయక బాలుర ముదుకలఁ గలరు సుమ్ము • లోలాక్షి యిటన్. ౯౪౨

ఉ. ఈవరమందిరావళులు • నీయసమానసుపూజ్యరాజ్య మిం
దీవరనేత్ర! నాయనుఁగు • దేవులు వేలకొలంది వెండి నా
జీవనముం భవద్వశముఁ • జేసెద, నిన్నిటి కీవ యిప్పుడే
దేవివి కమ్ము లెమ్ము పరి • దేవన మేటికిఁ గొమ్ము నన్ బలిన్. ౯౪౩

ఉ. ఏల దురంతతాపమున • నేడ్చెద విట్లు! మదీయవాక్యముల్
లాలన నాదరింపుము వి • లాసిని! మే లగుమార్గ మిద్దియే
యాల మిఁ కేల యేవొ యడి • యాసల నేటికి వేఁగె, దర్పమే
బాలిక! పుష్పచాపశర • బాధితునిన్ ననుఁ ద్రోసి పుచ్చఁగన్? ౯౪౪

ఉ. ఏ మని యెంచితే కువల • యేక్షణ! శతయోజనాయతం
బై మహితోగ్రరాక్షసస • హస్రసమావృత మైన లంక? సు
త్రామముఖామరాసురులు • దాయఁగ నైనను లేరు, నాకు సం
గ్రామమునందు యక్షసుర • కాండములున్ సరిరావు బల్మిచేన్. ౯౪౫

రాముఁడు రాముఁ డంచు నొక • రాజ్యవిహీనుని దేబ జోగినిన్
వేమఱు నల్ప తేజుని న • నేకవిధంబులఁ గూర్చి యేడ్చె దో
భామిని! నీకు యోగ్యుఁ డగు • భర్తను నేనె, ననున్ భజింపుమీ
శ్యామరో! యౌవనంబు సత • మా పిటికీ ననుఁ గూడు హాయిగన్. ౯౪౬

ఉ. ఏటికి రిత్తయాస సుద • తీ రఘురామునిఁ జూతు నంచు, ని
చ్చోటు మనస్సుచే నయినఁ • జొచ్చి నినుం గన వాని కౌ నకో?
త్రాటను గట్టఁగా వశమె • తన్వి నభోగతవేగితానిరా
ఘాటసదాగతిన్, శిఖిశి • ఖానిచయంబును బట్ట శక్యమే. ౯౪౭

ఉ. లోకమునందు లేఁడు విను • లోలవిలోచన మామకీన బా
హాకులపాలిత న్నినుఁ బ • రాక్రమనృత్తిని నన్ను గెల్చియున్
దోకొనిపోవువాఁడు, విబు • ధుల్ సచరాచరభూతకోటులున్
నీకు సపర్యఁ జేయుఁ,దరు • ణీ నను నేలుము రాజ్యభూతితోన్. ౯౪౮

కం.శంకాతంకం బేటికి, లంకారాజ్యంబు నెల్ల • లలనా యభిషే
కాంకిత వై యేలుము నీ,కింకరుఁగా నన్నుఁ గొనుము • క్రీడలఁ దేలన్. ౯౪౯

కం.మును నీచేసినపాపము, వనవాసాయాసమున ని • వర్తించెను నీ
యొనరిచినపుణ్యఫలములు, కనకాంగీ నీవు పొందఁ • గాలం బొదవెన్. ౯౫౦

కం ఈచందన మీసరములు, నీచామీకరవిభూష ♦ లిద్దఱ మిచటన్
వాచాఽగోచరసుఖలీ,లాచతురతఁ బూసి ముడిచి ♦ బలిఁ దొడుగుద మే. ౯౫౧

మత్తకోకిలము. ఇంచుఁబోణిరొ పుష్పకాఖ్యస♦మిద్ధమైనవిమాన మ
భ్యంచదర్కవిభావికాసము ♦ యతుఁ నగ్రజుఁ బోర ని
ర్జించి తెచ్చితి హృద్య మయ్యెడఁ ♦ జేరి యిద్దఱ మెంతయున్
జంచదిష్టసుఖోపభోగముఁ ♦ జాన! పొందుచు నుందమా. ౯౫౨

కం.వదనము తామరసశ్రీ,సదనము నునుముద్దు గుల్కు ♦ చందము చెడె నీ
యదనున రోదనమున నీ,యదనద నెద వదలి నేలు♦మా నన్ను దయన్. ౯౫౩

కం ఈరీతి ననుచుఁ డాడఁగ, నారీమణి పైటకొంగు♦నం దనవదనం
బారఁగఁ గప్పుచుఁ గన్నుల, నీ రోడిక గట్టు చుండ ♦ నిన్వెఱ నుండెన్. ౯౫౪

చం అది గని రావణుం డను ధ♦రాత్మజతో సతి! ధర్మలోపబు
ద్ధ్యుదితము సిగ్గు చాలు, వల ♦ దూరక యేడ్వఁగ, ధర్మలోప మిం
పొని వచియింపుమీ, కన ఋ♦షీశులు దైవకృతానుబంధిమున్
మది గణియింప రోటు, నిను♦పూం పలుమాట లిఁ కేల మైథిలీ. ౯౫౫

ఉ. జానకి త్వత్పదాంబుజర♦జస్థిలకాన్వితశీర్షయుక్తిఁ జం
ద్రానన వేఁడువాఁడను, ద♦యామతి నేలుము నీదాసుఁడన్
మానవతీ రాత్రిఁ జిక్క యిటు ♦ శూన్యతరోక్తులు పల్కినాఁడ నో
మానిని! రావణుండు నొక ♦ మానవతిం బడ మంటి మ్రొక్కనే. ౯౫౬

తోటకము. అని యాగతిఁ బల్కి ద♦శాస్యుఁడు దం
జనకాత్మజ నాత్మను ♦ సంతసిలెన్
వనితామణి నక్కను ♦ నా కిఁకఁ బో
యని యంతకపాశస♦శాత్ముఁడు మైు. ౯౫౭

◆— సీత రావణునకుఁ బరుసోక్తు లాడుట —◆

కం.పలలాశనుఁ డిటు పల్కిన,పలుకులు విని సీత దుఃఖ♦భరకర్శిత యై
పులుపోఁచ యడ్డముగఁ దాఁ, బలికెన్ నిర్భీతి నసుర♦పాలకుతోడన్. ౯౫౮

సీ. సత్యసంధుఁడు పరి♦జ్ఞాత నుస్థిరుఁడును, ధర్మసేతువు నగు♦దశరథునకుఁ
బుత్రుండు త్రిభువన♦పూజ్యుండు రాముండు, విశ్రుతనాముండు ♦ విపులనేత్రుఁ
డాయతబాహుఁడు స♦త్యంతధర్మాత్ముండు, ప్రాణవిభుండు దై♦వంబు నమ్ము
నిన్నుఁ జంపఁగ నున్న ♦ నిస్తులవీరుఁడు, సహలక్ష్మణుఁడు హరి♦స్కంధుఁ డాతఁ
తే డవని జనియించె నిక్ష్వాకు♦సన్వయమున, నేమిరో ప్రేలెదవు రాము♦నెదుట నీవు
నన్నుఁ జెనకియు యుండిన ♦ నిన్ను నంద, ధరకు బలిపెట్టి యుండఁడే♦ఖరునిమాడ్కి.

ఉ. భీకరరూప మంచుఁ బటు♦భీమబలాఢ్య మటంచు రాక్షసా
నీకము నెన్న దీ విచట ♦ నిర్విష మౌచును దార్క్ష్య మొ్రోల ద
ర్వీకరరాజి యట్లు తల ♦ వ్రేలఁగ వైచి పడుట మదీశచా
మీకరపుంఖ బాణతతి ♦ మ్రింగఁగ వీచులు గంగయొడ్డ నన్. ౯౬౦

చం. వరమున దేవదైత్యుల క♦వధ్యుఁడ వైనను నాదుభర్త కాఁ
కరమును గల్గఁ జేసి బ్రదు♦కట వశమౌ రణసీమ నీకు, న
ధ్వరమున యూపబద్ధపశు♦భంగిని నీవు మనంగఁ జాల వా
శరవర! రామభీకరని♦శాతశరాళికి గోచరుండ వై. ౯౬౧

కం. రాక్షస! క్రోధోద్దీపిత,చక్షువులన్ నిన్ను రామ♦చంద్రవిభుండున్
వీక్షించిన దగ్ధుఁడ వై, నీక్షితిఁ దక్షణము కూలె♦వే నీచమతీ. ౯౬౨

శా. ప్రాలేయాంశుకబింబమున్ వసుమలిం ♦ బాతంబుఁ గావించు, దో
ర్లీల న్నాశము నైనఁ జేయు జలధిం ♦ గ్రీడాగతిన్ శోషిలన్
హేలాగీతిని జేయఁ జాలుఘనుఁ డా♦నిస్తుల్యవీర్యుండు ప్రో
యాలిన్ రక్తను బంది నుండి విడఁ జే♦యం జాలఁడే రక్కసా. ౯౬౩

కం. గతరముఁడవును గతాయువు, గతేంద్రియుఁడు గతబలుఁడవు ♦ కావుట ఖల నీ
కతమున వైధవ్యంబునఁ, గుతిలపడున్ లంక యేటి ♦ కో యీపొగరున్. ౯౬౪

కం. నాపతిపార్శ్వంబున నెడఁ, బాపుటచే నన్ను నబలఁ ♦ బాపాత్మా యీ
పాపంబు సుఖోదర్కం, బేపాటియుఁ గాదు చూడు♦మీ నీ కెటులున్ ౯౬౫

ఉ. దైవబలంబుఁ గల్గు మహి♦తద్యుతిమంతుఁడు ధర్మశీలి స
ద్భావుఁడు నిర్భయుండు పతి♦తప్రతిమానవిహీనశూరతన్
గేవలుఁ డుగ్రసత్త్వనృగ♦కీర్ణమహాటవి నున్నవాఁడురా
రావణ బాణవర్షమునఁ ♦ గ్రక్కునఁ జేయు భవద్బలోద్ధతుల్ ౯౬౬

కం. కాలవశులైన పురుషులు, కాలప్రేరణముఁ జేసి ♦ కార్యములందున్
జాలఁ బ్రమాదము పడుదురు, మే లని దుష్కార్యములను ♦ మేకొంద్రు సుమీ.

కం. అట్టివినాశపుఁగాలము, పుట్టెం జుమి నీకు నసుర♦పుంజములకు నీ
గట్టికొని యున్నసతులకు, నిట్టు నను నీవు బల్మి ♦ నిటఁ దెచ్చుటచేన్. ౯౬౭

తే. క్రతువు మధ్యంబునందు స్రు♦గ్భాండమండి,తంబు బ్రాహ్మణమంత్రపూ♦తంబు వేది
మాలఁ డంటఁగ వశమె యా♦లీల సతిని, రామపత్నిని నన్ జూడ♦రా దురాత్మ.

ఆ. ధర్మనిత్యుఁడైన ♦ దశరథ సుతవర్యు, ధర్మపత్ని సాధ్విఁ♦దరమె నీకు
రాక్షసాధముండ♦రాక్షుదుశ్చరితుండ, పాపి నన్నుఁ దాఁక♦బాలిశుండ! ౯౭౦

కం. అరవిందబృందముల నన,వరతము రాయంచతోడ ♦ వరకేళిత
త్పర యగుహంససాంగన యే,కరణిఁ దృణస్థంబు నీము♦కాకిని గనెడిన్. ౯౭౧

చం. తనువు విసంజ్ఞ యయ్యెడి మ॥దంబునఁ గట్టిన వేని కట్టుమీ
కనలునఁ దిందు వేని తిను ॥ కా దనుదానను గాను, నాకు నీ
తనువును జీవితం బయిన ॥ దానవ! రక్ష్యము గాదు రోరి, నా
మన మిది మర్త్యశంబ యన॥మానము పాల్పసనొల్ల నమ్ముమీ. ౯౨౨

కం. అని పరుసంబుగ వాక్కొని, కనరున మఱియేమి యనక ॥ త్సాకన్యక యుం
డిన నసురుఁడు భయసంద,ర్శనముగ ని ట్లనియెఁ గ్రోధ॥సందీప్తుం డై. ౯౨౩

→ రావణుఁడు సీతమీఁద రాక్షసస్త్రీల కావలి యుంచుట. ←

మ. వినుసీతా పదిరెండుమాసములలో ॥ విశ్వాసపూర్వంబుగా
ననుఁ గామింపఁగఁ గోర వేనియును నం॥తం బ్రాతరాశార్థ మై
నిను నావంటలవారు తున్కలుగ ఖం॥డింపం గలా రంచు న
న్దనుజుం డచ్చటికాపుకత్తెల కనుక ॥ దైత్యాంగనల్ వింటిరా. ౯౨౪

ఉ. దింపుఁడు దీనిక్రొవ్వు కసి ॥ దీఱఁగ నంచు వచింప వారు నై
లింపవిరోధిఁ జూచి ముకు॥ళింపఁ గరంబులు పాదఘట్టనో
త్కంపితభూమిభాగుఁ డయి ॥ దానవనాథుఁడు దీని నిష్ఠ నా
పంపునఁ గొంచుఁ బొందు సుమ॥పల్లవపుష్పలతావికీర్ణ మై ౯౨౫

కం. మానిత మైనయశోకో,ద్యానమునకు నంద మీరి ॥ యనవరతము ర
తానియతి నుండి యీవన,జానన నరయుండు కడుర॥హస్యము గాఁగన్. ౯౨౬

తే. ఘోరదర్శనలార వి॥కారరూప,లార మాంసాస్రభోజన॥లార సతిని
బెదిరినముల నొండె మెత్తని॥నుడుల నొండె,వశమునకుఁ దెండు వనగజ॥వధువునట్లు.

కం. అని చనిన నసురవనితలు, జనకసుతం దోడుకొనుచుఁ ॥ జని రనవరతం
బును సర్వకాలఫలపు,ష్పనికరములు గలయశోక॥వనతలమునకున్. ౯౨౭

కం. పిడువసవగపున మిగులన్, సుడివడుచును నాఁడుపులులు ॥ చుట్టుకొనంగా
మిడికెడుహరిణి యనంగాఁ, బడఁతుక రాకాసిగుమికి ॥ వశపడి యుండెన్. ౯౨౮

కం. అమ్మగువ దుస్సహవ్యా,నమ్మున సంగ్రస్త యగుచు ॥ నవయుచు దృఢపా
శమ్ములకట్టులఁ జిక్కి సు,ఖ మ్మెఱుఁగనియాఁడుజింక॥కరణిని నుండెన్. ౯౩౦

కం. భీకరవికటేక్షణ ల,స్తోకము భయ పెట్ట మగున ॥ దూలుచు నుండెన్
శోకమున దయితుఁ బతినిన్, శ్రీకరు దైవతము నెపుడుఁ ॥ జింతించు చెదన్. ౯౩౧

→ రాముఁ డపశకునములఁ గని పరితపించుట. ←

ఉ. అక్కడఁ గామరూపిఁ బొ॥లాశి మృగాకృతిఁ బూని యున్నయా
టక్కరిఁ ద్రుంచి యాశ్రమము ॥ వాయుత్వరం జనుదెంచుచోట నె

స్రుక్క శివారుతంబు విని ♦ రాముఁడు దారుణ మీారవంబు నా
కెక్కుడుకీడుఁ దెల్పె, నసు♦రేంద్రులు మ్రింగరు కాదె జానకిన్. ౯౮౨

మ. ఖలమారీచుఁడు మత్స్వరానుకృతి బి♦గ్గం గూసె, నానాద మా
జలజాతాక్షియు లక్ష్మణుండు విని రా ♦ సంభ్రాంతు లై తత్సతీ
తిలకప్రేషితుఁ డై సుమిత్రసుతుఁ డెం♦తే వేగ నన్ రోయుచున్
జెలువం గానల వీడి వచ్చు నటపైఁ ♦ జే టేమి గా నున్నదో. ౯౮౩

ఉ. ఎక్కడిపైఁడిజింక, నను ♦ నీగతిఁ దాటకసూతి దూరమున్
దక్కక తెచ్చి నాశరము♦తాఁకునఁ జచ్చుచు సీత లక్ష్మణా
చిక్కితి నం ద టంచఱచె ♦ సిద్ధము దీసను జూప జానకిం
ద్రెక్కొన నున్నవారు రజ♦నీచరు లేపటుమాయచేతనేన్. ౯౮౪

సీ. కాన నేకత ముండు ♦ కలికికి నాతమ్ముఁ,గుఱ్ఱకు సేమంబు ♦ గోఱలుఁ గాక
తెగనివైరము గల్గె ♦ దితిజులతో జన,స్థానవాసంబు ని♦దానముగను
ఘోరనిమిత్తముల్ ♦ గొల్లలుగాఁ దోఁచె, నఱచుచు నున్నవి ♦ నఱకు లెందు
నేకీడు మూఁడునో ♦ యెది కనఁ గల్గునో, యేమి సేయుదు వార ♦ లెట్టు లైరొ

తే. యనుచు దీనతఁ జనుచోట ♦ సఖలపక్షి
మృగవితానము సవ్యంబు ♦ నేగు చతుల
భీకరారావములు నింపఁ ♦ బృధ్వీసుతను
దమ్ముఁ జింతించుచును బోయెఁ ♦ దడయ కెందు. ౯౮౫

రాముఁడు లక్ష్మణుం జూచి సీతఁ దలంచి దుఃఖించుట.

ఉ. పోవుచు నిట్టు లాశ్రమము ♦ పొంతకు వేగ నదూరమంద సీ
తావిభుఁ డేగుదెంచుతన♦తమ్ముని దీనతరాస్యుఁ గాంచి దుః
ఖావిలచిత్తుఁ డై కదిసి ♦ యాతనిసవ్యకరంబుఁ బట్టి తా
నీవిధి నార్తి దోఁప నని♦యెం బరుషంబును మార్దవంబుగన్. ౯౮౬

శా. అయ్యో లక్ష్మణ యేమి చేసితివి నీ ♦ యాసీత నీ వొంటిగా
నయ్యారణ్యతలంబున న్వదలి యే♦లా వచ్చి తిం దక్కటా
యయ్యన్నన్ మనుజాశనుల్ మెసవిరో ♦ హా కొంచు నే పోయిరో
యయ్యా సందియ మింత లే దశుభ మే ♦ యత్యంతముం గల్గెడిన్. ౯౮౭

శా. అన్నా! లక్ష్మణ! చూడఁగాఁ గల మొకో ♦ యన్నారి జీవంబుతో
నున్నన్ సేమముగాఁగఁ, గంటివె యదే ♦ యుగ్రంబుగాఁ గూసె నా
సన్నంబై వఱడుల్ ఖగంబులు మహా♦సత్త్వంబులున్ సూర్యసం
పన్నాశాభిముఖంబు లై, శుభ మెటుల్ ♦ ప్రాపించు నోతమ్ముఁడా. ౯౮౮

కం.హరిణమువలెఁ దోఁచినయా,ఖరదైత్యుఁడు వాలకమునఁ ♦ గమవఖ్య వనుఁ
సరగఁ గొనియేగ నెట్లో, పొరిపుచ్చితి వాని మోసఁ♦పోకలు దెలియన్. ౯౮౯

తరలము. అదరె వామవిలోచనంబు, ప్ర♦హర్ష మేమియు లేదు నా
మదిని, నాశ్రమభూమి నిక్కము ♦ మానినీమణి లేదురా
సుదతినిఁ హరియించిరో తమ♦సూదు దీఱఁగ రక్కసుల్
ముదిత దా మరణించెనో వని♦లోనఁ ద్రోవయె తప్పెనో. ౯౯౦

ఉ. ఇమ్మున సౌఖ్యముల్ విడిచి ♦ యెంతయు నాపయిభక్తి దండకఁ
ద్రిమ్మరి రాజ్యహీనుఁడును ♦ దీనుఁడుఁ ద్రిమ్మటకాఁడు నైనవా
కమ్మోయి దుర్దశాప్తిని స♦హాయముగాఁ జరియించుజానకిం
దమ్ముఁడ వీడి వచ్చితివి ♦ నాసతి యేగతిఁ బట్టెఁ జెప్పుమా. ౯౯౧

ఉ. ప్రాణ సహాయురా లెవతెఁ ♦ బాసి ముహూర్తము యేని దేహసం
త్రాణపరాయణత్వమునఁ ♦ దాళఁగఁ జాల, ధరాపతిత్వగి
ర్వాణపతిత్వముల్ కమల♦పాణి యెవర్తుక యొద్ద లేనిచోఁ
బోణిమిఁ గోర నట్టిపువుఁ♦బోణి ధరాత్మజ యేది లక్ష్మణా. ౯౯౨

ఉ. ప్రాణముకంటె నాకుఁ బ్రియ ♦ యైనమహీసుత సీత దండకఁ
బ్రాణముతోడ నున్నదియె ♦ పల్కవయా, పదునాలుగేఁడు ల
క్షీణముగా వనీస్థలి వ♦సింతు న టన్నమదుక్తి బంభరీ
వేణి నెపానఁ గల్లయయి ♦ వెంపఱఁ జేయదుగా కుమారకా. ౯౯౩

కం.సీతాకారణముగ నే, వీతాసుఁడ నైన నీవు ♦ వే పురి కరుగఁ
జేతము రంజిలఁ గామా,న్వితయగుచు భరతుమాత ♦ విలసిల్లుఁ గదా. ౯౯౪

కం.సుతరాష్ట్రసహితఁ గైకను, హృతపుత్ర తపోవ్రతాఢ్య ♦ మృదుశీలిని స
న్నుతగుణ కౌసల్య యదే,గతిఁ జిక్కి మెఱింగి కొలువఁ♦గా నేర్చు నయో. ౯౯౫

కం.వచ్చెద నాశ్రమమునకును, సచ్చరితా సీత ప్రాణ♦సహితయ యేనిఁ
జచ్చెద నిచ్చట లేదే, నచ్చిగురుంబోణి యూశ్ర♦మాంతరమందున్. ౯౯౬

కం.ముద్దులు గులికెడిసరస, ముద్దియ నాకెదురు వచ్చి ♦ మురిపెంబున మేల్
సుద్దులు చెప్పవ యేనియు, బిద్దెద నాశ్రమముత్రోలఁ ♦ బెక్కులిఁ కేలా. ౯౯౭

కం.పలుకుము లక్ష్మణ జానకి, గలదా ప్రాణంబుతోడఁ ♦ గడ తేఱినదా?
పలలాశులు భక్షించిరొ, యెలనాఁగను నీవు చిత్త ♦ మేమఱి యుండన్. ౯౯౮

కం.బాలిక యవిదితదుఃఖ సు,శీల సలీల సుకుమారి ♦ సీతాసతి యా
నోల మదీయవియోగం, బేలాగునఁ దాళఁజాలు ♦ నెటు వగచెడినో. ౯౯౯

కం.నీచుఁడు క్రూరాత్ముఁడు మా,రీచుఁడు వంచకుఁడు నాదు♦రీతిని నిన్నుళ్
వాచాకుశలత నఱచిన, నోచెల! నీకును భయంబు ♦ నొదవెనె చెపుమా.౧౦౦౦
ఉ. మామకకంఠనిస్వనస♦మానవిరావము నాలకించి యా
భూమిజ భీతిఁ జెంది నినుఁ ♦ బొమ్మని నంతనె నానిమిత్తమై
యీమెయి వచ్చినాఁడవు మ♦హీజ మహాటవి నొంటి వీడి, దు
ష్టామిషభుగ్వ్రతానమున ♦ కంతర మిచ్చితి సూడు దీర్పఁగన్. ౧౦౦౧
కం.ఖరవధమునకును వగచెడి, సురవైరులు సందు గాంచి ♦ సుందరి నెట్లేన్
బరిమార్చి యుంద్రు నిక్కము, పరికింపవ చూచె యింత♦వట్టు కుమారా.౧౦౦౨
కం.మునిఁగితి దుఃఖసముద్రము,నను బడితిం జెడితిఁ గూలి♦నాఁడను నింకే
మనుదుం జేయుదు నీగతి, పొనరుట ప్రాప్తవ్య మంచు ♦ బుద్ధిం దలఁతున్.౧౦౦౩
మంజుభాషిణి. అనుచున్ విలాసవతి ♦ నాత్మ నెంచుచున్
జనియెం బిపాస క్షుధ ♦ జాలి గొల్ప మో
మును వాడఁగాఁ దొలఁగ ♦ మున్ప్వ, స్వాశ్రమం
బున కింతిలేమి నటఁ ♦ బొక్కి యేడిచెన్. ౧౦౦౪
కం.తనయుటజమునకు వచ్చుచుఁ, దనుఁ జూడఁగ వచ్చియున్న♦తమ్మునిఁ గని యి
ట్లని ప్రశ్నించెను దెరువున, జనకసుతాధవుఁడు శోక♦సంతప్తుం డై. ౧౦౦౫

రాముఁడు లక్ష్మణుని సీతను విడిచి యేల వచ్చితి వని యడుగుట.

ఆ. నిన్నెద నమ్మికాదె హరి♦ణీనయనన్ వని నొంటి వీడి యో
యన్న యిటేను వచ్చితిని ♦ న్యాయమె నీకు నరణ్యమధ్యమం
దన్నవలామిహీన్ విడిచి ♦ యాపరబాదర పాటుతేర, నిన్
గన్నదియాది నామనము ♦ కాతరతన్ వహియించె లక్ష్మణా. ౧౦౦౬
కం.సీతావిరహితుఁడవు నీ, వేతేరుట దూరమంద ♦ యేఁ గనినంతన్
జేతం బగలెను నదరెను, నాతమ్ముఁడ వామబాహు♦నయనంబు లయో. ౧౦౦౭
చం.అన భృశదుఃఖతప్తమతి ♦ యై యను లక్ష్మణుఁ డార్తిఁ దూలురా
మునకు స్వతంత్రతన్ మతివి♦మోహముచే నిట రాను, గావరే
జనకజ లక్ష్మణా యనుచు ♦ శబ్ద మరణ్యమునందుఁ గల్గినన్
విని సతి పొమ్ము పొమ్మనియె ♦ నీవయిఁ జెల్మిని భీతి నేడ్చుచున్. ౧౦౦౮
కం.ఈరీతిఁ దీవరించిన, నారీతిలకంబుఁ గాంచి ♦ నయమున నెంతో
దూరము నమ్మిక పుట్టఁగ, ధీరగుణా నిన్నుఁ గూర్చి ♦ తెలిపితి మఱియున్.౧౦౦౯
చం.వదినె! యిటేటికమ్మ భయ♦పాటునఁ గుందెదు, రాక్షసాళిచేఁ
గదనమునందు రామునక ♦ కల్గు భయం? బది యేటిమాట యి

య్యాది రఘురాముప ల్కనుచు ♦ నాత్మ స్ఫురింపదు, దైత్యుఁ డెవ్వఁడో
యదను నెఱింగి యిట్లఱచె ♦ నంగన నెమ్మది నిమ్మళింపుమీ. ౧౦౧౦

కం. దేవతలనైనఁ గడిమిని, గావంగాఁ జాలు నట్టి ♦ కడిఁదిబలుండా
యీవిధమున నీచంబుగ, వా విడి ననుఁ గావుమనుచు ♦ వాపోవు 'సతీ? ౧౦౧౧

మ. ఎవఁడో యేమినిమిత్తమో యఱచెఁ ద ♦ ల్లి నమ్ము మాయన్న యా
రవముం బోలఁగఁ బాహి పాహి యని యా ♦ రావంబు వైస్వర్య మా
త్మ విలోకింపఁగ రాముకంఠ మని న ♦ మ్మఁగ రాదు శాంతింపుమీ
తవునే నీకుఁ గుయోషితాజనముచం ♦ దం బంది దుఃఖింపఁగన్. ౧౦౧౨

ఉ. పుట్టినవారిలో జగతిఁ ♦ బుట్టెడువారలలో రఘూత్తముఁ
గిట్టి రణంబునన్ గెలువ ♦ నేర్చెడువారలు కల్గ రమ్మ, లోఁ
దొట్టినభీతిఁ బో నడిచి ♦ తోయజలోచన స్వస్థచిత్త వై
దిట్టవు గ మ్మజయ్యుఁడు స ♦ తీ రఘురాముఁడు దేవకోటికేన్. ౧౦౧౩

కం. నావుడు నతిమోహితమతి, యై వసుధాకన్య యనియె ♦ నగ్రజుఁ డీల్గన్
నీవు ననుఁ గోరి కల్మష, భావుఁడ వైతట్టికోర్కి ♦ పారముఁ గనునే. ౧౦౧౪

సీ. తెలిసెను లెమ్ము నీ ♦ తెఱఁ గెల్ల భరతుండు, నీవు సంకేతంబు ♦ నిశ్చయించి
కొని రాము వెనువెంటఁ ♦ జనుదెంచితివి నీవు, కాకున్నఁ దనయన్న ♦ కావు మనినఁ
బలుకరింపని యట్టి ♦ భ్రాతయుఁ గలుగునే, ప్రచ్ఛన్నచారి శా ♦ త్రవుఁడ వగుచు
నానిమిత్తంబుగా ♦ నానాథు వెంబడి, వంతరాన్వేషి వై ♦ యరుగుదెంచి

ఆ. తనినఁ బెదవు లదుర ♦ నాగ్రహంబున రక్త, నేత్రకుండ నగుచు ♦ నిలువలేక
యాశ్రమంబునుండి ♦ యరుదెంచినాఁడ నో, యన్న యున్నవిధము ♦ నాడినాఁడ.

రాముఁడు లక్ష్మణుతో నతఁడు సీతను విడిచి వచ్చుట
తగనిపని యని చెప్పుట.

కం. అని లక్ష్మణుఁ డన దశరథ, తనయాగ్రణి శోకమోహ ♦ తాపార్దితుఁ డై
యను సీత విడిచి వచ్చుట, యనఘా సరిగానికార్య ♦ మన నేమి యిఁకన్. ౧౦౧౬

ఉ. ఆఁడుది కింకచేఁ గఱకు ♦ లాడె నటంచును గోప మెత్తి నా
వాఁడిమగంటిమిన్ దనుజ ♦ వారణమందలి శక్తిమత్త్వముఁ
బోఁడిమి నీవెఱింగియును ♦ బొల్తుకఁ గానల వీడి వచ్చితే!
వేఁడియ కాని నీయెద వి ♦ వేకము లేదు గదయ్య తమ్ముఁడా. ౧౦౧౭

కం. అంగన నినుఁ బల్కిన దని, చంగునఁ గోపించి యిట్లు ♦ చనుదెంచుటయున్
సంగతమే? నాయాజ్ఞా, భంగముఁ గావించి తిదియుఁ ♦ బాడియె నీకున్: ౧౦౧౮

సీ. హరిణరూపంబున ♦ నాశ్రమంబుననుండి, ననుఁ గొని తెచ్చిన♦దనుజుఁ డిదిగొ
నతులశరం బొందు ♦ నవలీల నే నైన, దానితాఁకున మృగ♦తనువు విడిచి
కేయూరభూషణా♦లీయుత దేహుఁ డై, ప్రాణముల్ ద న్నడ్డ ♦ పాసి పోవ
వసుధపైఁ బడి యున్న♦వాఁడు దురాత్ముండు, దారుణం బైనమ♦ద్బాణఘాత
ఆ. మోర్వ్వలేక యాతఁ ♦ డూపిరి విడుచుచు, నెద్ది వినుటఁ జేసి ♦ యిచటి కీవు
నాతి విడిచి వచ్చి♦నాఁడవో యాపెను,రవము నించె నాదు♦రవముపోల్కి. ౧౦౧౯

రాముఁడు పర్ణశాలలో సీత లేమిఁ గని దుఃఖించుట.

కం. అని బిఱ బిఱఁ జనురామున,కును క్రీ డాకన్నుకదలెఁ♦గూలెం బదముల్
దనువు వణఁకంగఁ దొడఁగెను, గని యాయవలక్షణములఁ ♦ గళవళపడుచున్.
మం. కలదా యింకను సేమ మానుదతికిం ♦ గంజాక్షి నేఁ జూడఁగాఁ
గలనా యంచు నిజాశ్రమస్థలిని వే♦గస్ఫూర్తిమైఁ జొచ్చి లోఁ
గలనాదామిని లేమిఁ గాంచి భృశశో♦కభ్రాంతచిత్తాకృతిన్
గలఁకం బాఱుచుఁ గే ల్విదుర్చుచును భూ♦కన్యామనోనాథుఁడున్ ౧౦౨౧
సీ. సీమంతినీమణి ♦ లేమిచే హేమంత,మునఁ బద్మిని యనంగఁ ♦ బొలుచుదాని
నేడుచు చున్నట్టు ♦ వాడినసుమములు, శకునాళి గల్గువృ♦క్షములదానిఁ
గాంతిహీనంబుగఁ ♦ గ్లాంతమృగం బగు, చ్యుతవనదేవతా♦తతులదాని
విప్రకీర్ణాజిన♦విప్రవిద్ధబృసీక,కటకుశం బగుచును ♦ గ్రాలుదానిఁ
ఆ. బాడు పెట్టినట్లు ♦ ప్రభ చెడి యున్నట్టి, స్వాశ్రమంబుఁ జొచ్చి ♦ యరసి చూచి
సీత లేమి దెలిసి ♦ చిత్త ముత్తలపడఁ, దలఁచి తలఁచి యేడ్చెఁ ♦ దరుణిఁ గూర్చి,
సీ. అపహరించిరొ కదే ♦ యసురులు పగఁబట్టి, ఘాతుకమృగములే ♦ కాంతఁ దినెనొ
యేహేతువున నైన ♦ నెం దేని యరిగెనో, దాఁగియున్నదొ వినో♦దంబుపొంటె
నేరువుగానఁ గాం♦తారంబుఁ జేరెనో, ఫలపుష్పములఁ దేర ♦ వలచి చనెనొ
స్నానార్థ మేగెనో ♦ సరసులపొంతకు, నంబువులకు నేటి ♦ కరిగె నొక్కొ
ఆ. యేమి సేయువాఁడ ♦ నెక్కడ వెదుకుదు, నెందుఁ జొత్తు నిందు ♦ నెవరి నడుగ
ననుచు రోసి రోసి ♦ యంబుజాతేక్షణఁ, గనులు వాఁచ నేడ్చె ♦ నినకులుండు.
ఉ. వేఁదుఱు గొన్నయట్లు, నెఱ♦వెంగలిరీతిని, బిచ్చి యెత్తినాఁ
గాఁ, దలతిక్కయో యన, వి♦కారపుదృష్టి వెడంగుభంగిఁ, దా
మీఁదులు చూచు దుఃఖభర♦మేదురరక్తవిలోకనంబులన్
మోఁదుకొనున్ శిరంబుఁ దన♦ముంగయిచే నిఁక నేదిదిక్కనున్. ౧౦౨౪

రాముఁడు సీతను వెదకుట.

చం. పర్వు విడుఁ జెట్టుచెట్టునకుఁ ♦ బాఱును బల్విడి గుట్టగుట్టకున్
జరగును బుట్టబుట్టకును ♦ సాగును దొంనర వాఁకవాఁకకున్

గరము విలాపయుక్తుఁ డగు ♦ గాఢతరార్తి మహాబ్ధిమగ్నుఁ డ
వరఁకులు పెట్టి నీకుఁ దగ♦వా మగువా యని యేడ్చు దీనుఁడై. ౧౦౨౫

సీ. బింబమా! రుచిరక♦దంబమా! కంటివే, బింబోష్ఠిని గదంబ♦ప్రియను బ్రియను
గీరమా! పక్వమా♦లూరమా! కంటివే, కీరవాణిని బిల్వ♦హారికుచను
సాలమా! మృగచక్ర♦వాళమా! కంటివే, సాలప్రియను గృష్ణ♦సారనయనఁ
గకుభమా! చెపుమ వే♦గ యిభమా! కంటివే, కకుభోరుఁ గరిరాజ♦గమన రమణిఁ
తే. దిలకసూనమ! ప్రియసతిఁ ♦ దిలకనగమ!, నీవ యైనను గంటివె ♦ నెలఁతఁ జెపుమ
యింబు మీఱఁగ జంబు! ని♦జంబు చెపుమ, జంబునుస్నిగ్ధఁ గంటె వ♦నంబులోన.
కం. శోకాపహామ యశోకమ, శోకోపహతాత్ము నన్ను♦శుభ మగుఁ ద్వన్నా
మాకలితునిఁ జేయఁ గదే, యాకలకంఠివిధంబు ♦ నని నాతోడన్. ౧౦౨౭

సీ. తాళమా! యింత కాం♦తాళమా, చెప్పుమా, తాళఫలస్తని ♦ దార లేదె
చూతమా నీదయ ♦ చూత మానూతన,చూతపల్లవపాణిఁ ♦ జూడ లేదె
నీపమా! వృథావ♦నీపమా యియ్యెడ, నీపసుమాధర ♦ నీవు కంటె
జంభమా! యింతటి♦జంభమా చెప్పుమా, జంభపయోదరి♦జూడఁ గంటె
తే. పాటలాధరఁ గంటివే ♦ పాటలంబ, నవనయస్థను గంటివే ♦ నవనయస్థ
సరళభూజమ! కంటివే♦సరళహృదయ, మల్లికావల్లికా కంటె♦మల్లికాంగి. ౧౦౨౮

కం. కరిణీ! కరినాసోరువు, హరిణీ! హరిణాక్షి భృంగమా! భృంగకచన్
హరివర! హరివరమధ్యను, గరిగమనన్ మీర లెందుఁ ♦ గానఁగ లేదే. ౧౦౨౯

సీ. మీ రైనఁ జెప్పరే ♦ మీలోన నున్నదే, మృగవిలోచన చారు♦మృగములార
నీ వెఱుంగుదు చూడ ♦ నెలఁత యేగినజాడ, గజరాజ! గజరాజ♦గమనలీల
శార్దూలమా! నీకు ♦ జంకేల చెప్పుమా, యింతి యెం దరిగెనో ♦ యెఱుక కలదె
కలకంఠమా! నీకుఁ ♦ దెలిసి యుండఁగవచ్చుఁ, గలకంఠకంఠిని♦ గాన లేదె
తే. హంసమా! నీవు కంటివే ♦ హంసయానఁ, గీరమా! నీవు కంటివే ♦ కీరవాణి
భ్రమరమా! నీవు కంటివే ♦ భ్రమరవేణిఁ, జెప్పరే మీరు కరుణించి ♦ సీత తెఱఁగు.

కవిరాజవిరాజితము.

నిలు నిలు మేగకు మోకలికీ! యెవ ♦ నిర్దయమే మరుపూములికీ!
యలుగఁగ నేటికి ప్రాణసఖీ! పరి♦యాచకమా యిది చంద్రముఖీ!
కులుకుచుఁ గుల్కుచుఁ బర్విడెదే కనుఁ♦గొంటిని లే జగిచీర యదే
పలుకవు కోపమ నీలకచా! ననుఁ ♦ బాలన సేయుము కుంభకుచా! ౧౦౩౦

చం. అడిగినవాని నీ ట్లడిగి ♦ యాడినమాటయె వెండి యాడి బ
ల్వడి మును పోయి చూచినత♦లంబుల కే మఱిపోయి యాత్మలో

నడలుచు సోలి సొక్కుచును ♦ నారట మందుచు నార్తిఁ గుందు చా
యడవిని ధారిణీతనయ ♦ నంతట రోసియుఁ గాన కెయ్యెడన్. ౧౦౩౨

→ సీత రాక్షసహత యైన దని యెంచి రాముఁడు పలవించుట ←

కం. వ్యాలోలచేతమున ని, ట్లాలోచించెను రఘూత్త♦మాగ్రణి యయ్యో
బాలామణి పలలాశన, జాలంబులచేతఁ జిక్కి♦సమయఁగఁ బోలున్. ౧౦౩౩

కం. అంగనను బట్టి రక్కసు, లంగంబులఁ బంచికొంచు ♦ హర్షంబున ను
ప్పొంగుచు నుందురు నాలే, మింగట్టా యెంతచెట్ట ♦ మ్రింగెను సీతన్. ౧౦౩౪

సీ. చారుకుండల మబ్జ♦సఖ మైన నెమ్మోము, కాంతి వాసెనొ కదే ♦ యింత కయ్యొ
హారిచంపకవర్ణ ♦ తారహారో దీర్ణ, యుఱవంగ నసురులు ♦ నఱికి రేమొ
పల్లవకోమల♦బాహువుల్ తెగఁద్రుంచి, కొఱకెదరో యింత♦వఱకుఁ బగఱు
చెఱకుతుంటనుబోలె ♦ విఱిచి నెన్నడుమును, భక్షించు చున్నారొ ♦ పాపమతులు

ఆ. గుంపు విడిచి చనిన♦కువలయాక్షిని వన్య, సత్త్వచయము లెల్లఁ ♦ జంపుపగిదిఁ
గానలోన నొంటి♦గా వీడి నేఁ బోవ, నంబుజాక్షిఁ జంపి ♦ రసురఖలులు ౧౦౩౫

కం. అన్నా! లక్ష్మణ నీకై, న నన్నలామిన్న వనిఁ గ♦నంబడియెనె యో
చిన్నారికన్నియా! నా, కన్నారఁగఁ జూడఁ గలనె ♦ కాంతా! నిన్నున్. ౧౦౩౬

కం. విలపించుచు నిటు రాఘవుఁ, డలఘుగతిఁ వనము వనము ♦ నరయుచు భ్రమచేఁ
బిలుచుచు నిలుచుచుఁ దొలఁగుచు, మలయుచు దూపిల్లె వెకలి♦మాడ్కిఁ[1] సతికై.

కం. దీనుం డై భయశోకా, ధీనుం డై యాశ్రమాంత♦దేశమునఁ బరి
ధ్యానుం డై ధుతవస్తువి, తానముఁ గని చేతు లెత్తి ♦ తద్దయు నేడ్చెన్. ౧౦౩౮

శా. ఏరా లక్ష్మణ! సీత లేదు గదరా ♦ యెచ్చోటికిం బోయెనో
క్రూరం బైనమృగం బెదే మెసవెనో ♦ కొంపోయిరో యెవ్వరేఁ
నీరేజేక్షణఁ బాసి నిల్వఁ గలనా ♦ నే నొక్కమూర్తంబు, క
న్నారఁ నాచెలి! నిన్నుఁ జూడఁ గలనా ♦ హా మానినీరత్నమా! ౧౦౩౯

కం. డాఁగికొని చెట్లమాటున, దాఁగురుమూఁతాడి నన్నుఁ ♦ దపియింపింపం
గాఁ గాలమె యిది యోయెల, నాఁగా! పరిహాస మేల ♦ నన్నేలఁ గదే. ౧౦౪౦

కం. బాలామణి! నీచెలిమిని, గేళీరతి మరగి తిరుగు♦క్రీడామృగముల్
హేలావతి! నినుఁ బాయుట, వాలాయము నేడ్చు చున్న♦నదు వెఱుఁగుదువే.

శా. భామారత్నవియోగభారమున స్వ♦ర్గం బేగ నాతండ్రి యే
మేమీ రాముఁడ! యిందు వచ్చి తిటు లీ♦రేడేండ్లు దుర్గాటవీ
సీమావాసముఁ జేయు మం చనవె? యిం♦స్సీ తీఱెనా కాల? మం
చీమాడ్కిన్ ననుఁ గల్లరీనిఁ బలుకుఁ ♦ స్వేచ్ఛావిహారుఁ డతన్. ౧౦౪౨

---

[1] వెకలియై యనక 'వెకలిమాడ్కిఁ' అనుటచే శ్రీరాముఁడు వెకలివలె నటించెనే కాని నిజముగా శోకపీడితుఁడు భ్రాంతచిత్తుఁడు కాలేదని యెఱుఁగవలయు.

ఉ. చక్కటి లేనిపూరుషుని ♦ సద్యశ మెల్లను బాయుభంగి నో
చక్కెరబొమ్మ! శోకమున ♦ సంతపియింపఁగ నేను దీనతన్
మక్కువలేక పోవఁ దగు♦నా సినుబోఁటికిఁ, నిన్ను బాసి నే
నెక్కడ కేగువాఁడ? నిఁక ♦ నేగతి మేను ధరింతు? సం చితుల్ ౧౦౪౩
కం. బిసరుహలోచన వెదకుచు, నసలున మునిఁగినగజంబు♦నట్టులు భృశదు
ర్వ్యసనమున మునుఁగునన్నకు, నసదృశహితసూక్తి నిట్టు ♦ లను లక్ష్మణుఁడున్.

## లక్ష్మణుఁడు రామునకు సమాధానముఁ జెప్పుట.

ఉ. ఏమిటి కన్న! శోకమున ♦ నెంతయు వేఁగెద వీదరీఝరీ
భూముల లోవత్రోవలను ♦ బొల్పగు కానలఁ గోనలన్ గుహా
సీమల భూమిజన్ వెదకఁ ♦ జేపడ కుండునె! ధీరవర్య లె
మ్మా మహిజాత కానఁ దిరు♦గాడఁ బ్రియంపు టి వెఱుంగవే. ౧౦౪౪
మ జలకేళిన్ విహరింపఁగాఁ జనియెనో ♦ చంద్రాస్య ఫుల్లాబ్జసం
కులనీరాకరతీరమే తటిసెనో ♦ కూలంకషల్ చూడఁగా.
వలపుంగైకొనెనో మఱుంగుపడెనో ♦ వామాక్షిహాసార్థ మై
తెలుపుల్ చూత మ టంచునే మనకు భీ♦తిం గొల్పనే డాఁగెనో. ౧౦౪౬
ఉ. ఎక్కడ కేగఁజాలు దర♦శేక్షణ వే జతనంబు చేసినన్
జిక్కకపోనె శోకమునః ♦ జిక్కకు మన్న నృధాన్యధామతిన్
దక్కు మ టన్న రాఘవుఁడు ♦ తమ్మునివాక్యము లాలకించి తా
గ్రక్కున లేచి వెండియును ♦ గాంతను రోయఁ దొడంగెఁ గానలన్. ౧౦౪౭
ఉ. కొండలు గుట్టలున్ నదులుఁ ♦ గోనలుఁ గానలు మేలొకలంకులున్
వెండియు రోసి రోసి పృథి♦వీసుతఁ గానక భ్రాతతోడ నీ
దండక నెల్లఁ గాంచితిమి ♦ దండుగ యయ్యెను గాదె మత్తవే
తండనుయాన యెం దరిగెఁ ♦ దమ్ముఁడ యే మిఁకఁ జేయ సం చనన్. ౧౦౪౮
కం. సౌమిత్రి యిట్టు లను శ్రీ,రామా పొందెదవు మరల ♦ రాజీవాక్షిన్
వామనుఁడు మున్ను బలిమిని, భూమిని బలియొద్దఁ గొన్న♦పోలుపున ననినన్.
కం. వెతకితి మీసర్వంబును, వెత యొక్కటె కాక లేదు ♦ వెలఁదుక యెందున్
క్షితిధరము బహుళకందర, మతివను నిఁక నెందు నెమక ♦ నను వగు ననుచున్.
కం. వ్రాలున్ మూర్ఛల నేలను, సోలున్ దుఃఖమునఁ దూలు ♦ శోషిలి వ్రేలున్
బాలా! సీతా! సీతా!, యేలాగైతివె య టంచు ♦ నేడ్చుచుఁ బొరలున్. ౧౦౫౧
కం. తమ్ముం దూఱటగా వా,క్యమ్ముల నే వేవొ చెప్పఁ ♦ గైకొనఁ డెద శో
కమ్మున సీతా! యని కడు, నమ్మలికం బందుఁ గుందు ♦ నుత్తలమందున్. ౧౦౫౨

కం.నీరజలోచనఁ గానక, నీరజలోచనుఁడు ధర్మ♦నిరతుఁడు సుమనో
　సారాచోపహతాత్ముం, డై రోదన మూరఁ జేసె ♦ నతివా! యనుచున్. ౧౦౫౩

→ రాముఁ డున్మత్తునివలె దుఃఖించుచు సీతను రోయుట. ←

ఉ. కన్నుల మ్రోల లేకయును ♦ గంజశరవ్యథ మ్రోల నున్నయా
　కన్నియఁ గూర్చి దుర్వచము♦గా వ్యసనార్తిని బల్కు జానకీ!
　క్రొన్ననలందు నీకుఁ గల♦కూరిమివేరిమి బాధపెట్టునం
　పన్న మశోకశాఖఁ గొని ♦ మాటుగ డాఁగితివే యెఱింగితిన్. ౧౦౫౪

కం.కదలీదండనిభంబులు, కద లీలావతిరో నీదు♦క మ్రోరువు లా
　కదలీసంస్మృతములె యై, మది రేఁకుల యవిగోఁ దోఁచె ♦ మఱుఁగిడ వశమే. ౧౦౫౫

ఆ. కర్ణికారవనముఁ ♦ గర్ణాంతలోచన, నవ్వులాట కరిగి ♦ పువ్వులను గని
　నన్ను నాలిగొనఁగ ♦ నాయమా యోబాల! నిన్ను గాన లేక ♦ నేను మిడుక.

కం.హేలనపర వగు టెఱుఁగుదు, హేలావతి యిదియు సమయ♦మే గేలి గొనన్
　బాలా గాసిలితిని నా, కేలా పరిహాస మిట్టి♦యెడరున నడవిన్. ౧౦౫౭

సీ. అన్న! లక్ష్మణ! సీత ♦ యున్న నో యని రాదె, మ్రింగిరో పరులు హ♦రించినారొ
　కన్నీరు దొరఁగ మృ♦గంబులు రక్కసుల్, సీతను దిని రని ♦ చెప్పు చున్న
　వెటు పోయితే తన్వి ♦ యెం దున్నదానవే, కైక కోరిక నీదు♦కతనఁ దీరు
　జానకితో వచ్చి ♦ జానకిఁ గోల్పోయి, యె ట్లంతిపురిలోని ♦ కేగువాఁడ
తే. రిత్త యంబేద రాముఁడు ♦ సత్త లేదు, నిర్దయుం డని పలుక రే ♦ నిఖిలజనులు
　కాంత లేకున్న సౌఖ్య మే♦కరణిఁ గాంతు, లేబరము గాదె యిల్లాలు ♦ లేనిబ్రదుకు.

ఉ. క్రచ్చుఱఁ దీర్చుచున్ మన మ♦రణ్యనివాసము, నూరి కేగినన్
　వచ్చిరి కూఁతు రల్లుఁ డని ♦ వచ్చి మముం గన మైథిలుండు నిం
　పెచ్చఁగ క్షేమమా యనిన ♦ నే మని యాతనిమోముఁ జూతు, నా
　సచ్చరితుం డెఱింగి తను♦జాతఁ దలంచి తపించి మూర్ఛిలున్. ౧౦౫౯

సీ. *నాకోడ లేదిరా ♦ నాయనా! యని నంత, మాయమ్మ కే మని ♦ మాఱు పలుక
　రామ! జానకి యేది♦రా యంచు నడుగు మీ,యమ్మ కే మనఁగ నో♦రాడు నాకు
　ధారవోసితివ సీ♦తను గాన కని ముసి,ముసి నవ్వకైక కే♦ముసి వచింతు
　వదిన రాదాయె నే♦మిది యని ప్రశ్నించు,తమ్ముల కేమి యు♦త్తరము లిడుదు
తే. సీత రాదాయె రాముండు ♦ చేతఁగాక
　యసురవాతను ద్రోచె ని♦ల్లాలి ననుచు
　నెల్లిదము సేయుజనులనో ♦ రెట్లు మూయఁ
　జెప్పుమా తమ్ముఁడా! యేమి ♦ చేయువాఁడ. ౧౦౬౦

కం. పోనీ భరతునిపురి కే, రా నే పో స్వర్గ మేగ ♦ రాకేందుముఖీ
హీనుఁడ నై చనుటను నది, కానంబడు శూన్య మగుచుఁ ♦ గాడుంబోలెన్. ౧౦౬౧

→ రాముఁడు లక్ష్మణుని నయోధ్యకుఁ బొ మ్మనుట. ←

సీ. తమ్ముఁడా! నీ వింకఁ ♦ దడయకు మిచ్చటఁ, బొమ్మయోధ్యాపురం♦బునకు వేగ
బిగియార భరతునిఁ♦బ్రేమఁ గౌఁగిటఁ గ్రుచ్చి, యనుము నామాటగా♦నతనితోడఁ
జిరముగా రాజ్యంబుఁ ♦ జేయుమీ భరత! రా,మునియాజ్ఞ యిది యని ♦ యనుము
మాయమ్మ కైకకు ♦ మీయమ్మకును గోస,లాత్మజ కెఱఁగు నా♦యాజ్ఞ నీవు [నీవు
తే. అడిగితిని జాల ననుమ మా♦యమ్మతోడ
సీతపోకయు నాచావుఁ ♦ జెప్పవయ్య
యామె నెల్లవిధంబుల ♦ నరయ రయ్య
పోయిరా నాయనా! నీకుఁ ♦ బొాదలు శుభము. ౧౦౬౨

కం. నను నీవు కాచి తిరుగం, బని లే దిఁక లక్ష్మణా! క్షమాసుత లేదే
దనువునఁ బ్రాణము నిల్వఁగ, విను శక్యము గా దటంచు ♦ విహ్వలుఁ డైనన్.

కం. హెచ్చిలుతాపభరమ్మున, నచ్చపలాక్షిని దలంచి ♦ హావడి గొని యా
ముచ్చిరి ముచ్చిర లక్ష్మణుఁ, డుచ్చలితమనస్కుఁ డగుచు ♦ నుత్తలపడియెన్. ౧౦౬౪

ఆ. స్నేహమోహశోక♦నిస్తులసంతాప,భరము పేర్మిఁ దాను ♦ గరము కుంది
తనదుదుఃఖమునకుఁ♦దన యట్లు తపియించు, ననుజుతోడ రాము♦డనియె మఱియు.

కం. శోకముపై శోకం బ,స్తోకము నాగుండె లవియఁ ♦ దూలించెడి; నీ
లోకంబున ననువంటిమ,హాకిల్బిషకారి గలఁడె ♦ యన్యుం డొకఁడున్. ౧౦౬౬

కం. తొలిబామునఁ బాపపుఁబను,లెలమిని నెన్నేనిఁ జేయ ♦ నీబామునఁ ద
త్ఫల మై చేకూరెను ని,స్తులదుఃఖముమీఁద ఘోర♦దుఃఖం బిట్టుల్. ౧౦౬౭

ఛం. అనుపమరాజ్యనాశము, హి♦తాప్తవియోగము, తండ్రిచావు, నా
జననిని బాసి వచ్చుటయు ♦ సర్వము దేహము నిర్దహింపఁగా
వనగతదేహకష్టము నె♦వంబున నన్నిటి విస్మరించితిఁ
వనితను బాయ నింధనవి♦వర్ధితవహ్నియ యయ్యెఁ గ్రమ్మఱన్. ౧౦౬౮

కం. అసురుం డెవ్వఁడొ జానకిఁ, బ్రసభంబునఁ దిగిచి పట్టి ♦ పాఱఁగ దివి సా
ధ్వసమున నపస్వరంబున, దెసమాలినభంగి నేడ్వ♦దే కోమలియున్. ౧౦౬౯

కం. లోహితచందనలిప్తము, లై హృద్యము లైననీర♦జాక్షీకుచముల్
లోహితధారలు గాఱ న,యో హతకుం డెవఁడొ పీఁడ ♦ నొప్పఱ కున్నే. ౧౦౭౦

కం. ఆమృదుమధురాలాపం, బామేచకకేశభార ♦ మారుచిరం బై
గోముకొను మోము రాహువు,చే మిడికెడుసోముపగిదిఁ ♦ జెన్నఱ కున్నే. ౧౦౭౧

సీ. తారహారవిహార♦హారికంధరఁ జెల్చి, నెత్తురు ద్రావిరో ♦ నీచమతులు.
నే నొంటి విడిపోవఁ ♦ గానలో రాక్షసుల్, హింసింపఁ గురరినా ♦ నేడ్వకున్న
యిదియ గోదావరి ♦ యిది ప్రియురాలికి, నతులితప్రియ మిందు ♦ నరుగుదెంచు
దినము దినం బిట ♦ వనజాక్షి యుండునే, యుండదు రా దెప్పు ♦ డొంటి నటకు
ఆ. నీశిలామనోజ్ఞ♦దేశంబునందు ను,దారశీల మున్ను ♦ దా వసించి
కాంతహాస నవ్వ ♦ గదుర నీతోఁ బలు,మాట లాడె నాస♦మక్షమందు. ౧౦౪౨
కం.పద్మాస్య పద్మలోచన, పద్మములకు గౌతమికిని ♦ వచ్చె నొకో తా
సద్మంబు విడువ దెన్నఁడు, పద్మిని నేఁ డేకతంబ ♦ వచ్చునె యిటకున్. ౧౦౪౩
కం.అసమకుసుమవిసరసరసము, భసలీకీకీవిహంగ♦భరితం బగునీ
కుసుమకుడుంగము డాసెనొ, పొసఁగదు సతి పిఱికి యొంటిఁ ♦ బూనునె రాఁగన్.
కం.నీకుఁ బ్రొక్కెద భువనకృ,తాకృతసత్యానృతజ్ఞ! ♦ యాదిత్య! రవీ!
నాకాంత యెందుఁ బోయెనొ, యేకరినుండేని కొంచు ♦ నేగెనొ చెపుమీ.
కం.పవనా! నీయెఱుఁగనియది, భువనాళిని లేదు పొలఁతి ♦ పొలిసెనొ లేదే
నెవఁ డైన హరించెనొ యీ,వనసీమలఁ జిక్కెనొటు ♦ తడయక చెపుమా. ౧౦౪౪
కం.అని యీగతిఁ గౌసల్యా,తనయుఁడు పలవింప భూరి♦ధైర్యాన్వితుఁ డి
ట్లనుఁ గాలోచితవాక్యం, బనఘుఁడు లక్ష్మణుఁడు రాము♦నారట మడఁపన్. ౧౦౪౫
ఉ. శోకము మాన వన్న! వెత ♦ సొక్కి లపింపకు మన్న! ధైర్యముం
జేకొన వన్న! దీనతఁ గృ♦శింపకు మన్న! తలోదరీమణిం
బ్రాకటరీతి రోయుదము ♦ రాఁగద వన్న! మహాత్ము లెందు న
స్తోకము గుంద రన్న! కఠి♦దుష్కరవముల్ ఘటియించువేళలన్. ౧౦౪౬
కం.అని యీగతిని సుమిత్రా,తనయుం డెన్నేనిధాల ♦ ధైర్యముఁ బలుకన్
విన నొల్లక దుఃఖించుచు, జనకసుతాధవుఁడు మఱియు ♦ సౌమిత్రి కనున్. ౧౦౪౭
శా.సౌమ్యా లక్ష్మణ! గౌతమీనదికి నా♦పూఁబోఁడి పో నోపుఁ బ
ద్మముల్ గోయఁగ నన్న లక్ష్మణుఁడు ప్రో♦త్సాస్తరముం జేరి సీ
తమ్మా! యోవదినా! యటం చఱచి ప్ర♦త్యాలాప మాలింపలే
కమ్మార్గంబున నెల్ల రోసి కమలా♦స్యం గాన కవ్వార్తయున్ ౧౦౫౦
కం.రామునకుఁ దెలిపి యిట్లను, నామహిళారత్నమున్న♦యడ పొడ గానన్
భూమిజ పలుకదు పిలిచిన, నా మహిపసుతుండు దాన ♦ నదినిం గనుచున్
కం.తల్లీ! గోదావరి! నా,పల్లవపద సీత యిందు ♦ వచ్చెనె చెపుమా
హల్లకపాణి యెటేగెనొ, యెల్లఁపి హరించె నొక్క♦రెవ్వం డైనన్. ౧౦౫౨

చం.అనవుడు భూతకోటి చెపు♦మా చెపుమా యని యెంతచెప్పినన్
మనుజవరుండు వేఁడి నను♦ మానముఁ దాల్చె సురారిభీతి నా
ధుని; నది మాఱు పల్క దిఁకఁ♦దోయజలోచన యాశ లేద; త
జ్జనకునకున్ మదంబకును♦ జానకి యే దన నేమి చెప్పుదున్. ౧౦౮౩
కం.ధారిణిఁ గోల్పడి వన్యా,హారంబులఁ గడుపు నించు♦నగచా ల్లెల్లన్
దూరంబుగ నెట్టెడియా,సారసదళనేత్ర యెందుఁ♦ జనియెనొ వనిలోన్. ౧౦౮౪
కం.ఏ మనుబంధులు లేమిని, రామను బెడఁబాసి జాగ♦రంబుల స్రుక్కన్
యామవతు లింక బహుళా,యామవతుల్ గావె లక్ష్మ♦ణా! యే మనఁగన్. ౧౦౮౫
తే. అహహ జానకి నా కిపు♦డబ్బె నేని, యీజనస్థానమందాకి♦నీజలములఁ
బ్రస్రవణగిరిఁ గేస్గేల♦ రాజిలంగ, నేఁకటలు వాయఁ దిరుగనే♦ యింతితోడ.

అడవిమృగములు రామునకు సీతపోబడి సూచించుట.

సీ. కంటివే లక్ష్మణా!♦ కాననమృగములు, సారె సారెకును నా♦చాయఁ జూచి
యేమియో చెప్పంగ♦ నింగితం బెఱిఁగించు, చున్నవి యెఱుఁగునో♦ యువతిజాడ
మృగములారా! మీర♦ లెఱుఁగుదు రే సీత,పోబడి యని బాష్ప♦ములు దొరంగ
శ్రీరాముఁ డడిగినఁ♦ జివుకున నవి లేచి, దక్షిణముఖము లై♦ తరలి మోర
ఆ. లాకసమున కెత్తి♦ యామ్యదిక్కును బట్టి, వారి మోముఁ గనుచుఁ♦ బఱువుపాఱ
వాని బాసఁ దెలిసి♦ వరమతి లక్ష్మణుం, డన్నతోడ నిట్టు♦ లనియె నపుడు. ౧౦౮౭
సీ. సీత యే దనుచుఁ బ్ర♦శ్నించిన నినుఁ జూచి, దివి భువి దక్షిణ♦దిక్కు గాఁగఁ
గానిపించెడిని మృ♦గములు నైఋతదిశ, పోదమా యాదెసఁ♦ బోవు చోట
జానకి లభియించు♦నదుపాయ మబ్బదే, నావుడు లె స్సని♦ నళిననేత్రుఁ
డనుగతలక్ష్మణుం♦ డై యరుగుచు నెల్లి, రోయుచుఁ బోవుచోఁ♦ ద్రోవలోన
తే. నేలపైఁ బుష్పచయములు♦ రాలి యున్న
వనువుఁ గనుఁగొని దుఃఖిత♦స్వాంతుఁ డగుచు
వానిదెసఁ జూపి రఘువంశ♦వర్ధనుండు
తమ్మునకు నిట్టు లనియె గ♦ద్గదిక దనర. ౧౦౮౮
కం కుసుమములు వనమున నేఁ, గోసి ధరాతనయ కీయఁ♦ గోమలి ముడిచెన్
భాసురవేణిని శ్వసన,త్మాసూర్యులు గాచి రిట్లు♦ మత్ప్రీతికి నై. ౧౦౮౯
కం.అనుచు మహాభుజుఁ డగుల,క్ష్మణుతో వచియించి ధర్మ♦సద్భావుం డ
ల్లనఁ జని ప్రస్రవణాకుల,ఘనశైలేంద్రంబుఁ గాంచి♦ కరుణోక్తి ననున్. ౧౦౯౦
తే. అబల సర్వాంగసుందరి♦ యవనిభృద్వ,రా! మనోహర మగువన♦రాజిఁ జూడఁ
బడియెనానాసీత నీచేత♦ విడువఁబడుట, నొంటి నాచేత నడయాడు♦ చుండ నిచట.[1]

---

[1] ఇందుఁ జిత్రాలంకారము గలదు. ప్రశ్నయుఁ బ్రత్యుత్తర మీపద్యమందే కలదు. పీఠిక చూడుఁడు.

కం.అనఁగఁ దనయట్ల పలికిన, వని తుద్రమృగంబుఁ గసరు♦పంచాస్య మనక్
వనరుహనయనుం డాగిరిఁ, గనుఁగొని యి ట్లనియెం గెంపు♦ గదురం గనులన్.
కం.బంగారువన్నె గల నా,బంగరుబొమ్మను మృగాక్షిఁ♦ బర్వతమా! చూ
పం గడఁగ వేని నాశం,బుం గావించెదను నెత్తు♦ముల గిత్తములన్. ౧౦౯
కం.అని పర్వతమును రాముఁడు, జనకసుతం జూర్చి యడుగ♦ శైలంబు ప్రతి
ధ్వనినెపమున బదు లిడి యా,వనితామణిఁ జూప కున్న♦ వసుధాధవుఁ డున్.
కం.మంచితనంబున సతి న,ర్పించిన సరి కాకయున్నఁ♦ బృథివీధర! కా
రించెద శరముల మసి గా,వించెద నిన్నిప్పు వేరు♦వెల్లంకులతోన్. ౧౦౯
కం.చిగురుంబోణి తెఱంగును, దగువిధమునఁ జెప్ప కున్నఁ♦ దమ్ముఁడ! నదినీ
రిగిరించెద నని కినుకం, బెగఁబల్కుచుఁ జూడ నొక్క♦ దెస నేలపయిన్. ౧౦౯-౬

రాముఁడు సీతాదేవిభూషణాదుల నేలపైఁ జూచుట.

చం.ఇట నట భీతి గొంచుఁ బరు♦వెత్తినజానకిపాదచిహ్నముల్
స్ఫుటముగ నామె వెన్కొనెడి♦సోఁకుల తేనివి పెద్దపాదముల్
త్రుటితధనూరథంబులును♦ దూణియు నిందును నందు ప్రీలి యుం
డుట గని సంభ్రమించుచు న♦నుంగుసహోదరుతోడ నిట్లనున్. ౧౦౯-౭
సీ. చూడుమా లక్ష్మణ!♦ సుదతి ధరించిన,జోమాలెపూసలు!♦ సొన్నుసగలు
మాల్యముల్ ధరరాలె♦మహినింపఁ బ్రోఁడిపూ,సలువోలె రక్తబిం♦దులు రహించెఁ
గావున నాసతిఁ♦ గామరూపాసురుల్, ఖండించి ఖండించి♦ ఖండములుగ
భక్షించి రని యెంతుఁ♦ బడఁతికై యిద్దఱు, పిరువీఁకులాడుచు♦ బిరుదు లగుట
తే. రాక్షసులు తమలోన సం♦గ్రామమునకుఁ
దొడరి యిట్లు రటంచును♦ దోఁచె నాకుఁ
గాక యుండిన నిచ్చోటఁ♦ గార్ముకాది
ఖండములు రాలుటకు నేమి♦కారణంబు. ౧౦౯-౮
కం.కాంచనభూషాన్వితమై, చంచన్మణిమౌక్తికాది♦సంగతమై రా
జించెడివి ల్లెరిదో యీ,సంచున నిట విఱిగి పడిస♦చందం బెటులో. ౧౦-౯
కం.తరుణార్కనిభము చామీ,కరకృతము విదూరజమణి♦ఖచితం బగుచున్
ధరణిపయిఁ దునుక లగుచును,దొరఁగిన యది కవచ మెవరి♦దో చూడఁ గల ...
ఆ. శతశలాక మైన♦ఛత్త్రంబు దివ్యమా,ల్యోపశోభితంబు♦ నుర్విమీఁద
భగ్నదండ మగుచుఁ♦బడియున్న ది ట్లొట, కేమి హేతు వొక్కొ♦ యె వరి దొకొ,
కం.హేమతనుత్రాణంబులు, భీమాకృతు లురుతనువులు♦ శీఘ్రపిశాచా
ద్దామాస్యంబులు ఖరములు, భూమండలిఁ దెరలె నెవరి♦ వో యివి తలఁపన్.

సీ. దీప్తాగ్నినిభ మయి ♦ తేజరిల్లుధ్వజంబు, విఱిగినయదియు నే♦వీరునిదియొ
యగ్రముల్ దునిఁగిన ♦ యక్షమాత్రసువర్ణ,పుం♦ఖబాణంబు లే♦పురుషునివియొ
నించినబాణముల్ ♦ నించిన ట్లున్న వీ,దొనలను గంటివే ♦ తునిఁగి పడిరొ
నొకచేత పగ్గంబు ♦ లొకచేత సెలగోల, యొసఁగి సారథి చచ్చె ♦ నెవరివాఁడొ

ఆ. చెవులఁ గుండలములు ♦ శిరమునఁ బాగయుఁ, గొమరుమీఱ నేలఁ ♦ గూలినారు
చామరములు దాల్చు♦జను లిర్వు రిదెచూడు, మెనరివారొ వీరు ♦ హితచరిత్ర.

రాముఁడు దేవతలపైఁ గోపించి జగత్సంహారముఁ జేయఁ బూనుట.

ఉ. ఈవిధ మంతయుం గనఁగ ♦ నెవ్వఁడొ రాక్షసుఁడే యి టీవనిఁ
నావనితన్ హరించె నని ♦ నాకు నిజంబుగఁ దోఁచెఁ దమ్ముఁడా
యీవల క్షేమొ లే యనుచు ♦ నెంచితి నిం కిట జీవితాంతకం
బై విడరానిసూడు దను♦జావళితో ఘటియిల్లె దీనిచేన్. ౧౧౦౪

కం హృతయో మృతయో సతి భ,క్షితయో రాక్షసులచేత ♦ క్షితిసుత రక్ష
స్తతిచేతఁ జిక్కఁగా న,క్షతధర్మం బైనఁ గావఁ ♦ జాలదు కంటే. ౧౧౦౫

కం.క్షితిసుత యపహృత యై భ,క్షితగా సౌమిత్రిసురులు ♦ కెలసము దీర్పన్
మతి గొనరు వీరె నా కప,కృతిఁ జేసియు క్షేమముగను ♦ గెరలెడివారల్.౧౧౦౬

ఆ. భువనసంఘములను ♦ బుట్టింపఁ బొలియింప, శక్తి గలిగి కరుణ ♦ సాధు వైన
యట్టిపురుషు లక్ష్మ♦ణా! యెల్లవా రవ,మానపఱుచు వారు ♦ జ్ఞాన మేది. ౧౧౦౭

కం.లోకహితయుక్తు సాధువుఁ, బ్రాకటకరుణాత్ము దాంతు ♦ బలహీనునిఁగా
లోకంబు దలఁచు సత్యము, నాకధ యిపు డట్టి దయ్యె ♦ నాయన వింటే ౧౧౦౮

కం.*కుట్టినచోఁ దే లందురు, కుట్టక యే యుండె నేని ♦ కుమ్మరపురువం
చెట్టును లక్ష్యము సేయరు, కట్టిఁడిజను లిదియు జగము ♦ క్రమము కుమారా.

కం.నాయెడఁ గలసద్గుణతతు,లీయెడ దోషంబు లగుచు ♦ నేర్పడెఁ గద కా
నీ యసురభూతచయములు, పాయక కను మిప్పు డెట్టి♦పాటులు పడునో. ౧౧౧౦

కం.కల కల మని తొలిమలపైఁ, గలకువెలుఁగు దోఁచి శీత♦కరు తేజంబున్
బిఱబిఱ హరించు గతినే, బిఱుసున మృదుగుణము లణఁచి ♦ వెలిఁగెదఁ గనుమీ.

కం.రాక్షసపిశాచకోటుల, యక్షులగంధర్వతతుల ♦ నవనీజనులన్
వీక్షింపు మొక్కఁ జేసియు, నీక్షణమున సుఖముగాఁగ ♦ నెసఁగెడి నేమో.౧౧౧౨

చం.హతమరుదర్క పావక మ♦హాప్రభ మై మథితాద్రిశృంగ మై
గతిరహితగ్రహంబు నయి ♦ స్కన్నని శాకరబింబ మౌచు శో
షితజలరాశిసంఘ మయి ♦ ఛిన్నలతాద్రుమగుల్మ మై జగ
త్తతి పొలియంగఁ జేసెద శి♦తప్రదరప్రకరప్రభాళులన్. ౧౧౧౩

మ. అదిగోఁ జూడు మదస్త్రబాణనిచయ♦వ్యాప్తంబు నాకాశముం
  బ్రిదులం జేసెద వ్యోమచారులను సం♦పీడింతు ముల్లోకముల్
  సుదతిం జెక్కు చెమర్ప కుండ విబుధుల్ ♦ చూపంగఁ దా రొల్ల రే
  విదితామోఘమదీయవిక్రమ మిదే ♦ వీక్షింత్రు గా కేడ్చుచున్. ౧౧౧౪
సీ. అతలకుతలము లై ♦ హల్లకల్లోల మై, చెల్లాచెదరు నయి ♦ చెల్ల చెదరు
  పచ్చముపాడు లై ♦ పంచబంగాళ మై, పాండవబీడు లై ♦ పగులు వాఱి
  మఱి పటాపంచ మై ♦ మామకీనాకర్ణ,పూర్ణబాణావళీ♦పూర్ణభువన
  మిపు డమర్యాద మై ♦ యేర్పడఁ గల దిదే, చూడుమీ లక్ష్మణ ♦ సాక్షి సోలి
ఆ. వ్రాలి తూలి వ్రేలి ♦ మాలి యీచేనతల్, యక్షరాక్షసాళు ♦ లదవదపడి
  పటుతరాస్త్రదీయ♦బాణనికృత్తు లౌ,వారు వీరె యోర్చు♦వారు నన్ను. ౧౧౧౫
కం. నాముద్దురాలి సీతను, సామంబునఁ దెచ్చి యీయఁ ♦ జాలక యున్నన్
  సౌమిత్రీ! భువనత్రయి, యేమెయి గూపఱునొ చూడు♦మీ నాశక్తిన్. ౧౧౧౬
చం. అని కటముల్ చలింప భయ♦దాసమరోషకషాయితాక్షుఁ డై
  ఘనతరకార్ముకంబు వెసఁ ♦ గైకొని భీషణపన్నగోపమం
  బనుపమతేజ మైనవిశి♦ఖాళిగ మొంటు గుణంబుఁ గూర్చి యి
  ట్లను ననుజాతుతోడఁ బ్రళ♦యాగ్నివిధంబునఁ దేజరిల్లుచున్. ౧౧౧౭
కం. ఏవిధి జరయును మరణం, బేవిధిఁ గాలం బదృష్ట ♦ మెట్లనివార్యం
  బావిధిఁ గోపప్రాప్తిని, నేవిధి నప్రతిహతుండ ♦ నే సౌమిత్రీ. ౧౧౧౮
కం. సల్లలితచరితస్మితముఖ, మెల్లగ నర్పించి రేని ♦ మే లగుఁ గాదే
  నల్లల నుడికింతును జుమి, హల్లోహలముగ జగంబు ♦ లని రోషింపన్. ౧౧౧౯

→ లక్ష్మణుఁడు రాముని శాంతునిఁ జేయుట. ←

సీ. సీతాపహరణక♦ర్శితుఁ దప్యమానుని, సాంసర్తకాగ్నియో♦జను జగంబు
  నిర్దగ్ధముగఁ జేయ ♦ నిష్ఠురుం డగువాని, సజ్యకోదండంబు♦చాయఁ జూచు
  చున్నవానిని వేఁడి♦యూర్పులూర్చెడువానిఁ, బ్రళయరుద్రునియట్లు♦ వెలుఁగువాని
  నెన్నఁడుఁ గోపించి ♦ యెఱుఁగనివానిని, రాముఁ గన్గొని సుమి♦త్రాసుతుండు
ఆ. పెదవు లెండ ముఖము ♦ వెలవెలఁ బోవఁగ, నిట్టు లనియె భూత♦హితరతుండ
  వెపుడు శాంతమతివి ♦ మృదువవు తగు నయ్య, కోప మెత్తి నైజ♦గుణము విడువ.
ఉ. ఇందునియందు లక్ష్మియు, న♦హీనతరప్రభ సూర్యునందునం
  దందడియోర్పు ధాత్రిని, స♦దాగతియందు సదాగతిత్వ, మ
  స్కందగతిం దిరం బగుచు ♦ జో నగు; నిన్నియుఁ గీర్తితోడ నీ
  యంద వసించు నిత్యముగ ♦ హావడి పెట్టఁగఁ జన్నెలోకముల్? ౧౧౨౧

సీ. అపరాధ మెవ్వఁడో ♦ యాచరించిన నెల్ల,జగముల సమయింపఁ ♦ దగునె నటన్న
యీభగ్న మైన తే ♦ రెవ్వనిదో యేల, యెవనిచే హత మయ్యె ♦ నెఱుకపడదు
తునిసినగొలిజలు ♦ దొరలిన నేమి నైె, నెత్తురుబొట్లు నీ ♦ నేల యొప్పె
సైన్యంబు పోరిన ♦ చందలబు లే దొంటి,కాని దురం బయి ♦ కానఁబడియెఁ
ఆ. గాన నొకనికై జ ♦ గంబుల నెల్లను, రూపు మాపఁ దగునె ♦ గూఢవృత్తి
రాజు లైనవారు ♦ రాజిల్ల వలదె మా,ర్దవము శాంతి యుక్త ♦ దండ మొనరి. ౧౧౨౨
కం. నీ వఖిలభూతతతులకుం, గేవలము శరణ్యుఁ డవును ♦ గీర్తిత పరమం
బై వఱలు గతియుఁ గాఫున, నేవాఁ డొకొ నీ విపత్తి ♦ కెలమిం గాంచున్. ౧౧౨౩
తే. సురలు గంధర్వదానవుల్ ♦ గిరులు నదులు, నీకు విప్రియ మొనరింప ♦ నేర రయ్య
ఋత్విజులు దీక్షితునిపట్ల ♦ నెగ్గు దలఁపఁ, జాలనివిధాన యోజింపు ♦ శాంతమతిని.
ఉ. కేల శరాసనంబుఁ గొని ♦ క్రేవల నే నడ తేరఁగాఁ దప
శ్శీలురబొసటన్ నెమకు ♦ సీతను బర్వతకాననంబులన్
శైలగుహాతరంగిణుల ♦ సారసకైరవవాటికాళులం
దాలిమి దేవతాదిభువ ♦ నంబుల నెంతయు జాగరూకతన్. ౧౧౨౫
కం. అప్పటికి మంచితనమున, నప్పింపర యేని సీత ♦ నమరులు మీఁదం
దప్పక కాలోచిత మగు,నప్పనిఁ గావింప న్యాయ ♦ మగుఁ బో నీకున్. ౧౧౨౬
మానిని. సామముచేతను శీలముచేతను ♦ సాధుమతీ! వినయాదులచే
భూమితనూభవ చేపడ కున్నను ♦ భూవరనందన! యాపయి సు
త్రామకఠోరసుసాధనసన్నిభ ♦ రాజతపుంఖశరౌఘములన్
నీమదివచ్చినచొప్పున లోకము ♦ నీఱుగఁ జేయుము యుక్త మగున్. ౧౧౨౭
కం. అని పాదంబుల వ్రాలుచు, వినయంబున మఱియు ననియె ♦ విపులతపమునన్
ఘనసత్కర్మములను నినుఁ, గనె జనకుఁడుసుధనుసురలు ♦ గాంచినభంగిన్. ౧౧౨౮
కం. వర కేవలయుష్మద్గుణ,పరవశుఁ డై తండ్రి నిన్నుఁ ♦ బాయుటచేతన్
సురలోక మరిగె ననుచున్, భరతుఁడు మన మెల్ల వినఁగఁ ♦ బలికెను గాదే. ౧౧౨౯
కం. కాకుత్థ్సవర్య! నీ వే, శోకము సహియింపలేక ♦ స్రుక్కెద వేనిన్
లోకమున నల్పసత్త్వులు, ప్రాకృతులా సైఁచువారు ♦ పటుదుఃఖంబుల్? ౧౧౩౦
కం. వలవంత నీ వె జగములఁ, బొలియింపఁగఁ జూచె దేని ♦ భూప్రజల కెవం
డలవడును గావ దిక్కై, వెలుగే చే నేయఁ గాచు ♦ వెర వెయ్యదియో. ౧౧౩౧
సీ. నహుషసూతి యయాతి ♦ నాకంబునొందియు,నవివేకి యయి దుఃఖ ♦ మంద లేదె
మనపురోధ వసిష్ఠ ♦ ముని సుతశతమును, గన నొక్కపరి వారు ♦ చనరె దివికి

భువనవందిత సర్వ♦భూతధాత్రి ధరిత్రి, గడగడ లాడదే ♦ వడఁకు గదుర
భువనచక్షుస్సులుఁ ♦ బూజ్యులు సూర్యచం,ద్రాత్మకుల్ గ్రహముల♦వాతఁ బడరె
తే. యెంతటిమహాత్ము లైన సు♦రేంద్రు లైన, దైవసంకల్పమును దాఁట ♦ దాఁటఁ గలరె
కష్టమెఱుఁగక కాలంబుఁ ♦ గడిపినారె, ప్రాణులకు మేలు కీడు స్వ♦భావ మధిప.
కం.హ్వాత మైనను మృత మైనను, క్షితితనయ తదర్థ మీవు ♦ చిత్తం బగలన్
వెత నొంద వలదు పామరు,గతి శోకము కార్యలాభ♦కరమే చెపుమా. ౧౧౩౩
కం.నినుబోఁటి సత్యదర్శను, లనయము దుస్సహతరార్తు ♦ లంటిన యేనిన్
మనమున నేనియు వగ గొన, రనఘా నిర్విణ్ణదర్శ♦నాఘ్యులు గానన్. ౧౧౩౪
కం.వరమతి నాలోచింపుము, సరి యగునే నీకు నిట్లు ♦ సంతాపింపన్
గురుబుద్ధి శుభాశుభములు, పరికింతురు నైజమేధ♦బలమున విబుధుల్. ౧౧౩౫
కం.కనరానిదోషగుణతతు,లను గలిగి యనిశ్చితఫు♦లంబును నౌక
ర్మనిచయముల నొనరింపక, మనుజుం డిటుసౌఖ్యదుఃఖ♦మగ్నుం డగునే. ౧౧౩౬
కం.ఈవిధమున రామా! ము, న్నీవే బోధించినాఁడ ♦ వీ విపుడు వగన్
హోవడి పడియెద వేనియు, దేవగురుం డైన నీకుఁ ♦ దెలుపం గలఁడే. ౧౧౩౭
కం.నీనిశ్చలమతి సురలకు, నేనియు దుర్లభము వగపు♦నెచ్చున యుష్మత్
జ్ఞానము ప్రసుప్త మైనను, మానక బోధింప వలసె ♦ మఱకువ దీఱన్. ౧౧౩౮
కం నో రెఱుఁగని నరులను నప,కారులు గానట్టిసురలఁ ♦ గారింపకు నీ
శూరతఁ దలంపు భవదప,కారిం గని పట్టి దండనుఁ ♦ గాఁ జేయు మనన్.౧౧౩౯

→ రాముఁడు లక్ష్మణువాక్యంబుల శాంతుఁ డై సీతను వెదకుట. ←

శా.నారంబైనసుభాషితార్థముల నా♦సౌమిత్రి యన్నంతనే
సారగ్రాహి తదగ్రజుండును మహా♦సారంబుఁ గైకొంచుఁ గోఁ
పారంభం బుపసంహరించి ధను ♦ వాధారంబుగా నిల్చి వ
త్సా! రామం గస నెందుఁ బోద మెది సే♦యుం బోలు భావింపుమా. ౧౧౪౦
ఉ దీవత రాముఁ డి ట్లనిన ♦ ధీరుఁడు లక్ష్మణుఁ డన్న! యీజన
స్థాన మనేకభూరిమృగ♦సంకులకందరశైలదుర్గసం
తానము కిన్నరాళిభవ♦నప్రచయాన్విత ముగ్ర రాక్షసా
ధీనము భూరిభూరుహత♦తిప్రవికీర్ణము గానఁ గోమలిన్ ౧౧౪౧
కం.ఇం దే రోయఁగఁ దగు నీ, చందంబున వాఁడు బుద్ధి♦సంపన్నుఁ డని
ష్పందుం డగు నాపదలం, దెం దేనియు గిరులు కదలు♦నే గాడ్పునకున్. ౧౧౪౨
కం.అని పలికిన రాముఁడు తత,యనుజుఁడు వెనువెంట రా వ♦సావని సర్వం
బును రోసెఁ గ్రోధవశతన్, ధనువున క్షురశరముఁ గూర్చి ♦ తాలిచి కేలన్.

### రామలక్ష్మణులు జటాయువును జూచుట.

కం. ఇటు వెదకుచుఁ జనఁ జన న,చ్చట నొకచో భూరిశైల♦సంకాశుని న
త్తుటఁ దోఁగియున్నపుణ్యుని, జటాయువు మహానుభావు♦శకునిప్రవరున్ ౧౧౪౪

కం. వీక్షించి పలుకు ననుజుని, శిక్షితపరిపంథి కంటె ♦ సీతను వీఁడే
భక్షించె నిజము గ్రద్దై, రాక్షసుఁ డే యున్నవాఁడు ♦ గ్రాలుచు సుఖియై. ౧౧౪౫

కం. వీనిని మద్ఘోరేషువి,తానంబులఁ జీల్చువాఁడఁ ♦ దడయక యని సీ
తానాయకుఁ డభిముఖుఁ డై, పూనఁగ శర మొండు వణఁకె ♦ భూతల మెల్లన్.

కం. నెత్తురు లాలలు గ్రక్కుచు, హత్తినమరణాంతబాధ ♦ నారటమున డ
గ్గుత్తికతోడ విహంగను,సత్తముఁ డిట్లనియె రామ♦చంద్రునితోడన్. ౧౧౪౭

### జటాయువు రామునకు సీతాపహరణవృత్తాంతముఁ జెప్పుట.

కం. ఆయుష్మంతుఁడ! యోషధి, నోయన వని నెద్ది రోయు ♦ చున్నారో మీ
రాయంగన నాప్రాణం, బీయెడ రావణునిచేత ♦ హృత మీరెండున్. ౧౧౪౮

ఉ. నీవును లక్ష్మణుండును వ♦నీక్షితి నొంటిగ వీడి చన్నయా
పావని సీత నెత్తికొని ♦ బల్మిని రావణుఁ డుప్పరంబునన్
బోవుచు నుండఁ జూచి యొక ♦ పూఁపున సద్దము దాఁకి వానితో
లావునఁ బోరి తద్రథ మి♦లాస్థలిఁ గూల్చితి వాని డొల్చితిన్. ౧౧౪౯

కం. అదె నే విఱిచినచాపం, బదె తూఁడి మదీయపక్ష♦హతసారథి వాఁ
డదొ తేరు నేను డస్సిన, ముదుక నగుట నతఁడు ఖడ్గ♦మున నాఱెక్కల్ ౧౧౫౦

కం. తెగ నఱికి తెఱవఁ గొనుచున్, గగనంబునఁ బఱచెఁ బంక్తి♦కంఠుఁడు మున్నే
మగుడకయి చంపె నీవుం, దగ వే వెండియును జంప ♦ దశరథపుత్రా. ౧౧౫౧

### జటాయుదుష్ఠితికి రాముఁడు దుఃఖించుట.

చం. అన విని బాష్పపూర్ణముఖుఁ ♦ డై ద్విగుణీకృతతాపసక్తుఁ డై
ధను వటు పాఱవైచి నృప♦తల్లజుఁ డాతనిఁ గౌఁగిలించి హా
యని వివశాత్ముఁ డై పడి స♦హానుజుఁ డై పలవించె నొంటివా
నిని వనిఁ గాలిత్రోవఁ బడి ♦ నిశ్వసనంబులు పుచ్చుపుణ్యునిన్. ౧౧౫౨

ఉ. తమ్ముఁడ చూడుమీ యకట ♦ ధారిణిరాజ్యము వేఱుపాటు భీ
ష్మమ్ముగుకాననస్థలిని ♦ సంకటపాటు ధరాత్మజాత నిం
దిమ్మెయిఁ గోలుపాటు విహ♦గేశ్వరు త్రుంగుడుపాటు నాయభా
గ్యస్థితుఁ గంటివో కనితె ♦ కాల్పఁగ నోపుఁ గృశాను నైనియున్. ౧౧౫౩

కం. ఘోరార్తిఁ దాప మాఱఁగఁ, బారావారంబుఁ జొరఁగఁ ♦ బ్రాఁతిలి నేనిన్
నీరము నాదౌర్భాగ్యము, పేరిమి శోషిల్లు నేల ♦ బీఁటిక లెగయున్. ౧౧౫౪

కం. నాకంటెను నిర్భాగ్యుఁడు, లోకంబున లేఁడు పరివి♦లోకించినచో
నీకరణి దుస్తరం బగు, ప్రాకటదుర్వ్యసనవాగు♦రం జిక్కుటచేన్. ౧౧౫౫

కం. మనజనకునిమిత్త్రుం డీ, యనఘుఁడు ముదుకఁడు విహంగ♦మాధిపుఁ డయ్యో
వినిహతుఁ డై పడియెను ధాత్రిని నాదురదృష్టవశత ♦ దీనతఁ గంటే. ౧౧౫౬

కం. అని జనకస్నేహమ్మున, ననుజునితో లూఁసపతు ♦ నస్రసుసక్తున్
డనకేలఁ దడవి యేదీ, యనఘా! నాప్రాణతుల్య ♦ యని ధర వ్రాలెన్. ౧౧౫౭

జటాయువు రామునకు సీతావృత్తాంతము సవిస్తరంబుగఁ జెప్పుట.

ఉ. తెప్పిఱి లేచి లక్ష్మణుని♦దిక్కుఁ గనుంగొని కంటె తమ్ముఁడా
యిప్పరమోపకారి విహ♦గేంద్రుఁడు నాకయి ప్రాని తెంపుపెం
పొప్పఁగఁ బోరి కూలి కొఱ♦యూపిరితోఁ బడినాఁడు, పల్కున
చ్చొప్పును దోఁప, దెల్గు కడు♦సూక్ష్మ మ టంచును బక్షికిట్లనున్. ౧౧౫౮

శా. ఓధతౌయ్యకులాధినాయక! జటా♦యూ! పల్కనేర్తేని సీ
తాదేవిం గుఱించి నీవధముచం♦దంబున్ ధరాకన్య నే
లా దైత్యుండు హరించె? నాతఁ డెద న♦ట్లం గారణం బేమి? మి
త్త్రా! దేవ్యాస్యము చంద్రతుల్య మెటు త♦త్కాలంబునం దుండెనో ౧౧౫౯

ఉ. ఆమెయిఁ గొంచు నేగ దురి♦తాత్ముఁడు తన్ను ధరిత్రికన్య దా
నే మనుచుండె? నప్పలుకు ♦ లేర్పడఁ జెప్పుమ, దైత్యుఁ డెట్టివాఁ
డేమియువాఁడు? వానిపుర ♦ మెయ్యది? శౌర్యము నెంతమట్టు? తం
డ్రీ! మఱి మారఁగాఁ బలుక♦వే సతి నెట్లు హరించి యేగెనో? ౧౧౬౦

ఉ. ఈవిధి రాముఁ డాడ విహ♦గేంద్రుఁడు మెల్లన విచ్చి ఱెప్పలన్
భూవిభు నల్లఁ జూచుచు న♦నుం గడు నీరెలుఁ గొప్ప రామ! మా
యావి సమీరదుర్దిశస♦మాకులవిస్తృతమాయ గూఢుఁ డై
రావణుఁ డేగె మింటను ధ♦రాసుత బల్మి హరించి క్రూరుఁ డై. ౧౧౬౧

కం. ఔడిదపుసంగరమున నే, బడలిన ననుఁ గాంచి మీఁదఁ ♦ బడి ఱెక్కలఁ దా
నడిదమున నడిచి యసురుఁడు, కడువడి దక్షిణముఖంబు♦గాఁ బరువెత్తెన్. ౧౧౬౨

కం. రామా! కన్నులు దిరిగెడి, నామనము వశంబు గాదు ♦ నాయన! తావుల్
దా మెడలెను బ్రాణంబులు, హేమాగము లవిగొ నభయ♦కృతకేశము లై.

ఉ. ఆయమకారి భూమితన♦యన్ హరియించినమూర్తముం గనన్
బోయినసొమ్ము స్వామి వెసఁ ♦ బొందుట తప్పమ, తత్తఱాన పై

తేయుఁడు తన్నుహయూర్తము మఱిదిం దెలియం, డది వింద యంద్రు, నీ
జాయ హరించి వాఁడు బడిశీంబును మ్రింగినచేఁపయట్లు లొ. ౧౧౬౪
కం. వ్యధపనకుము జనకజకై, ప్రథితగుణా! నీవు ద్రుంచి రాక్షసనాథుఁ
బ్రథనమున మరల సతిఁ గొని, పృథుయశ మొప్పారఁ బురికి నేగెదు నెమ్మిన్
కం. అని తెలివి చెడక యింతయు, మనుజేంద్రునితోడఁ బలికి మఱియు వచింపన్
జను నెడ మాంసము నెత్తురు, ఘనముగ వక్త్రంబునుండి గ్రక్కుచుఁ బైపై.
కం. ఔరసుఁడు విశ్రవునకున్, గారీవల్లభునిమిత్రునకు సోదరుఁ డం
చీరీతిఁ జెప్పనాలో, నారవయూపిరియు నక్కటా వెడలి చనెన్. ౧౧౬౭
కం. నుడువుము నుడువు మటంచుం, బుడమివిభుఁడు కేలు ముడువఁ బులుఁగులరేఁడున్
విడిచి తనువు దివికిం జనె, నుడుకుచు రాముండు చూచుచుండఁగ వెతచేన్.
కం. ఎఱు పొత్తఁ గనులఁ దుండముఁ, దెఱచుచుఁ దల వ్రేలవైచి స్థిరఁ బాదంబుల్
విఱివిగను సాఁచి దేహము, తఱచు వణఁక నుసులు విడిచి ధరపైఁ ద్రెళ్లెన్.

## జటాయుమృతికి రాముఁడు శోకించుట.

ఉ. ఆపడియున్నగృధ్రము జటాయువుఁ గన్గొని రాముఁ డార్తసం
తాపము దోఁప నిట్లు లనుఁ దమ్మున కీతఁ డనేకవర్షముల్
పాపపురక్షసావళికిఁ బట్టగుదండక నిర్భయంబుగా
నేపున నుండియుం దుదకు నిచ్చట నే మృతుఁ డయ్యెఁ గంటివే. ౧౧౭౦
కం. బాలత్వం బాదిగ నిట, వేలకొలఁదియేఁడు లిచ్చ విహరించి తుదిన్
గూలి యిచటఁ బడియెఁ గదే, కాలము దాఁటంగ రాదు గా యెవ్వరికిన్. ౧౧౭౧
ఉ. కంటివె లక్ష్మణా! జనకకన్యకఁ గావఁగఁ గోరి దేవతా
కంటకుతోడ డీకొని యఖండవిహంగమ రాజ్య మాయువున్
రెంటిని బాసి నాకయి ధరిత్రిపయిం బడినాఁడు; ధాత్రిపైఁ
గంటిమె యెన్నఁ డిట్టియుపకారపరున్ సముదారుఁ బుణ్యునిన్. ౧౧౭౨
కం. శూరులు శరణ్యులును హిత, చారులు సాధువులు ధర్మసత్పథవర్తుల్
ధారిణిఁ గల రెల్లయెడన్, ధీరగుణా! యరసి చూడఁ దిర్యక్కులనేన్. ౧౧౭౩
కం. నాతండ్రియట్ల పూజ్యుఁడు, స్ఖతయశుఁడు మాన్యుఁ డితఁడు ప్రియుఁడును జమ్మీ
యీతనిపాటు గనుంగొన, సీతాహరణార్తి సమసెఁ జిత్తమునందున్. ౧౧౭౪

## రాముఁడు జటాయువున కగ్నిసంస్కారాదులు చేయుట.

కం. సౌమిత్రీ! చితఁ బేర్పుమ, యీమహాత్మ్కార్యార్థనిహతు నీపతగేంద్రున్
నీమమున నగ్ని దరిచి య,శామతి దహియింతు ననుచుఁ దదభిముఖుండై.

తే. ఏది గతి యజ్ఞశీలుర♦కేది యాహి,తాగ్నులకు నపరావర్తు♦లైనవారి
కుర్విదాతల కట్టియు♦నుత్తమగతి, కరుగు మత్సంస్కృతి మదాజ్ఞ♦ నమితసత్త్వ.
కం. అని పులుఁగుఱేనిఁ జితపై, నునిచి శిఖిం గొలిపి రఘుకు♦లోత్తముఁ డార్తిన్
దనచుట్టమువలె దహనం,బును బొనరిచి రోహిమాంస♦మునఁ బిండంబుల్.
సీ. ఘటియించి లేఁబచ్చి♦కను వాని నిల్పి ద్వి,జాతులు మానవ♦ప్రేతమునకు
స్వర్గసంప్రాప్తికై ♦ చదివెడుపితృసం,బంధమంత్రముల జ♦పం బొనర్చి
గోదావరిన రాచ♦కొమరు లిద్దఱుఁ దోఁగి, గృధ్రజేనికి నుద♦కంబు లీయ
మిగులదుష్కరమును ♦ మేలికీర్తికరంబు, కార్యంబుఁ గావించి ♦ కదనమునను
ఆ. మృతిని గాంచి యున్న♦గృధ్రరాజు మహర్షి, కల్పుఁ డైనయవని♦కాంతుచేత
సంస్కరణముఁ గాంచి ♦ చనె శుభపుణ్యలో,కముల కంతఁ బుణ్య♦కర్మనిధులు.
కం. మన సెల్ల నతనిపై నిడి, మనమునఁ దద్వాక్యములను ♦ స్మరియించుచు భూ
తనయాధిగమనవాంఛను, వనసీమం జనిరి విష్ణు♦వాసవులక్రియన్.　　౧౧౭౯

లక్ష్మణుఁ డయోముఖిని విరూపఁ జేయుట.

చం. పడమరదక్షిణంబుగను♦ బ్రాగ్రిపపుత్రకు లేగి కొంత యా
యడవికి మూఁడుక్రోసుల మ♦హాటవిఁ గ్రౌంచముఁ జొచ్చి యందుఁ దా
రెడ నెడ మార్గఖేదమున ♦ వృక్షముసీడలఁ గూరుచుండుచున్
బడఁతుక గోయుచుం జనిరి ♦ వ్యాళమృగాండజబంధురాటవిన్.　　౧౧౮౦
ఉ. దానిని దాఁటి తూర్పుగ ♦ మ♦తంగవనంబున మూఁడుక్రోసులన్
గోన రసాతలాభ మయి ♦ ఘోరమృగం బయి శాశ్వతాంధ మా
దానిని డాయఁ బో నలఁతి♦దవ్వున భీకరదైత్య లీక్షణం
స్థానన ముక్తమూర్ధజ మృ♦గాదన లంబపిచిండ వారలన్　　౧౧౮౧
చం. కనుఁగొని చేర వచ్చి మును♦గాఁ జనులక్ష్మణు నాఁగి కేల నా
తని బిగిఁగౌఁగిలించి తమి ♦ దానవి యిట్లను నీకుఁ బెండ్లమా
దును జనుదెమ్ము యాడుకొనఁ ♦ దుర్గనుజీవితకాల మంతయున్
వనతటినీతటాళిఁ; బ్రియ♦నాథ! యయోముఖి యండ్రు న న్ననుల్.　　౧౧౮౨
కం. అనుడు సుమిత్రాపుత్రుఁడు, కనలున ఖడ్గంబు దూసి ♦ క్షణమున ముక్కున్
జనులున్ వీనులు నఱికిన, వనితయు మొత్తాడు చరిగె ♦ వచ్చినత్రోవన్. ౧౧౮౩
కం. అది చనఁ జనుచో గహ్వర,పదమున సోదరులు రాముఁ ♦ బలికెం దమ్ముం
డెడ చెదరె నెడమబాహువు, నదరెడి నశుభంబు గలుగు ♦ నని తోఁచెఁ జుమీ.
కం. అన్నా! నాపలుకులు విని, సన్నాహంబునను నుండు ♦ సంకట మెదో గా
నున్నది వంచులకము నుర,కు న్నిశ్చయమునుమఁ దెల్పుఁ ♦ గూసెడి వింటే. ౧౧౮౫

చం.అని యిటు వార లిర్వురు వ॥నాంతరవీథుల రోయుచుం జనన్
ఘనతరనిస్వనంబు వన॥కాండవిదారణదక్షమై నభం
బును నిబిరీసవాతపరి॥పూరితముం బచరించి వీచినన్
విని యిది యేమటంచు నట॥వీక్షలి రోయుచుఁ గాంచి రొక్కెడన్. ౧౧౮౬

→ రామలక్ష్మణులు కబంధునిచేఁ జిక్కుట. ←

మ. గిరిసంకాశుని భూరివక్షుని శిరో॥గ్రీవావిహీనున్ మహా
ఖరరోమావృతు నీలమేఘనిభు మే॥ఘస్ఫూర్జథుఘోషు భీ
కరవక్షస్థ్సలలాటదేశగపిశం॥గస్ఫారపక్ష్మాయతా
గ్నిరుచిస్ఫీతశుభేత్రైకనయను॥న్దీప్యన్మహాదంష్ట్రునిన్. ౧౧౮౭

మ. అటవీసత్త్వమృగద్విపాదికవిక॥ర్షాకర్షఖేలాప్రలం
పటునిన్ యోజనదీర్ఘబాహుయుగళున్ ॥ మార్గస్థితున్ భీముఁ బ్ర
స్ఫుట ఘోరాస్యుఁ గబంధుఁ గాంచి తటియం॥బోవంగ నాదైత్యుఁడున్
బటుదోర్దర్ప మెలర్ప నాయిరువురన్ ॥ బాహాయుగిం బట్టినన్. ౧౧౮౮

కం.ఖరతర తేజోయుతతను,ధరులు భయంకరశరాస॥ధరులు కృపాణీ
కరులు మహాబలు లిద్దఱు, పరుచేతికిఁ జిక్కి కీడు॥పడి రవ్వేళన్. ౧౧౮౯

కం.ధీరుఁడు శూరుఁడు రాముఁడు, ధీరతఁ గోల్పడఁడ విగత॥ధృతి తమ్ముఁడు కౌ
మారమున[1] ధైర్య మూనమి,చే రామునితో విషణ్ణ॥చిత్తుం డగుచున్. ౧౧౯౦

శా.అన్నా! నాగతిఁ గంటె చిక్కితిని దే॥వా రాలిచే వీనివా
త న్నన్నుం బడ వీడి పర్విడుము దా॥వ ప్వీనయే నెట్టులేన్
జెన్నారన్ సతిఁ గాంచ నేస్తు వని తోఁ॥చెన్, రాజ్యలక్ష్మీసుసం
పన్నత్వంబునఁ గ్రాలు వేళ నను మ॥ర్వం బోకుమీ యన్నఁడున్. ౧౧౯౧

కం.అని సౌమిత్రి వచించిన, విని రాముఁడు నీవు నిట్టి॥విధమున వగిపన్
జను నే యనుచుండఁగ స,ద్దనుజుఁడు వారలకు ననియె ॥ దారుణఘనశేలిన్. ౧౧౯౨

ఉ. ఎవ్వరు మీరు? చాపనిశి॥తేష్వసు లూని విషాణు లట్టు లి
ట్లివ్వని నేల త్రిమ్మరెద॥ రెంతయు నాఁకొను నాదునోటిలో
నివ్విధిఁ గూల నేమిటికి ॥ నిచ్చటికిం జనుదెంచినారు? మీ
కెవ్వలనన్ మసంగ వశ॥మే యిఁక, నిండెను నూఱునర్షముల్. ౧౧౯౩

కం.అని క్రొవ్వడర వచించెడి,దనుజుని పలు కాలకించి ॥ తమ్మునితో భూ
తసయావల్లభుఁ డను మో,ముప వెల్లఁదసంబు దోఁప ॥ మునుకొనువగచెన్.

కం.కష్టంబు మీఁదఁ గష్ట మ,నిష్టంబుగ దాపరించి ॥ యిటు మనుగడకే
రిష్టంబు గూర్చె వ్యసనం, బిష్టాంగన లభ్యపడక॥యే పోయెఁ గదా. ౧౧౯౫

---

[1] జన్మకాలమునుబట్టి రామలక్ష్మణులకు భేదము రెండుదినములే యైనను వాయసపరిమాణ భేదమును బట్టి లక్ష్మణుఁడు చిన్నవాఁడని తెలియనగు.

కం.అన్నన్న! కాలశౌర్యం, బెన్నఁతి నవ్యాహతంబొ ♦ యెఱిఁగితె భూమ్యు
త్పన్నప్రాణులపై నిను, నన్నుఁ దుఃఖములచేత ♦ ననయముఁ జేసెన్. ౧౧౯౬

చం.గురుతరధైర్యవంతులు న♦కూటబలుల్ కృతహస్తు లాజి దు
ర్ధరవర తేజు లయ్యు శిక♦తామయ సేతువువోలె బీఱువో
దురు సుమి కాలమో యనఘ ♦ తోఁపద కెంతయుఁ దప్పివచ్చినన్;
బరఁగును దుష్కరం బగుచుఁ ♦ బ్రాణుల దైవము చంపఁ జూచినన్. ౧౧౯౭

కం.అని తనమది దిటపఱుచుచు, దినవంశవరేణ్యుఁ డుండ ♦ నిట్లనుఁ బౌలా
శనుఁడు ననుఁ జూచి నివ్వెఱఁ, గన నేటికి మిమ్ము నోటి♦కడి విధిచేసెన్. ౧౧౯౮

## రామలక్ష్మణులు కబంధుని బాహువుల నఱకుట.

ఉ. ఈగతి శోకుఁ డాడఁగ న♦హీనపరాక్రముఁ డుగ్రవిక్రమో
ద్యోగముమై నిజాగ్రజుని♦తో నను లక్ష్మణుఁ డింక వీఁడు బ
ల్వేగమ నిన్ను నన్ను బలి♦పెట్టకమున్న శితాసిధార ర
క్షోగురుబాహుయుగ్మమును ♦ గూల్చుట మేలు వధంపరామిచేన్. ౧౧౯౯

కం.వీఁడు మహాబలముం గల, వాఁ డెంతయు భీమ మైన♦వపువుగలాఁడున్
దూఁపరి మనలన్ మ్రింగెడు, వాఁడేమి జగమెల్ల గెలిచి ♦ వర్తిలు చుంటన్. ౧౨౦౦

కం.ప్రతికారశక్తిహీనుల, మృతిఁ గూర్చుట పాడిగాదు ♦ నృపవర్యులకున్
గ్రతుమధ్యానీతముఁ బశు, తతిఁ గూల్చినభంగిఁ గుత్సి♦తంబు మహాత్మా. ౧౨౦౧

కం.అను లక్ష్మణువాక్యంబులు, విని దనుజుఁడు వారి వాత ♦ వేసికొనంగన్
గను నింతలోన నానృప,తనయముఁబల్ దేశకాల♦శాస్త్రవిధిజ్ఞుల్ ౧౨౦౨

కం.రాముఁడు దక్షిణబాహువు, సౌమిత్రియు సవ్యభుజముఁ ♦ జటులాసిహతిన్[1]
భీమగతి నఱక వాఁడును,భూమిం బడె దిగ్ధరాది♦వుల్ ధ్వని నిండన్. ౧౨౦౩

## లక్ష్మణుఁడు కబంధునకుఁ దమవృత్తాంతముఁ జెప్పుట.

కం.దీనుండై దోర్యుగళవి,హీనుండై దనుజవర్యుఁ ♦ డెవ్వరు మీరిల్
గానఁ బని యేమి యనఁగా, వానికి లక్ష్మణుఁడు పలికె ♦ స్వచరిత మెల్లన్. ౧౨౦౪

సీ. ఇక్ష్వాకువంశభ♦వేంద్రుఁ డీయనఘుండు, రాముఁ డటందురు ♦ ప్రజలు దనుజ!
మాయన్న యితఁడు ల♦క్ష్మణుఁ డండ్రు నాపేరు, దేవప్రభావుండు ♦ దేవితోడ
దండకాటవిలోన ♦ నుండ సుఖంబుగ, నసురులు మాయచే ♦ నంబుజాక్షి
మ్రుచ్చిల నామెను ♦ రోయుచు నిట వచ్చి,నార; మెవ్వఁడ వీవు ♦ కారణం బ
తే. దేమియొ కబంధ మైనయా♦కృతి వహింప?
నురమునను నోరు జంఘుల♦యొప్పు లేదు

---

[1] రామస్య దక్షిణోబాహు' వన్నట్లు లక్ష్మణుఁ డెప్పుడు రామునకుఁ గుడిప్రక్క నుండువాఁడు గనుక వాని కత్తు వాటమయ్యెను.

పోరలు చున్నాఁడ వన వాఁడు ♦ సురచయేంద్రు
వాక్యములు స్మరియించుచు ♦ నతులి ప్రీతి. ౧౨౦౫

కబంధుఁడు రామలక్ష్మణులకుఁ దనవృత్తాంతముఁ జెప్పుట.

కం. ఉద్ధుర మి ట్లను నో రఘు,సత్తమవరులార! మీకు ♦ స్వాగత మౌ నా
హత్తినభాగ్యంబున మిము, నిస్తులీఁ బొడగంటిఁ జేతు ♦ లివి పోఁగంటిన్. ౧౨౦౬
ఆ. అవినయంబుచేత ♦ నబ్బె నీవికృతంపు,రూపు దాని యున్న ♦ రూపు నీకుఁ
జెప్పువాఁడ వినుము ♦ శ్రీరామచంద్ర! ని,ర్వక్రసుగుణసాంద్ర! ♦ రాఘవేంద్ర!
కం. సోమఖరధానువిబుధ,స్తోమధవపమాన మైన ♦ సుందరరూపం
బే మును దాల్చి జగంబుల, రామా! విశ్రుతిని గంటి ♦ రమణీయతకున్. ౧౨౦౮
కం. ఆమిక నే నీరూపము,తో మునులుఁ గమనచరులు ♦ దూలఁగ భీతిఁ
వేమఱు గో డాడించుచుఁ, దామసమతి స్థూలశిరునిఁ ♦ దలరఁగ జేయున్. ౧౨౦౯
కం. శాపాయుధుఁ డాసంయమి, కోపంబునఁ దిట్టె నన్నుఁ ♦ గుచ్చిత మగునీ
రూపంబున బెదరించెద,వా పాపీ! రూప మిదియె ♦ యగుత సతంబున్. ౧౨౧౦
కం. అని తిట్టిన శాపాంతం, బనఘా! కరుణింపవే య ♦ టంచును వేఁడన్
వని రాముఁడు నీకరములు, దునిమి దహించినను గల్గు ♦ దొల్లిటిరూపున్. ౧౨౧౧
కం. అని యాస తిచ్చె శ్రీయుత,దనుసంజాతుండ నేను ♦ దగ విక్రృతశరీ
రిని నగుటకు లక్ష్మణ! శ,క్రునికోపము కారణంబు ♦ క్రొవ్వున నతనిన్ ౧౨౧౨
కం రా ర మ్మని రణమునకుం, జీరితి ఘోరంపుఁదపముఁ ♦ జేసి విధాతం
గోరుట దీర్ఘాయుష్యం, బేరీ నాసము లటంచు ♦ నెంచి వెకలి నై. ౧౨౧౩
కం. ఆతఁడు శతారధారా,పాతంబున శిరము గుదియఁ ♦ బడ వక్షమునం
దాతతసక్థిని గదుపున, వీతదయుం డగుచు నణఁప ♦ వేఁడితిఁ జంపన్. ౧౨౧౪
కం. ఎంతయు వేఁడిన ననుఁ దా, నంతకుకడ కనుపఁ డయ్యె ♦ నసృతమె భాషా
కాంతుని పలు కని సీతా,కాంతా! రెంటికిని జెడితిఁ ♦ గావర మాటన్. ౧౨౧౫
కం. ఎటు లయ్యా! నే బ్రదుకుదు, నిటు లాహారంబు లేక ♦ యేగతిఁ దినుదుఁ
గటకట భగ్నముఖుండ వి,ఘటితశిరస్సక్థితలుఁడఁ ♦ గరుణింపు మనన్. ౧౨౧౬
కం సురపతి యామమి నిడు పగు,కరములు వదనంబు దంష్ట్రి ♦ కలు జఠరమునన్
గరుసంచె దాన ద్వీపకే,సరిశార్దూలాదిసత్త్వ ♦ సంతతిఁ దినుదున్. ౧౨౧౭
కం. రాముఁడు లక్ష్మణయుతుఁ డై, నీమహితకరాళి నిశిత ♦ నిస్త్రింశహతిన్
భూమిఁ బడ నడున నిర్జర,ధామము నీ కబ్బు నని బుధ ♦ ప్రభు వరిగెన్. ౧౨౧౮
ఉ. ఆమునిమాట నమ్మి విక్రృ ♦ తాకృతి వేగమ పాయఁ గోరి నే
నేమృగ మేపదార్థమును ♦ దృష్టిపథంబునఁ బడ్డఁ బట్టినన్

రాముఁడు చిక్కఁడే యని ఘ♦వం బగునాశను నేదియేని నీ
యామపలోనఁ దోఁచిన ర♦యుంబునఁ బట్టుదు నోటఁ బెట్టుదున్. ౧౨౧౯
కం.ఆమానిపరుఁడు చెప్పిన,రాముఁడ వీవే మహాత్మ! ♦ రణతలమున।ని
న్నీమెయి వధియింపఁగ లే, రేమగపంతంబువార ♦ లేనియు రామా! ౧౨౨౦
మ. మతిసాచివ్య మొనర్చి, మిత్రవరు సం♦పాదింతు, న న్నగ్ని సం
స్కృతుఁ గావింపుఁ డట న్న రాముఁ డనియెన్ ♦ స్వేచ్ఛన్ జనస్థానమం
దితఁడు న్నేనుఁ జరింప రావణుఁడు నా♦యిల్లాలి గిల్చాడె; దు
ర్గతిపేరొక్కటి మే మెఱుంగుదుము, శౌ♦ర్యం బేని రూపంబు నేన్ ౧౨౨౧
చం.అతనినివాస మైనఁ దెలి♦యంబడ, దాతని నీ వెఱింగినన్
మతి చెడి కానకాన దెస♦మాలి చరించెడిమమ్ముఁ దీవ్రదుః
ఖితుల హితప్రవర్తనులఁ ♦ గేవలసత్కృపఁ జూచి చెప్పవే
స్థితి గతి యిట్టి దంచు నఱ♦సేయక వీర! మహోపకారి వై. ౧౨౨౨
కం కుంజరము లప్పు డప్పుడు,భంజించిన శుష్కకాష్ఠ♦పటలంబులు ప్రో
వుం జేర్చి బిలమునను ని,న్నుం జతన మొనర్తు నీదు♦నుడిమైఁ గాల్పన్. ౧౨౨౩
కం.ఎవ్వఁడు హరించె జానకి, నెవ్వలనం దాఁచినాఁడొ ♦ కృపచే మా కా
సవ్వడి తెలిపి శుభమునన్, నివ్వటిల నొనర్పవయ్య ♦ నీ వెఱిఁగిన నాన్.౧౨౨౪
ఉ. తీఁపురముల్ ఘటించి కొని ♦ తెచ్చినయీవికృతంపురూపుతో
దోఁపుదుపోయితిం దెలివి ♦ తోయజలోచన సీతగాథయున్
దోఁపదయిప్డు నాతనువుఁ ♦ దూర్ణము కాల్చిన దాఁపరీని యా
దాఁపఱికంబు నంతయును ♦ దాఁపక నీకు నెఱుంగఁ జేసెదన్. ౧౨౨౫
కం.అవటమున నన్ను వెస నిడి, సవిత పరిశ్రాంతహాయత ♦ జాఱక మున్నే
సవిధగ దహియింపుము మఱి, యవనిను తాహార్తిఁ దెలియు♦నతని వచింతున్.
ఉ. వాని నెఱుంగఁగాఁ గలుగు♦వాఁ డొకరుండు గలండు, వానితో
మానుగ న్యాయమార్గమున ♦ మైత్రి యొనర్పుము, కారణాంతరం
బైనఁ జరించె వాఁడు భువ♦నావళి నెల్ల, నతండు ధాత్రిపైఁ
గానని చోటు గల్గ, దుప♦కారము నీ కొనరించు నావుడున్. ౧౨౨౬

## కబంధుఁడు స్వస్వరూపంబు నొందుట.

చం.తొఱటను వానిదేహమును ♦ దోఁపి సుమిత్రసుతుండు మండుపె
న్గొఱవులు దెచ్చి కాష్ఠమునఁ ♦ గూరిచి వహ్నుల నూలుకొల్పఁగా
నెఱచిని నేతిముద్దకును ♦ నీ డగు దేహముఁ గాల్ప నగ్నియున్
జుఱుకరి గాక మందుఁ డయి ♦ చూఁడుచు నుండఁగ వారు చూడఁగన్. ౧౨౨౭

ఉ. మండెడుమంటనుండి యుస♦మానవినిర్మలచేలుఁ డుజ్జ్వల
స్పందనమండితుండు ఖప♦థంబున కుద్గమనం బొనర్చి శ్వే
తాండజయుక్తమైనసుర♦యానమునన్ దిశ లెల్ల వెల్గఁగా
నుండి కబంధుఁ డి ట్లనియె ♦ నుర్విజఁగాంచు తెఱంగు రామునిన్. ౧౨౨౯

మ అనఘా! రామ జగంబునందు మడుపా♦యజ్ఞుల్ క్రియాళీవిమ
ర్శనముం జేయుదు రందు దుస్థితిసమా♦క్రాంతుల్ సమాపన్ను లౌ
జనులన్ రోసి ఘటింత్రు మైత్రి నిపుడో ♦ జాయానిమిత్తంబు నీ
వనుజాన్వితుఁడ వౌచు నీచదశచే ♦ నాయాసపా టొందవే? ౧౨౩౦

—♦ కబంధుఁడు రామునకు సుగ్రీవునితో మైత్రి చేసికొనఁ జెప్పుట. ♦—

ఉ. కాన భవన్సమానదశుఁ ♦ గాంచి ఘటించుట మేలు మైత్రి, కా
దేనియు నీదుకార్యము తు♦దిం గను టెట్టులో తోఁపదయ్యె రా
మా! నగచారి క్రుద్ధుఁ డయి ♦ యన్నసురాధిపసూతి వాలి రా
జ్యానకుఁ గాఁగఁ దాఁపఁగ వ♦నాటచతుష్కసహాయుఁడై వెతన్. ౧౨౩౧

ఉ. పావనఋశ్యమూకగిరిఁ ♦ బంపతటిం జరియించుఁ, బేరుసు
గ్రీవుఁడు, వీర్యవంతుఁడు స♦దీనచరిత్రుఁడు సత్యవాది ప్ర
జ్ఞావిభవుండు ధీరుఁడు ప్ర♦శస్తపరాక్రమశాలి వానితో
నీవు పొనర్పు నెయ్యమును ♦ నీప్రియుఁగాలిని రోయ బాస కా. ౧౨౩౨

కం. ఏలా దుఃఖించెదు నర,పాలా! యెవ్వరికి నైన ♦ భవితవ్య మిలన్
దూలం బుచ్చఁగ వశమే, కాలము దురతిక్రమంబు♦గా యెవ్వరికిన్. ౧౨౩౩

కం. గమనింపు మచటి కిప్పుడ, యమలమతీ! యిచటనుండి ♦ యతిజవమున స్నే
హము సుగ్రీవునితోఁ జే,యుము వాఁడు మహాబలుం డ♦నుత్తమగుణుఁడున్.

ఉ. వంచన యింత లేక, యొక♦వానరుఁ డెయ్యది చేయనోపు నం
చెంచక, చెల్మి సేయుము క♦పీశునితోడుత వహ్నిసాక్షిగా;
నంచితవీర్యవంతుఁడు, స♦హాయతఁ గోరినవాఁడు, మేలు గా
వించుఁ గృతజ్ఞుఁ, డెల్లకపి♦వీరుల కేలిక, కామరూపియున్. ౧౨౩౪

కం మీ రాతనివాంఛితమును, దీరుపఁ గల రతనికోర్కిఁ ♦ దెప్పున మీరల్
దీరిచినఁ దీర్పకున్న న,వారణ మీకార్య మతఁడు, ♦ వలనుగఁ గూర్చున్.

సీ. అతఁడు ఋక్షరజుని♦యాత్మసంజనితుండు, జలజాప్తు నౌరస♦సంభవుండు
పంపాసరోవర♦ప్రాంతదేశంబున, నగ్రజుఁ డగువాలి ♦ కాత్మఁ దలఁకి
చరియించుచున్నాఁడు ♦ సకలాయుధంబుల, నంటి ప్రతినచేసి ♦ యతనితోడ
నెయ్యం బొనర్పుము ♦ నిర్జరారులయిక్క, లతఁ డెఱుంగనియవి ♦ యవని లేవు

తే. తరణికిరణాళి ప్రసరించు♦ధరణిలోనఁ, గలనదీనదపర్వత♦కాననముల
రోయఁ గపులను బంచి నీ♦జాయ వెదక, వార్తఁ దెప్పించు నమ్ముము ♦ కీర్తిపూత.
కం. నీదువియోగముకతమున, ఖేదంబునఁ గుందు చున్న♦క్షితిసుత సవ్యా
పాదుఁ డగురావణుసిప్రా, సాదంబున నుండువార్త ♦ శక్తుఁడు దెలియన్. ౧౨౩౮
కం. ఆరావణునినిశాంతము, నారసి పాతాలోక♦మం దుండిన యో
మేరువుకొన నుండిన సీ,తారమణిం దెచ్చుఁ జంపి ♦ దైత్యచయంబున్. ౧౨౩౯

కబంధుఁడు రామునకుఁ బంపామార్గంబుఁ జెప్పుట.

సీ. అనుచు సీతాప్రాప్త్యు♦పాయంబు వచియించి, పల్కె వెండియును గ♦బంధుఁ డిచట
నుండి ప్రతీచిగా ♦ నొప్పు చుండువనాళి, ఫలపుష్పసముదాయ♦కలిత మగుచు
మారేళ్లు నేరేళ్లు ♦ మంచిగన్నేరులు, గోఁగులుఁ బనసలు ♦ రేఁగుచెట్లు
రావులుఁ మావులుఁ ♦ గ్రోవులు ముంతమా,మిడులు వారిజములుఁ ♦ గడప లాది
తే. గాఁగ ధరణీరుహంబులు ♦ గలవు పెక్కు,
చెట్టు లెక్కియొ ఫలములు ♦ గొట్టి నేలఁ
ద్రోచియో మీరు మెసవుచుఁ ♦ ద్రోవఁ బోవ
నవులఁ బుష్పితతరువనం ♦ బలరు చుండు. ౧౨౪౦
కం. నందనసుందర మై ని,ష్యందమధురసంబు నగుచు ♦ నభిలర్తుఫలా
స్పందితవిటపియుతం బై, పొం దగువన ముత్తరకురు♦భూముల కన దై. ౧౨౪౧
కం. ధారాధర ధరణీధర, వారంబులఁ బోలి పక్వ♦ఫలభారనతం
బై రమ్యవిటపయుత మై, శ్రీరంజిలు నచట నచట ♦ వృక్షచయంబుల్ ౧౨౪౨
కం. ఆచెట్టు లెక్కియో యిలఁ, ద్రోచియొ ఫలములను నీకుఁ ♦ దోరము గూర్చున్
నీచిన్నతమ్ముఁ డటపై, వే చనినం గొండకొండ ♦ విపినముఁ గనుచున్. ౧౨౪౩

కబంధుఁడు రామునకుఁ బంపాసరస్సు వర్ణించి చెప్పుట.

మాలిని. సారసరాజమరాళరథాంగక♦చారురవంబులు, శైవలన
స్నీరములున్, సికతాతలరాజిత♦నిర్గలగాధసమానను లా
తీరములున్, నవసారసకైరవ♦దివ్యసుగంధిఘుమంఘుమవా
పూరములున్, విలసిల్లఁగఁ బంప ♦ యపూర్వముదావహ మై యెసఁగున్.
ఆ. వధముఁ దెలియనట్టి♦వనచారిపక్షులు, ముదము మీఱఁ దిరుగు ♦ నదరు బెదరు
గొనక నరులు తమ్ముఁ ♦ గూడ నచ్చిన నైన; నేతిముద్ద లట్లు ♦ భాతి మెఱయు.
ఉ. మీరలు గండుమీలఁ జొఱ♦మీలును రొయ్యలుఁ గొట్టిచేఁప ల
వ్వారిగ బొమ్మిడాయిలును ♦ వాలుగలున్ మఱి ముంపులేని వా .
వారిచరంబు లెన్నియొ ని♦వాసము చేయు సరోవరంబునన్
గోరిన వెల్లనుం గొనుఁడు; ♦ గాల్చుచు వానిని దమ్ముఁ డమ్ములన్ ౧౨౪౪.

తే. ఒలిచి చర్మంబు తొక్కలు ♦ దులిచి నైచి
యినుపకాఁడలకును గ్రుచ్చి ♦ యనలమందుఁ
బక్వ మొనరించి చిక్కని♦వాని ముండ్లు
దీసి సద్భక్తి నీకయి ♦ తెచ్చి యిచ్చు. ౧౨౪౭

చం. తనివి సనన్ భుజించి నవ♦తామరసామలగంధ మైసుఖో
జ్జనకసుశీతలం బగుచు ♦ స్ఫాటికరౌప్యవినిర్మలంబు నై
యనిశము మోదహేతు వగు♦నక్కమలాకరవారిఁ గ్రోలుమీ
యనుజుఁడు పద్మపత్రపుటి♦యం దొగిఁ దేరఁగ హాయి మీఱఁగన్. ౧౨౪౮

కం. వాలుమొకంబులు నీరము, గ్రోలుతమిన్ ఱొప్పుకొనుచుఁ ♦ గోడెల రీతిన్
వాలాయము వచ్చుట నర, పాలా! కానంగఁ గలవు ♦ పంపతటమునన్. ౧౨౪౯

కం. సుమనోభరరంజిత మగు, కమనీయకుజాళి శిత♦కాండము సంధ్యా
సమయమునఁ బచారము గొని, యమలమతీ! యుల్లమలర ♦ నటఁ గనెదు సుమీ.

## కబంధుఁడు రామునితో శబరికి దర్శన మిమ్మని చెప్పుట.

సీ. విరిదమ్మిగలువలు ♦ వరసుమసశ్చిత, నక్తమాలతిలక♦నవ్యతరులు
సంతసం బిడు మీకు ♦ జనము లాపూవులు, ధరియింప రెవ్వరుఁ ♦ దరణికులుఁడ
వాడవు తొడిమెల ♦ నూడ వెన్నండును, నచట మతంగసం♦యమివరుండు
తప మొనరింప నా♦తనిశిష్యగణములు, వన్యముల్ దేరంగ ♦ వనిని దిరుగ

తే. నమ్మహాత్ముల చెమ్మట ♦ లవని వ్రాల, వాన జనియించె నవి గాన ♦ వసుమతీశ!
యట్టిమహిమంబుఁ గాంచె న♦య్యనఘు లచటు, వీడి చన వారివరవుడు♦వీడ దధిప!

కం. చిరజీవిని శ్రమణీమణి, వరధర్మచరిత్ర శబరి ♦ స్వర్గముఁ జేరున్
దరిసించి దేవసము నన, వరతంబు సమస్తభూత ♦ వందితు నిన్నున్. ౧౨౫౨

ఉ. ఆమహి నాగపాళి చేర♦లాడుచు నుండియు నమ్మతంగు తే
జోమహిమాన నాశ్రమము♦నూరెలఁ జేరఁ దొకటుఁ, దత్సరో
భూమికిఁ బశ్చిమంబునను ♦ బొల్చును గుహ్యతరాశ్రమోర్వి, యం
దామహిళావతంసము ని♦రంతరముం దప మాచరించెడిన్. ౧౨౫౩

కం. బృందారకవననిభ మై, నందనసంకాశ మగుచు ♦ నవ్యగరుత్మ
ద్బృందాకుల మగునావని, నందింపఁగలాఁడ వీవు ♦ నానాగతులన్, ౧౨౫౪

సీ. ఆమెను గనుఁగొని ♦ యరుగుమీ యానలఁ, బంపాసరోవర♦ప్రాంతమునకు
నచ్చట సుమభార♦హారిశైలము ఋశ్య, మూకంబు పొలుచు న♦నేకపముల
సమ్మర్దమునఁ జేసి ♦ సౌఖ్యంబుగాఁ గొండ, నెక్కంగ రా దది ♦ నిక్కువంబు
ఆమలపై నిద్ర ♦ నందువాఁ డేసొమ్ముఁ, గలలోనఁ గాంచు మే♦ల్కనినయంత

తే. దానిఁ బడయును; బాపు లా♦ధరణిధరము
పైకిఁజనరాదు; చని నిద్ర ♦ గైకొనినను
రాక్షసులు వారిఁ బ్రహరింత్రు ♦ రామచంద్ర!
బ్రహ్మనిర్మిత మియ్యది ♦ పార్థివేంద్ర! ౧౨౫౫
తే. మనికి గొనుచు మతంగాశ్ర♦మంబునందుఁ
బంపయొడ్డునఁ జేరలాడు♦వారణముల
పోతములు గీఁక లిడినను ♦ భూమిధరము
మీఁదఁ జక్కఁగ వినవచ్చు ♦ మిహిరవంశ్య. ౧౨౫౬
కం. జలధరవర్ణంబులునై, బలితము లగుకరులు మదము♦బలముసఁ దమలోఁ
గలహించి తొఁగి నెత్తుటఁ,దొలఁగి చనున్ వేఱు వేఱు♦త్రోవల నచటన్. ౧౨౫౭
కం. విమలంబై శీతం బగు,కమలాకరవారిఁ ద్రావి ♦ కాననగజముల్
తమిమీఱ నచ్చట యథే,చ్ఛముగా విహరించు సౌఖ్య♦సమ్మదమతులన్. ౧౨౫౮
సీ. ఎలుఁగులఁ బులులను ♦ నింద్రనీలచ్ఛాయ,మృగములఁ గన శోక ♦ మెడలు నీకు
నాపర్వతమున మ♦హాగుహ యొక్కటి, యుర్వీశ యొప్పారు♦చుండు నదియు
రాతి పెన్మూఁతచేఁ ♦ గ్రాలెడు నద్దానిఁ, జొరఁగఁ బూనుట సుఖ♦కరము గాదు
తద్గుహకును దూర్పు♦ద్వారంబుకడ నొండు, మంచి చల్లనిసీటి♦మడుఁగు గలదు
తే. ఆజలాశయతీరంబు ♦ తేజరిల్లు, హరిఫలమూలయుత మయి ♦ హరిణనికర
యుక్తి నాగుహ సుగ్రీవుఁ ♦ డుండు నయ్యె,వానరచతుష్కయుతుఁ డయి ♦ వాలిభీతి.
కం. ఎపుడేనియు గిరిశిఖరము, నుపరితలమునందు నిలుచు ♦ చుండు న టంచున్
విపులాధీశులకును విశ,దపడన్ వచియించి మింటఁ ♦ దరలుచు నిలువన్. ౧౨౬౦
కం. పొమ్మని సెలవిచ్చిన వాఁ,డు మ్ముదమునఁ బోయి రాముఁ♦డుం దమ్ముఁడు శీ
ఘ్రమ్మునఁ బడమటి దెస గో,త్రమ్ములు మధుమధురఫలయు♦తమ్ములు వనముల్
కం. తరువులు గనుచుం జని భూ,ధరముసమీపమున నాఁటి♦తమిఁ బుచ్చి తమో
హరుఁ డుదయించిన నిర్మల,తరవారిమనోజ్ఞ పంప♦తటముం గనుచున్. ౧౨౬౨
కం. వరుణదిశాతీరంబున, నరసి యచట శబరి రమ్య ♦ మగు నాశ్రమమున్
బరికించి చేరఁ జన న,త్తరుణియు వెస లేచి మోడ్చి ♦ తనహస్తంబుల్. ౧౨౬౩

## రామలక్ష్మణులు శబరిం జూచుట.

కం. వారలపదములు సోఁకఁగ, సారమతిన్ మ్రొక్కి పాద్య♦జల మిడి తగుస
త్కారము లెల్ల యథావిధిఁ, దీరిచి నిలుచున్న రామ♦దేవుం డనియెన్. ౧౨౬౪
సీ. నీతపోవ్రతములు ♦ నిర్విఘ్నితంబులై, సాగుచున్నవి గదా ♦ సాధుశీల!
యాగ్రహమునయందు[1] ♦ నాహారమునయందు, నియమంబు గలదుగా ♦ నిర్మలాత్మ

[1] ఆగ్రహము = పట్టుదల

నీనియమంబులు ♦ నెఱవేఱు చున్నవే, మనసు నిమ్మళ మయి ♦ యొనరు నమ్మ
గురుపరిచర్యలు ♦ కొనసాగు చున్నవే, సఫలంబులా యవి ♦ చారుచరిత
ఆ. యనుచు రాముఁ డడుగ ♦ నత్తపోధనురాలు, సిద్ధసమ్మత యగు♦సిద్ధురాలు
కౌసలేయుఁ జూచి ♦ ఘనభక్తియుక్తి ని, ట్లనియెఁ దన తెఱంగు ♦ వినయమునను.
సీ. ఇపుడెకా ఫలియించెఁ ♦ హితగురుశుశ్రూష, నిన్నుఁ జూచుటఁ జేసి♦నిర్మలాత్మ
యిపుడెకా సిద్ధించెఁ ♦ దపములు వ్రతములు, నీదర్శనంబున ♦ నీరజాక్ష
యిపుడెకా నాజన్మ ♦ మెల్ల సార్థక మయ్యెఁ, గనులార నినుఁ జూడఁ ♦ గౌసలేయ
యిఁక నెకా స్వర్గంబు[1] ♦ నే నేగఁ గందును, దివుట నిన్ బూజింప ♦ దేవవర్య
ఆ. నీదయార్ద్రదృష్టి ♦ నిహతపాతక నైతి, నరివిదారి! యక్షయంబు లైన
పదము లందుదానఁ ♦ బరమభవ్యచరిత్ర, యఘులతాలవిత్ర ♦ యసితగాత్ర.
ఉ. శ్రీరఘురామ! నేఁ బరిచ♦రించుచు నుండినమద్గురూత్తముల్
సారతపోధనుల్ చనుచు ♦ స్వర్గముఁ జేరఁగ మీరు చిత్రకూ
టోరుధరంబునం దునికి♦యుం బినతమ్ముఁడు నీవు నీయెడన్
జేరఁగ వత్తు రంచును వి♦శిష్టగతిన్ మిముఁ జూచినంతటన్ ౧౨౬౭
చం. ఒకవెడు నవ్యయం బగున♦నుత్తమలోకము లంచుఁ జెప్ప స
మ్మద మెదఁ గ్రమ్మ నీకొఱకు ♦ మంచివి మంచివి యేఱి కోరి పె
క్కుదెగల వన్యసంతతులఁ ♦ గూరిచి యుంచినదాన; నన్న ని
ర్వివళితవైరి జ్ఞానపద♦పీపరిణద్ధ దృఢాత్మమానసన్ ౧౨౬౮
చం. శ్రమణిని గాంచి యిట్లనియె ♦ రాముఁడు త్వద్గురుసత్ప్రభావమున్
శ్రమణిరొ యాదనుప్రభవు♦సన్నిధి వింటిని, గన్నులారం నా
శ్రమమువిచిత్రముల్ గనఁగఁ ♦ జాలఁ గుతూహల మయ్యె వానిన్
క్రమముగఁ గానిపింపు మది ♦ గల్గిన యేని య టన్న నామెయున్. ౧౨౬౯

## శబరి రామలక్ష్మణులకు మతంగాశ్రమమునందలి వింతలు చూపుట.

సీ. ఇదె ఘనాఘనతుల్య♦మృగపక్షిసంకీర్ణ, మైనమతంగవ♦నాంతరంబు
ఇచ్చోటఁ దమమంత్ర♦భృశశక్తిఁ దీర్థముల్, కల్పించి మాగురుల్ ♦ గ్రాలినారు
పడమటివేది మ♦హాస్వాములు వణఁకుచేతులఁ బూలఁ బూజలు ♦ సలిపినారు
వారితపఃప్రభా♦వంబున వేదులు, నేఁడును వెలిఁగించె ♦ నిఖిలదిశల
ఆ. నిత్యపాసములను ♦ నిర్గతసత్త్వు లై, వడువలేమిఁ జింత♦నంబు సేయ
సప్తసాగరములు ♦ చనుదెంచె నిచటికిఁ, జూడనయ్య రామ ♦ సుగుణధామ.
ఉ. తానము లాడి వల్కపరి♦ధానము లీద్రుమశాఖలం దిడన్
మానవనాథ! యాఱ వవి ♦ నాగురువర్యతపంబుపెంపునన్

[1] స్వర్గము – వైకుంఠము. శ్లో. విద్వేషాదపి గోవిందం దమఘోషాత్మజ స్మరన్ ।
శిశుపాలో గత స్స్వర్గం కింపున స్తత్పరాయణః ॥ అత్రిస్మృతి.

మ్లానత నొందక యున్నవి సు♦మంబులు చూడుము దేవపూజయం
దానియమాఘ్య్య లుంచినవి ♦ యాదర మారఁ సుశీలతానిధీ. ౧౨౭౧

కం. వింటివి వినఁదగుదానిని, గంటివి వన మెల్ల నింకఁ ♦ గాయము విడి నే
దంట లగునాదుగురువులఁ, గంటకుఁ జన నాన తిమ్ము ♦ కాకుత్స్థ యనన్. ౧౨౭౨

కం. అచ్చెలువపలుకులను విని, మెచ్చుచు శ్రీరామవిభుఁడు ♦ మెలఁతకు ననియెన్
వచ్చెను నీదుసపర్యలు, సచ్చరిత! యథాసుఖంబు ♦ చను కోర్కి మెయిన్. ౧౨౭౩

ఉ. ఆజనకాత్మజేశుఁ డిటు ♦ లాజ్ఞ యొసఁగ ముదిబోయచేడె కృ
ష్ణాజినచేల యాయతజ♦టాన్వితయై యోగసమిద్ధవహ్నులం
దోజమెయిం గళేబరము ♦ నొప్పుగ వీడి లసత్పరిష్క్రియా
రాజితదివ్యదేహ యయి ♦ క్రచ్చఱఁ జేరె మునీంద్రసన్నిధిన్. ౧౨౭౪

## ◆ రామలక్ష్మణులు పంపాతీరంబుఁ జేరుట ◆

కం. ఆసతి యీగతిఁ బరగతి, దాసిన నేకాగ్రచిత్తుఁ ♦ డన్నుని హితునిన్
వాసవనిభుఁ డగురాముఁడు, మాసరముదమునను బల్కె ♦ మానివిషయుఁడై.

శా. ఏమీ వారలసత్ప్రభావము! ల వెం♦తే నక్కజం బయ్యెడిన్
సౌమిత్రీ! మృగముల్ పులుల్ చనవు హెం♦చ్చన్ నమ్మికం గ్రుమ్మరెన్
నీమం బారఁగఁ జైత్రతర్పణము మా♦నిత్రేష్ఠసంసృష్టత
త్నామగ్రాంబులఁ దీర్చినారము శుభో♦దర్కంబుగా నీయెడన్. ౧౨౭౬

ఉ. హానశి దీఱె, సౌఖ్య మిఁక ♦ నబ్బెనుఁ, జిత్తము తుష్టి చెందె, సు
గ్రీవుఁడు సంచరించెడి గి♦రిం గడుదూరము లేదు, పంపకై
పోవలదా యిఁకన్ మనము ♦ పొల్చుఁ గదా యట ఋష్యమూక మన్
గ్రావము, సూర్యపుత్త్రుఁ డటఁ ♦ గ్రాలుఁ గపీంద్రచతుష్కయుక్తుఁడై. ౧౨౭౭

ఉ. పోదము లెమ్ము పక్షహిత♦పుత్త్రునిఁ గానఁగ వేగ, వానిచేఁ
గాదె ధరాతనూజ వెద♦కం దగుకార్యము తీరు, నన్న సే
తాదయితుల్ వచించు విను తద్విషయంబునయందె నామనం
బాదటఁ దీవరించెఁ బద♦మా యని వారలు చేరి పంపనున్. ౧౨౭౮

సీ. నానాలతాకీర్ణ♦నవ్యభూరుహపూర్ణ, పానీయవాహినీ♦భవ్య మగుచు
నిష్యందమకరంద♦నీరంధ్రదరవింద, కహ్లారవితతి రం♦గ్తంబు నగుచుఁ
బుండరీకవితాన♦పురుకైరవాదీన, లలితరోచులచే వ♦ళక్షు మగుచు
పవగణనాతీత♦కువలయసంజాత, నిబిడకాంతులచేత ♦ నీల మగుచుఁ

తే. గుథముఁబోలిన యాపంప♦కొలఁకుఁ గాంచి
నియమసముదారజనసమ♦న్వితమైన

దానిమహిమకు మిగులఁ జో♦ద్యంబు నొంది
కనులపండువుగా దానిఁ♦ గనుచు నరిగి ౧౭౯

తే. దానికిని నాతిదూరాన♦ మానసీయ, మగుమతంగసరసమున♦ నాధరాధి
పతికుమారులు దోఁగి త♦త్ప్రాంతరమ్య,వనములను దిలకించుచుఁ♦ జనుచు నుండ.

తే. లలితలతికావిరాజిత♦తిలకబీజ, పూరకరవీరకుందభాం♦డీరసప్త
పర్ణకేతకనిచుళామ్ర♦వణవిభాసి,త మయి భూషితప్రమద నాఁ♦ దనరుదాని

తే. కీరకోయష్టికార్జున♦హారిపక్షి,గణవిశాదితవనమును♦ గనుచు నెలమి
నరిగి మఱి పంపఁ జేరి సీ♦తాధినేత, దమ్మునకు నిట్టు లనియె రా♦గమ్ము దొలఁక.

కం. ఈపంపాతీరంబున, నేపారెడుబుశ్యమూక♦పృథివీధర మం
దాపుణ్యుఁడు సుగ్రీవుం, డీపట్ల వసించుచుండు♦నిష్టులతోడన్. ౧౮౩

కం. దీనుఁడ నై రాజ్యశ్రీ,హీనుఁడ నై సీతఁ బాసి♦ యెటు మనవచ్చుఁ
గాన దివాకరతనయునిఁ, గానఁగ నీ వరుగ వయ్య♦ కార్యము పొంటెన్. ౧౮౪

కం. అని లక్ష్మణసహితుం డై, యినకులచంద్రుఁడు విషాద♦భృశతాపితుఁ డై
తనయనుఁగుఁదమ్ముతోఁ బం,పను దృష్టిమనోహరైక♦భాగముఁ జేరెన్. ౧౮౫

మానిని. ఈవిధ దుఃఖకరంబులఁ గానల♦ నెల్లను దాఁటి క్రమంబుగ వి
ఘ్నావళిఁ బాయఁగఁ జేయుచు దవ్వు ప్ర♦యాణము చేసి మనోజ్ఞకనా
నావిధపక్షిసమాకులఁ బంపను♦ నవ్యజలాశయసత్తము నా
భూవరనందనయుగ్మము గాంచి య♦పూర్వముదంబున నుల్లసిలెన్. ౧౮౬

## ఆరణ్యకాండాంతపద్యములు.

కం. రామా! గుణధామా! రిపు,భీమా! సౌందర్యకామ! ♦ విశ్రుత తేజ
స్సీమా! శుభనామా! రుచి, సీమా! లసదొంటిమిట్ట♦సీతారామా! ౧౮౭

చం. అయగతి వందనీయ దుర♦వాప్తపదార్థరతైకచేతనో
చ్ఛ్రయసువిదూర యింద్రియవ♦శంగత దేహిభృశార్తిమోక్షణా
వ్యయదయ యాజవంజవని♦బద్ధసదైకగతీ మహామతీ
జయజయ ధర్మభృద్వర ప్ర♦శస్తసమస్తగుణైకమందిరా. ౧౮౮

మందాక్రాంత. ధీరా! యూర్ధ్వేశ శుచినముచి♦ద్వేషిదిక్సాంఖ్యపద్యో[1]
దారారణ్యప్రథితచరితో♦ద్దామ వాత్సల్యసీమా
క్రూరారాతిక్రథనకలిత♦క్రూరకోపా యపాపా
వారాశీడ్గాకమానుమాను భక్తహృత్పద్మసద్మా. ౧౮౯

[1] పది దిక్కులలో నూర్ధ్వదిక్కు పదునొకండవది, యీశాన్యము ౮, శుచి = అగ్నిదిక్కు రెండవది, నముచిద్వేషి దిక్కు = తూర్పు మొదటిది. ౧౮౯ పద్యము.

— గద్యము. —

ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందమిళిం
దాయమాన మానసత్వ మహావైభవ వావిలి
కొలను రామచంద్రరాయతనూభవ సుజనవిధేయ సుబ్బరాయ
నామధేయప్రణీతం బైన శ్రీమదాంధ్రవాల్మీకిరామా
యణ మనునిర్వచనమహాకావ్యంబునందు
నారణ్యకాండము.

---

శ్రీ రామార్పణమస్తు.

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్లో. నమోస్తు రామాయ సలక్ష్మణాయ, నమోస్తు దేవ్యై జనకాత్మజాయై
నమోస్తు వాతాత్మభువే వరాయ, నమోస్తు వల్మీక భవాయ తస్మై.

---



శ్రీః.

శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణేనమః.

శ్రీ శారదాయైనమః.

శ్రీమతే రామానుజాయ నమః.

# శ్రీమదాంధ్రవాల్మీకి రామాయణము.

## కిష్కింధాకాండము.

---



చరణాజోవికసిత
వాచంయమిహృదయకమల ♦ వారితశమలా!
ఖేచరభూచరవినుత వ
నేచరవరపరమమిత్ర ♦ నీరదగాత్రా! ౧

### రాముఁడు పంపాతీరంబున సీతావిరహంబునఁ దపించుట.

కం. రాజీవేందీవరఝష, రాజీసువిరాజమాన ♦ రమణీయ శ్రీ
యోజితసరసిం గని రవి, తేజుఁడు లక్ష్మణునితోడ ♦ దీనత ననరెన్. ౨

కం. పంపాలోకనసమ్మద, కంపితసర్వేంద్రియుండు ♦ కంజాతశరా
కంపితహృదయుఁడు రాఘవుఁ, డింపుగ లక్ష్మణునితోడ ♦ నిట్లని పలికెన్. ౩

కం. విరిదమ్ములుఁ జెంగల్వలు, సురుచిరవైడూర్యవిమల ♦ శోభనజలముల్
పరిసరవివిధద్రుమములుఁ, బరఁగెడి సౌమిత్రి కంటె ♦ పంపతెఱంగున్. ౪

కం. కొండలు శిఖరంబులతో, నుండుగతిం గొమ్మ లెసఁగు ♦ నుర్వీజంబుల్
మెండుకొనఁ బంపచుట్టును, గొండాడఁగఁ దగినవనులు ♦ గొఱలెడిఁ గంటే. ౫

కం. భరతునిదుఃఖంబున సతి, హరణంబున శోకతప్తుఁ ♦ డై వనరెడి నా
గురుతరదుస్సహపీడా, భరమున మాధవుఁడు ముంచి ♦ శాధించె నయో. ౬

కం.శోకార్తుఁడ నగునాకును, నీకాసారంబు మిగుల♦నిం పొనగూర్చెన్
బ్రాకటవిచిత్రవన మై, శ్రీకరశీతోదకంబు ♦ చిత్రసుమం బై. ౭

కం.ఉరగానుచరిత మయ్యును, సరసి మృగశకుంతనికర♦సంకుల మయ్యెన్
వరసీరుహనీలాబ్జో,త్కరసంఛన్నంబు నయ్యుఁ ♦ దతహర్ష మిడెన్. ౮

కం.రమణీయనీలపీతము, లమలినశాద్వలము లవిగొ ♦ సతులితశోభన్
ద్రుమసుమసమర్పితము లై, కమనీయము లయ్యె రత్న♦కంబళము లనన్. ౯

కం.సుమభరసమృద్ధములు కొన,కొమలు విరాజిల్లుతరులఁ ♦ గుసుమవిలసితా
గ్రము లగులతాళు లావ్యం,తము గౌఁగిటఁ గ్రుచ్చినట్లు ♦ తనరెడిఁ గంటే. ౧౦

సీ. పరిమళభరితుఁ డై ♦ వరసుఖానిలుఁ డయి, ప్రచురమన్మథుఁ డయి ♦ ప్రసవఫలమ
నోహరుం డయి వసం♦తుండు చెన్నారెడిఁ, దోయదజాలంబు ♦ తోయములను
గురియుభంగిని♦బుష్ప♦తరువులు సుమముల,వర్షించు చున్న వై♦భవముఁ గంటె
కటకురానేలలఁ ♦ గాసనద్రుమములు, రాలిచెఁ బూవులు ♦ గాలి విసర
తే. రాలురాలినపూవుల ♦ లీల బెగసి, యాడెఁగరువలికొమరుండు ♦ చూడ నయ్య
యలరు లలరినకొమ్మల ♦ ననిలుఁ డూఁది, స్థానచలితాళిమిషను గీ♦తంబు నెఱపె.

కం.పరభృతలలితరవంబుల, సరసంబుగఁ దమలకొమ్మల ♦ నాడించు నటుల్
గిరికందరమును వెడలుచు, వరగానము సేయునట్లు ♦ పవనుం డొప్పెన్. ౧౨

కం.కరువలి బెట్టుగ వీచిన, బెరయఁగ నొండొంటితోడ ♦ విరిసినకొమ్మల్
సురుచిరగతి మాలిక లనఁ, బరిఢవిలెం గంటె వృక్ష♦వారములందున్. ౧౩

కం.చందనశీతలుఁ డగుచును, మందానిలుఁ డిపుడు పుణ్య♦మహితామోదం
బెందును వెలయఁగ బడలిక, కుందఁ సుఖస్పర్శుఁ డగుచుఁ ♦ గొమరుగ వీచెన్. ౧౪

కం. తేనియ వలపులు వెలసెడి,కాననముల మదమిళింద♦కమ్రారవసం
తానమిషంబున ద్రుమములు, గానము లొనరించె నాడెఁ ♦ గరువలి పేర్మిన్. ౧౫

కం.నెత్తములఁ బుట్టి పూవుల,గుత్తులచే నిండియున్న♦కొమ రగుచెట్టుల్
హత్తఁగ నొక్కటిగ మహీ,భృత్తతి పెనుపూలరాసి♦విధమునఁ దోఁచెన్. ౧౬

కం సుమసంఛన్నశిఖరములు, సమీరణోత్క్షేపగాఢ♦సంచలితములున్
భ్రమరావతంసితంబులు, ద్రుమములు గానం బొనర్ప ♦ దొరఁకొన నయ్యెన్. ౧౭

కం.సిలు వెల్లఁ బూచి గోఁగులు, లలిమెయి నపరంజితొడవు♦లం దాలిచి పై
వలెవాటుగఁ బైఁడిజరీ,వలువలు ధరియించుజనుల♦వడువున నమరెన్. ౧౮

కం.వింతశకుంతరవంబుల, నెంతయు నాక్రాంత మగుచు♦ నెసఁగి వసంతం
బంతస్తాపముఁ గూర్చెడిఁ, గాంతాహీనునకు నాకుఁ ♦ గడు దుస్సహ మై. ౧౯

కం.భామావియోగదుఃఖో,ద్దాముఁడ నగునన్ను మిగులఁ ♦ దపియింపించెన్
గాముఁడు; జయఘోషంబున, వేమఱు కోవెలలు నన్నుఁ ♦ బిలిచెడిఁ దుష్టిన్. ౨౦

కం. రమ్యవననిర్ఝరంబుల, సమ్యగ్రాప్తంబు లగుచుఁ ♦ జారురవంబుల్
సౌమ్యగతి నించి నాకు న, శామ్యత్పరితాప మిడియె ♦ జలకుక్కుటముల్. ౨౧
కం. తమ్ముఁడ మన మాశ్రమదే, శమ్మున మున్నుండ నిట్టి ♦ చాగురనముల్
క్రమ్మిన జానకి విని కడు, సమ్మదమున నన్నుఁ బిలిచి ♦ సంతోషించెన్. ౨౨
కం. నానామంజులరవము ల, నూనంబుగ బహుళనీడ ♦ జోత్కరములు త
మ్మూన లతికాకుడుంగవి, తానంబుల వ్రాలు నవ్విధంబును గనుమీ. ౨౩
కం. కమ్మనియెలుఁగులు నించుచుఁ, బమ్మినతమి జాతిపురుష ♦ పక్షులతోడన్
సమ్మదమునఁ గ్రీడించె ఖ, గమ్ములు భ్రమరమ్ములు బయ ♦ కాఱులు గాఁగన్. ౨౪
కం. పాదపములు నత్యూహచ, యోదితరవముల వనప్రి ♦ యోత్తమకలన
న్నాదంబుల నామది సుమ, కోదండానలము మిగుల ♦ గుర్వోనరించెన్. ౨౫
తే. నెఱి నశోకగుళుచ్ఛము ♦ ల్నిప్పులుగను, షట్పదధ్వని మంటల ♦ చప్పుడుగను
దొగరుఁజిగురులు కీలల ♦ పగటుఁ దాల్ప, నిగిగొ నామనిచిచ్చు స ♦ న్నేర్చె నిపుడు.
మత్తకోకిలము. ఈమనోహరకోకిలారవ ♦ మీసుపుష్పితకాననం
బై మహిం జెలు పొనసంపము ♦ హర్షిం విం సీకుం
వామలోచన మంజుభాషిణి ♦ బంధరాంకఁ బాసి యిం
కేమికార్య మనుంగుఁదమ్ముఁడ ♦ యేను జీవముఁ దాల్చియుం. ౨౭
మత్తకోకిలము. ఏవి పూదిసపూవు పేరము ♦ లెల్లెడం గన నాచు నా
యూచకొంవిలోచన గను ♦ లాంఁ గానమిఁ బున్నా
రావజాతవసంతర ♦ రాగ కారణశోకశు
క్రాచితాస్కుఁడ నై కృశించెన ♦ నయ్యొ యెట్లు సహింతునో. ౨౮
మత్తకోకిలము. కానరాక విదేహకన్యక ♦ క్రాలఁజేసెను శోకముల్
కానవచ్చి వసంతుఁడున్ శ్రమ ♦ కాంపబిందుల నూన్పెడిన్
మానినీ మణిఁ బాసివేదన ♦ మాఁడుచుండఁగ నీవసం
తానిలుం డెటువంటిక్రూరుఁడొ ♦ యయ్యొ నన్ను దహించెడిన్. ౨౯
చం. పవనము వీచినన్ రెపరె ♦ పన్ స్ఫటికంపుగవాక్షముల్ నలెన్
మివులఁ బురుల్ లసింపఁగ నె ♦ మిళ్లు నటించెడిఁ దమ్ముఁ జెంటులున్
దవిలి భజింపఁ జుట్టుకొని ♦ తద్దయు మొత్తున సొక్కుచున్ పనో
భవపరిపీడితాత్ము నసుఁ ♦ బంచశరార్తి మఱింత పెంచు మున్. ౩౦
ఉ. ఆడెడినెమ్మిఁ జూచి కెల ♦ వార మయూరియుఁ దాను నాపఁగా
వీడనిమన్మథార్తి నడె ♦ పేటులపంచల తెక్కలార్చుచుం

గూడఁగఁ బోవుచుఁ మృదుల♦కూజితముల్ వెలయంగ బర్హి నా
జాడను జూచె న న్నగెడి♦చందముగాఁ గనుఁగొంటె లక్ష్మణా. ౩౧

కం. కానల శిఖావలము ప్రియ, మానిని నసురుండు గొనుచు ♦ మఱుఁగండు సుమీ
కావఁ గదా యిది ప్రియతో, మానుగ వేడుకలఁ గ్రీడ ♦ మరగెను దమిచేన్. ౩౨

ఉ. ఘోర వసంతకాలమహి♦మాతిశయంబు శకుంతజాతులన్
భారిత జన్మమందియును ♦ దద్దయు రాగభరంబునం బతిన్
జేరియ విల్చె నాశిఖిని ♦ సీతయు రక్కసుచేతఁ జిక్కి దే
సూరిమి లోలనేత్ర నసుఁ ♦ గూడఁగ రాదె ససంభ్రమాత్తయై. ౩౩

మత్తకోకిలము. అట్టి నాప్రియురాలి జానకి ♦ హారికుంతలఁ బాసి నే
నెట్టు లక్ష్మణ సంతరింతునొ ♦ యీవసంతముఁ గంటివే
తొట్టుతేనెల మేలిపూవుల♦తో వనంబులు నిండి యి
ప్పట్టువన్ సుమపాళి నాయెడ ♦ వ్యర్థమయ్యెడి నయ్యయో. ౩౪

మాలిని. ఎంతయుఁ గాంతలు దొంతర లారియు ♦ నీకుసుమంబులు తేఁటిగముల్
రంతులు సేయుచు వెన్కను ధారిణి ♦ రాలెడి నాయెడ వ్యర్థము లై;
కాంతిక లారవముల్ నిగిడించుచుఁ ♦ గామము నా కెసఁగింపఁ బతి
త్వంతలి నల్పెడి నొక్కొ పరస్పర♦సల్లపనంబులు పిల్వలచేన్. ౩౫

కం. ఎచ్చట నాప్రియ యున్నదొ, యచ్చట నీపుష్పసమయ ♦ మమరిన నిక్కం
బచ్చపలాక్షియు నావలె, ముచ్చిరుఁ గందర్పశర్వ♦మూర్ఛిత యగుచున్. ౩౬

ఉ. జానకి యున్నచోటను వ♦సంతము కల్గదు, నన్నుఁ బాసి యా
చాన సహించు నెట్టు లది ♦ జానకి నేనియుఁ, గల్గెఁ బో యయో
దానవకోటి చుట్టుకొని ♦ తర్జనముల్ పలుకంగఁ బూర్ణచం
ద్రానన యేమి సేయఁగల ♦ దార్తిని వెల్వలఁ బాఱుమోమునన్. ౩౭

కం. శ్యామ మృదుపూర్వవచనో,ద్దామ మనోజ్ఞాభిరూప్య♦ధామ దళచ్ఛ్రీ
ధామదళనేత్ర యుద్య,త్కామ యగుచు సురభివేళఁ ♦ గాయము విడదే. ౩౮

కం. ఇట్టులు నామదిఁ దోఁచెడిఁ, బట్టుగ నీవేళ జనక♦భవ కోమిరెయుఁ దా
నెట్టన మగనా లగుటను, నెట్టును మద్విరహమును స♦హింపదు తాల్మిన్. ౩౯

కం. తప్పుఁ ప సీతారమణి మ,న మెప్పుడు నిలిచియుండు ♦ నాయందే నా
కమ్మదిరాక్షీమణియం, దిమ్ముగ భావంబు నిలుచు ♦ నెల్లపుడుఁ దమిన్. ౪౦

ఉ. కుసుమసౌరభానిలుఁ డ♦హీనసుఖావహశీతలుండు నై
భాసిలు చుండియున్ సకియ ♦ పజ్జను లేమిని నగ్ని కల్పుఁ డై

గాసిలఁ జేయఁజొచ్చె ననుఁ ♦ గామినిఁ గూడి చరించువేళ నెం
తే సుఖమౌండు నేఁ డిటు ద♦హింపఁగఁ జూచెడి నేమి పాపమో. ౪౧

ఉ. ఈవలుగాకి కాకి మును ♦ పేము సుఖంబుగ నుండఁ బేరిమిన్
జూపుచు మింటిపైఁ జెవులు ♦ చూఁడెడిభంగిని గూయుచుండు, ని
ర్దో పుచ్ఛఁబోణి లేమి ముద ♦ మూరఁగ జెక్క విదుర్చుతోడ శా
ఖాపటలంబులం గునియఁగాఁ ♦ గడఁగెన్ ముదమారఁ దమ్ముఁడా. ౪౨

కం. మహిళావియోగమును నీ, విహగము సూచించె నాఁడు ♦ వెండియు ననలా
మిహియోగము సమ్మోదా, నహరుతముల నిప్పు డెఱుక♦పఱిచెడి నెమ్మిన్. ౪౩

కం. విరులం గొనలన్ వెలసెడి, తరులం గూర్చుండి పక్షి♦తతి రమ్యముగాఁ
దెరలన్ ధైర్యము కామము, పెరుఁగం గావించె వింటె ♦ వివిధరుతంబుల్. ౪౪

కం. లలిఁ బవనక్షిప్తంబుం, తిలకపు మంజరిని వెన్క♦నెన్ షట్పదమా
పలలిత కామమదోద్ధుత, జలజాక్షిం బ్రియను మగని♦చందము దోఁపన్. ౪౫

కం. పేర నశోకం బయ్యును, వారిగఁ గామిజనశోక♦వర్ధన మిది యూ
మారుతధుతగుచ్ఛంబుల, సారెకు నను భయముపఱుచు♦చందము నొందెన్. ౪౬

కం. పూవులు నిండం బూసిన, మావులు గనుఁగొంటె విభ్ర♦మస్థయమతు లా
పావనవిలేపనకసం, భావిత మానవులఁబోలి ♦ భాసిలె రుచులన్. ౪౭

సీ. పంపావనంబుల ♦ సొంపార నట నటఁ, గిన్నరుల్ దిరిగెద ♦ రన్న [illegible]టె
ప్రతిఫలించిన బాల♦భాస్కరుఁ బోలిన, కోకనదంబుల♦కొమరుఁ గంటె
యాహ్లాదకర మగు♦కహ్లారహల్లక, హంససారసరాజి♦తాంబుఁ గంటె
తరుణార్కనిభ షట్ప♦దచ్ఛా దాహాతకేస, రాబ్జాన్వితజలాశ♦యంబుఁ గంటె
ఆ. చక్రవాక యుతము ♦ చారువనీ పరి, ధానరంజితంబు ♦ దప్పికలిమిఁ
జేరియున్న లేళ్ల ♦ గొరులపిండు నై, పంప యింపుసొంపు ♦ పెంప వెలసె. ౪౮

కం. కరువలి తాఁకున రేఁగిన, తరఁగల చేఁ దాడితములు ♦ తామరపూవుల్
నరసత నుయ్యెల లూఁగెడు, సరణిన్ రహిమీఱెఁ గంటె ♦ సౌమిత్రి యటన్. ౪౯

కం. శతపత్రపత్రలోచన, శతపత్రప్రియను ఫుల్ల♦సారసగంధిన్
క్షితికన్యకఁ గన లేమిని, బ్రతుకఁగ నే నొల్ల నేల ♦ బరువుగ ననుజా. ౫౦

కం. ఔరా కామునికుటిలత, దూరగతం బ్రాణతుల్య ♦ దుర్లభ భద్రన్
జారుతరభద్రవాదిని, స్మారగతిం దెచ్చె నిపుడు ♦ స్మరణంబునకున్. ౫౧

కం. పూచినతరువులకలిమిని, నేచి వసంతుండు నన్ను ♦ నేఁపఁడె యే[illegible]
నేచందంబున నైనను, నేచుదు సౌమిత్రి కాము♦నిన్ సహియింపన్. ౫౨

కం. రమణీసంగతి నెయ్యవి, రమణీయము లగుచు నాకు ♦ రాగముఁ గూర్చెన్
రమణి నెడఁబాయ నవియే, రమణీయుతఁ బాసి కదు వి♦రాగముఁ గూర్చెన్. ౫౩
కం. తామరమొగ్గల రేకుల, నామోదముతోడఁ గందు♦నా యన నవి నా
భామినిదృక్కోశంబుల,తో మాదిరి గొనుట వానిఁ ♦ దోఁపం జేయున్. ౫౪
తే. పద్మకేసరస్పృష్టుఁ డై ♦ వనుమతీరు,హాంతరవినిస్సృతుండు నై ♦ యదిగొ వాయు
వంగనామణినిశ్వాస♦భంగినొంది,యసమగతి వీచెడినిమనో♦హరుఁడునగుచు. ౫౫
కం. పంపాదక్షిణతటమున, నింపగునెత్తములఁ గంటి♦వే సౌమిత్రీ
పెంపార విరియుగోఁగుల,సొంపగుకాండములఁ బరమ♦శోభాఢ్యములన్. ౫౬
చం. పురుతరధాతురాగచయ♦భూషితుఁ డీగిరిరాజు కంటె ము
త్కరముగ వాయువేగనువి♦ఘట్టితసాంద్రరజంబుఁ జిత్రవై
ఖరులను రేపు చుండెడిని ♦ గమ్రసుపుష్పిత పత్రహీనసుం
దరవరకింశుకంబులను ♦ దగ్ధయు సానులు ప్రజ్వరిల్లెడిన్. ౫౭
సీ. మాలతీ కరవీర ♦ మాధవీ మల్లికా, వల్లికావేల్లిత ♦ వరతలములు
సిందువారక బృంద♦కుందవాసంతికా, సంతానగుల్గినీ ♦ చారుతటులు
వంజుళ మంజుళ ♦ వకుల చంపక నీప, చిరిబిల్వ కేతకీ ♦ పరిణములను
నారంగ మధురంగ ♦ నాగరంగ కురంట, పాటలార్జున కూర ♦ చటులములను
తే. శింశుపోద్దా[illegible] కేతక♦కింశుకములఁ, జందనస్పందనసుదర్శ♦సంతతులను
గురువక శిరీష లినిశ కే♦సర సువర్ణ,శాబరాగములను గంటె ♦ నానుపులను. ౫౮
కం. పూచినశిఖలను గలలతి,చాచయములు చుట్టుకొనఁగఁ ♦ గంటె పంపఁ
బూచినద్రుమములు సాంద్రను,రీచుల నిగిడించు చూఁచెఁ ♦ గ్రీష్మం గొన్నల్. ౫౯
కం. కరువలి కాడెడువిటపో,త్కరములతో నెలమిఁ దమ్ముఁ ♦ గదియఁగ రాఁగెన్
దరువులు వాని మదిరచిన,వరతరుణులువోలె లతలు ♦ పరిరంభించెన్. ౬౦
కం. తరువుం దరువున్ ధరణీ,ధరమున్ ధరమున్ వనంబు ♦ తత వనముం గా
మరుతుఁ డనేక రసజ్ఞా, సరుసించెడినరునిమాడ్కి ♦ నరిగెడుఁ గంటే. ౬౧
కం. పెల్లుగవిరిసినపూవుల,మొల్లము నై మధురగంధ♦ములు కొన్నితరుల్
సల్లలితకుట్మలంబుల, మొల్లమిచే వెలిఁగె నీల♦ములు కొన్నితరుల్. ౬౨
కం. అదె రాగమత్తమధుకర, మిది రమ్యం బిదియె స్వాదు ♦ విదియో యిపుడే
కద విరిసిన దని యెంచుచు, మునమున ఝుంకృతులఁ గుసుమ♦ములఁ దాఁ దవిలెన్.
కం. మాటుగొని భూరుహముల న,దాటున వెలివచ్చి తేనెఁ ♦ దవిలినరక్తిన్
జాటుగ మఱియొక భూరుహ,కూటముఁ జేరంగఁ దేఁటి ♦ గొబ్బునఁ జనియెన్. ౬౪

కం. తెలుచుగఁ దమకుం దా మిల, నెఱసిన యొఱపైనవిరుల ♦ నెఱిగలనేలల్
తెలుకొనును హాయిగా నిటఁ,బఱవనిపూఁబఱపు లగుచు ♦ భాసిలెఁ గంటే. ౬౫

కం. పలుపలువన్నెలయలరులు, గలయఁగ సానువుల రాలి ♦ కమనీయము లై
విలసించెఁ బసిమిజేవులు, వెలిపాన్పులలీలఁ గంటి ♦ వే సౌమిత్రీ. ౬౬

కం. కుసుమసమయంబునన్ ద్రుమ, విసరంబుల సుమచయంబు ♦ విరివిం గంటే
కుసుమోత్తంసిత తరువులు, పసమీఱెఁ గదన్న యొట్టి ♦ ప్రక్కలఁ గనినన్. ౬౭

కం. పాటికి నన్యోన్యస్యంబును, బోటికివలెఁ బూచి లెస్స ♦ భూజములు పరీ
పాటిగఁ దేఁటులమ్రోఁతల, మాటికి నొండొంటి గేలి ♦ మాటలఁ జీరెన్. ౬౮

కం. ఈకారండవశకునము, ప్రాకటశుభవారి మునిఁగి ♦ రమణియుఁ దానున్
నా కతెనుతాప మొదవ ర,తి కేళిం గూడెడిం గ ♦ దే సౌమిత్రీ. ౬౯

కం. మందాకినితటినికి నీ,యుందంబు మనోజ్ఞభంగి ♦ యలనడుట జగం
బందు మనోరమగుణముల, నెందును విఖ్యాతిఁ గాంచె ♦ హృష్టిప్రద మై. ౭౦

కం. కనులారఁ గనుచు నాసతి, మనసారఁగ నిందు నుండ ♦ మరగితి తేనిన్
విను స్వర్గ మాయయోధ్యయు, మనమున స్మరియింపఁజాల ♦ మాన్యచరిత్రా.

ఆ. వానితోఁటలేల ♦ పసమీఱిసుతతోడ, దంబుమీఱు శాద్వ ♦ లంబులందు
నే రమింపఁ గలుగ ♦ నేటికిఁ జింతింతు, నుబుసుపోక కైన ♦ నున్నవాని. ౭౨

కం. ఇవ్విధం మొగడలఁ దలిరుల, సవు రగునాకులను మిగుల ♦ సంపన్నము లై
ఛవి మీఱుతరులవనముల, రవరవలన్ వేదు రెత్తె ♦ రా నా కనఘా. ౭౩

కం. జక్కవలు బెగ్గురులు జల,కుక్కుటములుఁ గ్రౌంచములును ♦ గూజద్ద్విజముల్
పెక్కులుజింకలుఁ బందులు, మిక్కుట మగుపంపఁ గంటె ♦ మిక్కిలి వెలిఁగెన్.

కం. సామోదద్విజచయములు, శ్యామామణిఁ జంద్రముఖిని ♦ సారసనేత్రన్
నామనమునకుం దెచ్చియుఁ, గామము నాలోనఁ గొలఁది ♦ గడవం జేసెన్. ౭౫

కం. హరిణీచయసంగతముల, హరిణంబుల సానుభూము ♦ లందుం గనుమీ
హరిణీశాబకనయనా,విరహీకృతు నన్ను దీను ♦ వీక్షింపవనా. ౭౬

కం. మత్తద్విజసంఘంబులు, నత్తమ్ముల మొత్తములను ♦ నెమ్మదిఁ దిరుగన్
హత్తినతమి నట నిట నా,చిత్తముతహతహల నేమి ♦ చెప్పుదు ననుజా. ౭౭

కం. కాంతాసహితుఁడనై యీ,కాంతసుకాంతారమున ని ♦ కామము దీరన్
జింతాచ్యుతిఁ జరియించిన,యంతఁ గదా నాకు స్వస్తి ♦ యగు సౌమిత్రీ. ౭౮

కం. పావనపంపావనములఁ, బావనపోతముల నేను ♦ బావని సీతా
భావినితో సేవించిన, జీవము మెయి నిలుచు నొంట ♦ సేమము గలదే. ౭౯

కం. పంపోపవనసమీరము, సొంపుగ బిససూనకుముద ♦ సుమసురభితమున్
లంపటము దీఱఁగా సే,వింపంగల వారు పో భు ♦ విన్ ధన్యతముల్. ౮౦

కం. ఆనీరేజవిలోచన, యానవయౌవనవిలాస ♦ యారాకాచం
ద్రానన యేగతి విరహాధీనత వివశాత్మ యగుచు ♦ ధృతి మన నోపున్. ౮౧

చం. అనఘుఁడు సత్యవాది మహి♦తాత్ముఁడు ధర్మరతైకశీలుఁ డా
జనకుఁడు గోష్ఠి మాకుశల♦సంపద ప్రశ్నము చేసి యుల్లుఁడా!
తనయకు సేమమా? యనిన ♦ దానికి నే మని చెప్పువాఁడ మా
నిని నెవఁడో హరించెను వ♦నీస్థలి నంచు వచించువాఁడనే. ౮౨

కం. ననుఁ గన్నతండ్రి వన్నుక్, వనములఁ బడు పొమ్మ టన్న ♦ వనజాక్షియు న
న్ననుగమనం బొనరిచె స,జ్జనసుతమార్గమున నట్టి♦సతిగతి యేమో. ౮౩

తే. రాజ్యహీనునిఁ గృపణు ని♦ర్భాగ్యతముని
వెంటనంటియు నడవుల ♦ జంట విడక
యున్న రన కరుదెంచిన♦యువతిఁ బాసి
యేమి గని మేనఁ బ్రాణంబు ♦ లేను నిలుప. ౮౪

సీ. కందునా నేఁ గొమ్మ ♦ ఘ మ్మనుకమ్మని,యస్వంపునిస్వంపు♦ముద్దుమోము
విందునా వీనుల♦విందుగాఁ దుల లేని,యొలనవ్వు హాస్యంపుఁ♦గలికిపలుకు
ఉందునా తాఁ గుందు♦నొంద న ట్లంగజ,బాధితు ననుఁ దేఱఁ♦బలుక మరల
మందునా నే నిఁక ♦ మందయానను బొంది, డెంద మానందానఁ ♦ గందళింప
తే. నేమిరా సేయువాఁడ నే ♦ నేగఁ బురికిఁ, దల్లికౌసల్య మృదుభావ ♦ తనయ! రామ!
యేది నాకోడ లం చన ♦ నే మటంచుఁ, జెప్పు మనెదవురా నన్ను ♦ శిష్టవినుత.

కం. చనుమా లక్ష్మణ పురికిని, గనుమా సౌభ్రాత్రరతునిఁ ♦ గైకతనూజున్
మనుమాట కల్ల నే నిఁక, సనుమానము లేదు జనకు♦నాత్మజ లేమిన్. ౮౫

కం. అని యనఘోత్తెఁ బరిదేవనముం గావించుచున్న♦వలనుం గని యి
ట్లను నమయోచితహితగతి, ననయోక్తుల లక్ష్మణుండు ♦ సంతాప మడఁగన్. ౮౬

లక్ష్మణుఁడు రామునకు ధైర్యోక్తులు చెప్పుట.

కం. అన్నా ధైర్యము పూనుము, చన్నే నినుఁబోటి ధీర♦సత్తముఁడును నా
పన్నతఁ గుందఁగ వగవకు, మన్నా నామనవి వినఁగ♦దన్నా యన్నా! ౮౭

ఉ. ఇట్టిది గాదె లోకమున ♦ నిష్టజనంబులఁ బాసినంతటన్
బుట్టెడిఁ దీవ్రదుర్గఖ మని ♦ బుద్ధిని లెస్స యెఱింగి యాత్మలోఁ
జుట్టములందు స్నేహమును ♦ జొన్పకు, స్నేహబలంబునం గదా
నెట్టన వత్తి మండఁగను♦ నేర్చెడి నీళుల నాని యుండియున్. ౮౮

ఉ. ఆర్త యొకింతయేన్ దెలియ♦వచ్చినపిమ్మట ధారిణీసుతా
హర్త తనంతటం జెలియ ♦ సర్పణ సేయును నీకుఁ, జేయఁడేన్

ధూర్తత భోగిలోకమునఁ ♦ దూఱిన జానకితోడ మాంసభు
గ్భర్త హరిప్రసూజఠర♦భాగముఁ జొచ్చినఁ జించి చెండెదన్. ౯౦
కం. పత్నికి నై ధీజనతా,రత్నమ ఖగవకుము ధృతిని ♦ గ్రాలుము సతి నే
యత్నమునను సాధింతము, యత్నింపక చెడినకార్య ♦ మగుటయుఁ గలదే. ౯౧
శా. ఉత్సాహంబునకంటె లేదు బల మా♦యుత్సాహమే శక్తి యా
యోత్సాహుం డగువాని కియ్యవని లే ♦ దొక్కండు దుస్సాధముల్
సోత్సాహుం డగువానికార్యములఁ బ్ర♦త్యూహంబు లే దెందు నే
నుత్సాహం బొకఁ డూనువాఁ కనఁగ నౌ ♦ నుర్వీసుతల్ రాఘవా. ౯౨
కం. వెనుకకు నెట్టుము శోకము, కొనియాడకు కామవృత్తిఁ ♦ గోవిదుని మహా
త్ముని సుకృతాత్ముని రామా, నిను నీవ యెఱుంగ కున్న ♦ నేనే మందున్. ౯౩
చం. అనవుడు బోధితాత్ముఁ డయి ♦ యాయనఘుండును శోకమోహముల్
మనమున మాని ధీరత స♦మంచితరీతి వెసన్ రఘూద్వహుం
డనుచరుఁ డౌ సుమిత్రసుతుఁ ♦ దనతో ... వనములఁ జూచుచున్ సమద♦వారణగామి చనన్ సుమిత్రసం
దనుఁడును నప్రమత్తుఁ డయి ♦ ధర్మబలంబులఁ గాచుచుం జనెన్. ౯౪

### సుగ్రీవుఁడు రామలక్ష్మణులఁ జూచి భయపడుట.

ఉ. ఈవిధి ఋశ్యమూకకుధ♦రేంద్రసమీపతలంబునందు నా
భూవరనందనుల్ దిరుగ ♦ భూరితరాద్భుతదర్శనీయులన్
దేవసమానవిక్రములఁ ♦ దేఁకువ గన్గొని కొండమీఁదిసు
గ్రీవుఁడు చేష్టలం దొఱఁగి ♦ కీడ్పడఁ జొచ్చెను భీతచిత్తుఁ డై. ౯౫
స్రగ్విణి. కనుఁగొనినంతనె ♦ త్యావరసుతులన్
వనచరవర్యులు ♦ వారని వెఱచేఁ
జనిరి వనాటని♦శాంతము సుఖదం
బును నగునాశ్రమ♦ముల్ పడిఁ దఱియన్. ౯౬
కం. వీరుల గురుతరభద్రా,కారుల సోదరులఁ జాప♦కాండకృపాణీ
ధారుల రాఘవులను బల,సారుల రవిసూతి చూచి ♦ శంకితుఁ డగుచున్. ౯౭
చం. తడతటలాడ గుండియలు ♦ దద్దయు దిక్కుల నెల్లఁ జూచుచున్
దటుకున నిప్పు ద్రొక్కినవి♦ధంబుగఁ దత్తఱఁ బొద మొక్కచోఁ
బ్రుటియును నిల్వ కాకలుష♦దూరులఁ జూచుచు వీడి స్వస్థలం
బటమట నందు నిల్వక భ♦యార్దితుఁ డై భృశశోకతప్తుఁ డై. ౯౮
సీ. ఉండినచోటన ♦ యుండుట మేలొ ప,లాయనం బౌట య♦త్యంతశుభమొ
యని తలపోసి తా ♦ ననుచరయుతుఁ డయి, సచివుల కనిమొ నీ♦చందమునను

గంటిరే వారల ♦ ఘనశుభాకారుల, వీరులఁ గాసార♦తీరమునను
వా రెవ్వరో కాని ♦ వంచనామతిఁ జేసి, నారచీరలు దాల్చి♦నారు గాక
తే. వాలికిని నాకు విడువని♦వైర ముంట, వాలిపంపున వచ్చిన♦వారు వారు
కపటమునిరూపముల నటు♦గాక యున్నఁ, దాపసుల కేల శరచాప♦ధారణములు.
చం. అనవుడు వార లావరశ♦రాసనహస్తులఁ జూచి గుండె ఝ
ల్లన శిఖరంబునుండి శిఖ♦రాంతర మల్లలనాడ దూఁకుచున్
వనగతజీవజంతులు ఘు♦నంబుగ బెగ్గిలి పాఱ దుర్గభూ
జనితకుజాళి ద్రెళ్లఁ జెయు♦జాతినపాదరసంబు నట్టు లై. ౧౦౦
కం. ఒక్కఁడు పోయినత్రోవ మ, ఱొక్కఁడు చన కెల్లవార ♦ లుఱుకుచు నడిమై
నక్కొండ కొండుప్రక్కన, యొక్కటి యై సూర్యపుత్త్రు♦నొద్దను నిలువన్. ౧౦౧

హనుమంతుఁడు సుగ్రీవుని భయకారణ మడుగుట.

ఉ. తామరసాప్తసంభవుని ♦ దాయుచు వాయుసుతుండు పల్కె నీ
కేమిటి కయ్యె యీ వెఱ పి♦కేటికిఁ బాఱెదు వాలిభీతిచే
నీమల ఋశ్యమూకము గ♦దే యిట వాలిభయంబు నున్నె? శా
ఖామృగనాథ! వాలియును ♦ గానఁగరాఁ డిటు లేల త్రొట్రిలన్. ౧౦౨
ఉ. క్రూరునిఁ బాపకర్ము నల♦క్రోఁతులతేనిని గాన నెందు నీ
భీరుత కేమి హేతువు, క♦పిత్వ మహో చరితార్థ మయ్యె నేఁ
డారయ లేవు పూర్ణముగ ♦ హా లఘుచిత్తత, సర్వభూతసం
వారము నెట్లు ప్రోచు నృప♦వర్యుఁడు జ్ఞానమతీంగితచ్యుతిన్? ౧౦౩
కం. మతివిజ్ఞానేంగితసం, చ్యుతి లేక యొనర్పవయ్య ♦ సుగ్రీవ క్రియా
తతి యనుచు శుభము పల్కిన, హితు మారుతి శుభతరోక్తి♦నినసుతుఁ డనియెన్.
మ. హనుమా! భీతి జనింప కుండెడి నె యా♦యస్త్రాతపత్త్రాక్షులన్
గనదాజానుసుదీర్ఘబాహుల మహా♦కాండాసికోదండులన్
వినుతోత్తేజుల దేవపుత్త్రనిభులన్ ♦ వీక్షించినన్, వాలియే
పనుపన్ వా రిట కేగుదెంచి రనుచున్ ♦ భావించితిన్ నామదిన్. ౧౦౪
ఉ. మేదిని రాజు లెల్ల బహు♦మిత్త్రులు, వారల విశ్వసింపఁగాఁ
గా దెద గూఢచారుల ని♦కారవిధంబునఁ బంత్రు, కానివా
రాద దొలంగి యున్నసమ♦యంబున రంధ్రము రోసి తారు ప్ర
మాదికబుద్ధి పొందక ప్ర♦మాపణముల్ ఘటియింత్రు వారికిన్. ౧౦౫
ఉ. వాలి యుపాయశాలి నిర♦పాయకశీలియు దీర్ఘదర్శి భూ
పాలకులెల్ల కట్ల కద ♦ వైరులఁ ద్రుంతురు, తచ్చరిత్రము

త్తే లగుఁబో యెఱుంగ నెటు ♦ లేనియుఁ బ్రాకృతు నందుఁ బంచి, యీ
వేళను నీవు ప్రాకృతుని ♦ వేషముఁ గైకొని వారి డాయఁగన్. ౧౦౭

→ సుగ్రీవుఁడు హనుమంతుని రామలక్ష్మణులయొద్దకుఁ బంపుట. ←

కం. సౌమ్యా వ్యాభాషణరూ, పమ్ముల నింగితము భేద ♦ భంగులఁ దద్భా
వమ్మునిజమ్మును శుద్ధియు, నమ్మకముగఁ దెలిసి యంజ ♦ నాసుత రమ్మా. ౧౦౮

చం. పలుకుల నేర్పు పెంపునను ♦ భావసుబోధకనేత్రవక్త్రచే
ష్టల నెద వారు నమ్మఁగఁ బ్ర ♦ శంస యొనర్చి మదాభిముఖ్య మై
వెలయఁగఁ జేయు మిట్టు లట ♦ విస్థలి చాపశరాసిధారు లై
కలయఁగ సంచరించుటకుఁ ♦ గారణ మే మని ప్రశ్న సేయుమీ. ౧౦౯

ఉ. వారలు నిర్మలాత్ము లని ♦ వాయుసుతా! మది నీకుఁ దోఁచినఁ
సారెకు వెంటియుం బలుకు ♦ చందములం బరికింపు వారివ్యా
పారములందు సత్యము న ♦ బద్ధము నావుడు నట్లుగాక యం
చారఘువీరు లున్నెడ మ ♦ హాత్ముఁడు వాయుజుఁ డేగ నెంచుచున్. ౧౧౦

→ హనుమంతుఁడు భిక్షువేషంబున రామలక్ష్మణుల యొద్దకుఁ బోవుట. ←

ఉ. వంచకబుద్ధిచేతఁ గపి ♦ వర్యుఁడు వానరరూపు మాని య
భ్యంచితభిక్షురూపమున ♦ నగ్గిరినుండి నృపాలు రందు వ
ర్తించుచు నున్నచోటికిని ♦ దెప్పున దాఁటియుఁ జేరఁబోయి ని
శ్చంచలనృత్తి మై వినయ ♦ సంపద వారల కర్థి మ్రొక్కుచున్. ౧౧౧

కం. సుమనోజ్ఞము సౌమ్యము నగు, విమలోక్తుల ముచ్చటించి ♦ విధహితగతి భూ
రమణులఁ దనుపుచు ని ట్లను, స్వమతంబును సూర్యతనయ ♦ సమ్మతసూక్తిన్. ౧౧౨

సీ. ఎవ్వార లయ్యా! మీ ♦ రివ్వనదేశంబు, నకు వచ్చుటకుఁ గార ♦ ణం బ దేమొ
రాజర్షి దేవతా ♦ ప్రతిమానులరు ముని, రాజవేషులరు సు ♦ వ్రతుల రరయ
వరవర్ణులరు సరో ♦ వరతీరకుజముల, నొప్పుగాఁ జూచుచు ♦ నున్నవారు
మిముఁ జూచి వనిలోని ♦ మృగములు పక్షులు, కనుకని పఱచెడిఁ ♦ గడుభయమున

తే. మీతనూశోభ నీనని ♦ పూతజలము, మెఱుఁగు పెట్టినయట్టులు ♦ నెఱివహించె
ధీరులరు తప్తహాటక ♦ దేహులరును, మంచిప్రాయంపువారలు ♦ మాన్యులార!

సీ. హర్యక్షవీక్షణుల్ ♦ హర్యక్షవిక్రముల్, హరిచాపనిభచాప ♦ హస్తులరును
శ్రీమంతులరు వృష ♦ శ్రేష్ఠవిక్రములరు, హస్తిహస్తాభభు ♦ జాన్వితులరు
సుందరాకారులు ♦ బృందారకాభులు, శత్రుసంహరణను ♦ క్షములు మీరు
పారిఁబోరి నిశ్వాస ♦ ములు పుచ్చుచున్నారు, భయపెట్టుచున్నారు ♦ పక్షిగణము

తే. భద్రసింహాసనార్హులు ♦ ప్రాజ్ఞులార! నారచీరంబులను గట్టి ♦ వీరులార!
జడల ధరియించి యీరీతి ♦ జటులఁబోలి, తిరుగ నేటికిఁ జెప్పరే ♦ కరుణమీఱ.

కం. అనుపమతేజంబున గిరి,వనులం బెలిఁగించుచున్న ♦ వా రన్యోన్యం
బును సములు విపులవక్షులు, ఘనబాహార్గళులు దివ్య ♦ కాంతిస్ఫీతుల్. ౧౧౫

కం. ఆకాశంబును విడి యిల్లవోకగ భూతలముఁ జూచి ♦ పోవచ్చినయా
లోకహితశీతకిరణుల, రేకను దోఁచెదరు చెప్ప ♦ రే మీ రెవరో. ౧౧౬

కం. పరిఘోపమానములు సుం,దరములు నాజానువులును ♦ దగవృత్తంబుల్
వరభూషార్హంబులు మీ,కరములు సువిభూషితములు ♦ గావేమిటికో. ౧౧౭

కం. సవనంబు ససాగరముగ, దివిజాలయ వింధ్యశైల ♦ దీపితమగు నీ
యవని సమస్తము నేలఁగఁ, దవువారలు నిరువు రిట్టి ♦ దశ గననేలా? ౧౧౮

కం. చిత్రంబులు శ్లక్ష్ణంబులుఁ, జిత్రవిలేపములు హేమ ♦ చిత్రిత మగునా
సుత్రామపనికి సమములు, గోత్ర నదృష్టంబు లిట్టి ♦ కోదండంబుల్. ౧౧౯

కం. తూణంబులు శత్రుజన,ప్రాణాంతకనిశ్వసన్న ♦ హాహిస్ఫాయ
ద్బాణంబులఁ బూర్ణంబులు, నాణెంబులు భద్రదర్శ ♦ నంబులు చూడన్. ౧౨౦

కం. కదునిడుదలు కడుఁబఱపులు, బెడిదంబులు నుదిరిపసిఁడిఁ ♦ బెనుపరుఁలను మీ
యడిదంబులు కుప్పసముగ, విడిచినవిసదారు లనఁగ ♦ వెలసెడి నౌరా. ౧౨౧

ఉ. ఈవిధి నింతపల్కిన న ♦ దేటికి మాఱు వచింప రయ్య? సు
గ్రీవుఁడు నా నొకానొక హ ♦ రిప్రభు వుత్తమధర్మశీలి సం
భావితవీరలోకుఁడును ♦ భ్రాతృనిరాకృతుఁడై మహావ్యథా
త్మావలయంబునం దిరుగుఁ గా ♦ తరభావముతోడ దీనుఁడై. ౧౨౨

సీ. మీతోడి చెలిమిని ♦ మేకొన నాతఁడు, పనుప మీయొద్దకు ♦ వచ్చినాఁడ
నాతనిసచివుండ ♦ వాతతనూజుండ, హనుమంతుఁ డను పేరి ♦ యగచరుండఁ
గామరూపధరుండఁ ♦ గామసంచారుండ,హరితనూజుహితంబు ♦ నాత్మఁ గోరి
మస్కరియాకృతి ♦ మాఱువేషముఁ దాల్చి, ఋశ్యమూకమునుండి ♦ యిటకు వచ్చి
ఆ. టయ్యె నని వచించి ♦ యతఁ డూరకుండిన, నతనిమాటకిఁ జిత్త ♦ మలరుచుండఁ
దనదు చెంత నున్న ♦ తమ్మునిఁ గనుఁగొని, కౌసలేయుఁ డనియె ♦ గారవమున. ౧౨౩

→ రాముఁడు లక్ష్మణుతో హనుమంతునిఁ బ్రశంసించి చెప్పుట. ←

కం. ఘనమతి యగుసుగ్రీవుని,యనుగుంబ్రెగ్గడయ యీతఁ ♦ డనఘా మహిన మే
వ్వనిఁ దలఁచుచుంటి మాగవి,తనయుఁడె తా నిట్లు మనల ♦ దాయఁగ వచ్చెన్.

సీ. నెయ్యంబుఁ దియ్యంబు ♦ నేర్పు దీపింప నీ,వాక్యజ్ఞునకుఁ బ్రతి ♦ వచన మిమ్ము
ఋగ్వేదము చక్క ♦ నెఱుఁగనివాఁడు య,జుర్వేదధారణా ♦ సామాన్యబుద్ధి

సామవేదమునఁ బ్రాజ్ఞత్వంబు లేనివాఁ, డీరీతిభాషింప ♦ నేరఁ డెపుడు
వ్యాకృతి యంతయు ♦ వల్లించె నిజముగ, నెన్ని మాటులో యీతఁ ♦ డింతసేపు
ఆ. మాట లాడ నొక్క ♦ మాట యేనియు నప,శబ్దితంబు గాదు ♦ చక్షువులనొ
ముఖముననొ లలాట ♦ మున బొమలందునో, దోష మొక్కఁ డైనఁ ♦ దోఁప దెందు.
చం. కొంకులు లేక విస్తరము ♦ గూడక శంకకు సందునీక య
ద్రుత మవిళంబితంబు నయి ♦ తొన్నులు పోవ కురోగళైకను
స్థిత మయి మధ్యమస్వరము ♦ చే నలరారెడి వీనివాక్కు సం
స్కృతమును సక్రమంబు శుభ ♦ మెంతయు హృద్యము నై రహించెడిన్. ౧౨౬
తే. అవఘ యీతనిత్రిస్థల ♦ వ్యంజనస్థ, మైనచిత్రవచోగతి ♦ యాగ్రహమునఁ
జంపఁ గత్తిని బై కెత్తు ♦ శత్రు నైన, నెలమిఁ బొందింపఁ జాలక ♦ యేల పోవు ౧౨౭
కం. భూతలనాథుం డీసృశ,దూతను గడియింపఁ డేని ♦ తొడఁగినపని యే
రీతిని గడ గనఁ గాంచును? ఖ్యాతిం గను నెట్లు సిద్ధ ♦ కార్యకరుం డై?　　౧౨౮
కం. ఏతాదృగ్గుణగణసము, పేతుం డగుదూత నిలుచు ♦ నెవ్వనికడ నా
భూతలపతికార్యంబులు, దూతముఖంబున నె తీరు ♦ ధ్రువ మని యన్నన్. ౧౨౯

లక్ష్మణుఁడు హనుమంతునితోఁ దమవృత్తాంతముఁ జెప్పుట.

మ. అల వాక్యజ్ఞుఁడు లక్ష్మణుండు వెస వా ♦ క్యజ్ఞున్ హనూమానునిన్
బలికెం బండితవర్య సూర్యజుప్రభా ♦ వంబున్ గుణామేయతన్
దెలియన్ వింటిమి యీతనిన్ వెదకుచున్ ♦ ధీవర్య మే మిందు రాఁ
గలిగెం జుమ్ము, త్వదుక్తకీశపతివా ♦ క్యం బేము హర్షంబునన్　　౧౩౦
కం. నీవు వచించినవిధముగఁ, గావింపంగల మ టన్న ♦ గాలికొడుకు సు
గ్రీవునిజయంబుఁ గోరుచు, వావిరి సఖ్యంబుఁ గూర్ప ♦ వారికి నెంచెన్.　౧౩౧
చం. పనివడి సూర్యపుత్రుఁ గన ♦ వచ్చిన వార మ టన్నమాటకున్
హనుమయుఁ బొంగి సంతసము ♦ నన్ రవిపుత్రుఁ దలంచి యింక నా
తనిపని యెల్లఁ జక్కఁబడుఁ ♦ దథ్యను యిట్టిరు కార్య మూని యీ
తనిఁ గనఁగోరువార లఁట ♦ తప్పదె యీతని రాజ్యలబ్ధియున్.　　౧౩౨
చం. అని తలపోసి యాప్లవగుఁ ♦ డాజగతీపతిఁ జూచి ఘోర మా
వనులను బంపతీరమున ♦ భ్రాతయు నీవును గ్రుమ్మరంగ నే
లన రఘురామచోదితుఁడు ♦ నై హనుమంతున కాసుమిత్రసం
దనుఁ డనియెన్ రఘూత్తముక ♦ థం దెలియన్ మొదలింటినుండియున్.　౧౩౩
సీ. ద్యుతిమంతుఁడును మహా ♦ మతిమంతుడును నగు,దశరథుం డను పేరి ♦ ధరణివిభుఁడు
ధర్మవత్సలుఁడు స్వ ♦ ధర్మంబునను జతు,ర్వర్ణపాలన మనా ♦ రతము సలిపెఁ

బగతుఁ జేరికిఁ గాక ♦ పగ యొక్కఁడును లేక, భూతాళి మాటట ♦ ధాత యగుచు
నియతిఁ దప్పకయ య ♦ గ్నిష్టోమముఖమహా,క్రతు లాప్తదక్షిణల్ ♦ గాఁగఁ జలిపె
తే. నతనికొడుకులలోపల ♦ నగ్రజుండు, రామనాముండు వినుతప ♦ రాక్రముండు
సర్వభూతశరణ్యుండు ♦ జనకవాక్య,పారగుఁడు రాజచిహ్నసం ♦ పన్నుఁ డితఁడు.

మ. ధరణీరాజ్యముఁ గోలుపోయి వనికై ♦ తర్లంగ వెన్నంటితిన్
ధరణీకన్యక భార్య సీతయు దినాం ♦ తంబందు మార్గంబునన్
బర మాకాంతులభంగి వెన్కనియె నీ ♦ ప్రాజ్ఞానుజాతుండ త
ద్వరధీసద్గుణరాజికిన్ వశుఁడ నై ♦ దాస్యంబుఁ గావించెదన్. ౧౩౫

ఉ. పేరున లక్ష్మణుండఁ గృత ♦ విజ్ఞ సుఖార్హ్హ మహార్హ్హ భూతర
తారతు రాజ్యహీను ప్రియ ♦ కాంతను సీతను గామరూపి కాం
తారమునం దెనండొ యొక ♦ దానవుఁ డోడక మ్రుచ్చిలింప మే
మారమణీలలామ గహ ♦ నావళులన్ వెదకంగ నొక్కెడన్. ౧౩౬

⟵{లక్ష్మణుఁడు హనుమంతునితో రాముఁడు సుగ్రీవ సాచివ్యము గోరి యుండుట చెప్పుట.}⟶

కం. శాపముకతమున దానవ,రూపముఁ గనినట్టిదనుఁడు ♦ రూషిగ మాతో
భూపుత్రిజాడఁ దెలియఁగ, నో పెడి సుగ్రీవుఁ డనువ ♦ నౌకోవిభుఁడున్. ౧౩౭

కం. అని చెప్పి యతఁడు స్వర్గముఁ, జనియె యథాసుఖముగా ని ♦ జం బిది నీకున్
వినిచితి మాయిరువురకును, దినకరతనయుం డొ యింక ♦ దిక్కు కపీంద్రా. ౧౩౮

కం. లోకాధినాథుఁ డై మును, ప్రకటబహువిత్తదాన ♦ పటిమంబున సు
శ్లోకుం డగురాముండు ది,వాకరసుతు శరణుఁ జొచ్చె ♦ వాయుతనూజా. ౧౩౯

కం. దీనశరణ్యుఁడు ధర్మవి,తానైకసువత్సలుండు ♦ దశరథుఁ డాభూ
జానినుతుండు శరణ్యుఁడు, వానరపతి శరణుఁ జొచ్చె ♦ వాయుతనూజా. ౧౪౦

కం. లోకంబుల కన్నింటికిఁ, బ్రాకటశరణంబునున్ శ ♦ రణ్యం డగునీ
కాకుత్స్థుఁడు మద్గురువు ది,వాకరసుతు శరణుఁ జొరఁగ ♦ వచ్చెం జుమ్మీ. ౧౪౧

కం. ఎవనిప్రసాదంబున నీ,కువలయమున జనము లెల్లఁ ♦ గొఱలు సుఖితే నా
యవనీవిభుఁ డగురాముఁడు, సవినయముగఁ గీశపతిప్ర ♦ సాదముఁ గోరెన్. ౧౪౨

ఉ. మానితసర్వసద్గుణస ♦ మంచితు లౌధరణీవరాగ్రణుల్
మానుగ వేనిచేత బహు ♦ మానము గౌరవ మందు చుండి రా
దానివరేణ్యుఁ డౌదశర ♦ థప్రభుపుత్త్రుఁడు లోకవిశ్రుతుం
డీనయశీలుఁ డిప్పుడు క ♦ పీశ్వరునిన్ శరణంబుఁ జొచ్చెడిన్. ౧౪౩

కం. శోకాభిభూతుఁ డగుసు,శ్లోకుఁడు సుగ్రీవు శరణుఁ ♦ జొచ్చెను గరుణా
లోకనముల నతఁ డీతనిఁ, జేకొను టర్హం బటంచుఁ ♦ జెప్పుచు జాలిన్. ౧౪౪
ఉ. కన్నుల బాష్పపూరములు ♦ గార్చెడి లక్ష్మణుతోడ వాయుజుం
డిన్నతి యాజితేంద్రియత ♦ యీమతి నైభవ మిట్టిశీలసం
పన్నత గల్గుమిమ్ముఁ దన ♦ భాగ్యమునన్ రవిజుండు గన్గొనన్
సన్నుతశీలురార! హరి ♦ సత్తముసత్తము నాలకింపుఁడీ. ౧౪౫
ఉ. అన్నగువాలి సూడు గొని ♦ హానడి పెట్టి పురంబు వెల్వడన్
దన్ని తదీయభార్యను స ♦ ధర్మమునన్ హరియింపఁ గాన నా
పన్నతఁ గుందె మీ కిపు డ ♦ వశ్యము సాయముఁ జేయు జానకిం
బన్నుగ రోయుకార్యమున ♦ మాదృశకీశసహాయసంపదన్. ౧౪౬
కం. అని తేనెలొలుకుపలుకులు, హనుమయు రాఘవునిఁ జూచి ♦ యనియెన్ మరలన్
జనుదెండీ సుగ్రీవునిఁ, గనుఁగొన నన లక్ష్మణుండు ♦ కపిపుంగవునిన్. ౧౪౭
చం. అలరుమనంబుతోడుత స ♦ మర్హవిధిం గొనియాడి రాముతోఁ
బలికె మరుత్తనూభవుఁడు ♦ భవ్యమనస్కుఁడు సత్య మాడెదన్
గలదు వనాటనాథునకుఁ ♦ గార్యము నీ వొనరింపఁ గానఁ బే
రెలమిని బొందు మింకఁ గృత ♦ కృత్యుఁడ వైతివి నీవు రాఘవా. ౧౪౮
ఉ. మోముప్రసన్నభావమును ♦ మోదముసంబలుకాడుభంగులన్
సామము మీఱ వ్యక్తముగఁ ♦ జల్పుప్రసంగముభంగిఁ జూడఁగా
నేమియు మోస మీకపికు ♦ లేశ్వరునందుఁ గనంగరాదు రా
మా! మన మిప్పు డందుఁ బద ♦ మా హనుమంతుఁడు కోరునట్లుగన్. ౧౪౯
చం. అనవుడు రామచంద్రుఁడు త ♦ థాస్తన మారుతి భిక్షురూపుఁ జ
య్యన విడి నైజరూపమును ♦ నయ్యినవంశ్యుల సంసదేశమం
దునిచి ప్రహృష్టుఁడున్ సుమతి ♦ యుగ్రజవుండు యశస్వి సూర్యనం
దనుఁడు చరించుచున్నెడ కు ♦ దాగగతిం జనిడించె వారలన్. ౧౫౦

హనుమంతుఁడు రామలక్ష్మణులను సుగ్రీవుకడకుఁ దీసికొని పోవుట.

ఉ. ఆయెడ వారి డించి దివ ♦ సాధిపనందనుఁ జేరి సూర్యజా!
యీయనఘుండు రాముఁడు సు ♦ మీ మతిమంతుఁడు నిన్ను డాయ మి
త్రాయితతేజుఁ డౌననుఁగుఁ ♦ దమ్ముఁడు లక్ష్మణుతోడ వచ్చె వి
న్యాయతసత్యశౌర్యుఁడు మ ♦ హాత్ముఁడు సూర్యకులప్రజాతుఁడున్. ౧౫౧
కం. రాముఁడు తేజోజితసు,త్రాముఁడు దశరథసుతుండు ♦ ధర్మమతిన్ ని
స్సీముఁడు పితృవాక్కరణో,ద్దాముఁడు సతితోడ విపిన ♦ ధరఁ దిరుగు నెడన్. ౧౫౨

కం. రావణ హృతనిజదారుఁడు, పావనతర రాజసూయ♦వరమఖముఖదీ
ర్ఘావిధిని శతసహస్రము,గోవుల దక్షిణల నిచ్చి ♦ గురుమతితోడన్. ౧౫౩

కం తపమున సత్యబలంబున, విపులాచక్రంబు నేలి ♦ విపులయశుం డా
నృపతితనూజుం డీయెడఁ, గపివర! నీశరణుఁ జొరఁగ ♦ గమకించెఁ జుమీ. ౧౫౪

ఆ. పూజనీయతములు ♦ పురుషోత్తములు రామ,లక్ష్మణులు కపీంద్ర ♦ లలితయశులు
నీదు చెలిమిఁ గోరి ♦ నేఁ డిట వచ్చిరి, చేరఁ జనుము పూజ ♦ సేయు మనిన. ౧౫౫

సుగ్రీవుఁడు రామలక్ష్మణులతో సంభాషించుట.

కం. పావనివాక్యంబుల సు,గ్రీవుఁడు రాఘవులవలని♦కెరలెడిభీతిన్
బో విడిచి సంతసంబునఁ, బావన మగుమనుజరూపు ♦ వరఁగఁగ వచ్చెన్. ౧౫౬

కం. వచ్చి రఘూత్తములకుఁ దా,నచ్ఛపుమతి నర్చ లిచ్చి ♦ యనురాగము పెం
పెచ్చఁగ రామునిఁ గనుఁగొని, యచ్ఛండకరాత్మజాతుఁ ♦ డను నీరీతిన్. ౧౫౭

కం వీరుల రని ధర్మగుణో,దారుల రని సర్వభూత♦తతవాత్సల్యా
ధారుల రని చెప్పెను సా,మీరి యధార్థంబు భవద♦మేయగుణాళుల్. ౧౫౮

ఉ. మానవలోకపాలకకు♦మారకులార! మహాత్ములార! యీ
వానరుతోడ సఖ్యమును ♦ వారక మీరు ఘటింప నెంచినన్
మానుగ నింతకంటె బహు♦మానము నుత్తమలాభ మొందు న
న్నానుసె? నేనె ధన్యుఁడను ♦ నొక్కటి చెప్పెద విన్ము రాఘవా! ౧౫౯

రాముఁడు సుగ్రీవునితో సఖ్య మొనర్చుట.

కం. నాతోడ నెయ్య మూనఁగ, క్ష్మాతలవర! నీకు నిందు♦సమ్మత మేనిన్
జేతను జెయి వైవుము నా,చేతిని నిదె సాఁచినాఁడ ♦ స్థిరమర్యాదన్. ౧౬౦

కం. ఆవచనము విని రాముఁడు, భావంబున నలరి తనదు♦పాణితలము సు
గ్రీవుకరంబున నిడి సం,భావించెను హృద్యమైత్రిఁ ♦ బరిరంభించెన్. ౧౬౧

కం. భిక్షుకరూపం బంతట, నృక్షచరవరుండు హనుమ ♦ వీడి సమిధలన్
సాక్షాత్కపిరూపంబున, నాక్షణ మొదఁగూర్చి నగ్ని ♦ నందు రగిల్చెన్. ౧౬౨

కం గనగన మండెడినహ్నికి, వనసుమముల నర్చ లిచ్చి ♦ హారినడుమఁ బా
వని నిలుప రామరవిజులు, నినువారుతమిం బ్రదక్షి♦ణించిరి యర్థిన్. ౧౬౩

కం. నేస్తం బిటు ఘటియించి మ,నస్తాపముఁ బాసి వారు ♦ నందితమతులై
శస్తశుభాలోకనముల, నిస్తుగ నొండొరులఁ గనుచుఁ ♦ జెందరు తృప్తిన్. ౧౬౪

చం. కటవునఁ బడ్డయట్లు రఘు♦కాంతుఁడు వానరకాంతుఁ డిట్లు పె
న్నుఁ బగుసంతసంబుమెయి ♦ నొండొరులన్ మెయిపుల్కజాదుకో

నెఱమతిఁ జూచు చుండఁ గపి♦నేత రఘూత్తముతోడ ని ట్లనుక
దాఁటిసితి నీదుచెల్మి మన♦దుఃఖసుఖంబులు పొందె నైక్యమున్. ౧౬౫
కం. అని బహుపర్ణం బగునొక, ఘనపుష్పితశాఖ విఱిచి ♦ కపికులపతి యు
ర్విని వైచి రామునితో నొ, య్యనఁ గూర్చుండె దాని♦యం దమలమతిన్. ౧౬౬
కం. హనుమంతుండును నొకచం, దనశాఖం దేర రాము♦తమ్ముఁడు ప్రీతిక
సనయముగ నందుఁ గూర్చుం, డెను సప్పుడు రామునితో వి♦నీతుం డగుచున్. ౧౬౭

◆ సుగ్రీవుఁడు రామునితోఁ దనకు వాలి చేసినయపకారముఁ జెప్పుట. ◆

ఉ. నీరజమిత్రనందనుఁడు ♦ నెమ్మిఁ దలిర్పఁగ నిట్లు పల్కు నీ
తారమణా! మదగ్రజుఁడు ♦ దారుణవిక్రముఁ డైనవాలి న
న్నీరస మెత్తి రాజ్యమున ♦ కెంతయుఁ బాపి, హరించి మత్సతిక్,
గ్రూరత నెట్టఁ గొండలను ♦ గుట్టల నిట్టులు ప్రాణభీతి మై ౧౬౮
కం. అల్లాడుచు నున్నాఁడను, జల్లనికరుణార్ద్రవృష్టి ♦ జనకసుతాహృ
ద్వల్లభ! వాలిభయం బెడఁ, బొల్లునటం బ్రాణదాన♦మును నా కిమ్మా. ౧౬౯
కం. అనవుడు ధర్మజ్ఞుండును, ఘనధర్మసువత్సలుండు ♦ కాకుత్స్థుం డా
ననమున నెలవ పొలయఁగ, వనచరనాథునకుఁ బ్రీతి ♦ వఱలఁగఁ బలికెన్.

◆ రాముఁడు సుగ్రీవునితో వాలిం జంపఁ బ్రతిజ్ఞఁ జేయుట. ◆

కం. ఉపకారఫలము మిత్రము, కపినాయక నేను జక్కఁ♦గా నెఱుఁగుదు నీ
చపలాక్షిని హరియించిన, విపరీతచరిత్రుఁ ద్రుంతు ♦ వెఱవకు వాలిన్. ౧౭౦
తే. కంకపత్రప్రతిచ్ఛన్న♦కంబు లైన, మచ్ఛరంబు లమోఘముల్ ♦ మహితశితము
ఖములు బుజుపర్వముల్ ద్రుంచుఁ♦గష్టచరితు, గాఢరోష భుజంగమ♦గణము లట్లు.
మ. ఇదిగోఁ జూడుమువాలి నేల మాతుఁ డై ♦ యీ ఘోరబాణంబులక
మద మేదంగ విశీర్ణపర్వత మనక ♦ న్రాలంగఁ గన్నార నా
ముదితుం డై హరినూతి పల్కు రఘురా♦ముక నీప్రసాదంబునక
మదిరాక్షీమణి పూజ్యరాజ్యరమ సం♦ప్రాప్తింప మోదిల్లెదన్. ౧౭౩
కం. ఎటు నాపగతుని వాలిని, దటుకున వధియింప వచ్చుఁ ♦ దత్పద్ధతి వే
చటులాంబక యొనరిచి నా, పటుసంకటములను బాపి ♦ పాలింపు మనన్ ౧౭౪
కం. సరసిజసువర్ణవైశ్యా, నరసములు జానకీవ♦నాటేశనిశా
చరనాథులడాకన్నులు, సరవిం జలియించెఁ దత్ప్ర♦సంగము జరుగన్. ౧౭౫

◆ సుగ్రీవుఁడు రామునితో సీతను దాను గొనివచ్చు నట్లు చెప్పుట. ◆

సీ. వెండియు నిట్లనుఁ ♦ జండాంశునందనుం, డారామచంద్రుతో ♦ హర్ష మునను
మత్సచివాగ్రణి ♦ మారుతపుత్రుండు, తెలిపె మీ రడవి కే♦ తెంచినట్టి

హేతువు మైథిలి ♦ సీతతోఁ దమ్ముఁడౌ,సౌమిత్రితో వన♦స్థలులయందుఁ
గ్రుమ్మర నీజాయఁ ♦ గూళనిశాటుండు, చెంత మీారలు లేని♦యంతరంబు
తే. నెఱిఁగి హరియించి పోవుచు ♦ గృధ్రనేత
నాజటాయువు వధియించి ♦ యరిగె ననుచు
ననఘ భార్యావియోగజ ♦ మైనదుఃఖ
మేను బాపెద వగవ నీ ♦ కేల యింక. ౧౭౬
కం. శిష్ట యగునాతలోదరిఁ, గష్టాత్ముఁ డతండు దాఁచుఁ ♦ గా కెయ్యెడ నేఁ
నష్టామ్నాయశ్రుతి యన, స్పష్టంబుగ నామెఁ దెత్తు ♦ వగవకు మయ్యా! ౧౭౭
కం. ఉండిన రసాతలంబున, నుండిన నాకాశమునను ♦ నుగ్గలిఁ దెత్తుఁ
జండాంశుసంశదీపక, ఖండేందునిటాల నీకుఁ♦గా నర్పింతున్. ౧౭౮
ఉ. నమ్ముము నాదుసత్యవచ♦నమ్మును రాక్షసదానవార్యనీ
కమ్ములు నొక్క టౌచు నెస♦కమ్మునఁ బూనియు భూతనూజ జీ
ర్ణమ్మును జేసికోఁ గలవె ♦ రామ! విషాన్వితభక్ష్య మెందు జీ
ర్ణమ్మగునయ్య భక్షకుల ♦ నాశముఁ జేసెడిఁ గాక తూర్ణమున్. ౧౭౯
చం. విడువుము దుఃఖముఁ వినుత♦వీర్య! భవత్సతి నేను దెచ్చెదఁ
దాడితోడిఁ బంక్తికంఠుఁ డొక♦తొయ్యలి లక్ష్మణ! రామ! రామ! యం
చడలున విస్వరంబున ని♦జాంకతలంబున నేడ్చు చుండఁగా
విడినడి పాఱె మింట, నల♦బిత్తరి సీతయ, నేఁ జెఱింగితిన్. ౧౮౦
కం. దర్వీకరభామినివలె, నుర్వీవర! మిగులఁ గంప ♦ మొందెడిభామన్
బర్విషుదశముఖునొడిలో, నుర్వీధరగతుల మేను ♦ నున్న నలువురున్ ౧౮౧

సుగ్రీవుఁడు రామునకు సీతాదేవి వైచినభూషణంబులఁ జూపుట.

ఉ. కంటిమి మచ్చెకంటియును ♦ గాంచి మముం దనయుత్తరీయమం
దంటఁగఁ గట్టి భూషణచ♦యంబులఁ బాఱఁగ వైచె నేను, న
న్నింటిని దాఁచినాఁడ నవ♦నీధరకందరమందు, నీదువా
ల్గంటివొ యేమొ చూడు మవి ♦ గ్రన్నన తేరఁగఁ బంతు నావుడున్. ౧౮౨
కం. ఏలా! కాలవిలంబన, మీాలీలం దేరఁ బనుప♦వే మిత్రమ నా
హేలితనూజుఁడు చని భూ,షాలిం గొని తెచ్చె నివిగొ ♦ నని కనఁబఱిచెన్. ౧౮౩
ఉ. చీరచెఱంగు భూషలును ♦ చేతను గైకొని శోకవారి నీ
హారము సారసారి నస ♦ నక్షులు గప్పఁగ రుద్ధదృష్టి యై
హా రమణీ ప్రియా! యనుచు ♦ నారటపాటున నూర్చె నాయలం
కారము ఱొమ్ము నొత్తి కిను♦కం బిలపన్నగ మూర్చ్చునట్లుగన్. ౧౮౪

కం॥ ఘనమూర్ఛ వ్రాలి తమ్మునిఁ, గని క్రూరుఁడు రాక్షసుండు ♦ గ్రహియించి చనన్
దనమేనిపరిష్కారము,లను ధారిణి వైచి సీత ♦ లక్ష్మణ! చనియెన్. ౧౮౫

కం॥ వీనిని బచ్చికపట్టుల, జానకి పడవైచె నిజము ♦ సకలవిభూషల్
మానుగను జెక్కుచెదర క,నూనము లయిపొల్లియట్ల ♦ యున్నవి కనుమా! ౧౮౬

చం॥ అనవుడు లక్ష్మణుండును ని♦జాగ్రజుతోడుత నిట్లు పల్కు నో
యనఘ! యెఱుంగఁజాల వని♦తాంగదముల్, గుఱితింపలేన యీ
గొన బగుకుండలంబులను ♦ గోమలి కేను దినంబుఁ బాదవం
దన మొనరించుచుం గనుట ♦ నాతివ యందియ లే నెఱుంగుదున్. ౧౮౭

రాముఁడు సుగ్రీవుని రావణువృత్తాంతము నడుగుట.

ఉ॥ అంచు వచింపఁ బెంపుగొను♦నారటపాటున సూర్యనందనున్
గాంచి హితుండ! ప్రాణములఁ♦కంటెఁ బ్రియం బ్రియురాలి నెందు వీ
క్షించితి వయ్య రాక్షసుని♦చేపడి పోఁగ? దుఃఖదాత యా
వంచకుఁ డెందు నుండుఁ? బరి♦వారయుతంబుగఁ గూల్తు నాతనిన్. ౧౮౮

ఉ॥ జానకి ముచ్చిలించి, పెను♦సంకటముం గలిగించి, దోష మ
న్యూనముగాఁగఁ బెంచి, తన♦యున్నతిఁ దానుగ నాత్మమృత్యు దే
వీనిలయారరార్గళము ♦ వీకునఁ బాయఁగఁ దట్టిపట్టి యా
దానవుపొంత లోకము న♦దానవముల్ ఘటియింతుఁ జెప్పుమా. ౧౮౯

కం॥ చెప్పుము వనమునఁ దస్కరు,చొప్పున బలవంతముగను ♦ సుగ్రీవా! నా
కప్పురగందిని ముచ్చిలు,నప్పాలసు బట్టి యిపుడ ♦ హతుఁ గావింతున్. ౧౯౦

సుగ్రీవుఁడు రామునకు ధైర్యముఁ జెప్పుట.

మ॥ అన సుగ్రీవుఁడు బాష్పరుద్ధగళుఁడై ♦ యయ్యా! నిజం బేను న
ద్దనుజాధీశునివాసముల్ బలముఁ ద♦త్సామర్థ్యముల్ శక్తి యే
నిని నానీచునిదుష్కులం బెఱుఁగఁ, గా♦నీ ధైర్యమున నే మాయెు నీ
వనితారత్న మెటేని నిగ్గలయు త్రో♦వల్ చేసెదన్ నమ్ముమీ. ౧౯౧

మ॥ వినుమీ నాదుప్రతిజ్ఞ నీయునుఁగు దే♦విన్ రోసి యెం దున్న నా
దనుజున్ బాంధవపుత్రమిత్రయుతు యు♦ద్ధక్షోణి భంజించి నీ
మన ముల్లాసముమీఱఁ బౌరుషము సం♦భావించి నీప్రేయసిన్
నినుఁ గూడన్ ఘటియింతు శీఘ్రమునఁ దం♦డ్రీ నమ్ము నావాక్యముల్. ౧౯౨

చం॥ అడలకు మయ్య, తెంపు విడ♦నాడకు మయ్య, దిటంబు తేజమున్
విడువకు మయ్య, పెంపు సెడ ♦ వేసనఁ గుందకు మయ్య, దేవ! యీ

వడువునఁ గుండువారలె భ♦వద్విధు లైనమహాత్ము? లయ్యె నీ
వెడఁద నెఱుంగవే వగపె ♦ హేతువు లాఘవవృత్తి కెయ్యెడన్. ౧౯౩

ఉ. చేడియఁ గోలుపోయి వెనుఁ♦జిక్కుల నేనును జిక్కి స్రుక్క నే?
యేడుచు చున్నవాఁడనె? మ♦హీశ్వర ధైర్యముఁ బాసినాఁడనే?
మూఁడుఁడఁ గ్రోఁతి నే నయిన ♦ ముగ్ధియ కై వగనన్, సునీతులన్
బ్రోడవు ధైర్యవంతుఁడవు ♦ పోలునె నీ కిటు లోమహాత్మకా! ౧౯౪

సీ. దొరఁ గెడికన్నీరు ♦ తోరంపుధృతిచేత, నరికట్టి మరలింప ♦ నర్హమయ్య
సత్త్వవంతుఁడు వ్యవ♦స్థాహాపకం బైన, ధైర్యంబు విడనాడఁ ♦ దగు నటయ్య
వ్యసనార్థనష్టులఁ ♦ బ్రాణార్తి వెఱ నిజ,బుద్ధిమై ధీరుఁడు ♦ పోలుచు నయ్య
యెప్పుడు వగచు ధీ♦హీనుఁడు శోకాబ్ధి, బరువోడ నీట నా♦సురుఁగు నయ్య
తే. హస్తములు మోడ్చి వేఁడెద ♦ ననఘచరిత
నెయ్య మెద నెంచి నన్ను మ♦న్నింప వయ్య
యింతయును వగపున కెడ ♦ మీకు మయ్య
పౌరుషం బూఁత గొనవయ్య ♦ సూరివర్య. ౧౯౫

ఉ. శోకపరాయణాత్మునకు ♦ సూర్యకులాగ్రణి లేవు సౌఖ్యముల్
శోకవిలీనచిత్తునకు ♦ లోప మగున్ ఘన తేజ మంతయున్
శోకభరాభిపన్నునకుఁ ♦ జొప్పడు జీవితసంశయంబునున్
శోకము నుజ్జగింపు రిపు♦సూదన! కేవలధైర్య మూనుమీ. ౧౯౬

ఉ. స్నేహముచే హితం బిటులు ♦ చెప్పఁ గడంగితిఁ గాని రామ సం
దేహము లేదు నీకు నుప♦దేశము చేయఁగ నెంతవాఁడ, నా
స్నేహము గౌరవించి యిటు ♦ చెప్పినవాక్యము లాదరించి యీ
మోహముఁ జిత్తదాహమును ♦ మాన్పఁగఁ జేయుము రాజనందనా! ౧౯౭

ఉ. నెయ్యముఁ దియ్యమున్ వెలయ ♦ నిండఁబాంధవసూనుఁ డాడినన్
గ్రయ్యల నెయ్యురై వినక ♦ కాత్మహితవ్రతులుం జెఱంగునన్
జయ్యన నొయ్యనం దుడిచి ♦ సాజపుఁజిత్తముతోడఁ గ్రోఁతితా
జియ్యను నయ్యినాన్వయుఁడు ♦ చేరఁగ దీసి ప్రియంబు నెక్కొనన్ ౧౯౮

ఉ. క్రుచ్చి కవుంగిటం బలికెఁ ♦ గూరిమిమీఱ వయస్యుఁ డైనయా
యచ్చపుమేలు కోరుసుగు♦ణాఢ్యకుఁ డెయ్యది చేయ నర్హమౌ
బొచ్చెము లేక తీఱములఁ ♦ బూనిక నీవును నిప్పు డట్టులో
నెచ్చెలి యుక్తకార్యమును ♦ నెమ్మి నొనర్చితి నన్నుఁ దేర్చుటన్. ౧౯౯

ఉ. అక్కఱవేళ నాదుకొను♦నట్టిరు బంధువు లన్న మిత్రమా!
యెక్కడ నాకు లభ్యపడు ♦ నిట్టిహితాత్ముఁడు చుట్టమందులో

క౦. అని ప్రియము లాడుసుగ్రీ,వుని వచనము లాలకించి ♦ పురుహూతవిభా
ఖని యగుసుమిత్రతనయుఁడు, వినుచుండఁగ నొసటంచు ♦ విభుఁడుం బలికెన్.

సీ. అంత సూర్యాత్మజుం ♦ డవనీరుహముశాఖ, నప్పటినుండి యు♦న్నట్టిరామ
లక్ష్మణులను గని ♦ లలితశాఖార్థంబు, నలుదిక్కు లొయ్యనఁ ♦ గలయఁ జూచి
యనతిదూరంబున ♦ నలరులచే నిండి, యాకులు మిక్కిలి ♦ లేక సమద
షట్పదాంచిత మైన♦సాలశాఖ నొకండు, గొనివచ్చి నైనఁ గాఁ ♦ గువలయేశ్వ

ఆ. రుండు గూరుచుండ ♦ నొండట్టిశాఖను, హనుమ దెచ్చి లక్ష్మ♦ణునకు నిచ్చె
నంద లిట్లు తతసు♦ఖాసీనులై యుండ, భానుకులుఁ గనియె ♦ భానుజుండు. ౨౧౨

ఉ. వేరము మై మదగ్రజుఁడు ♦ వీడు ననుం వెడలంగఁ గొట్టి నా
దార హరింపఁగాఁ దలను ♦ దాఁపఁగఁ బ్రాణభయార్తి ఋశ్యమూ
కోరుధరాధరాన నిటు ♦ లుండెద సంకటపాటునం జగ
ద్వీరభయాపనోది! ననుఁ ♦ బాలన సేయు మనాథు దీనునిన్. ౨౧౩

చం. అన విని పిన్ననవ్వు దొలఁ♦కాడఁగ నిట్లను రామభద్రుఁ డో
యనఘుఁడ మేలు సేయుట మ♦యస్యునిచిహ్నము, శత్రులకుం
బనఁ బడుఁ గీడుసేఁత, భవ♦దబ్జముఖిం హరియించి నట్టి మూ
ర్ఖుని వధియింతుఁ జూడు మిది♦గో నిపుడే మదిఁ గుంద నేటికిన్. ౨౧౪

చం. అతులమహాజనంబులు మ♦హాద్యుతిమంతము లుగ్రరూపసం
గతములు హేమపుంఖములు ♦ స్కందవనోద్భవముల్ హరిస్వరు
ప్రతిమము లుగ్రరుష్టఫణి♦భంగిని శాతతరాగ్రముల్సుమీ
ధృతియుత! నాశరంబులు న♦ధింతును వాలిని శీఘ్ర మానుమీ. ౨౧౫

క౦. పవిధారాహతిఁ గూలిన, యవనీధర మనఁగ వాలి ♦ యఘమతి ప్రస్లక
దివనాధిపనందన హర్షవికాసము దోఁపఁ జూచి ♦ సంతసపడుమీ. ౨౧౬

క౦. అను రామునివచనంబులు, విని సుగ్రీవుండు హర్ష♦వికసితముఖుఁడై
వనజాక్షు మేలు మే లని, సనయంబుగఁ బ్రీతిమైఁ బ్ర♦శంసించి మఱిన్. ౨౧౭

క౦. దేవా శోకార్తులకును, నీవే గతి యగుట శోక♦నిహతుఁడ నగుటన్
నీవు చెలి వౌట నేఁ బరి, దేవన మొనరింతు నిట్లు ♦ దేవరు దోఁపన్. ౨౧౮

ఉ. పావకసాక్షికంబుగను ♦ బాణిని బాణిని నిచ్చి మైత్రి సం
భావనఁ బ్రాణదానమును ♦ స్పష్టముగాఁగ నొసంగుటం ధృతిం
దేవర ప్రాణమిత్ర మని ♦ నెమ్మది నమ్మి మదీయచిత్తముం
బావకుభంగి నెల్లపుడు ♦ మాడ్చెడి దుఃఖముఁ జెప్పఁ బూనితిన్. ౨౧౯

కం.అని యింతనట్టు పలికియుఁ, గనుఁదమ్ముల వెల్లివిరియఁ ♦ గా బాష్పంబుల్
వెనుడగ్గుత్తిక పడి యా,వనచరపతి పలుకలేఁడ ♦ వాక్యం బొకఁడున్. ౨౨౦
కం.ధీరుఁడు సుగ్రీవుఁడు త,ద్వారిని వారించి తుడిచి ♦ బాష్పములు మహో
దారధృతి నూర్చుచును రఘు,వీరునితో నిట్లు లనియె ♦ వెండి నిజకథన్. ౨౨౧

రామునితో సుగ్రీవుఁడు వాలి దన్నుఁ బరిభవించినవిధంబుఁ జెప్పుట.

సీ. రామ యావాలి తా ♦ రాజయి యేలఁగ, యువరాజనై నేను ♦ నుంట నాఁడు
వెలుచ నుచ్చావచం♦బులు దూషణములాడి,క్రూరుఁడై వెడల నగ ♦ద్రోచినాఁడు
నాప్రాణములకంటె ♦ నాకతిప్రియ యైన,యిల్లాలినిన్ హరి♦యించినాఁడు
నాప్రియమిత్రుల ♦ నాదుసంబంధులఁ, జెఱసాలలందు దాఁ ♦ జేర్చినాఁడు
తే. విడక నాప్రాణములఁగన్న♦వేసినాఁడు, చంపఁగా నన్నుఁ బెక్కుర♦బంపినాఁడు.
చెనఁటి యుక్తుల నెన్నియో ♦ చేసినాఁడు, చెప్ప శక్యంబె యాతఁడు ♦ చేయుకీడు
ఉ. ఆతఁడు పంపఁ బంప మఱి ♦ యంపఱ నేనును జంపఁ జంప ని
ట్లోతరణీశ్వసంశ్వ చను♦మస్నది కాలము, దాన నే కదా
యీతరుచారిసర్గమును ♦ నేనును మిమ్ములఁ జూచినంతనే
భీతిని దత్తఱిల్లితిమి ♦ భీతి నెవండు కలంగ కుండెడున్. ౨౨౩
కం. కేవల మీహానుమత్ప్రము,ఖావనిరుహచరులు తగుస♦హాయులుగా నే
జీవించి యున్నవాఁడను, దేవా పలుకష్టములను ♦ దేవురుపడుచున్. ౨౨౪
కం.నే నిలువఁ దారు నిలుతురు, నే నడచినఁ దారుఁగూడ♦నే నడచెద రీ
మానితచరిత్రు లిటు నా, ప్రాణముఁ గాచెదరు చూవె ♦ బంధువతంసా. ౨౨౫
ఉ. ఏ లతివిస్తరంబు జగ♦దీశ్వర చెప్పెద సంగ్రహంబుగా
వాలినవిక్రమంబు గల♦వాఁడు పరాక్రమహేలి వాలి రి
ప్వాళులపాలి కీలి హాతుఁ♦డై ధరఁ గూలినఁ గాక నాదు మః
ఖాలి యడంగునే కుడుపు ♦ హోయి యొనర్చునె నిద్ర వచ్చునే. ౨౨౬
కం.అలమిన నావనటలకుం, బలికితిఁ గడపలను దుఃఖ♦పాటున రామా
యిల దుఃఖితుఁడో సుఖియో,చెలికానికి నెపుడు దిక్కు ♦ చెలికాఁడె సుమీ.
ఉ. అంతయు నాలకించి వసు♦ధాధిపుఁ డిట్లను వాలితోడ నీ
కింతవిరోధ మెట్లొదవె ♦ నెల్ల వచింపుమ యాలకించి నే
నంత బలాబలంబులను ♦ నారసి కార్యము చక్కఁబెట్టెదన్
జింతిలఁబోకు ధైర్యమును ♦ జేకొని పల్కుము యానుపూర్విగన్. ౨౨౮
ఉ. నీయవమానపాటుకథ ♦ నే విని నంతన నామనంబునన్
బాయనితీవ్ర మాకినుక ♦ ప్రజ్వరిలెన్ జలదాగమంబునం

దాయతవేగ మాజలము♦నట్టులు చిత్తము కంపమొందె నీ
దాయయ నాదుచాయ యని ♦ తథ్యము నమ్ముము వానరేశ్వరా. ౨౨౯

కం. విలు మోపెట్టకమున్నే, యెలమిని నీవార్తఁ దెలుపు♦మీ గుణలతికన్
వెలలినచో నా బాణం, బిలఁ గూలె నటంచు నమ్ము♦మీ నీవైరిన్. ౨౩౦

కం. అని రామవిభుఁడు పలికిన, దినజుఁడు నిజసచివయుక్తి ♦ హృష్టుం డగుచున్
దనకును దనయన్నకు నొద,వినవైరముకథఁ దొడంగె ♦ వినిపింపంగన్. ౨౩౧

→{ సుగ్రీవుఁడు రామునితో వాలికిఁ దనకు విరోధము
సచ్చినకారణముఁ జెప్పుట. }←

సీ. మహితగుణుం డైన♦మాతండ్రికిని వాలి, జ్యేష్ఠసుతుఁడు నేఁ ♦ జిన్నవాఁడఁ
దండ్రికి నాకును ♦ దగ్గ ప్రేమాస్పదుం, డై వాలి, పూ♦ర్వంబునందు
మాతండ్రి గడచన ♦ మంత్రులెల్లఁ బౌరులుఁ, బరమసమ్మతముగఁ ♦ బట్టభద్రుఁ
జేసిరి వాలిని ♦ భాసుర మగుకపి,రాజ్యంబునందు నో♦రామభద్ర

తే. నిజకులాగతరాజ్యంబు ♦ నిపుణముగను, నియతిఁ బాలింప వాలి నే ♦ హీనసుబుద్ధి
వినయ మేపారఁగా బంటు♦విధము దోఁప, నేనుఁ జక కొల్చుచుంటిని ♦ నెల్లవేళ.

ఉ. ఈవిధిఁ గొంతకాలము న♦రేశ్వర సాగినయంతమీఁద మా
యావి యనంగ దుందుభికి ♦ సన్నుతుఁ డగ్రతనూజుఁ డుగ్రుఁడున్
వావిరి వైర మొక్క యుగ♦నాఁగనిమిత్తము వెల్లి వాలితోఁ
జేసను బాలుదెందమెను ని♦శీథమునన్ జను డెల్లఁ గూర్కఁగన్. ౨౩౩

కం. కిష్కింధాద్వారమునన్, నిష్కంపితనృప్తి నతఁడు ♦ నిలిచి ధ్వనింపన్
బుష్కరధర మన దపకో, ద్విష్కరుసింబోలె వాలి ♦ చిటమటపడుచున్ ౨౩౪

ఉ. నిద్దురవీడి మండుచు ధ్వ♦నిన్ విని దిగ్గన లేచి రోషి యై
యద్దిర పాన్పు దూఁకి సర♦యంబుగ నాసనిమీఁదఁ బోవఁగా
ముద్దియ లేనునున్ వినతి ♦ మ్రొక్కుచుఁ గా దిది వేళ నిట్లు మం
చొద్దికఁ జెప్పఁగా వినక ♦ హమ్మని త్రోసి చనెన్ రయంబునన్. ౨౩౫

ఉ. ఒంటిగఁ బోవువానిఁ గని ♦ యుల్లమునం గల భక్తిప్రేమి వె
న్వెంటని, దవ్వునం గల న♦నుం బయివచ్చెడి వాలిఁ జూచి లో
నంటినభీతి సోఁకుఁడు జ♦వాతిశయంబునఁ బాఱఁజొచ్చినన్
ఖింటను దోఁచుచున్న యుగ♦నీవిజనైరి వెలుంగు దోడ్పడన్ ౨౩౬

ఉ. వెన్నడి మేము పోయితిమి ♦ వీడుఁడు దానవుఁ డంత నిల్లరీ
చ్ఛన్నము దుర్గమున్ బిలము ♦ నిగ్గగతముం గని యందుఁ బొచ్చె మా

సీ. మాయదృష్టంబున ♦ దాయ మాయావిని, మడియించి వచ్చితే ♦ మహితశౌర్య
దిక్కు లేనట్టి యీ ♦ దేశంబునకు నాకు, దిక్కు నీవే కదే ♦ ధీరచరిత
బహుశలాకము చంద్ర ♦ భాసురచ్ఛత్రంబు, నేను బట్టెదఁ గొమ్ము ♦ నిర్మలాత్మ
యొక్క యేఁడాది నే ♦ నుంటి బిలద్వార,మం దార్తితోడ నో ♦ యవనినాథ
తే. యంత నెత్తుగు వెల్లువ ♦ లంత కంత, కెక్కుడై పాఱ సాగె నా ♦ రక్కసులర
వంబు వినవచ్చెఁగాని నీ ♦ ధ్వని యొకింత,యైన వినకుంటి దుఃఖాబ్ధి ♦ నడలుచుంటి.
తే. కొండ నొక్కటి గొనివచ్చి ♦ గుహాముఖంబు,నందుఁ బడనైచి శోకంబు ♦ నంది కుంది
డెందము కలంగియు నలంగి ♦ యందు నిలక,పురముఁ జేరితి నిక్కంబు ♦ పురుషవర్య.
కం. వసట ముఖంబునఁ దోఁపఁగఁ, జనుదెంచిన నన్నుఁ జూచి ♦ సచివులు రాజ్యం
బును ననుఁ బూంచిరి వలదో, యని నే వాదాడఁ గరుణ ♦ నరయుము దేవా. ౨౫౦
ఉ. రాజవు నీవ కమ్ము, యువ ♦ రాజుగ నుండెద మున్నువోలె నే,
రాజును లేమి రాజ్యము న ♦ రాజక మానని మంత్రిసత్తముల్
యోజన చేసి నన్ని[illegible] ని ♦ యుక్తునిఁ జేసిరి, నేను గోర నీ
రాజతనంబు, స[illegible] ♦ క్రమ్మఱఁ గొమ్ము, ననుం క్షమింపుమీ. ౨౫౧
శా. అ[illegible] తమ్ముఁ[illegible] నేను, [illegible] మొదల ద్రో ♦ హం బేమియే నెంచ,నన్
[illegible]న్నింపం [illegible]గు, వ్రాలెద[illegible] బగములన్ ♦ హస్తంబులన్ మోడ్చు,నాఁ
[illegible] విడనాడఁ డింతయుని[illegible] ధి ♦ క్కారంబు మానందు న
[illegible] చెప్పఁగరాని వన్ని యన ధా ♦ త్రీశా యతం డావలన్. ౨౫౨
చం. ప్రకృతుల మంత్రివర్గము స ♦ భన్ [illegible]జతిఁ గూరిచి నన్నుఁ జూపి వా
రికి నిటు పల్కు, నొక్కఁడు ♦ రేయి ని శాటుఁడు యుద్ధకాంక్ష మై
వికటముగాఁగ నన్బిలువ ♦ వేగమ నే నిలు వీడి పోవ నీ
నికృతిరతుండు నా వెనుక ♦ నే చనుదెంచుట మీ రెఱుంగరే. ౨౫౩
కం. మాయిరువురఁ గనుఁగొని యా,మాయావియు భీతిఁ బఱచె ♦ మానక యాతై
తేయుని వెన్నడి పఱచితి, నీయఘశీలుండు వెంట ♦ నే తెంచెఁ జుఁడీ. ౨౫౪
ఉ. అట్టులు పర్వి పాఱి గహ ♦ నాంతరభూవివరంబులోని కా
దిట్టఁడు చొచ్చె, నేనును మ ♦ దిం బగ డింపక పోవఁ బూని యీ
కట్టడితోడ నే నసురఁ ♦ గాలునిఁ గూరిచి వచ్చుదాఁక ని
ప్పట్టున నిల్వు, మేను మస ♦ పత్తనముం జోర నొల్ల శాత్రవున్ ౨౫౫
కం. పొరిఁగొనక యంచు బిలముఖ,ధరణిని నీతనిని నిలిపి ♦ తడయక నేనున్
సరభసముగఁ జొచ్చి బిలం, బరసితి నరసితిని దుష్టుఁ ♦ డౌనాయసురన్. ౨౫౬

కం. ఏఁ డొక్కటి చనె నంతట, వాఁడును గనఁబడియె నాహ♦వంబున వానిన్
వాఁడిమి గలబంధులతోఁ, బోఁడిమి చెడఁ ద్రుంచి మరలి ♦ పురి కరుదేరన్ ౨౫౭
కం. త్రోవఁ గననేర నైతిని, భూవివరము శైలపిహిత♦భూతం బగుటన్
వావిరి సుగ్రీవా సుగ్రీవా యని యఱవ నఱవఁ ♦ గి మ్మనఁ డొకఁడున్. ౨౫౮
కం. వెడలఁగఁ ద్రోవయుఁ గానమి, విడివచ్చిన యతనియెల్లు ♦ వినరామిని నేఁ
బడునడలు నేమిచెప్పుదుఁ, గడుపునఁ జేపెట్టి కలఁచు♦కైవడి నయ్యెన్. ౨౫౯
కం. ఇట్టడలుచు బిలముఖమున, గుట్టను బదఘాతములను ♦ గూలిచి నే నె
ట్టెట్టో వచ్చితి; సిరికై, యెట్టిమహాఘుంబుఁ జేసె ♦ నితఁ డెఱిఁగితి రే. ౨౬౦
కం. అన్న గదా యని యెంచక, యన్నీచుం డెంతసేయ ♦ నెత్తైను; వీఁడున్
మన్ననకుం బాత్రుఁడె? యని, సన్నేకాంశుకముతోడ ♦ నగరము వెడలన్ ౨౬౧
కం. కొట్టెను నాభార్యను జే, పట్టెను నేఁ బ్రాణభీతి ♦ బహుభూములలో
నెట్టిన తిరిగియుఁ దుద కీ, గుట్ట నతఁడు చేరరామిఁ ♦ గొనితి నెలవుగన్. ౨౬౨
కం. అపరాధము చేయకయును, విపరీతపుఁగష్టములను ♦ వేఁగెదఁ గంటే
కృప సర్వభూతరక్షక, కృపణుని రక్షించి యతులకీర్తిం గనుమీ.
చం. అనవుడు రామచంద్రుఁ డిటు ♦ లాడెను మిత్రవ చింత మానుమీ
సునిశితమచ్ఛరంబులను ♦ నూడు దొలంచెద, నెంతదాఁక నా
యనుపమపాపచారుఁడు మ♦దక్షులకుం గనరాక యుండు నం
దనుక సుఖించుఁగాక పర♦దారరతాభిరతిన్ విమోఘుఁ డై.
కం. నాదుఃఖమువంటిదె కా, నీదుఃఖం బంచు లెస్స ♦ నెఱుఁగుదు నేను
నీదుఃఖం బడఁగించెద, మోదింపుము నిచ్చఁ గీశ♦ముఖ్యా యనిసన్. ౨౬

↞ సుగ్రీవుఁడు రామునకు వాలిబలపరాక్రమంబులఁ దెలుపుట. ↠

ఉ. హర్షవికాసభాసురము♦ఖాంబుజుఁ డంబుజమిత్రసూతి రా
జర్షభుఁ బల్కు నిస్తులయ♦శా నిజ మియ్యది లోకపాళి సా
మర్షభవద్విముక్తశిత♦మార్గణకోటి యుగాంతభాస్కరో
ద్ఘర్షకరాళిపోలెఁ ద్రుటిఁ ♦ గాల్చి యొనర్చును బూదిప్రోవుగన్. ౨౬౬
ఉ. ఐనను వాలిపౌరుషమ♦హాద్భుతవిక్రమధైర్యసంపదల్
మానక యేకచిత్తమున ♦ మానవపాలక యాలకించి యా
పైనయశీల యెయ్యది యు♦పాయమొ యయ్యది సేయ నయ్య, ఘృ
ష్టానననగంబు లెత్తి భుజ♦దర్పితుఁ డన్నన కాఁడు లాడెడిన్. ౨౬౭
ఉ. తూరుపువార్ధినుండి యఱ♦తోయపుదిక్కునవారిరాశికిన్
సారబలుండు దక్షిణపు♦సంద్రమునుండి యుదగ్దిశాబ్ధి కా

చారపరుండు నిత్యమును ♦ సారసమిత్రుఁడు రాకమున్న తా
వారుధి పోయి వచ్చును జ♦వంబున ను స్సని యార్వ కింతయున్. ౨౬౮
కం. తనబలముం బ్రకటింపఁగ, ఘనతర వనతరుచయంబుఁ ♦ గరదండమునన్
దునుకలుగాఁ బడ నడుచును, వనఘాత్మక చెప్పఁ జిట్ట ♦ లాతనిబలముల్. ౨౬౯

సుగ్రీవుఁడు రామునకు దుందుభివృత్తాంతముఁ జెప్పుట.

సీ. దుందుభినాముండు ♦ దుంతసోఁకుఁ డొకండు, కైలాసశిఖరని♦కాశ తేజుఁ
డమర సహస్రనా♦గాధిక బల ముగ్ర,నరదానబలమున ♦ వార్ధిఁ జూచి
తోయధినాధ నా♦తో యుద్ధమునకు వ,చ్చెద వె యం చనఁగను ♦ జేటుకాల
మటు మూఁడి పలికెదు♦నాతని క నె నబ్ధి, యసురేంద్ర నీతోడ ♦ నని యొనర్ప
ఆ. నెంతవాఁడ నేను ♦ నీశ్వసుమామ శై,లాధినేత తాప♦నాశ్రయుండు
బహుఝరీదరీవి♦భాసితుఁ డగుహిమ,వంతుఁ డతఁడు నీకు ♦ వంతు వచ్చు. ౨౭౦
అనువతని భీతునిం గా, దనుజుఁడు దలపోసి చనియెఁ ♦ దద్ద వడి శరా
సముక్తశరముభంగిని, ఘుఁడు హిమవంతునిఁ గనంగఁ ♦ గలహప్రియుఁ డై ౨౭౧
శనశృంగాగ్రంబుల ♦ నుగండోపలము లెల్లఁ ♦ బృథివిం ద్రెళ్లం
లించిన గిరి ,త,ఘన హాపముతోడ శృంగ♦గత హై పలికెన్, ౨౭౨
ను నే యేఁచెద వు ని♦త్యం బెంతో ధర్మంవ వే
ంబుల కాశ్రయుండ నః దు♦ర్గోహాత్ము డై యాతఁడున్
యు భీతుఁడవ యేని యుద్ధమును గా♦వింపంగి లే వేని నా
కని చేయంగల వీరుఁ జెప్పు మన సీ♦ప శైరాగ్రి యమ్మాటకున్ ౨౭౩
మ. చెలఁగున్ వాలి యనంగ వాసరుఁడు కి♦ష్కింధన్ మహాధీరుఁడున్
బలియుం డాతఁడు శక్రతుల్యుఁడు మహా♦ప్రాజ్ఞుండు ద్వంద్వ సమా
గ్మోలఘున్ ద్వంద్వరణంబు నీ కొసఁగు యు♦ద్ధేచ్ఛాగు నస్కుం డ వేగ
జేలమూర్ధం గనఁ బొమ్ము వాని నిపుడే ♦ సర్వంబు చక్కంబడున్. ౨౭౪
కం. నముచికి వాసవుపోలిక, ననునారి నీ కొసంగు ♦ నాహవభిక్షన్
నముచినిషూదనసుతుఁ డని, హిమశైలము కోపయుక్తి ♦ నిటు లాడుటయున్.

దుందుభి వాలిమీఁదికి యుద్ధంబునకు వచ్చుట.

ఉ. బంధురవిక్రమాఢ్యుఁ డగు♦పాపపురాక్షసుఁ డంత రోషగ
ర్వాంధతఁ బొనఘట్టనం ♦ నల్లలనాడ ధరిత్రి యేగి కి
ష్కింధకుఁ గాసరాకృతిని ♦ జీరె నిశాతవిషాణధారలన్
సింధురభంగి వృక్షములఁ ♦ జీల్చెను ద్వారకవాటదేశమున్. ౨౭౬

కం. జడికాఱునఁ బఱ మొగులన, విడివడి రక్కసుఁడు కర్ణ♦భేదనముగ దం
డడి దుందుభి దుందుభివలె, నెడనెడ ధ్వనియించుచున్ ర♦హించుచు నున్నన్.

కం. అంతఃపురగతుఁ డగుచు, కాంతకసుతుఁ డాలకించి♦ యానాడు నిశా
కాంతుఁడు తారలతోఁబలె, గంతులతో వచ్చి యసుర♦కిట్లు వచించెన్. ౨౭౮

ఉ. దుందుభి నీవు నే నెఱుఁగు♦దున్ దనుజోత్తమ యేల యీఁగలిన్
మందమతిన్ ధ్వనించెదవు♦ నా నగరంబున ద్వారసీమఁ, బొ
మ్మిందుల కేని భూమిపయి♦ నింకను నూపిరితోడ నుండఁగా
డెందము గల్గెనే ననఁ గ♦డింది బలాఢ్యుఁడు దైత్యుఁ డిట్లనున్. ౨౭౯

ఉ. గోలల మున్ను దంభములు♦ గొట్టినయంతనె మేలు వచ్చెనే
వాలినవిక్రమంబు గల♦వాఁడవయే నరుదెమ్ము పోరికిన్
వాలి భవద్భుజాబలము♦ నాఁ డెఱుఁగం దగు నట్లు కాదయేన్
దాళెద వేగుదాఁకఁ బ్రియ♦దారలతో రమియింపు మంతకున్. ౨౮౦

ఉ. పొమ్ము భవద్గృహమ్మునకుఁ♦ బొంపిరివోవఁగ మిత్రకోటికై
యిమ్ము ధనమ్ము దానముగ♦ నెల్లయనుంగుజనాళి కౌఁగిలిన్
గొమ్ము, విలాసినీజనులఁ♦ గూడుము, చూడుము పట్ను మెల్ల, రా
జ్యమ్మున నీసముల్ నిలుపు♦ మావల రమ్ము మదం బణంచెదన్.

కం. మత్తుఁ బ్రమత్తుని సుప్తు న,నాత్తాయుధు నిన్నుఁ బోలె♦ నసహాయుధ
హాత్తుని మిత్తిం గూర్చిన, హత్తును జమి భ్రూణహత్య♦ యగచరవర్యా! ౨౮౨

చం. అన విని మందహాసరుచి♦రాననుఁ డైనిజదారఁ దారఁ ద
క్కినమృగలోచనావళుల♦ గేహముఁ జేరఁగఁ బంచి రక్కసుం
గని యసురోత్తమా పిఱికి♦కండ యెసంగద యేని మత్తుగన్
ననుఁ దలఁపంగఁ బోకుము ర♦ణంబున కియ్యది వీరపాణ మూ. ౨౮౩

కం. పరికింపు మనుచు జనకుఁడు, సురనాథుఁ డొసంగిపట్టి♦ సుందరకాంచ
స్వరమాలిక మెయిఁ దాలిచి, సరభసముగఁ దాఁకె రాక్ష♦సప్రాగ్రసరున్. ౨౮౪

ఉ. పైపడి వాని బిట్టిదిమి♦ పౌరుషమారఁగ వాని శృంగముల్
చేపడ తివ్వతివ్వనను♦ జెచ్చెర నాతనిఁ ద్రిప్పి హీనుఁ డై
లోపడ నేల మోఁదుటయు♦ లొల్లిగ వీనుల నెత్రు గాఱఁగాఁ
బైపయి వాఁడు ద్రెళ్ళియు న♦పారబలంబున లేచె ధీరుఁ డై. ౨౮౫

కం. మోఁకాళుల మోచేతుల, మ్రాఁకులఁ బెనుశిలల వాలి♦ మహిషాసురునిన్
వీఁక మెయిఁ దాఁచె దానికి, సోఁకుఁడు జంకక యెదిర్చె♦ సురపతిసుతునిన్. ౨౮౬

తే. ఒండొరుల గెల్చుకోరికి ♦ యుద్ధమాడ, నంతకంతకుఁ గపిబల ♦ మతిశయిల్లె
సైంధవద్వేషిదనుజుని♦సత్త్వమెల్లఁ, దొడుతొడుత క్షీణించెఁ ♦ దోయజాక్ష.

## ↔ మతంగుఁడు వాలిని శపించుట. ↔

సీ. హీనబలుం డౌట ♦ యెఱిఁగి యవ్వాలి యుఁ, బిడికిటిపోటులఁ ♦ బీఁచ మడఁచి
దనుజకళేబరం♦బును గేలఁ బై కెత్తి, వెస యోజనంబున ♦ విసరి వైచె
విబుధారినోట స్ర♦వించునెత్తురు మతం,గాశ్రమమునఁ బడె ♦ ననిలుకతన
నది గని మౌని మ♦హాగ్రహాయుక్తుఁ డై, పరమదురాత్ముండు ♦ బాలిశుండు
ఆ. జ్ఞానహీనుఁ డెవ్వఁ ♦ డీనెత్రు నాపయి, వైచె దుష్టబుద్ధి ♦ పాపి యనుచు
వెలికి వచ్చి చూచె ♦ సిల గతాసుం డయి, పర్వతంబువోలెఁ ♦ బడినవాని ౨౮౮
కం. మహిషాసురుఁ గని యెవఁ డీ,నహిఁ జేసె నటంచుఁ జూచి ♦ స్వతపశ్శక్తిన్
మహిజాటుఁడు బలమదధూ,ర్వహుఁ డై పొనరించినట్టి♦పని యంచు మదిన్ ౨౮౯
ం. తెలిసి యది విసరి చిమ్మిన,బలియుని వాలినిగుఱించి ♦ పటురోషమునన్
ాలబుద్ధి యసురతనువుం, ఖిమిని నిట వైచి యాశ్ర♦మస్థలితరువుల్ ౨౯౦
ి యిల నెల్ల నల్ల యు, నెఱచియుఁ బడవైచి వనిని ♦ హేయంబుగఁ దాఁ
చెఱపనచేట యు,నుఱు పాయుం గాక దీనిఁ ♦ జొచ్చినమాత్రన్. ౨౯౧
ధూగము మా,మకమహితాశ్రమము దీని ♦ మర్కటపతి యో
ణమే, ప్రకటంబుగ యమునిమంది♦రంబుం జేరున్. ౨౯౨
కి నైనవారలు జ♦వంబున దీనిని బాసి పొండు, పో
రేనియు రేః ప్ర సూర్యుఁ డుద♦యించినపిమ్మట నిందుఁ గ్రోఁతి నన్
గానఁగఁ గల్గునేనియు ని♦కారము గాదు శపించితిం జుఁడీ
మానక వేనవే లగుస♦మల్ శిల లై పడియుండ నియ్యెడన్. ౨౯౩
కం. బిడ్డవలె నేను సాఁకిన,దొడ్డవనంబందుఁ గపులు ♦ దుడుకుతనమునన్
గడ్డలుఁ బండ్లును నాకులు, మడ్డితనంబునను రూపు♦మాపఁగఁ జన్నే. ౨౯౪
కం. అని యిట్లు మౌని తిట్టిన, వనచరవర్గంబు వెఱచి ♦ వాలిని డాయన్
జన నిట్లను నాతండుం, బని యేమీ యిట్లు మీరు ♦ పరువున రాఁగన్. ౨౯౫
కం. హరిమతంగాశ్రమసం,చారవనేచారులార ♦ సౌఖ్యము లే దేఁ
గారణ మే మన వాలికి, వారలు మునిశాపవిధము ♦ వాక్రుచ్చుట యున్. ౨౯౬
చం. అది విని వాలి భీతి ముని♦యంతికముం జని కేలు మోడ్చి యో
సదయ క్షమింపుమీ యనుచు ♦ సారెకు వేఁడినఁ గన్కుఁ బాయకే
సదనములోని కేగె, ముని♦శాపభయంబున నేగి యార్తుఁ డై
యది మొదలిందు రాఁడు కన♦నైనను నోడును వాలి యీగిరిన్. ౨౯౭

కం. ఆతఁ డిటఁజోరఁగ రామిని, ఖ్యాతయశా తెలిసియుండు♦కారణమున ని
ర్భీతిఁ జరియింతు నిం దదె, దైతేయుని యస్థిరాశి ♦ ధరమున కెనఁయై ౨౯౮
కం. నేలఁ బడి యున్న యది పర,కాల! మహాసాలసప్త♦కంబును గంటే
వ్రాలినకొమ్మలు నిండఁగఁ, బాలించి కనంగఁ గానఁ♦బడదు మహాత్మా. ౨౯౯
కం. ఈమహితసాలముల సు,త్రామనుతుం డొక్క టొకటి ♦ తనభుజశక్తిఁ
వేమఱు నిష్పత్రంబుగ, నామిక ఘటియించు నిప్పు♦హోయుం డగుచున్. ౩౦౦
కం. చెప్పితిఁ జుమి యాకపివరు,గొప్పభుజాబలము విధముఁ ♦ గొనకొని నీ కే
చొప్పున నాతనిఁ జంపఁగఁ, జొప్పడునో చెప్పు మన్న ♦సుగ్రీవునితోన్ ౩౦౧
కం. ఎలనగవున లక్ష్మణుఁ డనుఁ, గలితయశా యేమి సేయఁ♦గా నింద్రసుతుక్
బొలియింపఁ జాలు రఘుకుల,తిలకుం డని నమ్మె దనినఁ ♦ దీవ్రాంశుజుఁడున్. ౩౦౨
ఉ. భద్రగుణాపురందరుని♦పట్టి బలంబున నేడుసాలముల్
ఛిద్రము లొందఁజేసె నవ♦లీలగ వేమఱు నొక్క టొక్కటిక్
రౌద్రశరాన నొక్కటను ♦ రాముఁడు వీసను నొంచు ద్రుంప న
త్యుద్రబలుం డటంచు హరి♦సూనునిఁ జంపు నపించు నమ్మెదన్.
కం. వెండియు లక్ష్మణ రాముఁడు, కొం డనఁదగు నసురయెమ్ము♦గూఁడును
బెండుగ నిరుసూర్ధనువులు, చండగతిం జిమ్మ నమ్మఁ♦జాలుదు ననుచు
కం. పలికియుఁ దనలోఁ గొండొక, దలపోసి వచించె నిట్లు ♦ దశరథసుతుతో
బలవంతుఁడు భువి విశ్రుత, బలపౌరుష శాలి వాలి ♦ ప్రధనములందు
ఉ. దుర్జయుఁ డార్యవర్య గురు♦దోర్బలనిస్తులశౌర్యరాశి సం
భర్జితశూరలోకుఁడు సు♦పర్వులచేత నసాధ్య మంచు స్థ
వర్జిత మైనకార్యముల ♦ వాలి ఘటించె స టొటచేఁ గదా
యూర్జితభీతి నియ్యెడ ర♦ఘూత్తమ డాఁగి చరింతు నెప్పుడున్. ౩౦౬
ఉ. వానియజయ్యవిక్రమము ♦ వానియధృష్యపుఁబౌరుషంబునుక్
వానియుదగ్రరోషమును ♦ వానిమహాజవసత్త్వసంపదల్
మానవనాథ యెంచి యను♦మానముతో వెనువెంట నీమహా
వానరు లోలి రాఁగ నెడఁ♦బాయఁగ నొల్లను ఋశ్యమూకమున్. ౩౦౭
కం. మిత్రుని సుజనశ్లాఘూ, పాత్రుని నినుఁబోల్ మహాను♦భావునిఁ గనుటక్
మిత్రజనవత్సలా! హిమ,గోత్రము ప్రాపబ్బినట్లు ♦ కుందు దొఱఁగితిన్. ౩౦౮
ఉ. నీదుసమగ్రధైర్యమును ♦ నీదుస్వరూపము నీదుప్రజ్ఞయుక్
నీ దగుమాటచందమును ♦ నీదుగభీరత యిన్ని చూచినన్

కం.సాలమ్ము లేడు బొడిచవు,వాలమ్మున బిఱును దఱికిఁగి ♦ వ్రాలఁగఁ గడు నా
భీలమ్ముగ నది గని కపి,జాలమ్ములకేఁడు బాణ♦జవగరిమకు నై	3౨౦

కం.అచ్చెరుపడి మెడఁ గ్రుచ్చిన,యచ్చపుహారములు వ్రేల ♦ నవనిని దలచే
నచ్చరితుఁ డంటి మ్రొక్కుచుఁ; బొచ్చెము లే నట్టిప్రీతిఁ ♦ బునరుత్థితుఁ డై 3౨౧

చం.కరములు మోడ్చి పల్కు మహి♦కాంతునితోడ భవచ్ఛరావళిన్
హరిహయయుక్త మైనయమ్మ♦తాశనకాండము దైత్యఖండమున్
బొరిగొనఁ జాలు దీవు, రణ♦భూమిని వాలియు గీలి లెక్కయే,
వరుణబలారితుల్యు హిత♦వత్సలు ని న్గనఁ దీతె దుఃఖముల్.	3౨౨

కం సాలంబుల నేడిటి గురు,శైలంబు రసాతలంబు ♦ శర మొక్కంటన్
జీలిచి వైచిన నిన్నును, నాలంబున నెదురు నెవ్వఁ ♦ డార్తశరణ్యా.	3౨3

ఉ అంజలి మోడ్చి వేఁడెద మ♦హాత్మక రాఘువవంశదీప నా
నెంజలిఁ బాపుమీ యహితు ♦ నిర్దయు సోదరహాపు వాలి వీఁ
కం జేముఁ గూల్చు నాకొఱకుఁ♦గా నని దీనత వేఁడ సూర్యపు
త్రుం జేనవారిఁ గౌఁగిటను ♦ గ్రుచ్చి నచించెను భ్రాతృవత్సలిన్.	3౨౪

సుగ్రీవుఁడు తొలిసారి వాలిమీఁదికి యుద్ధమునకుఁ బోవుట.

కం.పోదము పద కిష్కింధకు,లే దిఁక నాలంబు హాళహా♦ళిం జని మును నీ
సోదరు సోదరహింసకు, మోదంబునఁ బిలుము యుద్ధ♦మునకున్ రవిజా.	3౨౫

చం.అని రఘురామలక్ష్మణులు ♦ నానగచారిగణంబుతోఁ జెఁ జ
య్యనఁ జని వృక్షజాలముల ♦ నావృత మైనమఱుంగుఁదావునన్
వనమున నిల్చి రంతఁ గపి♦నర్యుఁడు మున్నుగఁ బోయి గర్జలన్
నినిచి నభంబు పూరటిల ♦ నిష్ఠురు వాలిని బిల్చె దొమ్మికిన్.	3౨౬

కం.అనినదము విని బలరిపు,సూనుం డస్త్రాద్రిఁ దోఁచు♦సూర్యునిపగిదిన్
దా నరుగుదెంచెఁ జివ్వకు, మాననికోపమున రేఁగి ♦ మండుచు నరగన్.	3౨౭

ఆ. అంత ఘోరతముల ♦ మైనకయ్యము సాగె, నన్నదమ్ములకు భ♦యావహముగ
నంబరంబునన్ బు♦ధాంగారకగ్రహ,ములకుఁ బోలె నలుకు ♦ కలఁక లేక.	3౨౮

కం.పిడుగులఁ గేరడ మాడెడి,పిడికిళ్లను దలములం ప్ర♦భీకరగతి వా
రడుచుచు నుడుగక పోరిరి, పిడిగ్రుద్దులకయ్య మిట్లు ♦ పెరుఁగుచు నుండన్.3౨౯

ఉ. చే విలు దాల్చి రాఘవుఁడు ♦ చెచ్చెర నజ్యముఁ జేసి యశ్వినీ
దేవతనూజులట్టు లయి ♦ తేజమునందు సురూపశౌర్యసం
భావనలందుఁ దుల్యు లయి ♦ భాసిలువారలఁ గాంచి వీఁడు సు
గ్రీవుఁడు వీఁడ వాలి యని ♦ కీనయు భేద మెఱుంగఁ జాలమిన్.	3౩౦

ఉ. అంతకరాభుగంబు లులి♦తాత్ముఁడు రాముఁడు వీడఁ డయ్యెఁ, దా
నింతటిలోన నింద్రసుతు♦నేటులు నొచ్చి దినేశసూతి యం
తంతల నున్న రాముఁడెస♦నైనను జూడక పాఱిపోయె స
ల్లాంబిగ రక్తసిక్తుఁ డయి♦ గాటపుఁగింకను వాలి తోలఁగన్. ౩౩౧

చం. పరువిడి ఋశ్యమూకగిరి♦భాగవనాంతముఁ జేరెఁ జేరినన్
హరిహయపుత్త్రుఁ డందుఁ జొర♦ నాత్మఁ దలంకుచు శాపభీతిచేఁ
బురరుషఁ బల్కి ఛీ బ్రతికి♦ పోయితి పోర యటంచు గ్రక్కునన్
మరలి పురంబుఁ జేరె, నట♦ మానవపాలుఁడు లక్ష్మణుండునున్ ౩౩౨

వాలిని జంపమికి సుగ్రీవుఁడు రాముని నిష్ఠుర మాడుట.

కం. హనుమయుఁ దోఁ దోఁ దేరఁగ, వనచరపతి దీనుఁ డగుచు ♦ వగ్గిలు నెలవుం
జని యెదుర నిలువ వారలఁ, గని సిగ్గున మోము వాంచి ♦ కపివరుఁ డనియెన్. ౩౩౩

ఉ. నమ్మఁగ నీపరాక్రమము ♦ నా కటు చూపియు వాలిఁ బిల్వఁ బో
పొమ్ము రణమ్ము సేయ నని ♦ భూవర నన్ బరరేచి నైరిచే
నిగ్గొయిఁ జంపఁ జేయఁ దలఁ♦పెత్తుట కేమి కతంబొ? యేమి లా
భమ్మును బొందెదో పగతు♦వాతను సన్నుతఁ ద్రోచి రాఘవా? ౩౩౪

ఉ. చంపుము వాలి నంచు నిను ♦ సత్యవ్రతా యటు వేఁడినప్పు నో
ప్పింపను వాలి నంచు మును♦పె పచియింపఁగరాదె? యిట్లు లే
నింపుగ నెప్పటట్ల యిట♦ నే పనియుండెనె? యేటికయ్య నన్
బంపుట చావుదెబ్బలకుఁ ♦ బాలొనరించుటకా మహామతీ? ౩౩౫

రాముఁడు సుగ్రీవునితోఁ దాను వాలిం జంపమికిఁ గారణము దెల్పుట.

కం. అని కరుణంబుగ దీనతఁ, బనవ్రురవిజు ననియె రామ♦భద్రుం డోనా
యన యేటికిఁ గోపించెదు, వినుమీ నే దివ్యశరము ♦ విడువనికతమున్. ౩౩౬

కం. రూపున వయసునఁ బొడవునఁ, జూపున వేషమున నడక♦సొంపునఁ గాంత్యా
లాపంబుల స్వరమున ధృతి, రూపింపఁగఁ దుల్య లిరువు♦రున్ మీ రనఘా. ౩౩౭

కం. కావున మీయిరువురిలో, నేవాఁడో యింద్రతనయుఁ ♦ డెఱుఁగఁగ లేమిన్
జీవాంతకఘోరాశుగ.మే విడువన చుమ్మి నిక్క ♦ మియ్యెడ హితుఁడా. ౩౩౮

ఉ. ఎప్పుడు గిత్త వోయెదు క♦పీశ్వర మత్కరముక్తసాయకం
బిప్పుడు మీపయిన్ విడున ♦ నెవ్వరిఁ ద్రుంచునొ మూలనాశనం
బప్పుతిలంగ నిష్టగుల ♦ నొప్పమి పుట్టును గాదె యంచు నే
నప్పుడు బాణమున్ విడువ♦నైతి శమింపుము మిత్త్రరత్నమా. ౩౩౯

కం. అరయమి లాఘవమున మ,చ్ఛరమున నినుఁ గూల్తునేని ♦ జగముల నెల్లన్
హరివర శాశ్వతముగ నా,గురుమాహాత్మ్యము విహీనమగు ♦ కుదురుగ నిలుచున్. ౩౮౦

కం. దత్తాభయఘాతంబు మ,హాఘోరపాపం బటంచు ♦ సంగరు ప్రాయ
శ్చిత్తంబు లేదు దానికిఁ, జిత్తంబునఁ దలంపు మింత ♦ స్నిగ్ధజనాఢ్యా. ౩౮౧

కం. సౌమిత్రి నేను సీతా,భామయు నీచేతిలోని ♦ వారము నీవే
యీమహితవనంబున మా, కోమహితగుణాఢ్య దిక్కు ♦ సుగుణుఁడు మాకున్.

ఉ. నమ్ముము నన్ను మిత్రమ ను♦నంబున సందియ మందఁబోకుమీ
సొమ్ము మఱొక్కమాట సుర♦పుంగవపుత్రునితోడఁ బోరఁగా
నిమ్మరి యేదియేని గురు♦తు నే నెఱుఁగంగ ధరింపు మేన, మా
ర్తమ్మున మచ్ఛరాభిహతి ♦ ధారిణిఁ గూలఁగఁ జూచె దాతసిన్. ౩౮౩

కం. పెల్లుగను బూచియున్నది, యల్లదె గజపుష్పలతిక ♦ యది సౌమిత్రీ
తెల్లముగా నీ వానర,వల్లభుకంఠమున వేగ ♦ వైచును యిపుడే. ౩౮౪

కం. అనవుడు సౌమిత్రియు దా,నిని గొని చనుదెంచి వైచె ♦ నీరజహితపు
త్రునిమెడ విపరీతంబుగ, ఘనతారాయుక్తసూర్య♦కరణిఁ వెలుఁగన్. ౩౮౫

తే. సంజవేళ బలాకసం♦చయముతోడ, నొప్పు మబ్బువిధంబున ♦ నొప్పి యతఁడు
రామవాక్యంబునను ధృతి ♦ రాజిలంగఁ, జనియెఁ గిష్కింధకును రామ♦చంద్రుతోడ.

◆ రాముఁడు సుగ్రీవాదులతోడఁ గిష్కింధయొద్దకుఁ బోవుట. ◆

సీ. మిత్రసుతుండు సు♦మిత్రాసుతుండును, దనకు మున్నున్నగాఁ ♦ జనుచు నుండ
నలసీలవాయుసం♦వనతారనాయక,వానరుల్ వెన్నంటి ♦ వచ్చుచుండఁ
గాంచనభూషిత♦ఘనశరాసనమును, సర్పాభబాణంబు ♦ లమరఁ గేల
సట సటఁ బుష్పభా♦రావలంబితకుంజాళి, నిర్మలోదకవిమల ♦ సికరములను

తే. సుందరము లైనకందర♦బృందములను, మంజులము లైనజనింబత♦కుంజములను
వికిరనికరసమాకులో♦గ్రవృక్షములను, వాటములు లైనగిరికూట♦వాటములను. ౩౮౭

కం. మొగిపూలతో [illegible] ద్రుపు,జగియాకులతోడఁ దమ్మి♦సంగమ్ములతో
నగ మీఱిశిలయకరులతోఁ, నగు తేఁటులు నొప్పు కొలఁకు♦దాఁటులఁ గనుచున్

కం. కారండవకాండంబులు, నారంములు [illegible]ములు ♦ జలకుక్కుటసం
వారములుఁ జక్రవాకము, లారఁగ ధ్వనిచేయఁ గని జ♦లాశయతతులన్ ౩౮౯

కం. గుట్టల మెట్టల మదిలోఁ, దట్టపదిగు లింత లేక ♦ తమఁ [illegible]చ్చికను
వట్టులు మేయుచు లేళులు, నెట్టన విహరింపఁ గనుచు ♦ నిండుముదమునన్ ౩౯౦

చం. వనమున జంగమాద్రులన ♦ వారిధరాభము లైన [illegible]కమిను
గొనకొని వే కలంచుచును ♦ గూలములం దను [illegible]

దునియలు గాఁగఁ ద్రోయుచును ♦ దుమ్ములు నెత్తినఁ జేల్లుకొంచు నొం
టిని విహరించుచుండెడి య♦నేకపరత్నము లుండఁ జూచుచున్ ౩౫౧

కం. చనుచు హాటూహాటివడకలఁ, గని ద్రుమషండంబు వనముఁ ♦ గాకుత్సుం డ
ర్కనిపట్టి కిట్టులనియెం, దనమది కవ్వని మహాద్భు♦తంబు ఘటింపన్ ౩౫౨

ఉ. ఉప్పర వీదిఁ గార్మొగులు♦నొప్పున మిక్కిలి కారుకొంచు నా
చొప్పున నెల్లెడన్ నిగిడి ♦ సుందర మైసయనంటిచెట్టులున్
దొప్పలుదోర లై కడుఁ గు♦తూహలమున్ సమకూర్చె మిత్రమా
చెప్పఁగదయ్య యే మిది వి♦చిత్రము నాకుతుకంబు దీరఁగన్. ౩౫౩

కం. అని యడిగిన నడచుచునే, యినజుం డిట్లనియెఁ దన్న♦హిష్ఠారామం
బునకథ యిది శ్రీసునాశన, మునఘమునినసంబు సత్ఫ♦లాంబుయుతంబున్. ౩౫౪

ఉ. సప్తజనాఖ్యు లైనముని♦సత్తము లేడ్వు రధశ్శిరస్కులున్
దప్తులు నేడునాళ్లఁ బవ♦నంబును మెక్కుచు నంబుశాయు లై
సప్తశతంబు లేండ్లిటుఁ ♦ జల్పి మహోగ్రవ్రత ముగ్రనిష్ఠ దే
వప్తహాయద్యుతుల్ చనిరి ♦ స్వర్గముఁ జేర శరీరయుక్తు లై. ౩౫౫

కం. వారలమహిమను ద్రుప్రా, కారావృత మిష్వనంబుఁ ♦ గాసఁగనే బృం
దారకవనుజచయంబులు, నేరవు సుష్ఠి ♦ కృశాల ♦ నిర్భరభీతిన్. ౩౫౬

కం. చౌర విందుఁ బశువులేన్ వన, చరములు నేన్ జొచ్చె నేని ♦ సంభ్రమమతి చేఁ
దిరుగుచు నుండెడు సందే, నరవం వెలి రా వ వెన్ని♦నాళ్లకు నైనన్. ౩౫౭

కం. భూషణశింజితముం బరి, తోషణకరగీతవాద్య♦తూర్యంబులు స
ద్భూషణములతో శాత్రవ, శోషణ వినవచ్చు దివ్య♦సురభియు వీచున్. ౩౫౮

కం. త్రేతాగ్నులు వెలిఁగెడి సట, వాతచయోద్భూతధూమ♦వారము కుజసం
జాతాగ్రంబుల సదిగొఁ గ, పోతాంగారుణరుచిం బ్ర♦భూతం బయ్యెన్. ౩౫౯

కం. ధూమచయావృతమస్తక, సీమల నేతద్వనీవి♦శిష్టావనిజ
స్తోమంబులు ధారాధర, ధామయుతవిదూరజాత♦ధరములఁ బోలెన్. ౩౬౦

చం. అనుజునితోడ సమ్మునుల ♦ కంజలి సేయుము ధర్మశీల యి
మ్మునులకు మ్రొక్కువారలకు ♦ మూఁడ దొకింతియు దేహరోగ మం
చన సనుజుండుఁ దానును స♦మంచితభక్తి నమస్కరించి చ
య్యన నది దాఁటి ద న్వగుప్ర♦యాణము పోయి యటం గనుం గొనెన్ ౩౬౧

తే. వాలిపాలితకిష్కింధ ♦ భద్రసూక్తి, యిట్లు రామానుజాగచ♦రేశయుక్తి
నుదితసముదగ్ర తేజుం డ♦నూనశక్తి, మరలఁ జనుదెంచె శత్రుసం♦హారణరక్తి. ౩౬౨

కం ఈరీతి నెల్లగును బా, కారితనూజాతపత్త్ర♦నాంతికమున దు
ర్వారణ్యత్తలముసన్ భూ, మీరుహపాళీపినద్ధ♦మేదిని నిలువన్. ౩౬౩

## రాముఁడు సుగ్రీవునకు భయము పాయ నుత్సాహోక్తులు చెప్పుట.

సీ. అంత సుగ్రీవుఁ డ♦త్యంతరోషంబున, నలుగడ లత్తఱిత్తి ♦ కలయఁ జూచి
ఘుమఘుమాతర♦ఘుర♦స్వనవారిధరగర్జ,లను బోలుగర్జలు ♦ నినిచి బాల
తరణితుల్యుఁడు క్రియా♦దక్షు రామునిఁజూచి, హరివాగురావృత♦యరిత్రరక్షి
తంబు కిష్కింధపు♦ త్తన మిద్దియే సుమ్మి, వచ్చితిమిందు నో♦వాసవాభ
తే. మున్ను వాలిని జంపెద ♦ నన్నప్రతిన
సఫలముగఁ జేయ నిదియు చూ ♦ సమయ మయ్యె
లతికలకు వసంతాదికా♦లంబురీతి
ననిన రఘురాముఁ డిట్లను ♦ నర్కజునకు. ౩౬౪

సీ. సౌమిత్రి నీకంఠ♦సీమను గూర్చిన,గజపుష్పచిహ్నంబు♦కతన నీవు
చుక్కచాలుల నొప్పు♦సూర్యుచే భాసిల్లు,విపరీతగగనంబు♦విధముగాఁగ
వెలిఁగెదు వాలిచేఁ ♦ గలుగునీభయ మెల్ల, బాణ మొక్కంటన ♦ పాపువాఁడఁ
గానిపింపుము భ్రాతృ♦కంటకు నవ్వాలి, నంతతో నాఁ డంత ♦ మందుఁ జుమ్ము
తే. నుధు లి వేటికి నాకంటఁ ♦ బడియు వాఁడు, మరల జీవంబుతోడుత ♦ మరలెనేని
యప్పు డేమైన దూషింపు♦మనఘుచరిత, యంతకును గర్హనీత న్యా♦యంబుగాదు.

కం. కన్నారఁ జూచితివిగా, మున్నాసాలంబు లొక్క♦మొగినే డిల్లప
మన్నారాచంబునఁ బడ, నన్నిటఁ దలపోయు వాలి ♦ హతుఁ డౌట కిటన్. ౩౬౬

కం. ఎన్నివిపత్తుల మునుఁగుచు,నున్నను వరధర్మలోప ♦ మొల్లమిఁ గల్గ
మ న్నన్నుఁ జూడ నీక నే, నెన్నం డాడంగఁ బోవ ♦ నిది నిజ మనఘా. ౩౬౭

చం. విడువుము సంభ్రమంబు నెఱ♦వేర్చెద నాదుప్రతిజ్ఞ వానచే
మడులను సస్యవంతముగ ♦ మానుగనింద్రుఁ డొనర్చుభంగి, లో
జేడియకు మెట్టిగర్జ బల♦శాసనసూనుఁడు విన్నమాత్ర నే
యుడుకుచుఁ బోర్కి నడచు♦నో యొనరింపుము యట్టిగర్జనన్. ౩౬౮

ఉ. క్రచ్చఱ ధైర్యశాలి జిత♦కాశి పరాక్రమశాలి వాలి ము
న్నొచ్చినవాఁడు గాఁడు త్వద♦నూనబలంబున నట్లు గావునన్
వచ్చు నవశ్య మిందు, వన♦వారిజనేత్రలగోష్ఠి నున్నచో
హెచ్చును గాదె దుర్గద మ♦దట్టివివేకికి వానరోత్తమా. ౩౬౯

కం. శూరులు వైరికృత తిరస్కారంబును సైఁపలేరు ♦ స్వబలము పేర్మిన్
నారీజన సన్నిధి నీక, వారిదురాగ్రహముఁ జెప్పు♦వలయు నె చెప్పుమా. ౩౭౦

## సుగ్రీవుఁడు వాలిని రణంబునకుఁ బిల్చుటకై సింహనాదముఁ జేయుట.

కం. ఇటు పలికిన రామునిప్రస్ఫుటవాక్యము లాలకించి ♦ సుగ్రీవుఁడు ది
క్పటలస్ఫోటనముగా గళ,రటనము సూర్యాత్మజునిభంబు ♦ రహి నెఱిఁగించెన్. ౩౭౧

తే. అంతిపురమున కరిగె నా♦యంబుజాక్షి, యూరెలుంగున నేడ్చుచుఁ ♦ దార యట్లు
మరలి గృహమున కేగఁగ ♦ హరివిభుండు, నిస్తులాగ్రహమునఁ బురి ♦ నిర్గమించి.

→ వాలి సుగ్రీవుల ద్వితీయయుద్ధము. ←

సీ. నిబిడరోషంబున ♦ నిట్టూర్పు విడుచుచు, శత్రుదర్శనకాంక్ష ♦ సకలదిశలు
కలయంగఁ బరికించి ♦ కనియె దీప్తానిల,ధాము నవష్టబ్ధు ♦ హేమపింగ
ళుని సూర్యపుత్రునిఁ ♦ గని సముత్సాహి యై, చేల చక్కబిగించి ♦ చాలఁ గినుక
ముష్టి పై కెత్తి స♦మ్ముఖముగఁ జనఁ దన, కెదు రేగు దెంచెడి♦ హేమమాలి

ఆ. వాలి నంశుమాలి♦వరతనూజుఁడు గాంచి, యెదురనడిచె నదరు ♦ బెదరు లేక
తనకు నభిముఖముగఁ ♦ జనుదెంచుతమ్మునిఁ, గాంచి యీసు పెంచి ♦ కడకఁ బలికె.

మ. ఇదిగో సన్నిహితాంగుళీకలిత మా♦నీముష్టినిం జూడరా
భిదురంబో యన నీపయిం బడుచు ని♦ర్భేదించు ని న్నిప్పుడే
చెదరం బాఱకు మన్న నాతఁ డిటె ము♦ష్టిం జూడుమీ నీతలం
జిదియం గొట్టిన నొక్కపోటున నె యు♦క్షీణప్రతాపోన్నతిన్. ౪౦౫

చం. అనవుడుఁ గ్రుద్ధుఁ డై కదిసి ♦ యట్టె ప్రగాఢపుముష్టిఁ గొట్టినన్
దనువుసఁ గొండనంకవలెఁ ♦ దద్దయు నెత్తురు గాఱ సూర్యజుం
డును నొకసాలముం గొని క♦డున్వడి దిర్దిరఁ ద్రిప్పి మోఁదె నా
ఘనబలశాలి వాలి తను♦కంపము పెంపున విహ్వలింపఁగన్. ౪౦౬

కం. గురుభారసమాక్రాంతము, తరణి మహావాతనిహతిఁ ♦ దరలెడిమాడ్కిన్
హరిసుతగురుసాలహతిన్, హరిహయనందనుఁడు వణఁకె ♦ నతివికలుం డై. ౪౦౭

చం. అనిలసుపర్ణవేగులు మ♦హాబలశాలులు వాలిసూర్యజుల్
ఘనతరవర్ధమానదృఢ♦కాయు లజయ్యు లమిత్రమర్దనుల్
గొనకొని బీఱువోక వెఱ♦గూడక యోటమి లేక యంబరం
బున రవిచంద్రబింబముల♦పోల్పున నొప్పిరి యుద్ధధారిణిన్. ౪౦౮

కం. గురుబలవీర్యయుతుం డగు,హరిహయసుతుశౌర్య మంత♦కంతకు హెచ్చెన్
హరితనయుశౌర్యసారము, దరితరమ పటుత్వ మెడలి ♦ తఱుఁగం జొచ్చెన్. ౪౦౯

తే. పాకశాసనసుతుచేత ♦ భగ్నదర్పుఁ, డయ్యుఁ బరిధుతవిక్రముఁ ♦ డయ్యు రోష
మునను జెలరేఁగి లాఘవం♦బునను భాస్కరాత్మజుఁడు పోరుచుండె స♦నంతశక్తి.

కం. సామర్షణవేగిత ము,ష్టాముష్టిఁ గరాకరిన్ స♦సార తరువులన్
హేమాహేమీ లొప్పిరి, కామముగఁ బదాపదిన్ న♦ఖానఖిఁ దిరు లై. ౪౧౧

ఉ. ఒండొరులన్ వెసం గదిసి ♦ యుగ్రతఁ దాఁతురు సృక్కకోటిచే
నొండొరులం బడం దిగిచి ♦ యుగ్గని నొంతురు గాఢముష్టిచే

నొండొరులకా ముఖాముఖ స♦ముగ్ధతిఁ దాఁకుదు రిద్ధవీర్యులై
భండన మిట్లు వారలకు ♦ వర్తిలె వాసవవృత్రయుద్ధ మై. ౪౧౨
కం.బల మఱి క్రమక్రమంబుగ, బలరిపుసుతు చేత ఘాత♦పడి సుగ్రీవుం
డలసి పరికించు మఱి మఱి, సలుదిక్కులు నేలఁ జూచు ♦ సలిగులి యగుచున్. ౪౧౩

## రాముఁడు వాలిని నేలఁ గూల్చుట.

ఉ.। భూరితరార్తిఁ జొక్కు రవి♦పుత్రుని దుస్థితిఁ జూచి యుగ్రతే
జోరమణీయమూర్తి యరి♦సూదనదక్షుఁడు రామచంద్రుఁడుక్
ఘోరశరంబు వాలివధ♦కుం దగుదానిని దీసి నగార్భటం
కారము మీఱ వింటను స♦ఖండజవంబునఁ గూర్చె దక్షుఁడై. ౪౧౪
కం.ఆజ్యాతలఘోషణమున, దోర్జ్యాస్థలిఁ దిరుగు వనఖ♦గోత్కరమృగముల్
ప్రాజ్యభయాధీనములై, త్యాజ్యములగ నిజాయనాళి ♦ యవనిం గూలెన్. ౪౧౫
కం.దంభోళిభయదరవసం,రంభంబునఁ బిడుగు నా ని♦రస్తశరం బా
జంభారితనూభవభుజ,జృంభణ మడఁగంగ వక్షః♦సీమం నాటెన్. ౪౧౬.
కం.ఆశర మిటు నిజవక్షో, దేశంబున నాట రాక♦తిథి సమయందుకా
నాశితశక్రధ్వజ మనఁ,గా శతమఖసుతుఁడు గూలె ♦ గతసత్త్వుం డై. ౪౧౭
ఉ. ఘోరకుఠారధారఁ దెగఁ ♦ గూలినవృక్షము వట్లు వాలి త
త్క్రూరశరాహతిక్ నసుధఁ ♦ గూలుటయుక్ నడిఁ బెంచకట్టుగా,
ధారిణి తేజుఁ బాసెఁ గుము♦దప్రియహీననభంబుమాడ్కి; నా
వీరుఁడు నేల వ్రాలియును ♦ వీడఁడు తేజము విక్రమాసువుల్. ౪౧౮
కం.వాసవదత్తం బగుత,ద్భాసురమణిఖచితకనక♦దామవరము తే
జోఽసుపరాక్రమలక్ష్ములు, వాసవి నెమ్మేను నిలిపి ♦ భాసిలఁ జేసెన్. ౪౧౯
తే.మేలికాంచనమాలిక ♦ మేన వెలుఁగ, వాలివిక్రమశాలి యా♦వేళ వెలిఁగె
సంజకెంజాయ రంజిలు♦జలధరంబు,తోడ నీ డను నొప్పి యే♦జాడఁ జూడ. ౪౨౦
కం.భర్మాంచితమాలికతో, మర్మోద్ఘాటంబు సేయు♦మహితశరముతో
నిర్మల మగు దేహముతో, స్వర్మహిపసుతుండు మూఁడు♦వన్నెల నొప్పెన్. ౪౨౧
తే.వీరునకు వాలి కహితసం♦హారునకును, స్వర్గమార్గప్రభావన♦శాలి యైన
రామకార్ముకముక్తనా♦రాచవరము, పరమగతికారణం బయ్యెఁ ♦ బ్రధనమునను.
సీ. విగతార్చి యైనట్టి♦వీతిహోత్రుఁడువోలెఁ, గల్పాంతపతితభా♦స్కరుఁడువోలె
సుకృతంబు సమసిన ♦ సురలోకముననుండి, యవనిపైఁ బడినయ♦యాతివోలె
నామ హేంద్రునిమాడ్కి ♦ నతిదురాధర్షుని, శక్రునిఁబోలె న♦సహ్యబలుని
హరివిపులోరస్కు ♦ హరివిశాలాక్షుని, దీప్తవదను మహా♦దీర్ఘబాహుఁ

ఆ. దన్నుఁ గూల్చినట్టి ♦ దర్పితు మెచ్చుచు, నతనిఁ జూడఁ గోరి ♦ యల్ల నల్ల
దెసలు చూచు వాలి ♦ దృఢపరాక్రమకేలి, డాసె రామవిభుఁడు ♦ తమ్ముతోడ.

## వాలి రాముని దూషించుట.

కం. ఇటు తను డాసినరామునిఁ, బటుతరవిక్రము సుమిత్రా♦పట్టిం గని ప్ర
స్ఫుటధర్మయుతము మృదువును, గటువును నగురీతిఁ గీశ♦కాంతుఁడు పలికెన్. ౪౨౪
శా. రామా నీవు నరేంద్రపుత్త్రుఁడవు శా♦స్త్రజ్ఞానసంవేదివిన్
క్షేమశ్రీనిధివిం గులీనుఁడవు స♦త్తేజుండవుం గీర్తికిన్
ధామీభూతుఁడ విట్టివాఁడ వయి యు♦ద్ధక్షోణిలో నేను మా
ర్గోమ్మై యుండఁగ నన్నుఁ ద్రుంప గుణ మే♦మో దాని భాషింపుమా. ౪౨౫
కం. రాముఁడు కరుణాజ్ఞానో,ద్దాముఁడు జనహితరతుండు ♦ తతకారుణ్యశ్రీ
ధాముఁడు సముజ్జ్వలుఁడు నని, నీసుహితయశంబు భూత♦నికరము పొగడున్. ౪౨౬
చం. దమము శమంబు నోరిమియు ♦ ధర్మము ధైర్యము సత్యముం బరా
క్రమమును వెంచి దండన మప♦రాధులయందున యివ్వి రాఘవా
సముచితసద్గుణంబులుగ ర♦నాపతులం దని నేను నమ్మి జ
న్యమునకుఁ దారఁ బట్టనుమి ♦ నాపెఁగ వచ్చితి నిందుఁ జచ్చితిన్. ౪౨౭
ఉ. రాముఁడు సత్కులుండు గుణ♦రమ్యుఁడు నే నొరుతోడఁ బోరుచో
నే మని వచ్చు నాపయికి ♦ నే మని నన్వధియించు నంచు నే
నీమెయి నెంచి నీమొగ మె♦ట్టిదొ నేఁగనియుండమిం జుమీ
యీమెయిఁ బోరఁ డాసితిని ♦ నియ్యెడఁ బ్రాణము ధారవోసితిన్. ౪౨౮
ఉ. పచ్చిక కప్పి యున్న పెను♦బావిని బోలెడువాని, బూదిలోఁ
జిచ్చును బోలువాని. నృప♦శేఖరధర్మసువేషధారి పా
నచ్చుపుఁ బాపచారునిఁ, గ♦టా నిను మాయలమారి నంచు నే
నిచ్చఁ దలంప నైతి మతి♦హీనతచే నిటు లైతి రాఘవా. ౪౨౯
ఉ. నీమొగ మే నెఱుంగ, విను నీ ♦ కపకారము పట్నమందు నేన్
సీమను నేని యెప్పుడును ♦ జేసినవాఁడను గాను, గానలోఁ
గామము దీర నెయ్యెడయు ♦ కాయలుఁ గూరలు మెక్కుచుండు శా
ఖామృగ మేను, పస్తునునుఁ ♦ గాంచిన మే మొగుత్తఁ బోరఁగఁగన్. ౪౩౦
ఉ. రాజసదన్వయంబున ధ♦రన్ జనియించి యధీతవేదుఁ డ
తేజున మీఱి సందియము ♦ దీరఁగ నెల్ల నెఱింగి యున్నఁ డీ
యోజను ధర్మవేషమును ♦ నొప్పుగఁ దాల్చి యధర్మవృత్తుఁ డై
భూజనతాఽహితంబుగను ♦ బూనునొ క్రూరపుఁజర్య సల్పఁగన్. ౪౩౧

తే. రాజకులమునఁ బుట్టితి ♦ రాము నీవు, ధర్మవంతుండ వనుకీర్తిఁ ♦ దనరినాఁడ
విట్టిక్రూరచరిత్రుండ♦వేటి కయ్య, పెద్దమానిసివలెఁ బెంపు♦పెరుఁగఁదిరుగ. ౪౩౨
కం. సామము దానము శౌర్యో,ద్దామత సత్యంబు క్షమయు ♦ ధర్మము ధృతియున్
రామ యపరాధిదండము, భూమీధనగుణము లంద్రు ♦ బుద్ధిమదగ్ర్యుల్. ౪౩౩
కం. వనచరులము ఫలమూలము,లను దిని జీవించుమృగము♦లము మే మనఁగా
విను నీవో పురుషుండవు, మనుజవరుండవును బుద్ధి♦మాలితి వింకే. ౪౩౪
కం. ఇలయో పసిఁడియొ వెండియొ, కలహింపఁగఁ గారణములు♦గా? నాదు వనీ
ఫలమూలంబులపై నా,సలు గొంటివె? వాని కొఱకు ♦ చంపితి నన్నున్? ౪౩౫
కం. విను నయము దుర్వినయమును, ననుగ్రహము నిగ్రహంబు ♦ నను నివి వరుసన్
గన నగుఁజూ సజ్జనమ,ర్దనభూమీపతులయం ద♦సంకీర్ణము లై. ౪౩౬
ఉ. రాజులు స్వేచ్ఛ వచ్చినటు ♦ రాదు చరింపఁగ, ,నీవొ యింద్రియో
ద్వేజకవృత్తిఁ గామ మెది ♦ వేళను ముఖ్యముగాఁగఁ గోవి వై
రాజచరిత్రసంకరము ♦ గ్రాలఁగఁ జాపపరాయణుండ వై
యాజికిఁ గాలు ద్రవ్వి మరి♦యాదఁ దలంపవు ధర్మహీనతన్. ౪౩౭
తే. అర్థ మార్జించుటందు మ♦ర్యాద లేదు, శ్రేష్ఠ యను మాట లేదు ధ♦ర్మంబునందుఁ
గామవృత్తుండ వగుచు ని♦గ్రహము లేని,యింద్రియము లీడ్చినట్లెల్ల ♦ నేగ దీవు.
కం. అపరాధము చేయనినను, విపరీతగతిన్ వధించి ♦ వికటశరమునన్
నృపకుల ! యే మని చెప్పెదొ, యపవాదము వోవ సజ్జ♦నావళిసభలోన్. ౪౩౮
ఉ. చోరుఁడు ప్రాణిహింసకుఁడు ♦ సూచకుఁడున్ గురుతల్పగుండు భూ
మీరమణఘ్నుఁడుం బిసిని ♦ మిత్రధరామరులన్ వధించు నా
క్రూరుఁడు నాస్తికాధముఁడు ♦ గోఘ్నుఁడు నగ్రజుకంటె మున్నుగా
దారగ్రహించుతమ్ముఁడును ♦ దథ్యము నారకవాసు లింపటున్. ౪౪౦
కం. నినుఁబోల్ సుజనులు నాతో,లును గప్పరు తాఁక రెముక♦లును మాంసంబున్
దివరు మఱి వెంద్రుకల నే,వనికిం గొన రేల నన్నుఁ ♦ బరిమార్చితివో. ౪౪౧
తే. వినుకోఘలజంతువు♦లందు రాము! యాఘనయు నేదుఁబంది తాఁ♦బేలు నుడుము
చెవుపిల్లియు ననునివి ♦ యనునిసుపు, కషనిపతులకుఁ దగును భ♦క్ష్యంబు లగుచు.
కం. నాయెమ్ములు నాచర్మము, సోకుముగఁ బరిత్యజింతు ♦ రెందు మనీషుల్
నాయెఱచిఁ గుసుప రెవ్వరు,నాయ్యయమె నీ కిట్టిపంచ♦నఖముం జంపన్. ౪౪౩
తే. అకట సర్వజ్ఞ యగుతార ♦ యాసినట్టి
సత్యవాక్యంబు హిత మప♦థ్యంబు చేసి

తెలివి మాలుట వచ్చి తత్ఫలము నిదిగో
ననుభవించుము మున్నుఁడ నగ్గకులుఁడ.　　　　　౪౪౪

తే. నీవు నాథుఁడుగా నవనీతలంబు, పొలుచు చుండు ననాథగా భూపవర్య
క్రిందుఁ డగుధూర్తపతి దాపరించి నట్టి,పరమశుభశీలసంపన్న ప్రమదవోలె.

తే. నికృతిపరుఁడవు శఠుఁడవు నీచమతివి, దంభవిజితేంద్రియుండవు దశవిహీనుండా
పరమశీలుండు సుమహానుభావుఁ డతని,కడుపు చెడ నెట్లుపుట్టితి కతినశీల?

తే. ఛిన్నచారిత్రకక్ష్యంబు శీలవినుత, ధర్మమార్గాతివర్తియుఁ దక్షకధర్మ
సృణియు నగు రామహస్తిచేఁ జిక్కి నేఁడు, కాలుఁజూడంగ వలసె;నుత్కృష్టచరిత.

తే. పెద్ద తెల్ల ఛీ ఛీ యనఁ బెంపు దొలఁగు,నిట్టి యశుభ మయోగ్యంపుఁగృతినొనర్చి
యేమి మొగమున సుజనుల యెదుటఁ బడెద, వేమి యంచు నచించెద విట్టిపనికి.

కం. మగతనమును నెఱపితి కద, తగవులకుం దిగని యీయాయు దాసీసునిపైఁ
బగ గొన్నవిరోధు లయొకట, మగతన మది లేద యెట్టి నుగవాఁడ చొకో.　　　　　౪౪౯

కం. నాకంటె కెదుటఁ బడి నీ,వే కలహము చేసి యుంటివేనియుఁ ద్రుటిలోఁ
బోకలమారీ! నీకుం, జేకూర్చు నె దుంతకాతు చే గౌరవమున్.　　　　　౪౫౦

కం. కనుచా టగునీచే మృతిఁ, గనవలసె నేను శౌర్యకలితుఁడ నయ్యున్
దనివారఁ ద్రావి నిద్రించిన ద్రాగుడుపోతు పాము చేఁ జచ్చినటుల్.　　　　　౪౫౧

ఉ. నీకథ నా కొకింతయును నీ వెఱిఁగింపవు గాక మున్ను, నీ
వేకతనన్ దినేశసుతు నిష్టము సల్పఁగ న స్వధించితో
యాకపటాత్ము రావణుని నాజిని గొట్టి గళంబు కట్టి పె
న్వేకున నిందుఁ దేనె? పృథివీసుతఁ దోడ్కొని రానె ప్రొద్దుటలోనన్?　　　　　౪౫౨

కం. పాతాళంబున దాఁచిన, శ్వేతనయన్ సాగరమున ముఱుఁగుపఱిచినన్
శ్వేతాశ్వతరిం బూర్వము, శ్రీతురగగ్రీవునట్లు చెచ్చెరఁ దేనే.　　　　　౪౫౩

ఉ. ఏ విబుధాలయంబుఁ జన నెంతయు వస్తుఁపు రాజ్య మేల సు
గ్రీవుఁడు దాయ గాన నను మృత్యువుఁ గూర్చుట యొప్పుఁగాక నీ
వీనికటంపుఁగాథ్లని హింసేతుఁ జేసితి విట్టిసేఁత యో
త్తూనర! యుక్తకార్యమునఁగాఁ దగి దుర్గ, మశేర్ష మాటచేసు.　　　　　౪౫౪

కం. పుట్టినవారికి నెప్పుడో, గిట్టుట సహజంబ దానికిన్ నగిపను నీ
కట్టెఁడిచేఁతకు నుత్తర, మెట్టు వచించెదవొ చూడు మీ యుక్తి యెదేన్.　　　　　౪౫౫

కం అని నొరెండఁగ శరహతిఁ, దను వెల్లను నెరియ శాఘ తాళఁగ లేకన్
గనుఁగొనుచు రాము నూరక, వనచరపతి యుండె విగత వరతేజుండై.　　　　　౪౫౬

కం.నాపల్కుమాటలను, విను,మా పల్కెడ స్పష్టముగను ♦ మదిఁ గేవలముల్
గోపంబుచేతనే యభి,శాపంబులు పల్కి తిట్టఁ ♦ జనకుము నన్నున్. ౪౬౫

చం.నినుఁ బొరిగొన్న కారణము ♦ నే నచియించెద విన్న సన్ననా
తనవరధర్మముల్ విడిచి ♦ తమ్ముఁడు జీవముతోడ నుండె నా
యన యనుజునిభార్య నీస్నుష రు♦మాంగనఁ గూడితి వీవు కాముఁడై
త్తిని దురితంపుఁబద్ధతిని ♦ దీనిని గా నన దేని చెప్పుమా. ౪౬౬

కం.పోవిడిచి ధర్మమార్గముఁ, గేవలదుష్కామి నగు చుఁ ♦ గనలుచును స్వస్త్రీ
యావరజునినతిఁ బట్టుట, నీవిధి దండింప నలసె ♦ నియ్యెడ నిన్నున్ ౪౬౭

కం. ధర్మంబు విడిచి జనహిత,కర్మాచారంబులకును ♦ గడచ స్వగుచర్
నిర్మర్యాదం దిరిగెడి,దుర్మదునకు గండ మొకఁడె ♦ సిద్ధౌషధ మగున్. ౪౬౮

ఉ. పుట్టితి క్షత్త్రియుండ నయి ♦ గూరియశోనిధనాభిరాము న్నే
నెట్టనకీర్తిఁ గన్న యను వ♦నీపతివంశమునందు నట్టి నా
పట్టెని ధర్మమెంచ కతి♦పాపముఁ జేసిన కాముకున్ నిన్ని
న్నెట్టులు గూరిచి చూచి సహి♦యింతు శమింతును నీవ చెప్పుమా. ౪౬౯

కం.తనసుతతోఁ జెలియలితోఁ, దనతమ్మునిభార్యతోడఁ ♦ దగులుకుమతికిన్
వనచరవర! వధ యొక్కటె, వినియుకుతం బయ్యె దండ♦విధిశాస్త్రములన్. ౪౭౦

కం భరతుండను రాజు మేమో, ధరణీపునాదేశమునను ♦ ధర్మతరులమై
ధరఁ దిరిగి యరసి యుచితఫ,సరణిన్ శిక్షింతుము పూర్వజన♦సమ్మతిగాన్. ౪౭౧

కం దుర్జనశిక్షయు ధర్మో,పార్జనమును జేయు చుండు ♦ భరతుఁడు మేముల్
వర్తితతన్మార్గుల మై, కర్తంబు నుపేక్ష సేఁగ ♦ కార్యం బగునే? ౪౭౨

ఉ. పావనమైత్రి నామదికి ♦ వానరనాయక! లక్ష్మణుండు సు
గ్రీవుఁడు నొక్కరూప సుమి ♦ శ్రీమహి దారలు తక్కలంబు లౌ
నీవరశౌర్యశాలి ఘటి♦యింపఁగఁ జాలును నాకు మేలు, నే
నేవిధి నేమిహేతువున ♦ నీతనిసఖ్య ముపేక్ష సేయుదున్? ౪౭౩

కం.వనచరవర్యులసన్నిధిఁ, బొనరించితి నేను బ్రతినఁ ♦ బుణ్యానుపమునన్
ఘనబల! బాన యొనర్చియుఁ, జను నే నాయట్టివాఁడు ♦ చలియింపంగన్. ౪౭౪

సీ. నీవు పాలించున♦నీ శైలధారిణు, లైలావికు లైనమా ♦ నగును గాదె
దుష్టశిక్షణమును ♦ శిష్టరక్షణమును, బృథ్వీశునకు నెందు ♦ విధియె కాదె
యనుజునిభార్యాగ్ర♦హాములాదఁ గొని వానిఁ, గట్టుఁబ్రముతోడ ♦ నెట్ట లేదె
తమ్మునిభార్యను ♦ దగిలినవానికి, శిక్ష వధం బని ♦ చెప్పఁ బడదె

ఆ. యతనితోడ నేను ♦ నగ్నిసాక్షికముగఁ, జెలిమి సేసి హితము ♦ సేయుటకును
ప్రతిన సేయ లేదె ♦ పల్కి బొంకఁగఁ జన్న, యే యసత్యమిందు ♦ నెఱుఁగఁ జెపుమ.

కం. సన్నుతధర్మోపేతము, లిన్నిమహాకారణముల ♦ వనచరేంద్రా
నిన్ను వధించుటె ధర్మం, బన్నతిఁ దలపోయుమా మహాబలశాలీ! ౪౭౬

కం. ధర్మ మెఱింగిసమిత్రుఁడు, ధర్మచరిత్రునకు నెపుడుఁ ♦ దగు సాయపడన్
ధర్మజ్ఞుఁడె విది నీఖల,కర్మములకుఁ బౌచితంబు ♦ గాఁ దలఁపు మదిన్. ౪౭౭

కం. చారిత్రవత్సలంబులు, సూరిజనాంగీకృతములు ♦ సుజనాచరితో
దారము లగుమనుసూక్తులు, వీర! ప్రమాణములు నాకు ♦ వినుమా వాలిన్. ౪౭౮

రాముఁడు వాలికి ధర్మశాస్త్రవాక్యంబులు చెప్పుట.

కం. జనములు పాపముఁ జేసియు, జననాథులచేతఁ దాము ♦ శాసితు లగుచున్
ఘనసుకృతాత్ముల రీతిని, జనుచుందురు నాకవిభుని ♦ సదనంబునకున్. ౪౭౯

కం. చోరుఁడు చౌర్యముఁ జేసిన, భూరమణునిచేత శిక్షఁ ♦ బొందియె కాదే
నారఁ బ్రవిముక్తుఁ డగుచునో, వీరమణీ! పాపమునను ♦ విఘటంబడెడిన్. ౪౮౦

కం. దోసముఁ జేసినవారిని, శాసింపఁగ నేరనట్టి ♦ జనపతి తాఁ డా
దోసమును దాను బొందును, వాసవసుత ధర్మవిధము ♦ నచ్చొనె తెలియన్? ౪౮౧

కం. స్ఫీతయశుం డగుమాంధాతయు శ్రమణుం డొకండు ♦ ధర్మము చెడ నీ
రీతిని పాప మొనర్చిన, నాతని దండింపఁ డా భ ♦ యంకరలీలన్? ౪౮౨

ఉ. ఎన్నఁగ గోలుసంద వసు ♦ ధేశ్వరు లారయ లేక ధర్మముల్
మన్నిలి కొంద ఱుండియును ♦ న్యాయవిమర్శనవేళ నిండుజా
గ్రత్తు వహించి పాపజన ♦ కాండములం దగురీతి దండనం
బత్తఁగఁ జేసి పాపనిచ ♦ యంబు శమింపఁగఁ జేయరే కపీ. ౪౮౩

కం. కావునఁ బరితాప మందకు, మానిత మీవధము ధర్మ ♦ మార్గముఁ దొలఁపన్
దీనన్ మాకు స్వతంత్రత, వానరవర! లేదు శాస్త్ర ♦ బద్ధుల మగుటన్. ౪౮౪

చం. అదియును గాక యొండొకమ ♦ హత్తరహేతువు విన్ము దాన నీ
మది గలసందియంబు నతి ♦ మన్యువు పాయును నీ వెఱుంగమిన్
బదరుచుఁ గాఱులాడుట ల ♦ నంబును నామెపఁ గిన్కయేనియున్
గొదుకును గాని లేదు కపి ♦ కుంజర నమ్ముము నాదువాక్యముల్. ౪౮౫

సీ. వల పన్ని యుడులొడ్డి ♦ యది త్రవ్వి యోదంబు, లేర్పాటు గావించి ♦ యెన్నొయెన్ని
యేనివిధంబుల ♦ నెమ్మృగంబుల నైన, నెదు రుండి యేని మా ♦ టిడుచు నేని
భయపడి పఱచియున్నఁ ♦ బరువు వాఱుచు నున్న, సమ్మనిల్చియయున్న ♦ నిమ్ముగాను
మా స్వర్గంబున నున్న ♦ మాంసాభిలాషులు, మానవుల్ చంపుట ♦ గాన వొక్క

తే. పాప మయ్యెడఁ గలిగెనే ♦ పరమధర్మకోవిదులు వేఁట పో గ్రాక్రో ♦ క్రోఁతి నీవు
నేను క్షత్త్రియుఁడను గాన ♦ నీవు రణము, సలిపినను జల్ప కున్నను ♦ జంప వచ్చు.

ఉ. చాల వ్రణామయార్తునకు ♦ శస్త్రచికిత్సకునట్లు ధారిణీ
పాలుఁడు దుర్లభం బయిన ♦ బంధురధర్మము జీవరక్ష భ
ద్రాళియుఁ గూర్చు లోకులకు ♦ నారసి వా రదియెల్ల కుండిసన్
బాలన సేయఁగాఁ బ్రభువు ♦ పాఁపడి యుండుట వానరోత్తమా. ౪౮౭

ఉ. కావునఁ జంపరాదు క్షితి ♦ కాంతునిఁ, దిట్టఁగ రాదు, విప్రియం
బేవిధి నాడ రాదు, పరి ♦ హేలనముం బచరింప రాదు, త
ద్భూవిభుఁ డొండు చెప్పఁ బనిఁ ♦ బూని తిరస్కృతు లాడ రా, దిలన్
దేవతలే నరాకృతిని ♦ ద్రిమ్మరు చుందురు ధర్మరక్షకై. ౪౮౮

ఉ. కేవలరోష మూని పరి ♦ కింపక యింతయు ధర్మసూక్ష్మముల్
వావిరి నన్నుఁ దిట్టితివి ♦ నాల్కకు వచ్చినయట్లు క్రోఁతిరా
జా! విను తాతదండ్రులప్ర ♦ శస్తపుధర్మము వీడ నైతి, వా
తీవిరి పాయ నన్ను నిఁకఁ ♦ దిట్టెదె తిట్టుము మెచ్చు మెచ్చినన్. ౪౮౯

చం. అనుచును రామభద్రుఁ డిటు ♦ లాడినవాక్యము లాలకించి యా
వనచరవల్లభుండు నృప ♦ వల్లభుదోషము లేమిఁ జూచి తా
మనమునఁ జాలఁ గుందెఁ గొఱ ♦ మాలినకాఱులు ప్రేలితిం గదా
యనఘు నటంచు, ధర్మవిధి ♦ యందు సునిశ్చితుఁ డౌచు నిట్లనున్. ౪౯౦

వాలి రామునివాక్యంబుల సమాధానపడి తన్ను క్షమింప వేఁడుట.

శా. రామా! నీ విపు డాడినంతయు యథా ♦ ర్థం బయ్యె సందేహ మం
దేమాత్రంబును లేదు మాదృశులు నే ♦ హీనాళులే నిన్నుఁబోల్
ధీమత్పుణ్యుల మాఱు పల్కఁగను శ ♦ క్తిస్ఫీతు? లజ్ఞాని నై
యేమేమో యనినాఁడ మ్రొక్కెదను దం ♦ డ్రీ! నన్ను మన్నింపవే. ౪౯౧

ఉ. నీ వనఁ గేవలుండవె వి ♦ సీతుఁడవుం బరమార్థతత్త్వధీ
కోవిదతల్లజుండవు న ♦ కుంఠితకారణకార్యసిద్ధులన్
నీవరబుద్ధి యెప్పుడు సు ♦ నిశ్చయముం గదుసుప్రసన్నమున్
దేవర! నన్ను బోఁటులె మ ♦ తిన్ నినుఁ దప్పులు పట్ట నేర్పరుల్? ౪౯౨

కం. ధర్మముల నేమి చేయక, ధర్మములం జేసి యన్నా ♦ ధర్మేతరదు
ష్కర్ముఁడ నైతిని నన్నున్, శర్వ! ధర్మోక్తిఁ గరుణ ♦ శమియింపఁ గదే. ౪౯౩

ఉ. క్రుంగ నెడంద నే నిటులు ♦ కూలుటకుం, బ్రియదార తారకై
యంగద లేదు, బాంధవుల ♦ కై రవ యేనియు నంగలార్చ, హే

మాంగదు నాదుముద్దుసుతు ♦ నంగదు లోనఁ దలంచినంత నా
కుం గలదుఃఖపాటు రఘు♦కుంజర యే మని చెప్పఁ జాలుదున్. ౯౯౪

## వాలి యంగదుని రామునకు నప్పగించుట.

ఉ. ఒక్కఁడె నాకుఁ బుత్త్రుఁడు, గు♦ణోత్తముఁ డాతఁడు, నే న దెంతయో
మక్కువ లాలనంబులను ♦ మానుగఁ బెంచితి, నిప్పు డిట్లు నే
దిక్కఱి నేల వ్రాలఁ గని ♦ దీనతఁ బోయి తె తండ్రి యంచుఁ దా
స్రుక్కి నా వీతనీరసర♦సుంబలె నంచును దల్లడిల్లెడిన్ ౯౯౫

చం. మరగినవాఁడు నాచనపు ♦ మానఁ డొకప్పుడు నాదుపోషణ, నా
కరయఁగ నొక్కఁడే తనయుఁ ♦ డాతఁడు బాలుఁడు, దాఁకుడప్పుడున్
నెరవుగఁ దానుగా నెఱుఁగ♦నేరఁ, డిఁ కేగతిఁ బట్టి పోవునో,
ధరణిప నీవ దిక్కు, విను ♦ తల్లియుఁ దండ్రియు నీవ వానికిన్ ౯౯౬

కం. ఉంపుము సమానురాగం, బింపుగ నంగదునియందు ♦ నిపతనయునిపైఁ
బ్రెంపుము పాల న్మంపుము, పంపుము కార్యముల నిప ♦ పరమగుణాఢ్యా! ౯౯౭

కం. భరతునిపై లక్ష్మణుపైఁ, బరఁగించెదు నెట్టిప్రీతి ♦ భద్రగుణా! భా
స్కరసుతుపై నంగదుపైఁ, బరఁగింపఁగవయ్య యట్టి♦పరమప్రీతిన్. ౯౯౮

ఉ. భాసురశీల తార సుత♦పస్విని నాయొనరించినట్టి యా
దోసముచేతఁ దాను గృత♦దోషయ భానుజుపట్ల, దాని పై
యూసున భానునందనుఁడు ♦ హీనతఁ జూచుచు నానమానఁగా
నాసలిఁ జేయకుండఁగ ద♦యాపరతన్ నియమింపు మాతనిన్. ౯౯౯

ఉ. మీకు నణంగి క్రమ్మరుచు ♦ మీ హృదయంబు నెఱింగి కొల్చినన్
మీకరుణాబలంబునను ♦ మేదిని యేలుట చెప్ప నేల? యా
నాకపదంబు నైన సము♦పార్జన సేయఁగఁ జాలి యుండు, నో
శ్రీకర! పంకజాక్ష! యిగి ♦ సిద్ధము సత్యము నే నెఱుంగుదున్. ౬౦౦

చం. నలినదు పోకు పోకు మని ♦ వాగ్యుఁడు నాముఁ బటంనుఁ దాని దాఁ
బలుగటుపాటన్ వచించినను ♦ బాయక నీవలనన్ రఘూత్తమా
కలనను నాపె నాశ గొని ♦ కాఁట దివాకరసూతితోడ నేఁ
బెలుచన యుద్ధముం బిలవ ♦ వే చను ఖంచితి జానకీశ్వరా! ౬౦౧

కం. అని మెుక్కి యూర కుండిన, విని రఘుకులదీపకుండు ♦ విశ్రుతధర్మం
బున నెసఁగుసూక్తులను నా, వనచరనాయకుని శాంతి♦పఱుచుచుఁ బలుకున్.

↞ రాముఁడు వాలిని సమాధానపఱుచుట. ↠

సీ. వగవకు మయ్య యో♦వనచరాధీశ్వర!, యీవిషయంబున ♦ నించుకేని
మానిమిత్తంబుగ ♦ నైనఁ జింతింపకు, నాకును నై యేని ♦ యడల వలదు
నీ వకృత్యంబున ♦ నిష్ఠురంబౌటఁ బ్రా,యశ్చిత్త మేను జే♦యంగ వలసెఁ
గారణం బున్నను ♦ గార్యంబు గలుగును, గారణం బీవ య♦కార్యపరత
తే. నేను గార్యంబు నిన్ను దం♦డించుకతన, దండితుండయి దండ్యుండు ♦ దండనీతి
దండనము సేయునట్టి యా♦తండు నిరయ,పథమునను బోరు నిర్దర♦పలితనూజ.
ఉ. చేసితి వీ వకార్యమును ♦ జేసితి నేను సమస్తదండముల్
బాసితి వీవు పాపమును ♦ బాధవినిర్గలశుద్ధరూపముల్
భాసురభర్గపద్ధతిని ♦ బాయక పొందెద వింక దీని కా
యాసము నీను రోసమును ♦ నందకుమీ, విధి దాఁట శక్యమే. ౫౦౪
కం. అంగదునిఁగూర్చి నీమది, నంగద వహియింపఁ బోకు♦మా నీకొమరుం
డంగుగ నీ కట్టులొ యీ,భంగియ రవిజునకు నాకుఁ ♦ బరమప్రీతిన్. ౫౦౫
చం. అనవుడు ధర్మమార్గచరి♦తాగ్రణి రాముని నాదువాక్యముల్
విని మదిఁ గొంకుఁ బాసి హరి♦వీరుఁడు పల్కు మహానుభావ! త్వ
త్సునిశితమార్గణాగ్ని నను ♦ జూఁడుటఁ బల్వ దొఱంగి లిట్టిరిక్
సను క్షమియింపవయ్య రఘు♦నందన! యింద్రసమానవిక్రమా. ౫౦౬

↞ వాలిస్మృతి విని తార కిష్కింధ వెడలి వచ్చుట ↠

కం. అని ప్రత్యుత్తర మేమియు, నన లేక నృపునహేతు ♦ నగుసూక్తులకున్
వెను వగుమూర్ఛయుఁ గ్రమ్మఁగ, వనచరనాథుండు నేలఁ ♦ బడియుండె వ్యథన్.
కం. పెల్లుగశిలాప్రహతిఁ బడి, గ్లాను గడు నొచ్చి బాణ♦కీలితతనుఁ డై
త్రెళ్ళుట నడుగులపటిమయు, నల్లఁగఁ బడియుండె వాలి ♦ శరవేదనచేన్. ౫౦౭
సీ. అక్కడ రామబా♦ణాహతిఁ జనభర్త, వాలియుట విని సహా♦స్వర్గ యగుచుఁ
దార దుస్సహశోక♦భారంబునను భయ,వేగానఁ గిష్కింధ ♦ వెడలి వచ్చె
నంగదపరివార ♦ మగుకీశవర్గంబు, చాపపాణిని రామ♦చంద్రుఁ జూచి
బెదరి నల్దిక్కులు ♦ చెదరి పాఱుచు వేగ, హతయూథపంబు మృ♦గాళివోలె
తే. వారలను రామబాణాను♦బద్ధు లట్లు,పఱచువారలఁ గని తార ♦ పలికె నిట్లు
లన్నఁ జంపించెఁ బిన్న రా♦జ్యంబుకొఱకు, నేల మీ రీభయంబు హ♦రీంద్రులార!
కం. ఇన్నాళ్లు మీర లెల్లను, నన్నెలింపాధిసాధు♦నాథుజు నిత్యం
బు న్నెఱిఁబలసి భజంచియుఁ, జన్నయుపు ట్లను పఱచ ♦ నేలగుహాలకునన్. ౫౧౧

## వానరులు తారకు వాలిపాటు దెలుపుట.

చం.అను పతివాక్యముల్ విని వ♦నౌకసు లెల్ల సయుక్తికంబుగా
 నని రిటు జీవపుత్త్ర! యిటు ♦ లర్హముగా దరుదేరఁ, బొమ్ము, నీ
 తనయునిఁ గాచుకొ, మ్మకట ♦ దండధరుం డిటు రామరూపి యై
 వనచరనాథు దూరతల♦పాతిశరంబులఁ గూల్చె దేవెరీ! ౫౧౧

కం.గుండ్రాల నడిచి చెట్టులఁ, దీండ్రంబుగ మోఁది వాలి ♦ దేఁకువతోడన్
 గొండ్రిల్లుచుండ రాముఁడు, వేండ్రపుఁబవినిభశరములు ♦ వేయుచుఁ గూల్చెన్.

కం.వానరసన్నిభతేజుఁడు, వాసవి యటు గూలఁ జూచి ♦ వారనిభ్రశసం
 త్రాసమున నెల్లక్రోఁతులు, దూసిరి పురముఖముగాఁగఁ ♦ దొట్రిలఁబడుచున్.

కం.గవఁకుల నెల్లెడఁ గా పిడు, మవధానమునం జరింపు ♦ మంగదు సద్దై
 భవమున నభిషేకించిన, సవురుగ భజియించు నెల్ల♦శాఖామృగముల్. ౫౧౪

ఉ. ఓరుచిరాననా! యిచట ♦ నుండుట నీకు నభీష్ట మేని చే
 కూరుఁ బ్రమాద, మెట్లనినఁ ♦ గ్రోఁతులు భార్యలు లేనివారలున్
 దారలు గల్గియుం బరుల♦దారలఁ గోరెడివారు వచ్చి యీ
 యూరను నిండు వారు మును ♦ పూర్వపలింపఁగఁబడ్డవారితోన్. ౫౧౫

కం.వారికిని నూరివారికి, వారనికలహంబు లెప్పుడు ♦ వర్తిలు ననుచున్
 వారికిఁ దోఁచినగతి నను,వారికి నల్పాంతరగత♦వానరతతికిన్. ౫౧౬

తే. చారుహాసిని వచియించెఁ ♦ గారియంబు
 నరసి తనకును బ్రతిరూప ♦ మైనభంగి
 వాడువాటినమొగముతో ♦ వఱద కట్ట
 బాష్పములు చేలచెఱఁగునఁ ♦ బాపికొనుచు. ౫౧౭

ఉ. అక్కట యట్టిభర్త మహి♦తాత్ముఁడు వానరసింహమూర్తియే
 దక్కక నాకుఁ బోయె నఁట ♦ ధారిణిరాజ్య మిఁ కేల? నాకు నిం
 కెక్కడిపుత్త్రకుండు? తను ♦ వేటి? కివా నను నుద్ధరించెడిన్?
 జక్కఁగఁ బోయెదన్ నృపతి♦సాయకవిద్ధధవాంఘ్రిమూలమున్. ౫౧౮

## తార వాలిం జేరఁ బోవుట.

సీ. అని విలపించుచు ♦ హస్తతలంబున, మొగిఁ దల తల బొమ్ము ♦ మోఁదికొనుచుఁ
 జనుదెంచి దానవ♦సంహారిసమవర్తి, సమరానివర్తిని ♦ స్వరుసమూహ
 ముల వాసవుఁడు శైల♦ములఁబోలెఁ గొండల,మీటువానిని గాలి ♦ మీఱుజవముఁ
 గలవాని మేఘౌఘ♦కంఠారవమువాని, నమరనాయకవిక్ర♦మాభిరాము

తే. శూరపాతితు శూరుని ♦ వైరినినద, మఱచుభీమగళారవు ♦ నంత నంతఁ
జూచి సంధులు ప్రిదులంగ ♦ స్రుక్కిపడుచుఁ,జేరఁ జనుదెంచె వానర♦వీరుకడకు.

ఉ. ఓలిని వృష్టిపిష్టటను ♦ నొప్పుఱు మేఘముఁబోలువాని, శా
స్త్రాలము మాంసహేతువున ♦ రూక్షముఁగా వధియింప నేలపైఁ
గూలినసింహమో యనఁగఁ ♦ గూలినవానిని, నాగకారణ
వ్యాలవిరోధినిర్మథిత♦హారిసవేదిక చైత్యసన్నిభున్. ౫౨౦

కం. వాలి ననుత్తమచాపము, ప్రాలంబము గొనినరాము ♦ రామానుజు భూ
పాలురచెంగట నిలిచిన, వాలిసహోదరునిఁ గాంచె ♦ వరశుభమతియున్. ౫౨౧

ఉ. వారి నతిక్రమించి నిజ♦వల్లభుఁ జేరి శరైకవిద్ధుఁ డై
ధారిణిఁ గూలియున్నపతిఁ ♦ దన్వి గనుంగొని దుస్సహార్తిదు
ర్వారమునన్ ధరం బడి భ♦రం బగునిద్రను మేలుకొన్నయ
న్నారినిబోలె లేచి ప్రియ♦నాథ! మనోహర! యంచు నేడ్చుచున్. ౫౨౨

ఉ. దారుణమృత్యుపాశములఁ ♦ దద్దయు సందితుఁ డైనపెన్నిటన్
సారెకుఁ జూచి యేడ్చునది♦నన్ సుకుమారుఁ గుమారు నంగదున్
సారసమిత్రసూతి గని ♦ సైఁపఁగరానిమహార్తి దుఃఖకూ
పారమునందు మున్గెఁ బయి♦పై నరుదేరఁగ వేఁడిబాష్పముల్. ౫౨౩

→ తారావిలాపము. ←

ఉ. దారుణబాణతాడితు మ♦దద్విరదాభు మహేంద్రతుల్యునిన్
దార భృశార్తిభారపరి♦తప్తమనోంబుజయై హృదీశునిన్
జేరి కవుంగిటం బొదివి ♦ చెట్టు సమూలముగాఁగఁ ద్రెళ్లిన
ట్లారమణాంగయష్టిపయి ♦ హా యని వ్రాలె విలాపయుక్తయై. ౫౨౪

సీ. ఏపాటిరణముల ♦ నేపారునీ కిట్టి,పాటబ్బెనే నేఁడు ♦ ప్రాణనాథ
యనపరాధిని నేను ♦ హా యని పలవింప, బదులు మాటాడవే ♦ ప్రాణనాథ
నాదోష మే మొకో ♦ నాయకా! న న్నిట్లు, పాసి పోవఁగ నీకుఁ ♦ బ్రాణనాథ
యేమాత్రమైన నీ ♦ కెదు రాడి యెఱుఁగ నా,పాపమా కోపమా ♦ ప్రాణనాథ
తే. ప్లవగనాయక లే లెమ్ము ♦ పరమతల్ప,మందు శయనింపు, భూపతు ♦ లెందు నేని
కటికి తూలను బండుట ♦ గలిగె నొక్కొ, యెట్టు లే నోర్చుదాన నీ ♦ విట్టులున్న.

కం. ఎంత ప్రియ మొక్కొ ధరణీ,కాంతపయి న్నీకు ధరణి♦కాంతా! యిటు నేఁ
జెంతన యుండఁగఁ జచ్చియు, నింతయుఁ గవుఁగిలిని విడువ ♦ విది యర్హంబే ౫౨౬

కం. సురపురి తెరువున ధర్మ,స్థిరగతి! కిష్కింధఁబోలు ♦ శ్రీపురి నీకుం
దొరకెనొకో కా దేనియుఁ, బరమశుభాస్పదము దీనిఁ ♦ బాయఁగఁ దలఁ తే. ౫౨౭

సీ. ఇంక నెవ్వరిఁ గూడి ♦ యెలమి నైమి విహరింతు, నారామతలములఁ ♦ బ్రాణనాథ
మధుగంధిసుమముల ♦ మన్నించి నా కింక, నిచ్చువా రెవ్వరు ♦ హృదయనాథ
ప్రాణేశ్వరీ యని ♦ పరమసంప్రీతిని, బిలుతు రిం కెవ్వరు ♦ లలితరూప
యెప్పుడు వచ్చునా ♦ హృదయేశుఁ డని తమి, నెదు రెవ్వరికిఁ జూతు ♦ విదితయశుఁడ
ఆ. నాదునాశ లెల్ల ♦ నాశనం బయ్యెనే, సంతసంబు లెల్ల ♦ సమసె నయ్యొ
దేవ నిన్నుఁ బాసి ♦ దిక్కుటి గీన నై, మూలయింట నేను ♦ మూల్గ వలసె. ॥ ౨౮

సీ. *ముగిసెనా నేఁటితో ♦ జగిమీఱ సొగసార, నీతోడ విహరించు ♦ నీటు లెల్లఁ
దీఱెనా నేఁటితోఁ ♦ దియ్యనిముద్దుపంపుఁ, బలుకులు నీతోడఁ ♦ బలుకు టెల్లఁ
గ్రుంగెనా నేఁటితో ♦ రంగారు నీరూపు, భంగిఁ గై మదిలోనఁ ♦ బొంగు టెల్ల
సమసెనా నేఁటితో ♦ సరి నెలంతలచేత, నల నొప్పఁ గను గౌర ♦ వంబు లెల్ల
ఆ. నెవ్వరిడు నాకు ♦ సంతుల లో నని, పొగరు పెఱుదు నిట్టు ♦ లగు టెఱుంగ
నాదు గర్వ మణఁప ♦ నా నాథ నీ కిట్టి, పాటు గూర్చె నేమొ ♦ పాపబ్రహ్మ. ॥ ౨౯

సీ. *నా సుఖదుఃఖముల్ ♦ నా నాథ! తనవిగా, నెంచి పాలించెడ ♦ రెవ్వ రింక
మన్మనోగతములు ♦ మన సిచ్చి మెచ్చిక, నెవ్వనితో సచి ♦ యింతు నింక
నెవ్వరిఁ గనుఁగొని ♦ యెల్లవారును నన్ను, నిచ్చ మన్నించెద ♦ రింకమీఁద
నెవ్వని ప్రాపు నే ♦ నెన నొప్పు నిర్భయ, ప్రవృత్తిమై విహరింతు ♦ నింకమీఁద
ఆ. నెవనిసుఖముకొఱకు ♦ నెలమితో జీవింతు, నేసుసుఖముఁ గోరి ♦ యింక నుందు
నన్నొక యిన్నియూన ♦ లేవేవియో యుండె, నేఁటితోడ నెల్ల ♦ నేలఁ గలసె. ॥ ౩౦

కం నీయట్టివిభుఁడు నన్నుం, బాయుము నీగుణకలాపంబై ♦ బసి యుండెన్
చేయిటునుక తై పోదు, నా యీ హృదయం బిదెట్లు ♦ నాశము కాదో. ॥ ౩౧

కం. తమ్మునిఁ బురి వెడలంగాఁ, గొట్టి నిర్బంధించి వాని ♦ పొలఁతిని బలసం
తమ్ముగ నేలితి దాని ఫల, మ్మిట్టు గుడువంగ వలసె ♦ లాలితరూపా. ॥ ౩౨

కం. నీ మేలు గోరి పలుక, స్వామీ! హిత మాడలేద ♦ హీనుల నిడి తే?
వ్యామోహంబున నన్నే, ఛీ మాటాడకు మటంచుఁ ♦ జక్కొట్టితిగా. ॥ ౩౩

ఉ. మానితరూప! యౌవనస ♦ ముంచితదక్షుల దేవకాంతలన్
మానద! తావకీనలస ♦ మానసునోహరకాంతిఁ జేష్ట నవ్వ
ధీనలఁ జేసికొంచు సుమ ♦ తీ! తమి నేల వె? యిన్నినాళ్ళు నన్
వానరనాథ! యేలి తగ ♦ వా యిట నొంటిగ డించి పోవఁగన్. ॥ ౩౪

ఉ. వారణసత్త్వ పోకుడు ♦ వద్దని నే బతిమాలుచుండినన్
నా పలుకు నాదరంపక ♦ వాచము నాకోసయట్లుగ బలా

త్కారముగాఁగ నీడ్చినవి♦ధంబునఁ బోరికి వచ్చి నప్పుడే
యోరసి జీవితాంతకర ♦ మంచు నెఱింగితి నీకుఁ గాలమున్. ౫౩౫

ఉ. మానసమందు దుఃఖ మను♦మంటలు మండంగను, దైన్య మెట్టిదో
యేను దలంప నిందనుక ♦ నిట్టి దటంచును నీదు మున్నరన్,
దీనత నెల్లకాల మిఁకఁ ♦ గీఱనిదుఃఖముచేఁ గృశించుచున్
వానరనాథ! యెల్లి విధ♦వాత్వము దిక్కఱి నే సహించెదన్. ౫౩౬

ఉ. రార కుమార! నీజనకు ♦ రమ్యగుణాకరు నిగ్గనిక్కఁగ
న్నారఁగఁ జూచరా యిపుడె ♦ హా యిదె మానఁ గడంపరి, యింక నీ
కోరినయేని నీదుజన♦కుం గనుభాగ్యము లేదు తన్న, నీ
వేరిని నాయనా యనుచు ♦ నింకను బిల్చెదవొరా కుమారకా. ౫౩౭

ఉ. చూడుము వీఁడె యంగదుఁడు ♦ సుందరశైలాగ్రణి! సౌఖ్య మెన్నఁడున్
వీడినవాఁడుకాఁ డట్టి♦వేళల గోముచుఁ బెంచఁ దగ్గె, వా
వోఁడెడి నీదుముద్ద, యయ♦యో కడుఁగోపిని బిన్నతండ్రి, నే
జాడను గొల్చువాఁడొ, కపి♦సత్తము! యేగతిఁ బట్టి పోవునో? ౫౩౮

చం. అని పతిమీఁద వ్రాలి ప్లవ♦గాధిప! యూరకుండె నీసుతుండు నీ
కను లొకయింత విచ్చి కనఁ♦గాఁ దగదే? యిటు లేల యేడ్వ నా
యన! యని తేర్ప రాదె? శిర ♦ మూఁకట మూర్కొన రాదె? దూరముం
జనియెద వొక్కమాట కడ♦సారికిఁ జెప్పఁగ రాదె బుద్ధిగన్. ౫౩౯

చం. కటకట నిన్నుఁ జంపి ఘన♦కార్యము చేసెను రామభద్రుఁ, డి
చ్చట దిననాథసూతియెడఁ ♦ జల్పినబాసను దీర్చి యప్పు ప్ర,
స్ఫుటముగ నీఁగె; సూర్యసుత! ♦ సూడు దొలంగఁగ నన్నుఁ జంపి తిం
కిట రుమతోడ రాజ్యరమ ♦ యేలుము నీతి తొలంగి పోయినన్. ౫౪౦

కం. వల్లభ యిదె నీపెక్కురు,వల్లభ లిట నేడ్చువారు ♦ వల్లభ యనుచున్
బల్లెత్తి మాట యొక్కటి, సల్లాపింపంగ రాదె ♦ చతురమనీషా! ౫౪౧

చం. అనవుడు వానరీచయము ♦ లంగదుఁ దెచ్చి హృదిం గూర్చి యి
ట్లనియెఁ గపీంద్ర! ముద్దుసుతు ♦ నంగదునిన్ గుణసన్నికృష్టుఁ జ
య్యన విడనాడి పోవఁ దగు♦నా పరదేశము నివ్వ పోవుచో
వనచరనాథ! నీకు నిది ♦ ధర్మ్యము గాదు తలంచి చూడుమా. ౫౪౨

సీ. వీర! పుత్రుని నన్ను ♦ విడిచి దీర్ఘప్రవాసంబు పోవఁగ నీకుఁ ♦ జన్నె చెప్పుము
యటు పోవఁ దప్పేమి ♦ యాచరించితి మొక్కొ, నేనైన సుతుఁడైన ♦ నిర్మలాత్మ

నేఁ బ్రమాదంబున ♦ నేరంబె చేసిన, క్షమియింపవే నన్నుఁ ♦ జారుశీల
నీచరణంబుల ♦ నేని డెప్పాలెదఁ, గరుణింపవే నన్నుఁ ♦ గపివతంస
తే. యనుచుఁ గరుణంబుగాఁ దక్క ♦ వనచరీస
యంబుతోఁ దార యేడ్చుచు ♦ నటమటించి
పరమనుతశీల తనప్రాణ ♦ భర్తదాపు
నంద ప్రాయోపవేశంబు ♦ నందఁ దలఁచె. ౫౪౩

## హనుమంతుఁడు తార నూరార్చుట.

కం. తారాపథమును బాయుచుఁ, దార ధరాస్థలిని రాలు ♦ తద్విధమున నా
తారాధిపతుల్యాసన, తార ధరన్ వ్రాల హనుమ ♦ తరుణికి ననియెన్. ౫౪౪
ఉ. మానిని యేల యేడ్చెదవు ♦ మానుము, దేహి కెఱింగి యేని య
జ్ఞానముచేత నే నతఁడు ♦ సల్పినకర్మమె హేతుభూత మై
మానక మేలుగీళ్లను స ♦ మంచితరీతిని నాతిరిక్త మ
న్యూనముగాఁగఁ గూర్పఁ జను ♦ నొక్కట నాపరలోకసీమకున్. ౫౪౫
చం. మగువరొ నీటిబుగ్గకు స ♦ మానము దేహము లెల్లవారికిన్
వగవఁగ నీకు నీవ తగు ♦ పద్ధతి, యన్యుల కేల యేడ్చెదో?
తగఁ గడుదీన వీ వితరు ♦ దైన్యము కై యనుకంప మందెదే?
జగమున నెవ్వఁ డెవ్వనికిఁ ♦ జారుమతీ! పలవింపఁ జెల్లెడిన్? ౫౪౬
ఉ. బాలకుఁ డంగదుండు పరి ♦ పాలకురాలవు నీవ వానికిన్,
బాలిక జీవపుత్రకవు ♦ భావిశుభార్థము లెల్లఁ గూర్పఁగాఁ
జాలుదు వింతమాత్రమును ♦ స్వాంతమునం దలపోఁత మాని యి
ట్లేల శరీరమున్ విడువ ♦ నెంచెదు? దుఃఖము తెల్విఁ బాపెనే? ౫౪౭
ఉ. భూతలమందు భూతములు ♦ పుట్టుట గిట్టుట రెం డనిత్యముల్
పూతమనీషిణీ! యెఱుఁగ ♦ వో, యిటు గావున నౌర్ధ్వదైహికం
బై తగు సచ్ఛుభంబులనె ♦ యర్థము సేయఁగ, నైహికక్రియా
జాతము సేయ రాదు పర ♦ సౌఖ్యముఁ గూర్పఁగ నెంచువారికిన్. ౫౪౮
చం. హరివరకోటి నేలెను స ♦ హస్రములం బ్రయుతార్బుదంబులం
బరమమతిన్ స్వకీయులను ♦ మన్చెను బెక్కువిధాల, ధర్మత
త్పరుఁ డయి శాస్త్రదృష్టశుభ ♦ తత్త్వవిధిజ్ఞత సామదానశాం
తిరతిఁ జెలంగి వీడెను క్షి ♦ తిం గపినాథుఁడు దుఃఖ మేటికిన్. ౫౪౯
కం. అంగదునకుఁ గపిభల్లుక, పుంగవులకుఁ గిశరాజ్య ♦ మునకున్ నీ వో
యంగన! దిక్కఁక నీపై, సంగతిగా నిలిచినదియ ♦ సకలభరంబున్. ౫౫౦

కం.మానుము శోకము మెల్లగ, మానిని! నీసాయమునను ♦ మానితగతి నీ
సూనుఁడు రాజ్యము సేయ మ,హానందము నందఁ గలుగు ♦ నడలకు మిట్లన్.
కం.ఏమినిమిత్తము సంతతి, భూమిపయిం గనఁగఁ గోరుఁ ♦ బురుషుఁడు నేఁడో
భామా! యది ఘటియిల్లెను, భూమిపునకుఁ జేయుఁగాక ♦ పుత్త్రుఁడు క్రియలన్.
కం.తీరిచి కపిపతికిని సం,స్కారము సుతు రాజ్యమునను ♦ స్థాపించి వెతఁ
దూరంబుఁ జేసె దనవుడుఁ, దార హనూమంతునకును ♦ దా నిట్లనియెన్. ౫౫౩

→ తార హనుమంతునకుఁ బ్రత్యుత్తర మిచ్చుట. ←

కం.వినుమీ యంగదసన్నిభ,తనయశతముకంటెఁ శౌర్య♦తనుఁడై సమరా
వనిఁ ద్రెళ్లిననావల్లభు,తనువు కవుఁగిలింత వరము ♦ తథ్యము కీశా! ౫౫౪
ఉ. ఎవ్వతె నయ్య నేను బ్లవ♦గేశ్వరుసంస్కరణంబు దీర్పఁగా?
నెవ్వతె నయ్య నంగదుఁ గ♦పీశ్వరరాజ్యమునందు నిల్పఁగా?
నవ్విధు లెల్లఁ దీర్పఁగ స♦మర్థుఁడు చూ...సతంత్రి యింక, నే
రవ్వయి నాకు నేమిటికిఁ ♦ బ్రాణధవుం డరుగంగ స్వర్గమున్. ౫౫౫
తే. అంగదునివిషయంబున ...నేను!
యేను యోజింపఁ దగి... లేదు
కొడుకునకుఁ దండ్రియే ...బంధు
వరయ జనయిత్రి గా... ...రినతంస. ౫౫౬
కం.పరమునసే నిహమునసే ...సంశ్రయముకంటెఁ ♦ నత్యుత్తమముఁ
బరికింప లేదు నే నిఁక, ప ...ముఖనిహతుశయ్య ♦ నగుఁ బండ నసన్.

→ { వాలి సుగ్రీవుతోఁ దాను జేసినయపకారము ...అవు మని చెప్పుట. } ←

కం.అంతట గుట్టునుఱునఁ ...కాంతుఁడు శ్వాసంబు మెల్ల♦గాఁ బుచుచ్చుఁ దాఁ
జెంతను గని నంగదుఁ దను,పాంతంబునఁ బ్రాప్తవిజయు ♦ నర్కాత్మభవున్.
సీ. కని స్పష్టమైనవా♦క్యాన స్నేహపూర్వంబు,గా నిట్టు లను దివా♦కరతనూజు
సుగ్రీవ! నీపయి ♦ సూడు చాటితి నని, యనఘ దూషింపకు ♦ మయ్య నన్ను
భావిఫలం బట్లు ♦ పట్టి యీడిచి బలా,త్కారంబుగను దెల్పె ♦ తలఁగఁ జేసె
మనయిద్దఱము నొక్క♦మాటుగా సౌభ్రాత్ర,మునఁ గూడి సుఖయింప♦మొనయదయ్యెఁ
తే. దమ్ముఁడా! దైవకృత మది ♦ దప్పఁ జేయ, మనకు శక్యమె నే నింక ♦ మనఁగఁ జాల
నీవనేచరరాజ్యంబు ♦ నెలమి నీవు, కొమ్ము పాలించుచుండుమీ ♦ నిమ్మళముగ.
కం.జీవితమును రాజ్యంబును, శ్రీవైభవముఁ ధరిత్రి ♦ త్రిజగద్వినుతం
బై వఱలినసత్కీర్తియుఁ, బో విడి చనువాఁడ నుగుణ♦భూషణ దివికిన్. ౫౬౦

## వాలి సుగ్రీవునకు నంగదు నప్పగించుట.

గీ. గనస్థయందు నెది ♦ యేనియు దుష్కర మేను జెప్పినన్
స్త్రీవు సేయఁ దగు ♦ ప్లవగవర! కంటివె బాలుఁ బ్రాజ్ఞునిన్
గామ్యచయ♦సూషితవస్తుని సౌఖ్యపాత్రు స
మ్మోడముః నే నెపుడు ♦ ముద్దుగఁ బెంచిన చిన్ని బాలకున్. ౫౬౧
తే. అంగదుని నాఁ న్ను నా♦ప్రాణములకు, మిన్న యగువాని నన్న! నీ కన్నకొడుకు
నట్లు సాఁకఁ గ సమ్మస్తసకల, దాతవును భ్రాత వీవె నా♦తనయునకును.
చం. భయపడునట్టిచోట ♦ బాపుము వానికి, విక్రమంబునన్
రయగతి నీకుఁ దుల్యుఁ రంబున రాక్షసపాళిఁ ద్రుంప దు
ర్జయుఁ డయి నీదుముంగట గ్రాలుఁ జుమీ, యనురూపకర్మసం
చయములు వీఁడు సల్పు, రణ ముఁడు జంకఁ డొకించు కేనియున్. ౫౬౩
సీ. అనఘు సుషేణుని♦తనయ యీ తా, తత్త్వార్థనిశ్చయ నిష్ఠి♦తాత్మ సుమ్ము
ఔత్పాతికజ్ఞాన♦మందుఁ బండితురాల మిని నే ని ♦ పలికినట్టి
పని యవశ్యము సల్పు♦వలయును గొంకక టికి నీ♦యింతి చెప్పి
నట్టిదేదియుఁ దప్పు ♦ దయ్యె యిం కొక్క టిప. దిఁ ♦ బదిలపఱుపు
తే. రాముకార్య మవశ్యక♦ర్తవ్య మె పుడు, శంకయొ ము లేక ♦ సలుపు మీవు
చేయకుంట యధర్మంబుఁ♦జే తనుటియు, నవమన్న తనుచుని♦న్న పుడ చంపు
ఉ. నే మరణించి సంతట న♦నేచరవల్లభ! శ్రీదొఱం
దామము దివ్య మిద్ద యిది ♦ దాల్చి వధింపుము శత్రులన్
శ్రీమహితం బుదార మయి ♦ చెల్వగు కాంచనమ యిద్ది, నా
నామహిరాత్మజుండును గ్ర♦హార్దితచంద్రుఁ డువోలె సఁ డై. ౫౬౫
కం. తనయగ్రజువచనంబుల, ఘనతరశాంతింబుఁ దాల్చి ♦ కాంచనమాలన్
గొనియెను నన్యస్తుం డై, తనుజాతునిఁ జూచి వాలి ♦ తగ నిటు పల్కెన్. ౫౬౬

## వాలి యంగదునకు నీతి దెల్పుట.

తే. దేశకాలంబు లెఱిఁగి వ♦ర్తింపు కొడుక, క్షమ వహించి ప్రియాప్రియ♦సంగతులన
సౌఖ్యదుఃఖంబులోర్చి తత్♦తత్సమయములను,వలనుమీఱఁ గ సుగ్రీవు♦వశుఁడవగుము
కం. నాపట్ల నీవు చనవుం, జూపుచు వర్తించి నట్లు ♦ సుగ్రీవు నెడం
జూపి చరించిన నానలెఁ, జేపట్టుచు లాలనంబు ♦ సేయఁ డు నిన్నున్. ౫౬౮
కం. ఈతనియహితులతోడను, నీతనిశాత్రవులమిత్ర♦బృందము తోడన్
రీతిచెడి మైత్రి సేయకు, మీతనికార్యములు సేయు ♦ మెం తయు దాంతిన్. ౫౬౯

కం. చేయకుము యతిస్నేహము, చేయకు మస్నేహ మెపుడు ♦ చెడు గీరెండుగా
బాయక యెన జాగరూకత, నాయన! మధ్యస్థపథము♦నగా వర్తిలుమా. ౫౭౦

↞ వాలి మరణించుట. ↠

కం. అని చెప్పి గ్రుడ్లు గిరగిర, మని త్రిప్పుచు తీవ్రబాణ♦హాతిఁ బీడితుఁడై
గనఁబడ భీకరరదములు, ననచలోరకేశుఁ డెపుడు ♦ ప్రాణము విడిచెన్. ౫౭౧
తే. అగచరసమూహ మెల్ల ♦ హా యనుచు నేడ్చెఁ
జూడఁ గిష్కింధ గన్పట్టె ♦ శూన్య మగుచుఁ
బర్వతోద్యానగహనముల్ ♦ భాతి దప్పి
పాడు పడినట్లు దోఁచెఁ ద♦త్ప్రభువు పోన. ౫౭౨
సీ. ఎవనివేగంబున ♦ నెడలి కాననములఁ, బుష్పౌఘసంబంధ♦భూరుహములు
వెనువెంటఁ జనుదెంచు ♦ ఘనుఁ డట్లు చేయంగఁ, జాలుఁ గాఁ డెవఁడింక ♦ సత్త్వగరిమ
గోలభగంధర్వ♦కుంజరులతోడ నొక్క, పదునేనువర్షముల్ ♦ పగలు రేయి
యనక యుద్ధము చేసి ♦ యవినీతు పోషెడ, వర్షంబునను నేల♦పాలు చేసి
ఆ. మాకు నెల్ల దిగులు ♦ మాన్చి రక్షించె, నట్టివీరుఁ డేఁడి ♦ యకట యిపుడు
చూడలేముగాదె ♦ శూరకులాగ్రణి, నింక నొక్కసారి♦యేని యనుచు. ౫౭౩
కం. గోపతి యీల్గిన గోవులు, ప్రాపతి హర్యక్షకలిత♦భయదాటవిలో
నేపతినవిధము దోఁపఁగ, వాపోయిరి క్రోఁతు లెల్ల ♦ వనచరపతికిన్. ౫౭౪
కం. మృతపతివదనముఁ జూచుచు, వితతవ్యసనాబ్ధి మునిఁగి ♦ విలపించుచుఁ ద
త్పతిఁ గ్రుచ్చి పడియెఁ దారయు, హతవృక్షముతోడ వ్రాలు♦నాశ్రితలతనాన్.

↞ వాలిమరణంబునకుఁ దార యేడ్చుట. ↠

కం ఇటు వ్రాలి వాలిముఖమునఁ, గుటిలాలక ముఖముఁ జేర్చి ♦ కుమిలపడుచుఁ దా
నిటు లను నానుడి విన కీ, కటికిశిలల మేను చేర్పఁ ♦ గలిగెనె నాథా! ౫౭౬
కం. నీ కెంతటిప్రియురాలో, నా కంటెను భూమిదేవి ♦ వనచర దానిక్
నాకనుల యెదుర నాల్గీ, పాకలనం దేర్చి మాట♦లాడవు నాతోన్. ౫౭౭
తే. ఆర్య! సుగ్రీవునకు మయ్య ♦ సౌర విధియు, వీని సహసికప్రియ ♦ పృథ్వియందు
శూరవరుఁ డన నాసూర్య♦సుతుఁ డెగాక, బలియు రెవ్వరు నినుఁ దాఁకి♦ బ్రదికినారు.
కం. వానరగోలాంగూలవి, తానము నీ నంగదుంఁ ♦ గన్దయు నేడ్వన్
వీనుల నిడ వేటికి మా, దీనాలాపంబు లిదియుఁ ♦ దెలియఁగ నీకున్. ౫౭౯
తే. మున్ను నీచేతఁ బగ తెందు ♦ మన్ని గొనిరొ, యట్టి దగువీరశయనంబు♦నంద నీవు
యుద్ధసత్ప్రియ! కూలితే ♦ శుద్ధవంశ్య, నాథ! యెం జేగితివి న న్ను♦నాథఁ జేసి. ౫౮౦

కం. మూరు లగువారు కన్యల, శూరుల కొనఁగంగ రాదు ♦ చూచితివె మహా
శూరునిభార్యను నేఁగతి, వారక హత నైతి నింద్య♦వైధవ్యమునన్. ౪౮౧

ఉ. మానము న్యూన మయ్యెఁ, బర♦మం బగుసద్గతి రిత్త యయ్యె, నెం
తేని నగాధదుఃఖజల♦ధిం బరిమగ్నగ నైతి, రాయి యే
మో నిజ మీమనంబు, యిటు ♦ మోహనగాత్రుఁడు భర్త చావఁగాఁ
గానఁగఁ గల్గియుం జెడదు ♦ ఖండము లై శతధావిభిన్నమై. ౪౮౨

కం. నానెయ్యుఁడు నాదైవము, నానాథుఁడు నాహితుండు ♦ నావల్లభుఁడున్
నానిధి యేకచరాగ్రణి, హా నన్ను ననాథఁ జేసి ♦ నాకం బరిగెన్. ౪౮౩

ఆ. తనయు లెంద ఱున్న ♦ ధాన్యసంపదలున్న, ధనము పూర్ణముగను ♦ దనరియున్న
మగఁడు లేనియట్టి♦మగువను గని జనుల్, విధవ యండ్రుగాదె ♦ వెలితిదోఁప.

కం. ఆరుద్రపురుగుడాలున, భారుచిరం బైనమృదువు♦పాన్పునఁబోలెన్
నీరుధిరమండలంబున, వీరవరా! నీవు పండ ♦ విధి యేర్పడెనే. ౪౮౫

కం. నెత్తురులు గాఱఁ బైపయి, మెత్తినగతి దుమ్ము గ్రమ్మ ♦ మెఱుఁగు చెడిన నీ
మెత్తనియొత్తను వెటువలె, నిత్తఱి నేఁ గౌఁగిలింతు ♦ వృక్షచరేంద్రా! ౪౮౬

కం. ధన్యుఁడు పో సుగ్రీవుఁ డ,నన్యవిదిత మైనవైర ♦ మారాఘవరా
జన్యునియొందుశరంబున, శూన్యముఁ గావించుకొనియె ♦ సువిహితభంగిన్. ౪౮౭

కం. తనువుఁ దూఱంగిననిన్నుం, గనుఁగొను టొక్కండెగాక ♦ గాఢంబుగ ఱొ
మ్మున నాటినశరముకతన,మ్మునఁ గౌఁగిటఁ జేర్ప వలను♦మొనయద యయ్యో. ౪౮౮

చం. అని యిటు తార యేడ్వఁ గుధ♦రాంతరకందరలీనసర్పభం
గిని సురరాజపుత్రతను♦కీలితబాణముఁ బాప నీలుఁడున్
ఘనశర మప్పు డస్తగిరి♦నాయకకూటనిరుద్ధుఁ డైనయూ
దినకరు వీడి వచ్చుభుజ♦తేజ మనన్ మహితారుణద్యుతిన్. ౪౮౯

తే. ఆసనాటప్రకాండ దేహంబునుండి, వెల్లువలు వాఱె నెత్తురుల్ ♦ కొల్లలుగను
బర్వతాగ్రంబునందుండి ♦ పాఱుచున్న, తామ్రగైరికసంపృక్త♦ధార లనఁగ. ౪౯౦

కం. శరహతి ధరణిం గూలిన, తరుచరపతి ప్రాణనాథు♦తనువునధూళిన్
దరుణీమణి నయనోదక,ఝరిచే మార్జనము చేసె ♦ సర్వాంగములన్. ౪౯౧

తే. అంగదునిఁ జేరఁదీసి యా♦యబల యనియెఁ, గంటివే పుత్ర నీతండ్రిఁ♦గన్నులారఁ
బాపకర్మంబుచే నైన♦వైరమెల్ల, నేఁటితో మేనితోఁ బాసె ♦ నేలఁ గూలి ౪౯౨

చం. ఇదె కడసారిరా కొడుక ♦ యిప్పుడె తండ్రికి నీవు మ్రొక్కు మీ
యుదయదివాకరాభతనుఁ ♦ డొక్కఁడ కాలునివీటి కేగు నా

వదలనిభక్తి నాతఁడును ♦ వాలిపదంబుల వ్రాలి తండ్రి! యం
గదుఁడను నేను మ్రొక్కెదను ♦ గైకొనవే యని మ్రొక్కెఁ, దారయున్. ౫౬౩
ఉ. నాయక! చూడ వేల? ప్రియ♦నందనుఁ డీగతి నీకు మ్రొక్క దీ
ర్ఘాయువు గమ్ము పుత్రక య♦టంచును దీవన లాడ వేల? నా
థా! యిటు నేనుఁ బుత్త్రుఁడు మృ♦గాధిపహింసిత మైనగోపతిక్
బాయఁగ లేనిధేనువు సు♦వత్సము నా నడలంగఁ గానవో. ౫౬౪
తే. చటులసంగ్రామయజ్ఞంబు ♦ సలిపి నీవు, జానకీనాథనాయక♦జలములందు
నవభృథస్నాన మర్థిమై ♦ నాచరింప, బత్ని నగునన్ను విడనాడి ♦ ప్రాణనాథ!
కం. ఏదీ రణమున నీకై, మోదించి బలాసురారి ♦ మున్నిచ్చినయా
గాదిలిపసిండిహారము, లేదే నీయురమునందు ♦ లీల రహింపన్. ౫౬౬
కం. అస్తంగతుఁ డగుసూర్యు ప్ర, శస్తమహాశోభ రత్న♦సానువు విడ దా
సిస్తున రాజ్యశ్రీ నిను, నస్తమితుఁగా విడువ దయ్యె ♦ నేఁ గ్రాగేశా. ౫౬౭
మత్తకోకిలము. అక్కటా హిత మెంత చెప్పిన ♦ నాలకింపకపోయి తే
నొక్కిచెప్పియు నడ్డగింప ని♦నుం బసమర్థను గానుగా
దిక్కుమాలిన దానసైతిని ♦ దేవ! నే సుతుతోడ, న
న్నొక్కటం గా నినుఁ గూడి వల్లభ ♦ యుజ్జగించెను లక్ష్మియున్ ౫౬౮

సుగ్రీవుఁడు వాలికై దుఃఖించుట.

ఉ. అంగదుతోడ నిట్లు కడు ♦ సంగర నంగన నంగలార్చ నా
భంగి గతానుఁ జూచుఁ దన♦భ్రాత ధరాస్థలి యున్న రీతి నా
రం గని సూర్యనందనుఁడు ♦ గ్రమ్మెడు బాష్పజలంబుతోడ సం
తం గడుఁగూరె నింతకును ♦ దాన కదా కత మంచు నెంచుచున్. ౫౬౯
ఉ. ఆసతిమోముఁ జూచి హృద♦యంబు కలంగిన మెల్ల మెల్లగా
వాసరనాథనందనుఁడు ♦ భానురసర్పసమాన బాణబా
ణాసనపాణి రాముని ని♦జాశ్రితసంయుతుఁ జూచు దీర్ఘని
శ్వాసము నించు మంగదియ ♦ వచ్చి రఘూత్తముఁ గాంచి యిట్లనున్. ౬౦౦
మత్తకోకిలము. ఈవు పల్కినబాస దీరె న♦రేంద్రచంద్రను గూరపి
ద్వావిభుత్వము నాకు నబ్బెను ♦ గాని రాజ్యసుఖంబులం
జీవితంబునఁ గల్గునాశ న♦శించె నన్ను క్షమింపుమా
భూవరా! మన నొల్ల నింకిటఁ ♦ బోదు నన్నకుఁ దోడుగన్. ౬౦౧
సీ. మాయన్న దేవేరి ♦ మహితశోకంబును, బురమునవారల♦పొక్కుచంద
మంతటివాఁడు మా♦యన్న నాకారణంబున బ్రాణములువాసి ♦ భూమిఁ బడుట

బాలుఁ డంగదుఁడును ♦ బ్రతుకునొ బ్రదుకఁడో,యనుసందియంబిన్ని ♦ యరసిచూడ
రాఘవా నామది ♦ రాజ్యభోగములందు,నాస చేయదు చూ య ♦ థార్థముగను
తే. రోషమునఁ గ్రోధమునఁ నతి ♦ రూక్షవిప్ర
ధర్మమున నగ్రజునిమృతి ♦ ధరణినాథ
మున్ను నాకు నభీష్ట మై ♦ మొనసెఁ గాని
యిపుడు దుస్సహతాపంబు ♦ హెచ్చె మదిని. ౬౦౨

మత్తకోకిలము. అన్నఁ జంపి సురాధిపత్యము ♦ నైనఁ బొందఁగఁ గోర ము
న్నున్నయట్టులు ఋశ్యమూకత ♦ టోర్వి నుందు స్వసృత్తిమై
నిన్నుఁ జంప యత్నేచ్ఛ మేగుము ♦ నీవ టన్న మహాత్ముప
ల్కన్నెఱిం దగునట్టివానికిఁ ♦ గ్రౌర్య మిట్టిది నా కగున్. ౬౦౩

ఉ. సోదరుఁ డన్నఁ గేవలుఁడె ♦ సూరవశంస మనుష్యుండు వ్యా
పాదితుఁ జేసినాఁడ నటు ♦ నంటిమహాత్ముని; రాజ్యలాభస
మ్మోదము భ్రాతృనిర్మథన ♦ ముం బచరింపఁగఁ గల్గుదుర్లఘు మిం
కేది ఘనంబొ యంచు గణి ♦ యింపను గామపురస్కృతుండ నై. ౬౦౪

ఉ. చంపఁగ నొల్లఁ డయ్యె నను ♦ సంగరభూమిని శక్తిగల్గి తాఁ
బెంపును శోగ్యయుం దలఁచి ♦ బీరము గల్గినవాఁడు గాన, నేఁ
డెంపరి నై దురాత్మతను ♦ ద్రెళ్లఁగఁ జేసితి నీతిరీతిఁ జిం
తింపక యట్టివానిని న్య ♦ తిక్రమ మొార్చితి బాలిశుండ నై. ౬౦౫

చం. బలితపుఁ జెట్టుకొమ్మ నను ♦ బాఁదిన నేలను వ్రాలి మూర్త మే
విలవిల తన్నుకొం చపుడు ♦ వీరుఁడు న న్గని యూఱడించుచుః
జెలువకు మింక నిట్టు లని ♦ సాంత్వనవాక్యము లాడి ఫుచ్చె, నా
యలఘుగుణాన్వితుం గినిసి ♦ యంతకుఁ జేర్చితి నింద కోర్చితిన్. ౬౦౬

తే. భ్రాతృభావంబు మఱి యార్య ♦ భావ మధిక,ధర్మమును రక్షితంబు లీ ♦ ధన్యు చేతఁ
గ్రోధమునుగామమును మఱి ♦ క్రోఁతిగుణము, దృష్టమయ్యెను నాయందు ♦ శిష్టవర్య

సీ. అతుల మచింతనీ ♦ యంబును బరివర్జ,నీయంబు స్వవవేక్ష ♦ ణీయ మయి య
నీప్సనీయం బైన ♦ నిస్తుల పాపంబు, విశ్వరూపునిఁ జంపి ♦ వృత్రునెరి
యొడిగట్టుకొన్న య ♦ వ్వజ్రపున భ్రాత నర్జించి నే నిట్టు లా ♦ ర్జించినాఁడ
నింద్రునియఘము మ ♦ హీజలద్రుమవని,తలు పంచికొనిరయ్య ♦ తమకుఁ దార

తే. క్రోఁతికిల్బిషమును బంచు ♦ కొను నెవండు, పాపశీలుఁడ నీచుఁడఁ ♦ బరమగర్హి
తుంత లోకాపకారకా ♦ ర్యుండ; వాన, నీళ్లు పల్లంబునకు నేగి ♦ నిలుచు నట్లు ౬౦౭

ఉ. ఘోరతరార్తి ముంచె నను ♦ గోవిద వర్య; యధర్మసంయుతం
బారఁగ వంశనాశకర ♦ మా నకృతంబు ఘటించి పౌరస

త్కారము యౌవరాజ్యమును • గైకొన నర్హుఁడఁ గా నటన్నచో
గౌరవయుక్త రాజ్యరమ • కా తగువాఁడను ధర్మతత్పరా? ౬౦౯
తే. భ్రాతృవధపాలమును దాప • భరశిరోవి,పాణహస్తాత్తులును నగు • చటులకల్మ
షేభ మిటు సంప్రస్పృష్టమై • యేటిగట్టుఁ,బోలె ననుఁ గూల్చు చున్నది • పుణ్యచరిత!
తే స్వర్ణమును జక్కఁ గ్రాఁచ వి • వర్ణ మగుచు,ననటువిడనాడుఁభంగినా • మదిని గలుగు
సాధుస్నత్త్మి మీపాపసం • సర్గమునకు, రోయుచు నివర్త మయ్యెఁ బూ • రుషవరేణ్య!
తే. మత్కృతం బైనఘోరక • ల్మషముకతన, దుస్సహం బైనయంగదు • దుఃఖమునకు
వీరవరు లైనకానన • చారు లెల్ల, సగముప్రాణాన నున్నారు • చారుశీల. ౬౧౨
కం. కలుగరె సుతు లందఱకును, గలఁడే సుజనుండు సుమతి • కడునశ్యం డై
యిల నంగదుఁ బోల్తనయుఁడు, కలదే సోదరునిఁ గూర్పఁ • గలదేశంబున్. ౬౧౩
కం బ్రదికినచోఁ దారేయుఁడు, బ్రదుకును దారయును • వానిపరిపాలనకై
బ్రదుకనిచోఁ దనతనయుఁడు, బ్రదుకదు తారయును నిక్క • వం బది రామా!
తే. అన్నతోఁ బుత్రుతో నెయ్య • మలరుపొంకు, దీపితాగ్నుల విడిచెద • దేహ మేను
వీరె యున్నారు వానర • వీరు లెల్ల, సీత రోయఁగఁ దద్వార్తఁ • జెప్ప నీకు. ౬౧౪
ఉ. నే మరణింప నీవుపని • నిల్వఁగఁ బోవదు నే నెఱుంగుదుర్
రామ వలంతి పీవు సుక • రంబుగ సర్వముఁ జక్కఁ జేసికో
నే మని వంశనాశకుఁడ • నీమెయిఁ బ్రాణములన్ భరింతు? న
య్యో మహితాగసుండను ర • ఘూత్తమ నాకు ననుజ్ఞ యీయవే. ౬౧౫
తే. అనుచుఁ బల్కుకపీశువా • క్యముల వినుచు
శత్రుమర్దనచణరామ • చంద్రుఁ డపుడు
కన్నులను బాష్పపూరముల్ • కాఱుచుండ
నార్తుఁ డయ్యె ముహూర్త మ • య్యనఘుఁ డట్లు. ౬౧౭

రాముఁడు తార నూఱార్పఁ బోవుట.

చం. క్షమ క్షమఁబోలువాఁడు త్రిజ • గత్పరిరక్షణకర్త రాముఁ డా
సమయమునం గనం జనియె • నారెకుఁ ద న్గనుదాని శోకసం
భ్రమపరిమగ్నఁ దారను స • మాశ్వసనేచ్ఛను మంత్రిముఖ్యులున్
విమలవిలోచనం గదిసి • వేర్పడఁ జేసిరి వాలినిన్ సతిన్. ౬౧౮
కం. ఆపద్మదళవిలోచన, యాపద్మదళాయతాక్షు • నాఖిలమహా
చాపశరపాణి మార్తండోపమసహజప్రభాస • ముజ్జ్వలగాత్రున్. ౬౧౯
తే. సాధువర్తను రాజల • క్షణసమేతుఁ, బురుషసత్తముని నదృష్ట • పూర్వుఁ జూచి
చారుశీలవతీమణి • స్వాంతమందు, నితఁడ యీరామభద్రుఁ డం • చెంచికొనుచు

కం. హరిహాయతుల్యు దురాసదుఁ, బరమ మహాత్మకుని రామ♦భద్రుని డాయన్
దరుణి వ్యసనాభిపీడిత, పరివిహ్వల యగుచుఁ జనియెఁ♦బరమజవమునన్. ౬౨౧
తే. మేటిగుఱికాని రాముని♦ మెలఁత మిన్న, శోకసంభ్రాంతభావ వి♦శుద్ధసత్త్వ
దృఢమనస్విని గనుఁగొని♦ యిట్టు లనియె, భర్తృవధజాతపరితాప♦భరము పేర్మి.

తార దన్నుఁ జంపు మని రాముని జూచి ప్రలాపించుట.

సీ. అప్రమేయుఁడవు దు♦రాసదుండవు నీవు, విజితేంద్రియుఁడవును♦ విశ్రుతైక
ఘనధార్మికుఁడవు స♦క్షయ్యకీర్తివిని వి,చక్షణుఁడవు క్షమ♦ క్షమకు సాటి
క్షతజోపమాక్షుండ♦ వతులబాణాసన,బాణపాణివి మహా♦బలుఁడ వనఘ
యుత్తమసంహన♦నోపేతుఁడవు మర్త్య,విగ్రహాభ్యుదయము♦ విడిచి దివ్య
తే. విగ్రహాభ్యుదయంబున♦ వెలసె దీవు
పతిని జంపిన యాయొంటి♦బాణమున నె
నన్నుఁ ద్రుంపుము రామ! నా♦నాథుఁ గందు
వాలి సుఖియింపఁ డయ్యన♦ న్వదలి యొందు. ౬౨౩
ఉ. ఆర్యవరేణ్య యాసరసి♦జాక్షుఁడు నాకమునం దలంక్రియా
కార్యవిచక్షణల్ కుసుమ♦కాంచవిరాజితశేఖరల్ మహా
వార్యగతిన్ భజించినను♦ వ్రాలఁడు హాయిగ నన్నుఁ గానమిన్
భార్యను భర్తనుం గలుపు♦భవ్యయశంబునఁ బొంగ దే నృపా. ౬౨౪
ఉ. నాకమునన్ వసించియును♦ నాపతి న న్నెడఁబాసి యుండుటన్
శోకము విన్నఁబాటు గొని♦ స్రుక్కు మ నుండు నిజంబు దేవ నీ
వేకరణిన్ మనోహరవ♦గేంద్రతటంబున సీతఁ బాసి య
స్తోకము గుందితో యటులె♦ చూడుము యన్యుల కైనవేదనల్. ౬౨౫
ఉ. ప్రాయపుఁబూరుషుండు తన♦ప్రాణసఖిం బెడఁబాయఁ గల్గునా
యాయత మైనదుఃఖభర♦ మంతయు నీవు నెఱుంగుదే కదా
యీయెడ వాలి న న్విడిచి♦ యెంత తపించెడి నొక్కొ రాఘవా!
శ్రేయము తచ్ఛరంబున నె♦ వేగమ నేఁ జని కాంతు వల్లభున్. ౬౨౬
ఉ స్త్రీవధ పాతకం బనుచుఁ♦ జింతిలఁ బోకు మహానుభావ! నే
నావిభునాత్మ నన్నమతి♦ నన్ వధియింపు దయార్ద్రబుద్ధివై
నావిభుఁ జంపినట్లు, రఘు♦నాయక! వేదము శాస్త్రసంఘముల్
వావిరి నొక్కయు భర్తకును♦ భార్యయ యాత్మ యటంచుఁ జూడుమా. ౬౨౭
ఉ. కూరిమి భార్య భర్తకును♦ గూరిచి దానము సేఁతకన్న లే
దారయ యొండుదాన మని♦ యందురు జ్ఞానులు, నన్ను నాప్రియున్

గూరిచి తేని ధర్మ మెవఁ ♦ గూర్చిచి పుణ్యాను యబ్బు, నన్ను సం
హారము చేసినట్టియఘ ♦ మంటదు నిన్ను నృపాలకాగ్రణీ!　　　　౬౨౭

ఉ. దిక్కెద లేనిదాన, సతి♦దీనను, భర్తయుఁ బాసిపోయె, నీ
వొక్క శరంబు పైపడిచి ♦ యూపిరిఁ బాపుము, నీకు బ్రొక్కెదన్,
దిక్కరితుల్యగామి వర♦ధీరుఁడుఁ గాంచనమాలి వాలి నే
నక్కట వీడి నిల్వఁ గల♦నా చిరకాలము జీవయుక్తనై.　　　　౬౨౯

రాముఁడు తార నాశ్వాసించుట.

కం. అని పనవులారఁ గనుఁగొని, యనియె రఘూత్తముఁడు దుఃఖ ♦ మాఱఁగ నిట్టుల్
చను నె విధవపుపతి నీ, కనఘాత్మక! వీరభార్య♦నై సహించుంపన్.　　　　౬౩౦

తే. నిఖిలజగములు ధాతచే ♦ నిర్మితములు, తరుణి! సుఖదుఃఖ యోగముల్♦ధాత చేతఁ
గలుగుచుండును గాన దుః♦ఖంబు సుఖము, బ్రహ్మ చేసినయది యని♦పలుకు జనము.

ఉ. ధాత వధించినట్టులు గ♦దా సకలంబును వర్తిలున్, వశం
బే తరుణీ! విధాతృకృతి ♦ నింతయు మీఱఁగ, వీరపత్ని లీ
రీతిని దుఃఖ మందుదురె ♦ ప్రీతి వహించెదు యౌవరాజ్యను
స్పీతునిఁ బుత్త్రుఁ గాంచి యనఁ ♦ జెల్వ సువేష దొఱంగె దుఃఖమున్.　　　　౬౩౨

కం. హారు మని యేడ్చునంగదుఁ, దారను సుగ్రీవుఁ గాంచి ♦ తత్సమశోకుం
బౌరఘుపతి లక్ష్మణుతో, వారల నూరార్చి నాంత్వ♦నచనంబుల చేన్.　　　　౬౩౩

కం చచ్చినవారికి నేడ్చిన, నచ్చు నె నిశ్చయసంబు ♦ వారికిఁ జెపుఁడా?
యిచ్చ ననంతరకార్యముఁ, గ్రచ్చఱ పలుపంగఁ దలఁపఁ ♦ గార్యము గాదే.　　　　౬౩౪

కం చాలును లోకముతోపా, టీలీలను బ్రేతమునకు ♦ నేడ్చుట నేమూఁ
గాలంబు మీఱి యూపలఁ, జాలుదు రెద్దాని మీఱు ♦ పలుపఁగఁ జెపుఁడా.　　　　౬౩౫

కం నియతియె లోకనిదానము, నియతి క్రియాసాధనంబు ♦ నిక్కము చుండీ
నియతియె భూతావళులను, నియమింపఁగఁ గారణము ప♦రిచరులారా!　　　　౬౩౬

ఉ. ఒక్కఁడు దేనినేఁ జేలుప ♦ నోపఁడు కర్తగఁ, జేయఁ గార్యముల్
జక్కఁగ నెవ్వఁ డేనియును ♦ జాలఁడు చూ పెరరేప నెవ్వనిన్
నిక్కముపో స్వభావమున ♦ నిత్యము లోకము వర్తిలుం జుఁడీ
తక్కక, తత్స్వభావము స♦తంబును గాలపరాయణం బగున్.　　　　౬౩౭

కం. కాలము దాఁటదు కాలముఁ, గాలమున కపక్షయంబు ♦ గలుగదు చుండీ
కాలము స్వభావమున నే, క్రాలెడి స్వనియమము సద్ది ♦ కడనద యెపుడున్.　　　　౬౩౮

కం. కాలం బెఱుఁగదు చుట్టముఁ, గాలమునకుఁ గారణంబు ♦ గలుగదు కడిమిన్
గాలము చిక్కదు మిత్త్రులు, కాలమునకు లెదు పశము ♦ గా దాత్మలకున.　　　　౬౩౯

తే. కాలపరిణామమునఁ గల్గు ♦ గార్యజాత
మనుచు మతిమంతుఁ డుండఁగ ♦ నర్హ మెపుడు
ధర్మ మర్థంబు కామంబు ♦ తనకుఁ దాన
కలుగుఁ గాలక్రమంబునఁ ♦ దొలఁగ దెట్లు. ౬౮౦

తే. అట్లు కావున వాలి ము ♦ న్నాచరించి,నట్టిధర్మార్థకామఫ♦లాళిఁ జెంద
నరిగె నిట నుండి నాకంబు ♦ నతుల మైన,తనదుపరిశుద్ధధామంబుఁ ♦ గనుచు నిట్లు.

కం.తనధర్మగుణముబలిమిని, మును విజితం బైనస్వర్గ♦మును గైకొనఁగాఁ
జనె డాఁపక ప్రాణంబులఁ, జనునే యిటువంటిశౌర్య♦శాలికి వగవన్. ౬౮౧

కం ఈపౌరుషైకధనియుం, బ్రాపించె ననుత్తమంపుఁ♦బద మిఁక నేలా
తాపంబునఁ బడ మీరలు, వే పూనుఁడు కాలయోగ్య♦విధికృత్యములన్. ౬౮౩

లక్ష్మణుఁడు సుగ్రీవునితో వాలి సంస్కరింపఁ బ్రయత్నింపఁ జెప్పుట.

కం.రామవిభుఁ డిట్టు లాడఁగ, సౌమిత్రియు దుఃఖభార♦జలధినిమగ్నుం
డౌమిహిరతనయుఁ గని హిత, సామోక్తుల నిట్టు లనియె ♦ సమయార్హముగన్.

సీ. తే లెమ్ము సుగ్రీవ ♦ వాలికి నిఁకఁ బ్రేత, కార్యంబుఁ దీర్పఁగఁ ♦ గడఁగరాదె
తారాంగదులఁ గూడి ♦ దహనకార్యముఁ దీర్పు, మెందుగందపుఁజెక్క♦లిందుఁ దేర
నాజ్ఞ సేయుము చూడు♦మంగదుం డెట్టులు, దీనుఁ డైయున్నాఁడొ ♦ తేర్పు మతని
వస్త్రమాల్యంబులు ♦ వలసినఘృతతైల,గంధముల్ దేర సం♦గదునిఁ బంపు

తే. నగర మెల్లను నీయధీ♦నంబు సుమ్ము, విమువుమా బాలిశత్వంబు ♦ వీరవర్య
తారుఁడా లెమ్ము శిబికను ♦ త్వరితముగను,త్వరగయు మేలందురిటువంటి♦తరుణమందు.

కం.జత కూర్పుము నహానార్హుల, ద్రుతగతిని సమర్థు లైన♦తోరపుబలులఁ
వెత మూను మనుచు వానర,పతితో వచియించి రాము♦పజ్జకుఁ జనియెన్. ౬౮౬

సీ. అంతఁ దారుఁడు సుమి♦త్రాత్మజు నాజ్ఞ సం,భ్రాంతుఁ డై గుహఁజొచ్చి♦పటుజవమున
భద్రాసనయుతంబు ♦ పక్షికర్మాంచితం, బగకర్మభూషితం ♦ బమలచిత్ర
పత్తిసమేతంబు ♦ వరజాలవాతాయ,నాన్వితంబును జిత్ర♦హారగతము
విశ్వకర్మకృతంబు ♦ విమలసిద్ధవిమాన,సన్నిభంబును దారు♦శైలసంయు

తే. తంబు కృత్రిమకందరి♦తంబు రక్త,చందనవిలిప్తమును బుష్ప♦బృందపద్మ
హారసంఛన్నమును నుద♦యార్కవర్ణ,మైనశిబికను గొనివచ్చి ♦ యందు నిలిపి.

తే. దానిఁ గనుఁగొని రాముండు ♦ తమ్ముఁ జూచి, యిట్టు లను వేగ వాలిని ♦ నిందుఁ నుంపఁ
బనుపుమీ ప్రేతకార్యంబు ♦ పరఁగ వేగ, మాచరింపుమ యన, దాని ♦ నాలకించి.

కం.వాలినదుఃఖంబున నిల, వ్రాలుచు నంగదుఁడు దివస♦రాజసుతుండుఁ
వాలిని శిబికను జేర్చి సు,మాలిని వస్త్రములు నగల ♦ నర్పించి వెసన్. ౬౮౯

ఉ. ఇందు సమస్తదానములు ♦ నిస్తమణీవసనాదు లాదిగాఁ
బొందు వనేచరుల్ శిబిక♦పూర్వ మతుల్యసమృద్ధభూమిభృ
ద్వందము లౌర్ధ్వదైహిక ము♦దారత సల్పెడిరీతి లోటు లే
కుండ నొనర్పుఁ డంచుఁ బ్లవ♦గోత్తముఁ డానతి యిచ్చె నంతటన్. ౬౫౦

కం. తారుఁడు లోనగువారు కు,మారకు నంగదునిఁ జుట్టి ♦ మహితాక్రోశో
దారరవంబుల నేగి ర,పారవ్యథ వాలి శిబిక♦పజ్జను గుములై. ౬౫౧

కం. తారాసతి మొదలుగఁగల,నారులు వీరా యటన్న ♦ నాదంబులతో
సారెకు నాక్రోశించుచు, న్వారాట్సుతుశిబికపజ్జఁ ♦ జనిరి మహోగ్రిన్. ౬౫౨

తే. వానరీనాదములచేత ♦ వనులు గిరులు
మాఱుమ్రోయుచు నవి యేడ్చు♦మాడ్కి నుండె
నిర్జనం బగునొకయేటి♦నీటియొడ్డు
నందుఁ జితిఁ జేర్చి రినుక న♦నాటు లపుడు. ౬౫౩

తే. వాహకులు డించి యచ్చట♦వాలిశవము,జరగిరేకాంతమున కార్తి♦భగితు లగుచుఁ
దార శిబికాశయితుఁ గపి♦వీరు డాసి, యంకమునఁ బతిశిర ముంచి ♦ యడలె నిట్లు.

— శిబికయం దున్నవాలిఁ జూచి తార యేడ్చుట. —

సీ. హా వానరేంద్ర! మ♦హారాజ! హృదయేశ! హా మహాశూర! మ♦హార్హ దేవ!
నన్ను మన్నించు నా♦మన్నన యే మాయెఁ, గన్నెత్తి నన్నేల ♦ కాన విపుడు
ఇందఱు నీకయి ♦ వందురుచున్నారు, గూడవే వారల ♦ సుందరాంగ
విగతాసు వయ్యును ♦ వీర నీ నెమ్మోము, కళకళ లాడుచుఁ ♦ గాంతి దేఱెఁ

ఆ. గ్రుంకుచున్న సూర్య♦కోమరారుకాంతిని, బ్రదికి యున్న వాని♦పగిది గాఁగ
నొప్పుచున్న దయ్యొ ♦ యెప్పుడు చూతునో, కపికులేంద్ర నిన్నుఁ ♦ గఱవు దీఱ.

కం. అరణ్యతలమునం దొక,నారాచముచేత నీదు♦నారులకును ము
త్తారాణఁ దొలఁచి కాలుం,డే రామాకృతిని గొంచు ♦ నేగెడు నిన్నున్. ౬౫౬

కం. నీకు సదా వల్లభ లై, నీకూర్మికిఁ బాత్ర లైన♦నీప్రియుగాం త్ర
యో! కాలినడన దవ్వుగ, నీకడ కరుదెంచు టెఱుఁగ♦నేర వ దేలా. ౬౫౭

సీ. ఈరాజముఖు లెల్ల ♦ నీరమణులె కదా, పలుకరింప వదేల ♦ వానరేంద్ర
నీతమ్ముఁ డదె యేల ♦ నెనరూరఁ బలుకవు, పోలు నే నీకిది ♦ పురుషవర్య
వీరె మహారాజ! ♦ తారుఁడు లోనగు,సచివులు మంత్రంబు ♦ సలుప రాదె
పురజనుల్ వీరె నిను♦బోరిఁ జుట్టి యున్నారు, సెల విమ్ము తగురీతి ♦ లలితరూప
తే. వీర లందఱు పోయిన ♦ వేడ్క మీఱ, మనము చెలరేగి యుత్కట♦మదనవృత్తి
రమ్యవనసీమలను విహా♦రంబు సలుపు,చుంద మోనాథ! యేల నీ♦ వూరకుండ.

### అంగదుఁడు వాలిని సంస్కరించుట.

కం. అనుచు విలపించు తారను, వనజాక్షులు పట్టి ♦ లేవ వనరుచు సుగ్రీ
వునితోడ నంగదుండును, దనజనకుని జేను జేర్చి ♦ తగ వగురీతిన్ ౬౫౯
కం. చిరముగఁ బ్రవాసి యగుచును, బరలోకం బేగుకీశ ♦ పరివృఢున కిడెన్
గరుణముగ నేడ్చు చగ్నిని, హరినుతుఁడు ప్రదక్షిణించె ♦ నపసవ్యముగన్. ౬౬౦
తే. శక్రతనయుని నీరీతి ♦ సంస్కరించి, విధిహితంబుగ నుదకముల్ ♦ విడుచుకొఱకు
శీతజల మైనశుభనదిఁ ♦ జేరి భానుపుత్ర, తారలు నంగద ♦ పూర్వకముగ ౬౬౧
కం. వాలికి నుదకంబుల నిడి, రీలిఁ సమాసశోకుఁ ♦ డిక్ష్వాకుజుఁడున్
హేళిజుతోఁ బ్రేతక్రియ, లోలిన్ జరిపించెఁ జెత్త ♦ ముత్తలపడఁగన్. ౬౬౨
కం. విగ్రహమునఁ గూలిసటన, యగ్రజునకు దహనకార్య ♦ మంతయుఁ దీరన్
వ్యగ్రమునస్కంధ ప్లవ యూ, యుగ్రాంశుసుతుండు రాము ♦ నొద్దకు వచ్చెన్. ౬౬౩

### హనుమంతుఁడు రాముని సుగ్రీవునకుఁ బట్టాభిషేకం బొసర్ప వేఁడుట.

కం. క్లిన్నాంశుకు బహుదుఃఖవి, పన్నున్ సుగ్రీవు సచివ ♦ పటలి భజించెన్
బన్నుగ నిందఱు గొల్వఁగఁ, జెన్నారెన్ సూర్యుఁడు మునుల ♦ చే బ్రహ్మవలెన్. ౬౬౪
ఉ. అంతటఁ గాంచనాద్రినిభుఁ ♦ డంచిత బాలదివాకరాననుం
డెంతయు భక్తి కేలు మొగిచి ♦ యిట్లను మారుతి రామచంద్రుతోఁ
జింతలు దీఱె యీప్లవగ ♦ శేఖరుఁ డెట్లును జెందరానిభూ
కాంతత నొందె నీకరుణ ♦ కల్గిని రాఘువవంశపుంగవా! ౬౬౫
కం. నీ వనుమతించినను సుగ్రీవుఁడు కిష్కింధఁ జేరి ♦ కీశావళితోఁ
గావించును గార్యంబులు, దేవా! సుస్నాతుఁ డగుచు ♦ దివ్యౌషధులన్. ౬౬౬
ఉ. హారిమణీపరీమళసు ♦ మాదుల మీర రట కేగుదెంచినన్
నారపుభక్తిఁ బూజలను ♦ సల్పు, నచే గుహ రందు పోవ నుం
దీరు కృతాభిషేకునిఁగ ♦ నీతనిఁ జేసి కపీంద్రకోటికిన్
గూరుపుఁడీ ముదం బొసఁగ ♦ గోవిదసత్కృతు పల్కఁ బావనిన్. ౬౬౭

### రాముఁడు సుగ్రీవుని పట్టాభిషేకంబున కనుమతి యిచ్చుట.

చం. జనకునియాజ్ఞఁ జేసి పురిఁ ♦ జాలను బట్నము నేని పల్లెనేన్
హనుమ! చతుర్దశాబ్దములు ♦ హాయిగ నర్కజుఁ డూరు చేరి చ
య్యన నభిషేకముం గొని య ♦ థాగమపద్ధతిఁ గీశరాజ్యముం
బొనరుచుఁ గాత మంచు రఘు ♦ పుంగవుఁ డర్కజుతోడ నిట్లనున్. ౬౬౮
కం. ఈయంగదు యువరాజుఁగఁ, జేయుము నీతో సముండు ♦ చేవను మఱియున్
మీయన్న పెద్దకొడుకితఁ, డేయనువున యౌవరాజ్య ♦ మీతనికిఁ దగున్ ౬౬౯

సీ. సలిలాగమం బైన ♦ శ్రావణమాసంబు, తొలుతటియది వాన ♦ నెలలయందు
వార్షికసంజ్ఞను ♦ వర్తిల్లు మాసచ,తుష్కంబు వచ్చె సు ♦ ద్యోగమునకు
నిది వేళ గాదు నీ ♦ వేగుము పురి కేను, సౌమిత్రితో డ నీ ♦ శైలగుహను
వసియింతు నిచ్చట ♦ వా నొప్పి యున్నది, గాలి రమ్యంబు వి ♦ శాల మిదియుఁ
తే. గుముదసారసయుతములు ♦ కొలఁకు లెల్లఁ, గార్తికము వచ్చునెడ దశ ♦ కంఠవధకు
యత్నమును జేయు మీవు నీ ♦ వరిగి పురికి, రాజ నగుము సుహృ త్తతి ♦ రంజిలంగ

## ⟻ సుగ్రీవపట్టాభిషేకము. ⟼

సీ. అనెను రామునిచేత ♦ నభ్యనుజ్ఞాతుఁ డై, కిష్కింధ కేగి సు ♦ గ్రీవుఁ డపుడు
వానరకోట్లభి ♦ వాదనం బొనరించి, బలసి వెన్నంటఁగఁ ♦ బౌరు లెల్ల
సాఁగిలఁబడి నమ ♦ స్కారంబు లొనరింప, వారి లేవఁగ నెత్తి ♦ హారివచన
పద్ధతిఁ దేర్చి స్వ ♦ భ్రాతృసంతఃపురం, బును జొచ్చి తారకుఁ ♦ బొక్క మాన్చి
తే. వెలికిఁ జను దేర వానర ♦ వీరు లెల్ల, నాది తేయబలంబు బ ♦ లారిఁబోలె
హరి నభిషేక మొనరింప ♦ హరిసుతుఁడు, దివ్య తేజోయుతుం డయి ♦ తేజరిల్లె.
సీ. తపనీయభూషిత ♦ ధవళాతపత్రంబు, స్వర్ణదండాంచిత ♦ చామరములు
సర్వరత్నంబులు ♦ సర్వౌషధంబులు, సక్షీరవృక్షకి ♦ సాలకుసుమ
తతులు ధాన్యంబులు ♦ సితవస్త్ర లేపనం,బులు సుగంధులు స్థల ♦ జలజములును
నగుసుమసంతతు ♦ లగరుచందనదివ్య,గంధము లక్షతల్ ♦ కాంచనంబు .
తే. వ్యాఘ్రచర్మంబు నేయియు ♦ నడవిపంది,తోలు చెప్పులు గసగసల్ ♦ మేలిపెరుఁగు
తేనె సమకూర్పుమనిసిల ♦ తోను రోచ,నంబు నుత్తమ మగు లేప ♦ నంబుఁ గొనుచు
సీ. పదునాఱుకన్యలు ♦ పరమహర్షమున రా, భక్ష్యమణీవస్త్ర ♦ పటలిచేత
ద్విజుల సంతర్పించి ♦ విధివిహితంబుగ, దర్భపరిస్తీర్ణ ♦ తలమునందు
జాతవేదుని నిల్పి ♦ పూతమంత్రంబుల, హోమంబుఁ గావించి ♦ యుచితభంగి
మంత్రవేదులు చిత్ర ♦ మాల్యోపశోభిత,ప్రాసాదతలమున ♦ రమ్యభద్ర
తే. పీఠిఁ బ్రాఙ్ముఖముగఁ గపి ♦ వీరవర్యు, నిలిపి, బహునదీనద ♦ నీరములను
సాగరాంబులఁ గొనివచ్చి ♦ స్వర్ణకుంభ,ములను నించించి బంగారు ♦ కలశములను.
తే. వృషభశృంగంబులను ముంచి ♦ విధిహితము
మైందుఁడును ద్వివిదుఁడు గంధ ♦ మాదనుండు
గజుఁడు గవయు గవాక్షులు ♦ గాఢ్పపట్టి
జాంబవన్నళశరభులు ♦ సమ్మదమున. ౬౭౪
కం. బుభునాయకు వసుసంఘుం, బభిషేక మొసర్చురీతి ♦ నతిపరిమళస
ద్విభవం బగునీటను గపి,విభు నభిషేకించి రపుడు ♦ వెలసిన రక్తిన్. ౬౭౫

కం. పొంగుచు సుగ్రీవుండును, నంగదునిన్ రాముచెప్పి♦నట్టుల యువరా
జుంగా నొనరించినఁ గపి,పుంగవులును మే లటంచుఁ ♦ బొగడిరి తుష్టిన్. ౬౨౬

కం. రాముని లక్ష్మణు మెచ్చిరి, ధామములఁ బతాకతతుల ♦ ధ్వజతతులన్ శా
ఖామృగము లెత్తఁ దేజ,స్స్థానంబున నగర మెల్ల ♦ శోభిల్లెఁ గడున్. ౬౨౭

కం. అభిషేకవార్త తులిత,స్వభునకు నెఱిఁగించి యంత్య♦సతి రుమతోన్
స్వభిమతసుఖములఁ దేలుచు, విభవమున రహించె శక్ర♦విధమునఁ గపియున్. ౬౨౮

## రామలక్ష్మణులు ప్రస్రవణగిరిగుహఁ జేరుట.

సీ. రామచంద్రుం డంత ♦ సౌమిత్రితోఁ గూడి, వ్యాఘ్రమహావ్యక్షర♦ వాన్వితంబు
తతవిధగుల్మల♦తాగూఢమును బహు,ళక్ష్మిమహాసంజాత♦సంకులంబు
వానరగోపుచ్ఛ♦వారభల్లూకబి,డాల సేవితమును ♦ నీల మేఘ
రాశినిభంబును ♦ రమ్యజలాశ్రయం, బైనప్రస్రవణాద్రి ♦ కరిగి యతని

తే. కనియె నీగుహఁ గంటివే ♦ యతివిశాల
మగుచు రమ్యంబు మితవాయు ♦ వగుచు వెలసె
వానకాలెల్లఁ గడపఁగఁ ♦ బ్రమన మొప్ప
నుండుటయె యిందు లక్ష్మణా! ♦ యుక్త మగును. ౬౨౯

సీ. ఈగిరిశృంగంబు ♦ పృథ్వీశనందన, తెల్లన యెఱ్ఱన ♦ నల్లనైన
రాలచే ధాతువ♦ర్గంబుచే లహరీద,రీపాళిచేఁ బెక్కు ♦వృక్షతతుల
చే మయూరవిహగ♦స్తోమనాదంబుచే, సిందువారకదంబ♦కుందగుల్మ
మాలతీసర్జార్జు♦నాళీసుమాళిచే, హృదయంగమంబునై ♦ యొసఁగెఁ గంటె

తే. చారుచిత్రలతావృత ♦ మై రహించె
రమ్యమై యున్న వెందు గో♦రంటచెట్లు
గుహయు నున్నత మగుచును ♦ గొమరు మీఱె
యుక్త మగు నెల విది మన ♦ ముండుటకును. ౬౩౦

కం. కమలాకర మది గంటివె, కమలాకరచారుఫుల్ల♦కమలాకరమై
విపులం బయి మనగుహకున్, సమీపతలవర్తి యగుచు ♦ సంతస మిడెడిన్. ౬౩౧

ఉ. తూరుపు నుత్తరంబు గుహ ♦ దోఁచెడి వాటపుఁబల్లమై సుఖం
బారెడి జల్లు కొట్టమిని ♦ నా వెనుప్రక్కను మిఱ్ఱు గావునన్
మారుతముల్ మితంబ యగు ♦ నాయన దొడ్డది చాఁపఱాయి యెం
తో రహిఁ గూర్చి భిన్న మగు♦తోరవుఁగాటుకకుప్పఁబోలుచున్. ౬౩౨

సీ. ఉత్తరంబున మఱి ♦ యొండుశృంగముఁ జూడు, భిన్నాంజనచయంబు♦ పేర్మిఁ గనుచు
నాగవపలఁబోలి ♦ వ్యాప్తమై యున్నది, దక్షిణంబున నొండు♦ధవళశిఖర

మొప్పెడిఁగైలాస ♦ మోయన ముందటఁ, బ్రాచీనవాహిని ♦ పాత్ర నదిగొ
నదు సొకింతయు లేక ♦ యల త్రికూటంబున, జాహ్నవీనదికిని ♦ సాటి యగుచు

తే. సాలతాలతమాలత ♦ క్కోలజాల, తిలకకృతమాలహింతాల ♦ లలితవకుళ
చారువానీరవస్తక ♦ సరళ వేణు, పాదపంబులఁ జెలఁ గెడి ♦ భంగిఁ గంటె ౬౭౩

కం. అట నట నానాకృతు లై, విటపితతుల్ తీరమందు ♦ వెలసెడిఁ గంటే
స్ఫుటవసనాభరణాన్విత, కుటిలాలకచందమునను ♦ గోమ రొప్పంగన్. ౬౭౪

చం. విమలవిహంగమప్రకర ♦ విశ్రుతనాదము నై పరస్పరా
సమసమరక్తచక్రచయ ♦ సంపరిశోభిత మై మనోహరో
ద్గమపులినస్థలం బయి ని ♦ తాంతము సారసమానసాలయ
భ్రమరయుతంబు నై నదియు ♦ భాసిలె నవ్వనెలంతయో యనన్. ౬౭౫

సీ. ఒక చోట హృదయంగ ♦ మోత్పలంబులకూట, మొక చోట రక్తాబ్జ ♦ నికరఘాట
మొకక్రేవ కైరవ ♦ ముకుళసంఘము చేవ, యొకత్రోవఁ బ్జనముల ♦ యొప్పు తేవ
యొకవంక నెమిళుల ♦ ప్రకట కేకలబింక, మొక తెంకిఁ గొంచల ♦ నొనరు పొంక
మొకప్రక్కఁ జంచన ♦ ప్రకరంబు రుచినిక్క, నొకయిక్క మానుల ♦ యునుకు లెక్కఁ

తే. జూచితే యీతరంగిణి ♦ సొంపుమీఱె, నార! యెంతమనోహర ♦ మైన దిదియు
నిందె మునము వసింత మా ♦ నందముగను, జిరముదూరంబుగాదు కి ♦ ష్కింధ యిటకు.

కం విన నయ్యె గీతవాద్య, ధ్వనులుకా నర్తిల్లు వగమ్యు ♦ దంగరవంబుల్
కని రుమను రాజ్యరమయును, మనమున హర్షించుఁ గాదె ♦ మర్కటవిభుఁడున్.

కం అని యా ప్రస్రవణాద్రిని, నినకులుఁడు వసించె నందు ♦ నెల్లసుఖంబుల్
పొనరియుమునముం గానఁడు, తనప్రాణపదంపుభార్యఁ ♦ దలఁచుచు నార్తిన్. ౬౭౬

కం. తూరుపుమలఁ బుట్టెడిసీ, హారకరుం జూచి చూచి ♦ వ్యథితాత్ముం డై
హారిశయనంబు గలిగియుఁ, గూరుకుఁ గొనఁ డొక్కనాఁడు ♦ కువలయపతియున్.

కం పొంగి చను దెంచుశోకము, నం గాఱెడి బాష్పములను ♦ నవసెడి శ్రీరా
ముం గినుచుఁ దుల్యదుఃఖుం, డంగద శమియింప నిట్టు ♦ లన్నం దేర్చున్. ౬౮౦

లక్ష్మణుఁడు రాము ననునయించుట.

కం. అన్నా! యీగతి దుఃఖవి, పన్నతఁ గృశియింప నీకు ♦ భావ్యం బగునే
పన్నుగ నీవెఱుఁగవె దుః, ఖోన్నతిఁ గార్యములు నాశ ♦ మొందు నటంచున్. ౬౮౧

ఉ. నీవు క్రియాపరుండ వవ ♦ నీధవ దైవపరాయణుండవుకా
నీ వతిధర్మశీలుఁడవు ♦ నిస్తులపద్వ్యవసాయి వాస్తికుం
డీవు మహాత్మ కూళ ననుఁ ♦ దేశ్వరు సంగరరంగమందు బా
హావిభవం బెలర్పఁ దును ♦ మాడఁగ నేర్తువె ధైర్యహీనతన్? ౬౮౨

ఉ. చేయుము శోకవేగమును • జెచ్చెర నాశము మూలముట్టుగాఁ,
జేయుము సుస్థిరంబౌ ధృతిఁ • జేకొనుచున్ వ్యవసాయ మెట్టులున్,
జేయుము ధ్వంసమున్ సకల • సేవకపుత్త్రకమిత్త్రయుక్తదై
తేయుని, న్యాయమే యిటులు • దీఱనిచంతలఁ గుందు చుండఁగన్? ౯౯౩

కం. అతతగిరివనజలధిస, మేతం బగుభూతధాత్త్రి • నేనియుఁ దలక్రిం
దై తరలఁజేయు నేర్తువు, దైతేయుం జేటిలెక్క • దర్పస్థానా. ౯౯౪

ఉ. వచ్చెను వానకాల, మిఁక • వచ్చు శరత్తె శరదాగమంబు, లో
నచ్చినతాల్మి జేచి సహి • యింపుము, పిమ్మట రావణాసురున్
ద్రొచ్చెదు గాక బంధుహిత • కోటులుగాఁ, దగువేళ నిన్ను నే
నెచ్చరికింతు నాహుతికి • నేర్వఁజేయఁ, జెడి నహ్నినో యనన్. ౯౯౫

కం. అని లక్ష్మణుండు పల్కినఁ, దనకు హితము శుభము నైన • తద్వాక్యంబుల్
మనమున నిల్పి సుహృత్త్వముఁ, దన నెయ్యునిఁ జూచి యనియె • ధరణీశుఁ డిటుల్.

ఉ. తమ్ముఁడ నీవు భక్తియు హి • తమ్మును నెయ్యము సత్త్వశౌర్యద
ర్పమ్ము లెసంగఁ బల్కుటను • బాసితిఁ గార్యవినాశకారిదుః
ఖమ్మును విక్రమమ్ముఁ గొని • కాచెద నీవచియించినట్లు కా
లమ్మునకై, ప్రసన్నతఁ జె • లంగెడుదాఁక నదీకపీశ్వరుల్. ౯౯౬

కం. వీరుం డగుపురుషుం డుప, కారికి మఱుమే లెఱుఁగని • కావించుఁ బ్రతీ
కారముఁ జేయక మఱచెడి, క్రూరుఁడు నొప్పించు సుజన • కోటులమనమున్. ౯౯౭

చం. అన విని లక్ష్మణుండు జన • కాత్మభవాపతితోడ రామ! నీ
వనినటు సర్వ మొప్పెడి న • నాటచయోధిపుఁ డర్వ్నేళఁ దాఁ
బనిఁగొని చేయు సాయమును • వానలు నిల్చెడిదాఁక నోర్పుగ్
గొని యిట నుండు మీనెలలు • గూల్తువుగా కరికోటి నావలన్. ౯౯౮

→ వర్షర్తు వర్ణనము. ←

కం. అన విని తమ్మునిఁ గనుఁగొని, చను దెంచెను గంటె వృష్టి • సమయము మబ్బుల్
పెనుఁగొండలట్లు నభమున, ఘనముగ వ్యాపించె నిగ్గు • గవియఁగ ధరణిన్. ౨౦౦

కం. దివి దినకరకరముల నర్ణవరసముల నెల్లఁ ద్రావి • నెన్నెల మెఱయన్
నవమాసగర్భ యగుచును, నవురుగఁ బ్రసవించెడిన్ ర • సాయన మిట్టుల్. ౨౦౧

కం. వనధరణిశ్రేణులచే, వినువీధికి నెక్కిపోయి • వేఁడి వెలుంగున్
మనుఁగుటజాస్త్రసుమములఁ, గొనబార నలంకరింపఁ • గూడెడిఁ గంటే. ౨౦౨

తే. సంజకెంజాయ మెడ నెఱ • సంజలంగఁ
తతముపాండర మగుచు సం • తతములయందు

స్నిగ్ధములు నైనమబ్బు లను జింపిచేల
ములను గట్టినపుండునా వెలసె నభము. ౨౦౩

తే. మందమారుతనిశ్వాసబృంద మగుచు, సాంధ్యరాగపటీరరంజనముఁ గనుచు
నభ్ర మాపాండురం బగునభ్రయుక్తిఁ, గామపరిపీడితునిభంగిఁ గ్రాలెఁ గంటె.

తే. ఘర్మసంతప్త మై నవకాండములను, దొప్పదోఁగుచు నార్తి దోదూయమాన
మైనజనకాత్మభవ యన నవని బాష్పపూరములు రాల్చెఁ గంటివే ధీరచరిత.

కం. జలదోదరముక్తంబులు, సులలితకహ్లారనికరసుఖశీతలముల్
లలిఁ గైతకపరిమళములు, చెలువుగ జుట్టంగ వచ్చుఁ జేరలకొలఁదుల్. ౨౦౬

కం. కేతకధూళీలిప్తం, బాతతఫుల్లార్జునంబు నయి యీగిరి ని
ర్ధూతారిభాస్క రాత్మజు,భాతిని ధారాభిషిక్తపటిమం గ్రాలెన్. ౨౦౭

కం. జలదము కృష్ణాజినముగ, జలధారలు దోఁచు చుండ జన్నిదములుగా
వలిగాలి నిండ గుహలను, మల లొప్పెను శ్రుతులు చదువుమనుజులమాడ్కిన్.

కం. ఒఱ పగుకడానిబంగరు, మెఱుఁగుల నెఱితుఱఁగలింత మించినమించుం
గొఱడాలఁ గొట్ట దూఁకట, మొఱ యిడువటు వనఁగ నభము మొగసెడి వింటే.

తే. అకట లక్ష్మణ! నీలమేఘాశ్రితంబు, కార్తెఱుం గెట్లు చలియించెఁ గంటి వయ్య
రావణునియంకమందు ధరాతనూజ, వ్యసనభరమున వణఁకెడివడువు దోఁప.

తే. నీలఘనములచే నవలిప్త లగుచు, దిశలు నష్ట గ్రహాబ్జదీధితులతోడ
నంగనాయుతులకు హితలయి విభాగ,మేర్పరింపఁగరాక తా మెసఁగె నిపుడు.

తే. ప్రకటవర్షాగమమున కుత్సుకము లగుచు, నచ్చటచ్చట నావిరి వచ్చు చుండఁ
గామసందీపనంబుగఁ గ్రాలు చున్న,కొండమల్లెలు చఱియలఁ గొమరు మీఱె.

ఉ. దుమ్ములు మాసె, మారుతము దోలఁ దొడంగెను జల్లగా, మెయిన్
జెమ్మట లూఱుటల్ సమసె నిల్చెను వీవనతోడి జోలి, దూ
రమ్ముగ నేగియున్నప్రజ గ్రచ్చఱఁ జేరెడి స్వాలయంబులన్,
నిమ్మళమార భూపతులు నిల్చిరి యాత్రలు వోక యూరులన్. ౨౧౩

ఉ. మానసవాసలాలసనమంచితహంసలు దాఁగె నెందునో
మానుగఁ జక్రవాకములు మంజులరీతిఁ బ్రియాప్తి రాజిలెన్
బూనిక నేకధారగను బోరున పాములు వ్రేలునట్లుగా
వానలు రేఁగ సాగ వికి బాటలలోఁ బయనింప బండ్లపై. ౨౧౪

చం. అనఘ! క్వచిత్ప్రకాశ మయి యభ్ర మదే క్వచిదప్రకాశ మై
కనఁగఁ గ్వచిత్క్వచిత్క్షుధరకాండనిరుద్ధము నై తరంగచా

లనరహితాబ్ధిపోలికఁ జెలంగెను ; సర్జకదంబపుష్పమే
ళన మయి శైలధాతుతతులన్ నిబిడారుణ మై నదీతతుల్ ౭౧౫
తే. కేకికేకానుయాతముల్ ప్రాకటముగఁ, గ్రొత్తనీళ్లను వహియించి రోకు మీఱి
దూఁకుచును బాఱు చున్నవి తోర మైన, వేగమునఁ గంటివే సువివేకధన్య.
తే. సారతరరసయుత మయి మట్పదములఁ, బోలు నేరేడుపండ్లను గాలికతన
నవని వ్రాలినపలువన్నె లగువివక్వ,చూతఫలముల భుజియింత్రు చూవె జనులు.
తే. ప్రకట మైనబలాకమాలికలతోడ, మించుఁడెక్కెంబులోఁ గొండ మేల్మిఁ దాల్చి
రణతలంబున నున్నవారణములట్లు, గర్జ లిడు చున్న వవిగొ మేఘంబులెల్ల.
కం. యవసము జడిఁ దని వొందఁగ, లివ గొనుచును నెమిలిపిండు లీల నటింపన్
దవ వర్షింపఁగ మబ్బులు, నవురుగ నపరాహ్ణవేళ జా నయ్యె వనుల్. ౭౧౮
కం. సలిలాతిభార మొదవఁగ, జలధరములు గర్జ లిడుచు సబలాకము గా
బలితపుగిరిశిఖరంబుల, నిలిచి నిలిచి లేచి పోవు నెఱిఁ గనుఁగొంటే. ౭౨౦
తే. గర్భధృతికిని మేఘాభి కామ మగుచు, దండ కేగెడుకొక్కెర పిండు మింటఁ
గట్టఁబడి మారుతాహతిఁ గదలు చున్న, వెల్లదామరసరమన వెలసెఁ గంటె.
ఉ. పెల్లుగ నింద్రకోపములపిల్లలు రాలఁగ నిందు నందు భ్రా
జిల్లెడి లేఁతపచ్చికలసీమలసొంపున ధాత్రి శోభిలెన్
మొల్లపుటెఱ్ఱపట్టునను మొగ్గ కసీదను గుట్టఁ గాంతి రా
జిల్లెడిచిల్కతెక్కజిగిచీరను దాల్చినకాంతయో యనన్. ౭౨౨
కం. క్రన్న నది కడలిఁ బాఱెను, బన్నుగఁ గొక్కెరలు మేఘపటలముఁ దారెన్
వెన్నుఁడు నిద్దురఁ గూరెను, జెన్నగుకాముకయుఁ బ్రియునిచెంతం జేరెన్. ౭౨౩
కం. చెలఁగె నెమిళ్లులయాటలు, కలిగెఁ గదంబముల విరులఁ గ్రాలెడికొమ్మల్
వెలిఁగె మహి సస్యవనముల, మెలఁగె సమప్రీతి నాలు మే లగుకోడెల్. ౭౨౪
ఉ. ఆడెను, జింత వాసెఁ, దొలఁకాడెను, బాడెను, జంచలత్వమున్
వీడెను, జాలు గూడె సరవిన్, వడి నూడసిఁబాడె నయ్యెడన్
వేడుక నెమ్ములుం విరహిణీనిచయమ్ములు, సద్వనమ్ములున్
జోడుగజమ్ములుం, గపులు, బోరని వానలు నెల్లవాఁకల్మన్. ౭౨౫
ఉ. ఎత్తినవేడ్కతోడ నెలయేఱులపొంతలఁ గ్రంతలన్ మదం
బెత్తినహత్తిమొత్తములు నెంతయుఁ గేదఁగిపూలవాసనల్
కుత్తుకబంటి గ్రోలి గిరికూటపతజ్ఝరిమ్రోఁత కుల్కుచున్
మత్తనటచ్ఛిఖావలసమాజముతో ధ్వని నించు దిక్కులన్. ౭౨౬

ఉ. ఇమ్ముగఁ బూవుఁ దేనియల ♦ నిచ్చకొలందిని ద్రావుచుర్ నిమే
షమ్మున మత్తు గాంచు నళి♦సంఘము లిప్పుడు వర్షధారవే
గమ్మునఁ దాఁడిత మ్మయి ది♦గాలన గాడ్పడుచుం గదంబపుం
గొమ్మల వ్రేలు చున్నయవి ♦ గోల్పడి యెల్లమదంబుఁ జూచితే.　　౨౨౭

కం. చిప్పిల్ల రసము చల్లని,నిప్పులపొడిచాయ విరిసి ♦ నేరెడుపండుల్
కప్పఁగఁ దేఁటులదాఁటులు, కప్పినగతి జంబుతరులఁ ♦ గ్రాలెడిఁ గొమ్మల్.　　౨౨౮

కం. సౌదామనీపతాకము, మేదురగంభీరరవము ♦ మేకొనఁగ సమి
న్నేదిని నుద్యద్గజముల,మాదిరిఁ గనుపట్టెఁ గనితె ♦ మబ్బులు మింటన్.　　౨౨౯

ఉ. శైలవనానుసారి యయి ♦ సత్వరమం దొకనాగ మేఘుచో
నోలిఁ బిఱుంద నొండుస్తని♦తోదయ మాటయు నాలకించి తా
హాళిని యుద్ధకామ మయి ♦ యచ్చటఁ జీరె నొకండు దంతి యం
చాలము సేయఁగా మరలె ♦ నాద్విరదంబును జూడు లక్ష్మణా!　　౨౩౦

కం. ఆడెడిభంగిని గొన్నియుఁ, బాడెడిగతిఁ గొన్ని మత్తు♦భరమునఁ గొన్నిర్
జూడఁగఁ బలు తెగల వనుల్, వేడుక శిఖిమధుపకరుల♦వృత్తుల నొప్పెన్.　　౨౩౧

కం. లలితకదంబార్జునకం,దళరుచిరము నూత్నవారి♦తతపూర్ణంబుర్
గలితమదశిఖావలన్నృ,త్యలసిత మయి పానశాల ♦ యన వని యొప్పెన్.　　౨౩౨

తే. శక్రదత్తంబు లగుచును ♦ స్వచ్ఛము లయి
ముత్తెములఁబోలుబిందువుల్ ♦ మోదమునను
బత్త్రపుటభగ్నములను బి♦పాసఁ గ్రోలు
బహువిధపర్ణచ్ఛదము చక్ర♦వాక సమితి.　　౨౩౩

తే. భ్రమరతంత్రీలతామధు♦రస్వనంబు, కప్పలొండొంటి మించెడి♦కంఠతాళ
మంబుదమృదంగనాదంబు ♦ లింబుమీఱఁ,గాననంబుల సంగీత♦కంబు వెలసె.

తే. కొన్ని నెమిళులు పాడంగఁ♦గొన్నియాడఁ,గొన్నినిలువంగఁ జెట్టుల♦కొమలకొనలఁ
గొన్ని వ్యాలంబబర్హభా♦షోష్ణతములు,గా వనంబుల సంగీత♦కంబు వెలసె.　　౨౩౫

కం. మబ్బులయుఱుములఁ గప్పలు, నిబ్బర మగుదీర్ఘకాల♦నిద్రను విడి పే
రుబ్బున నానాధ్వను లా,గుబ్బతిలర్ వానధార♦కుర్ మోదించెన్.　　౨౩౬

చం. కులుకుమెఱుంగుజేక్కన ల♦కుంఠమదంబునఁ గ్రాల, నుస్లనొ
డ్డులను నతిక్రమించుచుఁ గ♦డుర్ మద మెత్తఁగఁ బుష్పముల్ ఫలం
బుల నుపహారముల్ గొనుచుఁ ♦ బోయెడిఁబో తటినీనవోఘలుర్
గెలవునఁ దూర్ణయానములఁ ♦ గేరుచుఁ బ్రాణవిభుం గనుంగొనన్.　　౨౩౭

తే. కాలుకొండలతో బద్ధ♦మూలము లయి, కాలుకొండలమాడ్కిని ♦ నీలమేఘ
పటలసంసక్తములు నవ♦వారిపూర్ణ,జలదములు నీలకాంతుల ♦ జాను మీఱె. ౨౩౮

తే. ఉబ్బి కేకలు వైచుమ♦యూరతతులు, శక్రగోపసమన్విత♦శాద్వలములు
హారివాసన లీను నీ♦పార్జునములు,గ్రాలువనులందుఁ జరియించెఁ ♦ గరులు కెరలి.

చం. నిరవధికాంబుధారలను ♦ నీటు దొలంగిన కేసరంబులన్
నురుచి దొఱంగి యున్నబిస♦నూనములన్ మధుపాళి వాసి ని
ర్భరరుచిరేద్ధకేసరధు♦రంబు కదంబకదంబకాళిఁ జె
చ్చెరఁ జని వ్రాలె, హీనదశ ♦ చేకుఱ మైత్రిఁ దలంత్రె చంచలుల్. ౨౪౦

ఉ. ఎంతయు భూరిసమ్మదగ♦జేంద్రము హృష్టిలసద్గవీంద్రమున్
శ్రాంతమృగేంద్రమున్ రుచిర♦సంపదుదంచితభూధరేంద్రమున్
దొంతులు మేఘబృందముల♦తోఁ బరిఖేలితనిర్జరేంద్రమున్
శాంతనరేంద్రముం గనితె ♦ సాదృతి లక్ష్మణ వానకాలమున్. ౨౪౧

కం. జలనిధిఘోషంబు దిసం,తులు గొట్టుచు గగనతలము♦తో రాయుచు నే
ళ్లులఁ గొలఁకుల బావులఁ జె,ఱ్వుల నేకముఁ జేసె మేఘ♦పూగము గంటే. ౨౪౨

ఉ. జోరున నేకధారగ వ♦సుంధరఁ బర్వఁగఁ జిమ్మచీఁకటుల్
దోరపువర్షముల్ గురియఁ ♦ దోడయి గాలియు జివ్వు జివ్వునన్
క్రూరత వీవఁగా నదులు ♦ కూలము లుర్లఁగఁ బొంగి యెవ్వియో
దారులఁ దప్పత్రోవల ని♦తాంతరయంబునఁ బాఱె నియ్యెడన్. ౨౪౩

చం. ధర జనతాభిషిక్తు లగు♦ధారిణినాయకు లాత్మవైభవం
బరుదుగఁ జూపురీతి నమృ♦తాశననాయకదత్తమై మహా
నురుదుపనీతమైనఘన♦మండలిచే నభిషిక్త మాచు భూ
ధరతతి గానిపించెడిఁ గ♦దా నిజరూపము శ్రీయుతంబుగన్ ౨౪౪

ఉ. రిక్కలతోడి మిన్ను ఘన♦బృందముచేత మునుంగఁ గాంచె, నే
ప్రక్కన నున్నవాఁడొ కన♦రాఁడు దివాకరుఁ, డీధరిత్రియుం
బెక్కువ నీటఁ దృప్తిఁ గొనెఁ ♦ బేరినచీఁకటి ముంచె సర్వమున్
దిక్కులు తెల్వి మాసె నెది ♦ దిక్కొ యెఱుంగఁగరాదు లక్ష్మణా! ౨౪౫

చం. తర మిఁడి వారిధారలను ♦ ధౌతము లై ధరణీధ్రకూటముల్
కరము విరాజితంబు లయి ♦ క్రాలెడి వ్రేలెడిమేలిముత్తెపున్
సరములపోణిమిం దనరు ♦ శైలతటాగ్రపతత్ప్రపాతకో
త్కరములతోడఁ గంటివె ము♦దంబు ఘటించెను భోగికైవడిన్, ౨౪౬

ఉ. కొండలనుండి జాలువెడఁ ♦ గొండల గుండులు ద్రోవ కడ్డమై
యుండిన వానిఁ దాఁకి వడి ♦ యొప్పులు నిర్ఘరపాళి విన్వ్యర్క
దండిగఁ జింది ప్రక్కలను ♦ నవ్యము లయ్యె గుహాళులర్క వినం
బండువుగాఁగఁ బాడుశిఖ♦మండలిపాలిటిహారవల్లులై.　　　　　౨౪౭

ఆ. మదనకదనములను ♦ మదవతుల్ సురపురి, ననఁగఁ బెనఁగఁ బెరిఁగి ♦ హారవల్లి
సంఘ ముర్విఁ దెరలు ♦ చందంబు దోఁపఁగఁ, దోయధార లురలెఁ ♦ దోరముగను.

కం.వికిరంబులు డాఁగుటచే, ముకుళించెడి నీరజాత♦ములపంక్తులచే
వికసించెడిజాజులచే, సెకవేలుపు క్రుంకు టాత్మఁ ♦ జింతింపఁ దగెన్.　　　　　౨౪౯

కం.త్రోవ యిది డొంక యిది యని, భావింపఁగ రామి నడఁగఁ ♦ బగ యెలగోల్ సే
నావిసరము వెనుదీయఁగ, భూవల్లభదండయాత్ర ♦ పోనుపడెఁ జుమ్మీ.　　　　　౨౫౦

కం.అనఘా యీభాద్రపదం,బున సామామ్నాయపఠన♦మునకుర్ విప్రుల్
ఘనమతు లుపక్రమించెద, రినకుల! యధ్యయనసమయ ♦ మిది యగు కతనన్.

కం.గృహకృత్యంబులఁ బో నిడి, మహితపదార్థములఁగూర్చి ♦ మనభరతుం డ
స్పృహ నాషాఢి మొదల్ వ్రత,సహితుండయి యుండు నయ్యె ♦ శ్రద్ధాయుక్తిన్.

కం.పురి నుండి వచ్చునన్నుం, బరికించి యయోధ్యజనము ♦ పరఁగించినదు
ర్భరరవముం బురిడించుచు, సరయూనది వేగ పాఱు ♦ సరవం బగుచున్.　　　　　౨౫౩

ఉ. భావుకమైన యిట్టియెడ ♦ బాధితవైరి సదారుఁ డౌచు సు
గ్రీవుఁడు రాజ్యభోగములఁ ♦ గ్రీడలు సల్పుచు నుండుఁ గాదె, నే
నో విగతాత్తదారుఁడ న♦ముజ్ఝితరాజ్యుఁడ నై నదీతట
ద్యావలెఁ గూలిపోయెదఁ గ్ర♦మంబుగ సైఁపఁగ రానియార్తిచేన్.　　　　　౨౫౪

కం.ఈ కారు దుర్గమం బ,స్తోకంబు మదీయహృదయ♦శోకానలముర్
భీకరసత్త్వుఁడు రావణుఁ, డేకైవడిఁ బార మొందుఁ ♦ గృత్యము మనకున్.　　　　　౨౫౫

ఉ. ఏమి యొనర్చు వాఁడ ధర♦ణీశ్వర చెప్పు మటంచు వేఁడ శా
ఖామృగనేత మార్గము ల♦గమ్యము లంచును నెన్నినాళ్లకో
ప్రేముడి భార్యఁ గూడె నని ♦ పెద్దయుఁ బో మనకార్య మంచు నే
నేమియుఁ బల్క నైతి, నతఁ♦డే చను దెంచెడి యుక్తవేళకున్.　　　　　౨౫౬

కం.ఉపకార మెఱుఁగువాఁ డా,కపివర్యుఁడు గాన వేతుఁ ♦ గాలంబునకై
విపులమహానదులయుఁ ద,త్కపినాథు ననుగ్రహంబుఁ ♦ గాంచెడిదాఁకన్.　　　　　౨౫౭

కం.పేరుం దగుపురుషుం డుప, కారికి మఱుమే లెటేని ♦ కావించుఁ బ్రతీ
కారముఁ జేయక మఱచెడి, క్రూరుఁడు నొప్పించు సుజన♦కోటులమనముల్.

చం.అన విని లక్ష్మణుండు జన♦కాత్మభవాపతితోడ రామ! నీ
వని నటు సర్వ మొప్పెడి వ♦నాటచయాధిపుఁ డర్థవేళఁ దాఁ
బనిఁగొని చేయుసాయమును ♦ వానలు నిల్చెడిదాఁక నోరుపుఁ
గొని యిట నుండు మంత రిపుఁ ♦ గూల్పఁగ నౌ నని పల్కె నంతటన్. ౭౫౯

→ కామపరతంత్రుఁ డగు సుగ్రీవుని హనుమంతుఁడు బోధించుట. ←

కం.తొలఁగఁగ మెఱుఁగులు మబ్బులు, చెలఁగఁగ హంసారవంబు ♦ శ్రీమంతంబై
మెలఁగఁగ వెన్నెల దిక్కుల, వెలుఁగఁగ వినువీది మిగుల♦విమలం బగుచున్.

సీ. కని మహాభోగభా♦గ్యసమృద్ధుఁ గామైక, పరతంత్రు సజ్జన♦భవ్యమార్గ
దూరగు ధర్మార్థ♦దూరమానసు విని, వృత్తకార్యునిఁ బ్రమ♦దోత్తమాభి
రతనిరతుని మనో♦రథజాలసంప్రాప్తి, రేవగల్ హాయిఁ జ♦రించువాని
దారతోఁదారతో ♦ హారిసదోదార,ఖేలావిలోలుఁడై ♦ క్రాలువాని

తే. నందనంబున బృందార♦కేందుముఖులు, బృందములు గట్టికొలువ♦సానందుఁడైన
వాసవునిఁబోలి విహరించు♦వాని సచివ,వారవిన్యస్తనృపకార్య♦భారుఁ డగుచు

ఉ. పన్నగ రాజ్యతంత్రముల♦పట్ల విమర్శము లేనివాని, ను
త్పన్నధరాధిపత్యగురు♦శంకు, నిదేశవిహీను, సర్వదో
త్పన్నమనోజసౌఖ్యరతు ♦ వానరనాయకు, డాసి తత్త్వసం
పన్నుఁడు కాలవేది హిత♦పథ్యయథార్థనయోక్తి నూరియుఁ. ౭౬౨

కం.సామమృదుభాషణుం డగు,సామీరి వచించె వినయ♦సంపదను యశ
శ్శ్రీమహి లొదవెఁ గపిస్వామీ! మిత్రులకార్య మొకఁడె♦మిగిలెం జుమ్మీ. ౭౬౩

కం.కాలమెఱుంగుచుఁ దత్తత్కాలంబున మిత్రులందుఁ ♦ దగుపద్ధతి భూ
పాలుఁడు వర్తింప యశో,జాలము రాజ్యంబు కీర్తి♦ శౌర్యము పెరుఁగున్. ౭౬౪

కం.దండంబును మిత్రసుహృ, త్కాండంబును గోశబలము ♦ త్మాపతి యీనా
ల్గుండిన లెస్సగ రాజ్య మ,ఖండసమృద్ధిం దనర్చుఁ ♦ గపిలోకవరా! ౭౬౫

తే. వృత్తసంపన్నుఁడవు నీవు ♦ చిత్త మెపుడు
తతనిరత్యయపథమును ♦ దగిలి యుండు
వేగ హితకార్యమును నెఱ♦వేర్చుపొంటె
యత్నమును జేయఁ దగు నీకు ♦ నగచరేంద్ర. ౭౬౬

కం.తనపనుల నెల్ల వదలియుఁ, దనమిత్రునికార్యమునకుఁ ♦ దత ముత్సాహం
బును గొని చరించునాతఁడు, కనఁ డెప్పు డనర్థకంబుఁ ♦ గపికులతిలకా! ౭౬౭

కం.కాలాతిక్రమణంబుగఁ, జాలఁగ మిత్రార్థమునకు ♦ సమకట్టి నరుం
డేలీల నెంతగాసికిఁ, బా లైనను మిత్రకార్య♦పరుఁ డన రతనిన్. ౭౬౮

—— హనుమంతుఁడు సుగ్రీవునితో సీతను వెదకింపు మని చెప్పుట. ——

ఉ. కావున మిత్రకార్యము స♦కాలమునందఁ దొసర్పు మీవు, స
ద్భావ! విదేహజన్ వెదకఁ ♦ బంపుము, కాలము మీఱె మున్నె, ప్ర
జ్ఞావిభవుండు త్వద్వశుఁడు ♦ క్ష్మాపతి సత్వరుఁ డయ్యుఁ గాలమున్
బోవుట తా నెఱింగియును ♦ బూనఁడు చూ నిను హెచ్చరింపఁగన్. ౨౬౯

ఆ. నీదువంశ మిలను ♦ నిలిపెను చిరకాల,మైత్రి కర్తఁ డైన♦మాననీయుఁ
డప్రమేయమహిముఁ ♦ డతులితసుగుణి యా,రాజచంద్రుఁ డైన♦రామవిభుఁడు.

కం. ఆతండు నీకు మున్నుగ, ఖ్యాతంబుగ మేలు చేసె ♦ నతనికి నీవున్
బ్రీతిం గూర్పఁగ వలదే, వే తరుచరవరులఁ బంప♦వే సమకూడన్. ౨౭౦

కం. కాలాతిక్రమదోషము, గ్రాలదు పరు లెచ్చరింప♦కయ మును చేయన్
గాలాతిక్రమదోషము, గ్రాలెడిఁ బరులెచ్చరింపఁ ♦ గార్యము సేయన్. ౨౭౧

కం. ఉపకారము లేకున్నను, నృపతీ! యుపకృతి నొనర్పు ♦ నీతియ నీకున్
విపులశ్రీరాజ్యంబులఁ, గృప సేసినరాము నెడ నిఁ♦కే మని చెప్పన్. ౨౭౩

కం. ధృతియుతుఁడవు బలినుతుఁడవు, హితచరితుఁడ వీవు వాన♦రేశ్వర యేలా
క్షితిపతికార్యముఁ దీర్పఁగఁ, దతవాసరకోటిఁ బంపఁ ♦ దడసితి విట్టుల్. ౨౭౪

ఉ. నీ విట వాన రై చనక ♦ నిల్చినయంత నె రాముకార్యమున్
బోవునె రిత్త యై? నిశిత♦భూరిశరావళిచే మనుష్యభు
గ్దేవతపన్నగావళులఁ ♦ దత్క్షణమాత్రన పిల్కుమార్పఁగాఁ
జేవ గలండు, నీప్రతిన ♦ చేయుట యెట్టిదొ చూడఁ దాఁ గెడిన్. ౨౭౫

కం. ప్రాణంబునకును జెంకక, రాణన్ మేల్ చేసె నీకు ♦ రాముఁడు నీవున్
రాణువతోఁ జని యాతని, రాణిని వెదకింపు నంబ♦రంబున ధరణిన్. ౨౭౬

చం. అనిమిష దైత్యమారుతఖ♦గాహిగణంబులు కూడియేని రా
మునకు రవంత యేని భయ♦ముం గలిగింపఁగ లే వనంగ నే
మని వచియింప రాక్షసచ♦యంబును, నీ కుపకారి యైనయా
ఘనునకు మాఱుమే ల్సలుపఁ♦గా గమకింపుము వానరేశ్వరా. ౨౭౭

కం. మంటను వింటను జలముల, మంటల బలితలమునందు ♦ మహితజనమునన్
గుంటు వడక కపు లెల్లరు, దంటలు చన నీ వనుజ్ఞ ♦ దయ చేసితివేన్. ౨౭౮

కం. పాటించి యెట్టికార్యముఁ, బాటవమునఁ దీర్ప నేరు♦పరు లౌ వారల్
కోటికొలందులు ధరణిరు,హాటులు గల రేమి సేయ ♦ నగు ముద లిడుమా. ౨౭౯

ఉ. నాపుడుఁ గాలయోగ్యపవ♦నప్రభవాలపనంబు లెల్లను
గ్రీవుఁడు చక్కఁగా విని హ♦రిధ్వజినీపతి నీలుఁ జూచి నా
నావనచారియూథపులు ♦ నాదుననుజ్ఞ పదేనునాళ్లలో
రావలయుర్ సమైన్యముగఁ ♦ బ్రాణముఁ దీయుదు రాక తక్కినన్. ౭౬౦

కం. అని చాటింపుము తారా,తనయుండును నీవు వేగ ♦ తగుపద్ధతులన్
బనిపూనుఁడు కార్యంబున, కని సుగ్రీవుండు చొచ్చె ♦ నంతిపురంబున్. ౭౬౧

శరత్కాలంబున రాముఁడు సీతావిరహంబునఁ దపించుట.

చం. వెలియఁగ వానలున్, నభము ♦ వెల్లన నల్లెడఁ దోఁపఁ, జంద్రమం
డలము విశుద్ధమై తనర ♦ నవ్యశరత్ప్రజనీలలామ ని
ర్మలశశికాంతిచందనము ♦ రమ్యముగాఁగ నలందఁ, గ్రోఁతిత్రేఁ
డలఘుసుఖంబుఁ జెంద, సమ♦యంబు నతీతము నొందఁ, జూచుచున్. ౭౬౨

కం. తొలఁగఁగ మెఱుఁగులు మబ్బులు, చెలఁగఁగ హంసారవంబు ♦ శ్రీమంతం బై
మెలఁగఁగ వెన్నెల దిక్కుల, వెలుఁగఁగ వినువీదిమిగుల ♦ విమలం బగుచున్. ౭౬౩

కం. మానితశైలాగ్రనమా,సీనుండై రామవిభుఁడు ♦ సీతాతరుణిన్
మానసమునఁ దలపోయుచు, నూనినశోకమున నిట్లు ♦ నుపతాపించెన్. ౭౬౪

కం. పరసారసారవారవ, వరసారససారమధుర♦వంబు చెలంగన్
సరసంబుగ నాశ్రమమున, సురమించును నేఁడు నాకు ♦ సుఖ మిదు టెట్లో. ౭౬౫

కం. కుసుమితతరువిసరంబుల, లసదష్టాపదవినిర్మ♦లంబుల శుభ మా
ననమాసనములఁ గనుచుం, గుసుమాంగి యదెట్టు లడలు♦నో నే లేమిన్. ౭౬౬

కం. కలభాషిణి మును పలుకఁగఁ, గలహంసరవంబుపోల్కిఁ ♦ గని యెఱుఁగుదు నే
లలితసకలాంగి నిపుడే,చెలువునఁ దెలియంగలాఁడ ♦ సీతారమణిన్. ౭౬౭

కం. మక్కువ నొక్కటఁ దిరిగెడి,జక్కవకవరవళి విన్న ♦ జలజాక్షి యదెం
యెక్కువడిఁ దపియించునొ, దిక్కఱి ననుఁ బాసి మిగుల ♦ దీనత నొంటిన్. ౭౬౮

ఉ. ఆవనజాతపాణి మఱి ♦ యాయనిమేషవిలోలనేత్ర హా
యావరపల్లికాలలిత ♦ యాయమ్మ తాసమకీరవాణి లే
కీవనజాకరంబులును ♦ నీతటినీవరతీరదేశ మిం
దీవనకాననోత్కరము ♦ లిం పొదవింపవు సంచరింపఁగన్. ౭౬౯

కం. శారదగుణనారాచ,స్ఫారుఁడు కాముఁడు వియోగ♦జాతార్తను సీ
తారమణిని సుకుమారిని, గారింపక యున్నె మృత్యు♦కారణ మగుచున్. ౭౭౦

కం. చాతకము నీటికై పురు,హూతునకుం మొఱలు పెట్టు♦నో జను గాన
ల్యాతనయుఁడు విలపించెను, సీతావనజాక్షికై వి♦శేషవ్యధచేన్. ౭౭౧

కం. ఏకాంతవిసంజ్ఞుం డై, యేకాంతమనంబుతోడ ♦ నేకాకృతి సీ
తాకాంతకు దురపిల్ల ని,లాకాంతునిఁ జూచి సత్ఫ♦లగ్రహణాస్థన్. ౯౨

లక్ష్మణుఁడు రామునిదుఃఖముఁ బాపుట.

ఉ. వింతపథంబులం దరిగి ♦ వేగమ వచ్చి సుమిత్రపుత్రుఁ డ
త్యంతవిషణ్ణచిత్తుఁ డయి ♦ యన్న యిదే మిటు నీదుభూరివి
క్రాంతి పరాభవంబు గొనఁ ♦ గామవశాత్ముఁడ వౌట యర్హమే?
చింతలఁ గుందె దయ్యె ధృతి♦ చేఁ బని దీర్పఁగ నర్హమా నెడన్. ౯౩

చం. మన మిపు డాచరింపఁగ స♦మంజసకార్యము నెంచి, ధీప్రసా
దనమును గాంచి, కాలమువి♦ధంబుఁ దలంచి, స్మరించి వానరేం
ద్రుని పెనుఁబ్రాపు, దేవతల♦నుగ్ భజియించుట లోగ్రహించి, దు
ర్జనగణదూర! ధైర్యమునఁ ♦ గ్రాలుము, వ్రాలుము విక్రమంబునన్. ౯౪

కం. శ్రీనిలయ! త్వత్సనాథ మ,హీనందన సులభ యగునె ♦ యితరులకును వై
శ్వానరకీలలలోఁ బడి, మానవుఁ డెవ్వండు వీర! ♦ మనఁగాఁ జాలున్. ౯౫

చం. అని హితముం బ్రియంబును స♦యంబును ధర్మము సామ మొప్పఁగా
నని యొసితమ్ము వాక్యముల ♦ నాదట రాఘవుఁ డాలకించి నా
యన! భవదీయసూక్తి హిత ♦ మౌను దురాసద కార్యచింతనం
బును దగుఁ దత్ప్రయత్నమును ♦ బూనఁగ నొప్పు నటంచుఁ బల్కుచున్. ౯౬

శరద్వర్ణనము.

సీ. పదపడి రాముండు ♦ పద్మపలాశాక్షిఁ, దలఁచి లక్ష్మణుతోడఁ ♦ బలికె శార్తి
వేగంటి ధారిణి ♦ విపులధారలచేతఁ, దన్పి పైరులు ప్రోచి ♦ ధన్యఁ డయ్యె
ద్రుమభూమిధరపురో♦గమఘనంబులు మ్రోఁగి, వర్షించి బడలికఁ ♦ బాపుకొనెడి
కారుమబ్బులు దెసల్ ♦ కాటుక పట్టించి, విమదవ్విపము లట్లె ♦ వేగ మేదె

ఆ. నంబుగర్భములు మ♦హావేగములు కుట,జార్జునాతిపరిమ♦ళాన్వితములు
జృంభితములు నైన ♦ యెలగోలుగాలులు, విసరి విసరి వీచి ♦ విరతి నొందె. ౯౭

కం. వారిధరవారముల మద, వారణసంతానములయు ♦ బర్హిగతులయున్
వీరవర! కొండవంకల, యారావ మ్మొక్కమాటె ♦ యణఁగెను వింటే. ౯౮

కం. ఓలిని వారిదధారల,జాలున నిర్మలము లైన♦ శైలంబులప్ర
స్థాళులు విచిత్రకాంతుల,చే లిప్తము లైనరీతిఁ ♦ జెలఁగెడి నౌరా. ౯౯

కం. ప్రీశావతి నవసంగమ,వేళను జఘనములఁ జూపు♦విధముగను శర
త్కాలంకషయున్ సైకత,పాళుల మెలమెల్లఁ జూపు♦భంగులు కంటే. ౧౦౦

కం. శారదిశాఖాతతులం, దారాగణతరణికుముద♦ధవకిరణములన్
వారణసత్తమముల నిజ,సారద్యుతిఁ బంచి యమరె ♦ శారద యనుజా. ౧౦౧

కం. శారదగుణాత్తయును నా,నారుచిరద్యుతియు నైన♦నవ్యశ్రీ బా
లారుణకరబోధిత మగు,నీరేజాకరమునందు ♦ నెఱ నెఱిఁగాంచెన్. ౧౦౨

కం. ఘనసారవృక్షసుమవా,సన లై మత్తాళిబృంద♦ఝుంకారము లై
గొనబుగ మదవారణముల,కును దర్పము రేఁపె గాడ్పు♦కొదమలు వనిలోన్.

సీ. జంట జంటలు గాఁగ ♦ శైవాలినీపులి,నావళియందుండి ♦ యరుగుదెంచి
కొలఁకులఁ గ్రీడింపఁ ♦ గుతుకంబు గొని తమ,ఱెక్కలు విచ్చుచు ♦ త్రేసి యాడి
పుష్పాళ్ళు బుక్కాము♦పొళ్లుగా మెయినిండ, నెలమిని నొండొంటి♦నెదురుకొనుచుఁ
జక్రవాకంబులుఁ ♦ జక్రాంగకంబులుఁ, గేళిఁ దేలుచు నున్న♦లీలఁ గంటె

ఆ. మదము దొట్టఁ దిరుగు ♦ మాతంగములయందుఁ, గ్రొవ్వి తిరుగులాడు♦కోడెలందు
నీరు తేఱి పాఱు ♦ నిమ్నగాతతులందు, ఋతువులక్ష్మిదోఁచె ♦ నెన్నొగతుల. ౧౦౪

ఆ. చూచి మబ్బులేని♦చుక్కదారిని దమ, పించియములనగలు ♦ విడిచి ప్రియలఁ
దలఁగి కాంతి దొఱఁగి ♦ ధ్యానముల్ సేసెడి, నెమ్మిసిందు వనుల ♦ నెమ్మి జాఱ.

చం. గరగరజాళువాపసిఁడి♦గౌరవుఁగాంతులు నిండ దిక్కులన్
నెరవిరినిండువ్రేఁకనను ♦ నేలకు వంగినకొమ్మ లెల్లెడన్
గరమును నేత్రపర్వముగఁ ♦ గ్రాలఁగ ఘు మ్మని కమ్మవాసనల్
నెరయఁగఁ జేయుమంకెనల ♦ నీటు వహించె వనాళు లియ్యెడన్. ౧౦౬

మ. కరిణీసంతతి వెంట నంట నళినీ♦కాండప్రియంబుల్ కరుల్
వరనూనోత్థితముల్ మహావనతటీ♦వాహ్యాళిసంసక్తముల్
గురుదానోత్కటముల్ మహామదరసా♦లోలంబు లై మందసం
చరణస్ఫీతము లయ్యెఁ గాననములన్ ♦ సౌమిత్రి కంటే కదా. ౧౦౭

చం. చెలఁగె నభం బదే చికిలిఁ♦జేసినవాలులడాలునన్, నదీ
జలములు సన్నగిల్లె నెల♦జే వ్వన మెక్కుమెలంతనమ్మనా
జలరుహశీతవాతముల♦సంచరణం బొనరెన్, దిశాతతుల్
కళకళలాడుచున్నవి ప్ర♦గాఢపుఁజీఁకటి తమ్ముఁ బాసినన్. ౧౦౮

ఉ. వేఁడివెలుంగుకాఁకలకు ♦ బీఁటలు వాఱఁ దొడంగెఁ బంకముల్
మాఁడినయట్లుగా ధరణి ♦ మాటికి రేఁగెను సాంద్రధూళి, మ
న్నీఁడులు వైరకోపముల ♦ నీఁగఁగ నొండొరులన్ జయింపఁగాఁ
బోఁడిమి దండయాత్రఁ జనఁ ♦ బూనఁగఁ గాల మి దయ్య లక్ష్మణా. ౧౦౯

ఉ. పొంకముగా శరత్సుగుణ♦పుంజసుతుష్టశరీరశోభ ని
శ్శంకముగాఁగఁ గ్రుమ్మరుచు ♦ సాంద్రముదంబునఁ బోతరించి పెః
హుంకృతు లొప్పఁ గొమ్ము లొక♦యోరగ వ్రాలుచుచుః ఖణి ల్లనః
అంకెలు వైచి చివ్వకును ♦ అక్కడిఁ గాళ్లు వృషాళి మందలన్. ౧౧౦
చం.నలినశరప్రపీడితమ♦నంబునఁ దీవ్రగతానురాగ మై
కులచయసంయుతం బగుచుఁ ♦ గూరిమి మీఱఁగ మందయాన మై
సలలితభంగిఁ దోఁపఁగ వ♦శాచయ మాత్తమదుః నిజేశ్వరుః
దలఁగక వెంట నంటెడిని ♦ దమ్ముఁడ చూచితె కాననంబులన్. ౧౧౧
కం.తోడవు లగుమేలిపురులః, విడిచి నదీతీరమునకు ♦ వెడలఁగ హంసల్
వడి గద్దించిన మరలెడి,వడువున దైన్యమునఁ జనెడి♦బర్హులఁ గంటే. ౧౧౨
కం.జక్కవల నీరుకోళ్లను, జక్కఁగ దిగు లొంద నెగిచి ♦ సామజములు అం
పెక్కఁగ నలినాలంకృత, మక్కొలఁకుం గలఁచి కలఁచి ♦ యంబులు గ్రోలెన్.
కం.అస లుడిగి విమలజలములు, నిసుమును వెలుఁగఁ గ సధేను♦బృందం బగుసా
రసరావరణితతటినీ,రసముల సారసచయంబు ♦ రమణం గ్రుంకెన్. ౧౧౪
చం.ఎడపక దూఁకు చున్న సెల♦యేళుల చప్పుడు, వృద్ధి గొంచుఁ దా
ముడుగక మ్రోయు చుండెడిమ♦యూరరవంబులు, గాలిమ్రోఁతలుః,
ముడుఁగక కట్టుఅట్టు యని ♦ మ్రోఁగెడుకప్పలనాదుఅంపులుః
బోడ వడఁగెః ముదంబు చెడ ♦ భూరివలాహకగర్జతోడుతన్. ౧౧౫
కం.పెక్కులువన్నెలపాములు, బక్కటిలి నపోదితాబ్ద♦పరిలీనము లై
డొక్కలు మాఁడఁగ నాఁకట, బొక్కలు వెలువడి చరించు ♦ బుసు బుసు మంచున్.
కం.చంచచ్చంద్రకరస్ఫు,ర్యాంచిత ముద్వేకచతార♦కాన్విత యారా
మించఁగ రాగము సంధ్య త్య,జించెడి నంబరముఁ దాన ♦ చెలువుగఁ గంటే.౧౧౭
కం.ఉదితశశిరమ్యముఖ తమి, విదితోడువ్యక్తచారు♦విమలాంబక కౌ
ముదకౌముదీవసన యయి, యిదె రే వెలిచీరఁ దాల్చు♦నింతిం బోలెన్. ౧౧౮
ఉ. పండినయెన్నుజొంపములు ♦ భాసిల ముక్కుల సారసావళుల్
దండిముదంబునః మొగులు♦దారిని మారుతవేగధూతముల్
నిండుజవంబునం బఱచె ♦ నిర్మలశీలక! పెక్కువన్నెపూ
దండలు గూర్చి నింగి యను♦తామరసాక్షి ధరించినట్టు లై. ౧౧౯
ఉ. నిద్దురగొన్నహంస మయి ♦ నిర్మలకైరవవారయుక్త మై
యద్దిర పే రగాధపుజ♦లాశయమండలినీర మొప్పెడిః

రద్దు పడంగ మేఘములు ♦ రాకనిశాకరుతోడఁ జుక్కలన్
ముద్దులు మూటఁగట్టునభ♦ముం దలఁపించుచు నూర్జిళాధవా. ౮౨౦

ఉ. రాణ దలిర్పఁగా లలిత♦రాజమరాళకులంబు చుట్టు నొ
ప్పాణముతీవఁ దాల్పఁ, బ్రక♦టస్ఫుటనీలసరోజపద్మముల్
పోణిమి మీఱుపేరులను ♦ బోలఁగ, నూతులు భూమిశాంగ లొ
నేణవిలోచనామణుల♦యింపు వహింపఁగఁ గంటె లక్ష్మణా. ౮౨౧

సీ. గోపాలబాలురు ♦ కొమరొప్ప వాయింపఁ, బిల్లఁగ్రోవులఁ బుట్టు♦ప్రియరవంబు
రెపరెప మని వీచు♦రేపటిపూఁటల,యెలగాలి జనియించు♦హితనదంబు
వ్రేండ్లపూవుంబోండ్లు♦పెరుఁగుచిల్కఁగఁబుట్టు,ఘుంఘుమమనియెడి♦కొమరుటులిపు
చియ్యపట్టినకోడె ♦ లొయ్యన నసగూఁట, సారెకు నినుచు హుం♦భారవంబు

తే. లేఁగలను విడుకాలంబు♦గాఁగ నవియు, నాఁకొనుటను నంజే యని ♦ యఱచునాదు
చేలకును జెట్లకును జను♦హాలికులని,నాద మిప్పుడు తఱ చగు ♦ నగరములను.

చం.నలలితవేణికాకుసుమ♦సంచయభూరివిభానమాన మై
పలుచనికోమలంపునునుఁ♦బయ్యెర కొయ్యన సంచలించు చున్
వలిపపుఁబట్టుబుట్టవు బె♦ణంగు వహించిన తెల్లుపూవులన్
గులుకుమెఱుంగుకూలముల♦కోమలికంబును గంటె తమ్ముఁడా, ౮౨౩

చం.ప్రకటవనప్రచండమధు♦పానకళాభృశశౌండహృద్యహా
ర్షకభసలీప్రకాండయుత♦సప్తపతాండవితద్విరేఫముల్
మకమలరేణుగౌరతను♦శోభ వహించి మదంబుపెక్కఁ గొం
చక పవనానుయాత్ర నదె ♦ సల్పుచు నున్నవి చూడు లక్ష్మణా. ౮౨౪

ఉ. తేటెను వారిపూరములు ♦ దెల్వి వహించెను గైరవావళుల్
దేటెను గొంచపిండునకుఁ ♦ దీయనినాదము, పక్వసుస్థితిన్
మీఱెను శాలికాననులు ♦ మెల్లన వీవఁ దొడంగె వాయువుల్
జాఱుట వానకాల మిదె ♦ చంద్రుఁడు సాంద్రరుచిన్ వెలింగెడిన్. ౮౨౫

తే. మేల్మి మీనోపదర్శిత♦మేఖల లయి, యలసగతు లయ్యె వాహినీ♦జలజవదన
లతులరతులను బ్రియులతో♦నసఁగి పెనఁగి, వేగ వసివాళ్లు వడిచను♦వెలఁదులనఁగ.

కం.జక్కవలన్ శైవాలపుఁ,బెక్కువలన్ తెల్లుపూవు♦వెలిచేలములన్
మిక్కిలి నదిముఖములు సొం,పెక్కెను సతిముఖములట్లు ♦ భృతపత్రములై. ౮౨౭

కం.వనముల వికసితబాణా,సనముల మధుపానమత్త♦షట్చరణమహా
స్వనముల నుద్యతబాణా,సనదండుఁడు మరుఁడు సలుపు ♦ సంచారములన్. ౮౨౮

తే. తతము జగతికి జీవన♦దాన మొసఁగి, యెల్ల చెఱువులుఁ గొలఁకులు ♦ నెల్ల నించి
భూమిఁ బైరులఁ బంటలఁ ♦ బొసఁగఁ జేసి, యంబుధరములు నష్టంబు ♦ లయ్యె నిపుడు.
తే. సుప్రసన్నోదకంబుల♦శోభతోడ, నింబుమీఁటిన కురరీర♦వంబుతోడ
హాళిఁ దిరిగెడిజక్కవ♦పాళితోడ, సరసు లెల్లను దోఁచెను ♦ సరసముగను. ౮౩౦
కం. కొండలచఱులన్ శ్యామా,దండము బంధూకకోవి♦దారాసనముల్
దండిగ వాసన లీనుచు, నుండెడి యేడాకులరఁటు ♦ లొప్పెడిఁ గంటే. ౮౩౧
కం. పులినతలంబులఁ గురరుల,విలసనముల సారసముల ♦ విహారణకేళుల్
సులలితరథాంగదంపతి,కలకలనాదములు వెలసెఁ ♦ గడురమ్యములై. ౮౩౨
కం. పరిపంథు లైననృపతులు, పరస్పరజయాభిలాషఁ ♦ బయనించుటకై
పౌరి యత్నముఁ జేయ నిదే, తరుణము సౌమిత్రి యింకఁ ♦ దడయం జనునే.

సుగ్రీవుఁడు సమయ మతిక్రమించినందునకు రాముఁడు విచార పడుట.

ఉ. వానరనాథపుత్త్రుఁ డిట ♦ వచ్చినవాఁడును గాఁడు, యత్నమేన్
జేసినజాడ లేదు, గడ♦చెన్ శరదృతువు నొంచుఁ బ్రొవృషన్
మాసచతుష్క,మర్కట సు♦మాళముగన్ ననుఁ గూడి యాడుసీ
తాసతిఁ బాసి శోకమునఁ ♦ దత్తఱలాడెడినాకు లక్ష్మణా! ౮౩౪
ఆ. చక్రవాకి భర్త♦సంగతిఁ బాయక, చనెడిరీతి విషమ♦వనమునకును
నాటతోఁట కరుగు♦న ట్లరుదెంచెను, భర్తృహితసమేత ♦ బాల సీత. ౮౩౫
ఆ. ఆలు లేనివాఁడు ♦ నార్తిఁ గుందెడువాఁడుఁ, బుడమి నెల్లఁ గోలు♦పడినవాఁడు
నకటా! ప్రవాసి ♦ యంచు నాపై దయ, రాదు తండ్రి! కీశ♦రాజునకును. ౮౩౬
ఉ. పోయెను రాజ్యమెల్లఁ, బరి♦భూతి గనన్ దనుజేంద్రుచేత, నీ
వా యను దిక్కు లేదు, కడు♦వందిరి యేడ్చుచు నున్నవాఁడు తా
జాయకుఁ గాఁగఁ గాపు యయి ♦ సమ్మతి నాశరణంబు నొందె, నం
చాయగచారి నాయెడ స♦నాదరబుద్ధి వహించెఁ దమ్ముఁడా. ౮౩౭
కం. తనకార్యము నెఱవేఱుట, మనతో నే మనుచు యునతి♦మార్గణకార్యం
బును దలఁపఁడు తనసమయం,బును మఱచె సకాలమునను ♦ భూజచరుండున్.

రాముఁడు లక్ష్మణునిఁ గిష్కింధకుఁ బోయి రమ్మనుట.

కం. పొమ్మా కిష్కింధకుఁ గనుఁ,గొమ్మా యామూర్ఖు భోగ♦కుటిలితమతి నీ
విమ్మాడ్కి ననుమ నావచ,నమ్ముగ సౌమిత్రి ప్లవగ♦నాథునితోడన్. ౮౩౯
తే. అర్థులై యాశ్రయించిన♦యర్థులకును
మున్నె యుపకార మొనరించి♦యున్నవారి

కాడియును బాస తప్పుచు ♦ నాశ చెఱుచు
వాఁడె పురుషాధముం డండ్రు ♦ ప్రాజ్ఞజనులు. ౮౪౦
తే. పాపమో పుణ్యమో మున్ను ♦ పలికినట్టి
పలుకు దప్పక సత్యంబు♦పక్ష మూని
నడచునవ్వీరుఁడే చుమీ ♦ పురుషమియందు
దండియుశ మొందుఁ బురుషోత్త♦ముండునాఁగ. ౮౪౧
కం.తనపనులు చక్కఁబఱిచిన,తనమిత్రుల మఱచునాకృ♦తఘ్నుఁడు చావన్
విను మాతని పీనుంగును, గననైనను గనవు శునక♦కంకశివాదుల్. ౮౪౨
కం. అని చెప్పు మతఁడు నిజముగ, ఘనతరమత్కనక పృష్ఠ♦గాఢవికృష్ట
స్తనితార్భటవిద్యున్నిచ,యనిభ శరాసనముఁ జూడ ♦ నాసం జేసెన్. ౮౪౩
కం.ముడివడ్డబొమలతో నే, నుడికెడుచిత్తంబుతోడ ♦ నుగ్రతఁ దివియన్
బిడుగులు క్రక్కెడునల్లియ, బెడితపుటంలి వతఁడు గోరె ♦ వెండియు వినఁగన్.
కం.ఎఱిఁగి యెఱింగియు మది నా, నెఱినెఱియున్ బాణశక్తి ♦ నీబాసట దా
నుఱఁడు గదే మనసమయము, మఱచెం దనపనులు దీరి ♦ మరగుట సుఖముల్.
కం.తనచెలిమి వాలివధ మేఁ, బనిపూనుట యేల యేమి♦బాస యొనర్చెన్
మనకు జడికారు చనఁ జల్పను సర్వము మఱచెఁ దనదు♦పని నెఱవేఱెన్. ౮౪౬
కం.వానలు వెలిసినతోడనె, నే నిట కరుదెంచువాఁడ ♦ నిక్కం బనియెన్
వానెలల్ నాలుగుఁ జనెఁ, దా నెఱుఁగఁడు స్వైరకేళి♦తత్పరుఁ డగుచున్. ౮౪౭
కం.ఇష్టజనగోష్ఠి దీరుచు, నిష్టంబుగొలంది త్రావి ♦ యెఱుఁగఁడు మనయీ
కష్టము దయఁ దలఁపఁడుగా, శిష్టనుతా! దుఃఖమునను ♦ జేడ్పడు నాపై. ౮౪౮
ఉ. కావున లక్ష్మణా! చనుము ♦ గాఢమదాగ్రహాతుల్యరీతి సు
గ్రీవునితోడ ని ట్లనుము ♦ కీశపతీ! మును వాలిచన్న యా
త్రోవను గంప మొల్లవు దఱ♦దుశ్చ్యవనాత్మజమార్గ మీవునుం
బోవకు వానరా! సమయ♦ముం దలపోయు మిఁకేని సీమదిన్. ౮౪౯
కం.వాలిని నొక్కని శరమునఁ, దూలం బుచ్చితిని మున్ను ♦ ద్రోహమతిన్ స
త్యాలాపము గమనింపని,బాలిశు నినుఁ ద్రుంతుఁ జుమ్ము ♦ బంధుయుతముగన్.
ఉ. వానరరాజ, నీపలుకు♦బాసను మీఱకుమీ, సనాతనం
బైనసుధర్మపద్ధతిని ♦ నాఱడి పెట్టకుమీ, త్వదగ్రజుం
గానఁగఁ బోకుమీ నిశిత♦కాండములన్ ధరఁ ద్రెళ్లి, యంచుఁ దీ
వ్రానలతేజ నానుడిగ ♦ నాడుమ యెయ్యది యుక్త మంతయున్. ౮౫౧

కం. దేవనిభుఁ డిట్లు భృశరో,షావిష్టుం డగుచుఁ బలుక ♦ ననుజుండును సు
గ్రీవు నెడ నదేవిధముగ, వావిరికోపంబుఁ దాల్చి ♦ వరబలనిలయున్ ౮౫౨

లక్ష్మణుఁడు రామునితో సుగ్రీవునిఁ దాను వధించెద నని చెప్పుట.

ఉ. కామముఁ పేర్మి దీనుఁ డగు♦కంజదళాక్షునిఁ జూచి పల్కె నో
రా మది సాధువృత్తముఁ ది♦రస్కృతి చేసి సుహృత్త్వలాభజా
తామితభోగసౌఖ్యముల ♦ నాత్మ గణింపఁడు, రాజ్యసౌఖ్యముల్
భూమిప నాశ మొందినను ♦ బుద్ధి స్మరించును నిన్ను నయ్యెడన్. ౮౫౩

కం. తుచ్ఛగ్రామ్యసుఖంబుల, నిచ్ఛించుచు మతి దొఱంగి ♦ కృత మెంచనియా
పుచ్ఛకటె రాజ్యసంపద, మచ్ఛరముల వాలి చనిన♦మార్గము చనుతన్. ౮౫౪

ఉ. కోపము నాఁపఁజాల రఘు♦కుంజర! త్రుంచెద నే ననూనృతా
లాపునిఁ గీశనాయకు ని♦లాసుత రోసెడిఁ గాక యంగదుం
డేపున నన్న నాత్మభయ♦దేషు శరాసనహస్తు శత్రుసం
తాపనదక్షు ఘోరసము♦దాయదురాగ్రహు రాఘవుం డనున్. ౮౫౫

రాముఁడు లక్ష్మణుని శాంతిపఱిచి కిష్కింధకుఁ బంపుట.

చం. తలఁచునె నిన్నువంటిగుణ♦ధన్యుఁడు నింతటిపాపకార్యముం
జలుపఁగ? మానవన్న, మన♦సఖ్యముఁ బూర్వపువృత్తభంగియుం
దలఁచి యథాప్రకారముగఁ ♦ దద్దయుఁ బ్రీతిఁ జరింపు లక్ష్మణా!
కలుషము సద్వివేకమునఁ ♦ గ్రాఁచుఘనుండు నరోత్తమాఖ్యుఁ డౌ. ౮౫౬

చం. ఇది మది నుంపఁబోకు, ప్లవ♦గేశ్వరుతోఁ బరుసంబు మానుచుం
మృదు వగువాక్యపద్ధతిని ♦ హెచ్చరికింపుము, క్షప్తకాల మ
య్యది తనవిస్మరించుట య♦టంచును శాత్రవవీరహంత స
ద్ధృది వచియింప నాతఁడు ని♦వృత్తనిజాశయుఁ డౌచుఁ వేగి నై. ౮౫౭

కం. వాసవచాపనిభం బగు,భాసురకోదండ మూని ♦ ప్రతిలయకాలుం
డై సౌమిత్రి సశృంగో,ద్భాసితమందరనగంబు♦పగిది రహించెన్. ౮౫౮

ఉ. అన్న వచించినట్లు తన♦యాడఁగయుక్తము లైనమాటలుం
దన్నుఁ గపీశుఁ డాడెడివి♦ధంబును గీష్పతితుల్యబుద్ధిసం
పన్నుఁడు లోఁ దలంచుచును ♦ బాదతలాహతిపాతితాశ్వక
ర్ణోన్నతసాలతాలమహి♦జోత్కరుఁ డై శిల లెల్ల నుగ్గుగన్. ౮౫౯

కం. సామజముం దలఁపించుచుఁ, గామక్రోధభవరామ♦ఘనకోపాగ్ని
స్తోమావృతుఁ డయి భయదం, బౌమారుత మనఁగఁ జనియె ♦ నతిత్వూర్ణముగన్.

కం. పుట్టినపనితొందరచేఁ, దట్టినయుద్రేకమునను ♦ దనకుడిపదముం
బెట్టుచు దవుదవ్వుగఁ దా, నిట్టలవున్వేగమునఁ జ ♦ నెం బురిచాయన్. ౨౬౧
కం. దట్టంపుగిరులనడుమను, బట్టనమును గీశ రాజ ♦ పాలితముం దా
నెట్టయెదుటఁ గని కపిపైఁ, బుట్టినకోపమున నధర ♦ పుట మదరంగన్ ౨౬౨

లక్ష్మణునిఁ జూచి క్రోఁతులు భయపడి పరువెత్తుట.

సీ. పురబహిశ్చరుల వా ♦ నరవర్యులను గాంచె, వారు నామానవ ♦ వర్యుఁ గాంచి
కరముల గిరిశృంగ ♦ తరువులఁ గొనదాన, బహ్వింధనంబుల ♦ జ్వలనుఁ దనఁగ
ద్విగుణితాగ్రహుఁడుగాఁ ♦ దేఱిచూడఁగలేక, లయకాలుఁడో యని ♦ భయముగదుర
గుంపులై కపులు ది ♦ క్కులవెంటఁ బాఱుచు, సుగ్రీవభవనంబుఁ ♦ జొచ్చి వేగ
తే. సాగ్రహుం డయి లక్ష్మణుఁ ♦ డరుగుదెంచు
విధముఁ దెలుపఁగఁ దారతో ♦ వివిధగతులఁ
గామియై కేళిఁ దేలుచుఁ ♦ గపికులేంద్రుఁ
డంతిపురి నుంట వినఁడు వా ♦ ాడునుడులు. ౨౬౩
సీ. సచివసందిష్టులై ♦ శాఖామృగాగ్రణు, లద్రినాగాబ్దాభు ♦ లైనవారు
దశనాగవిక్రముల్ ♦ దశగుణోత్తరబలుల్, సామజాయుతసత్త్వ ♦ సంగతులును
వికృతదర్శనులును ♦ ద్వీపిపరాక్రముల్, ద్రుమహస్తు లగుచును ♦ దుర్గములను
బ్రాకారములయందుఁ ♦ బరిఖలక్రేవల, విక్రమోదగ్రులై ♦ వెలసి రంత
ఆ. నన్న పడెడిబాధ ♦ యగచరనాథుప్ర,మాదపాటుఁ దలఁచి ♦ మనమునందుఁ
దీవ్రకోప మెసఁగ ♦ దీర్ఘోష్ణముగ నూర్పు, నెడల జేవుఱింప ♦ వీక్షణములు. ౨౬౪
తే. ధూమయుతపావకుం డనఁ ♦ దూపుములికి, జిహ్వగాఁ జాపదండంబు ♦ శీర్షముగను
దనదు తేజంబు విషముగఁ ♦ దనరురామ,సోదరుఁడు పంచవదనమా ♦ నురగ మనఁగ.

సుగ్రీవునకుఁ దనయాగమనవార్తఁ దెలుపు మని
లక్ష్మణుఁ డంగదుఁ బంచుట.

చం. ప్రలయకృశానుతుల్యుఁ డనఁ ♦ బ్రజ్వలుఁడై భుజగేంద్రుఁ డోయనఁ
గలితమహోగ్రహంబునను ♦ గ్రాలెడునాతనిఁ జేర నంగదుం
డలమినసాధ్వసంబునను ♦ నారటపాటున రాఁగ నాతనిన్
వలనుగఁ జూచి పల్కెఁ జని ♦ వత్స వచింపుము పిన్నతండ్రికిన్. ౨౬౬
మ. మదదుర్వారుద్ధముఁ డైనలక్ష్మణుఁ డిదే ♦ మాటాడ నీతోడఁ దా
మదిలో నగ్రజదుఃఖపాటునకు సం ♦ భ్రాంతుండు సంతప్తుఁడై
కదిసెన్ ద్వారతలంబు నీ కతనివా ♦ క్యం బైన నాలింపఁగా
నెదలోఁ గల్గిన నాచరింపు వనచా ♦ రీ! యుక్తమామార్గమున్. ౨౬౭

కం. అని వచియించి జవంబునఁ, జనుదెమ్మన శోకయుక్తిఁ ♦ జని జనకునకున్
జననికి రుమకును మ్రొక్కుచు, వినిపించె నుదంత మెల్ల ♦ విశదతరోక్తిన్. ౪౬౮
కం. మదనవిమోహితచిత్తుఁడు, మదమత్తుఁడు ఘనసుషుప్తి♦మదితుం డయి యం
గదుమాటలు వినఁ డిసజుఁడు, మదమత్తుల కెచట కెక్కు♦మనవుల్ గినవుల్. ౪౬౯
కం. చండౌఘునిభుని నృపుఁ గని, గుండెలు పగులంగ భీతిఁ ♦ గ్రోఁతులతుటుముల్
దండను గిచ కిచ మని రవ, మొండొండ నిగిడ్చెఁ గరుణ ♦ యుదయింపంగన్.

సుగ్రీవునకు మంత్రులు హితము బోధించుట.

సీ. ఆమహారవమున ♦ కల్లన మేల్కని, వ్యాకులహారభూ♦షాకులుండు
మదవిహ్వలారుణ♦మహితలోచనుఁడు తా, రాశజువాక్యంబు ♦ లాలకించె
నంగదునుడి విని ♦ యతనితో వచ్చిన, దారదర్శులుఁ జను♦వారుఁ గీశ
పతి కిష్టసచివులు ♦ ప్లక్షప్రభావాఖ్యు, లర్థ ధర్మంబుల ♦ నైకగతులఁ
ఆ. బలుక వచ్చియున్న ♦ పార్థివసుతుఁ గూర్చి, వృషునిమాడ్కి సముప♦విష్టుఁ డైన
ప్లవగనాథుతోడఁ ♦ బ్రస్తావ మొనరించి, హితము దోఁప నతని ♦ కిట్టులనిరి. ౪౭౧
కం. భ్రాతలు రాజ్యసుఖశ్రీ, దాతలు నీమిత్రవరులు ♦ దాశరథులు భూ
మీతలభరభరణార్హులు, నాతతసత్యాత్ములుగ మ♦హాభాగవరుల్. ౪౭౨
కం. ఆయిరువురందు నొక్కఁడు, దాయఁగ లక్ష్మణుఁడు చాప♦ధరుఁ డై రాఁగా
నాయతిబలుఁ గని భీతిని, గూయిడు చున్నవియు వింటె ♦ క్రోఁతులు తేఁడా.
కం. తనయన్న పనుప నేదో, పనిపడి నీతోడఁ గార్య♦పర్థతిఁ బలుకన్
జనుదెంచి నీకుఁ జెప్పఁగఁ, బనిచెం దారేయుఁ గినుకఁ ♦ బదటముపడుచున్.
కం. చూడ్కు లన కపుల మాడ్చెడి, మాడ్కిని నున్నాఁడు సుతుల ♦ మఱి బంధువులన్
దోడ్కొని చని పదములఁ బడి, వేడ్కొనుమీ యతని కోప♦వేగము దీరన్. ౪౭౫
తే. రాజ ధర్మాత్ముఁ డైనశ్రీ♦రామవిభుఁడు, చెప్పి నట్టులు చేయుము ♦ చిత్త మునిచి
నీవు పలికినవాక్యంబు ♦ నిలిపికొనుము, సత్యవాది వటన్న ప్ర♦శస్తిఁ గనుము.

లక్ష్మణుఁడు వచ్చినవార్త విని సుగ్రీవుఁడు భయపడుట.

కం. అని చెప్పఁ గినుక దశరథ, తనయుఁడు నిలుచున్నవాఁడు ♦ తనవాకిట సం
చనునంగదునుడి విని యా, సనమునఁ జలియించు చనియె ♦ సచివులతోడన్.
ఉ. ఆడను గీడుమాట, యెదు ♦ రాడను వారికిఁ, జేష్ట సేయఁగాఁ
జూడను, రామచంద్రునను♦జుం డిటు లేటికిఁ గోప మూనెనో?
యాడిరొ రంధ్రముల్ వెదకు♦నట్టివిరోధులు లేనిపోనివిన్
గీడొనరింప నాకు రఘు♦కేసరితోడ, నిఁ కేమి చేయుదున్. ౪౭౮

కం. తొలుదొలుత యథాస్థితిగాఁ, దెలియం దగు నతనిబుద్ధి ♦ తీరు నతండుం
జలుప నిట నిశ్చయించిన, యలవిధముం హితులచేత ♦ నతినిపుణముగన్. ౮౭౯

కం. భయపడను లక్ష్మణునకుం, భయపడ నొకయింత రామ ♦ భద్రున కైనం
బ్రియమిత్రుఁడు హేతువు లే, కయె కుపితుం డగుట కేను ♦ గళవళపడెదన్. ౮౮౦

కం. సులభము మిత్రులఁ జేర్చుట, కలసిన మఱి మైత్రి చెడక ♦ కాపాడుటయే
బలితపుఁగష్టము మది చం, చల మగుటను బ్రీతి చెడును ♦ స్వల్పంబునకేన్. ౮౮౧

కం. రాముఁడు నా కొనరించిన, యామేలున కేమి సేయ ♦ నగుఁ బ్రతికృతిగా
నామదిఁ దానిం దలఁచిన, నేమో భయ మొదవె నద్ది ♦ యీ డగుఁ జేయన్.

హనుమంతుఁడు సుగ్రీవునకు హిత ముపదేశించుట.

కం. అనవుడు సుగ్రీవునిఁ గని, హనుమంతుం డనియె నింత ♦ యానే నీ వా
ఘను కొనరించినమేలును, మనమున విస్మృతిని గనమి ♦ మార్తండసుతా! ౮౮౩

సీ. ఆరాఘవేంద్రుంపు ♦ వీరవరేణ్యుండు, శక్రాభవిక్రము ♦ జడుపు లేక
త్వత్ప్రియార్థము గాదె ♦ వధియించె వాలిని, బ్రణయకోపం బూని ♦ పార్థివుండు
పనిచె నిజానుజు ♦ ఘనబలు లక్ష్మణు, నీవు మత్తుండ వై ♦ యెఱుఁగ లేక
కాలంబు దాఁటుట ♦ లీలమై నుండిన, నతఁ డెచ్చరింపఁగ ♦ నరుగుదెంచె

తే. విచ్చెఁ గపురంపుటనఁటులు ♦ హెచ్చె మింట
నిర్మల గ్రహనక్షత్ర ♦ నికరములును
విచ్చుమొగ్గయ్యె మేఘముల్ ♦ విశదకాంతు
లలమె దిక్కులఁ గొలఁకుల ♦ నాపగలను. ౮౮౪

తే. చైత్రయాత్రకు నిది తగు ♦ సమయ మగుట, వారలను గానఁ బోకున్కి ♦ వారు నిన్ను
మత్తునిఁగ నెంచి రదియు ని ♦ మిత్తమూని, వచ్చె నిచటికి సౌమిత్రి ♦ వానరేంద్ర!

కం. హృతదారుఁడు దుఃఖార్తుం, డతులమహాత్ముండు రాముఁ ♦ డనుచుట ననుజుం
డతిపరుషము లాడినచో, హిత మని సహియింపఁ దగుఁ గ ♦ పీశ్వర నీకున్. ౮౮౬

కం. అపరాధివి వారియెడం, గపినాయక! దోషహరణ ♦ కరణక్షమ మా
నుపమ మఱి యొద్ది లే దిఁక, నిపు డంజలిఁ జేర్చి మ్రొక్కు ♦ మీ సౌమిత్రిన్.

కం. భూనాథనియుక్తులు నయి, మానవపతిమేలు గోరు ♦ మంత్రులు హితముం
మానక నచింప నర్హము, గానఁ జుమీ భయము విడిచి ♦ కల తెఱఁ గంటిన్.

కం. కోపించి రాఘవుం డురు, చాపంబును గేలఁ గొనిన ♦ ససురాసుర మై
దీపించు జగము నంతయు, స్థాపింపఁ గలండు తనవ ♦ శం బయి పరఁగన్. ౮౮౯

కం. తలఁచుచుఁ బూర్వోపకృతిం, దలఁగక మఱుమేలు సేయఁ ♦ దలకొనునీ వా
లలితాత్ముని వేఁడినచో, నలుగంగా నెట్టు నేర్చు ♦ నాతఁడు మరలన్. ౮౯౦

చం. తరలుము పుత్రమిత్రసహి♦తంబుగ, నాతనిఁ జేరఁబోయి నీ
కరములు మోడ్చి మ్రొక్కి, సతి ♦ కాంతువశంబున నిల్చునట్లుగా
హరివర! నిల్వు నీదుసమ♦యంబును దప్పక తద్వశంండ నై
యరమర మేల నానుడి హి♦తార్థముగాఁగఁ బరిగ్రహింపుమా. ౮౯౧

తే. రామ రామానుజాజ్ఞ శా♦ఖామృగేంద్ర, తలఁగిచనఁ జిత్తమం దేనిఁ ♦ దలఁపవలదు
నీమన మెఱుంగుఁ గాదె సు♦త్రామునిభుని, సానుజునిరాము మానుష♦మైనబలము.

లక్ష్మణుఁ డంగదునితో సుగ్రీవునంతఃపురంబుఁ జొచ్చుట.

సీ. అచట నంగదుచేత ♦ నాహూతుఁ డై సుమి, త్రాత్మజుఁ డరిగె గు♦హాంతరమున
భూరివిక్రము లైన♦ద్వారపాలురు లేచి, ప్రాంజలు లై నిల్వఁ♦బడిరి గాని
కుపితుఁ డై రోఁజెడి♦నృపసుతు డాయంగ, సాధ్వసవశమునఁ ♦ జనఁ డోకండు
రత్నమయం బయి ♦ రమణీయ మై దివ్య, మై పుష్పితారామ ♦ మగుచు హర్మ్య
తే. సౌధసంబాధ మగుమను ♦ సర్వకామ, ఫలుల సుమముల రాజిలి ♦ లలితదేవ
యక్షగంధర్వపుత్రికీ♦శాళిచేత, దివ్యమాలాదిధరుల చేఁ ♦ దేజరిలుచు. ౮౯౩

తే. చందనాగరుపద్మాళి♦సంతతులను, సారమైరేయమధురస♦పూరములను
నధికవాసిత మైనమ♦హాపథముల, మేలిసెలయేళ్లఁ గాంచె సౌ♦మిత్రియచట.

సీ. అంగదుగృహము మైం♦దాలయంబును గజ, ద్వివిదగవాక్షుల♦వీళ్లు గవయ
శరభవిద్యున్మాలి♦సంపాతిసూర్యాక్ష, వాయుతనూజుల♦వాసములును
వీరబాహుసుబాహు, తారసుషేణుల, నలనీలకుముదుల♦నిలయములును,
జాంబవంతుం డుండు♦శాలయు దధివక్త్ర, సదనంబును సునేత్రు♦సద్మతలము
తే. మఱి సుపాటలునవసించు మ♦మందిరంబు, పాండురాభ్రప్రకాశముల్ ♦ ప్రకటధాన్య
ధనసతీజననిబిడముల్ ♦ ఘనజవుండు, శౌరిఁ గనుఁగొంచు నరిగె సం♦తోషమతిని.

ఉ. పాండురసాలసంవృతము ♦ బాధమరాపదముర్ మనోజ్ఞ మా
ఖండల గేహసన్నిభము ♦ కాంతి గిరీశగిరిప్రతీపముర్
దండిగ సర్వకామఫల♦ధారిణిజోత్కరరాజితంబు నా
ఖండలదత్తదివ్యనగ♦కల్పితసౌఖ్యము దీప్తిమంతమున్. ౮౯౬

తే. దివ్యమాల్యావృతంబు దే♦దీప్యమాన, తప్తకాంచనతోరణో♦ద్భాసితంబు
నాయుధీయాన్వితద్వార♦మైనసూర్య, తనయుమందిర దేశంబుఁ ♦ గనుచు వేగ.

కం. బలియుండు నిరంకుశగతి, నిలయము, జొరఁబాఱి పద్మినీకాంతుఁడు వ్యో
తలముం జొచ్చెడిక్రియఁ గ, క్ష్యల నేడిటి నరగఁగడచి♦చనుచు సుమతియున్ ౮౯౮

తే. హైమరాజతపర్యంక♦దామములను, సురుచిరవరాసనాళి నా♦స్తరణములను
రమ్యతర మైనయంతిపు♦రంబుఁ జొచ్చి, తతవరోహాపగర్వశ♦సతులఁ గనియె.

కం. సమగీతపదాక్షరముల్, విమలమనోజ్ఞస్వరంబు ♦ వీణారవముల్
రమణీయభూషణోత్తమ, రమణుల హారణుల వినియె ♦ రాఘవుఁడు కనెన్. ౯౦౦
కం. ఆపోవనివారు సభూ, షాపరిలిప్తాంగకులు న ♦ చారుతరపటి
దీపితమాలోరస్కులు, రూపింపఁగ లేరు వాన ♦ రుని సేవకులన్. ౯౦౧
కం. రాజితమణిమయనూపుర, కూజితములు మేఖలలయ, కుంచితరవముల్
రాజకుమారుఁడు విని ల, జ్జాజుష్టమనస్కుఁ డయ్యె ♦ సౌధమునందున్. ౯౦౨
కం. ఆనాదము విని కుపితుఁడు, జ్యానాద మొనర్చి నిండ ♦ సకలదిశలు వే
వే నడచి యువతిరహిత, స్థానంబున నిలిచె రామ ♦ తాపార్తుఁడై. ౯౦౩
కం. అమహార్వ్రవమును విని, హైమాసనమందు వణఁకె ♦ నగచరపతియుల్
సౌమిత్రి వచ్చెరా యని, మోమును వెల వెల్లఁబాఱ ♦ ముంచినభీతిన్. ౯౦౪

→ లక్ష్మణుని సమాధానపఱుప సుగ్రీవుఁడు తారను బంచుట. ←

శా. తారేయుండటు వచ్చి తన్ బిలువఁ జెం ♦ తం గ్రాలు తారాసతిన్
నీరేజాప్తసుతుండు గాంచి యనియెన్ ♦ నీరేజపత్రేక్షణా!
శ్రీరామానుజుఁ డెంతయున్ మృదుల మా ♦ చిత్తంబువాఁ డెప్పుడున్
భూరిక్రోధవశాత్ముఁ డై యిపుడు రాఁ ♦ బూనంగ నేహేతువో. ౯౦౫
కం. కారణము లేక సాధువు, పూరుషసత్తముఁడు కోప ♦ మును బూనం డే
నేరముఁ గావించితిమో, యారసి నాకెఱుఁగఁ జెప్పు ♦ మా బుద్ధిమతీ! ౯౦౬
కం. కాదేని నీవ వే చని, భూదయితకుమారుఁ గాంచి ♦ పురుసాంత్వోక్తిన్
సాదరమతిగాఁ జేసి ప్ర, సాదంబును బడయుమీ వి ♦ శాలసునేత్రా? ౯౦౭
కం. పరిశుద్ధమనస్కుఁడు నినుఁ, దరుణీ! కని కోపగింపఁ ♦ దలఁపఁడు శాంతిం
బొరయు, మహాత్మకు లెప్పుడు, గిరితలయెడ దారుణంబుఁ ♦ గావింపరుగా. ౯౦౮
కం. మును నీవు సాంత్వవచనం, బున నతనిఁ బ్రసన్నచిత్తు ♦ మొనరఁ జేయుము నేఁ
జనుదెంతు వెనుక మృగలో, చన! యాపితకమలనయను ♦ సందర్శింపన్. ౯౦౯

→ తార లక్ష్మణునితో సంభాషించుట. ←

కం. అనిన మదవిహ్వలాక్షియుఁ, జనె నడుగున నడుగు నిడుచు ♦ సౌమిత్రిని డా
యను లంబమానరత్నర, శనయై సమితాంగయష్టి ♦ సహాలక్షణయై. ౯౧౦
కం. చనుదెంచు వానరేంద్రుని, వనితఁ గని మహాత్ముఁ డతఁడ ♦ వాఙ్ముఖుఁడై శ్రీ
జనసన్నికర్షమునఁ దాఁ, గనలు శమింపఁగ నుదాస ♦ గతి వర్తిల్లెన్. ౯౧౧
తే. పానవశమున సిగ్గును ♦ బాయఁ దట్టి
జనవరతనూజదృష్టిప్ర ♦ సాదమునను

జనవు మెఱయు మహార్థంబు ♦ సాంత్వపూర్వ
మయినవాక్యములఁ దాం యి ♦ ట్లనియె నపుడు. ౯౧౨

ఉ. క్ష్మావరనందనా! కినియఁ ♦ గారణ మెయ్యది? యుష్మదాజ్ఞఁ దాఁ
గావర మెత్తి యెవ్వఁ డిటఁ ♦ గా దని చేయక యుండునాఁ, దశం
కావిలవృత్తి శుష్కమహీ♦జాన్వృతకానన మేర్చువహ్నికీ
లావళి దూఁక నెవ్వఁడొకో ♦ యాసపడున్ శలభంబురీతిగన్. ౯౧౩

కం. చంచలనయనామణి ని,ర్వంచనముగ సాంత్వపూర్వ♦వాక్యములఁ దనుఁ బ్ర,
శ్నించిన ననియెం బ్రణయో,దంచిత మగుసూక్తి రాము♦తమ్ముఁడు సతికిన్. ౯౧౪

లక్ష్మణుఁడు తారతో సుగ్రీవుఁడు సమయాతి
క్రమణంబుఁ జలుపుట చెప్పుట.

శా. ఏమీ భర్తృహితాత్మురాల! మది నిం♦తే నీవు యోజింపవా?
కామోద్రేకిత నర్థధర్మవిధులం ♦ గానండు, కావింపఁడున్
భూమీపాలనమున్, గణింపఁడు మమున్ ♦ భూరివ్యథాయుక్తులన్,
సామాత్యుం డయి నీమగండు సతి! పా♦నం బెప్డు సేవించెడిన్. ౯౧౫

కం. నాలుగునెలలను గడు విడి,గోలా! నీమగఁడు లెస్స ♦ గ్రోలుచు మదిరన్
గాలము చనుటను గేళిం, దేలుచు నెఱుఁగండు నీవు ♦ దెలుఁపఁగ రాదే. ౯౧౬

కం. పానంబును గొనియాడరు, మానిని! ధర్మార్థసిద్ధి ♦ మదిఁ గను సుమతుల్
పానంబు చెఱుచు నర్థము, పానంబే ధర్మకామ♦భంగముఁ గూర్చున్. ౯౧౭

కం. ఉపకారి కొనర్పమిఁ బ్ర,త్యుపకారము ధర్మలోప ♦ మొదవెడి నర్థం
బపగత మగుఁ గామము చెడుఁ, జపలాక్షీ! సుగుణిమిత్ర♦సంచ్యుతిచేతన్. ౯౧౮

తే. అర్థకామవరిష్ఠుని ♦ నమలచరితు, సత్యధర్మపరాయణు ♦ సఖుని విడిచి
ధర్మహాని ఘటించెను ♦ దక్కినట్టి, రెండు విడనాడె నీదును♦గండు తార! ౯౧౯

తే. కార్యతత్త్వజ్ఞురాల! శా♦ఖామృగేంద్ర,విభుఁడు కార్యంబు నిట్లు గా♦వించినాఁడు
కాన మాకిఁకఁ జేయ నౌ♦కార్య మెద్ది, చెప్పుమీనీవ చక్క యో♦జించి యిపుడు.

తే. అనిన నతనిధర్మార్థస♦మాధియుక్త, మతులమధురస్వభావ మై♦నట్టిపలుకుఁ
దార యాలించి వారల♦కారియమ్ముఁ, దెలిసి పతికార్యవిశ్వాస♦కలితఁ బలికె.

తార లక్ష్మణుని సమాధానపఱుచుట.

ఉ. కోపము సంహరింపు నర♦కుంజర! కా దిది కోపకాలమున్
గోపము సేయ నౌనె యను♦కూలచరిత్రుల నాత్మబంధులన్?
మీపనియందు శ్రద్ధఁ గల♦నిర్మలచిత్తుప్రమాదపాటు సం
తాపితవీరవైరి! తగ♦దా క్షమియింపఁగ నిన్ను బోఁటికిన్. ౯౨౨

కం. బలవంతుఁ డైనమనుజుఁడు, బలహీనులమీఁదఁ గోపపడు నె కుమారా!
యీలశాంతిసత్త్వములకుం, దలఁకుగునీబోఁటి కినియఁ దలఁచునె యకట్టా.

కం. ఎఱుఁగుదు రామునికోపము, నెఱుఁగుదు కాలంబు చనుట గారాలమే తే
నెఱుఁగుదుఁ బయి మాకార్యము, నెఱుఁగుదు నే సర్వ మాత్మ నెఱుఁగుదు నైనన్.

కం. తెలియుదుఁ గామబలంబునఁ, గలుగునుదివికారమాఁపఁగా రా దనుచున్
దెలియుదు సుగ్రీవుం డే,జలజాక్షులతోడఁ గామపరుఁ డగుటయున్. ౨౬

తే. ఆగ్రహమునకువశ మైనయట్లు నీదు,బుద్ధి చిక్కదు స్వతంత్రములకు వత్స!
కామవశుఁ డైన మనుజుండు గాంచు నయ్య, దేశకాలార్థధర్మముల్ ధీరహృదయ?

కం. ననుఁ గూర్చి కామవృత్తం,బున లజ్జాహీనుఁ డయ్యెఁ బురుషాగ్రణి! నీ
యనుజుని వానరవల్లభు, ననఘా! క్షమియింపుమీ దయాళంబగుణా. ౨౭

చం. నిరఘతపోభికాములు వినిగ్రహధర్ములు నైనమహాత్ములే
పరఁగుచుఁ గామతంత్రులయి బంధురమోహవశాత్ము లైనచో
గురుచపలస్వభావుఁ డగుక్రోఁతి యహో గురుసౌఖ్యతృప్తిమైఁ
బరఁగుచు నుంట చిత్రమె కృపాగుణభూషణ! నీవ చెప్పుమా. ౨౮

కం. అనుచు మహార్థపువాక్కులు, వనితామణి పల్కి వెండి నసజాతునితో
నను మదవిహ్వలలీలగఁ, దన పెనిమిటికిన్ హితంబు దలకొనురీతిన్. ౨౯

కం. జేతనము సేసెను మున్నే,క్షితినాథతనూజ నీదుకోసముఁ దీర్పన్
రతిపతివిధేయుఁ డయ్యును, క్షితిరుహచరవల్లభుండు కినియఁగ నేలా. 30

కం. బలయుతులు కామరూపులు, పలువురు కోట్లానఁగోట్లు పర్వతవాసుల్
బలిముఖులు వీరె వచ్చిరి, సలిలాశయచరులు కార్యసాధనశక్తుల్. 3౧

ఉ. అంతిపురంబులోపలఁ బరాంగన యుండుట, చూడ దోషమౌ
స్వాంతముతోడ నిల్చి తిటఁ జాలిక నమ్ము సుశీలరక్షణం
బెంతయుఁ జేసి తీ విటు, లహీనగుణా విను మైత్రిచేత స
త్స్వాంతులు నాస్త్మమిత్రజనదారలఁ జూచుట దోషమా? యనన్. 3౨

→ లక్ష్మణుఁడు సుగ్రీవునిఁ జూచి నిష్ఠురంబు లాడుట. ←

ఉ. దేవనిభుండు తన్ను సుదతీమణి పిల్చుటఁ జేసి కార్యపుం
దీవరపాటుచేతఁ జని దివ్యమహాభరణోజ్జ్వలాంగునిన్
దేవధవాభు దుర్జయుని దివ్యసుమాంబరు దివ్యరూపు సు
గ్రీవు సతీసమావృతునిఁ గీర్తిపరున్ మృదుతల్పసంయుతున్. 33

కం. కని జేవురించఁ గన్నులు, కనలున లయకాలునట్లు గ్రాలంగ రుమా
వనితాయుతుఁ డాభాస్కరతనయుఁడు గనె విపులనేత్రు దశరథపుత్రున్. 3౪

సీ. అప్రతిహత తేజు ♦ నాగ్రహావిష్టు స,మాగతుఁ బురుషసిం♦హంబు గోపి
నిశ్శ్వసమాను ప♦హ్నిప్రభాదీప్తుని, భ్రాతృశోకసుతప్తు ♦ బలవదగ్ర్య
నారఁ గనుంగొని ♦ వ్యథితేంద్రియుం డయి, తతపరిష్కృతహారి♦ధ్వజమువోలె
హేమాసనమునుండి ♦ యిలపయి దుముకంగ, శశివెంటఁ జనెడిన♦క్షత్రచయము
తే. లట్లు రుమయును దక్కిన♦యంబుజాక్షు, లొకటఁ బీరములను డిగ్గ ♦ నుత్తికి రంతఁ
గేలు జోడించి వడఁకుచుఁ ♦ గీశవరుఁడు, కల్పవృక్షముపోలికఁ ♦ గ్రాలుచుండె.
కం. తారావృతశశిపోలిక, నారసనేత్రాసమూహా♦సంవృతుని వనీ
చారిని రుమాద్వితీయునిఁ, గ్రూరాగ్రహాయుక్తి మనుజ♦కుంజరుఁ డనియెన్. ౯౩౭
కం. నిజమరియుఁ గృతజ్ఞుండును, విజితేంద్రియుఁ డధికకరుణ ♦ వెలసెడిసత్త్వా
భిజనయుతుం డైనమహీ,భుజుఁడే మనిగా లోకమునను ♦ బూజ్యుం డెందున్.
కం. మేలొనరించినవారికి, మేలొనరింపఁగను బ్రతిన ♦ మేకొని గర్వం
బేలేసమును గావించెడి, బాలిశుకంటెన్ ఖలుండు ♦ పలుకు మెవండో. ౯౩౮
ఉ. మావునఫల్ల బొంకినను ♦ మావులు నూఱిటిఁ జంపుపాప మౌ,
నావునపట్ల బొంకినను ♦ నాలను వేయిటిఁ జంపుపాప మౌ,
భాసముఁ దప్పి పూరుషుని ♦ పశుమునం దనృతంబుఁ బల్కినన్
వావిరి తన్ను నాత్మజన♦వర్గముఁ జంపును మూలముట్టుగన్. ౯౩౯
కం. మును మేలొనరించినహిత,జనములకున్ మరల మేలు ♦ సలుపం దలపో
యని నీచుండు కృతఘ్నుఁడు, వినుమా వధ్యుండు భూత♦వితతికి నెల్లన్. ౯౪౦
కం. వినుమా కృతఘ్నుఁ గనుఁగొని, కినుకను వచియించె మున్ను ♦ కీశపతీ భూ
జనవందితుఁడు స్వయంభువు, మనమున నిపు డైన నెఱుఁగు♦మా ధర్మవిధిన్ ౯౪౧
కం. ధరణీసురునిం జంపిన, సురఁ ద్రాగిన ముచ్చిలింప ♦ సువ్రతము చెడన్
బరఁగును బ్రాయశ్చిత్తము, ధర నిష్కృతి లేదు సూ కృ♦తఘ్నున కెందున్. ౯౪౨
తే. తొలుత రామునిచేఁ గృతా♦ర్థుండ వగుచు, మాఱు సేయనికతమున ♦ మానహీన
కుటిలుఁడవునీవు మఱికృత♦ఘ్నుఁడవు నీ వ,నార్యుఁడవు నీవు కల్లరి ♦ వగచరేంద్ర!
ఉ. చెప్పుము నీవె రాఘవుని♦చేతఁ గృతార్థుఁడ వైై ప్రతిక్రియం
దప్పక నీవు చేయఁగ మ♦నంబునఁ గల్గిన సీత రోయఁగాఁ
దెప్పునఁ బూన వేల? సుద♦తీరతసక్తునిఁ గల్లరీని నిన్
గప్పియెలుంగుపాము వని ♦ కానకపోయెను రాముఁ డక్కటా. ౯౪౪
ఉ. ఏపరి దీనవాక్యముల ♦ నేడ్చిన నిన్గని జాలిచే నయో
పాప మటంచు నాత్మఁ గొని ♦ పాపరతా! దురితాత్మ! నిన్ను సం

ప్రాపితరాజ్యుఁ జేసె రఘు♦భర్త మహాత్ముఁడు, మే ల్దలంపఁగా
నోపవయేని ని న్నిపుడ ♦ యుగ్రతఁ బంపును వాలిఁ జేరఁగన్. ౯౪౫
కం. అలవాలి చనినమార్గము, కలుషాత్మక మూఁత వడదు ♦ కాన సమయమున్
దలఁపుము సత్యము పట్టుము, తలఁపకుమీ యన్నత్రోవఁ ♦ దరలఁగ నీవున్. ౯౪౬
కం. పవిసన్నికాశముల రా ఘవచాపవిముక్తశాత♦కాండములన్ నీ
నవివేకి! కనకికతన వి,భవములనే మరగి రాము♦పనిఁ దలఁపవుపో. ౯౪౭

## తార లక్ష్మణుని శాంతి పలుకుట.

కం. అని కొఱవిఁ జూఁడినట్లుగ, ఘనకోపమునన్ నచించు♦కాకుత్స్థవరున్
గనుఁగొని యి ట్లనుఁ దారా,వనజాయతనేత్ర సాంత్వ♦వచనరచనలన్. ౯౪౮
చం. ఇటు సరిగాదు నీకు వచి♦యింపఁగ లక్ష్మణ, వానరేంద్రుఁ డీ
కటుతరభాషణంబు వినఁ♦గాఁ దగఁడున్, మఱి యందుచున్ సము
త్కటరుష నీదునా వెడలఁ, ♦ గాఁ డకృతజ్ఞుఁడు, కాఁడు క్రూరుఁడున్,
కుటిలుఁడు గాఁడు, కాఁడు హత♦కుండు హరీశుఁ డసత్యవాదియున్. ౯౪౯
ఉ. సారబలాఢ్య! యన్యులకు ♦ సాధ్యము గానిమహోరణంబునన్
సారసనేత్రు రాముని ప్ర♦సాదమునన్ స్థిరకీశ రాజ్యమున్
జారుసుఖంబులున్ రుమను ♦ సంపదలన్ ననుఁ బొందినాఁడు, మి
క్కూఁరిక మెచ్చెడిన్ మఱవు ♦ నొందఁడు మీయొనరించుసాయమున్. ౯౫౦
కం. కడుదుఃఖపడుట మీఁదయుఁ, గడుసుఖముల నిపుడు గాంచి ♦ కాసఁడు గడువున్
గడచన విశ్వామిత్రుని,వడవున నీకీశవిభుఁడు ♦ వాస్తవ మనఘా. ౯౫౧
కం. కామవశుఁడు ఘృతాచీ,భామినికిం జిక్కి యేండ్లు ♦ పది చన ముని వి
శ్వామిత్రుఁడు ధర్మాత్ముఁడు, దా మది నొకదిన మ టంచుఁ ♦ దలఁపఁగ లేదే. ౯౫౨
కం. భీమతపోవిభవుఁడు వి,శ్వామిత్రునియంత వాఁడె ♦ స్మరవశుఁ డగుచున్
నేమపుఁగాల మెఱుంగఁడె, రామానుజ! యేమి చెప్పఁ ♦ బ్రాకృతజనులన్. ౯౫౩
చం. జనవర! దేహధర్మ మటి♦సాధ్యము గాదు విడంగ, దానిపై
మన సిడ శ్రాంతుఁ డై తనివి♦మాలక కాల మెఱుంగఁ డయ్యె స
జ్జననుతశీల! దోష మిది ♦ సైఁపుము,సిక్క మెఱుంగ లేక నా
యన! జడునట్లు నీవు కిని♦యం దగునా?విను మింకఁ జెప్పెదన్. ౯౫౪
కం. నినుబోఁటి సత్త్వయుక్తులు, మనమునఁ జక్కనివిమర్శ♦మాలి తటుకునన్
గినుకకు లోపడుదురె? రవి,తనయునిపైఁ గినుక మాను ♦ ధర్మజ్ఞవరా! ౯౫౫
కం. ననుఁగాని రుమను గానీ, ధనధాన్యవసువులు గాని ♦ తనకపిరాజ్యం
బును గాని విడుచు రాముని,పని కీతం డనుచుఁ దలఁతుఁ ♦ బరమనయాఢ్యా.

→ సుగ్రీవుఁడు కపిసేనల రప్పించినవార్త తార లక్ష్మణునకుఁ దెలుపుట. ←

సీ. ఆహవంబున రావ♦ణాసురు వధియించి, రోహిణితోడఁ జం♦ద్రునివిధాన
జనకజతోడ రా♦మునిఁ గూర్చు సుగ్రీవుఁ, డింతటిశంక నీ♦ కేల చెపుమ?
నూఱువేల్కోటులు ♦ నూఱువేల్ ముప్పది,యీ అయుతంబులు ♦ నసురవరులు
గల రయ్య లంకను ♦ గలన వారల నెల్లఁ, జంపక రావణుఁ ♦ జంపరాదు
ఆ. తోడులేని యొక్క♦తోయజాప్తతనూజు, చేతఁ జచ్చె నెట్లు ♦ ఖ్యాతబలుఁడు
దశముఖుం డటంచుఁ ♦ దత్త్వ మెఱింగిన,వాలి చెప్పె దానిఁ ♦ బలుకుదాన. ౯౫౭
కం.మీ కనిఁ దోడ్పడుపొంటె వ,నౌకోనిచయంబు లిటకు ♦ నరుదేరఁగ ము
న్నే కావించె నిదేశం, బీకపివీరుండు గపుడు ♦ నేగెడి నేఁడే. ౯౫౮
కం.వారల నెల్లరఁ దోడ్కొని, శ్రీరామార్థంబు సిద్ధి ♦ సేయఁగఁ దా నే
తేరఁ దలంచి కపీశుఁడు, ధీరవరా! యటకు బయలు♦దేఱఁడు సుమ్మీ. ౯౫౯
కం.గోలాంగూలశతంబులు, వాలినవిక్రములు ఋక్ష♦వరులుం గ్రోఁతుల్
చాలఁగఁ గోట్లకొలందులు, హాళి నినుం గొల్చువార ♦ లయ్యా! యిపుడే ౯౬౦
ఉ. మానుము కోప మోపురుష♦మండన! నీదు మొగంబుతీరు జ్వా
లానలతుల్యనేత్రముల ♦ నారసి యీకపిరాజు నంగనల్
మాననిభీతిఁ జేష్టడిరి ♦ మాకును దొల్లిటిశంక చొప్పడెన్
వానరనాథుపట్ల విసు♦వాసము గూర్పుము ప్రీతిఁ దేర్పు మీ. ౯౬౧

→ సుగ్రీవుఁడు లక్ష్మణుని సమాధానపఱుచుట. ←

చం.అనిన మృదుస్వభావుఁ డగు♦నారఘువంశవిభూషణుండు త
ద్వనితసధర్మసూక్తిఁ గొని ♦ దారుణకోపము మానె, సూర్యనం
దనుఁడును గ్లిన్నవస్త్రు మనఁ ♦ దన్నృపసూనుభయంబు వీడి కాం
చనమయచిత్రమాల్యము వె♦సం ద్యజియించి మదంబు పాయుచున్. ౯౬౨
కం.వినయమునఁ బల్కు లక్ష్మణ, మునుపోయినకీశ రాజ్య♦మును శ్రీకీర్తుల్
జననుత రామునిదయచే,తన మరల లభించె నాకుఁ ♦ దథ్యము సుమ్మీ. ౯౬౩
ఉ. అంతటివిక్రమాఢ్యునకు ♦ నంతటినైజఘనక్రియాదిశా
క్రాంతసుకీర్తి కేఁడు ప్రతి♦కారము సేయఁగ నోపువాఁడు? భూ
కాంతుఁడు సీత నొందు, నల♦కావలురావణుఁ ద్రుంచి వైచు, నా
వంతయు శంక లే దయిన ♦ నయ్యెద నేను సహాయమాత్రుఁడన్. ౯౬౪
కం.ధరణీరుహాముల నేడిటి, ధరణిని ధరణీధరంబు ♦ దారితములుగా
శరమున నొక్కటఁ జేసిన, వరబలునకు వేఱుతోడు♦పా టది యేలా? ౯౬౫

కం.ఉంకించి ధనువు మీటిన, ఠంకృతి గిరిసహిత మై వ♦సుంధర యుర్విన్
బింకముఱి యట్టిమేటికి, నింకొక్కఁడు సాయపడఁగ ♦ నేలా చెపుమా. ౯౬౬

కం.వైరి యగురావణాసురు, భూరిచమూతతులతోడఁ ♦ బోరి గొనఁ జనునా
శ్రీరాముని వెంబడి గో,త్రారమణకుమార! యిదిగొ ♦ రా సిద్ధుండన్. ౯౬౭

తే. ప్రణయకారణముననొ వి♦శ్వాసముననొ, యీభవద్దాసుఁ డొక వేళ ♦ నించుకంత
తప్పినడచిన యేన్ క్షమిం♦తవ్యుఁ డగును, గలఁడెయొకఁ డైన నపరాధి♦గానివాఁడు.

లక్ష్మణుఁడు సుగ్రీవునిఁ బ్రశంసించుట.

సీ. అని వచియించుమ♦హాత్ము సుగ్రీవునిఁ, గని యిట్టు లనియె ల♦క్ష్మణుఁడు ప్రీతి
వినయవంతుఁడవు నీ ♦ వనఘ దిక్కోట మా,యన్న సనాథుఁ డై ♦ యమరె నయ్య
నీపారిశుద్ధ్యంబు ♦ నీదునార్జవమును, నీప్రభావంబు ని♦న్నింటిఁ జూడ
లలితవానరరాజ్య♦లక్ష్మిని భోగింప, సద్వుండ వీవు కీ♦శాగ్రగణ్య

ఆ. నీదుసాహ్యమునను ♦ నిర్జరారాతిని, రామవిభుఁడు చంపు ♦ రణమునందు
ధర్మకలితగుణ కృ♦తజ్ఞ జితవైరవర్య, యుక్త మయ్య నీదు♦సూక్తి మిత్ర. ౯౬౯

కం.ఘనసామర్థ్యము గలిగియుఁ, దనదోష మెఱింగి యెవఁడు ♦ దానిం బలుకున్
వినయంబున మాయన్నయు, నినతనయా! నీవొకండు ♦ నిద్దఱు తక్కన్. ౯౭౦

చం సముఁడవు రామభద్రునకు ♦ శౌర్యపరాక్రమసాహసంబులం,
దమరెను దైవతంత్రమున ♦ నచ్చపునెయ్యము మీకు, లెమ్ము పో
దము, తరుణీవియోగజని♦తవ్యథఁ గుందెడి రాముఁ దేర్ప మా
విమనునిపల్కులన్ విని క♦పిప్రభు! దూఱితి నిన్ను సైఁపుమీ. ౯౭౧

సుగ్రీవుఁడు హనుమంతునితో వానరులనిమిత్తమై మరల దూతలఁ బంపు మని చెప్పుట.

సీ. అని లక్ష్మణుఁడు పల్క ♦ నినజుఁడు తనచెంత, నిలుచున్న హనుమతోఁ ♦ బలికెనిట్లు
హిమవంతమునను మ♦హేంద్రవింధ్యంబులఁ, గైలాసమందర ♦ శైలములను
దరుణార్కవర్ణభా♦సురముల సాగరాం,తాద్రులఁ బశ్చిమా♦శాద్రులందు
సంధ్యాభ్రసన్నిభ♦జలజాప్తనిలయంబు,నందుఁ జరించు వ♦నౌకసులను

తే పద్మ తాళవనంబున♦ప్లవగవరుల, నంజనాంబుదసంకాశ♦కుంజరాభు
లయినయంజనపర్వత♦హరివరులను, స్వర్ణవర్ణమనశ్శిలా♦వాసకపుల. ౯౭౨

కం.మేరువున ధూమ్రగిరిని మ,హారుణమున హరిశాన♦నాంతరసీమన్
మైరేయపాయు లగుదు,ర్వారమహాశ్వవుల ఘోర♦వానరపతులన్. ౯౭౩

తే. మనులయాశ్రమసీమల ♦ వనములందు, భూమి నెల్లెడ నుండెడి♦భీమబలుల
వానరుల నెల్లఁ బిలిపింపు ♦ వానరేంద్ర, సామదానాదివిధులను ♦ జాగు వలదు.

కం. దూతలఁ బంచితి మున్నా, హూతికి నై భూరిజవుల ♦ నుద్దవిడిం గీ
శాతతగణములఁ బంపుము, జాతత్వరులుగను జేయు ♦ సచివా వారిన్. ౯౨౫
కం. కామాసక్తకపీంద్రుల, సోమరు లైనట్టిదీర్ఘ ♦ సూత్రుల మునుము
న్నామహితశాసనంబున, నామీఁరి పిలువఁ బంపు ♦ చయ్యనఁ గపులన్. ౯౨౬
కం. వలిముఖుఁ డెవఁ డీయాజ్ఞను, బలుచన గావించి రాఁడొ ♦ పదిదినములలో
నలనృపశాసనదూషకు, తలఁ దీయించెదను వాయు ♦ తనయా చుమ్మీ. ౯౨౭
సీ. వేగ పంపుము నూర్లు ♦ వేలు కోట్లుగ నిష్ట, క్రోఁతుల దిక్కు దిక్కునకు నీవు
మేఘపర్వతనిభుల్ ♦ మేఘపథం బెల్లఁ, గప్పుచుఁ జనువారు ♦ గాక యిపుడ
తావు లెఱింగిన ♦ తరుచరుల్ కవు లుండు, తలములకును బోయి ♦ పిలువనిమ్ము
యనవుడు హనుమయు ♦ నఖిలదిక్కులకును, బనిచె నాక్షణమంద ♦ ప్లవగవరుల
తే. వారు విహగోడుపథమున ♦ భూరివేగ, మునను జని సింధుకందర ♦ వనములందుఁ
గలుగుక్రోఁతులకును రాము ♦ కార్యవిధముఁ, దెలిపి పనుపంగ వారును ♦ దీవరముగ.

వానరసేనలు కిష్కింధకు వచ్చుట.

కం. లయకాలసన్నిభం బగు, భయదవుసుగ్రీవు నాజ్ఞఁ ♦ బ్లవగవరేణ్యుల్
రయమునఁ జనుదెంచిరి దిక్చయములు ప్రచ్ఛాదితముగ ♦ సమరోత్సుకులై ౯౨౯
సీ. అంజనగిరినుండి ♦ యంజనసన్నిభుల్, మూఁడుకోటులు కీశ ♦ ముఖ్యవరులు
నస్తాచలమునుండి ♦ హాటకదేహులు, పదికోట్లు వచ్చిరి ♦ ప్లవగపతులు
గిరిశాలయమునుండి ♦ హరికేసరద్యుతుల్, వేకోట్లు వచ్చిరి ♦ వీర్యధనులు
వలిమలఫలమూల ♦ ముల మెక్కుక్రోఁతులు, వేవేలకోటులు ♦ వేగ వచ్చె
తే. వింజములనుండి యొకకోటి ♦ వేలకపులు, కదలి వచ్చిరి భీమనాం ♦ గారకాభు
లరుగుదెంచి రసంఖ్యాక ♦ హరులు క్షీర, వారినిధితీరగులు నాళి ♦ కేరభుజులు. ౯౩౦
కం. హరిమండలముఁ మ్రింగెడి, సరణిని జనుదెంచె శైల ♦ సరిదవనీకం
దరకాననిలయం బగు, హరిమండల మప్పు రాఘ ♦ వార్థం బగుచున్. ౯౩౧
ఉ. కాననచారులం బిలువఁ ♦ గా మునుపోయిన వానరాళి యెం
దేని మహేశ్వరుండు ఘటి ♦ యించె మహాధ్వరముఁ మనోహరం
బై నెగడంగ నట్టిశిశి ♦ రాచలసీమ మహాద్రుమంబులుఁ
మానుగఁ గాంచె నల్లనవ ♦ నంబున నాజ్యపయోన్న సంగతిన్ ౯౩౨
ఉ. నానిననేలఁ బుట్టినమ ♦ నః ప్రమదాకరకందమూలసం
తానము సత్ఫలంబులు సు ♦ ధారుచిమంతము లై రహించు న
వ్వానిని నెవ్వఁడేని యొక ♦ పారి మెసంగిన మాస మాఁకలిం
బూనఁడు, కీశు లట్టిఫల ♦ మూలములుఁ రుచిరప్రసూనముల్. ౯౩౩

కం.ఇనసుతునకుఁ బ్రీతిగఁ గై,కొని పుడమిం గలుగునట్టి♦క్రొంౕతుల నెల్లన్
వినియమనము చేసి వెసం, జనుదెంచిరి మున్ను గాఁగ ♦ సరిచన గడువున్. ౯౮౪
కం.ఇటు వచ్చి కానుకల ముం,గట నుంచి కపీంద్ర యెల్ల♦కపులకు గిరిని
ష్కుటసింధువాసులకుఁ బ్ర,స్ఫుటముగ మీయాజ్ఞఁ దెలుపఁ ♦ బొలుపుగ వారున్
కం.చనుదెంచిరి కిష్కింధకు, నన సుగ్రీవుండు మిగుల ♦ హర్షంబున నా
వనచరుల కానికల్ గొని, చనుఁడీ యని సెల వొసంగె ♦ స్వభవనములకున్.

→ లక్ష్మణసుగ్రీవులు సేనతోడ రామునియొద్దకుఁ బోవుట. ←

సీ. వారికి సెల విచ్చి ♦ వానరపతి తాను, నృపతి గృహాగ్ర్థులం ♦ చెంచుకొనియె
సౌమిత్రి యంత భా♦స్కరపుత్రుఁ గని రాముఁ, గనఁ బోవఁదగునొకో♦యనఁగ నాతఁ
డగుఁగాక కలదె మీ♦యాజ్ఞ ప్తి కన్యథా,త్వం బని తారాది♦వనితలకును
సెల విచ్చి మీరును ♦ శీఘ్రమ రండని, వానరవరులకు ♦ నాన తిడిన
ఆ. నంగనాదర్శనకుణుల్ ♦ హస్తములను, మోడ్చి యందుండఁ బల్లకి ♦ మోయువారి
నాదుశిబికను గొనిరండు ♦ కాదు జాగు, సేయ నన వారు నట్టుల ♦ చేయుటయును.
కం.ఎక్కుము లక్ష్మణ యని యతఁ, డెక్కిన సుగ్రీవుఁ డెక్కి ♦ యిరుగడలందున్
జక్కని చామరములు పెం,పెక్కిన శ్వేతాతపత్ర ♦ మెలమిం గూర్పన్. ౯౮౫
ఉ. భేరులు మ్రోయ శంఖముల♦బిట్టులివుల్ పరఁగంగఁ గీశగ
ర్జారవముల్ చెలంగఁ గపి♦రాజ్యరమావిభవాభిరాముఁ డై
శూరులు శస్త్రపాణులును ♦ జుట్టును జేరి భజింప నేగి ధా
త్రీరమణుండు పొల్చు నెడ ♦ దిగ్గి సలక్ష్మణుఁ డై సభక్తి మై. ౯౮౬
కం.రాముని డాయఁగఁ జని కర,తామరసంబుల మొగుడ్చఁ ♦ దక్కిన క్రొంౕతుల్
భూమీశు మ్రోల నటువలెఁ, జేమోడ్చునభయముభక్తి ♦ చెలఁగఁగ నిలువన్.
కం.నాళీకముకుళరాజిత,నాళీకాకరముమాడ్కి ♦ నవ్వం బగుకీ
శాళీసైన్యముఁ గని భూ,పాలుం డినసుతునియెడఁ గృ♦పాళుం డయ్యెన్. ౯౮౭

→ రాముఁడు సుగ్రీవునకు నీతిఁ దెలుపుట. ←

కం.తనపదముల వ్రాలినయా,యినతనయుని లేవ నెత్తి ♦ యెలమిని గవుఁగిం
టను జేరిచి కూర్చుండుమ, యని యతఁ డాసీనుఁ డగుడు ♦ నర్మిలి ననియెన్. ౯౮౮
తే. ధర్మ మర్థంబు కామంబు ♦ దగినరీతి, విభజనము సల్పి యుచితంపు♦వేళఁ దెలిసి
వాని సేవించు చుండునా♦ప్రాజ్ఞతముఁడు, ప్లవగనాయక రాజునాఁ♦బ్రథ వహించు
తే. ధర్మమార్గంబు విడిచి య♦ర్థంబు మఱచి
సర్వదా కామమంద యా♦సక్తి గలుగు

సతఁడు వృక్షంబుకొనకొమ్మ♦యందుఁ గూర్కి
నేలఁ బడి మేలుకొనువానిఁ ♦ బోలు చుండు. ౯౯౪

కం. శత్రువులఁ వధియించుచు, మిత్రుల సమకూర్చుకొనుచు ♦ మెలఁకువతోడన్
ధాత్రిఁ ద్రివర్గఫలమునకుఁ, బాత్రం బగురాజు ధర్మ♦పథవర్తి యగున్. ౯౯౫

కం. ఖద్యోతనందనా యిది, యుద్యోగము సేయ మనకు ♦ నుచితసమయ మా
సద్యస్సుభఁగూర్పుము సచివాద్యులతో మంత్ర మిప్పు ♦ డాలోచింపన్. ౯౯౬

సుగ్రీవుఁడు రామునితోఁ దాను వానరసేనల సిద్ధపఱుచుట తెలుపుట.

చం. అనవుడు నాతఁ డి ట్లను మ♦హాత్మక నష్టమహావిభూతియున్
వనచరరాజ్యలక్ష్మియు ఘ♦నం బగుకీర్తియుఁ గంటి నీదు నీ
యనుజుని సత్ప్రసాదమున ♦ నవ్యయభంగిని వెండి మాఱుమేల్
పొనరుప నెంచఁ డెవ్వఁ డల♦పూరుషుఁడే సతతంబు నింద్యుఁ డౌ. ౯౯౭

సీ. రాజేంద్ర! భూమిచ♦క్రంబునఁ గలిగిన, ప్లవగగోలాంగూల♦భల్లుకముల
బలియురఁ బిలువంగఁ ♦ బంచితి దేవగం,ధర్వపుత్రులు ఘోర♦దర్శనులును
గామరూపధరులు ♦ కాంతారమార్గవి, జ్ఞానులు తమతమ ♦ సేన లొప్ప
నూఱులు నూఱువేల్ ♦ నూఱులక్షలు మఱి, యయుతముల్ శంకువు♦లర్బుదములు.
తే. ఖర్వమధ్యాంతములును సా♦గరపరార్థ
ములును వచ్చుచు నున్నారు ♦ బలిముఖేంద్రు
లల మహేంద్రపరాక్రముల్ ♦ హాటకాద్రి
మందరాభులు వింధ్యాద్రి♦మందిరులును. ౯౯౮

కం. కావలు సహబాంధవు నా,రావణు వధియించి యుగ్ర♦రణమున యుష్మ
ద్దేవిని గొనితెచ్చియు నో,దేవా! యర్పింతువారు ♦ దేవర కింకన్. ౯౯౯

తే. అనిన నాతని యుద్యోగ ♦ మంతఁ దెలిసి, కుట్మలితహస్తుఁ గౌఁగిటఁ♦గ్రుచ్చి మోద
గరిమ వికసితమేచక♦కంజతుల్య,దర్శనీయుఁడు భాస్కరా♦త్మజున కనియె. ౧౦౦౦

రాముఁడు సుగ్రీవునిఁ బ్రశంసించుట.

ఉ. చిత్ర మటయ్య భాస్కరుఁడుఁ ♦ జీఁకటులం దివి రూపు మాపుటల్
వృత్రవిరోధి లోకులకు ♦ వృష్టులచేత ముదంబుఁ గూర్చుటల్
ధాత్రిని శీతలంబుగ సు♦ధాకరుచేయుటయున్ భవాదృశుల్
మిత్రులకుం బ్రతిక్రియగ ♦ మేలొనరించుట సౌమ్యభూషణా! ౧౦౦౧

కం. మిత్రతనూభవ నిను బోల్,మిత్రవరుఁడు మిత్రతతికి ♦ మే ల్సేయుటయున్
చిత్రము నే నిఁక వెలయుదు, జైత్రుఁడ నై కలన నీదు♦సాహాయ్యమునన్. ౧౦౦౨

కం మతి నే తెన్న గొలుసుంగుదు, సతతప్రియవాది వనుచు ♦ సఖ నీ వే స
మ్మతుఁడు సుహృన్మిత్రుఁడవును, బ్రతతయశా! నాకుఁదోడు♦పడు మివ్వేళన్.

ఉ. నాదయితన్ హరించెఁ దన♦నాశముపొంటెను రావణుం డను
న్లోదుఁడు వంచనన్ శచిని ♦ నర్కతనూభవ మున్ హరించి న
ట్లాదితిజాధమున్ శితశ♦రావళిఁ ద్రుంచెద నాపులోమునిన్
సూదితుఁ జేసినట్టిబల♦సూదనుపోలికి నంచు నుండఁగన్. ౧౦౦౪

వానరసేనలు రామునికడకు వచ్చుట.

సీ ఇంతలో నాకాశ ♦ మంతయుఁ బెనుధూళి, నావృత మయ్యెఁ దీ♦వ్రాంశుకిరణ
జాలంబు తేజంబు ♦ సమసి కుంఠిత మయ్యె, దిక్కులు రజమున ♦ నిక్కచెడియె
శైలకాననదీ♦సహితవసుంధర, గడగడ మని కదు♦వడఁకఁ జొచ్చె
ధరసన్నిభము తీక్ష్ణ♦దంష్ట్రము దుర్దాంత,బల మసంఖ్యం బగు♦ప్లవగసేన

ఆ. మహిని నిండె నిమిష♦మాత్రమునం దొప్పి, రద్రిసాగరాప♦గాలయులును
గామరూపధరులు ♦ గర్కశ దేహులు, జలదరవులు గహన♦చరులు కపులు.

కం.తరుణారుణవర్ణులు సిత,కిరణాచ్ఛలు నీరజాత♦కేసరదీప్తుల్
హరులు పదివేలకోటులు, సరభసముగఁ గొలువ వచ్చె ♦ శతవలి యటకున్.

కం భీషణరోషుఁడు శాత్రవ,దూషణుఁ డగుతారతండ్రి ♦ తోతెంచెను సం
తోషంబుతో సుషేణుఁడ, శేషము పదివేలకోట్ల♦సేన భజింపన్. ౧౦౦౭

సీ. కోటిసహస్రముల్ ♦ క్రోఁతులతో రుమ,తండ్రి యేతెంచెను ♦ దారుఁ డపుడు
కమలకింజల్కసం♦కాశుండు తరుణార్క,వదనుండు ప్రాజ్ఞుండు ♦ వరతరస్వి
హనుమంతుతండ్రి స♦హస్ర మనీకముల్, భజియింపఁ గేసరి ♦ వచ్చె వేగ
శిక్షితభీమవి♦పక్షగవాక్షుండు, కోటివేల్ కపులతోఁ ♦ గొలువ వచ్చె

తే. రెండుకోటులు సేవింప♦ఋక్షవరులు, ధూతపరిపంథి యరుదెంచె♦ధూమ్రుఁడటకుఁ
బనసుఁడునుమూఁడుకోటులు♦ప్లవగవరులు,బలియుఁబొడచూపె వానర♦ప్రభుని మ్రోల

కం.నీలాంజనచయకాయుఁడు, నీలుఁడు పదికోటు లగువ♦నేచరములతో
శైలాటు లైదుకోటులు, వాలఁగ గవయుండు నటకు ♦ వచ్చినయంతన్. ౧౦౦౯

ఉ. కోటిసహస్రసంఖ్య గల♦క్రోఁతులతోడ దరీముఖుండునున్
గోటులుమూఁటితో గజుఁ డ♦కుంఠితతేజులు కోటికోటివేల్
పాటిగఁ గొల్వ నశ్విజులు ♦ బాహుబలుల్ ద్వివిదుండు మైందుఁడున్
గోటి దశాచ్ఛసేవితుఁడు ♦ గొబ్బున వచ్చెను జాంబవంతుఁడున్. ౧౦౧౦

కం.వింతబలుల్ శతకోటులు, చెంతలఁ గొలువంగఁ గపులు ♦ శీఘ్రగతి రుమ
ణ్వంతుండు వచ్చె వానర,కాంతుని దేశమున భూమి♦కాంతునిఁ గొలువన్.౧౦౧౧

ఆ. కోట్లునూటఁవేలు ♦ క్రోఁతులు గొలువంగ, గంధమాదనుండు ♦ కదలి వచ్చె
నైదుకోట్లుగొలువ ♦ హరివరుల్ తారుండు, తారకావిభావి♦హారి వచ్చె. ౧౦౧_౨

కం.చనుదెంచెను దారేయుఁడు, జనకనిభపరాక్రముండు ♦ చయ్యన నటకున్
దనుఁ బద్మసహస్రంబులు, వనచరశతశంకువులును ♦ నలనుగఁ గొలువన్. ౧౦౧౩

కం.వీరుఁ డగునింద్రజానుఁడు, కూరిమిఁ దనుఁ బదునొకొండు♦కోటులు నసనం
చారులు గొలువఁగ వచ్చెను, సారతరజవంబు మెఱయ ♦ జనపతి కడకున్.౧౦౧౪

కం.కుంభినిపక్షద్రవిణా,రంభుఁడు రంభుండు వచ్చె ♦ రవితేజుఁడు వి
స్రంభార్హులు దోర్విభవో, త్తంభులు లక్షాయుతము ల♦దంభతఁ గొలువన్. ౧౦౧౫

కం.దుర్ముఖుఁ డనుప్లవగుండు స,హర్ముఖమార్తాండతేజుఁ ♦ డరుదెంచెను బ
ర్హిర్ముఖవంశజకీశులు, కూర్మిని దనుభక్తి రెండు♦కోటులు కొలువన్. ౧౦౧౬

కం.కైలాసశిఖరిశిఖరో,త్తాలాకారులు బలిష్ఠ♦తరుచరకోటుల్
వేలు దనుఁ గొలుచుచుండఁగ,గాలితనూజాతుఁ డటకుఁ ♦ గ్రచ్చఱ వచ్చెన్.౧౦౧౭

చం.నలుఁ డరుదెంచె వీరులు వ♦నాటవరుల్ శతలక్షకోట్లు దన్
గొలువఁగఁ, గొల్వఁగా దధిము♦ఖుండును వే పదికోట్లు కీశనా
థులు చనుదెంచె, వహ్నికుము♦దుండును దారుణరంహుఁ డైనదో
ర్బలి యలరంహుఁ డుగ్రశర♦భ ప్రముఖప్లవగోత్కరంబులున్. ౧౦౧౮

కం.వచ్చెను వెండియు శైలస,ముచ్చయముల నదుల వనుల ♦ నుండెడివారల్
వచ్చిరి వారలసంఖ్యల, నిచ్చలముగఁ జెప్పవచ్చు♦నే యెవ్వరికిన్. ౧౦౧౯

ఉ. మ్రొక్కెడి పోవువారుఁ గపి♦ముఖ్యులు కొందఱు కేలుమోడ్పులన్
బ్రక్కల నిల్చువారును బ్ల♦వంగచయంబులు గర్జ లాశలన్
బిక్కటిలంగ నించుచును ♦ బెంపు రహింపఁగ దూఁకులాడుచున్
గ్రిక్కఱియన్ ఘనావృతహ♦రిం దలఁపించె హరీంద్రుఁ డయ్యెడన్. ౧౦౨౦

తే. బాహువిక్రమశాలు లా♦ప్లవగవరులు
కిలకిలారావములతోడఁ ♦ గెరలి వచ్చి
తమ్ము నెఱిఁగించుకొనుచును ♦ దరణిజునకు
శిరము వ్రాలిచి మ్రొక్కుచు ♦ నరిగి రంత. ౧౦౨౧

కం.ఉచితం బగుపద్ధతి సం, కుచితాంబరముఖ్యు లగుచుఁ ♦ గొందఱు కీశుల్
రచితాంజలు లై నిలిచిరి, ఖచరాత్మజునొద్ద వినయ♦గరిమ రహింపన్. ౧౦౨౨

కం.వారల నెల్లర రఘుపతి, కారఁగ నెఱిఁగించి వారి ♦ నారసి తగు శై
లారణ్యంబుల మీఁఁపటి,వారంబుల నరసికొంచు ♦ వర్తిలుఁ డనుచున్. ౧౦౨౩

↞ సుగ్రీవుఁడు రామునకుఁ దనసేనల నివేదించుట. ↠

సీ. ముదలఁ గావించి రాముని జూచి సుగ్రీవుఁ, డనియె మద్విషయస్థు లైనకపులు
కామరూపులు మదసామజతుల్యులు, విక్రమవంతు లవక్రగతులు
దైత్యసంకాశులు దారుణాకారులు, సంజితక్లములు ప్రశస్తబలులు
ఖ్యాతపరాక్రముల్ వ్యవసాయపరులు భూ,మ్యంబుచారులు గహనాలయులును
ఆ. గోట్లకొలఁది వచ్చి కూడి యున్నా రిదె, నీదుకింకరులను నెమ్మిఁ గనుము
స్వామికార్యపరులు జవ దాఁట రాజ్ఞను, నీదుపనుపు సేయ నేర్పు గలరు.
చం. ఇది భవదీయసేన, చరియించు భవద్వశ మాచు నింక, నె
య్యది యుచితంబు సేయ నది యానతి యి, మ్మిటనున్న క్రోఁతుల౯
విదితము నాకుఁ బూనినప నెఱవేర్ప సమర్థు, లైన నీ
మదిఁ దలపోసి యుక్తమగు మార్గమునం బనిఁ గొమ్ము వీరిచేన్. ౧౦౨౫
కం. అనవుడు రాఘవుఁ డిట్లను, నినజునిఁ గౌఁగిటను గ్రుచ్చి పృథ్వీసుత దా
మని యున్నదొ లేదో యిం,దనుకను దశకంఠువీటఁ దగఁ దెలియంగన్. ౧౦౨౬
ఉ. రావణువాసదేశము, ధరానుత యుండెడిభంగి, మున్ను సు
గ్రీవ! యెఱుంగవచ్చినను గేరుచు నావలికార్యభంగుల౯
నీవును దోడ్పడ౯ సరగ నే విధియించెద, దీనిఁ దీర్పఁగా
నీవె సమగ్రశక్తుఁడవు నేరము నేనును నాదుతమ్ముఁడున్. ౧౦౨౭
ఉ. ఇంతకుఁ గార్య మెల్ల ఘటియింపఁగ మా కిట నీవె దిక్కు, వృ
త్తాంత మెఱుంగు దంతయు, యథాక్రమ మారఁగఁ బంపు మీవ, వి
క్రాంతుఁడ వర్థవేదివి సకాలవిదుండ! ద్వితీయమిత్రుఁడు౯
స్వాంతమునందు మాహితము వాంఛ యొనర్చెద వే నెఱుంగుదున్. ౧౦౨౮

↞ తూర్పున సీతను వెదక సుగ్రీవుఁడు వినతునిఁ బంచుట. ↠

చం. అనవుడు రామలక్ష్మణసమక్షమునందు గిరీంద్రతుల్యుని౯
ఘననిభఘోషుని౯ వినతుఁ గ్రచ్చుఱఁ బిల్చి వచించె దేశకా
లనయయుతుండ వెల్లపనుల౯ విహితాహితతత్త్వవేదివి౯
వనచరనాథ! సోమరవివంశ్యులు లక్షలు గొల్చు చుండఁగన్. ౧౦౨౯
ఉ. తూరుపుదిక్కు నీ వరయఁ దూర్ణమ యేగుము రావణాసురా
గారము భూమిపుత్రికయి కాననశైలనదీనదంబుల౯
వారక రోయుమీ సరయువాహిని గంగను గౌశికి౯ మనో
హారిణి సింధు సూర్యజను యామునభూధరము౯ సరస్వతిన్. ౧౦౩౦

సీ. మహీధరవనయుత♦మహి కాలమహి బ్రహ్మ,మాల విదేహముల్ ♦ మాళవంబు
కాశికాపురము మా♦గధమహాగ్రామముల్, కోశకారులపురి ♦ కోసలంబు
నిన్నియు వెదకుఁడీ ♦ యిందీవరాక్షని, దశరథస్నుష రాము♦దయిత సీత
జలధిలోపల నున్న♦శైలపత్తనములు, మొగి మందరస్థు లౌ♦ముక్కుడులును

ఆ. నోష్ఠకర్ణకులును ♦ నుగ్రలోహముఖులు, నేకపాదకులు స♦హీనజవులు
భూరిబలులు నరులు ♦ పురుషాదకులు గర్ణ,చూడు లుండుస్థలులు ♦ చూడ వలయు.

ఆ. సరవిగాఁ గిరాత♦చయములు కనకాంగ,వారములును ద్వీప♦వాసు లైన
యామమీనభుజులు ♦ సంతస్గరాటులు, నరవ్యాఘ్రకులుండు♦ధరణు లరసి. ౧౦౩౨

చం. చని యటఁ బర్వతంబులను ♦ సారపునౌకల లంఘనంబులన్
గనఁ దగు నేకుఖండములఁ ♦ గ్రాలుయవాఖ్యము[1] స్వర్ణరూప్యకం
బనఁబడుద్వీపముల్ గడచి ♦ యావలఁ బుష్కరచుంబిశృంగకం
బును శిశిరాఖ్యశైలమును ♦ భూరిగుహావనవాటి రోయుఁడీ. ౧౦౩౩

సీ. అది దాఁట రక్తజ♦లావిశఁ౦బు నగాధ, మతిశీఘ్రగమనంబు ♦ నైనశోణ
నదము వర్తిల్లును ♦ నుదధికి నవ్వరి, సచ్ఛటిరమ్యతీ♦ర్థాదికముల
నైదేహితో డ గా♦ననుఁ మీరు వెదకుఁడు, పర్వతప్రభవముల్ ♦ బహుళరమ్య
వాహినుల్ తోఁటలు ♦ వాహినీశాంతర,ద్వీపముల్ దప్పక ♦ వెదకవలయు

తే. నచట నంబుధిలోన మ♦హాఘనులు, చిరబుభుక్షితు లసురులు ♦ సరసిజాత
భవువరంబున ఛాయలఁ ♦ బట్టుచుండ్రు, దాని గ్రోహ్యమునన ♦ దాఁటి పోయి

ఉ. లోహితవారియుక్త మగు♦లోహితవారిధిఁ జూచుచుం గపి
వ్యూహములార మీ రరిగి ♦ భూరితరం బగుకూటశాల్మలిన్
లోహమణీన్గముక్ విమలు♦లోచనశైలనిభంబుఁ బక్షిరా
డ్గేహము చేఁ శిల్పివరి♦కీలితముం గనుఁ డందు రాక్షసుల్ ౧౦౩౫

సీ. మందేహనామకుల్ ♦ మహితభీమాకృతుల్, వివిధరూపులు పృథి♦వీధరాళి
శృంగాగ్రతలముల ♦ వ్రేలాడు చును బ్రహ్మ, తేజంబునను బ్రతి♦దినము భాస్క
రోదయవేళల ♦ నుదకంబులను వారు, వినిహతు లై నుతి ♦ వ్రేలుచుందు
రచ్చట ధవళాభ్ర ♦ మనుకరించు చు నున్న,క్షీరోద మనెడికూ♦పార మొప్పు

తే. నదియు నూర్ముల ముక్తిక♦హారవితతి,సమభిలంకృత మైనట్లు ♦ సరస మగును
బరమదుర్ధర్ష మది యందుఁ ♦ బార్థివేంద్ర,తరుణి రోయుఁడు రావణా♦సురునితోడ.

చం. విమలపయోధిమధ్యమున ♦ విశ్రుత మై ఋషభాఖ్యపర్వతం
బమరు సితప్రభాలసిత ♦ మైనవదివ్యసుగంధ యుక్త మా
సుమముల నొప్పు హేమమయ♦సుందరభూరుహపూర్ణ మై యటన్
శ్రమహరదర్శనీయసుస♦రస్సు రహించు సుదర్శనం బనన్. ౧౦౩౬

---

[1] దీని నిపుడు జావాయందురు.

తే. రజతకేసరరంజిత♦రాజతాబ్జ, మైనయాకొలనన్ రాజ♦హంసతతులు
పోలెఁ గిన్నరచారణ♦బుధగణంబు, లచ్చరలుఁ గేళిఁ దేలంగ ♦ నరుగుదెంత్రు.

శా. ఆక్షీరాంబుధి దాఁటినం గలదు భూ♦కాత్యంతభీత్యావహం
బక్షీణౌర్వమహా♦ప్రథాజనితఘో♦రాస్యస్ఫురద్వహ్నిసం
లక్షీభూతము నౌజలాబ్ధి లయవే♦ళన్ సర్వలోకంబు లా
సాక్షాద్బాడబవహ్నివాతఁ బడి భ♦స్మంబౌ సమూలంబుగన్. ౧౦౩౯

కం. ఎంతసమర్థము లగుజల,జంతులు బడబాగ్నిఁ జూచి ♦ సాధ్వసవేగా
క్రాంతము లయి కూపెట్టఁగఁ, జెంతల వినవచ్చుఁ బ్లవగ♦శేఖరులారా. ౧౦౪౦

చం. అలజలసాగరంబునకు ♦ నావలఁ బోఁ బదుమూఁడు యోజనం
బులు గలజాతరూపశిల ♦ పొల్చు సువర్ణనగంబు దానిపై
లలితశశిప్రకాశుని ని♦లాధరుఁ బన్నగశాత్రు వేశిరం
బులఫణిరాజు నీలపట♦మోదితుఁ జూడుఁడు మీ రనంతునిన్. ౧౦౪౧

ఆ. ఆమహాత్మునకును ♦ నమరుచుఁ గేతు వై, కనకతాల కేతు ♦ వొనరి యుండుఁ
ద్రిశిర మదియు శైల♦శృంగస్థితంబు పూ,ర్వావధిగను దేవ♦తాళి నిలిపె. ౧౦౪౨

సీ. అటమీఁదఁ గనకమ♦యం బగునుదయాద్రి, కొమరారుఁ దచ్ఛైల♦కోటియందు
నాకస మొరయుచు ♦ హాటకమయ మయి, శతయోజనవితర్ది ♦ జానుమీఱు
నాలతాలతమాల♦జాలకకర్ణికా,రమ్ములు సూర్యతే♦జమ్ము లగుచుఁ
బుష్పవంతమ్ము లై ♦ పొలుపారు నయ్యేక, యోజనవిస్తార ♦ ముచ్ఛ్రితంబు

తే. యోజనదశంబు గలశృంగ ♦ మొప్పు చుండు
సౌమనస మనఁబడు నందు ♦ వామనుండు
మును త్రివిక్రముఁ డగువేళ ♦ నునిచి పదము
గొలిపె రెండవయది మేరు♦కూటమునను. ౧౦౪౩

కం. దినపతి జంబూద్వీపం,బునయుత్తరభాగమునను ♦ మొగిఁ దిరుగుచుఁ ద
ద్ఘనశైలశృంగగతుఁ డై, కనవచ్చున్ దక్షిణంపుఁ♦గడవారలకున్. ౧౦౪౪

తే. అందు భాసిల్లు చుండుదు ♦ రర్కవర్ణు, లమితతేజులు వాల ఖి♦ల్యాఖ్యమునులు
కర్కశవ్రతు లైనవై♦ఖానసులును, దాని ప్రక్కనియదియ సు♦దర్శనంబు. ౧౦౪౫

తే. ఇమ్మహాద్వీపమునయందు ♦ నెల్లప్రాణి,సంఘములకును నేత్రతే♦జంబుఁ గూర్చు
భూరితేజంబు వెలుఁగుఁద♦త్పూర్వకుధర,వనగుహాశృంగములరో♦యవలయుసతిని.

కం. అరుణాంశుద్యుతిచామీ,కరకుధరమహాప్రభాని♦కాయము తనపైఁ
బరఁగుటను బూర్వసంధ్యయుఁ, గరము విరాజిల్లు రక్త♦కాంతులచేతన్. ౧౦౪౬

చం. ధరణికి లోకపాలికిని ♦ ద్వారముగాఁగను దొల్తఁ జేయుటన్
సరసిజసంభవుండు, మఱి ♦ నారసమిత్రప్రచారపద్ధతిన్
బరఁగుట, నాఖ్య మొందు నది ♦ ప్రస్తుత మయ్యెను బూర్వదిక్కనా
నరయుఁడు సీత నందు గహ♦నాంతరనిర్ఝరకందరంబులన్. ౧౦౪౮

ఉ. ఆయుదయాచలీధరము ♦ నావల దేవత లుండుచోటు, ప్రా
లేయకరార్కదీప్తు లట ♦ లేశముఁ బొఱమి నిగ్గు నిండు, నా
చాయ నగమ్య మందనుక ♦ సాధ్యము వోవఁగఁ గాన మీర లా
మాయెడ నోక్తదేశముల ♦ యందును రోయుఁడు భూమికన్యకన్. ౧౦౪౯

చం. చని యుదయాద్రిదాఁక మహి♦జాతను రావణువాసదేశముల్
గని నెలలోన నియ్యెడకుఁ ♦ గ్రమ్మఱుఁడీ యటమున్న రాక ప
క్కన యొప మీరు వధ్యులరు ♦ కీర్తి గడించుఁడు సిద్ధకార్యులై
జనకజ నెట్టులేని కని ♦ చయ్యన రండు సుఖింపుఁ డానలన్. ౧౦౫౦

సుగ్రీవుఁడు హనుమదాదులను దక్షిణదిక్కున రోయఁ బనుచుట.

సీ. పురుహూతదిశ రోయ ♦ హరివీరులను బంచి, దక్షిణదిశ రోయ ♦ దక్షులైన
యగ్నిసంభవు నీలు ♦ హనుమంతు సారస,సంభవతనయుని ♦ జాంబవంతు
గజుని సుహోత్రుని ♦ గవయు శరారిని, శరగుల్మని సుషేణు ♦ వరబలాఢ్యు
ఋషభు గవాక్షుని ♦ ఋభుభిషగ్జాతుల, మైందద్వివిదుల స♦మందబలుల
తే. గంధమాదను విజయు నుల్కాముఖాఖ్యు, నంగదాదుల విదితబ♦లాతిజవులఁ
బంపెఁ దలపోసి యొకకొంత♦బలము మున్న, పనిచె వెంట నెయామ్యది♦గ్భాగమునకు.

ఉ. వారలఁ జేరఁ బిల్చి సమ♦వర్తి దిశాగతదుర్గశైలకాం
తారవిధంబు లిట్లను స♦నంతలతాద్రుమయుక్తముల్ సహ
స్రోరుశిరఃప్రకీర్ణ మగు♦నుగ్రధరంబు మహింబు వింధ్యముల్
భూరిభయంకరాహిచయ♦పూర్ణము నర్మద యన్ మహానదిన్. ౧౦౫౨

సీ. విపులగౌతమిఁ[1] గృష్ణ♦వేణి మహానది, గురుఫణిసేవిత ♦ వరదనదిని
మేఖలోత్కలలను ♦ మెలిదశార్ణోరు, పట్టనములు నశ్వ♦వంతియందు
మఱి యవంతి విదర్భ♦మహిషిఋషికముల, వంగకాశికలిం♦గాంగతలుల
ధరనదీకందరో♦ద్ధురదండకాటవి, గోదావరి[2] నొకింత♦కొదవ లేక
తే. పొలఁతి నరయుఁడు మఱి యంధ్ర♦పుండ్రచోళ
పాండ్య కేరళవిషయాళి♦బహుళచిత్ర
పుష్పితాటవి చందన♦భూజయుత మ
యోముఖంబగు సహ్యాద్రి♦సీమఁ గనుఁడు. ౧౦౫౩

---

[1] గౌతమి = వింధ్యపూర్వభాగమునఁ బ్రవహించు గోదావరి పాయంతరము భోగవతి.

[2] దండకారణ్యమునఁ బ్రవహించునది.

కం. ఏవారికిని నవారిఁగ, నేవారి శివప్రదంబు ♦ హితనిర్మల మా
కావేరిని జలనిధిపతి, దేవేరిని గనుఁడు సురస♦తీవిహితంబున్. ౧౦౪౪

ఉ. ఆమలయాద్రి రాజిలు మ♦హాౌజసు దివ్యఋషీశ్వరుం ఘనుం
గామితముల్ ఫలింపఁగ న♦గస్త్యునిఁ గాంచి నమస్కరించి మీ
రామహనీయునాజ్ఞఁ గొని ♦ యావల నేగుచుఁ దామ్రపర్ణి ను
ద్దామఘనీకుళీరకవి♦తానయుతంబును నక్రజుష్టమున్. ౧౦౪౫

కం. తిలకింపుఁడు చందనవన, కులసంఛన్నంబు ద్వీప♦కోటియుతం బై
యెలప్రాయపుఁగాంత పతిం, గలయఁగఁ జనురీతి జలధిఁ ♦ గలయఁగఁ జనెడిన్.

కం. అనల దివ్యము నవము, క్తావారవిభూషితంబుఁ ♦ గనకాంచితముం
శ్రీవిలసితపాండ్యకవా, టావనిఁ బరికింపుఁడీ వ♦నాటవరేణ్యుల్. ౧౦౪౭

చం. వననిధితీరముం గదిసి ♦ వానరులార! తరించుమార్గముం
గనుఁగొనుఁ డబ్ధిలోపల న♦గస్త్యుఁడు మున్ను మహేంద్రశైలముం
బొనరఁగ నిల్పె నయ్యదియు ♦ మున్నినయట్టులు దోఁచు చుండెడిం
గనకమయంబు నవ్యలతి♦కారుచిరంబు నమగ్ని సేవ్యమున్. ౧౦౪౮

కం. వినుఁ డందు యక్షచారణ, జనములు సిద్ధులును ద్రిదశ♦పతులును గుము లై
యనయం బుందురు శక్రుఁడు, చను దెంచెడు నెల్లపర్వ♦సమయములందున్. ౧౦౪౯

కం. వననిధిమధ్యతలంబున, మనుజులకు నగమ్య మగుచు ♦ మానుగ శతయో
జన మాయత మై ద్వీపము, దనరెడి నం దెల్ల సీతఁ ♦ దగ వెదుకంగన్. ౧౦౫౦

చం. అదియ తలంబు నన్యుఁడు దు♦రాత్ముఁడు శక్రసమప్రభుండు నా
నదితిసుతారి నేత వసు♦ధాత్మభవాప్రతిరోధి రావణుం
డనయుఁడు గ్రాలుపట్టు న ♦ తోటను మిక్కిలి జాగరూకు లై
వదలక యింతమాత్రమును ♦ వారక రోయుఁడు మర్కటాగ్రణుల్. ౧౦౫౧

కం. దక్షిణజలనిధినడుమను, రాక్షసి యంగారకాఖ్య ♦ గ్రాలెడు నదియుం
రూక్షిత భూతవ్రాతము, భక్షించును ఛాయ నొడసి♦పట్టి కడంకన్. ౧౦౫౨

సీ. ఆయెడ జానకి ♦ నరసి హెచ్చరిక మై, నట లేమి నిస్సంశ♦యంబ యనుచుఁ
దోఁచిన నావలఁ ♦ దూర్ణంబ చనుఁ డొక్క, యోజనశత మందు ♦ నొప్పుచుండు
సిద్ధచారణచయ♦సేవిత మై చంద్ర, సూర్యాంశుతులిత మై ♦ సొబగుమీఱి
యంబుధినీరస♦మావృత మై మింటి, నొఱయుకూటములచే ♦ నొఱపు వెలసి
తే. పుష్పితకనామగిరి యొండు ♦ భూధరంబు
కనకశృంగంబు రాయుచుఁ ♦ గమలహితుఁడు

దక్షిణాయనమున వచ్చు ♦ దానిరజత
శిఖరమును గొల్చు శశి కపి♦శ్రేష్ఠులార! ౧౬౩

కం. మేలును మఱచినవారలు, కూళలు నాస్తికులు సల్లి♦కుధరముఁ జూడం
జాలరు మీరును శిరముల, శైలంబు నమస్కరించి చను ♦ రోయు నటన్. ౧౬౪

సీ. అప్పర్వతము దాఁటి ♦ యరుగఁగఁ బదునాలు,గామడ దుర్ధర్ష ♦ మైనసూర్య
వంత మన్ గిరియొప్పు ♦ వైద్యుతశ మావల, సందు మూలఫలాదు ♦ లారగించి
తేనె లాస్వాదించి ♦ తీరఁ బతి శ్రమ, మావలఁ గుంజర ♦ మనెడిగిరిని
గాంచుఁ డస్మల విశ్వ♦కర్మ యగస్త్యున, కొక్కమందిరము నిం ♦ పొదనఁ గూర్చె

తే. నదియు నామడ వెడలుపు ♦ పంతకుఁ బది,యంత లెత్తును గలిగి హే♦మాంచితంబు
దివ్యరత్నోజ్జ్వలం బయి ♦ తేజరిల్లు, దానిఁ గనుఁగొనుఁ డస్మహా♦ధరమునందు

కం. భోగిపవాసుకి నిలయము, భోగవతీనామ మొనరి ♦ పురుదుర్ధర్షా
భోగమహాకక్ష్యం బయి, నాగావిత మగుచు నొందు♦నగరం బమరున్. ౧౬౬

కం. అయ్యహినగరాంతరమున, నయ్యొరమొడఁ గలవు చుఁడు ర♦హస్యతలంబుల్
చయ్యన నవి యన్నియు మీ, రొయ్యన నెమకుచును జనఁగ ♦ నురుమాపం బై

కం. ఋషభాకృతిఁ గన నయ్యెడి, ఋషభాఖ్యధరాధరం బ♦హీనమణిశ్రీ
విషయము దివ్యజ్వలన,త్విష మగుగోశీర్షకంబు ♦ దీప్తి గలదియున్. ౧౬౭

సీ. పద్మకశ్యామల♦వర్ణ మాచందనం, బమరు నగ్గిరి వాని ♦ నవధరింపుఁ
డంతియకాని మీ♦రంటఁ బోకుఁడు వానిఁ, గ్రూరగంధర్వులు ♦ రోహితాఖ్యు
లార రక్షించెద ♦ రనవరతంబును, బభ్రు శైలూషులు ♦ శుభ్రశిగ్రు
వులును గ్రామణి నాఁగఁ ♦ గలరు గంధర్వేంద్రు, లేవురు సూర్యస♦మిద్ధతేజు

తే. లందు రవిచంద్రవహ్నిస♦మాంగు లైన,పుణ్యకర్ములు నివసింత్రు ♦ భూమి గమిసు
గాఁగ రాజిల్లు నగ్గిరిఁ ♦ గలరు స్వర్గ,జితులు దుర్ధర్షులనఘులు ♦ సిద్ధకృతులు.

ఉ. దానిని దాఁటి పోవఁగ సు♦దారుణ మై పితృలోక ముండెడిన్
గాన మనుష్యకోటికి న♦గమ్య ము నెం యమరాజధాని య
ద్దానిని జుట్టి యుండు భయ♦దం బగుచీఁకటి యంతదాఁక నే
వానరులార! మీరు చన♦వచ్చును బోవ నసాధ్య మావలన్. ౧౭౦

కం. ఈనిఖిలము మఱి యిఁక నే, వేనియుఁ ద్రోవలను దోఁప ♦ నేమియు విడ కే
మానవపతికాంతను నవ,ధానంబున రోయవలయుఁ ♦ దత్పరమతు లై. ౧౭౧

ఉ. మాసములోనఁ గ్రమ్మఱి తు♦మానుతఁ గాంచితి నన్న వాఁడు సౌ
ఖ్యాసమభోగవైభవచ♦యంబులు నెప్పుడు మత్సమానుఁ డై

వాసిఁ జెలంగుచుండు మఱి♦వానికి నస్యము మత్ప్రియంబు లే
దీసకలావనిన్ మిగుల ♦ నెక్కుడుదోషియుఁ జుట్ట మయ్యెడిన్. ౧౦౭౨
కం. మీరలు విక్రమసత్త్వ, దారులు సత్వాంశభవులు ♦ తతవిపులగుణా
ధారులు జనకసుతామణి, నేరీతిగ నైనఁ గనుఁడు ♦ కృతయత్నుల రై. ౧౦౭౩

→ సుగ్రీవుఁడు సుషేణాదులఁ బశ్చిమదిశ రోయఁ బనుచుట. ←

తే. హనుమదాదుల నిట దక్షి♦ణాశ కనిచి, భీమవిక్రముఁడును దన♦మామ యైన
తారతండ్రిని జలదాభుఁ♦జేరి కేలు, మోడ్చి వినయంబుదోఁపఁగ♦మ్రొక్కి యనియె.
ఉ. ఏచినభీమవిక్రముని ♦ నింద్రసమద్యుతియుక్తు భూరిధై
ర్యాచలు శౌర్యదర్పగహ♦నాటపరీతు మరీచిపుత్త్రు మా
రీచుని శేముషీలసద♦రీణచరిత్రు ఖగేంద్రతుల్యు మా
రీచుల శూరులం గపిస♦రిష్ఠుఁడు గాంచి వచించె నీగతిన్. ౧౦౭౪
సీ. చనుఁడు సుషేణాది♦వనచరులార మీ, రెల్లరు శ్రీరాము♦నింతి వెదక
రెండులక్షలు క్రోఁతి♦కాండంబుతోఁ బశ్చి,మముగ సురాష్ట్రంబు ♦ మహితబాహ్లి
కంబు శూరంబు భీ♦మం బను దేశముల్, విపులపురాణజ♦నపదచయము
పున్నాగగహనంబుఁ ♦ బొగడవనంబును, మొగిలికాంతారముల్ ♦ మొగిని గనుఁడు
తే. పశ్చిమంబుగఁ బాఱునా♦పగలు మునుల
కాననంబులు కొండలు ♦ గహనములును
మరుతలంబులు ఘనశిలా♦మండలములు
వెదకుచును బశ్చిమాంబుధిఁ ♦ గదియఁ జనుఁడు. ౧౦౭౬
కం. తిమినక్రాయుత మఖ్యో, భ్యము నీరధిఁ గాంచి తీర♦బహు కేతకషం
డములం గానుగుతోఁపుల, రమియింపుఁడు నారికేర♦రాజితవనులన్. ౧౦౭౭
ఉ. అం దనుకూలసంగతమ♦హాద్రినదీనిచయంబులందు శ్రీ
సుందరి జానకిన్ బలని♦షూదన వైరిని రావణాసురున్
బొందుగ రోసి దాఁటి చని ♦ పూనికమై మురచీపురంబునన్
సుందర మాజటీపురిని ♦ జూడుఁ డవంతిని సంగలోపనున్. ౧౦౭౮
చం. పురములు రాష్ట్రముల్ జనులు ♦ పోఁగరానివనీతలంబులున్
దూరి తోరి చూచి సింధునది ♦ తోయధిఁ జేరెడుచోటఁ జూడుఁడీ
ధరము మహాద్రుమాళికలి♦తం బురుకూటశతంబు గల్గునం
బరపరిచుంబిహేమగిరిఁ ♦ బటుకకేసరియుక్తసానువున్. ౧౦౭౯
కం. తిములన్ మత్స్యంబుల నా,గములం గుధరాగ్రకూట♦గతనీడములన్
గుములుగఁ గొని చని యాసిం,గము లుంచును దిరుగు దృప్త♦కరులచ్ఛటన్.

చం. అనఘచరిత్రులార! గిరి♦యంతయు నారసి వేగ నూఱుయోo
జనములు గిల్గి చూడఁగ న♦సాధ్యతరం బగుపారియాత్రకాం
చనగురుశృంగముం గనుఁడు ♦ సత్త్వగరిష్ఠులు కామరూపులం
దనలసమాను లుందురు ని♦రంతర మిర్వదినాల్గుకోటులున్ ౧౦౮౧

కం. గంధర్వులు దృఢవిక్రమ, సింధురశాత్రవులు వారిఁ ♦ జేరకుఁ డీరల్
బంధురఫలమూలముల మ, దాంధతఁ గాచెదరు వార ♦ లంటకుఁ డెవియున్.

కం. సీతాసతి నట రోయుఁడు, భీతిలఁ బని లేదు మీక♦పిత్వమునలనే
బూతవిదూరజవన్నా, భాతతసద్వజ్రపృథమ♦హాగిరి యొప్పున్. ౧౦౮౩

కం. నానాద్రుమలతికాసం, తానం బది దాని వజ్ర♦ధర మంత్రు నుండీ
మానుగ శతయోజనసమ, మై నేల యెసంగుచుండు ♦ నతిచిత్రముగన్. ౧౦౮౪

సీ. ఆవలఁ గలగుహ ♦ లన్నియు వెదకి పోవఁగఁ గంధిని జతుర్థ♦భాగమునను
జక్రనంతం బను♦శైలవరం బుండు, నందుఁ దోఁచెడి సహ♦స్రారచక్ర
మది విశ్వకర్మజం ♦ బది గాచు దానవ, వర్యు హయగ్రీవుఁ ♦ బంచజనునిఁ
జంపి మురారి త♦చ్చక్రంబు శంఖంబుఁ, గైకొనె నాసాను♦కందరముల

ఆ. వెదక నలయు సీత ♦ విబుధారి నావల, షష్టియోజనముల వి♦శాల మైన
రజతశృంగయుతవ♦రాహాఖ్యపర్వతం, బుండు వార్ధిలోన ♦ గండు మీఱి. ౧౦౮౫

కం. ఆతతకుధరంబునఁ బ్రాగ్జ్యోతిషపుర మొప్పు నందుఁ ♦ గ్రూరాత్ముం డా
ప్రతేయుఁడు నరకుఁడు ని, ర్భీతిఁ వసియించుఁ దద్వ♦రీకటకములన్ ౧౦౮౬

సీ. కలయఁజూచుచుఁబోవఁ♦గాంచనాంతరనిర్ఝ, రంబును మఱియుఁ బ్ర♦స్రవణయుతము
నగుసర్వసౌవర్ణ ♦ మనుకొండ గల దందు, జలపాతమునకు మా♦త్తెలుఁగు లిచ్చుఁ
గరిసింహశార్దూల♦కిరివితానంబులు, హరిహయు నెచ్చట ♦ సమరు లెల్ల
నభిషిక్తుఁ జేసి రా♦యవనీధరంబ చూ, మేఘవంతం బని ♦ మెప్పు గాంచె

ఆ. నదియు దాఁటి పోవ ♦ నఱువదివేలభూ, ధరము లుండు నందుఁ ♦ దరణివర్ణ
కనకమయుజకుజాళి ♦ గ్రాలుఁ బుష్పితమయి, చూడఁజూడ నింపు ♦ సొంపుఁ గూర్చు.

ఉ. వానికి మధ్యభాగమున ♦ వాలెడి నుత్తర మేరుపర్వతం
బానగరాజుఁ జూచి కమ♦లాప్తుఁ డొసంగె వరంబు ప్రీతుఁ డై
మానితు లై త్వదాశ్రయులు ♦ మాపును రేపును గాంచనాంగముల్
పూనుచు మత్ప్రసాదమునఁ ♦ బొల్చుచు నుందురు శైలసత్తమా! ౧౦౮౭

కం. నీపయి వసించు దేవక, లాపము గంధర్వముఖులు ♦ లలితప్రభ చే
దీపితతను లై శుభర, క్తాపఘనస్ఫూర్తి నుందు ♦ రహర్నిశతంబా. ౧౦౮౮

శా. విశ్వాదిత్య మరుద్వసుప్రముఖులున్ ♦ విఖ్యాతు లౌనిర్జరుల్
శశ్వచ్ఛక్తి ద్వితీయసంధ్య దినముం ♦ జామీకరాద్రిస్థు స
ప్తాశ్వుం గొల్తురు భూతకోటికి సహ♦స్రాంశుం డదృశ్యాంగుఁడై
విశ్వంబెల్లను జీకటిన్ మునుఁగఁ దా ♦ వేంచేయు నస్తాద్రికిన్. ౧౯౦

సీ. పదివేలయోజన ♦ ప్రాకారము దగ్గము,హర్మ్యంబు పోయి శి♦లోచ్చయంబుఁ
జేరు నాపర్వత♦శృంగాగ్రమున సూర్య,సన్నిభ మైనప్రా♦సాదనిచయ
భరితమహాదివ్య♦భవనంబు రాజిల్లు, విశ్వకర్మకృత మై ♦ వివిధపక్షి
సంకులితం బయి ♦ చారుభూజాతశో,భిత మయి వరుణని♦వేశ మొనరు

తే. సప్తగిరిమేరుగిరులకు ♦ సంతరమున, శ్రీసువర్ణమయంబును ♦ జిత్రవేది
కంబు దశశిరములు నయి ♦ క్రాలునొక్క, తాలవృక్షంబు లోచనో♦త్సవముగాఁగ.

సీ. అతులతపోనిష్ఠుఁ ♦ డధికధర్మిష్ఠుఁడు, మేరుసావర్ణినాఁ ♦ పేరఁ బరఁగు
బ్రహ్మతుల్యుం డందు ♦ రాజిల్లు నొక ఋషి, నాతనిఁ గని మ్రొక్కి ♦ యంబుజాక్షి
వార్త మీ రడుగుఁడు ♦ నానరులార ని,శాంతంబునను నీర♦జాతహితుఁడు
తిమిరంబు నిండాఁకఁ ♦ దేజంబునను జోపి, యస్తశైలంబున ♦ కరుగుచుండు

ఆ. నటుఁగ రాదు మనకు ♦ నే మున్నదో యట,పై సభాస్కరంబు ♦ పరఁగు నియలు
నస్తశిఖరి దాఁక ♦ నరిగి రావణునిల,యంబుఁ గాంచి సీత ♦ నరసి రండు. ౧౯౨

చం. ఒకనెలలోన రావలయు ♦ నుండఁగ రా దటమీఁద నెవ్వఁడేన్
వెకలితసంబునన్ నిలిచె♦నేనియు వధ్యుఁడు వాఁడు మీరలుం
బ్రకటపరాక్రమాఢ్యులరు ♦ మామ సుషేణుఁడు వచ్చు వెంట నా
వికటబలాఢ్యునాజ్ఞ మెయి ♦ వే చనుఁడీ గురుఁ డీతఁ డెల్లకున్. ౧౯౩

కం. ఈతని ముఖ్యునిఁగాఁ గొని, సీతాపతి వెదకి కార్య♦సిద్ధుల రయినన్
భూతలమునఁ బ్రతికృతిచే, ఖ్యాతిం గనవచ్చుఁ జూఁడి కృ♦తార్థుల మగుచున్.

తే. చెప్పినది గాక యింకేమి ♦ చేయఁ దగిన,యట్టి దున్నను దేశకా♦లార్థహితము
గాఁగ యోజించి చేయుఁడీ ♦ కపివరేణ్యు,లార! పశ్చిమదిక్కుగా ♦ నరుగుఁ డీరు.

సుగ్రీవుఁడు శతవలిని నుత్తరమున బోయఁ బనుచుట.

కం. తనమామఁ బశ్చిమంబుగఁ, బనిచి వనచరేశ్వరుండు ♦ బలసంపన్నున్
ఘను శతవలిఁ గని తనకును, వినతులునకు హితముగాఁగ ♦ నిట్టని పలికెన్. ౧౯౪

సీ. ప్రాలేయకుధరంబు ♦ రాజిల్లు నుత్తర, దిక్కుగా శ్రీరాము♦దేవి వెదక
నీయట్టివానరుల్ ♦ నినుఁ గొల్వ నూఱువేల్, యమతనూజులతోడ ♦ నరుగవయ్య
యీకార్యమును దీర్చి ♦ యాకాంతునకుఁ బ్రియం, బొరఁ జేసితి మేని ♦ యప్పువలన
విడువంగఁబడి యగ్గ♦విదులందుఁ గృతకృత్యు,లందునుత్తముల మై♦యనుపమఁ గలము

ఆ. మనకు మున్ను ప్రియము♦జనకజాపతి గూర్చెఁ, బ్రతిహితంబు సేఁత ♦ ప్రథ యొసంగ
జన్న మగచరేంద్ర! ♦ సఫలంబు నొనరింప, వెరవు గాదె శుభవి♦వేకధుర్య ౧౦౯౭

కం. ఉపకారి గానివానికి, నుపకారముఁ జేయ జన్న ♦ మొప్పు సఫల మై
యుపకారికి నుపకారముఁ, గపివర్యా! చేయఁ జెప్పఁ♦గా వలయు నొకో. ౧౦౯౮

చం. ఇది మది నుంచి రాముజల♦జేక్షణ జానకి యేమిపద్ధతిన్
విదితగ నొనొ యట్టిగతి ♦ వీడక మీరు చరింపఁగాఁ దగున్
సదమలచిత్తులార! యని♦శంబు హితైషుల రౌట మీరలే
చదురున నైన నీనృపతి♦సత్తముకార్యముఁ దీర్పఁ బాడి యౌ. ౧౦౯౯

ఆ. ఎల్లభూతములకు ♦ నీశుండు పూజ్యుండు, రాముఁ డహితజనపు♦రంజయుండు
మహితకరుణ గలఁడు ♦ మనమీఁదఁ గావున, వనుల గిరుల వెదక ♦ వలయు సీత.

సీ. మొలపునఁ జని మీరు ♦ మ్లేచ్ఛదేశంబున, శూరసేనపుళింద♦ధారిణులను
బ్రస్థర మద్రక ♦ భరత కురూద్వులఁ, గాంభోజ యవన శ♦కంబులందు
నారట్ట బాహ్లిక ♦ పౌరవ టంకణ, ఋషికంబునను జీన♦విషయములను
బరమచీన నిహార ♦ దరద తలంబులఁ, బ్రాలేయపర్వత♦భాగములను

తే. దేవదారు వనంబులఁ ♦ దేజు మిగులు, లోధ్ర పద్మక షండాళి ♦ లోలనేత్ర
సీత వెదకంగ వలయు దు♦ర్నిరీక్షుఁ డైన, పంక్తికంఠునితోఁ గపి♦ప్రముఖులార!

కం. సోమాశ్రమంబుఁ గనుఁగొని, భూమీధరవరముఁ గాళ♦మును గని యవలన్
భూమిజను జక్క వెదకుఁడు, దీనుసమునఁ దటదరీప్ర♦దేశములందున్. ౧౧౦౩

సీ. ఆపర్వతము దాఁటి ♦ యట పోవఁగ సుదర్శ,నాఖ్యపర్వత ముందు ♦ నది తరింప
నానాశకుంతవి ♦ తానసమాకీర్ణ, దేవసఖాద్రియుఁ ♦ దేజరిల్లు
నావల శతయోజ♦నాయతదేశ మ,గ్రావనైవాలిసీ♦త్క్రాజ మగుచు
సత్త్వశూన్యం బయి ♦ సాగుచు నుండు నా, కాంతారమును వేగ ♦ గడచి చనినఁ

తే. దోఁచుఁ గైలాసశైలంబు♦తోలఁచు వెతల,నచటఁ బాండురమేఘాభ♦మతులకనక
మండితము శ్రీసభవనంబు♦పాండురాభ్ర,కాంతిఁ గొలుపారెడిని విశ్వ♦కర్మకృతము

కం. అహ్లాదనిదాసం బయి, కహ్లారేందీవరాబ్జ♦కైరవయుత మై
నుహ్లాసపండజ మైదే,వహ్లీకావతులు[1] గొలువ ♦ వఱలును గొలనున్. ౧౧౦౪

ఉ. అచ్చరమచ్చెకంటులు వి♦హారము సల్పెడు దానిపొంత నై
యచ్చరజాతి యక్షనిచ♦యంబులు గొల్వఁ గుబేరుఁ డెప్పుడున్
ముచ్చటదీరఁ గ్రీడలను ♦ మోదితుఁ డయ్యెడు మీరు రావణున్
సచ్చరితాగ్రగణ్య యగు♦జానకినిన్ వెమకుండు తత్థ్సలిన్. ౧౧౦౫

---

1 [illegible]

కం.ఆవలఁ గ్రౌంచాద్రిని గనుఁ, డావివరము దుష్ప్రవేశ ♦ మందుఁ బ్రమాదా
భావమ్ముగఁ జొరుఁ డుందురు, దేవార్చితు లర్క సములు ♦ దివ్యమహర్షుల్. ౧౧౦౬
కం.తక్కిన గుహలును జఱులును, లెక్కకు మిగిలినదరీస్థ♦లీకటకములుఁ
జక్కఁగ వెదకుఁ డవృక్షం, బక్కడఁ గలకామశైల ♦ మామానసమున్ ౧౧౦౭
కం.చోరరాదు మానసాహ్వయ,గిరి సురదానవుల కేని ♦ గిరిపార్శ్వములం
దరయుఁడు క్రౌంచము దాఁటినఁ, బరఁగెడి మైనాక మనఁగఁ ♦ బర్వతవరమున్.
కం.అందు మయదానవుఁడు దా,నందంబుగఁ గట్టుకొనిన ♦ యాలయ ముండుఁ
గందరసానుతలంబుల, సుందరి వెదకంగ వలయుఁ ♦ జుండీ మీరల్. ౧౧౦౯
కం.ఘోటకముఖు లగుయువతుల,వాటంబులు గలుగు ♦ వాని వడిఁ గడచినచో
మేటు లగువాలఖిల్యుల,కోటులు సిద్ధులును దపము ♦ గూడెద రెపుడున్. ౧౧౧౦
తే. వందనీయులు వారలు ♦ పరమతపము,పేర్మి గతకల్మషాత్ములై ♦ పేర్చు చుంద్రు
మిగులువినయంబుతోడుత ♦ మిథిలకన్య,వార్త వారల నడుగుఁడు ♦ ప్లవగులార!
కం.ఆసిద్ధాశ్రమతలమున, భాసురకనకాబ్జపిహిత♦వైఖానసనా
మాసమసరస్సు గల దట, భాసిలు బాలార్కనిభవి♦భాహంసంబుల్. ౧౧౧౨
తే. ఐలబిలుప్రియువాహనం ♦ బనఁగఁ బరఁగు, సార్వభౌమాఖ్యనాగంబు ♦ సంతతంబు
వచ్చు నచ్చోటికిని వశా♦వళులు గొల్వఁ, దత్సరః ప్రాంతముల మీరు♦దగును వెదక.
సీ. ఆసరోవరమున ♦ కావల నష్టచం,ద్రదివాకరంబు న♦తారకంబు
నిష్పయోదము మిన్ను ♦ నిశ్శబ్ద మగు; మును,లందు స్వయంప్రభు ♦ లర్కునట్లు
వెలిఁగించు చాస్థలి ♦ విశ్రమించెదరు మీ, రది దాఁట శైలోద ♦ యనెడియేఱు
పాఱు నానది రెండు♦ప్రక్కలఁ గీచకా,ఖ్యాత వేణుకుడుంగ♦గణము లుండు
తే. నవియ యాధారముగ సిద్ధు ♦ లైనవార, లావలీవలఁ బోవ రా ♦ నమరి యుండుఁ
బుణ్యపురుషావళికి నెల్ల ♦ భోగభూము, లుత్తరపుఁ గురుదేశంబు ♦ లొప్పియుండు.
కం.చంచద్వైడూర్యదళో,దంచిత మై నవ్యకాంచ♦నాంబుజ యుత మై
మించినమనోజ్ఞనళినీ,సంచయములతోడ నదులు ♦ చాలఁగ నొప్పున్. ౧౧౧౫
తే. అచట రక్తోత్పలములవ♦నాళి గలుగు
నచటినీరాకరంబులు ♦ హాటకాభ
ములును దరుణార్కసన్నిభ♦ములును నగుచుఁ
బటిమ మీఱును గన్నుల♦పండు వగుచు. ౧౧౧౬
తే. మేలినల్లనిరతనాల♦మిసిమి త్రెకు, లచ్చ పచ్చానపరంజిడా♦లకరువులును
గలుగునల్లనికలువలఁ గలుకు♦లైన,కొలఁకు లెల్లెడ సొబగారుఁ ♦ గొమరు మిగిలి.

తే. ఆణిముత్యాల రతనాల ♦ రాణ మీఱు, నిసుకదిబ్బలతో నీళ్లు ♦ పస నెసంగు
నగ్గికీడయి జాళువా♦నిగ్గు దేఱు,కొండ లెన్నెడఁ జెన్నారు ♦ దండి బలిసి. ౧౧౧౯
కం.ఎల్లపుడుఁ బూలు పండ్లును, బెల్లుగ నై పులుఁగుగములు ♦ వేలకొలఁదు లై
మొల్లపుఁదావులు సోఁకును, గొల్లలు నై కోర్కు లెల్లఁ ♦ గురియుం జెట్టుల్.
ఉ. అచ్చటి కొన్నిగుంట్లు వివి♦ధాకృతి చేలము లీనుఁ, గొన్ని శై
లోచ్చయముల్ సతీపురుష♦యోగ్యములుఁ నిఖిలర్తుసేవ్యముల్
ఇచ్చకు వచ్చుసత్ఫలము ♦ లెంతయుఁ గూర్చును, వెండి కొన్నియుఁ
మెచ్చగురత్నసంతతుల ♦ మేలివిభూషల నిచ్చుఁ బెచ్చుగన్. ౧౧౨౦
సీ. అనుపమచిత్రహై♦మాసనశయనాళి, గ్రావోత్తములు కొన్ని ♦ కాచు నచట
భక్ష్యపానంబులు ♦ బహువిధమనఃకాంతమా,ల్యంబుల నీను ద్రు♦మంబు లచట
నయ్యెడఁ దోయ్యలుల్♦ హారిణుల్ యౌవన,భ్రాజితల్ సుగుణసం♦పన్న లుంద్రు
గంధర్వసిద్ధనా♦గవ్యూహకిన్నర,విద్యాధరసమితి ♦ వేడ్క మీఱఁ
తే. దరణితేజస్సులై తమ♦తలిరుఁబోండ్ల,తోడ విహరింత్రు కామముల్♦దోరములుగ
రతిపరాయణ మగుచు సు♦కృతకలాప,కర్మ మగుచుండు నట జన♦కాండ మెల్ల.
తే. అఖిలభూతమనోహారి ♦ మగుచు నందు, మందహాసయుతంబుగ ♦ మగువగములు
నించు సంగీతవాదిత్ర♦నిస్వనంబు, జాను మీఱఁగ వినవచ్చు ♦ సంతతంబు. ౧౧౨౨
కం.ముదితుండు కానివాఁడును, ముదితను లేనట్టివాఁడు ♦ ముచ్చట కేనిఁ
మెదలుట లేదట గుణములు, పొదలు మనోరమతఁ బూఁట♦పూఁటకుఁ బ్రజలన్.
తే. దానిని దరించి పోయి యు♦త్తరము గాఁగఁ
జూడుఁడు పయోధి దానిలో ♦ సోమశైల
మనఁగ హేమమయం బగు♦నచల ముండు
నింద్రవిధిలోకవాసులు ♦ గంద్రు దాని. ౧౧౨౪
కం.తపనుఁడు గలదేశంబులఁ, దపనుని తేజమున వస్తు♦తతివలె నచటఁ
దపనుఁడు వెలుంగకయుఁ ద,త్తపనీయరుచిం బదార్థ♦తతి గానఁబడున్. ౧౧౨౫
కం.భగవంతుఁడు విశ్వాత్ముఁడు, తగ నేకదశాత్మకుండు ♦ దర్పకహరుఁడుఁ
జగతీస్రష్ట విధాతయు, నగచరవరులార! యుందు ♦ రావాసముగన్. ౧౧౨౬
కం.ఉత్తరకురుభూములకును, నుత్తరముగఁ బోకుఁడీ సు♦రోత్కర మేనిఁ
సత్తంబు గాదు సోమకు,భృత్తును జేరంగ మీర ♦ లీక్షించి గిరిన్. ౧౧౨౭
కం.మరలుఁ డమహ్యాదంబును, నరవిప్రభ మవల నెఱుఁగ ♦ మట నే ముండుఁ
హరులార! మీరు నాచేఁ, బరికీర్తిత మగదితంబు ♦ వసుధయుఁ గనుఁడీ. ౧౧౨౮

కం.భామామణిఁ గాంచుటచే, రామునకుఁ గడుం బ్రియంబు ♦ రామునకంటెన్
నామదికి నధికమోదం, బోమరుదనలాభులార ♦ యొదవిం త్రీరన్. ౧౧౨౯

కం.అంత మదర్చితులై యే,కాంతము హితబాంధవాళి ♦ కడు నలర ధరన్
శాంతవిరోధులరై మీ,స్వాంతంబున కెక్కఁ దిరుగుఁ ♦ డనుచును మఱియున్.

సుగ్రీవుఁడు కార్యభారము హనుమంతుపై మోపుట.

చం.హనుమను జూచి వానరకు♦లాగ్రణి యాతఁడె కార్యసాధకుం
డని మది నిశ్చయించి యని♦లాత్మజు విక్రమవంతుఁ గాంచి యి
ట్లను ముదమార నోవనచ♦రాగ్రణి! యప్పుల నిప్పులన్ సురా
వని గగనంబునందు నని♦వార్యము నీగతి నే నెఱుంగుదున్. ౧౧౩౦

కం.సాసురము సగంధర్వము, సాసురరిపుసర్వమనుజ♦సంఘము సధరం
బోసామీరి! ససింధువు, నౌసకలధరిత్రి నీకు ♦ నవిదిత మున్నే. ౧౧౩౨

కం.జవమునఁ దేజంబున లా,ఘవమున గమనంబునందుఁ ♦ గడిమిగరిమలన్
బవమానతనయ! పిత యగు,పవమానునితోడ నీడు ♦ సత్త్వవు నీవున్. ౧౧౩౩

ఉ. ఓకపిలోకనాథ! భవ♦దున్నతతేజముచేతఁ జూచినన్
నీకు సమంబుభూత మవ♦నిస్థలి లేదు బలంబు బుద్ధి య
స్తోకపరాక్రమంబు గుణ♦దోషవిచారణశక్తి దేశకా
లైకసదానువృత్తియు న♦యజ్ఞ తిరంబుగ నుండు నీయెడన్. ౧౧౩౪

కం.కావున హనుమా! రాఘవు, దేవిని సాధించి మరలఁ ♦ దేర నుపాయం
బీవే చేయఁగ వలయును, నా విని రాముండు యోజ♦నను జల్పె నిటుల్. ౧౧౩౫

రాముఁడు హనుమంతుచేతికిఁ దనముద్రిక నిచ్చుట.

ఆ. కార్యభార మెల్లఁ ♦ గపినేత హనుమంతు,నందు నిడియె ♦ నిశ్చి♦తార్థుఁ డితఁడు
కార్యసాధనమున ♦ గాడుపుపట్టియు, నిశ్చితార్థకరుఁడు ♦ నిశ్చయంబు. ౧౧౩౬

ఆ. పూర్వకృతము లైన♦భూరికార్యములచేఁ, బేరు నమ్మకంబుఁ ♦ గూరి మిగుల
భర్త నచ్చినట్టి♦బంటు గావునఁ గార్య,ఫలము వీనివలనఁ ♦ గలుగు నిజము. ౧౧౩౭

కం.వ్యవసాయోత్తరుని హరి,ప్రవరునిఁ గని మానసమునఁ ♦ బరిహృష్టుం డై
యవనీపతి తన్నన్ ధ,న్యవరులన్ భావించి ప్రేడి♦యుంగర మొందన్. ౧౧౩౮

మ. తనపేరుంగలయట్టిదానిఁ గొని సీ♦తాభర్త ప్రీతిన్ మరు
త్తనయుం గాంచి కపీంద్ర! గీనిఁ గొనుమీ ♦ ధాత్రీజకున్ దీనిఁ జూ
పిన నమ్మున్ సతి నాదుదూత వని ని♦ర్భీతిన్ నిజం, గీశనే
తనియుక్తంబును నీవ దీక్ష వని యూ♦త్మం దోఁచె వీరాగ్రణీ. ౧౧౩౯

క. నీవిక్రమసంపదయును, నీవిపులం బైనబలము ♦ నీయత్నము సు
గ్రీవునిసందేశముఁ గన, నీవలనె కార్యసిద్ధి ♦ నిక్కముగ నగున్. ౧౧౪౦

చం. అతిబలసింహవిక్రమ య♦సల్పపరాక్రమ మూని జానకీ
సతి నెటు గాంచ నౌ నటులు ♦ సల్పుము కార్యము, నేను నీబలా
శ్రితుఁడ న టన్న నంగరముఁ ♦ జేకొని మూర్ధమునన్ ధరించి స
మ్మతిఁ గరముల్ మొగిడ్చి పద♦ముంజయులన్ నతి చేసి నిల్చినన్. ౧౧౪౧

## వానరులు సీతను వెదకఁ బోవుట.

క. ప్లవగర్షభుండు సర్వప్లవగులఁ దిలకించి రాము♦పని సిద్ధింపన్
జవమునఁ జని నాచెప్పిన,యవనీతల మెల్ల వెదకుఁ ♦ డన నక్కపులున్. ౧౧౪౨

చం. ఎడలనిభక్తిచేతఁ దమ♦యేలినవానినిదేశ మూని పె
న్మిడుతలదండువోలె నవ♦నీస్థల మెల్లను నాక్రమించుచున్
గడువడిఁ బోయి రందు హరి♦కాండముతో వినతుండు తూర్పుగాఁ
బడమరగా సుషేణుఁ డను♦వానరవర్యుఁడు పోయె నర్థిలిన్. ౧౧౪౩

చం. శతవలి యుత్తరంబుగను ♦ సాగెను దక్షిణదిక్కుగా మరు
త్సుతుఁడును దారుఁ డంగదుఁడు ♦ తోడుగ రాఁ జనుచో సతారమున్
గతజలదంబు శుద్ధ మగు♦ఖంబునఁ జంద్రుఁడువోలెఁ బొల్చె వ్యో
మతలమునందు వానరస♦మాజములుం దనుఁ జుట్టి కొల్వఁగన్. ౧౧౪౪

తే. తరణిసూనుండు కపుల య♦థాతథంబు,గా ననిచి సంతసించె సు♦ఖంబుఁ గాంచి
రామలక్ష్మణు లంతఁ బ్ర♦స్రవణముసను, గాచి యుండిరి మాసంబు ♦ గడువు దీఱ.

క. తెచ్చెద నేనే సీతను, వ్రచ్చెద రావణునిఁబట్టి ♦ రయమున ననె గా
ఢోచ్చానదోస్తులను గీ,శోచ్చయములఁ గూయఁ దొడఁగ ♦ నొక్కఁ డొకండున్.

క. అఱచుచు బిగ్గఱ రదములు, గొఱుకుచు దెస లెల్ల నద్రుసఁ ♦ గూయుచుఁ దోఁకల్
చఱచుచు సింహరవంబులు, నెఱపుచుఁ బరువెత్తుచున్ వ♦నీచరు లుండన్. ౧౧౪౭

క. నేనే రావణుఁ గిట్టి మ,హానీకమునందుఁ బట్టి ♦ యణఁగఁగఁ గొట్టన్
జానికి భయమున వణఁకం, దే నేగ్గును మీఱ లింద ♦ నిలువుఁడు క్రోఁతుల్. ౧౧౪౮

క. అంచు నొకరుండు పల్కనఁ, ద్రుంచెద వృక్షముల గిరులఁ ♦ దూలించెద నెం
డించెద సింధువు ధరఁ గా,రించెద జానకిని వే హ♦రించెద నేనే. ౧౧౪౯

క. అనవుడు నొకకపి నేయో,జనశతమున్ దాఁటువాఁడ ♦ జవమున ననఁగా
విను నే దాఁటుదును జివు,క్కున సంతకు నెక్క డనుచుఁ ♦ గ్రోఁతి యొకఁ డనున్.

క. భూమిని బాతాళంబున, భీమమహీధరములందుఁ ♦ బెనుఁ గోనల ని
స్సీమాబ్ధి నడ్డులే క,ద్దామగతిం జనుదు ననుచుఁ ♦ దరుచరుఁ డొకఁడున్. ౧౧౫౧

కం. ఇటు లోకోత్కృష్టము తన తన, పటుజవసత్త్వములు దెలియఁ ♦ బలుకుచు దర్పో
ద్భటుఁడై కపిరాజేంద్రుని, కటతలమునఁ బలికె నధిక♦గర్వ మెలర్పన్. ౧౧౫౨

{ సుగ్రీవుఁడు రామునితోఁ దాను భూమండలముఁ జూచినవిధానముఁ జెప్పుట. }

సీ. వానరవరు లిట్లు ♦ పయనించి చనఁ గీశ, రాజవర్యుసితోడ ♦ రాముఁ డనియె
నీ కెట్లు దెలియు నీ♦నిఖిలభూవలయంబు, చెప్పుమా యన భక్తిఁ ♦ జెప్పఁ దొడఁగె
దుందుభిదైత్యుండు ♦ దున్నయై రా వాలి, మలయంబు దాఁకఁ ద♦ ర్మింగ నతఁడు
తద్గుహాబిలమును ♦ దరమునఁ జొచ్చిన, వానిఁ జంపఁగఁ జొచ్చె ♦ వాలి దాని
తే. నే గుహాద్వారమునను వి♦నీతి నుంటిఁ, గడచె సంవత్సరం బన్న ♦ క్రమ్మ అందు
నెత్రు వఱదల బిలమెల్ల ♦ నిండె నంత, వాలిహతుఁ డయ్యె నని చాల♦వగపు చెంది.
కం. కొండనుబోలిన యొకపెను, గుండుం గొనివచ్చి యిడితి ♦ గుహవాకిట దై
త్యుండును వెడలఁగ నేరక, చండాంశుతనూజుఁ జూడఁ ♦ జనుఁగా కనుచున్.
తే. అంతఁ గిష్కింధకును వచ్చి ♦ యన్నచచ్చెఁ
గాక యన నిశ్చయించి నా♦కాంతలుగను
దార రుమను గ్రహించి వి♦స్తారరాజ్య
భార మేను వహించితి ♦ బంధుయుక్తి. ౧౧౫౫
చం. పదపడి వాలి దానవునిఁ ♦ బట్టి వధించి పురంబుఁ జేర నే
ముదమున గౌరవంబునను ♦ మ్రొక్కి భయంబున రాజ్య మిచ్చితిన్
మదలుళితేంద్రియుం డగుచు ♦ మచ్చర మూని దురాత్ముఁడై ననున్
సదనముఁ బాయఁగొట్టి మఱి ♦ చంపఁగఁ బూనె నితాంతకోపి యై. ౧౧౫౬
కం. నాసచివులతో నేనును, వేసరక పవల్లు రేలు ♦ వే పరువిడఁగన్
రోసంబున నాతండును, గాసి గసక వెంట నంటెఁ ♦ గలహప్రియుఁడై. ౧౧౫౭
తే. కొఱవిచక్రంబురీతిని ♦ గొఱలుదాని, గోష్పదం బన నొప్పఁగఁ ♦ గుతల మెల్ల
నద్దమునఁ జూచినట్లుగ ♦ నపుడు గంటిఁ, బఱచి పఱచి పదంబులు ♦ వాఁపు చూప.
సీ. తూరుపుగా నేగి ♦ తోరంపుద్రుమములు, సరసులు నదులును ♦ శైలములును
నుదయపర్వతము క్షీ♦రోదముఁ గనుఁగొని, వెనుకకు మరలితి ♦ పిదుఁ జెగవ
నంత దక్షిణమున ♦ హరివింధ్యాద్రిప్ర, ఫుల్లీని జందన♦పాళిఁ గంటి
నది పీడి వరుణది♦శాభిముఖుండనై, యస్తాద్రి లోనగు♦నవియుఁ గంటి
తే. యక్షపతిదిశ కేగి హి♦మాచలంబు, మేరువు సముద్రమును గంటి ♦ సూర్యవర్య.
తలను దాఁవఁగ జేనెఁడు♦తలము లేద, యంత హనుమంతుఁ డిట్లను♦నాదరమున.

చం.మున్ను మతంగమౌని హరి♦ముఖ్యునిడాటమునన్ సమన్యుఁడై
యున్నఁగ మెక్కనేనియు మహీ♦స్థలి వానిశిరంబు వ్రక్కలై
క్రన్నన కూలు నం చనియె ♦ రాజవరా! యది నాకు నిప్పు డా
త్మ న్నతిదోఁచె నన్న విని ♦ తద్విధిఁ జేసి సుఖించితిం జుమీ. ౧౧౬౧
కం.ఈవసుధాధరగుహకు నృపా! వాలియు రాఁడు శాప♦భయమున; నేధా
త్రీవలయము ప్రత్యక్షము,గా వాసవతేజ నాఁడు ♦ గంటి ననంగన్. ౧౧౬౧

విన తాదులు సీతను గానక వచ్చుట.

సీ. అట సీత వెదకంగ ♦ నర్కతనూభవుం, డానతిచ్చినయట్లు ♦ హరివరులును
నరిగి దుర్గంబులు ♦ నద్రులు నగరముల్, నదులు సరస్సులు ♦ నభము పొదలు
కాననతలములుఁ ♦ గడు హెచ్చరిక మీఱఁ, బగళుల రోసి మా ♦ పగుదు నొక్క
యెడఁ జేరు చుండిరి ♦ హితఫలద్రుమముల,లోఁ జూచి తత్ఫలా♦ళులు భుజింత్రు
తే. యామినుల సందఱును జేరి ♦ యోగ్యచరిత
ములను జెప్పుచు నిద్దుర♦పోదు రవల
నిఖిలభూమండలం బిట్లు ♦ నెమకు చుండ
మాస మగుడును వానరుల్ ♦ మగిడి రందు. ౧౧౬౨
ఉ. తూరుపుదిక్కు రోసి వినతుం డరుదెంచెను వ్యగ్రుఁ డౌచుఁ, గా
శ్చేరదిశం జరించి హరి♦విక్రముఁ డాశతవల్యభిఖ్యుఁడున్
వారుణదిక్కుఁ జూచి వెస ♦ వచ్చె సుషేణుఁడు మాస మైన, వా
రారవినంశయుక్తుఁ బ్లవ♦గాధిపుఁ జూచి వచించి రీగతిన్. ౧౧౬౩
చం. వెదకితి మెల్లయూళ్ళఁ బృధి♦వీధరముల్ వనముల్ గుహాళులున్
వెదకితి మెల్లపల్లియలు ♦ నిమ్నగలున్ విషమస్థలంబులున్
మదసతిఁ గాన మెందు వన♦మండలి భీతిదసత్త్వకోటులన్
జదిమితి మెందు లేదు సతి ♦ సీత నిజం బిది వానరేశ్వరా! ౧౧౬౪
ఉ. ధీరుఁ డుదారసత్త్వకుల♦దీపకుఁ డద్రిచరేంద్రరత్న మా
మారుతసూతి రామవిభు♦మానిని యుండెడిదక్షిణాశకై
శూరజనంబుతోఁ జనియెఁ ♦ జూచియ వచ్చును భూమికిన్ నే
తీరున నైన నంచును బ్ర♦తీక్ష యొనర్చిరి వాయుజాదులన్. ౧౧౬౫

హనుమంతుఁ డంగదాదులతో వింధ్యంబున సీతను వెదకుట.

కం.తారాంగదసంయుతుఁడై, మారుతి రవిసంభవోక్త♦మహీమండలమున్
జేరంగ నరిగె నిటు కడు,దూరంబుగ నరిగి క్రోఁతి♦తుటుములు వింధ్యన్ ౧౧౬౬

చం.గహనములున్ నగాగ్రములు ♦ కాననసీమలు భూరివృక్షముల్
గుహలును బర్వతంబులును ♦ ఘోరభయంకరదుర్గదేశముల్
సహనముతోడ నన్నియు ది♦శల్ పరికించెను గాని యెయ్యెడన్
మహిసుత లేద వెండియును ♦ మర్కటముల్ ధృతి నేకచిత్తతన్ ౧౧౬౭

కం కందరబృందంబులచేఁ, దుందిల మై చొరఁగరాని♦దుస్సహదేశం
బందు శ్రమంపడి వెదకుచు, సందంద వసించి మెక్కె ♦ నమలఫలాదుల్. ౧౧౬౮

కం.నిర్జల మై శూన్యం బై, నిర్జన మై గహన మగుచు ♦ నిఖిలమృగాళీ
గర్జనల మించు నావని, వర్జించియు నెమకి యట్టి♦వానిని గొన్నిన్. ౧౧౬౯

సీ. అకుతోభయులు కపు ♦ లన్యదేశం బొందు, ఫలములుఁ బూలు నా♦కులును లేని
వృక్షముల్ గలదాని ♦ హీనతోయము లైన, యేఱులు గలదాని ♦ మూలములును
దొరకనిదానిని ♦ గరులు మృగంబులు, వ్యాఘ్రముల్ దున్నలు ♦ భవ్యములగు
వనగోచరంబులు ♦ పక్షులు గనరాక, పాడిడినట్టులు ♦ పరఁగుదాని

తే. ప్మోజములు గాని పొదరులు♦గాని యోష,ధీసమూహంబులును గాని ♦ తీఁగె గాని
లేద యచ్చట స్నిగ్ధసా♦మోదవికసి,తస్థలిపద్మినులఁ దుమ్మె♦దలును గనవు. ౧౧౭౦

తే. సత్యవాది తపోధన♦సత్తముండు, కండుఁ డనుమౌని తనబాల♦కుండు షోడ
శాబ్దగుఁడు తన్మహారణ్య♦మందుఁ దప్పి, కానరాక నశించిన♦కారణమున ౧౧౭౧

కం.ఆధర్మాత్ముఁడు దాని దు, రాధర్షము పక్షిమృగని♦రస్తము విజనం
బై ధర నశరణ్యముగా, నేధితకోపమునఁ దిట్ట ♦ నీగతి పట్టెన్. ౧౧౭౨

కం.ఆనగకందరములలో, నానదులను గాననముల ♦ హరిసంఘము ల
జ్ఞాననను గాని హర్తను, దానవపతిఁ గాని కనక ♦ దానిన వెదకన్. ౧౧౭౩

కం.భీమంబుగ లతి కాచయ,దామసమావృతుని నొక్క♦దానవుఁ గ్రూరో
ద్దాముని సురనిర్భయుఁ గని, దీమసమునఁ గీశులెల్ల♦దృఢపరిహితు లై ౧౧౭౪

కం.నిలువంబడ వారలఁ గని, యలుకక చచ్చితిరి పొండ ♦ టంచును ముష్టిన్
బలియుఁడు గొని పై కుఱికినఁ, దలఁచుచు నారక్కసుండె ♦ దశముఖుఁ డనుచున్

ఆ. అంగదుండు వాని ♦ నఱచేతఁ గొట్టిన, నెత్రు గ్రక్కి వాఁడు ♦ నేలఁగూలెఁ
గొండ గూలినట్లు ♦ క్రోఁతు లంతటఁ దత్ప్ర,దేశమెల్ల వెదకి ♦ దిటము మీఱి.

తే. అన్యగహనంబు నొక్కటి ♦ యరసి యందు, సీతఁ గానక ఖిన్ను లై ♦ చేరి యంద
ఱొక్కచో నొక్కవృక్షంబు♦నొద్దఁ జేరి, కూరుచుండిరి దీనత♦గూరుమదుల.

## అంగదుఁడు కపుల నుత్సాహపఱుచుట.

కం.అపుడు మహామతిమంతుఁడు, సుపరిశ్రాంతుండు వాలి♦సుతుఁ డిట్లు లనెన్
... గాఁ గా శ్రమం బ♦ఱుమన్వాక్యములన్.

ఉ. కంటిమి దుర్గసంఘములు ♦ గంటిమి ఘోరదరీగిరీంద్రముల్
గంటిమి గహ్వరంబులను ♦ గంటిమి భూరిధునీవనీతతుల్
కంటఁబడంగ లేదు సుర♦కన్యకఁబోలెడిసీతయేని వా
ల్గంటిని గొంచుఁ జన్నసుర♦కంటకుఁ డా దశకంఠుఁ డేనియున్. ౧౧౭౯

కం.మన మగుగు డెంచి కాలము, చనియెం బెద్దయు మహోగ్ర♦శాసనుఁడు నుఁడీ
యినజుండు గాన గుమిగా, మన మందఱ మరయ వలయు ♦ మహిళామణిసిన్.

కం.అలసత నిద్రయు శోకముఁ, దొలఁగఁగ నిడి రోయవలయుఁ ♦ దోయజగంధిఁ
దెలివియు నుత్సాహము వ్యథఁ,దలఁగుట యివి కార్యసిద్ధిఁ ♦ దప్పక కూర్చున్.

కం.చనఁ ద్రోవ లేకయును ని,న్వనసీమను వెదకవలయు ♦ వనజదళాక్షిఁ
మనమున విసునక వదలక, పనిచేయుచు నున్న ఫల మ♦వశ్యము గలుగున్.

ఆ. చాలు నింతసేపు ♦ సంతపించుటయును, గనులు మూసికొనుచుఁ ♦ గడపుటయును
మనకుఁ దగదు మఱియు ♦ మార్తాండపుత్త్రుండు, తీక్ష్ణదండుఁ డగుట ♦ తెలియ లేర?

కం.మహితాత్ముఁడు రామునకును, నహిమకరతనూజునకు భ♦యంపడనలయుఁ
సుహిత మిది యనుచుఁ జెప్పితి, గహనచరుల్ సల్పుఁ డిచ్చ ♦ గల దేని యటుల్.

కం.కాకున్న మనకు సేమం, బౌకార్యముఁ జెప్పుఁ డన్న ♦ నంగదువాక్యం
బాకర్ణించి పిపాస స,మాకులమతి యైనగంధ♦మాదనుఁ డనియెన్. ౧౧౮౫

కం.అంగదువాక్యము మీకు సు,సంగతము హితంబు మేలు ♦ సమకూర్చును గా
నం గావింపుఁడు పతి నా,భంగిని వెదకుదము దుర్గ♦పర్వతగుహలన్. ౧౧౮౬

కం.తరణితనూజుఁడు చెప్పిన,సరణిని గిరిదుర్గవితతి ♦ సకలము మహియుం
దరయఁగఁ దగు నన వెస లే,చిరి కీశులు దక్షిణమున ♦ సీతను వెదకన్. ౧౧౮౭

ఆ. చనుచు శారదాభ్ర♦సన్నిభంబును దరీ,మంత మతులశృంగ♦వంత మైన
రజతశైల మెక్కి ♦ రమ్యరోధ్రవనం బు, సప్తపర్ణవనము ♦ సకల మరసి. ౧౧౮౮

కం.విపులపరాక్రమయుతు లా,కపివీరులు తిరిగి తిరిగి ♦ కందరయుత మా
విపులాధరమెల్లను రో,సి పరిశ్రాంతాత్ము లై వి♦చేతను లగుచున్. ౧౧౮౯

తే. బడలి పర్వతమును డిగ్గి ♦ బయల నొక్క
వృక్షమూలంబునందు నొ♦క్కింత నిలిచి
శ్రమ మొకించుక పాయంగ ♦ నెమకఁ దొడఁగి
రల్లవింధ్యాద్రి నలుప్రక్క ♦ హరులు పూని. ౧౧౯౦

## హనుమదాదులు ఋక్షబిలంబుఁ బ్రవేశించుట.

సీ. అనిలసుతుండు తా♦రాత్మజతారసం,గతి సింహశార్దూల♦యుతతలాళి
నాపగల్ శిలలు మ♦హాఝరులను రోసి, కొండపైఁ గోణప♦కోణమునను

గపులతో నుండ న♦గ్గదువును గడచెల్లె, హనుమంతుఁ డంత న♦న్యోన్యనికట
తలవర్తులుగను మైం♦దద్విపిదాంగద,గజసుషేణగవాక్ష♦గవయశరభ

తే. గంధమాదనులను నిల్పి ♦ క్రమముగాఁగ, శైలజాలావృతం బగు♦శమనదిశను
గలుగుదేశంబు రోయంగ ♦ బలిత మైన,క్షుత్పిపాసలకును జిక్కి ♦ సొమ్మసిలుచు.

తే. నీరములు రోయ వల్లికా♦వారవృతము, దనుజసంరక్షితం బైన♦ఘనబిలంబు
ఋక్షబిల మనుదానిని ♦ వృక్షచరులు, గాంచి రం దుండి యార్ద్రప♦క్షౌంచితములు

తే. అంబుజాతపరాగర♦క్తాంగకములు, క్రౌంచసారసహంసచ♦క్రములు రాఁగఁ
జూచి సురభిత మగుచును ♦ జొరఁగరామి, విస్మయవ్యగ్రచిత్తు లై ♦ వీరు లెల్ల.

కం. నానాసత్త్వాకీర్ణము, దానవనిలయోపమంబు ♦ తతభీతిద మౌ
దానిసి బిలముం గని తమ,మానసముల ముదము లేక ♦ మఱుకువ చెందన్. ౧౧౯౮

సీ. వనకోవిదుండు పా♦వని యిట్టు లను దక్షి,ణంబునఁ గలుగున♦నంబు లెల్ల
వెదకితి మెందును ♦ బృథివీజ గనరాదు, పెల్లుగాసిలినార ♦ మెల్లవార
మీబిలంబుననుండి ♦ యివె నీటఁ దడిసిన,జక్కవల్ క్రౌంచ లం♦చలును సార
సంబులు వెడలెడి ♦ సత్య మియ్యది సలి,లంబులు గలుగుకూ♦పంబొ మడుఁగొ

తే. బిలమువాకిటఁ బచ్చచె♦ట్టులును గలవు, గానఁ జొత్త మ టం చనఁ ♦ గపులచంద్ర
తపనమును గాఢతిమిరావృ♦తంబు రోమ,హర్షణం బగుదాని ధై♦ర్యంబు పూని

కం. చొచ్చెదుచో మృగపక్షిస,ముచ్చయముల వ్యాఘ్రహరిస♦ముత్కరములఁ దా
రచ్చెరువుగఁ గాంచిరి కడుఁ, బొచ్చెము పడఁ దేజు కనులు ♦ వురుశౌర్యంబున్.

సీ. నిజవాయువేగంబు ♦ నిష్ఫలం బయ్యును, బిర బిర పోవుచు ♦ భీమవివిధ
వృక్షసంకుల మైన♦వివరంబునం దొక్క, కపి కేలి నింకొక్క♦కపి గ్రహించి
యాఁకలి దప్పుల ♦ సలసల పతి చెడి,జీవితాశలు వాసి ♦ చేవ యెడలి
సలిలార్థు లగుచు యో♦జనమొండు పోయి ప్ర, కాశాభిరామ మౌ♦దేశమొండు

తే. కపులు తిలకించి రటఁ బావ♦కప్రభములుఁ,గాంచనచ్ఛాయములు నైన♦కర్ణికార
సాల తాల తమాలముల్ ♦ చంపకములు, నాగ వంజుళ కకుభ పు♦న్నాగతరులు.

సీ. రాజతస్తబకముల్ ♦ రక్తకిసాలముల్, లతిక లాపీడముల్ ♦ లలితరుక్మ
భూషణభూషితం♦బులు విదూరజకృత, వేదికల్ బాలార్క♦విభ్రమములు
నైజనపుష్ప్యతి♦భ్రాజమానంబు లౌ,పూతహిరణ్మయ♦భూజములును
గరుణార్కసన్నిభ♦తపనీయనీరజ,యుతము లై నీడజా♦వృతము లగుచు

తే. నీలవైడూర్యపద్మినీ♦జాల మెలయఁ, బసిఁడి చేఁపలు తాఁ బెల్లు ♦ బలిసి యుండ
నిస్తులం బైనజలముల ♦ నెటి వహించి, తమ్మికొలఁకులు రాజిల్ల ♦ నెమ్మిఁ గనిరి.

కం ముత్తెపుజాలరులను నెఱి,హత్తినయుపరంజిమేల్ ♦ గవాక్షంబులు నై
చిత్తమిగిరింపఁ జేసెడి,క్రొత్తపసిఁడి వెండి మణులఁ ♦ గొమరగునిండుల్.
కం.పవడముల ద్వారయఁ బూచిన,యవనీజంబులును గాంచ ♦ నాళులు మణిహే
మవిచిత్రశయనాసనములు,పావనించెడుయానములును ♦ పారిచయము గనెన్.
సీ. స్వర్ణరాజతకాంస్య ♦ భాజనచయములు, నగరుచందనపదా ♦ ర్థావళులును
నిం బగుభక్ష్యమూ ♦ లంబులు ఫలములుఁ, బానీయములుఁ దీయ ♦ తేనియలును
దివ్యాంబరంబులు ♦ దివ్యకంబళములు, నజినసమూహంబు ♦ లందు నందు
నగ్నిహోత్రసమాన ♦ మగుతేజముం గల,కాంచనరాసులఁ ♦ గుప్పలు గనిరి
తే. వెండి నందందు వెదకుచు ♦ వీరవరులు
చీరకృష్ణాజినాంబర ♦ స్త్రీ నొకర్తుఁ
దాపసిని గాంచి యొక్కెడఁ ♦ ద్రస్తహృదయు
లగుచు వెఱగున నిలిచిరి ♦ యచట నచట. ౧౨౦౧

హనుమంతుఁడు స్వయంప్రభతో సంభాషించుట.

కం హనుమంతుఁ డంత సమ్మది,వనితం గని కేలు మోడ్చి ♦ భయభక్తుల ని
ట్లను నెవ్వతె వెవ్వరి వీ,కనకంబులు బిలము మఱి య ♦ గారము చెపుమా. ౧౨౦౨
కం.అని మఱియుఁ బలుకుఁ దాపసి, ఘన మగునాఁకటను డప్పి ♦ గాసిలి మే మె
ల్లను జెనుఁజీఁకటిఁ గన్నులు,గనరాని ధరాబిలంబుఁ ♦ గని యుద్దానిన్. ౧౨౦౩
కం చొరఁబాఱి దీనఁ గలయ,బ్బురపుఁబదార్థముల పెల్లుఁ ♦ బొడగని కడు న
చ్చెరువున దిగ్భ్రమ గొని వెత, దురపిల్లితి మెల్లరమది ♦ తోఁపక చింతన్. ౧౨౦౪
సీ. తరుణార్కసన్నిభ ♦ తపనీయవృక్షమ్ము, లీశుచిభోజ్యంబు ♦ లీఫలాళు
లీవిమానంబులు ♦ నీవెండిగృహములు, మణిజాలకగవాక్ష ♦ మండలములు
ఫలపుష్పవంతముల్ ♦ పరిమళవంతముల్, కనకమయంబు లౌ ♦ న్మోరుహములు
సమలజలంబుల ♦ హాటకపద్మముల్, గలిగె నెవ్వనితపో ♦ గరిమచేతఁ
తే. గనకఝుషములు కచ్ఛప ♦ కాంశములును
గలసి విహరించెడి ని దెల్లు ♦ తెలుప నమ్మ
నిన్ను నీమహిమయు నేరి ♦ నిరుపమాన
తపమునను గల్గె నిదియును ♦ జెపుమ దయను. ౧౨౦౫

స్వయంప్రభ హనుమంతునకు ఋక్షబిలవృత్తాంతముఁ జెప్పుట.

తే. అనుచు నీరీతి సామీరి ♦ యడుగుటయును, సర్వభూతహితాత్మిక ♦ సా ఘనస్థ
యనియె ని ట్లని మయుఁ డను ♦ నసురనేత, మాయలాఁ డిది నిర్మించె ♦ మాయచేత.

తే. రమ్య మీ స్వర్ణగృహము ని♦ర్మాత మున్ను, దనుజులకు విశ్వకర్మయా♦దనుజభర్త
యతఁడు వర్షసహస్రకం ♦ బధికతపముఁ, గానలోఁ జల్పి నీరజ♦గర్భుచేత. ౧౨౦౭
తే వరముగాఁ గొనె శుక్రుని♦స్వాప తేయ, మైనశిల్పంబు నెల్ల నా♦యతులమహిమ
సర్వకామేశ్వరుండయి ♦ చారువనముఁ, గల్పిత మొనర్చి యం దుండ♦వేల్పు ఱేఁడు
కం హేమాసక్తుని మయు సం,గ్రామంబున వజ్రధార ♦ ఖండించెఁ జుమీ
హేమకు మయుఁ డొసఁగెనుసీ, హైమగృహము వనము నిందు♦నమరునుసుఖముల్.
తే. నృత్తగీతవిశారద ♦ హేమ నాదు,చూర్మిసఖి యామె దివ్యన♦కూటవాటి
ప్రాప్తవర నయి నేను గా♦పాడు చుందు, వరతనూజను మేరుసా♦వర్ణి కేను. ౧౨౧౦
కం.పేరు స్వయంప్రభ కానన,చారీ! మీ రెవరు దుర్గ♦చయముల ఘనకాం
తారములఁ దిరుగ నేటికి?, నేరినిమిత్తంబు? కంటి ♦ రెట్టులు దీనిన్? ౧౨౧౧
కం.ఈమూలంబుల ఫలముల, నీమహితపదార్థములను ♦ నీపానీయం
బామెతగాఁ గొని తీరఁగఁ, గామం బామీఁదఁ బలుకఁ ♦ గడఁగుఁడు చరితన్.

←≻— స్వయంప్రభ హనుమంతునిఁ గపులవృత్తాంత మడుగుట. —≺→

కం.అని తాపసి మఱియు ననెన్, వనచరవరులార! మీకు ♦ ఫలభక్షణచేఁ
దనుఖేదము దీఱిన నే, వినఁదగిన భవచ్చరిత్ర ♦ వినిపింపుఁ డనన్. ౧౨౧౩
కం.కలది కలయట్టు మారుతి, పలుకం దొడఁగెన్ మహేంద్ర♦వరుణాభుఁడు భూ
తలపతి దశరథతనయుఁడు, సలలితచరితుండు రామ♦చంద్రుం డర్థిన్. ౧౨౧౪
ఉ. తమ్ముఁడు లక్ష్మణుండు నిజ♦దార విదేహతనూజ సీతయున్
సమ్మతిఁ దన్నుఁగొల్వఁ జని ♦ సారసనేత్రుఁడు దండకాటవిన్
గ్రుమ్మరు చుండ నాయనఘు♦కోమలినిం బ్రసభమ్ము చేతఁ జౌ
ర్యమ్మునఁ గొంచు నేగెఁ జుమి ♦ రావణనామక రాక్షసేశుఁడున్. ౧౨౧౫
కం త్మానల్లభమిత్రుఁడు సు,గ్రీవుం డనువానరుండు ♦ కీశపతి మమున్
రావణు సీతను వెదకఁగ, వైవస్వతదిశకుఁ బంప ♦ వచ్చితి మిట్లుల్. ౧౨౧౬
కం.దక్షిణ మంతయు రోసి బు,భుక్షయు నీర్వట్టు మమ్ముఁ ♦ బోరి బాధింపన్
బ్రక్షీణజవుల మై యొక,వృక్షమునీడన్ వసించి ♦ వెత గొనుచు నటన్. ౧౨౧౭
కం.ఆననములఁ దెలి వేదఁగ, ధ్యానపరాయణుల మగుచుఁ ♦ దడ వుండియుఁ జిం
తానీరధిపారంబును, గానక యట నిటను వెదకఁ♦గా నొక చోటన్ ౧౨౧౮
కం.ఇరులం గురియుచుఁ దీఁగెలఁ, దరువుల సంఛన్న మగుచుఁ ♦ దనరారెడి యీ
గురుబిలముం గనితిమి పు,ష్కరహంసకకురరతతులు ♦ సంక్లిన్నము లై ౧౨౧౯
కం.అంచితగతి వెడలఁగ నే, మంచిది యీబిలములోన ♦ మనమెల్లఁ బ్రవే
శించుద మని యన ననుమా,నించి కపుల్ వల్లెయనుచు ♦ నిబిడతమమునన్

కం.దీనఁ బరస్పరమును గే, లూనికఁ బట్టుకొని వచ్చి ♦ యుష్మన్నికట
స్థానముఁ జేరితి మిది మా,పూనినకార్యంబు భృశబుభుక్షాతృషలన్	౧౨౧

కం.గాసిని మాప్రాణంబులు, పో సమయం బయ్యె నీదుపుణ్యంబున మా
లాసమఫలములఁ దినుటం, బాసె శ్రమము మాకు నెల్లఁ ♦ బ్రాణము మరలెన్.

కం కోరెదరు కీశనాథులు, చారుగుణా! మాఋమేలు ♦ సలుపఁగ నీకున్
గారియ మున్నను జెప్పుము, తీరుతు మిపు డనఁగఁ గపిత♦తిం గని ప్రీతిన్.	౧౨౩

తే. అనియె సర్వజ్ఞ యైనస్వ♦యంప్రభయును, మీరు పలికినపలుకుల ♦ మెచ్చు వచ్చె
ధర్మచరి నౌట మీచేయఁ♦దగినకార్య,మేది లే దన హనుమంతుఁ ♦ డింతి కనియె.

స్వయంప్రభ కపులను బిలమునుండి వెడలించుట.

ఉ. వృక్షచరాధినేత విధి♦యించిన మాసమయంబు మీఱె నీ
ఋక్షబిలంబునందుఁ జరి♦యింపఁగ, మమ్ము బిలంబునుండి సా
ధ్వీ! క్షమఁ జేస్పుమీ గడువు ♦ తీఱె గతాయువు లెల్లరున్ దయా
వీక్షణపంక్తులం బఱపి ♦ యిందఱఁ బ్రోవు భవత్ప్రపన్నులన్.	౧౨౫

తే ధర్మచారిణి మాకుఁ గ♦ర్తవ్య మైన, కార్య మెంతయుఁ గలిగియు ♦ గహన మైన
యీబిలంబునఁ జిక్కిన♦హేతువునను, జలుప లేమైతి మేమియు ♦ సత్య మమ్మ.

కం.అనవుడు దీనిం జొచ్చియుఁ, దనువులతోఁ బోక యనఁగఁ ♦ దలఁతు నసాధ్యం
బని కావున నియమతపం,బునపెంపున నుద్ధరింతు ♦ మాయుఁడు గన్నుల్.

కం.అనిమీలితలోచను లై, చనుట యశక్యం బనంగ ♦ సర్వప్లవగుల్
కనులన్ మూసిరి కరములఁ, బెనుబిలముఁ దరించుకాంక్ష ♦ పేరెమువాఱన్.

తే హస్తరుద్ధాననములఁ గీ♦శాలి నెల్ల, నిమిషమున నుద్ధరించి యా♦నియతశీల
వారి నూరార్చి యిది వింధ్య♦ధారణీధ్ర, మిదియె ప్రస్రవణం బను♦పృథుధరంబు.

కం.వనచరులారా! యిది యే, వననిధి మీకెల్ల శుభము ♦ వఱలుత నేనున్
జనియెద భవనంబున కని, చనియె స్వయంప్రభయు నాత్మ♦సదనంబునకున్. ౧౨౩౦

కం.ఘోరతరంగాభీల మ,పారం బభిగర్జితంబు ♦ నరుణాలయమున్
ఘోరం బగుసాగరమున్, వీరవరుల్ విస్మయమున ♦ వీక్షించి రటన్.	౧౨౩౧

అంగదుఁడు గడువు మీఱినందులకు విచారపడుట.

చం.విలసితపుష్పభారపృథి♦వీరుహసంచయవింధ్యపాదస
త్తలమునఁ గూరుచుండి కపి♦దండము పూచినతీఁగెలం గడుం
బొలిచినమాధవావనిజ♦ము ల్గని డాసె వసంతవేళ యం
చళుకు వహించి నేలఁ బడె ♦ నయ్యెడ నష్టనిదేశకాల మై.	౧౨౩౨

తే. అపుడు సింహవృషస్కంధుఁ ♦ డతులపీన,రాయతభుజుండు ప్రాజ్ఞుండు ♦ నైనయంగ
దుండు వృద్ధుల శిష్టుల ♦ దండఁ జేరి, యిట్టు లను వారి నూరార్చి ♦ హితము దోఁప.
చం. వెడలితి మిందఱుం బ్లవగ ♦ వీరవరేణ్యుని శాసనంబునన్
గడచెనె మాస మొండు బిల ♦ గహ్వరమందు నెఱుంగ రొక్కరున్
గడఁగితి మాశ్వినంబునను ♦ గాలముసంఖ్య యతీత మైచనెన్
నుడువుఁడు మీఁదికార్యమును ♦ నూల్కొన మీరలు నీతికోవిదుల్. ౧౨౩౪
ఉ నమ్మినబంట్లు మీరు నిజ ♦ నాథహితాచరణుల్ సమస్తకా
ర్యమ్ములు దీర్ప నేర్పరులు ♦ ఖ్యాతపరాక్రమయుక్తులుం గదా
యమ్మెయి రాజునాజ్ఞ మెయి ♦ నందఱు వెల్వడి తీర్ప రామకృ
త్యమ్మును నన్ బురస్సరుఁగ ♦ నాదటఁ జేసితి రింత చేసియున్. ౧౨౩౫
కం అకృతార్థుల మై మరలిన, శకలీకృతు లగుదు మేల ♦ శంకింపఁగ దీ
ప్రకరజుసందేశముఁ జే,యక యెవ్వఁడు మనఁగ నోపు ♦ హాయిగఁ జెపుఁడా.
కం. పోయెను నియమితకాలము, చేయంగల దేది లేదు ♦ చేవ్పడి మనముల్
బ్రాయోపవేశ మొక్కటి, చేయం దగునదిగఁ దోఁచెఁ ♦ జిత్తమునందున్. ౧౨౩౬

అంగదుఁడు భేదోపాయోక్తులు వచించుట.

చం. ఇనసుతుఁడో స్వభావమున ♦ నే కడుఁదీక్ష్ణుఁడు, తాన యిప్డు రా
జును నయి యున్నవాఁడు, నృప ♦ సుందరివార్త యెఱుంగ లేక పో
యిన నపరాధముం దలఁచి ♦ హింస యొనర్చు, క్షమింపఁ డేమియున్
గనుక సుయుక్తి మిచ్చటనె ♦ కాలము దీఱుట యందు నెంచెదన్. ౧౨౩౭
కం. మన మెల్ల మరలి పోయిన, ధనదారసుతాలయాదితతి వీడ్వడఁ జం
పును ఘోరమరణ మచటికిఁ,జని చచ్చుటకంటె నిందె ♦ సమయుట మేల్తా. ౧౨౩౮
తే. యావరాజ్యంబు నా కిచ్చి ♦ నట్టివాఁడు
భానుజుఁడుగాఁడు సద్గుణ ♦ భద్రుఁ డైన
రామభద్రుండు, పూర్వనై ♦ రంబుఁ దలఁచి
సమయ మిపు డబ్బఁ గపిరాజు ♦ చంపు నన్ను ౧౨౪౦
కం. జీవించియుండువఱ కగు,నానవటం గనఁగ నేల ♦ నామిత్రంబుల్
గావునఁ బుణ్యద మగుపా,రావారముతోధమునను ♦ బ్రాణము విడుతున్. ౧౨౪౧
కం. అని తారాసుతుఁ డాడిన,విని శాఖామృగవరేణ్య ♦ వితతులు దుఃఖం
బునఁ బొగులుచు నాతనితో, న నె నిట్టులు లోనఁ గరుణ ♦ యలముకొనంగన్.

కపు లంగదువాక్యంబుల నామోదించుట.

చం. ఇనసుతుఁడున్ స్వభావమున ♦ నే కడునుగ్రుఁడు రామభద్రుఁ డో
తన ప్రియురాలిమీఁదిమమ ♦ తం దపియించెడివాఁడు కాన నీ

తను బొంద కాన కేగినను ♦ దథ్యము రాముని ప్రీతుఁ జేయఁగా
వనజహితాత్మసంభవుఁ డ♦వశ్యము నిందఱఁ జంపుఁ గ్రూరుఁడై        ౧౨౪౩
కం. అపరాధు లైనవారలు, నృపు డాయఁగ రాదు సీత ♦ నెమకి దొరకినన్
గపిరాజుఁ గనఁగఁ బోదము, విపరీతం బైనయముని♦వేశ్మంబునకున్.        ౧౨౪౪
చం. అనుడు భయార్దితానవిరు♦హాటులవాక్యము లాలకించి యి
ట్లనెను దారసుఁ డేటికి మ♦హాన్యథ నొందెద రీబిలంబునం
దున వసియింత మియ్యది సు♦దుర్గము నిర్భరవృక్షభోజ్యపా
వనవన మేయకంబు భయ♦వార్త వినంబడ దెట్లు చూచినన్.        ౧౨౪౫
కం. అందు మన ముంటిమేని పు,రందరుఁడేఁ గాక కీశ♦రాజేనియు సం
క్రందననిభకౌసల్యా,నందనుఁ డేఁ జెనక లేఁడు ♦ నగచరులారా!        ౧౨౪౬
కం. అంగదువాక్యంబులకు ను,సంగత మగుతారువచన♦సరణిని విని యే
భంగిని గీడొందవదో య,బ్భంగియ తగు ననుచు హ        రులు పలుకన్.  ౧౨౪౭

→ హనుమంతుఁ డంగదుని సమా        ట. ←

కం. తారానందనుతో ఁ     తఁ, దారాధిప తేజుఁ డైన♦ త           వ్యా
హారింపఁగ నంగదుచే, నారాజ్యము హృతే     టంచు ♦ హనుమ దలంచెన్.
కం. పదునాలుగుగుణములు నెని,మిదియంగము     శుశ్రూష♦మేధయు బలసం
పద నలువిధములు గలఁ డని, మది వాలితనూజు నెఱఁగె ♦ మరుదాత్మజుఁడున్.
తే. శుక్లపక్షాదిఁ గాంతిచే ♦ సొబగు మీఱు, చంద్రుఁ డన బలవిక్రమ♦సాంద్ర తేజ
ములను నభివృద్ధి గనువాని ♦ బలమునందు, జనకతుల్యుఁ డని బుద్ధిని ♦ శక్రగురుని
తే. శుక్రనీతిని వినునట్టి♦ శక్రుఁబోలెఁ
దారుపల్కులు విన శ్రద్ధ ♦ దాల్చు వాని
సకల శాస్త్రవిశారదు ♦ స్వామికార్య
మునఁ బరిశ్రాంతు నూఱార్చ ♦ మొనసి హనుమ.        ౧౨౫౧
తే. వానరులలోన వారిలో ♦ వారిలకు ను
పాయముల నాలుగిటను మూఁ♦డవయుపాయ
మును బ్రయోగించి భేదంబు ♦ పుట్టఁ జేసి
వారిలో వారు భేదించి ♦ పలుకు చుండ.        ౧౨౫౨
కం. కోపోపాయసమన్విత, మాపలుకుల భీషణముగ ♦ నంగదునకు భీ
త్యాపాదకుఁ డై గంధవ,హాపత్యము పలికి మఱియు ♦ నను నాతనితోన్.  ౧౨౫౩
శా. తారానందన! తండ్రికంటెఁ గడు యు♦ద్ధక్రీడ విన్నాణివిన్
భారం బౌకపిరాజ్య మంతయు వహిం♦ప న్నేర్తువుం దండ్రియ

ట్లారఁ దోజన నేయు మీకపులు నిత్యం బస్థిరసాప్వంతగుల్
దారార్థియులఁ బాసి నిన్ని చట నేఁలా కొల్తు రెల్లప్పుడున్. ౧౨౫౪

చం. ఎదుటన చెప్పెదన్ వినుమ యెట్లు సుహోత్రుఁడు జాంబవంతుఁడున్
విదితముగాఁగ నీలుఁడును పీడరొ సూర్యజు నట్ల నేనునున్
వదలను, సామదానగుణవర్గము చేతను దండపద్ధతిన్
గొదగొని యైన వీరలను గూర్చుకొనంగను జాల వేమిటన్. ౧౨౫౫

కం. బలహీనుతోడఁ బగ గొని, బలవంతుఁడు బ్రదుకఁ గలఁడు వాలితనూజా!
యిల బ్రదుకవాంఛ గలిగిన, బలహీనుఁడు బలియుతోడఁ బగ గొనఁ దగునే?

ఉ. చెప్పఁగ వింటి నిప్పుడు వసింపఁగ వచ్చు బిలంబులోన మే
లొప్పఁగ నంచు లక్ష్మణుని యుగ్రశరంబుల కిద్ది లక్ష్యమే?
యెప్పుడొ కూల్పఁడే? పవి సురేంద్రుఁ డలంతిపనిన్ ఘటించెఁ దా
గుప్పి శరాళి లక్ష్మ [illegible] గొబ్బునఁ జెక్కుఁడె దీని దొప్పగన్. ౧౨౫౭

కం. కులిశాశనిసన్నిభ [illegible] రములు నేని చీల్చు గురుతీక్ష్ణశరం
బులు గలవు పెక్కు [illegible] దీపకుఁ డగుసుమిత్రాకొమరునియొద్దన్. ౧౨౫౮

కం. బిలమున నుండితి వేనియు, బలమునఁ బినతండ్రితోడఁ బగ గొని తేనిన్
నిలువక కృతనిశ్చయు లై, వెలి చనుదు రెల్లకపులు విమలమనీషా! ౧౨౫౯

కం. ఆలుం బిడ్డలఁ దలఁచుచుఁ, జాలఁగ నాఁకట దినంబు శ్రమపడుచును దుః
ఖాలయశయ్యల వసరుచు, వాలిసుతా! నిన్నుఁ గపులు వదలెదరు సుమీ.

కం. హితకాము లైనబంధులు, హితులున్ నిను విడిచి పోవ నెత్తినభీతిన్
మతిచెడి వణఁకెదవు సదా, గతికి వణఁకుతృణముకంటెఁ గడులాఘువ మై.

కం. స్వామిక్రియావిముఖు నిను, భీమంబు దురాసదంబు వేగాన్విత మౌ
సౌమిత్రిశరస్తోమం, బేమిటికి వధింపకుండు నెంచుము నిన్నున్. ౧౨౬౨

ఉ. రమ్ము వినీతి మాబడిని రాజ్యమునన్ నిను నిల్పు నానుపూ
ర్వ్యమ్ముగ నీపితృవ్యుఁడు భవద్ధితకాముఁడుధర్మకాముఁడున్
జుమ్ము దృఢవ్రతుండు కడుశుద్ధుఁడు సత్యప్రతిజ్ఞుఁ డౌట న
న్నమ్ము మొకప్పు డైన నిను నాశ మొనర్పఁడు సూర్యపుత్రుఁడున్. ౧౨౬౩

కం. నీతల్లియందు మిగులం, బ్రీతి గలుగువాఁడు తన్నుమిత్రము జీవో
పేతుండును సంతానా, పేతుఁడు యువరాజ యచటి కేగుట యొప్పున్. ౧౨౬౪

## అంగదుఁడు సుగ్రీవుగుణముల నిందించుట.

తే. అనవుడును గంధవహసుతువినయయుతము
రాజసత్కారయుతము ధర్మ్యంబు నైన

పలుకు లాలించి వచియించె ♦ వాలితనయుఁ
డార్తగత మెల్ల నాప్తన♦గాధిపునకు. ౧౨౬౫

ఉ. స్థైర్యము నాత్మమానసిక♦శౌచము నార్జవ మానృశంస్యముం
ధైర్యము విక్రమంబుఁ గపి♦నాయకుపట్లను లేమి వింతయే?
యార్యను జీవయుక్తుఁ డగు♦నగ్రజుభార్యను మాతృతుల్యఁ దాఁ
గార్యము కా ద టం చనక ♦ కైకొనువాఁ డెటువంటినీచుఁ డో. ౧౨౬౬

కం. వెలుపల వైరులు దాఁకిన, నిలువుము నీ వనుచు నన్ను ♦ నిలిపినఁ దా నే
బిలముఖము మూసినాతఁడు, తెలఁపుము దెలియంగలండె ♦ ధర్మపథంబున్.

కం. పాణిం బాణిని వైచి ప్ర,మాణము గొని పనియుఁ దీర్చి ♦ మహితాత్ముఁడు దాఁ
బ్రాణముఁ గాచిన నట్టియు,రీణసుతికి మఱచె నెవరి♦కృత మతఁ డెఱుఁగున్.

తే. అవనిజాతను వెదక న♦నాటనమునకుఁ, బంపుటయు లక్ష్మణుని భీతి♦వలనఁ గాని
ధర్మలోపభయంబును ♦ దాల్చి కాదు, తెలఁచు నే యిట్టివాఁ డెందు ♦ ధర్మవిధము.

కం. చలచిత్తుఁడు స్మృతిహీనుఁడు, కలుషాత్ముఁడు కృతముఁ దెలియఁ ♦ గానఁడు వానిం
గులజుఁడు బ్రదుకఁగ నాశం,గలయూహ్యుఁ డెవండు నమ్ముఁ♦గలలో నైనన్. ౧౨౭౦

తే గుణముకలవాఁడు గాని స♦న్మిత్రుఁడు గాని
పుత్రకుని రాజ్యమున నిల్పఁ ♦ బోలుఁ గాక
వైరితనయుండ నగునన్నుఁ ♦ బ్రాణయుక్తు
నీరజాప్తసుతుం డేల ♦ నిలుపువాఁడు. ౧౨౭౧

ఉ. వెల్లడి చేసితిం హృదయ♦వీథిని గల్గినమంత్ర, మెల్ల నేఁ
డెల్లము సాపరాధుఁడను ♦ దీనుఁడ శక్తియులేని వాఁడ నే
నల్లపురంబులో నవద♦యట్లయి యుండఁగ నెట్లు నేర్తుఁ? ద
ద్వల్లభుఁడుం రహస్యవిధి ♦ బద్ధుని దండితుఁ జేయు నన్ను గూన్. ౧౨౭౨

తే. క్రూరుఁడును వంచకుఁడు దయా♦దూరుఁ డతఁడు
రాజ్యకారణమున నన్ను ♦ బ్రదుకనీఁడు
బంధనాత్మక మగుఘోర♦బాధకంటె
వేగతుల మేలు ప్రాయోప♦వేశనంబు. ౧౨౭౩

కం. హరివరులారా యిండ్లకు, నరుగంగా వచ్చు మీకు ♦ నానతి యిడితిం
బురి కేను రాను నిందే, మరణముఁ గాంచుటయె భద్ర♦మార్గము నాకున్. ౧౨౭౪

కం శుభబలయుక్తుల రఘువుల, నభివాదనపూర్వకముగ ♦ నడిగితి ననుఁడీ
ప్రభు సుగ్రీవుఁ బితృవ్యుని, నభివాదనపూర్వకముగ ♦ నడిగితి ననుఁడీ. ౧౨౭౫

కం. మామాత రుమాదేవిని, సేమంబా యనుచుఁ బ్రశ్న♦సేయుం డట్లే
మామాతను దారను విూ, రోముఁడు దుఃఖాపనోది♦సూక్తులఁ గరుణన్. ౧౨౭౬

తే. నాదుజనని సహజముగ ♦ నందను నెడc
బ్రీతి గలయది తనపతి♦కై తపించు
సదియు సచ్చీల నామ్మృతి ♦ నాలకించి
మడియుట నిజంబు దా నెట్లు ♦ మనcగcగలదు. ౧౨౭౭

→ అంగదాదులు ప్రాయోపవేశంబు సేయుట. ←

కం. అని వృద్ధుల కెల్లను దా, వినయంబున మ్రొక్కి దర్భ♦వితతుల పై నో
దన మొనరించుచుc గడుదు, ర్దనుc డై భూస్థలిని గపికు♦మారుcడు పండెన్. 

ఉ. ఆర్తిని వానిపాటుc గని ♦ హా యని కన్నుల నీరుగారఁ గా నై
కర్తను దూఱుచుఁ శతమ♦ఖప్రభవుం గొనియాడుచుం బురా
వర్తనముల్ గణించుచును ♦ బ్రాయము గోరుచుc గీశకోటి త
ద్భర్తను జుట్టి యూతనిమ♦తంబు నెఱింగి జలంబు నంటుచున్. ౧౨౭౯

తే. అంబునిధియుత్తరంపుcదీ♦రంబునందు
దక్షిణాగ్రము లై యొప్పు♦దర్భలందుc
బ్రాఙ్ముఖంబుగc గూర్చుండి ♦ ప్రాప్తమరణ
మగుట మే లని చింతించి ♦ యగచరాళి. ౧౨౮౦

తే. రామవనవాసమును దశ♦రథునిమృతియు, నలజనస్థానవధము జ♦టాయువధము
భూమిజాహరణము శక్ర♦పుత్రునిహతి, రామకోపంబు వానర♦స్తోమభయము.

కం. తలcచుచును బేరెలుంగున, విలపింపcగ శైలనిభక♦పిప్రవరతతుల్
జలదంబు లుఱుమc బ్రతిరవ,ముల నిడుగతి సగుహ మగుచు♦మొరసెఁ గిరియున్.

→ సంపాతి యంగదాదులc జూచుట. ←

ఉ. ఏతలమందుc గీశచయ ♦ మిట్లు మృతీచ్ఛ వసించె నాస్థలిఁ
ఖ్యాతబలప్రతాపుcడు జ♦టాయువునన్న సుదీర్ఘజీవి సం
పాతి యనంగ గృధ్రపతి ♦ పర్వతకందరవాసి చేర సం
ప్రీతిని వచ్చి యిట్లనియె ♦ హృష్టమనస్కత నుల్లసిల్లుచున్. ౧౨౮౩

కం. దైవంబు ప్రాణికోటికిc, గావించును రక్ష దగినగతిc గానc గదా
యీానిధిc జిరకాలమునకు, నానంకకుc దెచ్చి యిచ్చె ♦ నవ్యాశనమున్. ౧౨౮౪

కం. వనచరవరులను నొక్కొ,క్కనిcగఁ దినదినముc దిందుc ♦ గ్రమముగ వీరల్
గన మరణం బనcగా విని, హనుమకు నుద్విగ్నుc డైన♦యంగదుc డనియెన్.

సీ. భక్ష్యలుబ్ధం బైన♦పక్షిని గంటివే, సీతాపదేశంబు♦చేత యముcడె
ప్లవగమండలికి నా♦పాయంబుc గావింప, నిచ్చోటి కీగతి ♦ నేగుదెంచె

శ్రీరాముకార్యంబుఁ జేసినయది లేదు, రాజాజ్ఞ మనము దీర్పఁగను లేదు
ఇంతలోఁ జనుదెంచె నీసుహాపాయంబు, కపికోటి కెల్ల నాకస్మికముగ
తే. నవనికన్యకకును బ్రియంబు వారఁ గూర్పఁగా జటాయువు చేసినకార్య మెల్ల
వింటిమే కద మనమెల్లఁ బిదప నట్టిభంగి మన కెల్ల నిప్పుడు ప్రాప్తమయ్యె.
తే. స్నేహదయలను మనవలె జీవకోటు, లహహ పశుపక్షిజాత్యాదు లైన వేఱు
వేఱఁదమయంతశ్రీరఘుపీరునకును, బ్రియముఁగావించుఁబ్రాణముల్ విడిచిరైన.
తే అవనిజాపతి కుపకార మాచరింప
ధర్మవిదుఁడు జటాయువు తనువు దొఱఁగి
ప్రియము గావించెఁ గాదె యాఁకిలి మనము
గాసిఁబడినార మారాముకార్యమునకు.　　　　౧౭౮
కం. కాంతారంబుల నన్నిటఁ, గాంతామణి వెదకి వెదకి కానము మఱి జీ
వాంతంబును బ్రాప్తించెను, జింతింపఁగ నేల మృతికి సిద్ధుల మగుటన్. ౧౭౯
కం. ఖండితుఁడై రావణుచే, భండనమున నీల్గి పరమపద మేగె ఖగేం
ద్రుండు కపినాథభయము, క్షుండయి ధన్యుండతండె కువలయమందున్. ౧౮౦
తే. దశరథేశుండు దా మృత్యువశుఁ డగుట
బృథివికన్యక నసుర హరించుకతనఁ
గృధ్రరాజు జటాయువు మృతుఁడు నగుటఁ
బ్లవగులకు జీవసంశయాపద ఘటిల్లె.　　　　౧౮౧
శా. త్రైలోక్యామణితోడ రామవిభుఁడుర్విం సౌమిత్రియుం గానకై
రాకల్ రాఘవతిప్రశ్రాణమున సుప్రాణాంతకం బట్టుట
శ్రీకాకుత్స్థనయోజ్జ్వలత్విబుధనైర్వ్యాతముల్ గూలుట
కైకేయీవరదానకారణమునం గాఁగల్గె నీకష్టముల్.　　　　౧౮౨

→ సంపాతి యంగదాదులతో భాషించుట. ←

కం ధరణీపతితులు కపులు స,కరుణం బగుపాలితనయకథకథ విన నా
గురుచలితమతి ఖగేశుఁడు, పరితాపకరంబు గాఁగఁ బలికెం బాఁడిన్. ౧౮౩
ఉ. ఎన్నిదినాలకో వినితి నియ్యెడఁ దమ్ముని పేరు, ప్రాణముల్
కన్నప్రియుండు వాఁడు, కడుఁ గంపితె నాహృదయంబు తిత్వరన్
విన్నను, దండకన్ దనుజపీరున కాతని కేల యుద్ధ? మా
పన్నత యెట్లు గల్గె? నది పల్కుద వెవ్వఁడ వీవు వానరా?　　　　౧౮౪
కం. గిరినుండి నన్ను దింపఁగఁ, బరమమతిన్ వేఁడువాఁడ బలియుఁడు తమ్ముం
డుసుగుణజ్ఞుం డాతని,పరికీర్తన వినఁగఁ గల్గెఁ బలునాళ్ల కిటన్.　　　　౧౮౫

కం. సీతాపతిజనకుం డగు,ఖ్యాతలపతి దశరథుండు ♦ సఖుఁ డె ట్లయ్యెన్
నాతమ్మునకును జెపుఁడా, ఖ్యాతయశోధన్యులార ♦ కాంక్షింతు వినన్. ౧౨౯౬

కం. ఖరకరుఖరకరిములఁ గపి,నరులారా! నేను దగ్ధ♦పత్త్రుఁడ నగుటన్
గిరి డిగ్గఁజాల నన్నుం, బెరిమం గొనిపొండు మీఁద♦మీఁదమున కనన్. ౧౨౯౭

అంగదుఁడు సంపాతికిఁ దమవృత్తాంతమును జెప్పుట.

కం. గోదశోనుదుఃఖంబున గ,ద్గదికం దడఁబడెడి గృధ్ర♦గళరవము వినిన్
మది నమ్మ రైరి తద్భీ,తిదశర్థంబునకుఁ గపులు ♦ దిగు లుదయింపన్. ౧౨౯౮

తే. మనల నెల్లరి భక్షించు ♦ మాన దిదియుఁ, గాన వల దని కొందఱు♦కపులు పలుకఁ
జావ నాయత్తపడియును ♦ జడుపి దేల?, యరిగి వేగంబ ధన్యుల ♦ మగుట తగదె.

చం. అని చని దాని నెత్తికొని ♦ యద్రిని డింపఁగఁ గొంచ అంగదుం
డనియెను దానితో విను వి♦హంగమవల్లభ! స్వర్ణగర్భుతో
నెనయుపలీముఖేంద్రుఁ డలి♦బుట్టిరజం డనువిక్రమాఢ్యుఁ డా
యనకును బుత్త్రులిర్వురు మ♦హాఘబలుల్ గల రుగ్రవిక్రముల్. ౧౩౦౦

కం. వాలియు సుగ్రీవుం డన,వాలియు నాతండ్రి యతఁడు ♦ వర్ణితుఁ డయ్యెన్
వాలినవిక్రమమునఁ గా,ర్యాళి లనేకములు సలిపి ♦ యద్భుతకీర్తిన్. ౧౩౦౧

చం. సకలజగత్ప్రభుండు రఘు♦చంద్రముఁ డాజినుబాండు రాముఁ డి
క్ష్వాకులుమనర్ఘనుండు తన♦దారను దమ్ముని గూడి తండ్రిమా
జ్ఞకు బడు లాడ నోడి కదు♦న్యాయ్యపథస్థుఁడు గాన ఘోరదం
డక నడ తెంచి చొచ్చె; వికృ♦టక్రియఁ డా దశకంఠుఁ డయ్యెడన్ ౧౩౦౨

కం. వాని జనస్థానమున వి,హారము సలుపం గ రాము♦నంగనను బలా
త్కారంబుగఁ గొని చనఁగా, శ్రీరాముపితజనకుసఖుఁడు ♦ గృధ్రేశుండున్ ౧౩౦౩

తే. అగుజటాయువు రాముని♦సుగువఁ జూచి
యామె విడిపింపఁ గోరి మే♦ఘాధ్వమునను
జనెడిరావణుఁ దాఁకి త♦త్స్యందనంబుఁ
గూల్చి ధరమీఁద నిలిపె స♦త్కృపలయాత్మ. ౧౩౦౪

కం. వెండియుఁ బోరు నెడన్ శ్రాం,తుండును వృద్ధుండు నగుట ♦ దోషాటునిచే
ఖండితపక్షుం డై పడె, భండనమున నిట్లు విహగ♦పతి మరణింపన్. ౧౩౦౫

తే. జానకీభర్త యాతని ♦ సంస్కరించి, యుత్తమం బైనగతి గూర్చి ♦ హస్తిఁ జేసె
నాదుపినతండ్రి సుగ్రీవ♦నాముతోడ, సఖ్య మొనరించి చంపె నా♦జనకుఁ బిదప.

కం. నాతండ్రితోడ సదివో,పేతుం డయి గొదగొదన్ సహించె బితృవ్యుం
డాతరశికులుఁడు వాలిఁ బ,రేతుం గావించి రాజ్య ♦ మిచ్చె హితునకున్. ౧౩౦౭

కం వానరపతిసుగ్రీవుఁ డ♦నూనవిభుత్వప్రతిష్ఠ ♦ నొందె మహీజా
గానఁగ మముఁ బంచెను రా,మానుమతిని మేము నచట ♦ నచట వెదకుచున్
కం.తిరిగితిమి కాని భాస్కరు,కరముల రాత్రులను జూడఁ ♦ గానమిధరణీ
ధరణిజఁ గానమ దండకఁ, జరియించుచు హెచ్చరికను ♦ సతి నెమకెడి చోన్.
కం.అజ్ఞానవశంబున ధ,ర్మజ్ఞా! విస్మృతము బిలము ♦ మహిగతము మయ
ప్రజ్ఞారచితముఁ జొరఁగా,నాజ్ఞయిచ్చినమాస మరిగె ♦ నచటనె మాకున్. ౧౩౦౦
కం.రాజాజ్ఞాబద్ధుల మీ,రోజం గడు వెల్లఁ జనియె ♦ నూరక చనినన్
మాజీవంబులు దక్కవు, రాజితమతి! దానఁ జేసి ♦ ప్రాయము గనుటల్. ౧౩౦౧
కం.రామునకును గపినేతకు, సౌమిత్రికిఁ గినుక పుట్టఁ ♦ జలిపితి మేని
మామేనుల నుసు ఉండదు, నామాటనిజంబు గృధ్ర♦నాథా! యనినన్. ౧౩౦౨

సంపాతి కపులతో జటాయువు తనతమ్ముఁ డని చెప్పుట.

సీ. ప్రాయోపవిష్టులై ♦ ప్లవగులు దీనులై, కన్నీళ్లతోఁ దమ♦కథ వచింప
సంపాతియును మహా♦స్వనమున నిట్లను, రావణుచేత ని♦గ్రహితుఁ డైన
యట్లు మీరా రనినజ♦టాయువు నాతమ్ముఁ, డతనిపాటును విని ♦ యును నయ్యెను
సైఁచెద దగ్ధప♦క్షతను వార్ధకమునఁ, బగ దీర్చుకొనుసంత♦బలము లేమి
తే. వృత్రవధ పూర్వమునఁ బ్రవ♦ర్తిల్లు చుండ, నన్నుదమ్ముల మాత్మజ♦వాతిశయము
దెలియ నన్యోన్యవిజిగీష ♦ దివికి నెగసి, చండకరమండలము డాయఁ♦జనఁగఁ దివిరి.
కం.వలయము లేర్పడఁ దిరుగుచు, జలధరమార్గమున మేము ♦ చనుచో రవియుఁ
దలమీఁదికి రా సరిగా, వలజడిఁబడెఁ దమ్ముఁ డంత ♦ ననురాగమునన్ ౧౩౦౪
కం.ఆతని నాపక్షంబుల,చేతం గప్పితిని గాని ♦ చిత్రాంశుమయూ
ఖాతతరోచులఁ గమరుట,నాతనురుహములుగము వింధ్య♦నగమునఁ బడితిన్. ౧౩౦౫
కం.నే నిచ్చట వసియించుట,చే నాయనుజాతువార్త ♦ చెవిఁ బడదయ్యెన్
నా పతనిఁ గాంచి తారా,సూనుం డిట్లను జటాయు♦సోదరుఁ డెవన్ ౧౩౦౬.
కం.నా వాక్రుచ్చిన దంతయు, నీవును వినియుందు గాదె ♦ యెఱిఁగిత వేనిన్
ధీవర్ధితుఁ డగురావణు,నావాసము దవ్వొ దాపొ ♦ యూరడు మ టన్నన్. ౧౩౦౭
కం.తన కనుహాపం బగుగతి, వనచరతతికిన్ ముదంబు ♦ వర్ధిల ననియున్
వినుఁడీ శౌర్యవిహీనుం,డను గ్రద్దను దగ్ధపక్షుఁ♦డను నే నయ్యున్. ౧౩౦౮

సంపాతి కపులకు రావణునునికిఁ జెప్పుట.

సీ. రామకార్యం బిది ♦ ప్రథమకర్తవ్య మా,కార్య మైనను వార్ధ♦కమునఁ జేసి
బలము క్షీణించెను ♦ బ్రాణముల్ శిథిలముల్, గాన మిక్కిలి చేయ ♦ లేను గాని

మాటమాత్రము తోడుపాటు గావించెద, నెఱుఁగుదు విశలాది ♦ యెల్లలోక
ములును త్రివిక్రమమూర్తియై విష్ణుండు, జగములఁ గొలచిన♦చంద మెల్ల
తే నిర్జరాళికి రాక్షస♦నిచయములకు,నైనసంగ్రామువిధముల ♦ నమృతమునకు
గాఁగ నంభోధిఁ ద్రచ్చిన♦క్రమము నేను, జక్క నెఱుఁగుదు కాంతారచారులార!
ఉ. కంటిని రావణానుచరుఁడు ♦ కైకొని పోఁగ మింట నొక్క వా
ల్గంటిని బ్రాయపుంజెలిని ♦ గస్త్రసమస్తవిభూషణాంచితన్
గంటను బాష్పముల్ దొరల ♦ గాత్రవిధూనన మాచరించుచున్
గెంటుచు మేనిసొమ్ములను ♦ గీష్పడి యున్నత్రిలోకసుందరిన్. ౧౩౨౦
కం ధరణీధరాగ్రంబున భాస్కరుకాంతియొ కాక నీల♦జలదస్థతటి
ద్వరమో యన నారమణీ,సరకౌశేయంబు దైత్య♦వరుపై వఱలెన్. ౧౩౨౧
కం రామా యని లక్ష్మణ యని, యామానిని యేడ్చెఁ గాన ♦ నామెయె సీతా
భామ యని తలఁతుఁ జెప్పెద, నామనుజాశనునినిలయ ♦ మాలింప రయా. ౧౩౨౨
కం.ఔరసుఁడు విశ్రవునకున్, గౌరీవల్లభునిమిత్రు♦నకుఁ దమ్ముండున్
బేరను రావణుఁడు మహం, బారఁగ వసియించు లంక ♦ యనునగరమునన్. ౧౩౨౩
కం.జలధిని నూఱామడలో, గల దొకద్వీపంబు విశ్వ♦కర్మకృతం బై
చెలువం బయి యదియే చుఁడి, యిల లంక యనంగ రాక్ష♦సేశ్వరుపురియున్.
తే. పసిఁడివాకిండ్లు బంగారు♦పంచటరుఁగు, లమరి రవివర్ణప్రస♦మాస్పృత మయి
తనరుఁ దత్పురి రావణాం♦తఃపురమున, క్షితిజ వసరుచు నుండు ర♦క్కెసలు గాన.
తే. జలధి తనకు పగస్తగా ♦ నాగరమున, నొక్కశతయోజనము పోవ ♦ నుండు లంక
దక్షిణంబుగ నటు చని ♦ రాక్షసేంద్రుఁ, జూచి ఫలసిద్ధిఁ గని రండు ♦ శూరులార!
కం.త్వర సేయుఁడు మీరలు మీ,గురుతరవిక్రమముఁ జూపఁ ♦ గుజచరులారా!
పరికింప జ్ఞానదృష్టిన్, మఱలెద రెల్ల ఫలిత♦మహితార్థకు లై. ౧౩౨౪
సీ, ధాన్యంబుఁ దినుఖగ♦లతులు కుళింగాది,పక్షుల కెల్లను ♦ ప్రథమగతియు
అననీనుహాభవంబు ♦ లగుఫలాదుల దిను,వాయసంబులకు ద్వి♦తీయగతియుఁ
గ్రౌంచకురరభాస♦గతి మూఁడవది యగు, నాల్గవగతియు శ్యే♦నంబులకును
గృధ్రాల కైదవ♦గతి గల్గు బలవీర్య,యౌవనశాలిచ♦క్రాంగములకు
తే. నాఱవది గతి యైన తే♦యముల కవుల,నైన తేయునిసంతతి ♦ వార మేము
ఇచట నుండియ సీత లం♦కేశుఁ గందుఁ, గలదు సౌవర్ణదివ్యాక్షి♦బలము మాకు.
కం.నైసర్గిక బలమునఁ దిను,గ్రాసము వీర్యంబుచేతఁ ♦ గనుఁగొందు మనా
యాసంబుగ యోజనశత, మోసాధుగుణాఢ్యులార ♦ యుత్తములారా! ౧౩౨౫

కం.దూరమున నుండుదానిని, జేరం జని తీసుట మాకు ♦ సిద్ధం బయ్యెన్
ధారిణిం దమపాదంబుల,చేరునం గలవానిం గోళ్లు ♦ చీరి భుజించున్. ౧౩౩౦

కం గర్హిత మగుకార్యంబును, బర్హిగ్రథువైరి చేసె ♦ బలిముఖులారా!
యర్థంబుగ మద్భ్రాతృని,బర్హణమున కయ్యెడున్ భ♦నత్కృతి ప్రతిగన్. ౧౩౩౧

కం.తోయుఁడు జలనిధి దాఁటును,పాయము వనధిం దరించి ♦ యవనీసుత మీ
రాయెడఁ గని ధన్యుల రై,జే యని కిష్కింధ మరలఁ ♦ జేరుఁడు సంగిన్. ౧౩౩౨

చం.వననిధి నేను నీళ్లు విడు♦వన్ వలయున్ మృతిం గూరినట్టి నా
యనుజున కీను తోయనిధి♦యంతికసీమను ధన్యుఁ జేప్పుఁడీ
యనఁ గపు లట్లు చేసి పత♦గాధిపుఁ గ్రమ్మఱం దెచ్చి తొల్లిటి
తని నట నిల్పి రాఘవుని♦దేవియునంత మెఱుంగవచ్చుటన్ ౧౩౩౩

జాంబవంతునితో సంపాతి సీతావృత్తాంతముఁ జెప్పుట

కం.సంపాతివాక్సుధారస,సంపాతంబునను మిగుల ♦ సకలకపుల్ హ
ర్షింపఁగ భల్లుకనాథుం, డింపెసఁగఁగ లేచి యనియె ♦ గృధ్రేశునకున్. ౧౩౩౪

ఉ. ఎక్కడ నుండు సీత? సతి ♦ నెవ్వరు చూచిరి? హర్త రాక్షసుం
డెక్కడివాఁడు? సర్వము ఖ♦గేశ్వర! తెల్పు వలీముఖాళికిన్
దిక్కయి ప్రోవుమీ; రఘుప♦తిప్రకటస్వరతుల్యబాణముల్
మ్రుక్కడి యెవ్వఁ డొక్క మది♦లోఁ దలపోయఁ డొకింత లోనిచున్. ౧౩౩౫

కం.అనవుడు సీతావృతి నే, వినినవిధము వక్ష తెఱఁగు ♦ వికచాంబుజలో
చన యుండుతావు మరలన్, వినిచెద విన రయ్య ప్లవగ♦వీరవరేణ్యుల్. ౧౩౩౬

కం.తెక్కలు విఱుగుట దీనత, నిక్కొండన యుండ నాఁడ ♦ నిట్టిఁడ నాప్తె
నెక్కొనుభక్తి సుపార్శ్వుం, డక్కఱగొని భుక్తిఁ గూర్చు ♦ నాత్మజుఁ డగుటన్.

కం.అతికాముము గంధర్వుల, కతివేలం బైనకోప ♦ సుహించయములకున్
అతిభయము మృగంబులకును, నతిమాత్రవృత్తుత్తు మాకు ♦ నగచరులారా!

సీ. అటు లౌట నొక్కనాఁ ♦ డాహారకాంక్షి నై, యాఁకట నే నెంతో ♦ యటమటింప
నర్కుఁ డేగినవెన్క ♦ నామిషహీనుఁ డై, నాపుత్త్రకుఁడు నాదు♦దాపుఁ జేర
వృద్ధులు కోపస♦మృద్ధులు గావునఁ, బదరితి వానిం బి♦పాసకతన
నాతండు నన్ను స♦మాధానపఱిచి మ,హేంద్రాద్రి నరికట్టి ♦ యేను వసధి
తే.సత్త్వచయమును గుంపు లై ♦ చనెడి త్రోవ
నాఁగి తల వ్రేలఁగా వైచి ♦ తూఁగుచుండి
కంటి భిన్నాంజనాద్రినీ♦కాశుఁ డొకఁడు
కొంచుఁ జన సూర్యసమతేజఁ ♦ గొమిరె నొకతె. ౧౩౩౮

కం ఓరంబు దొరికె నని మది, నారఁగఁ గృతనిశ్చయుండ ♦ నైతిని వాఁడుం
గోరె ననుఁ దెరు వొసంగఁగ, సారమతీ! నవినయముగ ♦ సరి పొమ్మంటిన్. ౧౩౪౦
కం. హేయగుణుఁడైనఁ దన్నుం, దాయం జని వేఁడఁ జంపఁ ♦ దలకొనఁ దనఁగా
నాయట్టియాతఁ డిప్డీ, చేయునె యటువంటిపనిని ♦ జిరంజీవివరా! ౧౩౪౧
కం తన తేజంబున గగనము, గొనిపోయెడి నేమొ యనఁగ ♦ గొబ్బున వాఁడుం
జనె ఖచరులు ననుఁ గనుఁగొని, యని రన్నా! బ్రతికి తీ వ♦హా భాగ్యమునన్.
కం ఎట్టెట్టో చనె నతఁ డిప్పుట్టున నతితోడ; నీకు ♦ భద్రం బిఁక నం
చిట్టు వచింపఁగ నాతని,పుట్టువుఁ గథ నడుగ సిద్ధ♦పుంగం బనియెన్. ౧౩౪౩
ఉ. ఆతఁడు రావణాఖ్యుఁ, డసు♦రావళి కెల్ల విభుండు, జానకిన్
సీతను రాముభార్య నవి♦నీతి బలాత్కృతిఁ గొంచుఁ బోయెడిన్
భీతిని, రామలక్ష్మణులఁ ♦ బేర్కొని యేడ్చుచు భ్రష్టభూష యై
జాతమహావ్యథం బడెడి♦చారువిలోచన సీత యాఁ జుమీ. ౧౩౪౪
కం అని యని రనుచును గాలము,చని వచ్చిన నాసుతుండు ♦ సకలము నొడివెన్
వినియును నిది యసురునిప్డుఁ, జని శక్తిని జూప మనసు ♦ చాలద నాకున్. ౧౩౪౫
కం. ఱెక్కలు విఱిగినపక్షిని, నెక్కరణిని దేని నైన ♦ నేటు సేయుదు? నే
వాక్కును బుద్ధియు గుణమును, దక్కుట మీశక్తి కగువి♦ధంబు వచింతున్. ౧౩౪౬
సీ. ఎది రాముకార్యంబొ ♦ యది నాదుకార్యంబు, సత్య మియ్యది, లేదు ♦ సందియంబు
మీరలు బలియురు ♦ మేధావులును గపి,పతిచేతఁ బంపంగఁ ♦ బడినవారు
సమరంబునను దురా♦సదులరు సురల కేన్, రామలక్ష్మణులనా♦రాచవితతి
ముజ్జగంబులఁ బట్టి ♦ నజ్జ నజ్జగఁ జేయ, నైన రక్షింపఁగ♦నైనఁ జాలు
తే. సాపు తేజంబు గలఁడు ద♦శాస్యుఁ డైనఁ గడుసమర్థులు మీకు దు♦ష్కరము లేదు
జాగు సేటికి బుద్ధిని♦శ్చయము తగును, బనుల వెనుదీయ రెప్పుడు మీ♦వంటిఘనులు.

సంపాతి నిశాకరఋషితోఁ దనకు నైనసంభాషణంబుఁ జెప్పుట.

కం. అనివానరసంఘంబులు, దనుఁ జుట్టఁగ నున్న వాలి♦తనయుం గనుచున్
జనితప్రత్యయమతి యై, యనియెను సంపాతి మఱియు ♦ హర్షం బెసఁగన్. ౧౩౪౭
సీ. సద్దు చేయక మీరు ♦ శాఖామృగములార!, వినుఁడు సీతోదంత ♦ మనుచుఁ బలికి
యంగదుతోడ ని ♦ ట్లనియె నీవింధ్యంబు శిఖరంబునను రవి♦సెగకు దగ్ధ
పక్షుండ నై మూర్ఛఁ ♦ బడియుండి యిరుమూఁడు,దినము లాపిమ్మటఁ ♦ దెల్విరాఁగ
నలుదిక్కులను జూడఁ ♦ దెలియ రా దొక్కటి, చక్కఁగ మఱిచూడ ♦ సాగరంబు
తే. శైలతటినీసరస్సులు ♦ జలధివేల, గోచరింపఁగఁ గందర♦కూటయుతము
సజాలపక్షిగణాకీర్ణ ♦ మైనగంబు, శాఖిశిఖరస్థమగు వింధ్య ♦ మనుచుఁ దోఁచె. ౧౩౪౮

కం.ముని యిచట నిశాకరుఁ డను,మునియొక్కఁడు తపము ఘోర♦ముగఁ గావించెన్
జని నెనిమిదివే లేఁడులు, జననుతుఁ డాతండు చేరె ♦ స్వర్గామంబున్, ౧౩౫౦

సీ. ఆఋషీశ్వరుఁడు నా♦యనుజుని నన్నును, గడుమచ్చికను జేసి ♦ గారవించు
కతన నాతనిఁ జూడఁ ♦ గాంక్ష దలిర్పఁగ, నెగ్గుడు దిగ్గ డై ♦ యెంతయేని
వాఁడిమొన ల్గల♦పరుసపుదర్భల, యవనికి విమమవిం♦ధ్యాద్రి నుండి
దిగి గాసిమై నెక్కి ♦ బుగులువాసనగల్గి, పూచనిశాచని♦భూరుహంబు,
తే. లేక భాసిల్లు నమ్ముని♦లోకచంద్రు,నాశ్రమాంతికమున నొక్క♦యగమునీడ
విశ్రమించితి మునిరాక ♦ వేచి యతఁడు, వచ్చె నీరాడి యుత్తర♦వదనుఁ డగుచు.

ఉ. ధాతను బ్రాణికోటివలెఁ ♦ దాపసవర్యుని వ్యాఘ్రసింహసం
వ్రాతసరీసృపాహిసృమ♦రంబులు నర్దిలి వెంట నంటుచున్
జ్ఞాతలవల్లభుండు నిజ♦సౌధముఁ జేర నమాత్యపంక్తియ
ట్లాతఁడు లోని కేగ నవి ♦ యన్నియు స్వేచ్ఛఁ జనె న్పదంబునన్. ౧౩౫౨

ఉ. అమ్ముని నన్నుఁ జూచిప్రమ♦దాతిశయంబున లోనఁ జొచ్చియున్
గ్రమ్మఱి కొంతసేపటికె ♦ నన్నుఁ గనుంగొని యగ్నిదగ్ధప
క్షమ్ములు మేన గాయములు ♦ గల్గుట ని న్గుఱుతింపఁ జాలఁ బూ
ర్వమ్మున గృధ్రముల్ గలవు ♦ వాయుజవమ్ములు గృద్ధతేఁడు లై. ౧౩౫౩

ఉ. భ్రాతలు కామరూపగులు ♦ వారలలోపలఁ బెద్ద యైనసం
పాతివి నీవు, నీయనుఁగు♦భ్రాత జటాయువు, మానుషాకృతిన్
స్ఫీతమతిన్ మదంఘ్రియుగ♦సేవ యొనర్తు మ, నీకు ఱెక్క లే
హేతువుచేతఁ గూలెఁ?గత ♦ మెయ్యది? శిక్ష యొనర్చె నేఁ డొకో? ౧౩౫౪

సంపాతి తనకు ఱెక్కలు గాలినవిధము నిశాకరునితోఁ జెప్పుట.

సీ. అనవుడు ని ట్లంటి ♦ నలజడిచేతను, వ్రణబాధ సిగ్గున ♦ వ్యాకులేంద్రి
యుండ నే నగుటఁ బ్ర♦త్యుత్తర మీఁజాల, గర్వాంధతను బరా♦క్రమము తెలియఁ
గోరి కైలాసాద్రి♦కూటస్థు లగుఋషి,వర్యులసన్నిధి ♦ సూర్యబింబ
మస్తాద్రిఁ జేరెదు♦నంతలో దానిని, జేరఁగఁ బన్నిద♦మూరిఁ బలికి
తే. యొక్కపరి మింటి కెగసి మే ♦ మొక్కు మెఱసి
వింటఁ జనుచుండ నగరముల్ ♦ వేఱువేఱు
బండికండ్లంత లై కాన♦బడియె నచట
నచట విన నయ్యె వాద్యబ్ర♦హ్మస్వరములు. ౧౩౫౫

కం.రంగుగ లోహితవాస,స్సంగత లగునంగనలను ♦ సంగీతకళా
సంగలఁ గనుఁగొనుచును జే,రం గలిగితి మిర్వురమును ♦ రవిమార్గంబున్. ౧౩౫౬

సీ. అచ్చట నుండి మే ♦ మాలోకనము సేయఁ, బచ్చికపట్టయ్యె ♦ వనతలంబు
కొండల నిండిన♦కుతలంబు గులకఱాల్, నెఱప మఱింగిన♦నేల యయ్యె
నాపగావృత మగు♦నవని నూల్పోగులు, చుట్టినచెం డయి ♦ చూడ నయ్యె
మిహికాద్రి వింధ్యంబు ♦ మేరువు మడువున, నాగంబులట్లు కా♦నంగఁ బడియె
తే. మేనఁ జెమ్మట దుఃఖంబు ♦ మానసమునఁ
గలిగె గిరగిర తిరిగెను ♦ గన్నుదోయి
యామ్య మిది పశ్చిమం బిది ♦ యనుచు దిక్కు
దెలియ దయ్యెను శూన్య మై ♦ దెసలు దోఁచె. ౧౩౫౭

కం. లయసమయశిఖిశిఖాసం,చయమున నిర్దగ్ధ మైన♦జగములచందం
బయి తోఁచె లోకమంతయు, నయకోవిదవర్య మాకు ♦ నట నుండి కనన్. ౧౩౫౮

చం. కనుఁగొన సాధనంబు లగు♦కన్నులు దిగ్భ్రమఁ బొంది యుండుటన్
మనమును వ్యాకులంపడియె ♦ మానక మేము దృఢప్రయత్నతన్
గను లొకయింత విచ్చి గ్రహ♦కాంతుని శంకఁ గనంగ భాస్కరుం
డును ధరణీప్రమాణము త♦నుం గొనియుండుట గంటి మంతటన్. ౧౩౫౯

చం. ఒకపలుకైనఁ జెప్పకయె ♦ యుర్వికి డొల్లె జటాయు వయ్యెడన్
జకచక నేను వచ్చి యను♦జాతునిఁ గప్పితి నాదు ఱెక్కలన్
సెకలను వానిదేహ మటు ♦ చెక్కు చెమర్పద కాని యెట్లొ తి
గ్మకరమరీచిదీధితులఁ ♦ గాలెను నా యెఱకల్ క్షణంబునన్. ౧౩౬౦

కం. అతఁడు జనస్థానంబునఁ, బతితుం డయి యుండు ననుచు ♦ భావించితి నీ
క్షితిధరమున నేఁ బడితిన్, గతి చెడి యొక మొద్దు వోలెఁ ♦ గమరుట ఱెక్కల్.

కం. తమ్ముండును ఱెక్కలు రా,జ్యమ్ము పరాక్రమము పోవ ♦ సర్వగతుల జీ
వమ్మేల నిలుప నని యచ,లమ్మునుండి యిలఁబడఁ ద♦లంచితిఁ జావన్. ౧౩౬౨

నిశాకరుఁడు సంపాతికి ఱెక్కలు మొలచు నుపాయంబుఁ జెప్పుట.

చం. అని వినిపించి యేడ్చుటయు ♦ ధ్యాన మొనర్చి మునార్త మత్తపో
ధనుఁ డనె నీకుఁ గ్రమ్మఱ ఛ♦దమ్ములు గల్గెడి వెండి సత్త్వముల్
గనులును విక్రమంబు తొలి♦లాగున లబ్ధము లౌను జుమ్ము, నే
వినితిఁ బురాణమం దొకభ♦విష్యముఁ గంటిఁ దపోబలంబునన్. ౧౩౬౩

సీ. ఇక్ష్వాకునందనుం ♦ డిల మించు దశరథుం, డనుభూమిభర్త యా♦తని సుతుండు
ప్రకటతేజుఁడు రామ♦భద్రుండు జనియించు, నాతండు జనకవా♦క్యానుసారి
యయి లక్ష్మణుం డను♦ననుజునితో నర,ణ్యాళిఁ జరింపఁగ ♦ నతనిభార్య
దానవేంద్రుఁడు జన♦స్థానంబునందుండి, హరియించి యామె కా♦హారములను

తే. నాశ చూపును గాని యా♦యతులసాధ్వి, తాఁక దొక్కటి యేని ని♦తాంతదుఃఖ
మగ్నయై యంత [నిగ్గర♦మండలికిని, దుర్లభం బగునమృత మిం♦ద్రుం డొసంగు.

ఉ. దానిని నింద్రదత్త మని ♦ తత్త్వ మెఱింగి తదన్న మందు నా
త్మానుత యగ్రభాగమును ♦ గైకొని ప్రాణముతోడ నుండినన్
గాని యమర్త్యభోజమును ♦ గాంచినఁ గాని సలక్ష్మణుండు నా
ప్రాణవిభుండు రాముఁ డ♦టంచును భూస్థలి నుంచు భక్తిమై.][1] ౧౩౬౭

కం. రాముని దూతలు క్రోఁతులు, వామాక్షిని వెదకి కొనుచు ♦ వచ్చెద రిటకున్
భూమిజవృత్తాంతము శా,ఖామృగములకున్ వచింపఁ ♦ గలుగు శుభంబుల్.

కం. ఎందును బో వలవదు నీ,విం దుండుము హీన మైన♦యిట్టిదశను నీ
వెం దరుగఁ గలవు? ఱెక్కలఁ, బొందెద విట దేశకాల♦ములు నెదురు గనన్.

తే నీకు ఱెక్కలు మొలపింప ♦ నేర్తుఁ గాని
యిపుడ యటు సేయఁగా నుత్స♦హింప నైతి
భువనహిత మైన కార్యంబుఁ ♦ బూని నీవు
పతగపుంగవ చేయంగ ♦ వలసి యుంట. ౧౩౬౮

కం. సురవరునకు మునులకు భూ,సురవరులకు నిర్జరులకు ♦ సుహితచరితు లౌ
ధరణీపగసంవనులకుఁ, గరుము ప్రియము నీవు సేయఁ♦గా వలయుఁ జుమీ. ౧౩౬౯

తే. మహితకీర్తుల రామల♦క్ష్మణులఁ జూడఁ, గలదు కొండంతయాశయుఁ ♦ గాని యంత
కాల మున్నవి గాయంబుఁ ♦ గావి యుండెఁ, బ్రాణముల్ విడ గానఁ ద్య♦జింతు మేను.

సంపాతికి నూత్న ఱెక్కలు మొలచుట

సీ. అని పెక్కుగతులఁ ద♦త్త్వార్థవర్ణనుఁ డెంతొ, నన్ను నాశ్వాసించి ♦ సన్నుతించి
పో మ్మని చెప్పి తాఁ ♦ బోయె లోనికినంత, నీకొండమీఁదికి ♦ నెట్లొ మెల్ల
నెక్కి యందుండి నే ♦ నెదురు చూచుచు నున్న,వాఁడ మీరాక కై ♦ ప్లవగులార!
యెనిమిది వే లేండ్లు ♦ చనియె నే నోర్పుమైఁ, గాలదేశంబులఁ ♦ గాచి యుంటి

తే. వపసినుడి సమ్మి యాతండు ♦ విపుల విడిచి, దివికి నేగిన నేనును ♦ ధృతి దొఱంగి
పెక్కువిధములఁ జింతచే ♦ స్రుక్కి స్రుక్కి, కాల్పఁబడు చున్నవాఁడ దుఃఖంబుచేత.

సీ. చత్తునా యంచును ♦ జతనంబుఁ గావింతు, మౌనివాక్యంబున ♦ మరలుచుందు
నేమి జీవన మని ♦ యెన్నుదు మునిబుద్ధి, తిమిరంపుదివియ యై ♦ తెల్వి నిచ్చు
రావణు నెఱుఁగుట ♦ రామకాంతను నేల, కావ నైతని పుత్రు ♦ గర్హింతు
దశరథునెయ్యంబుఁ ♦ దలఁచి యైనను నాఁటి, నేచ్చ సీతను గావ ♦ నెంచఁ డయ్యె

తే. నేమిపుత్రుం డటంచును ♦ నెంచుచుండు, ననుచు నీరీతి సంపాతి ♦ యగచరాళి
కెల్లఁ దనకథఁ జెప్పంగ♦నింతలోనఁ,గపులు చూచుచు నుండ ఱె♦క్కలును మొలచె

[1] [కుండలీకరణ మైనభాగము ప్రక్షిప్తము.]

చం. అరుణరుచిన్ వెలుంగుగఱు ♦ లట్లుదయింపఁగఁ బొల్చుమేనిఁ దా
నరుణసుతుండు చూచుకొని ♦ హర్షవికాసమనస్కుఁడై నిశా
కరమహిమంబుచేత నెఱ♦కల్ మొలదెంచెను వెండి కంటిరే
పరువపువేళఁ గల్గుబల♦పౌరుషముల్ గల వంచుఁ దోఁచెడిన్. ౧౩౭౩

ఉ. ఎన్నివిధంబులన్ నెమకుఁ ♦ డీవు ధరాసుత నిప్డు నాకు ను
త్పన్నము లైనఱెక్కలవి♦ధంబుఁ గనంగను విశ్వసింప నా
నన్నవలాను గన్గొనుట ♦ యాజ్ఞ నొసంగుఁడు మింటిత్రోవ వే
గోన్నతి మున్నువోలెఁ జన ♦ నోపుదునో పరికింపఁ గోరెదన్. ౧౩౭౪

కం. అని చన ముద మొదవఁగ న,న్వనచారులు సంప్రల♦బ్ధపౌరుషు లగుచున్
జనకజ రోయఁగ నభిజి, త్తనుమూర్తము వేచి చనిరి ♦ యవనిజదెసకై. ౧౩౭౫

### వానరులు సముద్రతీరంబుఁ జేరుట.

ఉ. ఈగతి రావణక్షయము ♦ గృధ్రము చెప్పఁగ నాలకించి యు
ద్వేగము దక్కి యెల్లపృథి♦వీరుహచారివరేణ్యు లంత నా
భోగముదంబునం గెరలి ♦ పొంగుచు గంతులు వైచుచున్ మహా
భాగను జూచుకోరిక న♦పాంపతితీరముఁ జేరి యయ్యెడన్. ౧౩౭౬

తే. అన్నిజగముల ప్రతిబింబ ♦ మనఁగ నొప్పు, దక్షిణాంబుధి యుత్తర♦తటముఁ జేరి
సారబలులందు సన్నివే♦శంబు చేసి, పాఱఁజూచిన మెయి గగు♦ర్పాటు పొడల.

సీ. ఆస్యముల్ విచ్చి మ♦హాకాయములు దాల్చి, చరియించువికృతంపు♦సత్త్వచయము
లమరఁ దరంగస♦మాకులం బయి యొప్పు, స్థలమున నిద్రించు♦చండముగను
నొండొకఁ గ్రీడించు♦నొప్పినంబును గాంచి, మఱియొక్కచో గిరి♦మాత్రమయిన
వారిచేఁ దనరారి ♦ పాతాళతలవర్తి, దానవేంద్రులచేతఁ ♦ దటమటించి
తే. వారిదాధ్వమువోలె దు♦ష్పార మగుచు, రోమహర్షణ మైన నీ♦రాశిఁ గాంచి
చింతలకుఁ జిక్కి యిఁక నేమి ♦ సేయవచ్చు, దీని నెట్టులు దరియింపఁ ♦ దీరుననుచు.

కం. ఘన మగుభయమున దుఃఖం,బునఁ దట్టు పడంగఁ గీశ♦పుంజము తారా
తనయుఁడు మతిమంతుం డి, ట్లనియెన్ వారలకు ధైర్య ♦ మాత్మల నిలువన్.

చం. వలదు విషాదముం గొనఁగ ♦ నాపిరిదోషము దుర్విషాద మా
బలితవుఁగ్రుద్ధపన్నగము ♦ బాలునిఁ జంపెడిరీతిఁ బూరుషున్
నిలుగఁగఁ జేయు దుఃఖము వ♦నీచరులార! పరాక్రమంబు వే
ళల వెతఁ గూరుచున్నుద్రున క♦లబ్ధము పో పురుషార్థ మేదియున్. ౧౩౮౦

ఉ. రేయిటు లేగ వానరవ♦రేణ్యులు వాలిజుఁ జుట్టి కొల్వఁగా
నాయనఘుండు నిర్జరస♦మావృతవాసవుమాడ్కిఁ బొల్చుచున్

జేయఁగలట్టికార్యమును ♦ జింతన నేసె; నెవండు చాలుఁ దా
రయసమీరణాత్మజులు ♦ గ్రిక్కఁగ నాకపిసేన నిప్పుఁగన్. ౧౩౮౧

అంగదుఁడు కపుల సముద్రంబు దాఁటఁ బ్రేరించుట.

కం. హరివృద్ధులఁ దక్కుచమూ,వరులం గని యూఱడిలఁగ ♦ వాలితనూజుం
డురుమతి నర్థవదుక్తులఁ, బరమముదం బెసఁగ నిట్లు ♦ పలికెఁ గరిమన్. ౧౩౮౨

సీ. ఏమహాతేజుఁడో ♦ యీసాగరము దాఁటు, శైలాటపతి సత్య♦సంధుఁ జేయు
నేమహాబలుఁడొ నూ♦ఱామడ లంఘించి, ప్లవగులభయ మెల్లఁ ♦ బాప నోపు
నెవ్వనిమహిమచే ♦ నిటనుండి చని యింట, నాలుబిడ్డలఁ గూడి ♦ యలరఁ గలుగు
నెవ్వనికరుణచే ♦ నెలమి సుగ్రీవుని, రామలక్ష్మణులఁ జే♦రంగఁ గలమొ

తే. యట్టిసామర్థ్యమును గల♦హరివరుండు, సాగరంబును లంఘింపఁ ♦ జాలువాఁడు
గలిగె నేనియు నీసైన్య♦కాండములకు, నభయదక్షిణ నొసఁగుత ♦ మాశుగతిని.

కం. అని తారాతనయుఁడు పల్కిన నొక్కండేని సేనఁ ♦ గిమ్మనఁ డయ్యెన్
వనచరవాహిని యించుక,యును గదలక మెదల కున్న ♦ యువరా జనియెన్.

చం. బలియురలోన శ్రేష్ఠులగు ♦ బాఢపరాక్రమకీర్తనీయులున్
విలసితసత్కులీనులరు ♦ విశ్రుతకార్యధురంధరత్వసం
కలితనమస్యులుం గద న♦గౌకసులార! చనంగరానితా
వులు ధర లేవు మీకు నెటు♦పోయిన నేసమయంబునందు నేన్. ౧౩౮౫

తే. కావునను మీరు కీశాగ్ర♦గణ్యులార!, యెవ్వ రెవ్వరు జలనిధి ♦ నెంతదవ్వు
దాఁటఁ గలవారొ మీశక్తిఁ ♦ దలఁచి చెప్పుఁ, డనిన నాతని కనిరి ప♦నాటవరులు.

అంగదునితోఁ గపులు వారివారి లంఘనశక్తిఁ జెప్పుట.

కం. గవయ గవాక్ష సుషేణులు, ద్వివిదుఁడు మైందుండు గజుఁడు ♦ విధిసంభవుఁడున్
జవశాలి గంధమాదనుఁ, డమితధవిక్రముఁడు శరభుఁ ♦ డనిరి క్రమమున్ ౧౩౮౭

సీ. పదియోజనంబులు ♦ వార్ధి దాఁటుదు నంచుఁ, బలికెగజుం డను♦ప్లవగవరుఁడు
ఇరువదియామడ ♦ యరుగఁ జాలుదు నని, యనియె గవాక్షుండు ♦ హర్షమునను
ముప్పదామడ దాఁట♦ మొనయుదు నంచును,గవయుండు వాక్రుచ్చెఁ♦గడిమిమెఱయ
నలువదామడ దాఁట ♦ ♦నలవు నాకగు నని, శరభుండు పల్కె ను♦త్సాహి యగుచు

తే. నేఁబదామడ తరియింతు ♦ నే నటంచు,గంధమాదనుఁ డనియె ని♦ష్కంపమతిని
మైందుఁ డనునాతఁ డర్వదా♦మడ తరింప, నుత్సహించెద నని పల్కె ♦ నుల్లమలర.

కం. డెబ్బదియామడ ద్వివిదుఁడు, నిబ్బరముగఁ దాను దాఁట ♦ నేర్తు ననఁగఁ బె
న్నుబ్బున సుషేణుఁ డెనుబది, గొబ్బున లంఘింతు ననుచుఁ ♦ గొదుకక పలికెన్.

సీ. అంతటఁ దన్మర్క♦టావళి నెల్లను, దగురీతిఁ బల్కి వృ♦ద్ధతముఁ డైన
జాంబవంతుఁడు పల్కు ♦ శాఖామృగములార!,గతివిక్రమము కొంత♦గలిగి యుంటిఁ

గాని పూర్వం బిప్డు ♦ కపుముదుకఁడ నైతిఁ, బ్రాయంబు పారంబు ♦ ప్రాప్త మగుట
నది యటు లుండఁ గా ♦ కర్కసంశజులును, సర్కజుండును దను♦యాత్మలందు
తే. నీమహాకార్యమును మన ♦ మెట్టులేని, చేయఁగలవార మని విశ్వ♦సించినారు
కాన దీని నుపేక్షింపఁ ♦ గాదు నాకుఁ, గాలభేదాన నిప్పటి♦కడిమిఁ దలఁప ౧౩౯౦
ఉ. తొంబదియామసల్ చనఁగ ♦ దోర్బలశక్తియెసంగు నంచుఁ జి
త్తంబునఁ దోఁచె నాగసున♦దార్ఢ్యము యింతియ కాదు సుండు పూ
ర్వంబు మహాబలీంద్రుఁడు స♦నం బొనరింపఁ ద్రివిక్రమావతా
రంబున నొప్పువిష్ణువును ♦ గ్రన్నన నేను బ్రదక్షిణించితిన్. ౧౩౯౧
ఉ. యౌవనవేళ నప్రతిమ ♦ మైనబలంబు జవంబు గల్గె, నా
కావయస్సిప్డు జెల్లె, ముది ♦ యాసహిాలెక్క, గమనంబు మంద మై
చేనయుఁ బోసెఁ, గాన నెటు♦చేసిన నింతకు మించి వాఁడిమెఁ
బోవఁగఁజాల, దాన ఫల♦ముం గనిపింపన, యేమి సేయుదున్. ౧౩౯౨
కం. అనవుడు భల్లూకాధిపుఁ, గొనియాడుచు ననియె వాలి♦కొడు కిటు నే యో
జనశతము దాఁట నేర్తును, ఘనశక్తిని మరలి రాఁగఁ♦గలనో లేనో. ౧౩౯౩
ఉ. నా విని జాంబవంతుఁడు న♦నాటనరేణ్య! త్వదీయశక్తి సం
భావిత మెంత కైన వినుమా శత మైన సహస్ర మైనను
బోనఁగనేర్తు వాయువలెఁ ♦ బోయి జవంబుఁ గ్రమ్మఱంగనుక్
లావు గహించు నీకు, నయి♦నక్ సరిగా దటు నిన్నుఁ బేయఁగన్. ౧౩౯౪
చం. పనిగొనువాఁడు పేఁపితనిఁ ♦ బంపఁగఁ బెల్లదు భృత్యకోటికిం
బనిగొను నీకుఁ బెల్లుఁ బని♦వారలు వీరలఁ బంపి నాయనా!
వనచరకోటి కింతటికి ♦ స్వామివి నీ మగుట న్నిరంతరం
బును గను రక్షణీయుఁడవు ♦ పూనిక మాకుఁ గళత్రముం బలెన్. ౧౩౯౫
కం. సేనలకు నెల్ల నధిపతి, మానక రక్ష్యుండవు లోక♦ముగాన్యవ యిపుఁ
గాన నిను మేము గావం,గా నగుఁ గా కొంటిఁ బంపఁ♦గా సర్వావే. ౧౩౯౬
ఉ. అంతియ కాక కార్యమున ♦ కంతకు మూలము నీవ, యర్గను
త్యంతము సర్వమూలమును ♦ నాదటఁ గాన నటంచు నీతి భా
షింతురు కార్యకోవిదులు ♦ చెట్టునమూలము లెస్స యున్నచో
నెంతయుఁ గల్గఁగాఁ బె ప్లవ♦గేశ్వర! దారుఫలప్రసూనముల్. ౧౩౯౭
చం. అనఘ సుధీసుధీరతల ♦ నాకర మై తగునీవు కార్యసా
ధనమున కెల్ల మూలమవు ♦ తథ్యపరాక్రమ మాగురుండవుక్

వనచరలోకనాథ గురు♦పర్వతనూజుఁడ వట్టి లౌట ని
న్మనుగొని కార్యము ♦సలుప ♦ నూఁగొనువారము చూ కుమారకా. ౧౩౯౮
కం.అనవుడుఁ దారాతనయుం, డను నేఁ బోకున్న నేవ్వఁ ♦ డరుగఁగ నోపుఁ
మనలోఁ గావున మనకుం, జనుఁ బో ప్రాయోపవేశ♦సంస్థితి[1] మరలన్. ౧౩౯౯
చం.హరిపతియానతిం జలుప ♦ కయ్యెడ కేగిన మేనితోడ నుం
టరిది ఖరాంశుసూనుఁడు స♦మగ్ర డనుగ్రహనిగ్రహంబులన్
బొరిగొను నింపలన్ గడువు ♦ పుచ్చియు వ్యర్థుల మాచుఁ బోవ నే
కరణిని గార్య మొండుగతి ♦ గాదో వచింపుము నీవ తద్విధన్. ౧౪౦౦
తే అనిన భల్లూకలోకేశుఁ ♦ డనియె వాలి
తనయుతో నీకుని కార్య♦మునకుఁ గొఱఁత
గలుగ నేరదు సుమి కార్య♦కరుని నిపుడు
ప్రభుతనూభవ! ప్రోత్సాహ♦పఱచువాఁడ. ౧౪౦౧
కం.అని ప్లవగేంద్రుఁడు ప్లవగేంద్రుని లంఘనకేళికోవి♦దుని నేకాంతం
బున హాయిగఁ గూర్చుండిన,హనుమం బ్రోత్సాహపఱుప ♦ నారంభించెన్. ౧౪౦౨

జాంబవంతుఁడు హనుమంతునిఁ బ్రోత్సాహపఱుచుట.

కం.ఏమియుఁ జేయఁగఁ దోఁపక, నోముల దైన్యంబు ప్రేల ♦ మురి దొఱఁగినశా
ఖామృగసహస్రములఁ గని, ధీమంతుఁడు వాయుతనయు ♦ దృష్టించి యనున్.
ఉ. ప్రాకటసర్వశాస్త్రచణ! ♦ వానరవీరవరేణ్య! పావనీ!
యేకత మిట్లు పూనము వ♦హించి రమించుచు మాట లాడ వే
లా? కమలాప్తసూనునకు ♦ నారఘువీరులకున్ బలంబునన్
వీకునఁ దేజనం బుసుడు ♦ నీ వవు డెంతయు నెంచి చూచినన్. ౧౪౦౪
సీ. వినతాతనూజుండు ♦ విదితమహాబలుం, డాకశ్యపుని సుతుం ♦ డంపజాత
కాంతుండు గరుటాల♦మంతుండు నీరధిఁ, బాముల హరియించి ♦ పఱచు చుండ
నెన్ని మాఱులో కంటి ♦ సన్నిషజేంద్రుని,పక్షంబులకుఁ గల♦బలము జవము
నీబాహువులకుఁ గల్గు ♦ నిక్కంబు వానికి, వీసమం తైనను ♦ దీసిపోవు
తే. తేజమున బుద్ధిబలమున ♦ ధృతిని జగతి
నెల్లవారలకంటెను ♦ నెక్కుడీవు
నిన్ను నీవేల యెఱుఁగవు ♦ నిర్మలాత్మ ౧౪౦౫
యేమి కత మిది యోజింపు ♦ మోమహాత్మ!

జాంబవంతుఁడు హనుమంతుని జన్మవిధంబుఁ జెప్పుట.

చం.ఇలపయి నంజనాఖ్య జని♦యించెను నచ్చరమిన్న పుంజిక
స్థల యను ఖ్యాతరూప యొక♦శాపముచేతను గీశకాంత యై

---

[1] సంస్థితి — మరణము.

యలకపినేత్ర కుంజరున ♦ కాత్మజ వైమె నిజకామితాకృతిఁ
గలిఁవి ధరింప నేర్పునసి ♦ కేసరి యన్కపికాంతుపత్ని వైమె. ౧౪౦౬

చం. లలితసురూప యౌవనవి♦లాసిని యాకపికాంత యొక్కనాఁ
డెలమిని మానుషాకృతి వ♦హించి విచిత్రమనోజ్ఞభూష వైమె
కులుకఁగ మాల్యసంచయము ♦ కోమలచారుదుకూలరమ్య వైమె
జలదనికాశరోచి యగు♦శైలతటంబున సంచరింపఁగన్. ౧౪౦౭

ఉ. ఆనళినాక్షిరక్తదశ♦మౌ శుభ పీతదుకూల మప్డు శై
లానిలకారణంబునను ♦ నల్లనఁ బాయుడు నుబ్బుగుబ్బలున్
మౌ నగున్నత్తపీవరస♦మంచితసక్థులు సూక్ష్మమధ్యకాం
తాననముల్ పిఱుందులు శు♦భాకృతియుం గని మోహితాత్ముఁడై ౧౪౦౮

కం. మారశరాహతి స్రుక్కి స,మీరణుఁ డాసాధ్విఁ బొదివి ♦ మేలిభుజములన్
గూరిమిని గౌఁగిలింపఁగ, సారసదళనేత్ర యనియె ♦ సంభ్రాంతమతిన్. ౧౪౦౯

ఉ. ఎవ్వఁడు నాపతివ్రతము ♦ నియ్యెడ నాశముఁ జేయఁ గోరె? నా
సవ్విరిఁబోఁశికిం బవనుఁ ♦ డంగన నీపయిఁ జిత్త ముంచి నే
నివ్విధిఁ గౌఁగిలించితిని ♦ నింతియ నీకొకకీడుఁ గూర్పనో
జవ్వని భీతిలన్ వలదు ♦ స్పర్శనుఁడం జుమి నే యశస్వినీ. ౧౪౧౦

కం. ప్లవనంబున లంఘనమున, నవలా! మత్సముఁడు నీకు♦నందనుఁడు మహా
జవనుఁడు పరాక్రమాఢ్యుం, డవితథసత్త్వుండు ప్రాజ్ఞుఁ ♦ డంగన కలుగున్.

కం. అనవుడు నీజనయిత్రియు, మనమున ముద మంది యేగి ♦ మహీధరగుహాలోఁ
గనియె న్నినుఁ బ్లవగోత్తము,ననుపమయశ నీవు నుదయ♦దర్కుని వనిలోన్. ౧౪౧౨

చం. కనుఁగొని యొక్కనాఁడు ఫల♦కాంక్ష దివంబున కుద్గమించి యో
జనములు మూఁడునూర్లు చని ♦ చండకరాతపతప్తదేహి వై
నను మది నైనఁ గుందక ది♦నప్రభు డాయఁగవచ్చు నీపయిన్
ఘనతరకోప మూని శచి♦కాంతుఁడు వజ్రము వైచె జివ్వనన్. ౧౪౧౩

కం. ఆమహితవజ్రహతి నీ, వామహానువు భగ్న మగుట ♦ వఱలెను నీకున్
భూమిని హనుమంతుం డను, నామము నీపాటు గని ఘ♦నం బగుకినుకన్. ౧౪౧౪

కం ఇంచుకయు జగత్ప్రాణుఁడు, సంచారము గొనక యుండె ♦ జగములు మూఁడున్
సంచలిత మయ్యె వేగో,దంచితగతి వచ్చి సురలు ♦ వ్యాకులమతులై. ౧౪౧౫

చం కినిసినగాడ్పుఁ దేర్చుడును ♦ గీశవరా! నినుఁ గాంచి నీరజా
సనుఁడు వరం బొసంగె దయ ♦ శస్త్రములన్ మృతిలేక యుండ, వ
జ్రనిహతినీవు నొవ్వమికి ♦ సంతస మంది మృతిస్వతంత్రతన్
గనికరమార నిచ్చె వెయి♦గన్నుల వేలుపుఱేడు పావనీ! ౧౪౧౬

తే. కేసరికి భీమవిక్రమా ♦ క్షేత్రజుఁడవు, మారుతున కౌరసుండవు ♦ మహితతేజ
మునను బ్లవనంబునను సరి♦పోలు దీవు, కన్నతండ్రికి నాయనా! ♦ కల్ల గాదు.
ఉ. పోయెడి మాకుఁ బ్రాణములు ♦ పుణ్యమతీ మముఁ గావ నయ్య ధై
ర్యాయతదార్ఢ్యవిక్రమము♦లందు ఖగేంద్రునిమాఱుమూర్తి వీ
వీయచలాళికాననస♦మేతధరిత్రిఁ ద్రివిక్రమాకృతిన్
వాయుజ! యిర్వదొక్కపరి ♦ వచ్చితిఁ జుమ్ము ప్రదక్షిణంబుగన్. ౧౪౧౮
కం. అమృతంబుఁ దరుమువేళను, నమరులశాసనముచే మ♦హౌషధులతలన్
సముకూర్చితి నాతఁగెల, నమృతం బుదయించెఁ జుమ్ము ♦ యమితప్రజ్ఞా. ౧౪౧౯
తే. కలిగె నా కప్పు డసమాన♦బలము జవము, పోయె నాకాల మెల్లను ♦ బుణ్యశీల
వృద్ధుఁడను మఱి పరిహీన♦విక్రముఁడను, నిప్పు డీ స్థితిఁ జింతింప ♦ నేమిఫలము.
ఉ. ఈ వన సర్వసద్గుణస♦మేతుఁడ వోప్లవగాగ్రణీ! ధరన్
లావున దూరలంఘనక♦లావిభవంబున నీవ మేటివిన్;
నీవలె నేగ నేదియును ♦ నేరదు భూతచయంబులందు, నే
డీ వెస నీవిజృంభణము♦నేపున జూపఁగదయ్య మారుతీ. ౧౪౨౧
కం. లెమ్మా హరిశార్దూలా, యిమ్మహితార్ణవము దాఁటు ♦ మీప్లవగానీ
కమ్ములు యుష్మద్బలవీ,ర్యమ్ములఁ గనుఁగొనెదునాఁ ♦ గ్రాలెడి ననఘా. ౧౪౨౨
కం. మున్ను త్రివిక్రముపోలిక, సన్నుతి మగునీదుశక్తి ♦ సకలముఁ జూపన్
గన్నారఁ జూడఁ గోరెద, రన్నా కపివరు లుపేక్ష ♦ యగ్గిమె యనుచున్. ౧౪౨౩
కం. బుభుక్షువుఁడు పెరరేఁగ, నాక్షణమున హనును రేఁగి ♦ హరిసైన్యమ్ముల్
వీక్షింపఁగ హర్షంబున, నక్షయముగఁ దనదురూప ♦ మప్పుడు పెంచెన్. ౧౪౨౪

జాంబవంతునివాక్యంబుల హనుమంతుఁడు విజృంభించుట.

చం. అలఘున నూఱుయోజనము ♦ లంబుధి దాఁట విజృంభమాణుఁ డై
చెలఁగుపరాక్రమాభ్యుదయ♦సిద్ధుఁ బ్రసిద్ధు బ్లవంగనాథుఁ గీ
శులు గని తత్క్షణంబ తమ♦శోకము వీడి ప్రహృష్టచిత్తు లై
కలకలనాదముల్ సలిపి ♦ గంధవహాత్మజు సంస్తుతించుచున్. ౧౪౨౫
ఉ. జే యని ముందు త్రివిక్రముని♦చెల్వ వహించి యొసంగినట్టి నా
రాయణు లోకు లెల్లఁ గని♦నట్టులు వానరు లెల్ల విస్మయా
మేయముదంబులం గన స♦మీరసుతుండును మేను పెంచి య
త్యాయతసంప్రవర్ధితబ♦లాఢ్యత నల్లల నార్చె వాలమున్. ౧౪౨౬
కం. గిరిగహ్వరగతకేసరిఁ బోలి ప్రభంజనాత్మ♦జాతుఁడు రేఁగన్
హరివరనుతుఁడై తేజోవిశాలం బగునాననమును ♦ వెలయఁగఁ జొచ్చెన్.

కం. అప్పుడు పవనజువదనం, బొప్పెను నెఱ్ఱగను గ్రాఁగి ♦ యుండెడు పెనముక్
దెప్పుచుఁ గణకణ మని పొగ, కప్పనినిప్పుకలకుప్పు ♦ కాంతి రహింపన్. ౧౪౨౮

ఉ. గగ్గురుపాటు మేనఁ జెలఁ ♦ గం గపిమధ్యమునుండి లేచి తా
దిగ్గున వృద్ధకీశులకు ♦ ధీరుఁడు మ్రొక్కి వచించె వీర్యస
మ్యగ్గతిఁ బర్వతాగ్రముల ♦ నైనను జిమ్ము నమేయశౌర్యభా
స్వద్గగనప్రచారుఁడు సు ♦ తాశనమిత్రుఁడు శీఘ్రగామియున్ ౧౪౨౯

→ హనుమంతుఁడు కపులతోఁ దనపరాక్రమంబుఁ దెల్పుట. ←

ఆ. ప్రబలవేగుఁ డగుప్ర ♦ భంజనునౌరసపుత్రకుండ ప్లవన ♦ భూరికర్మ
మునను నాకు సములు ♦ గనరారు జగముల, నీను వత్తుఁ దండ్రి ♦ తోడ వినుఁడు.

సీ. వత్తునా వేమారు ♦ హత్తి మిన్నొరసెడి, తపనీయగిరికిఁ బ్ర ♦ దక్షిణంబు
ముంతునా సహస్ర ♦ కాంతారగిరియుక్త, భువిఁ గనోత్థాంబుధి ♦ పుష్కరములఁ
జిమ్ముదునా మింటి ♦ కెమ్మెగా నక్రయు, క్వనధి జంఘోరుజ ♦ వంబుగరిమ
వలగొందునా మింటఁ ♦ బటుమఖగాధిపు, విపతాతనూజుని ♦ వేయిమారు

తే. లుదయదర్కుని నిటనుండి ♦ కదిసి కూడఁ, బాటి యపరాద్రిఁ జేరియూ ♦ భాస్కరుండు
గ్రుంకకయమున్న యెదురేగి ♦ కూడునాఁడ, నుండ చుండెడిమార్తండ ♦ మండలంబు

తే. అచటనుండియు ధారిణి ♦ నంటకుండ, వెండి యిచటికి రానేర్తు ♦ వేగమునను
గగనగోచరములు నెల్లఁ ♦ గడిమిమెఱసి, దాఁటి పోవంగనేర్తు ను ♦ త్సాహమునను.

ఉ. ఇంతలు పుష్కలైక చెరఁగ ♦ నీయిలఁ జిల్కునో, సాగరంబు నెం
డింతునో, పర్వతంబులను ♦ నెట్టన చేతులఁ బిండి పిండిగా
దంతునో, నూకువేగముఁన ♦ దారుణనీరధి నాదు వెంట ర
ప్పింతునో, యేమి గుంచితిరి ♦ భీషణకాయుని నాంజనేయునిన్. ౧౪౩౩

ఉ. ఱివ్వునఁ గ్రింకపోలిక నెగిరి దివి నేగ లతాకుజంబులక్
బువ్వులు చివ్వున న్నెగసి ♦ పోఁణిమి నావెనువెంట వచ్చు చో
నవ్విమువీదిఁ దారకస ♦ మాయాతమార్గమునట్లు దోఁచెడక్
దవ్వునఁ జూచుమాపటికిఁ ♦ దధ్యమునాచనుమార్గ మంతయున్. ౧౪౩౪

కం. పైపై కెగయుచుఁ గ్రిందికి దిగు, చాకాశంబునను వేగ ♦ మరిగెడినన్నుక్
వీకాశంబుగ భూతా, నీకంబులు చూడఁ గలవు ♦ నివ్వెరగొనుచున్. ౧౪౩౫

కం. ఆకాశమున మహాంబుద, నీకాశుఁడ నగుచుఁ గప్పి ♦ నింగిని మ్రింగక్
చేకొన్నగతిఁ జనఁగ వ, నౌకోవరులార! కనెద ♦ రయ్యా నన్నున్. ౧౪౩౬

కం. నఱుఁకింపుచుఁ బర్వతములు, నుడికింపుచు సాగరంబు ♦ నుద్దవిడిక్ నే
నఱ్ఱింపుచు మేఘంబులఁ, గడలిని దరియింతుఁ గనుఁడు ♦ కపిసింహంబుల్.

కం.బలమున వేగమున మహా,బలునకు వినతాత్మజునకుఁ ♦ బాటిగ వత్తుర్
గల రే నాబడి రా గు,ర్వీలతేఁడును గాడ్పు దక్కఁ ♦ బసు లెవరేనిన్. ౧౪౩౯

తే. మెఱుఁగు మెఱసినరీతి ని♦మేషమాత్ర, నంబరంబున కెగిరి యా♦లంబ మేది
కడలి దాఁటఁ ద్రివిక్రమా♦కారుఁ డైన, విష్ణుభంగిని గ్రాలెద ♦ విస్మయముగ.

కం.వీడుఁడు చింతల ముదముం, గూడుఁడు ప్లవగేంద్రులార! ♦ కోమలిఁ గాంతుఁ
వీఁకనిబుద్ధిబలంబునఁ, గీ డొందవదు మనసుచేష్ట ♦ కెరలెడి నట్టుల్. ౧౪౪౦

చం.అనిలశకుంతనాయకస♦మాధిక వేగము పేర్మి వేయియో
జనములు నైన దాఁటగను ♦ జాలెద నంచుఁ దలంచెదన్ స్వయం
భుని పరమేష్ఠిహాసమునఁ ♦ బొల్చిన యేని సహస్రుఁ డైన యిం
ద్రునికరమందు నున్నసుధ ♦ దోర్బలశక్తి హరించి తెచ్చెదన్. ౧౪౪౧

కం లంకను బోఁ తగలఁగ నక,లంకగతిం బెఱికి వెంట ♦ లాగుకొని చనన్
బింకమున నేర్తు నని ని,శ్శంకంబుగఁ దోఁచెఁ బ్లవగ♦సత్తములారా! ౧౪౪౨

మ. అని గర్జించెడిభూరితేజుఁ బ్లవగా♦ధ్యక్షుల్ నిరీక్షించి య
వ్వనచారుల్ కడువిస్మయంబున ముదా♦వాప్తిం జెలంగన్ మహో
త్తనయుం గన్గొని జాంబవంతుఁడు జగ♦త్ప్రాణాత్మజా! వీరలో
కనుతా! కేసరిపుత్ర! బంధుజనశో♦కం బార్చి తౌ నాయనా. ౧౪౪౩

కం.కావున నీమే ల్గోరెడి,యీవనచరచక్రవాళ ♦ మెల్లను దమిఁ గా
ర్యావాప్తికిఁ గావించు శు,భావహముగ నీకు మంగ♦ళాశాసనముల్. ౧౪౪౪

కం తపసులప్రసాదముహిమం, గపివృద్ధులమతిని గురుల♦కరుణాగరిమన్
గపివీరలోకనాయక, విపులమహార్ణవము దాఁటి ♦ వెలయుము కీర్తిన్. ౧౪౪౫

హనుమదాదులు మహేంద్రాద్రి నెక్కుట.

చం.నిలిచెద మేకపాదమున ♦ నీ వరుదెంచెడుదాఁక నిందు నీ
బలిముఖయోధయూధముల♦ప్రాణము లెల్లను ద్వద్గతంబు లం
చెలమిని బల్కి వానరుల ♦ కిట్లనుగాడుపుపట్టి చాలదీ
యిలయు మదీయలంఘనము♦హిస్థ రయంబు నొకింత నైఁపఁగన్. ౧౪౪౬

సీ. ఆమహేంద్రాద్రిసు♦మహాశిఖరంబులు, చటులస్థిరశిలా♦సంకటములు
నానాద్రుమవికీర్ణ♦మానితముల్ ధాతు,నిష్యందకాంతముల్ ♦ నిష్ఠురములు
కావున నవి యోపుఁ ♦ గడలి నూఱామడ, దాఁటంగ నేగు ను♦త్సాహ మొప్ప
నా పాదములఘట్ట♦నంబును దాళంగ, నని వానరులతోడ ♦ నద్రి యెక్కి

తే. వివిధవృక్షలతాగుల్మ ♦ వృతము సకల,మృగని షేవితశాద్వలం ♦ బగణితోరు
నిత్యపుష్పఫలద్రుమ ♦ నీరపూర,సంకులము సింహశార్దూల♦చరిత మగుచు.

కం.మత్తద్విజగణరణితము, మత్తమతంగజయుతంబు ♦ మహనీయం బౌ
నత్తలము న విహరించెను, జిత్తం బుప్పొంగఁ బ్లవగ♦శేఖరుఁ డంతన్. ౧౪౪౭

సీ. పవమాననందన♦పాదపీడిత మయి, సింహాభిహతదంతి♦చెలువుఁ దాల్చి
క్షితిధరంబును విప్ర♦కీర్ణశిలోచ్చయ, మై వారిపూరంబు ♦ నట్టె గ్రక్కె
బెదరెమమృగములు ♦ కదలెమకుజములు, నెగిరెడివిహగము ♦ లెడయు పా..
సక్తు లాగంధర్వ♦చక్షుశ్శ్రవోముఖ,నంబులు డాఁగు ఫ♦ణాధరములు
తే. దనరి దొంరలెడిజాలు శీ♦దాఁకుచుండఁ, గర్కశార్ధిని నిట్టూర్పు♦గాడ్పు లోలయ
నర్ధనిస్సృతఫణులు చే ♦ నానగంబు, వెలసె నపతాగరీతిని ♦ వెఱపు నొలుప.
తే త్రాసనంభ్రాంతమునిజన♦త్యజ్యమాన,శద్ధిలోచ్చయములు గ్రాలె ♦ దారుణోరు
కాననాంతరసార్థవి♦హీనపాంథు, బోల్కి దలఁపించుచును;వాయు♦పుత్త్రుఁ డపుడు.
కం.గంహోన్పితచిత్తుఁడు కపి,సింహము జననాధికుండు ♦ శ్రీమహిముఁడు ద్వి
ట్సంహారకుఁడు మనస్వి ను,సంహతమతి యయ్యె లంకఁ ♦ జన నవ్వేళన్. ౧౮౫౧

కిష్కింధాకాండాంతపద్యములు.

కం మాయాతీతా నిజగురు,మాయాకలితావతార ♦ మాయావిమహా
మాయాధఃకరణచణా, మాయామయదివ్యదేహ ♦ మాయామోహా ౧౮౫౨

పనమయూరము. స్నిగ్ధజనపాలనవి♦శిష్టసుచరిత్రా! ముగ్ధగిరజీవిచయ♦మోహపరిశస్తా!
దుగ్ధనిధివాస బుధ♦తోషణవిదగ్ధా! దిగ్ధసరసీజము♦సృగ్ధర రమేశా!

కాంతి. భామాఽభయదా కృ♦పాళువరా
భూమీరుహచారి♦పుంగవహా
నామైకశిలాపు♦రాశ్రయణా
సోమాననబింబ ♦ సోమనుతా ౧౮౫౩

— గద్యము. —

ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందమిళిం
దాయమాన మానసత్వ మహావైభవ వావిలి
కొలను రామచంద్రరాయతనూభవ సుజనవిధేయ సుబ్బరాయ
నామధేయప్రణీతం బైన శ్రీమదాంధ్రవాల్మీకిరామా
యణ మనునిర్వచనమహాకావ్యంబునందుఁ
గిష్కింధాకాండము

శ్రీ రా మా ర్ప ణ మ స్తు.

శ్రీ. శ్రీ. శ్రీ.

శ్లో. నమోస్తు రామాయ సలక్ష్మణాయ, నమోస్తు దేవ్యై జనకాత్మజాయై
నమోస్తు వాతాత్మభువే వరాయ, నమోస్తు వల్మీక భవాయ తస్మై.